





# కథలు

నీతి, పురాణ, పొడుపు

# కథా సరిత్సాగరము - 1 నుంచి 5





# సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

# శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

# అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

# వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020010005557/58/59/60/61

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: In ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with
CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers
Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam
Author:
Year: to
Subject: Any Subject
Language: Telugu
Scanning Centre: Any Centre
Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| • Rashtrapati Bhavan<br>• CMU-Books<br>• Sanskrit<br>• TTD,Tirupathi<br>• Kerala Sahitya Akademi | • INSA | • Times of India<br>• Indian Express<br>• The Hindu<br>• Deccan Herald<br>• Eenadu<br>• Vaartha | • Tamil Heritage Foundation<br>• AnnaUniversity NEW! |

**Title Beginning with.**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Author's Last Name**

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

**Year**

| 1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951- |
|---|---|---|---|---|---|---|

**Subject**

| Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects... |
|---|---|---|---|---|---|---|---|---|

**Language**

| Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu |
|---|---|---|---|---|---|---|---|---|

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖



మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# కథా సరిత్సాగరము

(సంపుటము: 1)

## శ్రీ సోమదేవ భట్ట ప్రణీతము

( 1—23 తరంగములు )

తల్లావజ్ఝల శివ శంకర శాస్త్రి

తల్లావజ్ఝల కృత్తివాస తీర్థులు

సంస్కృతమునుండి తెలిగించినది




పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కొ

సరస్వతీ పవర్ ప్రెస్

రాజమహేంద్రవరము

# ప్రకాశకుని విజ్ఞప్తి

కథాసరిత్సాగరము తెలుగు చేయించి ఆంధ్రలోకానికి అందచేతామని సంకల్పము కలిగి, శ్రీ శివ శంకర శాస్త్రిగారిని కోరినాను. ఇదివరలో అనువాదమొకటి ఉన్నదిగదా, అని వారన్నారు. అది ఇంచుమించుగా యాభై సంవత్సరములనాటి దనీ, జనసామాన్యానికి సులభసాధ్యము కాదనీ, తమ నవీనసరళానువాదము కావలె ననీ చెప్పగా వారంగీకరించినారు.

కథాసరిత్సాగరములో మొదటి అయిదులంబకములకూ పద్యానువాద మున్నది. సంపూర్ణముగా పద్యరూపములో దీనిని ఎవరూ ఆంధ్రీకరించలేదు.

సంస్కృత ప్రాకృతాది వివిధభాషా వేత్తలయిన శివ శంకర శాస్త్రిగారూ, వారికుమారులు కృత్తివాస తీర్థులుగారూ, సంస్కృత మాతృకను తేటతెలుగులోకి అనువదించినారు. కొన్నిలంబకములు శాస్త్రిగారూ, కొన్నిలంబకములు వారికుమారులూ తెలిగించినారు. శాస్త్రిగారు గ్రంథ మంతా సంస్కరించి, పద్యములు చేర్చినారు.

శ్రీ శివ శంకర శాస్త్రిగారికి మా గ్రంథాలయము మీద ఆదినుంచీ అభిమానము. వారు మా సరస్వతీ గ్రంథ మండలికి కొన్నిసంవత్సరములు గౌరవసంపాదకులుగా ఉండేవారు. నాకోరిక మన్నించి ఈగ్రంథము అభిమానాతిశయముచేత ప్రకటనార్థము మాకిచ్చినారు.

నిర్ఝరములు ఉపనదులలో పడుతవి. ఉపనదులు నదులలో చేరుతవి. నదులు సముద్రాంతర్గతము లవుతవి. అలాగే కథానకములు, ఉపకథలు, ఖండకథలు, పరికథలు, కలిసి, కథాసరిత్సాగర మయినవి.

ఈకథాసందోహము ఆరు సంపుటములుగా వెలువడుతుంది.

రాజమహేంద్రవరము
1 — 10 — 1945

అడ్డేపల్లి లక్ష్మణ స్వామి

పీ ఠి క

౧

సంస్కృతభాషలో సోమదేవ భట్టు పద్యరూపములో రచించిన కథా సరిత్సాగరము అనే మహాగ్రంథానికి ఇది అనువాదము.

సంగ్రామరాజు కుమారుడు, అనంతరాజు కాశ్మీరము పరిపాలన చేసే రోజుల్లో సోమదేవ భట్టు అతని ఆస్థానములో ఉండేవాడు. అనంత భూపతి క్రీ. శ. ౧౦౬౩ – ౮౧ వరకూ రాజ్యము చేసినాడు. ఆయన భార్య సూర్యమతీ దేవి జలంధర రాజకన్య; కలశభూపతితల్లి; కాశ్మీరక హర్షమహారాజ పితామహి. ఆమె సాహిత్యములో బాగా అభినివేశము కలది. ఆమెవినోదార్థము సోమదేవుడు కథా సరిత్సాగరము రచించినాడు. దీనికి మూలగ్రంథము గుణాఢ్య విరచితమైన బృహత్కథ.

క్రీ. శ. ౧౦౨౦ – ౧౦౮౦ వరకూ రాజ్యము చేసిన అవంతి వర్మ ఆస్థానకవి క్షేమేంద్రుడు. ఆయన బృహత్కథను అనుసరించి, సంగ్రహించి సంస్కృతములో రచించిన బృహత్కథామంజరి చాలా సంక్షిప్తముగా ఉన్నదనీ, నాతిరుచిర మనీ, సూర్యమతీదేవి సోమదేవుని ప్రార్థించి కథా సరిత్సాగరము చేయించింది.

౨

పైశాచీభాషలో బృహత్కథాకర్త అయిన గుణాఢ్యుడు ఎప్పటివాడు? క్రీ. శ. తొమ్మిదవ శతాబ్ది ప్రాంతములో నేపాళదేశీయుడైన బుధస్వామి పైశాచీబృహత్కథను అనుసరించి బృహత్కథాశ్లోకసంగ్రహము అనే గ్రంథము కావ్యరూపముగా చేసినాడు. అందులో ౨౪ సర్గలూ, ౨౫,౦౦౦ శ్లోకములూ ఉన్నవి. గ్రంథము యథామాతృకముగా అనువదించినాడట. ఇప్పుడు లభ్యమయ్యే గ్రంథములో ౪౫,౨౪ శ్లోకాలు మాత్రము కనబడతవి. కథ ప్రద్యోత మహారాజు మరణంతో ప్రారంభ

మవుతుంది. అందులో పంచతంత్ర శేతాళ పంచవింశతికలు లేవు. ఏమీ అతిక్రమించకుండా కవి నరవాహనదత్తచరిత్ర రచించినాడట. అందులో మదనమంచుకను రాజపుత్రికను చేసినాడు.

ఈకథను బుధస్వామి నేపాళదేశములో ముడిపెట్టినాడు. ౨౮ సర్గలకు బదులు ప్రస్తుతము ఆరుభాగాలు మాత్రమే ఉన్నవి. పైశాచీ మాతృకలో నరవాహనదత్తుని వ్యాపారాలే ఉన్నవట ౨౮ భాగాలుగా శ్లోకసంగ్రహములో ఉపకథలు లేవు. కాశ్మీరపాఠముల పద్ధతికీ, ఇందులో అనుక్రమణికకూ కొంత భేదము ఉన్నది. పైశాచీగ్రంథమును బుధస్వామి సముఖాన ఉంచుకొని సంస్కృతీకరించినట్లు తోస్తుంది.

గోవర్ధనాచార్యుడు, యశస్తిలక చంపూకర్త సోమదేవసూరి, ధనంజయుడు, త్రివిక్రమభట్టు, బృహత్కథను పొగడినారు. క్రీ. శ. ౮౭౫ సంవత్సరములో కాంబోడియా దేశములో ఒకానొక శాసనములో గుణాఢ్యుని నామధేయమూ, ఆయనకు ప్రాకృతభాషమీది విరక్తి లిఖించి ఉన్నవి.

క్రీ. శ. ౬ శతాబ్ది పూర్వార్థములో రాజ్యము చేసిన గాంగవంశ ప్రభువు అవినీత మహారాజు కుమారుడు దుర్వినీతుడు బృహత్కథను సంస్కృతీకరించినట్లు శాసనములవల్ల తెలుస్తుంది. జైనాచార్యు డయిన పూజ్యపాదునికి దుర్వినీతుడు శిష్యు డట.

“కువలయానంద” పరికరప్రకరణములో — “చిత్రార్థాం న బృహత్కథా మచకథం” అని కనబడుతుంది. “అతిదీర్ఘజీవిదోషా ద్వ్యాసేన యశోపహారితం హన్త కై ర్నోచ్యేత గుణాఢ్యః స ఏవ జన్మాంతరాపన్నః”

“శ్రీ రామాయణ భారత బృహత్కథానాం కవీన్ నమస్కుర్మః” అని గోవర్ధనాచార్యుని ఆర్యాసప్తశతిలోనూ; “రామాయణాది చ విభావ్య బృహత్కథాం చ” అని ధనంజయుని దశరూపకములోనూ;

"శశ్వద్బాణ ద్వితీయేన నమదాకార ధారిణా ధనుషేవ గుణాఢ్యేన నిశ్శేషో రంజితో జనః" అని త్రివిక్రముని దమయంతీకథా చంపువులోనూ; "భూతభాషామయీం ప్రాహు రద్భుతార్థాం బృహత్కథాం" అని క్రీ. శ. అష్టమశతాబ్దిలో ఆచార్యదండి విరచిత కావ్యాదర్శములోనూ; "బృహత్కథాలంబై రివ శాలిభంజికోపేతైః" అని క్రీ. శ. సప్తమ శతాబ్దిలో సుబంధుకవి విరచిత వాసవదత్తలోనూ;

"సముద్దీపిత కందర్పా కృతగౌరీప్రసాధనా హరలీలేవ నో కస్య విస్మయాయ బృహత్కథా!" "బృహత్కథాకుశలేన-" అని క్రీ. శ. సప్తమ శతాబ్దిలో, వర్ధిల్లిన భట్టబాణుని హర్షచరిత, కాదంబరీ గ్రంథాలలోనూ; "ప్రద్యోతస్య ప్రియదుహితరం వత్సరాజోఽత్ర జహ్రే; ప్రాప్యా వన్తీ నుదయన కథాకోవిదగ్రామ వృద్ధాన్;" అని క్రీ. పూ. ప్రథమశతాబ్దిలో కాళిదాస కవీంద్రుని మేఘదూతములోనూ కనబడుతున్నవి.

క్రీ. పూ. ద్వితీయ శతాబ్దిలో ఉన్న భాసకవి బృహత్కథను అనుసరించి ప్రతిజ్ఞాయౌగంధరాయణము, స్వప్నవాసవదత్త మొదలయిన నాటకాలు రచించినాడు. బృహత్కథలోని గోముఖుడు యౌగంధరాయణుడుగానూ, మదనమంచుక వసంతసేనగానూ, భాసుని రచనలలో మారిపోయినారు. పైన ఉదహరించిన సంగతులను బట్టీ, ఇతర చరిత్రాంశములను బట్టీ గుణాఢ్యుడు క్రీ. పూ. ౨౦౦ మొదలు ౧౫౦ సంవత్సరప్రాంతాలలో వర్ధిల్లినాడని పురాతత్వవేత్తలు నిర్ధారణ చేసినారు.

## 3

మహామాహేశ్వరుడయిన జయద్రథుడు తన హరచరిత చింతామణిలో, ౨౭ ప్రకాశములో శబ్దశాస్త్రావతార ఘట్టములో గుణాఢ్యునికథ లిఖించినాడు. క్షేమేంద్రుడూ సోమదేవుడూ గుణాఢ్యుని చరిత్ర వ్రాసినారు. వారి వాక్కులవల్ల గుణాఢ్యునిది దైవమానుష జన్మగా కనిపిస్తుంది. ఆయనతల్లి బ్రాహ్మణకన్య, తండ్రి నాగప్రభువు. శాతవాహనప్రభువుల రాజధాని అయిన ప్రతిష్ఠాన (సుప్రతిష్ఠిత) పురములో ఆయన జననము.

అప్పటిరాజు శాతకర్ణి కావచ్చు. కథాపీఠలంబకములో రాజు జలక్రీడా వృత్తాంతములో సంస్కృత వ్యాకరణ ప్రశంసాదులనుబట్టి రాజు పాలించిన ఉండవలె. విమర్శకు ఈవిషయము నిలవదు. కథలో కొన్ని విషయాలు సుసంగతముగా లేవు. గ్రంథాంతరంగ పరీక్షవల్ల గుణాఢ్యుడు ఉజ్జయినీ పురవాసి అని తేలుతుంది.

గుణాఢ్యుడు కాశ్మీరకుడా, నేపాలీయుడా, ఆంధ్రుడా? నేపాళీయులు వారు ఆయన తమదేశీయు డన్నారు. అది అసంగతము. డాక్టర్ Winter Nitz మతప్రకారము గుణాఢ్యుడు కాశ్మీరకుడు. దానికి తగిన కారణాలు కనపడవు. ఇక ఆంధ్రవాదము మిగిలింది.

పాటలీ పుత్ర ప్రభువు నందుడూ, సుప్రతిష్ఠిత (ప్రతిష్ఠాన) ప్రభువు శాతవాహనుడూ సమకాలికులు. గుణాఢ్యునికీ సాతవాహన ఆంధ్ర రాజుకూ చాలా సంబంధము ఉండడము స్పష్టము. కాబట్టి గుణాఢ్యుడు ఆంధ్రుడు కావడానికి ఎక్కువవీలు కనబడుతున్నది.

బృహత్కథా విధానము రామాయణ మహాభారతముల ధోరణిని పోలి ఉన్నదట. బృహత్కథా బీజాలు క్రీ. పూ. చాలా శతాబ్దాలు వెనుకకు వెళ్ళుతవి. వివిధకథలను సంగ్రహించి, ప్రణాళిక ఏర్పరిచి, పైశాచీభాషలో రచించినాడు గుణాఢ్యుడు.

బృహత్కథ గద్యాత్మకమా, పద్యాత్మకమా? వచనరూపములోనే రచన జరిగిం దని ఫ్రాన్సుదేశ పండితుడు Lacote అన్నాడు. అయితే, ఇన్నిలక్షల గ్రంథము చేసినాడు అని కథాపీఠలంబకములో ఉన్న మాటలకు గతి యేమిటి? సంస్కృతభాషలో గ్రంథము అంటే 32 అక్షరాల పద్యసముదాయము. ఒకవేళ దానిని వచనానికికూడా అన్వయించవచ్చునేమో.

గద్య మయినా పద్య మయినా బృహత్కథ ఆదినుంచీ ఆదరమే పొందింది. కవులు, లాక్షణికులు, (వ్యంగ్యముగా) కవిత్రయములో వాల్మీకి, వ్యాస, గుణాఢ్యులను ప్రశంసించారు.

గుణాఢ్యుని ప్రభావము చాలామంది గ్రంథకర్తలమీద పడ్డది. ముఖ్యముగా దండ్యాచార్య, కల్హణపండిత ప్రభృతులమీద ప్రస్ఫుటము. పైశాచీభాష ప్రాకృతభాషలలోనిదే.

౪

పైశాచీమాతృక కానీ, అందులో భాగాలు కానీ, ఇప్పుడు లభ్యము కావడము లేదు. క్రీ. శ. తొమ్మిదవ శతాబ్దివరకూ పైశాచీగ్రంథ మున్నట్టు బుధస్వామివల్ల తెలుస్తుంది. క్షేమేంద్రుడు కాని, సోమదేవుడు కాని, పైశాచీమాతృక చూచారా అని సందేహము. ఈకవులిద్దరికీ లభించినది గుణాఢ్యకృతి కాదని పాశ్చాత్యవిజ్ఞుల మతము. పైశాచీమాతృకను ఆధారము చేసుకొని, మూలములో ఉన్న కొన్ని విషయాలు తీసివేసి, కొన్ని నూతనాంశాలు చేర్చినగ్రంథ మది అనవచ్చు. అయితే అది పైశాచీలో ఉన్నదా, ఆనాటి కాశ్మీరీభాషలో ఉన్నదా? కథాపీఠలంబకములో ఉన్న విషయా లన్నీ యథార్థము అనడానికి వీలు లేదు. క్షేమేంద్ర సోమదేవులు బుధస్వామిగ్రంథమునో, కాశ్మీరీ అనువాదమునో చూచినా రని భావించవచ్చు.

క్షేమేంద్రుడు ఉత్తమగ్రంథాలను సంగ్రహించి రామాయణమంజరి, భారతమంజరి, బృహత్కథామంజరి రచించినాడు. ఆయనకు కళాదృష్టి కన్న ధర్మదృష్టి ఎక్కువ కావడముచేత రచనలో స్వారస్యము తక్కువ. క్షేమేంద్రుడు అనుసరించిన కాశ్మీరకపాఠములో పంచతంత్రము, బేతాళపంచవింశతి మొదలయినవి ఉన్నవి. గుణాఢ్యునికృతిలో అవి లేవట.

౫

కథాసరిత్సాగరములో ౧౮ లంబకములు, ౧౨౪ తరంగములు, ౨౨,౦౦౦ శ్లోకములూ ఉన్నవని Arthur Macdonell మహాశయుని లెక్క. ౨౧, ౫౦౦ అని మరికొందరి గణన. కవి విశేష భాగము అనుష్టుభ చ్ఛందస్సులో గ్రంథము నడిపినాడు. అక్కడక్కడ

ఇతర సంస్కృతవృత్తాలుకూడా తగులుతూ ఉంటవి. పుస్తకమంతా పురాణధోరణిలో కాఠిన్యము లేకుండా, సరళరీతిలో సాగిపోయింది.

ఇందులో ద్వితీయ తృతీయ చతుర్థ లంబకాలు ఒక్క శ్రేణిలో ఉంటవి. పంచమ అష్టమ లంబకాలకూ కథాగమనానికీ సందర్భశుద్ధి తక్కువ. ఆరవ లంబకము ధోరణి చూస్తే, తగినంత ప్రాతిపదిక లేకుండా నూతన కథా ప్రారంభ మయినట్టు కనిపిస్తుంది. ఏడు తొమ్మిది పదకొండు లంబకాలకు కూర్పుబిగువు తక్కువ. అవి వివాహాలతో మాత్రము సమాప్తి చెందుతవి. ౧౨, ౧౩ లంబకాలు సుసంగతము లయినప్పటికీ ౧౪-౧౫, ౧౬-౧౭ లంబకాల తర్వాత ఉండడము ఉచితము. ౧౮ లంబకాన్ని విభజించవలె. పూర్వభాగము ఆరవలంబకానికి పీఠిక అవుతుంది. ఉత్తర భాగము సరిగా అతకదు.

సోమదేవుడు ఆరవ లంబకమునుంచీ ఉపకథలు చేర్చి, నాయకుని వీర కృత్యములు వివరించి స్వారస్యము సమకూర్చినాడు. అవాంతరకథలలో సామాన్యజనుల విశ్వాసాలు ద్యోతకమవుతవి. కాశ్మీర దేశములో ఉండే కొన్ని మూఢవిశ్వాసాలు కవి ఇందులో కూర్చినాడు. బౌద్ధుల జాతక కథాంశములు, మాంత్రికులచేష్టలు, పిట్టకథలు, మొద లయినవి కూడా చాలా చేరినవి. గ్రంథానికి ఏకవాక్యత సమకూర్చడానికి కవి కష్టించినాడు. సోమదేవుడు గాణాపత్యునివలె కనబడతాడు. విశేషముగా గణపతిస్తుతి చేసినాడు. శివస్తుతికూడా వెంటవెంటనే ఉంటుంది. గ్రంథములో చాలాచోట్ల వింధ్యవాసినీదేవి ఆరాధన కనిపిస్తుంది. ఆకాలపువారికి కొండదేవతమీద దండిగా భక్తి ఉండాలి.

మానవచరిత్రలు దుఃఖభూయిష్ఠము లనీ, దివ్యుల చరిత్రలు సుఖ మయము లనీ, అందుచేత వైచిత్రికి తావు తక్కువ అనీ, ఈ గ్రంథ ములో దివ్యమానుష కథలు కవి వర్ణించినాడు. కథాపీఠములోనే ఈ ప్రతిజ్ఞ ఉండడముచేత చదువరులకు సంభావనా విరహము కలగదు.

సంక్షిప్త్రశ్రేణి బాటనికథలూ, ఘట్టములూ అనేకము కథాసరిత్సాగర మాటలూ కలిసిపోయినవి. రాజచరిత్రలే కాకుండా, బ్రహ్మ క్షత్రియ వైశ్యుల కథలూ, కర్మకారుల కష్టసుఖ వృత్తాంతములూ, వణిక్పుత్రుల వ్యాపారవిశేషాలూ, సముద్రయానపరుల సాహసకృత్యాలూ, ద్వీపాంతర వాసుల స్థితిగతులూ, విచిత్ర చరిత్రలూ విరివిగా ఇందులో పొందుపరచి తన రాజపత్ని సూర్యమతీదేవికి సమ్మోదము సమకూర్చినాడు.

ఇటువంటి కథలను పోలినకథలను సంస్కృతములో కొందరు రచించినారు. దక్షిణాపథమున మహిళాపురమును క్రీ. శ. ఆరవ శతాబ్దిలో పరిపాలించిన అమరశక్తి ప్రభుకుమారులకు విష్ణుశర్మ పంచతంత్రము చెప్పినాడు. ధవళచంద్రప్రభువు ఆనతిప్రకారము నారాయణుడు 'హితోపదేశము' చేసినాడు. కొద్దిమార్పులతో అది పంచతంత్రమువలెనే ఉంటుంది.

విక్రమార్కుడు నాయకుడుగా 'బేతాళ పంచవింశతి' వల్లభదాసు వ్రాసినాడని కొందరూ, జంభదత్తుడు చేసినాడని కొందరూ అన్నారు. "విక్రమార్క చరిత్రము" నందికేశ్వరుడు (నందికేశ్వరయోగి) రచించినది.

"శుకసప్తతి" క్రీ. శ. ఏకాదశ శతాబ్దికి పూర్వమే ఉన్నట్టు ఊహ. ఈ కథాసరిత్సాగర పఠనమువల్ల వినోదమే కాకుండా వివిధవిషయ జ్ఞానముకూడా కలుగుతుంది.

ఇతి శివమ్!

సాహిత్య సమితి
రాజమహేంద్రవరము
౧ అక్టోబరు, ౧౯౪౫

శివశంకరశాస్త్రి

# విషయానుక్రమణిక

తరంగము: ౭



తరంగము: ౮



తరంగము: ౯



తరంగము: ౧౦



తరంగము: ౧౧



తగంగము: ౧౨



తరంగము: ౧౩

## కథా పీఠ లంబకము

### తరంగము ౧

---

శ్రియం దిశతు వశ్శంభో
శ్శ్యామః కంఠో మనోభువః
అంకస్థ పార్వతీ దృష్టి
పాశైరివ విశేష్టితః!

సంధ్యానృత్తోత్సవే తారాః
కరేణోద్ధూయ విఘ్నజిత్
సీత్కారశీకరైరన్యాః
కల్పయన్నివ పాతు వః!

మనసిజుని కోర్కెచే ఆసమాడ్కి నొప్పు
నేది యంకస్థ పార్వతీదృష్టిపాశ
వలయితం బయి, ఆమహేశ్వరుని నీల
గళము చూపునుగాక మంగళము మనకు!

సాంధ్యనృత్తోత్సవమున హస్తమ్ము లోడ
చిమ్మి తారల, సీత్కారశీకరముల
నన్యతారల గల్పించు నట్లు తోచు
శ్రీగణేశుడు మనల రక్షించుగాక!

### కథావతరణము

కిన్నర గంధర్వ విద్యాధరులకు నివాసమైన హిమవత్పర్వతానికి ఉత్తరశిఖరము కైలాసగిరి. ప్రమథగణాలు, సిద్ధవిద్యాధరులూ సేవలు చేస్తూఉండగా, సమస్తచరాచరప్రపంచాలకు ప్రభువైనమహేశ్వరుడు అంబికాదేవితో ఆశిఖరముమీద నివాసము చేస్తూ ఉంటాడు. ప్రాణ

ప్రియ అయిన శ్రీభవానీదేవి ఒకనాడు ఏకాంతప్రదేశాన ఈశ్వరుణ్ణి స్తుతి వాక్యాలతో ప్రసన్నుని చేసుకున్నది. శశిశేఖరుడు ఆమెను అంకతలము న కూర్చోబెట్టుకొని, "కిం తే ప్రియం కరోమి? నీకు ఇష్టమైనది ఏది చెయ్యను!" అన్నాడు. అప్పుడు పార్వతి, "నాథా, నాకు మనోహర మైన అద్భుతకథచెప్పండి" అన్నది. అందుకు పరమేశ్వరుడు "ప్రేయసీ, నీకు తెలియని భూతభవిష్యద్వర్తమానములు ఏమున్నవి?" అన్నాడు. అలా అన్నప్పటికీ పార్వతి పరమశివుని నిర్బంధపెట్టింది. మానవతులమనస్సు ప్రియానురాగాన్ని పరీక్ష చెయ్యవలెననేకోరికతో ఉండడము సహజమే. మహేశ్వరుడు ఆమె హృదయానికి ఉల్లాసము కలిగించి, తనప్రభావాన్ని ప్రకటించే ఈచిన్నకథ చెప్పినాడు.

## జ్వాలాలింగ కథ

పూర్వము నాదర్శనార్థము బ్రహ్మావిష్ణువులు బయలుదేరి భూలోకసంచారము చేస్తూ, హిమవత్పర్వతమూలము చేరి, అక్కడజ్వాలాలింగాన్ని చూచినారు. దానిఅంతు తెలుసుకోడానికి ఒకరుపైకి, ఒకరు కిందికీ వెళ్ళినారు. ఎంతదూరము పోయినప్పటికీ అంతము అగపడలేదు. ఇద్దరూ తిరిగి వచ్చి తపస్సు చేసి నన్ను మెప్పించారు. నేను వాళ్ళకు ప్రత్యక్షమై, "వరములు కోరుకోండి" అన్నాను. తనకు నేను పుత్రుడుగా పుట్టవలెనని బ్రహ్మ అడిగినాడు. తాను సర్వోత్కృష్టుడు కావలెనని అడిగిన యీవరమువల్ల బ్రహ్మకు లోకములో పూజలు లేకుండా పోయినవి! "స్వామీ, మీకు నేను శుశ్రూష చేస్తూ ఉండేలాగ వరము దయచెయ్యండి" అనికోరడముచేత విష్ణువు నాశరీరములో అర్ధభాగముగా జన్మించినాడు. ఆనారాయణుడవు నీవే. పూర్వజన్మలో నీవు నాభార్యవు.

శంకరుడు ఈప్రకారము చెప్పగానే, "వెనక జన్మలో మీకు నేను ఎలా భార్య నయినాను?" అని పార్వతి ప్రశ్నించింది. మహేశ్వరుడు కథ మొదలు పెట్టినాడు.

## దక్షయజ్ఞ కథ

దేవీ, పూర్వము దక్షప్రజాపతికి నీతోపాటు చాలామంది కొమార్తెలు పుట్టినారు. నేను నీపాణి గ్రహించాను. ఒకసారి నీ తండ్రి యజ్ఞము చేస్తూ, అల్లుళ్ళను అందరినీ ఆహ్వానించి నన్నుమాత్రము పిలవలేదు. అప్పుడు నీవు "మీఅల్లుడుగారిని పిలువలేదేమి?" అని నీతండ్రిని అడిగావు. "నీభర్త కపాలమాలిక కంఠహారంగా ధరిస్తాడు. అటువంటివాణ్ణి యజ్ఞంలోకి ఎలా ఆహ్వానించను?" అన్నాడు దక్షుడు. ప్రియా, ఆయన అన్నమాటలు నీచెవులకు శూలాయమానము లయినవి. "నాతండ్రి పాపాత్ముడు! ఇటువంటివాడికి జన్మించిన యీ పాడు శరీరము నా కెందుకు!" అని నీవు కోపముతో ఆదేహము త్యజించావు. కొంచెము జ్ఞాపకము చేసుకో. నేను హిమాలయానికి తపస్సుకోసము వచ్చాను. హిమవంతునికి నేను అతిథిని. నాశుశ్రూష చెయ్యడానికి ఆయన నిన్ను నియమించినాడు. తారకాసురుని సంహరించ గల కుమారుడు నాకు కలగడముకోసము దేవతలు మన్మథుని ప్రేరేపించారు. ఆప్రేరణవల్ల మదనుడక్కడికి వచ్చాడు. నీవు నాసన్నిధానములో ఉన్నప్పుడు తరుణము చూచుకొని నామీదికి పుష్పబాణము విడిచాడు. నేను మూడోకన్ను తెరిచేసరికి పంచబాణుడు భస్మీభూతు డైనాడు. తరువాత నీవు కఠోరతపస్సు చేసి నన్ను ప్రసన్నుని చేసుకొన్నావు. పూర్వజన్మలో నీవు నా ప్రేయసివి. ఇంతకన్న ఏమి చెప్పమన్నావు?

మహేశ్వరుడు ఇలా అనేసరికి పార్వతీదేవికి అలక వచ్చింది. "ఎందుకిలా వంచన చేస్తారు? వేడుకొన్నప్పటికీ చక్కనికథ చెప్పరే!

మీహృదయం ఎప్పుడూ అన్యాసక్తమే. గంగమ్మను నెత్తిమీద ఎక్కించుకొని సంధ్యాదేవికి మీరు ప్రణామము చేయడం నాకు తెలియదా ?” అని బెదిరించింది. శివుడు ఆమె అలక తీర్చి దివ్యకథ చెప్పడానికి అంగీకరించాడు. ఆమె ప్రసన్నురాలైంది. లోపలికి ఎవరినీ అడుగు పెట్టనీయవద్దని పార్వతీదేవి నందీశ్వరునికి ఆజ్ఞయిచ్చింది. నందీశ్వరుడు ద్వారము కాపలా కాస్తూ ఉండగా ఈశ్వరుడు ఈకథ చెప్పడము మొదలు పెట్టినాడు:

## పుష్పదంతాదుల శాప వృత్తాంతము

దేవి ! దేవతలు నిరంతరభోగులు. వారిచరిత్రలు సుఖాంతాలు. మానవులు దుఃఖభాజనులు. అందువల్ల దేవమానవచరిత్ర సుఖదుఃఖ మిళితమై మనోహరముగా ఉంటుంది. విద్యాధరులకథ విను అని శివుడన్నాడు.

ఇంతలో పుష్పదంతు డనే ఈశ్వరభృత్యుడు ద్వారము దగ్గరకు వచ్చినాడు. శివారాధననిమిత్తము అతడు ఇంటిలోకి వెళ్లవలసి ఉన్నది. ద్వారదేశములో ఉన్న నందీశ్వరుడు అతన్ని ఆటంకపరచినాడు. నిష్కారణముగా నన్ను అడ్డుకొంటావేమి అని, పుష్పదంతుడు యోగమాయవల్ల అదృశ్యుడై శివసన్నిధానము చేరి మహేశ్వరుడు చెప్పుతున్న విద్యాధరులవిచిత్రచరిత్రలు విన్నాడు. తరువాత తనభార్య జయదగ్గరికి వెళ్లి ఆకథ లన్నీ పూస గుచ్చినట్లు ఆమెకు చెప్పినాడు. ధనముగాని రహస్యము గాని స్త్రీల దగ్గర దాగదు. ఆడవాళ్లనోళ్లలో నువ్వుగింజ నానదు అనేమాట నిజము. కుతూహలముతో తాను ఆకర్ణించిన అద్భుతకథలను జయ పార్వతీదేవికి చెప్పింది. మహేశ్వరుడుతనకు అపూర్వము లైన కథలు చెప్పుతానని పురాణములు, శ్రుతపూర్వములు అయినవే చెప్పినాడేమో అనుకొని తరువాత భర్తతో, “స్వామీ !

మీరు నాకు చెప్పినకథలు జయకుకూడా తెలుసు" అన్నది. మహేశ్వరుడు యోగదృష్టివల్ల సర్వమూ గ్రహించి అమ్మవారితో "దేవి! నీకు నేను కథలు చెప్పేసమయములో పుష్పదంతు డనే నాభక్తుడు యోగశక్తివల్ల లోపల ప్రవేశించి అదృశ్యుడై ఉండి విద్యాధర చరిత్రలు విని వెళ్లి తనభార్యకు చెప్పినాడు" అన్నాడు. ఈవాక్కులువిని పార్వతి కోపోద్దీపితురాలై పుష్పదంతుని పిలిపించి నీవు మనుష్యజన్మ ఎత్తవలసిం దని శాప మిచ్చింది. పుష్పదంతుని క్షమించ మని అక్కడ ఉన్నప్రమథుడు మాల్యవంతుడు అమ్మవారిని వేడుకొన్నాడు. అమ్మవారు ఆగ్రహించి నీవుకూడా మనుష్యుడవై పుట్టు మని మాల్యవంతుని శపించింది. ఆతరువాత పుష్పదంతుడు తనభార్య జయతోను, మాల్యవంతునితోను కలిసివచ్చి మొర పెట్టుకొన్నాడు. అప్పటికి అమ్మవారి హృదయము కరిగింది. అప్పుడు పార్వతీదేవి శాపవిమోచనము ఈ విధముగా అనుగ్రహించింది: "పుష్పదంతా! కుబేరునిశాపముచేత సుప్రతీకుడు అనేయక్షుడు పిశాచరూపము ధరించి వింధ్యారణ్యములో కాణభూతి అనేపేరుతో ఉన్నాడు. నీవు ఆపిశాచరూపము ఎప్పుడు చూస్తావో అప్పుడు పూర్వజన్మస్మరణ కలుగుతుంది. వాడికి ఈ కథ చెప్పు. వెంటనే నీకు శాపవిమోచనము అవుతుంది. మాల్యవంతుడు కాణభూతివల్ల ఈకథవింటే కాణభూతి శాపవిముక్తుడౌతాడు. ఈకథ లోకములో ప్రకటిస్తే మాల్యవంతుని శాపము తొలగిపోతుంది."

పార్వతీదేవి ఈప్రసాదముగా అనుగ్రహించినమీదట పుష్పదంతుడు, మాల్యవంతుడు అదృశ్యులైనారు.

## ప్రమథులు

కాలము గడిచింది. ఒకనాడు గౌరీదేవి శంకరుని చూచి "దేవా! నేను శపించిన ఆప్రమథులు ఇద్దరూ ఎక్కడ జన్మించినారు?" అని

జాలిగాఅడిగింది. "ప్రియా! భూలోకములో కౌశాంబి అనేనగరమున్నది. పుష్పదంతుడు అక్కడ వరరుచినామముతో ఉన్నాడు. మాల్యవంతుడు సుప్రతిష్ఠితము అనేనగరములో గుణాఢ్యు డనేపేరుతో ఉన్నాడు. ఇది సంగతి" అని చంద్రశేఖరుడు చెప్పినాడు. తనభక్తులకు శాప మిచ్చి కష్టపెట్టినందుకు విచారపడుతున్న పార్వతీదేవిని ఈశ్వరుడు కైలాససానువులలోను, కల్పలతా నికుంజాలలోను సుఖగోష్ఠిలో తేల్చుచూ కాలము గడపినాడు.

## తరంగము : ౨

## వరరుచి కాణభూతిని చూచుట

వరరుచి, కాత్యాయనుడు అనేనామాంతరాలతో పుష్పదంతుడు భూలోకములో మానవజన్మ ఎత్తినాడు. ఆయన నందరాజువద్ద మహామంత్రిగా ఉన్నకాలములో గొప్పవిపత్తు సంభవించింది. వరరుచి వింధ్యవాసినీదేవి దర్శనార్థము వింధ్యాటవికి వెళ్లినాడు. తపస్సు చేసి అమ్మవారిని ప్రసన్నురాలినిగ చేసుకొన్నాడు. దేవి అతనిస్వప్నములో ప్రత్యక్షమై వింధ్యారణ్యములో ఉన్నకాణభూతిని దర్శించ మని ఆజ్ఞ ఇచ్చినది. వరరుచి మహారణ్యము ప్రవేశించి పెద్దమర్రిచెట్టుకింద పిశాచగణపరివేష్టితుడై కొలువు దీర్చిఉన్న మహోన్నతశరీరుని కాణభూతిని చూచినాడు. కాణభూతి వెంటనే లేచి ఎదురువెళ్లి వరరుచిపాదములకు ప్రణామముచేసి ఆయనను సుఖాసీనుని చేసినాడు. వరరుచి "కాణభూతీ! నీనడవడి ఉత్తమముగా ఉన్నది. నీకీపిశాచత్వము ఎందుకు వచ్చింది?" అని ప్రశ్నించినాడు. ఆచల్లనిమాటలకు సంతోషించి కాణభూతి ఇలా చెప్పినాడు :

## కాణభూతి వృత్తాంతము

మహానుభావా! స్వయముగా నాకు పూర్వజన్మ జ్ఞానము లేదు. అయితే ఒకసారి ఉజ్జయినిలో రుద్రభూమిలో ఈశ్వరునివల్ల విన్న మాటలు చెపుతాను. పార్వతి మహేశ్వరునితో, "నాథా! కపాల మాలలు, స్మశానసంచయము మీకు ఎందుకు ఇంపుగా ఉంటవి?" అన్నది.

ప్రళయకాలములో ప్రపంచము జలమయము అయింది. ఆసమయం లో నాతొడ చీరి రక్తబిందువులు కిందికి రాల్చాను. అవి నీటిలోపడి అండమైనవి. ఆఅండము రెండుభాగాలు చేశాను. పురుషుడు పుట్టి నాడు. సృష్టినిమిత్తము ప్రకృతిని సృజించాను. వారుభయులూ ఇతర ప్రజాపతులను ప్రజలను సృష్టించారు. అందువల్ల ఆపురుషుని పితామహు డన్నారు. అతడు చరాచరప్రకృతిని కల్పించి గర్వించినాడు. వెంటనే అతనిశిరస్సు ఖండించినాను. తరువాత నాహృదయము వెన్నవలె కరి గింది. జాలిగుండెతో కపాలము ధరించి స్మశాన వాసినై మహావ్రతము లో మగ్నుడను అయినాను. దేవీ, ఆఅండభాగాలు రెండూ భూమ్యా కాశాలు. అందువల్ల భువనము ఈకపాలరూపాన నాహస్తములో ఉన్నది. అని మహేశ్వరుడు చెప్పినాడు.

పార్వతీపరమేశ్వరులు ఇంకేమి ప్రసంగిస్తారో విందామని కుతూ హలాయత్తచిత్తుడను అయినాను. "పుష్పదంతుడు మన సన్నిధికి ఎప్పుడు వస్తాడు?" అని పార్వతి అడిగింది. "కుబేరసేవకు డైనపీడు స్థూలశిరు డనే రాక్షసునితో చెలిమి చేసినాడు. ఈసంగతి తెలిసి కుబే రుడు కోపోద్దీప్తుడై, 'వింధ్యాటవిలో పిశాచమై పుట్టు' అని శపించినాడు. వాని సోదరుడు దీర్ఘజంఘుడు వెళ్లికుబేరునిపాదాలమీద పడి శాపాం తము కోసము ప్రార్థించినాడు. "శాపవశాన భూలోకములో పుష్ప

దంతుడూ, మాల్యవంతుడూ మానవజన్మ ఎత్తినారు. పుష్పదంతునివల్ల మహాకథ విని, మాల్యవంతునికి వీడు చెప్పినతర్వాత ముగ్గురికీ మళ్ళీ దివ్యత్వము వస్తుంది అని కుబేరుడు అనుగ్రహించినాడు. పుష్పదంతునికి నీవుకూడా శాపమోక్షము అలాగే విధించావు. జ్ఞాపకముచేసుకో'' అని శివుడు చెప్పినవాక్కులు విని చాలా సంతోషించి ఇక్కడికి వచ్చినాను. పుష్పదంతుని దర్శనము అయితే గాని నాశాపవిముక్తి కాదు.

## వరరుచి కాణభూతికి బృహత్కథ చెప్పుట

ఈమాటలు వినేసరికి వరరుచి నిద్ర మేలుకొన్నట్టయి పూర్వజన్మ స్మృతి కలిగి "ఆపుష్పదంతుడను నేనే. ఆబృహత్కథ చెపుతాను విను'' అని ఏడులక్షల పరిమితి కలిగిన ఏడుభాగాలు చెప్పినాడు. కాణభూతి ఆశ్చర్యము పొంది, "మహానుభావా, నీవు సాక్షాత్ రుద్రుని అవతారానివి! కాకపోతే ఇటువంటి మహాకథలు ఎవరు చెప్పగలరు? నీ అనుగ్రహముచేత నాశాపము క్షీణించినట్టే తోస్తున్నది. నాకు చెప్పడానికి మీాకు అభ్యంతరము లేకపోతే పుట్టినది మొదలు నేటివరకు నీయాన వృత్తాంతమూ తెలిపి నన్ను కృతార్థుని చెయ్యాలి!'' అని వేడుకొన్నాడు. వరరుచి తనచరిత్ర సవిస్తరముగా ఇలా చెప్పడము ప్రారంభించినాడు:

## వరరుచి జననము

కౌశాంబీనగరములో ఒకబ్రాహ్మణు డుండేవాడు. అగ్నిశిఖు డనీ, సోమదత్తు డనీ, ఆయనకు రెండుపేర్లు. ఆయనభార్య వసుదత్త. వెనక జన్మలో ఆమె మునికన్య; శాపవశాన మానవజన్మ ఎత్తింది. నేను వారి పుత్రుడను. నాశైశవములోనే మాతండ్రి పరమపదించినాడు, మాతల్లి చాలా కష్టపడి నన్ను పెంచింది.

## వ్యాడీ, ఇంద్రదత్తుడూ, వరరుచిని కలిసికొనుట

ఒకరోజున ఎవరో ఇద్దరు బ్రాహ్మణులు చాలా దూరప్రయాణము చేసి మాయింటికి వచ్చి మద్దెలచప్పుడు చేసినారు. ఆశబ్దము విని మా అమ్మ మానాయనగారిని తలచుకొని "అబ్బాయీ, మీతండ్రిగారి స్నేహితుడు నందుడు అనేనటుడు ఈరోజు నృత్యముచేస్తాడు" అన్నది. "అమ్మా, నన్ను వెళ్ళ నిస్తావా? చూచి వస్తాను. ఆపాట నీకు విని పిస్తాను, ఆటనీకు చూపిస్తాను" అన్నాను. నామాటలువిని ఆబ్రాహ్మణు లిద్దరూ ఆశ్చర్యపడ్డారు. "నిజమే. మాకుర్రవాడు ఒకసారివింటేనే ధారణ చేస్తాడు" అని మాఅమ్మ వారితో అన్నది. నన్ను పరీక్షించా లని వాళ్ళు నాయెదట వేద ప్రాతిశాఖ్య చదివినారు. విని ఆగ్రంథము యావత్తూ వెంటనే అప్పగించాను. ఆతర్వాత వాళ్ళవెంట నాట్యానికి వెళ్ళి చూచి, వచ్చి, అది అంతా మాఅమ్మయెదుట ఆడి పాడినాను. వా రిద్దరిలో ఒక ఆయన పేరు వ్యాడీ. ఆయన నన్ను శ్రుతధరునిగా నిర్ణ యించి, మాఅమ్మగారికి ప్రణామము చేసి ఇలా చెప్పినాడు:

## వ్యాడీ, ఇంద్రదత్తుల చరిత్ర

అమ్మా, వేతసపురములో దేవస్వామి, కరంభకుడు అని ఇద్దరన్న దమ్ములు ఉండేవారు. ఒకరిని చూస్తే ఒకరికి ఎంతో ప్రీతి. ఒకాయన కుమారుడు ఈఇంద్రదత్తుడు; రెండవఆయన కుమారుడను నేను, వ్యాడిని. నేను పుట్టగానే మానాయన చనిపోయినాడు. ఆదుఃఖము భరించ లేక ఇంద్రదత్తునితండ్రి మహాప్రస్థానయాత్ర చేసినాడు. ఆవిచారముచేత మాతల్లులు దేహాలు చాలించారు. ధన మున్నప్పటికీ మాకు దిక్కు లేదు. విద్యానిమిత్తము కుమారస్వామిని గురించి తపస్సు చెయ్యడానికి

బయలుదేరినాము. స్వామివారు స్వప్నములో సాక్షాత్కరించి "నంద మహారాజు పాలించే పాటలీపుత్రములో వర్షుడనే విప్రు డున్నాడు. అక్కడికి పొండి. ఆయనవల్ల మీకు సమస్తవిద్యలూ సంక్రమిస్తవి" అని అనుగ్రహించినాడు. తర్వాత మేము పాటలీపుత్రానికి వెళ్ళి వర్షుని కోసము చాలా విచారణచేశాము. వర్షు డనే బ్రాహ్మణుడైతే ఉన్నా డు. ఆయన వట్టిమూర్ఖుడు. ఆ పేరు గలవిద్వాంసుడు లేడు అని తెలిసింది. మాకేమీ తోచక వీధులవెంట తిరిగి తిరిగి చివరకు వర్షుని యింటికి చేరుకొన్నాము. ఆయింటికి ఎటు చూచినా ఎలికకన్నాలు, చీమలపుట్టలు. గోడలు బీటలు వేసినవి. ఇంటికప్పు సరిగా లేదు. కళావిహీనమైన ఆయింట్లోకి వెళ్ళి చూస్తే వర్షుడు ధ్యాననిష్ఠలో ఉన్నాడు. ఆయనభార్య కనిపించింది. ఆమె చాలా చిక్కిపోయింది. చినుగుల పాత చీర కట్టుకొని ఉన్నది. మూర్తీభవించిన దరిద్ర దేవత వలె తోచింది. ఆమెమమ్మలిని కూచో మన్నది. మేము ఆమెకు సాష్టాంగదండప్రణామాలు చేశాము; చేసి మావృత్తాంతము, వర్షుని మాహాత్మ్యమునుగురించీ ఆమెతో చెప్పినాము. ఆసాధ్వి "నాయనలారా, మీరునాబిడ్డల లాంటి వాళ్ళు. మీదగ్గర దాచడమెందుకు? నిజస్థితి చెపుతాను" అని ఈకథ ప్రారంభించింది :

## వర్షోపాధ్యాయుల కథ

ఈనగరములోనే శంకరస్వామి అనే విప్రుడు ఉండేవాడు. నాభర్త, ఉపవర్షుడూ ఆయనకుమారులు. నాభర్త మూర్ఖుడు, దరిద్రుడు. ఉపవర్షుడు బుద్ధిమంతుడు, ధనవంతుడు. వర్షాకాలము వచ్చినప్పుడు ఈనగరములో స్త్రీలు బెల్లము పిండి కలిపి పిండివంట వికారరూపము వచ్చే లాగున చేసి, మూర్ఖబ్రాహ్మడికి దానము చేస్తారు. వివేకు లెవరూ ఆదానము పట్టరు. ఆదానమువల్ల స్త్రీలకు శీతాకాలములో స్నాన

శ్రమ కాని, వేసంకాలములో తాపబాధ కాని కలగవు. మాతోడి కోడలు దక్షిణతోసహా ఆదానము నాభర్తకు ఇచ్చింది. అదిపట్టుకొని నాభర్త ఇంటికి వచ్చాడు. నాకు చాలా అసహ్యాం వేసింది. నేను విసుక్కున్నాను. తనవిద్యావిహీనతకు ఎంతో విచారించి నాభర్త కుమారస్వామివారి పాదపద్మాలే శరణ మని యెంచి వెళ్ళి తపస్సు చేసి స్వామిని మెప్పించినాడు. స్వామి ప్రసన్నుడై, మావారికి సమస్తవిద్యలూ అనుగ్రహించి "ఏకసంథాగ్రాహి అయినబ్రాహ్మణకుమారునికే ఈ విద్యలు చెప్పవచ్చు. ఇతరులకు చెప్పవద్దు" అని ఆదేశించినాడు. దేవతాప్రసాదము పొంది స్వగృహానికి తిరిగి వచ్చి, సంతోషపూర్వకముగా నాతో విశేషా లన్నీ చెప్పి, అప్పటినుంచీ నిరంతర ధ్యానములో ఉంటున్నారు. మీరువెళ్లి శ్రుతధరుని (ఏకసంథాగ్రాహిని) ఎవనినైనా తీసుకు రండి. మీనర్వాభీష్టాలు సిద్ధిస్తవి.

## వ్యాడీ ఇంద్రదత్తుడు వరరుచిని వర్షోపాధ్యాయుని వద్దకు కొనిపోవుట

వర్షుసధర్మపత్నికి వందవరహాలిచ్చి అక్కడినుంచి మేము దేశము తిరిగీ తిరిగీ చివరకు మీయింటికి వచ్చినాము. ఏకసంథాగ్రాహి ఇప్పటికి మాకు లభించినాడు. ఇతనిని మాకు ఇస్తే మేమందరమూ వెళ్లి విద్యలు సాధిస్తాము అని వ్యాడి చెప్పినమాటలకు ఆమె ఇలా అన్నది: "మీ మాటలలో నాకు సంపూర్ణ విశ్వాస మున్నది. వీడు పుట్టగానే అశరీరవాణి ఈసంగతులు సూచించింది. వీడు శ్రుతిధరు డవుతాడు. లోకములో వ్యాకరణశాస్త్రము ప్రతిష్ఠిస్తాడు. లోకములో ఏదేది వరమో (ఉత్తమమో) అది యావత్తూ వీనికి రుచిస్తుంది. కాబట్టి వరరుచి అని పేరు వస్తుంది. వీడు ఎదిగినప్పటినుంచీ ఆవర్షోపాధ్యాయులవారు ఎక్కడ

ఉన్నారో అని నేనూ ఆలోచిస్తూనే ఉన్నాను. మీమాటలు వింటే చాలా ఆనందముగా ఉన్నది. వీడు మీతమ్ముని లాంటివాడు. తీసుకు వెళ్ళండి. ”

మాఅమ్మ అంగీకరించినందుకు వ్యాడీంద్రదత్తులు హర్షపరవశు లయిపోయి ఆరాత్రి మేలుకొని ఇష్టాగోష్ఠిలో కాలము గడిపినారు. నాకు వేదాధికారము కలగడానికి ఉపనయనము చేయించి మాఅమ్మకు ధనముకూడా ఇచ్చి నన్ను తీసుకొని బయలుదేరుతుంటే ఆమె కన్నీళ్లు ఎలాగో ఆపుకొని అనుజ్ఞ ఇచ్చింది. వ్యాడీంద్రదత్తులు ఆమెకు శాంత వచనాలు చెప్పినారు.

## వ్యాడీ, ఇంద్రదత్త కాత్యాయనుల విద్యాభ్యాసము

ప్రయాణము చేసి చివరకు మేము వర్షోపాధ్యాయులవారి యింటికి వెళ్ళినాము. గురువు నన్ను వాత్సల్యముతో స్వీకరించినాడు. మర్నాడు ఆయన పవిత్రప్రదేశాన నన్ను ఎదురుగా కూర్చోబెట్టుకొని మొదట ప్రణవము ( ఓంకారము ) ఉచ్చరించినాడు. తక్షణమే ఆయనకు షడంగ ములతోసహా వేదా లన్నీ స్ఫురించినవి. వెంటనే గురువు మాకు వేదా ధ్యాపనము ప్రారంభించినాడు. ఒకసారి వినేసరికి నేను, రెండోమారు వినేటప్పటికి వ్యాడి, మూడోపర్యాయానికి ఇంద్రదత్తుడు వేదములు గ్రహించినాము. అపూర్వమైనవేదఘోష విని విప్రులు వచ్చి చాలా ఆశ్చర్యపడి వర్షోపాధ్యాయులవారికి సాష్టాంగదండప్రణామాలు చేసి స్తోత్రసమేతముగా పూజ చేసినారు. ఆదృశ్యము చూచి ఉపవర్షుడు తప్ప తక్కినవా రంతా ఆనందించినారు. ఈవిషయాలు నందమహారాజుకు తెలిసి, కుమారస్వామివారి వరప్రభావమువల్ల జరిగినట్టు గ్రహించి ప్రభువు మాగురువుగారికి సమస్తసంపదలూ సమకూర్చి ధన్యు డయినాడు.

## తరంగము : 3

వరరుచి చెప్పుతూ ఉంటే కాణభూతి ఏకాగ్రచిత్తముతో వింటు న్నాడు. స్వాధ్యాయ ముయిపత ర్వాత ఒకనాడు ఉపాధ్యాయులవారితో "స్వామీ, ఈనగరము లక్ష్మీ సరస్వతులకు నిలయము కావడానికి కారణ మేమిటో" అని మేము అన్నాము. ఆయన ఇలా చెప్పినారు:

### పాటలీపుత్ర కథ

నాయనలారా, గంగాద్వారములో కనఖలము అనేపుణ్యతీర్థమున్నది. కాంచనపాతము అనే దేవగజము ఉశీనరపర్వతప్రస్థము భేదించి, గంగానది కిందికి ప్రవహించేలాగున చేసింది. ఆతీర్థక్షేత్రములో దక్షిణదేశబ్రాహ్మణుడు భార్యతోకూడా తపస్సు చేస్తున్నాడు. ఆయ నకు ముగ్గురుపుత్రులు పుట్టినారు. కొంతకాలానికి తల్లితండ్రులు చనిపోతే ఆముగ్గురుకుమారులూ విద్యాభ్యాసము నిమిత్తము రాజగృహము అనే నగరానికి వెళ్ళినారు. వాళ్లు విద్యావంతు లయి, దిక్కు లేకపోవడము చేత దక్షిణాన కుమారస్వామి దర్శనార్థము బయలుదేరి సముద్రతీరాన చించినీపురము చేరి, భోజికు డనేబ్రాహ్మణునియింట్లో దిగినారు. తనకు పుత్రసంతానము లేకపోవడముచేత కుమార్తెలను ముగ్గురినీ ఆముగ్గురికీ ఇచ్చి వివాహము చేసి, ధనముకూడా వారికిచ్చి, తపస్సు చేసుకోడానికి గంగాతీరానికి వెళ్లినాడు. వాళ్ళు మామగారియింట్లో సుఖముగా ఉంటున్నారు. కొన్నాళ్ళకు కరవు వచ్చింది. అందరూ అల్లాడిపోయి నారు. ఆభర్తలు భార్యలతో చెప్పకుండా దేశాంతరము వెళ్ళిపోయి నారు. కఠినహృదయాలకు బంధుప్రీతి ఉంటుందా? ఆకుమార్తెలలో నడిమిఆమె గర్భవతి. తమతండ్రి మిత్రుడైన యజ్ఞదత్తునియింటికి

ముగ్గురుస్త్రీలూ చేరుకొని భర్తలను ధ్యానిస్తూ కష్టముమీద కాలము గడుపుతున్నారు. నెలలు నిండినతర్వాత గర్భవతి కుమారుని కన్నది. ఆపిల్లవానిని అక్కాచెల్లెళ్ళు ముగ్గురూ చాలాముద్దుగా పెంచుతున్నారు. ఒకనాడు మహేశ్వరుడు ఆకాశమార్గాన వృషభవాహనము మీద వస్తూ ఉండగా, ఆయనఒడిలో కూర్చున్న పార్వతీదేవి ఆ పిల్లవానిని చూచి, "నాథా, ఆకుర్రవాడు పెరిగి పెద్దవాడై రక్షిస్తాడని ఆముగ్గురుతల్లులూ ఆశ పెట్టుకున్నారు. బాల్యములోనే ఆబిడ్డడు వాళ్ళను సంరక్షించేలాగున మీరు అనుగ్రహించాలి" అన్నది. వరదుడైనమహేశ్వరుడు, "దేవీ, నీకోరికప్రకారము వీనిని అనుగ్రహిస్తాను. వెనకజన్మలో వీడు భార్యతోకూడా శివారాధన చేసినాడు. అందుచేత వీడు ఈజన్మలో మహైశ్వర్యము అనుభవిస్తాడు. వీనిభార్య పాటలి అనే పేరుతో మహేంద్రవర్మకు కుమార్తెగా పుట్టింది. ఈజన్మలో అదివీనికే భార్య అవుతుంది" అని సెల విచ్చినాడు. తర్వాత ఈశ్వరుడుఆ ముగ్గురు తల్లులకూ స్వప్నములో కనిపించి "మీపిల్లవానికి పుత్రకుడు అనే పేరు పెట్టండి. ప్రతిదినమూ వీనితలగడకింద (దిండుకింద) లక్షవరహాలుంటవి. వీడు ప్రభువుకూడా అవుతాడు" అని అనుగ్రహించినాడు. తెల్లవారినతర్వాత ఆపతివ్రతలు పిల్లవాడు నిద్ర లేవగానే దిండుతీసి చూస్తే లక్షవరహాలు కనబడినవి. చాలా ఆనందించారు. అచిరకాలములోనే సువర్ణరాశివల్ల పుత్రకుడు రాజ్యస్థాపన చేసినాడు. శివానుగ్రహముంటే సంపదల కేమి కొదవ? ఒకనాడు యజ్ఞదత్తుడు పుత్రకునితో "రాజా, నీతండ్రులు కరువుకాలములో చెప్పకుండా దేశాంతరము వెళ్ళిపోయినారు. నీవు బ్రాహ్మణులకు ఎప్పుడూ దానధర్మాలు చేస్తూ ఉంటే వాళ్ళు విని ఇక్కడికికూడా రావచ్చును. దృష్టాంతమొకటి విను.

## బ్రహ్మదత్తుని కథ

పూర్వము వారణాసిలో బ్రహ్మదత్తు డనేరాజు ఉండేవాడు. ఆయన ఒకరాత్రి ఆకాశాన తళతళలాడే రెండుబంగారపుహంసలను చూచినాడు. వాటిచుట్టూ వందలకొద్దీ రాజహంస లున్నవి. వాటిని చూడవలె నని రాజుకు కోరిక పుట్టింది. ఆయన మంత్రులతో ఆలోచించి సరోవరము తవ్వించి అక్కడికి వచ్చే పక్షులను ఏమీ బాధించకూడదని కట్టడి చేసినాడు. త్వరలోనే ఆహంసలు సరస్సుకు రావడము చూచి రాజు వాటిని మచ్చిక చేసి సువర్ణదేహము రావడానికి కారణము అడిగినాడు. హంసలు మనుష్యవాక్కులతో "రాజా, మేము వెనకజన్మలో కాకులము. బలి వేసే ఆహారముకోసము పోరాడి శూన్యమైన శివాలయాన ద్రోణిలో (అరణిలో) పడి చనిపోయినాము. పుణ్యస్థలములో పోవడముచేత పూర్వజన్మ జ్ఞానముతో బంగారు హంసలమై పుట్టినాము" అని స్పష్టముగా చెప్పినవి. రాజు వాటిని చూస్తూ చాలా ఆనందించినాడు.

అదేప్రకారము నీవు దానధర్మాలు చేస్తూ ఉంటే నీతండ్రులు క్రమేణ లభిస్తారు." యజ్ఞదత్తుడు చెప్పినమాటలు విని పుత్రకుడు బ్రాహ్మణ సమారాధన ప్రారంభించినాడు. భావించినట్టే బ్రాహ్మణులు అక్కడికి వచ్చి సమస్తమూ తెలుసుకొని, భార్యలూ కుమారుడూ లభించగా బహుసంతోషముతో కాలముగడిపినారు. కొన్నాళ్ళకు వాళ్ళకు దుర్బుద్ధి పుట్టింది. వాళ్ళే రాజ్యము చెయ్యాలని సంకల్పించి పుత్రకుని సంహారించడానికి ఎత్తు ఎత్తినారు. వింధ్యవాసినీదేవి దర్శనార్థము పోదామని వంక పెట్టి పుత్రకునికూడా తీసుకుపోయినారు. అమ్మవారిదర్శనము మొదట అతనినే చెయ్యమని గర్భగుడిలోకి వెళ్ళమన్నారు. నిశ్శంకగా అతడులోపలికి పోయినాడు. అదివరకే అక్కడ నియుక్తులయిన హంతకులు అతనిని చంపడానికి మీదికి పోయినారు. వింధ్య

వాసినీదేవి రాజుమీద అనుగ్రహముచేత ఆహంతకులకు మతిభ్రమకల్పించింది. వాళ్లు తికమకపడ్డారు. "ఎందుకు నన్ను చంపుదామనుకున్నారు?" అని పుత్రకుడు అడిగితే. వాళ్ళు "మహాప్రభూ, మీతండ్రులు మాకు బంగార మిచ్చి ఈపని చెయ్యవలసింది అని ఆజ్ఞాపించారు" అని విన్నవించినారు. "సరే. మీరు నన్ను వదిలి పెట్టితే అమూల్యమైన ఈరత్నాలంకారా లిస్తాను. మీగుట్టు బయట బెట్టను. దేశాంతరము వెళ్ళిపోతాను" అని రాజు చెపితే వాళ్ళు సమ్మతించి ఆభరణాలు పుచ్చుకొని వెలుపలికి వచ్చి "రాజును చంపివేశా" మని చెప్పి వాళ్ళు వెళ్ళిపోయినారు. బంధువుల మీద విరక్తి పుట్టి పుత్రకుడు వింధ్యారణ్యానికి వెళ్ళినాడు.

రాజుతండ్రులు పట్నములోకి వచ్చినతర్వాత హత్యావిషయము బయలు పడ్డది. రాజద్రోహు లనీ, పుత్రహంతకుల నీ, వాళ్ళనుమంత్రులు ఉరితీయించినారు. దుర్మార్గులకు దుర్గతి తప్పదుకదా!

పుత్రకుడు వింధ్యారణ్యములో వెళుతూ ఉంటే ఇద్దరు ముష్టియుద్ధము చేస్తున్నారు. మీరు ఎవరయ్యా అని పుత్రకుడు అడిగితే వాళ్ళు, "మేము మయాసురుని కుమాళ్ళము. ఈపాత్ర, కర్ర, పావుకోళ్ళు మా తండ్రి ఇచ్చినఆస్తి. మాలో ఎవరు బలవంతుడో వానికి ఇవిసంక్రమిస్తవి అని యుద్ధము చేస్తున్నాము" అని చెప్పినారు. పుత్రకుడు నవ్వి "ఈ అల్పవస్తువులకోసము యుద్ధమా?" అన్నాడు. "ఈపావుకోళ్ళు తొడుక్కుంటే ఆకాశములో వెళ్ళవచ్చు. ఈకర్రతో భూమిమీద ఏరూపము చిత్రిస్తే అది సత్యమవుతుంది. తలుచుకుంటే ఈపాత్రలోకి అమృతమువంటి ఆహారపదార్థాలు వస్తవి" అన్నారు వాళ్ళు. అప్పుడు పుత్రకుడు ఆలోచించి "వీటికోసము యుద్ధ మెందుకు? పరుగులో ఎవరు గెలిస్తే వారివి అని పందెము వేసుకోండి" అని సలహా ఇచ్చినాడు. అంగీకరించి వాళ్ళు పరుగెత్తినారు.

ఆనుండి బుద్ధులు కొంతదూరము పోగానే పుత్రకుడు ఆపావుకోళ్ళు తొడుక్కొని, కర్ర, పాత్ర, తీసుకొని ఆకాశమార్గాన శీఘ్రగమనముతో వెళ్ళి ఆకర్షిక అనేపట్నములో దిగినాడు. "వేశ్యలు మోసము చేస్తారు. వైశ్యులు లోభులు. ఎవరియింట్లో దిగితే బాగుంటుంది" అనుకుంటూ ఒకానొక వృద్ధస్త్రీని చూచి, ఆమెకు కొంతధన మిచ్చి ఆమెజీర్ణగృహ ములో రహస్యముగా ఉండడము మొదలు పెట్టినాడు. ముసలమ్మకు ఇతనిమీద చాలా అభిమానము కలిగింది. ఒకనాడామె "నాయనా, నీకు తగిన యిల్లాలు లేదని నాకు చాలా విచారము కలుగుతున్నది. ఈనగర మేలేప్రభువుకు పాటలి అనేపుత్రిక ఉన్నది. ఆమెను అంతఃపుర ములో పై మేడలో భద్రంగా ఉంచారు" అనిచెప్పింది. వెంటనే పుత్ర కుని మనస్సులోకి మన్మథుడు ప్రవేశించినాడు.

## పాటలీపుత్రకుల సమ్మేళనము

పాటలిని ఆరాత్రివేళనే చూడడానికి నిశ్చయించుకొని పుత్రకుడు పావుకోళ్ళు తొడుక్కొని ఆఅంతఃపురానికి వెళ్ళి పెద్దకిటికీలోనుంచి లోపలికి ప్రవేశించి ఒంటరిగా నిద్రపోతున్న పాటలిని చూచినాడు. ఆమెను లేపడము ఎలాగా అని అతడు ఆలోచిస్తూ ఉండగా, నగ స్త్రీ తిరుగుతున్న యామికుడు హఠాత్తుగా ఈగీతిక పాడినాడు.

ఆలింగ్య మధురహుంకృతి,
మలసోన్మిషదీక్షణం రహః కాన్తామ్
యదోద్బోధయన్తి సుప్తాం
జన్మని యూనాం త దేవ ఫలమ్.

ఉపగూహనము చేసి యువకుడు, మధుర
హుంకృతిం, బ్రియ నలసోన్మిషన్నేత్ర,
నే కాంతమున లేపుటే నిద్రనుండి
ఇహజన్మ ఫల మని యెంచుకోవలయు!

ఈవాక్కులు విని ఉత్సాహము పొంది అవయవాలు కంపిస్తూ ఉండగా పుత్రకుడు పాటలిని కౌగలించుకొన్నాడు. ఆమెకు మెళుకువ వచ్చి, ఆశ్చర్యమూ, సిగ్గూ పెనవేసుకొన్నవి. క్రమక్రమముగా ఉభయులూ సంభాషణలోకి దిగి, చివరకు గాంధర్వవివాహము చేసుకొన్నారు. తెల్లవారుజామున ప్రియురాలిని వీడ్కొని, పుత్రకుడు వృద్ధస్త్రీయింటికి వచ్చినాడు.

ఈవిధముగా పుత్రకుడు రాత్రిళ్ళు వస్తూ పోతూ ఉన్నాడు. ఒకనాడు ఆమెశరీరమున సంభోగచిహ్నాలు గమనించి రక్షకస్త్రీలు భయపడి రాజుగారికి విన్నవించినారు. రహస్యము కనిపెట్ట మని రాజు ఒకతెను పాటలిభవనములో దాగి ఉండ మని చెప్పినాడు. ఆరాత్రిపుత్రకుడు వచ్చి నిద్రపోయేటప్పుడు అతని ఉత్తరీయముచెంగున ఆస్త్రీ లాక్షారసముతో గుర్తువేసి, మర్నాడురాజుతో చెప్పింది. ఆగుర్తు చెప్పి చారులచేతపట్నమంతా వెతికిస్తే పుత్రకుడు దొరికినాడు. భటులు అతనిని పట్టుకొని వెళ్ళి ప్రభుసమక్షములో ఉంచినారు. రాజుకు చాలాకోపము వచ్చింది. పుత్రకుడు పావుకోళ్ళు తొడుక్కొని వెంటనే పాటలిదగ్గిరికి ఎగిరిపోయి "ప్రియా, మనరహస్యము బయట పడ్డది. లే, వెంటనే వెళుదాము" అని ఆమెను ఒడిలో కూర్చోబెట్టుకొని ఆకాశాన దూరము ఎగిరిపోయి గంగాతీరాన దిగినాడు. అలసట చెందినభార్యకు తలపుచేత పాత్రలో ఉదయించిన అమృతాహారము పెట్టి శ్రమ పోగొట్టినాడు. తర్వాత ఆమెకోరికమీాద చతురంగబలసమేతముగా కర్రతో నగర చిత్రము గీసినాడు. అది సత్యమై సజీవమైనది. పుత్రకుడు మహాప్రభువయి, మామను లోపరచుకొని సుఖముగా రాజ్యము చేసినాడు. ఆదివ్యనగరమే ఇది. పాటలి పుత్రకులపేర పాటలీపుత్రము అని ప్రసిద్ధి చెంది, లక్ష్మీసరస్వతులకు నిలయ మయినది. కాణభూతీ, వర్షోపాధ్యాయుల వారివల్ల ఇది విని మేము చాలా ఆశ్చర్య పడ్డాము.

## తరంగము : ౪

## వరరుచి ఉపకోశను చూచుట

ఈప్రకారముగా వరరుచి కాణభూతికి అవాంతరకథ చెప్పి, ప్రకృత వృత్తాంతము ఇలా చెప్పడము ప్రారంభించినాడు :

నేను వ్యాడీంద్రదత్తులతో అక్కడనే నివసిస్తూ కాలక్రమేణ విద్యాపారంగతుడ నయినాను. ఒకనాడు మిత్రులతో కలిసి ఇంద్రోత్సవము చూడడానికి వెళ్ళినాను. అక్కడ ఉపవర్షునికొమార్తె ఉపకోశ మాకు కనబడ్డది. ఆమె చెలికత్తెలద్వారా నాసంగతి తెలుసుకొని అనురాగరసము ఉట్టిపడే క్రీగంటతో సవిలాసముగా నన్ను చూచి, కష్టముమీద నిజగృహానికి మరలింది. నామనస్సులో ఆమెరూపరేఖావిలాసాలు అంకితము కావడముచేత రాత్రి నిద్ర పట్టలేదు. ఆమె వదనమునూ, బింబాధరమునూ ధ్యానిస్తూ జాగరణము చేసినాను. తెల్లవారుజామున ఎలాగో కాస్త కునుకు పట్టేసరికి స్వప్నము వచ్చింది. అందులో, శ్వేతవస్త్రధారిణి అయిన దేవత మెడలో మల్లెదండలు సువాసనలు వెదజల్లుతుండగా ప్రత్యక్షమై, కృపావీక్షణము నామీద ప్రసాదిస్తూ, చల్లని వాక్కుతో, “నాయనా, ఉపకోశ నీపూర్వజన్మలో ప్రేయసి. ఈగుణవతి నిన్ను తప్ప ఇంకెవరినీ వరించదు. సంశయించకు. నీరసనాగ్రవర్తిని నయిన సరస్వతీదేవిని నేను. భయపడకు. నీవిచారము పోగొట్టడానికి వచ్చాను” అని చెప్పి అంతర్ధాన మయినది.

తెల్లవారినతరవాత లేచి దేవి ఆనతిచ్చిన వాక్యాలు తలుచుకొంటూ నాప్రియురాలి భవనానికి ఎదురుగా ఉన్న తియ్యమామిడి గున్న కింద ఒంటరిగా కూర్చున్నాను. ఇంతలో ఉపకోశ చెలికత్తె నావద్దకు వచ్చి, ఆమె పొందుతున్న పరితాపమునుగురించి చెప్పింది. నాతాపము వెంటనే ద్విగుణీకృతమయింది. “సఖీ, నీకు మాఅన్యోన్యానురాగ

విషయము తెలిసింది. తల్లిదండ్రులు ఆమెను నా కిస్తారో ఇవ్వరో అని సందేహము. రహస్యముగా ఉపకోశను కలుసుకోవడము యుక్తము కాదు. అపకీర్తివస్తే తర్వాత చేసేదేమీ ఉండదు. నీవు నేర్పుతో ఆమెతల్లిదండ్రులకు నచ్చజెప్పి మాకు కల్యాణము చేయించాలి" అని బతిమాలుకొన్నాను. ఆమె ఉపకోశతల్లికి నిపుణముగా చెప్పింది. ఆమె భర్తతో చెప్పింది. ఉపవర్షులు వర్షాచార్యులవారితో చెప్పినారు. తర్వాత వివాహనిశ్చయమయింది. వ్యాడి కౌశాంబికి వెళ్ళి, మాఅమ్మగారిని త్వరగా తీసుకువచ్చినాడు. నాకు వివాహ మయింది. భార్యాభర్తలము సుఖముగాఉంటూ, మాఅమ్మగారికి ఉపచారాలు చేస్తున్నాము.

## పాణిని చరిత్ర

వర్షునికి కాలక్రమేణ శిష్యసమూహము హెచ్చింది. అందులో పాణిని అనే మందబుద్ధి ఉన్నాడు. ఉపచారాలు చెయ్యలేక ప్రాణము విసిగి పోయిన పాణినిని వర్షునిభార్య పంపివేసింది. వాడు హిమాలయా నికి వెళ్ళి తపస్సుచేసి మహేశ్వరుని మెప్పించి శివానుగ్రహమువల్ల నూతనవ్యాకరణము లభించగా తిరిగి వచ్చి, నన్నే వాదానికి పిలిచి నాడు! ఏడురోజులు వాగ్వాదము జరిగింది. ఎనిమిదోరోజు పాణిని ఓడి పోయినాడు. ఆనమయాన ఆకాశమునుంచి మహేశ్వరుడు భయంకర ముగా హుంకారము చేసినాడు. దానితో మాఐంద్రవ్యాకరణము ఈ లోకములో లేకుండా పోయింది! పాణిని జయించినాడు. మేము మంద బుద్ధుల మయినాము. నేను చాలా విచారపడి కుటుంబనిర్వహణానికి కావలసిన ద్రవ్యము హిరణ్యగుప్త డనేవర్తకునికి నిర్ణయించి ఇచ్చి ఉపకోశకు తెలియజేసి, శివునిగురించి తపస్సు చేయడానికి హిమాల యానికి వెళ్ళినాను. ఉపకోశ నాశుభకాంక్షతో ప్రతిదినమూ గంగా స్నానమూ, వ్రతాలూ చేస్తూ ఇంట్లోనే ఉంటున్న దట.

## ఉపకోశ పాతివ్రత్యము

వసంతఋతువులో ఒకనాడు ఉపకోశ గంగానదికి వెళ్ళుతూ ఉంటే రాజపురోహితుడు, కొత్వాలు, కుమారమంత్రి వరసగా చూచారు. ఆ నాడు ఉపకోశ చాలాసేపు స్నానము చేసింది. ఆమె ఇంటికి మరలి వస్తూ ఉండగా కుమారమంత్రి అడ్డగించినాడు. ఉపకోశ సమయస్ఫూర్తితో "భద్రా, నీ కెంత యిష్టమో నాకూ అంతేయిష్టమే. నేను కుల స్త్రీని. భర్త దేశాంతరము వెళ్ళినాడు. ఇప్పుడు ఎవ రైనా మనసు చూస్తే తలగింపులు! పౌరులు వసంతోత్సవములో మగ్నులయి ఉండగా నీవు రాత్రి ప్రథమయామములో మాయింటికి రా" అని సంకేతము ఏర్పాటు చేసింది. కొంచెము దూరము పోగానే రాజపురోహితుడు ఆమెను అడ్డగిస్తే, రాత్రి ద్వితీయయామము ఆయనకు సంకేతము ఏర్పాటు చేసింది. ఈఘటనలకు దిగులుపడి ఆమె మరికొంతదూరము పోతుంటే కొత్వాలు వచ్చి అడ్డము నిలిచినాడు. అతనికి మూడవజాము ఏర్పాటు చేసి తప్పించుకొని యింటికి పోయి చాలా ఆందోళన పడ్డది. ప్రోషితభర్తృకలు పాపాత్ముల కళ్ళయెదుట పడడముకంటె చనిపోవడము చాలా మేలు. అని విచారపడి చెలిమికత్తెలను పిలిచి కర్తవ్యము ఆలోచించింది. బ్రాహ్మణపూజార్థము కొంచెము ద్రవ్యము కావాలని ఉపకోశ హిరణ్యగుప్తునికి వార్త పంపితే వాడు వచ్చి రహస్యముగా "చాలారోజులనుంచీ నీమీాద నాకు మనసు! నాకోరిక తీర్చు. నీభర్త నావద్ద దాచిపెట్టినడబ్బు యావత్తూ ఇచ్చేస్తాను" అని చెప్పినాడు. వానివద్ద నేను ఉంచిన ధనానికి సాక్ష్యము లేకపోవడమువల్ల ఉపకోశ విచారపడి, వచ్చినకోపము అణుచుకొని రాత్రి నాలుగోజాము సంకేతము ఏర్పాటు చేసి వానిని పంపివేసింది.

పిమ్మట ఉపకోశ చెలిమికత్తెలతో చెప్పి కాటుక తెప్పించి నూనెలో రంగరించి, కస్తూరి మొదలయిన సువాసన ద్రవ్యములు కలిపి, ఆ

కాటుకనూనె గూనలో పోయించింది. తర్వాత నాలుగు కౌపీనములు చింపించి, గూనలో నుంచి బోషాణము ఖాళీ చేసి, వెలుపల గడియ వేసి భద్రముగా ఉంచింది.

## ఉపకోశ సమయస్ఫూర్తి

ఉజ్జ్వలవేషము ధరించి కుమారసచివుడు రాత్రి మొదటిజాములో ఉపకోశయింటికి వచ్చినాడు. అతనినిచూచి ఆమె, "నీవుస్నానముచేసి వస్తేనే తప్ప నిన్ను ముట్టుకోను. లోపలికి వెళ్ళి బాగా స్నానము చేసి రా" అని చెప్పింది. ఆమందబుద్ధి సమ్మతించినాడు. ఆమెచెలిమికత్తెలు వానినితీసుకు పోయి చీకటిగా ఉన్నప్రదేశాన అతని వస్త్రాలంకారాలు తీసివేయించి, గోచీ యిచ్చి కూచోబెట్టి కాటుకనూనె బాగా పట్టించి దరువులు వేస్తూ శరీరము మర్దన చేశారు. ఇంతలో రెండవ జాము అయింది; పురోహితుడు వచ్చినాడు. ఆస్త్రీలు "అయ్యో! వరరుచిగారిమిత్రులు పురోహితులవారు దయచేసినారు. ఏమి గతి! నీవు ఇందులో దాగి ఉండు" అని చెప్పి, వానిని బోషాణములోకి దింపి గడియ వేసినారు. రాజపురోహితునికూడా అప్రకారముగా నే చీకటికోణములోకి తీసుకుపోయి గోచీ పెట్టించి శరీరమంతా దట్టముగా కాటుక పట్టించి కాలజ్ఞానము లేకుండేలాగున ఒళ్ళు పరవశ మయ్యేలాగున నేర్పుతో దరువులువేస్తూ తల అంటినారు. మూడవయామములో కొత్వాలు వచ్చినాడు. అతని ఆగమనానికి భయపడినట్టు నటించి ఆస్త్రీలు పురోహితుని భయపెట్టి ఆబోషాణములోకి పంపి గడియ వేసినారు. కొత్వాలునుకూడా నూనెగోచీపాతరాయునిచేసి ఒళ్ళు మర్దించి వర్తకుడు రాగానే భయపెట్టి బోషాణములోకి దింపి గడియ వేసినారు. అందులో ఉన్నముగ్గురూ ఒకరికి ఒకరు తగులుతూ ఉన్నప్పటికి నోరు విప్పకుండా కూర్చున్నారు. తర్వాత ఉపకోశ దీపమ్ము

వెలిగించి వర్తకుని తీసుకు వచ్చి "నాభర్త నీవద్ద ఉంచినధనము" తే అని అడిగింది. "ఇస్తా నని ఇదివరకే చెప్పినాను కాదా?" అన్నాడు శ్రేష్ఠి. ఉపకోశ భోషాణమును సంబోధించి "దేవతలారా; హిరణ్యగుప్తునిమాట విన్నారుకదా?" అని దీపము ఆర్పివేసి ఉపకోశ వర్తకుని చెలిమికత్తెలకు అప్పగించింది. వాళ్ళు అతనికి గోచీ యిచ్చి అభ్యంగనము మొదలుపెట్టి కొంతసేపటికి "పోవోయి తెల్లవారింది" అని నెట్టివారు. వాడు వెళ్ళక సందేహిస్తూ ఉండగా మెడపట్టి వీధిలోకి నెట్టివేసి తలుపు మూసినారు. గత్యంతరము లేక వర్తకుడు ఆ గోచీతో ఆ కాటుకనూనె పట్టినశరీరముతో మధ్య మధ్య కుక్కలు వెంట బడుతూ ఉండగా ఎలాగో స్వగృహము చేరినాడు. నౌకర్లు అతని ఒళ్ళు రుద్ది స్నానము చేయించినారు. స్నానవేళ హిరణ్యగుప్తుడు ముఖముపైకెత్తి వాళ్ళకేసి చూడనైనా చూడలేదు. దుష్కార్యానికి ఫలితము దుస్సహము కదా!

ఇంట్లో పెద్దలకు ఈసంగతులు చెప్పకుండా ప్రాతఃకాలమే ఉపకోశ చెలికత్తెలతో మహారాజుమందిరానికి వెళ్ళి ప్రభువుతో "దేవా, నా భర్త తనవద్ద దాచి పెట్టినధనమును హిరణ్యగుప్తుడనేవర్తకుడు అపహరించినాడు" అని విన్నవించింది. రాజు వెంటనే వర్తకునికి వార్త పంపినాడు. అతడు రాగానే ప్రభువు ఈవిషయము అడిగితే "నాదగ్గర ఈమెధనము ఎంతమాత్రమూలేదు" అని అసత్యము చెప్పినాడు. ఉపకోశ "మహాప్రభూ సాక్షు లున్నారు. నాభర్త దేశాంతరము వెళ్ళేటప్పుడు గృహదేవతలను ముగ్గురిని మందసములో పెట్టి వెళ్ళినారు. మాయింట్లో జరిగే విషయా లన్నింటికీ ఆమంజూషలో ఉన్నయిలు వేలుపులే సాక్షులు. దేవర విచారించవచ్చును" అనివిన్నపము చేసింది. వెంటనే రాజు సేవకులను పంపి ఆభోషాణము తెప్పించినాడు. ఉపకోశ ఆమందసముకేసి తిరిగి "దేవతలారా ఈవర్తకుడు మీకు వినబడే

లాగున ఏమి అంగీకరించినాడో చెప్పి మీరు సుఖముగా ఇంటికి వెళ్ళి పోదురుగాని. మాటాడకపోయినా నిజము చెప్పకపోయినా మిమ్ములిని నిలువునా నీరు చేయిస్తాను" అని గట్టిగా అన్నది. మంజూషలో దాగి ఉన్న ముగ్గురుధూర్తులూ భయపడి స్పష్టవాక్కులతో "ఈమె చెప్పి నది సత్యము: వర్తకుడు తనవద్ద ఈమె భర్తధనమున్నట్లు మాయెదుట అంగీకరించినాడు" అని బిగ్గరగా అన్నారు. వర్తకుడు వెల వెల బోయి నాడు. కుతూహలము కలిగి ప్రభువు కోషాణము తెరవమని ఉపకోశను కోరినాడు. మూత తెరిచేసరికి మూర్తీభవించిన అంధకారమువంటి ముగ్గురుమనుష్యులు వెలుపలికి వచ్చినారు. రాజు మొదట వారిని గుర్తించలేదు. కుమారమంత్రి, పురోహితుడు, దండాధిపతి అని గ్రహిం చిన సభ్యులు చప్పట్లు కొట్టి కోలాహలము చేసినారు. ఆశ్చర్యపడి రాజు ఈవృత్తాంతమూ చెప్పమని ఉపకోశను అడిగినాడు. జరిగిన సంగతు లన్నీ ఆమె సవిస్తరముగా తెలిపింది. పతివ్రత అయిన ఆ కుల కాంతను అందరూ ప్రశంసించారు. ప్రభువు ఆధూర్తుల సంపదలు శిక్ష కింద రాజకోశానికి చేర్పించి వాళ్ళను దేశములోనుంచి బయటికి వెళ్ళ గొట్టించినాడు. ఉపకోశను రాజు ధర్మసహోదరిగా భావిస్తా నని చెప్పి ధనాదులిచ్చి ప్రీతితో ఇంటికి పంపినాడు. వర్షోపవర్షులు ఈవృత్తాంతము విని చాలా సంతోషించి ఉపకోశను ఆదరించినారు. నగరజనులు ఆశ్చ ర్యానందములు పొందినారు.

## వరరుచి వార్తికములు చేయుట

నేను శీతాచలసానువులమీద తీవ్రతపస్సు చేసి, ప్రమథనాథుని ఆరాధించినాను. పరమేశ్వరుడు పాణినీయశాస్త్రమునే నాకు ప్రసా దించినాడు. ఈశ్వరేచ్ఛచేతనూ, అనుగ్రహముచేతనూ వ్యాకరణ శాస్త్రము పూర్తిచేసినాను. పరమేశ్వరప్రసాదామృతము లభించడము

చేత ఏవిధ మైనశ్రమ లేకుండా ఇల్లు చేరి, పెద్దలకు మొక్కి, ఉపకోశ పాతివ్రత్యకథ విని ఆశ్చర్యానందభరితుడ నయినాను. వర్షోపాధ్యాయులు నూతనవ్యాకరణము నావల్ల వినగోరితే కుమారస్వామివారే ఆయనకు వినిపించినారు.

## ఇంద్రదత్తుని పరకాయప్రవేశము

వ్యాడీంద్రదత్తులు గురుదక్షిణ ఇస్తామని విన్నవించగా ఉపాధ్యాయులు కోటివరహాలు అడిగినారు. గురువాక్యము స్వీకరించి వాళ్ళు నాతో ఇలా అన్నారు. "నందమహారాజును గురుదక్షిణకోసము యాచింతాము. ఇంకెక్కడా ఇంత సువర్ణము లభించదు. అతనికి తొంభై తొమ్మిదికోట్లు ఉన్నవి కాదా ! ఉపకోశను అతడు ధర్మసహోదరిగా పేర్కొన్నాడు. కాబట్టి నీవు అతనికి బావమరిదివి. నీవల్లనే మనకు కావలసిన ధనము లభిస్తుంది"

అంతట సహాధ్యాయులము ముగ్గురమూ అయోధ్యాపురములో కంటకటకమునకు వెళ్ళినాము. అక్కడ మేము అడుగుపెట్టే పెట్టకముందే రాజు మృతినొందినాడు. రాజ్యములో కలిగిన కలకలమువల్ల మాకు విషాదము కలిగింది. యోగసిద్ధుడైనఇంద్రదత్తుడు, "నేను ఈమృత రాజుదేహములో ప్రవేశిస్తాను. వరరుచి వచ్చి నన్ను ధనము కోరితే యావత్తూ ఇప్పిస్తాను. నేను తిరిగి వచ్చేవరకూ నాశరీరమును వ్యాడి కాపాడుతూ ఉండాలి" అని, యోగమార్గాన నందరాజుదేహములో ప్రవేశించినాడు. రాజుబతకడమువల్ల రాజ్యములో ఉత్సవము చేశారు జీర్ణదేవాలయములో ఇంద్రదత్తునికాయము వ్యాడి కాపాడుతున్నాడు. నేను రాజాస్థానానికి వెళ్ళి యోగనందుని ఆశీర్వదించి గురుదక్షిణ కోటివరహాలు కోరినాను.

మంత్రిశకటాలునికి రాజు ఆజ్ఞ యిచ్చినాడు. మరణించినవాడు మళ్ళీ జీవించడమూ, వెంటనే యాచకుడు రావడమూ, అడిగినమూ త్రాన యాచకునకు ప్రభువు అంతసువర్ణము ఇమ్మని ఆజ్ఞాపించడమూ మంత్రికి అనుమానకారణము లయినవి. ప్రజ్ఞావంతులు గ్రహించలేనిది ఏముంటుంది ? కనబడినశవాల నన్నింటినీ వెంటనే దహనము చేయించ వలసిం దని రాజభటులకు మంత్రి ఆజ్ఞ యిచ్చినాడు. బ్రాహ్మణునికి కోటివరహాలు ఇంకా ఇచ్చినావా ఇవ్వలేదా అని అడుగుతున్న ప్రభు వుతో మంత్రి, "దేవా, పరిజనము ఉత్సవములో మగ్నులయి ఉన్నారు. త్వరలోనే ఈవిప్రునికి విత్తము ఇప్పిస్తాను" అని విన్నవించినాడు. ఇంతలో వ్యాడి వచ్చి యోగనందునితో "దేవా రక్షించాలి, రక్షించాలి. మీఉత్సవసమయములో సమాధిలో ఉన్న బ్రాహ్మణుని రాజభటులు బలాత్కారముగా తీసుకుపోయి దహించారు" అని మొర పెట్టినాడు. ఆవాక్కులు వినగానే యోగనందునికి విచారమూ, అవస్థాంతరమూ కలిగినవి. నిజశరీరము దగ్ధము కావడముచేత ఇంద్రదత్తుడు నందరాజు శరీరములోనే స్థిరమయి పోయినాడు. మహాబుద్ధిమంతుడు శకటాలుడు నాకు సువర్ణ మిచ్చినాడు.

## యోగనందుడు శకటాలుని చీకటినూతిలో పెట్టించుట

యోగనందుడు ఏకాంతముగా వ్యాడితో "అన్నా, ఎందుకు నాకీ సంపదలు ? బ్రాహ్మణ జన్మ మెత్తినా, శూద్రుడ నయిపోయినానే !" అని దుఃఖించినాడు. వ్యాడి సమయోచితముగా మంచిమాటలు చెప్పి దుఃఖోపశమనము చేసి "సోదరా, శకటాలుడు నిన్ను కనిపెట్టినాడు. ఈమహామంత్రి తేలికగా నిన్ను రాజ్యభ్రష్టుని చేసి, పూర్వనందుని పుత్రుని చంద్రగుప్తుని ప్రభువును చేస్తాడు. కాబట్టి ముందే జాగ్రత్త పడి వరరుచిని ప్రధానామాత్యుని చేసుకో. అతనిశక్తివల్ల రాజ్యము నీకు

స్థిర మవుతుంది అని, గురుదక్షిణ తీసుకొని వెళ్ళిపోగానే యోగనందుడు నన్ను ప్రధానామాత్యుని చేసినాడు. నేను రాజుతో ఏకాంత ప్రదేశములో "నీకు బ్రాహ్మణ్యము పోనే పోయింది. శకటాలుడు అధికారములో ఉన్నంతకాలమూ నీసింహాసనము అస్థిరమే. కాబట్టి యుక్తిచేత ఇతనిని వదిలించుకో" అని బోధించినాను. సజీవుడైన బ్రాహ్మణుని దహనము చేయించినా డన్న నేరము మోపి, శకటాలుని అతనిపుత్రులను రాజు చీకటి నూతిలో ప్రవేశపెట్టించినాడు. ప్రతిదినమూ వారికిమూకుడు పిండి, నీళ్ళు మాత్రము నూతిలోకి దింపడానికి ఆజ్ఞ యిచ్చినాడు. "ఈపిండి ఒకనికి హానిహానిగా సరిపోతుంది. మీలో ఎవరు నందునిమీద పగ సాధించగలరు? ఆ ఒకడే ఈపదార్థములు పుచ్చుకుంటే తక్కిన వాళ్ళము మానివేస్తాము," అని శకటాలుడు కొడుకులతో అన్నాడు. "నాయనా, నీవే సమర్థుడవు. మాకు శక్తి లేదు. నీవే ఆహారము తీసుకో" అని కొడుకులు వేడుకొన్నారు శకటాలుడు ఆపిండి తిని నీళ్ళు తాగుతున్నాడు క్రమక్రమముగా అతని పుత్రులు మృతి చెందినారు. పగ సాధించడము కోసము శకటాలుడు ఆకళేబరాలమధ్య ప్రాణాలు బిగబట్టిఉన్నాడు.

## యోగనందుని సామ్రాజ్యము

యోగనందుడు రాజ్యములో సుస్థిరు డయినాడు. వ్యాడి ఈలోగా గురుదక్షిణ యిచ్చి వచ్చి యోగనందుని ఆశీర్వదించి తపస్సుకు వెళ్ళిపోతా నన్నాడు. రాజు గద్గదకంఠముతో, "అన్నా, నీవు వెళ్ళవద్దు. నారాజ్యములో నీయిష్టము వచ్చినట్లు సుఖముగా ఉండు" అని వ్యాడిని వేడుకొన్నాడు. "రాజ్యముగాని, దేహము గాని క్షణభంగురము. ఇవి అన్నీ ఎండమావులవంటివి. వీటికి ప్రాజ్ఞులు మోహపడకూడదు" అని బోధించి వ్యాడి తపస్సుకే వెళ్ళిపోయినాడు.

తర్వాత యోగనందుడు రాజధాని అయినపాటలీపుత్రానికి సైన్య సమేతుడై బయలుదేరినాడు. నేనుకూడా వెంట వెళ్ళినాను. ఉపకోశ నాకు ఉపచారాలు చేస్తున్నది. నేను మంత్రిపదవిలో ఉన్నాను. గంగా భవాని ప్రసన్నురాలై ప్రతిదినమూ మాకు సువర్ణము అనుగ్రహిస్తు న్నది. సరస్వతీదేవి నాలో నివసించి ఆలోచనలు చెపుతూ ఉన్నది.

## త రం గ ము : ౫

### యోగనందునికి శకటాలుడు మంత్రి అగుట.

వరరుచి మళ్ళీ కథ ప్రారంభించినాడు. క్రమక్రమముగా యోగ నందుడు కామపరవశుడై మదోన్మత్త మతంగజమువలె లోకమును లక్ష్యపెట్టడము లేదు. అధ్యసిరి మానవుని తలకిందులు చేస్తుంది. "ఈరాజు విచ్చలవిడిగా తిరుగుతున్నాడు. ఇతని మీద ఆలోచనతో నాధర్మము కూడా నష్టమవుతున్నది. కాబట్టి బుద్ధికుశలుడైన శకటాలుని తెప్పించి మంత్రిని చేయిస్తాను. నేనుండగా అతడు అపకారము ఏమి చేయగలడు? అని నేను యోచించి, నందుని ఒప్పించి, చీకటినూతిలో నుంచి శకటాలుని బయటికి తెప్పించి, మంత్రి పదవిలో నియోగించి నాను. అతడు నన్ను అనుసరిస్తూ రాజకార్యాలు నిర్వర్తిస్తున్నాడు. నేను ఉండగా యోగనందుని ఏమీ చేయ లేనని ఊరుకున్నట్టు కనబడ్డది.

### వరరుచి ఇంగితజ్ఞానము

ఒకనాడు రాజు నగరమువెలుపల సంచరిస్తూ గంగాతీరానికి వెళ్ళి నాడు. నదీమధ్యమునుంచి అయిదువేళ్ళూ కలియబట్టినచెయ్యి కనబ డ్డది. అదేమని రాజు వెంటనే నన్ను ప్రశ్నించినాడు. నాచేతివేళ్ళు రెండు కలియబట్టి ఆవైపు చూపినాను. వెంటనే నదిలోచెయ్యి అదృశ్య

మయింది. రాజు ఆశ్చర్యపడి అది ఏమిటి అని అడిగినాడు. "అహా స్తము అయిదు వేళ్ళు బిగబట్టి, అయిదుమంది ఏకముగా ఉంటే లోకములో వారికి అసాధ్య మైనపని లేదు అని సూచించింది. నేను రెండు వేళ్ళు కలిపి చూపి, ఇద్దరు కలిస్తే చాలు. అయిదుగురు ఎందుకు ? అని సమాధానము సూచించాను." అని చెప్పినాను. శకటాలుని ముఖము చూస్తే, నన్ను బుద్ధిలో జయించ లే డన్నట్టు కనిపించింది. రాజు చాలా సంతోషించినాడు.

## శుష్కమత్స్యము నవ్వుట

ఒకనాడు యోగనందుని పట్టపుదేవి మేడమీద నిలుచుని వీధిలో నిలువబడి ఆమె వంక దృష్టి నిలిపిన బ్రాహ్మణునివైపు చూచింది. యోగనందుడు ఆదృశ్యము చూచి త్వరపడి బ్రాహ్మణునికి ఉరిశిక్ష విధించినాడు. ఈర్ష్యాపరునికి వివేకము లోపిస్తుంది. తలారులు అతనిని వధ్యస్థానానికి తీసుకుపోతుంటే బజారులో ఒక ఎండుచేప పకపక నవ్వింది. ఈవిషయము విన్నవించగా, ప్రభువు ఉరిశిక్ష ఆపుదల చేయించి, చేప నవ్వడానికి కారణ మేమిటి అని అడిగినాడు "తెలుసుకొని వచ్చి మీకు వివరిస్తాను" అని నేను వెళ్ళి ఏకాంతప్రదేశములో కూర్చుండి సరస్వతీదేవిని తలుచుకొన్నాను దేవి ప్రత్యక్షమై "తండ్రీ, ఈరాత్రి ఎవరికీ కనబడకుండా వెళ్ళి ఆ తాడిచెట్టుమీద కూర్చో. చేప నవ్వినకారణము నీకు అక్కడ తెలుస్తుంది. అని కటాక్షించింది. నేను వెళ్ళి తాడిచెట్టుమీది కెక్కి కూర్చున్నాను. ఇంతలో భయంక రాకృతి గల రాక్షసి చిన్నపిల్ల వాళ్ళతో అక్కడికి వచ్చింది. తినడానికి ఏ మయినా పెట్టుఅని అడుగు తున్న ఆ బాలకులతో రాక్షసి, "కాస్త ఓపిక చెయ్యండి బాబూ రేపటి దాకా. ఉదయము మీకు బ్రాహ్మణ మాంసము తెచ్చి పెట్టుతాను. ఈవేళ అతన్ని ఉరి తియ్యలేదు." అన్నది "ఈవేళే ఆయనను ఎందుకు

ఉరి తియ్యలేదు? అన్నారు బాలకులు. "ఎండుచేప నవ్వడముచేత రాజు శిక్ష ఆపుదల చేసినాడు" అన్నది రాక్షసి. "అయితే ఎండుచేప ఎందుకు నవ్వింది?" అని అడిగారు పిల్లలు. "ఈ రాణివాస మంతా చెడిపోయినవారే. అంతఃపురములో పురుషులు చాలామంది స్త్రీవేషాలతో ఉన్నారు. వాళ్ళంతా సుఖంగా ఉండగా, ఏమీ ఎరగని అమాయక బ్రాహ్మడికి ఉరిశిక్ష ఎందుకో అని చేప నవ్వింది" అన్నది రాక్షసి. కొంత సేపటికి నేను చెట్టు దిగి వచ్చి ప్రాతః కాలమే ప్రభువుకు ఈవిషయము తెలిపినాను. అంతఃపురములో ఆడవేషాలలో ఉన్న మగ వాళ్ళను కనిపెట్టి రాజు నన్ను ఆదరించి బ్రాహ్మణునిశిక్ష తప్పించినాడు.

## యోగనందుడు వరరుచిని సంహరించ మని శకటాలునికి ఆన తిచ్చుట

యోగనందుని వ్యవహారాలకు నేను విచారపడుతున్నాను. అట్టిస్థితిలో చిత్రకారు డొకడు వచ్చి, రాజును రాణిని పటముమీద చిత్రించినాడు. వాక్కు, చేష్ట తప్ప తక్కినవిధానములో ఆచిత్రాలు సజీవముగా ఉన్నట్టు కనపడ్డవి. ప్రభువు చిత్రకారునికి బహుమాన మిచ్చి ఆపటమును శయ్యాగృహములో గోడకు వేలాడదీయించినాడు. ఒకరోజు నేను ఆశయ్యాగృహములోకి వెళ్ళి దేవి సర్వలక్షణ లక్షితగా ఉండడము గుర్తించి, ఒక్కపుట్టుమచ్చ ఉండవలసినచోట లేకపోవడము గమనించి, ఆమె మొలతాడుపక్కన పుట్టుమచ్చ చిత్రించి వెళ్ళిపోయినాను. తర్వాత రాజు వచ్చి ఆమచ్చ చూచినాడట; చూచి ఎవరు వ్రాసినారని అంతఃపుర పాలకులను అడిగినాడట; నేను లిఖించినా నని వాళ్ళు చెప్పినారట "రహస్యప్రదేశాన ఉన్న ఈమచ్చ నాకు తప్ప మరెవ్వరికీ తెలియదు వరరుచికి ఇది ఎలా తెలిసింది? రహస్యముగా ఇతడు అంతఃపుర ద్రోహము చేస్తున్నాడు! అందుచేతనే ఆమధ్య స్త్రీ వేషధారు

లయిన పురుషులను కనిపెట్టినాడు" అని రాజు నిర్ధారణచేసుకొని శకటాలుని పిలిపించి "అంతఃపురద్రోహి అయినవరరుచిని వెంటనే సంహరించవలెను" అని అతనికి ఆజ్ఞ యిచ్చినా డట. శకటాలుడు సరే నని ఇంటికి వెళ్ళి ఇలా ఆలోచించినాడు :

"వరరుచి మహాప్రభావము కలవాడు. అతనిని సంహరించేశక్తి నాకు లేదు. ఆయన నన్ను ఆపదలోనుంచి రక్షించిన బ్రాహ్మణోత్తముడు. కాబట్టి ఆయనను గుప్తముగా దాచి రక్షించడము ఉత్తమకార్యము"

ఈవిధముగా భావించి శకటాలుడు వచ్చి రాజుకోపమునూ తదాజ్ఞనూ తెలిపి "మరొకనిని చంపిస్తాను. నీవు మాయింట్లో దాగి ఉండు" అని నాతో చెప్పి ఆప్రకారమే చేయించినాడు. నేను అతనియింటనే రహస్యముగా ఉన్నాను. అతనినీతికి ఆనందించి "శకటాలా, మంత్రి అంటే నీవే. నన్ను హింసించేబుద్ధి నీకు పుట్టలేదు. అయినా నన్ను ఎవరూ చంపలేరు. నా మిత్రుడు రాక్షసుడొక డున్నాడు. నేను తలుచుకొంటే వచ్చి ఎంతపని అయినా చేస్తాడు ఈరాజు ఎవరో తెలుసునా? వెనుక నామిత్రుడు ఇంద్రదత్తుడనేవిప్రుడు. అందుచేత ఇతనిని సంహరించరాదు" అని చెప్పినాను. అప్పుడు రాక్షసుని చూపించమని శకటాలుడు నన్ను ప్రార్థించినాడు.

### వరరుచి శకటాలునికి రాక్షసుని గంగాదేవిని చూపుట

నేను తలుచుకోగానే రాక్షసుడు వచ్చినాడు శకటాలునికి భయమూ ఆశ్చర్యమూ కలిగినవి. రాక్షసుడు వెళ్ళిపోయినతర్వాత అతడు "నీకు రాక్షసుడు ఎలా చెలికా డయినాడో చెప్పు" అని అడిగినాడు నేను ఇలా చెప్పినాను :

ఈనగరములో పూర్వము నగరరక్షకులైన కొత్వాలు రాత్రి కొకడు చొప్పున మరణించేవాడు. కొన్నాళ్ళకు రాజు నన్ను కొత్వాలుగా

నియోగించినాడు. నేను ఆరాత్రి జాగరము చేస్తూఉండగా ఈరాక్షసుడు కనపడి, "నగరములో కల్లా సుందరాంగి ఎవరో చెప్పు" అని నన్ను ప్రశ్నించినాడు. నేను నవ్వి "వెర్రివాడా, ఎవతె ఎవనికి ప్రియురాలో ఆమె వానికి సుందరాంగి" అని ప్రత్యుత్తర మిచ్చినాను. ఆ మాటలు నన్ను రక్షించినవి! రాక్షసుడు నన్ను చంపక "జితోస్మి! నీ కౌశల్యానికే నేను ఓడిపోయినాను. నిన్ను మెచ్చుకొన్నాను. నేటినుంచి నీవు నా స్నేహితుడవు. నీవు తలుచుకొన్నప్పు డల్లా వచ్చేస్తాను" అని చెప్పి అంతర్ధాన మయినాడు. నేను ఇంటికి వెళ్ళినాను. నాటినుంచీ ఈ రాక్షసుడు నాకు ఆపత్కాలములో తోడునీడ అయినాడు.

తర్వాత శకటాలుడు గంగాదేవిని చూపమని నన్ను కోరినాడు. ఆమెను నేను ధ్యానించాను. గంగ దేవతాకారములో సాక్షాత్కరించింది. ఆమెను స్తుతించాను. దేవి సంతోషించి అంతర్ధాన మయింది.

ఒకనాడు నేను విచారముతో ఉన్నాను. మంత్రివచ్చి "సఖా, సర్వజ్ఞుడ వయినా ఎందుకు విచారముగా ఉన్నావు: ప్రభువులకు వివేకము చాలా దూర మని తెలియదా: నీమీది అపవాదు త్వరలోనే తొలిగి పోతుంది. దృష్టాంతరము విను.

## శి వ శ ర్మ క థ

పూర్వకాలములో ఇక్కడ ఆదిత్యవర్మ ప్రభువు. అతనికి శివశర్మ అనే మహామంత్రి ఉండేవాడు. ఒకప్పుడు అతని రాణులలో ఒకతె గర్భవతి అయింది. రాజు అంతఃపురపాలకులతో "మేము ఈమె వద్దకు వచ్చి రెండు సంవత్సరా లయింది ఈమెకు గర్భము ఎలా కలిగింది?" అని అడిగినాడు. "దేవా పోతుటీగఅయినా ఇక్కడికి వచ్చేందుకు వీలులేదు. శివశర్మమంత్రి మాత్రము నిరాక్షేపంగా వస్తూ పోతూ ఉంటాడు" అని వాళ్ళు విన్నవించారు. శివశర్మ అంతఃపురద్రోహము చేసినాడని

భావించి, రాజు అతనిని బహిరంగముగా చంపడము భావ్యము కా దని ఉపాయము చేసి తన సామంతు డయిన భోగవర్మవద్దకు మంత్రిని పంపి రహస్యముగా అతనిని తుద ముట్టించ వలసిన దని లేఖ పంపినాడు. శివశర్మ వెళ్ళినయేడవనాడు ఆరాణి స్త్రీవేషధారి అయిన ఒకానొక పురుషునితో లేచి పోతుంటే రక్షకభటులు పట్టుకొన్నారు. మంత్రి సత్తముని వృథాగా చంపించానే అని ఆదిత్యవర్మ చాలా పశ్చాత్తాప పడ్డాడు. ఇంతలో శివశర్మ భోగవర్మరాష్ట్రానికి వెళ్ళినాడు. రాజులేఖ కూడా వచ్చింది. భోగవర్మ యేకాంతంగా శివశర్మకు ఆజాబు చూపించి అందులో ఉన్నమరణదండన తెలియ జేసినాడు. 'నన్ను వెంటనే సంహరించు; సంహరించవా, ఆత్మహత్య చేసుకుంటాను" అన్నాడు శివశర్మ. భోగవర్మ ఆశ్చర్యపడి "ఏమి విప్రోత్తమా, ఇంత తొందర పడుతున్నావు! ఇందులో ఏదో మర్మమున్నది. చెప్పు! చెప్పకపోతే ఒట్టుసుమా!" అన్నాడు. రాజా, నన్ను సంహరించినచోట పన్నెండు సంవత్సరాలు వర్షము కురవదు" అని శివవర్మ చెప్పినమీదట రాజు మంత్రులతో ఆలోచన చేసినాడు. ఆదిత్యవర్మ దుర్మార్గుడు. మన దేశము నాశనము చేయడానికి ఈయెత్తు ఎత్తినాడు. ఈబ్రాహ్మణుని చంపించ వలెనంటే తనరాజ్యములో హంతకులు లేరా! కాబట్టి శివ శర్మను మనము వధించగూడదు; ఆత్మహత్య చేసుకోనియ్యగూడదు" అని నిర్ణయించుకొని భోగవర్మ రక్షకభటులను కావలి పెట్టి శివశర్మను తన రాష్ట్రములోనుంచి దూరప్రదేశము పంపివేసినాడు. మహామంత్రి శివశర్మ తనబుద్ధిబలముచేత బతికి మళ్ళీ స్వస్థానానికి చేరుకొన్నాడు. రాజు అతనిని నిర్దోషిగా నిరూపించినాడు. ధర్మము ఎన్నటి కయినా జయించి తీరుతుంది. నీమీది అపవాదుకూడా పోతుంది. మాయింట్లో నిశ్చింతగా ఉండు.

5

## వరరుచి హిరణ్యగుప్తుని శాపమువిమోచనము చేయుట

శకటాలునివాక్కులకు శాంతి పొంది అతనియింటిలోనే రహస్యముగా ఉంటున్నాను. ఒకరోజు యోగనందుని కుమారుడు హిరణ్యగుప్తుడు వేటకు వెళ్ళినాడు. గుర్రము అతన్నిదూరముగా తీసుకుపోయింది. పరివారజనము ఎక్కడో దిగబడిపోయినారు. సూర్యాస్తమానముకూడా అయింది. రాత్రిగడపడానికి రాజకుమారుడు చెట్టుమీాది కెక్కినాడు. ఇంతలో సింహాము తరుముకొని వస్తూంటే ఎలుగుబంటి త్వరత్వరగా వచ్చి ఆ చెట్టే ఎక్కింది. తననుచూచి భయముతో వణుకుతున్న రాజకుమారునితో ఎలుగుబంటి "నీవు నాస్నేహితుడవు నీకు భయములేదు" అని చెప్పింది. భయముతీరి రాజకుమారుడు నిద్రపోయినాడు. ఎలుగుబంటి మేలుకొనే ఉన్నది. సింహాముఎలుగుబంటితో "నిద్రపోతున్న ఆమనిషిని కిందికి నెట్టు. తర్వాత నేను వెళ్ళిపోతాను" అన్నది. నేను మిత్రద్రోహాము చెయ్యను అన్నది. ఎలుగుబంటి తర్వాత రాజకుమారుడు మేలుకొన్నాడు. ఎలుగుబంటి నిద్రపోయింది. సింహాము అతనితో "మనిషీ, ఎలుగుగొడ్డును కిందికినెట్టు" అన్నది. రాజకుమారుడు సింహాన్ని మంచి చేసుకోడానికి ఎలుగును నెట్టినాడు. కాని ఎలుగుగొడ్డుకు మెలుకువ వచ్చి కొమ్మలుపట్టుకొని కిందపడక, "మిత్రద్రోహీ, నీకు పిచ్చి యెత్తుతుంది!" అని శాపముపెట్టి, "ఎవరైనా ఈవృత్తాంతముగ్రహించి చెప్పినప్పుడు నీకుశాప మోక్షము అవుతుంది." అన్నది. మర్నాడు ఉదయము రాజకుమారుడు ఎలాగో రాజధానికి వచ్చినాడు. అతనికి పిచ్చి యెత్తింది. కుమారుని అవస్థచూచి యోగనందుడు చాలావిచారపడి "ఈసమయములో వరరుచిఉంటే దీనిహేతువు గ్రహించి ప్రతిక్రియ చేసేవాడే. అతన్ని వృథాగా చంపించాను!" అన్నాడు. శకటాలుడు ఆమాటలువిని "వరరుచిని బయట పెట్టడానికి

ఇది చాలా మంచితరుణము! అతడు అభిమాని. ఇక రాజుదగ్గిర ఉండడు. నామీద విశ్వాసముతో ఉంటాడు" అనుకొని రాజువల్ల అభయము పొంది "దేవా, విచారించకండి. వరరుచి సజీవుడే" అని చెప్పినాడు. తత్క్షణము నన్ను తీసుకు రమ్మని రాజు చెప్పగానే శకటాలుడువచ్చి తీసుకు వెళ్ళినాడు. రాజకుమారునిస్థితి చూచి, సరస్వతీదేవిని స్మరించి, ఆమెఅనుగ్రహము వల్ల జరిగినసంగతులు తెలుసుకొని, రాజుతో "వీడు మిత్రద్రోహము చేసినాడు" అని జరిగినసంగతులు చెప్పినాను. రాజకుమారుని శాపమోక్ష మయింది. అతడు మనశ్శాంతి పొంది నన్ను స్తోత్రము చేసినాడు. "నీ కీవృత్తాంతము ఎలా తెలిసింది?" అని యోగనందుడు నన్నడిగినాడు. బుద్ధికుశలతఉంటే ఊహవల్ల, కొన్నిలక్షణాల వల్లగ్రహించవచ్చు. రాణి పుట్టుమచ్చసంగతి తెలిసినట్టే ఇదీ తెలిసింది" అని నేను చెప్పినాను. రాజుసిగ్గుపడి, పశ్చాత్తాపము పొందినాడు.

తర్వాత యోగనందుడు చేసినసత్కారాలు స్వీకరించకుండా అక్కడినుంచి వెళ్ళినాను. నామీదిఅపవాదు తొలిగిపోవడమే నాకుముఖ్యము. నేను స్వగృహము చేరగానే ఇంట్లోనాళ్ళంతా రోదనము చెయ్యడము మొదలుపెట్టినారు. ఏమీతోచక దిగ్భ్రమ చెందినవాతో ఉపవర్షాచార్యులు విచారముతో "యోగనందుడు నిన్ను చంపించినాడనేవార్త విని నీభార్య అగ్నిప్రవేశము చేసింది. నీతల్లి గుండె పగిలిచనిపోయింది" అన్నాడు. ఆదుఃఖవార్తలకు నేను చాలా కుంగిపోయినాను. వర్షాచార్యులవారు వచ్చి "నాయనా, సమస్తమూ అనిత్యము. మాయాస్వభావము తెలిసికూడా ఎందుకుఇలా అజ్ఞానములో పడతావు?" అని మంచిమాటలు చెప్పినమీదట నేనుకొంతవరకు తెప్పరిల్లినాను. పిమ్మట విరక్తిచేత సర్వసంగపరిత్యాగము చేసి ప్రశాంతికోసము తపోవనము ఆశ్రయించాను. కొంతకాలము గడిచిన మీదట ఒకనాడు అయోధ్య నుంచి బ్రాహ్మణుడు ఒకడు అక్కడికివచ్చినాడు. నేను యోగనందుని

వార్తలు అడిగాను. అతడు నన్ను ఆనవాలు పట్టి, విచారముతో ఇలా చెప్పినాడు :

## చాణక్యుడు యోగనందుని సంహరించుట

మీరు వెళ్ళినతర్వాత నందునిగతి ఏమయినదో తెలిసిందా? శకటాలుడు అతనిని ఉపాయముగా నాశము చెయ్యవలెనని చూస్తున్నాడు. ఒకనాడు తోవలో నేలతవ్వుతున్న చాణక్యుని చూచి "ఎందుకయ్యా, నేల తవ్వుతావు?" అని అడిగినాడు. "ఈదర్భ నాకాలికి తగిలింది; అందుచేత నిర్మూలము చేస్తున్నాను" అన్నాడు చాణక్యుడు. ఆవిప్రుడు మహాకోపీ, దృఢనిశ్చయుడూ అని యెంచి యోగనందుని సంహారానికి మంచిసాధన మవుతాడని భావించి నామధేయము తెలుసుకొని 'విప్రోత్తమా, నందమహారాజుగారియింట నీకు త్రయోదశీశ్రాద్ధము ఇప్పిస్తాను. చాలాదక్షిణ దొరకుతుంది. అగ్రభోజనము నీది" అని చెప్పి శకటాలుడు అతనిని తనయింటికి తీసుకు వెళ్ళి శ్రాద్ధమునాడు నందమహారాజుకు చాణక్యుని చూపించినాడు. రాజుసమ్మతించినాడు. చాణక్యుడు వెళ్ళి శ్రాద్ధకర్మలో అగ్రస్థానములో కూర్చున్నాడు. సుబంధువనే మరొకబ్రాహ్మణుడు అక్కడ కూచోబోయినాడు. శకటాలుడు ఈవిషయము మహారాజుకు విన్నవించినాడు. "సుబంధువే అగ్రస్థానానికి అర్హుడు. ఇంకొకడు పనికిరాడు" అని రాజు నిర్ణయించినాడు. శకటాలుడు చాణక్యునివద్దకు భయపడుతూవచ్చి, రాజాజ్ఞ తెలిపి, అందులో తనదోషము లేదని మనవి చేసినాడు. చాణక్యుడు కోపోద్దీప్తుడై జుట్టుముడివిప్పి "ఈనందుని ఏడవరోజు దాటకుండా నాశనముచేసి, తర్వాతనే జుట్టు ముడివేసుకుంటాను" అని ప్రతిజ్ఞ చేసినాడే కాని రాజభయము వల్ల వెంటనే పలాయనము చేసినాడు. శకటాలుడు అతనిజాడలు కనిపెట్టి తెచ్చి, తనయింట్లోనే

రహస్యముగా దాచిపెట్టినాడు. ప్రయోగానికి కావలసిన సామగ్రులు అన్నీ మంత్రి తెప్పించినాడు. చాణక్యుడు యోగనందునిమీద ప్రయోగము చేసినాడు. దాహజ్వరముచేత యోగనందుడు ఏడవ నాడు మరణించినాడు మంత్రి రాజకుమారు డయిన హిరణ్యగుప్త నిచంపించి, పూర్వనందుని కుమారు డయిన చంద్రగుప్తునకు రాజ్యాభిషేకము చేసి, చాణక్యుని ప్రార్థించి మంత్రిగా ఏర్పాటు చేసినాడు. తనపుత్రుల మృతికి కారకు డయిన యోగనందుడు చనిపోవడముచేత పగ తీరి కృతార్థుడై శకటాలుడు, పుత్రశోకము పొంగి రాగా తపోవనానికి వెళ్ళినాడు.

## వరరుచి దివ్యగతి పొందుట

కాణభూతీ, ఆవిప్రుడు చెప్పినమాటలవల్ల సమస్తమూ అనిత్య మని స్పష్ట మయింది. చాలా విచారము కలిగి వింధ్యవాసినీ దేవిని దర్శించడానికి వచ్చి, నిన్ను చూడగలిగినాను. నిన్ను చూచేటప్పటికి పూర్వజన్మస్మరణా దివ్యజ్ఞానమూ కలిగినవి. మిత్రమా, నీకు బృహత్కథ చెప్పినాను. నాశాపము ఇప్పటికి తీరింది. ఇక దేహము చాలిస్తాను. మూడుభాషలలో మాటాడ నని శపథము పట్టిన గుణాఢ్యుడు శిష్యసమేతముగానీసన్నిధికి వస్తాడు. అంతవరకూ నీ విక్కడే ఉండు. అతడు మాల్యవంతు డనేప్రమథుడు. నాకోసము పార్వతీదేవిని ప్రార్థించి శాపగ్రస్తుడై మనుష్యజన్మ మెత్తినవాడు. మహేశ్వరప్రోక్తమైనయీకథ అతనికిచెప్పు. మీ ఉభయులకూ శాపవిముక్తి అవుతుంది.

వరరుచి ఈవృత్తాంతము యీపత్తూ కాణభూతికి చెప్పి, దేహము చాలించడానికి బదరికావన పుణ్యభూమికి వెళ్ళుతూ గంగాతీరాన శాకాహారి అయిన మునిని చూచినాడు. అతని చేతికి దర్భ గుచ్చుకోవడమువల్ల రక్తము కారుచున్నది. అతనికి ఎంత అహంకార మున్నదో

పరీక్ష చెయ్యడానికి వరరుచి ఆరక్తమును శాకరసముగా మార్చివేసి నాడు. రక్తము శాకరసముగా మారిపోవడము గమనించి సిద్ధుడ నైనా నని ఆముని గర్వము పొందినాడు. అప్పుడు వరరుచి మందహా సము చేసి అతనితో "ఆర్యా" పరీక్షార్థము నీరక్తాన్ని శాకరసము చేశాను. ఇప్పటికీ నీఅహంకారము పోలేదు. జ్ఞానమార్గానికి అహం కారము గొప్ప ఆటంకము కదా! జ్ఞానము లేకుండా ఎన్నివ్రతాలు చేసినా నిష్ఫలము. అహంకారము విడిచి పెట్టు" అని బోధించినాడు. ఆముని వరరుచికి నమస్కరించి, స్తోత్రము చేసినాడు. తర్వాత వరరుచి బదరికాశ్రమానికి వెళ్ళినాడు. మానవ దేహము త్యజించేకోరికతో గౌరీదేవిని దృఢభక్తితో ఆశ్రయించినాడు. పార్వతి ప్రత్యక్షమై అగ్ని ధారణ బోధించింది. ఆ అగ్నితో వరరుచి శరీరము దగ్ధము చేసి దివ్య గతి పొందినాడు.

కాణభూతి గుణాఢ్యునికోసము వింధ్యారణ్యముతో ఎదురు చూస్తు న్నాడు.

## తరంగము : ౭

మాల్యవంతుడు పార్వతి శాపమువల్ల మనుష్యజన్మ యెత్తి గుణా ఢ్యుడు అనేపేరు పొంది, సాతవాహనరాజును సేవించి, ప్రభుసముక్ష ములో చేసిన ప్రతిజ్ఞవల్ల సంస్కృతము మొదలయిన మూడుభాషలు విడిచి పెట్టి విచారముతో వింధ్యవాసినీదేవిని దర్శించడానికి వచ్చి నాడు. దేవిఆజ్ఞప్రకారము కాణభూతిని చూచి, పూర్వజన్మ జ్ఞప్తికి వచ్చేసరికి తాను విసర్జించిన మూడుభాషలకంటె విలక్షణమైనపైశాచీ భాషలో కాణభూతికి తనపేరు చెప్పి "మిత్రమా, పుష్పదంతునివల్ల నీవు విన్నదివ్యకథ నాకు చెప్పు. మన కుభయులకూ శాపవిమోచన మవుతుంది" అన్నాడు. ఆమాటలకు కాణభూతి సంతోషించి నమ

స్మరించి, "అలాగే చెపుతాను కాని నాకుతూహలము తీర్చాలి. జన్మ మొదలు నేటివరకూ నీపవిత్రచరిత్ర నాకు వినిపించాలి" అని వేడు కొన్నాడు. గుణాఢ్యుడు ఇలా చెప్పినాడు.

## గుణాఢ్యుని చరిత్ర

ప్రతిష్ఠాన ప్రదేశములో సుప్రతిష్ఠిత మనే పట్నము ఉన్నది. అక్కడ నివసించే సోమశర్మకు వత్సుడు, గుల్మకుడు అని యిద్దరు కొడుకులూ శ్రుతార్థ అనేకూతురూ కలిగినారు. కాలక్రమేణ ఆవిప్రుడూ ఆయనభార్యా చనిపోయినారు. ఆ అన్నదమ్ములు చెల్లెలిని సంరక్షిస్తు న్నారు. ఆమె హఠాత్తుగా గర్భవతి అయింది. పరపురుషులు ఎవరూ అక్కడ లేకపోవడముచేత వాళ్ళకు ఒకరిమీద ఒకరికి అనుమానము కలిగింది. ఆసంగతి గ్రహించి శ్రుతార్థ "అన్నలారా, నాగరా జయిన వాసుకితమ్మునికి కీర్తిసేను డనేకుమారు డున్నాడు. ఒకనాడు నేను స్నానానికి వెళుతూ ఉంటే అతడు నన్ను చూచి మోహించి, తన కులగోత్రాలు తెలిపి గాంధర్వవిధిని వివాహము చేసుకొన్నాడు. ఈ గర్భమునాకు బ్రాహ్మణజాతివల్లనే కలిగింది" అని చెప్పింది. ఆమాటలకు అన్నదమ్ములు దృష్టాంతరము చూపించ మని చెల్లెలితో అన్నారు. ఆమె ఏకాంతములో నాగకుమారుని తలుచుకొన్నది. అతడు వచ్చి వత్సగుల్మకులను చూచి "మీచెల్లెలు అప్సరస. శాపమువల్ల మానవజన్మ ధరించింది. మీరుకూడా శాపము వల్ల ఈలోకములో పుట్టినారు. ఈమెకు కుమారుడు కలు గుతాడు. దానితో మీకు ముగ్గురికీ శాపమోక్షము అవు తుంది" అనిచెప్పి అంతర్ధాన మయినాడు. కొద్దిరోజులలో ఆమెకు పుత్రుడు పుట్టినాడు. ఆసమయములో ఆకాశవాణి "ఈబాలుడు

ప్రమథుని అవతారము. గుణాఢ్యుడనే పేరుతో లోకములో ప్రసిద్ధుడవుతాడు ” అని పలికింది.

తర్వాత కొంతకాలానికి నాతల్లీ మేనమామలూ శాపవిముక్తులయి దేహాలు చాలించారు. బాలుడ నయినప్పటికీ నేనుదక్షిణాపథము వెళ్లి విద్యాభ్యాసము చేసి, క్రమక్రమముగా పేరుప్రతిష్ఠలు సంపాదించి, చాలాసంవత్సరాలకు స్వదేశానికి శిష్యసమేతముగా వచ్చాను. సుప్రతిష్ఠితనగరము అపూర్వశోభతో కనిపించింది. ఒకతావున సామగానము జరుగుతున్నది. ఒకచోట విప్రులు వేదార్థవాదము చేస్తున్నారు. జూదరులు ‘నిపుణునిచేతిలో నిధి ఉన్నది’ అని ద్యూతమును పొగడుతున్నారు. ఒకప్రదేశములో వైశ్యులు తమవ్యాపారదక్షతను ప్రశంసిస్తున్నారు. వారిలో ఒకడు తనచరిత్ర ఇలా చెప్పినాడు :

## ఎలుకసెట్టి కథ

మూలధనము ఉండి దానివల్ల ధనము సంపాదించడము ఏమి గొప్ప ? చేతిలో పైసా లేకుండా పూర్వము నేను ధనము సంపాదించినాను. నేను మా అమ్మకడుపులో ఉండగానే మాతండ్రి చనిపోయినాడు. దుర్మార్గులైన దాయాదులు మాఆస్తి యావత్తూ హరించినారు. మా తాతగారి మిత్రుడైన కుమారదత్తుని ఇంట్లో మా అమ్మ నివాసము చేయడము ప్రారంభించింది. ఇంతలో నేను పుట్టినాను. ఆమె అష్టకష్టాలు పడి, నన్ను పెంచి పెద్దవాణ్ణి చేసింది ; వీధిబడిపంతులను ఆశ్రయించి నాకు వ్రాతపోతలు, లెక్కలూ నేర్పించింది. ఒకనాడు మా అమ్మ నాతో “నాయనా, నీవు కోమటిబిడ్డవు. వర్తకము చెయ్యడము మనధర్మము. ఈదేశములో విశాఖిలుడు అనేవైశ్యశిఖామణి ఉన్నాడు. పేదవారైన గొప్పయింటి కోమటిబిడ్డలకు ఆయన వర్తకనిమిత్తము ధనసహాయము చేస్తాడట. నీవూ వెళ్లి ఆయనను

మూలధనము అడుగు" అని చెప్పింది. నేను వెంటనే బయలుదేరి ఆయనవద్దకు వెళ్లినాను. ఆసమయాన విశాఖిలుడు ఒకానొక వైశ్య కుమారుని "అబ్బాయీ, ఈ చచ్చిన యెలుకను చూడు తెలివి కల వాడు దీనినికూడా సరుకు చేసుకోగలడు. నీవు ఎందుకూ పనికి రావు! ఎన్నిసార్లు నీకు ధన మిచ్చాను! వడ్డీమాట అలా ఉంచి అసలే పాడు చేశావు!" అని మందలిస్తున్నాడు. ఆమాటలు విని నేను "ఆర్యా, ఈయెలుక నాకు మూలధనముగా ఇచ్చి, లెక్క వ్రాయించండి" అన్నాను. ఆయన నవ్వుతూ ఉంటే నేను ఎలుకను తీసుకు పోయినాను. ఒకానొకవర్తకుని పిల్లికోసము ఆయెలుకను రెండుదోసిళ్ల సెనగలకు అమ్మినాను. ఆసెనగలు వేయించి మంచినీళ్లకుండ దగ్గర పెట్టుకొని గ్రామము వెలుపల మార్గముపక్కన చెట్టునీడలో కూర్చున్నాను. ఆమార్గాన దప్పిగొని వచ్చేకట్టెమోపులవాళ్లకు కాసిని కాసిని సెనగలు పెట్టి మంచిమాటలు చెపుతూ మంచినీళ్లు పోసినాను. ఒక్కొక్కరు రెండేసికర్రలచొప్పున నాదగ్గర పడవేసి వెళ్లినారు. అవి బజారు పట్టుకుపోయి విక్రయించి, వచ్చినడబ్బుతో సెనగలు కొని వెనకటిరోజువలెనే మోపులవాళ్లకు పెట్టి, కట్టెపుల్లలు తీసుకొన్నాను. కొన్నాళ్లు ఇలాగే చేసి, చాలా వంటచెరుకు సంపాదించి, క్రమముగా కట్టెలమోపు లన్నీ నేనే కొని భద్రము చేసినాను. ఇంతలో వర్షము కురిసి, ఇతరప్రదేశాలనుంచి కట్టెలు రావడము కష్టమయింది. అప్పుడు నాసరుకు చాలా లాభానికి విక్రయించి, ఆడబ్బుతో దుకాణము పెట్టి క్రమేణ ధనికుడను అయినాను. ఒకనాడు బంగారముతో ఎలుకను చేయించి విశాఖిలునివద్దకు వెళ్లి "ఆర్యా, ఇదుగో మీరిచ్చినమూల ధనము. వడ్డీకూడా కలిపినాను" అని చెప్పి యిచ్చినాను. ఆయన చాలా సంతోషించి తనకొమార్తెను నాకిచ్చి వివాహము చేసి, కూతురికి వినోదార్థము ఆబంగారుమూషికమును బహుమానము చేసినాడు.

నాకు ఎలుకసెట్టి అని పేరు రావడానికి ఇదే కారణము. చేతిలో ఏమీ లేకుండా ఇంతధనము సంపాదించాను. ఈకథ విని అక్కడివర్తకులు ఆశ్చర్యపడ్డారు. ఆధార మేమీ లేకుండా చిత్తరువు వ్రాస్తే ఆశ్చర్యము కలగదా ?

## మందమతి అయిన సామవేది కథ

సామవేదము చెప్పుకొన్న బ్రాహ్మణుడు ఒకచోట ఎనిమిదిమాడల బంగారము దానము పట్టినాడు. ధూర్తవిటు డొకడు ఆవిప్రుని వంచన చేతా మనుకొని "బ్రాహ్మణోత్తమా, నీకు భోజనము ఎక్కడనైనా దొరుకుతుంది. కేవలవైదికుడవు. లోకయాత్ర అభ్యసిస్తే నీవు మంచి నేర్పరి వవుతావు" అన్నాడు. ఆవెర్రిబ్రాహ్మణుడు "నా కెవరు నేర్పుతారు!" అన్నాడు. "అదుగో వేశ్యయిల్లు. అందులో ఉన్న చతురికవద్దకు వెళ్లితే అది నేర్పుతుంది" అన్నాడు ఆవిటుడు. "అక్కడికి వెళ్లి నే నేమి చెయ్యాలి ?" అన్నాడు బ్రాహ్మణుడు. "బంగార మిచ్చి దాన్ని రంజింపజెయ్యి. సామవాక్యాలు ప్రయోగించు" అని ధూర్తవిటుడు చెప్పేసరికి సామవేదము నేర్చిన ఆవిప్రుడు వెంటనే చతురికయింటికి వెళ్లినాడు. వేశ్య ఆయనకు ఎదురు వచ్చి మర్యాద చేసింది. బ్రాహ్మణుడు కూర్చుని "ఈబంగారము పుచ్చుకొని నాకు లోకయాత్ర నేర్పు" అన్నాడు. అక్కడ ఉన్నవాళ్లంతా నవ్వినారు. ఆవెర్రిబ్రాహ్మణుడు చేతులు ఆవుచెవివలె పట్టి బిగ్గరగా సామగానము ప్రారంభించినాడు. ఆచమత్కారము చూడడానికి విటులు మూగినారు. "ఈజంబుకము (నక్క) ఇక్కడి కెందుకు వచ్చింది ? దీనికంఠానికి ఒక్కఅర్ధచంద్రము ఇచ్చి పంపివెయ్యండి" అన్నారు కొందరు. అర్ధచంద్రమంటే బాణ మనుకొని బ్రాహ్మణుడు భయపడి, తెలిసింది లోకయాత్ర అని కేకలు వేస్తూ, ప్రథమములో

తనను అక్కడికి పంపించిన ధూర్తవిటునివద్దకు వచ్చి, జరిగినసంగతులు వివరించినాడు. "వెర్రిబ్రాహ్మడా, సామము అంటే వేదము కాదు, మంచిమాట లాడ మని నా అభిప్రాయము. వేశ్యాసదనములో వేదము ఎందుకయ్యా!" అని, అతనిని చతురికదగ్గరకు తీసుకుపోయి, "ఈద్విపాత్పశువుకు బంగారము గడ్డివలె విసిరి పడవెయ్యి" అని చెప్పినాడు. వేశ్య నవ్వుతూ ఆతనిబంగారము అతనికి ఇచ్చింది. ఒతుకు జీవుడా అని ఆ బ్రాహ్మణుడు సంతోషిస్తూ నిజగృహానికి వెళ్ళినాడు.

ఇటువంటి వినోదాలు చూస్తూ దేవేంద్రభవనమువంటి రాజమందిరానికి వెళ్ళినాను. ముందుగా శిష్యులచేత లోపలికి వార్త పంపినాను. శర్మవర్మ మొదలయిన పెద్దలు చుట్టూ ఉండగా, రత్నసింహాసనము మీాద కూర్చుని ఉన్న సాతవాహనమహారాజును సందర్శించి, ఆశీర్వదించి, ఉచితాసనముమీాద కూర్చున్నాను. రాజు నన్ను గౌరవించినాడు. శర్వవర్మాదులు నన్నుగురించి రాజుతో "దేవా, ఈయన జగత్ప్రసిద్ధి కలవాడు, సకలవిద్యావిశారదుడు గుణాఢ్యుడు అనేసార్థకనామము కలవా డయినాడు" అని స్తుతించినారు. ప్రభువు సంప్రీతుడై, నన్ను వెంటనే మంత్రిపదవిలో నియోగించినాడు. అప్పటినుంచీ నేను రాజకార్యాలు చక్కబెట్టుతూ, శిష్యులకు పాఠాలు చెపుతూ, వివాహము చేసుకొని, సుఖముగా కాలక్షేపము చేస్తున్నాను.

## దేవీకృత—ఉద్యాన చరిత్ర

ఒకనాడు సాయంకాలము వినోదార్థము గోదావరీతీరానికి వెళ్ళి, అక్కడ దేవీకృతి అనే ఉద్యానము చూచి, దానివైభవానికి ఆశ్చర్యపడి, అది ఎలా నిర్మాణ మయినదో అని వనపాలకుని అడిగినాను. వాడు ఇలా చెప్పినాడు:

"స్వామీ, పెద్దలుచెప్పఁగోగా విన్నాను. పూర్వము ఒక బ్రాహ్మడు ఆహారము మాని వేసి, మానము పూని, ఈదివ్యోద్యానమూ, ఆలయమూ నిర్మాణము చేయించాడు. ఈవిచిత్రం చూడడానికి వచ్చిన బ్రాహ్మలు గుచ్చి గుచ్చి అడిగితే ఇలా చెప్పాడట:

నర్మదాతీరాన భరుకచ్ఛపము అనే దేశము నాజన్మస్థానము. నేను బీదవాడను, పైగా సోమరిపోతును. ఎవరూనాకు బిచ్చము పెట్టేవారు కారు. చివరకు ప్రాణము విసికి, తీర్థయాత్రకు బయలుదేరి, చాలా పుణ్యక్షేత్రాలు సేవించి, క్రమేణ వింధ్యవాసినీదేవిని దర్శించి, "జన సామాన్యము అమ్మవారికి మేకలు మొదలయినవి బలి యిచ్చి వరాలు పొందుతున్నారు. పశుప్రాయుడ నయిన నన్నే బలి యిచ్చు కొంటాను" అని నిశ్చయించుకొని, కంఠము నరుకుకొనడానికి కత్తి యెత్తినాను. నామీద అనుగ్రహాము కలిగి దేవి ప్రత్యక్షమై "వత్సా, ఆత్మ హత్య వద్దు. నీవు సిద్ధుడవయినావు. నా సన్నిధానములోనే ఉండు" అని అనుగ్రహించింది. నాకు దేవత్వము ప్రాప్తించింది. ఆకలి దప్పికలు పోయినవి. తర్వాత కొన్నాళ్లకు అమ్మవారు, "వత్సా, ప్రతిష్ఠానమునకు పోయి, రమణీయమైన ఉద్యానము నిర్మించు" అని ఆన తిచ్చి దివ్యబీజమును ప్రసాదించింది. ఆగింజ యిక్కడ నాటినాను. దానిమహిమువల్ల ఈ ఆరామము సిద్ధ మయినది. దీనిని మీరు సంరక్షించవలె" అంటూ ఆయన అంతర్ధానమయినాడు. స్వామీ, దేవి మహాత్మ్యమువల్ల ఈకోట సృష్టిజరిగింది. ఉద్యాపాలకునివల్ల ఈకథ విని సంతోషించినాను.

## సాతవాహనుని పూర్వచరిత్ర

ఈచరిత్ర విని కాణభూతి మహారాజుకు సాతవాహను డనేపేరు ఎందుకు వచ్చిందో చెప్ప మన్నాడు. గుణాఢ్యుడు ఇలాచెప్పినాడు:

దీపకర్ణి అనే రాజుకు శక్తిమతి అనే భార్య ఉండేది. ఆమె అంటే రాజుకు చాలా యిష్టము. ఒకరాత్రి పాము కరిస్తే ఆమె చనిపోయింది. సంతానము లేకపోయినా దీపకర్ణి బ్రహ్మచర్యవ్రతము అవలంబించినాడు. తన తదనంతరము రాజ్యానికి వచ్చేవాడు లేడే అని విచారిస్తూ ఉన్న రాజుకు ఒకరాత్రి స్వప్నములో మహేశ్వరుడు సాక్షాత్కరించి, "రాజన్, ఈఅరణ్యములో సింహమునెక్కి ఉన్న బాలుడు నీకుకనపడతాడు. వానిని ఇంటికి తెచ్చుకో వాడేనీకు పుత్రప్రాయుడు" అని అనుగ్రహించినాడు. రాజు ఆస్వప్నమును స్మరిస్తూ ఆనందిస్తూ ఉండేవాడు. కొన్నాళ్లకు దీపకర్ణి ఒకనాడు వేటకు వెళ్ళి, చాలా దూరము తిరిగి తిరిగి పద్మసరోవరముదగ్గర సింహముమీద కూర్చున్న బాలుని మధ్యాహ్నసమయములో చూచినాడు. వెంటనే స్వప్నము సంగతి జ్ఞప్తికి వచ్చింది. ఇంతలో సింహము బాలుని దింపి సరోవరములో నీరు తాగడానికి వెళ్ళింది. దీపకర్ణి సింహముమీదికి బాణము విడిచినాడు. వెంటనే ఆసింహము మానవాకారము ధరించింది. రాజు ఆశ్చర్యపడి ఏమిది అని అడిగితే అతడు "రాజా, నేను కుబేరమిత్రుడను; సాతుడు నానామము. పూర్వము, గంగానదిలో స్నానము చేస్తున్న మునికన్యను చూచాను; ఆమెకూడా నన్ను చూచింది. మాయిద్దరికీ అనురాగము కలిగింది. గాంధర్వవిధిని వివాహము చేసుకొన్నాము. ఆసంగతి తెలిసి ఆమె బంధువులు "దుర్మోన్మత్తులై స్వేచ్ఛాచారు లయినమీరు సింహాలయి పుట్టండి" అని శపించారు. ఆమెకు కుమారుడు పుట్టేవరకూ, నాకు నీబాణము తగిలేవరకూ శాపావధి. మేము సింహదంపతులుగా పుట్టినాము. కాలక్రమేణ నా భార్య ఈబాలుని కని, చనిపోయింది. సింహాలపాలతో నేను వీనిని పెంచి పెద్ద చేశాను. నీబాణము తగలగానే నాశాపమోక్షమయింది. వీడు సత్త్వసంపన్నుడు. వీనిని పుత్రునిగా స్వీకరించు. ఇలా అపుత్రుం

దని పూర్వమే ఆమునులు నిర్ణయించారు," అని చెప్పి అంతర్ధాన మైనాడు. దీపకర్ణి ఆబాలుని ఇంటికి పిలుచుకొని పోయి, సాతుడు వానికి వాహనము కావడముచేత సాతవాహను డని పేరు పెట్టి కాల క్రమేణ పట్టాభిషేకము చేసి తపస్సుకోసము వనానికి వెళ్ళిపోయినాడు. అప్పటినుంచీ సాతవాహనుడు రాజ్యము చేస్తున్నాడు.

కాణభూతికి గుణాఢ్యుడు ఈఅవాంతర కథ చెప్పి తరవాత వృత్తాంతము ప్రారంభించినాడు :

### రాణి సాతవాహనుని ఆదరించుట

తర్వాత కొంతకాలానికి సాతవాహనుడు వసంతకాలములో ఆ దేవీ కృతోద్యానానికి వెళ్ళి రాణి వాసముతో చాలసేపు వనవిహారము చేసి జలక్రీడార్థము పద్మసరోవరములో ప్రవేశించినాడు. స్త్రీలు అతనిమీద వినోదముగా నీళ్లు చల్లుతున్నారు. రాణి జలక్రీడలో అలిసిపోయి రాజు తనమీద నీళ్ళు చల్లుతుంటే తట్టుకోలేక, "దేవ, మోదకై ర్మాం పరితాడయ" అని సంస్కృతములో అన్నది. రాజు వెంటనే చాలా మోదకములు (తీపికుడుములు) తెప్పించినాడు రాణి నవ్వుతూ 'దేవ! నీటిలో మోదకా లెందుకు? మా ఉదకై: పరితాడయః అంటే నీళ్ళతో కొట్టవద్దు (గట్టిగా చల్ల వద్దు) అని వేడుకొన్నాను. మాశబ్ద ఉదకశబ్దాలకు సంధి మీకు తెలియలేదు. సందర్భముకూడా మీరు గ్రహించలేదు" అన్నది. వ్యాకరణము చదువుకొన్న ఆరాణి మాటలకు పరివార జన మంతా నవ్వినారు. రాజు చాలా సిగ్గుపడి వెంటనే జలక్రీడ ఆపి నిరుత్సాహముతో బయలుదేరి రాజధానికి వెళ్ళి నాడు. చింతాక్రాంతుడై భోజనము మాని ఎవరేమి అడిగినా సమాధానము చెప్పక పానుపుమీద పరుండి నాకు సంస్కృత పాండిత్యమో, చావో ఏదో ఒకటి శరణ మని తలపోస్తూ బాధపడుతున్నాడు. ఆక

స్మికముగా రాజుకు కలిగిన ఈ అవస్థ చూచి పరివారము ఏమీ తోచక దిగులుపడి ఊరుకొన్నది.

## శర్వవర్మ సాతవాహనుని సంస్కృత విద్వాంసుని చేయుట

నాకూ శర్వవర్మకూ ఆవార్త తెలిసింది. ఆరోజు గడిచింది. రాజుకు ఆరోగ్యము కలగలేదని విని, రాజహంసు డనే రాజభటుని పిలిచి ప్రభువుస్థితి ఎలా ఉన్నదని అడిగాను. వాడు 'దేవరవారికి ఎన్నడూ ఇంతటి మనోవ్యథ కలగలేదు. విష్ణుశక్తికూతురు చదువుకొన్నదాన ననే గర్వంతో ప్రభువువారిని ఏవోమాట లన్న దని తక్కినరాణులు సెల విచ్చారు' అని వాడు విన్నవించినాడు. సంశయము కలిగి శర్వవర్మతో 'రాజుకు వ్యాధి అయితే వైద్యుల్ని పిలిపించేవారు. మనో వ్యాధికి కారణం కనపడదు. శత్రువులు లేరు. ప్రజలు అనురక్తులు. ఏ లోపమూ కనపడదు. ఈయనకు ఇంత మనోవ్యథ ఎందుకుకలిగిందో!'' అన్నాను. బుద్ధిమంతు డయిన శర్వవర్మ ఇలా అన్నాడు: 'తెలిసింది. తనకు సంస్కృతము రానందుకు రాజు విచార పడుతున్నట్టు తోస్తుంది. తాను పండితుడు కావలె నని తరుచుగా అంటూ ఉండేవాడు. రాణి అన్నమాటలకు తనవిద్యాలోపము గ్రహించుకొని ప్రభువు మంచము పట్టినాడు.'

ఇలా ఒకరితో ఒకరము కూడ బలుకుకొని ఆరాత్రిగడిపి, మర్నాడు ఉదయము రాచనగరికి వెళ్ళినాము. ఎవరూ లోపలికి వెళ్ళడానికి వీలు లే దని రాజాజ్ఞ అని తెలిసినా, ఉపాయము చేసి లోపలికి వెళ్ళినాము. నేను రాజుదగ్గరికి పోయి కూర్చుని "దేవా, ఎందుకు ఇలా వృథాగా బాధపడుతారు?" అని అడిగినాను. ఆయన ఏమీ మాటాడలేదు. తర్వాత శర్వవర్మ ఇలా అన్నాడు: "మీకు పాండిత్యము కావలె నని తరుచు అంటూ ఉండేవారు. రాత్రి నాకు స్వప్నము వచ్చింది. ఆకాశము

నుంచి కమలము మొలిచింది. దివ్యబాలుడు ఒకడు దానిని వికసింప జేసినాడు. ఆకమలములోనుంచి శ్వేతవస్త్రధారిణి అయిన దివ్యస్త్రీ పైకివచ్చి మీనోటిలో ప్రవేశించింది. నాకు వెంటనే మెళుకువ వచ్చింది. ఆమె సరస్వతీదేవి అనే నావిశ్వాసము."

సాతవాహనుడు స్నానము విడిచి సాభిప్రాయముగా నాతో "ఆర్యా, శ్రద్ధతో విద్యాభ్యాసము చేయిస్తే ఎంతకాలములో పురుషునకు పాండిత్యము కలుగుతుంది? విద్యలేని నాసంపదవల్ల ఏమీ శోభ లేదు" అన్నాడు. "సమస్తవిద్యలకూ మూల మయిన వ్యాకరణశాస్త్రము పన్నెండు సంవత్సరములలో పట్టుపడుతుంది. నేను మీకు ఆరుసంవత్సరాలలో బోధించగలను" అన్నాను నేను. అందుకు శర్వవర్మ "సుఖ మగ్నులైన ప్రభువునకు ఆరుసంవత్సరాలు విద్యాభ్యాసక్లేశము దుస్సహము. దేవా, నేను మిమ్ములను ఆరుమాసములలో పండితుని చేస్తాను." అన్నాడు. వీలూ చాలూ లేని యీమాటలకు నాకు కోపము వచ్చి "రాజుగారికి నీవే ఆరుమాసాలలో పాండిత్యము సమకూర్చితే నేను లోకవ్యవహారములో ఉన్న సంస్కృతము, ప్రాకృతము, దేశభాష— ఈ మూడింటిని విసర్జిస్తాను" అని శపథము చేసినాను. "నామాట నిర్వహించ లేకపోతే నీపాదరక్షలు పన్నెండేళ్ళకాలము శిరస్సుమీద పెట్టుకొని మోస్తాను" అని శర్వవర్మ ప్రతిజ్ఞ చేసినాడు. మాప్రతిజ్ఞల వల్ల తనకోరిక నెరవేరుతుం దని రాజు భావించినాడు.

తాను చేసిన విషమప్రతిజ్ఞ తలుచుకొని శర్వవర్మ దిగులుపడి భార్యతో చెప్పుకొన్నాడు. ఆమెకూడా చాలా విచారపడి "నాథా, ఈ అవస్థలో మనకు కుమారస్వామి కన్న వేరే దిక్కులేదు" అన్నది. శర్వవర్మ కృతనిశ్చయుడై, నిరాహారుడై, ఆరాత్రి నాలుగోజామున కుమారక్షేత్రానికి ప్రయాణ మయినాడు. ఆసంగతి తెలిసి తెల్లవారగానే నేను ప్రభుసన్నిధికి వెళ్లి చెప్పినాను. రాజు ఆలకించి, ఫలితము

ఏమిటా ? అని ఆలోచిస్తున్నాడు. నిరంతరము ప్రభువు మేలు కోరే సింహగుప్త డనే రాజపుత్రుడు వచ్చి "దేవా, దేవర విచారగ్రస్తులై ఉండడముచేత నాకూ చాలా దుఃఖము కలిగి నగరము వెలుపలి చండికా దేవి ఆలయానికి వెళ్ళి, తమ శ్రేయస్సు కోసమై నన్ను అమ్మవారికి బలి యిచ్చుకోడానికి శిరస్సు ఖండించుకో బోయినాను. అంతలో ఆకాశవాణి, "వత్సా, త్వరపడి సాహసించకు. నీ ప్రభువు కోరిక త్వరలోనే సిద్ధిస్తుంది" అని అనుగ్రహించింది. నేను ఈ విషయము తమకు విన్నవించడానికి వచ్చాను" అని నివేదించి, సెలవు తీసుకొని ఇద్దరు చారులను శర్వవర్మ వెంట పంపినాడు. శర్వవర్మ మౌనవ్రతము పూని, వాయుభక్షణము చేస్తూ, కుమారక్షేత్రము చేరి ఘోరతపస్సుచేసి స్వామిని సంప్రీతుని చేసినాడు. కుమారస్వామి కోరినవరములు అతని కిచ్చినాడు. శర్వవర్మ ప్రయత్నసాఫల్యాన్ని సింహగుప్తుని చారులు వచ్చి రాజుకు విన్నవించినారు. ప్రభువుకు ప్రమోదము, నాకు విచారమూ కలిగినవి.

తర్వాత శర్వవర్మస్వామి వరప్రభావముచేత రాజును విద్యావంతుని చేసినాడు. ఈశ్వరానుగ్రహ ముంటే ఏపని కాదు ? రాజుకు విద్యాలాభము కలిగినందుకు ప్రజలు ఉత్సవము చేశారు. ప్రతి యింటిమీదా జండాలు ఎత్తినారు. సాతవాహనుడు శర్వవర్మను గురువుగా పేర్కొని, నమస్కరించి, రాజోచితము లైన మణి కనక వస్తువాహనాదులు సమర్పించి, నర్మదాతీరాన ఉన్న భరుకచ్ఛప్రదేశానికి ప్రభువును చేసినాడు. సింహగుప్తుని మహైశ్వర్యవంతుని చేసినాడు. విద్యాప్రోత్సాహకారకురాలయిన విష్ణుశక్తి కుమార్తెను పట్టపురాణిని చేసినాడు.

## తరంగము : ౭

నేను మౌనం అవలంబించి రాజసన్నిధికి వెళ్ళినాను. అక్కడ ఒకానొక బ్రాహ్మణుడు తాను రచించిన శ్లోకముచదివినాడు. రాజు దాని

అర్థము సంస్కృతభాషలో వివరించినాడు. అందరూ సంతోషించినారు. కుమారస్వామి ఏవిధముగా ప్రసన్ను డయినాడో చెప్పమని రాజు శర్వవర్మను వినయపూర్వకముగా అడిగినాడు. అతడు ఇలా చెప్పినాడు :

## స్వామి ప్రసన్ను డయిన విధము

దేవా ఇక్కడనే మౌనము పూని నిరాహారుడనై బయలుదేరినాను. తీవ్రతపస్సువల్ల మార్గములో మూర్ఛపోయినాను. చేతులో బల్లెము పట్టుకొన్న మహానుభావుడు కనబడి 'వత్సా, లే. నీఅభీష్టము నెరవేరు తుంది' అని అభయ మిచ్చినాడు. ఆమాటలకు నేను మూర్ఛదేలి, ఆకలి దప్పికలు పోయి, హాయిగాలేచినాను. క్రమేణ కుమారస్వామి ఆల యానికి వెళ్ళి భక్తిపారవశ్యముతో గర్భగుడిలో ప్రవేశించినాను. స్వామి నాకు దర్శనము అనుగ్రహించినాడు. నానోటివెంట సరస్వతి నాశరీర ములో ప్రవేశించింది. స్వామి ఆరునోళ్ళతోనూ స్పష్టముగా "సిద్ధోవర్ణ సమామ్నాయః" అని సూత్రము ఉచ్చరించినాడు. నేను ఊరుకోలేక మానవ చాపల్యముచేత ఊహించి రెండవసూత్రము పలికినాను. షణ్ము ఖుడు (కుమారస్వామి) నన్ను చూచి, "ఓరీ, నీవు రెండవసూత్రము ఉచ్చ రించకుండా ఉంటే నీశాస్త్రము పాణినీయ వ్యాకరణశాస్త్రమును అణగ ద్రొక్కివేసేదే. నీచాపలమువల్ల ఇది స్వల్పతంత్రమై 'కాతంత్రము' అనే పేరుపొందుతుంది. నావాహన మైన నెమలిపేరిట దీనికి 'కాలాపము' అనికూడా సంజ్ఞ ఉంటుంది" అని, నవీనమైన శబ్దశాస్త్రమును నాకు క్షణములో అనుగ్రహించి, "వత్సా, నీప్రభువు వెనకజన్మలో ఋషి ; భరద్వాజుని శిష్యుడు ; మహాతపస్వి. అప్పుడు కృష్ణుడు అనిపేరు. కృష్ణుడు ఒకానొక మునికన్యనుచూచి మోహించినాడు. ఆమెకూ మోహము కలిగింది. ఋషులు శపించారు. వా రిద్దరూ మానవ జన్మ మెత్తినారు. అతడే సాతవాహనుడు, ఆమునికన్యకే విష్ణుశక్తికూతురు,

నిన్ను చూచినతర్వాత నీయిష్టానుసారముగా రాజుకు సకలవిద్యలూ సంక్రమిస్తవి. పూర్వజన్మ సంస్కారమువల్ల పుణ్యాత్ములకు ఉత్తమార్థాలు శ్రమ లేకుండా ఈజన్మలోలభిస్తవి'' అని అంతర్థాన మయినాడు. గర్భగుడిలోనుంచి నేను ఇవతలకు వచ్చినతర్వాత ఆగుడి అర్చకులు నాకు బియ్యము ఇచ్చినారు. నేను ప్రయాణములో వండుకొంటూ ఉన్నా బియ్యము తరగనే లేదు!

ఈ వృత్తాంతము విన్నతరువాత రాజు మాధ్యాహ్నిక స్నానము కోసము సభ చాలించి లేచినాడు. నేను మౌనవ్రతము అవలంబించడము చేత రాజకార్యాలు ఏవీ చూడలేక, తల వంచి రాజువద్ద సెలవు తీసుకొన్నాను. నేను రాజ్యాన్ని విడిచి వెళ్ళడము ఆయనకు ఎంతమాత్రమూ ఇష్టము లేకపోయినా ఇద్దరుశిష్యులతో బయలుదేరి, తపస్సు చేతామని వింధ్యవాసినీ దేవివద్దకు వచ్చినాను. అమ్మవారు స్వప్నములో కనబడి నీవద్దకు వెళ్ళమని సెలవిచ్చింది. నీకోసము ఈ ఘోరారణ్యములో ప్రవేశించినాను. దైవవశాత్తు ఒకానొక పుళిందుడు కనబడి నాకు బిడారు చూపించినాడు. దానివెంట ఇక్కడికి వచ్చేసరికి పిశాచులు కనబడినారు. దూరమునుంచి వాళ్ళసంభాషణలు విని పైశాచీభాష గ్రహించాను. ఈభాష రావడముచేత మౌనము విడిచినాను. నీవు ఉజ్జయినికి వెళ్ళినావని విని, నీవు వచ్చేవరకూ ఇక్కడనే నీకోసము కనిపెట్టుకొని ఉన్నాను. నిన్ను చూచి భూతభాషలో కుశలప్రశ్న వెయ్యగానే నాకు పూర్వజన్మజ్ఞానము కలిగింది. ఇది నావృత్తాంతము.

గుణాఢ్యుడు ముగించగానే కాణభూతి ఇలా అన్నాడు: "నీవు వచ్చినట్టు ఆరాత్రే నాకు ఎలా తెలిసిందో చెపుతాను. భూతివర్మ అనే రాక్షసుడు నామిత్రుడు. అతనికి దివ్యదృష్టి ఉన్నది. ఉజ్జయినిలో నాఉద్యానవనానికి వెళ్ళి నా శాపాంతము ఎప్పుడని అతనిని అడిగాను. పగటివేళ తనకు శక్తి లేదనీ, రాత్రిదాకా ఆగ మనీ భూతివర్మ

అన్నాడు. రాత్రి కాగానే అక్కడ పరుగు లెత్తుచున్న పిశాచుల సంతో షానికి కారణ మేమి టని ప్రస్తావవశాన అడిగాను. పూర్వము మహే శ్వరుడు బ్రహ్మకు చెప్పిన విషయము నాకు చెప్పినాడు. సూర్యప్రభా వమువల్ల పగటివేళ యక్ష రాక్షస పిశాచులకు శక్తి లేదు; రాత్రివేళ వీళ్ళకు పండగ. దేవతలకు పూజలు జరగని ప్రదేశాలలో బ్రాహ్మణులు ఉచితాచారాలు నిర్వర్తించని చోటా, విధివిరుద్ధముగా భోజనములు జరిగే తావులలో వీటి ప్రభావము మెండు. మాంసము తినని వానిదగ్గి రికీ, పతివ్రత దగ్గిరికీ, జ్ఞానులజోలికీ శూరులజోలికీ వీళ్ళు వెళ్ళరు.

"ఇక వెళ్ళు నీ శాపమోక్షానికి కారణభూతు డయిన గుణాఢ్యుడు వచ్చినాడు." అని భూతివర్మ చెపితే వచ్చినాను. పుష్పదంతుడు చెప్పిన కథ నీకు చెపుతాను. ఆయనకు పుష్పదంతు డనీ, నీకు మాల్యవంతు డనీ పేర్లు రావడానికి కారణము వినవలెనని కుతూహలము.

: పుష్పదంతునికి ఆ పేరు వచ్చిన కారణము :

కాణభూతి కుతూహలము తీర్చడముకోసము గుణాఢ్యుడు ఈప్రకా రము చెప్పినాడు :

గంగాతీరమున బహుసువర్ణక మనే అగ్రహారములో గోవిందదత్తుడు అనే బ్రాహ్మణవిద్వాంసుడు ఉన్నాడు. అగ్నిదత్త అనే ఆయనభార్య మహాసాధ్వి. కాలక్రమేణ వారికి అయిదుగురు కుమారులు కలిగినారు. వారు మూర్ఖులు. అందగాళ్ళ మని వాళ్ళకుగర్వము. ఒకనాడు వైశ్వా నరు డనే అతిథి వారింటికి వచ్చి కుమారులకు నమస్కారము చేసినాడు. వాళ్ళు ప్రతి నమస్కారము చెయ్యక నవ్వడము మొదలు పెట్టినారు. వైశ్వానరునికి కోపము వచ్చి బయలుదేరాడు. గోవింద దత్తు అతిన్ని ఆపి బతిమాలుకొగా "నీకుమారులు మూర్ఖులు, పతితులు. మీఇంట్లో భోజనంచేస్తే ప్రాయశ్చిత్తము చేసుకోవలసి వస్తుంది." అన్నాడు వైశ్వా

నాపైనా ఉపహారాగ్రహమును ఇక ఎప్పుడూ ముట్టుకోను అని గోవిందదత్తు శపథము చేసినాడు. అగ్నిదత్త కూడా అతిథిని చాలా బతిమాలింది. చివరకు వైశ్వానరుడు వారి ఆతిథ్యము స్వీకరించినాడు. ఆయన పుత్రులలో దేవదత్తు డనేవాడు అదంతా చూచి పశ్చాత్తాపము పొంది, తన జీవితము వ్యర్థమని ఎంచి, విరక్తి పుట్టి బదరికాశ్రమానికి తపస్సు నిమిత్తము వెళ్ళినాడు. కొంతకాలము ఆకులు అలములూ తిని, కొంత కాలము ధూమము పీల్చి, చాలా కాలము మహేశ్వరుని గురించి తపస్సు చేసినాడు. అతని ఉగ్రతపస్సుకు మెచ్చి మహేశ్వరుడు ప్రత్యక్షమైనాడు. ఈశ్వరునికి తాను అనుచరుడుగా ఉండేలాగున అనుగ్రహించ వలసినదని అతడు వరము వేడినాడు. "విద్యలు నేర్చుకో. భూలోకములో భోగాలు అనుభవించు. తర్వాత నీ అభీష్టము నెరవేరుతుంది" అని ఈశ్వరుడు వరము దయచేసినాడు.

పిమ్మట అతడు బయలుదేరి పాటలీపుత్రములో వేదకుంభుడు అనే గురువువద్ద యథావిధిగా విద్యాభ్యాసము చేయడము ప్రారంభించినాడు. ఒకనాడు గురుపత్ని అతనిని వలచి బలవంతము చేసింది. దేవదత్తుడు పాటలీపుత్రము విడచి ప్రతిష్ఠానపురము వెళ్ళి, వృద్ధభార్య ఉన్న గురువును ఆశ్రయించి విద్యలు అభ్యసించినాడు.

విద్వాంసుడూ, సుందరమూర్తి అయిన దేవదత్తుని ఆ నగరప్రభువయిన సుశర్మ కూతురు శ్రీదేవి ఒకనాడు చూడడము సంభవించింది. వాతాయనము దగ్గర ఉన్న శ్రీదేవిని అతడు చూచినాడు. సరి, ఇద్దరికీ వలపు తలముణక, లయింది. అతనిని కిటికీదగ్గిరికి, రమ్మని రాజకుమారి వేలితో సంజ్ఞచేసింది. దేవదత్తుడు సమీపించగానే శ్రీదేవి దంతముతో పుష్పమును ఎగజిమ్మింది. ఆసంకేతాభిప్రాయము గ్రహించలేక అతడు లోలోపల కుమిలి, ఇంటికి వచ్చి నేలమీద దొర్లడము మొదలు పెట్టినాడు. బుద్ధిమంతుడయిన గురువు శిష్యుని అవస్థ గ్రహించి

యుక్తిపూర్వకముగా జరిగిన వృత్తాంతము సంపూర్ణముగా విన్నాడు; విని రాజకుమారి దంతముతో పుష్పమును ఎగజిమ్మి సంకేతస్థానము సూచించింది. పుష్పదంత మనేదేవళములో నాకోసము ప్రతీక్షించు. ప్రస్తుతము వెళ్ళిపో, అని ఆమెఅభిప్రాయము" అని చెప్పినాడు. దేవ దత్తుడు విచారము విడిచి దేవాలయానికి వెళ్ళినాడు. రాజపుత్రి అష్టమీ వ్రతమనే నెపముతో దేవదర్శనార్థము ఒంటరిగా గర్భగుడిలోకి వెళ్ళింది. ద్వారబంధమువెనక నిలిచిఉన్న దేవదత్తుడు ముందుకు వచ్చి ఆమె కంఠము కౌగిలించుకొన్నాడు. "నేను చేసిన సంజ్ఞనీవెలా గ్రహించావు?" అని ఆమె ఆశ్చర్యముతో అడిగింది. "నాకు తెలియలేదు. మాగురువు గారు విప్పి చెప్పినారు" అని దేవదత్తుడు చెప్పేసరికి శ్రీదేవి "నన్ను విడు. నీవు రసికుడవు కావు" అని చిరాకుతోనూ, రహస్యము బయలు పడుతుం దనే భయముతోనూ త్వరత్వరగా వెళ్ళిపోయింది.

## : దేవదత్తునికి పంచశిఖుడు తోడ్పడుట :

చేతికి దొరికి జారిపోయిన ప్రియురాలి కోసము దేవదత్తుడు చాలా మనోవ్యథ చెంది ప్రాణత్యాగము చేయబోయినాడు. పూర్వమే అతనికి వరము అనుగ్రహించిన మహేశ్వరుడు పంచశిఖు డనే ప్రమథుని పిలిచి దేవదత్తునికి సహాయము చెయ్యవలసిన దని ఆజ్ఞ యిచ్చినాడు. పంచ శిఖుడు వచ్చి దేవదత్తుని ఓదార్చి, అతనికి స్త్రీవేషము వేసి, తాను వృద్ధబ్రాహ్మణవేషము ధరించి శ్రీదేవి జనకుడయిన సుశర్మవద్దకు అత నిని తీసుకుపోయి "దేవా, నాకుమారుడు దేశాంతరము వెళ్ళినాడు. ఈపిల్ల నాకోడలు. ఈమెను నీవద్ద ఉంచి, కుమారుని వెదకడానికి వెళ్తు తాను. అతడు దొరికినతర్వాత వచ్చి ఈమెను తీసుకుపోతాను. అంత వరకూ ఈమెను సంరక్షించాలి" అని విన్నవించినాడు. అంగీకరించక పోతే కోపమువచ్చి బ్రాహ్మణుడు శపిస్తాడని భయపడి, రాజుసమ్మతించి,

స్త్రీ వేషధారి అయిన దేవదత్తుని భద్రముగా ఉంచడముకోసము తన కుమార్తె అంతఃపురానికే పంపినాడు. పంచశిఖుడు వెళ్ళిపోయినాడు.

తర్వాత దేవదత్తుడు తన ప్రియురాలి సమీపములోనే నివసిస్తూ, ఆమెకు విశ్వాసము బాగా కలిగించి, ఒకరాత్రి ఏకాంతసమయములో నిజస్వరూపము బయటపెట్టినాడు. ఆమెకు ఆమోదము కలిగింది. ఉభయులకూ గాంధర్వ వివాహము జరిగింది.

ఆమె గర్భవతి అయినతర్వాత దేవదత్తుడు పంచశిఖుని తలచు కొన్నాడు. అతడు వచ్చి ఎవరికీ తెలియకుండా అంతఃపురములోనుంచి దేవదత్తుని తీసుకుపోయి అతని స్త్రీవేషము తీసివేసి, తాను వృద్ధ బ్రాహ్మణవేషము ధరించి, ఆతనిని వెంటబెట్టుకొని సుశర్మసన్నిధికి వెళ్ళి, "దేవా, ఇదుగో నాకుమారుడు దొరికినాడు. ఇక్కడ ఇల్లట ముంచిన నాకోడలిని పంపించు" అని అడిగినాడు. అంతఃపురములో విచారణ చేస్తే ఆయువతి రాత్రి కనబడకుండా ఎక్కడికో పోయిందని తెలిసి రాజు బ్రాహ్మణశాపానికి భయపడి మంత్రులతో ఆలోచన చేసినాడు.

## శిబిచక్రవర్తికథ

రాజు అమాత్యులతో, "ఆర్యులారా, ఇతడు సామాన్యబ్రాహ్మణుడు కాడు; ఎవరో దేవు డని తోస్తుంది. నన్ను పరీక్షించడానికి ఈ రూపములో వచ్చినాడు. ఇటువంటి సంఘటనలు పూర్వమూ ఉన్నవి. శిబిమహారాజు అందరినీ రక్షిస్తూ, దయాదానధర్మాలకు చాలా ప్రసిద్ధి చెందినవాడు. ఆయనను పరీక్షించడానికి ఇంద్రుడు డేగరూపము ధరించి, పావురము రూపము తాల్చిన యమధర్మరాజును తరుము కుంటూ శిబిదగ్గిరికి వచ్చినాడు. పావురము భయభ్రాంతమై శిబిచక్రవర్తి ఒడిలో దూరింది. డేగ మనుష్యవాక్కుతో "మహాప్రభూ, నాకు చాలా ఆకలిగా ఉన్నది. ఈ పావురము నాకాహారము. దీనిని విడిచిపెట్టు. విడువక

పోతే నాప్రాణాలు ఇప్పుడే పోతవి. నీకు పాపము చుట్టుకొంటుంది" అని చెప్పింది. "ఈ పావురము నన్ను శరణుగోచ్చింది. దీనిని విడవడానికి వీలులేదు. దీనికి సరిఅయినమాంసము నీకిస్తాను" అన్నాడు చక్రవర్తి. "అయితే నీ మాంసమే నాకు కావాలి" అన్నది డేగ. శిబి అంగీకరించి తనమాంసము కోసి త్రాసులో ఎంత వేసినా, పావురమువైపే మొగ్గుగా ఉన్నది. చక్రవర్తి తన శరీరము యావత్తూ కాటాలో వేయించి తూచ వలసిం దన్నాడు. అప్పుడు ఆకాశవాణి శిబిని మెచ్చుకొని హర్షధ్వానములు చేసింది. ఇంద్ర యములు సంతుష్టులై పక్షిరూపాలు విడిచి నిజరూపాలతో ప్రత్యక్ష మయి శిబికి వజ్రదేహమూ, వరాలూ ఇచ్చి అంతర్థాన మయినారు. ఆలాగే నన్ను పరీక్షించడానికి ఎవరో ఈరకమున వచ్చినాడు." అని చెప్పినాడు.

సుశర్మ మంత్రులతో ఇలా నెమ్మదిగా అని, బ్రాహ్మణునితో బహిరంగముగా "ఆర్యా, ముందు నాకు అభయ మియ్యవలె. నీ కోడలిని గతరాత్రి ఎవరో అపహరించుకు పోయినారు. రాత్రింబగళ్ళు మేము కనిపెట్టి ఉన్నా మీకోడలు అదృశ్యం అయింది" అని విన్నవించినాడు. బ్రాహ్మణుడు మొదట కోపించి, క్రమముగా శాంతించి, చివరకు, "రాజా, నా కుమారునకు నీ కుమారిని ఇయ్యి" అన్నాడు. బ్రాహ్మణ శాపానికి వెరచి సుశర్మ తనకుమార్తె శ్రీదేవిని దేవదత్తునికిచ్చి వివాహాము చేసి, అల్లుని తనవద్దనే ఉంచుకొన్నాడు. పంచశిఖుడు కైలాసానికి వెళ్లిపోయినాడు. దేవదత్తునికి బహిరంగముగా ప్రియురాలు లభ్య మయింది. పురుషసంతానము లేని మామగారి సంపదయావత్తు ఆతనికే దక్కింది. శ్రీదేవికి కలిగినకుమారునికి రాజ్య మిచ్చి సుశర్మ తపస్సు నిమిత్తము వనానికి వెళ్ళినాడు.

కాలక్రమేణ దేవదత్తుడు కుమారుని అభివృద్ధి చూచి ఆనందించి, భార్యతోకూడా తపోవనానికి వెళ్లిపోయినాడు. అక్కడ ఈశ్వరారాధన

చేసి, శివానుగ్రహమువల్ల మానవదేహము విడిచి మళ్ళీ ప్రమథగణములో చేరినాడు. తనప్రియురాలు దంతముతో పుష్పమును ఎగజిమ్మినసంజ్ఞ గ్రహించక పోవడముచేత ఆతనికి ప్రమథగణములో పుష్పదంతుడు అని పేరు వచ్చినది. ఆతనిభార్య జయ అనే నామధేయముతో పార్వతీ దేవికి ప్రతీహారి అయినది. ఆతనికి పుష్పదంతు డనే పేరు రావడానికి ఇది గాథ.

## మాల్యవంతునికి ఆ పేరు వచ్చిన కారణము

ఇక నాకథ చెపుతాను. దేవదత్తునితండ్రి గోవిందదత్తు కదా! ఆయన పుత్రులలో నే నొకడను. నన్ను సోమదత్తు డనేవారు. మా నాయనగారికి నామీద వాత్సల్యము లేకపోవడముచేత విచారము కలిగి, నేను హిమాచలానికి వెళ్ళి మాల్యములతో శివపూజ చేస్తూ తపస్సు చేసినాను. మహేశ్వరుడు ప్రసన్నుడై దర్శన మిచ్చినాడు. నేను భోగములూ కోరక ప్రమథగణత్వమే వేడితే స్వామి అదే ప్రసాదించినాడు. మానవులు అడుగు పెట్టలేని అరణ్యప్రదేశాలనుంచి నీవు పుష్పములు తెచ్చి మాల్యములు గుచ్చి పూజ చేయడముచేత నీకు మాల్యవంతు డనే నామధేయము ఉంచుతున్నాను" అని శివుడు అనుగ్రహించినాడు. నేను మానవశరీరము విడిచి ప్రమథుడ నయినాను. ఈశ్వరానుగ్రహముచేత నాకు మాల్యవంతుడనే పేరు ఈవిధముగా వచ్చింది.

కాణభూతీ, దురదృష్టవశాన పార్వతీదేవి శాపముతగిలి నేను మానవ లోకములో జన్మించాను. హరప్రోక్తమైన ఆ దివ్యకథ ఇక చెప్పు. మన ఉభయులకూ శాపమోక్ష మవుతుంది.

తరంగము : ౮

## గుణాఢ్యుడు బృహత్కథను సాతవాహనునికి పంపుట

ఈవిధముగా గుణాఢ్యుడు అడుగగా ఏడుఖండాలుగా ఉన్న ఆదివ్య కథను కాణభూతి తనభాషలోనే చెప్పినాడు. గుణాఢ్యుడు ఆకథను ఏడు సంవత్సరాలలో ఏడులక్షలశ్లోకాలలో రచించినాడు. అరణ్యములో సిరాదొరకక పోవడమువల్ల ఆమహాకవి తనరక్తముతోనే గ్రంథము లిఖించినాడు. విద్యాధరులు కథను అపహరిస్తారేమో అన్న భయముచేత కథను అలా గ్రంథస్థము చేసినాడు. అప్పటికి కథ వినడానికి వచ్చి ఆకాశాన నిలిచిన విద్యాధరాదులు పందిరికి చాందినీ కట్టినట్టున్నారు. కథను చూచి కాణభూతి దివ్యగతి పొందినాడు. అతనివెంట ఉన్న తక్కినపిశాచాలుకూడా కథవిని స్వర్గానికి వెళ్ళినారు.

ఈ మహాకథను భూలోకములో నిలపవలె. అప్పటికి శాపమోక్షమని దేవి సెలవిచ్చినది. దీనిని ఎలా ప్రకటించను? ఎవరి కివ్వను? అని గుణాఢ్యుడు ఆలోచిస్తున్నాడు. ఆయనతోకూడా వచ్చిన గుణదేవుడు నందిదేవుడు అనేశిష్యులు "ఈకావ్యమును గ్రహించడానికీ, అర్పించడానికీ తగినవాడు శ్రీ సాతవాహన మహారాజు. ఆయన రసజ్ఞుడు. పుష్పపరిమళమును మారుతము వహించేలాగున ఆ ప్రభువు ఈ కావ్యాన్ని వహించగలడు" అని చెప్పినారు. సమ్మతించి గుణాఢ్యుడు ఆశిష్యులకు కావ్య మిచ్చి మహారాజుసన్నిధికి పంపి, తాను ప్రతిష్ఠానపురము వెలుపల ఉన్న దేవీకృతోద్యానములో సంకేతస్థానము ఏర్పాటు చేసి కూర్చున్నాడు. శిష్యులు మహారాజును దర్శించి గుణాఢ్యుడు రచియించినా డని ఆగ్రంథము సమర్పించినారు. సాతవాహనుడు వారి పిశాచాకృతి గమనించి, పుస్తకము తెరిచి, పైశాచీభాషలో ఉండడము గ్రహించి, అసహ్యించుకొని విద్యాగర్వముతో,

"ఏమి! నీరసమైన పైశాచీభాష! రక్తముతో వ్రాసినగ్రంథము! ఏడు లక్షలశ్లోకాలు! పాడుకథ!" అని నిరసించినాడు. శిష్యులు గ్రంథసమేత ముగా వెళ్ళి జరిగినసంగతి గురువుకు విన్నవించినారు. ఆయన విచారపడి నాడు. గుణగ్రహణశక్తి కలవారే నిరసిస్తే ఎవరికి విచారము కలగదు?

తర్వాత గుణాఢ్యుడు సమీపపర్వతమువద్దకువెళ్ళి ఏకాంతరమ్య స్థానములో అగ్నికుండము చేసి కూర్చుని ఒక్కొక్క పత్రమే చదివి శిష్యులూ, మృగాలూ, పక్షులూ కన్నీరు విడుస్తూ ఉండగా అగ్నిలో పడవేస్తున్నాడు. ఈప్రకారముగా ఆరులక్షల శ్లోకాలగ్రంథము అగ్ని హోత్రునికి ఆహుతి అయిపోయింది. నరవాహన దత్తచరిత్ర మాత్రము మిగిలింది. గుణాఢ్యమహాకవి ఆప్రకారముగా గ్రంథము చదివేవేళ లేళ్లు, వరాహములు, మహిషములు మొదలైనజంతువులు బారులుతీర్చి చుట్టూ నిలిచి, ఆహారము మాని, కన్నీళ్ళతో నిశ్చలముగావిన్నవి.

ఇంతలో సాతవాహన మహారాజుకు జబ్బు చేసింది. సారము లేని మాంసము తినడమేకారణ మని వైద్యులు నిర్ణయించినారు. వంట వాళ్ళను రాజు గట్టిగా అడిగితే వేటకాండ్రు తెచ్చి యిచ్చినమాంసమే తాము వండినట్టు చెప్పినారు. వేటగాండ్లను అడిగితే, "మహాప్రభూ, ఇక్కడ ఒకబ్రాహ్మడు కథ చదువుతూ ఒక్కొక్కపత్రమే అగ్గిలో వేస్తున్నాడు. జంతువులు మేత మాని వింటూ ఉండడముచేత నీరసించి పోయినవి. వాటి మాంసం నీరసం అయిపోయింది." అని వాళ్లు విన్నవించుకొన్నారు. కుతూహలము కలిగి రాజు వాళ్ళను ముందు నడవ మని, వెంట వెళ్ళి గుణాఢ్యుని చూచినాడు. శిష్యులూ, మృగాలూ, చుట్టూఉండగా మధ్య కథ వినుపిస్తున్న మహాకవికి రాజు నమస్కారము చేసి వృత్తాంతము యేూపత్తూ చెప్ప మన్నాడు. పుష్ప దంతునిశాపము మొదలుకొని అప్పటివరకూ జరిగిన విషయా లన్నీ పైశాచీభాషలో మహాకవి చెప్పినాడు.

గుణాఢ్యుడు ప్రమథావతార మని తెలుసుకొని మహేశ్వర ముఖో ద్గత మైన బృహత్కథను తనకు దయచేయవలసినదని సాతవాహనుడు కవీశ్వరుని కాళ్ళమీద పడినాడు.

“రాజా, ఆరులక్షల శ్లోకాల కథలు, ఆరు అగ్నిపాలైనవి. ఈ కథ లక్షగ్రంథము మాత్రము మిగిలినది. తీసుకో. నాశిష్యులు వచ్చి వివరిస్తారు.” అని గుణాఢ్యుడు చెప్పి, రాజుకు సెలవిచ్చి, యోగమార్గాన నిజదేహము విడిచి దివ్యపదవికి వెళ్ళినాడు.

గుణాఢ్యుడు ప్రసాదించిన బృహత్కథను తీసుకొని రాజు నిజ నగరమునకు బయలుదేరిపోయినాడు. ఆ నరవాహనదత్త చరిత్రను వివరించి వ్రాసిన కవిశిష్యులు గుణదేవ నందిదేవులకు సాతవాహన మహారాజు మణి కనక వస్త్రవాహనాలూ, గృహములూ, ధనమూ, అగ్రహారములూ ఇచ్చి సత్కరించినాడు. రాజు ఆశిష్యులతో సహా కథావిభాగము చేసి పైశాచీభాషలోనే కథావతారమును తెలుపడానికి ఈ కథాపీఠము రచించినాడు. ఆ మహాకథ రసవంతమై చిత్రవిచిత్ర సంఘటనలతో కూడి దేవకథలనుకూడా మరిపించి త్రిలోక విఖ్యాతి పొందింది.

## తరంగము : ౯

గౌరీ నవ పరిష్వంగే
విభోః స్వేదాంబు పాతు వః
నేత్రాగ్నిభీత్యా కామేన
వారుణాస్త్ర మివాహితమ్.

ఫాలనేత్రాగ్నిభీతిచే పంచశరుడు
వరపు వారుణాస్త్రముభాతి, ప్రప్రథమము
గౌరి కౌగిట జేర్చు శంకరునిమేన
దోచు స్వేదోదకము మిమ్ము బ్రోచు గాక!

మహేశ్వరునివల్ల పుష్పదంతుడు వరరుచిగా జన్మించిన, ఆపుష్పదంతుని వల్ల కాణభూతి, కాణభూతివల్ల గుణాఢ్యుడు, గుణాఢ్యునివల్ల సాత వాహనుడు గ్రహించిన మహాద్భుతవిద్యాధరకథ ఆకర్ణించండి!

## శ తా నీ కు ని క థ

వత్సదేశానికి కౌశాంబి రాజధాని. పాండవవంశ సంభూతు డయిన పరీక్షిత్తుకు మనుమడు, జనమేజయునకు కుమారుడు అయిన శతానీకుడు ఆరాజ్యమును పరిపాలిస్తూ ఉన్నాడు. ఆయన పట్టమహిషి వసుమతీ దేవి. వారికి సంతానము లేదు.

ఒకనాడు శతానీకుడు వేటకు వెళ్ళి అరణ్యములో సంచరిస్తూ ఉండగా అక్కడ తపస్సు చేస్తున్న శాండిల్యమునితో పరిచయ మయింది. ప్రభువు ప్రార్థించగా ముని రాజువెంట కౌశాంబీ నగరానికి పోయి పుత్రకామేష్టి చేయించినాడు. మహారాణికి మంత్రసిద్ధమైన పాయసము ఇచ్చినాడు. పాయసము త్రాగి వసుమతీదేవి గర్భము ధరించింది. క్రమేణ కుమారుడు కల్గినాడు. అతనికి సహస్రానీకుడు అని పేరు పెట్టినారు. పెద్దవాడయిన తరువాత తండ్రి అతనికి యౌవరాజ్యాభిషేకము చేసి తాను రాజ్యభారవిచారము విడిచిపెట్టి శాంతముగా కాలము గడుపుచున్నాడు.

## శతానీకుడు దేవేంద్రునికి సాయము చేయుట

కొన్నాళ్ళకు ఇంద్రునికి రాక్షసులతో యుద్ధము సంభవించినది. మాతలిద్వారా మహేంద్రుడు శతానీకునికి ఆహ్వానము పంపినాడు. శతానీకుడు తనకుమారుని యుగంధరు డనేమంత్రికి అప్పగించి, రాజ్యభారము మంత్రికి, సుప్రతీకుడు అనే ప్రధానసేనాపతికి అప్పజెప్పి మాతలితో ఇంద్రునిసన్నిధానానికి వెళ్ళినాడు. మహేంద్రుని సమక్షములోనే యము

దంష్ట్రుడు మొదలయిన అసురులను సంహరించి శతానీకుడు యుద్ధములో ప్రాణములు విడిచినాడు. ఆరాజుశవమును మాతలి భూలోకానికి తెచ్చినాడు. రాణి సహగమనము చేసింది.

తర్వాత సహస్రానీకుడు వత్సదేశానికి ప్రభు వయినాడు. ఇంద్రుడు రాక్షసులను జయించి విజయోత్సవము చేస్తూ తనమిత్రుని పుత్రుడయిన సహస్రానీకుని ఆహ్వానించినాడు. నందనవనములో అప్సరసలతో విహారాలు చేస్తూన్న దేవతలను చూస్తూ తనకు తగినభార్య లేదే అని సహస్రానీకుడు విచారపడినాడు. అతని ఆశయము గ్రహించి మహేంద్రుడు ఇలా చెప్పినాడు : "రాజన్, విచారించకు. నీకోరిక ఈడేరుతుంది. నీకు కాగల భార్య భూలోకములో పుట్టి ఉన్నది. వెనుక ఒకసారి బ్రహ్మదేవుని దర్శనార్థము వెళ్ళినాను. నేను వెళ్ళినతర్వాత విధూముడు అనే వసువు వచ్చినాడు. మేమంతా అక్కడ ఉండగానే అలంబుష అనే అప్సరస వచ్చింది. దానిచీర గాలికి కాస్త తొలిగేసరికి చూచిన విధూమునికి మనోవికారము కలిగింది. అప్సరస కూడా అతని రూపసంపదకు ముగ్ధురాలు అయింది. బ్రహ్మ నాకేసి చూచినాడు. నేను ఆయన అభిప్రాయము గ్రహించి కోపించి వాళ్ళతో "మూర్ఖులారా, మీరిద్దరూ మర్త్యలోకములో పుట్టి భార్య భర్త కావలి అని శపించాను. సహస్రానీకా, శాపభ్రష్టుడయిన ఆవసువు నీవే సుమా! ఆ అప్సరస అయోధ్యాధిపతి కృతవర్మకు కూతురయి పుట్టి మృగావతి అనే పేరుతో పెరుగుతున్నది. ఆమె నీకు భార్య అవుతుంది."

ఈవాక్యములు విన్నతరవాత సహస్రానీకుడు మృగావతిమీద మమత హెచ్చింది. అనంతరము మహేంద్రుడు అతనిని సన్మానపూర్వముగా సాగనంపినాడు. అతడు ప్రయాణము చేస్తూ ఉండగా మార్గమధ్యములో తిలోత్తమ అనే అప్సరస ప్రీతివల్ల సహస్రానీకుని ఉద్దేశించి "రాజా, క్షణము ఆగు, నీకొక వార్త చెపుతాను" అన్నది. మృగావతినే ధ్యాని

స్తున్న రాజుకు ఆమాటలు చెవికెక్కలేదు. అప్సరస సిగ్గుపడి, రోష ముతో "రాజా, నామాటలు వినిపించుకోక ఎవతెను ధ్యానిస్తున్నావో ఆమెతో నీకు పధ్నాలుగేళ్ళు వియోగము కలుగును గాక!" అని శపించింది. ఆమాటలు రాజుకు వినపడలేదు. రథము నడుపుతున్న మాతలికి మాత్రము వినబడినవి.

## సహస్రానీకుడు మృగావతిని వివాహ మాడుట

రాజధాని చేరి సహస్రానీకుడు యుగంధరాది మంత్రులతో మృగా వతివృత్తాంతము చెప్పినాడు. విలంబానికి సహించలేక మృగావతి తండ్రి కృతవర్మవద్దకు అయోధ్యకు దూతలను పంపినాడు. ఆయన సంతోషించి తనరాణి కీ వివాహవిషయము తెలిపినాడు. తమబిడ్డను సహస్రానీకునికి ఇచ్చి తప్పకుండా వివాహము చేయవలసిందని, తనకు స్వప్నములో ఒకానొక బ్రాహ్మణుడు కనపడి ఇలా చెయ్యవలసిందని అన్నాడని రాణి చెప్పింది. మృగావతి రూపలావణ్యములను చూచి నృత్తగీతాదికళా శలమును గ్రహించి దూతలు వెళ్ళినారు. తర్వాత మృగావతీ సహస్రా నీకులకు మహావైభవముతో వివాహము జరిగింది. వారిసమ్మేళము చాలా మనోజ్ఞ మయింది.

సహస్రానీకుని మంత్రులకు త్వరలోనే బిడ్డలు కలిగినారు. యుగంధరు నికి యౌగంధరాయణుడు, సుప్రతీకునికి రుమణ్వంతుడు హాస్యసచివునికి వసంతకుడు జన్మించినారు. మృగావతి కూడ గర్భము ధరించింది. ఆమె ముఖము తెల్లని కాంతులు వెదజల్లడము ఆరంభించింది.

## మృగావతిని పక్షి తన్నుకొనిపోవుట

ఒకనాడు రాజు భార్యవంక రెప్ప వాల్చకుండా చూస్తూ ఉన్నాడు. "నెత్తురుతో నిండిన దిగుడుబావిలో స్నానము చేయవలె ననే కోరిక

కలిగింది" అని రాణి విన్నవించింది. భర్త [illegible] రక్తానికి బదులుగా దిగుడుబావిలో లాక్షారసము [illegible] కలిపించినాడు. రక్తవర్ణముతో ఉన్న నీటిలో రాణి స్నానము చేస్తూ ఉండగా ఆకాశాన పోతున్న గరుడపక్షి మాంసపుకండ అనే భ్రమతో రాణిని పైకి తన్నుకుపోయింది. రాజు మూర్ఛపోయి కొంతసేపటికి తెప్పరిల్లినాడు. ఆ వృత్తాంతము దివ్యదృష్టివల్ల గ్రహించిన [illegible] ఆకాశమార్గాన వచ్చి రాజును ఓదార్చి తిలోత్తమ పెట్టిన శాపమూ, దానిఅంతమూ తెలియపరచి వెళ్లినాడు. "ప్రాణేశ్వరీ, ఆ పాపాత్మురాలు తిలోత్తమ మనోరథము ఈడేరింది!" అంటూ రాజు చాలా దుఃఖించినాడు. శాపవిషయము తెలియడముచేతను, మంత్రులు ఓదార్చడముచేతను సహస్రానీకుడు కొంతవరకు మనస్సు దిక్కబట్టి, భార్యతో మళ్ళీ సమాగమము కలుగుతుంది అనే ఆశతో ప్రాణాలు విడవకుండా ఉన్నాడు.

గరుడపక్షి మృగావతిని తన్నుకుపోయి, ప్రాణాలున్న వ్యక్తి అని త్రోవలో గ్రహించి దైవయోగముచేత ఉదయపర్వతముమీద విడిచిపెట్టి, వెళ్ళింది. ఆమె భయశోకాలచేత వికలచిత్తురాలయి, మనుష్యులు అడుగుపెట్టడానికి వీలులేని కొండచరియమీద తాను ఉన్నట్టు తెలుసుకొన్నది. కట్టుబట్టతో దిక్కులేని ఆ మృగావతిని మింగడానికి కొండచిలువ మీదికి వచ్చింది. ముందుముందు ఆమెకు సౌభాగ్యము ఉండడముచేత ఆసమయములో ఒకానొక దివ్యపురుషుడు వచ్చి ఆపామును సంహరించి, కనపడీ కనపడకుండా అంతర్ధానమయినాడు. దుఃఖాతిశయముచేత ఆమె ప్రాణత్యాగము చేయవలెనని నిశ్చయించుకొని అక్కడికి వచ్చిన అడవి యేనుగు కాళ్ళ ముందు వెళ్ళి పడ్డది. ఆశ్చర్యము! ఆ క్రూర జంతువు ఆమెను ఏమీ చెయ్యలేదు. శివానుగ్రహము ఉంటే ఏ అశుభమూ జరగదు.

ఇంకా గర్భములో ఉన్న ఆగర్భవతి కొండచరియ మీదనుంచి లేచిన దైవవశాన వసుగొన్ని భర్తను తలుచుకొని పెద్దపెట్టున రోదనము ప్రారంభించింది.

## మృగావతి జమదగ్ని ఆశ్రమమున నివసించుట

అదృష్టవశాన సరిగా ఆసమయాన కందమూలఫలాల కోసము అక్కడికి వచ్చిన మునికుమారుడు మూర్తీభవించిన దుఃఖదేవతవలె ఉన్న ఆమెను ఓదార్చి సమీపములో ఉన్న జమదగ్ని మహర్షిని ఆశ్రమానికి తీసుకొని వెళ్ళినాడు. ఆమె జమదగ్నిపాదములకు మొక్కింది. దయార్ద్ర హృదయుడైన జమదగ్ని దివ్యదృష్టితో చూచి, "తల్లీ, విచారపడకు. నీకడుపున వంశవర్ధను డైన కుమారుడు జన్మిస్తాడు. మళ్ళీ నీకు భర్తతో సమాగమము కలుగుతుంది" అని ఓదార్చినాడు. ఆపతివ్రత ఆశ్రమములోనే నివాసము చేస్తూ భర్తను మనస్సులో ధ్యానిస్తూఉన్నది.

## ఆకాశవాణి మృగావతి పుత్రునకు ఉదయనుడని పేరుపెట్టుట

కొంతకాలానికి మృగావతికి కుమారుడు కలిగినాడు. "ఇతడు ఉదయనుడు అనేపేరుతో ప్రసిద్ధి చెందుతాడు. మహా శ్రీమంతుడు, కీర్తిమంతుడు, మహాప్రభువు అవుతాడు" "ఇతని కుమారుడు సమస్త విద్యాధర చక్రవర్తి అవుతాడు" అని ఆసమయాన ఆకాశవాణి పలుకు కర్ణోత్సవముగా వినబడ్డది. ఆశ్రమములో ఉదయనుడు దిన దినాభివృద్ధి పొందుతున్నాడు. అతనికి క్షత్రియోచితము లయిన సమస్త సంస్కారాలూ, ఉపనయనమూ చేసి, అతనికి అన్నివిద్యలూ, ధనుర్వేదమూ జమదగ్ని నేర్పినాడు.

## వసునేమి అనేనాగుని ఉదయనుడు రక్షించుట

సహస్రానీకుని పేరు చెక్కిన కడియము తనచేతినుంచి తీసి మృగావతి ప్రీతితో కుమారునిచేతికి పెట్టింది. ఉదయనుడు ఒకనాడు అడవికి వేటకు వెళ్ళినాడు. శబరు డొకడు బలవంతముగా నాగుని (సర్పమును) పట్టు కొనడము చూచి, దాని అందచందాలకు జాలిపడి, దాన్ని విడిచిపెట్ట వలసిందని ఉదయనుడు శబరునికి ఆజ్ఞ యిచ్చినాడు. వాడు చేతులు జోడించి "దొరా, నేను పేదవాణ్ణి; పాములు పట్టుకోడం మాకులవృత్తి. పాములను ఆడించి బతుకుతాను. ఇదివరకు నాదగ్గర ఉండేపాము చచ్చి పోయింది. మంత్ర ఓషధుల మహిమచేత ఈ కీకారణ్యంలో దీన్ని పట్టాను." అని విన్నవించినాడు. ఉదయనుడు చేతికడియము తీసి శబ రునికి ఇచ్చి సర్పమును విడిపించినాడు. కడియము పుచ్చుకొని శబరుడు వెళ్ళిపోగానే ఆనాగుడు ఉదయనునికి నమస్కరించి "రాజన్, నాపేరు వసునేమి, నేను వాసుకి సోదరుడను. నన్ను నీవు రక్షించినావు. కాబట్టి కృతజ్ఞతతో ఈ వీణను, ఈ తాంబూలపు తీగలను, వాడిపోని ఈ పుష్ప మాలికను, ఈ తిలకమును నీకు సమర్పిస్తున్నాను. ఈ వీణకు శ్రుతి విభాగము ఉన్నది, దివ్యమైన తంత్రులు ఉన్నవి. స్వీకరించు" అని సమర్పించినాడు. ఉదయనుడు స్వీకరించినాడు తర్వాత ఆనాగుడే ఉదయనుని ఎత్తుకొని ఆశ్రమములో దింపి వెళ్ళినాడు.

శబరుడు కడియమును రాజధానిలో అమ్మజూపినాడు. కడియము మీాద మహారాజు సహస్రానీకుని నామాక్షరములు చూచి రాజభటులు శబరుని ప్రభువుసన్నిధికి పట్టుకుపోయినారు. మహారాజు కడియమును చూచి దుఃఖాక్రాంతుడయి, అది వానికి ఎలా దొరికినదో చెప్పవలసిన దని ఆజ్ఞాపించినాడు. ఉదయాద్రిమీాద తాను పామును పట్టినది మొదలు కొని కటకము లభించినంతవరకూ జరిగిన వృత్తాంతము యావత్తూ

శబరుడు విన్నవించినాడు. ఆకటకము తాను భార్యచేతికి పెట్టినదని రాజు తెలుసుకొని చాలా ఆందోళన పడినాడు. ఇంతలో అశరీరవాణి "రాజా, నీశాపము ముగిసినది. నీభార్య మృగావతీదేవి కుమారునితోసహా ఉదయాద్రిమీద జమదగ్ని ఆశ్రమములో ఉన్నది" అని వినబడినది. రాజు భార్యమీద చింతతో ఆరోజు కష్టముమీద గడిపి, మరునాడు సైన్యమును వెంట బెట్టుకొని, శబరుని మార్గము చూపుమని జమదగ్ని ఆశ్రమానికి బయలుదేరినాడు.

## తరంగము : ౧౦

ఆనాడు మహారాజు చాలాదూరము ప్రయాణము చేసి అరణ్యములో ఒకప్రదేశాన సరోవరతీరాన దిగి అలసటవల్ల పండుకొని కథకుని పిలిచి, "సంగీతకా, మహారాణి దర్శనార్థము తహతహ లాడుతున్న నాకు ఏదయినా కథచెప్పి వినోదము సమకూర్చు" అని ఆజ్ఞాపించినాడు. "దేవా, ఎందుకు వృథా శ్రమపడుతారు? శాపాంతమై దేవితో తమకు త్వరలోనే సమాగమము కానున్నది కదా! మానవులకు సంయోగ వియోగాలు ఎన్నో కలుగుతూ ఉంటవి. ఉదాహరణార్థము ఈకథ ఆకర్ణించండి!" అని సంగతకుడు కథ చెప్పనారంభించినాడు.

## శ్రీదత్తుని కథ

పూర్వము మాళవదేశములో యజ్ఞసేను డనే బ్రాహ్మడు ఉండేవాడు. ఆయనకు కాలనేమి విగతభయుడు అని ఇద్దరుకొడుకులు. ఉభయులూ జనరంజకులు. జనకుడు దివంగతుడయిన తర్వాత ఉభయులూ విద్యార్థము పాటలీపుత్ర నగరానికి వెళ్ళినారు. కాలక్రమేణ విద్యాభ్యాసము పూర్తికాగానే వారిగురువు తనకొమార్తెలను ఇద్దరినీ వీరికిచ్చి వివాహము చేసినాడు. ధనవంతులను చూచి అసూయచెంది

కాలనేమి వ్రత హోమాదులు చేసినాడు. లక్ష్మీదేవి ప్రత్యక్షమై "కాలనేమీ, నీకు చాలాసంపద లభిస్తుంది. నీకు రాజు కాగల పుత్రుడు పుట్టుతాడు, కాని నీకు అవసానములో దొంగచావు సంభవిస్తుంది. ఓర్వలేనితనముతో హోమాదులు చేయడముచేత అటువంటి అంతము కలుగుతుంది" అని చెప్పి అంతర్ధాన మయినది.

క్రమేణ కాలనేమి మహాసంపన్ను డయినాడు. కుమారుడుకూడ కలిగినాడు. శ్రీదేవి వరముచేత జన్మించిన తనయునికి శ్రీదత్తుడు అని తండ్రి పేరు పెట్టినాడు. ఆబాలుడు పెరిగి పెద్దవా డయినాడు. అతడు బ్రాహ్మణు డయినప్పటికీ మల్లయుద్ధాలలో, శస్త్రప్రావీణ్యములో అసమాను డయినాడు.

కాలనేమి తమ్ముని భార్యను పాము కరిచింది. భార్య పోయినతర్వాత విగతభార్యుడు విరక్తిచెంది తీర్థయాత్రమీద బయలుదేరినాడు.

వల్లభశక్తి అనేరాజు చాలా యోగ్యుడు. తనకుమారుని చెలికాడుగా ఉండడానికి మల్ల విద్యా ప్రవీణుడయిన శ్రీదత్తుని ఆయన ప్రీతితో పిలిపించినాడు. రాజపుత్రుడయిన విక్రమశక్తితో శ్రీదత్తుడు సహవాసము చేస్తున్నాడు. అతనికి దేశసంభవులయిన బాహుశాలి, వజ్రముష్టి అనే యిద్దరుక్షత్రియులూ, తనతో మల్లయుద్ధములో ఓడిపోయిన మహాబలుడు, వ్యాఘ్రభటుడు, ఉపేంద్రబలుడు, నిష్ఠురకుడు అనే దాక్షిణాత్య మంత్రికుమారులు శ్రీదత్తునికి స్నేహితులయినారు. ఒకనాడు మిత్రులతో కలిసి రాజకుమారుడు విక్రమశక్తివెంట శ్రీదత్తుడు గంగాతీరానికి వెళ్ళినాడు. పరివారము విక్రమశక్తిని రాజును చేసి ఆటలాడుతూ ఉంటే, మిత్రులు శ్రీదత్తుని ప్రభువునుచేసి వినోదముగా కాలక్షేపము చేసినారు. దానిమీద విక్రమశక్తి రోషముతో శ్రీదత్తుని మల్లయుద్ధానికి పిలిచినాడు. పోరాటములో ఓడిపోయి రాజకుమారుడు శ్రీదత్తుని నెమ్మదిగా కడ తేర్చ తలచెను

కొన్నారు. బుద్ధిశాలులైన శ్రీదత్తుడు అతని అభిప్రాయమును గ్రహించి మిత్రులతోసహా అన్యప్రదేశానికి వెళ్ళుతూ ఉంటే, గంగాప్రవాహములో మునుగుతూ తేలుతూఉన్న సుందరాంగి కనబడ్డది.

మిత్రులను సమీపమున ఉండమని చెప్పి అతడు జలప్రవాహములోకి దూకినాడు. ఆ యువతీరత్నము కొలవెంట్రుకలు మాత్రము అతని చేతికి చిక్కినవి. ఆమె నీళ్ళలోకి మునిగిపోతే అతడుకూడా మునిగినాడు. ఇంతలో అక్కడ స్ఫటిక శిలానిర్మితమైన శివాలయము గోచరించింది. గంగానది గాని ఆకాశముగాని మళ్ళీ కనబడలేదు. అతడు చాలా ఆశ్చర్యపడి అక్కడ మనుష్యులు ఎవరైనా ఉన్నారేమో అని వెతికితే ఎవరూలేరు. అంతట ఆలయానికి ప్రదక్షిణము చేసి పరమేశ్వరునికి భక్తితో మొక్కి, అలసటచెంది ఉండడముచేత ఆరాత్రి అక్కడ సుందరోద్యాన భాగములో విశ్రమించినాడు.

## శ్రీదత్తుడు విద్యుత్ప్రభను వీక్షించుట

ప్రాతఃకాలానికి ఆ త్రిలోకసుందరి శివాలయానికి వచ్చి అర్ధేందు శేఖరుని అర్చించి తిరిగిపోతుంటే శ్రీదత్తుడు ఆమె ననుసరించి ఆమె మందిరములోకి ధైర్యము చేసి వెళ్ళినాడు. ఆమె అతన్ని చూచి ఉలికిపడి ఏమీమాటాడకుండా సౌధాంతర్భాగములోపలికి పోయి స్త్రీ పరివారము తన చుట్టూ చేరగా పర్యంకముమీద కూర్చున్నది. శ్రీదత్తుడు సంశయించకుండా పోయి ఆమె పక్కన కూర్చున్నాడు. హఠాత్తుగా ఆమె బావురు మని యేడవ సాగింది. చెలికత్తెలు ఆమెను ఊరడించారు. శ్రీదత్తుడు జాలిపడి "యువతీ, ఎవరు నీవు? సమస్త సంపదలతో నిండి మహాద్భుతమైన యీసౌధములో చెలికత్తెలతో వినోదిస్తూ ఉండక ఎందు కిలా రోదనము చేస్తావు? నీదుఃఖకారణ మేమిటి? నాతో చెపితే నేను విచారణ చేస్తాను." అని ధైర్యము

చెప్పినాడు. కొంత సేపటికి ఆమె ఊరడిల్లి ఇలా చెప్పింది: "ఆర్యా, మే మందరము బలిచక్రవర్తి మనుమరాండ్రము. వీళ్ళలోకి పెద్దదాన్ని. నన్ను విద్యుత్ప్రభ అంటారు. మహావిష్ణువు మాతాతగారిని శాశ్వతంగా పాతాళలోకాన బంధించినాడు. మాతండ్రి విష్ణువుతో యుద్ధములో మృతి చెందినాడని మమ్మల్ని విష్ణువు నగరములో నుంచి వెళ్ళగొట్టి మేము మళ్ళీ అక్కడికి వెళ్ళకుండా సింహాన్ని అక్కడ కాపలాపెట్టి నాడు. అప్పటినుంచీ ఆసింహము స్థిర నివాసము ఏర్పాటు చేసుకొన్నది. తర్వాత మేము మహావిష్ణువును ప్రార్థించాము. ఆయన మామీద దయదలచి ఈసింహము మొదల ఒకానొకయక్షుడు. కుబేరునిశాపము వల్ల ఈ ఆకారము ధరించినాడు. మానవు డెవడైనా వీనిని జయిస్తే శాపమోచనము అవుతుంది. అప్పుడు మీరు యథాప్రకారముగా నగరములోకి వెళ్ళి ఉండవచ్చును" అని అనుగ్రహించినారు. ఆర్యా, నీవు బాహుబల సంపన్నుడవు. మాయందు అనుగ్రహముంచి సింహాన్ని నీవు జయించాలి. ఈపని నీవల్ల కావాలి. ఇతరులవల్ల కావడము వట్టిది ! ఈ ఉద్దేశముతోనే నిన్ను ఇక్కడికి ఆకర్షించి తీసుకువచ్చాను. ఈ సింహాన్ని ఓడిస్తే నీకు మృగాంకమనే ఖడ్గము లభిస్తుంది. ఆ దివ్య ఖడ్గప్రభావమువల్ల నీకు జయము కలుగుతుంది. నీవు రాజు వవుతావు"

ఈమాటలువిని సరే అని శ్రీదత్తుడు ఆనాడు అక్కడే గడిపి మర్నాడు దైత్యకన్యలను వెంటబెట్టుకొని ఆనగరానికి వెళ్ళినాడు. సింహము అతన్ని చూచి ఒక్కగంతులో మీదికి దూకింది. శ్రీదత్తుడు ఏమీ జంకక భుజబలముతో సింహాన్ని పడగొట్టినాడు. శాపాంతము కావడముచేత సింహము పురుషాకారము ధరించి అతన్ని స్తుతించి మృగాంక మనే పేరు గల తన చేతికత్తిని అతనికిచ్చి అంతర్ధాన మయింది. తర్వాత అందరూ పట్నములో ప్రవేశించారు. తనకు మహోపకారము చేసిన ఆవీరునకు విద్యుత్ప్రభ విషాన్ని హరించే ఉంగరము సంతోషపూర్వకముగా ఇచ్చింది.

శ్రీదత్తుడు కొన్ని రోజులు అక్కడున్నాడు. విద్యుత్ప్రభమీద అతనికి అనురాగము కలిగింది. ఆమె గ్రహించి అతనితో "ఆ సరస్సులో స్నానము చేసి రా. అందులో మొసళ్ళు ఉండాలి. కాబట్టి నీఖడ్గము చేతిలోనుంచి విడిచిపెట్ట వద్దుసుమా!" అని చెప్పింది. చెప్పిన ప్రకారము శ్రీదత్తుడు నీటిలో మునిగి లేచేసరికి వెనక తాను గంగానదిలో దిగినచోట ఉన్నాడు. నాలుగుదిక్కులా చూచి ఆశ్చర్యపడి, చేతి ఉంగరమునూ కత్తినీ గమనించి దైత్యకన్యక మోసము చేసిం దనుకొని మిత్రులను వెతుకుతూ స్వగృహాభిముఖుడయినాడు. తోవలో నిష్ఠురకుడు కనబడి నమస్కరించి, "నీవు మునిగినతర్వాత నీకోసము చాలా రోజులు వెతికినాము. దుఃఖాతిశయంచేత మే మంతా చచ్చిపోదామని యత్నిస్తుంటే ఆకాశవాణి "నాయనలారా, సాహసించకండి. శ్రీదత్తుడు సుఖంగా తిరిగి వస్తాడు" అన్నది. తర్వాత మేము నీతల్లిదండ్రులను చూడడానికి పోతుంటే, పూర్వపరిచితుడు ఒకడు కనబడి "మీరు నగరములోకి వెళ్ళకండి. వల్లభశక్తి చనిపోయినాడు. మంత్రులు విక్రమశక్తిని రాజును చేశారు. నిన్ననే విక్రమశక్తి కాలనేమియింటికి వెళ్ళి 'శ్రీదత్తుడు ఎక్కడున్నాడు.' అని అడిగితే ఆయన తనకు తెలియదన్నాడు. మండిపడి రాజు ఆయనను కొరతవేయించి చంపినాడు. ఆయన భార్య గుండె పగిలి చనిపోయింది. మహాదుర్మార్గుడైన విక్రమశక్తి శ్రీదత్తుని కడతేర్చాలని వెతికిస్తున్నాడు. మీరు దేశాంతరము వెళ్ళడం మంచిది" అని చెప్పినాడు. సునమిత్రులు బాహుశాలి ప్రభృతులు చాలా దుఃఖించి, బాగా ఆలోచించి నీకోసము నన్ను ఇక్కడ రహస్యముగా ఉంచి స్వస్థానమయిన ఉజ్జయినికి వెళ్ళినారు. కాబట్టి మనముకూడా అక్కడికే పోదాము. ఇక్కడఉంటే అపాయము, విధి ఇలా ఉన్నది."

## రాక్షసీ శాపమోచనము

నిష్ఠురకునివల్ల ఈసంగతులు విని అతను శ్రీదత్తుడు దుర్గతికి విచారపడి పగతీర్చుకోడానికి మాటిమాటికీ కత్తి తీసి చూశాడు కాని మంచి తరుణము కాదని ఆగి, నిష్ఠురకునితో కలిసి స్నేహితులను చూడడానికి ఉజ్జయినికి ప్రయాణ మయినాడు. తాను గంగానదిలో మునిగినది మొదలు సరస్సులో స్నానము చేసిన వరకూ విశేషా లన్నీ నిష్ఠురకునికి చెపుతూ వెళుతూ ఉండగా మార్గములో రోదనము చేస్తూన్న స్త్రీ కనపడ్డది "ఎందుకు ఏడుస్తూన్నావు" అని అతను అడిగితే "మాళవదేశానికి వెళుతూ తోవ తప్పిపోయినాను" అని ఆమె చెప్పింది. దయతలచి ఆమెను వెంట రమ్మన్నాడు. ఆస్త్రీ ఎక్కువదూరం నడవలేదని జాలిచేత దగ్గరలో పాడుపడ్డ పట్నములో రాత్రి బసచేసినాడు. అతనికి ఒకరాత్రివేళ మెళుకువ వచ్చి చూచేటప్పటికి ఆస్త్రీ నిష్ఠురకుని చంపి మాంసము తింటున్నది! అతడు ఖడ్గము ధరించి లేచినాడు. ఆమె భయంకర మైన రాక్షసిరూపము ధరించింది. అతడు దానిజుట్టు పట్టుకొని తల నరకడానికి కిందికి వంచినాడు. వెంటనే ఆమె దివ్య వనితగా మారిపోయి అతనితో ఇలా అన్నది "మహానుభావా, నన్ను సంహరించవద్దు; విడిచిపెట్టు; నేను రాక్షసినికాను; కౌశికుని శాపమువల్ల ఇలా అయినాను. కుబేరపదవిని కాంక్షించి కౌశికుడు పూర్వము తపస్సు చేస్తూఉంటే తపోభంగము చెయ్యవలసిందని కుబేరుడు నన్ను నియమించినాడు. చక్కదనముచేత ఆఋషిని ప్రలోభపెట్టలేకసిగ్గుపడ్డాను. పోనీ భయపెట్టి చూతామని భీకరాకారము ధరించినాను. కౌశికుడుకోపించి "దౌర్భాగ్యురాలా, రాక్షసివై మనుష్యులను భక్షిస్తూ ఉండు" అని శాపముపెట్టి నీవు నాసిగపట్టి లాగగానే శాపాంతమని అనుగ్రహించినాడు. బహుకాలమునుంచి ఇక్కడివాళ్లను చంపి తిని నగరము నాశనము చేశాను. నీవల్లనాకు శాపవిమోచనమయింది; నీవేదైనా వరమడిగితే ఇస్తాను"

ఈమాటలకు శ్రీదత్తుడు సంతోషించి నాకు వేరేవరమెందుకు ? ఈ మిత్రుని బ్రతికించు" అన్నాడు. ఆమె సరేఅని వరమిచ్చి అంతర్ధానమయినది. చెక్కు చెదరని శరీరముతో నిష్ఠురకుడు లేచినాడు. శ్రీదత్తుని సంతోషాశ్చర్యాలకు మేరలేదు. మర్నాడు ఉదయము ఉభయులు బయలుదేరి క్రమముగా ఉజ్జయిని చేరినారు. వీరిని చూచి తక్కినమిత్రులంతా ఆనందించారు. శ్రీదత్తుడు వారికి తనవృత్తాంత మంతా చెప్పి బాహుశాలి అనే మిత్రుని గృహములో బసచేసినాడు. ఇతనికి బాహుశాలి జననీ జనకులు సాదరముగా ఉపచర్యలు చేస్తూ ఉండగా స్వగృహములో ఉన్నట్టు సుఖముగా ఉంటున్నాడు.

## శ్రీదత్తుడు మృగాంకవతిని హరించుట

వసంతోత్సవము ప్రారంభ మయినది. ఒకనాడు శ్రీ దత్తుడు మిత్రులతో పుష్పోద్యానములో వేడుక చూడడానికి వెళ్ళినాడు. అక్కడ బింబకి అనే రాజుకూతురు మృగాంకవతిని చూచినాడు. దర్శనమాత్రములోనే శ్రీదత్తుని వికసితనేత్రాలవెంట మార్గము చేసుకొన్నదా అన్నట్టు మృగాంకవతి అతనిహృదయములోకి ప్రవేశించింది. ప్రథమప్రణయాన్ని సూచిస్తూ ఆమెచూపులు దూతికలవలె అతనివైపు రాకపోకలు మొదలు పెట్టినవి. రాజపుత్రి కనబడకుండా వెళ్ళేసరికి శ్రీ దత్తునికి దిగ్భ్రమ పుట్టింది. బాహుశాలి అతనిసంగతి కనిపెట్టి "వయస్యా, రహస్యమెందుకు ? నాకు తెలుసులే. రాజపుత్రిక వెళ్ళినవైపే వెళదాము. పద" అని ఆమె ఉన్నచోటికి అతనిని తీసుకుపోయినాడు. ఇంతలోనే "అయ్యో, రాజకుమారిని పాము కరిచింది" అని కేకలు వినబడ్డవి. బాహుశాలి వెళ్ళి కంచుకిని చూచి, "నామిత్రునివద్ద విషము హరించే ఉంగరమున్నది. అతనికి మంత్రముకూడా వచ్చును" అన్నాడు. తత్క్షణము కంచుకి వెళ్ళి శ్రీ దత్తునిపాదాలకు మ్రొక్కి, రాజపుత్రిదగ్గిర

అతనిని తీసుకుపోయినాడు. శ్రీదత్తుడు ఆమె వేలికి అంగుళీయకము తొడిగి మంత్రము జపించినాడు. ఆమె బ్రతికి లేచి కూర్చున్నది. అందరూ ఆనందించి అతనిని పొగడుతూ ఉండగా రాజు బింబకి అక్కడికి వచ్చినాడు. తర్వాత శ్రీదత్తుడు బాహుశాలియింటికి వెళ్ళినాడు. రాజపుత్రిక వేలినుంచి ఉంగరము తీసుకోలేదు. ప్రభువు పంపిన బహుమానము శ్రీదత్తుడు బాహుశాలితండ్రికే సమర్పించినాడు.

నిరంతరము రాజపుత్రికను స్మరిస్తూ శ్రీదత్తుడు పడుతున్న బాధకు స్నేహితులు ఏమీ చెయ్యలేక చింతిస్తున్నారు. రాజకుమారికి సఖి అయిన భావనిక ఉంగరము తిరిగి ఇచ్చివేసే మిషతో శ్రీదత్తుని నివాసానికి వెళ్ళి, "సుందరమూర్తీ, నావయస్య ఎటువంటి అవస్థలో ఉన్నదో తెలుసునా? ఒకసారి ప్రాణ మిచ్చిననీవు పతివి కాకపోతే ఆమె ప్రాణాలు ఇకముందు నిలవవు" అని విన్నవించింది. శ్రీదత్తుడు, బాహుశాలి, భావనిక, తక్కినమిత్రులూ రహస్యాలోచన చేసి, మృగాంకవతిని ఆ నగరమునుంచి గూఢముగా మధురాపురికి తీసుకుపోయి అందరూ అక్కడే నివసించేలాగున నిర్ధారణ చేసి ఏర్పాట్లుకూడా చేసుకొన్నారు. భావనిక మృగాంకవతి సన్నిధికి వెళ్ళింది.

వర్తకానికి వెళ్ళుతున్నట్టు పన్నాగము పన్ని బాహుశాలి మర్నాడు ముగ్గురుస్నేహితులతో మధురాపురికి బయలుదేరినాడు. రాజకుమారి వేగముగా పలాయనము చేయడానికి పనికివచ్చే అంచెగుర్రాలను మార్గములో ఉంచినాడు. ఒకానొకస్త్రీకి, దానికొమార్తెకు బాగామద్యము పోయించి రాజపుత్రికగదిలో వాళ్ళు పడుకొనే ఏర్పాటు చేయించినాడు. అర్ధరాత్రివేళ మృగాంకవతిని రాజభవనములోనుంచి యువతలకు పంపించి ఇంటికినిప్పుపెట్టి, కనిపెట్టుకొని ఉన్న శ్రీదత్తుని కలుసుకొన్నది. అతడు ఇద్దరుమిత్రులను తోడిచ్చి, రాజపుత్రిని భావనికను ముందువెళ్ళిన బాహుశాలివద్దకు పంపించినాడు. రాజగృహములో దగ్ధమైన స్త్రీని,

దానిబిడ్డను చూచి రాజపుత్రిక భావనిక, ననిపోయినా రనుకొన్నారు లోకులు. మరునటి ఉదయము శ్రీదత్తుడు యథాప్రకారముగా పట్నములో అందరికీ కనబడి, రెండవరాత్రి మృగాంకఖడ్గమును ధరించి మృగాంకవతిని కలుసుకోడానికి ప్రయాణమయి చాలాదూరము వెళ్ళి పొద్దెక్కేటప్పటికి వింధ్యారణ్యములో ప్రవేశించినాడు.

అక్కడ అతనికి అన్నీ అపశకునాలే. కొంతదూరము వెళ్ళేసరికి అతనికి మిత్రులు, భావనిక కనిపించారు. దెబ్బలు తిని సడలిపోయి ఉన్న స్నేహితుల అవస్థకు శ్రీదత్తుడు విచారపడ్డాడు. వారు అతనితో "మిత్రమా, మమ్మలిని గుర్రపుదండు కొట్టిదోచుకొన్నది. మేము ఈ స్థితిలో ఉండగా ఎవరో కొందరు రాజకన్యను అశ్వముమీద ఎక్కించుకుని పోయినారు. నీవు దక్షిణముగా వెళ్ళు. ఇక్కడ ఉండనక్కరలేదు. మృగాంకవతిసంగతి ముఖ్యము" అని అతన్ని సాగనంపినారు. శ్రీదత్తుడు తీరుగా వెనకకు తిరిగి వయస్యులను చూచి చివరకు ఆ గుర్రపు దండును త్వరలోనే కలుసుకొన్నాడు. వారినడుమ మృగాంకవతిని తీసుకుపోతున్న రాజపుత్రుని సమీపించి సామ వాక్యాలతో ఆమెను తనకు సమర్పించమన్నాడు. అతడు అంగీకరించలేదు. శ్రీదత్తుడు అతన్ని కాలితో తన్ని గుర్రముమీదినుంచి కిందికి లాగి శిలాఖండముమీద వేసి చితకగొట్టి అతని అశ్వాన్నే ఆరోహించినాడు. తనమీదికి వచ్చిన రౌతులను హతము చేసినాడు. శేషించినవారు అతనిపరాక్రమానికి భయపడి పలాయనము చేశారు.

తర్వాత శ్రీదత్తుడు మృగాంకవతితోసహా స్నేహితులదగ్గిరికి బయలుదేరి కొంతదూరము వెళ్ళినాడు. మార్గములో అశ్వము అలసిపోవడము గ్రహించి ప్రియురాలితోకూడా క్రిందికిదిగినాడు. యుద్ధములో గాయములు తగిలిన ఆగుర్రము భూమిమీదపడి ప్రాణాలువిడిచింది. మృగాంకవతికి నోరెండి దాహమయింది. ఆమె నక్కడ ఉంచి అతడు మంచి

నీరు తేవడానికి బయలుదేరి వెతుకుకుంటూ వెళ్ళినాడు. ఇంతలో సూర్యుడు అస్తమించినాడు. చివరకు అతనికి నీళ్లు దొరికినవి. కాని శ్రీదత్తుడు చీకటిలో తోవతప్పి, తెల్లవార్లూ విలపిస్తూ తిరిగినాడు. ప్రాతఃకాలము అయ్యేసరికి వెనుకటిరోజు మృతాశ్వము పడినచోటికి వచ్చినాడు. రాజకుమారి కనబడలేదు. ఆమె కనిపిస్తుందేమో అని పెద్ద చెట్టు ఎక్కినాడు. ఆమార్గమున వెళ్ళుతున్న శబరనాయకుడు మృతాశ్వమూలమున పెట్టి ఉన్న ఖడ్గమును చూచి వెంటనే తీసుకున్నాడు. శ్రీదత్తుడు వృక్షారోహణము చేసేటప్పుడు మృగాంకమును చెట్టుకు ఆనించినాడు. అతన్ని చూచి శ్రీదత్తుడు చెట్టుదిగి వినయముతో ప్రియురాలి విషయమై వానిని అడిగినాడు. “మాపల్లెకు వెళ్ళు; దగ్గరలోనే ఉన్నది. అక్కడ నీభార్య ఉంది. నేనుకూడా త్వరలోనే వచ్చి నీకత్తి యిచ్చేస్తా.” అని శబరనాయకుడు చెప్పినాడు. కాంతాసందర్శనకుతూహలముతో శ్రీదత్తుడు శబరనాయకుని పరివారముతో ఆ పల్లెకు వెళ్ళినాడు. విశ్రాంతి తీసుకోమని వాళ్లు అన్నారు. అతడు నాయకునియింట్లో పడుకొని అలసటవల్ల నిద్రపోయినాడు. మెళుకువవచ్చి చూచుకొనేసరికి కాళ్ళకు సంకెళ్లు వేసి ఉన్నవి! అతడు దైవగతికి ఆశ్చర్యపడుతూ, ప్రియురాలిని తలుచుకుంటూ అక్కడే కాలము గడుపుతున్నాడు.

## శ్రీదత్తుడు శబరకన్యను పెండ్లియాడుట

మోచనిక అనే చేటిక ఒకనాడు అతనిదగ్గిరికి వచ్చి “మహాభాగా, ఎందుకు ఇక్కడికి వచ్చావు? నీకు మరణము నిశ్చయము! శబరనాయకుడు ఏదోపనిమీద గ్రామాంతరము వెళ్ళాడు. రాగానే నిన్ను అమ్మవారికి బలి యిస్తాడు. అందుకోసమే వింధ్యారణ్యమునుంచి నిన్ను ఈ పల్లెకు తీసుకువచ్చి చెరలో పెట్టినాడు. నీకు మంచిబట్టలు యిచ్చి బాగా భోజనము పెట్టి ఉపచారాలు చేయించడం ఎందుకో తెలుసునా? అమ్మ

వారికి బల యిస్వాడానికే. తప్పించుకొనేపని నంటే ఒకటే ఉపాయ ముంది. నీవు ఒప్పుకుంటే చెబుతాను. నాయకుడికి సుందరి అనే కూతు రున్నది. ఆమె నిన్ను చూచినప్పటినుంచీ వలపు తలకెక్కి బాధపడు చున్నది. ఆమెను చేపట్టితే నీకు శుభము'' అని చెప్పినది. శ్రీదత్తుడు అంగీకరించి గాంధర్వవిధిని సుందరిని పెండ్లాడినాడు. సుందరి ప్రతిరాత్రి వచ్చి అతని సంకెళ్లు తొలగించి సుఖముగా కాలము గడపి వెళ్లుతూ ఉన్నది. త్వరలోనే ఆమె గర్భవతి అయినది.

మోచనికవల్ల ఈ విషయ మంతా విని సుందరితల్లి రహస్యముగా శ్రీదత్తుని దగ్గిరికి వెళ్ళి అల్లుడనే అనురాగముతో, "నాయనా! సుందరి తండ్రి మహాకోపి. శ్రీచండు డనే పేరు ఊరికే పెట్టిందికాదు—సార్థకము! నీవు ఇక్కడినుంచి పారిపో. దొరికితే క్షమించడు. మా సుందరిని మాత్రము మరిచిపోవద్దు'' అని వేడుకొని సంకెళ్లు తీసివేసింది.

## మృగాంకవతీ సమాగమము

ఆమెతండ్రి తెచ్చిన ఖడ్గము తనదని శ్రీదత్తుడు సుందరితో చెప్పి బయలుదేరి మృగాంకవతిని వెదకడానికి వింధ్యాటవిలో వెనుకటి ప్రదే శానికే వెళ్ళినాడు. ఆప్రాంతాన బోయవాడు ఎదురుపడితే తన కాంత సంగతి వానిని అడిగినాడు. "నీవు శ్రీదత్తుడువా'' అన్నాడు బోయవాడు. "అవును. ఆని ర్భాగ్యుడను నేనే''అని శ్రీదత్తుడు నిట్టూర్పువిడిచినాడు. అత నితో బోయ"అయ్యా, నీప్రియురాలు నీకోసముఅన్ని దిక్కులా వెదుకుతూ ఏడుస్తుంటె నేను చూచి జాలిపడి మాపల్లెకు ఆమెను తీసుకుపోయినాను. అక్కడి కోడెగాండ్లవల్లఆమెకు భయముపుట్టింది. ఆమె దిగులు పడుతూ ఉంటే మథురాపురి దగ్గర నాగస్థలము అనేగ్రామములో విశ్వదత్తు డనే ముసలి బాపనఅయనగారి యింట్లో గౌరవంగా ఆమెను ఇల్లడ పెట్టాను. ఆమెవల్ల నీ పేరు తెలుసుకొని నీకోసం ఇక్కడికివచ్చాను. నీవు

శీఘ్రముగా నాగస్థలానికి వెళ్ళు. ఆమెను అక్కడ చూస్తావు" అని చెప్పినాడు. తక్షణమే శ్రీదత్తుడు బయలుదేరి ఆరాత్రికే నాగస్థలము చేరుకొని వెతుక్కొని విశ్వదత్తుని యింటికి వెళ్ళి "ఆర్యా, బోయ మీవద్దఉంచిన నాభార్యను నాకివ్వండి" అని వేడినాడు. బ్రాహ్మణుడు అతనితో "ఆర్యా, మధురాపురిలో నామిత్రుడు చాలా యోగ్యుడు అయిన విప్రుడున్నాడు. ఆయన శూరసేన మహారాజుకు ఉపాధ్యాయుడు, అమాత్యుడూ. నీకాంతను ఆయనకు అప్పగించాను. ఇది కుగ్రామము. ఆమెనుసంరక్షించడము చాలాకష్టమని ఇలాచేశాను. నీవు నేటికి ఇక్కడ విశ్రాంతి తీసుకొని రేపు ఆమె దగ్గరకు వెళ్ళు" అని చెప్పినాడు.

శ్రీ దత్తుడు రాత్రి అక్కడే విశ్రమించి మర్నాడు ప్రాతఃకాలము బయలుదేరి మర్నాడు మధురాపురి చేరుకున్నాడు. గ్రామకంఠములో మంచిదిగుడు బావి కనపడ్డది. ఒంటిమీది ధూళి, ప్రయాణపుబడలిక పోవడానికి అందులో స్నానము చేసినాడు. అక్కడ చక్కని వస్త్రము పడియున్నది. దాన్ని తీసుకొని ప్రియకాంతను దర్శించవలె ననే తహ తహలో పట్నములో ప్రవేశించినాడు. రాజపురుషులు ఆవస్త్రాన్ని గుర్తుపట్టి, కొంగున ముడిచిఉన్న హారమును కూడా గుర్తించి చోరుడని శ్రీ దత్తుని కొత్వాలు సన్నిధికి కొనిపోయినారు. ఎవరో దొంగలు హారము ఆవస్త్రముచెంగున కట్టిపెట్టినట్టు అతనికి తెలియనే తెలియదు. కొత్వాలు శ్రీ దత్తుని నేరమును ప్రభువునకు విన్నవించినాడు. రాజు అత నికి ఉరిశిక్ష విధించినాడు. తలారులు తప్పెటలు వాయిస్తూ శ్రీ దత్తుని వధ్యభూమికి తీసుకొని పోతున్నారు. మంత్రిమందిరములో ఉన్న మృగాం కవతి మేడమీదినుంచి ఆ దృశ్యము చూచి తక్షణము మంత్రిసన్నిధికి వెళ్ళి "నాథర్తను ఉరి తియ్యడానికి వధ్యస్థానానికి తీసుకు వెళుతున్నారు" అని సంభ్రమముతో మొరపెట్టుకొన్నది. మంత్రి తలారులను ఆపి, ప్రభువు విన్నపము చేయించి ఉరిశిక్ష తప్పించి, శ్రీ దత్తుని స్వగృహానికి

తెప్పించినాడు. శ్రీ దత్తుడు అతనిని ఆనవాలు పట్టి "ఏమిది ఆశ్చర్యము! వెనుక దేశాంతరము వెళ్ళిన నా పినతండ్రి శివానుగ్రహమువల్ల ఇక్కడ అమాత్యుడయినాడు" అనుకొని ఆయనపాదములమీద వాలినాడు. ఆయన విగతభయుడు; అన్నకుమారుని ఆనవాలు పట్టి పాదాలమీద నుంచి లేవనెత్తి, ఆనందముతో ఆలింగనము చేసుకొని యావద్వృత్తాంతమూ చెప్పమని అడిగినాడు. తనతండ్రి వధవిశేషాలు మొదలు కొని తాను అక్కడికి వచ్చినసంగతివరకూ శ్రీ దత్తుడు విగతభయునికి విన్నవించినాడు. ఆయన రహస్యముగా అతనితో "నాయనా, నాకు ఒకానొక యక్షిణి స్వాధీన మయినది. ఆమె నాకు అయిదువేల గుర్రాలను, అయిదుకోట్ల వరహాలను అనుగ్రహించింది. నాకు బిడ్డలు లేరు. అవన్నీ నీవే" అని చెప్పి, మృగాంకవతిని అతనికి అప్పగించినాడు. ఆ సంపదలనుస్వీకరించి, మృగాంకవతిని పెండ్లాడి, అక్కడే సుఖముగా నివాసము చేస్తున్నాడు. అయితే బాహుశాలి మొదలయిన మిత్రులసంగతి మాత్రము మధ్యమధ్య మనస్సును బాధిస్తున్నది.

## శ్రీ దత్తుడు శూరసేన రాజకుమారిని వివాహమాడుట

విగతభయుడు ఒకనాడు శ్రీ దత్తునితో రహస్యముగా "నాయనా, ఈ శూరసేన మహారాజుకు కొమార్తె ఉన్నది. ఆమె కింకా వివాహము కాలేదు. ఆయన ఆజ్ఞాప్రకారమే ఆచిన్నదానిని నేను అవంతి దేశానికి తీసుకు వెళ్ళాలి. ఉపాయము చేసి ఆమెను నీకు అప్పగిస్తాను. ఆమెకు తోడు వచ్చేసేన, నాసేన కలిస్తే, శ్రీదేవి చెప్పినట్టు నీకు త్వరలో రాజ్యము లభిస్తుంది." అని బోధించినాడు. తర్వాత రాజకుమారిని తీసుకొని విగతభయుడు, శ్రీ దత్తుడు భార్యలతోను, భటులతోను బయలు దేరి వింధ్యాటవి చేరినారు. హఠాత్తుగ దొంగలగుంపు వారిమీద వడి రాళ్ళవాన కురిపించింది. శ్రీ దత్తుని దండుకు చాలాదెబ్బలు తగిలినవి.

అతడు మూర్ఛపోయినాడు. దొంగలు యీవత్తూ దోచుకొని అతన్ని కట్టివేసి పల్లెకు తీసుకుపోయి, ఘంటానాదాలతో భీకరముగా ఉన్న చండికాలయములో ఉంచారు. అప్పువారి దర్శనము చేతా మని చిన్నికుమారునితో సుందరి అక్కడికి వచ్చింది. భర్త అయిన శ్రీదత్తుని చూచి చోరులను అవతలికి పంపి, ఆనందముతో అతన్ని తనయింటికి తీసుకుపోయింది. కుమారులు లేని శ్రీ చండుడు మరణకాలములో తనపల్లెరాజ్యము కుమార్తె సుందరికి ఇచ్చివేసినాడు. అందుచేత శ్రీదత్తుడు దానికి దొర అయినాడు. వెంటనే పినతండ్రి మొదలయిన వారిని విడిపించినాడు. అదివరలో పోయినధనాదులు, మృగాంకఖడ్గము మళ్ళీ అతనికి స్వాధీన మయినవి. శూరసేన ప్రభువు పుత్రికను అక్కడే వివాహమాడి రాజ్యము చేయడము ప్రారంభించినాడు.

అనంతరము శ్రీదత్తుడు బింబకి మహారాజుకు శూరసేనమహారాజుకు దూతలద్వారా వర్తమానము పంపినాడు. వారు చాలా సంతోషించి పుత్రికలమీది అనురాగముచేత సైన్యసమేతముగా అక్కడికి వచ్చినారు. బాహుశాలి ప్రభృతులుకూడా ఆరోగ్యము పొంది అతనిసన్నిధికి చేరుకొన్నారు. శ్రీదత్తుడు మామలతోసహా తనతండ్రిని సంహరించిన విక్రమశక్తిమీదికి దండయాత్ర చేసి అతనిని తపస్సుకోభాగ్యానికి ఆహుతి చేసి వేసినాడు. మహాప్రభువై మృగాంకవతితో భోగములు అనుభవించినాడు.

దేవా, ధీరులయినవారు ఈవిధముగా వియోగ సముద్రాన్ని తరించి సౌభాగ్యము పొందుతారు.

## సహస్రానీకుడు మృగావతిని కలుసుకొనుట

సంగతకుడు చెప్పినకథవిని సహస్రానీకుడు ప్రియురాలికోసము కలలు కంటూ రాత్రి ఎలాగో వెళ్ళబుచ్చినాడు. ఉదయముకాగానే బయలు

దేరి జమదగ్ని ఆశ్రమానికి వెళ్ళి మునీశ్వరునికి ప్రణామము చేసినాడు. రాజుకు అతిథి సత్కారాలు చేసి ముని మృగావతిని, కుమారుని అప్పగించినాడు. శాపము తీరినతర్వాత పరస్పరవిలోకనము చేసిన ఆదంపతుల నేత్రాలలో బాష్పాలు అమృతబిందువులలాగ చిందినవి. ప్రథమ పర్యాయము చూచినపుత్రుని సహస్రానీకుడు తనివితీర [illegible] డగా కౌగలించుకొన్నాడు.

తర్వాత రాజు జమదగ్ని సెలవుపొంది భార్యాపుత్రులతో బయలుదేరినాడు. తపోవనములో లేళ్ళుసహితము కన్నీళ్ళతో [illegible] వరకు వెంబడించినవి. భార్యావృత్తాంతాలు వింటూ, తనవృత్తాంతము ఆమెకు చెపుతూ సహస్రానీకుడు నిజరాజధాని చేరినాడు. కౌశాంబీ నగరము తోరణాలతో, జెండాలతో అలంకరించి, నగరవాసులు ప్రభు కుటుంబాన్ని పరమాహ్లాదముతో వీక్షించినారు. వెంటనే రాజు ఉదయునునకు యౌవరాజ్యాభిషేకము చేసి వసంతక రుమణ్వంతులనూ యౌగంధరాయణునీ కుమారునికి అమాత్యులుగా అప్పగించినాడు. "ఈ అమాత్యులవల్ల ఇతడు సార్వభౌముడు అవుతాడు" అని ఆకాశయాన అశరీరవాణి వినబడ్డది. పుష్పవర్షము కురిసింది. కుమారుని యువరాజును చేసి మహారాజు రాజ్యభారము తగ్గించుకొని భార్యతో శాంతముగా కాలక్షేపము చేస్తున్నాడు.

ఇలా కొంతకాలము గడవగా మహారాజుకు వార్ధకము వచ్చింది. ఉదయనుని మహారాజునుచేసి సాహస్రానీకుడు భార్యతోను, మంత్రులతోను హిమవత్పర్వతానికి బయలుదేరి పోయినాడు.

## తరంగము : ౧౧

కౌశాంబీనగరము రాజధానిగా ఉదయనుడు వత్సదేశాన్ని పరిపాలిస్తున్నాడు. కొన్నాళ్లకు రాజ్యభారము యౌగంధరాయణునకు కొంత

## చండమహాసేనుని ప్రభావము

అప్పుడు యౌగంధరాయణుడు ఇలా చెప్పినాడు. "దేవా, ఇది అసాధ్యము. పైగా అనుచితము. ఆయన మహాప్రభావ సంపన్నుడు. ఆయన చరిత్ర వినండి. ఉజ్జయినిలో మహేశ్వరుడు మహాకాళస్వామి అనే పేరుతో వెలసినాడు. పూర్వము మహేంద్రవర్మ అనే రాజు అక్కడ పరిపాలన చేస్తూ ఉండేవాడు. అతని పుత్రుడు జయసేనుడు. అతని కుమారుడు మహాసేనుడు. తనకు తగిన ఖడ్గము, కాంత కావలెనని మహాసేనుడు చండికాదేవి ఆలయానికి వెళ్ళి నిరాహారదీక్ష పూని బహుకాలము అమ్మవారిని ఆరాధించి చివరకు తనశరీరము కోసుకొని మాంసము హోమము చేసినాడు. అనుగ్రహము కలిగి అమ్మవారు ప్రత్యక్షమై "వత్సా, నీభక్తికి పరితుష్టి చెందినాను. ఇదుగో ఖడ్గము. దీని ప్రభావమువల్ల ఎవరూ నిన్ను జయించలేరు. మరొక విషయము. అంగారకాసురుని పుత్రిక అంగారవల్లరి అనే త్రిలోకసుందరి త్వరలోనే నీభార్య అవుతుంది. నీవు చండ (భయంకర) కర్మ చేయడముచేత నీకు చండమహాసేను డనే ఇకనుంచి వస్తుంది." అని సెల విచ్చి అమ్మవారు అంతర్ధాన మయింది. చండమహాసేనుడు సిద్ధసంకల్పుడై చాలా సంతుష్టచిత్తు డయినాడు.

అతనికి అమ్మవారిచ్చినఖడ్గము నడగిరి అనే మదపుటేనుగు మహేంద్రునికి వజ్రాయుధము ఐరావతమువలె ఉన్నవి. వాటి ప్రభావమువల్ల ఆయన సుఖముగా ఉంటున్నాడు. ఒకనాడు ఆయన మహాటవికి వేటకు వెళ్ళినాడు. ఒకచోట పర్వతాకారముగల అడవిపంది కనబడ్డది. రాజు ఆ మహావరాహముమీద బాణాలు ప్రయోగించినాడు. వాటిని లెక్కచెయ్యక వరాహము రథము విరగదన్ని పరుగెత్తిపోయింది. చండమహాసేనుడు ధనుస్సు మాత్రము పట్టుకొని దానివెంట బడినాడు.

పోయి పోయి వరాహము ఒకానొకగుహలో దూరింది. రాజు కూడా అందులో ప్రవేశించి చాలాదూరము వెళ్ళేసరికి చక్కని నగరము కన బడినది. గ్రామకంఠములో ఉన్న దిగుడుబావిఒడ్డున రాజు ఆశ్చర్యముతో కూర్చున్నాడు. వందమంది చెలికత్తెలతో కూడి ఒక కన్యక అక్కడికి వచ్చి అతనిని అనురాగదృష్టులతో చూచి మంద మందముగా సమీ పానికివచ్చి "సుందరమూర్తీ, ఎవరయ్యా మీరు? ఇక్కడికి ఎందుకు వచ్చారు." అని అడిగింది. రాజు నిజవృత్తాంతము చెప్పినాడు. ఆమె నేత్రాలనుంచి అశ్రుధారలు కురిసినవి. "సుందరీ, ఎవరు నీవు? ఎందుకు రోదనము చేయుచున్నావు?" అని రాజు ప్రశ్నించినాడు. అనురాగ ప్రేరణవల్ల ఆకన్య ఇలా చెప్పింది. "ఇందులోకి మిమ్మలిని ఆకర్షించుకు వచ్చిన వరాహము అంగారకుడనే రాక్షసుడు. ఆయన నాతండ్రి. నన్ను అంగారవతి అంటారు. మహాబలవంతుడైన నాతండ్రి రాజాంతఃపురా లలో నుంచి ఈవందమంది కన్యలను అపహరించుకువచ్చి నాకు చెలికత్తె లుగా ఏర్పాటు చేసినాడు. శాపమువల్ల ఈయన అసురుడయినాడు. ఆయాసముచేత ప్రస్తుతము విశ్రాంతి తీసుకుంటూ మిమ్మలిని సంహరించ కుండా విడిచిపెట్టినాడు. నిద్రలేచినతర్వాత మీకు అపాయము తల పెట్టి ఉంటాడు. రానున్న ఆపదకు నాకు దుఃఖము వచ్చి కన్నీరు కారుతున్నది."

ఆమాటలకు రాజు అంగారవతితో "నీకు నిజముగా నామీద ప్రేమ ఉంటే, నేను చెప్పినట్టు చెయ్యవలె. ఆయనకు మెలకువ రాగానే నీవు వెళ్లి ఆయనసమక్షములో పెద్దపెట్టున రోదనము చెయ్యి. ఎందుకు ఏడుస్తున్నావని అడిగితీరుతాడు. నాయనా, నిన్ను ఎవరైనా సంహ రిస్తే నాగతి ఏమవుతుందో అని దుఃఖిస్తున్నానని చెప్పు. అప్పుడు నీకూ నాకూ మేలు కలుగుతుంది" అని బోధించినాడు. ఆమె సమ్మ తించి రాజును రహస్యప్రదేశాన దాచిపెట్టి, తండ్రికి మెళుకువ వచ్చే

వరకూ ఎదురుచూచి ఆయన లేవగానే బావురు మని యేడ్చింది. "ఎందుకు తల్లీ, ఏడుస్తావు?" అన్నాడు అంగారకుడు. "నాయనా, నిన్ను ఎవరైనా చంపివేస్తే ఆతర్వాత నాస్థితి ఎలా ఉంటుందో అనే భీతిచేత దుఃఖము వచ్చింది" అన్నది అంగారవతి. ఆయన మందహాసము చేసి "తల్లీ, నన్ను సంహరించగలవాడెవడు? నాది వజ్రకాయము. ఎడమ చేతిలోమాత్రము చిన్న రంధ్ర మున్నది. అయితే ధనుస్సు దాన్ని కాపాడుతూ ఉంటుంది కదా" అని కుమారిని ఓదార్చినాడు. రాజు చాటునుంచి ఈమాటలు పొంచి విన్నాడు. తర్వాత అంగారకుడు స్నానముచేసి మౌనముతో శివపూజ ప్రారంభించినాడు. రాజు ధనుస్సులో బాణము సంధించి అతనియెదుటికి పోయి యుద్ధానికి రమ్మని ఆహ్వానించినాడు. కుడిచేతితో శివపూజ చేస్తూ ఉండడముచేతను మౌనము వహించి ఉండడముచేతను అంగారకుడు ఎడమచెయ్యి ఎత్తి కొంతసేపు ఆగు అన్నట్టు సంజ్ఞ చేసినాడు. సూటిగా ఎడమచేతి రంధ్ర ములోకి రాజు బాణము విడిచినాడు. అంగారకుడు పెద్దకేక వేసి నేల మీద పడి తన్నుకుంటూ, "చాలా దాహముగా ఉన్న నన్ను బాణ ముతో కొట్టినవాడు ప్రతిసంవత్సరమూ నాకు తర్పణము చెయ్యకపోతే అతని మంత్రులు ఐదుగురు చనిపోతారు!" అని అరిచి ప్రాణాలు విడిచినాడు.

చండమహాసేనుడు అంగారవతిని వెంటబెట్టుకొని ఉజ్జయిని నగరానికి వెళ్ళి మహావైభవముతో వివాహము చేసుకొన్నాడు. కాలక్రమేణ ఆదంపతులకు గోపాలకుడు, పాలకుడు అని ఇద్దరుపుత్రులు పుట్టినారు. రాజు ఇంద్రోత్సవము చేసినాడు. ఇంద్రుడు సంతుష్టుడై కలలో రాజుకు కనబడి "నాప్రసాదముచేత నీకు అద్వితీయసుందరి అయిన కుమారి కలుగుతుంది." అని అనుగ్రహించినాడు. ఆప్రకారముగానే మహా లావణ్యవతి పుట్టింది. ఆసమయములో ఆకాశవాణి ఈమెకు మన్మథుడు

కుమారుడై పుట్టి సకలవిద్యాధరులకు చక్రవర్తి అవుతా'' డని పలికింది. వాసవుని (ఇంద్రుని) అనుగ్రహమువల్ల జన్మించడముచేత ఆబిడ్డకు తండ్రి వాసవదత్త అని పేరు పెట్టినాడు. ఇప్పుడామెకు పెళ్ళియీడు వచ్చింది. చండమహాసేనుని చరిత్ర ఇటువంటిది. ఆయన దుర్గమప్రదేశములో ఉన్నాడు. జయించడము అసాధ్యము. నిజపుత్రికను మీకు ఈయదలచి ఉన్నాడు. సగౌరవముగా తనపక్షమును వృద్ధిచేసుకోగోరినాడు. మీరు వాసవదత్తను పెళ్లి ఆడడమే శుభదాయకము.

యౌగంధరాయణుడు చెప్పిన వాక్యాలకు వత్సరాజు మనస్సు వాసవదత్తమీదికి వెళ్ళింది.

## తరంగము : ౧౨

## యంత్రగజము

వత్సరాజు పంపినదూత వెళ్లి సందేశము చండమహాసేనునికి విన్నవించినాడు. ఆయన ఆలోచించి "వత్సరాజు చాలాఅభిమాని. మన దగ్గరకు రాడు. మనబిడ్డను అతని దగ్గరికి పంపడానికి వీలు లేదు; పంపితే మనప్రతిష్ఠతగ్గుతుంది. ఉపాయముచేత అతనిని పట్టి తీసుకురావలెను'' అని మంత్రులతో చెప్పి, పెద్ద మరయేనుగును (యంత్రగజేంద్రమును) చేయించి, వింధ్యారణ్యములో ఉంచి దాని కడుపులో భటులను దాగి ఉండ మని ఆజ్ఞాపించినాడు.

గూఢచారులు వెళ్ళి వత్సరాజుతో "దేవా, వింధ్యాటవిలో గొప్ప యేనుగు తిరుగుచున్నది. అటువంటిది ప్రపంచములో మరొకటి లేదు. వింధ్యపర్వతమే నడుస్తున్నట్టు కనబడ్డది.'' అని నివేదించారు. రాజు చాలా సంతోషించి వాళ్ళకు గొప్పబహుమాన మిచ్చి పంపి "దీన్ని బంధించి తెస్తినా ఇది నడగిరికి దీటు అవుతుంది. అప్పుడు

చండమహాసేనుడు వశుడై వాసవదత్తను నాకు సమర్పిస్తాడు." అని భావించి ఆరాత్రి ఎలాగో గడిపినాడు. మంత్రులమాట చెవిబెట్టక ఆ చారులనే ముందు ఉంచుకొని, జోతిష్కులు మొదట బంధనము, తర్వాత పత్నీలాభము ప్రయాణఫలా లని చెప్పినా లక్ష్యము చెయ్యక వత్సేశ్వరుడు వింధ్యాటవికి వెళ్ళినాడు. అడవియేనుగు బెదరకుండా ఉండడానికి తనసేనను ఒకచోట నిలిపి కొద్దిమంది చారులతో దానిని వెదకడానికి ప్రయాణ మయినాడు. సాయంకాలానికి ఏనుగు గుర్తులు దొరకినవి. దూరముగాఉన్న యేనుగును చారులు చూచి ప్రభువుకు చెప్పినారు. అతడు ఘోషవతిని తీసుకొని ఒంటిగా బయలుదేరి వీణ వాయిస్తూ మనోహరగానము చేస్తూ నెమ్మదిగా దాన్ని సమీపించినాడు. తనమనస్సు పాటలో లీనమై ఉండడముచేతను, సందెచీకటి వల్లను వత్సేశ్వరుడు మాయాగజమును నిజమైన ఏనుగుగా భ్రమపడ్డాడు. ఏనుగు సంగీతానికి సమాకృష్టమై చెవులు నిక్కబెట్టుకొని సమీపానికి వచ్చినట్టు వచ్చి అవతలికి వెళుతూ, మళ్ళీ దగ్గిరికి వస్తూ, రాజును ఇలా కొంతదూరము తీసుకుపోయింది. అప్పుడు యంత్రగజము కడుపులోనుంచి ఆయుధపాణులైన భటులు దూకి వత్సరాజును చుట్టుముట్టినారు. అతడు బాకు దూసి ఎదటివారితో యుద్ధము చేస్తూ ఉండగా వెనుకనుంచి కొందరుభటులు అతనిని పట్టుకొని చేతులు కట్టివేసి, సంజ్ఞ చేయగా వచ్చిన తక్కినసేనతో కలిసి చండమహాసేనుని సన్నిధికి తీసుకొని వెళ్ళినారు. ఆయన నగరము వెలుపలికి ఎదురు వచ్చి వత్సరాజును చాలా ఆదరించి ఉజ్జయినిలో ప్రవేశించినాడు. ప్రజలు వత్సేశ్వరుని చూచి తమప్రభువు ఆయనను సంహరిస్తాడేమో అని భయపడి, ఆయనసన్నిధికి పోయి "దేవా, వత్సరాజుకు అపాయము కలిగితే మేము జీవించము" అని విన్నవించుకొన్నారు. అందుకు ప్రభువు "వత్సేశ్వరుడు హంతవ్యుడు కాడు. మాకు మిత్రకోటిలోవాడు" అని వారి ఆందోళన

పోగొట్టినాడు. తర్వాత వాసవదత్తను రప్పించి, వత్సరాజుకు అప్ప గించి, "రాజన్, ఈమెకు గాంధర్వవిద్య నేర్పండి. మీకు కల్యాణ మగు గాక! మనస్సులో చింతపడవద్దు" అని సాదరముగా చెప్పినాడు.

## వత్సరాజు వాసవదత్తకు గాంధర్వవిద్య నేర్పుట

వాసవదత్తను చూచేటప్పటికి వత్సరాజు మనస్సు స్నిగ్ధమయి చండ మహాసేనునిమీది కోపము యావత్తూ ఎగిరిపోయింది. అతనిని చూడ గానే ఆమెకు ప్రేమోదయ మయి మనస్సు వివశమయినది. వత్సరాజు ఆమెకు విద్యనేర్పుతూ ఆమెనే సదా ధ్యానిస్తూ అక్కడి సంగీతశాల లోనే నివాసము చేస్తున్నాడు. అతనితొడమీద వీణ, కంఠములో గీతశ్రుతి, సముఖములో వాసవదత్త ఉండడముచేత వినోదముగా కాలము గడుస్తున్నది. అతడు ఒకవిధమైన బంధనములో ఉన్నప్పటికీ ఎడబాయని లక్ష్మీదేవివలె వాసవదత్త నిరంతర పరిచర్యలు చేసి ఉల్లా సము కలిగిస్తున్నది.

## యౌగంధరాయణుడు ఉజ్జయినికి వెళ్ళుట

వత్సరాజువెంట వేటకు వచ్చినసేన కౌశాంబికి తిరిగి వెళ్ళగానే రాజును శత్రువు బంధించినాడని రాజ్యమంతటా ఆందోళన పుట్టింది. వత్సరాజు ప్రజాదరము కలవాడు కావడముచేత తక్షణమే ఉజ్జయిని మీదికి దండయాత్ర చెయ్యవలెనని కొందరు పట్టు పట్టినారు. రుమ ణ్వంతుడు వారితో "యుద్ధము యుక్తముకాదు. దండయాత్ర చేస్తే వత్సరాజుకు చాలా అపాయము. చండమహాసేనుడు సామాన్యుడుకాడు, ఆయనను జయించడము చాలా కష్టము. కాబట్టి నేర్పుతో మన కార్యము నెరవేర్చుకోవలె" అని హితము చెప్పినాడు. తర్వాత యౌగంధరాయణుడు రుమణ్వాదాదులతో "మీరంతా ఇక్కడే నిరంత

రము జాగరూకులై రాజ్యమును రక్షిస్తూ ఉండండి. అవసరము వస్తే శక్తిసామర్థ్యాలు చూపవచ్చును. వసంతకుని వెంటబెట్టుకొని నేనువెళ్ళి ప్రభువును విడిపించుకొని వస్తాను." అనిచెప్పి ఉజ్జయినికి వసంతక సమేత ముగా బయలుదేరినాడు. వింధ్యప్రాంతములో వత్సరాజుకు మిత్రుడు పుళిందకుడు అనే ప్రభువు గృహానికి పోయి, వత్సరాజు ఆ మార్గాన మరలి వచ్చేటప్పుడు సంరక్షణార్థము సేనతో సిద్ధముగా ఉండవలసినదని చెప్పి ఉజ్జయినిచేరి మహాకాళ శ్మశానముదగ్గర ఆగినాడు.

## బ్రహ్మరాక్షస్సు యౌగంధరాయణునకు మిత్ర మగుట

అక్కడ భేతాళుడు అనేకమంది గుమిగూడి ఉన్నారు. యౌగంధ రాయణుని చూడగానే యోగేశ్వరుడు అనే బ్రహ్మరాక్షసుడు సంప్రీ తుడై, స్వయముగావచ్చి స్నేహము చేసుకొన్నాడు. అతడు చెప్పిన మంత్రమువల్ల యౌగంధరాయణునికీ, వసంతకునికీ వికారరూపాలు వచ్చి నవి. మంత్రికి బట్టతల, గూను, ముసలితనమూ, వసంతకునికి పెద్దబొజ్జ, నోటినిండావళ్ళు, పైకి ఉబికిన నరాలూ, ఏర్పడ్డవి.

## యౌగంధరాయణ వత్సరాజుల సమాగమము

యౌగంధరాయణుడు వసంతకుని ముందుగా రాజనగరి సింహద్వా రమువద్దకు పంపి, తాను వికారరూపముతో పట్నము ప్రవేశించినాడు. బాలకులు గుంపులుగా చేరి తనను వెంబడిస్తూ అందరూ వినోదిస్తూ ఉండగా అతడు రాజప్రాసాదమువద్దకు పోయి అక్కడివారికి వేడుక చూపడము ప్రారంభించినాడు. ఇతని విషయము వాసవదత్తకు తెలిసి ఆమె చేటికను ఇతనిని సంగీతశాలలోకి తీసుకు రమ్మన్నది. పడుచు వాళ్ళకు పరిహాస మంటే ఇష్టము. యౌగంధరాయణుడు వత్సరాజును చూచి బాష్పములు విడిచి సజ్ఞచేసినాడు. వత్సరాజు ఇతన్ని తన

మంత్రిగా గ్రహించినాడు. మంత్రి యోగవిద్యచేత ఇతరులకు అదృశ్యుడై వత్సరాజుకు మాత్రము కనిపిస్తున్నాడు. యువతులు ఆశ్చర్యపడి "ఉన్నట్టే ఉండి ఈవెర్రివాడు ఎక్కడికి పోయినాడో". అనడముచేత తనమంత్రికి యోగమహిమ ఉన్నదని రాజు తెలుసుకొని, వాసవదత్త తో "అమ్మాయీ, సరస్వతీ పూజకు పూజాద్రవ్యాలు తీసుకురావాలి" అన్నాడు. ఆమె చెలికత్తెలతో బయలుదేరింది.

అప్పుడు యౌగంధరాయణుడు రాజుకు బంధనాలు భేదించే యోగాలును, వాసవదత్తను వశీకరించే వస్తువులును వీణాతంత్రులలో దాచి యిచ్చి "దేవా, వసంతకుడు ఇక్కడికి వికారరూపముతో వచ్చి ద్వారదేశములో ఉన్నాడు. అతన్ని మన సన్నిధానములో వినోద బ్రాహ్మణునిగా ఉండనివ్వండి. వాసవదత్తకు మీయందు నమ్మకము కలిగిన తర్వాత నేను చెప్పినప్రకారము చేతురుగాని. అందాకా శాంతముగా ఉండండి" అని బోధించి వెళ్ళిపోయినాడు.

ఇంతలో వాసవదత్త పూజాద్రవ్యాలు తీసుకువచ్చింది. ఆమెను చూచి వత్సరాజు "కోటవాకిట బ్రాహ్మణుడున్నాడట. సరస్వతీ పూజలో దక్షిణ ఇవ్వడానికి అతన్ని పిలుపించు" అన్నాడు. సరే అని ఆమె వసంతకుని రప్పించింది. వత్సరాజును చూడగానే వసంతకుడు దుఃఖము పట్టలేక రోదనము చేసినాడు. రహస్యము బయట పడుతుందేమో అని రాజు "బ్రాహ్మణా, ఏడవకు వైద్యము చేయించి నీవ్యాధిని వికారరూపాన్ని పోగొట్టిస్తాను. నావద్దనే ఉండు"అని అభయమిచ్చినాడు. "చిత్తము, మహాప్రసాదము" అని వసంతకుడు అన్నాడు. రాజు అతన్ని చూచి మందహాసము చేసినాడు. వసంతకుడు గ్రహించి నోరు బాగా తెరిచి వికారచేష్టలు చేసినాడు. వినోదము కలిగి వాసదత్త "బ్రాహ్మణోత్తమా, నీకు ఏయేకళలలో ప్రవేశం ఉన్నది?" అని అడిగింది. "దేవీ, నేను కథలు బాగా చెప్పగలను" అన్నాడు.

" అయితే ఏదైనా కథ చెప్పు " అన్నది రాజకుమారి. వసంతకుడు ఇలా చెప్పడము ప్రారంభించినాడు.

## లోహజంఘుని కథ

శ్రీ కృష్ణుని జన్మస్థాన మయినమథురానగరములో రూపిణిక అనే ప్రసిద్ధవేశ్య ఉండేది. దానితల్లి మకరదంష్ట్ర. వేశ్యానక్తు లయిన పడుచువాళ్ళకు ఆవేశ్యమాత విషప్రాయము. రూపిణిక ఒకనాడు దేవాలయానికి వంతుప్రకారము సేవచెయ్యడానికి వెళ్ళి, దూరముగా నిలుచున్న ఒకపురుషుని చూచి, చేటికతో "నీవు వెళ్ళి ఆయనను ఈరాత్రి మనయింటికి రమ్మని చెప్పవే" అని నెమ్మదిగా అన్నది. చేటి ఆ ప్రకారమే చేసింది. ఆయువకుడు దానితో "నేను బ్రాహ్మణుడను. నావద్ద ధనము లేదు. రిక్తహస్తాలతో వారాంగన గృహానికి నేను రావడమెందుకు ? " అని ఆలోచనాపూర్వకముగా అన్నాడు. "మాయజమానురాలికి మీా విషయములో ధనాపేక్ష లేదు." అన్నది చేటి. దానికి లోహజంఘుడు సరే అన్నాడు. చేటి వెళ్ళి ఈ సంగతి చెప్పింది. రూపిణిక ఉత్కంఠతో అతనిరాకకు ఎదురుచూస్తూ ఉన్నది. కొంతసేపటికి లోహజంఘుడు వచ్చినాడు. ఎదురుపోయి రూపిణిక అతనిని ఆదరించి కంఠాశ్లేషము చేసి శయ్యాగృహానికి తీసుకుపోయింది. లోహజంఘుని సౌదర్యాలకు లోబడిపోయి రూపిణిక ఆ నాటినుంచీ పరపురుషులను చూడడముకూడా మానివేసి అతనిపొందుకన్న ఈ జన్మకు వేరేఫలము లేదని నిశ్చయించుకొన్నది. లోహజంఘుడు ఐహికసుఖాలలో తేలియాడుతూ రూపిణిక మందిరములోనే నివాసము చేస్తున్నాడు. వేశ్యలకు విద్య నేర్పిన మకరదంష్ట్ర చాలా విచారపడి కూతుని చూచి రహస్యముగా "తల్లీ, ఈ దరిద్రుణ్ణి సేవిస్తున్నావు ! జనులు శవాన్ని ముట్టుకోరు. గణికలు ధనహీనుణ్ణి తాకరు. వేశ్యకు ప్రేమ

యేమిటి! అనురాగ కాముకన్నగణిక సంధ్యాసమయమువలె అట్టేసేపు వెలగదు. వేశ్య నటివలె విటునిమీద నటించాలి. ఈ నిర్భాగ్యుణ్ణి విడిచి పెట్టకపోతే చెడిపోతావు!" అని బోధ చేసింది.

కోపము వచ్చి రూపిణిక "అమ్మా, ఏమిటి ఈమాటలు! ఆయన నాకు ప్రాణంకంటెకూడా ప్రియుడు! ఇప్పటికే మనకు చాలా ధన మున్నది. ఇంకా ధనమెందుకే? మళ్ళీ నాకు నీతిబోధ చెయ్యకు" అని గట్టిగా చెప్పింది. మకరదంష్ట్ర కోపము లోలోపలనే అణుచుకొని లోహజంఘుని వెళ్ళగొట్టడానికి పన్నాగము పన్నుతున్నది. ఒకనాడు ధనము లేని రాజపుత్రుడు ఆయుధపాణు లయినభటులతో ఆతోవన వస్తున్నాడు. వేశ్యమాత అతనివద్దకు పోయి "ఆర్యా, ఒక కాముకుడు, గర్భదరిద్రుడు మాయిల్లు ఆక్రమించుకొని కదలడము లేదు. మీరు దయచేసి వాణ్ణి బయటికి తరిమి మా అమ్మాయిని స్వీకరించండి" అని వేడుకొన్నది. రాజపుత్రుడు సమ్మతించి యింట్లో ప్రవేశించినాడు. ఆసమయాన రూపిణిక దేవాలయానికి వెళ్ళింది. లోహజంఘుడు ఎక్కడికో పోయినరిగా ఆవేళకు ఇంటికి వచ్చినాడు. రాజభటులు అతనిని తన్ని కొట్టి మురికిగుంటలోకి నెట్టివేసినారు. లోహజంఘుడు తప్పించుకొని పారిపోయినాడు. రూపిణిక ఇంటికి వచ్చి యావద్వృత్తాంతము విని చాలా యేడ్చింది. దానిరోదనము చూచి రాజపుత్రుడు ఇల్లు విడిచి వెళ్ళిపోయినాడు.

## లోహజంఘుడు లంక చేరుట

వేశ్యమాతవల్ల చాలా దీనస్థితికివచ్చి లోహజంఘుడు తీర్థయాత్రలు చేతా మనుకొని బయలుదేరినాడు. రూపిణికతో వియోగము చాలా బాధాకరముగా ఉన్నది. మకరదంష్ట్ర చేయించినపనికి మండిపోతున్నాడు. దీనికి తగినట్లు ఎండకూడా మండిపోతున్నది. నీడకోసము అతడుచూచి

నాడు. ఎక్కడా చెట్టు కనబడలేదు. చివరకు ఏనుగుశవము కనిపించింది. అది ఉత్తడొల్ల. లోహజంఘుడు అందులో ప్రవేశించి నిద్రపోయినాడు. ఇంతలో మబ్బులుకమ్మి కుండపోతగా వాన కురిసింది. వాగు ఒకటి వచ్చింది. రంధ్రము మూసుకుపోయిన డొల్ల ప్రవాహములో కొట్టుకుపోయి గంగానదిలో చేరింది. ఆకళేబరము గంగాప్రవాహమువెంట సముద్రములో పడ్డది. గరుడవంశపక్షి ఒకటి ఆడొల్లను ఎగతన్నుకుపోయి సముద్రపు అవతలి తీరాన వాలి చర్మము ముక్కుతో చీల్చి లోపల మనిషి ఉండడము చూచి బెదిరి పారిపోయింది. పక్షి చేసిన రంధ్ర మార్గాన లోహజంఘుడు ఇవతలికివచ్చి తాను సముద్రతీరాన ఉన్నట్టు గ్రహించి స్వప్న మనుకొన్నాడు.

భయంకరాకారులయిన ఇద్దరు రాక్షసులను చూచి లోహజంఘుడు భయపడ్డాడు. వాళ్ళూ మనిషిని చూచి భీతి చెందినారు. మానవుడైన రాముడు వెనక లంకను జయించడము జ్ఞప్తికివచ్చి, ఈ మానవుడు సముద్రము దాటి వచ్చిన వాడనీ, అసాధ్యుడనీ భావించి, అందులో ఒకడు అక్కడే ఉండి, రెండవవాడు విభీషణ ప్రభువుకు ఈ విషయము విన్నవించడానికి వెళ్ళినాడు.

## విభీషణుడు లోహజంఘుని సత్కరించుట

రాములవారి ప్రభావము ఎరిగిన విభీషణ మహారాజు భటునితో "నీవు పోయి ఆమానవుని మనయింటికి దయచెయ్యమని నామాటగా విన్నవించు" అని చెప్పి పంపినాడు. లోహజంఘునికి భటుడు ప్రభువాక్యములు విన్నవించగా అతడు సంతోషించి భటులతో లంకా పట్టణము ప్రవేశించి అక్కడి సువర్ణసౌధాలుచూచి ఆశ్చర్యపడుతూ విభీషణ మహారాజు మందిరానికి వెళ్ళి ప్రభువును ఆశీర్వదించినాడు. విభీషణుడు అతిథి సత్కారాలుచేసి "బ్రహ్మణోత్తమా, మాదేశానికి ఎలా రాగలిగినావు ?" అని అడిగినాడు. లోహజంఘుడు ఇలా చెప్పినాడు:

"మాది మధురాపురము. నన్ను లోహజంఘుడు అంటారు. పేదరికమువల్ల బాధలు పడి, ఆలయానికివెళ్లి నిరాహారదీక్షపూని శ్రీ మహావిష్ణువును ఆరాధించాను. స్వప్నములో విష్ణువు సాక్షాత్కరించి, "నీవు విభీషణమహారాజువద్దకు పో అతడు నాభక్తుడు. నీకు సమస్తసంపదలూ ఇస్తాడు" అని అనుగ్రహించినాడు. "నే నెక్కడ! లంకాపురమెక్కడ! విభీషణ మహారాజు ఎక్కడ! నాకు సాధ్యమా!" అన్నాను. అందుకు శ్రీ మహావిష్ణువు, "భయము లేదు. వెళ్లు. ఇప్పుడే అతనిని చూడగలవు" అని అభయ మిచ్చినాడు. నాకు మెళుకువ వచ్చి చూచే సరికి ఈసముద్రతీరాన ఉన్నాను. ఇంతకంటె నా కేమీ తెలియదు."

ఈమాటలు విభీషణుడు నమ్మినాడు. లంకాపట్టణము మానవులకు అగమ్యము. దేవతామహిమచేతనే బ్రాహ్మణుడు అక్కడికి రాగలిగినాడని యెంచి ప్రభువు "బ్రాహ్మణోత్తమా, నీకు కావలసినద్రవ్యము తప్పకుండా ఇస్తాను. ఇక్కడనే సుఖంగా ఉండు" అని చెప్పినాడు. ఆభూసురునికి నరమాంసభోజను లయినరాక్షసులను తోడు పంపడము మనస్కరించక, సమీపములో ఉన్న స్వర్ణమూల పర్వతముమీద గరుడపక్షివంశములో పుట్టిన పక్షిపిల్లను తెప్పించి విభీషణుడు మచ్చిక చేయించడము ప్రారంభించినాడు. కాలక్రమేణ లోహజంఘుడు ఆపక్షి మీద ఎక్కి మధురాపురికి తిరిగి వెళ్లవచ్చునని అతని ఊహ. ఒకనాడు లోహజంఘుడు విభీషణునితో "రాజా, మీలంక కొయ్యబారిపోవడానికి కారణ మేమిటి?" అని అన్నాడు.

## లంకా నిర్మాణము

విభీషణుడు ఇలాచెప్పినాడు: "పూర్వకాలములో వినత, నాగమాత కద్రువకు దాసిగా ఉన్నది. ఆమెకుమారుడు గరుత్మంతుడు తల్లి దాస్యము మాన్పడానికి దేవలోకమునుంచి అమృతము తీసుకురావలసి

వచ్చింది. ఆ దుష్కరకార్యము చెయ్యడానికి అతనికి తగిన బలము చేకూర్చే ఆహారముకోసము తండ్రి కశ్యపప్రజాపతివద్దకు వెళ్లి అడిగి నాడు. "శాపమువల్ల సముద్రములో రెండు గజకచ్ఛపములు (ఏనుగు, తాబేలు) పోరాడుతున్నవి. వెళ్ళి వాటిని భక్షించు" అని ప్రజాపతి సూచించినాడు. గరుడుడు వాటిని ఎగదన్నుకుపోయి కల్పవృక్షశాఖ మీద వాలినాడు. భారానికి కొమ్మ విరిగింది. కింద తపస్సుచేస్తున్న వాలఖిల్యమునులు నలిగిపోతా రనీ, లోకులమీద పడితే అణగారిపోతా రనీ భయపడి గరుడుడు తండ్రి ఆజ్ఞాప్రకారము ఆశాఖను ముక్కున కరుచుకునివచ్చి ఈ నిర్జనప్రదేశాన పడవేసినాడు. తర్వాత కొంతకాలా నికి ఆశాఖమీద ఈలంకాపట్టణము కట్టినారు. అందుచేత ఇది కొయ్య బారినట్లు ఉంటుంది."

## లోహజంఘుడు విహగారూఢుడై మధురాపురము చేరుట

తర్వాత కొన్నాళ్ళకు లోహజంఘుడు మధురాపురము వెళ్ళుతా నన్నాడు. విభీషణుడు అతనికి అమూల్యరత్నాల నిచ్చి, మధురలో శ్రీ హరిదేవాలయములో సమర్పించ మని బంగారుగద శంఖచక్రాలూ ఇచ్చినాడు. మహారాజు ఇచ్చిన వన్నీ పుచ్చుకొని ఆబ్రాహ్మణుడు పక్షి మీద ఎక్కి, ఆకాశమార్గాన సముద్రాదులు దాటి, మధుర చేరి నాడు. ఆకాశమునుంచి నగరమువెలుపల పాడుపడిన మందిరములో దిగి, రత్నాదులు దాచిపెట్టి, పక్షిని కట్టివేసి అంగడివీధికి పోయి ఒక రత్నము విక్రయించి తనకు కావలసిన వన్నీ తెచ్చుకొన్నాడు. అక్కడే భోజనము చేసి పక్షికి మేత పెట్టి, మంచివస్త్రములు ధరించి సుగంధము రాచుకొని పుష్పమాలిక వేసుకొని, అలంకారాలుకూడా పెట్టికొని చీకటిపడినతర్వాత శంఖచక్రగదలు ధరించి పక్షి నెక్కి రూపిణిక మేడ పైన ఆగి, గంభీరస్వరముతో పిలిచినాడు. రూపిణిక ఇవతలికి వచ్చి

శంఖచక్రాదులతో దేదీప్యమానముగా ఉన్న అతనిని చూచి సాక్షాత్తో విష్ణువే అనుకొని సాష్టాంగదండప్రణామాలు చేసింది.

"నేను శ్రీహరిని. నీకోసము వచ్చినాను" అని అతడు చెప్పేసరికి "స్వామీ, లోపలికి దయచెయ్యండి" అని వేడుకొన్నది. లోహజంఘుడు దిగి, పక్షిని ఒకమూల నిలిపి, వారాంగనతో కొంతసేపు శయ్యా గృహములో గడిపి, వచ్చి, పక్షి నెక్కి ఆకాశమూర్గాన వెళ్ళిపోయి నాడు. "నేను దేవతను, శ్రీహరి నాభర్త. ఇక నేను మానవులతో మాటాడను" అని రూపిణిక ఆమర్నాడు ఉదయమునుంచీ మౌన వ్రతము పట్టింది. "ఏమిటే తల్లీ ! ఇలా ఉన్నావు!" అని మకరదంష్ట్ర బహువిధాల మొత్తుకోగా అప్పటికి రూపిణిక తనకూ తల్లికీ మధ్య తెర వేసి గతరాత్రి జరిగిన వృత్తాంతము చెప్పింది. తల్లి నమ్మక ఆరాత్రి ఒక చోట రహస్యముగా దాగి, పక్షివాహనారూఢుడై వచ్చిన లోహ జంఘుని చూచింది.

## వేశ్యమాతకు తగిన శిక్ష

ప్రాతఃకాలము మకరదంష్ట్ర కూతురితో తెరచాటునుంచి, "తల్లీ, శ్రీహరికి నీమీద అనుగ్రహము కలిగింది. నీవు దేవత వయినావు. నేను నీతల్లినిగదా, పెద్దదాన నయినాను. బొందితో స్వర్గానికి పోదా మని నాకోరిక. దేవునితో ఈవిషయము మనవిచేసి నన్ను ఆయన అను గ్రహించేలాగున చూడు తల్లీ" అని బ్రతిమాలుకొన్నది.

రూపిణిక సరే అని మర్నాడురాత్రి వచ్చిన మాయా విష్ణుతో ఈసంగతి విన్నవించింది. అందు కతడు ఇలా చెప్పినాడు. "నీతల్లి పాపాత్మురాలు. బహిరంగముగా స్వర్గానికి తీసుకు వెళ్ళడానికి వీలు లేదు. ఏకాదశినాడు ఉదయము స్వర్గద్వారము తెరుస్తారు. ఆ సమయ ములో ప్రమథులు, శాంభవులు ప్రప్రథమములో ప్రవేశిస్తారు. నీతల్లికి

వారివేషము వేసి వారినడుమ ఉంచితే ప్రవేశము దొరుకుతుంది. మీఅమ్మ తలమీద పంచశిఖలు పెట్టించాలి. కంఠాన ఎముకలదండ వెయ్యాలి. ఒకపక్కన కాటుక, రెండోపక్కన సింధూరమూ పూయవలె. దిగంబర కావలె. ఈవిధముగా గణాచారులవేషము వేసుకొంటే నీతల్లిని శ్రమ లేకుండా స్వర్గానికి తీసుకువెళుతాను."

మర్నాడు మకరదంష్ట్ర గణాచారివేషము వేసుకొని, ఎప్పుడు స్వర్గానికి వెళుదునా అని కనిపెట్టుకుని ఉన్నది. రాత్రి లోహజంఘుడు యథాప్రకారముగా గరుడపక్షిమీద వచ్చేసరికి రూపిణిక తల్లిని అతనికి అప్పగించింది. వేశ్యమాతను తీసుకొని పక్షిమీద ఎక్కించి ఆ మాయావిష్ణువు ఆకాశమార్గాన తీసుకుపోయి దేవాలయ సముఖాన ఉన్నత శిలాస్తంభముమీద నిలిపి, "నేను త్వరలోనే వస్తాను. భూలోకములోకి వెళ్ళి కొందరు భక్తులకు దర్శనము ఇచ్చి వస్తాను." అని చెప్పి వెళ్ళుతూ, అక్కడ రాత్రి జాగరణము చేయడానికి వచ్చిన జనముతో "వెళ్ళండి. వెళ్ళండి. మీమీద మహామారి పడబోతున్నది. అందరినీ సంహారము చేస్తుంది. భద్రము! శ్రీహరిని ఆశ్రయించండి" అన్నాడు. ప్రజలు భయపడి భగవత్సాన్నిధ్యములో స్వస్త్యయనము చేస్తూఉన్నారు. లోహజంఘుడు దేవునివేషము తీసివేసి ఎవరికీ తెలియకుండా వచ్చి జనములో చేరి ఏమి జరుగుతుందో అని చూస్తూ కూర్చున్నాడు. వేశ్యమాతకు క్రమముగా అదుర్దా హెచ్చింది. దేవుడు ఇంకా రాలేదే. నన్ను స్వర్గానికి తీసుకుపోలేదే అని మకరదంష్ట్ర అనుకొని అనుకొని, చివరకు నేను పడుతున్నా, పడుతున్నా అని బిగ్గరగా అరిచింది. అమ్మా! పడకు! పడకు! అని జనులు భయముతో మొరపెట్టినారు. పడుతున్నా అంటే వచ్చి ఊరిమీదపడి మహామారి అందరిని హరిస్తుందనే వారిభీతి. చివరకు తెల్లవారింది. సంగతి తెలిసి ప్రభువుకూడా అక్కడికే వెళ్ళినాడు. శిలాస్తంభముమీద వికృతాకారముతోనూ,

దిగంబరముగాసూ ఉన్న వేశ్యమూలను గుర్తుపట్టి అంతా నవ్వినారు. రూపిణిక ఈసంగతి యాసత్తూ విని అక్కడికి వెళ్ళి ఆశ్చర్యపడి జనుల సహాయముతో తల్లిని కిందికి దింపించింది.

మకరదంష్ట్రను కిందికి దింపినతర్వాత జనము చుట్టూ మూగి ఇదంతా ఏమిటి అని అడిగితే ఆముసలిది జరిగిన దంతా చెప్పింది. సిద్ధులు మొదలయినవారి విచిత్రచర్యగా భావించి అనేక కాముకులను వంచించిన ఈముసలిదానిని మోసగించిన బుద్ధిమంతు డెవరో కనబడితే అతనిని సత్కరిస్తాము అన్నారు అక్కడి వారు. లోహజంఘుడు బయటికి వచ్చి మొదటినుంచి అప్పటివరకూ జరిగిన విశేషాలన్నీ చెప్పి విభీషణమహారాజు ఇచ్చిన శంఖచక్రగదలు శ్రీహరికి సమర్పించినాడు. ప్రజలు సంతోషించి అతనిని సన్మానించినారు. లోహజంఘుడు తన ప్రేయసితో సుఖముగా నివాసము ప్రారంభించినాడు.

మారువేషములో ఉన్న వసంతకుడు చెప్పిన యీకథ విని వాసవదత్త చాలా సంతోషించింది.

## తరంగము : ౧౩

## వాసవదత్తాహరణము

వాసదత్తకు క్రమేణ తండ్రివిషయములో వైముఖ్యమూ వత్సరాజు మీద అనురాగమూ కలిగినవి. యౌగంధరాయణుడు వచ్చి అదృశ్యకరణిప్రభావమువల్ల అన్యులకు కనపడకుండా వసంతకుని సమక్షములో వత్సరాజుతో ఇలా చెప్పినాడు:

"దేవా, మహాసేనుడు మాయచేసి మిమ్మలిని బంధించినాడు. వాసవదత్తను మీ కిచ్చినతర్వాత మర్యాద చేసి పంపవలె ననుకొంటున్నాడు. మనమే ఈమెను హరించుకొని పోదాము. ఇలా చేస్తే ఈపొగరుబోతుకు తగిన ప్రతిక్రియ అవుతుంది. మనకు పౌరుషము లేదనే అప్ర

తిప్ప పోతుంది. మహాసేనుడు తనకుమారైకు భద్రవతి అనే యేనుగు నిచ్చినాడు. దానితో సమానముగా వెళ్ళగల యేనుగు లేదు. ఒక్క నడగిరి ఉన్నా భద్రవతిని చూస్తే పోరాడదు. నడగిరి మావటివాడు ఆషాఢకుడు. బాగా ధనమిచ్చి వాణ్ణి వశపరుచుకొన్నాము. మీరు ఆయుధాలు పట్టుకొని వాసవదత్తతో భద్రవతిమీద ఎక్కి రాత్రి వేళ రహస్యముగా ఇక్కడనుంచి బయలుదేరాలి. ఏనుగుల సంగతులు బాగా తెలిసిన మహామాత్రుని తప్పతాగిస్తాము. మార్గరక్షణము చెయ్యడానికి మిత్రుడు పుళిందకుని వద్దకు నేను ముందుగా వెళ్లి ఉంటాను." ఈప్రకారము చెప్పి యౌగంధరాయణుడు వెళ్ళినాడు.

వత్సరాజు కర్తవ్యము మనస్సులో పెట్టుకొన్నాడు. ఇంతలో వాసవదత్త అతనివద్దకు వచ్చింది. ఆమెకు ఏకాంతముగా కథలు చెప్పి కాలక్షేపము చేస్తూ, రాజు కథాసందర్భములో మధ్యమధ్య పలాయనము సంగతి సూచించినాడు. అనురాగవివశురాలయిన వాసవదత్త అంగీకరించింది. ఆషాఢకుడనే మావటివానిని పిలిచి ప్రయాణ సన్నాహము చెయ్యమని ఆజ్ఞాపించింది. దేవీపూజ చేసిన తీర్థమనే నెపముతో మత్తువస్తువులు కలిపిన మద్యము మావటివాళ్ళకు అందరికీ కుత్తుక బంటిగా తాగించింది. రాత్రివేళ మేఘగర్జనము వినబడ్డది. వెంటనే మావటివాడు ఏనుగును సిద్ధము చేసుకొని వచ్చినాడు. సన్నాహము చేసేటప్పుడు ఏనుగు ఘీంకారము చేసింది. గజభాష తెలిసిన మహామాత్రుడు ఆశబ్దమువిని "ఈయేనుగు అరవైమూడు ఆమడలు పోతానంటున్నది" అని తడబడుతూ అన్నాడు. మత్తులో ఉన్న తక్కినవాళ్లు వాని మాటలు గమనించలేదు. వాడుకూడా ఆలోచనాశక్తి కోలుపోయి ఊరుకున్నాడు.

అలికిడికాకుండా వత్సరాజు ఘోషవతిని తీసుకొని, యౌగంధరాయణుడు పూర్వమిచ్చిన యోగాలవల్ల బంధనాలుఛేదించి, వాసవదత్త సాయ

ముగా ఇచ్చిన ఖడ్గము పట్టుకొని వసంతకునితో సహా ఏనుగునెక్కినాడు. రహస్యము కాపాడే కాంచనమాల అనే చెలికత్తెతో వాసవదత్త కూడా ఆయేనుగునే ఎక్కింది. చివరకు మావటివాడు ఎక్కినాడు. భద్రవతి ప్రాకారము పగులగొట్టి, దారి చేసుకొని, బయట పడ్డది. అక్కడ అడ్డము వచ్చిన వీరబాహు, తాళభటుడు అనే కావలివాళ్ళను వత్స రాజు సంహరించి, ఆషాఢకుడు అంకుశము పట్టి ఏనుగును నడుపుతూ ఉండగా ప్రయాణము సాగించినాడు.

ప్రాకారమువద్ద పడిఉన్న పహారావాళ్లను చూచి నగరరక్షకులు కలతపడి ఆరాత్రివేళనే ఆసంగతి చండమహాసేనునికి విన్నవించినారు. వత్సరాజు వాసవదత్తను హరించుకు పోయినాడని ప్రజలు ఆందోళన చేసినారు. మహారాజు వాస్తవము గ్రహించినాడు. ఆయన ద్వితీయ పుత్రుడు పాలకుడు నడగిరి నెక్కి వత్సరాజు వెంట పడినాడు. ఇద్దరికీ పోరు జరుగుతూ ఉండగా రాజుగారి జ్యేష్ఠపుత్రుడు గోపాలుడు ఇంతలో అక్కడికి చేరి తండ్రి ఆజ్ఞానుసారముగా యుద్ధము ఆపుదల చేయించి నాడు. నడగిరి భద్రవతితో పోరాడలేదు. తర్వాత వత్సరాజు నిరాతంక ముగా ప్రయాణముచేసి వింధ్యారణ్యము చేరినాడు. మధ్యాహ్నము అయ్యేసరికి అరవై మూడు యోజనాలు నడిచి భద్రవతి దప్పి కొన్నది. వత్సరాజాదులు దిగగానే ఏనుగు నీరు తాగి కింద పడిపోయి ప్రాణాలు విడిచింది. వత్సరాజు, వాసవదత్త చాలా విచారపడ్డారు. ఇంతలో ఆకాశములోనుంచి ఇలా వినిపించింది: "రాజన్, విచారపడ వద్దు, నేను విద్యాధరాంగనను. మాయావతి నా పేరు. శాపవశాన ఇంతకాలమూ ఏనుగునై ఉన్నాను. ఇప్పుడు నీవల్ల నాకు శాపవిమోచన మయింది. నీకు ఉపకరించాను. నీకుమారునికికూడా ఉపకారము చేస్తాను. నీకాంత వాసవదత్త మానవస్త్రీ కాదు, దేవాంగనసుమా! ఏదో కారణముచేత భూమిమీద జన్మించింది."

ఆతర్వాత వత్సరాజు వింధ్యసానువులో తనమిత్రుడు పుళిందకుని వద్దకు వసంతకుని పంపి, తాను, వాసవదత్త కాలినడకను నెమ్మదిగా వెళుతూ ఉంటే చోరులు చుట్టుముట్టినారు. బాణములతో కొట్టి నూట యేబదిమంది తస్కరులను రాజు హతమూర్చినాడు. ఇంతలో పుళింద కుడు వచ్చి చోరులను వారించి రాజుకు ప్రణామము చేసి వాసవదత్తా వత్సరాజులను తనపల్లికి తీసుకు వెళ్ళినాడు. నడకలో వాసవదత్త పాదా లకు వనదర్భలు గుచ్చుకొన్నవి. రాత్రి వారు ఆపల్లెలో విశ్రమించినారు. యౌగంధరాయణుడు పంపిన దూతవల్ల సంగతులు గ్రహించి రుమ ణ్వంతుడు రాజుసన్నిధికి వచ్చినాడు. శిబిరము యావత్తూకూడా వచ్చింది. వత్సరాజు శిబిరములో ప్రవేశించి ఉజ్జయిని వార్తలకోసము ప్రతీక్షిస్తూ ఉన్నాడు. యౌగంధరాయణుని మిత్రుడు ఒకానొక వర్తకుడు వచ్చి రాజుతో "దేవా, చండమహాసేన ప్రభువు మీయందు అనురక్తుడు. తన అల్లుడు అయినందువల్ల మీసన్నిధికి ప్రతీహారుని పంపినాడు. అతడు తమఆజ్ఞకు వేచి ఉన్నాడు. నేను ఈవార్త మనవి చెయ్యడానికి ముందుగా వచ్చినాను" అని మనవి చేసినాడు. ఈవార్తకు వత్స రాజు సంతోషించి వాసవదత్తతో చెప్పినాడు. వినోదార్థము కథ చెప్ప మని ఆమె వసంతకుని అడిగింది. బంధువులను విడిచి కల్యాణకాంక్షతో, సిగ్గుతో ఉన్న వాసవదత్తకు పతిభక్తిని వృద్ధిచేసే ఈ కథను చెప్ప నారంభించినాడు :

## దేవస్మిత కథ

తామ్రలిప్తి నగరములో ధనదత్తు డనే సంపన్న వర్తకుడు ఉండే వాడు. సంతానము లేనందువల్ల అతడు బ్రాహ్మణ బృందమును సమ కూర్చి ప్రణామము చేసి "ఆర్యులారా, శీఘ్రకాలములో నాకు కుమా రుడు కలిగేలాగున అనుగ్రహించాలి" అని ప్రార్థించినాడు. "ఇది అసా

ధ్యముకాదు. వైదికకర్మలచేత ఈలోకములో బ్రాహ్మణులు ఏదైనా సాధించగలరు. పూర్వము ఒకరాజుకు బిడ్డలు లేరు. నూటఅయిదు మంది రాణులు ఉన్నారు. ఒకరికీ సంతానము కలుగలేదు. పుత్రకామేష్టి చేయించినారు బ్రాహ్మణులు. తర్వాత కొమారుడు కలిగినాడు. జంతువు అని చిత్రమైన పేరు పెట్టినాడు రాజు. అందరికీ కన్నుల పండువుగా ఆబిడ్డఎదుగుతున్నాడు. ఒకనాడు చీమ వానితొడలోకుట్టింది. బిడ్డడు ఏడ్చినాడు. కారణము తెలియక రాణివాసమంతా గొల్లుమన్నది. రాజుకూడా విచారపడ్డాడు. తర్వాత తెలుసుకొని చీమను తీసివేస్తే బాలుడు బాగా ఆడుకొన్నాడు. విచారకారణము ఏకపుత్రవిషయము. కాబట్టి బహుపుత్రులుంటే బాగుంటుందని ఎంచి కుమారు లనేకులు కలిగే మార్గము చెప్పండని విప్రులను విచారముతో అడిగినాడు. "రాజన్, ఉపాయము లేకపోలేదు. అయితే చాలా బాధాకరము. ధైర్యము చేసి ఈబాలకుని మాంసము అగ్నిలో హోమము చేయించి, ఆహోమగంధము నీరాణివాసము వాసనచూస్తే అందరికీ సంతానము కలుగుతుంది" అని వారు తెలిపినారు. రాజు చివరకు ఆప్రకారము చేస్తే భార్యలందరికీ కుమాళ్ళు కలిగినారు. కాబట్టి నీకు సంతానము కలగడము కష్టముకాదు—" అని బ్రాహ్మణులు అంగీకరించి దక్షిణలు పుచ్చుకొన్నారు. వారు చేసిన వైదిక కర్మకు ఫలితముగా వర్తకునికి కుమారుడు పుట్టినాడు. వానికి తండ్రి గుహసేను డని పేరు పెట్టినాడు. గుహసేనుడు పెరిగి పెద్దవా డయిన తర్వాత వివాహార్థము తండ్రి పిల్లను వెతకడము ప్రారంభించి, కుమారుని వెంట బెట్టుకొని వర్తకానికి అని బయలుదేరి ద్వీపాంతరము వెళ్ళినాడు. ధర్మగుప్తు డనే వైశ్యశిఖామణి కూతురు దేవస్మితనుచూచి తనకొమారుని కిచ్చి పెళ్ళి చెయ్యమన్నాడు. కూతురిమీది మమకారము చేతనూ, తామ్రలిప్తినగరము దూర మనీ, ధర్మగుప్తుడు అంగీకరించలేదు. అయితే దేవస్మిత గుహసేనుని చూచి

వలచి బంధుజనాన్ని విడిచి అతనివెంట వెళ్ళిపోవడానికి నిశ్చయించుకొని చెలికత్తె ద్వారా సందేశము పంపించి గుహసేన ధనదత్తుల వెంట రహస్యముగా ఆరాత్రే బయలుదేరి వెళ్ళిపోయింది. తామ్రలిప్తి చేరిన తర్వాత దేవస్మితా గుహసేనులకు మహావైభవముతో వివాహమయింది. ఆదంపతులు ఏకమనస్కులై సుఖముగా కాపురము చేస్తున్నారు.

## వాడిపోని తామర పూవులు

కాలక్రమేణ గుహసేనుని తండ్రి దివంగతుడయినాడు. బంధువుల ప్రేరేపణవల్ల వర్తకానికి అతడు కటాహద్వీపము వెళ్ళినాడు. అన్య ప్రదేశానికి వెళితే భర్త పరస్త్రీరతుడు అవుతాడేమో నని దేవస్మిత సమ్మతించలేదు. ఒకవక్కన బంధుప్రేరణ రెండవవక్క భార్యానిరోధము. ఏమీతోచక గుహసేనుడు దేవాలయానికి వెళ్ళి భగవంతుడు సూచించిన ప్రకారము చేస్తానని నిరాహారదీక్ష పూనినాడు. భార్యకూడా అతనితో పాటు వ్రతము చేసింది. రాత్రి స్వప్నములో మహేశ్వరుడు సాక్షాత్కరించి రెండు ఎర్రతామర పూలు ఇచ్చి "ఉభయులూ చెరి ఒకరి దగ్గర ఉంచుకోండి. ఒకరి వ్రతభంగ మయితే రెండోవారి చేతిలో తామర వాడిపోతుంది. మరొక విధముగా వాడదు" అని అనుగ్రహించి అంతర్ధానమయినాడు. వారికి మెలకువ వచ్చేటప్పటికి ఇద్దరి చేతుల్లో ఎర్రతామరపూలు ఉన్నవి. గుహసేనుడు ఒకపద్మమునుతీసుకొని ప్రయాణము చేసినాడు. దేవస్మిత రెండవ పుష్పమును తరుచుగా చూస్తూ తామ్రలిప్తిలోనే ఉన్నది. అచిరకాలములోనే గుహసేనుడు కటాహద్వీపము చేరి రత్నాలవ్యాపారము మొదలు పెట్టినాడు. అమ్లాన కమలమును చూచి ఆశ్చర్యపడి కొందరు వణిక్పుత్రులు అతనికి బాగా మద్య మిచ్చి మైకములో అతనివల్ల పుష్పవృత్తాంతము తెలుసుకొన్నారు.

చాలా కాలానికి గాని అతడు స్వగృహానికి మరలిపో డని గ్రహించి కోమటిబిడ్డలు నలుగురూ కుతూహలముతో తామ్రలిప్తికి రహస్య ముగా బయలుదేరి వెళ్ళినారు. గుహసేనుని భార్యావ్రతము భంగము చేయవలెనని వారిసంకల్పము. తామ్రలిప్తి చేరినతర్వాత ఉపాయము ఊహిస్తూ, అక్కడి బౌద్ధాయతనములో యోగకరండిక అనే పరివ్రాజి కను చూచి, నమస్కరించి, "భగవతీ, మాకోరిక నెరవేరిస్తే నీకు బహు ధన మిస్తాము" అని బతిమాలుకొన్నారు. "మీకు ఎవరో స్త్రీమీద కోరిక ఉన్నది. చెపితే సాధిస్తాను. నాకు ధనముతో పనిలేదు. నాశిష్యు రాలు సిద్ధకరి చాలా తెలివి కలది. దాని దయవల్ల నాకు కావలసినంత సంపద లభించింది" అని చెప్పింది. "భగవతీ, శిష్యురాలి తెలివివల్ల నీకు ఎలా ధనములభించిందో వినగోరుతాము" అని వారు బతిమాలితే యోగకరండిక ఇలా చెప్పింది:

## సిద్ధకరి ప్రజ్ఞ

పూర్వము ఉత్తరదేశాన్నుంచి ఇక్కడికి వర్తకు డొకడు వచ్చి నాడు. ఆయన ఇక్కడ ఉన్నరోజుల్లో నాశిష్యురాలు అతనివద్ద మారు వేషముతో పనికత్తెగా చేరింది. చల్లచల్లగా అతనికి నమ్మకము కలిగించి చివర కొకనాడు తెల్లవారుజామున ఇంట్లో బంగార మంతా అపహ రించుకు పోయింది. మార్దంగికుడు ఒకడు దానిసంగతి యెలాగో గ్రహించి దాని ధనము హరించా లని దానివెంట బడినాడు. ఈలోగా సిద్ధకరి పెద్దమర్రిచెట్టు చేరి వాడు రావడము కనిపెట్టి చాలా విచారము నటిస్తూ "అయ్యా, నాకు జీవితము ఆశ లేదు. భర్తతో కలహించి వచ్చాను. ఉరి పోసుకోడానికి ఈచెట్టుకొమ్మకు గట్టితాడు వేసిపెట్టు" అని ప్రార్థించింది. ఆ డోంబుడు లోలోపల సంతోషించి "నేను స్త్రీహత్య చెయ్యనక్కర లేకుండా ఈస్త్రీ ఆత్మహత్య చేసుకొంటుంది. నారొట్టె

నేతిలో పడ్డది!" అనుకొని కొమ్మకు తాడు వేసినాడు. సిద్ధకరి అమాయకముగా "అయ్యా, ఉరి ఎలా పోసుకోవాలో కాస్త చూపించు" అన్నది. డోంబుడు మద్దెలమీద నిలుచుని ఇలా అని ఉరి పోసుకొనే పద్ధతి చూపిస్తుండగా సిద్ధకరి మద్దెలను కాలితో తన్నింది. వాడు ఉచ్చులో వేలాడుతూ గిలగిల తన్నుకొని ప్రాణాలు విడిచినాడు. ఇంతలో వర్తకుడుకూడా ఆప్రదేశానికి రావడము చూచి సిద్ధకరి చెట్టుమీది కెక్కి పత్రముల చాటున దాగింది. వర్తకుడు తన సేవకులతో వచ్చి ఉరి వేసుకొని చనిపోయిన డోంబుని చూచినాడు. సిద్ధకరి కనబడలేదు. "చెట్టెక్కిందేమో" అన్నాడొక సేవకుడు. ఒకడు చెట్టెక్కినాడు. వానిని చూచి సిద్ధకరి "ఓయి అందగాడా, నాకు నీమీదనే మనసు! ఇక్కడికి నీవే వచ్చినావు. ఈ ధనమంతా నీదే రా, నావద్దకు" అని వాడు దగ్గిరికి రాగానే ముద్దు పెట్టుకో బోయినట్టు నటించి వానినోరు తెరచి నాలుక పండ్లతో గట్టిగా కరిచింది. నోట నెత్తురు కక్కుతూ విలపిస్తూ వాడు నేలమీద పడిపోయి నాడు. వాని అస్పష్టవాక్కులు విని వర్తకుడు భయపడి ఏదో పిశాచము కొట్టిందని సేవకులతో సహా అక్కడినుంచి పరుగెత్తి పోయినాడు. సిద్ధకరి నెమ్మదిగా దిగి రహస్యముగా బంగారముతో ఇంటికి వచ్చి నాకిచ్చింది. నాశిష్యురాలు ఇంతశక్తి కలది. ఈవిధముగా నాకు చాలా ధనము సమకూడింది.

## పరివ్రాజిక యోగకరండిక వస్నాగము

పరిగా ఆసమయానికి అక్కడికే వచ్చిన సిద్ధకరిని కోమటిబిడ్డలకు చూపి "నాయనలారా, చెప్పండి ఎవతె కావాలి మీకు? నేను సాధించి మీకు సమకూరుస్తాను" అన్నది యోగకరండిక. "గుహసేనునిభార్య దేవస్మిత కావాలి. దానిని మాకు సమకూర్చాలి" అన్నారు వాళ్లు.

పరివ్రాజిక సరే అని ఒప్పుకొని వారిని తనయింట్లోనే ఉండమని చెప్పి దేవస్మితః పరిచారికలకు భక్ష్యాదులు పెట్టి వశము చేసుకొన్నది. ఒక నాడు సిద్ధకరితో కలిసి యోగకరండిక దేవస్మిత యింటికి వెళ్లింది. గుమ్మముదగ్గర గొలుసుతో కట్టివేసిన ఆడకుక్క కొత్తవారిని చూచి మొరిగి అడ్డపడ్డది. దేవస్మిత గమనించి "ఎందుకు వచ్చిందో ఈమె" అనుకొని చేటికను పంపి పరివ్రాజికను లోపలికి రమ్మన్నది. ఆదుర్మార్గు రాలు ఆశీర్వదించి ఆదరము అభినయిస్తూ దేవస్మితతో, "అమ్మా, నిన్ను చూడవలె నను కొంటూ ఉంటాను. నీవు స్వప్నములో కన బడ్డావు. అందుచేత ఉత్కంఠ కలిగి నిన్ను చూడవచ్చాను. భర్తతో వియోగము కలిగిన నిన్ను చూస్తే నాకు జాలి కలుగుతున్నది. కాంతునితో భోగము లేని రూపమూ, యౌవనమూ నిష్ఫలములు గదా!" అని, చాలాసేపు ఏవేవో మాటలు చెప్పి, మళ్ళీ వస్తానని వెళ్లిపోయింది. మర్నాడు పరివ్రాజిక మిరియాలపొడి చల్లిన మాంస ఖండము తీసుకుపోయి కుక్కకు వేసింది. అది చటుక్కున పట్టుకు తిన్నది. మిరియపుపొడివల్ల దానికళ్ళవెంటా ముక్కువెంటా నీరు కారింది. ఆధూర్తపరివ్రాజిక లోపలికివెళ్లి "అమ్మా, చూడు. కుక్క ఏడుస్తున్నది. జన్మాంతరములో నేను తన సఖి నని గ్రహించింది. నాకళ్ళుకూడా చెమ్మగిలినవి" అన్నది. దేవస్మిత కుక్కను చూచి ఆశ్చర్యపడ్డది.

తర్వాత పరివ్రాజిక ఇలా చెప్పింది: "అమ్మాయీ, పూర్వజన్మలో నేనూ ఈకుక్కా సవతులము. మాభర్త బ్రాహ్మణుడు. రాజుగారి ఆనతిప్రకారము మా భర్త తరుచుగా ఆ గ్రామమూ ఈ గ్రామమూ వెళ్లుతూ ఉండేవాడు. ఆయన దేశాంతరము వెళ్ళినప్పుడు శరీరారో గ్యము కోసము పరపురుషులతోటి సుఖంగా ఉండేదాన్ని. ఇంద్రియా లను క్షోభపెట్టడము మంచిదికాదు. నేను అందుచేత పూర్వజన్మ జ్ఞాన

ముతో పుట్టినాను. నా సవతి శీలము రక్షించుకొని వృథాక్లేశము పొంది కుక్క అయి పుట్టింది. పూర్వజన్మజ్ఞానముమాత్రము కోలుపోలేదు."

దేవస్మిత మనస్సులో ఆశ్చర్యపడి "గొప్పధర్మము! ఈ పరివ్రాజిక చాలా ధూర్తురాలు" అనుకొని మందహాసముచేసి "తల్లీ, ఇన్నాళ్ళూ నాకు ధర్మస్వరూపము గోచరించలేదు. ఇప్పటికి తెలిసింది. ఏప్రియునితోనైనా నాకు సమాగమము సమకూర్చగలవా! అమ్మా?" అని అమాయికముగా అడిగినట్టు అడిగింది. యోగకరండిక లోలోపల ఉప్పొంగిపోయి "తల్లీ, ద్వీపాంతరమునుంచి మన పట్నానికి వణిక్కుమారులు వచ్చారు. వాళ్ళను తీసుకు వస్తాను" అని చెప్పి వెళ్ళింది.

## వణిక్కుమారులకు శిక్ష

దేవస్మిత తనచేటికతో చాటుగా "చూచావా? వణిక్పుత్రులు కటాహద్వీపములో తనయజమానుని చేతిలో అమ్లానకమలముచూచి రహస్యము ఎలాగో గ్రహించి ఇక్కడికి దుర్బుద్ధితో వచ్చారు. ఈ పరివ్రాజిక వట్టి దౌర్భాగ్యురాలు. ఇది తార్పుడుకత్తె. వీళ్ళకు మనము తగినశాస్తి చేతాము. మీలో ఒకరు వెళ్ళి మనకుక్కకు ఇనుపకాలు త్వరగా చేయించుకు రావలి. ఉమ్మెత్తకలిపిన మద్యము తెప్పించాలి" అన్నది. వాళ్ళు ఆప్రకారమే చేశారు. ఒకచేటి దేవస్మితవేషము ధరించింది.

ఆనలువురు వణిక్కుమారులలో మరీ ఉబలాటపడుతున్నవానికి తన శిష్యురాలివేషము వేసి, అతనిని దేవస్మిత యింట్లో చల్లగా విడిచి పరివ్రాజిక వెళ్ళిపోయింది. ఆరాత్రి దేవస్మితవేషము ధరించిన చేటిక అతనిని గుర్తించి, చాలా ఆదరము నటించి మంచిమాటలు చెపుతూ, ఉమ్మెత్త కలిపిన మద్యము బాగా తాగించింది. వాడు ఒళ్ళుమరచి పడిపోయిన తర్వాత వాని వస్త్రాభరణాలు లాగివేసి, కుక్కచేత వానిముఖాన ఇనుపకాలిముద్ర కొట్టించి చేటికలు వానిని తీసుకుపోయి మురికిగుంటలో

పడవేసి వచ్చినారు. తెల్లవారుజామున మెళుకువ వచ్చి వాడు తన స్థితి తెలిసికొని పోయి స్నానముచేసి పరివ్రాజిక యింటికి దిగంబరము గానే వెళ్ళినాడు. స్నేహితులు నవ్వకుండా ఉండేందుకు కథ కల్పించి చెప్పినాడు. తాను వస్తూఉండగా దొంగలుకొట్టి యావత్తూ దోచు కొన్నట్టూ, జాగరణము చేతనూ, విశేషముగా తాగడము చేతనూ తల నొప్పిగా ఉన్నదనీ, చెప్పి ముఖాన ముద్ర కనపడకుండా తలకు గుడ్డ చుట్టుకొన్నాడు. మర్నాడు రాత్రి రెండవవాడు దేవస్మిత యింటికి వెళ్ళి మొదటివానికి జరిగిన శిక్షే పొంది వచ్చి, "ఆభరణాలు ఆమెయింటనే పెట్టి వచ్చాను. కాని తోవలో దొంగలు నన్ను కొట్టకుండా విడువలేదు." అని చెప్పి తలకు గుడ్డ చుట్టుకొని పడు కొన్నాడు. మిగిలిన యిద్దరికీకూడా అటువంటిశాస్తి యథాక్రమముగా జరిగింది. వణిక్పుత్రులు అవమానము పొంది, ముఖాలమీద ముద్రలు పడి ధనము కోల్పోయి చెప్పకుండా తామ్రలిప్తి విడిచివెళ్ళినారు.

పరివ్రాజిక శిష్యురాలితో దేవస్మిత యింటికి వెళ్ళింది. తాను కృతా ర్థురా లయినట్టు ఆమె లోలోపల మురిసిపోతున్నది. దేవస్మిత వాళ్ళను సాదరముగా ఆహ్వానించి కృతజ్ఞురాలివలె నటిస్తూ, ఉమ్మెత్త కలిపిన మద్యమును మంచిమాటలతో తాగించి, మురికిగుంటలోకి తోయించింది.

వణిక్పుత్రులు కటాహద్వీపము చేరిన తర్వాత తన భర్తకు ఏమి అపకారము చేస్తారో అని భయపడి జరిగిన వృత్తాంతము తన అత్త గారికి వివరించింది. దానికి అత్త సంతోషించి "అమ్మాయీ, నీవు చేసినపని యుక్తమే కాని అక్కడ అబ్బాయికి ఏమయినా కీడు చేస్తా రేమో అనిపిస్తున్నది" అన్నది. "అత్తా, పూర్వము శక్తిమతి తన ప్రజ్ఞచేత భర్తను కాపాడినట్టు నేనుకూడా మీకుమారుని కాపాడు తాను" అన్నది దేవస్మిత. శక్తిమతికథ చెప్పమని అత్తగారు అడి గితే, కోడలు ఇలా చెప్పింది:

## శక్తిమతి కథ

మాగ్రామములో పూర్వులు ఊరిమధ్య మణిభద్రస్వామి అనే యక్షవిగ్రహాన్ని ప్రతిష్ఠించారు. పౌరులు ఆస్వామికి మొక్కుకొని ఆయనపేర ముడుపులు కట్టుతారు. రాత్రివేళ పరస్త్రీతో సహా దొరికిన పురుషుని స్త్రీని పట్టుకుపోయి యక్షాలయ గర్భగృహములో బంధించి, తెల్లవారిన తర్వాత ప్రకటనచేసి, రాజు సన్నిధానానికి తీసుకుపోయి శిక్ష చేయించడము ఆచారము. ఒకరాత్రి కొత్వాలు పరస్త్రీయుతుడైన వర్తకుని పట్టుకుపోయి యక్షాలయములో పెట్టి బయటపెద్దగడియ వేసినాడు. వర్తకుని భార్య శక్తిమతికి ఈసంగతి ఆరాత్రే తెలిసింది. ఆమె ధైర్యము వహించి, చేటికలతో, పూజాద్రవ్యములతో యక్షాలయానికి వెళ్ళింది. పూజారి ధనాశచేత ఆమెకు తలుపు తీయించడానికి కొత్వాలుతో "ఈమెఎవరో పూజార్థము వచ్చింది. లోపలికి వెళ్ళనీయవచ్చు" నని చెప్పి ఒప్పించినాడు, ఆమె పరస్త్రీతోకూడా అందులో వెల వెల బోతున్న భర్తను ఓదార్చి, ఆస్త్రీకి తనవేషము వేసి పంపి, తాను అక్కడే కూర్చున్నది. తెల్లవారినతరువాత రాజపురుషులు వచ్చి వారు భార్యాభర్తలని తెలుసుకొని వారిని విడిచిపెట్టి కొత్వాలును మందలించినారు.

## దేవస్మిత కటాహద్వీపమునకు పోవుట

అత్తగారిని సమాధాన పరచి దేవస్మిత పురుషవేషము ధరించి చేటికలకు కూడా వేషాలు వేసి వర్తకానికని కటాహద్వీపానికి బయలు దేరింది. అక్కడికి చేరి యితర వర్తకుల మధ్య తనభర్తను చూచింది. పురుషవేషముతో ఉన్న తన భార్యను ఆతడు చూచి ఎందుకో ఆనందము కలిగి ఇతడు తనభార్యవలె ఉన్నాడనుకొన్నాడు. దేవస్మిత రాజుసన్నిధికి పోయి "దేవా, నా దొకమనవి ఉన్నది. ప్రధానపౌరు

లను ఇక్కడికి రప్పించ ప్రార్థన" అన్నది. కుతూహలము కలిగి రాజు ఆప్రకారముగా ఆజ్ఞయిచ్చినాడు. "ప్రభూ, వీరిలో నా బానిసలు నలుగు రున్నారు. దేవరవారు వారిని నాకు ఇప్పించాలి" అన్నది. "మంచిది. నీబానిసలను గుర్తించి తీసుకు వెళ్ళవచ్చును" అన్నాడు రాజు. తామ్రలిప్తిలో తనయింట శాస్తి పొంది వచ్చిన నలుగురు వణిక్పుత్రు లను గుర్తించి వీరని చెప్పింది. వైశ్యప్రముఖులకు కోపము వచ్చి "వీరు గొప్పవణిక్పుత్రులు. నీకు బానిస లేమిటి!" అని మందలించి నారు. "మీకు నమ్మకము లేకపోతే వీరిముఖాలకు చుట్టిన వస్త్రాలు తీయించి చూడండి. కుక్కకాలితో నేను వేయించిన పాదముద్రలు ఉంటవి." అన్నది దేవస్మిత. ఆప్రకారము చేసి చూస్తే వాళ్ళముఖాల మీద శునక పాద చిహ్నాలు కనబడినవి. అందరూ ఆశ్చర్యపడ్డారు. వర్తకులు సిగ్గుపడ్డారు. ఆశ్చర్యముతో "ఈ వృత్తాంతము యావత్తు వివరించవలసింది" అని రాజు కోరినాడు. దేవస్మిత యావద్వృత్తాం తమూ తెలియచెప్పింది. న్యాయతః వీరు నీకు దాసులే అన్నాడు రాజు. వర్తకులు ఆమెకు చాలా ధనమూనూ, ప్రభువుకు జరిమానానూ సమ ర్పించుకొని ఆ నలుగురినీ విడుపించుకొన్నారు. దేవస్మిత భర్తతోను చేటికలతోను ధనముతోను బయలుదేరేటప్పుడు జనుల పూజలు పొంది తామ్రలిప్తికి వచ్చి సుఖముగా ఉన్నది. అటుతర్వాత భార్యాభర్తలు ఒకరి నొకరు ఎన్నడూ విడిచి ఉండలేదు.

దేవీ, ఉన్నత వంశసంభూతలు పవిత్ర సాహస కృత్యములచేతనూ, ఏకాగ్రనిష్ఠచేతనూ భర్తను సేవిస్తూ ఉంటారు. పతివ్రతలకు భర్తే పరదేవత.

వసంతకుడు చెప్పిన ఈకథ విని వాసవదత్త చాలా సంతోషించింది. పుట్టిల్లు విడిచి వచ్చి కొద్దికాలమే కావడముచేత సిగ్గు తగ్గలేదు. అది

వరకే ఉదయునునిమీద ఆమెకున్న అనురాగము ఈ కథవల్ల మరింత గాఢ మయింది.

## తరంగము : ౧౮

ఇంతలో చండమహాసేనునిదూత వచ్చి నమస్కారము చేసి "దేవా, మా మహారాజు తమకు ఇలా సందేశము పంపినాడు. మీరు వాసవదత్తను తీసుకొని వెళ్ళడము సమంజసమే. మిమ్ము మేము ఉజ్జయినికి తీసుకొని వచ్చిన ఉద్దేశము ఇదే. బంధనములో ఉన్నప్పుడు మీకు వాసవదత్తను ఇస్తే మాయెడల మీకు అభిమాన ముండదని ఇవ్వలేదు. మాబిడ్డకు యథావిధిగా వివాహము అయ్యేలాగున కొంచెము మీరు ఓర్పు వహించవలె. అచిరకాలములోనే మాగోపాలుడు వచ్చి శాస్త్రీయముగా చెల్లెలి వివాహము చేయిస్తాడు" అని విన్నవించి వాసవదత్తకుకూడా నివేదించినాడు. ఆమె చాలా సంతోషించింది. "గోపాలునికోసము మీ యుభయులు ఎదురుచూస్తూ ఇక్కడే ఉండండి. అతనితోకూడా కౌశాంబికి రండి" అని వచ్చిన ప్రతీహారునితో, పుళిందకునితో చెప్పి వత్సరాజు వాసవదత్తతో కౌశాంబికి మరునాడు ప్రాతఃకాలము బయలుదేరి మూడురోజులలో స్వరాష్ట్రము చేరి ఒక రాత్రి రుమణ్వంతుని భవనములో విశ్రమించి, పౌరు లందరూ తన ఆగమనానికి ప్రతీక్షిస్తూ ఉత్కంఠతో ఉండగా మహావైభవముతో నగరప్రవేశము చేసినాడు. వాసవదత్తతో ఉదయనుడు నగరవీథులలో రథములో వెళుతూ ఉంటే పౌరాంగనలు పుష్పములు చల్లి మంగళ హారతులు పట్టినారు. ఎటు చూచినా, దర్శనార్థము వచ్చిన సామంత ప్రభువులు, వందిమాగధులు, మంగళగీతములు.

త్వరలోనే గోపాలుడు ప్రతీహార, పుళిందకులతో కలిసి కౌశాంబికి చేరినాడు. వత్సరాజు అతనికి ఎదురుపోయి ఆదరము చూపినాడు.

వాసవదత్త అన్నను చూచి హర్షవిహ్వాల అయినది. గోపాలుడు తండ్రిగారి సందేశాలను తెలిపి చెల్లెలికి ధైర్యాన్ని పురికొల్పినాడు. అన్నగారిరాకవల్ల ఆమెకు చిత్తశాంతి కలిగింది.

## వాసవదత్త వివాహము

మర్నాడు గోపాలుడు వాసవదత్తా వత్సరాజులకు వివాహము చేయించినాడు. గోపాలుడు ఇచ్చిన రత్నాలవల్లనూ సామంతులు సమర్పించిన కానుకలవల్లనూ కోశము నిండిపోయింది.

గోపాలకుని పుళిందకుని వత్సరాజు న్యాయముగా సన్మానించి, తక్కిన వారిని ఉచితరీతిని సత్కరించడానికి యౌగంధరాయణ రుమణ్వంతులను నియోగించినాడు. "రాజు చాలా కష్టమైన కార్యభారము మనమీద పెట్టినాడు. జనరంజనము మహాకష్టము. మెప్పించలేకపోతే కేవలము బాలునివల్ల కూడా కీడు కలుగుతుంది" అని యౌగంధరాయణుడు ఈ కథ చెప్పినాడు.

## బాల వినష్టకుని కథ

పూర్వము రుద్రశర్మ అనే బ్రాహ్మణునికి ఇద్దరు భార్య లున్నారు. అందులో ఒకతె పుత్రుని కని చనిపోయింది. ఆపిల్లవాణ్ణి సవతితల్లి పెంచుతున్నది. వాడు కొంత ఎదిగినతర్వాత అన్నములో నెయ్యి వెయ్యడము మానివేసింది. వాడికి పొట్ట పెరిగింది. ఒంటిమీద బూడిద వన్నె ఏర్పడ్డది. "ఏమిటి, వీడు ఇలాఉంటున్నాడు?" అని భర్త అడిగితే ఆమె "వీడికి నెయ్యి మొదలయినవి వేసి అన్నం పెట్టుతున్నా ఇలా ఉంటున్నాడు. నేనేమి చెయ్యను!" అన్నది. ఆకుర్రవాడిటీరే అంత అనుకొని బ్రాహ్మణుడు ఊరుకొన్నాడు. స్త్రీల తియ్యని మోసపు మాటలకు ఎవడు లొంగిపోడు? బాల్యములోనే వినష్టు డయినాడని వానికి బాలవినష్టకుడు అనే పేరు వచ్చింది. బాలునికి అయిదేళ్లు వచ్చి

నవి. "ఈమె నన్ను ఎప్పుడూ వేధిస్తున్నది. దీని కేదో చెయ్యాలి" అని ఆలోచించి కొలువుకూటమునుంచి తండ్రి యింటికి రాగానే వాడు "నాన్నా, నాన్నా, నాకు ఇద్దరు నాన్నలే!" అని ఒంటరిగా అస్పష్టముగా ఒకనాడు అన్నాడు. ఇలా కొన్నిరోజులు తండ్రికి ఎదురుగా వెళ్ళి అనడము సాగించాడు. రుద్రశర్మ భార్యమీద అనుమానపడి ఆమెను తాకడము కూడా మానివేసినాడు. భార్యకు సంశయము కలిగి "చిత్రంగా ఉన్నది! నావల్ల ఏదోషమూ లేనిదే భర్త కోపించి అప్రసన్నంగా ఉన్నాడు. ఈ బాలవినష్టకుడు ఏమయినా చేసి ఉంటాడా?" అనుకొని వాడిని ఆదరముతో చూచి అభ్యంగనస్నానము చేయించి బాగా నెయ్యి వేసి అన్నము పెట్టింది. భోజనానంతరము చల్లని వాక్కుతో "నాయనా, నాన్నగారితో నన్నుగురించి ఏమయినా చెప్పావా?" అని అడిగింది. బాలవినష్టకుడు సవతితల్లితో ధైర్యముగా "ఇప్పటినుంచి అయినా నన్ను సరిగా చూడక పోతే నాన్నగారితో ఇంకా ఇంకా చెపుతాను! మీఅబ్బాయిని బాగా ఆడించి పోషణ చేస్తావే, నాకుమాత్రం చెయ్యకూడదేం! నన్ను రోజూ వేధిస్తావు!" అన్నాడు. ఆవిడ ఒట్టుపెట్టుకొని "నిన్ను చక్కగా చూస్తా, ఎన్నడూ కష్టపెట్టను. మరి నాన్నగారికి నామీద కోపం పోగొట్టు" అని బాలుని బతిమాలుకొన్నది. "మానాన్నగారు రాగానే పనికత్తెచేత ఆయనకు అద్దము చూపించమని చెప్పు. తర్వాత సంగతులు నేను ఆలోచిస్తాను" అన్నాడు బాలవినష్టకుడు. ఆనాడు రుద్రశర్మ యింటికి రాగానే అతనికి అద్దము చూపినారు. బాలవినష్టకుడు అద్దములో ప్రతిబింబము కేసి చూపుతూ "నాన్నా, నాన్నా, ఇడిగో రెండో నాన్న!" అన్నాడు. ఆమాటలకు రుద్రశర్మ ఆలోచనాపరుడయి, "నిష్కారణంగా భార్యమీద అనుమాన పడ్డానే" అని విచారపడి అప్పటినుంచీ ఆమెను సుముఖముగా చూడడము ప్రారంభించినాడు.

కుర్రవానికి కోపము వచ్చినప్పటికీ ఎంతపని అయినా జరుగుతుంది. కాబట్టి మనము అందరికీ ఉచితసత్కారాలు చెయ్యవలె.

ఈవిధముగా చెప్పిన తర్వాత అందరికీ జాగరూకతతో మర్యాదలు జరిగినవి. యౌగంధరాయణ, రుమణ్వంత, వసంతకులకు రాజు స్వయముగా వస్త్రాభరణాదు లిచ్చి మైపూతలు పూసి గ్రామము లిచ్చి సత్కారము చేసినాడు.

గోపాలకుడు వివాహోత్సవము జరిగిన కొద్దిరోజులకు ఉజ్జయినికి వెళ్ళడానికి వత్సరాజును సెలవు అడిగినాడు. మళ్ళీ త్వరలో రావలెనుసుమా! అని వీడ్కోలు సమయాన వత్సరాజు అన్నాడు.

## బంధుమతీ పరిణయము

గోపాలకుడు ఒకరాజ్యములో పట్టి తెచ్చిన బంధుమతీ అనే రాజకన్యను వాసవదత్తకు కానుకగా పంపినాడు. మంజులిక అని మారు పేరు పెట్టి ఆమెను వాసవదత్త రాచనగరిలో గుప్తముగా ఉంచింది. ఒకనాడు వత్సరాజు వసంతకుని సాయముతో మంజులికను కనిపెట్టి పుష్పోద్యానములో పూపొదరింట్లో గాంధర్వ విధానప్రకారము ఆమెను పెళ్ళి చేసుకున్నాడు. వాసవదత్త కనిపెట్టి వసంతకుని బంధించి తీసుకు వెళ్ళింది. వాసవదత్త పుట్టింటినుంచి వచ్చిన సాంకృత్యాయని అనే పరివ్రాజికను వత్సరాజు ఆశ్రయించినాడు. ఆమె నేర్పుతో వాసవదత్త అలక తీర్చింది. వాసవదత్త బంధుమతిని వత్సరాజు కిచ్చింది. వసంతకుని బంధనములోనుంచి విడిపించింది. పతివ్రత హృదయము కుసుమసుకుమారముకదా! వసంతకుడు వచ్చి రాణిసముఖాన నిలిచి "దేవీ! బంధుమతి ప్రభువుమనస్సుహరించింది. నేనేమిచేశాను. తాచుపాముమీాది కోపముతో మీారు రెండుతలలపామును కొట్టినారు." అని నవ్వినాడు.

"ఏమి టాఉపమానము ? కొంచెం వివరించి చెప్పు" అని వాసవ దత్త కుతూహలముతో అడిగింది. వసంతకుడు ఇలా చెప్పినాడు :

### రురు దుండుభ కథ

పూర్వము రురువు అనేమునిపుత్రుడు యథేచ్ఛగా సంచరిస్తూ, మేనకకూ ఎవరో విద్యాధరునికీ కలిగిన ప్రమద్వర అనే సుందరిని చూచినాడు. చూచి, ఆమెను పెంచుతున్న స్థూలకేశు డనే మునివద్దకు వెళ్లి ప్రమద్వరను తన కిచ్చి వివాహము చెయ్య మన్నాడు. ముని అంగీకరించినాడు. వివాహకాలము సమీపిస్తుండగా ప్రమద్వరను పాము కరిచింది. రురుడు విచారముతో ఉండగా ఆకాశవాణి "విప్రుడా, ప్రమద్వర ఆయువు మూడింది. నీ ఆయుస్సులో సగభాగమిచ్చి ఆమెను బతికించుకో" అని వినబడ్డది. తక్షణమే రురుడు తన ఆయుస్సులో అర్ధభాగ మామెకిచ్చినాడు. ఆమె జీవించింది. తర్వాత వివాహముజరిగింది.

అప్పటినుంచీ రురుడు ఎక్కడ పాము కనబడినా, ఈ సర్పమే నాప్రియురాలిని కాటువేసి ఉంటుంది, అని కోపముతో కొట్టిచంపేవాడు. ఒకనాడు దుండుభము (రెండుతలల సర్పము) కనబడితే బడితెతో రురుడు కొట్టబోయినాడు. దుండుభము మనుష్యవాక్కులతో "బ్రాహ్మణుడా, నాగుపాముమీద ఉన్న కోపం రెండుతలలపాము మీద చూపిస్తున్నావేమి ? నీభార్యను కరిచింది నాగుపాము. రెండు తలల పాములకు విషం ఉండదు" అన్నది. "నీ వెవరు ?" అన్నాడు రురుడు. "శాపవశాన సర్పజన్మ ఎత్తిన ఋషిని. నీతో సంభాషణవల్ల నాకు శాపవిమోచన మయింది." అని వెంటనే అంతర్ధాన మయింది. నాటినుంచీ రురుడు సర్పసంహారము మానుకున్నాడు.

దేవీ, తాచుపాముమీద కోపముచేత రెండుతలల పామును కొట్టినాడు. అని నేను అలంకారరూపముగా అన్నానని వసంతకుడు నవ్వి

నాడు. భర్తసన్నిధానములోనే ఉన్న వాసవదత్త మందహాసము చేసింది.

వత్సరాజు మధ్య మధ్య వాసవదత్తకు కలిగే ప్రణయకోపము పోగొట్టుతూ, వసంతకుని చమత్కార వాక్యాలకు ఆనందిస్తూ, ఉన్నాడు. అతని జిహ్వా మదిరారసముతోనూ, కర్ణములు వీణా కల రవముతోనూ, నేత్రములు ప్రియురాలి ముఖవీక్షణముతోనూ ఆమోదము పొందుతున్నవి.

## తరంగము: ౧౫

నిర్విఘ్న విశ్వ నిర్మాణ
సిద్ధయే యదనుగ్రహమ్
మన్యే న వక్రే ధాతాఽపి
తస్మై విఘ్నజితే నమః!

ఆశ్లిష్యమాణః ప్రియయా
శంకరోఽపి యదాజ్ఞయా
ఉత్కంపతే స భువనం
జయ త్యసమసాయకః.

నిర్విఘ్నముగ విశ్వనిర్మాణమునకు
యదనుగ్రహార్థమై అబ్జసంభవుని
యంతవాడును సైత మర్చించినాడో,
అట్టి విఘ్నేశున కంజలి గూర్తు!

ఎవని యానతిచేత, ఈశుడు కూడ
కాంతాసమాశ్లిష్ట గాత్రుడై యయ్యు
ఉత్కంప మొందుచు నుండునో, అట్టి
విషమ సాయకుడా ఈ విశ్వవిజేత.

## దిగ్విజయ సమాలోచన

వత్సేశ్వరుడు వాసవదత్తయందు క్రమముగా సుఖాసక్తుడై మన సంతా ప్రియురాలిమీదే లగ్నము చేసినాడు. యౌగంధరాయణుడూ సర్వసేనాధిపతి అయిన రుమణ్వంతుడూ రాజ్యభారము వహించినారు. యౌగంధరాయణుడు ఒకరాత్రి రుమణ్వంతుడితో ఇలా ఆలోచన చేసినాడు. "పాండవవంశంలో జన్మించిన మనప్రభువు వత్సరాజ్యానికి వల్లభుడు. కులక్రమాగతంగా ప్రభువుల కందరికీ ఎప్పుడూ హాస్తిపురం రాజధానిగా ఉండేది. మనవత్సేశ్వరుడికి ఆపట్టణము రాజధానీ నగరం కావాలి. శత్రువులను జయించా లనే ఇచ్ఛ వదిలి, పరిమితమయిన రాజ్యముతో తృప్తి పడి, మనరాజు కాముకుడై మృగయాసక్తుడై నిశ్చింతగా ఉన్నాడు. రాజ్యభార మంతా మనమీద పెట్టినాడు. కులక్రమాగతంగా ఉన్న సమస్తరాజ్యభారాన్ని మహారాజు వహించేటట్లు మనంచేయాలి. అలా చేయగలిగితే మనరాజభక్తి, కార్యాచరణశక్తి చరితార్థ మవుతవి. అది ఎలా సాధ్య మవుతుం దని విచారించవలసిన పనిలేదు. సమస్తకార్యములనూ ధీకౌశలమువల్ల సాధించవచ్చును.

## మహాసేనుని కథ

మహాసేను డనే మహారాజు ఉండేవాడు. ఒకసారి అతనిని బలవంతు డయిన శత్రువు ఎదిరించేటప్పటికి, అతడు చలించిపోయినాడు. మంత్రులు మహారాజు పిరికితనము చూచి ఆలోచించి, కార్యము చెడకుండా రక్షించా లని, ఆయనచేత విరోధిరాజుకు నమస్కారము చేయించారు. గండం గడిచి గట్టెక్కినాడు. శత్రువుకు ప్రణామం చేయవలసి వచ్చిందే అని మహారాజు అభిమానంతో విచారించాడు. మనోవ్యధతో అతడు కుమిలి కుమిలి పోగా గర్భములో గుల్మం పుట్టింది. అత డాబాధ పడ లేక

చనిపోవడానికి ఉద్యమించేటప్పటికి, మతిమంతు డయిన వైద్యుడు రోగ నిదానం గ్రహించి, ఔషధానికి సాధ్యము కాదని తెలిసికొని రాజుతో యుక్తిగా అబద్ధమాడినాడు: "మహారాజా! పట్టమహిషి మీబాధ చూచి భరించలేక గుండె పగిలి చనిపోయింది" అనే వైద్యుడి మాటలు విని మహాసేనుడు చెట్టు కూలినట్టు శోకంతో నేలమీద కూలినాడు. గర్భగోళం శోకంవల్ల బాగా కదిలింది. గుల్మరోగం దానంతట అదే తగ్గిపోయింది. రోగం కుదరగానే రాజు రాణితో ఇష్టభోగాలు అనుభవించి, శాత్రవుల్ని ఎదిరించి విజయము పొందినాడు. సద్యఃస్ఫూర్తితో ఆవైద్యుడు మహాసేనుడికి ఎలా ఉపకారం చేశాడో అలాగే మనంకూడా వత్సరాజు హితంకోరి, బుద్ధిబలంవల్ల కార్యం సాధించాలి. భూమండలం మనకు కావాలి. ప్రస్తుతం మనకు మగధరాజయిన ప్రద్యోతుడు పరమశత్రువు. అతడు మన కెప్పుడూ అనర్థమే చేస్తాడు. అందుకు మనము ఉపాయము ఆలోచించవలె. ప్రద్యోతునికి పద్మావతి అనే పుత్రిక ఉన్నది. ఆమెను మన వత్సేశ్వరుడికి ఇస్తాడేమో వెళ్ళి అతన్ని అడుగుదాము. మన తెలివితేటలు ఉపయోగించి వాసవదత్తను ఎక్కడయినా దాచి, ఆమె నివసించే ఇంటికి నిప్పంటించి ఆమె దగ్ధమై పోయిందని వార్త వ్యాపింపచేయాలి. వాసవదత్త చనిపోయిం దనే మాట వెయ్యకపోతే మగధరాజు తనకుమార్తెను మనరాజుకు ఇవ్వడు. మునుపు ఒకసారి నేను ప్రద్యోతునితో పద్మావతీ వివాహ విషయం ప్రస్తావించగా ఆయన, "నా కుమార్తెమీద ప్రాణాలన్నీ పెట్టుకొన్నాను. మాఅమ్మయిని మీవత్సరాజుకు ఇవ్వను. వత్సరాజుకు వాసవదత్తమీద అనురాగం అధిక మట! "రెండు కొప్పులు ఒకచోట ఇమడ వంటారు. సవతి ఉండగా సంబంధం చెయ్యను" అన్నాడు. మన వత్సరాజు రాణీఉండగా ద్వితీయం చేసుకోడు. వాసవదత్త అగ్నిదగ్ధ అయిందని వాదు వేస్తే కార్యం చక్కబడుతుంది. మగధరాజు

ప్రద్యోతుడు మనరాజుతో సంబంధం చేసికొని స్నేహితు డవుతాడు. మనకు సహాయంగా ఉంటాడు. మొదట మనం పూర్వదిగ్విజయయాత్ర ఆరంభిస్తే, ప్రద్యోతుడు అల్లుడికి అండగా నడుముకడతాడు. భూమండల మంతా మన వత్సేశ్వరుని వశం అవుతుంది. అదీగాక పూర్వం అశరీర వాణి వత్సరాజు చక్రవర్తి అవుతా డన్నది. ”

యౌగంధరాయణుని మాటలు విని రుమణ్వంతుడు సమాధానము ఇచ్చినాడు: “మంత్రివర్యా! మీరు చెప్పిన పని సాహసంవల్లనే నెర వేరాలి. పద్మావతిని మన రాజేంద్రుడికి ఇప్పించడానికి ఇంత కపట నాటకం ఆడితే ఆమె తప్పక మనదే అవుతుంది. కపటోపాయంవల్ల కార్యసాధన మంచిది కాదంట్నారు పెద్దలు. అందుకు నిదర్శనంగా కథ వింటారా?”

## వైశ్యకన్యా మౌనవ్రతుల కథ

పూర్వము జాహ్నవీతీరాన మాకందిక అనే పట్టణంలో మౌన నిష్ఠతో ఒకసన్యాసి ఉండేవాడు. అతడు తిరిపె మెత్తుకొని జీవించాలని సంకల్పించేప్పటికి, కొంతమందిశిష్యులు ఆయనకోసము దేవాలయములో మఠము కట్టించినారు. ఒకరోజు ఆసన్యాసి భిక్షకోసము ఒక వైశ్యు నింటికి వెళ్ళినాడు. బిచ్చము వెయ్యడానికి అతనికుమార్తె గుమ్మము దాటి వచ్చింది. ఆ అందాలకుప్పను సన్యాసి చూచి మోహించినాడు. “అబ్బా! ఎంతకష్టం వచ్చింది!” అంటూ ఆయతి మౌనము వీడినాడు. వైశ్యుడు ఇంట్లోనుంచి యతిమాటలు విన్నాడు. సన్యాసి తిరిపెము తీసుకొని మఠానికి వెళ్ళినాడు. యతి ఎన్నడూ లేనిది మౌనముద్ర వదిలినా డేమని వైశ్యుడు ఆశ్చర్యపడి, సందేహనివారణ చేసుకోడానికి మఠానికి వెళ్ళినాడు.

"మా యింటికి భిక్షాటనకు వచ్చి మా అమ్మాయినిచూచి ఎంతకష్టం వచ్చిం దన్నా రేమి స్వామీ? మౌనవ్రతం భంగం చేశా రేమి" అన్నాడు. అప్పుడు సన్యాసి "నీకూతురు చక్కని చుక్క. అయితే ఆ అమ్మాయిలో శుభలక్షణాలు కనపడవు. ఆపిల్లను ఎవరికన్నా ఇచ్చి పెళ్ళి చేస్తే నీకుఆపదలు కలుగుతవి. నీవంశం నాశన మవుతుంది. అడి గావు కనక చెప్పాను. నీవు నాభక్తుడివి. అందువల్ల నీకీ సంగతి చెప్ప వలె నని మౌనం విడిచిపెట్టాను. ఈరాత్రి నీకూతుర్ని పెట్టెలో పెట్టి పెట్టెమీద మూకుడులో దీపం వెలిగించి, పేటికను గంగలో వదలిపెట్టు" అని ఉపదేశించినాడు.

సన్యాసి చెప్పినట్టు వైశ్యుడు చేసినాడు. భీరువుల చిత్తాలు అటు వంటివేకదా! ఆరాత్రి సన్యాసి తనశిష్యవర్గాన్ని పిలిచి "మీరు గంగాతీరానికి వెళ్ళి గట్టువెంబడి దీపంతోకూడా కొట్టుకువచ్చే పెట్టె పైకి తీసి నాదగ్గిరికి తీసుకురండి. పెట్టెలో సణుగుడు వినిపిస్తే లెక్క చెయ్యకండి" అని చెప్పినాడు. శిష్యులు గంగఒడ్డుకు వెళ్ళి పేటిక కోసం కనిపెట్టుకొన్నారు. అంతకుముందే ఒకరాజపుత్రుడు అనుచర వర్గంతో షికారుగా గంగాతీరానికి వచ్చినాడు. గండదీపముతో మంద సము నీళ్ళలో తేలుతూ వచ్చింది. రాజపుత్రుడు కుతూహలముతో ఆపెట్టెను ఒడ్డుకు పట్టించి తెరిపించినాడు. అందులోని వణిక్పుత్రికను చూచి మోహించి గాంధర్వ వివాహము చేసుకొన్నాడు. చమత్కా రము చేయా లని అనుకొని ఆపెట్టెలో పెద్దకోతిని ఉంచి, యథాపూర్వ ముగా పెట్టెమీద గండదీపము పెట్టి గంగలో వదిలి రాజపుత్రుడు ప్రియురాలితోకూడా వెళ్ళిపోయినాడు. మౌనస్వామివారిశిష్యులు గంగలో తేలుతూ వస్తున్న మందసము చూచి, తీరానికి తీసుకొని వచ్చినారు. సన్యాసి "శిష్యులారా! ఇందులో యక్షిణి ఉన్నది. నేను మంత్రశక్తివల్ల దాన్ని వశం చేసుకోవాలి. నేను మఠానికి పెట్టె

తీసుకుపోయి సాధిస్తాను. మీరీ రాత్రి ఇక్కడ కిక్కురుమనకుండా ఉండండి'' అన్నాడు.

కన్య తనచేతుల్లో చిక్కింది గదా అని సన్యాసి సంతోషము పట్టలేక పెట్టె తెరిచినాడు. తన దుర్నయము మూర్తీభవించినట్టు భీకరాకారముతో కోతి కోపముతో బెదిరి లేచి వాడిగోళ్ళతో సన్యాసి ముక్కూ చెవులూ కొరికి రక్కింది. కిచకిచలాడుతూ కోతి కుప్పిగంతులు వేసుకొంటూ వెక్కిరిస్తూ వెళ్ళిపోయింది. గురువు ముక్కూ చెవులూ తెగిపోయి రక్తము స్రవిస్తుంటే శిష్యులు యక్షిణీప్రభావ మనీ, గురువును బెడిసి కొట్టిందనీ అనుకున్నారు. ఊరంతా సన్యాసిసంగతి పొక్కింది. కుమార్తెకు అనుకూలు డయినభర్త దొరికినందుకు వైశ్యుడు సంతోషించినాడు. ఆమె సుఖముగా భర్తతో కాపరము చేస్తున్నది. కపటోపాయమువల్ల కార్యము సాధించా లని మహాప్రయత్నము చేసి మౌనసన్యాసి తాను తవ్వుకొన్నగోతిలో తనే పడినాడు.

వాసవదత్తా విరహమువల్ల మనమహారాజుకు బాధ సంక్రమించక ముందే మనము మేలుకోవలసి ఉంటుంది.''

యౌగంధరాయణు డిలా అన్నాడు: "నీమాట నిజమే. అయితే కార్యసాధనకు మరొకమార్గం కనబడదు. ఏపనీ చేయకుండా ఉంటే ఉన్నతీరుకూడా చెడుతుంది. మనకున్న గౌరవం పోతుంది. ప్రభువు అనాదరానికి పాత్రులం కావలసి వస్తుంది. సచివాయత్తసిద్ధి అయిన రాజుకు సచివులప్రజ్ఞ కార్యసాధనము. వారు ఉత్సాహశూన్యులయితే సిరిసంపదలకు నీళ్ళు వదలాలి. చండమహాసేనుడూ, మహారాణి వాసవదత్తా మనం చెప్పినట్టు వింటారు. కార్యసాధనకు వెనక్కు తీయవద్దు."

ఆమాటలు విని శంకించి రుమణ్వంతుడు అన్నాడు : "ప్రియురాలి వియోగంవల్ల ఎంతవివేకి అయినా బాధపడక మానడు. ఇక మన వత్సరాజు సంగతి వేరే చెప్పాలా ? ఈసందర్భంలో కథ వినండి;

## ఉన్మాదినీ దేవసేనుల కథ

పూర్వము బుద్ధిమంతుల్లో అగ్రగణ్యు డయిన దేవసేనుడు అనే రాజు శ్రావస్తి రాజధానిగా చేసుకొని రాజ్యపాలన చేస్తున్నాడు. ఆ నగరములో మహాధనవంతు డయిన ఒకవర్తకుడికి చక్కనిచుక్క కూతు రున్నది. ఆపిల్ల అందచందాలు చూచి చాలామందికి మతులు పోవడమువల్ల ఆ అమ్మాయికి ఉన్మాదిని అని పేరువచ్చింది. లోకాతీత మైన అందము చిదిమిపోసే ఈపిల్లను రాజుకు చెప్పకుండా ఎవరికీ ఇవ్వ కూడదు. అలా సంబంధము ఏ దయినా చేస్తే రాజుకు కోపము వస్తుం దని తండ్రి ఆలోచన చేసినాడు. రాజు దగ్గిరికి వెళ్ళి ఆవర్తకుడు తన కుమార్తెసంగతి నివేదించినాడు. "ఏలినవారు నాకుమార్తెను స్వీక రించాలి" అని. ఆమాట విని రాజు తనకు నమ్మకమయిన విప్రులను పంపి కన్య శుభలక్షణాలు కలదేమో చూచి రమ్మన్నాడు. బ్రాహ్మ ణులు ఉన్మాదినిని చూచి వెంటనే విరహము పట్టలేక మతులు పోగొట్టు కొన్నారు. కొంచెం సేపటికి తెలివి వచ్చింది. "మహారాజు ఈకన్యను వివాహము చేసికొన్న ట్లయితే రాజకార్యములకు నీళ్లు వదలి ఈమె తోనే లోకము ఉన్న దనుకొంటాడు. ఇం కే ముంది! అంతా నాశ నమే!" అని ఆబ్రాహ్మణులు ఒకమాటగా కూడబలుకుకుని రాజు దగ్గిరికి వెళ్లి కన్యకు శుభలక్షణాలు లే వని చెప్పినారు. రాజు ఆమెను స్వీకరించక పోవడముచేత వర్తకుడు తనకుమార్తెను సేనాధిపతికిచ్చినాడు.

ఒకనాడు మహారాజు వీధివెంట వెడుతూండగా ఉన్మాదిని అతన్ని మేడమీద మీదినుంచి చూచి ఒయ్యారంగా కనబరచింది. వెంటనే అతనికి మతిపోయింది. రాజమందిరానికి వెళ్ళి అతడు ఆలోచన చేసి ఉన్మాదినిగా గ్రహించినాడు. తాపము అధికమై మదనజ్వరము వచ్చింది. ఉన్మాదిని భర్త అయినసేనాధిపతి రాజు దగ్గిరికి వచ్చి ప్రణామము చేసి విన్నవించినాడు: "దేవా! నాభార్యను దేవాలయములో వదులుతాను,

ఏలినవారు దాన్ని దాసీగా స్వీకరిస్తే పరస్త్రీదోషము ఉండదు. తమరు అలా అనుగ్రహించండి" అని. "నేను పరస్త్రీముఖం చూడను. ఆమెను నీవు వదిలి వేస్తే అధర్మము ఆచరించినవాడివి అవుతావు. నేను నిన్ను దండించవలసి వస్తుంది." అన్న రాజు మాటలు విని మంత్రులు ఊరు కొన్నారు. క్రమముగా మహారాజు మదనజ్వరము తీవ్రమైపోవడంవల్ల చనిపోయినాడు. ధీరు డయిన ఆరాజే ఉన్మాదిని లేక నశించినప్పుడు, వాసవదత్త చనిపోయిం దనుకొని వత్సరాజు ఏమవుతాడో! "

యౌగంధరాయణుడు రుమణ్వంతుడి మాటలకు సమాధానము ఇచ్చి నాడు : "భావికాలములో శుభము చేకూరుతుందని రాజులు తత్కాల క్లేశము సహించగలరు! రావణ నాశనముకోసం, దేవతలు యుక్తిగా శ్రీరాముడికి సీతావిరహము కలిగించలేదా? అప్పుడు రామచంద్రుడు ప్రియావిరహము సహించలేదా?"

రుమణ్వంతుడు పలికినాడు : "రామాదులు దేవతలు. అందువల్ల వారు సర్వమూ సహించగలరు. మానవబుద్ధి అలా సహించలేదు. అందుకు నిదర్శనముగా కథ వినండి :

## యక్షిల్లకుని కథ

బహురత్నాఢ్య మైన మధురాపట్టణం ఉన్నది. అక్కడ యక్షిల్లకు డనే వైశ్యుడు ప్రియురాలే లోకముగా ఉంటున్నాడు. ఒకసారి అతడు పనిమీద ద్వీపాంతరం వెళ్ళవలసి వచ్చింది. కూడా భార్య ప్రయాణ మైనది. స్త్రీలమనస్సు, భావానురక్తము, విరహాసహము. ఆమె అందంగా అలంకరించుకొని ప్రయాణానికి సిద్ధపడుతున్నప్పుడు అతడు తీసుకొని వెళ్ళలేదు. భర్త వెడుతుంటే గుమ్మము దగ్గర నిలుచుని కళ్ళనీళ్ళు పెట్టుకొన్నది. అతడు కంటికి కనపడకుండా వెళ్ళేదాకా చూచి, దృష్టి పథము దాటిపోయినతరువాత ప్రియునిఎడబాటు సహించలేక నిలువునా

ప్రాణాలు విడిచింది. భార్య పోయిన సంగతి అతడు తెలుసుకొని వచ్చి సుందరపాండుర మైన ఆమె ముఖము చూచి, ఆమె శిరస్సు తొడపైన పెట్టుకొని దుఃఖించినాడు. అతని ప్రాణాలుకూడా వెంటనే ఎగిరిపోయి నవి. అన్యోన్యవిరహము వల్ల ఆదంపతులు మరణించినారు. అందువల్ల వత్సరాజుకు వాసవదత్తా విరహము కలగకూడదు.'' ఇలా శంకించి రుమణ్వంతుడు చెప్పగానే ధైర్యసాగరుడూ బుద్ధిశాలీ అయిన యౌగంధ రాయణుడు: "ఇదంతా నేను బాగా ఆలోచించి నిశ్చయానికి వచ్చాను. రాజకార్యములు సాధారణముగా ఇటువంటివే. అందుకు నిదర్శనము విను'' అని ఇలా ప్రారంభించినాడు :

## పుణ్యసేనుని కథ

పూర్వము ఉజ్జయినీనగరములో పుణ్యసేను డనే రాజుమీదికి బల శాలి అయిన పరరాజు దండెత్తి వచ్చినాడు. శత్రువును జయించడము సాధ్యముకాదని మంత్రులు ఆలోచించి, తమ రాజు చనిపోయినాడని మిథ్యావాదము పుట్టించి, అతన్ని ఒకచోట దాచినారు. మంత్రులు శవమును తెప్పించి రాజుకు తగిన రీతిగా దానిని దహన సంస్కారాలు చేయించి, శత్రురాజుతో "ప్రభూ! మాకు రాజు లేడు. నీవే మాకు రాజు కావాలి'' అంటూ దూతను పంపినారు. ఆ శత్రురాజు అందుకు సంతోషించి రాజసింహాసనము అధిష్ఠించినాడు. క్రమక్రమముగా రాజు స్కంధావారములో మంత్రులు భేదోపాయమువల్ల ఐకమత్యము పోగొట్టి నారు. సైన్యములో చీలికలు రాగానే మంత్రులు పుణ్యసేనుని బయ టకి తెచ్చి శత్రురాజునూ, అతని సేననూ వధించినారు. రాజకార్యాలు ఇలాగే ఉంటూ ఉంటవి. వాసవదత్తాదేవి కాలిపోయిందని వాదు పుట్టించి కార్యము ధైర్యంగా సాధించాలి.

యౌగంధరాయణుడు కృతనిశ్చయుడై అన్నమాటను రుమణ్వంతుడు "కర్తవ్యము ఇదే అని నిశ్చయించుకుంటే వాసవదత్తాదేవి అన్న

గోపాలకుని పిలిపించి, అతనితో సంప్రదించి కార్యము నెరవేర్చవలె" అన్నాడు. యౌగంధరాయణుడు అందుకు సరే నన్నాడు. మరునాడు మంత్రు లిద్దరూ గోపాలకుని దగ్గిరికి దూతను పంపి అతన్ని తీసుకు రమ్మన్నారు. గోపాలుడు రాగానే యౌగంధరాయణుడు కర్తవ్యము తెలియజేసినాడు. గోపాలుడు చెల్లెలు వాసవదత్త క్షేమమూ, రాజ హితమూ కోరి, యౌగంధరాయణుడి ఇంగితము అంగీకరించి "మంత్రి వర్యులు వన్నిన పన్నుగడ పసందుగా ఉన్నది. ప్రియురాలు అగ్నిలో కాలిపోయినదని బాధపడే వత్సరాజును కాపాడే ఉపాయము ఆలోచిం చాలి. ఉపాయసామగ్రి ఎంతయినా ఉండవచ్చును. అయితే మొదట రాబోయేకీడుకు వెంటనే ప్రతిక్రియ చేయవలె" అని చెప్పినాడు.

యౌగంధరాయణుడు చేయవలసినది ఇదివరకే ఆలోచించినాడు. "ఇందుకు విచారించడం అనవసరము. గోపాలకునికి చెల్లె లంటే ప్రాణం. ఇతనికి దుఃఖము స్వల్పముగా ఉండడము చూచి వత్సరాజు వాసవదత్త జీవించి ఉన్న దని ఆసతో మనస్సు చిక్కబట్టి జీవిస్తాడు. త్వరలోనే వత్సరాజుకు పద్మావతి భార్య అవుతుంది. ఆతర్వాత రాజు వాసవ దత్తను కలుసుకొంటాడు. వాసవదత్తా వత్సరాజులను యుక్తివల్ల లావాణకప్రదేశానికి తీసుకొనిపోదాము. మగధరాజ్యాన్ని అంటిఉన్న ఆప్రదేశము వేటకు అనుకూలముగా ఉంటుంది. అందుచేత వత్సరాజు వేటకు వెళ్ళినసమయము చూచి వాసవదత్త నివసించే అంతఃపురానికి నిప్పంటించి మనఉపాయము సాధించుదాము. వాసవదత్తాదేవిని యుక్తిగా పద్మావతీగృహములో ఉంచుదాము. గుప్తముగా ఉన్న వాసవదత్తనడవడి కనిపెట్టి పద్మావతి సాక్షిణిగా ఉంటుంది."

ఇలా రాత్రి వారంతా ఆలోచన చేసి రాజసన్నిధానానికి వెళ్ళినారు. రుమణ్వంతుడు వత్సరాజుతో "దేవా! మనము లావాణకము వెళ్ళితే అక్కడ అందమయిన వేటభూము లున్నవి. ఆదేశాన్ని మగధరాజు

బాధిస్తున్నాడు. ఆ దేశరక్షణకోసమూ, వినోదార్థమూ మనము అక్కడికిపోదాము" అన్నాడు. వత్సరాజు వాసవదత్తతో లోకము కల్పించుకోవడంవల్ల రుమణ్వంతుడి మాటలు నచ్చి, లావాణకము వెళ్ళడానికి ఉద్యుక్తుడయినాడు.

మర్నాడు ముహూర్తము స్థిరపరచినారు. మహారాజు ప్రియాసహితముగా ప్రయాణమయినాడు. నారదమునీంద్రుడు అతనికి సాక్షాత్కరించి పారిజాత ప్రసవమాల ప్రీతితో ఇచ్చి వాసవదత్తాదేవికి కామదేవాంశసంభూతుడూ విద్యాధరచక్రవర్తీ అయ్యేకుమారుడు కలుగుతాడని ఆశీర్వదించినాడు. నారదుడు యౌగంధరాయణుడు వినేవిధముగా వత్సరాజుతో పలికినాడు: "రాజా! నీప్రియురాలిని చూచేప్పటికి నాకొకటి జ్ఞాపకము వస్తున్నది. పూర్వము నీతాతముత్తాతలు ధర్మరాజాదులు ఉండేవారు కదా. వారయిదుగురికీ ద్రౌపది ఒక్కతే భార్య. ఆమెకూ వాసవదత్తవలె సాటిలేని చక్కదనము ఉండేది. అందువల్ల దోష మూహించి వారితో మీరు స్త్రీవైరము రానియ్యక జాగ్రత్తగా ఉండాలి," అన్నాను. అదే లోకంలో ఆపదలకు కారణము అందుకు నిదర్శనంగా ఈకథ విను:

## తిలోత్తమ కథ

"పూర్వము సుందోపసుందులనే ఇద్దరు అన్నదమ్ములు రాక్షసులున్నారు. వారు పరాక్రమంవల్ల మూడులోకములూ ఆక్రమించి అజేయులైనారు. వారిని నాశనం చేయడానికి బ్రహ్మ విశ్వకర్మచేత తిలోత్తమ అనే దేవతాంగనను సృష్టిచేయించినాడు. ఆమె బ్రహ్మచుట్టూ ప్రదక్షిణము చేస్తుండగా, నాలుగు దిక్కులా ఆమెఅందము చూడవలెనని బ్రహ్మదేవుడు చతుర్ముఖుడయినాడు. బ్రహ్మ ఆజ్ఞ శిరసావహించి తిలోత్తమ సుందోపసుందులను మోహంలో ముంచెత్తడానికి కైలాస

వనవాటికకు వెళ్ళినది. ఆరాక్షసులు కామోద్రేకములో దగ్గిరికి వచ్చిన ఆసుందరిని ఆలింగనం చేసుకొన్నారు. తిలోత్తమ నాకు కావా లంటే నాకు కావా లని వారిద్దరూ పరస్పరము యుద్ధం చేసి మరణించినారు.

స్త్రీ అన్ని ఆపదలకూ మూలము. మీపాండవు లందరికీ ద్రౌపది ఒక్కతే భార్య కనుక స్పర్ధరాకుండా మీరు ప్రవర్తించాలి. ఏదో ఒకయేర్పాటు చేసుకొనండి. ద్రౌపది పాండవులలో పెద్దవాడిదగ్గిర ఉన్నప్పుడు, చిన్నవాడు ఆమెను తల్లిగా చూడవలసిది. చిన్నవాడి దగ్గిర ఆమె ఉంటే, పెద్దవాడు ఆమెను కోడలిగా చూడమనీ నేను చెప్పినాను. రాజా! మీతాతముత్తాతలు నామాట పాటించినారు. నీకో మాట చెవుతున్నాను. మీతాతలవలె నీవూ నీమంత్రులమాట పాటించు. ఈవిధముగా చేస్తే నీకు కల్యాణము కలుగుతుంది. కొంత కాలము నీకు దుఃఖము ప్రాప్తించినా అప్పుడు అతివైరాగ్యము కూడదు. ఆదుఃఖము ఆఖరికి సుఖంగా పర్యవసిస్తుంది.''

నారదుడు అంతర్ధాన మైనాడు. రాబోయే కల్యాణమును అతడు సూచించి వెళ్ళినాడు. ఆయన అన్నట్టుగా యౌగంధరాయణాది మంత్రి పుంగవులు తమకోరిక సఫలము చేసుకోవలె నని నిశ్చయించి కార్య తత్పరు లయినారు.

యౌగంధరాయణాది మంత్రులు యుక్తిచేత వాసవదత్తా వత్సరాజు లను లావాణకము తీసుకొని పోయినారు. వత్సరాజు సైన్యసమేతముగా వచ్చినా డని మగధరాజు తెలుసుకొని తనమీద దండయాత్ర చేస్తా డేమో నని భయపడి, యౌగంధరాయణుడి దగ్గిరికి దూతను పంపి నాడు. మంత్రి ఆదౌత్యము అంగీకరించినాడు. వత్సరాజు లావాణక ములో వేటకై దుర్గమారణ్యాలకు వెడుతూ ఉండేవాడు.

## వాసవదత్తా మందిర దహనము

ఒకరోజు రాజు వేటకు వెళ్ళినాడు. యౌగంధరాయణుడు మహారాజుకు చేయవలసిన ఏర్పాట్లు చేసి, గోపాలక, రుమణ్వ, వసంతకులతో కూడా వాసవదత్త దగ్గిరికి వెళ్ళినాడు. అన్న గోపాలకుడు చెల్లెలు వాసవదత్తకు హెచ్చరిక చేసి, రాజకార్యములలో సాయము చేయవలె నని కోరినాడు. మంత్రి తలపెట్టిన ఉపాయము, భర్తతో కొంతకాలము ఎడబాటు కలిగించే దయినా వాసవదత్త అంగీకరించింది. కులాంగనలు భర్తల కొరకై కష్టములు సహిస్తారు. యౌగంధరాయణుడు వాసవదత్తను బ్రాహ్మణీ వేషము ధరించ మన్నాడు. రూపము మార్చుకొనే యోగము ఆమెకు ఉపదేశము చేసినాడు. మంత్రి ఆదేశమును అనుసరించి వసంతకుడు ఏకాక్షి, బ్రహ్మచారిగా మారినాడు. యౌగంధరాయణుడు వృద్ధ బ్రాహ్మణరూపము తెప్పించుకొన్నాడు. అనంతరము అతడు వాసవదత్తనూ, వసంతకుణ్ణీ వెంట పెట్టుకొని మగధదేశము వెళ్ళినాడు. ఆమె శరీరము మగధకు వెళ్ళిందే కాని మనస్సుమాత్రము వత్సరాజు దగ్గిరికే వెళ్ళింది. ఈలోగా రుమణ్వంతుడు వాసవదత్తాదేవి వాసగృహానికినిప్పంటించినాడు. “అయ్యో! అయ్యో! వాసవదత్తాదేవీ వసంతకుడూ కాలిపోయినారు!” అని గగ్గోలు పెట్టినాడు. ఏకకాలములో పుట్టిన దహనరోదనాలు విజృంభించగా కొంతసేపటికి అగ్ని చల్లారిందే కాని రోదనము తగ్గలేదు.

## వాసవదత్తను పద్మావతివద్దకు చేర్చుట

యౌగంధరాయణుడు వాసవదత్తా వసంతకులతో మగధ చేరినాడు. అతడు ఉద్యానపాలకులు అడ్డగిస్తున్నప్పటికీ లక్ష్యము చెయ్యక వనములో మగధరాజపుత్రికదగ్గిరికి వెళ్ళినాడు. పద్మావతి బ్రాహ్మణీ రూప

ములో ఉన్న వాసవదత్తను కన్నులార కాంచినది. ఆమెహృదయములో వాసవదత్తమీద చెప్పలేనంతప్రీతి ఏర్పడినది. వృద్ధబ్రాహ్మణ వేషములో ఉన్న యౌగంధరాయణుడితో పద్మావతి "బ్రాహ్మణోత్తమా! ఈమె నీ కే మవుతుంది? ఇక్కడికి ఎందుకు వచ్చావు?" అన్నది. యౌగంధ రాయణుడు "రాజపుత్రీ, ఈ అమ్మాయి నాకూతురు. ఈమెపేరు అవంతిక. నాఅల్లుడు దుర్వ్యసనాలలోపడి, నాకూతుర్ని విడిచి ఎక్కడికో వెళ్ళిపోయినాడు. ఈపిల్లను నీదగ్గర ఇల్లడగా (న్యాసం) చూచుకో. ఈలోగా అల్లుణ్ణి వెదికి తెస్తాను. పిల్లను ఒక్కదాన్నే ఉంచితే బెంగపడు తుందని, సోదరుడయిన ఈ ఏకాక్షినికూడా ఇక్కడనే ఉంచుతున్నాను. నీవు అనుగ్రహించాలి" అని వేడి, పద్మావతి దగ్గిర సెలవు పుచ్చుకొని లావాణకము వెళ్ళిపోయినాడు.

అనంతరము అవంతిక అనే పేరుతో ఉన్న వాసవదత్తనూ, బ్రహ్మచారి రూపములో ఉన్న వసంతకుణ్ణీ పద్మావతి ఔదార్య ముతో సత్కరించి తన వినోదమందిరానికి తీసుకొని వెళ్ళింది. వాసవదత్త పద్మావతీమందిరములో కుడ్యములమీద చిత్రితమైన శ్రీరామచరిత్రములో అశోకవృక్షముక్రింద కూర్చున్న సీతాదేవిని చూచి, భర్తృవియోగాన్ని కష్టముమీద సహించింది. ఆమెలావణ్యము, నల్లకలువ వలె పరిమళించే తనుసౌరభము, శయనాసనసౌష్ఠవము మొద లయిన వానివల్ల పద్మావతి వాసవదత్తను మహాకులీనగా నిశ్చయించు కొన్నది. ఆమెకు కావలసిన ఉచితోపచారాలు చేస్తున్నది. పద్మావతి తనలో "ఈమె ఎవరో తెలియదు? ఇక్కడ ప్రచ్ఛన్నవృత్తిలో ఉన్నది. పూర్వము విరాటుని గృహములో ద్రౌపది అజ్ఞాతంగా ఉండలేదూ?" అనుకొన్నది. ఒకసారి వాసవదత్త పద్మావతితో అందచందాలు, అలంకరణాన్నీ గురించి మాట్లాడే సందర్భములో, తాను ప్రియుడి దగ్గిర అభ్యసించిన అమ్లానమాలాతిలకములు పద్మావతికి రచన చేసింది.

పద్మావతీదేవి ముఖాన ముద్దు లొలుకుతున్న మాలాతిలకములు ఆమె తల్లి చూచి "అమ్మాయీ, ఎంతచక్కగా ఉన్నదమ్మా తిలకము! ఇంతముద్దుగా ఎవరు తీర్చి దిద్దారమ్మా!" అన్నది.

"అమ్మా, నామందిరములో అవంతిక అనే ఆమె రచించింది."

"అమ్మాయీ, ఇటువంటి శిల్పనైపుణ్యము సామాన్యులకు ఉండదు. ఏదేవతో ఏమో! దేవతలూ మునులూ వంచనచేయడానికి సజ్జనుల గృహాలలో ఉంటారట. అందుకు తార్కాణము విను:

"కుంతిభోజుడనే రాజుగారింటికి వంచన చేయవలెననే ఉద్దేశముతో దుర్వాసమహాముని వచ్చాడట. ఆయన పరిచర్యకోసము రాజు తన కూతురు కుంతిని నియమించినాడు. శ్రద్ధాభక్తులతో ఆమె ఋషికి ఉపచారాలు చేస్తున్నది. ఒకరోజు మునీంద్రుడు ఆమెను పరీక్షించాలని "నేను స్నానము చేసి వచ్చేసరికి క్షీరాన్నము సిద్ధంగా ఉండాలి." అని చెప్పి వెళ్ళి స్నానము చేసి వచ్చి భోజనానికి కూర్చున్నాడు. ఆమె మునికి ఎదుట క్షీరాన్న పూర్ణ మయిన పాత్ర ఉంచింది. వేడివేడిగా క్షీరాన్నము కాలుతుండడమువల్ల పాత్రను ఋషి పట్టుకోలేకపోయినాడు. అతడు కుంతి వీపుకేసి చూచినాడు. అతని అభిప్రాయమును ఆమె గ్రహించి పాత్రను వీపుమీద పెట్టుకొనేసరికి వీపు కాలి బొబ్బ లెక్కింది. అయినప్పటికీ కుంతి కిక్కురుమనకుండా ఉండడం ముని చూచి సంతోషించి ఆమెకు వర మిచ్చి వెళ్ళినాడు. మునీంద్రుడు ఆమె గృహములో ఏవిధముగా ఉన్నాడో అదేవిధముగా అవంతిక నీవద్ద ఉన్నది. ఆమెను చాలా చక్కగా గౌరవించు" తల్లి మాటలు విని పద్మావతి మారువేషంలో ఉన్న వాసవదత్తను బాగా సన్మానించింది.

వాసవదత్త ఎన్ని గౌరవాలు పొందుతున్నప్పటికీ ప్రియుణ్ణి ఎడబాసి విరహపాండిమతో నిశీథములో పద్మినివలె ఉంటున్నది. వసంత

కుని కోతికొక్కిరాయి చేష్టలను చూచేప్పటికి ఆవిరహిణికి కొంచెము చిరునవ్వు వచ్చేది.

ఈలోగా వత్సరాజు అతిదూరంగా ఉన్న వేటభూములు తిరిగి సాయంకాలము లావాణకము వచ్చి బూడిద అయిన అంతఃపురము చూచి, వాసవదత్తా వసంతకులు కాలిపోయినారని విన్నాడు. వెంటనే మూర్ఛవచ్చి నేలమీద పడినాడు. కొంతసేపటికి తెప్పరిల్లినాడే కాని హృదయములో శోకాగ్ని జ్వలించింది. వత్సరాజు ఆర్తితో గిలగిల కొట్టుకొంటూ ప్రాణాలు వదిలేతామని నిశ్చయము చేసుకొనేసరికి "వాసవదత్తవల్ల నాకు విద్యాధర చక్రవర్తి కాబోయే కుమారుడు కలుగుతాడని నారదుడు చెప్పాడు. అతనిమాట అబద్ధ మవుతుందా? కొంతకాలం నాకు దుఃఖం కలుగుతుందని కూడా నారదుడు అన్నాడు. ఈ గోపాలక, యౌగంధరాయణులు విచారంతో కనపడరే! బహుశః దేవి జీవించి ఉంటుంది. ఇది మంత్రుల యుక్తి కావచ్చును. ప్రియురాలితో నాకు సమాగమము కలగవచ్చు. అందుచేత పర్యవసానము చూడాలి" అని జ్ఞాపకము వచ్చింది. మహారాజుకు మంత్రులు ధైర్యము చెప్పినారు. వాసవదత్తాదేవి తండ్రి విచారపడకుండా ఉండేటందుకు గోపాలుడు దూతముఖంగా, రహస్యంగా ఆమె సంగతి తెలియజేసినాడు.

## పద్మావతీ వివాహము

మగధరాజు లావాణకవృత్తాంతము సర్వమూ చారులవల్ల తెలుసుకొన్నాడు. అదివరకే తనను యౌగంధరాయణుడు కోరిన ప్రకారము తన కుమార్తె పద్మావతిని వత్సరాజుకు ఇవ్వడానికి ఇష్టపడి, అంగీకారమును వత్సరాజుకూ, అతని మంత్రికీ తెలియ చేసినాడు. వత్సరాజు, మంత్రిమాటమీద పద్మావతిని పరిణయ మాడడానికి ఇష్టపడినాడు. అప్పుడు అతడు "ఇందుకోసమే వాసవదత్తను దాచిపెట్టినారు కాబోలు"

అనుకొన్నాడు. వెంటనే లగ్నము స్థిరపరిచి యౌగంధరాయణుడు దూతముఖంగా మగధరాజుకు 'నీకోరిక మేము అంగీకరించినాము. నేటికి ఏడవరోజున పద్మావతిని వివాహమాడడానికి వత్సరాజు అక్కడికి రాగలడు. ఈ పరిణయమువల్ల వత్సేశ్వరుడు వాసవదత్తను శీఘ్రముగా మరిచిపోవుగాక !" అని సందేశము పంపినాడు. ప్రతిదూత వెళ్ళి ఆ సందేశాన్ని మగధేశ్వరునికి నివేదించినాడు. మగధరాజు అందుకు అంగీకరించినాడు. అతడు తనకూతురిమీద వాత్సల్యమూ, తన, సిరి సంపదలకూ తగినట్టు పెళ్ళిసరంజామా సిద్ధము చేయించినాడు. పద్మావతి ఇష్టుడైన వరునివల్ల సంతోషముతో పొంగిపోయింది. వాసవదత్త ఆవార్త విని విచారపడ్డది. వసంతకుడు వాసదత్తకు మాటమాత్రము ధైర్యము కలిగించినాడు. "ఈపద్మావతీ పరిణయమువల్ల, వత్సరాజుకూ మగధేశ్వరునికీ మైత్రి ఏర్పడుతుంది. శత్రు వయిన మగధరాజు మిత్రుడైనాడు. నీమీద వత్సరాజు ప్రేమతో ఉంటాడు." అని చెప్పినాడు.

వివాహము సమీపించగానే వాసవదత్త ఆమెకు మాలాతిలకరచన చేసింది. ఏడవనాడు వత్సరాజు సైన్యసమేతముగా, మంత్రులతో వివాహానికి వచ్చినాడు. వాసవదత్తావియోగవ్యథతో బాధపడే వత్సరాజు పద్మావతీదేవిని పరిణయ మాడడానికి ఎలా రాగలుగు తున్నాడని శంకించడము అనవసరము. ఆతడు తిరిగీ వాసవదత్తను పొందుతా ననే ప్రత్యాశ ఉన్నందువల్ల పద్మావతీపరిణయానికి అంగీకరించినాడు. చంద్రోదయమువల్ల సముద్రము ఉప్పొంగినట్టు వత్సేశ్వరునిరాకవల్ల మగధరాజు ఆనందపరవశుడై అల్లుడికి ఎదురుగా వెళ్ళినాడు. వత్సవల్లభుడు పురప్రవేశము చేస్తూండగా పురజన హృదయాబ్జాలలో మహోత్సవము ప్రవేశించింది. అమహీరమణుడు విరహమువల్ల కృశించి, మనోహరంగా ఉన్నపుడు పురకాంతలు అతన్ని రతీదేవి లేని మన్మథుడేమో అనుకొన్నారు. అతడు మగధరాజ ప్రాసాదము ప్రవేశించి,

ముత్తైదువులతో కళకళ లాడుతున్న వివాహమందిరంలో పెళ్ళి కుమా ర్తెను, నిర్జితపూర్ణ చంద్రబింబను పద్మావతిని కౌతుకముతో చూచి నాడు. ఆమె ధరించిన తన మాలాతిలకములు చూచి వత్సరాజు "ఈమెకు ఈమాలాతిలకములు ఎవరు రచించారు ?" అని వితర్కించు కొంటూ పరిణయవేదిక ఎక్కి పద్మావతీపాణి గ్రహించినాడు. ఆకర గ్రహణము పృథివీకర గ్రహణానికి ఆరంభముగా ఉన్నది. వాసవదత్తా ప్రియుడు వివాహ సంరంభము చూడలేడన్నట్టు, మంగళహోమ ధూమము అతని నేత్రాలను అశ్రువులతో మూసింది. పద్మావతీ వద నము అగ్నిప్రదక్షిణ సమయంలో ఎర్రనై, భర్త అభిప్రాయము గ్రహించి కోపారుణ మైనట్టు ప్రకాశించింది. వివాహ మయినతరువాత వత్సరాజు పద్మావతిపాణిని వదిలినాడే కాని వాసవదత్తను మనస్సులో నుంచి వదల లేదు. మగధరాజు అల్లుడి కిచ్చిన రత్నరాసులను చూస్తే, భూమిలో ఇక రత్నాలు లేవని అనవలసివస్తుంది! అప్పుడు యౌగంధ రాయణుడు "ఈ అగ్నిహోత్రసాక్షిగా అల్లుడితో మైత్రితో ఉంటా నని మగధరాజు సెలవీయాలి" అన్నాడు. మగధరాజు అందుకు అంగీక రించినాడు. వివాహ మహోత్సవ సమయంలో అందరికీ కట్నాలు వస్త్రాలు లభించినవి. చారణులు గానము చేసినారు. వేశ్యాంగనలు అభినయించినారు. అప్పుడు వాసవదత్తాదేవి తనప్రియుని అభ్యుదయము కోరి ఎక్కడో నిద్రిస్తున్నదానివలె కనపడకుండా పగటివేళ వెన్నెలవలె ఉన్నది.

మహామతి యౌగంధరాయణుడు మంత్రభేదము శంకించి "వత్స రాజు అంతఃపురంలో ప్రవేశిస్తే వాసవదత్తాదేవిని చూడక మానడు." అనుకొని, వత్సరాజు నిజరాజధానికి తరలి వెడతా డని, మగధరాజుకు తెలియజేసినాడు. ఆయన అంగీకరించినాడు. రాజధానికి తరలి వెళ్ళాలని మంత్రి వత్సరాజుకు తెలిపినాడు. ఆయన ప్రయాణానికి సిద్ధపడినాడు.

విందులూ, పానగోష్ఠి అయిన తరువాత వత్సరాజు, పద్మావతీ సహితంగా, మంత్రులు వెంట రాగా తరలినాడు. వాసవదత్త పద్మావతి ఇచ్చిన సుఖవాహన మెక్కి, సేనవెంట రాగా, వసంతకుడు ప్రచ్ఛన్నముగా వెనుక రాగా, బయలుదేరినది. వత్సేశ్వరుడు లావాణకము చేరి పద్మావతితో మందిరము ప్రవేశించినాడు. తాను మాత్రము దేవి మనస్సులో ప్రవేశించినాడు. వాసవదత్త అర్ధరాత్రి అన్న గోపాలకుని దగ్గిరికి వెళ్ళినది. చెల్లెలిని చూచి ఆదరముతో అన్న కన్నుల నీరు నింపినాడు. ఆమె అన్నను ఆలింగనము చేసుకొన్నది. కన్నీరు మున్నీరుగా దుఃఖించింది. సరిగా అప్పుడే సంకేత ప్రకారము యౌగంధరాయణుడు రుమణ్వంతునితో కూడా రావడంతోటే అతన్ని వాసవదత్త ఆదరముతో చూచింది. ఆమె విరహవ్యథ తీరిన దని ఆయన ఓదార్చినాడు. ఈలోగా పద్మావతీదేవి అనుచరులు అమ్మగారి దగ్గిరికి వెళ్లి "దేవీ! మాతో కూడా ఇంతదూరము దాకా అవంతికమ్మ వచ్చి, మామాట తోసిరాజని గోపాలకుని ఇంటికి పోయింది" అని మనవి చేసినారు. వత్సరాజుముందు పద్మావతితో అనుచరులు విన్నవించగానే, ఆమెకు సంశయము తోచింది. వెంటనే ఆమె అనుచరులతో "వెళ్లి నామాటగా అవంతికతో చెప్పాలి. నాదగ్గిర ఆమె న్యాసంగా ఉన్నది. నేను ఎక్కడ ఉంటే ఆమెకూడా అక్కడే ఉండాలి. మరోచోట ఆమె ఉండరాదు" అని చెప్పింది.

## వాసవదత్తా ఉదయనుల పునస్సమావేశము

పద్మావతీదేవి ఏకాంతముగా ఉండడము చూచి వత్సరాజు ఆమెను కుతూహలముతో "ప్రేయసీ! నీకు ఈమాలాతిలకములు ఎవరు రచించారు?" అని అడిగినాడు.

"మాయింట్లో ఒక బ్రాహ్మణుడు అవంతిక అనే బ్రాహ్మణిని ఇల్లడము ఉంచి వెళ్ళినాడు. ఇదంతా ఆమెశిల్ప నైపుణ్యము." అన్నది పద్మ. ఆమె వాసవదత్త అయి ఉంటుందని రాజుకు తోచింది. అలాగే అతడు నిశ్చయించుకొని గోపాలకునివాసానికి వెళ్ళేప్పటికి పద్మావతీదేవి అనుచరులు కనిపించారు. రాజు మందిరములో ప్రవేశించినాడు. అక్కడ వాసవదత్త, గోపాలక యౌగంధరాయణ రుమణ్వద్వసంతకు లున్నారు. వత్సరాజు గ్రహణముక్త మయిన చంద్రునివలె వియోగానంతరము వచ్చినవాసవదత్తను చూచి దుఃఖముతో నేలమీద పడిపోయినాడు. వియోగాతిశయమువల్ల పరిపాండుదుర్బలశరీరము గలవాసవదత్తాదేవి హృదయము వియోగదుఃఖముతో పొర్లిపోగా, తన్ను తాను నిందించు కొంటూ బొవురు మన్నది. రాజదంపతులు ప్రవాసానంతరదుఃఖముతో వలవిస్తుంటే, మహాధీరు డయినయౌగంధరాయణుని నేత్రాలు అశ్రు పూరితము లయినది. ఆ కోలాహలము విని పద్మావతి, ఆకులపాటుతో సంగతి అంతా తెలుసుకొని వాసవదత్తా వత్సరాజులవలె తానుకూడా దుఃఖించింది. ఇల్లాళ్ళు స్నేహముగలు కదా! వాసవదత్త పలుసారులు "అయ్యో! నాభర్తకు ఎంత దుఃఖము కలిగించాను? నేనెందుకు జీవిం చడం!" అని వలవించింది. ధీరు డయిన మహామంత్రి "దేవా! మగధ రాజపుత్రికా లాభమువల్ల మీకు సామ్రాజ్యము లభిస్తుం దని ఇదంతా చేసినాను. దేవికి దోషం చేయలేదు. విరహములో ఉన్నప్పుడు వాస వదత్తా దేవిశీలానికి సాక్షిణిగా సవతి, ఈ పద్మావతే ఉన్నది" అన్నాడు. మాత్సర్యరహితబుద్ధితో పద్మావతి "ఈమె శీలాన్ని ఋజువు చేయడా నికి అగ్నిప్రవేశ మయినా చేస్తాను" అన్నది. వత్సరాజు "నానిమిత్తం వాసవదత్త మహాబాధ అనుభవించింది. నేనే అపరాధిని. ఆమె కానే కాదు" అన్నాడు. వాసవదత్త నిశ్చయాత్మకబుద్ధితో "మహా రాజు సందేహము తీరడానికి నేను అగ్నిప్రవేశము చేస్తాను" అన్నది.

యౌగంధరాయణుడు తూర్పుగా తిరిగి ఆచమనము చేసి శుద్ధుడై "లోక పాలకులారా! నేను రాజహితము చేసేవాడినే అయితే, వాసవదత్త పవిత్రురాలయితే ఆమాట చెప్పండి. మీరలా చెప్పకపోతే నాశరీరాన్ని వదలివేస్తాను" అన్నాడు. వెంటనే అశరీరవాణి మేఘ గంభీరస్వరముతో "వత్సరాజా! నీపూర్వ పుణ్యమువల్ల యౌగంధ రాయణుడి వంటిమంత్రి, అపరదేవత వంటి వాసవదత్త లభించారు. నిజంగా నీవే ధన్యుడవు!" అన్నది. అక్కడివారు అశ్రులెత్తి చెవులు రిక్కించి, సంతోషచిత్తులై మయూరవృత్తు లయి విన్నారు. వత్సరాజు బావమరిది గోపాలకుడూ యౌగంధరాయణుని పొగడినాడు. భూచక్ర మంతా తనచేతికి చిక్కినట్లు మహారాజు నిశ్చయించుకున్నాడు. అనుదినమూ అనురాగముతో పద్మావతీ వాసవదత్త లుండగా ఆనందములో మహారాజు ఓలలాడుతున్నాడు.

## త ర ం గ ము : ౧౭

వత్సరాజు వాసవదత్తా పద్మావతులతో ఏకాంతములో పానలీలలు అనుభవించిన తరువాత గోపాలక రుమణ్వద్వసంతక సహితముగా యౌగంధరాయణుని రావించి అందరితో గోష్ఠి జరుపుతున్నాడు. మహారాజు తన విరహప్రస్తావనలో కథ చెప్పినాడు.

### ఊర్వశీ పురూరవుల కథ

పురూరవు డనే పరమవైష్ణవరాజు ఉన్నాడు. అతడు అడ్డులేకుండా భూలోక స్వర్గలోకాలలో తిరుగుతున్నాడు. ఒకనాడు ఆయన నందన వనములో విహరిస్తున్నప్పుడు మన్మథుడి అపరమోహనాస్త్రము వంటి ఊర్వశి అతన్ని చూచిన మాత్రాన వివశురాలై మూర్ఛపోయింది. చివరకు మోహము ప్రాణాపాయము తెప్పించేవ్పటికి, ఊర్వశినిచూచి

రంభాది అప్సరసల హృదయాలు గిలగిలలాడినవి. పురూరవుడు లావణ్యా రసనిర్ఝరిణి అయిన ఊర్వశిని చూచి, ఆమెను ఆలింగనము చేసుకోవలె ననే తీవ్రేచ్ఛవల్ల మూర్ఛపోయినాడు. పాలసముద్రములో ఉన్న శ్రీహరికి పురూరవుడిఅవస్థ తెలియగానే, ఆయన నారదుడితో, "నందన వనములో పురూరవుడు ఊర్వశిని చూచి మోహించినాడు. నీవు వెళ్ళి నామాటగా ఇంద్రుడితో చెప్పి, ఊర్వశిని పురూరవుడికి ఇప్పించు" అని చెప్పినాడు. విష్ణుదేవుని ఆనతి శిరసా వహించి నారదుడు పురూరవుణ్ణి మేలుకొలిపి "నీకోసము మహావిష్ణువు నన్ను పంపినాడు. ఆయన తన భక్తుల ఆపదలు చూడలేడు" అని అతన్ని ఓదార్చి ఇంద్రుని దగ్గిరికి తీసుకుపోయి అతనికి ఊర్వశిని ఇప్పించినాడు. ఆ ఊర్వశీ దానము స్వర్గానికి నిర్జీవకరణము, ఊర్వశికి మృతసంజీవనము అయింది.

పురూరవుడు దేవాంగనను భూలోకానికి తీసుకొని వచ్చి, మానవుల కందరికీ ఆశ్చర్యము కలుగజేసినాడు. ఒకరిచూపువల్ల మరొకరు బద్ధులయినట్టు ఆ ఊర్వశీ పురూరవులు క్షణముకూడా ఎడబాటు సహించకుండా ఉన్నారు. ఇలా ఉండగా దేవదానవులకు మహాయుద్ధము సంభవించింది. అప్పుడు ఇంద్రుడు పురూరవుణ్ణి సాయము చేయమని కబురు పంపించినాడు. పురూరవుడు ఇంద్రుడిదగ్గిరికి వెళ్ళినాడు.

దేవేంద్రపురూరవులు మాయాధరుడనే రాక్షసరాజును సంహరించి, ఉత్సవము చేసినారు. ఉత్సవ సందర్భములో తుంబురుడి సమక్షములో రంభ నృత్యములో పొరపాటు చేసింది. అందుకు పురూరవుడు నవ్వినాడు. రంభ పురూరవుణ్ణి చూచి "నేను దివ్యనృత్యం చేశాను. నేను దివ్యస్త్రీని. నీవు మానవుడవు. నీకు నాట్యమర్మము ఎలా తెలిసింది?" అని అడిగింది. పురూరవుడు, "నీగురువు తుంబురునికి గూడా తెలియని నాట్యమర్మాలు, ఊర్వశీ సహవాసమువల్ల గ్రహించాను" అన్నాడు. తుంబురుడు కోపముతో "నీకు కృష్ణారాధన పర్యంతము ఊర్వశితో

వియోగము కలుగునుగాక" అని శాపము పెట్టినాడు. ఆ శాపము విని పురూరవుడు అకాలంలో అశనిపాతమువంటి మాట ఊర్వశికి చెప్పినాడు. ఎక్కడనుంచో గంధర్వులు వచ్చి, పురూరవుడికి కనపడకుండా, ఊర్వశిని ఎక్కడికో తీసుకుపోయినారు. ఇదంతా శాప ఫల మని పురూరవుడు గ్రహించి బదరికాశ్రమానికి వెళ్ళి శ్రీహరిని పూజిస్తున్నాడు. ఊర్వశి గంధర్వలోకంలో విరహంవల్ల వివశయై ఉన్నది. విరహదీర్ఘము లయిన నిశలను ఊర్వశిశాపము తీరుతుం దనే ప్రత్యాశతో గడుపుతున్నది. పురూరవుడు తపస్సుచేసి నారాయణుని మెప్పించినాడు. అప్పుడు గంధర్వపురుషులు ఊర్వశిని రాజు కిచ్చినారు. శాపము తీరినతరువాత భూలోకవాసి అయిన పురూరవుడూ, దివ్యాంగన అయిన ఊర్వశీ సుఖభోగాలు అనుభవించినారు.

వత్సరాజు చెప్పిన కథ విని వాసవదత్త తన వియోగసహనానికి సిగ్గుపడ్డది. మహారాజును సంతోషపెట్టడానికి యౌగంధరాయణుడు కథ చెప్పినాడు:

## అహితసేనుని కథ

సంపదలతో తులతూగుతూఉండే తిమిరానగరంలో అహిత సేనుడనేరాజు ఉన్నాడు. అతనిభార్య భూలోకంలో అప్సరస. ఆయన ప్రియురాలితో ఎక్కువగా భోగాలు అనుభవించడంవల్ల జీర్ణజ్వరం వచ్చింది. వైద్యులు అతనికి భార్యాసాంగత్యము అవథ్య మని నిషేధించారు. దేవితో ఉపభోగము లేనందువల్ల మహారాజు హృదయంలో బిళ్ళ పుట్టింది. వైద్యులు మంత్రులతో రహస్యంగా, ఆవ్యాధి అతిభయంవల్లనో అతిశోకమువల్లనో తగ్గిపోతుం దని చెప్పారు. మంత్రులు ఆలోచన చేసినారు. మహాసర్పము వీపుమీద పడినా, శత్రువులు అంతఃపురం ప్రవేశించినా, కలతచెందని రాజుకు భయ మెలా కలుగుతుందిః

మంత్రులు మహారాణిని దాచిపెట్టి, ఆమె చనిపోయిం దని రాజుతో మనవి చేశారు. ఆవార్త విని రాజు విపరీతంగా శోకించేటప్పటికి వ్యాధి తగ్గిపోయింది. మంత్రులు మహారాణిని రాజుకు తిరిగి అప్పగించారు. ప్రియురాలిని గుప్తము చేసినప్పటికీ రాజు మంత్రులను గౌరవించి, తెలివితేటలకు మెచ్చుకొన్నాడు. పతికి హితముచేయడము భార్యా లక్షణము కదా!

స్వామి హితము కోరడము మంత్రిలక్షణము. వత్సరాజా, మీకు సమస్తభూమండలం లభిస్తుందని ఆలోచించి ఈ ఉపాయము చేశాము. మీమీద భక్తివల్ల వియోగాన్ని సహించిన వాసవదత్తాదేవి మీకు మహోపకారం చేసింది. ఆమె అపకారిణి కాదు."

మహారాజు మంత్రిమాటలు విని తానే అపరాధిగా భావించుకొని నవ్వుకొని, "అవును. వాసవదత్త మూర్తీభవించిన నీతివలె నాకు భూమండల మంతా ఇచ్చింది, అనురాగాంధులకు సహనం ఉండదు. తొందరపడి అనుచితంగా మాట్లాడినాను." అని సల్లాపాలవల్ల, వాసవదత్తా దేవి లజ్జ ఒకసారే పోగొట్టినాడు.

మగధరాజు యౌగంధరాయణుడు చేసిన యుక్తిని గ్రహించి, దూతీముఖంగా వత్సరాజుకు "నీమంత్రులు మమ్మల్ని మోసము చేసినారు. మాకు దుఃఖము కలిగించకుండా నీవు ప్రవర్తించాలి." అని సందేశము పంపినాడు. మగధేశ్వరుడికి సమాధానం పంపడానికి వత్సరాజు ఆదూతను పద్మావతిదగ్గిరికి వెళ్లమన్నాడు. ఆమె వాసవదత్తా సన్నిధిలోనే దూతకు దర్శన మిచ్చింది. దూత పద్మావతితో "మీ తండ్రిగారు చెప్పమన్న మాటలు. మిమ్మల్ని మోసంచేసి యౌగంధరాయణుడు తీసుకొనిపోయినాడు. మీ భర్తకు వాసవదత్తమీద అనురక్తి అధికం. రెండుకొప్పులు ఒకచోట ఎలా ఇముడుత వని మీతండ్రిగారు విచారిస్తున్నాడు." అన్నాడు.

పద్మావతి "నామాటగా మాతల్లిదండ్రులతో చెప్పు. భర్త నామీద చాలా అనురాగముతో ఉన్నాడు. వాసవదత్త నాతో స్నేహంగా అక్కవలె ఉంటున్నది. సత్యప్రియులైన మానాయనగారు నాప్రాణాలు వదులుకోనివక్షంలో, నాభర్తనుగురించి విపరీతచింత చేయకుండా ఉండాలి." అని దూతను సత్కరించి పుట్టింటికి పంపింది. దూత వెళ్ళి పోగానే, పుట్టింటిని తలుచుకొని విచారపడ్డది. వాసవదత్తను రంజించ డానికి వసంతకుడు కథ ఆరంభించినాడు:

## సోమప్రభా గుహచంద్రుల కథ

పాటలీపుత్ర నగరములో ధర్మగుప్తుడనే ధనాఢ్యవైశ్యుడు ఉన్నాడు. అతనిభార్య చంద్రప్రభకు లేక లేక అందమైన కూతురు పుట్టింది. పుట్టీ పుట్టడంలో ఆపిల్ల శరీరకాంతితో ఇల్లంతా దేదీవ్యమానంగా వెలిగిస్తూ లేచి కూర్చుని, స్పష్టంగా మాట్లాడడం మొదలుపెట్టింది. పురుటింట్లో ఉన్న స్త్రీలంతా తెల్లపోయి ధర్మగుప్తుడితో సంగతంతా చెప్పారు. అతడు భయపడి పురుటింట్లోకి వచ్చి, ఏకాంతంలో కూతురికి నమస్కరించి "ఓ దేవీ! నీవెవరు? నాఇంట్లో అవతరించావు!" అన్నాడు. అప్పుడు ఆపిల్ల, "నన్నెవరికీ ఇచ్చి పెళ్ళిచెయ్యకు. నీఇంట్లో నేను ఉన్నంతకాలం శుభం చేకూరుతుంది. తక్కిన సంగతులు అడిగి లాభమేముంది?" అన్నది. బిడ్డ మాటలు విని ధర్మగుప్తుడు భయపడ్డాడు. కుమార్తె చనిపోయిం దని పుకారు పుట్టించి, రహస్యంగా ఇంట్లో పెంచుతున్నాడు. ఆ అందాల కుప్పకు తండ్రి సోమప్రభ అని పేరు పెట్టినాడు. ఒకరోజున ఆమె మేడ మీద పచారుచేస్తూ వసంతోత్సవం చూస్తూన్నది, గుహచంద్రు డనే వైశ్యపుత్రుడు సోమప్రభను చూచి మోహించాడు. అతని అస్వస్థత గ్రహించి తల్లిదండ్రులు ఏదేవదే అడిగినారు. అతనిస్నేహితులు అస్వస్థతకు కారణము చెప్పారు. గుహచంద్రుని తండ్రి గుహసేనుడు ధర్మ

గుప్తుని దగ్గిరికి వెళ్ళి తన కుమారునికి సోమప్రభను ఇమ్మని కోరినాడు. ధర్మగుప్తుడు అందుకు నిరాకరిస్తూ "నా కెక్కడి దోయి పిల్ల!" అన్నాడు. పిల్లను ఇంట్లో ఉంచుకుని లేదంటున్నా డని గ్రహించి గుహసేనుడు ఇంటికి వెళ్ళి కొడుకుతో, "ఈవిషయంలో రాజును ప్రేరేపిస్తాను. అదివరకు నేను రాజుగారికొలువులో ఉండేవాణ్ణి కూడాను. ఈ అవస్థలో రాజు సహాయం చెయ్యకపోడు" అన్నాడు. వర్తకుడు రాజుకు రత్నం ఇచ్చి సంగతి మనవి చేసినాడు. రాజు సంతోషించి గుహసేనుడికి కొత్వాలును సహాయం ఇచ్చాడు. కొత్వాలు సైన్యం తీసుకువెళ్ళి ధర్మగుప్తుని ఇల్లు ముట్టడించాడు. సర్వనాశనం సంభవిస్తున్న దని భయపడి, కంఠగతప్రాణంతో ఉన్న తండ్రితో సోమప్రభ, "నాన్నా, నన్ను ఇచ్చేసెయ్యి. నావల్ల నీ కెందుకు హాని? నీ వియ్యంకునితో ఒక ఏర్పాటు చెయ్యి. పెళ్లి చేసుకొన్నతర్వాత భర్త నన్ను శయ్యకు చేర్చ రాదు. అదీ ఏర్పాటు" అన్నది. ధర్మగుప్తుడు కుమార్తె చెప్పిన మాటలు వియ్యంకుడితో చెప్పినాడు. కుమారుడికి పెళ్లి అవుతుంది గదా అని సంతోషించి గుహసేనుడు అందుకు అంగీకరించినాడు. పెళ్ళి అయింది. సోమప్రభ అత్తవా రింటికి వెళ్ళింది. సాయంకాలము తండ్రి కొడుకుతో "నాయనా, నీభార్యను శయ్యకు చేర్చవద్దు." అని, చెప్పినాడు. తన షరతు మామగారికి జ్ఞాపకంచేస్తూ తర్జనితో ఆమె బెదిరించింది. ఆ వేలు చూడగానే అతనిప్రాణాలు ఎగిరిపోయినవి. మిగతావారికి భయం వేసింది. గుహసేనుడు చనిపోయాక, కుమారుడు తన ఇంట్లో మహామారిగా భార్య ప్రవేశించిందని నిశ్చయించుకొన్నాడు. గుహచంద్రుడు ఆమెను తాకక ఇంట్లో ఉంచుకొని అసిధారావ్రతం నడుపుతున్నాడు. అతనికి లోపలవిచారము, భోగాలమీద విరక్తికలిగి అతడు బ్రాహ్మణులకు దానధర్మాలు చేసి, భోజనాలు పెడుతున్నాడు. సోమప్రభ మౌనవ్రతం అవలంబించి, భోజనానంతరం బ్రాహ్మణులకు దక్షిణలు ఇస్తున్నది.

ఒకనాడు ముసలిబ్రాహ్మణుడు భోజనానికి వచ్చి, జగదేకసుందరి అయిన సోమప్రభను చూచి ఏకాంతములో ఆమెభర్తను అడిగినాడు, "ఈ పిల్ల నీ కే మవుతుంది?" అని అడిగినాడు. ఆయన నిర్బంధంవల్ల గుహచంద్రుడు రహస్యము దాచక చెప్పివేసినాడు. ఆ వృద్ధబ్రాహ్మణునికి అతనిమీద దయ కలిగింది. ఈప్సితం నెరవేరడానికి అగ్నిమంత్రం ఉపదేశించినాడు. గుహచంద్రు డామంత్రం పునశ్చరణ చేస్తుండగా, అగ్నిలోనుంచి దివ్యపురుషుడు ఉద్భవించినాడు. అతనిపాదాలమీద గుహచంద్రుడు మోకరిల్లినాడు. అగ్నిదేవుడు "ఈరోజు నీయింట్లో నా భోజనం, రాత్రి ఇక్కడే ఉండి, నీ కోరిక ఈడేరేవిధం సాధిస్తాను." అని చెప్పి వెళ్ళిపోయినాడు. తక్కిన బ్రాహ్మణ్యంతోపాటు అతడూ భోజనంచేసి, రాత్రి గుహచంద్రునిదగ్గర జాముసేపు జాగ్రత్తగా శయనించాడు. అంత నిద్రిస్తున్న సమయంలో సోమప్రభ అక్కడికి వచ్చింది. అప్పుడు వృద్ధబ్రాహ్మణుడు గుహచంద్రుని నిద్రలేపి 'రావోయి, నీభార్యసంగతి చూతువుగాని' అంటూ, యోగమాయతో గుహచంద్రుని తుమ్మెదను చేసి, తానూ అలాగే తుమ్మెదగామారి, అతనికి సోమప్రభను చూపినాడు. ఆసుందరాంగి ఊరువెలుపల చాలాదూరం వెళ్ళింది. ఆమెతో కూడా వృద్ధబ్రాహ్మణుడు, గుహచంద్రుడూ తుమ్మెదల రూపాల్లోనే అనుసరించారు. వెళ్ళగా వెళ్ళగా విశాలమయిన మర్రిచెట్టు చూశారు. ఆచెట్టుకింద వీణావేణు మనోహరగానం వారివీనులకు సోకింది. ఆ మర్రిచెట్టు కొమ్మమీద మహాసనంమీద తనభార్యవంటి దివ్యస్త్రీని, గుహచంద్రుడు చూచినాడు. అతనిభార్య ఆ దివ్యస్త్రీ పక్కనే కూర్చున్నది. ఆ రాత్రి సమానకాంతి గల ఆ యిద్దరినీ చూడగా ముగ్గురు చంద్రులు వెలుగుతున్నట్టు తోచింది. "ఏమిటి, ఇది స్వప్నమా? భ్రాంతి కాదు గదా? ఈరెండూకూడానా? నాకు శుభఫలం చేకూరుతుం దని

తోస్తున్నది." అని గుహచంద్రుడు ఆలోచిస్తుండగా, ఆ స్త్రీ లిద్దరూ భోజనానంతరం దివ్యాసవము పానముచేశారు.

"అక్కయ్యా! ఇవాళ మాయింటికి తేజశ్శాలి అయినబ్రాహ్మణుడు వచ్చాడు. నా కేమో భయంగా ఉన్నది ఆయన రాకవల్ల. నేను ఇంటికి పోవాలి" అంటూ గుహచంద్రునిభార్య సోమప్రభ, దివ్యాంగన దగ్గిర సెలవు తీసుకొని, చెట్టు దిగింది. అప్పుడు తుమ్మెదల రూపాలలో ఉన్న బ్రాహ్మణుడూ, గుహచంద్రుడూ ముందుగానే ఇంటికి వచ్చి, ఎప్పటిలాగే పరున్నారు. సోమప్రభ ఇల్లు చేరి ఎవరికీ తెలియకుండా తన మందిరంలోకి వెళ్ళింది.

అప్పుడు బ్రాహ్మణుడు గుహచంద్రునితో "చూచావా, నీభార్య మానవస్త్రీ కాదు! ఇవాళ నీభార్య సోదరిని కూడా చూచావుకదా? ఆమెకూడా దేవతే! నీభార్య దేవత కనుకనే నీపొందు అంగీకరించలేదు. నీకోరిక సిద్ధించేందుకు ద్వారముమీద రాయవలసిన మంత్రం ఒకటి ఉంది. ఆమంత్రానికి తోడు బాహ్యయుక్తికూడా చెప్పాలి. అగ్ని స్వయంగానే జ్వలిస్తుంది. గాలికూడా సాయపడితే ఇంక వేరే చెప్పవలెనా! మంత్రము ఒకటే నీకార్యం సఫలం చేస్తుంది. దానికితోడు. యుక్తి చెపుతున్నాను. మంత్రం అద్భుతంగా పనిచేస్తుంది." అని చెప్పి తెల్లవారగానే శయ్యామందిర ద్వారము మీద మంత్రాన్ని రాసినాడు. సాయంత్రం మంత్రాన్ని ప్రయోగించే యుక్తికూడా సాధించాడు. యుక్తి ప్రకారం గుహచంద్రుడు అలంకారాలు ధరించి సోమప్రభకు కనబడేలాగ వేశ్యతో సరససల్లాపాలు ఆరంభించాడు. ఆమెకు ఈర్ష్య కలిగింది. మంత్రమహిమవల్ల సోమప్రభ మౌనముద్ర వదిలి, "ఎవత్తె అది?" అని ప్రశ్నించింది. "ఇది వేశ్య. నామీద దీనికెంతో ప్రేమ. దీని ఇంటికి పోతాను." అని అతడు చక్కగా అబద్ధ మాడాడు. సోమప్రభ భర్త కేసి ఓరచూపులు చూస్తూ, కనుబొమ్మలు ముడివేస్తూ,

ఎడమచేతితో అతన్ని వారిస్తూ "సరి, సరి, తెలిసింది. అందుకా మీా వేషం ! వేశ్యతో వెళ్ళకండి. నేను మీాభార్యను. నేనుండగా మీా కేం కావాలి ? " అని మంత్రమహిమవల్ల ఆవేశంతో పలికింది. ఆమెశరీరం పులకరించిది, వణికింది, సంక్షోభించింది. భార్యాభర్త లిద్దరూ శయ్యా గృహంలో భోగాలు అనుభవించినారు. మంత్రప్రభావం వల్ల గుహాచం ద్రుడు దేవత అయిన భార్యను వశంచేసుకొన్నాడు. యాగములు, దాన ధర్మాలు మొదలయిన సత్కర్మలు ఆచరించే వారి ఇళ్ళల్లో శాప చ్యుతలయిన దేవతాస్త్రీలు ఇల్లాళ్లుగా ఉంటారు. సజ్జనులు దేవబ్రాహ్మణ పూజే కామధేనువని అంటారు. దానిముందు సామదానాది ఉపాయాలు ఎందుకు పనికి వస్తవి ? అలాగే దివ్యపదవిలో ఉన్నవారిని దుష్కృతం అధోగతిపాలు చేస్తుంది.

## అహల్యా వృత్తాంతము

పద్మావతికి వసంతకుడు చెపుతున్నాడు. "పూర్వము త్రికాలవేది అయిన గౌతమమహర్షి భార్య అహల్య. మహేంద్రుడు ఆమెరూపము చూచి మోహించి, ఏకాంతంలో తనకోరిక తీర్చ మని ఆమెను ప్రార్థించినాడు. ప్రభువుల చిత్తము ఐశ్వర్యమదమువల్ల యథేచ్ఛగా ప్రవర్తిస్తుంది కదా ! అహల్య అతనికోరికకు సమ్మతించింది. గౌతమ మహర్షి నిజతపః ప్రభావంవల్ల భార్యమనోవికారమును గ్రహించ గలిగి నాడు. గౌతముడు అక్కడికి వచ్చేటప్పటికి ఇంద్రుడు భయపడి మార్జాలరూపం ధరించినాడు. గౌతమమహర్షి అహల్యతో "ఇంతకు ముందు ఇక్కడున్నవాడు ఎవడు ?" అన్నాడు. ఆమె అపభ్రంశ భాషలో "ఏసో ఖు మజ్జారో" అన్నది. మజ్జారో అంటే మార్జాల మనీ, మజ్జారుడు అనీ రెండర్థాలు వస్తవి. "నిజానికి ఆవచ్చినవాడు జారుడే" అని మహర్షి నవ్వి, భార్య నిజం చెప్పినందుకు శాపవిముక్తి

అనుగ్రహించినాడు. "వనసంచారం చేసి తిరిగి వచ్చే శ్రీరామచంద్రుని దర్శనం కలిగేదాకా నీవు శిలారూపంతో ఉండాలి." అని తర్వాత ఇంద్రుని శపించినాడు. శాప మిచ్చి తపస్సు చేసుకోడానికి మహర్షి వెళ్ళిపోయినాడు. అహల్య శిలారూపిణి అయింది. దుష్కృత్యానికి ఫలం ఎప్పుడూ ఉంటుంది. ఎవరు ఏగింజ నాటితే, వారు ఆఫలం అనుభవించక తప్పదు. మహానుభావులు కేవల విరుద్ధవిషయాలలో ఉత్సాహము వహించరు. ఉత్తములకు ఇదే విధిసిద్ధ మయిన నియమం. మీరిద్దరూ పూర్వజన్మలో అక్కచెల్లెళ్ళు. శాపమువల్ల ఇలా జన్మించారు. అందు వల్లనే మీహృదయాలు ఏకమై అరమరలు లేకుండా సఖ్యంగా ఉన్నవి.

వసంతకుడు చెప్పినదంతా వాసవదత్తా పద్మావతులు విని, ఈర్ష్య లేకుండా కలిసి మెలసి ఉన్నారు. పద్మావతి జరిపిన దాత్యమువల్ల మగధేశ్వరుడు వాసవదత్తాదేవి సహృదయము గ్రహించి సంతోషించినాడు.

## దిగ్విజయాలోచన

మరునాడు మంత్రి యౌగంధరాయణుడు రాణి మొదలయినవారి సన్నిధిలో వత్సరాజును సందర్శించి ఇలా పలికినాడు. "రాజేంద్రా! జైత్రయాత్రకు మీరు కౌశాంబీనగరానికి వెళ్ళరేమి? మన తంత్రానికి లొంగిపోయి మగధరాజు మనజోలికి రాడు. కన్యాసంబంధ మనే రజ్జువుతో అతన్ని కట్టివేశాము. మనతో పోరి తనకుమార్తెను, ప్రాణాధికను పోగొట్టుకొంటాడా? అతన్ని, మీరు మోసం చెయ్యలేదు. ఇదంతా స్వయంగా నేనే చేశాను. ఇందువల్ల అతనికి చెరుపు ఏమీ లేదు. మగధరాజుకు మనమీద కోపం లేదనీ, ఇష్టమే ననీ దూతల వల్ల తెలియనే తెలిసింది."

సంకల్ప సిద్ధు డయిన యౌగంధరాయణుడు ఇలా వత్సరాజుతో అంటున్నప్పుడు మగధేశ్వరుని దగ్గిరనుంచి దూత వచ్చినాడు. రాజాజ్ఞ పొంది ప్రతీహారి దూతను రాజమందిరంలోకి పోనివ్వగా ఆదూత మహా

రాజుకు ప్రణామం చేసి ఇలా విన్నవించినాడు: "దేవా! పద్మావతీ దేవి పంపిన సందేశానికి మగధరాజు సంతోషించి తమకు తెలియచేయు మన్నారు. మాటలతో పనేమిటి? సర్వమూ తెలిసింది. ఈ వివాహ సంబంధమువల్ల మగధరాజు మీకు వశ్యుడైనాడు." దూత చెప్పిన మాటలు మహారాజు విని మంత్రిని రాజనీతి అనే వృక్షకుసుమముగా అభినందించినాడు. వాసవదత్తా పద్మావతులు వచ్చి బహుమతులతో ఆదూతను సత్కరించి పంపించారు. అనంతరము చండమహాసేనునిదూత వచ్చి మహారాజుకు ప్రణామం చేసి విన్నవించినాడు: "దేవా! మా రాజుగారు తమతో మనవి చేయమన్నారు. మీకీర్తికి చిహ్నము మీ మంత్రి యౌగంధరాయణుడు. మీమీద భక్తి గల వాసవదత్త ధన్యురాలు. ఆమె చేసిన సత్కార్యంవల్ల మాకు చిరకాలం నలుగురిలో తల ఎత్తుకొని ఉండే యోగ్యత కలిగింది. పద్మావతి నాకు వాసవదత్త కన్న వేరు కాదు. ఆసవతు లిద్దరి హృదయాలూ నఖ్యంగా ఉన్నవి. కనుక శీఘ్రమే దిగ్విజయం ఆరంభించాలి." మామగారి సందేశం విని వత్సరాజు సంతోషంతో పొంగిపోయినాడు. వాసవదత్తమీద అతనికి అనురాగం అధిక మయింది. మహామంత్రి యౌగంధరాయణునిమీద మహానురాగం కలిగింది. వత్సరాజు, దేవేరులూ ఆదూతను సత్కరించి పంపించినారు. దిగ్విజయసన్నాహవిషయమై, రాజు మంత్రులతో ఆలోచన చేసినాడు. వారి మంత్రప్రకారం మహారాజు కౌశాంబికి బయలుదేరినాడు.

## తరంగము: ౧౮

### ఉదయనుడు కౌశాంబిలో ప్రవేశించుట

వత్సరాజు లావాణకదేశమునుంచి మంత్రులతోను భార్యలతోనూ కౌశాంబీ నగరానికి తరలి వెళ్ళినాడు. అకాలములో పొంగిన సముద్రాలవలె భూమండలంఆక్రమిస్తూ సైన్యంవెంట వస్తున్నది. మహారాజుకు

శ్వేతచ్ఛత్రము పట్టినారు. ఆయనదగ్గిర సామంతరాజులు తమతమ స్థానాలలో ఉండి, ప్రభువు గుణగణములను ప్రశంసిస్తూ పరివేష్టించి నారు. మహారాజుకు వెనుక పిడిపనుగమీద దేవేరులు ఇద్దరూ వస్తు న్నారు. వందిమాగధులు కైవారములు చేస్తూ ప్రయాణం సాగి స్తున్నారు. ఇలా ప్రయాణం చేసి మహారాజు నిజపరివారంతో మహో త్సవముతో కలకలలాడే కౌశాంబీనగరం ప్రవేశించినాడు. ఆ పురలక్ష్మి వత్సవల్లభుని చూచి ఆనందతరంగిత అయింది. మహారాజూ, అతని భార్యలూ, పురస్త్రీలకు కన్నులపండుగ చేసినారు. ఆనగరంలో మేడల మీద కిటికీలలో ఎక్కడ చూచినా పురాంగనలు రెప్ప లార్పక మహా రాజును కుతూహలంగా చూచేవారే! రాజదర్శనేచ్ఛవల్ల ఒకరమణి రవికముడిమాట మరిచి కిటికీదగ్గిరికి పరుగెత్తుకొని వచ్చింది. ఒకామె ముత్యాలహారం గుచ్చుతూ వత్సేశ్వరుణ్ణి దర్శించా లనే తహతహతో కిటికీవద్దకు వచ్చేటప్పటికి హారం పెరిగిపోయి, ఆమె ఆనందాశ్రువులవలె ముత్యాలు రాలినవి. కొంతమంది వాసవదత్తాదేవి అగ్నిదగ్ధ అయి జీవించినవిషయం మాటాడుకొంటున్నారు. వాసవదత్తా పద్మావతుల రూపాలను ప్రశంసిస్తున్నారు కొందరు.

మహారాజు దేవేరులతో నగరప్రవేశము చేసేసరికి రాజమందిరానికి అపూర్వశోభ వచ్చింది. రాజమందిర మంతా సామంతరాజుల కానుక లతో నిండిపోయింది. వత్సరాజు రాజబృందాన్ని సమ్మానించి అంతః పురంలో ప్రవేశించినాడు. ఆయన దినశేషాన్ని ప్రియులతో, పానగోష్ఠు లతో, లీలతో గడిపినాడు.

## నిధిలాభము

మరునాడు వత్సరాజు మంత్రులతో ఆస్థానంలో ఉండగా, ఒక విప్రుడు ద్వారస్థానమునుంచి 'ప్రభూ, ప్రభూ, కాపాడాలి! అడవిలో

పాపు లయినగోపాలకులు నిష్కారణంగా నా కుమారుని పాదము నరికి వేశారు. ప్రభూ, మీరే దిక్కు!' అని మొర పెట్టినాడు. వెంటనే వత్సరాజు ముగ్గురు గోపాలకులను పట్టించి తెప్పించి వృత్తాంతం అడిగినాడు. గోపాలకులు రాజుతో ఇలా విన్నవించారు. "దేవా! మేము పశువులను కాచుకుంటూ, విజనస్థలాల్లో విహరిస్తూ ఉంటాము. మాలో దేవసేను డనే గొల్లవా డున్నాడు. వాడు రాతిమీాద కూర్చుని తాను రా జని చెప్పి మమ్మల్ని ఏలుతాడు. వాడిమాట ఎవరూ జవదాటరు. ఈప్రకారం గోపాలుడు అరణ్యంలో రాజ్యం చేస్తుండగా దారివెంట పోతూ ఈ బ్రాహ్మణపిల్లవాడు మా గొల్లదొరకు నమస్కారం చెయ్యలేదు. ఎంత చెప్పినా పిల్లవాడు వినలేదు. అప్పుడు గొల్లదొరకు కోపం వచ్చింది. వెంటనే బ్రాహ్మణ పిల్లవాడి కాళ్ళు నరికివేయ మని రాజాజ్ఞ అయింది. రాజాజ్ఞను ఎలా మీారడం ?" గోపాలకులు ఇలా విన్నవించే సరికి బుద్ధిమంతుడు యౌగంధరాయణుడు ఆవిషయం చక్కగా ఆలోచించి ప్రభువుతో "రాజేంద్రా! ముమ్మాటికి నిశ్చయం. అక్కడ ఆ గొల్లల కేదో నిధినిక్షేపం దొరికింది. ఆనిధిలాభంవల్లనే గోపాలునికి ఇంత ప్రభుత్వం కలిగింది. మనము అక్కడికి పోదాము" అన్నాడు. మహారాజు గోపాలకులనే దారి చూప మని నియమించి సేనా సమేతంగా ఆఅరణ్యానికి వెళ్ళినాడు. ఆప్రదేశాన్ని పనివాళ్ళు పరీక్షచేసి నిధి కోసం తవ్వడం ఆరంభించినారు. కొంత మేర తవ్వేటప్పటికి శిలామావు డయిన యక్షుడొకడు బయటకు వచ్చి 'రాజేంద్రా! ఈనిధి నీతాత పాతిపెట్టించినాడు. చాలా కాలం నేను దీన్ని కాపాడినాను. ఈ నిధి తీసుకో!' అని పలికి వెంటనే యక్షుడు అదృశ్యు డైనాడు. ఆ గోతిలో రత్నసింహాసనం వత్సరాజుకు దొరికింది. అభ్యుదయ కాలంలో కల్యాణ పరంపర కలుగుతుంది గదా! అప్పుడు వత్సరాజు గొప్ప ఉత్సవంచేసి ఆనిధానం తీసుకొని, గోపాలకులను అభినందించి, రాజధానికి వెళ్ళినాడు.

మహారాజు రత్నసింహాసనాన్ని తీసుకురాగా పురజనులు సంతోషం పట్టలేకపోయినారు. మంత్రులు మహోత్సవం చేశారు. ఉత్సవసమయంలో యౌగంధరాయణుడు వత్సరాజుతో తన యభిప్రాయం తెలియచేసినాడు : "దేవా! కులక్రమాగత మయిన మహాసింహాసనం లభించిన దిప్పుడు, మీరు దీనిని ఎక్కి అలంకరించడం సమంజసం" అని. "నా తాతముత్తాతలు భూమండలం జయించి ఈ సింహాసనం అధిష్ఠించినారు. నేను వారివలెనే చక్రవర్తినై సింహాసనం అధిష్ఠించాలి. రాజ్యాలను జయించక రత్నసింహాసనం అలంకరిస్తే నా కేమి కీర్తి? ఈ సాగరాంత భూమండలమును జయించి నాపూర్వుల రత్నసింహాసనం అధిష్ఠిస్తాను." అంటూ మహారాజు సింహాసనము ఎక్కలేదు. గొప్పవారికి అభిమానము ఎక్కువ కదా! యౌగంధరాయణుడు వత్సేశ్వరునితో "మంచిది మహారాజా! తూర్పుదిక్కున దిగ్విజయము ఆరంభించుదాము" అన్నాడు. "ఉత్తరాది దిక్కు ఉండగా, మొదట తూర్పుదిక్కునే జయించడ మేమిటి?" అన్నాడు వత్సరాజు.

అప్పుడు మంత్రి "కుబేరునిదిక్కు గొప్పదయినా, మ్లేచ్ఛసహవాసం వల్ల కలుష మయింది. సూర్యుడు పశ్చిమాన అస్తమిస్తాడు కనుక పశ్చిమదిగ్విజయం ఆదిలో మంచిది కాదు. దక్షిణదిక్కు రాక్షసాక్రాంతము కనుక, అది యోగ్యం కాదు. తూర్పున సూర్యోదయం అవుతుంది కనుక, దేవేంద్రుడు పరిపాలించేది కనుక, గంగ తూర్పు వైపే పారుతున్నది కనుక, తూర్పు శ్రేష్ఠమైనది. హిమవద్వింధ్యపర్వత దేశాలలో గంగ ప్రవహించే దేశాలే శ్రేష్ఠములు. కల్యాణకాంక్షుల మయిన మనము తూర్పువైపే పోదాము. మీపెద్దలుకూడా తూర్పు దిశనే మొదట జయించి, అనంతరం తక్కినదిశలు స్వాధీనం చేసుకొన్నారు. శతానీకుడు కౌశాంబీనగరం రమ్యమైన దనీ, సామ్రాజ్యము పౌరుషాధీనం కాని దేశాధీనం కాదనీ నిశ్చయించుకొని హాస్తినాపురంలో నివసించినాడు.

మంత్రి మాటలు విని మహారాజు శౌర్యధనుడు కావడంవల్ల "సత్యము! సామ్రాజ్యానికి దేశము కారణం కాదు. బలవంతులకు పౌరుషమే సంపత్కారణము. ఏకాకి అయినా, ఆశ్రయహీనుడయినా సిరిని చేపట్టగలడు. మీరెప్పుడూ సత్త్వనంతునికథను వినలేదా?" అన్నాడు. మంత్రులందరూ కథాకర్ణన కుతూహలాయత్తచిత్తులైనారు. వత్సరాజు దేవేరుల సన్నిధిలో ఇలా చెప్పినాడు :

## విదూషకుని కథ

ఉజ్జయినీనగరాన్ని ఆదిత్యసేనుడనే రాజు పరిపాలిస్తున్నాడు. ఆయన ఒకరోజు యాత్ర చేస్తూ గంగాతీరాన సేనతో ఉన్నాడు. ఇంతలో గుణవర్మ అనేవైశ్యుడు తనకుమార్తెను రాజుకు కానుకగా తీసుకొనివచ్చి, ప్రతీహారముఖంగా రాజుగారికి సంగతి మనవి చేసినాడు : "నాయింట్లో చక్కని చుక్క పుట్టింది. ఈకన్యను మరొకరికి ఇవ్వదలుచుకోలేదు. ఏలినవారే నాకుమార్తెను ఏలాలి" అని. మహారాజు ఆసౌందర్యరాశినిచూచి అనురాగమువల్ల ఆమెను పట్టపురాణిగా చేసి, గుణవర్మకు తనతో సమానంగా ఐశ్వర్యం ఇచ్చినాడు. ప్రియురాలితో అహోరాత్రాలు గడుపుతూ రాజు రాజకార్యాలమీద శ్రద్ధ వదలివేసినాడు. ప్రజల ఆక్రందనము అతనిచెవులకు సోకడంలేదు. ఎల్లప్పుడూ అంతఃపురములోనే మహారాజు ఉండడంవల్ల శత్రువుల హృదయాల్లో భయం తొలిగిపోయింది. ఇలా ఉండగా అతనిప్రేయసి తేజస్వతీదేవి ఆడపిల్లను ప్రసవించింది. ఆ పిల్లను అల్లారుముద్దుగా పెంచుతున్నారు. ఆ పిల్ల అందాలకుప్ప. అందరికీ కన్నులపండుగ చేస్తూ అమ్మాయి పెరుగుతున్నది.

ఒకప్పుడు సామంతుడు తిరుగుబాటు చేయగా రాజు అతనిపై దండయాత్ర చేస్తూ, తనసైన్యానికి వెనుక పిడివనుగుమీద తేజస్వతీదేవిని కూర్చోబెట్టినాడు. ఉత్తమాశ్వము ముంగాళ్ళమీద అతివేగముగా పరు

గెత్తుతున్నప్పుడు, రాజు తేజస్వతికి ఆహయాన్ని చూపుతూ దానికి హెచ్చరిక చేసినాడు. అప్పు డా గుర్రము అతని మడమ తాకువల్ల మహా వేగంగా ఎక్కడికో పరుగెత్తింది. సైన్యము తల్లడిల్లగా గుర్రపు రౌతులు వెయ్యివిధాల అతన్ని కనిపెట్టవలెనని దాడు తీశారు. ఏమీ లాభం లేకపోయింది. మంత్రులు అనిష్ట భయంవల్ల దేవిని తీసుకొని ఉజ్జయిని చేరి కోటద్వారము మూసివేసి, ప్రాకార రక్షణ చేసి, రాజు ఎక్కడ ఉన్నాడో వెతికిస్తూ, ప్రజలను ఓదార్చుతున్నారు. ఈలోగా గుర్రము రాజును తీసుకొనిపోయి వింధ్యారణ్యములో నిలిచింది. అరణ్యములో రాజుకు దారీ తెన్నూ తెలియక, విచారించి గుర్రము దిగి, అశ్వజాతులను ఎరిగినవాడు కనుక ఆ ఉత్తమాశ్వమునకు ప్రణామం చేసి "నీవు దేవుడవు. నీవంటివాడు ప్రభువుకు ద్రోహము చేయడు. నీవే నాకు దిక్కు. నన్ను మంచిదారికి తీసుకుపో" అని వేడుకొన్నాడు. రాజు మాటలు విని ఆ గుర్రము పూర్వజన్మజ్ఞానంవల్ల పశ్చాత్తాపపడి, రాజును ఎక్కించుకొని, ఏమీ శ్రమ కలిగించకుండా ఉజ్జయినీ నగర సమీపానికి తీసుకొని వెళ్ళింది.

సూర్యుడు అస్తమించినాడు. నగరమంతటా చీకటి కమ్మగా, నగర ద్వారములు మూసి ఉండడమువల్ల ఆ గుర్రము ఊరివెలుపల శ్మశానము వద్ద ఉన్న బ్రాహ్మణ మఠములో రాజును చేర్చింది.

అలిసిపోయిన అశ్వాన్ని దిగి ఆదిత్యసేనుడు ఆరాత్రి గడపవలెనని మఠంలో ప్రవేశించబోయేసరికి, అక్కడి బ్రాహ్మణులు అతను శ్మశానపాలుడో, చోరుడో అనే సంశయంవల్ల లోపలికి రానీయక పరుషములు పలికినారు. ఆ బ్రాహ్మణులలో విదూషకు డనే ఒక బ్రాహ్మణుడు, సత్త్వవంతుల్లో శ్రేష్ఠమయినవాడు. మఠంలోనుంచి బైటికి వచ్చినాడు. ఆయన యువకుడు, దృఢకాయుడు. అగ్నిదేవుని ఆరాధించి తలుచుకొన్న మాత్రాన చేతిలోకి వచ్చే ఖడ్గమును పొందినాడు. ఆయన

రాత్రివేళ వచ్చిన మహారాజును చూచి, తక్కిన బ్రాహ్మణులను అద లించి, వినయముతో మఠంలోకి తీసుకొనిపోయి, విశ్రమింపజేసినాడు. దాసీవాళ్ళచేత ధూళి తుడిపించి శుభ్రము చేయించి, విదూషకుడు రాజుకు తగిన ఆహారము ఏర్పాటు చేయించినాడు. గుర్రానికి జీను తీసి వేసి గడ్డి వేసి, ఉపచారములు చేయడంవల్ల అలసట తీరింది. అంతట ఆయన రాజుతో "రాజా, మీకు నేను కాపుంటాను. మీరు సుఖంగా నిద్రించండి" అంటూ విదూషకుడు రాజుకు పక్కవేసి, అతడు నిద్రించ గానే అగ్నిదేవు డిచ్చిన ఖడ్గము చేతబూని రాత్రి ద్వారం దగ్గిర పహరా యిస్తున్నాడు. తెల్ల వారింది. రాజు చెప్పకుండానే, ఆబ్రాహ్మ ణుడు గుర్రానికి జీను వేసి సిద్ధము చేసినాడు. రాజు అతనికి వీడుకోలిచ్చి గుర్ర మెక్కి ఉజ్జయినీ నగరం ప్రవేశించినాడు. ఆయన రావడంతోనే ఎదురుగా మంత్రులు సంతోషంతో వచ్చినారు. మంత్రులతో మహా రాజు రాజమందిరము ప్రవేశించినాడు. తేజస్వతీదేవి హృదయజ్వరము తగ్గింది. మహారాజు నగరప్రవేశము చేసేసరికి ప్రజల దుఃఖాలు తగ్గిపో యినవి. సాయంకాలందాకా వాళ్ళు దేవీ మహోత్సవము చేసినారు.

మరునాడు ఆదిత్యసేనుడు విదూషకుని బ్రాహ్మణు లందరితోకూడా పిలిపించినాడు. మహారాజు కృతజ్ఞతాపూర్వకంగా విదూషకునికి వెయ్యి గ్రామాలు, ఛత్రవాహనములూ బహూకరించినాడు. రాజు అతనిని తనకు పౌరోహితుని చేసుకొన్నాడు. గొప్పవారికి చేసినఉపకారము ఎన్నటికీ వ్యర్థము కాదు. విదూషకుడు సామంతరాజులతో సమానంగా గౌరవము పొందు తున్నాడు. తన కిచ్చిన గ్రామములను మఠబ్రాహ్మ ణుల కందరికీ సమానము చేసినాడు. ఆయన రాజును సేవించి ఆశ్రయించి తక్కిన బ్రాహ్మణులతో ఆగ్రామసమూహముతో కలిసి మెలిసి ఉంటున్నాడు. కాలక్రమేణ తక్కిన బ్రాహ్మణులు తమలో తాము ప్రాధాన్యము కోరి, ధనమదమువల్ల విర్రవీగి విదూషకుని లక్ష్యం

చెయ్యడం లేదు. వాళ్ళల్లో అంతఃకలహాలవల్ల గ్రామాల్లో శాంతి నశిం చింది. వారందరూ దుర్మార్గులై ప్రవర్తిస్తుంటే, విదూషకుడు ఏమీ పట్టించుకోకుండా ఉన్నాడు. అల్పులవిషయంలో ధీరులు ఉపేక్ష చేయడం సహజమే!

ఒకనాడు ఆ బ్రాహ్మణులు పోట్లాడుకొంటున్న సమయంలో, చక్ర ధరు డనే నిష్ఠురస్వభావు డయిన బ్రాహ్మణుడు వచ్చి "ఇతరులకు నీతులు చెప్పడానికి అంధుడూ స్వచ్ఛదృష్టికలవాడే. కుబ్జుడూ స్పష్టంగా మాట్లాడేవాడే. దరిద్రు లయిన మీకు సిరి పట్టింది. ఈనడమంత్రపు సిరివల్ల కన్నూ మిన్నూ కానక, ఓర్వలేక గ్రామాలను పాడుచేస్తు న్నారు. విదూషకుడు మీ సంగతిచూచి ఉపేక్షచేస్తున్నాడు. ఈతప్పు అతనిదే. మీకు త్వరలో ముష్టిచెంబు చేతికి వస్తుంది. మీలో ప్రతి వాడూ నాయకుడు కావా లని, పోరాడి గ్రామాలను బాధపెట్టడంకన్న ఒకేనాయకుడు చెప్పినట్టు మీరు వింటే సిరిసంపదలు నిలుస్తవి నా మాటవిని ధీరుడయినవాణ్ణి నాయకుణ్ణి చేసుకోండి." అని వారికి హిత బోధ చేసినాడు.

ప్రతివాడూ నేను నాయకుడు కావాలంటే నేను కావాలని పట్టు పట్టగా, ఆమూఢులకు చక్రధరుడు హితబోధ చేసినాడు: "ఎందు కిలా తగవు లాడతారు? నేను పందెం ఏర్పాటు చేస్తాను. అందులో ఎవడు గెలిస్తే వాడు నాయకు డవుతాడు. ఇక్కడ శ్మశానంలో ముగ్గురు దొంగలను కొరత వేశారు. ఈరాత్రి ఆదొంగల ముక్కులు ఎవడు కోసుకు రాగలడో వాణ్ణి నాయకుణ్ణి చేసుకోండి. ఎప్పుడూ వీరునికే పట్టం కట్టాలి కదా!" చక్రధరుని మాటలు విని విదూషకుడు "అలాగే చేతాము. ఇందులో దోష మేముంది?" అని పలికినాడు. అప్పుడు బ్రాహ్మణులు "ఈపని మావల్లకాదు" అన్నారు. విదూష కుడు దొంగల ముక్కులుకోసి శ్మశానంనుంచి తీసుకురావడానికి సిద్ధ

పడినాడు. విదూషకుడు ఆసాహసకృత్యము చేస్తే అతన్నే నాయకునిగా ఆబ్రాహ్మణులు అంగీకరిస్తా మన్నారు. విదూషకుడు ఆరాత్రి అగ్ని దేవుని తలుచుకొన్నాడు. తలచుకొన్నమాత్రాన కత్తి చేతులోకి వచ్చింది. ఒంటరిగా శ్మశానంలో ప్రవేశించినాడు. అప్పుడు శ్మశానంలో ఢాకినీదయ్యాలు ఘోష పెడుతున్నవి. గద్దలు, కాకులు రొద చేస్తున్నవి. కొరివిదయ్యాల నోళ్ళలో మంటలూ, చితిమీద మంటలూ వ్యాపిస్తున్నవి. కొర్రుస్తంభాలుమీద ఉన్న దొంగలు ముఖాలు పైకెత్తుకొని ఉండగా విదూషకుడు వారిని సమీపించినాడు. దగ్గరికి రాగానే బేతాళదయ్యమువల్ల దొంగలు ఆవేశంతో ఆబ్రాహ్మణుని పిడికిలితో గుద్దినారు. విదూషకుడు చలించక ధైర్యంగా కత్తితో వారిని నరికినాడు. దొంగలమీద ఆవేశించిన దయ్యము వదలిపోయింది. వెంటనే అతడు ఆదొంగల ముక్కులు కోసి వస్త్రంలో మూట కట్టుకొన్నాడు.

విదూషకుడు తిరిగి వస్తూండగా శ్మశానంలో శవముమీద జపము చేస్తున్న సన్యాసిని చూచి అత డేమి చేస్తాడో చూతా మని కుతూహలంవల్ల అతనివెనుకకు వెళ్ళి దాగినాడు. క్షణంలో సన్యాసి కింది శవము ఫూత్కారము చేసింది. వానిముఖమునుంచి జ్వాల, నాభినుంచి ఆవాలూ వచ్చినవి. అప్పు డాసన్యాసి ఆవాలు తీసుకొని లేచి శవాన్ని అరిచేతితో కొట్టినాడు. వెంటనే శవము లేచి నిలిచింది. అతడు ఆశవం బుజంమీద ఎక్కగా అది నడిచింది. విదూషకుడు మెల్లిగా వెంబడించినాడు. కొంతదూరము అతను నడవగా శిథిలమైన దేవాలయంలో కాళీవిగ్రహము కంట బడింది. అక్కడ సన్యాసి శవాన్ని దిగి గర్భగుళ్ళోకి వెళ్ళినాడు. శవాన్ని అధిష్ఠించిన బేతాళుడు నేలమీద పడ్డాడు. విదూషకుడు వాళ్ళకు కనబడకుండా యుక్తిగా చూస్తూ అక్కడే ఉన్నాడు. సన్యాసి కాళిని పూజించి

"దేవీ! నీకు తుష్టికలిగితే నాకు వరం ప్రసాదించు. నీవు తృప్తి పడకపోతే. నీకు నేను బలిఅవుతాను. అప్పుడయినా నీకు తృప్తి కలగదా?" అని మంత్రసాధనలో గర్వంతో అన్నాడు. గర్భగుడిలో ఆకాశవాణి "ఆదిత్య సేనమహారాజ పుత్రికను తెచ్చి కానుక అర్పించు. అప్పుడు నీకోరిక ఈడేరుతుంది" అన్నది. ఆమాటవిని ఆతడు శవమును కొట్టి లేపినాడు. అప్పుడు బేతాళుడు ఫూత్కారం చేస్తూ లేచి నిలుచున్నాడు. అతని నోటిలోనుంచి జ్వాలలు వస్తున్నవి. ఆ బేతాళునిబుజ మెక్కి సన్యాసి రాజకుమారిని తీసుకు రావడానికి ఆకాశాన వెళ్ళినాడు. అదంతా విదూషకుడు చూచి, "ఏమిటీ! నేను బతికి ఉండగానే వీడు రాజపుత్రిని చంపగలడా? ఈ మూర్ఖుడు వచ్చేదాకా నేనిక్కడే ఉంటాను" అని నిశ్చయించేసుకొని అక్కడే దాక్కున్నాడు.

సన్యాసి ఆకాశమార్గాన వెళ్లి కిటికీలోనుంచి అంతఃపురంలో ప్రవేశించినాడు; రాజపుత్రి నిద్రిస్తున్నప్పుడు ఆమెను ఎత్తుకొని వచ్చినాడు. ఆపిల్ల పెద్దపెట్టున ఏడుస్తున్నది. అతడు ఆకాశమునుంచి దేవీభవనంలో దిగి, బేతాళుని వదలిపెట్టి రాజపుత్రితో గర్భాలయంలోకి వెళ్లిన్నాడు. సన్యాసి కత్తి దూసి రాజకన్యను ఖండించబోయినాడు. వెంటనే వెనుక దాగి ఉన్న విదూషకుడు ఒరలోనుంచి కత్తి దూసి అక్కడికి వచ్చి "ఛీపాపీ! జాజిపువ్వును రాతితోనలగగొట్టివేతామనుకొంటున్నావు." అని సన్యాసిమెడ పట్టుకొని వంగదీసి తల ఖండించివేసినాడు. విదూషకుని గుర్తుపట్టి రాజకుమారి ముణుచుకొనిపోతున్నప్పుడు ఆమెను అతడు ఓదార్చి అంతఃపురానికి తీసుకుపోవడం ఏలాగని ఆలోచిస్తున్నాడు. ఆకాశవాణి "విదూషకుడా! నామాటవిను నీచేతుల్లో చనిపోయిన సన్యాసికి బేతాళుడూ ఆవాలూ దొరికినవి. అందువల్ల అతనికి రాజ్యసంపాదన మీద, రాజకన్యలమీద మనసు పుట్టింది. అతి ఆశకు పోయి ఈమూర్ఖుడు చనిపోయినాడు. ఓ వీర

విదూషకుడా! ఆవాలు పుచ్చుకో. వాటిప్రభావంవల్ల నీవు ఆకాశం మీాద సంచరించగలవు." అని అతనికి సంతోషము కలిగించింది.

విదూషకుడు సన్యాసికొంగున ఉన్న ఆవాలు తీసుకొని, రాజ పుత్త్రిని ఎత్తుకొని దేవీ భవనంలో బైటికి వచ్చినాడు. అప్పుడు అశరీర వాణి "వీరుడా! ఇక్కడికే ఈదేవి గృహానికే నెలరోజు లయ్యాక నీవు తప్పకుండా రావాలి. మరిచిపోకు" అన్నది. అతడు తప్పక వస్తా నన్నాడు. విదూషకుడు రాజకన్యను ఎత్తుకొని ఆకాశాన ఎగిరి అంతః పురానికి వెళ్ళి అక్కడఉంచిఓదార్చినాడు. అత డామెతో "అమ్మాయీ! తెల్లవారితే ఆకాశంమీాద వెళ్ళలేను. నాకు సెలవియ్యి. వెళ్ళిపోతాను. తెల్లవారితే నన్నంతా చూస్తారు." అన్నాడు. రాజపుత్రి భయ పడుతూ, "మహాపురుషుడా! నీవు వెళ్ళిపోతే నేను జీవించను. పూను కొన్నపని పూర్తిగా నెరవేర్చడం సత్పురుషులవ్రతం." అని వేడు కొన్నది. "ఏ మయినా కానీ. నేను పోను. పోతే ఈమె జీవించదు. అప్పుడు నా రాజభక్తివల్ల ఏమి ప్రయోజనం?" అని విదూషకుడు ఆలోచించి ఆరాత్రి అక్కడే ఉన్నాడు. భయంవల్ల రాజకన్య నిద్ర పోలేదు. అతడు మాత్రం అలిసి నిద్రపోయినాడు. తెల్లవారినా అత నికి మెళుకువ రాలేదు. "పాపం నిద్ర లేదేమో తెల్లవారు జామున నిద్ర పట్టింది లేపడం ఎందుకు!" అని ఆమె అర్ద్రహృదయంతో ఆలో చించి నిద్రలేపలేదు. అంతఃపురపరిచారికలు అతన్ని చూచి తెల్లపోయి రాజుగారి దగ్గిరికి వెళ్ళి విన్నవించారు. విదూషకుని ప్రభావం తెలిసిన మహారాజు కుమార్తె మందిరమునుంచి అతన్ని పిలిపించినాడు. విదూష కుడు రాజుతో జరిగినవిషయ మంతా పూస గ్రుచ్చినట్లు చెప్పి, తన కొంగున కట్టుకొన్న దొంగలనాసికలను, ఆవాలను చూపినాడు. అ దంతా నిజమే నని రాజునమ్మినాడు. దీనికంతకూ మఠంలో బ్రాహ్మ ణులు కారణ మని, వారిని చక్రధరునితోసహా పిలిపించి, రాజు

సర్వమూ అడిగి తెలుసుకొన్నాడు. స్వయముగా శ్మశానానికి వెళ్ళి, ముక్కులులేని ఆశవములను చూచి, కాళీదేవాలయానికి పోయి అక్కడ చచ్చిపడిఉన్న సన్యాసిని చూచి, నమ్మకం కలుగగా సంతోషించి, తన కుమార్తెను రక్షించిన విదూషకునికి ఆమె నిచ్చి వివాహము చేసినాడు. అది మొదలు ఆ విదూషకుడు రాజకన్యతో సుఖాలు అనుభవిస్తూ రాజభవనంలోనే ఉంటున్నాడు.

కొన్నిరోజులు గడిచిన తర్వాత రాజపుత్రి విదూషకునితో "నాథా! ఆరాత్రి అశరీరవాణి మిమ్మల్ని మాసాంతమున దేవీ మందిరానికి తప్పక రమ్మన్నది. ఆమాట మరిచిపోయినారా?" అన్నది. ప్రియురాలు జ్ఞాపకము చేసినందుకు విదూషకుడు సంతోషించి, "ప్రేయసీ! అవును. మరిచిపోయినాను. సమయానికి జ్ఞాపకముచేశావు." అంటూ అందుకు ఆలింగన బహుమాన మిచ్చినాడు. ఆమె నిద్ర పోయాక, అగ్నిదేవునివల్ల లభించిన ఖడ్గము చేత పూని స్తిమిత చిత్తంతో దేవీ భవనానికి వెళ్ళినాడు. "నేనువిదూషకుణ్ణి వచ్చాను." అని అతడు అరిచేసరికి లోపలికి రమ్మని అశరీరవాణి పలికింది. అతడు లోపలికి వెళ్ళినాడు. అక్కడ దివ్యమందిరము, అందులో అప్సరస కనపడినది. విదూషకుడు ఆదివ్యకన్యను చూచి ఆశ్చర్యపడినాడు. ఆమె అతన్ని స్నేహబహుమాన పూర్వకముగా కుశలప్రశ్నలు వేసింది. ఎవ రీమె? ఇంత చనువుగా మాట్లాడుతున్నదే! ఈమె ఎవరో తెలుసుకోవాలి అని అతడు ఉత్సుకు డయి ఉండగా ఆదివ్యకన్య "నేను విద్యాధరకన్యను. నన్ను భద్ర అని పిలుస్తారు. మాది గొప్పవంశము. కామ గమనముచేత ఇక్కడికి వచ్చి నే నప్పుడు నిన్ను చూచాను. నీ గుణములకు సంతోషించినాను. నీ సుగుణాలు నన్ను ఆకర్షించడం వల్ల నిన్ను మళ్ళీ రమ్మని, ఆసమయంలో అశరీరవాణిని సృష్టించాను. నా విద్యాప్రభావమువల్ల ఆదిత్యసేన మహారాజపుత్రి

మోహితురాలై, నీవు ఇక్కడికి రావలసిన విషయము జ్ఞాపకము చేసింది. నీకోసము నేను ఎదురుచూస్తూన్నాను. అందగాడా! ఈ శరీరము నీకు అర్పించాను. నన్ను పెళ్ళాడు." అని వేడుకొన్నది. విద్యాధరి మాటలు విని విదూషకుడు అంగీకరించి గాంధర్వవిధిని ఆమెను వివాహము చేసుకొన్నాడు. ఆమెతో భోగములు అనుభవిస్తూ అతడు అక్కడే ఉన్నాడు.

ఈలోగా అంతఃపురములో తెల్లవారుజామున రాజకన్య నిద్రలేచి, భర్త కనపడకపోవడంవల్ల బెంగపడి కన్నీరు మున్నీరుగా ఏడ్చింది. పదములు తోట్రుపడగా ఆమె తల్లిదగ్గిరికి వెళ్ళి తనభర్త రాత్రి ఎక్కడికో వెళ్ళిపోయినా డనీ, భయపడుతూ, పశ్చాత్తాపముతో తపించి చెప్పింది. కన్నకూతురిమీాద ప్రేమవల్ల తల్లి విచారించింది. రాజు సంగతి తెలుసుకొని వ్యాకులపడినాడు. అప్పుడు రాజకుమారి "నాకు తెలుసును. నాభర్త అమ్మవారి గుడికి వెళ్ళినాడు" అన్నది. కూతురు చెప్పినమాటను బట్టి రాజు స్వయముగా దేవ్యాలయానికి వెళ్ళినాడు. అక్కడ విద్యాధరీప్రభావమువల్ల విదూషకుడు అదృశ్యుడై ఉన్నందు వల్ల రాజు అతనిని కనిపెట్ట లేకపోయినాడు. ఏమిచేయడానికీ తోచక రాజు వెళ్ళిపోయినాడు. కుమార్తె భర్త లభించనందువల్ల నిరాశ చేసుకొని ప్రాణాలు వదలివేయ సంకల్పించుకొన్నది. ఆసమయములో మునీంద్రుడు వచ్చి "అమ్మా, నీ కేమీా ఆపద రాదు. నీభర్త దివ్య భోగాలు అనుభవిస్తూ క్షేమంగా ఉన్నాడు. త్వరలో నీదగ్గిరికి వస్తాడు" అంటూ ఓదార్చినాడు. పతిసమాగమము ప్రాప్తిస్తుంది గదా అని ఆమె ఆశతో ప్రాణాలు బిగబట్టి ఉన్నది.

విద్యాధరీదేవితో చెలికత్తె, యోగేశ్వరి రహస్యముగా "సఖి! మనుష్యసంపర్కము చేశా వని విద్యాధరులు నీమీాద కోపంగా ఉన్నారు. నీకు వాళ్లు అపకారం చేస్తారు. వెంటనే నీవు ఇక్కడినుంచి

వెళ్ళిపో. తూర్పుసముద్రము అవతలిదరి కార్కోటక మనేపట్టణము ఉన్నది. దానిని దాటగా శీతోద అనేపుణ్యానది, కనబడుతుంది. దాని అవతల సిద్ధక్షేత్ర మయిన ఉదయమహాపర్వతము ఉన్నది. అక్కడికి నీవు వెళ్ళితే విద్యాధరులు అంతవరకూ రాలేరు. వెళ్లిపో. వస్తే నీ ప్రియుడుకూడా నీతో వస్తాడు." అన్నది. చెలికత్తెమాటలు విని, విద్యాధరి విదూషకుని ప్రేమించినా, ఉదయపర్వతానికి వెళ్ళదలచు కొన్నది. ప్రియునితో ఆమె సంగతియావత్తూ యుక్తియుక్తంగా చెప్పి, అతనికి తనఉంగరము ఇచ్చి, తెల్లవారుజామున వెళ్ళిపోయింది. విదూషకుడు క్షణంలో దేవ్యాలయముదగ్గిర ఉన్నాడు. విద్యాధరిలేదు. ఆమందిరమూ అక్కడ లేదు. ప్రేయసీప్రపంచ మును స్మరిస్తూ ఉంగరము చూచుకొంటూ విదూషకుడు విషాదాశ్చర్యములపా లయినాడు. ప్రియురాలు ఉదయపర్వతానికి వెళుతున్నా నని చెప్పినమాటలు స్వప్న ప్రాయముగా స్మరిస్తూ, "నేను కూడా ఉదయపర్వతానికి పోతాను. నేను ఇక్కడ ఉంటే ఆదిత్యసేనుడు కనిపెట్టి నన్ను కదలనీయడు. కార్య సిద్ధికి తగినయుక్తి పన్నడం అవసరం" అని విదూషకుడు ఆలోచించి మారువేషము వేసుకొన్నాడు. చిరిగి పోయిన పేలికలు కట్టుకొని శరీ రానికి బూడిదపూసుకొన్నాడు. అతడు అమ్మవారిగుడినుంచి భద్రా అని కేకలువేస్తూ బయటికివచ్చినాడు. అక్కడున్న జనమంతా అతన్ని చూచి 'అడుగో విదూషకుడు అడుగో విదూషకుడు' అంటూ కోలాహలము చేశారు.పిచ్చివానివలె ఉన్న విదూషకుణ్ణి రాజు పట్టుకొని అంతఃపురానికి తీసుకొనిపోయినాడు. విద్యాధరిమీద ప్రేమవల్ల విదూషకుడు ఎవరు ఏమి అడిగినా 'భద్రా, భద్రా' అని పలుకుతున్నాడు. వైద్యులు అతనికి అభ్యంగస్నానము అవసరమన్నారు. విదూషకుడు తల అంటు కొన్నాక మళ్ళీ ఒంటికి బూడిదపూసుకోడం సాగించినాడు. రాజపుత్రి స్వహస్తంగా ఫలహారము తీసుకొని వస్తే విదూషకుడు కాలితో ఒక్క

తన్ను తన్నే వాడు. కొన్ని రోజులుపాటు అతడు బట్టలుచింపుకోడం పిచ్చిగా ఉండడం సాగించినాడు; అనవసరముగా ఇతనిని బాధపెట్టడం బాగా లేదు. ఈపిచ్చికి మందు లేమీ పని చెయ్యవు. మనము పెట్టేబాధ పడలేక ప్రాణాలు వదులుతాడు. పైగా బ్రహ్మహత్యాదోషం సంభ విస్తుంది. విచ్చలవిడిగా ఇతనిని వదిలిపెడితే కాలక్రమేణ స్తిమితపడతా డేమో. ” అని ఆదిత్యసేనుడు ఆలోచించి అతనిని వదిలిపెట్టినాడు.

## విదూషకుడు విద్యాధరి వద్దకు పోవుట

విదూషకుడు యథేచ్ఛగా తిరుగుతూ మరునాడు విద్యాధరీదేవి ఇచ్చిన ఉంగరము తీసుకొని విద్యాధరికోసం తూర్పు దిక్కుగా ప్రయాణ మైనాడు. పోయిపోయి అతను పౌండ్రక పట్టణము చేరి వృద్ధ బ్రాహ్మడి ఇంటిలో బస ఏర్పాటు చేసుకొన్నాడు. వృద్ధురాలు అతనికి ఆతిథ్యమిచ్చి, కన్నీరు విడుస్తూ “ నాయనా, నాయిల్లు వాకిలీ సర్వస్వం నీకు ధారాదత్తము చేస్తున్నాను. పుచ్చుకో. నేను జీవించను ” అన్నది. ఆశ్చర్యంతో అతడు “ ఎందు కమ్మా ఇలా అంటావు ? ” అని ప్రశ్నించినాడు. ఆమె ఇలా అన్నది: “ నాయనా, సంగతి విను. ఈ నగరపాలకుడు దేవసేనుడు. రాజుకు లేకలేక కుమార్తె చాలా కాలానికి కలిగింది. చిరకాల దుఃఖము అనుభవించిన తరువాత పుట్టిన పిల్ల కనుక దుఃఖలబ్ధిక అని పేరు పెట్టినాడు. ఆమెకు యౌవనము రాగానే కచ్ఛపనాథు డనేరాజుకు ముడిపెట్టినాడు తండ్రి. కచ్ఛపనాథుడు పడక గదిలో ప్రవేశించి భార్యదగ్గిరికి పోయేసరికి అతనిప్రాణాలు వెంటనే ఎగిరిపోయినవి. రాజు చింతాక్రాంతుడై దుఃఖలబ్ధికను మరొకరాజు కిచ్చి పెళ్ళి చేశాడు. అతడుకూడా యథాప్రకారంగా పెళ్ళి అయిన వెంటనే చనిపోయినాడు. రాజు లెవ్వరూ ఆపిల్లను వివాహము చేసుకో డానికి సాహసించలేక భయపడుతున్నారు. అప్పుడు దేవసేన మహా

రాజు సేనాధి పతిని పిలిచి ఇలా ఆజ్ఞాపించినాడు: "ఈ దేశంలో నీవు రోజూ ప్రతియింట్లోనుంచీ ఒక్కొక్క బ్రాహ్మణుణ్ణి గాని, క్షత్రియుణ్ణి గాని తెచ్చి నాకూతురి పడకగదిలో వదలాలి. ఎంతమంది ఎన్నాళ్ళు చనిపోతారో చూతాము. ఎవడు బతికితే వాడికి నాకూతుర్ని ఇస్తాను. విధిని తప్పించడం మనతరమా!"

"రాజాజ్ఞప్రకారము సేనాధిపతి ప్రతిదినమూ వంతుప్రకారము పురుషుని రాజకన్యకోసము తీసుకుపోతున్నాడు. వందలకొద్దీ మనుష్యులు చనిపోతున్నారు. నిర్భాగ్యురాల నయిననాకు ఒక్కడే కొడుకు ఉన్నాడు. నాయనా! ఇవాళ అతనివంతు వచ్చింది. వాడు లేకపోతే నేను బతికి ప్రయోజన మేమిటి? కనుక నేను జీవించి ఉండగానే, గుణవంతుడవయిన నీకు, తిరిగి నా కిట్టిదుఃఖము కలగకుండా ఉండేటందుకు గృహమూ నాసర్వస్వమూ ఇస్తున్నాను."

అప్పుడు విదూషకుడు "అమ్మా, నీవు బెంగ పెట్టుకోకు. నీయేక పుత్రుణ్ణి పంపకు. నేను ఆ రాజపుత్రి దగ్గిరికి పోతాను. నేను చనిపోతానని నన్ను చూసి జాలిపడకు. నాకు యోగసిద్ధి ఉన్నది. ఏమీ భయము ఉండదు." అన్నాడు.

"నీవు ఎవరో మానవమాత్రుడివి కావు. నా పూర్వపుణ్యావశాన ఇక్కడికి వచ్చావు. మాకు ప్రాణా లిచ్చి నాయనా, నీవు కుశలంగా ఉండు" అన్నది.

ఈ ప్రకారంగా విదూషకుడు వృద్ధురాలి దగ్గిర అనుమతి తీసుకొని, సందెవేళ సేనాధిపతి సేవకునితో రాజకన్యాంతఃపురానికి వెళ్ళినాడు. ఆరాజకన్య యౌవన మదములో విరియబూచిన పూలతీగవలె కళకళ లాడుతున్నది. ఆరాత్రి రాజపుత్రి పానుపుమీద పరుండగా విదూషకుడు అగ్నిదేవుణ్ణి ధ్యానించినాడు. వెంటనే అతనికి ఆగ్నేయఖడ్గము చేతిలోకి రాగా లోపలికి వెళ్ళి, "ఇక్కడ పురుషున్ని ఎవరు చంపు

తారో చూస్తాను.'' అని ఆలోచించుకొని రాత్రి మేలుకొన్నాడు. జనమంతా నిద్రించాక రాక్షసుడు ఘోరరూపంతో ద్వారసీమలో విదూషుని కంటపడినాడు. రాక్షసుడు ద్వారముదగ్గిర నిలిచి బాహువు చాచినాడు. విదూషకుడు కోపంతో కత్తి దూసి రాక్షసుని బాహువునుసరికినాడు. రాక్షసుడు అతని బలానికి భయపడి మళ్ళీ అక్కడికి అడుగు పెట్టకుండా పారిపోయినాడు. రాజపుత్రి నిద్ర లేచి తెగినబాహువును చూచి భయసంతోషాశ్చర్యముల పాలయింది. తెల్లవారింది. దేవసేన మహారాజు కుమార్తె గదికి వచ్చి పడిఉన్న బాహువును చూచి, పరమానందముతో విదూషకునికి కూతు నిచ్చి వివాహము చేసినాడు.

విదూషకుడు అక్కడ కొంతకాలము దుఃఖలబ్ధికతో భోగములు అనుభవించినాడు. ఒక రాత్రి ఆమె నిద్రిస్తున్నసమయం చూచి అతను విద్యాధరికోసము వెళ్ళిపోయినాడు. రాజపుత్రి నిద్ర లేచి చూస్తే భర్త కనపడ లేదు. తండ్రితో సంగతి చెప్పింది. ప్రియుడు తిరిగి తనకు లభిస్తాడే మోనని ఆశతో ఆమె ప్రాణాలు అరచేత పెట్టుకొన్నది. తండ్రి ఆమెను ఓదార్చినాడు. విదూషకుడు ప్రయాణముచేసి తామ్రలిప్తి నగరము చేరి, అక్కడ సముద్రము దాట ప్రయత్నించినాడు. స్కందదాసు డనే ఓడలవర్తకునితో విదూషకుడు స్నేహము చేసి, అపారధన పూర్ణ మయిన ఓడ నెక్కి ప్రయాణము చేసినాడు. నౌక కొంత దూరము పోయి ఏదో తగిలేసరికి ఆగిపోయింది. స్కందదాసుడు సముద్రుణ్ణి రత్నాలతో పూజించినాడు. అప్పటికీ నావ కదలక పోవడంవల్ల అతడు బెంగపడినాడు. 'ఆగిపోయిన ఈ నావను ఎవడు పోనివ్వగలడో వానికి నాకూతురి నిచ్చి పెళ్ళిచేస్తా నని ఆవర్తకుడు శపథము చేసినాడు. విదూషకుడు ఆమాట విని "నేను సముద్రములో దిగి, సముద్రోదకమంతా వెతికి క్షణములో ఈనావ కదిలేటట్టుచేస్తాను. మీరు నన్ను తాళ్ళతో పట్టుకొనండి. పడవ కదిలిన తరువాత నన్ను నీటిలోనుంచి

ఉద్ధరించాలి” అని చెప్పినాడు. వర్తకుడు అందుకు అంగీకరించినాడు. అప్పుడు కళాసులు అతన్ని తాళ్ళతో చంకలదగ్గిర కట్టివేసినారు. విదూషకుడు సముద్రములో దిగినాడు. అతడు అగ్నిదేవుణ్ణి ఆరాధించేసరికి ఆగ్నేయఖడ్గము అతనిచేతిలోకి వచ్చింది. నావకింద నీటిలో అతడు ప్రవేశించగా మహాకాయుడు కనపడినాడు. అతడు నిద్రిస్తున్నాడు. అతని పిక్కలో ఓడ ఇరుక్కుపోయింది. తక్షణం విదూషకుడు కత్తి దూసి ఆ మహాకాయుని పిక్కను తెగ నరికినాడు. వెంటనే ఓడ కదిలింది. అప్పుడు పాపాత్ముడయిన వర్తకుడు దురాలోచన చేసినాడు. అన్నమాటప్రకారము విదూషకునికి ధనాధికము ఇయ్యవలసివస్తుం దనే భయమువల్ల, అతనిచంకలకు కట్టినతాళ్ళను కోసివేసినాడు.

విదూషకుడు నీళ్ళలో తేలుతూ వర్తకునిమోసము గ్రహించినాడు. అతను ఎంతమాత్రము అధైర్యపడక, తాను ఖండించిన మహాకాయుని పిక్కనే తెప్పగాచేసుకొని సముద్రము దాటినాడు. అవతలిదరి చేరగానే ఆకాశవాణి పలికింది: “బళీ! విదూషకా! నీకంటె బలవంతుడు ఎవ డున్నాడు? ఇప్పుడు నీవు దిగంబరదేశము వచ్చావు. ఏడురోజులు ప్రయాణము చేస్తే కార్కోటపట్టణము చేర గలవు. నీకోరిక అక్కడ తప్పక నెరవేరుతుంది. నేను నీ ఆరాధనాదేవుణ్ణి, అగ్నిహోత్రుణ్ణి. నావరప్రసాదమువల్ల నీకు ఆకలిదప్పికలు ఉండవు. ధైర్యోత్సాహాలతో నీ అభీష్టము నెరవేర్చుకో.”

విదూషకుడు అశరీరవాణి విని సంతోషించి అగ్నిదేవునికి ప్రణామము ఆచరించినాడు. ఏడవనాటికి కార్కోటనగరము చేరినాడు. సత్పురుషులు, నానాదేశాగతులు నివసించిన మఠమునకు వెళ్ళినాడు. ఆమఠాన్ని ఆర్యవర్మ అనే అక్కడిరాజు కట్టించినాడు. ఆమఠములో బంగారు దేవాలయాన్ని కూడా అతడు నిర్మించినాడు. అక్కడ విదూషకునికి బ్రాహ్మణులు ఆతిథ్య మిచ్చి సత్కరించినారు. ఒకబ్రాహ్మణుడు అతన్ని తన

ఇంటికి తీసుకుపోయి మజ్జన భోజనాదికాలతో సంతృప్తుణ్ణి చేశాడు. సాయంకాలము అతడు చాటింపు విన్నాడు: 'బ్రాహ్మణుడు గాని క్షత్రియుడు గాని ఎవడు రేపు ఉదయాన రాజకుమారిని పెళ్ళి చేసుకోవా లనుకొంటాడో, అతడు ఈరాత్రి ఆమె ఇంటిలో ఉండాలోవలోయ్' అని. ఆచాటింపు విని విదూషకుడు దాని కేదో కారణ మున్న దని ఊహించినాడు. అతడు సాహసి కనుక రాజకన్యాంతఃపుర ములో ప్రవేశించవలె నని ఉద్దేశించినాడు. అప్పు డామఠంలో ఉన్న బ్రాహ్మణులు "బ్రాహ్మణోత్తమా! సాహసము వద్దు. అది రాజ కన్యాంతఃపురము కాదు: మృత్యుముఖము. అక్కడికి వెళ్ళినవాడు జీవించడు. ఎంతమందో సాహసించి వెళ్ళి మళ్ళీ రాలేదు" అని చెప్పినారు.

అక్కడున్నవాళ్ళు వెళ్ళ వద్దని చెప్పినా విదూషకుడు లక్ష్యపెట్టక రాజభటులతో రాజమందిరానికి వెళ్ళినాడు. ఆర్యవర్మ మహారాజు స్వయంగా విదూషకుణ్ణి గౌరవించినాడు. రాజకన్య అతన్ని చూచి వలపుతోనూ, అతడు జీవించ డని వగపుతోనూ, కన్నీరువిడుస్తూ ఉండగా విదూషకుడు అగ్ని దేవు డిచ్చిన ఖడ్గము చేత పట్టుకొని మేలుకొన్నాడు. హఠాత్తుగా రాక్షసుడు కనపడినాడు. అతనికి కుడి చెయ్యి లేదు. ఎడమచేతిని వాడు గదిలోకి చాచినాడు. అది చూచి విదూషకుడు "వీడే ఆ రాక్షసుడు. వీడి బాహువునే పౌండ్రవర్ధన పురంలో తెగ నరికినాను. ఈ బాహువును మాత్రము నరకను. అలా చేస్తే వీడు పారిపోతాడు. వీణ్ణి వధించడమే ఉచితము" అనుకొని వెంటనే రాక్షసుని మీదికి లంఘించి, వాడిజుట్టు పట్టుకొని వంచి చంపబోయినాడు. రాక్షసుడు భయపడి "మహాబలా! నన్ను చంపకు" అని మొరపెట్టినాడు. "నీ పేరేమి? ఎందు కిలాచేస్తావు?" అని విదూషకుడు రాక్షసుని ప్రశ్నించగా వాడు, "నాపేరు యమదంష్ట్రుడు. నాకు ఇద్దరు కుమార్తెలు. వాళ్ళల్లో ఈమె ఒకతె. రెండవది పౌండ్రవర్ధనంలో

ఉన్నది. ఈ రాజకన్యలను వీరపురుష సంగమమునుంచి. రక్షించాలి. నాకు శంకరుడు ఆజ్ఞ యిచ్చినాడు. మొదట నా కడిబుజాన్ని పౌండ్ర వర్ధనపురములో ఒకడు నరికినాడు. నీ విప్పుడు నన్ను జయించినావు. శంకరాజ్ఞ సమాప్త మయింది" అన్నాడు.

రాక్షసునిమాటలు విని నవ్వుతూ విదూషకుడు "నేనే నీ బాహువును ఇదివరలో నరికినాను" అని చెప్పినాడు.

"నీవు మానవమాత్రుడవు కావు. దేవపురుషుడవు. అవసరము వచ్చినప్పుడు గాని కష్టాల్లో గాని నన్ను తలచినమాత్రాన నీ కష్టాలు గట్టెక్కిస్తాను. నీవు నాస్నేహితుడవు." అంటూ రాక్షసుడు విదూషకునితో స్నేహము చేసినాడు. బ్రాహ్మణుడు ఆ నేస్తమునకు అంగీకరించినాడు. రాజకన్య విదూషకుని పరాక్రమాన్ని వేనోళ్ళ పొగడింది. అందుకతను పరమానందభరితుడై ఆమెతో రాత్రి గడిపినాడు. తెల్లవారగానే రాజుకు సంగతి యావత్తూ తెలిసి సంతోషించి, తనకుమార్తెను అతని కిచ్చి వివాహము చేసినాడు.

ఆ రాజకుమారి క్షణమాత్రమైనా విదూషకుణ్ణి వదలలేకపోయింది. అతడు ఆమెతో కొన్ని రాత్రులు గడిపి, ఒకరాత్రి తన పూర్వప్రేయసి అయిన విద్యాధరిని తలుచుకొని రాజకుమారితో చెప్పకుండా వెళ్ళిపోయినాడు. నగరము వదలి వెళుతున్నప్పుడు విదూషకుడు తనకు సాయము చేస్తా నని అభయ మిచ్చిన రాక్షసుణ్ణి స్మరించినాడు. వెంటనే రాక్షసుడు వచ్చి ఆ బ్రాహ్మణునికి వందన మాచరించి నిలువబడగా, విదూషకుడు "స్నేహితుడా! నాప్రేయసి విద్యాధరి నివసిస్తున్న ఉదయాద్రిక్షేత్రానికి వెళ్ళవలెను. నన్ను అక్కడికి తీసుకుపో" అన్నాడు.

రాక్షసుడు విదూషకుని తన బుజముమీద ఎక్కించుకొని, ఆరాత్రే అరవై యోజనాల దూరము అవలీలగా తీసుకొని వెళ్ళినాడు. తెల్లవారగానే మానవులు దాటలేని శీతోదానదిని దాటి ఉదయపర్వతము చేరి

నాడు. అప్పుడు రాక్షసుడు 'మిత్రుడా, నీఎదుటనే చూసు ఉదయపర్వతము. ఈసిద్ధక్షేత్రంలో నేనడుగు పెట్టలేను. నాకు ప్రవేశార్హత లేదు'' అని చెప్పి విదూషకునివద్ద సెలవు తీసుకొని అదృశ్య మైనాడు.

అప్పుడువిదూషకుడు దిగుడుబావిని చూచినాడు. ఆబావిలో చలిస్తున్న తుమ్మెదలరొదతో పద్మములు అతనికి కనపడినవి. దానిగట్టునే స్త్రీల అడుగులజాడలతో ఉన్నతోవ 'ఇదే నీకు ప్రియాగమహేతువు' అని చెప్పేదానివలె విదూషకునికి కనపడినది. 'ఈదారి ఎక్కడికి పోతుందో ? నరులు వెళ్ళడానికి శక్యముగా లేదు. ఈతోవలో ఉన్న అడుగుజాడలు ఎవరివో ? క్షణం నిదానించి చూడాలి' అని విదూషకుడు తలచినాడు. ఈలోగా దివ్యకాంతలు బంగారపుబిందెలు బుజాల మీదపెట్టుకొని దిగుడుబావిలో నీళ్ళు ముంచుకోడానికి వచ్చినారు. వాళ్ళు నీళ్ళు ముంచుకొంటున్నప్పుడు విదూషకుడు మృదువుగా వారితో "ఈనీళ్ళు ఎవరికోసం తీసుకుపోతున్నారు ?'' అన్నాడు.

"ఈపర్వతములో భద్ర అనే విద్యాధరి నివాసము చేస్తున్నది. ఆమెకు స్నానార్థము నీళ్ళు తీసుకు పోతున్నాము'' అన్నారు దివ్యకాంతలు. వెతకబోయినతీగె అతనికాలికి తగిలింది. బ్రహ్మదేవుడు ధీరుల ప్రయత్నాలకు సంతోషించి కావలసిన సామగ్రిని తానేసమకూరుస్తాడు. ఆదివ్య స్త్రీలలో ఒకతె ఆకస్మికముగా 'మహాభాగా ! ఈబిందెను నా బుజానికి ఎత్తుదూ' అని అడిగింది. ఆలాగే బిందెఆమెబుజానికి ఎత్తినాడు. పూర్వము తనప్రేయసి విద్యాధరి యిచ్చిన రత్నాలఉంగరమును విదూషకుడు బిందెలో వేసి యథాప్రకారంగా దిగుడు బావి గట్టున కూర్చున్నాడు.

దివ్యస్త్రీలు భద్రకు స్నానము చేస్తున్నప్పుడు బిందెలోనుంచి రత్నాలఉంగరము ఆమె ఒడిలో పడినది. ఆ అంగుళీయకమును చూచి విద్యాధరి భద్రాదేవి చప్పున గుర్తించింది. వెంటనే ఆమె "ఇక్కడ

అపూర్వ మైన పురుషుణ్ణి చూశారా ఏమిటి ?" అని ప్రశ్నించింది. "దిగుడుబావి గట్టున పురుషుణ్ణి చూచాము. అతడు బిందె బుజాన పెట్టి సాయము చేసినాడు." అని వాళ్ళు సమాధాన మిచ్చినారు.

"వెంటనే ఆపురుషుణ్ణి స్నానం చేయించి శీఘ్రంగా ఇక్కడికి తీసుకు రావాలి" అని భద్ర వాళ్ళకు ఆజ్ఞ యిచ్చింది. విదూషకుడు స్నానము చేసి వచ్చినాడు. విద్యాధరి అతనికోసము ఎదురు చూస్తూ నిలువబడింది. ప్రియుణ్ణి చూచి ఆమె ఆనంద బాష్పాలతో అర్ఘ్య మిచ్చి అతని కంఠమునా, బుజాలమీదనూ పూలదండలు వేసింది. ఆ భార్యభర్తలు గాఢాలింగనము చేసుకొన్నారు.

బహుకాలానికి వాళ్ళిద్దరూ కలుసుకోడం వల్ల, ఒకరి నొకరు తనివి తీర ఎంతసేపు చూచుకొన్నారో తెలియదు. ఆ భార్యాభర్తల హృదయాలలో కోరికలు కుప్పతిప్పలుగా బయలుదేరుతున్నవి. భద్రాదేవి భర్తను "ఈచోటికి మీరు ఎలా రాగలిగినారండీ ?" అని ప్రశ్నించింది. అతను "ప్రేమ, ప్రాణాపాయాలను లెక్క చెయ్యదు. నీ మీదఉన్న అనురాగము వల్లనే అపాయములు దాటుకొంటూ వచ్చాను" అన్నాడు. ప్రాణాలు పోగొట్టుకోడానికి వెనక్కు తీయని ఆ అనురాగమును ఆమె గ్రహించి ఆర్ద్రహృదయంతో "ఆర్యపుత్రా! నాకు చెలికత్తెలతో పని లేదు. సిద్ధులతో పని లేదు. మీరే నాకు ప్రాణము ! ఎంత అద్భుత మండీ మీగుణసంపద" అన్నది.

"ప్రేయసీ, అలా గయితే ఈ దివ్యభోగాలు వదిలిపెట్టి నాతో కూడా ఉజ్జయినీ నగరానికి రా" అని విదూషకుడు పలికినాడు. భద్ర అందుకు అంగీకరించింది. ఆమె ప్రియునితో వెళ్ళి పోవడానికి సిద్ధపడి, సంకల్పమాత్రంవల్ల సర్వవిద్యలనూ తృణప్రాయముగా వదిలిపెట్టింది.

ఆ రాత్రి విద్యాధరికి యోగేశ్వరి అనే చెలికత్తె నకలోపచారములూ చేసింది. తెల్లవారగానే విదూషకుడూ విద్యాధరీ ఉదయ పర్వతమునుంచి

దిగినారు. అతడు యమదంష్ట్రుని స్మరించగా ఆ రాక్షసుడు ప్రత్యక్షమైనాడు. వెళ్ళవలసిన మార్గము చెప్పి అతడు ఆ రాక్షసుని బుజాన ఎక్కగా విద్యాధరి ప్రియుని ఒడిలో కూర్చున్నది. విదూషకుడు అలా తన ప్రేయసిని ముందుకూర్చోబెట్టుకొని యమదంష్ట్రునిసాయమువల్ల కార్కోటక నగరము చేరినాడు. అక్కడివారు రాక్షసుణ్ణి చూచి భయపడి పోగా, విదూషకుడు ఆ నగరప్రభు వయిన ఆర్యవర్మ దగ్గిరికి పోయి తన ప్రేయసిని వంపమని అడిగినాడు. ఆర్యవర్మ తనకుమార్తెను అల్లుడికి ఇచ్చినాడు: విదూషకుడు ఆ రాజపుత్రిని రాక్షసుని బుజము మీాద ఎక్కించినాడు. వెంటనే యమదంష్ట్రుడు ఎగిరిపోయి పూర్వము విదూషకుణ్ణి మోసగించిన పాపిష్ఠి వర్తకుని దగ్గర వాలినాడు. ఆ వర్తకుడు ధనం బాగా ఆర్జించి భోగాలు అనుభవిస్తున్నాడు. అతని కుమార్తెనూ అతని ధనమునూ విదూషకుడు పుచ్చుకొన్నాడు. లోభుల సంపదను హరిస్తే అదే వారికి చావు. ఆ వర్తకుని కూతురిని కూడా రాక్షసునిబుజాన ఎక్కించుకొని ముగ్గురు భార్యలతో విదూషకుడు ఆకాశమార్గాన ప్రయాణము చేసి చేసి పౌండ్రవర్ధన పట్టణము చేరినాడు. ఆ పౌరులు రాక్షస వాహనుడై వచ్చిన విదూషకుని చూచి ఆశ్చర్యపడినారు. ఆ నగరపాలకు డయిన దేవసేనుడు తన కుమార్తెను విదూషకునికి అప్పగించగా అతడు రాక్షసుని సహాయమువల్ల నలుగురు భార్యలతో ఉజ్జయినీ నగరము చేరుకొన్నాడు. ఉజ్జయినీ నగరవాసు లంతా పరమాశ్చర్య పడుతున్నారు. ఆ నగరప్రభువు ఆదిత్యసేనుడు విదూషకునికి ఎదురుగా వచ్చినాడు. రాక్షసవాహనము దిగి విదూషకుడు మామగా రయిన ఆ మహారాజుకు నమస్కారము చేసినాడు. అతడు నలుగురు భార్యలనూ రాక్షసుని బుజాలమీాదనుంచి దింపి, రాక్షసుణ్ణి యథేచ్ఛగా వెళ్ళ మని సెల విచ్చినాడు. వెంటనే విదూషకుడు భార్యా సమేతముగా ఆదిత్యసేన మహారాజభవనానికి వెళ్ళి, చాలా కాలము

నుంచీ తనకై ఎదురు చూస్తున్న రాజకుమారిని తన ప్రథమ భార్యను చూచి ఆనందము కలిగించినాడు. రాజు కుతూహలముతో "ఇంత మంది భార్యలు ఎలా వచ్చారోయి, అల్లుడూ! ఆ రాక్షసు డెవడు ?" అని అడిగితే యావద్వృత్తాంతమూ విదూషకుడు పూసగుచ్చినట్టు చెప్పి నాడు. అల్లుని అఖండ ప్రతాపము గుర్తించి ఆదిత్యసేనుడు అర్ధరాజ్యము ఇచ్చినాడు. వెంటనే పరిచారకులు వెళ్ళి గొడుగు పట్టినారు. మరి కొందరు వింజామరలు వేసినారు. విదూషకుడు రా జయినాడు. క్రమేణా అతను పృథివీ మండలము జయించి చక్రవర్తి అయి భార్య లతో భోగాలు అనుభవించినాడు.

ఇలాగా దైవము అనుకూలముగా ఉన్నప్పుడు ధీరుల బాహుబలమే లక్ష్మీదేవిని ఆకర్షించడానికి మహామంత్ర మవుతుంది.

వత్సరాజు కథ చెప్పగా మంత్రులూ దేవేరులూ వింటూ ఆనంద ముతో పొంగి పోయినారు.

## తరంగము : ౧౯

యౌగంధ రాయణుఁడు వత్సరాజుకు ఇలా సలహా ఇచ్చి నాడు : "రాజేంద్రా! మీకు దైవము అనుకూలము. మీకు శౌర్యమున్నది. మేము రాజనీతి తెలుసుకొని చక్కగా ఆలోచించగా, మీరు వెంటనే దిగ్విజయము చేయడము ఉచితముగా కనపడుతున్నది." అప్పుడు వత్స రాజు, "అవును, బాగున్నది. మంచి చేయబోతే చెడు ఎదు రవు తుంది. సత్కార్యాన్ని ఆచరించేటప్పుడు విఘ్నాలు వస్తవి. అంత రాయాలు రాకుండా నివారణార్థము మహేశ్వరునిగురించి తపస్సు చేదాము. శివానుగ్రహము లేకుండా కోరికలు ఎలాసఫల మవుతవి?" అన్నాడు. మంత్రులు రాముని సేతుబంధ ప్రయత్నానికి కపీశ్వరులు సాయంచేసినట్టు, మహారాజు చేయబోయే దిగ్విజయయాత్రకు అంగీక

రించినారు. మహారాజు సత్కార్యాచరణ సఫలము కావడానికి తపస్సు చేసి మూడుదినములు ఉపవసించినాడు. అతనికి స్వప్నములో శివుడు ప్రత్యక్షమై "నీతపస్సుకు మెచ్చినాను. నీకు తప్పక జయము. త్వరలో నీకు విద్యాధరచక్రవర్తి కాబోయే కుమారుడుకలుగుతాడు" అన్నాడు. శివానుగ్రహమువల్ల మహారాజుకు సంతృప్తి కలిగింది. తెల్లవారగానే మంత్రులకూ, వ్రతోపవాసములవల్ల నీరసించిన కుసుమకోమలు లయిన రాణులకూ వత్సరాజు స్వప్నవిషయము చెప్పి వీనులకు విందు చేసినాడు. వాళ్ళసంతోషము చెప్పడానికి మాటలు చాలవు. ఇలా మహారాజు తపస్సుచేసి తాత ముత్తాతలవలె మహిమను సంపాదించి నాడు. దిగ్విజయయాత్రా సమారంభంవల్ల పౌరులు పరమానందము అనుభవిస్తూండగా వత్సరాజు పారణ చేసినాడు. అప్పుడు యౌగంధ రాయణుడు, రాజుతో "మహారాజా, నిజంగా మీరు ధన్యులు. ఈశ్వరదర్శన మయినమీకంటె ఎవరు కృతకృత్యులు? శత్రువులనుజయించి, భుజ పరాక్రమమువల్ల విజయలక్ష్మిని అనుభవించండి. క్షత్రియోచిత మయిన శౌర్యమువల్లనే లక్ష్మీదేవిని పొందితే అప్పుడు రాజ వంశాలలో స్థిరముగా ఉంటుంది. స్వధర్మార్జిత మయిన సంపద కలకాలమూ ఉంటుంది. మీ తాతముత్తాతలు సంపాదించిననిధి చిరకాలం భూమిలో మరుగుపడి నప్పటికీ నీకులభించింది. అందుకు నిదర్శనముగా ఈ కథ వినండి:

## దేవదాసు కథ

పాటలీపుత్ర నగరములో కులీనుడూ, ధనవంతుడూ అయిన దేవదాసు అనే వైశ్యుడు ఉన్నాడు. అతనిభార్య పౌండ్రవర్ధన పురములో ధనికుని కుమార్తె. దేవదాసు తండ్రి చనిపోయాక, వ్యసనాలలో చిక్కి జూదములో డబ్బు పోగొట్టుకొన్నాడు. దారిద్ర్య దుఃఖము వల్ల అతని భార్య కృశించగా, తండ్రి తన కుమార్తెను పౌండ్రవర్ధనపురము తీసుకు

పోయినాడు. ఆ స్త్రీయావత్తు కోలుపోయిన దేవదాసు మళ్లీ వర్తకము చేయవలెనని నిశ్చయించుకొని, మామగారని యాచించడానికి పౌండ్రవర్ధనపురము వెళ్ళినాడు. అత్తవారి ఊరు చేరుకొనేసరికి సాయంకాలమైనది. మాసిన బట్టలతో ఉన్న దేవదాసు విచారపడి "మామగారి యింట్లో ఈదశలో ఎలా ఉండడం? అభిమానికి బంధువులయెదట దైన్యముకన్న మరణమే మంచిది." అనుకొని బజారులో ఒకదుకాణములో మూల ముణుచుకొని పరున్నాడు. తర్వాత కొంతసేపటికి ఆదుకాణానికి ఎవరో వైశ్యుడు వచ్చి తలుపులు తెరిచి లోపల ప్రవేశించగానే, అప్పుడే ఒకస్త్రీ మెల్లిగా వచ్చి ఆ యింట్లో చేరింది. దీపము వెలుగుతూ ఉండడమువల్ల ఆ కాంతిలో దేవదాసు ఆమె తనభార్య అని ఆనవాలు పట్టినాడు. ఆమె లోపలికి వెళ్ళి తలుపు గడియ వేసింది. తన భార్య పరపురుషునితో లోపలికి వెళ్ళగానే దేవదాసు తలమీద పిడుగు పడిన ట్లయింది. ధనహీనుణ్ణి దేహముకూడా వదిలివేస్తుంది. స్త్రీలు వదిలివేస్తా రంటే ఆశ్చర్యమా? స్త్రీల చిత్తాలు మెరుపుతీగెలవలె మహా చంచలంగా ఉంటవి. వ్యసనాల్లో చిక్కిన పురుషుల మనస్సులూ చంచలంగానే ఉంటవి. పుట్టిల్లు చేరిన స్వతంత్రురాలు స్వేచ్ఛగా సంచరిస్తుంది. పాపఫలము అనుభవించకపోదు.' అనుకొంటూ దేవదాసు చాలా విచారించినాడు. తనభార్య పరపురుషునితో చేస్తున్న సరస సల్లాపములూ అతడు విన్నాడు. తలుపుదగ్గిరికి పోయి చెవి దోరపెట్టి వింటున్నాడు. అతనిభార్య జారునితో ఏకాంతములో మాట్లాడు తున్నది: "నీమీద నాకు మక్కువ ఎక్కువ. ఒక రహస్యము చెప్పాలి. నా భర్తకు వీరవర్మ అనే ముత్తాత ఉండేవాడు. ఆయన గృహప్రాంగణములో నాలుగు మూలలా వరహాలతో నిండిన బిందెలను భూమిలో పూడ్చిపెట్టి ఆ రహస్యము తన భార్యకుమాత్రమే చెప్పినాడు. ఆమె చనిపోయే సమయాన ఆ రహస్యము కోడలికి చెప్పింది. ఆమె తన కోడలికి చెప్పింది.

మా అత్తగారు నా కాసంగతి చెప్పారు. ఇలా రహస్యము కోడళ్ళకు మాత్రమే తెలుస్తూ వచ్చింది. ఆ రహస్యము నా భర్తకు చెప్పకుండా ఊరుకొన్నాను. ఆయన జూదమాడుతారు. అందువల్ల ఆయనకు చెప్పలేదు. ఆయన పేరు చెపితే నాకు పరమ అసహ్యము. నీవు నాకు ప్రియుడవు. నీవు అక్కడికి వెళ్ళి వరహాల బిందెలు తీసుకురా. వచ్చి నాతో సుఖము అనుభవించు.” ఆ జారుడు దానిమాటలకు సంతోషించినాడు. అప్రయత్నముగా ధనము లభిస్తున్నప్పుడు అత నెంతో పొంగిపోయినాడు. దేవదాసు భార్యమాటలువిని నిధి దొరుకుతుందిగదా అని సంతోషించి పాటలీపుత్రము వెళ్ళి స్వగృహంలో ఉన్న వరహాల బిందెలను తవ్వి తీసుకొన్నాడు. ఈలోగా దేవదాసు భార్యను చేపట్టిన జారుడు పాటలీపుత్రము వర్తకము చేయవలె ననే మిషతో వరహాల బిందెలకోసము వచ్చినాడు. దేవదాసు ఎక్కువ కిమ్మతుకు ఇల్లు అతనికి అమ్మివేసినాడు. దేవదాసు కాపరం పెట్టి అత్తవారింటికి వెళ్ళి భార్యను తీసుకొనివచ్చినాడు. శఠవర్తకుడు కొనుక్కొన్న ఇంట్లో వరహాలబిందెలు దొరుకక వేమోనని ఎంత తవ్వించినా దొరకలేదు. నిక్షేపము దొరకక పోవడంవల్ల అతడు ఖిన్నుడై దేవదాసు దగ్గిరికి వచ్చి “ఇల్లు నాకు అవసరం లేదు. తీసుకో నీ ఇల్లు. నాధనము నా కిచ్చేసెయ్యి.” అంటూ తగాదాచేసినాడు. ఇద్దరూ పోట్లాడుకొని రాజుకు మనవి చేసుకొన్నారు. దేవదాసు తనభార్య వర్తనము రాజుతో పూస గుచ్చినట్టు చెప్పినాడు. రాజు దేవదాసు భార్యను పిలిపించి యథార్థము తెలుసుకొని, పరదారను చేపట్టిన వర్తకునికి యావజ్జీవ శిక్ష విధించినాడు. దేవదాసు భార్య ముక్కు కోసి మరొక పిల్లను పెళ్ళిచేసుకొని, వరహాలబిందెలవల్ల ధనికు డయి సుఖంగా ఉన్నాడు.

## దిగ్విజయము

ఇలా యౌగంధరాయణుడు వత్సరాజుకు రాజధర్మము బోధిస్తున్నాడు. "ధర్మమువల్ల వచ్చినసిరి స్థిరంగా ఉంటుంది. అధర్మార్జిత విత్తము నీటి తుంపురులవలె నశిస్తుంది. రాజు ముఖ్యంగా ధర్మమువల్లనే ధనార్జన చేయాలి. కార్యసిద్ధికిగాను మంత్రు లందరినీ సమ్మానించి సిరి సంపదలు పొందవలె. మీ మామలవల్ల చాలామంది రాజులు మీఅండ చేరుతారు. కాశీరాజు బ్రహ్మదత్తుడు మీకు పరమ శత్రువు. ఆతన్ని ముందు జయించాలి. తర్వాత తూర్పుదిక్కు మొదలు వరసగా అన్ని దిశలూ గెలిచి కీర్తి పొందాలి.

మంత్రి ఈ మాటలు చెప్పినతర్వాత వత్సరాజుకు విజయోత్సాహము కలిగింది. జనమును ప్రయాణము కమ్మని ఆన తిచ్చి తనతో కూడా వస్తున్న బావమరిది గోపాలకునికి వైదేహరాజ్య మిచ్చి సన్మానించినాడు. తనవెంట సైన్యాన్ని తీసుకు వస్తున్న పద్మావతి సోదరుడు సింహ వర్మకు చేదిదేశ మిచ్చి గౌరవించినాడు. తనమిత్రు డైనభిల్లరాజు పుళిందకుని సైన్యముతో కూడా రావలసిన దని వార్త పంపినాడు. వత్స రాజు రాష్ట్రమం దంతటా ప్రయాణ సంరంభము ప్రారంభించింది. ఆతని శత్రువుల గుండెలు దడదడ లాడినవి.

బ్రహ్మదత్తుడు ఏమి చేస్తున్నాడో కనిపెట్టడానికి యౌగంధరాయణుడు వారాణసికి ముందుగా చారులను పంపినాడు. మంచిరోజున, సుముహూర్తాన, శుభశకునాలతో వత్సరాజు చైత్రయాత్ర బయలుదేరి మొదట బ్రహ్మదత్తుని మీదికి వెళ్ళినాడు. చతురంగ బలసమేతముగా వెళ్ళుతున్నా ప్రభువును ఇద్దరు రాణులుకూడా అనుసరించి ఉన్నారు.

ఇంతలో యౌగంధరాయణుని చారులు కాపాలిక వేషాలుధరించి కాశీకి వెళ్ళినారు. వారిలో గొప్పమోసగాడు గురువువలె నటించి

నాడు. మిగిలినవాళ్ళు అతనికి శిష్యు లయినారు. "మా గురువుగారు త్రికాలవేది" అని శిష్యులు మాయగురువును అక్కడక్కడ పొగడు తున్నారు. ప్రశ్న అడిగిన వారికి మాయగురువు ఇళ్ళు కాలిపోతవి అని చెప్పినమాటలు సత్య మయ్యేటందుకు శిష్యులు చాటుగా వెళ్ళి గృహములు తగులబెట్టేవారు. ఆ విధముగా ఆయన మహిమకు ప్రచారము జరిగింది. బ్రహ్మదత్తునికి ఇష్టు డయిన రాజపుత్రుని క్షుద్ర సిద్ధులద్వారా వశపరుచుకుని మాయాగురువు క్రమేణ బ్రహ్మదత్తుని రహస్యాలు గ్రహించినాడు. బ్రహ్మదత్తుని మంత్రి యోగకరండకుడు వత్సరాజు వచ్చేమార్గములో చాలా మాయోపాయాలు అలవంబించినాడు. ప్రతిమార్గములోనూ విషప్రయోగము చేయించి వృక్షాలను, పుష్పలతలను, గడ్డిని, నీటిని విషమయము చేయించి, విషకన్యలను, వేశ్యలను వత్సరాజు సేనలో ప్రవేశపెట్టినాడు. రాత్రివేళ శత్రువులను గూఢముగా సంహరించే మనుష్యులనుకూడా పంపినాడు. త్రికాలవేది వేషము ధరించిన గూఢచార నాయకుడు ఈ విషయా లన్నీ తన సహచరులవల్ల గ్రహించి యౌగంధరాయణునకు వెంటనే తెలియపరిచినాడు. విషప్రయుక్తా లయిన పదార్థాల కన్నింటికీ యౌగంధరాయణుడు విరుగు వేయించి, దండులోకి నూతనస్త్రీలను రానీయ గూడ దని ఆజ్ఞ యిచ్చినాడు. రహస్య ఘాతుకులను రుమణ్వంతుడు నేర్పుతో వధించి ప్రాణాలు తీయించినాడు. బ్రహ్మదత్తుని ఉపాయాలు ఏమీ ఫలించలేదు. అఖండ సేనాసమన్వితుడై వస్తున్న వత్సరాజును జయించడము సాధ్యము కాదని గ్రహించి బ్రహ్మదత్తుడు మంత్రులతో ఆలోచించి, ముందుగా దూతను పంపి, తర్వాత తానే వెళ్ళి వత్సరాజుపాదాల మీద పడినాడు. లోబడిన బ్రహ్మదత్తుని వత్సేశ్వరుడు ఆదరించినాడు. వీరులు నమస్కార ప్రియులు కదా !

బ్రహ్మదత్తుడు లోబడినతర్వాత వత్సరాజు తూర్పుదిక్కును వశపరచుకొంటూ, మెత్తనిప్రభువులను వంచుతూ, కఠినులను లాగివేస్తూ, వంగదేశముయావత్తూ ఆక్రమించి, తూర్పుసముద్రతీరాన జయస్తంభము నాటించినాడు. కాళింగులు ఎదురు వచ్చి, కప్పము కట్టినారు. పిమ్మట వత్సరాజు అరణ్యప్రదేశము దాటి దక్షిణదిశకు మరలినాడు. సర్వప్రాంతరాజులను అందరినీ జయించి, క్రమముగా కావేరీనది దాటి చోళరాజును వశపరచుకొని, కేరళదేశీయులను శిక్షించి, వెనుకకు తిరిగి గోదావరీనదిని దాటినాడు. క్రమముగా రేవానదినికూడా దాటి ఉజ్జయినికి వెళ్ళేసరికి ఆయనమామ చండమహాసేనుడు ఎదురు వచ్చి సాదరముగా ఆహ్వానించినాడు. మామగారి సత్కారాలకు అల్లుడు సమస్తమూ మరిచిపోయి అక్కడనే ఉన్నాడు. వాసవదత్త కూడా తండ్రిని విడిచిపెట్టలేక బాల్యము స్మరిస్తూ అక్కడనే ఉన్నది. చండమహాసేనుడు పద్మావతిని తనబిడ్డవలెనే ఆదరించినాడు. కొన్నాళ్లు ఉజ్జయినిలో విశ్రమించి వత్సరాజు మామతోనూ, మహాసైన్యముతోనూ, పశ్చిమదిశకు బయలుదేరి లాటదేశము జయించినాడు.

ఆతర్వాత వత్సేశ్వరుడు ఉత్తరదిక్కుకు బయలువెడలి సింధునాథుని వశవర్తిని చేసుకొని, మ్లేచ్ఛులను హతమార్చి, పారశీకప్రభువుశిరస్సు ఖండించి, హూణులను వేటాడి, హిమాచలము చేరినాడు. కామరూపరాజు ఎదురు వచ్చి, ప్రణమిల్లి, జంగమపర్వతములవంటి ఏనుగులను సమర్పించినాడు. వత్సేశ్వరుడు కామరూపమునుంచి మగధరాజ్యానికి మరలినాడు. ఆయనమామ వాసవదత్తను తనకుమార్తె పద్మావతితో సమానముగా ఆదరించి మహోత్సవములు చేయించినాడు. సర్వజననయనానందకరుడైన వత్సరాజు కొద్దికాలము మామగారియింట్లో ఉండి, ససైన్యముగా లావాణకము చేరినాడు.

## త రం గ ము : ౨౦

లావాణకములో విశ్రాంతి తీసుకొంటూ వత్సేశ్వరుడు యౌగంధ రాయణునితో "సచివోత్తమా, నీవు బుద్ధిచాతుర్యమువల్ల భూమండలములో రాజులను జయించినావు. వాళ్లెవరూ ఎదురు తిరగలేరు. కాశీరాజు కుత్సితుడు. అతనిని నమ్మలేము" అని పలికినాడు. అందుకు యౌగంధరాయణుడు సమాధాన మిచ్చినాడు: "రాజేంద్రా, కాశీరాజు బ్రహ్మదత్తుడు తిరుగుబాటు చెయ్యలేడు. పరాక్రమమువల్ల అతనిని పట్టినాము. పైగా నీవు అతనిని గౌరవించినావు. మేలు చేసినవానికి తెలివి కలవాడు కీడు చేయడు. అందుకు ఉదాహరణము విను.

### సోమదత్తుని కథ

పూర్వము పద్మదేశములో అగ్నిదత్తుడనే బ్రాహ్మణుడు రాజు ఇచ్చిన అగ్రహారాన్ని హాయిగా అనుభవిస్తున్నాడు. అతనికి సోమదత్తుడు, వైశ్వానరుడు అని ఇద్దరుకుమారు లున్నారు. పెద్దవాడు చక్కనివాడు, పనికిమాలినవాడు, నీతి నియమాలు లేనివాడు. రెండో వాడు వినయవంతుడు, పండితుడు. తండ్రిపోగానే కొడుకులు ఆస్తి చెరి సగము పంచుకొన్నారు. చిన్నవాడు రాజపూజితుడై నలుగురిలో తల ఎత్తుకొని తిరుగుతూ ఓహో అనిపించుకొంటున్నాడు. పెద్దవాడు కులవృత్తి వదిలి క్షత్రియకర్మ చేస్తూ, నలుగురినోళ్ళలో నానుతున్నాడు; వంశానికి తలవంపు తెస్తున్నాడు. ఒకనాడు సోమదత్తుడు శూద్రులతో గోష్ఠి చేస్తుండగా అతనితండ్రికి స్నేహితు డయిన ఒక బ్రాహ్మణుడు "ఓరీ! నీవు అగ్నిదత్తుని కుమారుడివి. మూర్ఖుడివై శూద్రునివలె సంచరించడం బాగాలేదు" అని మందలించినాడు. అందుకు కోపం తెచ్చుకొని సోమదత్తుడు అతన్ని కాలితో తన్నినాడు. ఆ విప్రుడు కొంతమంది బ్రాహ్మల్ని సాక్ష్యము తెచ్చుకొని న్యాయస్థానములో ఫిర్యాదు

చేసినాడు. రాజాజ్ఞప్రకారము సోమదత్తుణ్ణి కొట్లో పెట్టవలసివచ్చింది. అతన్ని తీసుకువస్తున్న భటులను సోమదత్తుని స్నేహితులు కత్తులూ కఠారులతో పరిమార్చినారు. రాజుకు ఆగ్రహము వచ్చింది. ఎక్కువ బలాన్ని పంపి సోమదత్తుణ్ణి తీసుకొని వచ్చి కొరత వేయుమని రాజ శాసన మయింది. తలారులు అతన్ని శూలముమీదికి ఎక్కిస్తున్నప్పుడు, ఎవరోతోసినట్టు సోమదత్తుడు భూమిమీద పడినాడు. వాడి అదృష్టం అలా కలిసివచ్చింది! మళ్ళీ తలారులు అతని శూలముమీదికి ఎక్కించబోయేసరికి వాళ్ళంతా అంధు లయినారు. వైశ్వానరుడు తన సోదరుణ్ణి రక్షించవలసిం దని రాజుకు విన్నపము పంపుకొన్నాడు. రాజు వైశ్వానరునిమాటవల్ల దయతలచి మరణాజ్ఞను ఆపించినాడు. చావు తప్పి సోమదత్తుడు రాజావమానము సహించలేక దేశాంతరము పోవడానికి నిశ్చయించుకొన్నాడు. బంధువులంతా కాళ్ళా వేళ్ళా పడి బతిమాలుకోడంవల్ల సోమదత్తుడు అగ్రహారద్రవ్యం అంటకుండా అక్కడే ఉంటున్నాడు.

బతుకుతెరువు దొరక్క పోవడంవల్ల సోమదత్తుడు వ్యవసాయము చేదా మనీ, అందుకు అనుకూల మయినభూమి సంపాదించా లనీ అడివికి వెళ్ళినాడు. అక్కడ అతనికి మంచిభూమి కనపడింది. ఆ ప్రదేశము మధ్య పెద్ద రావిచెట్టు ఉన్నది. సోమదత్తునికి ఎక్కడ లేనిభక్తి కలిగి రావిచెట్టుకు ప్రదక్షిణ నమస్కారములు చేసినాడు. "ఈ చెట్టుమీద వున్నభక్తునికి నేను దాసుణ్ణి." అన్నాడు సోమదత్తుడు. రెండుఎడ్లను తెచ్చి అతడు అరక కట్టి, రావిచెట్టుకు బలి ఇచ్చి వ్యవసాయము ఆరంభించినాడు. ఆ చెట్టుక్రిందనే అహోరాత్రాలు నివసిస్తున్నాడు. అతని భార్య అన్నము మూటకట్టుకొని అక్కడికే తీసుకువస్తుంది. సకాలానికి సస్యము చక్కగా ఫలించింది. అతని దురదృష్టమువల్ల అన్యరాష్ట్రము వారు వచ్చి పంట దోచుకొని పోయినారు. శత్రువులు వెళ్ళిపోయిన

తరువాత, సస్యముపోయినందుకు భార్య కన్నీరు మున్నీరుగా ఏడు స్తూంటే ఓదార్చి, మిగిలినధాన్యము ఇంటికి తోలుకొని పోయినాడు. యథాప్రకారముగా రావిచెట్టుకు బలి ఇచ్చినాడు. ధీరులకు కష్టకాల ములో దార్ఢ్యము సహజము. మనస్సు చికాకుగా ఉన్నందువల్ల అత నికి రాత్రి నిద్రలేదు. రావిచెట్టునుండి వాక్కు అతనికి వినవడ్డది: "సోమ దత్తుడా! శ్రీకంఠదేశంలో ఆదిత్యప్రభా మహారాజు దగ్గిరికి వెళ్ళు. అక్కడ రాజద్వారముదగ్గిర నిలబడి సదా సంధ్యాగ్ని హోత్ర మంత్ర ములు పఠించు. అప్పుడు ఇలాపలుకు. నేను బ్రాహ్మణుణ్ణి. నాపేరు ఫలభూతి. నామాట వినండి. మంచిచేసేవాడు, మంచి పొందుతాడు. చెడుచేసేవాడు చెడే పొందుతాడు. అంటూ నీ వక్కడ నిలబడితే రాజునీకు సంపదలు ఇస్తాడు. సంధ్యాగిహోత్రమంత్రాలు చెపుతాను. సోమదత్తుడా! నేర్చుకో. నేను ఎవరో ఎరుగుదువా? యక్షుణ్ణి!" ఇలా అశరీరవాణి చెప్పిన మాటలు విని సోమదత్తుడు మంత్రము నేర్చు కొన్నాడు. రావిచెట్టుమీదనుంచి వాక్కు అంతర్ధాన మయింది.

తెల్లవారగానే సోమదత్తుడు ఫలభూతి అనే కొత్తపేరు పెట్టుకొని భార్యాసమేతముగా ప్రయాణము చేసి అడవులను దాటి శ్రీకంఠదేశము చేరినాడు. అక్కడ రాజద్వారముదగ్గిర అతడు నిలువబడి సంధ్యాగ్ని మంత్రాలు ఏకరువు పెట్టి తనపేరు ఫలభూతి అని వ్యవహరిస్తున్నాడు. 'మంచి చేసేవాడు మంచినే పొందుతాడు. చెడు చేసేవాడు చెడునే పొందుతాడు' అని ప్రజలకు వింత గొలిపే మాదిరిగా అంటున్నాడు. పదే పదే ఫలభూతి పలుకులు విని మహారాజు అతనిని ఆస్థానానికి పిలి పించినాడు. రాజ సమ్ముఖాన కూడా ఫలభూతి యథాప్రకారముగా పలికినాడు. మహారాజుపక్క నున్న వారంతా పక్కున నవ్వినారు. సామంత సమేతంగా ఆదిత్యసేన మహారాజు అతన్ని గౌరవించి వస్త్రా భరణాలూ అగ్రహారాలూ దాన మిచ్చినాడు.

ఈ విధముగా యక్షుని ప్రభావమువల్ల ఫలభూతి సకలైశ్వర్యములూ అనుభవిస్తున్నాడు. ఆదిత్యసేనునికి ఫలభూతి అంటే అమితప్రీతి. కాల క్రమేణ రాజమందిరములోనూ అంతఃపురములోనూ ఫలభూతి మహా రాజుకు ఇష్టుడని అందరూ గౌరవంతో చూస్తున్నారు.

ఒకనాడు ఆదిత్యసేనుడు ఆకస్మికంగా వేటచాలించి అంతఃపురము లోకి పోగా, ద్వారపాలకులు తొట్రుపాటు చెందినారు. లోపలికి వెళ్ళి చూస్తే రాణి కువలయావళి దేవతార్చన చేస్తున్నది. ఆమె జుట్టు విరింప బోసుకుని, ముఖాన పెద్దసిందూరతిలకము పెట్టుకొని, రంగు రంగుల ముగ్గులతో ఉన్న మహామండలము మధ్య కూర్చుని కళ్ళు మూసుకొని పెదవులు కదిలేలాగున జపము చేస్తున్నది. ఆమెప్రక్క, పాత్రలలో రక్తము, మద్యము, మహామాంసము బలి ఇచ్చి ఉన్నవి. దిగంబరముగా ఉన్న కువలయావళి రాజును చూచి చప్పున వస్త్రము చుట్టుకొన్నది. 'ఇదంతా యేమిటి?' అని రాజు అడిగినాడు. "అభయ మివ్వండి. మీశుభము కోసమే ఈ పూజ చేస్తున్నాను. నేను కన్యగా పుట్టింట్లో ఉన్నప్పుడు ఒకసారి వసంతోత్సవములో ఉద్యానవనాన చెలికత్తెలు నాతో ఇలా అన్నారు: "ఈ వనములో చెట్లమాటున ఆకులలో విఘ్నేశ్వరు డున్నాడు. ఆ దేవుడు అడిగినవారి వరము లిస్తాడు. మహాప్రభావసంపన్ను డైనగణేశుని పూజిస్తే నీకు మంచి భర్త లభిస్తాడు." ఆ మాటలు విని చిన్నతనముచేత వాళ్ళతో 'విఘ్నే శ్వరపూజవల్లనే కన్యలకు మంచిభర్తలు దొరుకుతారా?' అన్నాను. 'ఏమిటి! వినాయకపూజ చెయ్యక పోతే ఎవరికీ కోరికలు సిద్ధించవు. ఆ దేవుని ప్రభావం ఎటువంటిదో విను' అని చెలికత్తెలు ఈ కథ చెప్పినారు:

కుమార సంభవ కథ

పూర్వము తారకాసుని సంహరించే కుమారుని కోసము ఇంద్రాదులు శివుని ప్రార్థించినారు. మన్మథుడు శివుని ఫాలనేత్రాగ్నిలో భస్మమయిన తర్వాత పార్వతీదేవి తపస్సు చేసి, మన్మథుని బతికించమనీ, తనకు కుమారుడు కావలెననీ, మహేశ్వరుని వేడుకొన్నది. విఘ్నేశ్వర పూజ మరచి పోయింది. "పార్వతీ, మన్మథునికి ప్రాణ మిస్తాను; శరీరము మాత్రము ఉండదు" అని శివుడు సెల విచ్చినాడు. తర్వాత బ్రహ్మాదులు వచ్చి శివపుత్రుని కోసము ప్రార్థన చేశారు. మహేశ్వరుడు అంగీకరించినాడు.

బహుకాలానికి కుమారస్వామి కలిగినాడు. దేవేంద్రుడు కుమారస్వామికి సైన్యాధిపత్య మియ్యడానికి ఉపక్రమించి కలశము ఎత్తేసరికి చెయ్యి బిగిసిపోయింది. "నీవు విఘ్నేశ్వరపూజ చేస్తే ఈ విఘ్నము పోతుంది" అని మహేశ్వరుడు అనుగ్రహించినాడు. ఇంద్రుడు సక్రమముగా గణేశ పూజ చేసి, కుమారస్వామిని సేనాపతిగా అభిషేకించినాడు. స్వామి తారకాసురుని సంహరించి దేవతల కోరిక నెరవేర్చినాడు. కాబట్టి నీవుకూడా విఘ్నేశ్వరపూజ చెయ్యవలసింది.

దేవా, వయస్యలు ఈ ప్రకారము చెప్పినమీదట ఏకాంతముగా గణేశపూజ చేశాను. పూజకాగానే నాచెలికత్తెలు ఆకాశములోకి ఎగిరిపోయి విహారము చేశారు. ఆశ్చర్యపడి నేను వారిని భూమి మీదికి రమ్మంటే వాళ్ళు వచ్చారు. 'మీకీ శక్తులు ఎలా వచ్చినవి?' అని నేను అడిగితే వాళ్ళు "మహామాంస భక్షణముచేత వచ్చినవి ఈ డాకినీ మంత్రసిద్ధులు. కాళరాత్రి అనే బ్రాహ్మణి మాకు ఉపదేశించింది" అన్నారు. 'నాకుకూడా ఉపదేశము చేయించండి' అని ప్రార్థిస్తే వాళ్ళు వెంటనే వెళ్ళి కాళరాత్రిని తీసుకు వచ్చారు. ఆమెది చాలా వికార రూపము: కనుబొమలు కలిసిపోయినవి, గాజు కళ్ళు, చప్పిముక్కు,

పెద్దచెంపలు, మొద్దుపెదవులు, పారపళ్ళు, కొంగమెడ, బానపొట్ట, చీలుకుపోయిన యెగుడు పాదాలు. ఆమె పాదాలకు నమస్కరించాను. అదివరకే విఘ్నేశ్వరపూజ చేసిన నన్ను దిగంబరముగా మండలములో కూచోబెట్టి, భైరవార్చన చేయించి, ఆమె నైవేద్యము పెట్టిన నర మాంస భోజనము నాకు పెట్టింది. మంత్రోపదేశ మయిన తర్వాత నేను ఆకాశము లోకి ఎగిరి కొంతసేపు విహారంచేసి ఆమె ఆనతిప్రకారం కిందికి వచ్చి, తర్వాత అంతఃపురానికి వెళ్ళాను. కన్యాత్వములోనే డాకినీ చక్ర వర్తిని నయినాను. కాళరాత్రి సంగతి చెపుతాను :

## కా ళ రా త్రి క థ

కాళరాత్రిభర్త విష్ణుస్వామి. ఆయన వేదపండితుడు. ఆయనసన్నిధికి వేదాధ్యయనము కోసము నానా దేశాలనుంచి విద్యార్థులు వస్తూ ఉంటారు. ఆ శిష్యులలో సుందరకు డనే అందగాడు ఉన్నాడు. బంగా రానికి పరిమళ మద్దినట్టు అతని అందానికితోడు శీలము అలంకారముగా ఉన్నది. విష్ణుస్వామి ఇంట్లో లేని సమయము చూచి కాళరాత్రి సుందరకుణ్ణి కామించింది. అతడు అంగీకరించక పెడ ముగము పెట్టినాడు. సత్పురుషుల మనస్సు నిశ్చలము కదా! సుందరకుడు వెళ్ళిపోగానే కాళరాత్రి తనశరీరాన్ని తానే కోపముకొద్దీ చీరుకొని, నఖక్షతాలూ, దంతక్షతాలూ ఒంటి నిండా ఉండగా తల విరియబోసుకొని, చీర సడల్చి భర్త వచ్చే వేళకు ఏడుస్తూ కూర్చుని "నాథా! మీ శిష్యుడు సుందరకుడు ఎంత పని చేశాడండీ! నన్ను బలాత్కారము చేయబోయి, నా శరీరమంతా గోళ్ళతో రక్కినాడు" అన్నది. సుందరకుడు తనను అనుభవించలే దని, కాళరాత్రికి ద్వేషము కొండవించింది. విష్ణుస్వామి భార్యమాటలు యథార్థ మని నమ్మి, కోపముతో మండిపడినాడు. అతనికి భార్యమీద విపరీతమైన విశ్వాసము. ఆ విశ్వాసమే అతని

తెలివి తేటలను హరించింది. భార్యమాటలు నిజమా అబద్ధమా అని విష్ణుస్వామి ఆలోచించ లేదు. సంజవేళ సుందరకుడు రాగానే విష్ణుస్వామి శిష్యసహితంగా వరుగెత్తి కర్రతో అతన్ని చావాచితక కొట్టినాడు. ఆ దెబ్బలతో సొమ్మసిల్లి పడగానే శిష్యుణ్ణి వీధిలోకి ఈడిపించినాడు.

రాత్రి చల్లనిగాలి వీచేటప్పటికి సుందరకుడికి తెలివి వచ్చింది. తన భంగపాటు తలుచుకొని ఇలా విచారించినాడు: "మనస్సును వికలము చేయడానికి స్త్రీ ముఖ్యకారణము. నా గురువు విద్వాంసు డై కూడా కోపం కొద్దీ ఇంతపని చేయడమా! మునీశ్వరులు మొదలు సామాన్యుల దాకా క్రామక్రోధాలు తప్పవు. పూర్వము మునీశ్వరులు తమభార్యల మీద అనుమానపడి దారుకా వనములో ఉంటున్న సాక్షాత్తు శివుని మీద అలగ లేదా? మునీశ్వరులకే తొందరఉంటే విద్వాంసులవిషయం వేరే చెప్పడ మెందుకు!" ఇలా అతడు తలపోసి భయమువల్ల పశువుల శాలలో ఒకమూల నక్కినాడు. సరిగా అప్పుడే కాళరాత్రి వచ్చింది. ఆమె చేతిలో చురకత్తి భీకరంగా ఉన్నది. ఆమె భయంకరంగా ఫూత్కారము చేస్తున్నది. కన్నులలోనుంచీ నోటిలోనుంచీ మంటలు వస్తున్నవి. భయంకర మైన ఢాకినీ రూపము సుందరకుడు చూచి రక్షోహరణ మంత్రము స్మరించు కొంటున్నాడు. భయమువల్ల వణికిపోతూ ముడుచుకొని కూర్చున్నాడు. అతని మంత్రోచ్చారణవల్ల ఆమె ముగ్ధురాలయి, ఖేచరమంత్రము ఉచ్చరించి ఆకాశమార్గాన ఎగిరి ఉజ్జయినికి వెళ్ళిపోయింది. ఆమె ఉచ్చరించిన మంత్రాన్ని సుందరకుడు విని గ్రహించినాడు. ఆమె పశువులశాలలో ఉన్న మేడను తీసుకుపోయి కూరగాయల తోటలో దింపి, వల్లకాటిలో డాకినీ చక్రమధ్యాన కూర్చుని క్రీడిస్తున్నది. సుందరకుడు ఆకలితో మలమల మాడి అలిసి ఆ కూరలతోటలో దిగి ముల్లంగిదుంప తవ్వుకొని తిని మేడ ఎక్కినాడు.

కాళరాత్రి అర్ధరాత్రివేళ మేడ ఎక్కింది. తన అనుచరలను పంపివేసి, ఆమె పడకగదిలో ప్రవేశించింది.

సుందరకుడు పశువులశాల వదలి పెట్టి స్నేహితులదగ్గిరికి వెళ్ళి తన అవస్థ వెళ్ళబోసుకొన్నాడు. పరదేశానికి అతడు పోతానంటే మిత్రులు ఓదార్చినారు. సుందరకుడు గురువుగారిఇల్లువదలి సత్రంలో తిండి తింటూ స్నేహితులతో స్వేచ్ఛగా తిరుగుతున్నాడు. ఒకనాడు బజారువీధిలో కాళరాత్రి అతన్ని చూచి కామించింది. అతడు అంగీకరించక ధర్మ బోధ చేసినాడు. ఆమెకు రోషమువచ్చి తనపైట చింపుకొని భర్త దగ్గిరికి వెళ్ళి "చూడండి, మీశిష్యుడు ఎంతపని చేశాడో! నాకొంగు చింపినాడు!" అంటూ పైటచెరుగు చూపించింది. విష్ణుస్వామి శిష్యుణ్ణి వధార్హుణ్ణిగా తలిచి, సత్రాధికారితో చెప్పి సుందరకుడికి తిండి పెట్ట వద్దన్నాడు. నిలువ నీడ లేక సుందరకుడు పశువులశాలకు వెళ్ళి ఆకాశానికి ఎగిరేమంత్రమును, దిగేమంత్రమునూ జ్ఞాపకము చేసుకోవాలను కున్నాడు. రాత్రి సుందరకుడు పశువులశాలతో ఉన్న మేడదగ్గిరికి వెళ్ళగా, కాళరాత్రి యథాప్రకారంగా వచ్చి ఆమేడనూ, శాలనూ ఎత్తుకొని ఉజ్జయినికి తీసుకుపోయింది. అక్కడ ఆమె ఆకాశమునుంచి దిగేమంత్రము ఉచ్చరించి, ఆమేడను కూరగాయలతోటలో దింపి, మంత్ర జపము చేయడానికి శ్మశానానికి వెళ్ళిపోయింది. సుందరకుడు ఆకాశము నుంచి దిగేమంత్రము విన్నప్పటికీ గ్రహించలేక పోయినాడు. గురూపదేశము లేకపోతే మంత్రము సిద్ధించదు. ఆకలి వేసేప్పటికి అతడు ముల్లంగిదుంపలు కోసుకొని తిని గోశాలలో యథాప్రకారంగా ఉన్నాడు. కాళరాత్రి వచ్చి గోవాటముతో ఉన్న మేడ ఎక్కి ఆకాశాన ఎగిరి మేడను ఎప్పటిచోట నిలిపి ఇంటికి వెళ్ళింది.

ఉదయము సుందరకుడు గోశాల విడిచి, ముల్లంగి అమ్మకానికి బజారు వెళ్ళినాడు. మాళవదేశజాతు లయిన రాజపురుషులు ఆ

ముల్లంగి తమదేశములో దని గ్రహించి, ఖరీదు ఇవ్వకుండా లాగివేసి నారు. అతడు ఖరీదు అడిగితే అతనిని పట్టుకొని, రాజుసన్నిధికి వెళ్ళి, "దేవా, మాళవమునుంచి ముల్లంగి తెచ్చి కాన్యకుబ్జములో ఎలా అమ్ముతున్నా వయ్యా, అని మే మడిగితే ఈయన మామీద రాళ్ళు రువ్వినాడు" అని ఫిర్యాదు చేసినారు. రాజు ఇదిఏమి అని అడిగితే, అతని అనుచరు లైనమిత్రులు ముందరికి వచ్చి "మహాప్రభూ, ఇతనిని మేడఎక్కిస్తే విచిత్రము చూపిస్తాడు." అన్నారు. రాజుకోరికప్రకారము సుందరకుడు సౌధముమీదికి ఎక్కి, మంత్రము ఉచ్చరించి, మిత్రులతోకూడా మేడ కదిలించుకొని ఆకాశాన ప్రయాగకు వెళ్ళినాడు. అక్కడ స్నానము చేస్తున్నప్రభువుని చూచి, సుందరకుడు మేడను ఆకాశములో ఆపి, పైనుంచి గంగానదిలోనికి దుమికి, రాజుసమీపానికి వెళ్ళినాడు. అందరూ ఆశ్చర్యపడినారు. "ఎవరు మీరు? ఆకాశములో నుంచి ఎందుకు దిగినారు? "అనిరాజు వినయపూర్వకముగా అడిగినాడు. "నేను మహేశ్వరుని అనుచరుడను, మురజకుడను. ఇహలోకభోగాలు అనుభవించిడానికి శివాజ్ఞ పొంది నీవద్దకు వచ్చినాను" అని సుందరకుడు చెప్పినాడు. ఆమాటలు నమ్మి, రాజు అతనికి పట్న మొకటి బహుమానము చేసినాడు. బంగారపుమంచముమీద పండుకొని, సుందరాంగనలు చామరములతో విసరుతూ ఉండగా యువకుల ఉపచారములతో ఇంద్రభోగాలు అనుభవిస్తున్నాడు సుందరకుడు.

కొంతకాలానికి ఆకాశాన వెళుతున్న సిద్ధుని సుందరకుడు స్తుతించి సంక్రీతుని చేస్తే, అతడు ఆకాశమునుంచి భూమిమీదికి దిగేమంత్రము చెప్పినాడు. ఆ మంత్ర ప్రభావముచేత సుందరకుడు మహావైభవసమేతమయిన నగరముతోకూడా ఆకాశమార్గాన కాన్యకుబ్జానికి వెళ్ళినాడు. రాజు గుర్తుపట్టి, ఎదురు పోయి మర్యాదలు చేసినాడు. అప్పుడు సుందరకుడు కాళరాత్రి వృత్తాంతము చెపితే, రాజు ఆమెను పిలిపించి అడిగి

నాడు. ఆమె అన్ని సంగతులూ ఒప్పుకొన్నది. దీని ముక్కూ-చెవులూ కొయ్యండి అని రాజాజ్ఞ అయింది. ఆమె చటుక్కున మాయమయిపోయింది. కాళరాత్రి తనరాజ్యములో ఉండగూడ దని రాజు శాసించినాడు. రాజమర్యాదలు పొంది సుందరకుడు ఆకాశమార్గాన వెళ్ళినాడు.

ఈ ప్రకారము కువలయావళి ఆదిత్య ప్రభునితో చెప్పి "దేవా, డాకినీ మంత్రసిద్ధులు ఇటువంటివి. మా తండ్రిరాజ్యములో ఇవి అంతటా ప్రసిద్ధము. పాతివ్రత్యముచేత నాసిద్ధులు కాళరాత్రి సిద్ధుల కంటెకూడా గొప్పవి. మీ శ్రేయస్సుకోసము అర్చనచేస్తూ, నరుని ఆకర్షించ బోతున్నాను. మీరుకూడా ఈ సాధనామార్గములో ప్రవేశించాలి. సిద్ధులు లభిస్తే మీరు సార్వభౌము లవుతారు" అని ఉత్సాహవాక్యాలు పలికింది. 'డాకినీ సాధన, మహామాంస భోజనము, రాజరికానికి సరిపడవు. ఇది వల్లపడదు' అని రాజు నిషేధము చేసినాడు. రాణి ప్రాణాలు త్యజిస్తా నని పట్టు పట్టింది. చివరకు రాజు అంగీకరించినాడు. కువలయావళి అతనిని మండలము మధ్య కూర్చో బెట్టి, ఇలా చెప్పింది. "మీ సన్నిధిలో ఉండే ఫలభూతి అనే విప్రుని ఆకర్షించాలి. ఆకర్షణ చాలా కష్టము. వంటవాని సాయము కావాలి. వానిని ఈ సాధనలో చేర్చి వానిచేత బ్రాహ్మణుని చంపించి వంట చేయించాలి. అసహ్య పడ గూడదు. ఉత్తమబ్రాహ్మణ మాంసమును అర్పించి భుజిస్తే, మంత్ర సిద్ధులు తక్షణమే అవుతవి." పాపభీతి ఉన్నప్పటికీ రాజు భార్యమాట కాదనలేక పోయినాడు. స్త్రీలమాట విని ఎవడు బాగు పడ్డాడు? సాహసికు డనే వంటవానిని పిలిచి, దీక్ష యిచ్చి, "రాజూ, రాణీ కని పెట్టుకొని ఉన్నారు. త్వరగా వంట చెయ్యి — అని ఎవడు నీతో చెపుతాడో వానిని సంహరించి ఆ మాంసము రుచిగా వండి మాకు ఉదయ వేళ భోజనము పెట్టవలెను" అని రాజదంపతులు ఆజ్ఞాపించారు.

చిత్రము అని వంటవాడు ఇంటికి వెళ్ళినాడు. ప్రభాతవేళ ఫలభూతి వచ్చినాడు. "నీవు వెళ్ళి రాజదంపతులు కనిపెట్టుకొని ఉన్నారు. త్వరగా వంటచెయ్యి అని పాచకునితో చెప్పు" అని రాజు ఆన తిచ్చి నాడు. ఫలభూతి కొంతదూరము వెళ్ళేటప్పటికి రాజకుమారుడు చంద్ర ప్రభువు ఎదురుపడి, "ఆర్యా, ఇప్పుడే నాకు చిన్నపని చేసిపెట్టవలె. ఈ బంగారము తీసుకు పోయి, మా నాయనగారికి చేయించిన కుండల లముల వంటి కుండలములు చేయించాలి" అని అతనిని ప్రార్థించినాడు. తాను వంటవానికి చెప్పవలసిన మాటలు రాజకుమారునితో చెప్పి ఫలభూతి కుండలములు చేయించడానికి వెళ్ళినాడు. చంద్రప్రభువు సాహసికునికి సందేశము చెప్పినాడు. వెనుకటి సంకేత ప్రకారము పాచ కుడు రాజకుమారుని చంపి, వండి, అర్చనానంతరము రాజదంపతులకు వడ్డించినాడు. నిజ మెరుగక వారు భుజించినారు.

మరునాడు ప్రాతఃకాలము ఫలభూతి కుండలములు పట్టుకొని వచ్చి రాజకుమారు డెక్కడ అని ప్రభువును అడిగినాడు. కుండలముల విష యము యావత్తూ విని, రాజపుత్ర మరణము గ్రహించి నేలమీద పడి రోదనము చేస్తూ, రాణిని మధ్య మధ్య దూషించినాడు. మంత్రులు అడిగిన మీదట రాజు యావద్వృత్తాంతమూ చెప్పినాడు. "మేలు చేసిన వానికి మేలు, కీడు చేసిన వానికి కీడు తప్పదు. అని ఫలభూతి రోజూ అంటూనే ఉన్నాడు. ఇతరుల కోసము తలపెట్టిన కీడు గోడమీద కొట్టిన బంతివలె తనకే వచ్చి తగులుతుంది. బ్రహ్మహత్యా మహాపాత కము తలపెట్టినందు వల్ల మా కుమారునే కోలుపోయినాము" అని రాజు చాలా దుఃఖించి ఫలభూతికి రాజ్యాభిషేకము చేసి, పాపపరిహారా ర్థము భార్యతో కూడా అగ్ని ప్రవేశము చేసినాడు. ఫలభూతి ప్రభువుకై ధర్మ ప్రకారముగా రాజ్యపాలన చేసినాడు. కాబట్టి చేసిన కీడు గాని మేలు గాని తప్పకుండా ఫలిస్తుంది.

వత్సరాజు సమక్షములో ఈకథ చెప్పి యౌగంధరాయణుడు "దేవా, అతడు మిమ్ములిని ఎదిరించడానికి యత్నించి ఓడిపోయినాడు. మీరు అతనికి మేలే చేసినారు. కాబట్టి బ్రహ్మదత్తుడు మీకు కీడు తల తలపెట్టడు; ఒకవేళ తల పెట్టినాడా మీ చేతులలోనే ప్రాణాలు విడు స్తాడు." అని నచ్చచెప్పినాడు. వత్సరాజు మంత్రిమాటలకు మన శ్శాంతి చెందినాడు.

మరునాడు వత్సరాజు లావాణకము నుంచి బయలుదేరి మహావైభ వముతో కౌశాంబీ నగర ప్రవేశము చేసినాడు. వందిమాగధులు కైవా రములు చేస్తూ ఉండగా, సామంత రాజులు వంగి నమస్కరిస్తూ ఉండగా చారణులు మంగళ గీతములు పాడుతూ ఉండగా వత్సేశ్వరుడు తన మందిరములోకి వెళ్ళి, జయ జయధ్వానముల మధ్య సింహాసనము ఎక్కినాడు. నగర మంతటా మహోత్సవము జరిగింది.

దిగ్విజయము చేసి వచ్చిన వత్సరాజు కీర్తి దశదిశలా నిండింది.

## నరవాహనదత్త జననము

### తరంగము : ౨౧

కర్ణతాల బలాఘాత
సీమంతిత కులాచలః
పంథాన మివ సిద్ధీనాం
దిశన్ జయతి విఘ్నజిత్.
కర్ణతాళాధిక ఘాతలచేత
సీమంతితాద్రియై సిద్ధిమార్గమ్ము
చూపుచున్న విధాన శోభిలు నట్టి
విఘ్నాధినాధుండు విజయమ్ము గాంచు!

తర్వాత ఉదయనుడు కౌశాంబి రాజధానిచేసుకొని, వత్సదేశాధిపతి అయి, సుఖములు అనుభవిస్తున్నాడు. యౌగంధరాయణ, రుమణ్వాం తులమీాద రాజ్యభారము విడిచిపెట్టి, వసంతకుడుసహాయుడుగా భోగ ములలో మునిగి తేలుతున్నాడు. స్వయముగా వీణ వాయిస్తూ, వాసవ దత్తా పద్మావతీ దేవులతో కూడి గాంధర్వములో కాలము గడుపు తున్నాడు. సౌధోపరి భాగమున వారాంగనలు మధుర మద్యములు బంగారు గిన్నెలలో ఇస్తూఉంటే సేవిస్తున్నాడు.

ఒకొక్కప్పుడు వత్సరాజు ఆకుపచ్చనిచొక్కా తొడుక్కొని ధనుర్బా ణములు ధరించి వేటకాండ్రతో బయలుదేరి అరణ్యములో మృగము లను వేటాడుతాడు. వరాహములనూ, వనమహిషములనూ బాణాలతో పడగొట్టి వేస్తాడు. సింహాలను ఈటెలతో పొడుస్తాడు. మృగయావినో దము ఆయుధాలతోనే అయి పోతుంది. కుక్కలు, వలలు, గోతులు మొద లయిన మృగయా సాధనములు అలంకారార్థమే.

## నా ర దు ని రా క

ఈ విధముగా సుఖపరాయణుడై ఉన్న వత్సరాజు వద్దకు ఒకనాడు నారదముని వచ్చినాడు. రాజు వినయపూర్వకముగా మునిని సత్కరించి నాడు. నారదుడు సుప్రీతుడై కొంచెము ఆలోచించి ఇలా పలికినాడు:

"వత్సరాజా, క్లుప్తసరిగా నీ కొకసంగతి చెపుతాను. నీకు పూర్వ పితామహులలో పాండురాజు ఉండేవాడు. నీ కున్నట్టే ఆయనకూ ఇద్దరు భార్యలు చాలా యోగ్యురాండ్రు ఉండేవారు. పెద్దది కుంతీదేవి, రెండవది మాద్రి. ఒకనాడు పాండురాజు వేటకు వెళ్ళి, మృగరూపము ధరించి భార్యతో క్రీడిస్తున్న కిందమమునిని పొరబాటున బాణముతో కొట్టినాడు. ప్రాణాలు విడవబోతూ కిందముడు, "రాజా, నీవు యథే చ్ఛగా సంచరిస్తూ నా మీాద బాణము విడిచావు. నాకువలె నీకుకూడా

భార్యతో కలసి ఉన్న కాలములోనే మరణము సంభవిస్తుంది" అని శాపము పెట్టినాడు. శాపభీతిచేత పాండురాజు భార్యలను తీసుకొని తపోవనానికి వెళ్ళిపోయినాడు. కొంతకాలానికి మైమరచి పాండురాజు మాద్రిని బలవంతముగా కూడే సరికి మృతి చెందినాడు. కాబట్టి వేట రాజులకు మహావ్యసనాలలోది. వేటకానికీ, జంతువుకూ, వేటకాని వాహనానికీ అపాయము సమానమే. కనుక నీవు వేట మానుకో.

"నీవు కల్యాణము పొందవలసిన వాడవు. నీ పూర్వులను బట్టి నాకు ఇష్టుడవు. కామదేవాంశమున నీకు కుమారుడు కలుగుతాడు. పూర్వము హరుడు ఫాలనేత్రాగ్నితో మన్మథుని దగ్ధము చేసిన తర్వాత రతీదేవి మహేశ్వరుని ప్రార్థించి, తనభర్తకు దేహము ప్రసాదించ మని వేడుకొన్నది. మహేశ్వరుడు దయార్ద్రహృదయుడై, "రతీ, పార్వతీదేవి నిజాంశమున భూలోకములో అవతరించి పుత్రాపేక్షతో నన్ను సేవించి మన్మథుని కుమారునిగా కంటుంది." అని అనుగ్రహించినాడు. ఆ ప్రకారముగా పార్వతి వాసవదత్తగా చండమహాసేనునికి జన్మించింది; తర్వాత నీకుభార్య అయినది. వాసవదత్త ఈశ్వరారాధన చేసి మన్మథుని కుమారునిగా కనబోతున్నది. అతడు విద్యాధర చక్రవర్తి అవుతాడు."

ఈ ప్రకారముగా నారదుడు చెప్పినమీదట వత్సరాజు ఆనందపరవశుడై తనరాజ్యము యావత్తూ నారదునికి సమర్పించినాడు. నారదముని రాజ్యము వత్సరాజుకే తిరుగ ఇచ్చివేసి అంతర్ధాన మయినాడు.

## పింగళిక వృత్తాంతము

పుత్రేచ్ఛతో ఉన్న వాసవదత్తాదేవితో వత్సరాజు ఆరోజు గడిపినాడు. మరునాడు ఆయన ఆస్థానానికి వెళ్ళినప్పుడు యథాప్రకారము ప్రతీహారుడు వచ్చి గోత్రప్రవరలు చెప్పి "దేవా, తమ దర్శనార్థము ఒకానొక

బ్రాహ్మణస్త్రీ ఇద్దరు బిడ్డలతో సహా ద్వారము దగ్గర ప్రతీక్షిస్తున్నది" అని విన్నవించినాడు. రా వచ్చు నని ప్రభువు అనుజ్ఞ యిచ్చినాడు. జీర్ణవస్త్రము ధరించిన బ్రాహ్మణస్త్రీ దైన్యము ఉట్టి పడుతున్న ఇద్దరు బాలకులను ఎత్తుకొని లోపలికి వచ్చి వందనము చేసి "దేవా, నేను ఉత్తమవంశంలో జన్మించిన బ్రాహ్మణస్త్రీని. దౌర్భాగ్యవశాన దారిద్ర్యము అనుభవిస్తున్నాను. తినడానికి తిండి లేదు. ఈ కవలపిల్లలకు పాలు లేవు. శరణాగత రక్షకు లయిన దేవరవారి సన్నిధానానికి వచ్చినాను. ఆ మీాద దేవర అనుగ్రహము!" అని విజ్ఞాపన చేసింది. రాజు దయదలచి ఆమెను వాసవదత్తాదేవికి అప్పగించ వలసినదని ప్రతీహారికి ఆన తిచ్చినాడు. ప్రతీహారుడు తీసుకొని వచ్చిన పింగళికను వాసవత్తా దేవి బాగా ఆదరించి, "ఏమి వైపరీత్యము! నాకు ఒక కుమారుడు కూడా కలగలేదు. ఈమెకు కవలబిడ్డలు!" అనుకొని, స్నానానికి లేస్తూ బ్రాహ్మ ణికి కావలసిన వన్నీ ఏర్పాటు చేయడానికి చేటికలను నియమించింది. పింగళిక భోజనము చేసి విశ్రాంతి తీసుకొన్నతర్వాత వాసవదత్త ఆమెను, ఏదయినా కథ చెప్పు అని అడిగింది. పింగళిక ఇలా ప్రారంభించింది:

## దేవదత్తుని కథ

పూర్వకాలములో జయదత్తు డనే సామంతప్రభువు ఉండేవాడు. అతని కుమారుడు దేవదత్తుడు పెరిగి పెద్దవాడయినాడు. అతనికి పెళ్ళియీాడు వచ్చేటప్పటికి తండ్రి ఇలా ఆలోచించినాడు. "రాజ్యశ్రీ వట్టిచపల; బలాత్కారము చేత అనుభవించ దగినది. వణిజులలక్ష్మి కులస్త్రీవలె స్థిరమైనది. మాకు దాయాదులు చాలామంది ఉన్నారు. క్షత్రియ కన్య కంటే వైశ్యకన్యను మావానికి పెండ్లి చేస్తే సంపద స్థిరముగా ఉంటుంది."

రాజు ఈవిధముగా ఆలోచించి పాటలీపుత్రములో వసుదత్తు డనే వైశ్యశిఖామణి కుమార్తెను తనకుమారున కిచ్చి వివాహము చెయ్య

వలె నని అడిగినాడు. దూరదేశ మయినప్పటికీ, సంబంధము మంచిదని వసుదత్తుడు తన పుత్రికను దేవదత్తునికి ఇచ్చి పెళ్ళిచేసినాడు. మామగారిచ్చిన మణికనకరాసులు చూచిన మీదట దేవదత్తునికి తండ్రి వైభవము మీద అభిమానము తగ్గింది. కుమారునికి మంచి సంబంధము దొరికింది కదాయని జయదత్త ప్రభువు నిశ్చింతగా ఉంటున్నాడు.

కొన్నాళ్ళకు వసుదత్తుడు కూతురిని చూతామని కోరికతో వియ్యంకుని మందిరానికి వచ్చి, తర్వాత పుత్రికను స్వగృహానికి తీసుకు వెళ్ళినాడు. ఇంతలో జయదత్తుడు హఠాత్తుగా మరణించినాడు. దాయాదులు చెలరేగి రాజ్యము అపహరించినారు. తల్లి కుమారుని రాత్రివేళ రహస్యముగా అన్యప్రదేశానికి తీసుకుపోయి "నాయనా, మన ప్రభువు పూర్వదిక్కున చక్రవర్తి. వెళ్ళి ఆయనను ప్రార్థిస్తే నీకు సహాయముచేసి రాజ్యము స్వాధీనము చేయిస్తాడు." అని హితబోధ చేసింది. "అమ్మా, పరికరాలు ఏవీ లేకుండా నేను వెళితే, అక్కడ నాకు ఆదరము చూపుతారా?" అన్నాడు కుమారుడు. "నాయనా, నీమామగారి యింటికి వెళ్ళు. ఆయన మహాధనికుడు కదా! ఆయనవద్ద ద్రవ్యము అడిగి తీసుకొని చక్రవర్తి సన్నిధికి వెళ్ళు" అని తల్లి ప్రోత్సాహము చేసింది. రాచబిడ్డకు సిగ్గుగానే ఉన్నది. విధిలేక దేవదత్తుడు ఆసాయంత్రమే బయలుదేరి క్రమేణ మామగారింటికి చేరేటప్పటికి రాత్రి పొద్దుపోయింది. తండ్రి పోయి, రాజ్యము పోయి, దీనస్థితిలో ఉన్న దేవదత్తుడు రాత్రి వేళ బంధువులను లేపడము ఎందుకనుకొని సమీపములో ఉన్న సత్రము వెలుపల కూర్చున్నాడు. అత్తవారిల్లు బాగా కనిపిస్తూనే ఉన్నది. కొంతసేపటికి ఆయింట్లోనుంచి తాడు పట్టుకొని నేలమీదకు దిగుతున్న స్త్రీ కనిపించింది. ఆమె రత్నభూషణాల కాంతితో ధగ ధగ మెరిసి పోతున్నది. ఆమె తన భార్య అని దేవదత్తుడు గుర్తుపట్టినాడు. 'ఎవరు నీవు' అని ఆమె దేవదత్తుని అడిగింది. బాటసారిని అన్నాడు

అతడు. భర్తను గుర్తుపట్టకుండానే ఆమె సత్రములోకి వెళ్ళింది. ఏమి జరుగుతుందో అని అతడు చాటుగా ఆమెను కనిపెట్టి చూస్తున్నాడు. ఎవరో పురుషుడు ఆమెను చూచి, ఇంత ఆలస్యంగా వచ్చావేమి అని రెండు తన్నినాడు. అతని కోపము పోగొట్టి ఆమె కామోద్రేకముతో అతనితో ఉపభోగము ప్రారంభించింది. రాజపుత్రుడు విచారపడి "క్రోధసమయము కాదు. సాధించవలసిన మహాకార్యమున్నది. ఈఖడ్గము శత్రువులమీద చూపవలసినది కాని స్త్రీలమీద, నరాధములమీద పోనిస్తే ఏమి లాభము? ఈదుష్టభార్యతో ఏమిపని! సరి సమానులు కానివాళ్ళతో సంబంధమువల్ల వచ్చిన నష్టమిది. కాకికి ఎంత సేపూ కాకిమీదనే దృష్టి కాని కోకిల మీదికి పోదు" అని భావించి వివేకముతో ఊరుకొన్నాడు. జయేచ్ఛ కలవారి మనస్సు మగువల మీదికి పోదు. జారునివద్ద సెలవు పుచ్చుకొని ఆమె వెళ్ళేటప్పుడు కర్ణాభరణము కింద పడిపోయినప్పటికీ గమనించకుండా వచ్చినదారినే ఇంటికి పోయింది. ఆజారుడుకూడా త్వరగా ఎటో వెళ్ళినాడు.

దేవదత్తుడు యావత్తూ గమనించి విచారగ్రస్తుడై ఉండి దైవవశాత్తు ఆ ఆభరణముకేసి చూసినాడు. మణులతో తళతళలాడుతున్న కర్ణాభరణము తీసుకొని బయలుదేరి కాన్యకుబ్జము చేరినాడు. బహుమూల్యము కలనగను తాకట్టు పెట్టి లక్షసువర్ణములు పుచ్చుకొని, అశ్వములు, గజములు కొని, పరివారముతో చక్రవర్తిసన్నిధికి వెళ్ళి తనరాజ్యహరణమును గురించి విన్నవించాడు. చక్రవర్తి సైన్య మిచ్చి పంపగా, దేవదత్తుడు శత్రువులను ఎదుర్కొని జయించి రాజ్యము సంపాదించుకొన్నాడు. తర్వాత తాకట్టు తప్పించి రత్నాభరణము మామగారికి పంపినాడు. కొమార్తెకు తండ్రి ఆ నగ ఇచ్చినాడు. ఆమె చీకాకుపడి, "ఆరాత్రి సత్రములో బాటసారి కనపడినాడు. అతడు నా భర్త అనిపిస్తున్నది. అప్పుడు ఆయననన్ను ఆనవాలు పట్టలేదు. ఈ ఆభరణము

నాచెవినుంచి జారిపోయి ఉంటుంది. తర్వాత వెతికితే కనపడలేదు. నా భర్త తీసుకువెళ్ళి ఇప్పుడు పంపించినాడు. ఏమి గతి!" అని భయపడి పిరికిగుండెవల్ల హృదయస్పందనము ఆగిపోయి మరణించింది. కుమార్తె రహస్యవ్యాపారము చేటికవల్ల గ్రహించి తండ్రి నోరెత్త లేదు.

రాజ్యము లభించినతర్వాత దేవదత్తునికి చక్రవర్తి తనకుమార్తె నిచ్చి పెండ్లి చేసినాడు. అతనితల్లి చాలాఆనందించింది.

సాహససమయాలలో స్త్రీల హృదయము వజ్ర నిష్ఠురము; భయ సమయాలలో కుసుమకోమలము. ఉత్తమవంశ సంభూత లయినస్త్రీలు ఆపదలోకూడా శీలము కోల్పోరు.

బ్రాహ్మణి చెప్పినకథ విని వాసవదత్తాదేవి "ఈమె కులీన, వాక్చాతుర్యము కలది. ఉత్తమ గుణముచేతనే ఈమెకు రాజదర్శనము లభించింది" అని భావించి. నీభర్త ఎవరమ్మా? నీ వృత్తాంతము చెపుతావా?" అని అడిగింది. ఆమె ఇలా చెప్పింది:

## పింగళిక వృత్తాంతము

దేవీ, మాళవ దేశములో అగ్నిదత్తుడనే బ్రాహ్మణోత్తమునికి ఇద్దరు సుపుత్రులు ఉన్నారు. అన్న శంకరదత్తుడు, తమ్ముడు శాంతికరుడు. చిన్నతనములోనే శాంతికరుడు విద్యార్థియై దేశాంతరము వెళ్ళిపోయినాడు. అతనిఅన్న నా భర్త. మా తండ్రి యజ్ఞకర్త, సంపన్న గృహస్థు; యజ్ఞదత్తుడని నామధేయము. కొన్నాళ్ళకు మామామగారు చనిపోతే అత్తగారు సహగమనము చేసింది. అప్పుడు నేను గర్భవతిని. నా భర్త తీర్థయాత్రలు సేవించడానికి వెళ్ళి, సరస్వతీనదీతీరాన మరణించారు. ఆయనవెంట వెళ్ళినవారు వచ్చి ఈ సంగతి నాకుచెప్పినారు. నేను సహగమనానికి సిద్ధపడితే గర్భవతిని అనే కారణముచేత నిషేధించారు. తర్వాత కొద్దిరోజులకు బందిపోటుదొంగలు వచ్చి, మాసంపద

యావత్తూ హరించి అగ్రహారగ్రామము అంతా దోచుకొనిపోయినారు. ముగ్గురు బ్రాహ్మణస్త్రీలు నా సావాసకత్తెలు. మేము నలుగురమూ దేశాంతరము వెళ్ళిపోయినాము. చేతిలో ఏమీ లేకపోడముచేత పని పాటలు చేసి నెలరోజులు కాలక్షేపము చేశాము. ఇంతలో నాకు ఈ కవలపిల్లలు పుట్టినారు. కొత్తచోటు, పేదరికము, ఈ పిల్లలూ! ఏమీ తోచక, మనమహాప్రభువు అనాథ రక్షకు లని విని, సిగ్గు విడిచి, ఇక్క-డికి ఎలాగో వచ్చి మీ అనుగ్రహపాత్రురాలను అయినాను. ఇక నా కష్టాలు గట్టెక్కినవి. చిన్నతనమునుంచీ శిష్టగృహములో అగ్నిహోత్రాల ధూపము తాకుతూ ఉండడముచేత నా నేత్రాలకు పింగళవర్ణము సంక్రమించింది. అందుచేత నన్ను పింగళిక అని లోకులు అంటారు. ఇది నా వృత్తాంతము. మా మరది శాంతికరుడు ఏ మయినాడో ఇంత వరకూ తెలియలేదు. దేవీ!

ఈప్రకారము పింగళిక చెప్పినకథ విని వాసవదత్త కొంచెము ఆలోచించి, "అమ్మా, మా పౌరోహితుని నామధేయము శాంతికరుడు. ఒకవేళ ఆయన నీ మరిది అవునేమో" అన్నది. పింగళిక చాలా ఆదుర్దాతో రాత్రి గడిపింది. ఉదయము వాసవదత్త శాంతికరుని పిలిపించి ఆయన వంశక్రమము అడిగింది. ఆయనవాక్యాలవల్ల మహారాణి విషయము యావత్తూ గ్రహించి "స్వామీ, ఈమె మీ వదినె పింగళిక" అని చెప్పింది. ఆయన నిదానించి చూచి గుర్తుపట్టి తనయింటికి తీసుకు వెళ్ళినాడు. తనతల్లిదండ్రులూ అన్నగారూ చనిపోయినట్టు విని చాలా విచారించినాడు. వాసవదత్త ఆ బిడ్డలకు శాంతిసోముడు, వైశ్వానరుడు అని పేర్లు పెట్టి తనకు పుట్టబోయే కుమార చక్రవర్తికి వాళ్ళను పౌరోహితు లని నిర్ణయించి వాళ్ళందరికీ సమృద్ధిగా సంపద లిచ్చింది. సుకృతకర్మలు ఫలసిద్ధికి తీసుకు వెళ్ళాటప్పుడు పురుషప్రయత్నము నిమిత్త మాత్రము.

ఒకనాడు కులాలవనిత (కుమ్మర స్త్రీ) అయిదుగురు బిడ్డలతో సహా బయలుదేరి అంతఃపురములోకి మూకుడులు తెచ్చింది. దానిని చూచి వాసవదత్త పక్కన ఉన్న పింగళికతో, "చూడు, దీనికి అయిదుగురు కుమాళ్ళు. నాకు ఒకడూ కలగలేదు. ఇది పుణ్యము చేసుకొన్నది" అన్నది. "దేవీ, దరిద్రులకు కుటుంబము హెచ్చు. పుణ్యమువల్ల కలిగినసంతానము కాదు. మీకు కలిగేపుత్రుడు ఉత్తము డవుతాడు. విచారించకండి. త్వరలోనే మీకు పుత్రోత్పత్తి అవుతుంది" అని ఓదార్చింది.

## శివానుగ్రహము

కుమారుడు కలగలేదు అనేచింతలోనే ఉన్నది వాసవదత్త. భార్య అభిప్రాయము గ్రహించిన వత్సరాజు వచ్చి "దేవీ ఈశ్వరాధన చేస్తే నీకు పుత్రోత్పత్తి అవుతుం దని నారదముని ఇదివరలోనే చెప్పినాడు. కాబట్టి వరప్రదాత అయిన మహేశ్వరారాధన చెయ్యవలి దేవీ!" అని సూచించినాడు. వాసవదత్త వ్రతము ప్రారంభించేసరికి రాజు, మంత్రులు, రాజ్యములో ప్రజలందరూ శివార్చనలు చేసినారు. మూడురోజులు రాజ దంపతులు ఉపవాసము చేసినతర్వాత స్వప్నములో శివుడు సాక్షాత్కరించి "మీకు కాముని అంశవల్ల పుత్రుడుపుట్టి, సకలవిద్యాధరులకూ చక్రవర్తి అవుతాడు" అని అనుగ్రహించినాడు. ఈవరమిచ్చి మహేశ్వరుడు అంతర్ధాన మయినతర్వాత రాజదంపతులు మేలుకొని చాలా ఆనందించినారు. ప్రాతఃకాలము వారు ఈవృత్తాంతము అందరికీ తెలియజేసినారు. అందరూ ఉత్సవము చేసి పారణలు, (భోజనాలు) చేసినారు.

తర్వాత కొద్దిరోజులకు జటాధారి అయిన మహాపురుషుడు వాసవదత్తకు స్వప్నములో సాక్షాత్కరించి ఫలము ఇచ్చినాడు. రాణి భర్తకు ఈవిషయము చెప్పింది. ఫలరూపముగా పుత్రునే మహేశ్వరుడు అనుగ్ర

హించినట్లు మహారాజు భావించి అచిరకాలములోనే తనకు పుత్రలాభ మవుతుం దని పరమోత్సాహముతో ప్రతీక్షిస్తున్నాడు.

## తరంగము : ౨౨

## వాసవదత్తా గర్భదోహదము

వాసవదత్తకు కామాంశవల్ల గర్భము కలిగింది. ఆమె వదనము కొంచెము పాలిపోయినప్పటికీ కమనీయముగా కనబడుతున్నది. మంత్ర సాధనాదులతో సంబంధించిన ఉపాసకుల కథలు వినవలెనని ఆమెకు కుతూహలము కలగడము ప్రారంభించింది. తాను ఆకాశములో సంచారము చేస్తున్నట్టూ, విద్యాధరాంగనలు సంగీతము పాడుతూ తనకు సేవలు చేస్తున్నట్టూ ఆమె కలలు కంటున్నది. జాగ్రదవస్థలో కూడా ఆకాశములో విహారాలు చెయ్యవలెననీ, భూమిమీదికి చూస్తూ ఉండవలెననీ ఆమెకు ప్రబలవాంఛ కలుగుతున్నది. అనేక యోగశక్తులు కల యౌగంధరాయణుడు ఇంద్రజాల, మంత్ర, తంత్రాదులతో ఆమె కోరిక నెరవేర్చుతున్నాడు. వాసవదత్త ఆకాశవిహారాలు చేస్తుంటే పౌరస్త్రీలు ఊర్ధ్వదృష్టితో ఆశ్చర్యముతో ఆమెను విలోకిస్తూ ఉంటారు. విద్యాధరులచరిత్ర వినవలె నని రాణి ఒకనాడు కోరితే, యౌగంధరాయణుడు అక్కడివా రందరూ వినేలాగ ఈకథ చెప్పినాడు.

### జీమూతవాహనుని కథ

హిమవత్పర్వతాలలో విద్యాధర చక్రవర్తి అయిన జీమూతకేతువు నివసిస్తున్నాడు. అతని ఇంటిలో వంశపారంపర్యముగా కల్పవృక్షము ఉంటున్నది. కల్పవృక్షము సమస్తకోరికలనూ సఫలము చేస్తుంది. ఒకరోజున విద్యాధరచక్రవర్తి ఆ కల్పవృక్షాన్ని దేవతా

స్వరూపముగా భావించి ' దేవా! నీవల్ల మాకోరికలు నెరవేరుతున్నవి. కుమారులు లేని నాకు పుత్రుణ్ణి ప్రసాదించ ' మని ప్రార్థించినాడు. ఆ వృక్షము అందుకు అంగీకరించి, 'ఓరాజా! నీకు దానవీరుడు, సర్వ భూతహితు డయిన కుమారుడు కలుగు తా' డని అనుగ్రహించింది. జీమూతకేతువు కల్పవృక్షానికి ప్రణామము చేసి, ఇంటికి వెళ్ళి పట్టపు దేవితో ఆ వృత్తాంతమును చెప్పి వీనులకు విందు చేసినాడు. తరువాత అతనికి జీమూతవాహను డనేకుమారుడు కలిగినాడు. ఆ కుమారుడు అతి బలవంతుడై సర్వభూతహితుడై దినదినప్రవర్ధమాను డవుతున్నాడు. క్రమేణా కొంతకాలానికి జీమూతవాహనుడు యువరాజై తండ్రిని సంతోషపెట్టి శుశ్రూషచేస్తూ ఇలా అన్నాడు : "తండ్రీ! కనపడే వస్తువులు అన్నీ శాశ్వతంగా ఉండవని నాకు తెలుసును. మహాత్ముల నిర్మల కీర్తి మాత్రము చిరకాలము ఉంటుంది. ఆకీర్తే పరోపకారము వల్ల లభిస్తే ఇక దానిసంగతి వేరే చెప్పవలెనా? పరోపకారముకన్న ఉదారులకు ప్రాణాధిక మైనధనము ఏ మున్నది? మనపెరటిలో ఉన్నకల్ప వృక్షము పరులకు ఉపయోగించినప్పుడే, దానిఫలమును అనుభవించిన వాళ్ళమవుతాము. ఈ కల్పవృక్షమువల్ల పేదవారి కడుపుమంట పో గొడతాను."

అధీరుడు ఇలా పలికేప్పటికి కల్పవృక్షము భూమిమీద బంగారము వర్షించింది. జన మంతా సంతోషించారు. జీమూతవాహనునికీర్తి అన్నిదిక్కులూ వ్యాపించింది. 'దయాళువు' బోధిసత్త్వాంశు డయిన జీమూతవాహనుడుతప్ప మరెవ్వడు కల్పవృక్షాన్ని యాచకులకు ఇవ్వగలడు ?" అని అంతా అతన్ని పొగడినారు.

జీమూతవాహనుని కీర్తివల్ల జీమూతకేతువు సామ్రాజ్యము సుస్థిరముగా ఉండగా, అది సహించలేక దాయాదులు వైరు లైనారు. ఈర్ష్యాళువులు అందరూ కలసి అతన్ని ఓడించవలె నని సమకట్టినారు.

అప్పుడు జీమూతవాహనుడు తండ్రితో, "నాయనా ఈశరీరము నీటి మీది బుడగ వంటిది. పెనుగాలిలో దీపమువంటి ఈ సిరిసంపదల వల్ల ప్రయోజన మేమిటి ? దాయాదులతో యుద్ధము చేయడము అనుచితము. రాజ్యాన్ని వదలిపెట్టి వెళ్ళిపోతాను. ఈదీను లంతా బతికిపోతారు. స్వకులనాశనము తప్పుతుంది." అన్నాడు. కుమారుని మాటలు విని తండ్రి "నాయనా! నేనుకూడా పోవలసినవాడినే. పడుచువాడివి నీవే రాజ్యమును తృణప్రాయముగా వదిలితే, ముసలివాణ్ణి నా కెందుకు? హాయిగా వనానికి వెళ్ళి తపస్సు చేసుకుంటాను" అని దృఢాభిప్రాయము వెల్లడించినాడు. జీమూతవాహనుడు తల్లిదండ్రులను మలయపర్వతానికి తోడ్కొని వెళ్ళినాడు. గంధపు చెట్లతోను సెలయేళ్ళతోనూ ఉన్న సిద్ధాశ్రమములో అతడు తల్లికీ తండ్రికీ యథావిధిగా శుశ్రూష చేస్తున్నాడు.

అక్కడ జీమూతవాహనుడికీ సిద్ధరాజకుమారు డయిన మిత్రావసువుకూ స్నేహ మేర్పడ్డది. ఒకనాడు అతడు మిత్రావసునిచెల్లెలిని, తన జన్మాంతరప్రేయసిని ఏకాంతమందు చూచినాడు. ప్రథమదర్శనములో అతడు ప్రియురాలి చూపులలో చిక్కుకున్నాడు. ఇద్దరిహృదయాలూ అనురాగరసములో మునిగిపోయినవి. హఠాత్తుగా త్రైలోక్యపూజితు డయిన మిత్రావసువు జీమూతవాహనునితో "మిత్రమా! నాకు మలయవతి అనే చెల్లెలు ఉన్నది. ఆమెను నీకు ఇవ్వావలె నని కోరిక. నామాటకు అడ్డు చెప్పకు," అన్నాడు.

జీమూతవాహనుడు, "యువరాజా! మీచెల్లెలు నాకు పూర్వజన్మలో భార్య. అప్పుడు నీవు నాస్నేహితుడవు; నా రెండోప్రాణానివి. నాకు పూర్వజన్మజ్ఞానము ఉన్నది," అని పలికినాడు. మిత్రావసువు స్నేహితుని జన్మాంతరకథ వినవలె నని కుతూహలము కనబరచినాడు. అప్పుడు జీమూతవాహనుడు తన వృత్తాంతము చెప్ప నారంభించినాడు;

## జీమూతవాహనుని జన్మాంతర గాథ

నేను పూర్వము విద్యాధరుణ్ణిగా ఉండి, ఆకాశ మార్గాన హిమాలయ శిఖరము మీదుగా వెళ్ళుతున్నాను. కైలాసశిఖరముమీద శివుడు పార్వతీదేవితో క్రీడాసక్తుడై ఉండి, తనపైగా ఆకాశాన వెళుతున్న నన్ను మానవుడై జన్మించ మని శపించినాడు. ఓరీ! నీవు విద్యాధరిని వివాహము చేసుకొని, కుమారుణ్ణి సింహాసనము మీద కూర్చోపెట్టి తిరిగీ జన్మాంతర జ్ఞానము కలవాడవు అవుతావు. విద్యాధరుడ వవుతావు." అన్న మహేశ్వరుని శాపవశంచేత భూమండలములో వలభీ నగరములో ధనికవైశ్యపుత్రుడినై వసుదత్తుడు అనే నామముతో పెరుగుతున్నాను.

కాలక్రమేణ నాకు యౌవనము రాగా మాతండ్రి రకరకాల సరుకులు ఇచ్చి, వర్తకానికి నన్ను ద్వీపాంతరము పంపినాడు. కొంతకాలము అక్కడుండి స్వస్థలానికి వస్తూండగా అడివిలో దొంగలు కొట్టి నన్ను పూర్తిగా దోచుకొన్నారు. అంతటితో ఊరుకోక నన్ను చండికకు బలి ఇవ్వడానికి దొంగలు సిద్ధపడి, తమ ప్రభు వయిన పుళిందకుని ఎదుట ఉంచినారు. నన్ను చూచేసరికి పుళిందకుని హృదయముకరిగింది. నిర్హేతుకముగా కలిగిన ప్రేమకు జన్మాంతర ప్రీతి కారణము. అతడు నాకు స్వేచ్ఛనిచ్చి తాను బలికావడానికి సిద్ధపడగా అశరీరవాణి " వత్సా, అలా చెయ్యకు. నీకు ప్రసన్నురాలను. కోరిన కోరిక నెరవేరుస్తాను." అన్నది. అశరీరవాణి పలుకులు విని అతడు సవినయముగా " దేవీ! నీఅనుగ్రహము చాలు. నీవు ప్రసన్నురాలవు. అంతకన్న నాకు ఏమి కావాలి? అయినా చిన్నకోరిక కోరుతున్నాను. ఈవైశ్యునితో నాకు జన్మాంతరములో కూడా స్నేహముకలుగును గాక.' అని వేడినాడు. అశరీరవాణి అందుకు అంగీకరించింది. దొంగల బారినుండి నేను తప్పించు

కొని బతుకు జీవుడా అని బైటపడ్డాను. ఈవిషయమంతా నాతండ్రికి చెప్పగా, ఆయన మహోత్సవము చేసినాడు.

కొంతకాలము గడిచినతరువాత దోపిడినేరముమీద దొంగలరాజయినపుళిందకుని కట్టి మా రాజుదగ్గిరికి తీసుకొని వచ్చినారు. అది చూచి పుళిందకుడు నాకు చేసిన మహోపకారమును స్మరించి, అతనికి ప్రత్యుపకారము చేసితీరవలె నని సంకల్పించి, నా తండ్రిని బతిమాలుకొని, లక్షద్రవ్యము దండ మర్పించి, నా స్నేహితునికి మరణశిక్ష లేకుండా తప్పించినాను. అతన్ని మా ఇంటికి అతిథిగా తీసుకుని వచ్చి గౌరవించినాను. అతడు వెళ్ళిపోయేప్పుడు మన నంతా నా మీదనే ఉంచి వెళ్ళినాడు. తనకు ప్రత్యుపకారము నేను చేసినందుకు, పుళిందకుడు ఉచిత మయిన కానుక ఇవ్వవలె నని ఆలోచించినాడు. మంచి ముత్యాలు సంపాదించడానికి హిమాలయపర్వతాలవద్ద అడవిలో ఏనుగులవేటకు వెళ్ళినాడు. మంచిముత్యాలు ఏనుగుల కుంభస్థలములో ఉంట వని ప్రసిద్ధి. అందుకోసము, సరస్సులో నీరు తాగడానికి ఏనుగులు వస్తవి గదా అని తలచి, విల్లు ఎక్కుపెట్టి పొంచున్నాడు. ఈ లోగా చక్కనిచుక్క సింహవాహనమై పార్వతీదేవివలె శివుణ్ణి పూజించడానికి వచ్చింది. ఆమెను చూచి పుళిందకుడు "ఎవరో ఈ కన్య? మానవస్త్రీ అయితే సింహముసెక్కి రాగలదా? దివ్యస్త్రీ అయితే నా కెలా కనపడుతుంది? ఈ చక్కనిదాన్ని నాస్నేహితుడి కిచ్చి ముడిపెట్టిస్తే ప్రత్యుపకారము చేసినవాణ్ణి అవుతాను. ఈమె దగ్గిరికి పోతాను." అనుకొని ఆమెదగ్గిరికి వెళ్ళినాడు. ఆదివ్యకన్య సింహము దిగి సరస్సులో పద్మాలు కోస్తున్నది. అత డామెకు నమస్కారము చేసినాడు. ఆమె ప్రీతితో కుశలప్రశ్న వేసి "ఎవరు నీవు? ఈ దుర్గమారణ్యానికి ఎలా రాగలిగినావు? ఎందుకు వచ్చావు?" అని అడిగేసరికి అతడు సమాధాన మిచ్చినాడు, "నేను శబరరాజును. చండికాదేవి భక్తుణ్ణి. ఏనుగులను

వేటాడి కుంభస్థలములలో ముత్యాలు సంపాదించ వస్తె నని వచ్చాను. దేవీ! నిన్ను చూడగనే నా ప్రాణమిత్రుడు శ్రీమంతు డయిన వసుదత్తుడు జ్ఞాపకము వచ్చినాడు. అతడుకూడా నీలాగే రూపయావనములు కలవాడు. అతడు ఏకన్యకరమును గ్రహిస్తాడో ఆమె ధన్యురాలవుతుంది. నీవు తప్పకుండా అతన్ని చేపట్టాలి." పుళిందకునిమాటలు ఆమెహృదయాన్ని చూరగొన్నవి. ఆమె వలపువల్ల "ఏడీ నీస్నేహితుడు? తీసుకురా అతన్ని. అయినా చూతాను" అని అడిగింది.

పుళిందకుడు స్వగ్రామము చేరి ముత్యాలు, కస్తూరి మొదలయినవి చాలా బారువలు పట్టించుకొని మాఇంటికి వచ్చినాడు. అమూల్యములైన ఆకానుకలతో పుళిందకుడు మాతండ్రికి బహూకరించినాడు. పగలంతా ఉత్సవములో ఉల్లాసముగా గడిచింది. రాత్రి వేళ అతడు నాతో రహస్యముగా ఆ కన్యాదర్శనా వృత్తాంతమును సవిస్తరముగా తెలిపినాడు. అతడు నన్ను కూడా తీసుకొని బయలుదేరినాడు. తెల్లవారగానే మాతండ్రి నేను పుళిందకునితో వెంట వెళ్ళిపోయినానని తెలుసుకొని, అతని మీద ప్రీతివిశ్వాసముల వల్ల బెంగ పెట్టుకోకుండా ఉన్నాడు. పుళిందకుడు నన్ను మంచుకొండ వద్దకు తీసుకొనిపోయినాడు. సంజవేళకు సరస్సు చేరి, మే మిద్దరమూ స్నానము చేసి, తియ్యని పళ్ళుతిని ఆరాత్రి వనములో కాలము గడిపినాము. సరస్సులో నీళ్ళు తాగి పూలసెజ్జల మీద పవళించాము. మరునాడు ఆకన్య యథాప్రకారముగా సరస్తీరానికి వచ్చింది. సింహముమీద ఆకన్య ఆసీనురాలై ఉండగా నేను చూచి భయపడ్డాను. ఆసుందరి సింహము దిగి సరస్సులో పువ్వులు కోసి, స్నానముచేసి, శివుణ్ణి ఆరాధించింది. పూజ పూర్తి కాబోయే వేళ నామిత్రుడు పుళిందకుడు ఆమెకు నమస్కరించి తనను తెలియపరుచుకొన్నాడు. ఆమె అతన్ని గౌరవించింది. అప్పుడు అతడు 'దేవీ! నీకు తగిన వరుణ్ణి, నాస్నేహితుణ్ణి తీసుకొని వచ్చాను. సెలవయితే ఇప్పుడే

అతన్ని చూపిస్తాను' అని విన్నవించినాడు. 'సరేచూపు' అనేసరికి నన్ను ఆమె దగ్గరికి తీసుకుపోయినాడు. చూచి ఆకన్య స్నేహమువల్ల పశు రాలై "నీసఖుడు మానవుడు కాడు. ఎవరో నన్ను వంచించడానికి వచ్చిన దేవపురుషుడు. సామాన్యమానవునికి ఈరూపము ఎక్కడిది? " అన్నది.

ఆమాట విని ఆమెకు నమ్మకము కలగడానికి ఇలా నేను పలికినాను: "సుందరీ! నిజముగా నేను మనుష్యుడను. సరళ జనులు కపటులై వర్తిం చరు. వలభీపురములో ధనికు డయిన వర్తకు డున్నాడు. నేను శివ ప్రసాదము వల్ల అతనికి జన్మించాను. నన్ను వసుదత్తు డని పిలుస్తారు. ఈపుళిందకుడు నాఆపదలు తప్పించి స్వయముగా నాతో స్నేహము చేసుకొన్నాడు. ఇదీ నాసంగతి "

నామాటలు విని ఆకన్య సిగ్గుపడి తలవంచి " నాకు స్వప్నములో మహేశ్వరుడు కనపడి ' రేపు నీకు భర్త లభిస్తా' డని వర మిచ్చినాడు. నీవే నాభర్తవు. నీస్నేహితుడు నా అన్న" అంటూ చక్కగా నోటి ముత్యాలు రాలి పడేట్టు మాట్లాడి నన్ను సంతోషపెట్టింది. నా స్నేహితుడినీ ఆదివ్యకన్యనూ మాఇంటికి తీసుకుపోవదలుచు కొన్నాను.

ఆకన్య కనుసన్న చేసి నన్ను తనతోపాటు సింహాన్ని ఎక్క మన్నది. నామిత్రునితో సింహము ఎక్కినాను. తోవలో నామిత్రుడు బాణాలు వేసి సంపాయించిన జింకమాంసమే మాకు భోజన మైంది. క్రమేణ మే మంతా వలభీనగరము చేరినాము. అక్కడ సింహముమీద వస్తున్న మమ్మల్ని చూసి ఊరివా రంతా భయపడి, మాతండ్రికి తెలియజేసి నారు. మానాన్న మాకు ఎదురు వచ్చి సంతోషపరవశుడు కాగా నేను సింహము దిగి ఆయనకు ప్రణామము చేసినాను. నన్ను ఆయన దీవించి నాడు. దివ్యకన్యకూడా సింహము దిగి నాతండ్రికి పాదాభివందనము చేసింది. నాతండ్రి పట్టరానిసంతోషములో పొంగిపోయినాడు. ఆ

రోజల్లా మాకు పండగ. పులిందకునితో స్నేహము చేయడమూ, సకల వృత్తాంతము నాతండ్రి తెలుసుకొని ఉత్సవము చేయించినాడు. మర్నాడు ముహూర్తము చూడగా, బంధుజనసమక్షములో ఆదివ్య కన్యను వివాహ మాడినాను.

నాభార్యకు వాహన మైనసింహము పెళ్ళివా రంతా చూస్తూ ఉండగా ఆకస్మికముగా పురుషాకారము ధరించి దివ్యవస్త్రాభరణాలంకృతుడై నాకు నమస్కారము చేసి ఇలా పలికినాడు. "నాది విద్యాధర కులము. నన్ను చిత్రాంగదు డని పిలుస్తారు. ఈకన్య నాకుమార్తె. నాకు ప్రాణాధిక. ఈపిల్లపేరు మనోవతి. దీనిని ఒడిలో కూర్చోబెట్టుకొని ఎప్పుడూ అడవుల్లో తిరుగుతూ ఒకనాడు గంగానదిదగ్గిరికి వెళ్ళినాను. గంగాతీరాన తపోవనములు అనేకము ఉన్నవి. నేను నదిని దాటుతూండగా నాపుష్పమాల నీళ్ళల్లో పడినది. ఆనీళ్ళల్లో ఉన్న నారదముని వీపుమీద పువ్వులదండ పడడమువల్ల ఆయన కోపించి ఇలా శాప మిచ్చినాడు. 'ఓరీ పాపీ! ఈగర్వమువల్ల నీవు సింహముగా మారి, హిమాలయాలలో ఈకుమార్తెను వీపుమీద మోసుకొని తిరుగుతావు. నీకుమారిని మానవుడు ఎప్పుడు వివాహము చేసుకుంటాడో అప్పుడు నీశాపము విరగ డవుతుంది.' శాపమువల్ల నేను సింహరూపమెత్తి నాకుమార్తెను మోస్తూ హిమాలయవనాలలో తిరుగుతూ ఉండగా, శబరాధిపతి సహాయమువల్ల జరిగినకళ్యాణము నీకు తెలిసే ఉన్నది. కనుక నేను వెళ్ళిపోతాను. మీరు క్షేమంగా నాలుగు కాలాలపాటు వర్ధిల్లాలి. ఇంతటితో నాశాపము తీరింది."

ఇలా అని విద్యాధరుడు ఆకాశమార్గాన ఎగిరినాడు. మా తండ్రికి పట్టరాని సంతోషము కలిగింది. మంచిసంబంధము దొరకినందుకు బంధువు లంతా సంతోషించారు. శబరాధిపతి పుళిందకుడు చేసిన ఉపకారము ఎవరుమరిచిపోగలరు! అక్కడ రాజుకూడా ఉదారమయిన పుళిం

దకుని చరిత్ర విని అతనితో స్నేహము చేసినాడు. మా తండ్రి రాజుకు రత్నాలు కానుకగా అర్పించగా ఆయన సంతుష్టుడైనాడు. అప్పుడు రాజుచేత మా తండ్రి అరణ్యరాజ్యమును పుళిందకునికి ఇప్పించినాడు. నేను దివ్యకన్య అయిన మనోవతితోనూ పుళిందకునితోనూ సుఖముగా అక్కడే ఉన్నాను. పుళిందకుడు స్వదేశాభిమానము విడిచి పెట్టి, మా ఇంట్లోనే ఉండేవాడు. అన్యోన్య మిత్రులకు కాలము క్షణముగా వెళ్ళిపోతూ ఉంటుంది. త్వరలో నా భార్య మనోవతికి హిరణ్యదత్తు డనే కుమారుడు పుట్టినాడు. వాడు మా కులదీపకుడు. అందరికీ కన్నులపండుగ చేస్తూ పెరిగినాడు. తల్లీతండ్రీ మనుమణ్ణి చూసుకొని కృతార్థులై సంతోషించి, విదేహముక్తి పొందడానికి భాగీరథీతీరానికి వెళ్ళినారు. మా తండ్రి పోయినశోకమువల్ల నేను దుఃఖములో మునిగి నప్పుడు, బంధువు లంతా నన్ను ఓదార్చి ఇల్లు అప్పజెప్పారు. ఆ కష్ట కాలంలోకూడా ఒకవైపు నా ప్రియురాలి సుందర వదనము, ఒకవైపు పుళిందకుని సాంగత్యమూ నాకు సుఖము కలిగిస్తూ ఉండేవి.

ఇలా ఉంటూ ఉండగా నాకు ముసలితనము వచ్చింది. వైరాగ్యము కలిగింది. సంసారము నా కుమారునిమీద పెట్టి కాలంజరపర్వతానికి భార్యా సహితముగా వెళ్ళినాను. నా స్నేహమువల్ల పుళిందకుడుకూడా నాతో నీడవలె వచ్చినాడు. అక్కడికి నేను చేరగానే ఈశ్వరశాపమూ, నా విద్యాధర జాతీ జ్ఞాపకము వచ్చినవి. నేను మానవ శరీరము వదిలి పెట్టా లని సంకల్పించి, ఆసంగతి నా భార్యకూ, మిత్రుడికీ చెప్పాను. నాకు జన్మాంతరములోకూడా మనోవతి భార్య కావా లనీ, పుళిందకుడే స్నేహితుడై పుట్టా లనీ తలచి శివధ్యానము చేసి, కొండమీదినుంచి పడి శరీరము వదలివేసినాను.

తరువాత జన్మలో నేను ఈ విద్యాధరకులములో జీమూతవాహను డనే పేరుతో జన్మించినాను. శబరాధిపతి అయిన పుళిందకుడవు మిత్రా

వసు వనే నామముతో విశ్వావసు వనే సిద్ధరాజుకు శివప్రసాదమువల్ల జన్మించినావు. నా భార్య మనోవతి మలయవతి అయింది. ఈ ప్రకారముగా నీవు నా పూర్వజన్మ స్నేహితుడివి. మలయవతి నాకు పూర్వజన్మలో భార్య. మన ఇద్దరికీ మళ్ళీ స్నేహము కలిసే సమయము వచ్చింది. అందువల్ల మలయవతిని వివాహము చేసుకుంటాను. అయినా, నీవు ముందుగా వెళ్ళి నా తలిదండ్రులకు తెలియచెయ్యి. వారు అంగీకరిస్తే నీ చెల్లెల్ని చేసుకొంటాను.

మిత్రావసువు జీమూతవాహనుడి మాటలు విని సంతోషించి ఆ ప్రకారమే అతని తల్లిదండ్రులకు పెళ్ళిసంగతి చెప్పినాడు. వాళ్ళు కూడా అందుకు సంతోషించినారు. మిత్రావసువు, పెళ్ళికి కావలసిన సన్నాహాలు చేయించినాడు. జీమూతవాహనుడు యథా విధిగా మలయవతిని వివాహమాడి, మలయ పర్వతము మీద మహావైభవముతో కాలము గడుపుతున్నాడు.

ఒకరోజున అతడు బావమరిది మిత్రావసువుతో కూడా సముద్ర తీరాన ఉన్న అరణ్యము చూడాలని షికారు వెళ్ళినారు. అకస్మాత్తుగా 'హా హా పుత్ర' అన్న ఏడుపు వారికి వినపడగా వాళ్ళు వెళ్ళి చూస్తే ఒక తల్లి, కుమారుని వెంటవెళుతూ దుఃఖిస్తున్నది. కుమారుడు తల్లిని ఏడవ వద్దని వారిస్తున్నాడు. ఈ లోగా మరొక పురుషుడు అక్కడికి వచ్చి ఆ కుర్రవాణ్ణి పెద్ద రాతి మీద కెక్కించి వదలిపోయినాడు. జీమూతవాహనుడు "ఎందుకు నీ తల్లి ఏడుస్తున్నది? ఎవరి పిల్లవాడివి నీవు? నీ పేరేమి" అని ప్రశ్నలమీద ప్రశ్న అడగగా ఆ కుర్రవాడు తన వృత్తాంతము పూసగుచ్చినట్టు ఇలా చెప్పినాడు:

"పూర్వము కశ్యపభార్యలయిన కద్రూ వినతలలో కద్రువ సూర్యుని గుర్రాలు నల్లనిరంగు గలవనీ, వినత తెల్లని వనీ వాదోపవాదోకి వివాదపడ్డి, ఓడినది రెండవదానికి దాస్యము చేయవలసినదిగా పంతము

వేసుకొన్నారు. విజయాకాంక్షిణి అయిన కద్రువ కుమారులతో చెప్పి సూర్యుని గుఱ్ఱాలకు విషపూత్కార మాలిన్యము చేయించి, వినతకు చూపి ఆమెను దాసీగా చేసుకొన్నది. వినతకుమారుడు తన తల్లిని దాస్యమునుంచి వదల మని కద్రువను మంచిమాటలతో అడిగినాడు. కద్రువ కుమారులు ఆలోచనచేసి "ఓవినతాకుమారా! పాల సముద్రమును దేవతలూ రాక్షసులూ మథిస్తున్నారు. నీవు బలవంతులలో శ్రేష్ఠుడవు. మాకు అమృతము సంపాయించి తెస్తే నీతల్లికి స్వేచ్ఛ ఇస్తాము" అని వాగ్దానము చేసినారు. ఆమాట విని గరుత్మంతుడు క్షీరసముద్రానికి వెళ్ళి అమృతము కోసము అద్భుతంగా పరాక్రమము చూపినాడు. అప్పుడు శ్రీహరి సంతోషించి గరుడునితో "నీవు మహాపరాక్రమశాలి వోయి! వర మడుగు" మన్నాడు. గరుత్మంతుడు విష్ణువుతో "దేవా, కద్రువ, ఆమె పుత్రులు నాగులూ నాతల్లికి స్వేచ్ఛ ఇవ్వడము లేదు. అందువల్ల నా ఆకలి తీరడానికి నాగు లందరూ ఆహారము కావాలి" అంటే ఆవరమును శ్రీహరి ఇచ్చినాడు. ఇంద్రుడు గరుత్మంతుడితో "ఆమూర్ఖులు అమృతాన్ని తాగకుండా ఉండేటందుకూ నేనే దాన్ని తిరిగి తీసుకొనేవిధము చూడు" అని హెచ్చరించినాడు. గరుత్మంతుడు నాగులదగ్గిరికి వచ్చి "ఇదిగో అమృతము. దీన్ని ఇక్కడే ఉంచి పోతున్నాను. మా అమ్మకు స్వేచ్ఛ యిచ్చి, మీరు అమృతము పుచ్చుకొనండి!" అని పలికినాడు. అతను అమృత కలశాన్ని దర్భాసనముమీద ఉంచినాడు. నాగులు వినతను వదిలి వేసినారు. గరుత్మంతుడు తల్లిని తీసుకొని వెళ్ళగా, నాగులు అమృత కలశాన్ని గ్రహించబోయినారు. ఇంద్రుడు తన ప్రభావమువల్ల వాళ్లను మోహములో పడవేసి, అమృతాన్ని హరించినాడు. పోయిన అమృత కలశము పోనేపోయింది, దర్భలచాపమీద రవంత అమృతము దించి ఉండదా అని నాగులు దానిని నాలుకతో నాకినారు. వాళ్లనాలుకలు

చీలిపోయినవి. గరుత్మంతుడు అమృతమును పోగొట్టుకొన్న నాగులను తినడము సాగించినాడు. అతని రాకవల్ల నాగలోకము భయపడినది. పాతాళలోక మంతా క్షణములో నాశన మవుతుం దేమో నని నాగరాజు వాసుకి భయపడి గరుత్మంతునితో "గరుడా, నీకు రోజుకు ఒక నాగుని ఆహారముగా పంపుతాను. ఒక్కసారే పాము లన్నిటినీ చంపి వెయ్యకు. పాతాళలోకానికి రావద్దు. అలా వస్తే నీకు ఆహారము లభించదు. నీవని పా డవుతుంది." అన్నాడు. వాసుకి చెప్పిన విధానానికి గరుత్మంతుడు అంగీకరించి, దినదినమూ ఒక్కొక్క పామును భక్షిస్తున్నాడు. కొంతకాలానికి చాలామంది నాగులు నశించినారు. ఈరోజు నావంతు వచ్చింది. నన్ను శంఖ చూడు డని పిలుస్తారు. నేను వాసుకి ఆజ్ఞవల్ల గరుత్మంతునికి ఆహారమునిమిత్తము ఈ వధ్యశిల ఎక్కినాను. అందుకే మాఅమ్మ లబోదిబో అంటూ ఏడుస్తున్నది.

శంఖచూడునిమాటలు జీమూతవాహనుని హృదయాన్ని కరిగించినవి. అప్పుడు జీమూతుడు "అయ్యో! నాగరాజుప్రభుత్వము ఎంత బలహీనంగా ఉంది! తనప్రజలను తనచేతులతో శత్రువుకు ఆహారముగా అర్పిస్తున్నాడు. నాగరాజే గరుత్మంతుడికి ఆహారము ఎందుకు కాకూడదు. తనకులము నాశన మయిపోతూ ఉంటే సాక్షిగా ఉండి చూస్తున్నాడు! ఏ మయిపోయింది అతని పౌరుషము? కశ్యపుని పుత్రుడై పుట్టి తండ్రికి నామర్దా తీసుకొని వస్తున్నాడు! ఈవాసుకికి శరీరము మీాద ఎంత అభిమానము! శంఖచూడుడా! నాశరీరాన్ని నాగరాజయిన వాసుకివలె భయపడక గరుత్మంతుడికి అర్పిస్తాను. నాశరీరము నీకోసము త్యాగము చేస్తాను." అన్నాడు.

శంఖచూడుడు ధైర్యముతో "మహానుభావా! వద్దు! ఎంతమాత్రమూ నీశరీరము గరుత్మంతుడికి అర్పించ వద్దు. గాజుముక్కకోసము ముత్యమును పోగొట్టుకో వచ్చునా? నేను కులానికి అప్రతిష్ఠ తీసుకు

రాలేను." అన్నాడు. ఇలా శంఖచూడుడు జీమూతవాహనుణ్ణి వారించి గరుత్మంతుడు ఎప్పుడు వస్తాడా అని ఎదురు చూస్తున్నాడు. అవసాన కాలము అంతకంతకు దగ్గిరికి వస్తూవుంటే శంఖచూడుడు సముద్రతీరాన ఉన్న గోకర్ణేశ్వరస్వామికి మొక్కడానికి వెళ్ళినాడు.

కరుణాసముద్రు డయిన జీమూతవాహనుడు ఆత్మార్పణమువల్ల అన్యుని రక్షించే అవకాశము లభించింది గదా అని సంతోషించినాడు. మహానుభావులశరీరాలు పరోపకారార్థమే. జీమూతవాహనుడు యుక్తి చేత మిత్రావసువును ఏదో పనిమీద ఇంటికి పంపినాడు. గరుత్మంతుడు వస్తున్నాడు. అతనిరెక్కలగాలివల్ల భూమి దద్దరిల్లుతున్నది. నాగులకు శత్రువు వస్తున్నా డని గ్రహించి వెంటనే జీమూతవాహనుడు వధ్యశిల ఎక్కినాడు. గరుత్మంతుడు ముక్కుతో అతన్ని పట్టుకొని మలయ పర్వతశిఖరానికి ఎగిరిపోతున్నాడు. జీమూతవాహనుని శరీరమునుండి రక్తము చుక్కలుగా భూమిమీద పడుతున్నది. అతని శిరస్సుమీద ఉన్న చూడామణిని గరుత్మంతుడు పెకలించడంవల్ల, అది నేలమీద పడి పోయింది. గరుత్మంతుడు జీమూతవాహనుణ్ని తింటూ ఉంటే పుష్ప వర్షము కురిసింది! అందుకు అతడు ఆశ్చర్యపడినాడు.

ఈలోగా శంఖచూడుడు గోకర్ణేశ్వరుణ్ని దర్శించి, రక్తసిక్త మయిన వధ్యశిలాప్రదేశాన్ని చూచి "అయ్యో! అయ్యో! ఆ మహానుభావుడు నన్ను రక్షించాలని తనదేహాన్ని గరుత్మంతునికి అర్పించి నాడు. జీమూతవాహనుణ్ణి ఎక్కడికి తీసుకు పోయినాడో గద! వెతుకుతాను." అంటూ నెత్తురుజాడను అనుసరించి వెళ్లినాడు.

గరుత్మంతుడు తనకు ఆహారమై వచ్చిన జీమూత వాహనుని చూచి పరమాశ్చర్యము పొందినాడు. గరుడుడు ముక్కుతో రక్కి, చీల్చివేస్తున్నా అతనికి రవంతకూడా బాధలేదు. పైగా అతడు ఆనంద పడుతున్నాడు. జీమూతవాహనుడు గరుత్మంతునితో "ఓపక్షిరాజా!

నాశరీరములో ఇంకా రక్తమాంసాలు ఉన్నవి. నీకు ఇంకా ఆకలి తీర లేదు, హఠాత్తుగా నన్ను తినడము మానివేశావేమిటి? ” అన్నాడు. అతని మాటలకు గరుత్మంతుడు అద్భుతపడి “ నీవు నాగుడవు కావు. ఎవరవో చెప్పు. ” అని అడిగినాడు. “ నేను నాగుణ్ణి. తిను తిను నన్ను. ధీరులు ఆరంభించిన కార్యమును వదిలివేస్తారా? ” అన్నాడు జీమూతుడు. ఈలోగా శంఖచూడుడు దూరమునుండి కేకలు వేస్తున్నాడు. “ వద్దు వద్దు! గరుత్మంతుడా! వద్దు. అతడు నాగుడు కాడు! నేను నాగుణ్ణి. వస్తు న్నాను. అతన్ని వదిలెయ్యి! ” గరుత్మంతుడు విభ్రాంతిలో మునిగినాడు. తనకోరిక తీరనందుకు జీమూతవాహనుడు పరితాప పడుతున్నాడు. ఇప్ప టికి గరుత్మంతుడికి తెలిసింది. తాను అజ్ఞానంవల్ల విద్యాధర చక్రవర్తిని తింటున్నట్లు. “ ఈమహానుభావుడు స్తుతిపాత్రుడు. పరులకుగాను తన శరీరాన్ని త్యజించినాడు! ” అని విచారపడినాడు.

గరుత్మంతుడు పాపశుద్ధికై అగ్నిలో పడబోగా జీమూతవాహనుడు “ ఓపక్షిరాజా, ఎందుకు విచారిస్తావు? ఇక ఎప్పటికీ పాములను భక్షించకు. చేసిన దానికి ప్రాయశ్చిత్తను పశ్చాత్తాపము పొంది, తిరిగి పాపము చేయకుండా ఉండు. ” అన్నాడు. ఆతని మాటలను గరుత్మం తుడు ఉపదేశ వాక్యములుగా సావధానముగా విన్నాడు. పాముల అస్తికలమీద అమృతము కురిపిస్తే గాని అవి తిరిగి బతకవు. కనుక అమృతసంపాదనకై గరుడుడు స్వర్గానికి వెళ్ళినాడు. గౌరి మలయవతి భక్తికి మెచ్చి జీమూతవాహనునిమీద అమృతము కురిపించి బతికిం చింది. అతని దేహము వజ్రశరీర మయినది. అతన్ని చూచి బంధువు లంతా సంతోషించినారు. అతని దగ్గిర వీడ్కోలు తీసుకొని శంఖ చూడుడు పాతాళలోకానికి వెళ్ళిపోయినాడు. జీమూతవాహనుడు మలయవతితో సుఖాలు అనుభవిస్తూ విద్యాధర చక్రవర్తిగా ఉన్నాడు.

ఈకథ యౌగంధరాయణుని వల్ల వాసవదత్తాదేవి విని ప్రీతి చేత

దేవతావిశ్వాస బుద్ధివల్ల, విద్యాధర చక్రవర్తి కాబోయే తన కుమారుని గురించి భావనలు చేస్తూ భర్తతో ఆరో జల్లా గడిపింది.

## తరంగము: ౨3

## వాసవదత్తా స్వప్నము

ఏకాంత ప్రదేశములో మంత్రిసమేతు డైన వత్సరాజుతో వాసవదత్తా దేవి ఈ ప్రకారము చెప్పింది: "ఆర్యపుత్ర, ఈ గర్భము ఏర్పడినది మొదలు దీని సంరక్షచింత నాకు హెచ్చి పోయింది. గతరాత్రి ఈ చింతతోనే నిద్రపోతున్న నాకు స్వప్నములో దివ్యపురుషుడు దర్శనమిచ్చినాడు. ఆయన శరీర మంతటా భస్మము పూసుకొన్నాడు. శిరస్సున పింగళ జటలు, వాటిపైన చంద్రరేఖ, చేతిలో శూలము ఉన్నవి. ఆయన నన్ను చూచి కరుణతో "బిడ్డా, గర్భము విషయమై నీకు చింత వద్దు. నేనే దీనిని నీకు అనుగ్రహించినాను; నేనే రక్షిస్తాను. రేపు నీకు నిదర్శనము లభిస్తుంది. రేపు భర్తమీాద నేరారోపణ చేసి ఒక తె నీ భర్త సన్నిధికి వస్తుంది. బంధువుల ప్రేరేపణచేత తన భర్తను చంపించవలె నని ఆదుర్మార్గురాలి ఆశయము. నీవు పతితో చెప్పి ఆ సాధు పురుషుని భార్యబారినుంచి తప్పించ వలి'' అని ఆజ్ఞ యిచ్చి అంతర్ధాన మయినాడు. నాకు మెళుకువ వచ్చింది. ఇంతలో తెల్లవారింది."

ఈ ప్రకారము రాణి చెప్పేటప్పటికి అందరూ ఆశ్చర్య పడ్డారు. అది యావత్తూ ఈశ్వరానుగ్రహముగా ఎంచి, నిదర్శనము కోసము ఎదురు చూస్తున్నారు.

## పతి విరోధిని

ఇంతలో ప్రధానద్వారపాలకుడు ప్రభువు సన్నిధికి వచ్చి "దేవా, ఎవతో స్త్రీ బంధువులతో, అయిదుగురు బిడ్డలతో, వివశ భర్తను బల

వంతముగా ఇక్కడికి తీసుకువచ్చింది'' అని విన్నవించినాడు. వాసవదత్తా స్వప్నము వాస్తవ మవుతున్నందుకు ఆశ్చర్యపడి వత్సరాజు వారిని లోపలికి తీసుకు రమ్మని అనుజ్ఞ ఇచ్చినాడు. తప్పక తనకు పుత్రుడు పుట్టుతాడని విశ్వాసము కలిగి వాసవదత్త సంతోషించింది. అక్కడివారు అందరూ ద్వారము కాసి కుతూహలముతో చూస్తుండగా ఆస్త్రీ భర్తతోసహా వచ్చింది; వచ్చి, రాణితో కూడా ఉన్న వత్సరాజుకు నమస్కరించి, దైన్యము నటిస్తూ "దేవా, ఈయన నాభర్త. ఏదోషమూ ఎరుగని నాకు అన్నవస్త్రాలిచ్చి పోషించడము లేదు'' అని విన్నవించింది. ఆమెభర్త "దేవా, ఈమె నిష్కారణంగా నామీద నేరము మోపుతున్నది. ఏటికి ఏడాది సరిపోయే సమస్త పదార్థాలూ తెచ్చి ఇంట్లో ఇచ్చినాను. బంధువులతో కలిసి ఈమె నన్ను తుదముట్టించాలని ఆలోచిస్తున్నది. సాక్షులున్నారు. మహా ప్రభూ!'' అని మనవి చేసినాడు. వత్సరాజు అతని వాక్కులు ఆలకించిన తర్వాత "వేరే సాక్ష్యముతో పని లేదు. స్వప్నములో స్వామివారే సెల విచ్చినారు. బంధుసమేతముగా ఈ స్త్రీశిరశ్ఛేదము చేయవలసింది'' అని ఆనతిచ్చినాడు. అప్పుడు యౌగంధరాయణుడు "దేవా, సాక్షులను పరీక్షించిన తర్వాత నిర్ణయము చేయడము సముచితము. కేవలస్వప్న వృత్తాంతాన్ని ప్రజలు విశ్వసించరు'' అని బోధించినాడు. సాక్షులను రప్పించి విచారిస్తే వారు ఆమెదాని మాటలే అసత్యమని స్పష్టముగా విన్నవించినారు. భర్తకు ద్రోహము తలపెట్టిన దౌర్భాగ్యురాలినీ దానిబిడ్డనూ, బంధువులనూ తనదేశములోనుంచి వెళ్ళగొట్టించి ఆసాధు భర్తను దయదలచి, అతడు అన్యవివాహము చేసుకోడానికి తగినంత ధనమిచ్చి రాజు అతనికి సెల విచ్చినాడు.

దుర్గతిలో ఉన్నపురుషుని దుష్టభార్య శాకివలె పీకుతుంది; సద్భార్య చెట్టునీడవలె తాపము పోగొట్టుతుంది, అని వత్సరాజు అంటే వసంతకుడు

"దేవా, మైత్రి కాని, వైరము కాని పూర్వజన్మ కర్మనుబట్టి కలుగుతూ ఉంటుంది." అని ఈకథ చెప్ప నారంభించినాడు :

## సింహపరాక్రముని కథ

విక్రమచండు డనే వారాణసీప్రభువుకు సింహపరాక్రము డనే ప్రియ సేవకు డుండేవాడు. వాడు యుద్ధములో ద్యూతములో ఎన్నడూ పరాజయము పొందలేదు. అతని భార్య కలహకారిణి సార్థకనామధేయ. కురూప, దుష్టబుద్ధి అయినప్పటికీ భార్యకు అతడు రాజుదగ్గరనుంచి కాని జూదములో గెలిచి కాని ధనము తెచ్చి ఇస్తూ ఉంటాడు. దానికి ముగ్గురుకొడుకులు. అది యెల్లప్పుడూ అతనితో కలహిస్తూనే ఉంటుంది. కొడుకులుకూడా తల్లిపక్షమే. "నీవు ఎక్కడో తింటావు, ఎక్కడో తాగుతావు. మాకు ఏమీ తెచ్చి ఇయ్యవూ" అని రోజూ పాటపాడుతుంది. కొంతకాలము ఇలా వినీ వినీ ప్రాణమువిసికి సింహపరాక్రముడు చెప్పకుండా ఒకనాడు బయలుదేరి వింధ్యవాసినీదేవిని దర్శించా లని వింధ్యాటవికి వెళ్ళినాడు. అక్కడ నిరాహారవ్రతము పూని ఉన్న అతనికి స్వప్నములో అమ్మవారు కనపడి, "వత్సా, లే. వారాణసికే వెళ్ళు. ఉన్నత వటవృక్షము కనిపిస్తుంది. దానికింద తవ్వితే నిధి కనిపిస్తుంది. గరుడమాణిక్యపాత్రిక కూడా లభిస్తుంది. దానిలోకి చూస్తే ఏజంతువు పూర్వజన్మ చరిత్ర అయినా నరే చిత్రపటరూపముగా కనిపిస్తుంది. నీపూర్వజన్మ నీభార్యపూర్వజన్మ అందులో చూచి గ్రహించి సుఖముగా ఉండు" అని ఆదేశించింది. ఉదయము భోజనము చేసుకొని సింహపరాక్రముడు క్రమముగా వారాణసి చేరి, ఉన్నత వటవృక్షము కనిపెట్టి దానికింద తవ్వి నిధి తీసుకొని మణిపాత్రిక బయటికి తీసినాడు. అందులో తనవిషయమూ తనభార్య విషయమూ చూచి, వెనకజన్మలో అది ఎలుగుగొడ్డు అనీ, తాను సింహమనీ, అందుచేతనే ఈజన్మలోకూడా

జాతివైరము తప్పలేదనీ గ్రహించి విచారము విడిచిపెట్టినాడు. అనుణి పాత్రలో చూస్తూ చివరకు సింహశ్రీ అనేపేరు గల కన్యను నిర్ధారణ చేసుకొన్నాడు. ఆమె వెనకటిజన్మలో ఆడసింగము. తమకు ఆనుకూల్యము ఉంటుందని సంతోషించి ఆమెను పెండ్లి చేసుకొని సుఖపడుతూ, మొదటిభార్యకు అన్నవస్త్రాదులకు లోపము లేకుండా సంరక్షిస్తున్నాడు. ఈవిధముగా దంపతులకు పూర్వజన్మసంబంధాన్నిబట్టి ఆనుకూల్యమో ప్రాతికూల్యమో సంభవిస్తుంది.

వసంతకుడు చెప్పిన కథ ఆకర్ణించి వాసవదత్తా వత్సరాజులు ఆనందించారు.

## మంత్రికుమారుల జననము

వత్సరాజు మంత్రులకు శుభలక్షణలక్షితులైన కుమారులు పుట్టినారు : యౌగంధరాయణునికి మరుభూతి, రుమణ్వంతునికి హరిశిఖుడు, వసంతకునికి తపంతకుడు, నిత్యోదితునికి గోముఖుడూ కలిగినారు. "వత్సరాజు పుత్రునకు వీరు మంత్రులవుతారు" అని ఆకాశవాణి అనసమయములో పలికింది.

## నరవాహనదత్త జననము

తరువాత కొన్నాళ్లకు వాసవదత్తాదేవికి నెలలు నిండినవి. సూతికాగృహమును బిడ్డలతల్లులు చిత్రచిత్రముగా అలంకరించినారు. రక్షణార్థము గవాక్షములలో జిల్లేడు, జమ్మిమండలూ ఉంచినారు. గృహములో రత్నప్రదీపములు పెట్టినారు. ఆయుధములు ఉంచినారు. మాంత్రికులు వచ్చి మంత్ర తంత్రములచేత సూతికాగృహమును భూతబాధాది భయములు లేకుండా భద్రము చేసినారు. వాసవదత్త శుభముహూర్తాన అపురుటింట్లో ప్రవేశించి, శుభక్షణములో కుమారుని

# కథాసరిత్సాగరము

(సంపుటము: 2)

## శ్రీ సోమదేవ భట్ట ప్రణీతము

(24 – 43 తరంగములు)

తల్లావఝ్ఝల శివ శంకర శాస్త్రి
తల్లావఝ్ఝల కృత్తివాస తీర్థులు
సంస్కృతము నుండి తెలిగించినది

2½ రూ

ప్రతులకు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# విషయానుక్రమణిక

[ చతుర్దారికాలంబకము ]



[ మదనమంచుకాలంబకము ]

[రత్నప్రభాలంబకము]

## చతుర్దారికా లంబకము

### తరంగము : ౨౨

మదఘూర్ణిత వక్త్రోత్థైః
సిందూరై శ్ఛురయన్ మహీమ్
హేరమ్బః పాతు వో, విఘ్నాన్
స్వతేజోభి ర్దహ న్నివ.

మదవిఘూర్ణిత మైనవదనసిందూర
రజముచే మేదిని రంజిల్లు చుండ
కాంతిని విఘ్నముల్ కాల్చుచున్నట్లు
తోచు విఘ్నేశుండు ప్రోచును మనల!

వత్సరాజూ వాసవదత్తా నరవాహనుని అల్లారుముద్దుగా పెంచు తున్నారు. కుమారుని సంరక్షణలో భయపడుతున్న ప్రభువుతో ఒక నాడు ఏకాంతముగా యౌగంధరాయణుడు ఇలా చెప్పినాడు. "దేవా! మీరు కుమారునివిషయములో ఏమీ విచారము పెట్టుకోవద్దు. ఇతడు సకల విద్యాధరచక్రవర్తి అవుతా డని కదా మహేశ్వరుడు అనుగ్ర హించినాడు! తమ విద్యాప్రభావముచేత ఈసంగతి గ్రహించి నీచ విద్యాధరులు కొంతమంది ఈర్ష్యాపరవశులై ఉన్నారు. అది తెలిసి మహేశ్వరుడు పిల్లవాని రక్షణనిమిత్తము స్తంభకుడనే గణేశుని నియ మించినాడు. ఈ విషయము నాకు నారదుడు చెప్పినాడు." మంత్రి ఇలా చెప్పుతూ ఉండగా ఆకాశమునుంచి కిరీటకుండలాలతో దివ్యపురు షుడు ఖడ్గహస్తుడై అవతరించి వత్సేశ్వరునికి ప్రణామము చేసినాడు. వత్సరాజు అతనిని "ఎవరు నీవు? ఏపనిమీాద వచ్చావు?" అని ప్రశ్నించి నాడు. ఆ దివ్యపురుషుడు ఇలా సమాధానము ఇచ్చినాడు. "నేను

పూర్వము మానవమాత్రుడనే. ఇప్పుడు విద్యాధరచక్రవర్తిని. నాకు చాలమంది శత్రువులు ఉన్నారు. నాశక్తివల్ల మాకు ముందుముందు చక్రవర్తి అయ్యే నీకొడుకును చూడాలని వచ్చాను.” ఆదివ్యపురుషుడు కాబోయే విద్యాధరచక్రవర్తిని చూచి సంతోషించినాడు. వత్సరాజు కుతూహలముతో “మిత్రుడా! విద్యాధరత్వ మంటే ఏమిటి? అది ఎలా లభిస్తుంది? నీకది ఎలా వచ్చింది?” అని ప్రశ్నలు కురిపించినాడు.

విద్యాధరుడు సమాధానముగా “రాజా! ఈజన్మలో గాని పూర్వ జన్మలో గాని శంకరుణ్ణి పూజించినవారు విద్యాధరత్వము పొందు తారు. దానికి విద్యాఖడ్గమాలలు సాధనాలు. అవి నాకెలా లభించి నవో చెప్పుతాను,” అని శక్తివేగుడు వాసవదత్తతో ఉన్న వత్స రాజుకు తనసంగతి చెప్పసాగినాడు:

## శక్తివేగుని కథ

భూలోకానికి అలంకార ప్రాయంగా ఉండే వర్ధమాన నగరములో పరోపకారి అనే పేరుతో శత్రునాశనముచేసే రాజు నివసిస్తున్నాడు. అతని భార్య కనకప్రభ. ఆమెకు కనకరేఖ అనే కుమారి జన్మించింది. కుమా రైకు క్రమేణ యౌవనము వచ్చింది. రాజు రాణీతో ఏకాంతములో “దేవీ! కనకరేఖకు వివాహము ఎపుడు అవుతుందా అని ఆరాట పడు తున్నాను. నిక్షేపము వంటి పిల్లను ఎవడో అపాత్రుడి కిస్తే ఇంకేమైనా ఉందా! చూస్తూ చూస్తూ ఎవడికో పిల్లను ఎలా ఇవ్వను? దీనికి తగిన వరుడు ఎవడు? ఈపెళ్ళి విషయము నామనస్సును పట్టి వేధిస్తున్నది” అన్నాడు. ఆమాటలకు కనకప్రభ నవ్వుతూ “పిల్లకు పెళ్ళి గిట్టదు. ఇప్పుడే కనకరేఖ ఆడుకుంటూ బొమ్మను కొడుకును చేసుకొన్నది. “అమ్మాయీ, నీపెళ్ళి కళ్ళారా ఎప్పుడు చూస్తానమ్మా!” అంటే అది “అమ్మా! నన్నెవ్వరికీ ఇయ్యవద్దు. నాకు వివాహము బ్రహ్మ రాసిపెట్ట

లేదు. నేను ఎప్పుడూ కన్యగానే ఉంటాను. బలవంతాన నాకు పెళ్ళిచేస్తే ఏనుయ్యో గొయ్యో వెతుక్కుంటాను. దీనికంతకూ కారణము ఉన్నది'' అని చెప్పింది. ఆమాట విన్నప్పటినుంచీ నాకు బెంగగా ఉంది. అందుకే మీదగ్గిరికి వచ్చాను. పెళ్ళి వద్దో అంటున్న దానికి పెళ్ళికొడుకును వెతకడం ఎందుకు ? '' అన్నది. ఈమాటలు వినేటప్పటికి రాజుకు పరమాశ్చర్యము కలిగింది.

రాజు అంతఃపురంలోకి వెళ్ళి కుమార్తెను ''అమ్మాయీ, సురాసుర కన్యలు తపస్సు చేసి వరముగా భర్తృలాభము పొందుతారు. అటువంటి భర్తృలాభము నీకు అక్కర్లేదా ?'' అని అడిగాడు. అందుకు కుమార్తె నేల చూస్తూ ''నాన్నా, నాకు ఇప్పుడు పెళ్ళి అక్కర్లేదు. మీకెందుకూ ఈవిచారం ? ఎందుకీ పట్టుదల ?'' అని ప్రశ్నించింది. రాజు ''అమ్మాయీ ! చేసినపాపాన్ని పోగొడుతుంది కన్యాదానం. బంధువరాధీనంగా ఉన్న కన్యకు స్వాతంత్ర్యము ఉన్నదా ? పుట్టింది మొదలు కన్య వరుని కోసమేగదా ? చిన్నతనంలో తప్ప, పెండ్లి లేకుండా పుట్టింట్లో ఎలా ఉంటుంది ? కన్య ఋతుమతి అయితే బంధువులంతా అధోగతి పాలవుతారు. దానిని వృషలి అంటారు. దాని భర్తను వృషలీపతి అంటారు'' అన్నాడు. అప్పుడు రాజకుమార్తె ''నాన్నా ! బ్రాహ్మడు గాని క్షత్రియుడు గాని కనకపురిని చూచిన వానికి నన్ను ఇవ్వండి. అలా అయితేనే పెళ్ళి చేసుకుంటాను.'' అని సమాధాన మిచ్చింది.

''ఇప్పటికి పెళ్ళంటే ఇష్టపడింది. ఇది ఎవరో దేవత. ఏకారణము వల్లనో నాఇంట్లో పుట్టింది. చిన్న పిల్లయినా ఇంత విశేషము ఎలా తెలుసునో ! '' అనుకున్నాడు రాజు.

మహారాజు మర్నాడు ఆస్థానంలో ''మీలో ఎవరయినా కనకపురిని చూచినవారున్నారా ? బ్రాహ్మణుడు, క్షత్రియుడు గాని దాన్ని చూచినవాడు ఉంటే అతనికి నాకుమార్తెను, యౌవరాజ్యాన్ని

ఇచ్చివేస్తాను'' అన్నాడు. అక్కడున్నవాళ్లు మొహామొహాలూ చూచుకొన్నారు. "దేవా! దానిపేరు కూడా మేము ఎప్పుడూ వినలేదు.'' అన్నారు వాళ్ళు. రాజు ప్రతీహారుని పిలిచి "నీవు ఊరంతా చాటించి కనకపురిని చూచినవాడు ఉన్నాడేమో కనుక్కో.'' అని ఆజ్ఞయిచ్చినాడు. ప్రతీహారుడు ఊరంతా తిరిగి చాటించినాడు. పౌరులు మే మెరగ మంటే మేము ఎరగ మన్నారు. కనకపురిని చూశా మన్నవాళ్ళు కంటికి కనపడ లేదు. బలదేవు డనే బ్రాహ్మణుని కుమారుడు శక్తిదేవుడు చాటింపు విన్నాడు. అతడు పయసులో ఉన్నాడు. అదివరకే ధన మంతా జూదములో పోగొట్టుకొని బైరాగిలా ఉన్నాడు. రాజు కుమార్తెను ఇస్తా డని తెలుసుకొని ఉత్సాహపడి ఆలోచించినాడు: "జూదములో రాగిదమ్మిడీ లేకుండా పోగొట్టుకొన్నాను. తండ్రి నన్ను ఇంట్లో అడుగు పెట్ట నివ్వడు. వేశ్యలు నా ముఖము చూడరు. నాకు వేరేగతి లేదు. నేను కనకపురాన్ని చూశా నని అబద్ధ మాడితే ఎలా ఉంటుంది? నేను ఆ పట్టణాన్ని చూశానో లేదో వీళ్ళకు ఏమి తెలుస్తుంది? దాన్ని ఎవరు చూచి ఉంటారు? అబద్ధ మాడి రాజపుత్రిని పొందాలి.'' శక్తిదేవుడు డప్పుల వాడితో తాను కనకపురము చూచినట్టు అబద్ధ మాడినాడు. జూదగాడికి అసాధ్య మేమి? ప్రతీహారుడు సగౌరవంగా అతన్ని రాజాస్థానానికి తీసుకొని పోయినాడు. రాజుతో కూడా వాడు అదే ప్రకారంగా అబద్ధ మాడినాడు. రాజపుత్రి ఆ బ్రాహ్మణుని ప్రశ్నించింది: "ఏమి, మీరు కనకపురం చూశారా'' అని "అవును. నేను విద్యార్థినై ఆవూరు ఆవూరు తిరుగుతూ ఆ నగరాన్ని తోవలో చూశాను.'' అన్నాడు అతడు. "ఏమార్గాన వెళ్ళారు?'' అని ఆమె ప్రశ్నించగా శక్తిదేవుడు సమాధాన మిచ్చాడు. "ఇక్కడినుంచి హార పురము, వారాణసి, పౌండ్రవర్ధనము, మీదుగా కనకపురము వెళ్ళినాను. ఆ పట్టణము అమరావతీనగరమువలె, పుణ్యా

త్ములకు భోగసీమవలె ఉన్నది. అక్కడ కొంతకాలము చదువుకొని తర్వాత ఇక్కడికి వచ్చాను. ఇదీ కనకపురం సంగతి.''

ఆ కపటుని వాక్యములు ఆమె విని "ఏమి బ్రాహ్మడా! ఏదారిని వెళ్ళావో చెప్పు. మళ్ళీ చెప్పు. అని అడిగింది. శక్తిదేవుడు గడుసుదనంగా సమాధాన మిచ్చినాడు. రాజకుమారికి ఒళ్ళుమండి అతన్ని మెడపట్టి గెంటించింది. ఆమె తండ్రి దగ్గిరికి వెళ్ళగా "ఏమమ్మా, ఆ బ్రాహ్మడి మాట నిజమేనా?'' అని రాజు అడిగినాడు. రాజపుత్రి పలికింది: "నాన్నగారూ! మీరు రాజైనప్పటికీ సంగతి చక్కగా విచారించ కుండా వ్యవహరిస్తున్నారు. ధూర్తులు, అమాయకులను వంచించడం ఎరగరా? ఆ బ్రాహ్మణుడు నన్ను మోసగించాడు. అతడు కనకపురమును చూడనే లేదు. ధూర్తులు రకరకాలుగా లోకంలో మోసములు చేస్తారు. తార్కాణంగా శివమాధవ కథ వినండి:

## శివమాధవ కథ

రత్నపురములో శివమాధవులనే ఇద్దరు జూదగాళ్ళు చాలామంది ధూర్తులను చేర దీసి, ఆపట్టణములో ఉండే ధనికుల ఆస్తిని హరించారు. ఇద్దరూ కలిసి ఉపాయము ఆలోచించినారు. "ఈఊరంతా దోచాము. ఉజ్జయినికి పోదాము. అక్కడ రాజపురోహితుడు శంకరస్వామి బాగా ధనికు డట. అతని ఇల్లు గుల్ల చేసి, మాళవస్త్రీలను చూతాము. ఆరాజపురోహితుడు రాజుగా రిచ్చే సర్వ దక్షిణలలో సగము హరిస్తా డట. ఏడు బంగారపు బిందెలు ఇంట్లో పాతిపెట్టా డట, పిల్లి కయినా పిడికెడు బిచ్చము పెట్టని పిసినిగొట్టు. ఆబ్రాహ్మణునికి ఒక కుమార్తె ఉన్న దట. ఆపిల్లకూడా ధనముతోపాటు మనచేజిక్కుతుంది.''

శివమాధవులు ఉజ్జయినీనగరము చేరినారు. మాధవుడు పరివారముతో రాజపుత్రివేషము ధరించి ఊరివెలుపల గ్రామములో ఉన్నాడు.

శివుడు యథావిధిగా బ్రహ్మచారివేషము వేసుకొని ఆనగరంలో సిప్రా నదీ తీరాన ఒక మఠములో ఉన్నాడు. అందరికీ కనపడేట్టుగా శివుడు భిక్షాభాండమూ మృగాజినమూ, దర్భలూ ఉంచుకొన్నాడు. ఉదయాన్నే సిప్రానదిలో ఒంటికి మన్నుపూసుకొని స్నానము చేసి తల కిందుగా జపము చేసి, కొంతసేపు సూర్యునికి ఎదురుగా నిలుస్తాడు. పద్మాసనము వేసి ధ్యానము చేస్తాడు. తెల్లని పువ్వులతో శివార్చన చేస్తాడు. ధ్యానవ్యాజముతో దుర్మార్గుల వృత్తులను తలపోస్తాడు. మధ్యాహ్న వేళ ఆయన భిక్షార్థియై, కృష్ణాజినం ధరించి సంచరిస్తాడు. మౌనియై, బ్రాహ్మణుల ఇళ్లల్లో బిచ్చము తెచ్చి, మూడుభాగములు చేసి కొంతభాగము కాకులకు, ఒకవంతు అభ్యాగతునికి పెట్టి మూడో భాగముతో కడుపు నింపుకొంటాడు. రాత్రి ఏకాకిగా మఠములో ఉండి మాయ తపస్సు చేస్తాడు. లోకులు అతనికి నమ్రులవుతున్నారు. అతనిపేరు అన్నివైపులా వ్యాపిస్తున్నది.

ఇంతలో ఇతని మిత్రుడు మాధవుడు చారులవల్ల సంగతి యావత్తూ తెలుసుకొని ఉజ్జయినికి వెళ్ళినాడు. దూరముగా దేవాలయములో బస చేసి రాజపుత్ర వేషంలో సిప్రానదికి స్నానానికి వచ్చాడు. స్నానము చేసి అతడు పరివారముతో దేవాలయానికి వెళ్లి శివుని పాదాలమీద వాలినాడు. లోకు లందరూ వినేట్లుగా శివునివంటి ఋషి మ రెవ్వరూ లే రని పలికినాడు. శివుడు డంభముతో సోదరుణ్ణి చూచి గంభీరముగా ఉన్నాడు. మాధవుడు ఇంటికి వెళ్ళినాడు. సోదరు లిద్దరూ రాత్రి ఒక చోట భోజనముచేసి పన్నాగము ఆలోచించినారు. నాలుగో జామున శివుడు మఠానికి వెళ్ళినాడు.

తెల్లవారగానే మాధవుడు తనతోకూడా ఉన్న జూదగాణ్ణి పిలిచి "ఈవంచెలజత తీసుకుపోయి రాజపురోహితుడు శంకరస్వామికి చదివించి ఆయనతో "ఆర్యా! మాధవు డనే రాజకుమారుడు దాయాదుల పోరు

పడలేక తండ్రి సంపాదించిన ఆస్తిని తెచ్చుకొని ఈవూళ్ళో ఉంటు న్నాడు. అతనితో మరికొందరు దక్షిణదేశమునుంచి వచ్చారు. అతడు మీరాజుదగ్గిర ఉద్యోగార్థము నన్ను మీదర్శనానికి పంపినాడు అని సవినయంగా మనవి చెయ్యి." అని నేర్పి పంపినాడు. ఆజాదగాడు సమయము చూచి పోయి ఏకాంతములో రాజపురోహితునికి కానుక సమర్పించి మాధవునిరాయబారమును నివేదించినాడు. పురోహితుడు పిసినిగొట్టు కావడమువల్ల రాయబారము అంగీకరించినాడు. లుబ్ధులను ఆకర్షించేది లంచము. మర్నాడు బాటసారుల వేషాలతో ఉన్న ధూర్తులు తన చుట్టూ కొలుస్తుండగా మాధవుడు స్వయముగా పోయి ముందుగా సేవకునివల్ల తాను వచ్చిన సంగతి తెలుపుకొని శంకరస్వామిని చూచినాడు. అతడు లేచి ఎదురుగా వచ్చి మాధవుణ్ణి గౌరవించినాడు. మాధవుడు అతనితో లోకాభి రామాయణము మాట్లాడి, సెలవు తీసుకొని వెళ్ళినాడు. మర్నాడుకూడా మాధవుడు ధోవతులజత శంకరస్వామికి కానుకపంపి స్వయముగా వెళ్ళి అతన్ని దర్శించి "ఆర్యా ! మాపరివారము చేసే నిర్బంధమువల్ల మేము సేవ కోరి మిమ్ము ఆశ్రయించాము. మాకు ధనము లేకపోలేదు. అని చెప్పి నాడు. పురోహితుడు చేతులోపడే లాభాన్ని వదులుకోవడ మెందు కని అలాగే రాజాస్థానములో ఉద్యోగము ఇప్పిస్తా నని మాట ఇచ్చినాడు. మరునాడు పురోహితుడు మాధవుణ్ణి రాజసభకు తీసుకుపోయి దర్శనము చేయించినాడు. రాజు రాజపుత్రవేషములో ఉన్న మాధవుణ్ణి ఆదరించి తనదగ్గిర ఉద్యోగము ఏర్పాటు చేసినాడు. మాధవుడు రాజసేవ చేస్తూ ఆలోచనకై శివునిదగ్గిరికి వస్తూ పోతూ ఉండేవాడు.

పురోహితుడు మాధవునికి చాకిరీ చేసి ధనము సంపాదించా లని తలచి, అతన్ని తనఇంట్లోనే ఉండ మన్నాడు. చెట్టునాశనానికి పురుగు సాయము చేసినట్లు, ధూర్తు లయిన మిత్రులతో కూడా మాధవుడు

పురోహితుని ఇంట్లో ఉంటున్నాడు. మాధవుడు మాయమాణిక్యములను బిందెలో నింపి పురోహితుని ధనాగారములో దాచిపెట్టినాడు. అప్పుడప్పుడు దాన్ని తెరిచి, బిందెలో ఉన్న మాయమాణిక్యాన్ని తీసి పురోహితునికి చూపుతూ అతని మనస్సు హరించినాడు. క్రమేణా పురోహితునికి మాధవునిమీద విశ్వాసము కలిగింది. తనమీద నమ్మకము దృఢపడగా మాధవుడు తిండితినడము క్రమంగా తగ్గించి కృశించినాడు. తనకు అగ్నిమాంద్య మనే వ్యాధి కలిగిన దని అతడు నటన చేస్తూ కొంతకాలము గడిచినతరువాత తనశయ్యాసమీపములో ఉన్న పురోహితునితో మాధవుడు హీనస్వరముతో ఇలా పలికినాడు. "నాశరీరస్థితి సక్రమంగా లేదు. ఎవరైనా బ్రాహ్మణోత్తముని పిలుచుకురా. నాకు ఇహపరసుఖాలు కావాలి. అందుకోసం నా యావదాస్తిని అతనికి అర్పణ చేస్తాను. శరీరము నశించే స్వభావము కలిగినదైనప్పుడు ధనముమీద కాంక్ష నాకేముంటుంది?" పురోహితుడు అందుకు అంగీకరించినాడు. మాధవుడు ఆనందముతో అతనికి ప్రణామము చేసినాడు. పురోహితుడు ఎంత మంచి బ్రాహ్మణ్ణి తెచ్చినా, అంతకన్న ఉత్తము డైనవాణ్ణి తెమ్మని మాధవుడు వచ్చిన బ్రాహ్మణ్ణి పంపించి వేస్తున్నాడు. అతని మిత్రు డయిన ధూర్తు డొకడు పురోహితునికి సలహా యిచ్చినాడు. "అయ్యా! సామాన్య విప్రులవల్ల ఇతనికి సంతృప్తి కలగదు. సిప్రానదీతీరాన ఉత్తమోత్తము డయిన బ్రాహ్మణుడు ఇప్పుడు ఉన్నాడో లేడో తెలిసికోవడం మంచిది. అతన్ని శివుడని పిలుస్తారు." వెంటనే మాధవుడు పురోహితునితో చెప్పి శివుణ్ణి తీసుకొని రమ్మన్నాడు.

పురోహితుడు ధ్యానమగ్నుడై ఉన్న శివుని సమీపానికి వెళ్ళినాడు. అతడు ప్రదక్షిణ నమస్కారములు చేసి సవినయముగా "స్వామీ! తమకు కోపము రాక పోతే ఒకవిన్నపము చేసుకుంటాను," అన్నాడు.

శివుడు చేయి కదులుస్తూ అందుకు అంగీకారమును చూపినాడు. పురో హితుడు ఇలా అతనికి విన్నవించుకొన్నాడు. "ఇక్కడ దాక్షిణా త్యుడు, మాధవు డనే రాజపుత్రుడు మహాధనికుడు. అతడు వ్యాధి గ్రస్తుడై ఉన్నాడు. తనయావదాస్తినీ దానము చేస్తాడు. మీరు అంగీకరిస్తే ఆ ఆస్తి మీచేతుల్లోకి వచ్చివడుతుంది." ఆమాటలు విని ఆ కపటమౌని మౌనము వదిలి "బ్రాహ్మణోత్తమా! ఏదో ఇంత భిక్షమెత్తుకొని బతికే బ్రహ్మచారికి ధనముతో నిమిత్త మేమి?" అన్నాడు. మౌని పైకి అలా ధనాపేక్ష లేనివాడివలె నటించినాడు. పురోహితుడు "అయ్యా! తమకు తెలియని విషయము ఏ మున్నది? వివాహము చేసుకొని గృహస్థులై దేవతాకార్యములు, చేస్తూ, ధనమువల్ల ధర్మార్థ కామములను సాధించడం మంచిది," అని సమాధాన మిచ్చినాడు. శివుడు "నాకు పిల్ల నిచ్చేవా రెవరు? అడ్డ మైనదాన్నీ నేను పెళ్ళిచేసుకోను." అని అంగీకారము తెలియజేసినాడు. పురోహితుడు శివుని ధనాన్ని తాను సుఖముగా అనుభవించవచ్చు నని ఆశపడి తరుణము తప్పిపో నివ్వక అతనితో "అలా అయితే నాకుమార్తె వినయస్వామిని అనే చక్కనిచుక్క ఉన్నది. ఆపిల్లను నీకు కట్టబెడతాను. మాధవుడు నీకిచ్చేధనాన్ని నేను భద్రపరుస్తాను. ఒకఇంటివాడవు కావోయి!" అన్నాడు. శివుడు పలికినాడు: "బ్రాహ్మణా, నీకు అంత కోరికగా ఉంటే, నీమాట జరుపుతాను. నేను తాపసిని. సంపదలు ఎలా ఉంటవో, వాటిముఖమైనా నాకు తెలియదు. నీచిత్తము వచ్చినట్టు చెయ్యి." పురోహితుడు సంతోషముతో బుజాలు ఎగరవేసుకొంటూ పిట్ట వలలో చిక్కిందని అనుకొన్నాడు. శివుణ్ణి అతడు ఇంటికి తీసుకు పోయి, ముహూర్తము చూసి కాళ్ళు కడిగి పిల్ల నిచ్చినాడు. శివుడు పురోహితుని మాధ్యమువల్ల అత్యాశవల్ల ఒకఇంటివా డయినాడు. పురోహితుడు కన్యాదానము చేసినతరువాత మూడోనాడు అల్లుడి

ఆస్తిని స్వీకరించ వలె ననే తలంపుతో, కపటమాంద్యముతో పడి పోయిన మాధవునిదగ్గిరికి శివుణ్ణి తీసుకుపోయినాడు. మాధవుడు శివుని పాదాలకు ప్రణామము చేసి, వెంటనే కోశాగారమునుంచి మాయ మాణిక్యరత్న రాసులతో నిండిన బిందెను తెప్పించి యథావిధిగా దానము చేసినాడు. శివుడు దానమును స్వీకరించి రాజపురోహితుని చేతిలో "నాకేమీ తెలియదు. నీకే తెలుసును." అని ఆదానద్రవ్యాన్ని ఉంచినాడు. పురోహితుడు "నీ కెందుకు; నేను ఉన్నాను గద. నేను నీఆస్తిని భద్రము చేస్తాను." అని గంభీరంగా పలికినాడు. శివుడు మాధ వుని ఆశీర్వదించి, భార్యతో శయనాగారము ప్రవేశించినాడు. రాజ పురోహితుడు మాయమాణిక్యాలతో నిండిన బిందెను తీసుకొనిపోయి తన కోశాగారములో భద్రము చేసినాడు.

మరునాడు మాధవుని కపటమాంద్యము క్రమముగా తొలగి పోయింది. శివునికి దానంచేయడంవల్ల మాధవుని మహారోగము తగ్గి పోయింది. రాజపురోహితుడు రాగానే మాధవుడు "స్వామీ! నాధర్మ కార్యానికి నీ వెంతో సహాయము చేసినావు. మహాపదనుంచి నన్ను తప్పించినావు." అంటూ స్తోత్రము చేసినాడు. "ఇతని మహిమవల్ల నారోగము తగ్గిపోయింది." అంటూ మాధవుడు శివుణ్ణి పొగడి బహి రంగంగా అతనితో స్నేహము చేస్తున్నాడు. కొన్నాళ్లు గడిచిన తరు వాత శివుడు "ఎన్నాళ్లు నీయింట్లో తినడం! నీవే నాఆభరణాలనూ మాణిక్యాలనూ ధరకు పుచ్చుకో. ఒకవేళ మాణిక్యరాసులు అమూ ల్యము లని తోస్తే నీకు తోచింది ఇచ్చి పుచ్చుకో." పురోహితుడు అల్లుని కపటనాటకము తెలిసికోకుండా తనద్రవ్య మంతాఇచ్చి మాయ మాణిక్యరాసులను కొన్నాడు. శివుడు విక్రయపత్రమును మామగారికి రాసి ఇచ్చాడు. ఆధనము తన ధనము కన్న ఎక్కువ అని గ్రహించి పురోహితుడు క్రయపత్రమును అల్లుడికి రాసి ఇచ్చాడు. ఎవరి పత్రాలు

వారు తీసుకొని ఎవరిమట్టుకు వారు వేరింటికాపరము చేస్తున్నారు. శివ మాధవులు పన్నాగమువల్ల రాజపురోహితుని ఆస్తిని యథేచ్ఛగా అనుభవిస్తున్నారు.

కొంతకాల మయిన తరవాత రాజపురోహితుడు తనదగ్గిర ఉన్న మాణిక్యరాశిలో ఒక మాణిక్యాన్నిబజారులో అమ్మివేయ యత్నించి నాడు. రత్నపరీక్షకులు మాయమాణిక్యాన్ని చూచి పురోహితునితో "ఎంత నేర్పు! ఇది మాయ మాణిక్యము! గాజుముక్కలకూ స్ఫటిక ఖండాలకు అనేకరంగులు వేసి ఇత్తడిలో పొదిగినారు. మాణిక్యాలూ కావు, బంగారమూ కాదు." అన్నారు. పురోహితునిగుండెల్లో రాయి పడ్డది. ఇంటికి వెళ్ళి ఆయన రత్నరాశిని తెచ్చి రత్నపండితులచేత పరీక్ష చేయించగా అన్నీ మాయమాణిక్యాలూ మాయరత్నాలనీ తేలింది. ఆ మాట అతని నెత్తిన అశనిపాతము పడినట్లయింది. వెంటనే ఆ వెర్రి బాగుల పురోహితుడు శివుని దగ్గిరికి వెళ్ళి, "నీ అలం కారములు నీవు పుచ్చుకొని నా సొమ్ము నాకిప్పించు." అని అడిగినాడు. శివుడు "నాదగ్గిర ధనమేది? ధనమంతా తిండీతిప్పలకు ఖర్చయిపోయింది." అని సమాధాన మిచ్చినాడు. ఇద్దరికీ వివాదము వచ్చింది. చేతులూ చేతులూ కలిసినవి. అంతటితో ఊరుకోక ఇద్దరూ రాజుదగ్గిరికి వెళ్ళి నారు. అప్పుడు మాధవుడు రాజుదగ్గిరే ఉన్నాడు. రాజపురోహితుడు "మహారాజా! వట్టిగాజుపెంకులకూ, స్ఫటికపు ముక్కలకూ రంగువేసి మాయనగలు చేయించి నాకిచ్చి, ఈ శివుడు నా ఆస్తి అంతా అనుభ వించాడు." అంటూ మొర పెట్టుకొన్నాడు. అప్పుడు శివుడు "రాజా! చిన్నతనము నుంచీ మేము సన్యాసులము. ఇతనే నన్ను బలవంతము చేసి ఆ దానమును పట్టించినాడు. నేనేమి తెలిసినవాణ్ణి కాను. అందు వల్ల అతనితో రత్నస్వరూపము నేను ఎరగను. నాకు నీవే ప్రమాణ మన్నాను. "అన్నింటికీ నేను ఉన్నాను కదా" అన్నాడు ఈయన.

అప్పుడు నేను దానమును స్వీకరించి దాన్ని ఈయన చేతుల్లోనే ఉంచాను. ఆ తరువాత దాన్ని ఈయన ఇష్టము వచ్చిన ఖరీదు ఇచ్చి పుచ్చుకొన్నాడు. ఈవ్యవహారములో మాకు కాగితాలు నిదర్శనాలు, ప్రభువులు కటాక్షించి నాకు సహాయము చేయ వేడుతున్నాను.'' అన్నాడు.

శివుని మాటలు పూర్తి కావడముతోనే మాధవుడు అన్నాడు. "నీవు ఇలా చెప్పవచ్చునా! పూజ్యుడవు. ఇందులో నాతప్పేమిటి? నేను నీవల్ల గాని, శివుని వల్లగాని ఏమీ పుచ్చుకోలేదు. నాపైతృక ధనము వారి వారి దగ్గర దాచి ఉంచాను. ఆధనాన్ని తెప్పించి శివుడికి ధారా దత్తము చేశాను. అది నిజముగా బంగారము కాకపోతే, అవి రత్న మాణిక్యాలు కాకపోతే, ఇత్తడి స్ఫటికము గాజు పెంకులూ ఇచ్చిన ఫలమే నాకు అయితే అవుతుంది! ఏ కపటమూ ఎరగక స్వచ్ఛహృదయ ముతో నేను దానమిచ్చినాను. దీర్ఘరోగముకూడా ఆదానమహిమ వల్లనే కుదిరింది. ''

రాజు మంత్రులతో పాటు నవ్వినాడు. మాధవుని సరళ హృదయా నికి సంతోషించినాడు. సభ్యులందరూ లోలోపల నవ్వుకుంటూ 'ఈవ్యవ హారములో శివుడు గాని మాధవుడు గాని చేసిన దోషమేమీ లేదు' అని చెప్పగానే పురోహితుడు తల వంచుకొని బిక్క మొగము వేసుకొని వెళ్ళినాడు. పిసినిగొట్టుకు ఆపద రాకుండా ఉండదు. దుర్మార్గు లయిన శివమాధవులు రాజానుగ్రహానికి పాత్రులై సుఖంగా కాలక్షేపము చేస్తున్నారు.

ఇలాగ లోకములో దుర్మార్గులు తమ దుస్తంత్రాలవల్ల అమాయ కులను నమ్మించి ద్రోహము చేస్తారు. నాన్నగారు! ఈబ్రాహ్మడు కనక పురము చూడకుండా అబద్ధా లాడినాడు. నాపెళ్ళికి మీరు తొందర పడకండి. నేను కన్యగానే ఉంటాను. ఏమతుందో చూతాము.'' తండ్రి

కుమార్తెతో ఇలా పలికినాడు. "అమ్మా! నీవు వయసులో ఉన్న దానివి. పెళ్ళిలేకుండా ఇలా వుండడము మంచిది కాదు. లోకము అప వాదు వేస్తే భరించలేవు. మనలో దోషము లేకపోయినా లోకులనోళ్లు మూయలేము. ముఖ్యంగా గొప్పవారి విషయాల్లో లోకులు అప వాదులు వేస్తారు. అందుకు కథ చెప్తాను.

### హారస్వామి కథ

గంగాతీరాన కుసుమపుర మనే అందమైన పట్టణములో హారస్వామి అనే సన్యాసి గంగ ఒడ్డునే పర్ణశాల నిర్మించుకొని, తపస్సు చేస్తూ లోకుల మన్ననలు పొందుతున్నాడు. ఒకనాడు అతడు భిక్షార్థము బయలు దేరుతున్నప్పుడు అతని సుగుణాలకు ఈర్ష్యపడిన దుర్మార్గుడు అందరి దగ్గిర "ఈ సన్యాసి పట్టి దొంగ. ఈ ఊళ్ళో ఉన్న పిల్లల నందరినీ ఇతనే పొట్టన పెట్టుకున్నాడు" అని అపవాదు పుట్టించాడు. మరొకమూర్ఖుడు 'అవు నవును. నేనూ అలాగే కొంతమంది అనుకుంటూ ఉంటే విన్నాను' అని పలికినాడు. మూడోవాడు దాన్ని సమర్థించినాడు. క్రమేణా ఆఅపవాదు ఊరంతా పాక్కిపోయింది. హారస్వామి పిల్లల్ని బలిఇస్తాడని ఊళ్ళోవాళ్ళు వెర్రిభయంతో కూడబలుకుకుని, ఆఖరుకు అతన్ని ఊళ్ళోనుంచి బైటికి పంపివేయా లని సిద్ధాంతము చేసినారు. ఆసన్యాసి ఎదట ప్రజలు తమ నిశ్చయాన్ని చెప్పే ధైర్యములేక కబురు పంపించారు. దూతలు వెళ్ళి దూరముగా నిలవబడి "నీవు ఈఊళ్ళో నుంచి మకాము ఎత్తివేయాలి. బ్రాహ్మ లంతా నిన్ను పొమ్మం టున్నారు." అన్నారు. హారస్వామి "ఎందుచేత?" అని ప్రశ్నించినాడు. వాళ్ళు జంకుతూ "కనపడ్డ పిల్ల లను నీవు భక్షిస్తావు. అందువల్ల ఊళ్ళో నీకు నీళ్ళుపుట్టవు. వెళ్ళిపో" అన్నారు. హారస్వామి స్వయముగా బ్రాహ్మణుల దగ్గిరికివెళ్ళి వాళ్ళ నమ్మకాన్ని పరీక్షించాలని తలచినాడు.

దగ్గిరికి సన్యాసి వస్తూ ఉంటే ప్రజలు దూర దూరముగా పోయి, కొంత మంది మఠముమీదికి ఎక్కినారు. బ్రాహ్మల్ని పిలిచి సన్యాసి "విప్రులారా! ఎందుకు మీకీ అజ్ఞానము? ఎంతమంది పిల్లల్ని నేను తిన్నానో పరస్పరము చూచు కోలేదేమి?" అని ప్రశ్నించినాడు. పిల్లలు ఎందరున్నారో అని కొందరు లెక్కచూడగా అంతా నిక్షేపంలాగ బతికే ఉన్నారు ఆబాలగోపాలము అప్పుడు "అయ్యో అనవసరముగా సన్యాసి మీద అపవాదు వేశామే" అని విచారించినారు. నిర్దోషి అని తేలగానే ఆఊరు వదిలి అతడు వెళ్ళిపోవ సంకల్పించగా ఆబాలగోపాలమూ అతని పాదాలమీద పడి క్షమించమని వేడుకొన్నారు. ఈప్రకారంగా గొప్పవారిమీద అల్పులు అపవాదు వేస్తారు.

అమ్మాయీ, నీవు చిన్నదానివి. లోక విషయము ఎరగనిదానివి. పెళ్ళిచేసుకోవడము చాలా ఉచితము." ఇలా చెప్పగా కుమారి కనకరేఖ దృఢ చిత్తముతో "బ్రాహ్మడు గాని క్షత్రియుడు గాని ఎవడు కనకపురం చూచాడో వాడే నాభర్త" అని పలికింది. తండ్రి కుమార్తెకు పూర్వజన్మ జ్ఞానము కలదని తెలుసుకొని వరుణ్ణి కుదర్చవలె నని అన్ని దేశాలలో చాటింపు చేయించినాడు. దేశదేశాల చాటింపు చేయించినా కనకరేఖకు భర్త దొరకలేదు.

## తరంగము : 2

శక్తిదేవుడు ఇలా ఆలోచన చేసినాడు : "రాజపుత్రి నన్ను అవమానించింది. కనకపురము చూచా నని అబద్ధ మాడినప్పటికీ రాజకన్య మాత్రము లభించ లేదు. ఆ పిల్లను ఎలా గయినా చేపట్టాలి. ప్రపంచమంతా గాలించి ఆ కనకపురాన్ని చూడాలి. చూసి తీరాలి. ప్రాణాలైనా వదలాలి! ఆ పిల్లను పెళ్ళి చేసుకోనిదే నా జన్మ ఎందుకు?" ఇలా ప్రతిజ్ఞ చేసి అతడు వర్ధమానపురము వదిలి, వింధ్యారణ్యము ప్రవేశించి

తిరిగి తిరిగి చల్లని సరస్సు చేరినాడు. తెల్లతామర పువ్వులతో, హంస లతో ఉన్న ఆ సరస్సులో అతడు స్నానాదికము చేసి, ఫలపుష్పభరిత మైన ఆశ్రమానికి పోయి సూర్యతపసు డనే వృద్ధ సన్యాసిని చూచి నాడు. శక్తిదేవుడు అతనికి నమస్కారము చేసి అతిథి సత్కారములు పొందినాడు. ఆ సన్యాసి "ఎవరు నీవు? ఎక్కడికి పోతున్నావు? చెప్పు" అని శక్తిదేవుణ్ణి అడిగినాడు. "స్వామీ! నేను కనకపురము వెళ్ళాలి. వర్ధమానపురం నుంచి వస్తున్నాను. కనకపురము ఎక్కడ ఉన్నదో తెలియదు. తమకు తెలిస్తే చెప్పండి" అని సవినయముగా అతడు సన్యాసిని కోరినాడు. సన్యాసి "నేను ఎనిమిదివందలసంవత్సరాల నుంచీ ఇక్కడ ఉంటున్నాను. నే నెప్పుడూ ఆ పేరు వినలేదు." అన్నాడు. శక్తిదేవుడికి కళ్ళ నీళ్ళ పర్యంత మయింది. "స్వామీ, అలా అయితే నేను భూమి యావత్తూ తిరిగి ఇక్కడ చనిపోతాను" అని సమాధాన మిచ్చినాడు. అప్పుడు మునీంద్రుడు సంగతి తెలుసుకొని అతనితో "నీ వలా నిశ్చయించుకొంటే, నేను చెప్పినట్లు చెయ్యాలి. ఇక్కడికి చాలాదూరములో కాంపిల్యదేశములో ఉత్తర పర్వతమని ఉన్నది. ఆ పర్వతముమీద ఆశ్రమములో మాఅన్న దీర్ఘతపసుడు ఉన్నాడు. ఆయన దగ్గిరికి వెళ్ళి కనకపురము ఎక్కడ ఉన్నదో తెలుసుకో." అన్నాడు.

శక్తిదేవుడు ఆశతో అక్కడ ఆరాత్రి గడిపి మరునాడు బయలుదేరి కష్టాలు పడుతూ కాంపిల్యదేశంలో దీర్ఘ తపసుని ఆశ్రమ వాటి చేరి నాడు. ఆ మునీంద్రుడు అతన్ని సత్కరించినాడు. శక్తిదేవుడు "స్వామీ, నేను కనకపురమును చూడా లని వచ్చాను. ఆ పట్టణము ఎక్కడ ఉన్నదో తమవల్ల తెలుసుకో మని మీ సోదరుడు సూర్యతప సుడు సలహా ఇచ్చినాడు." అని మనవి చేసుకొన్నాడు.

అప్పుడు దీర్ఘతపసుడు ఇలా చెప్పినాడు: "అబ్బాయి, కనకపుర మనే

ఊరు ఉన్నదని నీ వల్ల తెలిసింది. దేశాంతరవాసులతో నాకు చాలా పరిచయము ఉన్నది. బహుశః ఆ పురము ఏ ద్వీపములోనో ఉంటుంది. నేను ఉపాయము చెపుతాను. సముద్రమధ్యములో ఉత్థ్సల ద్వీపమున్నది. ఆలంకలో ధనికు డైన సత్యవ్రతు డనే పల్లెదొర ఉన్నాడు. అత డెప్పుడూ లంకలతో వ్యాపారము చేస్తూ ఉంటాడు. బహుశః అతనికి కనకపురము తెలిస్తే తెలియవచ్చును. మొదట నీవు సముద్ర తీరాన ఉన్న విటంక పురము వెళ్ళు. అక్కడ ఏవర్తకుడితోనో స్నేహము చేసి సత్యవ్రతు డున్న ద్వీపానికి వెళ్ళు. నీ అభీష్టము నెర వేరుతుంది."

దీర్ఘతపసుని మాటలు విని ఆ ప్రకారముగా శక్తిదేవుడు చాలా దూరము నడిచి విటంకపురము చేరినాడు. అక్కడనుంచి ఒకవర్తకుడు ఉత్థ్సల ద్వీపానికి వెళుతుండగా శక్తిదేవుడు అతనితో స్నేహము చేసి, దారి బత్తెము కూడా పుచ్చుకుని సముద్రప్రయాణము చేసినాడు. ఈ లోగా భయంకరమైన తుపానుగాలి చెలరేగింది. సముద్రము ఘూర్ణిల్లింది. క్షణములో నావ పైకి లేచి పడి బద్ద లయింది. వర్తకుడు నీళ్ళల్లో ఒకచెక్క సహాయముతో ఈదుకుంటూ పోయి, ఓడ దొరకగా బతికినాడు. పడవలోనుంచి పడుతున్న శక్తిదేవుణ్ణి పెద్దచేప దిగమింగి స్వేచ్ఛగా సముద్రములో ఈదుకొంటూ ఉత్థ్సలద్వీప తీరము చేరింది. పల్లెదొరలు ఆ పెద్ద చేపను చూచి ఆశ్చర్యపడి తమదొర దగ్గిరికి దాన్ని తీసుకు పోయినారు. ఆదొరలు కుతూహలముతో చేపను కోయగా శక్తిదేవుడు లేచినాడు. అతడు సత్యవ్రతునికి నమస్కారము చేయగా సత్యవ్రతుడు "బ్రాహ్మణోత్తమా, ఎవరు నీవు? ఈ చేపకడుపులో ఎందుకున్నావు? నీ వృత్తాంతము అద్భుతముగా ఉన్నది." అన్నాడు.

"శక్తిదేవుడు అయ్యా, నేను బ్రాహ్మణ్ణి. మావూరు వర్ధమాన

నగరము. కనకపురము వెళ్ళవలసి తిరిగి తిరిగి దీర్ఘతపసుని ఆశ్రమము చేరి, నేను వెళ్ళవలసిన మార్గము అడిగినాను. ఉత్స్థలద్వీపాధిపతి అయిన సత్యవ్రతునకు కనకపుర మార్గము తెలుస్తుంది అని చెప్పగా ఓడలో ప్రయాణము చేస్తున్నప్పుడు తుపానుగాలికి పడవ బద్దలైంది. పడవలో నుంచి నేను పడుతూండగా ఈపెద్దచేప నన్ను మింగింది. ఈమత్స్య సహాయమువల్ల యీద్వీపానికి రాగలిగినాను." అన్నాడు. "నేనే సత్యవ్రతుణ్ణి. ఇది నా ద్వీపమే. నేనూ కనకపురము ఎప్పుడూ చూడలేదు. పేరు మాత్రము ద్వీపాంతరాలలో విని ఉన్నాను. బ్రాహ్మడా, చింతించకు, తెల్లవారగానే నీకోరిక నెరవేరుస్తాను. ఏదయినా ఉపాయము ఆలోచిస్తాను." అంటూ సత్యవ్రతుడు శక్తిదేవుణ్ణి ఓదార్చినాడు. శక్తిదేవుడు మఠానికి వెళ్ళగా విష్ణుదత్తుడనే విప్రుడు అతనికి అతిథి సత్కారములు చేసినాడు. అతనితో మాటల సందర్భములో శక్తిదేవుడు తనసంగతి పూసగుచ్చినట్టు చెప్పినాడు. విష్ణుదత్తుడు అతన్ని చప్పున ఆలింగనము చేసుకొని ఆనందబాష్పాలతో "ఆహా! మా మామయ్యకొడుకువు నీవు! మన మంతా ఒకగడ్డలో పుట్టాము. నేను బాల్యములోనే ఈ ద్వీపము చేరినాను. నువ్విక్కడే ఉండు. ద్వీపాంతరాలనుంచి వచ్చే వర్తకులవల్ల కనకపురము ఎక్కడ ఉన్నదో తెలుసుకొందాము. అప్పుడు నీ కోరిక నెరవేరకపోదు." అని ఉపశమన వాక్యాలు పలికినాడు. శక్తిదేవుడు మార్గాయాసము మరిచి మహానందము పొందినాడు. కార్యసిద్ధి సమీపిస్తున్న దని తలచినాడు. రాత్రి నిద్రలేక, తన అభీష్టాన్నే చింతిస్తున్న శక్తిదేవునికి వినోదార్థముగా విష్ణుదత్తుడు కథ చెప్పుతున్నాడు:

## అశోకదత్త విజయదత్తుల కథ

పూర్వము కాళిందీతీరాన ఒక అగ్రహారములో గోవిందస్వామి అనే సద్బ్రాహ్మణునికి అశోకదత్తు విజయదత్తు అని ఇద్దరు కుమారులు

కలిగినారు. ఒకప్పుడు కరువురాగా గోవిందస్వామి భార్యతో "క్షామము వల్ల దేశము పాడయింది. బంధుమిత్రులు అన్నములేక కాటికి పోతుంటే కళ్ళతో చూడలేను. మన కున్న ధాన్యము బంధువులకు ఇచ్చి ఈ దేశము వదిలిపోదాము. సకుటుంబముగా కాశీలో ఉందాము." అన్నాడు. సకుటుంబముగా భార్యాభర్తలు కాశీ వెళుతుంటే తోవలో ఒక యోగి కనపడగా అతన్ని తమకుమాళ్ల శుభాశుభములు అడిగినాడు. అప్పుడా యోగి "బ్రాహ్మణోత్తమా! నీకుమాళ్ళకు శుభమే. అయితే నీకూ నీ రెండో కొడుకూ ఎడబాటు కలుగుతుంది. మీ పెద్దవాడిమహిమ వల్ల నీ రెండో కొడుకూ నీవూ మళ్ళీ కలుసుకొంటారు." అని జరగబోయే విషయాలు చెప్పినాడు. గోవిందస్వామి కష్టసుఖాలకు లోనై యోగీశ్వరుని దగ్గిర సెలవు తీసుకొని కాశీ వెళుతున్నాడు. భార్యాభర్తలు కాశీపురము వెలువల చండీదేవాలయములో మధ్యాహ్నము విశ్రమించి సంజవేళ తక్కిన యాత్రీకులతో పాటు, చెట్టుకింద మకాము చేసినారు.

రాత్రి యాత్రికులు ఆకూ అలమూ ఏరి శయ్యలుగా పరుచుకొని బడలికవల్ల నిద్రించినారు. గోవిందస్వామి రెండో కొడుకుకు శీతజ్వరము తగిలింది. దానివల్ల వాడికంటికి కునుకు లేదు. వాడిశరీరము వణికి పోయింది. వల్లమాలినచలి వచ్చేప్పటికి వాడు, గోవిందస్వామితో "నాన్నా, ఈచలికి బతకను. చితుకులు నాలుగు ఏరి చలిమంట వెయ్యాలి." అని వేడుకొన్నాడు. నిప్పు ఎక్కణ్ణించి వస్తుంది? అప్పుడు కుర్రవాడు "నాన్నా, ఈదగ్గిరలో మంటలు కనపడుతున్నవి. వెడదామా?" అన్నాడు. "అబ్బాయీ! శవమో తగలబడుతున్నది. లేకపోతే ఏభూతాలో కొరివిదయ్యాలో నిప్పులు గక్కుతున్నవి. పిశాచాలు ఉండే ప్రదేశానికి ఎలా పోతావు నాయనా?" అంటూ గోవిందస్వామి ఏమీ తోచకుండా లోలోపల మథనపడుతున్నాడు. కుమారుడు "నాన్నా! క్షుద్రపిశాచాలు నన్నేమి చేయగలవు? నా

కేమైనా శక్తి లేదనుకొన్నావా? వంటినిండా బల మున్నది." అంటూ జ్వర తీవ్రతలో కోపంతో అన్నాడు. తండ్రి కుమారుణ్ణి శ్మశానభూమి దగ్గిరికి తీసుకుపోయినాడు. మంటసమీపానికి వెళ్లి పిల్లవాడు చలికాచు కొంటూ తండ్రితో "నాన్నా, ఈమంటలో గుండ్రంగా కనబడే దేమిటి?" అని కుతూహలముతో ప్రశ్నించినాడు. "అబ్బాయీ! అది మనిషి పుర్రె! కాలుతున్నదిరా!" అన్నాడు తండ్రి. మండుతున్న కొరకంచుతో గోవిందస్వామి శవకపాలమును పగులగొట్టినాడు. వెంటనే కపాలములో నుంచి వస అతనినోటిలో పడింది. ఆకుఱ్ఱవాడు దాన్ని రుచి చూచిన తక్షణమే భీకరాకారుడయిన రాక్షసుడైనాడు. అతని వెంట్రుకలు నిక్కబొడుచుకొని ఊర్ధ్వముఖములుగా ఉన్నవి. అతను వసను నాలుకతో నాకుతునే పుర్రెను చేతులో ఉంచుకొన్నాడు. కొంతసేపటికి ఖడ్గహస్తుడై వాడు తండ్రిని నరకబోయినాడు. "దేవా! కపాలస్ఫోటా! కత్తి ఎత్తకు. ఆయన నీతండ్రి. ఇలా రా" అంటూ శబ్దము వినపడింది. గోవిందస్వామి పుత్రుడు కపాలస్ఫోటు డనే పేరుతో రాక్షసుడై క్షణంలో అదృశ్యుడైనాడు. కొడుకు పోగానే తండ్రి కుమిలిపోతూ చండీదేవాలయముచేరి భార్యకూ పెద్దకుమారుడికీ జరిగిన విషయము చెప్పినాడు.

దేవీపూజార్థము వచ్చిన యాత్రికసమూహము ఆభార్యాభర్తల పుత్రశోకము కనలేక వినలేక, కనిపెంచిన వాళ్ళతో సమంగా కన్నీరు మున్నీరుగా దుఃఖించింది. ఆసమయములో దేవీపూజకు వచ్చిన ధనికుడు సముద్రదత్తు డనేపర్తకుడు, దంపతులను చూచి కనికరించి తనఇంటికి తీసుకొనిపోయి కంటికి రెప్పవలె కాపాడినాడు. గోవిందస్వామి తోవలో యోగి చెప్పినమాటలు స్మృతికి తెచ్చుకొని పోయినకొడుకు లభిస్తాడనే ఆశతో ధైర్యము చిక్కబట్టినాడు. సముద్రదత్తుడు ఆదంపతులకు తన ఇంట్లోనే నివాసము ఏర్పాటు చేసినాడు.

పెద్దకుమారుడు అశోకదత్తుడు యువకుడై చదువులు నేర్చి, సాములో సమర్థుడైనాడు. ప్రపంచములో మల్లయోధుడు ఎవడూ అతన్ని చిత్తు చేయలేడు. ఒకసారి దేవీ పూజాసందర్భములో దక్షిణదేశమునుంచి ఒకమల్లుడు వచ్చి, కాశీరాజు ప్రతాపముకుటుని సమక్షములో తక్కిన వస్తాదుల నందరినీ ఓడించినాడు. అశోకదత్తుడు ఆకొత్త వస్తాదుతో సవాలుచేసి వాణ్ణి చిత్తుచేయగా అందరూ అశోకదత్తుణ్ణి అపరిమితముగా ప్రశంసించినారు. మహారాజు తలుచుకొంటే మహైశ్వర్యము రావడములో ఆశ్చర్య మేముంది? రాజు అతనికి తనసింహాసనము పక్కగా ఉచితాసన మిచ్చి గౌరవించినాడు.

ఒకనాడు మహారాజు ఊరి కవతల శివాలయములో అర్చన చేసి, శ్మశాన సమీపముగా నడుస్తున్నప్పుడు వల్లకాటిలో ఈ మొర దీనముగా అతని చెవులపడింది: "ప్రభూ! నేను ఏదోషమూ చేయనిదే న్యాయాధికారి నామీద నేరారోపణ చేసి నన్ను కొరతను వేయించినాడు. నేను పాపిని. మూడురోజులనుంచీ జీవుడు శరీరములోనుంచి లేచిపోవడము లేదు. అమితముగా దాహము వేస్తున్నది. మంచితీర్థము ఇప్పించండి ప్రభూ!" రాజు కనికరించి అశోకదత్తునితో చెప్పి మంచినీళ్ళు పంపినాడు. అశోకదత్తుడు చీకటిలో శ్మశానానికి వెళ్ళి "ఎవరు మంచినీళ్ళు అడిగినవారు?" అని గట్టిగా కేక వేసినాడు. 'నేను' అని ముక్తసరిగా సమాధానము వచ్చింది. ఆధ్వనినిబట్టి చితిమంట దగ్గిరికి అతడు వెళ్ళి చూడగా కొరతనున్న పురుషుని సమీపాన సర్వాభరణ భూషిత, సర్వాంగసుందరి అయిన రమణి కన్నీరు మున్నీరుగా ఏడుస్తున్నది. అశోకదత్తుడు ఆమెను "ఎవరమ్మా నీవు? ఏడుస్తావేం?" అన అడిగినాడు. ఆమెఇలా సమాధాన మిచ్చింది: "అయ్యా! కొరతలో ఉన్న ఈ నిర్భాగ్యుడు నాభర్త. నేను నిర్భాగ్యను. ఇతనితో కూడా సహగమనము చేతామని నిశ్చయము చేసుకొని ఇక్కడ ఉన్నాను. నాభర్తప్రాణము

పోయి, బాధ ఎప్పుడు పోతుందో అని కనిపెట్టుకొన్నాను. ఇప్పటి కి మూన్నాళ్ళయింది. మాటిమాటికీ నాభర్త దాహము అడుగుతున్నాడు. దాహము తెచ్చాను. కొరత ఎత్తుగా ఉండడంవల్ల దాహము అతని నోటికి అందించ లేక పోతున్నాను.'' అశోకదత్తుడు "రాజు నీభర్త కోసము దాహము పంపినాడు. ఇదిగో జలము. నావీపుమీద నీవు నిలిచి అతని నోటిలో మంచినీరు పొయ్యి.'' అనగానే ఆమె అతనివీపుమీద నిలబడింది. క్షణములో నేలమీదా, అతనివీపుమీదా నెత్తురుచుక్కలు రాలడము మొదలు పెట్టినవి. అశోకదత్తుడు ధైర్యముతో ముఖము పైకెత్తి చూడగా ఆమె కొరతమీదవున్న పురుషుణ్ణి పదేపదే చుర కత్తితో కోసి, అతని మాంసము భక్షిస్తున్నది. ఆమె పిశాచమేమో అని అతడు తలచి వెంటనే నేలమీద పడవేసి దాన్ని కొట్టబోగా కాలి అందెమాత్రము అతనిచేతిలో చిక్కింది. ఆమె కనబడకుండా వెళ్ళి పోయింది. అశోకదత్తుడు ఆపిశాచిని స్మరిస్తూ, అందెను చూచి ఆశ్చ ర్యముపొంది శ్మశానమునుంచి ఇంటికి వచ్చినాడు.

మర్నాడు ఉదయమే అశోకదత్తుడు స్నానాదికము పూర్తిచేసు కొని రాజాస్థానానికి వెళ్ళి రాత్రి శ్మశాన వాటికలో జరిగిన విషయ మంతా పూసగుచ్చినట్టు రాజుకు విన్నవించి తన చేచిక్కిన కాలి అందెను రాజుకు అర్పించగా రాజు రాణీకి ఇచ్చి అది ఎలా లభ్యమై నదో సవిస్తరముగా చెప్పినాడు. అశోకదత్తుడు అసాధారణ శౌర్య సంపన్నుడని రాజు గ్రహించి భార్యతో "ఇతను జాతి మాత్రాన్నే కాక విద్య, సత్యసంధత్వము రూపముచేతకూడా అందరికన్న గొప్పవాడు. మన అమ్మాయిని అనంగలేఖను అశోకదత్తునికి ఇచ్చి వివాహము చేస్తే బాగుటుంది. వరుడు ధనవంతు డయిన మాత్రాన పనికిరాడు. ఇతను మహావీరుడు. ఇతను మన అల్లుడు కావడము యుక్తము'' అని తన అభిప్రాయము చెప్పినాడు. ఆమాటలకు రాణి అన్నది: "నాథా నంబం

ధము మంచిది. ఇతనే అమ్మాయికి అనుకూలమైనవాడు. అమ్మాయి ఇతన్ని ఒకసారి మధువనములో చూచింది. అప్పటినుంచి దానికి ఇతని మీద అనురాగము అంకురించి అధికమవుతున్నది. అమ్మాయి తిండీ తిప్పలు లేక నిద్రమాని బెంగగా ఉంటున్నది. పిల్లసంగతి నాకు తెలిసి కర్తవ్యము ఆలోచిస్తూ నిద్రపోయినాను. కలలో దేవతాస్త్రీ కనబడి అనంగలేఖను అన్యులకు ఇవ్వకు. మీ అమ్మాయి అశోకదత్తుని పూర్వజన్మలో భార్య'' అన్నది. కలలో మాటస్మరిస్తూ తెల్లవారు జామున లేచి అమ్మాయి దగ్గిరికి వెళ్ళి ఓదార్చినాను'' రాణీమాటలు విని రాజు సంతోషించి అశోకదత్తునికి అనంగలేఖ నిచ్చి అఖండ వైభవముతో పెళ్ళిచేసినాడు. ఆవధూవరులకూడిమి లక్ష్మీవినయముల కూడికవలె వున్నది.

ఒకనాడు దేవి రాజుతో "అశోకదత్తుడు తెచ్చిన అందె కాంతి వంతముగా లేదు. పోనీ మరొక అందె చేయిస్తే బాగుంటుంది'' అన్నది. రాజు కంసాలులను పిలిపించి అందె చేయమని ఆజ్ఞాపించినాడు. అందుకు వాళ్ళు "ప్రభూ! ఇలాంటి కాలి అందెను మేము చెయ్యలేము. ప్రపంచములో ఎక్కడా ఇటువంటి దివ్యశిల్పము కనబడదు. మనుష్యులెవ్వరూ ఈఅందెను చెయ్యలేరు. ఇది ఎక్కడ దొరికిందో అక్కడే రెండో అందెకూడా దొరుకుతుందేమో వెతకండి'' అని మనవి చేసుకొన్నారు. రాజూ రాణీ అందె ఎలా లభిస్తుందని విచారిస్తున్నప్పుడు అశోకదత్తుడు వెంటనే "దీనిజత అందెను నేనే తెస్తాను'' అని శపథము చేసినాడు. రాజు అల్లుడి సాహసానికి సంతోషించడమే కాకుండా ప్రేమ వల్ల జంకి నాడు కూడా. ఆరాత్రి అశోకదత్తుడు శ్మశానభూమికి వెళ్ళి ఎంత వెతికినా అతనికి పూర్వము కనపడినస్త్రీ అగపడలేదు. కాలి అందెను పొందడానికి మాంసవిక్రయమే ఉపాయముగా తలచి చెట్టుకు వేలాడుతున్న శవాన్ని మోసుకొని తిరుగుతూ "మాంసము మాంసము. కావలసిన

వారు కొనండి" అని అరుస్తున్నాడు. క్షణములో దూరాన్నుంచి "వీరుడా మాంసము తీసుకురా" అని కేక వినవడింది. ఆపిలుపును బట్టి అశోకదత్తుడు వెళ్ళి వృక్షము క్రింద దివ్యరూపమును చూచినాడు. ఆమె చుట్టూ స్త్రీలు కూర్చున్నారు. రత్నాభరణాలతో ఆదివ్యస్త్రీ ప్రకాశిస్తున్నది. "మనుష్యమాంసము కావాలా?" అని అతను అడిగినాడు "ఎంతకిస్తావు?" అన్నది ఆమె. ఆవీరుడు భుజము మీదా వీపు మీదా శవాన్ని కుదురుగా నిలుపుకొని తనచేతిలో ఉన్న అందెను చూపి "ఈఅందెకు జత అందె నాకు ఎవరిస్తే వారికి ఈమాంసాన్ని అమ్ముతాను" అన్నాడు. "నీచేతిలో అందె నాకాలిదే. అదివరకు నీకు కనవడిన దాన్ని నేనే. ఇప్పుడు రూపమును మార్చుకొన్నాను. అందువల్ల నీవు నన్ను గుర్తించలేక పోయినావు. మాంస విక్రయముతో పనేమిటి? నేను చెప్పిన పని నీవు చేస్తే కాలి అందె ఇస్తాను" అన్నది ఆమె. అశోకదత్తుడు "తప్పకుండా నీవు చెప్పినట్టు చేస్తా" నని సమాధాన మిచ్చాడు.

ఆమె "వీరుడా! హిమాలయ పర్వతాలలో త్రిఘంటపురములో లంబజిహ్వు డనేరాక్షసరాజు నాభర్త. నాపేరు విద్యుచ్ఛిఖ. ఏ రూపము కావాలంటే, ఆ రూపాన్ని తెప్పించుకోగలను. నాకు ఆడపిల్ల పుట్టినతరువాత కపాలస్ఫోటు డనేవాడిచేతుల్లో నాభర్త మరణించినాడు. ఆయన రాక్షసపురాన్ని నాకు ఇచ్చినాడు. అప్పటనుంచీ కూతుర్ని పెట్టుకొని కాలక్షేపము చేస్తున్నాను. నాకూతురికి యౌవనము రాగా వరుడికోసం వెతుకుతున్నాను. ఆరాత్రి నీవు రాజుతోకూడా ఈ తోవనే పోతున్నప్పుడు, నీవు పడుచువాడ వనీ, సాహసికుడ వనీ, ఉత్తముడవనీ, నాకు అల్లుడు కాదగినవాడ వనీ తలచి ఉపాయము ఆలోచించినాను. శూలముమీద పురుషుని మొర అనేనెపముమీద నీచేత శ్మశానంలోకి మంచినీళ్లు తెప్పించినాను. మాయవేషాలు వేసి నిన్ను మోసగించాను. మళ్ళీ నిన్ను ఆకర్షించా లని నాకాలిఅందె ఒకటి

మాత్రము నీకు వదిలి అదృశ్యురాల నైనాను. నీవు మాయింటికి వచ్చి మాఅమ్మాయిని పెళ్ళిచేసుకో." అన్నది. ఆరాక్షసిమాటలకు అశోక దత్తుడు సంతోషించి ఆకాశమార్గాన దానివెంట హిమవత్పర్వత శిఖర మున ఉన్నపట్టణము ప్రవేశించి రాక్షసకన్య విద్యుత్ప్రభను పెళ్లి చేసు కొన్నాడు. అక్కడ కొంతకాలముప్రియురాలితో సుఖముగా ఉన్నాడు.

ఒకనాడు ఆమెతో "నాకు కాలిఅందె కావాలి. నేను ఇప్పుడు కాశీ నగరము వెళ్ళాలి. కాశీరాజు సమక్షములో రెండోఅందె తీసుకొని వస్తా నని శపథము చేసి వచ్చాను," అన్నాడు. అప్పు డామె పాద నూపురాన్నీ బంగారుతామరనూ ఇవ్వగా అతడు అవిస్వీకరించి రాక్షసీ మహిమాతిశయమువల్ల ఆకాశమార్గమున స్మశానవాటికకు వచ్చినాడు. ఆమె పూర్వమువలెనే చెట్టుకింద నిలిచి అతనితో "నేను ఎప్పుడూ కృష్ణచతుర్దశీరాత్రి వేళ ఇక్కడికి వస్తాను. నన్ను ఈ మర్రిచెట్టుదగ్గిరే చూడగలవు." అని చెప్పింది. అశోకదత్తుడు సరే అని చెప్పి, తండ్రి దగ్గిరికి వెళ్ళి, కుమారు లిద్దరూ చనిపోయా రని విలపిస్తున్న తండ్రిని ఓదార్చినాడు. తన హఠాదాగమనముచేత తల్లినీ తండ్రినీ ఆనందపర వశులను చేసినాడు. మామ ప్రతాపముకుటుడు అల్లునిశక్తిసామర్థ్యా లకు సంతోషించి పులకించిన బాహువులతో చాలాసేపు అశోకదత్తుణ్ణి ఆలింగనము చేసుకొన్నాడు. అశోకదత్తుడు రాజమందిరానికి వెళ్ళి కాలిఅందెనూ, బంగారు తామరనూ రాజుకు అర్పించి, అడిగినవారి కుతూహలము తీర్చడానికి వీనులవిందుగా జరిగిన దంతా చెప్పినాడు. రాజదంపతులు అల్లునివల్ల కృతార్థుల మైనామని సంతోషించినారు.

మర్నాడు రాజు తాను కట్టించిన దేవాలయములో అల్లుడు తెచ్చిన బంగారు తామరను ఒక వెండిచెంబు మీద ఉంచినాడు. శివ భక్తి పరు డయిన ఆ మహారాజు భక్తిరసావేశమువల్ల ఆనందాశ్రు వులతో "విభూతిచే తెల్లనైన మహేశ్వరుడు, ఎర్రని జటాజూటముతో

ఉన్నట్లు, ఈ కలశము బంగారుతామరతో ప్రకాశిస్తున్నది. ఇటువంటి బంగారు పద్మము ఇంకొకటి కూడా దొరికితే రెండవ కలశము మీద ఉంచేవాణ్ణి'' అని పలికినాడు. అశోకదత్తుడు మామగారి కోరిక తీర్చ డానికి రెండవ కమలము తీసుకొని వస్తా నన్నాడు. రాజు "నీ సాహ సము చాలు. నాకు రెండో కమలము అక్కర్లేదు'' అన్నాడు. అయినా సరే తెస్తా నని అశోకదత్తుడు ఉత్సాహపడుతుండగా కృష్ణ చతుర్దశి వచ్చింది. భార్య రాత్రివేళ నిద్రిస్తున్న సమయము చూచి అతడు ఇల్లు వదిలి శ్మశానానికి వెళ్ళినాడు. అక్కడ మర్రిచెట్టుకింద అశోకదత్తుని కోసము రాక్షసి అయిన అత్త ఎదురు చూస్తూ ఉన్నది. అల్లుడు రాగానే అతన్ని ఆమె ఆప్యాయంగా కుశలప్రశ్నలు వేసింది. అనంతరము వారిద్దరూ హిమపర్వత శిఖరమున రాక్షసపురానికి వెళ్ళి నారు. అశోకదత్తుడు భార్యతో కొన్నాళ్ళపాటు కాపురము చేసినాడు. ఒకరోజున అతడు "నాకు రెండో బంగారు కమలము కావాలి'' అని అత్తగారిని అడిగినాడు. అత్తగారు "ఇంకెక్కడి కమలాలు? ఇక్కడే కపాలస్ఫోటుని సరస్సు ఉన్నది. అందులో బంగారు పద్మాలు మొలు స్తవి. ఆ పద్మాలలో ఒకటి తీసి మా ప్రభువు నా భర్తకు ఇచ్చినాడు.'' అన్నది. అశోకదత్తుడు ఆ సరస్సును చూపించ మన్నాడు. "వీలు లేదు. రాక్షసులు ఆ సరస్సును కాపాడుతున్నారు. నీవు తెచ్చుకోలేవు'' అని ఆమె చెప్పింది. అశోకదత్తుడు పట్టినపట్టు వదలలేదు. ఆమె అల్లు డికి దూరాన్నుంచి సరస్సును చూపించింది.

ఆదివ్య సరోవరము ఆకాశాన్ని అంటే పర్వతసానువుల మీద ఉన్నది. బంగారు పద్మాలు సర స్సంతా కమ్ముకొని సూర్యకాంతి వల్ల దేదీప్యమానంగా ఉన్నవి. అశోకదత్తుడు పద్మాన్ని కోసేటప్ప టికి సాయుధు లైన రాక్షసులు వచ్చి అతన్ని ఆటంకము చేసినారు. అతడు ఆరాక్షసు లందరినీ వధించినాడు. చావు తప్పి కన్ను లొట్ట

పోయి కొందరు రాక్షసులు పారిపోయి కపాలస్ఫోటు డనే రాక్షస రాజుకు నివేదించినారు. ఆ రాజు స్వయంగా వచ్చి తామర పువ్వులు కొల్లలుగా కోస్తున్న అశోకదత్తుని చూచి, "మాఅన్న అశోకదత్తు ఇక్కడికి వచ్చేడే!" అని ఆశ్చర్యపడి ఆనవాలుపట్టి, శస్త్రము దూరంగా పారేసి, ఆనంద బాష్పాలు కపోలాలపైన ప్రవిస్తుండగా అన్న కాళ్ళమీద పడి "నేను విజయదత్తుడను నీసోదరుణ్ణి. మన మిద్దరమూ గోవిందస్వామి కుమారులము. ఇంతకాలము విధివశాన ఇలా రాక్షసు ణ్ణిగా ఉన్నాను. శవకపాలమును పగలగొట్టడమువల్ల కపాలస్ఫోటు డని పేరు పొందినాను. నిన్ను చూచేప్పటికి నా బ్రాహ్మణ జన్మ జ్ఞాపకము వచ్చింది. నా తెలివివల్ల రాక్షసత్వము తొలగిపోయింది. ఆవరించిన అజ్ఞానము వదిలిపోయింది." అని చెప్పినాడు. విజయదత్తుడు చాలాసేపు అశోకదత్తుని ఆలింగనములోనే ఉన్నాడు. అశోకదత్తుడు, రాక్షసత్వమువల్ల చెడిపోయిన తమ్ముని శరీరాన్ని శుభ్రము చేస్తున్నా డేమో అన్నట్టు ఆనందాశ్రువులు వర్షిస్తున్నాడు. ఇంతలో ప్రజ్ఞప్తి కౌశికుడనే విద్యాధర గురువు గగనమార్గమునుంచి వచ్చి ఆసోదరులతో "మీ రందరూ విద్యాధరుల శాపమువల్ల ఈ అవస్థ మీకు పట్టింది. ఇప్పుడు మీరు శాపముక్తు లైనారు. ఇవిగో అసాధారణము లైన విద్యలు, గ్రహించండి. మీ స్థానానికి వెళ్ళిపోండి." అని చెప్పి వాళ్ళకు విద్యలు అనుగ్రహించి ఆకాశమార్గాన వెళ్ళిపోయినాడు. అశోకదత్తుడూ విజయదత్తుడూ విద్యాధరులై సువర్ణపద్మాలను తీసు కొని ఆకాశమార్గాన హిమాలయశృంగానికి వెళ్ళారు. అశోకదత్తుడు భార్యదగ్గిరికి పోగా ఆమె శాపము తీరి విద్యాధరి అయింది. అంతా గగనమార్గాన కాశీపురము వెళ్ళి దుఃఖములో ఉన్న తల్లిదండ్రులకు కనపడి పరమానందము కూర్చినారు. విజయదత్తుడు తండ్రి కౌగిట్లో చాలాసేపు ఉన్నాడు. ఆసంగతి తెలిసి ప్రతాపముకుటుడు కూడా

హర్షపరవశుడై అక్కడికి వచ్చినాడు. అశోకదత్తుడు ఎదురు చూస్తున్న ప్రియురాలికి మహానందము కలిగించినాడు. అతడు మామగారికి అనేక స్వర్ణపద్మాలు ఇచ్చినాడు. కోరిక తీరి ఆయన సంతోషించినాడు.

గోవిందస్వామి విజయదత్తుని "నాయనా! ఆరాత్రి శ్మశానములో రాక్షసుడవైనది మొదలు నీసంగతి చెప్పు" అని అడిగినాడు. విజయదత్తుడు స్వవిషయము చెపుతున్నాడు: "ఆరాత్రి నేను చాపల్యమువల్ల శవకపాలము పగలగొట్టగా వస నానోట్లో పడ్డది. అందువల్ల రాక్షసుడనై, మాయకు లొంగిపోయినాను. రాక్షసులు నన్ను కపాలస్ఫోటుడా అని పిలిచారు. నేను రాక్షసులతో కలిశాను. వాళ్ళునన్ను సేనాధిపతిని చేశారు. మాప్రభువు మదమువల్ల గంధర్వులమీద దాడి చేసి, యుద్ధములో చనిపోయినాడు. వెంటనే రాక్షసులు నన్ను రాజును చేసినారు. నేను రాక్షసరాజ్యము పరిపాలిస్తూ రాక్షస పురములోనే ఉన్నాను. హఠాత్తుగా సువర్ణపద్మాలకై రాక్షసపురానికి అన్నయ్య వచ్చినాడు. అతన్ని చూడగానే నాఅజ్ఞానము తొలగిపోగా నాది విద్యాధరకుల మని గ్రహించినాను."

అశోకదత్తుడు స్వవిషయమును ఆమూలాగ్రముగా వర్ణిస్తున్నాడు: "పూర్వము మేము విద్యాధరులమై దివిజగంగానదిలో స్నానము చేస్తున్న మునికన్యలను ఏకాంతములో చూచి మోహించినాము. వాళ్ళు మమ్మల్ని చూచి వ్యామోహములో పడినారు. ఈసంగతి తెలిసి బంధువులంతా మునికన్యలను కోపంకొద్దీ శపించినారు.

దుర్మార్గు లయినమీకు మానవజన్మము వస్తుంది. అక్కడమీకు వియోగము కలుగుతుంది. మానవగోచరము కాని దూరదేశమునుంచి వచ్చిన నూతన పురుషుణ్ణి చూడగానే రెండోవాడికి జ్ఞానోదయము అవుతుంది. విద్యాధర గురువువల్ల విద్యలు సంపాదించి తిరిగి మీరు విద్యాధరులై, శాపముక్తులై మీబంధుమిత్రాదులను కలుసుకొంటారు.

ఇలా మునిశాపమువల్ల మేము ఇక్కడ జన్మించాము. మామగారికి బంగారు పద్మాలు కావలసివచ్చింది. నేను రాక్షసుల పట్టణానికి వెళ్ళి తమ్ముణ్ణి కలుసుకొన్నాను. అక్కడే ప్రజ్ఞప్తి కౌశికుడనే విద్యాధర గురువువల్ల సమస్త విద్యలూ కరతలామలకము చేసుకొని, విద్యాధరులమై ఇక్కడికి వచ్చాము.

శాపము వదిలిపోయినందుకు అశోకదత్తుడు సంతోషించి, తల్లిదండ్రులకూ భార్యకూ కథానికలు చెప్పి సంతోషపెట్టినాడు. ఆకథలు వినగానే అందరికీ విద్యాధరుల మని పూర్వజ్ఞానము కలిగింది. అశోకదత్తుడు మామగారిదగ్గిర సెలవు పుచ్చుకొని జననీ జనకులనూ, ఇద్దరుభార్యలనూ వెంట పెట్టుకొని ఆకాశమార్గాన తమచక్రవర్తి ఉన్నచోటికి వెళ్ళాడు. చక్రవర్తి ఆజ్ఞవల్ల అశోకదత్త విజయదత్తులు, అశోక వేగుడు విజయ వేగుడనే నూతన నామములు పెట్టుకొని గోవిందపర్వతానకి వెళ్ళి అక్కడ నివాసము ఏర్పరుచుకొన్నారు. ప్రతాపముకుటుడు అల్లుడిచ్చిన బంగారుపద్మాన్ని రెండవ కలశముమీద ఉంచి, తక్కిన పద్మాలతో మహేశ్వరుని పూజించి, అశోకదత్తుని సంబంధమువల్ల తనకులము పవిత్రమై ధన్యమైన దని సంతోషపడ్డాడు.

ఈవిధముగా లోకములో గొప్పవారు సత్త్వగుణమువల్ల ఉత్సాహము కలిగి దుష్కరకార్యములను సుఖువుగా సాధిస్తారు. అందువల్ల శక్తిమంతుడా, నీవుకూడా దేవాంశసంభూతడ వనీ, నీకు ఇష్టసిద్ధి అవుతుందనీ తలుస్తాను. నీవు కోరిన కన్యకూడా దేవతాకన్య అయి ఉండవచ్చును. ఆకనకరేఖ దేవతాస్త్రీ కాకపోతే కనకపురమును చూచినవాడినే భర్తగా ఎందుకు కోరుతుంది ?

విష్ణుదత్తుడు చెప్పిన ఈ కథను శక్తిదేవుడు విని మనసులో కనకపురీ దర్శనము కోసము తహ తహ లాడుతూ మనస్సు చిక్కబట్టినాడు.

## తరంగము : ౨౬

మరునాడు తెల్లవారుజామున దాశరాజు సత్యవ్రతుడు శక్తిదేవునితో "బ్రాహ్మణోత్తమా! నీకోరిక నెరవేరడానికి ఉపాయము ఆలోచించినాను. సముద్రమధ్యమున రత్నకూట మనేలంక ఉన్నది. ఆద్వీపములో సముద్రుడు శ్రీహరిని నెలకొల్పడముచేత, ప్రతియేటా ఆషాఢశుక్ల ద్వాదశినాడు ఉత్సవము జరుగుతుంది. ఆఉత్సవము చూడడానికి యాత్రికులు అనేక చోట్లనుంచి వస్తారు. అప్పుడు నీకు కనకపుర వృత్తాంతము తెలియవచ్చును. ఆఉత్సవదినము దగ్గిరికి వచ్చింది. పోదాము" అన్నాడు. శక్తిదేవుడు మిత్రుని ఉపాయానికి సంతోషించి అతడు చేసిన ధనసహాయము స్వీకరించి, నావ ఎక్కి ప్రయాణమైనాడు. శక్తిదేవుడు చుక్కానిదగ్గిరఉన్న సత్యవ్రతుణ్ణి "దూరంగా సముద్రములో రెక్కలున్న పర్వతాలు స్వేచ్ఛగా పైకి లేచినట్టి కనపడుతున్నవే! అవి యేమి?" అని కుతూహలముతో అడిగినాడు — సత్యవ్రతుడు "ఇక్కడ గొప్పసుడి ఉన్నది. దీన్ని తప్పించుకొనిపోవలెను. ఈసుడిలో పడ్డవాళ్ళు పైకి రాలేరు" అంటున్నప్పుడు నీటివేగమువల్ల నావ ఆసుడివైపే పోతున్నది. సత్యవ్రతుడు అది గమనించి "బ్రాహ్మణోత్తమా! మనకు కాలము మూడింది. ఓడ అటే పోతున్నది. నావను మరల్చడము సాధ్యముకాదు. మృత్యుముఖములో పడబోతున్నాము. నేను అందుకు విచారించను. శరీరము ఎప్పుడో పోవలసిందే కదా! కష్టపడినా నీకు కోరిక నెరవేరలేదని నాకు దుఃఖముగా ఉన్నది. నేను ఓడను నిలిపి చూస్తాను. నీవు వెంటనే మర్రిచెట్టు కొమ్మ గట్టిగా పట్టుకో. విధిని ఎవరు దాటగలరు!" అన్నాడు. ధీరుడయినసత్యవ్రతుడు ఇలా అంటున్నప్పుడు ఓడ మర్రికిందికి వచ్చింది. శక్తిదేవుడు భయపడక ఎగిరి లావుపాటి మర్రికొమ్మ పట్టుకొన్నాడు. సత్యవ్రతుడు నావతోపాటు సుడిలో గిరగిర తిరిగి కొట్టుకుపోయినాడు.

శక్తిదేవుడు మర్రికొమ్మను గట్టిగా పట్టుకొని నిరాశతో ఇలా చింతించినాడు: "నాకు కనకపురము కనపడ లేదు సరికదా, సత్య వ్రతుణ్ణి చేతులార నాశనము చేశాను! దురదృష్టాన్ని ఎవరు తప్పిస్తారు?" ఇలా ఆలోచిస్తుండగా పగలు గడిచింది. సంధ్యావేళ పెద్దపెద్దపక్షులు అనేకప్రాంతాలనుంచి ధ్వనులు చేస్తూ చెట్టుమీద వాలుతున్నవి. ఆపక్షుల రెక్కల గాలికి సంతోషముతో అలలు లేస్తున్నవి. శక్తిదేవుడు ఆకుల జొంపములో దాగి మనుష్యవాక్కుతో పరస్పరము మాట్లాడు కొంటున్న పక్షులవచనాలు విన్నాడు. ఒక పక్షి పగ లల్లా తాను తిరగిన ద్వీపాన్ని, పర్వతాన్ని వర్ణించింది. ఒక ముసలి పక్షి అన్నది: "ఇవాళ నేను కనకపురము వెళ్ళాను. రేపుకూడా అక్కడికే పోతాను. ఎంతో సుఖంగా విహరించవచ్చు." ఆపక్షిపలుకులు అతని వీనులకు అకాలంలో అమృతవృష్టివలె సోకగా "అమ్మయ్య. ఇప్పటికి నాపూర్వ పుణ్యము పండింది. కనకపురము వెళ్ళడానికి ఈపక్షిని వాహనము చేసుకోవడమే ఉపాయము" అని అనుకొన్నాడు. ఆవృద్ధవిహంగము నిద్ర పోగానే, దానివీపుమీది రెక్కల్లో దాగినాడు.

తెల్లవారగానే తక్కిన పక్షులు నానాదేశాలు పోగా వృద్ధవిహం గము తనవీపురెక్కలలో శక్తిదేవు డున్నాడని ఎరుగక కనకపురానికి ఎగిరిపోయింది. అది అక్కడి వనములో మేతకై వాలగా శక్తిదేవుడు దానికి తెలియకుండా వీపుమీదినుంచి దిగి అక్క డక్కడా తిరిగి వన ములో పువ్వులు కోస్తున్న ఇద్దరుస్త్రీలను చూచి దగ్గిరికి పోయి, తన్ను చూచి ఆశ్చర్యపడుతున్న వాళ్ళతో "ఏ మమ్మా? ఈ ఊరు పే రేమి? మీ రెవరు?" అని అడిగినాడు. "ఈ పురము కనకపురము, ఇక్కడ విద్యాధరులు నివసిస్తారు. మిత్రమా, ఇక్కడ చంద్రప్రభ అనే విద్యాధరి దగ్గిర మేము వనపాలికలము, ఆమె కోసమే పువ్వులు కోస్తున్నాము." అని వాళ్ళు సమాధాన మిచ్చినారు. "మీరాణీని నాకు చూపించాలి"

అని అతడు వేసుకోగా వాళ్ళు సరే అని అతన్ని రాజమందిరానికి తీసుకుపోయినారు. ఆరాజమందిరము మాణిక్యస్తంభాలతో, స్వర్ణ కుడ్యములతో దేదీప్య మానమూ, సంపదలకు నిలయమూ ఐవుండగా శక్తిదేవుడు చూచి ఆశ్చర్య పడ్డాడు.

విద్యాధర నివాసానికి మానవమాత్రుడు రావడము చేత అందరికీ అపరిమిత మైనవింత కలిగింది. అంతా వెళ్ళి రాణీకి చెప్పారు. రాణీ చంద్రప్రభ ప్రతీహారిని పంపి శక్తిదేవుణ్ణి మందిరములోకి పిలిపించు కొన్నది. అతడు బ్రహ్మసృష్టిలో ఉన్న సౌందర్యము మూర్తీభవించిన ఆ చంద్ర ప్రభను చూచినాడు. వీక్షణమాత్రము చేతనే రాణి అతనికి వశ్యురాలై, రత్నాలశయ్య దిగి అతన్ని కుశల ప్రశ్నలు వేసింది. "కల్యాణమూర్తీ! మానవమాత్రులకు సులభసాధ్యము కాని ఈ ద్వీపానికి నీవు ఎలా వచ్చావు?" అని ఆమె కుతూహలముతో అతన్ని అడిగింది. అతడు తన ఊరు, దేశమూ చెప్పి కనకరేఖ అనే రాజకన్యను పెళ్ళి చేసుకోడానికి కనకపురిని చూడడమే స్వాయంవర నియమమని తెలిసి, తాను అక్కడికి వచ్చా నని చెప్పినాడు. చంద్రప్రభ ఆలోచన చేసి శక్తిదేవునితో ఇలా అన్నది. "సుందరుడా! ఈ ప్రపంచములో శశిఖండు డనే విద్యాధరరాజు కుమార్తెలము మేము. మా నలుగురు అప్పచెల్లెళ్ళలో నేను పెద్ద దాన్ని చంద్రప్రభను. రెండోది చంద్రరేఖ. మూడవది శశిరేఖ. నాలుగో చెల్లెలు శశిప్రభ. నేను కన్యావ్రతములో ఉంటున్నాను. ఒకనాడు నాముగ్గురు చెల్లెళ్ళూ మందాకినీ నదిలో స్నానము చేయడానికి వెళ్ళి జలక్రీడలు ఆరంభించి, జలములో తపస్సు చేస్తున్న మునీంద్రుని మీద నీళ్ళు చల్లినారు. అతడు కోపముతో "దుష్టకన్యలారా! మీరు మానవ లోకములో పుట్టండి" అని శపించినాడు. మా తండ్రి మునీంద్రుణ్ణి వేడుకోగా, ఆయన శాపము ఎప్పుడు అంత మవుతుందో చెప్పి, పూర్వజన్మ జ్ఞానమును

ప్రసాదించినాడు. నా చెల్లెళ్లు ముగ్గురూ శాపవశమువల్ల మనుష్య లోకానికి వెళ్ళగా, మా తండ్రి నాకు ఈ కనక పురాన్ని ఇచ్చి, తపో వనానికి వెళ్ళినాడు. అంబికాదేవి అనుగ్రహమువల్ల మానవుడు నాకు భర్త అవుతాడని కలలో గ్రహించినాను. మా తండ్రి నా కోసము చాలామంది విద్యాధరులను వెతికినాడు. నాకువెవరూ నచ్చకపోవడముచేత వచ్చిన సంబంధాలన్నీ తోసిరాజన్నాను. అప్పటినుంచీ కన్యగా ఉండి మానవుని రాకకై ఎదురుచూస్తూ ఉండగా సుందరుడవైన నీవు రానే వచ్చావు. నీ అందచందాలకు, నీవిజ్ఞానానికి వివశనైపోయినాను. రాబోయే చతుర్దశిరోజున నీరాక మా తండ్రికి తెలియచేసే నిమిత్తము వృషభ పర్వతానికి వెళ్లుతాను. అక్కడికి శివపూజార్థము విద్యాధరు లందరూ నానాప్రదేశాలనుంచి వస్తారు. నా తండ్రికూడా వస్తాడు కనుక ఆయన అనుమతి పొందిన అనంతరము మనము పెళ్ళిచేసుకోవచ్చును.

చంద్రప్రభ విద్యాధరులను గౌరవించినరీతిగా శక్తిదేవుణ్ణి పువ్వుల్లో పెట్టి పూజించింది. అతడు ఆమె సమక్షములో నివసించడము అగ్ని దగ్ధునికి అమృతవర్ష పాతమువలె ఉన్నది! చతుర్దశీతిథి రాగానే చంద్ర ప్రభ "నాతండ్రిదగ్గిరికి వెళ్ళుతాను. పరివారము నాతోనే ఉంటుంది. పాపము నీవు ఏకాంతముగా రెన్నాళ్ళు గడపవలసి ఉంటుంది. ఏకా కిగా నీవు ఈఅంతఃపురములో ఉన్నప్పుడు మధ్యఅంతిస్తులోమాత్రము అడుగు పెట్టకు," అంటూ ఆమె మనసు అతనిమీదనే ఉంచి తండ్రి దగ్గరికి వెళ్ళింది.

శక్తిదేవుడు రాజకన్యామందిరములో ఏకాకిగా ఉంటూ కాలము వినోదముగా వెళ్ళబుచ్చుతున్నాడు. అంతఃపుర మంతా అతడు తిరిగి చూస్తూ, చంద్రప్రభ మధ్యఅంతస్తుకు వెళ్ళవద్దనడమువల్ల అతని కుతూహలము ఎక్కువయి మధ్యఅంతస్తులో కాలు పెట్టగానే మూడు రత్నమండపాలు కనవడినవి. ఒకరత్నమండపద్వారము తీసి ఉండగా

శక్తిదేవుడు లోపలికి వెళ్ళి చూచినాడు. అక్కడ హంసరెక్కల పానుపు మీద ఎవరో కప్పుకొని పండుకొన్నట్టు గ్రహించినాడు. కప్పుకొన్న దుప్పటి ఎత్తగా పరోపకారి మహారాజకుమార్తె అతనికి కనపడింది. ఆమె మెళుకువుగా ఉందా? నిద్రిస్తున్నదా? అది మాయా? ఎవరి కోసము శక్తిదేవుడు కనకపురము వెళ్ళవలసి వచ్చిందో ఆకన్య, తాను కోరినకన్య లభించింది! తక్కిన రత్నమండపాల్లో అతడు ప్రవేశించి కన్యలిద్దరిని చూచినాడు. అతడు అంద మైనదిగుడుబావిదగ్గర రత్నాల జీనుతో ఉన్న గుర్రాన్ని ఎక్కదలచినాడు. ఆ అశ్వము అతన్ని నూతిలో తోసింది. శక్తిదేవుడు. బావినీళ్ళల్లో మునిగి వర్ధమానపురములో వన ములోఉన్న దిగుడుబావిలో తేలినాడు. అతనికి చంద్రప్రభ కనపడ లేదు. అతడు బెంగగా "అయ్యో! విద్యాధరపురము ఏమయింది? ఏది చంద్రప్రభ? ఆశ్చర్యంగా ఉందే! ఎలా వచ్చాను మావూరికి? ఆహా, అంతా మాయ! ఈమందభాగ్యుణ్ణి ఎంత చక్కగా అందరూ వంచించారు! ఎవరిముఖాన మూడుపంక్తుల్లో బ్రహ్మ ఏమి రాశాడో గద!" అని విచారించాడు శక్తిదేవుడు. ఆలోచనా పరంపర విడిచి దిగుడు బావిలోనుంచి లేచి ఆశ్చర్యపడి, స్వగృహము చేరినాడు. శక్తి దేవుణ్ణి చూచి "మానాయన ఎన్నాళ్ళకు ఎన్నాళ్ళకు, వచ్చాడు!" అని పరమాశ్చర్యపడి తండ్రి పండుగ చేసినాడు. శక్తిదేవుడు యథాప్రకార ముగా ఆవర్ధమాన పురములో చాటింపు విన్నాడు: "బ్రాహ్మణుడు గాని, క్షత్రియుడు గాని కనకపురమును చూచి ఉంటే వాస్తవముగా చూచిన విషయము చెప్పవలె. అట్టివానికి కుమార్తెను, యావరా జ్యాన్ని రాజు ఇస్తాడు" అని.

ఆ చాటింపు విని శక్తిదేవుడు డప్పులవాళ్ళతో తాను కనకపురమును చూచితా నని చెప్పినాడు. వెంటనే అతన్ని వాళ్ళు రాజు దగ్గరికి తీసు కుని వెళ్ళారు. రాజుకు శక్తిదేవుని మీద నమ్మకము కలగలేదు. అప్పుడు

శక్తిదేవుడు 'నామాట మీకు అపనమ్మకముగా ఉంటే నేను కనక పురము వెళ్లిందీ వెళ్లనిదీ రాజపుత్రి పరీక్ష చేయవచ్చును' అని పలికినాడు.

రాజపుత్రి అతన్ని చూచీ చూడడంతో 'నాన్నా, ఇతడు అబద్ధా లాడుతున్నాడు' అన్నది. శక్తిదేవుడు 'నామాట నిజమో అబద్ధమో రాజపుత్రీ, తెలుసుకో. నాకు కుతూహలముగా ఉన్నది. నిన్ను కనక పురిలో పాన్పుమీద పరుండగా చూచాను. ఇక్కడా నిన్ను చూస్తు న్నాను,' అన్నాడు. అతడు చెప్పిన ఆనవాలు రాజకన్య రాజుతో మనవి చేసింది. "నాన్నా, ఈ బ్రాహ్మణుడు కనకపురము నిజముగా చూచినాడు. త్వరలోనే నాకు ఇతడు భర్త అవుతాడు. అక్కడ నా చెల్లె ళ్ళనుకూడా ఇతడు వివాహము చేసుకొంటాడు. కనకపురానికి ఇతడు విద్యాధరరాజు అవుతాడు. నేను నాపురమునకు వెళ్ళవలెను. మునీంద్రుని శాపమువల్ల మానవజన్మ మెత్తి మీఇంట్లో జన్మించాను. ఆమునీంద్రుడు నాకు శాపవిముక్తిని ఇలా ప్రసాదించినాడు: ఏమానవుడు కనకపురములో నీదేహమును చూచి ఆరహస్యాన్ని వెల్లడి చేస్తాడో అప్పుడు నీశాపము పోతుంది. మానవుడే నీకు భర్త కాగలడు" అని. నేను ప్రస్తుతము మానవ కన్యను. అయినను పూర్వజన్మ జ్ఞానము ఉన్నది. తిరిగి నావిద్యాధరపద మును పొందుతాను." ఇలా అంటూ ఆరాజకన్య శరీరము వదిలి కనపడలేదు.

రాజమందిరము ఏడుపు పెడబొబ్బలతో నిండిపోయింది. శక్తిదేవుడు రెంటికీ చెడినరేవడి నైనా నని అప్రియురాంద్రను తలపోస్తూ, తన్ను నిందించుకొంటూ రాజగృహమునుంచి బైటికి వచ్చి ఆలోచించినాడు: "నాకోరిక సిద్ధిస్తుంది. ఎందుకు నేను చింతపడడము? సిద్ధి సాధనమీదనే ఆధారపడుతుంది. అందుచేత నేను కనకపురము అవశ్యము వెళ్లుతాను. ఇందుకు దైవమే నాకు సహాయము —"

శక్తిదేవుడు వర్ధమానపురమును వదిలి విటంకపురము చేరినాడు.

పూర్వపరిచితు డయిన వర్తకుడు అతనికి ఎదు రయినాడు. శక్తిదేవుడు "ఓహో! సముద్రములో పడిపోయిన సముద్రదత్తుడు బతికి వచ్చినాడే! ఏమి చిత్రము! ఇందుకు నేనే నిదర్శనము" అని ఆలోచించి వర్తకుణ్ణి పలకరించినాడు. ఒకరి నొకరు కౌగలించుకొన్నారు. సముద్రదత్తుడు శక్తిదేవుణ్ణి ఇంటికి పిలిచి అతిథి పూజలు చేసి అడిగినాడు" నావ పగిలి పోయినతరువాత నీవు సముద్రములోనుంచి ఏలాలేచి రాగలిగావు?" అని. అతడు జరిగినవిషయము పూసగుచ్చినట్టు చెప్పినాడు. అప్పుడు వర్తకుడు "నాకుకూడా ఒక చెక్క దొరకగా, దానిసహాయముతో సముద్రము ఈదుకొంటూ దరి చేరాను. మూడురోజులు అయిన తరువాత ఒకఓడ రాగా గట్టిగా కేకలు పెట్టినాను. ఆనావలోవాళ్లు నన్ను ఓడలోకి ఎక్కించుకొన్నారు. ఓడలో మానాన్నను చూచినాను. ఆయన చాలా కాలముకిందట ద్వీపాంతరము వర్తకసందర్భములో వెళ్ళి తిరిగివస్తున్నాడు. నన్ను చూచి ఆనవాలుపట్టి గట్టిగా నాకంఠమును కౌగలించుకొని ఏడుస్తూ నాసంగతి అంతా అడిగినాడు. మానాన్నతో నేను "నాన్నా! నీవు ఎన్నాళ్ళకూ రాకపోగా వ్యాపారములో ప్రవేశించాను. ద్వీపాంతరానికి వెళుతూండగా మాపడవ బద్ద లయి పోయింది. నేను మునుగుతున్న సమయములో మీఓడ నన్ను ఉద్ధరించింది." అన్నాను. మాతండ్రి నన్ను ఇలా మందలించినాడు. "ఎందుకు, రా నాయనా, ఉపద్రవాల్లో ప్రవేశిస్తావు? నీకు కావలసినంత ధనము ఉండగా, నేనూ సంపాదిస్తున్నాను కదా; ఇంకా నీకు తాప త్రయము ఎందుకు? ఈనావ నిండా బంగారము తెస్తున్నాను." మే మిద్దరమూ విటంకపురము చేరుకొన్నాము.

శక్తిదేవుడు రాత్రి విశ్రాంతి తీసుకొని మర్నాడు సముద్రదత్తునితో "నేను ఉత్థ్సలద్వీపానికి వెళ్ళాలి. అక్కడికి మార్గము ఎలాగ? అని అడిగినాడు. వర్తకుడు "నా బేరగాళ్ళు అక్కడికే వెళుతున్నారు.

వాళ్ళతోపాటు నీవుకూడా వెళ్ళు." అని సలహా ఇచ్చినాడు.

శక్తిదేవుడు ఉత్థలద్వీపానికి వెళ్ళినాడు. అతడు అక్కడ తన బంధువు విష్ణుదత్తుదగ్గిరికి వెళుతూఉండగా దాశపతి అయిన సత్యవ్రతుని కుమాళ్లు చూచి ఆనవాలుపట్టి "నీవు మానాన్నతోకూడా కనక పురము వెతుకుతూ వెళ్ళావుకదా! ఇప్పుడు ఒంటరిగా వచ్చావేమి?" అని అతన్ని అడిగినారు. శక్తిదేవుడు విచారముతో "మీనాన్న సముద్రములో సుడిగుండములో కొట్టుకుపోయినాడు," అని చెప్పినాడు. ఆమాట విని వాళ్లు "ఈదుర్మార్గుణి పట్టుకోండి. వీడే మాతండ్రిని చంపినాడు. ఒకడు ఓడలో ఉండగా రెండోవాడు సుడిలో పడిపోవడము సంభవించదు. అందువల్ల శక్తిదేవుడు మాతండ్రిని చంపినాడు. రేపు తెల్లవారు జామున ఈదుర్మార్గుణ్ణి చండికాదేవికి బలి వేదాము." అని భటులకు ఆజ్ఞ ఇచ్చినారు.

వెంటనే ఆభృత్యులు శక్తిదేవుణ్ణి కట్టి చండీదేవాలయానికి తీసుకొని వెళ్ళినారు. అతడు ఆరాత్రి బద్ధుడై ఉండి దేవిని వేడుకొన్నాడు. "దేవి! బాలసూర్యునివలె అరుణ మయిననీవు లోకమంతటినీ, రక్షిస్తున్నావు. ఏపాపమూ ఎరుగని నన్ను ఈదుర్మార్గులు నీకు బలిగా సమర్పిస్తున్నారు. నాప్రియురాలిని దూరదేశములో ఉన్నదానిని పొందవలెనని వస్తున్నాను. నన్ను రక్షించు. నీభక్తుణ్ణి రక్షించు." అతనికి కలలో దివ్యస్త్రీ సాక్షాత్కరించి కనికరము చూపుతూ "శక్తిదేవా! భయపడకు. నీకు క్షేమము కలుగుతుంది. ఈదాశకుమారులకు బిందుమతి అనే చెల్లెలు ఉన్నది. ఆ అమ్మాయి నిన్నుచూచి మోహించి, వివాహము చేసుకోవలెనని యత్నిస్తుంది. అందుకు నీవు అంగీకరిస్తే ఆపిల్ల నిన్ను కాపాడుతుంది. ప్రాణభయం తప్పిపోతుంది. ఆకన్య పల్లెది కాదు. శాపవశము వల్ల ఇలా జన్మించిన దివ్యకన్య." అని పలికింది. మెళుకువ రాగా అతనిఎదుట బెస్తపిల్ల బిందుమతి కనపడింది. "నేను

నిన్ను విడిపిస్తాను. నాకోరిక మాత్రకు నీవు చెల్లించాలి. నాఅన్నలు నాకోసము తెచ్చిన సంబంధాలు అంగీకరించక కన్యనై ఉన్నాను. నీమీద నాకు మనసు కలిగింది. నన్ను ఏలుకో." అని ఆమె వేడుకొన్నది. అతడు స్వప్నవిషయము స్మరించి తన క్షేమానికై ఆమెను వివాహ మాడినాడు. అతడు బంధముక్తుడై బిందుమతితో సుఖము అనుభవిస్తున్నాడు.

ఒకనాడు ఆఊరివీధిలో చండాలుడు గోమాంసమును మోసుకొని పోతూ ఉండగా మేడపైనుంచి శక్తిదేవుడు చూచి ప్రియురాలితో "ప్రేయసీ, గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం అని పెద్దలు అంటారు. గోవులు త్రిలోకాలకూ పవిత్రములు. చూడు, ఆపాపిష్ఠివాడు దాని మాంసమును ఎలాభక్షిస్తాడో!" అన్నాడు. బిందుమతి "నాథా! ఆపాతకము ఊహించలేము. నేను గోప్రభావముచేత అల్పదోషమాత్రమున ఈరీతిగా బెస్తకులములో పుట్టినాను. వీడికి తరణోపాయ మంటూ ఉన్నదా?" అని అడిగింది. అతడు "ప్రియా, చిత్రమే! నీ వెవరవు? నీకు బెస్తజన్మ ఎందుకు వచ్చింది?" అని నిర్బంధించి అడిగినాడు. ఆమె "నా మాటప్రకారము చేస్తే నీకు చెపుతాను. ఒట్టుపెట్టు." అన్నది. శక్తిదేవుడు మాట తప్ప నన్నాడు. అప్పుడు బిందుమతి "ప్రాణేశ్వరా! నీకు ఈలంకలో మరొక ప్రేయసి లభిస్తుంది. ఆమె త్వరలో గర్భము ధరిస్తుంది. ఆమెకు ఎనిమిదో నెలలో గర్భస్రావము కలిగేవిధము చూడు. రోత పడకూడదు. దీనికి కారణము ఉన్నది. నాకు దాశజన్మ ఎలా వచ్చిందో చెపుతాను. నేను పూర్వజన్మలో విద్యాధరిని. శాపమువల్ల మానవలోకములో జన్మించాను. విద్యాధరినై ఉండికూడా వీణతీగెలను పళ్ళతో కొరికిన దోషమువల్ల బెస్తపిల్లనై పుట్టినాను. గోవుల ఎండు నరముతో చేసిన తంత్రులను నోటితో కరిచినందుకు ఈగతి నాకు పట్టింది. గోమాంసాన్నే తినేవాళ్ళ సంగతి ఏమనవలె?" అన్నది.

ఆమె అన్నలలో ఒకడు రోజుకుంటూ పరుగెత్తుకొని వచ్చి శక్తిదేవు నితో "ఎక్కడినుంచో అడివిపిందివచ్చి జనాన్ని చంపి ఇటుకేసివస్తున్నది." అన్నాడు. శక్తిదేవుడు మేడమీదనుంచి దిగి ఈటెపుచ్చుకొని అశ్వమెక్కి పందిని తరిమి పొడిచినాడు. దానికి గాయము తగులగా అది గుహలో దూరింది. అతడుకూడా గుహలో ప్రవేశించి వనమునూ గుహనూ చూచినాడు. అక్కడ అతనికి సుందరి వనదేవతవలె కనపడింది. "ఎవ రమ్మా నువ్వు! ఏ మిలా తిరుగుతున్నావు ?" అని శక్తిదేవుడు ఆమెను అడిగినాడు. ఆమె "సుందరాకారా! చండవిక్రముడు అనే దక్షిణదిశాధి పతి కుమార్తెను. నన్ను బిందురేఖ అని పిలుస్తారు. పాపాత్ముడైన జ్వలితలోచను డనే రాక్షసుడు నన్ను మోసగించి మాఇంట్లోనుంచి ఇక్కడికి తెచ్చినాడు. ఈరాక్షసుడు మాంసము కోసము వరాహ రూపము ధరించి పోగా ఎవరో వీరుడు ఇతన్ని పొడిచినాడు. వెంటనే వచ్చి ఇతడు చనిపోయినాడు. నేను కన్నెరికమును కాపాడుకొని బతుకు జీవుడా అని బైట పడ్డాను." అని చెప్పింది. శక్తిదేవుడు "రాజపుత్రీ, నేనే పందిని చంపినవాణ్ణి, ఈటెతో పొడిచినాను." అని చెప్పినాడు.

"నీ వెవరువు!" అని అతన్ని ప్రశ్నించింది. "నేను బ్రాహ్మణుడను. నన్ను శక్తిదేవుడని అంటారు" అని అతడు సమాధాన మిచ్చినాడు. "అలా అయితే నీవే నా భర్తవు" అని చెప్పింది. ఆకన్యను వెంట పెట్టు కొని శక్తిదేవుడు గుహాద్వారము గుండా ఇంటికి వెళ్ళి ఆ సంగతి భార్యతో చెప్పి, ఆమె అంగీకారము పుచ్చుకొని బిందురేఖను పెళ్ళి చేసుకొన్నాడు.

బిందురేఖ గర్భముతో ఉన్నది. ఎనిమిదో నెల రాగా, అతని ప్రథమ కళత్రము బిందుమతి స్వయంగా వచ్చి "వీరపురుషుడా! వాగ్దానము జ్ఞాపకము చేసుకో. నీ రెండో భార్యకు ఎనిమిది నెలల గర్భము. నీ వామెకు గర్భస్రావము కలిగించి పిండాన్ని తీసుకు

రావాలి. మాట తప్పవు కదూ!'' అన్నది. అతనిమనస్సు మథన పడింది. ఒకవైపు భార్యమీద మమకారము, మరొక వైపున శపథము అతన్ని వ్యాకుల పరిచినవి. చివరకు అతడు బిందురేఖ దగ్గిరికి వెళ్ళినాడు. ఆమె అతని విషాదకారణము కనిపెట్టి "నేను ఎరుగుదును. నా గర్భమును చీల్చు మని బిందుమతి అన్నది. అలాగే మీరు చేయండి. తప్పేమీ లేదు. జాలి పడవద్దు. అందుకు నిదర్శనంగావినండి.

## దేవదత్తుని కథ

పూర్వము కంబుకపురంలో హరిదత్తు డనే విప్రుని కుమారుడు దేవదత్తుడు చదువు రాక, ఎప్పుడూ జూద మాడుతూ ఇల్లు గుల్ల, వళ్ళు గుల్లా చేసుకొని ముఖమెత్తుకొని నలుగురిలో తిరగలేక, సిగ్గుతో పాడు పడిన దేవాలయములో ఉన్నాడు. అక్కడ మూలికావైద్యము తెలిసిన జాలపాదు డనే సన్యాసి వద్దకు పోయి దేవదత్తుడు వందనము చేసినాడు. అతడు తనకు జూదమువల్ల ధనము పోయిం దని కష్టాలను ఏకరువు పెట్టినాడు. అప్పుడు సన్యాసి "వత్సా! వ్యసనములో పడిన వాళ్ళకు ఎక్కడి ధనమూ చాలదు. నీవు బాగుపడవలె నని అంటే, నేను చెప్పినట్టు చెయ్యి. నేను విద్యాధరు డను కాబోతున్నాను. నీవు కూడా విద్యాధర పదవికి తగినసాధన చెయ్యి. నీ ఆపదలు గట్టెక్కుతవి'' అని సలహా ఇచ్చినాడు. దేవదత్తుడు అతన్ని కనిపెట్టుకొని ఉంటున్నాడు.

సన్యాసి మరునాడు శ్మశానానికి వెళ్ళి మర్రిచెట్టుకింద రాత్రివేళ పూజాదికము చేసి క్షీరాన్నము నైవేద్యము పెట్టినాడు. ఆ పూజా ద్రవ్యమును నలుదిక్కులా చల్లుతూ అతడు దేవదత్తునితో "నీవు, 'విద్యుత్ప్రభా ఈ పూజను స్వీకరించాలి' అంటూ ప్రతిదినమూ ఇలాగే పూజ చేయాలి. తరువాత ప్రక్రియ నే నెరుగుదును. నేను చెప్పినట్టు

చేస్తే మన మిద్దరమూ విద్యాధరులము అవుతాము." అని చెప్పి అత నితో కూడా ఇంటికి వెళ్ళినాడు. దేవదత్తుడు నియమానుసారముగా మర్రిచెట్టుకింద అర్చన చేస్తున్నాడు. ఒకనాడు పూజానంతరము చెట్టు రెండుగా చీలి అందులోనుంచి దివ్యస్త్రీ హఠాత్తుగా వెలువడి "ఏమోయీ కల్యాణమూర్తీ! మా స్వామిని నిన్ను పిలుస్తున్నది" అంటూ అతన్ని కూడా ఆ వృక్షములో ప్రవేశపెట్టింది. అతడు ఆ చెట్టు లోపల మణిమయ ప్రాసాదము, ఆ భవనములో శయ్యపైన దివ్యాంగ ననూ చూచినాడు. ఆమె అతనికి అతిథి సత్కారములు చేసింది. తన శయ్యమీద అతన్ని కూర్చోపెట్టుకొని "పుణ్యమూర్తీ! నేను రత్నా వర్షుడనే యక్షపతి కుమారిని. నా పేరు విద్యుత్ప్రభ. సన్యాసి అయిన జాలపాదుడు పూజ చేసినందుకు అతనికి కొంతఫలము ఇస్తాను. నీవు నా భర్తవు. నన్ను వివాహమాడు." అన్నది. దేవదత్తుడు విద్యు త్ప్రభను పెళ్ళి చేసుకొని కొంతకాలము ఆమెతో సుఖమనుభవించగా ఆమెకు గర్భము కలిగింది. అతడు సన్యాసి వద్దకు పోయి భయపడుతూ జరిగిన సంగతిఅంతా చెప్పినాడు. అప్పుడు జాలపాదుడు "నీవు చేసినది సరిగా ఉంది. నీవు వెళ్ళి దాని గర్భము కోసి ఇక్కడికి తీసుకురా." అని చెప్పగా, దేవదత్తుడు తిరిగి ప్రియురాలి వద్దకు వెళ్ళినాడు. విద్యు త్ప్రభ ప్రియుని మనస్సు కనిపెట్టి "ఆర్యపుత్రా! ఎందుకు విచారిస్తావు? నా గర్భాన్ని ఛేదించి పిండాన్ని తీసుకుపో. నీకు చేత కాకపోతే నేనే ఆపని చేస్తాను." అన్నది. అతడు ఆ కార్యము నెరవేర్చ లేకపోయినాడు. ఆమె స్వయంగా గర్భమును చీల్చి, పిండాన్ని బైటికి తీసి దేవదత్తునితో ఇది తిన్నవాడు విద్యాధరుడు అవుతాడు. నేను విద్యాధరిని. శాపమువల్ల యక్షకన్యనై పుట్టాను. నాకు శాపము తొలగిపోయింది. పూర్వ జన్మ జ్ఞానం ఉన్నది. నేను స్వగృహానికి వెళుతాను. మళ్ళీ మనము కలుసుకోవచ్చు" అంటూ వెళ్ళిపోయింది. దేవదత్తుడు ఆ పిండాన్ని

పుచ్చుకొని విచారముతో సన్యాసి దగ్గిరికి వెళ్ళి దాన్ని అర్పించినాడు. దేవదత్తుడు భైరవ పూజకై అరణ్యానికి వెళ్ళగా కనిపెట్టి ఆ సన్యాసి పిండ మాంసము వండి అంతా తానే తిన్నాడు. వెంటనే అతడు విద్యాధరుడై ఆకాశాన ఎగిరినాడు.

దేవదత్తుడు సన్యాసి చేసిన మోసమునకు విచారించినాడు. "అయ్యో, గ్రహచారము! ఈసన్యాసి నన్ను మోసగించినాడు. దీని కేమి ప్రతిక్రియ. విద్యాధరు డైన సన్యాసిని పట్టుకోడం ఎలాగ? బేతాళ సాధన కన్న ఇతర మార్గము కనపడడములేదు" ఆలోచన తెగిన మీదట అతడు రాత్రి శ్మశానానికి వెళ్ళి చెట్టుక్రింద బేతాళుని శవములో ఆవాహన చేసి పూజించి నరమాంసము నైవేద్యము పెట్టినాడు. అది చాలక పోవడము చేత దేవదత్తుడు తన మాంసాన్నే కోసి పెట్టినాడు. అప్పుడు బేతాళుడు అతనితో "నీబలానికి మెచ్చుకొన్నాను. తొందర పడకు. నీకు ఏమికావాలో చెప్పు సాధిద్దాము" అన్నాడు. దేవదత్తుడు "జాలపాదు డనే సన్యాసి నన్ను వంచించి విద్యాధరు డైనాడు. ఆ విద్యాధర నివాసానికి నన్నుతీసుకొనిపో" అని కోరినాడు. బేతాళుడు అందుకు సమ్మతించి దేవదత్తుణ్ణి తనబుజాన కూర్చోబెట్టుకొని విద్యాధరలోకానికి తీసుకొని పోయినాడు. జాలపాదుడు విద్యాధరరాజై గర్వించి తన భవనములో రత్నాసనముమీద కూర్చుని విద్యుత్ప్రభను తనకు భార్యకమ్మని వేధిస్తున్నాడు. దేవదత్తుడు అదిచూచి విద్యుత్ప్రభానయనచకోరములకు చంద్రామృతాన్ని కురిపిస్తూ, అతనిమీదికి వెళ్ళినాడు. జాలపాదుడు భయపడ్డాడు. అతని చేతిలో కత్తి జారిపోయింది. అతడు సింహాసనము మీదనుంచి భూమిమీద పడినాడు. దేవదత్తునికి జాలపాదుని కత్తి దొరికినప్పటికీ దానితో వాణ్ణి చంపలేదు. బేతాళుడు జాలాపాదుణ్ణి వధించబోగా దేవదత్తుడు వారించినాడు. "ఈ పామండుని చంపితే ప్రయోజన మేమిటి? వీణ్ణి తీసుకుపోయి నేలకొట్లో ఉంచు. వడి

ఉంటాడు కొంతకాలముపాటు." ఇలా దేవదత్తుడు అంటున్నప్పుడు పార్వతీదేవి ఆకాశమునుంచి దిగి ప్రత్యక్షమయినది. దేవదత్తుడు నమస్కారము చేయగా పార్వతి "పుత్రా, నీశౌర్యము అసమానము. నీవు వెంటనే విద్యాధరులకు రాజు కావాలి." అన్నది. ఆమె అంతర్ధానముకాగా బేతాళుడు జాలపాదుని భూలోకములో విసిరివేసినాడు. దేవదత్తుడు సంతోషించి విద్యుత్ప్రభతో కూడా విద్యాధరాధిపత్యము పొంది సుఖముగా ఉన్నాడు.

ఇలా శక్తిదేవుని గాథను బిందురేఖ చెప్పి బిందుమతి చెప్పినట్లు దుఃఖము మాని నాగర్భమును ఛేదించు అన్నది. శక్తిదేవుడు పాపానికి శంకిస్తూ ఉండగా ఆకాశవాణి "శక్తిదేవుడా! సందేహించకుండా గర్భమును ఛేదించి తీసుకో. దాని కంఠము పట్టుకోగానే అది నీకు ఖడ్గము అవుతుంది." అన్నది దివ్యవాణి. అది విని అతడు వెంటనే కడుపు కోసి పిండమును మెడలో పట్టుకొన్నాడు. వెంటనే అది ఖడ్గమై ప్రకాశించగా అతడు విద్యాధరుడైనాడు. బిందురేఖ అదృశ్యురాలయింది. అతడు వెళ్ళిపోయి ఆసంగతి రెండో భార్యకు చెప్పాడు. ఆమె ఇలా పలికింది. "నాథా! మేము విద్యాధరరాజకుమారికలము. మేము ముగ్గురమూ అప్పచెల్లెళ్ళము. కనకపురములో ఉంటే వీలు లేక పోయింది. మా అప్పచెల్లెళ్ళలో కనకరేఖ అనే దాన్ని వర్ధమానపురములో చూచినావు. ఆమెకు శాపము తీరింది. వెంటనే కనకపురము వెళ్ళిపోయింది. నేను రెండో దాన్ని. ఇప్పుడే నాశాపము తీరింది. నేను కనకపురము వెళ్ళాలి. అక్కడ మా విద్యాధర శరీరాలు ఉన్నవి. మా అక్క చంద్రప్రభ అక్కడే ఉంది. నీవు ఖడ్గసిద్ధ ప్రభావము వల్ల వెంటనే అక్కడికి వస్తే నలుగురమూ నిన్ను పెళ్ళిచేసుకొంటాము. నీవు విద్యాధర చక్రవర్తివై మమ్మల్నీ మా తల్లిదండ్రుల్నీ సంతోషపెట్టు."

బిందుమతి చెప్పిన మాటను పాటించి శక్తిదేవుడు గగన మార్గాన

కనకపురికి వెళ్ళినాడు. అతడు అదివరకు మూడు రత్నమండపాలలో మూడు విద్యాధర శరీరాలు చూచినాడు. ఇప్పుడు ఆ దేహాలలో తన ప్రియురాండ్ర ప్రాణాలు ప్రవేశించగా ఆ శరీరములు సజీవము లైనవి. చంద్రప్రభాదేవి శక్తిదేవుణ్ణి తన చెల్లెళ్ళనూ తనివి తీరక చూచింది. శక్తిదేవుణ్ణి పరివారజనము సేవించగా చంద్రప్రభ ఇలా పలికింది. "వర్ధమానపురంలో రాజకన్య చంద్రరేఖ నా చెల్లెలు. నీ భార్య బిందుమతి పెద్దపిల్ల. దీన్ని శశిరేఖ అని పిలుస్తారు. రాక్షసులు ఎత్తుకుపోయిన రాజకన్య బిందురేఖ ఇది. దీని నిజనామము శశిప్రభ. ఇదికూడా నా చెల్లెలు. వీరమూర్తీ! మా తండ్రి దగ్గిరికి రావోయి! మమ్మల్ని అందరినీ పెళ్ళాడి సంతోషపెట్టు." శక్తిదేవుడు నలుగురు విద్యాధరలతో వారితండ్రి దగ్గిరికి వెళ్ళినాడు. ఆ విద్యాధర కన్యలు తండ్రి పాదములకు వందనము ఆచరించినారు. జరిగిన వృత్తాంతమంతా వాళ్ళు పూస గుచ్చినట్టు తండ్రికి చెప్పినారు. అశరీరవాణి ప్రేరేపణవల్ల తండ్రి తన నలుగురు కుమార్తెలనూ శక్తిదేవునికి ఇచ్చి వివాహము చేసినాడు. అతడు కనకపురీరాజ్యాన్ని, సమస్తవిద్యలనూ శక్తిదేవుని కిచ్చి, అతనికి శక్తివేగు డనే నూతననామము ఉంచినాడు. ఆ విద్యాధరాధిపతి శక్తివేగునితో "శత్రువులు ఎవ్వరూ నిన్ను జయించలేరు. మహానుభావుడయిన వత్సరాజువల్ల మీకు నరవాహన దత్తుడు జన్మిస్తాడు. ఆ నరవాహన దత్తుడు విద్యాధర చక్రవర్తి అవుతాడు." అని పలికి, అల్లుణ్ణి గౌరవించి నిజరాజధానికి పంపినాడు. శక్తివేగుడు రాజై భార్యలతో కనకపురానికి వెళ్ళి సువర్ణ మందిరాలలో రత్నాలమెట్లు గల దిగుడు బావులలో, వనవాటికలలో క్రీడాసుఖము అనుభవిస్తున్నాడు.

ఈ ప్రకారముగా శక్తివేగుడు తనవిషయము వత్సరాజుకు చెప్పి "వత్సరాజా! చంద్రవంశ భూషణమా! ఆ శక్తివేగుణ్ణి నేనే! నీ కుమారుణ్ణి దర్శించా లని వచ్చాను. నేను మానవ మాత్రుణ్ణి అయినా

మహేశ్వర ప్రసాదమువల్ల విద్యాధరాధిపతిని అయినాను. నేను యింటికి వెళ్ళి వస్తాను. ప్రభువును చూచాను. మీకు శుభము కలుగునుగాక!" అని కేలుమోడ్చి సెలవు తీసుకొని, ఆకాశాన ఎగిరినాడు. వత్సరాజు దేవేరులతో, పిల్లవానితో, మంత్రులతో సుఖముగా ఉన్నాడు.

## చతుర్దారికా లంబకము

---

## మదన మంచుకా లంబకము

### తరంగము : ౨౭

తర్జయ న్నివ విఘ్నౌఘా
న్నమితో న్నమి తేన యః
ముహు ర్విభాతి శిరసా
స పాయా ద్వో గజాననః.

నమః కామాయ యద్బాణ
పాతై రివ నిరంతరమ్
భాతి కంటకితం శంభో
ర ప్యుమాలింగితం వపుః.

మస్తకం బెవ్వాడు మాటిమాటికిని
ఎత్తుచు వంచుచు నెల్ల విఘ్నముల
తర్జించురీతిని దనరారునట్టి
గజముఖదేవుండు కాచు మమ్ముగలను.

శివుని దేహ ముమా సమాశ్లిష్ట మగుట
ఎవని బాణపాతమ్ముచే నెల్ల వేళ

కంటకిత మైన రీతిని కానిపించు,
వందన మొనర్తు నా రతీవల్లభునకు.

నరవాహనదత్తుడు సమస్తసుఖములూ అనుభవిస్తూ, ఋషులూ, ఋషిపత్నులూ గోష్ఠి చేస్తూ ప్రస్తావవశాన తనచరిత్ర అడిగితే అన్యుడు చెప్పినట్టు తానే యీవిధముగా ప్రారంభించినాడు :

వత్సరాజు నరవాహనదత్తుని గారాబముతో పెంచుతున్నాడు. కుర్రవాడు ఎనిమిదేళ్ళు రాగానే మంత్రికుమాళ్లతో విద్యలు నేరుస్తూ వనాల్లో ఆడుకొంటూ ఉన్నాడు. వాసవదత్తాదేవికీ పద్మావతికీ ప్రాణా లన్నీ పిల్లవాడిమీదనే ఉన్నవి. నరవాహనదత్తుడు పెరిగిన కొద్దీ వినయముతో సద్వంశసంజాత మైన శరీరముతో ప్రకాశిస్తున్నాడు. వత్సరాజు కుర్రవానికి పెళ్ళి చేయవలె నని ఉవ్విళ్ళూరుతూ కాలము గడుపుతున్నాడు.

## తైలపాత్ర వైశ్యకుమారుని కథ

వితస్తానదీతీరములో తక్షశిల అనే పట్టణాన్ని సౌగతు డైన కళింగదత్త మహారాజు పరిపాలన చేస్తున్నాడు. పౌరు లందరూ జినదేవుని భక్తులు — ఆపురములో చైత్యము లనే ప్రార్థనామందిరాలు చాలా ఉన్నవి. ఆరాజు కంటికి రెప్పవలె ప్రజలను కాపాడడమే కాక, గురువై ఉపదేశము చేస్తున్నాడు. ఆతక్షశిలలో వితస్తాదత్తుడు అనే ధనిక సౌగతు డున్నాడు. రత్నదత్తుడు అతని కుమారుడు; తండ్రి పాపాత్ము డనే భావముతో ఉండేవాడు. తండ్రి కొడుకుతో "అబ్బాయీ! ఎందుకురా నన్ను నిందిస్తావు?" అని అడిగినాడు. కుమారుడు "నాన్నా! నీవు వైదికధర్మాన్ని మంట కలుపుతూ, బ్రాహ్మణు లంటే గిట్టక, శ్రమణు లనే పూజిస్తావు. నీకు సౌగతమతము ఎలా నచ్చిందో నాకు ఆశ్చర్యంగా

ఉన్నది! స్నానాది నియమాలు అక్కర్లేదు. తిండీతిప్పలకు వేళాపాళా అక్కర్లేదు. ఇదేమి మతమో!'' అని పలికినాడు. తండ్రి, "ధర్మానికి రూపములు చాలా ఉంటవి. లోకోత్తర మైన ధర్మమునకూ లోకవిదిత మైన ధర్మమునకూ వ్యత్యాసము ఉంటుంది. రాగముదు వదలివేయ డము, సత్యము భూతదయా బ్రాహ్మణ్యము అవుతుంది. అన్ని జాతులకూ గొప్పవారికీ కొద్దివారికీ అభయ మిచ్చే సౌగత మతాన్ని దూషిస్తున్నావు. అహింసాప్రధాన మైన ఈ జైనమతము నాకు పరమ ప్రీతి కలిగిస్తుంది. నేను చేసేదానిలో అధర్మమేమి ఉన్నది?'' అన్నాడు. తండ్రి మాటలను కుమారుడు పెడచెవిని పెట్టినాడు. ఇద్దరిమధ్యా వచ్చి గడ్డి వేస్తే భగ్గు మంటున్నది.

వితస్తాదత్తుడు కళింగదత్త మహారాజుదగ్గిరికి వెళ్ళి, తన కుమారుడు జైనమతద్వేషి అని చెప్పినాడు. రాజు వైశ్యపుత్రుని యుక్తిగా ఆస్థానానికి పిలిపించి, కోపాన్ని అభినయించి సారథితో "ఈవైశ్య కుమారుడు పాపాత్ముడు. జైనమతద్వేషి. వీణ్ణి వెంటనే చంపివేయాలి'' అని ఆజ్ఞ చేసినాడు. తండ్రి కుమారుణ్ణి రక్షించ మన్నాడు. రాజు రెండుమాసాలు గడువు ఇచ్చినాడు. కుమారుడు తండ్రిదగ్గిరికే వెళ్ళినాడు. "నేనేమి అపచారము చేశాను? రాజుకు నే నేమి అపకారము చేశాను?'' అని రత్నదత్తుడు విచారిస్తున్నాడు. రెండుమాసాలు అయిన తరువాత తన చావు తప్ప దని నిద్రాహారాలు మాని శుష్కిస్తున్నాడు. రెండు నెలలు గడిచిన తరువాత వితస్తాదత్తుడు కుమారుణ్ణి తీసుకొని రాజా స్థానానికి వెళ్ళినాడు. రాజు కుర్రవాణ్ణి చూచి "ఇలా కృశించిపోయినా వేమి? నిన్ను తిండి తిన వద్దన లేదే?'' అన్నాడు. అప్పు డా వైశ్య కుమారుడు "నేను భయమువల్ల నన్నే మరిచినాను. తిండిమాట ఏమి జ్ఞాపకం ఉంటుంది? మీరు ఆజ్ఞాపించిన మృత్యుదండన విన్నప్పటినుంచీ నేను మృత్యువునే జపిస్తున్నాను.'' అని సమాధాన మిచ్చినాడు. రాజు

"నీకు యుక్తితో ప్రాణభయము బోధించినాను. చావంటే అందరికీ భయంగానే ఉంటుంది. మృత్యుభయాన్ని పోగొట్టి రక్షించడముకన్న వేరే ఉపకారము ఏ మున్నది? నీకు మోక్షేచ్ఛ కలిగించే నిమిత్తము ఈ యుక్తి పన్నినాను. మృత్యుభీతుడైన ప్రాజ్ఞుడు ముక్తికి ప్రయత్నిస్తాడు. ఈ ధర్మాన్ని అవలంబించిన నీతండ్రిని నిందించకు —" అని చెప్పినాడు.

వణిక్పుత్రుడు వినయపూర్వకముగా "ధర్మోపదేశము వల్ల ఏలినవారు నన్ను కృతార్థుణ్ణి చేశారు. మోక్షేచ్ఛ కలిగింది. నాకు ఉపదేశము చేయ వేడుకొంటున్నాను" అని రాజును కోరినాడు. నగరోత్సవము వచ్చింది. రాజు నూనె నిండిన పాత్ర వైశ్యపుత్రునికి ఇచ్చి "ఈపాత్రను నీవు చేతిలో పెట్టుకొని ఊరంతా తిరిగి రావాలి. కింద ఒక చుక్కయినా పడకూడదు. ఒక్కబొట్టు పడితే ఈబంట్రోతులు నీతల నరికివేస్తారు." అని ఆజ్ఞాపించి, విచ్చుకత్తులు ధరించిన భటులను వెంటనే పంపినాడు. ఆవణిక్పుత్రుడు భయమువల్ల నూనె చుక్క క్రిందపడనీయక ఊరంతా తిరిగి రాజు దగ్గిరికి వచ్చినాడు. అప్పుడు రాజు "ఓయీ! ఊళ్లోతిరుగుతూ ఏమి చూశావు?" అని ప్రశ్నించినాడు. వైశ్యుడు చేతులు జోడించి "దేవా! నేను ఏమీ చూడలేదు. ఏమీ వినలేదు. కత్తి దెబ్బకు భయపడి, ప్రాణాలమీద తీపివల్ల నూనె బొట్టు క్రింద పడకుండా తదేకదృష్టితో ఉండి నగరమంతా తిరిగినాను. అని సమాధాన మిచ్చినాడు. మహారాజు తత్త్వోపదేశమును ఈవిధముగా చేసినాడు "నీవు దృశ్యమైన తైలము మీదనే మనసు ఉంచి మరేవిషయాన్నీ చూడలేదు. ఆఏకాగ్రతతోనే ధ్యానము చెయ్యి. నీమనస్సు విషయాలమీదకి పోకుండా ఎప్పుడు స్తంభించి పోతుందో అప్పుడు ఆత్మానుభవము కలుగుతుంది. స్వస్వరూపానుభవము కలవానిని కర్మలు అంట లేవు. ఇది నీవు గ్రహించవలసినది." వైశ్యకుమారుడు రాజేం

ద్రుని పాదాలమీద పడి కృతకృత్యుడై గృహోన్ముఖుడైనాడు.

ఇలా కళింగదత్తుడు ప్రజలను కన్నబిడ్డలవలె కాపాడుతున్నాడు. సుగుణరాశి అయిన అతని పత్ని తారాదత్త రాజచంద్రుని వెన్నెలవలె ఉన్నది. ఆరాజదంపతులు శచీపురందరుల వలె సుఖముగాఉన్నారు.

## సురభి దత్త కథ

ఇంద్రుని సమక్షములో స్వర్గరాజ్యమున చక్కని ఉత్సవము జరిగింది. నృత్తము చేసేనిమిత్తము అప్సరసలు అంతా వచ్చారు. సురభిదత్త మాత్రము మహేంద్రునికంట పడలేదు. ఇంద్రుడు యోగదృష్టితో చూసేసరికి సురభిదత్త నందనారామములో విద్యాధరునితో సుఖము అనుభవిస్తున్నది. ఇంద్రునికి కోపమువచ్చింది. "ఈదుర్మార్గులు కామములో కళ్లు కనపడకుండా విచ్చలవిడిగా ఉన్నారు. ఈవిద్యాధరుడు దేవలోకములో ప్రవేశించి వినయము తప్పి ప్రవర్తిస్తున్నాడు. అయినా విద్యాధరుని తప్పిదము ఏ మున్నది? సురభిదత్త తనఅంద చందాలతో అతన్ని ఆకర్షించి వలలోవేసుకొన్నది. ఆకామినీ లావణ్య సముద్రములో పడినవానికి ఇంద్రియనిగ్రహము ఎక్కణ్ణుంచి వస్తుంది? మేనకను చూచి విశ్వామిత్రుడు తపస్సు మానలేదా? శర్మిష్ఠారూపము వల్ల యయాతిగతి ఏ మైంది? బ్రహ్మదేవుడు సృష్టించిన తిలోత్త మను చూచి శివుడు తారుమారు కాలేదా? అప్సరసలు రూపలావణ్యాలవల్ల తపోధనులనుకూడా వశము చేసుకోలేదూ? ఈఅప్సరస పాపాత్మురాలు. దీనికి దేవతలపొందు సరిపడక విద్యాధరుణ్ణి చేపట్టి, నందనారామములో విచ్చలవిడిగా ఉంటున్నది" అని ఆలోచించి మహేంద్రుడు అప్సరసను "పాపాత్మురాలా! మనుష్యస్త్రీవై జన్మించి, అయోనిజను కుమార్తెగా కని నాదగ్గిరికి నీవు వత్తువుగాక!" అని శపించినాడు.

ఈలోగా తక్షశిలాపురములో కళింగరాజుభార్య ఋతిమతిగా ఉన్నది. ఇంద్రశాపముచేత స్వర్గపతితురా లయిన సురభిదత్త అనే అప్సరస కళింగరాణి గర్భవాసములో ప్రవేశించింది. అప్సరస కడుపున పడడముచేత ఆరాణి మరీ అందముగా ఉన్నది. ఆకళింగరాణి తారా దత్తాదేవి స్వప్నములో ఆకాశమునుంచి కాంతి జారి తనగర్భములో పడినట్టు చూచి తెల్లవారిన తరువాత భర్తతో చెప్పింది. కళింగరాజు సంతోషపడి "దేవీ! దివ్యులు శాపవశాన మనుష్యగర్భాన ఉద్భవిస్తారు. ఎవరో దేవతా సంబంధమయినవారు నీగర్భవాసంలో ఉన్నారు. జీవులు పుణ్యపాపకర్మాచరణవల్ల శుభాశుభ ఫలాలు అనుభవిస్తూ త్రిభువనములలో సంచారము చేస్తారు" అని పలికినాడు.

భర్తమాటలు విని మాటల సందర్భములో రాణి ఇలాఅన్నది. "కర్మబలీయము. అదే శుభాశుభభోగములను ఇస్తుంది. అందుకు నిదర్శనముగా వినండి:

పూర్వము కోసలదేశములో ధర్మదత్తమహారాజుకు నాగశ్రీ అనే పతివ్రత భార్యగా ఉన్నది. ఆమె అపరఅరుంధతి అని ఆనోటా ఆనోటా అంతా చెప్పుకొనేవారు. కాలక్రమేణ నాగశ్రీకి నేను జన్మించినాను. నాకు బాల్యములోనే తల్లి ఆకస్మికంగా జన్మాంతరమును స్మరించి మానాన్నగారితో "రాజేంద్రా! హఠాత్తుగా నాకు పూర్వజన్మము జ్ఞప్తికి వచ్చింది. అది చెప్పకపోతే ఆనందము పోతుంది. చెపితే నాకు మారకము. నాకు దరీతోవా కనపడదు!" అన్నది.

రాజు "ప్రేయసీ! ఆకస్మికంగా నాకు పూర్వజన్మ జ్ఞానము కలిగింది. నాసంగతి నీకూ, నీవిషయము నాకూ పరస్పరమూ చెప్పుకుందాము. ఏదయితే అది అవుతుంది. కానున్నది కాకమానదు. విధిని తప్పించ లేము కద!" అని ప్రేరేపణ చేయుగా రాణి అంటున్నది:

## తారా దత్త కథ

"రాజా! ఈ దేశంలోనే మాధవుడనే బ్రాహ్మణుని ఇంటిలో నేను పూర్వజన్మలో సువృత్త అనే పేరుతో దాసీదాన్ని. దేవదాసుడు అనే వాడు నాభర్త. ఆయన మహాయోగ్యుడు. ఒక షావుకారు దగ్గిర ఆయన ఉండేవారు. మాకు ముంతా కుండా, చీపురూ మంచము, నేనూ మావారూ అని మూడు జత లుండేవి. ఇద్దరమూ కీచులాడుకోక పూసలలో దారంలాగ కలిసిమెలిసి ఉండేవాళ్ళము. ఇంటికి అతిధీ అభ్యాగతీ, చుట్టపక్కములూ వస్తే కలో గంజో ఇంతపోసేవాళ్ళం. మేము కట్టుకోగా బట్టలు ఉంటే బీదా సాదాకు ఇవ్వడం కద్దు. ఇలా ఉంటూ ఉండగా దేశమంతటా కరువు వచ్చింది. మాకు రోజూ దొరికే తిండీ తిప్పలు తగ్గిపోగా, ఆకలి మంటతో అటమటించినప్పుడు ఒక బ్రాహ్మణుడు మాగుమ్మంలోకి అతిథిగా వచ్చాడు. మావారూ నేనూ తిండిలేక శోషవచ్చి కాటికి కాళ్ళు చాచుకొని అతిధికి ఉన్నకాస్తా వడ్డించాము. ఆయన తిని గుమ్మము దాటినాడో లేదో, వెంటనే మావారు కాలం చేశారు. ఆయనకు చితి పేర్చి నేను సహగమనము చేసినాను. అనంతరము రాజమందిరంలో పుట్టి మీకు దేవిని అయినాను. సుకృతవృక్షము వెంటనే ఊహించని ఫలమును కాస్తుంది కదా!"

ధర్మదత్తుడు "ప్రేయసీ! అవును. నేనే పూర్వజన్మంలో నీభర్తను. ఆదేవదాసుణ్ణి నేనే. నాకు పూర్వజన్మ జ్ఞానము కలిగింది." అని పలికినాడు. రాజూ రాణీ ఇద్దరూ కాలము చేసినారు. ఇలా నాతల్లిదండ్రులు గతించగా పినతల్లి నన్ను తీసుకుపోయి పెంచింది. నేను కన్యగా ఉన్నప్పుడు, మునీంద్రుడు అతిథిగా వచ్చాడు. ఆయనకు శుశ్రూష చేస్తూ అతని వరమువల్ల ఆ ధార్మికుణ్ణి పతిగా చేసుకొన్నాను. ఇలా ధర్మము చేత కల్యాణము ప్రాప్తమవుతుంది. ధర్మమువల్లనే మా తల్లిదండ్రులు రాజ్యాన్ని, జన్మాంతరజ్ఞానాన్ని పొందినారు.

తారాదేవి మాటలు విని కళింగదత్తుడు ధర్మము ఆచరిస్తే మహా ఫలము కలుగుతుంది. అందుకునిదర్శనంగావిను'' అని కథ చెపుతున్నాడు:

## సప్తద్విజ కథ

కుండిన పురంలో ఒక బ్రాహ్మణోపాధ్యాయునికి ఏడుగురు కుమారులు శిష్యులు. ఒకసారి కరువు రావడంవల్ల ఆయన చాలా గోవులున్న తన మామగారి దగ్గిరికి వెళ్ళి ఒక ఆవును అడిగి తోలుకొని రమ్మని శిష్యులను పంపినాడు. శిష్యులు గుర్వాజ్ఞను అనుసరించి వెళ్ళి గోవును అడిగినారు. ఆయన ఆవును అడిగిన వెంటనే అల్లుడి శిష్యులకు అర్పించాడే కాని అన్నాతురు లయిన శిష్యులకు అన్నము పెట్టలేదు. వాళ్ళు గోవును తోలుకొని వస్తూ మార్గమధ్యములో ఆకలి బాధతో నేలమీద పడి ఇలా విచారించారు: "గురువుగారి గృహము దూరాన ఉన్నది. మనము కష్టాలపాలైనాము. మనకు ఏవిధంగానైనా పట్టెడు అన్నము దొరికే విధము కనపడదు. ఈ గోవు మాత్రము నిర్జల ప్రదేశంలో, తృణకాష్ఠములు లేని చోట ఎలా బతుకుతుంది? ఇది చావక మానదు. గురువు గారి కార్యము అప్పుడు ఎలా నెరవేరుతుంది? అందుచేత గోవులో కొంతమాంసము తీసి ప్రాణము నిలుపుకొని, మిగతా గోమాంసము గురువుకు అర్పిద్దాము. కరువుకాలములో ఎలాగో కడుపులు నిండాలి కదా!'' అలా శిష్యులు అందరూ కూడబలుకుకొని ఆ సబ్రహ్మచారులు ఏడుగురూ యథావిధిగా గోవును వధించి, దేవపూజ, పితృతర్పణాలుచేసి కొంతగోమాంసము భక్షించి, మిగతా గురువుగారికి అర్పించి జరిగిన దంతా చెప్పినారు. అపరాధులు నిజము చెప్పినందుకు గురువు సంతోషించినాడు. ఆ ఏడుగురూ ఏడురోజులలో ఆకలితో చచ్చి, సత్యముచేత జాతిస్మరులై జన్మించినారు. సంకల్పము శుద్ధ మైతే సత్ఫలము, సంకల్పము దుష్టమైతే అనిష్టఫలము సంభవిస్తవి.

## విప్ర చండాల కథ

ఒకసారి గంగలో ఒక బ్రాహ్మణుడూ, ఒక పంచముడూ నిరాహారులై తపస్సు చేస్తున్నారు. బ్రాహ్మణునకు విపరీతముగా ఆకలి వేసింది. నదిలో చేపలు పట్టి తింటున్న పల్లెవాళ్ళను చూచి బ్రాహ్మణుడు "ఆహా! ఈ బెస్త వాళ్ళు లోకములో నిజంగా ధన్యులు! వీళ్ళు యథేచ్ఛగా మత్స్యమాంసాన్ని తింటారు!" అని మూఢతతో ఆలోచించినాడు. తపస్సు చేస్తున్న పంచముడు పల్లె వాళ్ళను చూచి "వీళ్ళు ప్రాణిహింస చేసే కిరాతకులు. ఈ మాంసము తినేవాళ్ళ బతుకూ బతుకేనా? ఛీ! వీళ్ళ మొహాలు చూస్తేనే పాపం!" అని కళ్ళు మూసుకొని ఆత్మ నిష్ఠుడైనాడు. క్రమేణా విప్రుడూ, చండాలుడూ తిండి లేక చనిపోయినారు. వాళ్ళలో బ్రాహ్మణ్ణి కుక్కలు పీక్కు తిన్నవి. పంచముని శరీరము గంగాజలములో శిథిల మైనది. అనంతరము బ్రాహ్మణుడు చిత్త సంస్కారము తక్కువకావడమువల్ల పల్లెవాళ్ళలో పుట్టి, తీర్థమహిమచేత జాతిస్మరుడు అయినాడు. చండాలుడు ఆత్మశుద్ధి ప్రభావమువల్ల అక్కడే గంగాతీరాన జాతిస్మరు డైన బ్రాహ్మణుడై జన్మించినాడు. వాళ్ళిద్దరూ పూర్వజన్మలను స్మరించుకొన్నారు. పల్లెవానికి పశ్చాత్తాపము కలిగింది. బ్రాహ్మణుడు రాజై సంతోషించినాడు. ఎవని చిత్తము శుద్ధమో వాడు తదనుగుణ మైన ఫలాన్నే అనుభవిస్తాడు.

కళింగదత్తుడు ప్రసంగవశాన, "దేవీ! సత్వగుణమువల్ల చేసే కర్మ సత్ఫలాన్నే ఇస్తుంది. అందుకు నిదర్శనం చెపుతాను." అని ప్రారంభించినాడు.

## విప్రవీరుని కథ

అవంతి దేశములో ప్రసిద్ధ మైన ఉజ్జయినీ నగరాన్ని విక్రమసింహ మహారాజు పాలిస్తున్నాడు. అతనికి శత్రువులు లేకపోవడమువల్ల యుద్ధ

మంటే రోత కలిగింది. ఇంగిత మెరిగిన అమరగుప్తు డనే మంత్రి ఇలా పలికినాడు: "రాజేంద్రా! బాహుబలమూ, అస్త్ర శస్త్రాలవల్ల మదమూ ఉండగా శత్రుకోటి ఏర్పడుతుంది. పూర్వము బాణాసురుడు భుజసహస్ర దర్పము చేత హరుణ్ణి ఆరాధించి, యుద్ధయోగ్యు డయిన శత్రువును యాచించినాడు. శివుడు అతనికి వరమిచ్చి హరిని శత్రువుగా చేసినాడు. యుద్ధములో విష్ణుమూర్తి బాణాసురుని సహస్రబాహు వనాన్ని నరికి వేసినాడు. అందుచేత నీవు యుద్ధము లే దని విచారపడకు. శత్రురూప మైన అనిష్టమును ఎవ్వడూ వాంఛ చేయకు. నీ బాహుబలమునూ, శస్త్రవిద్యా పాటవాన్నీ వేటలో చూపించు. రాజులకు వేట వ్యాయామము వంటిది. శ్రమ ఓర్వలేని రాజులు యుద్ధానికి పనికిరారు. అడవి మృగాలను వేటాడు. అయితే వేటకూడా మితముగా ఉండాలి. పాండురాజు మొద లయినవాళ్ళు మృగయావ్యసనము వల్లనే నశించినారు." విక్రమసింహుడు మంత్రి మాటలు విని అంగీకరించినాడు.

మర్నాడు మహారాజు వేటకు వెళ్ళినాడు. భూమి యావత్తూ అశ్వములతో, కాల్బలముతో వేటవాళ్ళ సింహనాదాలు నిండగా, రాజు బయలుదేరినాడు. అడవిలో పెద్దపులులు గర్జించగా కొండ గుహాలు ప్రతిధ్వనించగా మహారాజు మహానందము పొందినాడు. ఏనుగులను చంపగలిగిన సింహములను అతడు కూల్చి వాటి గోళ్ళనుంచి రాలిన ముత్యాలను తన పరాక్రమబీజాలవలె భూమిమీద వెదజల్లినాడు. జింకలు వంకరటింకరగా దూకుతూ అతని తోవకు అడ్డు వచ్చినవి. వెంటనే రాజు బాణము వదిలి జింకను కొట్టినాడు. చాలాసేపు అతడు వేటాడి అలిసి సొలిసి ఉజ్జయినికి మరలినాడు. ఒక శిథిల దేవాలయములో ఇద్దరు పురుషులు గుసగుస లాడుకొంటున్నారు. బహుశః వాళ్ళు వేగులవాళ్ళు అయి ఉంటా రని రాజు తలచి, ప్రతీహారుని పంపి ఇద్దర్నీ కట్టించి చెరలో ఉంచ మని ఆజ్ఞ ఇచ్చినాడు. మర్నాడు రాజు

వాళ్ళను దర్బారుకు పిలిపించి "మీరెవరు? అంతసేపు రహస్యాలోచనలు చేస్తున్నారేమి? ఏమిటి రహస్యముగా మీరు మాట్లాడేది?" అని ప్రశ్నించినాడు. వాళ్లు అభయ మడిగినారు. అందులో పడుచువాడు ఇలా విన్నవించినాడు :

"రాజా! ఉన్నది ఉన్నట్టు చెపుతాను. ఈ ఉజ్జయినిలో కరభకుడనే బ్రాహ్మణుడు మహావీరుడైన కుమారుడు కలగవలెనని అగ్ని దేవుణ్ణి ఆరాధించగా, ఆయనకు నేను పుట్టినాను. మా నాన్నగారు కాలము చేయగా మాఅమ్మ సహగమనము చేసింది. నాకు చిన్న తనములో చదువు అంటలేదు. నన్ను కనిపెట్టి చూచేవాళ్ళు లేక, నేను ధర్మమార్గమును అతిక్రమించి యథేచ్ఛగా జూదమూ శస్త్రవిద్యలు నేర్చినాను. శిక్షణ లేని జీవితము విచ్చలవిడిగా ఉంటుంది. నూనూగు మీసాల వయసులో వేటకు వెళ్లి విల్లు ఎక్కుపెడుతున్నాను. అప్పుడే ఉజ్జయినినుంచి పెళ్ళికూతురు బండీలో పెళ్ళివారితో తరలిపోతున్నది. హఠాత్తుగా ఏనుగు మదమువల్ల గొలుసు తెంపుకొని ఎక్కణ్ణించో ఆ పెళ్ళికుమార్తె మీదికి వచ్చింది. పిల్లతో కూడా వచ్చే పెళ్ళివారు భయపడి పారిపోయినారు. ఆ అమ్మాయిని చూచి "అయ్యో! పెళ్లి కూతుర్ని వదిలి వెళ్ళారు పెళ్లివారు! ఈ సుందరిని రక్షించాలి. ఆపదలో ఉన్నవాళ్లను కాపాడని నాబతుకు ఎందుకు? నాపౌరుషము కాల్పనా!" అనుకొని నేను ఏనుగును ఎదిరించాను. ఆగజము నామీదికి వస్తున్నప్పుడు, ఆకన్య భయపడి నాకేసి చూస్తున్నది. నేను కొంతదూరము ఏనుగును ఆకర్షించుకుపోయి ఆకుల జొంపముతో ఉన్న చెట్టులో దాగినాను. వృక్షశాఖను ఏనుగ చూర్ణము చేసి వెళ్ళిపోయింది.

తర్వాత నేను ఆసుందరి దగ్గిరికి పోయి "ఏమమ్మా భయపడ్డావా," అని అడిగినాను. ఆకన్య నన్ను చూచి కన్నుల నీరు నింపుతూ, సంతోషముతో అన్నది. "దుర్మార్గుని పాలయిన నాకు కుశల మెక్కడిది?

నన్ను కష్టాల్లో ఉంచి నాభర్త పిరికిపంద్రై పారిపోయినాడు. వాడునాకు భర్త కాడు. మృత్యువునుంచి రక్షించిన నీవే నాభర్తవు. అదుగో అతడు నాకర్లతో త్వరగా వస్తున్నాడు. నీవు మెల్లగా నావెనకనే రా. సందు దొరకగానే పారిపోదాము.'' నేను అందుకు అంగీకరించి "అందగత్తె తనంత తాను వలచి వచ్చినప్పటికీ పరస్త్రీ మన కెందుకు? '' అని మళ్లీ ఆలోచించినాను. క్షణములో ఆసుందరిని రక్షించేనిమిత్తము ఆమె భర్త వచ్చినాడు. పెళ్ళివారంతా కలిసి నడుస్తున్నారు. పెళ్ళికూతురు ఇచ్చిన దారిబత్తెముతో నేను మూరు దారిని వాళ్ళవెంట వెళ్ళినాను. పెళ్ళి కూతురు పెళ్ళికొడుకును మార్గములో తాకకుండా, గజభీతివల్ల వరు గెత్తితే శరీరము అలసిపోయిందని వంకపెట్టిందట. తరుణి ఫణామణితో హృదయాంతర విషజ్వాలతో ఉన్న పాము వలె అందరికీ అపకారము చేస్తుంది. క్రమేణా మేము పెళ్ళివారితో వాళ్ళ ఊరు వెళ్ళి వర్త కుల మని చెప్పినాము. ఆ పగటివేళ అందరమూ ఊరి వెలుపల దేవా లయములో ఉండగా ఈ బ్రాహ్మణమిత్రుడు నన్ను కలుసుకొన్నాడు. క్షణములో మాకు అన్యోన్య స్నేహానుబంధము ఏర్పడింది. ఇతనితో నారహస్యము అంతా పూసగుచ్చినట్టు చెప్పినాను. విని ఇతడు నిస్సందేహ ముగా "నెమ్మదిగా ఉండు. నీకోరిక సిద్ధిస్తుంది. అందుకు తగినఉపాయము ఉన్నది. ఈమెకు ఆడబిడ్డ ఉన్నది. అది నాతో రావడానికి సిద్ధముగా ఉంది. దాని సహాయమువల్ల నీఅభీష్టము నెరవేరుస్తాను'' అని నాతో పలికినాడు. ఈవిప్రుడు వైశ్యవధువు ఆడబిడ్డదగ్గిరికివెళ్ళి నారహస్యమంతా చెప్పినాడు. మర్నాడు ఆ ఆడబిడ్డ సంకేతస్థానము ఏర్పాటుచేసి పెళ్లికూతు రిని దేవాలయములోకి తీసుకొని వచ్చింది. గుళ్ళో ఉన్న నాస్నేహితునికి ఆడబిడ్డ తన వదినెగారి వేషము వేసింది. ఆవేషముతో ఇతన్ని ఊళ్ళోకి తీసుకొని పోయి అన్నతో కూడా గృహప్రవేశము జరిపింది. ఆమె చేసిన ఉపాయ ప్రకారము నేను పెళ్ళికుమార్తెకు పురుష వేషము వేసి

ఇక్కడికి తీసుకొని వచ్చాను. ఆరాత్రి అందరూ ఉత్సవముల్లో మునిగి గాఢనిద్రలో ఉండగా ఆమె ఇతనితో లేచి వచ్చింది. ఎవరికంట పడ కుండా ఈ బ్రాహ్మణమిత్రుడు ఆమెను తీసుకొని మధ్య మకాములు చేసి చివరకు నన్ను కలిసినాడు. ఇలా మేము ఇద్దరమూ తేమంత వలచి వచ్చిన పడుచు భార్యల్ని సంపాదించినాము. నిర్భయముగా కాపురము చేయడానికి మాకు లోకభయము ఎక్కువగా ఉన్నది. చేసిన సాహసా నికి మనస్సు నెమ్మదిగా ఎలా ఉంటుంది? ఉండడానికి బస, జీవయాత్రకు ధనార్జన మొదలైన విషయాలు మేము మాట్లాడుకొంటూ ఉండగా ఏలినవారు దూరాన్నుంచి మమ్మల్ని చూచి పిలిపించి బంధించి వేగుల వాళ్ళ మని భ్రమపడి చెరలో ఉంచినారు. మహారాజా! ఏలిక అజ్ఞవల్ల మాసంగతి ఉన్నది ఉన్నట్టు విన్నవించుకొన్నాము. అటుపైన ఏలిన వారి చిత్తము!"

విక్రమసింహుడు సంతోషించి "బాగా ఉంది. మీరు భయపడ వద్దు. ఈ వూళ్ళోనే ఉండండి. మీకు ధనము కావలిస్తే ఇస్తాను." అని పలికి వాళ్ళకు సొమ్ము ఇచ్చినాడు. వాళ్ళు భార్యలతో రాజుదగ్గిర చిరకాలము సుఖముగా ఉన్నారు.

దేవీ! ఈప్రకారము పౌరుషముతో కార్యములు నెరవేరిస్తే సంపదలు తుల తూగుతవి. పురుషకారము ఉన్న బుద్ధిమంతులను చూచి సంతోష పడి రాజులు అపారముగా ధనము ఇస్తారు. ఇలాగే పూర్వము చేసు కొన్న కర్మవిశేషమువల్ల ప్రస్తుతము సుఖదుఃఖాలు అనుభవిస్తూ ఉంటాము. అందుచేత స్వప్నములో ఆకాశమునుంచి నీగర్భములోకి వచ్చిన కాంతి ఏదో దేవతాసంబంధ మైనది. కర్మవశాన ఆ కాంతి నీదేహములో ప్రవేశించినది. ఇలా భర్త చెప్పగా తారాదేవి గర్భిణియై చాలా సంతోషము అనుభవించింది.

## కళింగసేనా జననము

తారాదత్త గర్భ భారముతో ఓపలేకుండా ఉంది. ఆమె ముఖము తెల్లనై చంద్రోదయానికి పూర్వ మున్న తూర్పు దిక్కు వలె ఉన్నది. ఆమె వెంటనే ఆడపిల్లను కన్నది. "అయ్యో, మొగపిల్లవాడు పుట్ట లేదే" అన్నట్టు స్నేహముతో ఉన్న దీపకళికలు స్త్రీ శిశు కాంతి వల్ల వెలవెల పోయినవి. తండ్రి మగబిడ్డ పుట్టలే దని విచారించినాడు. ఆడ పిల్ల పుడితే అంత విచార మెందుకో? కుమారుడే పుడితే ఆనందము మూర్తీభవిస్తుంది. మహారాజు మనస్సుకు ఉల్లాసము కలిగించుకోడానికి జిన ప్రతిమ లున్న విహారానికి వెళ్ళి సంఘములో కూర్చున్న సన్యాసిని చూచి అతని ధర్మబోధ విన్నాడు.

అర్థాన్ని దానము చేయడమే సంసారములో తపస్సు. అర్థదాత ప్రాణదాత. ప్రాణము అర్థములో నిలిచి ఉన్నది. బుద్ధదేవుడు దయా స్నిగ్ధహృదయముతో లోకకల్యాణానికి స్వార్థాన్ని తృణప్రాయము చేసినాడు. సమస్త భోగాలను త్యజించినాడు. సాధన చేసి బోధిసత్త్వ డైనాడు. శరీరము ఉన్నంత వరకూ జ్ఞాని ప్రాణిహితము కోసము కర్మ చేయవలె. అందుకు నిర్శనము విను:

## కృత పుత్రికల కథ

పూర్వము కృతమహారాజునకు ఏడుగురు అందమైన పుత్రికలు కలిగినారు. వాళ్లు పసితనములోనే ప్రపంచాన్ని విరక్తితో చూచి ఇల్లు వదిలి శ్మశానానికి వెళ్ళినారు. వాళ్లు పరిజనులతో ఇలా చెప్పినారు: "ఈజగత్తు నిస్సారము. శరీరము నశిస్తుంది. స్వప్నములో భాసించిన విషయాలు యథార్థము కానట్టు, శరీరముకూడా లేనిదే.

సంసారములో పరోపకారము ముఖ్యధర్మము. శరీరము ఉన్నందుకు సకలప్రాణికోటికి హితాన్ని చేస్తాము. ఈశరీరాన్ని శ్మశానములో మాంసము తినే జంతువులకు వదిలేస్తాము. చక్కని శరీర మయిన మాత్రాన ప్రయోజనము ఏ మున్నది? పూర్వము ఒక రాజపుత్రుడు అందగాడైనా విరాగియై సన్యసించినాడు. అతడు భిక్షుకై ఒకవైశ్యుని గుమ్మము తొక్కగా, ఆఇంటావిడ రాజపుత్రుని చక్కదనము చూచి మనసులో ఉవ్విళ్ళూరింది. "సుకుమారుడవు. ఇంత కఠినవ్రతాన్ని అవలంబించా వేమి? నీకన్నుల సొంపు చూచిన జవరాలు ధన్యురాలు. నీవు ఎవతెను చూస్తే ఆమె ధన్యురాలు!" అన్నది గృహిణి. అప్పుడు ఆభిక్షువు ఒకకన్ను ఊడబీకుకొని చేత పెట్టుకొని 'అమ్మాయీ, చూడు ఆకన్ను ఇలాంటిది. ఎంత రోతగా ఉందో చూడు. ఈరక్తమూ మాంసమూ చూడ శక్యమా? నీకు ఇష్టమైతే ఈకన్ను అట్టే పెట్టుకో. రెండవకన్నుకూడా ఇలాంటిదే. పోనీ గాని రెండు కళ్ళల్లో ఏది రమ్యముగా ఉంది?" అని పరీక్షించినాడు. ఆగృహిణికి విచారము కలిగి "అయ్యయ్యో! పనికి మాలిన దాన్ని! ఎంత పాపిష్ఠిదాన్ని! నీవు కళ్లు పెకలించుకొన్నావు. అయ్యో, నామూలాన ఎంతపని జరిగింది!" అని మథనపడింది. భిక్షురూపములో ఉన్న ఆరాజపుత్రుడు ఆమెను విచారపడవద్దనీ, తనకు మహోపకారము కలిగిందనీ చెప్పి, అందుకు నిదర్శనముగా కథ చెప్పినాడు:

## యతి కథ

పూర్వము ఒక సన్యాసి వైరాగ్యాన్ని గట్టిపరుచుకోవలె నని గంగాతీరాన ఉన్న వనవాటిలో తపస్సు చేస్తూన్నప్పుడు, విధివశాన రాజొకడు అంతఃపురకాంతలతో అక్కడికి విహారార్థము వచ్చి మధువు అధికముగా పానము చేయడమువల్ల మత్తిల్లినాడు. రాణులు రాజు

చెంత ఉండక చాపల్యము కొద్దీ వన మంతా తిరిగి సమాధినిష్ఠా గరిష్ఠుడై ఉన్న సన్యాసి చుట్టూ నిలువ బడి కుతూహలముతో అతన్ని చూస్తూన్నారు. ఈలోగా తెలివి వచ్చి రాజు రాణులకై వెతికి, మునీంద్రుని వద్ద నున్న తన భార్యలను చూచి, ఈర్ష్యపడి వెంటనే కత్తి దూసి సన్యాసిని కొట్టినాడు. కత్తికోత పడినా ఆ ముని కోపగించక ప్రసన్నుడై ఉండగా ఒక దేవత ప్రత్యక్షమై "మహాత్మా! నీకు అపకారము చేసిన దుర్మార్గుణ్ణి చంపివేస్తాను. ఎవడు వాడు!" అని అడిగింది. ఆ ముని "దేవీ! అతడు నాకు ఉపకారి, అపకారి కాడు. అతని అనుగ్రహమువల్ల నేను క్షమాశీలాన్ని పొందినాను. నన్ను అతడు పరీక్ష చేసినాడు. నేను అతన్ని క్షమించాను. ఈ పరీక్ష లేకపోతే ఎవరిని నేను క్షమించడము! నశ్వర మైన ఈ దేహానికి కోప మనగా ఎటువంటిది? ప్రియమునూ, అప్రియమునూ సమదృష్టితో చూచినప్పుడే క్షమ. అదే బ్రహ్మపదము." అని పలికేసరికి దేవత సంతోషపడి అతని గాయాలు మాన్పి అదృశ్యురా లైంది.

ఆ మునీంద్రుడు రాజును ఎలా ఉపకారిగా భావించాడో అలాగే ఓ తల్లీ, నీవు నాకు మహోపకారిణివిగా భావిస్తాను. ఆమె అతని పాదాల మ్రోల వాలింది. ఆభిక్షువు దేహమును రోసి తపస్సుకు వెళ్ళినాడు. పడుచుతనములోకూడా దేహాభిమానము ఎందుకు ఉండాలి? దేహము ఉన్నందుకు పరోపకారము విఘ్న్యక్తిధర్మము. అందువల్ల మేము శ్మశానములో పాడు శరీరాన్ని ప్రాణిహితము కోసము పారవేస్తాము." ఆ ఏడుగురు రాజకన్యలూ సిద్ధి పొందినారు. ఇలాగే జ్ఞానులకు శరీరము మీాద మమకారము ఉండదు. దార పుత్రాదుల మీాద మమకారము ఉండదు.

కళింగదత్తుడు బౌద్ధ విహారములో ధర్మపన్నాలు వింటూ ఆ దినమంతా గడిపి తన మందిరానికి వెళ్ళినాడు. అక్కడికి వెళ్ళగానే 'అయ్యో!

నా కుమారికి స్త్రీ శిశువు పుట్టిందే' అని మళ్ళీ విచారపడగా ఒక పెద్ద ఇంటి బ్రాహ్మణుడు ఇలా అన్నాడు: "రాజేంద్రా! ఆడపిల్ల పుట్టిందని అంత విచారిస్తావేమి? కొడుకులకన్న కూతుళ్ళే నయం. ఇహపరాలకు మే లయినవాళ్ళు. కొడుకులు పుట్టి రాజ్యలోభమువల్ల తండ్రినే సంహారము చేస్తారు. కుంతి భోజుడు మొదలయిన రాజులు కొడుకులవల్ల బాధలు పడితే, దూర్వాసుడు రక్షించాడు. కన్యాదానమువల్ల వచ్చే ఫలము — ముఖ్యంగా పరలోక ఫలము — పుత్రునివల్ల రాదు గదా. అందుకు తార్కాణము విను :

## సులోచన కథ

చిత్రకూటపర్వతముమీద అపరమన్మథు డనిపించే సుషేణ మహారాజు నందనవనముకన్న సుందరవనము వేయించి, దానిమధ్య దిగుడు బావి ఏర్పాటు చేసినాడు. రత్నాలతో ఉన్న బావిగట్టున తగినభార్య లేదని విచారముతో కూర్చున్నాడు. ఒకనాడు రంభ ఇంద్రభవనము నుంచి షికారుగా ఆత్రోవనేవచ్చి ఆరాజును చూచి "ఇతడు మన్మథుడా? అలా అయితే ఇతనిప్రేయసి రతీదేవి ఏది?" అనుకొని ఆకాశమునుంచి వనములోకి దిగి మానవరూపముతో అతనిపక్కకు వెళ్ళింది. రంభను చూచి రాజు ఆశ్చర్యపడి "ఈమె మనుష్యస్త్రీ కాదు. ఎవరీ అందగత్తె? ఈమెపాదాలకు ధూళి అంటదే! రెప్పపాటు లేదే! దివ్యస్త్రీ వలె తోస్తున్నది. ఎవ రని ఈమెను అడిగితే వెంటనే వెళ్ళిపోతుంది. కారణ విశేషమువల్ల ఇక్కడికి వచ్చింది," అని తలచినాడు. ఆమె అతన్ని పలుకరించి కంఠాన్ని కౌగలించుకొన్నది. ఇద్దరూ ఇహలోకసుఖాలు కొంతకాలము అనుభవించినారు. రంభ కొన్నాళ్లపాటు స్వర్గసీమను మరిచింది. ప్రేమ రమణీయమే కాని జన్మభూమికాదు గదా! రంభ

చెలికత్తె అయిన యక్షిణి ఆకాశమునుంచి బంగారుపురాసులు వర్షించగా ఆరాజ్యము మేరుశిఖరాలతో నిండిన ఆకాశమువలె ఉన్నది.

కాలక్రమేణ రంభ గర్భిణియై సాటిలేని స్ఫురద్రూపిణి యైన శిశువును కన్నది. ఆమె రాజుతో "రాజన్! నాశాపము తీరింది. నన్ను రంభఅంటారు. నిన్ను చూచి వలచినాను. శిశువును కని నీకు వదిలి వెళ్ళిపోతున్నాను. ఈపిల్లను నీవు పువ్వుల్లో పెట్టి కాపాడు. దీనికి వివాహము సంప్రాప్తమైనప్పుడు మన ఇద్దరికీ స్వర్గములో సమావేశము సంభవిస్తుంది" అని పలికి వివశురాలై అదృశ్య మైనది. రంభ వెళ్ళగానే సుషేణుడు వియోగదుఃఖమువల్ల శరీరాన్ని వదలివేతా మనుకొన్నాడు. మంత్రులు "మేనక శకుంతలను కని వెళ్ళిపోగా విశ్వామిత్రుడు ప్రాణాలు వదల లేదు. అలాగే మీరూ ఉండండి" అని పలకినారు. రంభా సమాగమకారణ మయిన ఆబిడ్డను ఎత్తుకొని రాజు ఆపిల్ల కన్నుగవ చూచి సులోచన అని నామకరణము చేశాడు. ఆకన్యకు క్రమేణ వయసు వచ్చింది. ఒకనాడు ఆమె సుందరోద్యానములో విహారము చేస్తూ ఉండగా వత్సుడు అనే యువమౌని చూచి వలచినాడు. "ఎంత చక్కనిచుక్క! దీన్ని పొందని నాతపస్సు దండుగచేటు!" అని అతడు తలచినాడు. సులోచన అతన్ని చూచి భ్రమసి "ఎవ రితను? దండ కమండలాలు ధరించిన తపోధనుడు. చక్కగా ఉన్నాడే!" అని వ్యామోహవశి దగ్గిరికి వెళ్ళి నల్లకలువలవంటి తన చూపుల తోరణాలు అతనిమీద వేసి, నమస్కరించింది. అతడు వెంటనే ఆమెకు వివాహ ప్రాప్తి రస్తు! అని ఆశీర్వదించినాడు. అతని అందచందాలకు ఆమె సిగ్గు చితికింది. సులోచన శిరస్సు వంచి "ఇదే మీకోరిక అయితే, పరిహాసము కాకపోతే, మానాన్నగారిని మీరు యాచించండి. అప్పుడు నన్ను వివాహము చేసుకొందురుగాని," అన్నది. ఆ యువముని సులోచన వంశ ప్రతిష్ఠ తెలుసుకొని, ఆమె జనకు డైన సుషేణుని దగ్గిరికి

వెళ్ళి పిల్లను ఇమ్మని అడిగినాడు. యువముని తపస్సౌందర్యము ముఖము మీాద ఉట్టి పడుతూ ఉండగా సుషేణుడు చూచి ఆతిథ్యము చేసి సత్కరించి "స్వామిన్! ఈకన్య నాకు రంభవల్ల కలిగింది. ఈకన్యకు మూడు ముళ్లూ పడితే, స్వర్గములో నాకు రంభా సమాగమ మవుతుంది. ఈవిషయము రంభ నాకు చెప్పింది" అని పలికినాడు.

మునికుమారుడు క్షణము ఆలోచించినాడు.

'పూర్వము మేనక కుమార్తె ప్రమద్వరను సర్పదష్టను రురువు తన ఆయుర్దాయములో సగ మిచ్చి బతికించి వివాహము చేసుకోలేదా? త్రిశంకుణ్ణి విశ్వామిత్రుడు స్వర్గానికి పంపలేదూ? అలాగే నేనూ నా తపోధనాన్ని వెచ్చిస్తే ఈకార్యము సాధించలేనా?' అని అతడు తలచి 'ఈపని భారము కాదు' అని సమాధానము చెప్పినాడు. అతడు రాజసభలో సభాసదులందరూ వినవలె నని "దేవతలారా! ఈమహారాజు నా తపోభాగ మాత్రమున శరీరముతోనే రంభా సమాగమానికై స్వర్గలోకానికి పోవును గాక" అనేప్పటికి తథాస్తు అని దివ్యవాణి కూడా పలికింది. అప్పుడు సుషేణుడు తనకుమారిని అతని కిచ్చి నాకలోకానికి వెళ్ళి దివ్యత్వము పొంది ఇంద్రాజ్ఞవల్ల వచ్చిన రంభతో స్వర్గసుఖాల్లో మునిగి తేలుతున్నాడు.

రాజన్! ఇలా సుషేణుడు కన్యాదానము వల్ల కృతార్థు డైనాడు. మీావంటి గొప్పవారి ఇళ్ళల్లో దివ్యకన్యలు జన్మిస్తారు. ఈమె ఎవరో దివ్యాంగన. శాపభ్రష్టయై నీకూతురు అయింది. ఆడపిల్ల పుట్టిందని అంత విచారపడకు. ఇలాగా పెద్దఇంటి బ్రాహ్మణుని వల్ల కళింగదత్త మహారాజు గాథను విని నిశ్చింతగా ఉన్నాడు.

ఆయన కన్నులపండుగ కలుగ చేస్తున్న కుమార్తెకు కళింగసేన అని పేరు పెట్టినాడు. ఆపిల్ల దిన దిన ప్రవర్ధమానమై చెలికత్తెలతో చెలిమి చేస్తూ, ఉద్యానవనాలలో రమణీయ ప్రాసాదాలలో తిరుగుతూ క్రీడా

రసములో సుఖముగా కాలము గడుపుతున్నది.

ఒకనాడు కళింగసేన మేడమీద ఆడుకొంటున్నప్పుడు మయాసురుని కుమారి సోమప్రభ గగన మార్గాన వెళుతూ చూచి ఇలా తలచింది: "ఎవ రీమె? చంద్రకళా? అయితే పగలు చంద్రకాంతి రాదే? రతీదేవి అయితే మన్మథుడేడీ? బహుశః ఈమె ఎవరో దివ్యకన్య. శాపవశాన రాజమందిరములో జన్మించింది. పూర్వజన్మలో ఈమెతో నాకు స్నేహము ఉండి ఉంటుంది. లేక పోతే ఈకన్యవిషయము నాకెందుకు? అకారణ స్నేహము నాలో ఉదయిస్తున్నది. ఈ స్నేహమే నిదర్శనము మా పూర్వజన్మ బంధాన్ని నిరూపించడానికి. ఈకన్యతో తిరిగి చెలిమి చేయాలి."

సోమప్రభ కళింగసేనకు కనబడకుండా గగనమునుంచి దిగి మానవాకారము ధరించి ఆమె దగ్గరికి వెళ్ళింది. రాజపుత్రి సోమప్రభను చూచి "ఎవ రీ దివ్యాంగన? నాదగ్గిరికి వచ్చిందే? ఆహా ఏమి చక్కదనము! నిజముగా ఈమె నాకు తగిన చెలికత్తె" అని తలచి లేచి కౌగలించుకొన్నది. వంశము పేరు అడిగింది. సోమప్రభ సమస్తమూ వివరించి చెపుతా నన్నది. ఒక రొకరి చేతుల్లో చేతులు వేసుకొని ఒట్టు పెట్టుకొన్నారు. ఆఒట్టే స్నేహప్రతిజ్ఞ. సోమప్రభ "చెలీ! నీవు రాజకన్యవు. రాజపుత్రులతో చెలిమి చాలా కష్టము. చిన్న పొరపాటు సంభవిస్తే అమితముగా ఆగ్రహము వారికి వస్తుంది. ఇందుకు నిదర్శనము చెపుతున్నాను" అని కథ మొదలు పెట్టింది.

## రాజపుత్ర వైశ్యపుత్రుల కథ

పుష్కరావతీ నగరములో గూఢసేన మహారాజుకు ఒక్కడే కుమారుడు. ఏకపుత్రుడు కావడము వల్ల తండ్రి కుమారుని గారాబముతో పెంచినాడు. కుర్రవాడు మహాగర్వియై మంచి చెడుగులు పాటించక

పది తోస్తే ఆపని చేస్తున్నాడు. తండ్రి కొడుకును నెత్తిన ఎక్కించుకొంటున్నాడు. ఆరాజపుత్రుడు వనములో విహరిస్తూ ఉండగా, బ్రహ్మదత్తుడనే వైశ్యుని కుమారునితో స్నేహము కలిగింది. ఆఇద్దరికీ నేస్తము బాగా కలిసింది. రాజకుమారుడు ఏభోగము అనుభవిస్తే వైశ్యకుమారుడు కూడా అది అనుభవించ వలసిందే. రాజపుత్రుడు వైశ్యకుమారుడికి ముందుగా వివాహ ముహూర్తము నిశ్చయించి, తన వివాహానికి తాను అహిచ్ఛత్రపురానికి ప్రయాణమై మిత్రుని కూడా తన ఏనుగు మీద ఎక్కించుకొని పరివారముతో సంధ్యవేళ ఇక్షుమతీ నదీతీరాన విడిసినాడు.

రాజకుమారుడు రాత్రి వెన్నెల్లో మధువు తాగి శయనించి దాది అడగగా కథ చెప్పబోయి, అలసతవల్ల మత్తుచేత నిద్రించినాడు. దాది కూడా నిద్రించింది. వైశ్యపుత్రుడు మాత్రము మైత్రిచేత మేలుకొని ఉండగా ఆకాశమునుంచి స్త్రీలవాక్కులు వినపడినవి: "ఈ రాజపుత్రుడు ఈ పాపి, కథ చెప్పకుండా నిద్ర పోయినాడు. అందుచేత వీణ్ణి నేను శపిస్తాను. తెల్లవారగానే వీనికి హారము కనపడుతుంది. ఆహారాన్ని స్వీకరిస్తే వెంటనే మరణము తప్పదు." రెండవస్త్రీ వాక్కు: "దీన్ని తప్పించుకొంటే ఇతనికి మామిడిచెట్టు కనపడుతుంది. ఆ మామిడి పళ్ళు తింటే వెంటనే చనిపోతాడు." మూడవస్త్రీ పలికింది: "ఈ మరణము తప్పించుకొంటే రాత్రి పడకగదిలో రాజపుత్రుడు ప్రవేశించి నూరు తుమ్ములు తుమ్మితే, ఎవరూ 'చిరం జీవ' అనకపోతే ఇతనికి చావు మూడిం దన్నమాట" మనము చెప్పుకొన్న మాటలు విని రాజపుత్రుని ఎవరు కాపాడవలె నని ప్రయత్నిస్తారో వాళ్ళు కూడా మరణిస్తారు." పిడుగువంటి ఆ మాటలు విని వైశ్యకుమారుడు రాజపుత్రుని మీది స్నేహముకొద్దీ "ఛీ! ఛీ! ఆరంభించినకథను ముగించకపోతే ఎంత చెరుపు! దేవతలు ఇలాగే శపిస్తారు కాబోలు. నా మిత్రుడు రాజ

పుత్త్రుడు చనిపోతే నేను బతికి ఏమి లాభము? ఎలా గయినా ఇతన్ని యుక్తివల్ల రక్షించాలి. ఈ సంగతి ఇతనికి చెప్పను" అనుకొని వైశ్య పుత్రుడు ఆలోచిస్తూ రాత్రల్లా జాగారము చేసినాడు.

తెల్లవారింది. రాజకుమారుడు వైశ్యపుత్రునితో ప్రయాణమై పోతూ తోవలో హారాన్ని చూచి తీసుకోబోయినాడు. అప్పుడు వణి క్పుత్రుడు "మిత్రమా, ఈహారాన్ని తీసుకోవద్దు; ఇది మాయ. మాయ కాకపోతే హారము సైనికులకు ఎందుకు కనపడదు?" అని వారించినాడు. తర్వాత రాజసుతుడు మామిడిచెట్టు చూచి మామిడిపళ్ళు తినబోగా వైశ్యపుత్రుడు ఆటంక పరిచినాడు. మిత్రుణ్ణి రక్షించబోగా పెళ్ళికొడుకు మనసులో మథన పడుతూ మామగారి ఇంటికి వెళ్ళినాడు. అతడు గుమ్మములో కాలు పెట్టబోయే సమయములో మిత్త్రుడు వారించగా అతడు ఇవతలకు వచ్చినాడు. వెంటనే ఆఇల్లు కూలింది. వైశ్యపుత్రుడు ఎలా చెపితే అలా చేస్తున్నాడు పెళ్ళికొడుకు. రాత్రి రాజపుత్రుడు పెళ్ళికూతురితో పడకగదిలో ప్రవేశించినాడు. వైశ్యుడు శయ్యా గృహములో ఒకచోట దాగి రాజపుత్రుని రక్షించదలచినాడు. రాజ పుత్త్రుడు శయ్యమీద కూచుని నూరుసారులు తుమ్మగా వైశ్యుడు మెల్లగా 'చిరం జీవ' అంటూ సంతోషముతో బయటికి వచ్చినాడు. అతడు పోతూ ఉండగా రాజపుత్త్రుడు భార్యాసహితముగా చూచి, స్నేహాన్ని మరిచి కోపముకొద్దీ ద్వారికులను పిలిచి "ఈ పాపి నా అంతఃపురంలో ప్రవేశించినాడు. రేపుఉదయము ఇతన్ని శిక్షిస్తాను. అంతవరకూ బంధించండి." అని ఆజ్ఞాపించినాడు. వైశ్యపుత్త్రుడు ఆరాత్రి బంధనములో కాలము గడపి తెల్లవారగానే తాను వధ్యస్థానానికి పోగా రాజపురుషులతో, "నన్ను మొదట రాజ పుత్త్రునిదగ్గిరికి తీసుకొని వదండి. నేను అతన్ని కొన్నిసంగతులు అడగ వలె. తరువాత నన్ను చంపివేయ వచ్చును." అనిచెప్పినాడు. వారు రాజు

దగ్గిరికి వెళ్ళి వైశ్యుడు చెప్పినమాటలు విన్నవించగా అతడు అందుకు అంగీకరించినాడు. వైశ్యకుమారుడు వచ్చి యావద్వృత్తాంతమునూ పూస గుచ్చినట్టు చెప్పినాడు. రాజపుత్రుడు తనను రక్షించిన మిత్రుని చెరనుంచి విడిపించి భార్యాసమేతముగా నిజనివాసానికి వెళ్ళినాడు.

ఈరీతిగా రాజసుతులు మత్తమాతంగములవలె తమ నియంతలనే చంపుతారు. వాళ్ళతోను బేతాళులతోనూ స్నేహ మేమిటి? ఉభయులూ నవ్వుతూ ప్రాణాలు తీస్తారు. అందువల్ల రాజపుత్రి, నీవు నాస్నేహాలతను తుంచి వెయ్యకు." అని సోమప్రభ చెప్పగా కళింగసేన విని నెయ్యముతో ఇలా పలికింది: "సఖీ! వీళ్లు పిశాచాలు గాని రాజపుత్రులు కారు. నీకు ఉదాహరణముగా కథ చెప్పుతాను:

## పిశాచదుర్గ్రహ కథ

పూర్వము యజ్ఞస్థల మనే అగ్రహారములో పేదబ్రాహ్మణుడు ఉండేవాడు. ఒకనాడు అతడువంటకర్రకై అరణ్యానికి వెళ్ళినాడు. గొడ్డలితో అతడు ఒకపెట్టు పెట్టగా చితుకు ఎగిరి అతనిపిక్కలో గుచ్చుకొన్నది. వెంటనే పిక్కకు గాయమై రక్తము కారగా అతడు మూర్ఛపోయినాడు. ఎవడో అతన్ని చూచి ఆనవాలు పట్టి ఇంటికి మోసి తెచ్చినాడు. భార్య కన్నీరు మున్నీరుగా ఏడ్చి అతనిగాయాన్ని శుభ్రపరిచి కట్టు కట్టింది. ఎంత వైద్యము చేసినా గాయము మానక క్రోత్తిపుండు బ్రహ్మరాక్షసి అయింది. నాడీవ్రణముగా పరిణమించడమువల్ల అతడు అసువులమీద ఆశ వదలుకొని ఆత్మహత్యకు ఒడంబడగా, అతనిహితమును కోరినమిత్రుడు "నాస్నేహితుడు యజ్ఞదత్తుడు మింగబోతే మెతుకులేక బాధపడి పిశాచసాధన చేసి పైసా గడించి, ఆమంత్రాన్ని నాకూ చెప్పినాడు. నీవుకూడా పిశాచాన్ని సాధించు. నీవ్రణము నయ మవుతుంది." అని సలహా చెప్పి మంత్రోపదేశము చేసి,

మంత్రవిధానముకూడా వివరించినాడు: "నాలుగోజామున లేచి తల విరియపోసుకొని, దిసమొలగా, రెండుపిడికిళ్లలో బియ్యము పట్టుకొని జపము చేస్తూ నాలుగువీధులూ కలిసేకూడలికి వెళ్ళు. అక్కడ ఆ రెండు గుప్పిళ్లబియ్యమూ ఉంచి మౌనంగా ఇంటికి రా. వెనక్కు తిరిగి చూడకు. ఈరీతిగా పిశాచము నీకు కనపడేదాకా నడుచుకోవాలి. ఆపిశాచము నీవ్యాధిని పోగొట్టుతాను అని స్పష్టముగా పలుకుతుంది. ఆమాట లంగీకరించు. నీరోగము నయ మవుతుంది." ఆవిప్రుడు అలాగే చేసినాడు. అప్పుడు పిశాచము వశ్యమై హిమాలయపర్వతాలనుంచి ఓషధులను తెచ్చి అతనివిషపుకురుపును మాన్పి "నాకు మరొకవ్రణాన్ని కూడా చూపు. దాన్నికూడా కుదిరిస్తాను. అలా చెయ్యకపోతే నీఅంతు చూస్తాను." అని అతన్ని పీడించింది. అతడు భయపడి చావుతప్పి కన్ను లొట్టపోయి, బతికితే బలుసాకు తినవచ్చని "ఏడురోజుల్లో నీకు రెండోవ్రణము నాశరీరముమీద చూపిస్తాను" అని చెప్పి వెళ్ళినాడు.

ఇలా అని అశ్లీలము చెప్పడానికి సిగ్గుపడి కళింగసేన క్షణం నిదానించి మళ్ళీ సోమప్రభతో చెప్పుతున్నది: "అతనికి రెండోవ్రణము దొరక్క బెంగపడి ఉండగా ఇల్లు పట్టిన కూతురు సంగతి యావత్తు ఆకళింపు చేసుకొని "నేను ఆ పిశాచాన్ని వశ్యము చేసుకుంటాను. దాన్ని వంచిస్తాను. నీవు పోయి దానితో 'నాకూతురికి వ్రణము లేచింది. పోగొట్టు' మని అడుగు." అన్నది. బ్రాహ్మణుడు పిశాచముతో చెప్పి దాన్ని కుమార్తెదగ్గిరికి తీసుకొని వచ్చినాడు. దానికి ఆమె ఏకాంతములో తన వరాంగమును చూపి "స్నేహితుడా! నాకు ఈవ్రణాన్ని కుదర్చవా?" అని వేడుకోగా, ఏకోశానా తెలివితేటలు లేని ఆపిశాచము ఆమె వరాంగమునకు పిండి పూసి కట్టు వేసి మాన్పలేక విసిగింది. ఆదయ్యము ఆమె పిక్కలను తన బుజాలమీద ఉంచుకొని ఇది ఎందుకు కుదరదో చూదా మని వరాంగాన్ని చూడగా దానికింద పాయువ్రణము

కనపడింది. అది చూచి హడిలిపోయి 'ఒకవ్రణము కుదరక పూర్వమే మరొకవ్రణము పుడుతున్నదే! కష్టాలు వెంటవెంటనే వస్తవని అంటారు — ' అని ఆలోచిస్తూ ప్రయత్నము నిష్ఫలము కావడము చూచి, ఈబంధము తనమెడకి చుట్టుకొంటుం దని వెరిచి, ఆమూాఢ పిశాచము తెగతెంపులు చేసుకొని అక్కణ్ణించి పారిపోయింది.

ఈరీతిగా ఆబ్రాహ్మణవితంతువు తండ్రిని రక్షించేనిమిత్తము పిశాచాన్ని వంచించింది. బాలు రయినరాజపుత్రులూ సాధించి అనర్ధమే చేస్తారు. బుద్ధి ఉపయోగించి అపాయము తప్పించుకోవలె. కులాంగన లయినరాజకుమార్తెలు ఇలాంటివా రని ఎక్కడా మనము విని ఉండలేదు. అందుచేత చెలీ, నాస్నేహాన్ని గురించి నీవు మరోమాదిరిగా భావించకు.

కళింగసేనవల్ల ఈకథ విని సోమప్రభ సంతోషపడి "చెలీ, మా యిల్లు ఇక్కడికి అరవై యోజనాలు. సంజవేళ కావచ్చింది. చాలా సేపు ఉన్నాను. వెళ్లివస్తాను" అని చెప్పి, తిరిగి తనరాకను కోరిన కళింగసేన దగ్గిర సెలవుపుచ్చుకుని గగనమార్గాన తనగృహానికి వెళ్ళింది. ఆ అద్భుతము అంతా కని కళింగసేన ఇలా తలచింది : 'ఈచెలి ఎవరు? సిద్ధాంగనా? అప్సరసా? విద్యాధరి అయి ఉంటుందా? గగనమార్గాన సంచరిస్తున్నది. కనుక దివ్యాంగన అయి వుంటుంది. దివ్యాంగనలు మానవస్త్రీలతో చెలిమి చేస్తారట. అరుంధతి పృథుచక్రవర్తి కుమార్తెతో స్నేహము చెయ్యలేదా! నేను ధన్యురాలను. నా పూర్వపుణ్యమువల్ల ఈదివ్యాంగనాస్నేహము లభించింది. రేపు ఆ దేవత రాగానే వంశమూ, పేరూ యుక్తిగా అడిగి తెలుసుకొంటాను." కళింగసేన ఆలోచనతో రాత్రి జాగరణము చేసింది. సోమప్రభ కళింగసేనను చూడవలె నని ఉవ్విళ్ళూరుతూ ఆరాత్రి గడిపింది.

మర్నాడు ఉదయము సోమప్రభ కళింగసేనకు ఉల్లాసము కలిగించ డానికి బరిణె తెచ్చి ఇవ్వగా, అందులో కొయ్యతో చేసిన జంత్రపు బొమ్మలు చాలా ఉన్నవి. కళింగసేన ఆమెనుచూచి ఆనంద బాష్పాలు కురిపిస్తూ లేచి, కంఠాలింగనము చేసి, తనవక్కనే కూర్చోబెట్టుకొని "మనకేమో జన్మాంతర స్నేహానుబంధము ఉన్నట్టున్నది. నీకు తెలిస్తే చెప్పు" అని అడిగింది. అప్పుడు సోమప్రభ "నాకు పూర్వజన్మజ్ఞానము లేదు. మునీంద్రులకుకూడా పూర్వజ్ఞానము ఉండడము అసంభవము. కొందరికి పూర్వజన్మజ్ఞానము ఉంటుంది." అన్నది. కళింగసేన ఏకాంతములో "చెలీ, చెప్పమ్మా! ఏవంశంలో జన్మించావమ్మా? సులక్షణా? నీపేరేమిటి? ఈబరిణె ఏమిటి? ఇందులో ఏ ముంది?" అని ప్రశ్న పైన ప్రశ్న గుక్క తిప్పుకోకుండా కురిపించింది. సోమప్రభ క్రమముగా నిజవృత్తాంతము చెపుతున్నది.

మూడులోకాలలో మయు డనే ప్రసిద్ధ రాక్షసుడు ఉన్నాడు. అతడు రాక్షసత్వాన్ని వదిలి హరిశరణను పొంది అభయము పొంది ఇంద్రుని సభ నిర్మించినాడు. రాక్షసులు మయుడు దేవపక్షపాతి అని కోపగించినారు. మయుడు రాక్షసులకు అగమ్యము మాయామయము ఐన మహామందిరము వింధ్యపర్వతాలలో నిర్మించినాడు. ఆ మయునికి మేమిద్దరము కుమార్తెలము. మాపెద్దక్కయ్య బ్రహ్మచారిణి. దానిపేరు స్వయంప్రభ. అది పుట్టింట్లోనే ఉన్నది. నేను సోమప్రభ అనే రెండో కుమార్తెను. నాభర్త నలకూబరుడు. మాతండ్రి నాకు మాయా యంత్రాలు చాలా నేర్పినాడు. యంత్రాలతో నిండిన బరిణెను ప్రీతితో నీకై తీసుకొని వచ్చినాను." అంటూ బరిణె తెరిచి బొమ్మల్ని చూపింది. బిరడా తీసేసరికి ఒకటి గగనానికి ఎగిరి ఆమెఆజ్ఞవల్ల శీఘ్రమే పుష్పమాల తీసుకొని వచ్చింది. ఒకటి అలాగే మంచినీళ్ళు తెచ్చింది.

ఒకటి నృత్యము చేసింది. ఒకటి కథ చెప్పింది. కొంతకాలము ఈరీతిగా
సోమప్రభ బరిణెవల్ల కళింగసేనకు ఉల్లాసము కలిగించి ఆమెదగ్గిర
సెలవు తీసుకొని గగనమార్గాన నిజనివాసానికి వెళ్ళింది.

కళింగసేన బరిణెవల్ల ఆశ్చర్యపడి ఆకలి బొత్తిగా మరిచిపోయింది.
ఆమెతల్లి కూతురికి జబ్బు చేసిం దేమో ననీ రెండుమెతుకులు ముట్టుకో
లేదని భయపడగా ఆనందుడు అనేవైద్యుడు, 'కళింగసేనకు ఏవ్యాధీ
లేదు ; నిక్షేపములాగ ఉంది ; ముఖము ఎలా సవ్వుతో ఉట్టిపడు
తున్నదో కళ్ళే చెపుతున్న' వని అన్నాడు. కుమార్తెకు కలిగిన సంతో
షాతిశయాన్ని తల్లి అడిగి తెలుసుకొన్నది. కుమారి తనకు ఇష్ట
మైనంతమాత్రమే తిన్నది. మర్నాడు సోమప్రభ వచ్చి విషయమంతా
తెలుసుకొని రహస్యముగా కళింగసేనతో "నేను మనస్నేహ విష
యాన్ని పాటించి, భర్తదగ్గిర సెలవు పుచ్చుకొని ప్రతిరోజూ ఇక్కడికి
రా దలచినాను. మీా జననీజనకుల అనుజ్ఞ తీసుకో. మన మిద్దరమూ
యథేచ్ఛగా విహరిద్దాము" అన్నది. కళింగసేన ఆమెచెయ్యి పట్టుకొని
తల్లితండ్రుల దగ్గిరికి తీసుకొని వెళ్లి పేరూ వంశమూ చెప్పి వాళ్ళకు
పరిచయము చేసింది.

ఆమెను చూచి ఆదంపతులు సంతోషపడి, సుతాస్నేహమువల్ల
ఆమెను గౌరవించి "అమ్మాయీా, ఈకళింగసేనను నీచేతుల్లోపెట్టాము.
ఇక మీాయిష్టము వచ్చినట్లు ఉండండి" అన్నారు.

ఆ చెలులు ఇద్దరూ మహారాజు కట్టించిన విహారములో విహారానికి
వెళ్ళినారు. సోమప్రభ బరిణె తెరిచి అందులోనుంచి యంత్రయక్షుని
పైకి తీసి బుద్ధదేవునిపూజకై కావలసిన సామగ్రిని తె మ్మని పంపింది.
వాడు చాలాదూరము వెళ్ళి ముత్యాలు, రత్నాలు బంగారు తామర
పూవులు తీసుకొనిరాగా వాడిచేతనే పూజచేయించి అక్కడికివచ్చిన బౌద్ధ
భిక్షువులను ఆశ్చర్యపెట్టింది. ఆసంగతి విని రాజు రాణి యంత్రచేష్టితాన్ని

గురించి సోమప్రభను అడిగినారు. సోమప్రభ ఇలా చెప్పింది: "రాజన్! మా తండ్రి పూర్వము మాయ యంత్రాలనూ సృష్టించినాడు. ఈ జగత్తు మాదిరిగా యంత్రాలుకూడా పంచభూతాత్మకము. వాటి స్వరూపము విను. పృథివీప్రధానయంత్రము ద్వారాదులను మూస్తుంది. అది మూస్తే దాన్ని అన్యులు తెరవలేరు. జలయంత్రమువల్ల రూపము సజీవముగా కనపడుతుంది. తేజోమయ యంత్రము జ్వాలను కక్కుతుంది. వాతయంత్రము రాకపోకలను కల్పిస్తుంది. ఆకాశయంత్రము శబ్దాన్ని వ్యక్తము చేస్తుంది. ఇవన్నీ మా నాన్న దగ్గిర నేర్చుకొన్నాను. అమృతరక్షక మయిన చక్రయంత్రము మా నాన్నకు మాత్రమే తెలుసును." ఆమె ఇలా అంటూ ఉండగా 'ఔను ఔను' అన్నట్లు మధ్యాహ్నశంఖాలు మోగినవి.

సోమప్రభ రాజుతో "మీ కుమారి కళింగసేన నాతో విందు ఆరగిస్తుంది" అని చెప్పి అనుజ్ఞ తీసుకొని యంత్రవిమానము ఎక్కి గగన మార్గాన ప్రయాణము చేసి పుట్టింటికీ, అక్కగారింటికీ కళింగసేనను వెంట బెట్టుకొని వెళ్ళింది. అప్పుడు స్వయంప్రభాదేవి బ్రహ్మచారిణియై చేతులో తావళము తిప్పుతూ ఉండగా కళింగసేన చూచి ఆమెకు పాదాభివందనము చేసింది. సోమప్రభవల్ల స్వయంప్రభ కళింగసేన సంగతి గ్రహించి పళ్ళూ ఫలాలతో ఆమెను సత్కరించింది. సోమప్రభ కళింగసేనతో "సఖీ! పద్మానికి మంచుజడి సోకితే ముసలితనము వస్తుంది. ఈ ఫలాలు నీవు రుచి చూస్తే నీకు నిత్యయౌవనము ఉంటుంది. స్నేహపూర్వకంగా ఇందుకోసమే నిన్ను ఇక్కడికి తీసుకొని వచ్చాను" అన్నది. కళింగసేన ఆత్రంగా ఆపళ్ళు తిన్న వెంటనే అమృతవృష్టిలో తల మున్కలైనట్లు అయింది. ఆమె కౌతుకముతో మయనిర్మిత మాయోద్యానములో తామరపువ్వులతో తీయనిపళ్ళతో ఉన్న సరస్సులనూ, మణిమయ స్తంభాలనూ, గోడ లేనిచోట గోడ ఉన్నట్లు నీరులేనిచోట

నీ రున్నట్లు భ్రమిస్తూ ఆశ్చర్యపడి చూచి స్వయంప్రభాదేవి వద్ద సెలవు తీసుకొని సోమప్రభతో గగనమార్గాన ప్రయాణముచేసి తక్షశిలానగరము చేరింది. కళింగసేన చూచిన దంతా తల్లిదండ్రులకు చెప్పింది. వారు సంతోషపడ్డారు.

ఈ రీతిగా సోమప్రభా కళింగసేనల స్నేహము దినదిన ప్రవర్ధమానమవుతూ ఉండగా ఒకనాడు సోమప్రభ కళింగసేనతో "నీకు వివాహాము అయ్యేవరకూ నీతో స్నేహము. నీకు భర్త రాగానే నీయింటి గుమ్మము తొక్కను. స్నేహితురాలి భర్తను చూడరాదు. తోడేలు మేకలమాదిరి, అత్త కోడల్ని భక్షిస్తుంది.

## కీర్తిసేన కథ

పాటలీపుత్రములో ధనపాలితు డనే వర్తకునికి కీర్తిసేన అనే కుమార్తె ఉన్నది. తండ్రికి కూతురిమీద అమితప్రీతి. అతడు కుమారిని మగధదేశములో మహాధనవంతు డయిన దేవసేను డనే వానికి ఇచ్చినాడు. దేవసేనుకి తండ్రిలేడు. అతడు ఇంట్లో లేనప్పుడు అత్త కోడలిని రాచి రంపాన పెడుతూ ఉన్నప్పటికీ ఆమె పల్లెత్తు మాట అనక భర్తకు తెలియనీయ కుండా ఉన్నది. ఒకప్పుడు దేవసేనుడు బేరసారాలకు వలభీ నగరానికి వెళ్ళబోతున్నప్పుడు భార్య అతనితో "ఆర్యపుత్రా, మీతో నేను పల్లెత్తుమాట చెప్పలేదు. అత్తగారు నన్ను పీడిస్తున్నది. మీరు దగ్గిర లేకపోతే నాగతి ఏమవుతుందో!" అనగా అతడు ఆశ్చర్యపడి తల్లి దగ్గిరికి వెళ్ళి నమస్కరించి "అమ్మా, కీర్తిసేనను నీదగ్గిర ఉంచి దేశాంతరము పోతున్నాను. ఇది పెద్దయింటి పిల్ల. దీన్ని కొంచెము కనిపెట్టి చూడు" అన్నాడు. అత్త కోడలిని పిలిచి కుమారునితో "దీన్ని నేను రాచి రంపాన పెట్టలేదు. నీతో నామీద చిలవలూ పలవలూ కల్పించి చెప్పి వేరింటికాపరము పెడదామని నీభార్య యత్నిస్తున్నది. ఏమాటకు

ఆమాట, నాయనా! నాకు మీఇద్దరూ సమానులే" అన్నది. దేవసేనుడు శాంతంగా విన్నాడు. కీర్తిసేన ఆశ్చర్యముతో నవ్వుకొన్నది. మర్నాడు దేవసేనుడు వలభీనగరానికి తరలినాడు.

కీర్తిసేన భర్తృవియోగములో బాధ పడుతున్నప్పుడు అత్త ఆమెను దిగంబరను చేసి "పాపాత్మురాలా! నా కొడుకునూ నన్నూ వేరుచేదా మనుకొంటున్నావా? మావాణ్ణి హరించేదా మనుకొన్నావా?" అని ఆమెజడ పట్టి తన్ని కొట్టి కరిచి నానాహింసలూ పెట్టి నేల మాళిగలో పడవేసింది. అత్త నేలకొట్టులో ఉన్న బంగారము తీసివేసి కోడలిని అందులో పెట్టి గడియ పెట్టింది. ప్రతిరోజూ సాయంకాలము కీర్తిసేనకు మూకుటిలో ఆహారము పెట్టి అత్త పంపుతున్నది. ఆమె కుమారునితో కోడలు స్వయంగా చనిపోయిం దని చెప్పదలచుకొన్నది. కీర్తిసేన చీకటికొట్లో కన్నీరు మున్నీరుగా ఏడుస్తూ ఆలోచన చేసింది: "భర్త ధనవంతుడు. పుట్టింటివారు గొప్పవారు. నానడవడిలో ఏదోషమూ లేదు. అత్తవల్ల ఇంత అవస్థపట్టింది. ఛీ! ఈఆడబతుకు ఎంత నికృష్టము!" ఇంతలో కీర్తిసేనకు తవ్వుగోల దొరికింది. వెంటనే ఆమె సొరంగము తవ్వసాగింది. తవ్వగా తవ్వగా ఆ సురంగము దైవవశాన తన పడకగదిలోకే వెళ్ళింది. ఆ గదిలో తన ప్రాక్తన ధర్మమువలె దీపము వెలుగుతూ ఉండగా కీర్తిసేన ఇల్లంతా వెతికి తన చీరెలు, నగలు నాణెమూలూ బంగారమూ తీసుకొని తెల్లవారుజామున రహస్యముగా వెళ్ళిపోయింది. ఆమె ఊరివెలుపలకు వెళ్ళి "ఈఅత్త పెట్టే ఆకడి ఎవరితో చెప్పుకోను! పుట్టింటికి పోతే గౌరవముగా ఉండదు. లోకులు నిందిస్తారు. యుక్తివల్ల నా భర్తదగ్గిరకే వెళ్లుతాను. సతికి పతి గతి కదా!" అని ఆలోచించింది.

చెరువులో కీర్తిసేన స్నానము చేసి రాజపుత్రవేషము ధరించి బజారులో కొంచెముకొంచెము బంగారముఅమ్మి డబ్బు చేసుకొని కోమటి

యింటఆరోజు బసచేసింది. మర్నాడు సముద్రదత్తు డనే వర్తకుడు వలభీ నగరానికి ప్రయాణ మవుతూ ఉండగా అతన్ని మంచిచేసుకొని ఆమె కూడా ప్రయాణ మైనది. ఆమె అతనితో "అయ్యా, నేను దాయాదుల పోరు పడలేక నీతో వలభీనగరము వస్తున్నాను." అన్నది. ఇద్దరూ అటవీమార్గాన ప్రయాణము చేసి ఒకచోట విడియగా నక్క ఊళ పెట్టింది; దానిఅర్థ మెరిగినవర్తకసంఘము దొంగలరాకకు భయపడి రక్షకులు ఆయుధపాణులై సిద్ధముగా ఉన్నారు. చీకటిపడుతూ ఉండగా కీర్తిసేన పురుషవేషములో ఉన్నతనను చూచుకొని "అత్త చేసిన ఆరడి నన్ను ఇక్కడికి తరుముకొని వచ్చింది. అత్త నన్ను మృత్యుదేవతవలె భక్షించింది. నేలకొట్టులో గిలగిలలాడి ప్రాణాపాయము తప్పించుకొన్నాను. దొంగలు నన్ను ఎత్తుకొనిపోతే నాఅత్త 'కోడలు ఎవరితోనో లేచిపోయింది' అని అపవాదు వేయకుండా ఉండదు. నావస్త్రాన్ని ఎవరయినా లాగితే స్త్రీ నని తెలుసుకొంటారు. నడవడి ముఖ్యము. నన్ను నేను కాపాడుకొంటాను. ఈ వర్తకుడు దొంగలచేతిలో చిక్కినా, మిత్రధర్మము కన్న పతివ్రతా ధర్మమే ప్రధానము" అని ఆలోచించుకొని గోతిలో దాగి పైన ఆకు అలము కప్పుకొన్నది.

దొంగలు సముద్రదత్తునీ అతని అనుచరులనూ దోచుకొని పోయినారు. విధివిలాసమువల్ల కీర్తిసేన ఆ కోలాహలము విని సజీవగా ఉన్నది. తెల్లవారగానే ఆమె గోతిలోనుంచి పైకి వచ్చింది. ఆ నిర్జన వనములో సింహము ఎదురైనా ఆమెను ఏమీ చేయలేదు. ఎవరో మునీంద్రుడు కీర్తిసేనవిషయ మంతా గ్రహించి ఆమెకు కమండలూదకము ఇచ్చి దారి చూపి అంతర్ధాను డైనాడు. ఆ కమండలు జలమువల్ల ఆమెకు దాహముతీరగా, సంజవేళదాకా నడిచి, వృక్షాగ్ర మెక్కి, విశాల మైన తొర్రలో ప్రవేశించి ద్వారానికి కొయ్య అడ్డు పెట్టింది.

చీకటి పడగానే కీర్తిసేన తలుపుసందులోనుంచి చూస్తూ ఉండగా

రాక్షసి తన పిల్లలతో వచ్చింది. ఆమె "ఇతరాపదలు దాటినాను. ఈరోజు ఈ రాక్షసి నన్ను తినేస్తుంది" అని భయపడుతూ ఉండగా, రాక్షసి కుమారులతో చెట్టు ఎక్కింది. పిల్లలంతా "మాకు తినడానికి ఏమయినా పెట్టు" అని గోల చేయసాగినారు. "అయ్యో, పిల్లలూ! తినడానికి తిండి లేదు. శ్మశానానికి పోతే తిండి దొరకలేదు. ఢాకినీ గణమును అర్ధించాను. వాళ్ళు నాకేమీ ఇవ్వలేదు. నన్ను చూచి భైరవుడు అన్నాడు: "భయంకరీ! గొప్ప ఇంటిదానివి. ఖరదూషణ వంశములో పుట్టినదానివి - ఈ వసుదత్త పురములో వసుదత్తుడనే మహాధార్మిక ప్రభువు ఈ వనాన్ని రక్షిస్తున్నాడు. అతడే సుంకము పుచ్చుకోడము, దొంగలను దండన చేస్తాడు. ఆ రాజు వేటబడలికవల్ల నిద్రపోతూఉంటే, చెవిలో పాము ప్రవేశించి క్రమేణ అతని తలలో పిల్లలిని పెట్టింది." ఆ వ్యాధివల్ల రాజు శుష్కించినాడు. వైద్యులకు రోగము ఎటువంటిదో తెలియలేదు. అతనికి చావు మూడింది. అప్పుడు అతని మాంసాన్ని మాయవల్ల తినవచ్చును. నీకు ఆరుమాసాల వరకూ సరిపోతుంది." ఈ రీతిగా భైరవుడుకూడా సందేహించి, చాలా కాలానికి నెరవేరే ఏర్పాటు చేసినాడు. పిల్లలూ! నేను మాత్రము ఏమి చేస్తాను?" అన్నది రాక్షసి.

అప్పుడు పిల్లలు "అమ్మా! ఎవరయినా ఆ రోగము ఎరిగి కుదిరిస్తే పూర్తిగా నయమై అతనుబతుకుతాడా?" అని అడిగారు. "రోగము కుదిరితే బతుకుతాడు. ఆ జబ్బును ఇలా కుదర్చాలి. వేడినేతితో తలంటి, నడిఎండలో కూర్చోబెట్టి, చెవిలో వెదురు గొట్టాన్ని ఉంచి, దాని రెండో చివరను చన్నీళ్ళ కుండమీద, మూకుడు నడుమ రంధ్రములో ఉంచవలె. ఆ ఎండ వేడికి పాములు అలిసిపోయి ఆ గొట్టము ద్వారా చల్లదనానికి ఆ చన్నీటి కుండలో పడతవి. ఇదే ఆ రోగానికిచికిత్స" అని తల్లి చెప్పింది.

కీర్తిసేన విని ఇలా తలచింది. "ఈఆపద తప్పితే నేను యుక్తితో రాజును బతికిస్తాను. ఈఅడివినే తనపెత్తనములో ఉంచుకొన్నాడు. పన్ను వసూలు చేసేవాడు. ప్రయాణసౌకర్యము ఉండడమువల్ల వర్తకులు అంతా ఈదారినే వస్తారు. సముద్రసేనుడుకూడా అలాగే చెప్పాడు. నాభర్తకూడా ఈదారినే వస్తాడు. అందుచేత వసుదత్తపురమునకు వెళ్ళి రాజును బతికించి పతిరాకకై ఎదురు చూస్తూ ఉంటాను." ఈఆలోచనతో ఆమె రాత్రల్లా గడిపింది. తెల్లవారింది. రాక్షసులు వెళ్ళిపోయినారు. ఆమె చెట్టుతొర్రనుంచి బైటికి వచ్చి, పురుషవేషముతో అరణ్యమధ్యాన నడుస్తూ, మధ్యాహ్నవేళ గొల్లవాణ్ణి చూచింది. వాడు ఆమె చక్కదనానికి ముగ్ధుడై మనసు కరగగా "ఇ దేమి చోటు? చెప్పు" అనడిగింది. గొల్ల "ఈఅడివి వసుదత్త మహారాజులుంగారిది. ఈ కనపడేది వసుదత్తపురము. మహారాజు వ్యాధివల్ల చనిపోవడానికి సిద్ధముగా ఉన్నాడు." అన్నాడు. కీర్తిసేన "నన్ను రాజుదగ్గిరికి తీసుకొని వెళ్ళండి. నేను చికిత్స చేస్తాను" అన్నది. గోపాలుడు "నాతో రా." అని ఇద్దరూ కలిసి వెళ్ళినారు. గోపకుడు పురుషవేషములో ఉన్న కీర్తిసేనను ప్రతీహారునికి అప్పగించినాడు.

వెంటనే ప్రతీహారుడు రాజుకు విన్నవించి అనుమతిపొంది ఆ పతివ్రతను రాజుదగ్గిరికి తీసుకొని పోయినాడు. రాజు ఆమె అందచందాలను చూచి తనరోగము నయ మవుతుం దని తలచినాడు. మనసు హితముసూ, అహితమునూకూడా చెప్పగలదు. అతడు ఆమెతో అన్నాడు: "కల్యాణీ! నారోగాన్ని కుదిరిస్తే నీకు అర్ధరాజ్యాన్ని ఇచ్చివేస్తాను. స్వప్నములో స్త్రీ నావీపుమీదనుంచి నల్లకంబళి తీసివేసింది. అందుచేత నిశ్చయముగా నీవు రోగం నయము చేయగలవు."

కీర్తిసేన "రాజన్! పగలు గడిచిపోయింది. రేపు మీవ్యాధి కుదురుస్తాను. అధైర్యము వద్దు ప్రభూ" అని చెప్పి రాజు శిరస్సుకు

ఆవునేయి రాయించింది. దానితో అతనికి హాయిగా నిద్ర పట్టింది. బాధ తగ్గింది. అక్కడ ఉన్నవా రందరూ 'ఇత నెవరో దేవుడు. మా పుణ్యమువల్ల వైద్యరూపముగా వచ్చినాడు." అని ఆమెను ప్రశంసించినారు. ఆమెకు సకలోపచారములూ జరిగినవి.

కీర్తిసేన మర్నాడు మధ్యాహ్నవేళ రాణులూ, మంత్రులూ, అందరూ చూస్తూ ఉండగా, రాజు తలలోనుంచి చెవిరంధ్రముద్వారా నూటయాభై పాములను రాక్షసి చెప్పిన యుక్తిచేత బైటకి లాగివేసింది. పాములను చన్నీటికుండలోనే ఉండనిచ్చి ఘృతక్షీరాదిసేకముచేత రాజు దాహాన్ని పోగొట్టింది. క్రమంగా రాజుకు అలసట తీరింది. రోగము కుదిరింది. అతడు నిరోగుడు కాగా కీర్తిసేన చన్నీటికుండలో పాములను చూపించింది. తనతలలోనుంచి ఇన్నిపాములు వచ్చినవే అని ఆశ్చర్యపడి రాజు పునర్జన్మ మెత్తినట్లు నిశ్చయించుకొని రోగము నయము చేసినందుకు కీర్తిసేనకు సగమురాజ్యము ఈయబోగా ఆమె గ్రహింపలేదు. అతడు ఆమెకు గజాశ్వములూ కాంచనమూ కానుకలూ ఇచ్చినాడు. పట్టపుదేవీ, మంత్రు లూతమరాజుకు ప్రాణమిచ్చిన కీర్తిసేనను మణికనక వస్త్రాలంకారములతో సమ్మానించినారు. ఆమె పతి కోసము ఎదురు చూచి, తాను అక్కడ కొంతకాలము ఉంటా నని చెప్పి రాజుదగ్గిరే ధన మంతా న్యాసముగా భద్రము చేయ మన్నది. అందరూ ఆమెను గౌరవిస్తూ ఉండగా పురుషవేషములోనే కీర్తిసేన అక్కడే నివసిస్తున్నది.

ఈలోగా దేవసేనుడు వలభీనగరమునుంచి వచ్చినా డని పురములో వార్త వ్యాపించింది. కీర్తిసేన దూరమునుంచి మబ్బును నెమలివలె ప్రియుణ్ణి చూచింది. ఆమె భర్తను సమీపించగా ఆనందబాష్పములను అర్ఘ్య మిచ్చి అతనిపాదాలమ్రోల వాలింది. వేషములో ఆమె మరుగుపడి ఉన్నప్పటికీ దేవసేనుడు ఆనవాలు పట్టినాడు. కీర్తిసేన నిజ

వృత్తాంతము అత్త తనను ఆరడి పెట్టిన విషయము అంతా భర్తకు నివేదించగా వర్తకులూ వసుదత్తమహారాజూ ఆశ్చర్యపడ్డారు. దేవసేనుడు భార్యవల్ల సంగతి విని కోప క్షమాశ్చర్యభావముల పాలై తల్లిపై విరక్తి చెందినాడు. అక్కడ ఉన్నవా రందరూ కీర్తిసేనపాతివ్రత్యాన్నీ ధర్మబలాన్నీ ప్రశంసించారు. దేవసేనుడు "ఈమె భర్తకోసము పడరానిపాట్లు పడి, సీతాదేవికన్న మిన్న అనిపించుకొన్నది. ఈమె నాకు ధర్మభగిని" అని అందరిఎదుటా పలికినాడు. కీర్తిసేన వసుదత్త మహారాజుతో "దేవా! మీరు నాకు కానుకగా ఇచ్చిన గ్రామాలూ అశ్వములూ సువర్ణరత్నాదికము యావత్తూ నాభర్తకు ఇప్పించ వేడుతున్నాను" అని అడిగింది. మహారాజు ఆప్రకారంగా దేవసేనునికి సువర్ణరత్నాభరణాలు గ్రామాలు ఇచ్చివేసినాడు. దేవసేనుడూ కీర్తిసేన అక్కడే సుఖముగా జీవిస్తున్నారు. కీర్తిసేనకు అత్తపోరు తీరిపోయింది. పతివ్రతలు విధివైపరీత్యాన్ని సహించి సాత్త్వికబలమువల్ల శీలమును కాపాడుకొని, భర్తృగౌరవాన్ని నిలువబెట్టుతారు.

సోమప్రభ ఇలాచెప్పగా కళింగసేన సంతోషించింది. కళింగసేనను ఆలింగనము చేసుకొని నిజనివాసానికి మరలింది.

## తరంగము : 30

సోమప్రభ నిజవాసానికి వెళుతూ ఉండగా కళింగసేన ప్రాసాదోపరి భాగాన నిలువబడినది. గగనమార్గాన మదనవేగుడు అనే విద్యాధర రాజు పోతూ ఆమెను చూచి మోహపాశములో చిక్కినాడు. అతడు "ఇంత చక్కని రూపము మానవస్త్రీలకు ఉండగా విద్యాధరస్త్రీలు ఎందుకు? అప్సరసలు అనవసరము. ఈమెను పెళ్ళాడని నాజన్మనిరర్థకము. విద్యాధరుడనైన నాకు మనుష్యస్త్రీ సమాగమము ఎలా సంప్రాప్తము అవుతుంది" అని ఆలోచించినాడు. ఆ విద్యాధరుడు ప్రజ్ఞప్తి విద్యను

స్మరించగా అది ఆకారముతో ప్రత్యక్షమై "భాగ్యవాన్! నిజానికి ఈమె మానవస్త్రీ కాదు. అప్సరస శాపవశాన కళింగదత్తునికి కుమార్తెగా జన్మించింది." అన్నది. ప్రజ్ఞప్తి ఇలా చెప్పగా మదనవేగుడు సంతోష పడి ఇంటికి వెళ్ళి "ఈమెను బలాత్కరించలేను. శివారాధన చేసి కళింగ సేనను పొందాలి. శ్రేయస్సు తపోధీనము" అని భావించి మర్నాడు ఋషభ పర్వతానికి వెళ్ళి ఒంటికాలిమీద నిలిచి ఆహారము మాని తపస్సు చేసినాడు. ఆ కఠోరతపస్సుకు మహేశ్వరుడు సంతోషించి ఇలా ఆనతి ఇచ్చినాడు. "భూలోకములో కళింగసేనకు తగిన వరుడు దొరక లేదు. వత్సరాజు మాత్రము అనుకూలమైనవాడు. అతడు కళింగసేనను కోరినాడే కాని, భార్య వాసవదత్తాదేవి ఏమంటుందో అనే భయము వల్ల స్పష్టముగా అడగడములేదు. సోమప్రభవల్ల కళింగసేన వత్సే శ్వరుని అందచందాలు విని మనసులో ఉవ్విళ్ళూరుతున్నది. వత్స రాజు కళింగసేనను వివాహము చేసుకోక పూర్వమే, నీవు వత్సేశ్వరుని రూపమును ధరించి కళింగసేనను గాంధర్వవిధిగా వివాహము చేసుకో. ఇలా చేస్తే కళింగసేన నీకు లభిస్తుంది." విద్యాధరుడు శివునికి ప్రణా మము చేసి కాలకూట పర్వతానికి వెళ్ళినాడు.

ఈలోగా బరిణెలో ఉన్నయంత్రమహిమవల్ల సోమప్రభ ప్రతిరాత్రి కళింగసేనదగ్గిరికి వచ్చి, తెల్లవారగానే నిజనివాసానికి వెళుతూ ఉన్నది. ఒకనాడు కళింగసేన సోమప్రభతో "సఖీ, నీకు రహస్యము చెపుతాను. ఎవరితో చెప్పకేం! నాకు వివాహము అవుతుంది. చాలామంది రాజులు నాదగ్గిరికి దూతలను పంపినారు. శ్రావస్తిమహారాజు ప్రసేనజిత్తుదూతను మాత్రము గౌరవించి అతనిరాక అమ్మకు చెప్పినాను. అతడు కులీను డని అమ్మ సమ్మతించింది. అంబ అంబాలికల వంశములో అతడు జన్మించినాడు. నన్ను ఆ ప్రసేనజిత్తుకు ఇచ్చి ముడి పెడ తారు. ఇది తప్పదు" అన్నది. సోమప్రభ కన్నీరు ముత్యాలుకోవ

అయింది. కళింగసేన సోమప్రభ విచారకారణము అడిగేసరికి ఆమె ఇలా పలికింది: "చెలీ! వయోరూప కులశీల విత్తాలలో వరుని వయస్సు ఆలోచించు. ప్రసేనజిత్తు ముసలివాడు. జాజిపువ్వు వాడినా సువాసన ఉంటుంది. ఆయన ముసలివాడైనప్పుడు కులీనుడైా లాభమేమిటి? అతన్ని నీవు వివాహము చేసుకొంటే నీబతుకు మంచుజడి సోకిన పద్మమువలె ఉంటుంది. కల్యాణీ! నీవు వత్సేశ్వరునిపత్నివై నాకు సంతోషము కలిగించు. అందచందాలలో గుణశౌర్యాలలో వత్సరాజు అద్వితీయుడు. నీవు అతన్ని వివాహ మాడితే బంగారానికి పరిమళమువలె రాణిస్తావు." సోమప్రభమాటలవల్ల కళింగసేనమనస్సు వత్సరాజుమీదికి ప్రసరించింది. "చెలీ! ఆయనకు వత్సరాజు అనే నామము ఎలా వచ్చింది? ఆయనవంశ మేది? ఆయనను ఉదయను డని ఎందుకు అంటారు?" అని కళింగసేన ప్రశ్నపై ప్రశ్న కురిపించింది.

సోమప్రభ చెబుతున్నది: "చెలీ! భూలోకానికి అలంకారముగా వత్సదేశము ఉన్నది. అందులో రెండోఅమరావతివలె కౌశాంబీ నగరము ఉన్నది. వత్సదేశాన్ని పాలిస్తున్నఅతనికి వత్సరాజని పేరు వచ్చింది. పద్మవ్యూహాన్ని భేదించినఅభిమన్యుని ఎరగవా? అతని కుమారుడు పరీక్షిత్తు, అతనికి జనమేజయుడు, జనమేజయునికి శతానీకుడు కలిగినారు. శతానీకుడు కౌశాంబీనగరవాసి. దేవదానవ యుద్ధములో అతడు రాక్షసులనుచంపి తాను చనిపోయినాడు. శతానీకునికుమారుడు సహస్రానీకుడు. ఇంద్రుని రథములో కూర్చుని స్వర్గమర్త్యలోకాలకు రాకపోకలు చేస్తూ కాలము గడుపుతున్నాడు. మృగావతీ సహస్రానీకులకు చంద్రవంశాలంకారమైన ఉదయనుడు జన్మించి లోకానికి కన్నులపండుగ చేసినాడు. మృగావతి వేవిళ్ళలో నెత్తురు నింపిననూతిలో స్నానము చేయవలె నని కోరింది. సహస్రానీకుడు పాపభయమువల్ల నూతిలోరక్తము నింపక లత్తుకరసము నింపి

ఆమెను స్నానముచేయించినాడు. మృగావతీదేవిని స్నానసమయములో గరుడపక్షి మాంసమనుకొని, ఉదయపర్వతానికి తన్నుకు పోయి విధి విలాసమువల్ల అక్కడ విడిచిపెట్టింది. మృగావతికి భర్తృ వియోగము కలగగా, మునీంద్రుడొకడు ఆమెను ఓదార్చి భర్తృసమాగమము కలుగుతుందని పలికినాడు. ఒకసారి తిలోత్తమ సహస్రానీకుణ్ణి వలచింది. వనిత తనంత తా వలచి వచ్చేసరికి అతనికి ఆమె చులకన అయింది. తనను నిర్లక్ష్యము చేసినందుకు తిలోత్తమ సహస్రానీకుని శపించింది. ఆశాపవశాన మహారాజుకు పత్నీవియోగము ప్రాప్త మైనది. మృగావతి జమదగ్ని ఆశ్రమవాటిలో ఉదయపర్వతముమీద కుమారుని కన్నది. అప్పుడు అశరీరవాణి "ఇతనికి ఉదయను డని పేరు పెట్టండి. ఇతడు సార్వభౌముడు కాగలడు. ఉదయనునికుమారుడు సకలవిద్యాధరులకూ చక్రవర్తి అవుతాడు." అని పలికింది. ఇలా ఉదయాద్రిమీద జన్మించినవాడు కనుక వత్సరాజుకు ఉదయను డనేనామము వచ్చింది.

తనభార్య శాపగ్రస్త అయినట్లు సహస్రానీకుడు ఇంద్రసారథివల్ల విని శాపాంతముకై ప్రియాసమాగమానికై రోజులు లెక్కపెడుతున్నాడు. ఆకాశవాణిని అనుసరించి, శబరుని దారి చూప మని నియమించి సహస్రానీకుడు వెంటనే ఉదయాద్రికి వెళ్ళి, అభీష్టసిద్ధివలె మృగావతినీ కుమారునీ చూచి కౌశాంబికి తీసుకొని వచ్చినాడు. తండ్రి క్రమేణ కుమారునికి యౌవరాజ్యపట్టాభిషేకము చేసినాడు. కొంతకాలానికి రాజ్యము కుమారునికి ఇచ్చి సహస్రానీకుడు భార్యాసమేతుడై మహాప్రస్థానముచేసినాడు. ఉదయనుడు యౌగంధరాయణమిత్రుడై చతుస్సముద్రముద్రిత మహీమండలమును అవక్రపరాక్రమముచేత జయించి పాలిస్తున్నాడు."

ఈరీతిగా సోమప్రభ ఏకాంతములో వత్సేశ్వరవృత్తాంతము చెప్పుతున్నది: "చెలీ! త్రిలోకసుందరి వయిననీకు వత్సరాజుమాత్రమే

తగినపతి. అతడు నిన్ను వలచినాడు. వాసవదత్తా దేవి అతన్ని ప్రాణాలలో ప్రాణముగా అత్యంతానురక్తహృదయముతో ప్రేమించింది. ఆమెవల్ల అతనికి నరవాహనదత్తు డనేపుత్రుడు ఉదయించినాడు. అతడు విద్యాధరసార్వభౌముడు అవుతా డని దేవతలు అదివరకే చెప్పినారు. అందువల్ల జడిసి వత్సరాజు నిన్ను బహిరంగముగా అడగడములేదు. నేను వాసవదత్తను చూచినాను. అందచందాలలో ఆమె నీతో స్పర్థ వహించదు.''

కళింగసేన మనస్సు వత్సరాజమయము కాగా "సఖీ! జననీజనకుల వశములో ఉన్న నేను ఏమి చేయగలను? ఈవిషయములో నీసహాయాన్ని అపేక్షిస్తున్నాను. కార్యసాఫల్యము దైవాధీనము. అందుకు నిదర్శనము విను :

## తేజస్వతి కథ

ఉజ్జయినిలో విక్రమసేనమహారాజుకు రూపవతి అయిన తేజస్వతి అనే కుమార్తె ఉన్నది. ఆమెకు ఏ రాజపుత్రుని మీదా మనసు పోలేదు. ఒకనాడు మేడమీద ఆమె పచారు చేస్తూ ఒకఅందగాణ్ణి చూచి, వ్యామోహపడి దూతీముఖముగా అతనికి సందేశము పంపింది. రాజకన్య సాహసాన్ని ఆఅందగాడు అంగీకరించ లేదు. అయినా బలవంతము చేసి తేజస్వతి దూతికద్వారా సంకేతస్థానము ఏర్పాటు చేసి "సజ్జనా! నిర్జన మయిన యీదేవగృహములో రాజపుత్రి సమాగమానికి ఎదురు చూడు'' అని చెప్పి పంపింది. తేజస్వతి సంజవేళ సమాగమానికై ఎదురు చూస్తున్నది. ఆ అందగాడు జడిసి సంకేత స్థానానికి రాలేదు. మండూకము పద్మకింజల్కాలను ఆస్వాదించగలదా? ఈలోగా కులీనుడైన రాజపుత్రుడు పితృమరణానంతరము, దాయాదులవల్ల రాజ్యభ్రష్టుడై, తండ్రి స్నేహితుడైన విక్రమసేనుని ఏకాంత

ములో చూడ వచ్చి, దేవాలయములో రాత్రి గడప దలచి, అందులో ప్రవేశించినాడు. తేజస్వతి ఆరేయి అక్కడికి వచ్చి కామములో కన్నులు కనపడక ఆరాజపుత్త్రుని పతిగా స్వీకరించింది.

ఆ బుద్ధిమంతుడు కన్యాప్రాప్తి భావిరాజ్యలాభానికి శుభసూచనగా తలచినాడు. అతడుకూడా అందగాడై ఉండటమువల్ల రాజపుత్త్రి అనుమానించక అతనికి సోమదత్తు డనే నామము ఉండటము తెలిసి మోసపోలేదని సంతోషపడ్డది. కొంతసేపు ఇద్దరూ ఇష్టాగోష్ఠి నడిపి ఒడంబడిక చేసుకొన్నారు. ఆమె నిజనివాసానికి వెళ్ళింది. అతడు అక్కడే రాత్రి గడిపి తెల్లవారగానే రాజమందిరద్వారము చేరి, ప్రతీహారముఖముగా తననామము మహారాజుకు తెలియపరచి, సమ్మానము పొంది నిజరాజ్యచ్యుతినిగురించి చెప్పుకొన్నాడు. విక్రమసేనుడు అతని దాయాదులను గెలిచి రాజ్యమునూ, తనకుమారినీ అతనికి ఇస్తానని చెప్పినాడు. కుమార్తె తల్లికి ఆప్తసఖిద్వారా నిజప్రణయవృత్తాంతము తెలిపింది. రాజుకూ కుమారీ ప్రేమవృత్తాంతము తెలిసి ఇష్టావాప్తి కాకతాళీయముగా తటస్థపడినందుకు రాజు ఆశ్చర్యపడినాడు. అప్పుడు మంత్రి ఇలా పలికినాడు: "రాజు చూచుకొనని కార్యములను మంత్రి చూచినట్లు, అదృష్టవంతుల కార్యములను విధి స్వయముగా నెరవేర్చుతుంది. అందుకు నిదర్శనంగా వినండి:

## హాయజోస్యుని కథ

హరిశర్మ అనే దరిద్ర బ్రాహ్మణునకు ప్రారబ్ధకర్మానుభవంవల్ల గంపెడు పిల్లలు ఉన్నారు. సకుటుంబముగా అతడు తిరిప మెత్తుతూ ఒకపట్టణములో స్థూలదత్తు డనే ధనికగృహస్థుని ఆశ్రయించినాడు. హరిశర్మ అతనికి ఉపచారాలు చేస్తున్నాడు. అతనికుమారులు స్థూలదత్తుని పశువులను మేపుతున్నారు. హరిశర్మ భార్య ధనికుని ఇంటిలో

పనిపాటలు చేస్తున్నది. అంతా కలిసి పొట్టకోసము చాకిరీ చేస్తూ ఆ ధనవంతుని పొరుగున నివాసము చేస్తున్నారు. ఇలా ఉండగా స్థూల దత్తుని ఇంట్లో శుభకార్యము వచ్చింది. పెళ్ళివారు తండోపతండాలుగా వచ్చారు. ఆ శుభకార్య సందర్భములో ధనికుని ఇంట్లో హరిశర్మ తిష్ఠ వేసి కుత్తుకబంటిగా ఘృతమాంసాదిభోజనము చేయాలని ఉవ్విళ్లూరు తున్నాడు. ఎవరూ అతన్ని జ్ఞాపకము ఉంచుకొని పెళ్ళికి పిలవలేదు. ఒకరాత్రి అతనుభార్యతో "దారిద్ర్యమువల్ల మూర్ఖతచేత నాకు ఇటు వంటి అగౌరవము కలిగింది. ప్రస్తుతము నేను ఉపాయము ఆలోచించి దత్తు గౌరవానికి గురి కావాలి. సమయము కనిపెట్టి అతనితో నేను మహాజ్ఞాని నని చెప్పు." అన్నాడు. అంతా నిద్ర పోతున్న సమయ ములో హరిశర్మ దత్తు అల్లునిగుర్రమును హరించి దూరాన దాచినాడు. తెల్లవారగానే మగపెళ్ళివారు ఎంత వెతికినా అశ్వము కనపడలేదు. అమంగళానికి భయపడి స్థూలదత్తు గుర్రపుదొంగను వెతుకుతూ ఉండగా హరిశర్మభార్య అతనితో "అయ్యా, నాభర్త జ్యోతిశ్శాస్త్రములో గట్టివాడు. ఆయన గుర్రాన్ని తెప్పించగలడు. ఆయనను అడగరేమి?" అన్నది. వెంటనే స్థూలదత్తుడు హరిశర్మను పిలిపించి "మాగుర్రాన్ని ఎవరు హరించారో చెప్పండి" అని అడిగినాడు. హరిశర్మ గీతలు గీసి ఊరికి దక్షిణసరిహద్దున దొంగలు గుర్రాన్ని కట్టివేశారు. త్వరగా వెళ్ళి తెచ్చుకోండి. ఆలస్య మమృతం విషమ్ అని పలికినాడు. వెంటనే పెళ్లివారు వెళ్లి అశ్వాన్ని పట్టి తెచ్చారు. హరిశర్మప్రతిభను అందరూ ప్రశంసించినారు. అతడు మహాజ్ఞాని అని అంతా ఆమోదించినారు.

కొన్నాళ్ళకు రాజమందిరములో సువర్ణరత్నరాసులు పోయినవి. దొంగ దొరకలేదు. అప్పుడు రాజు హరిశర్మను పిలిపించి అడిగినాడు. హరిశర్మ కొంతకాలము గడపదలచి రేపు చెపుతా నన్నాడు. రాజు అతన్ని నిజగృహములో ఒకతావున భద్రముగా ఉంచినాడు. రాజ

నగరులో జహ్వా అనే చేటి, దానిఅన్న కలిసి ఆసువర్ణరత్న రాసులను హరించినారు.

హరిశర్మ తమదొంగతనాన్ని కనిపెడతా డని జిహ్వాకు భయము వేసింది. అతడు గదిలో ఏకాంతములో ఉండి తననాలుకను "ఓ పాడు జిహ్వా! భోగాశచేత ఏమి చేశావే! చేసినదానికి అనుభవించు." అని నిందించినాడు. ఆ గదివక్కనే చెవియొగ్గి వింటున్నజిహ్వా దొంగతనము బయటపడిం దనీ, హరిశర్మ అందుకే తనను నిందిస్తున్నా డనీ భ్రమపడి యుక్తిగా అతనిదగ్గిరికి వెళ్ళింది. అది అతనిపాదాలమీద వాలి 'స్వామీ! నేనే మీరు కనిపెట్టిన దొంగను. సువర్ణరత్నరాసులను హరించి ఇంటివెనుక తోటలో దానిమ్మచెట్టుకింద పాతిపెట్టాను. నన్ను కాపాడాలి స్వామీ! నాకుదొరికిన సొమ్మునీవే పుచ్చుకో." అని వేడుకొన్నది. హరిశర్మ బెట్టుసరిగా "ఛో, నాకు భూతభవిష్యద్వర్తమానాలు తెలుసును. శరణాగతికై వచ్చినదానివి కనుక నిన్ను బయట పెట్టను. నీచేతికిచ్చినసొమ్ము నా పరము చెయ్యి" అన్నాడు. చేటి అందుకు అంగీకరించి వెళ్ళిపోగా హరిశర్మ ఆశ్చర్యపడి ఇలా తలపోసి నాడు: "విధి అనుకూలమై ఆపదను రాకుండాచేసింది. అసాధ్యకార్యమును సాధించింది. మాయజ్యోస్యుణ్ణి అయినా జిహ్వా నా పరువు నిలిపింది. నాలుకను నిందిస్తూ ఉంటే, గుమ్మడికాయలదొంగ తనబుజాలు తడువు కొన్నట్టు నేరము అంగీకరించి జిహ్వా నా పాదాలమీద పడ్డది. ప్రచ్ఛన్నదోషులు భీతివల్ల బయటపడతారు." ఆరాత్రి హరిశర్మ సంతోషములో సుఖనిద్రపోయినాడు. తెల్లవారగానే లేనిప్రజ్ఞ అభినయిస్తూ మాయజ్యోస్యుడు రాజును మందిరోద్యానములోకి తీసుకుపోయి ధన మున్నతావు తవ్వించి చూపి "ఎవ్వడో గాని ఆ దొంగ, కొంత కాజేసి పరారీ అయినాడు." అన్నాడు. రాజు సంతోషముతో హరి శర్మకు కొన్ని అగ్రహారాలు ఇనాముగా ఇయ్యదలచినాడు. మంత్రి మహా

బుద్ధిశాలి కావడముచేత జోస్యుని తీరు కపటముగా తోచి మహా రాజుతో "శాస్త్రపరిచయము రవంతయినా లేకుండా హరిశర్మ జోస్యం చెప్పడ మేమిటి? ఇతన్ని మరోవారందినాలదాకా పరీక్షించుదాము. ఇదంతా చూస్తే నాకు మోసముగా కనపడుతున్నది. అటుపైన దేవరవారిచిత్తం!" అని రాజుచెవిలో చెప్పినాడు. మహారాజు కుండలో మండూకమును పెట్టి మూత వేసి, ఆ ఘటమును సభలోకి తెప్పించి హరిశర్మతో "అయ్యా! జ్యోతిషాచార్యా! ఈ కుండలో ఏమున్నదో నీవు చెపితే నిన్ను పూజిస్తాను." అని పలికినాడు. ఆమాట వినగానే గుండెలు బరువెక్కి మనసులో కుమిలి కుమిలి ఏడ్చి వినాశకాలము వచ్చిందని నిశ్చయించుకొని, తనను బాల్యములో తండ్రి ముద్దు ముద్దుగా పిలిచే మండూకనామము స్ఫురణకు వచ్చి వెంటనే ఆతడు "ఓమండూకా, నీవు సాధువైన దానివే. అయినా ఘటములో నీవు ఉండుటవల్ల నీవినాశము సిద్ధమై ఉన్నది" అని పలుకగానే "ఈ మహా ప్రాజ్ఞుడు శక్తిమంతుడు. కుండలో ఉన్న మండూకాన్ని తెలుసుకో గలిగాడు" అంటూ అంతా సంతోషించారు. మహారాజు కూడా మోస ములో పడి హరిశర్మ మహాజ్ఞాని అని భ్రమసి అగ్రహారాలు, సువర్ణ, ఛత్రవాహనాలు కానుక లిచ్చినాడు. క్షణములో హరిశర్మకు విధివశాన సామంతుని హోదాదాకా వచ్చింది.

శుభకర్మ ఆచరించినవాళ్ళకు దైవము ఎప్పుడూ అనుకూలమే. "దేవా! నీకుమారి తేజస్వతి అసమానుని మానుకొని అనుకూలుడైన సోమదత్తుణ్ణి అభిసరించింది." మంత్రిమాటలు విని తగిన అల్లుడు దొరికి నందుకు రాజు సంతోషపడ్డాడు. అతడు తేజస్వతిని సోమదత్తుని కిచ్చి పెళ్ళి చేసినాడు.

సఖీ! విధి అనుకూలమైతే అసాధ్యములు సుసాధ్యములు కాక తప్పదు.

సోమప్రభ ఇలా రహస్యముగా కథ చెప్పగా కళింగసేన ఆకర్ణించి క్రమేణా బంధుభయము వదిలి వత్సరాజు పొందుకై కుందుతున్నది. సోమప్రభ అసురసంజవేళ కళింగసేనవద్ద సెలవుపుచ్చుకొని వెళ్ళిపోయింది.

## తరంగము : 32

మర్నాడు ఉదయము సోమప్రభ యథాప్రకారముగా కళింగసేన వద్దకు వచ్చి గోష్ఠి సలుపుతూ ఉండగా కళింగసేన "మాతండ్రి నన్ను తప్పక ప్రసేనజిత్తుకు ఇవ్వదలచు కొన్నాడు. ఆసంగతి మాఅమ్మ నాతో అన్నది. నీవు చేసిన రూపవర్ణనవల్ల వత్సరాజు శ్రవణ మార్గాన చొచ్చి నాచిత్తమును హరించినాడు. మున్ముందు నాకు ప్రసేనజిత్తును చూపి అనంతరము వత్సేశ్వరుని దగ్గిరికి నన్ను తీసుకుపో. మానాన్న మాట నాకు లెక్కలేదు" అన్నది ఆదుర్దాగా. కళింగసేన ఔత్కంఠ్యము గ్రహించి సోమప్రభ "నిజముగా నీవు వెళ్ళదలచి ఉంటే బరిణెలో యంత్రమహిమవల్ల గగనమార్గాన వెళ్ళిపోదాము. నీసామగ్రి యావత్తు తెచ్చుకో. వత్సరాజు నిన్ను చూశాక నువ్వు తిరిగి ఇక్కడికి రాలేవు. నీవు తిరిగి పుట్టింటికి రావు. ఇది ముమ్మాటికి రూఢి. ప్రియ వల్లభుని పొంది నన్నుకూడా మరిచి పోతావు. నే నిక్కడికి వచ్చినంత చనువుగా నీఅత్తవారింటికి రాలేనమ్మా" అన్నది. ఆమాటలకు కళింగ సేన కళ్ళనీళ్ళుపెట్టుకొని, "అలాఅయితే వత్సరాజును ఇక్కడికి రప్పించు. నిన్ను విడిచి నేను ఉండలేను" అని దీనముగా పలికి "అనిరుద్ధుని చిత్ర లేఖ యుక్తిగా తీసుకు రాలేదా? ఎలా తెచ్చిందో విను" అన్నది :

### ఉపకథ

బాణాసురపుత్రి, ఉష పార్వతీదేవిని భక్తితో కొలిచింది. అందుకు దేవి సంతోషించి "ఉషా! నీకు స్వప్నంలో ఎవడు ప్రియుడో వాడే

నీపతి" అని వరమిచ్చింది. అదేప్రకారం ఒక పురుషుణ్ణి కలలోగాంధర్వ వివాహము చేసుకొని, తెల్లవారగానే ఉషాదేవి లేచి, ప్రియుణ్ణి కానక, సంభోగ చిహ్నాలు శరీరముమీద చూచుకొన్నది. పార్వతీవరాన్ని ఆమెపలుమారులు స్మరించి భయాశ్చర్యమగ్న అయింది. స్వప్నములో ప్రియుడు జాగ్రదవస్థలో లేకపోవడముచేత ఆమె ఎడబాటుకు నిలువలేక పోతున్నది. కారణము అడిగిన చిత్రలేఖ అనేచెలికి సర్వమూ పూస గుచ్చినట్టు చెప్పింది. ఆ చెలికత్తె యజమానురాలి స్వాప్నిక ప్రియు డెవరో ఎరగక "చెలీ, ఇది దేవీ మహిమ. గుర్తులేని నీ పతిని ఎలా వెతకడం? అతన్ని నీవు ఎరిగి వుంటే విశ్వమంతా వెతుకుతాను. అందులో నీప్రియుణ్ణి చూపించు. అప్పుడు నేను అతన్ని తీసుకొని వస్తాను." అంటూ వాగ్దానము చేయగా ఉష అంగీకరించింది. చిత్రలేఖ జగత్తు యావత్తూ చిత్తరువులో లిఖించింది. ఉష సంతోషిస్తూ వణుకుతున్న కెంగేలితో విశ్వపటములో ద్వారవతీపురవాసులలో అనిరుద్ధుణ్ణి చూపింది. చిత్రలేఖ "ధన్యురాలవు! నీ భర్త హరికి మనుమడు. ఇక్కడికి అరవై వేల యోజనాల దూరములో ఉన్నాడు." అనగా, ఉష కామార్తయై ఇప్పుడే శ్రీఖండమువలె చల్లనైన అతని అంకమును ఆశ్రయింప లేకపోతినా కామాగ్నిలో కాలిపోతాను" అని దీనంగా అన్నది.

చిత్రలేఖ ప్రియసఖిని ఓదార్చి గగనమార్గాన ప్రయాణము చేసి ద్వారవతీపురము చేరింది. రాత్రి నిదురిస్తున్న అనిరుద్ధుని మేలుకొలిపి, అతనికి చిత్రలేఖ ఉషాస్వప్నమునూ అనురాగమునూ తెలియజెప్పి, ఆ చిత్తరువును అతనికి ఇచ్చింది. అనిరుద్ధునికి ఉషా స్వప్న వృత్తాంతము అంతకు మునుపే తెలుసును. అందుచేత అతడు చిత్రలేఖను అనుసరించి గగనతలమున ప్రయాణముచేసి ఉషాదేవి అంతఃపురములో ప్రవేశించాడు. అనిరుద్ధుని చూచిన ఉషాదేవి అంతరంగము చంద్రోదయ సముద్రమువలె పొంగి పొరలింది. ఆమె ప్రియునితో సుఖపడుతూ

ఉన్నది. ఉషతండ్రిని బాణాసురుని అనిరుద్ధుడు నిజపరాక్రమమువల్ల జయించినాడు. అనంతరము ఆ దంపతులు పార్వతీ పరమేశ్వరులవలె ఏక శరీరులై ద్వారవతికి వెళ్ళి సుఖంగా ఉన్నారు. ఈరీతిగా చిత్రలేఖ ఉషకు ప్రియుణ్ణి తెచ్చి ఇచ్చింది. నీవు ప్రతిభావంతురాలవు. అందు వల్ల ఆలసించక వత్సరాజునే ఇక్కడికి రప్పించు.

కళింగసేనమాటలు విని సోమప్రభ "చిత్రలేఖ అసురస్త్రీ కనుక పరపురుషుణ్ణి ఎత్తుకొని వచ్చింది. నేను పరపురుషుణ్ణి ఎలా స్పృశించను? నిన్నే వత్సరాజువద్దకు తీసుకుపోతాను. మొదట నీకు ప్రసేనజిత్తును చూపుతాను!" అనగానే కళింగసేన అంగీకరించింది. సోమప్రభ మాయాయంత్రవిమానమును తీసుకొని వచ్చింది. ఇద్దరూ బయలు దేరినారు. విమానము ప్రసేనజిత్తుదగ్గిరికి వెళ్ళగా సోమప్రభ అతన్ని కళింగసేనకు చూపింది. "ఈ రాజును ముదిమి వరించింది. ఇతన్ని మరెవ్వరైనా పెళ్ళాడతారు. నన్ను శీఘ్రంగా కౌశాంబీనగరానికి తీసుకొనిపో. అక్కడ వత్సరాజును చూస్తాను" అన్నది. సోమప్రభా కళింగసేనలు కౌశాంబీనగరము వెళ్ళారు. కళింగసేన కన్నుల కరవు తీరేట్టు, చంద్రునికి చకోరివలె ఉదయనుని చూచి హృదయాన చేయి ఉంచుకొని "సఖీ, ఈమార్గాన ఉదయనుడు నాలో ప్రవేశించినాడు" అని చెపుతున్నట్టున్నది.

కళింగసేన "సఖీ! ఇప్పుడే వత్సేశ్వరునితో నాకు సమాగమము కలిగించు. క్షణమైనా నిలువలేను" అన్నది. అందుకు సోమప్రభ "చెలీ, ఇప్పుడే అశుభశకున మైనది. అందుచేత ఈరోజు ఉద్యానవనములో అజ్ఞాతముగా ఉండు. రాకపోకలు చెయ్యకు. రేపు ఉదయాన్నే నేను వచ్చి మీఇద్దరూ కలిసే విధము చూస్తాను. నేనిప్పుడు చైత్రరథములో నాభర్త ఇంటికి వెళ్ళి వస్తాను." అని వెళ్ళిపోయింది. వత్సరాజు ఉద్యానమునుంచి గృహోన్ముఖు డైనాడు.

కళింగసేన అక్కడే ఉండి మంచిశకునము కా దని సోమప్రభ చెప్పినప్పటికీ లక్ష్యము చెయ్యక వత్సరాజుకు సందేశము పంపింది. వార్తాహరుడు రాజ దర్శనము చేసి సందేశాన్ని ఇలా నివేదించినాడు: "దేవా! తక్షశిలాధిపునికుమార్తె కళింగసేన మీ అందచందాలు విని అచ్చెరువుపడి బంధువు లందరినీ వదిలి ఏలినవారిని స్వయముగా వరించడానికి వచ్చింది. సోమప్రభ యంత్రవిమానముమీద ఆమెను కూర్చో బెట్టుకొని గగనమార్గాన ప్రయాణము చేసి కౌశాంబీనగరము చేరింది. దయచేసి కళింగసేనను స్వీకరించండి. మీ యోగము కౌముదీ చంద్ర యోగము అగును గాక!" వార్తాహరుని వత్సరాజు సత్కరించి యౌగంధరాయణమంత్రిని పిలిచి "తక్షశిలాధిపతికుమార్తె కళింగసేన స్వయంగా నన్ను వరించడానికి వచ్చింది. ఆమెను ఎప్పుడు పెళ్లి చేసుకోను?" అని అడిగినాడు. మంత్రి మహారాజుక్షేమాన్ని కోరి క్షణంసేపు ఆలోచన చేశాడు: "కళింగసేన త్రిలోకసుందరిగా వన్నె కెక్కింది; ఆమెను దేవతలుకూడా కోరుతారు. మహారాజు ఈ అద్వితీయసౌందర్యవతిని పెళ్ళాడి సర్వమూ మరిస్తే వాసవదత్త ప్రాణాలు వదిలివేస్తుంది. రాజకుమారుడు నరవాహనదత్తుడు చిక్కుపడతాడు. పద్మావతీదేవి అనురాగాంధ కనుక ఆమెకూడా జీవించదు. చండమహాసేనుడు ప్రాణత్యాగము చేస్తాడు; ద్వేషాన్ని అయినా సాధిస్తాడు. వివాహాన్ని నిషేధించడమూ మంచిదికాదు. ఈ కార్యము కాలవిలంబము చేస్తే ఆగిపోతుంది." తర్వాత యౌగంధరాయణుడు మహారాజుతో "దేవా, కళింగదత్తు మీకు భృత్యుడు. అతనికుమార్తె స్వయంగా మిమ్ము వరించేందుకు వచ్చింది. కార్తాంతికులను పిలిపించి సుముహూర్తము పెట్టించండి. యథావిధిగా వివాహము చేసుకోండి. కళింగసేనకు అనుకూలమైన పరివారజనాన్ని ఏర్పరించాలి. ఆమెకు అలంకారాదులు పంపాలి." అన్నాడు. వత్సరాజుకు ఎక్కడలేనిసంతోషమూ వచ్చింది.

కళింగసేన యథావిధిగా విడిదిలో చేరి కోరిక ఈడేరుతుం దని సంతోషిస్తున్నది.

యౌగంధరాయణుడు రాజమందిరమునుంచి స్వగృహానికి వెళ్లి ఇలా ఆలోచన చేసినాడు: "తరుచుగా అశుభకార్యానికి కాలహరణము ప్రతిక్రియ. అలాగే పూర్వము వృత్రశత్రు వైన ఇంద్రుడు బ్రహ్మహత్య వల్ల పారిపోగా ఇంద్రపదవిలో ఉన్న నహుషుడు శచీదేవిని బలాత్కరించాడు. ఆమె బృహస్పతిని శరణు వేడింది. దేవగురువు నహుషునితో "శచీదేవి రేపు ఉదయము నీవద్దకు వస్తుంది" అంటూ నహుషుడు నశించేవరకూ కాలహరణము చేసినాడు. ఇంతలో శక్రుడు దేవరాజయినాడు. ఇలాగే నేనుకూడా కళింగసేనవిషయములో ఉదయనునకు కాలహరణము చేయవలె." ఆలోచనానంతరము మంత్రి గణకులను రావించి ముహూర్తము పెట్టించినాడు. ఇదంతా రహస్యంగా చేయించినా, వాసవదత్తాదేవి కర్ణాకర్ణిగా విన్నది. యౌగంధరాయణుని పిలిపించి వాసవదత్త "మంత్రివరా! పూర్వము నాకు పద్మావతితప్ప మరేసవతి జీవించి ఉండకూడ దని కదా మీరు సెలవిచ్చారు! మహారాజు కళింగసేనను వివాహ మాడుతాడు. ఆమెయందు ఆయన అనురక్తుడై ఉన్నాడు. ఇక నాజీవితము వ్యర్థము!" అన్నది. మంత్రి ఇలా పలికినాడు: "దేవీ, ధైర్యంగా ఉండు. నేను జీవించిఉండగా అ దెలా జరుగుతుంది? ఈవిషయములో నీవు రాజవిరోధినివి కావద్దు. ధైర్యము శరణ్యము. రోగి ప్రతికూలవచనాలతో లొంగడు, అనుకూల వచనాలతో వశ మవుతాడు. మహారాజు మీవద్దకు వచ్చినప్పుడు మీరు అలుగ వద్దు. మీఅభిప్రాయాన్ని మనసులో పెట్టుకొని ఆయనను సేవించాలి. కళింగసేన సవతి కావడానికి అంగీకరించు. అందువల్ల ఆమె తండ్రి తక్షశిలాధిపతి మనకు సహాయము చేస్తాడు. పద్మావతితో కూడా ఈవిషయమే చెప్పాలి. అనంతరము నాయుక్తిబలము ఉన్నది.

ధీశాలులను సంకటాలలో, శూరులను యుద్ధాలలో పరీక్షించాలి. దేవీ, చింతించకు." యౌగంధరాయణుడు వెళ్లిపోయినాడు. వత్సరాజు ఆరో జల్లా దేవేరులదగ్గిరికి వెళ్ళలేక కళింగసేనపొందుకై అతడు ఉవ్విళ్ళూరు తున్నాడు.

తరంగము : 3_౨

మరునాడు యౌగంధరాయణుడు మహారాజువద్దకు వెళ్ళి "దేవా! నీకూ కళింగసేనకూ శుభలగ్నము నిశ్చయించేయడానికి ఆటంకము ఏ మున్నది?" అని అడిగినాడు.

వత్సరాజుమనసంతా కళింగసేనామయమై ఉన్నది. ఆమెను వదలి క్షణమైనా నిలవలేనని రాజు పలుకగా, అతనిఆనతి చొప్పున కార్తాంతికులను తీసుకు రమ్మని ప్రతీహారుని పంపినాడు మంత్రి. వివాహలగ్న విషయములో సిద్ధాంతులతో ఉపాయ మాలోచించి నాడు. ఆజ్యోతిష్కులు ఆరుమాసాలదాకా మంచిలగ్నమే లేదని తెలుపగా యౌగంధరాయణుడు మాయకోపము నటించి "రాజా! వీరికి ముహూర్తము చూడడము తెలియదు. పూర్వము మీరు ఒక మహాజ్ఞానిని గౌరవించారు. అతన్ని అడిగితే తెలుస్తుంది." అన్నాడు. వత్సరాజు ఆందోళన పడుతూ జ్యోతిశ్శాస్త్రపండితుణ్ణి పిలిపించి అడిగినాడు. అతడుకూడా మంత్రికుట్రలో చేరి ఆరుమాసలలోగా లగ్నమే లేదు అన్నాడు. యౌగంధరాయణ.మంత్రి బెంగపడిన వానివలె అభినయిస్తూ "రాజా! ఏమిచేయవచ్చును?" అన్నాడు. మహారాజు మంచిలగ్నమే 'అపేక్షించి "కళింగసేనను అడిగితే ఏమి అభిప్రాయము చెపుతుందో తెలుసుకొనండి" అని పలికినాడు. మంత్రి యౌగంధరాయణుడు ఇద్దరు జ్యోతిష్కులను కూడా తీసుకొని కళింగ సేనదగ్గరికి వెళ్లినాడు. ఆమెఅందచందాలను చూచి మంత్రి "ఈమె తగు

లాటములో రాజు పడితే రాజ్యపరిపాలన చెయ్యలే" దని తలచి ఆమెతో "నీకు వివాహలగ్నము నిశ్చయించేనిమిత్తము ఈసిద్ధాంతులను తీసుకొని వచ్చాను. నీజన్మనక్షత్రము చెప్పు." అన్నాడు. ఆమెపరివార జనము జన్మనక్షత్రాన్ని తెలిపినారు. మంత్రికుట్రవల్ల సిద్ధాంతులు మిథ్యావిచారముచేసి "ముహూర్తము ఆరు మాసాలదాకాలేదు." అన్నారు.

వివాహకాలము దూర మవుతున్న దని కళింగసేన దిగులు పడుతూ ఉండగా పరివారజనములోవాడు "మంచిలగ్నములోనే వివాహ మయితే దంపతులకు క్షేమము. పోనీ ఆలస్య మైతే మాత్రము వచ్చిన ఇబ్బంది ఏముంది?" అనే సరికి అందరూ అదేమాట అన్నారు. కళింగ సేనకు ఏమీ తోచక "మీయిష్టము వచ్చినట్టు చెయ్యండి" అని ఊరుకొన్నది. మంత్రి ఆమెదగ్గిర సెలవు తీసుకొని వత్సరాజు వద్దకు వెళ్ళి సంగతి చెప్పి యుక్తివల్ల అతన్ని ఊరడించినాడు.

యౌగంధరాయణుడు ఇలా కాలహరణము చేసి వివాహసన్నాహా న్నికై తన స్నేహితు డయిన యోగేశ్వర బ్రహ్మరాక్షసుని తలచు కొన్నాడు. ఆరాక్షసుడు పూర్వముచేసుకొన్న ఒడంబడిక ప్రకారము మంత్రి తలచిన మాత్రాన్నే సాక్షాత్కరించినాడు. మంత్రి అతనికి కళింగ సేనా వివాహవిషయము యావత్తు విశదపరచినాడు.

మంత్రి "మిత్రమా, నేను కాలయాపన చేస్తున్నాను. ఈలోగా యుక్తిచేత కళింగసేన శీలాన్ని ప్రచ్ఛన్నముగా కనిపెట్టు. అలాంటి అందగత్తె త్రిలోకాల్లో లేనందువల్ల ఏవిద్యాధరుడో తప్పకుండా ఆమెను మోహిస్తాడు. ఆమె విద్యాధరునితోనో సిద్ధునితోనో సంగమిస్తే రహ స్యంగా కనిపెట్టు. అన్యరూపములో వచ్చిన కాముకుణ్ణి పసిపట్టు. నిద్రా సమయములో దేవతలు నిజరూపములో ఉంటారు. నీవల్ల కళింగసేన నడవడి తీరులో లోపాలు కనిపెట్టగలము. ఈవిషయము తెలిస్తే రాజు

ఆమె యెడల విరక్తుడవుతాడు. ఈకార్యము నీవల్లనే సాధ్యమవుతుంది'' అని కోరినాడు.

బ్రహ్మరాక్షసుడు "ఇదంతా ఎందుకు? యుక్తివల్లకళింగసేన శీలము చెడగొట్టనా? పోనీ చంపివేయనా? '' అన్నాడు. మంత్రిధర్మవేత్త కనుక అందుకు అంగీకరించక "అలా చేయడం అధర్మం. ధర్మమే అభీష్టార్థ మును ఇస్తుంది. స్వయంగా ఆమె నడవడిలో లోపాలు ఉంటే కని పెట్టాలి. నీస్నేహమువల్ల మా రాజకార్యము ఈడేరుతుంది'' అనగానే బ్రహ్మరాక్షసుడు కళింగసేనా మందిరములో అదృశ్యరూపుడై ప్రవేశించినాడు.

ఈ లోపల సోమప్రభ మళ్ళీ కళింగసేనదగ్గిరకి వచ్చి రాత్రి జరిగిన విషయము అడిగి తెలుసుకొన్నది. ప్రచ్ఛన్నుడై రాక్షసుడు వింటు న్నాడు. "సఖి! ఈ రోజు పూర్వాహ్ణమందే నేను నిన్ను చూడాలని వచ్చాను. నీదగ్గిర యౌగంధరాయణుని చూచి మరుగున దాగినాను. నేను చెపితే వినక స్వతంత్రముగా త్వరపడినావు. అపశకునము కార్య సాఫల్యానికి అనుకూలము కాదు. అందుకు నిదర్శనము విను:

## దుశ్శకున కథ

అంతర్వేదిలో వసుదత్తుడనే విప్రునికి విష్ణుదత్తుడనేకుమారుడు ఉన్నాడు. కుమారుడు చదువు కోసము పదహారేళ్ళవయసులో వలభీ నగరానికి వెళ్ళినాడు. ప్రయాణములో మధ్యేమార్గములో ఏడుగురు మూర్ఖశిరోమణులు విష్ణుదత్తునితో చెలిమి చేశారు. ఒకరి నొకరు వద లకుండా కలిసి ఉండవలెనని శపథము చేసుకొన్నారు. విష్ణుదత్తుడు తండ్రితో చెప్పకుండా రాత్రి బయలుదేరి హఠాత్తుగా దుశ్శకునము కావడముచేత మిత్రులతో "శకునము బాగా లేదు. మంచిశకునము చూచుకొని ప్రయాణము చేదాము'' అని హితము చెప్పినాడు.

ఆ మూర్ఖ సప్తకము ఆ మాటలు పెడచెవిని పెట్టినా, విష్ణుదత్తుడు ఒడంబడిక ప్రకారము కట్టుబడి వారిన్మరణ చేస్తూ ప్రయాణము సాగించినాడు. ఉదయము ఇంకో దుశ్శకునమయింది. విష్ణుదత్తుడు మంగళించగా ఆ మూర్ఖులు ససేమిరా అని అతని మాటలు పాటించక పైగా బెదిరించి "అదు గడుక్కా ఏమిటి కుశ్శంకలు దత్తూ! తైనాతీలాగా నిన్ను వెంటబెట్టుకు వచ్చాము. ఇదే దుర్నిమిత్తము" అన్నారు.

విష్ణుదత్తు ఇలా ఆలోచించినాడు: "స్వేచ్ఛాచారి యైన మూర్ఖునికి హితోపదేశము బూడిదలో పోసిన పన్నీరు. మూర్ఖులలో పడిన ధీశాలి జలతరంగాలలో పడిన పద్మమువలె కష్టాల పాలవుతాడు. అందువల్ల వీరికి నేను హితాహితము ఉపదేశించకూడదు. ఊరికే ప్రయాణము చేస్తాను. అన్నింటికీ ఆ పరమాత్ముడే ఉన్నాడు!" అతడు మూర్ఖులతో ప్రయాణము చేసి సంజవేళకు శబరగ్రామము చేరినాడు. వాళ్ళు వయసులో ఉన్న బోయదానింటికి వెళ్ళి పరుండడానికి తావు ఇమ్మని అడిగినారు. ఆ బోయెత గదిఇవ్వగా తక్కినవాళ్ళతో పాటు విష్ణుదత్తుడు అందులో ప్రవేశించినాడు. క్షణములో ఆ ఏడుగురుమూర్ఖులూ గాఢ నిద్ర పోగా దత్తుమాత్రమే మెలకువగా ఉన్నాడు. వివేకులకు నిద్ర ఎక్కడిది? ఈ లోగా ఎవడో పడుచువాడు బోయదానిదగ్గిరికి వెళ్ళి దానితో సంగమించినాడు. అలసిసొలసి ఇద్దరూ నిద్రపోయినారు. విష్ణుదత్తుడు తలుపు సందులోనుంచి దీపకాంతివల్ల బోయదాని చర్య చూచి విసుగుతో దీనిగుమ్మము ఎందుకు తొక్కాము? ఇది చలచిత్తురాలు. ఇవాళ దీనికి వీడు మగడైతే రేవు మరొకడు" అని తలపోస్తూ ఉండగా జనుల కోలాహలము వినవచ్చింది. ఈ లోగా యువకుడూ ఖడ్గపాణీ అయిన శబరనాయకుడు పరివారసమేతముగా లోపల ప్రవేశించినాడు. "ఎవరు మీరు?" అని శబరుడు ప్రశ్నించాడు. "మేము బాటసారులము" అని విష్ణుదత్తుడు సమాధాన మిచ్చినాడు. శబరుడు

వినవిస లోపలికి పోయి పరపురుషునితో ఉన్న భార్యను చూచి కత్తి దూసి జారునిశిరస్సు నరికినాడు. భార్యను దండించ లేదు, మేలు కొలుప లేదు. కత్తికింద వేసి శబరుడు మరొకపాన్పుమీద పరున్నాడు. నిశ్శంకముగా అతడు నిద్రపోయినాడు.

ఇంతలో ఆబోయది మేలుకొని జారుని తలనూ, నిద్రిస్తున్న పతినీ చూచింది. ఆమె జారుని మొండెము బుజాన పెట్టుకొని, శిరస్సు చేత పట్టుకొని బూడిదరాసిలో పూడ్చి వచ్చింది. పాడుకొంపలో పడ్డాముగా భగవంతుడా అని విష్ణుదత్తుడు సాక్షిగా సర్వమూచూచి, మూర్ఖుల మధ్య నిద్ర పోయినాడు. బోయత నిదురిస్తున్న పతితలను తెగనరికి బయటకు వచ్చి అరిచి సేవకులను లేపి "అయ్యో! ఈ బాటసారులు నాభర్తను చంపేశారు!" అని ఏడ్చింది. బోయదాని అనుచరులు పరుగుపరుగున వచ్చి తమదొరను చూచి విచ్చుకత్తులు చేబూని విష్ణు దత్తాదుల మీదికి వచ్చినారు. మూర్ఖులు చావుదెబ్బలు తిని నిద్ర లేచారు. విష్ణుదత్తుడు "దొరలూ! బ్రహ్మహత్యాదోషము ఎందుకు పడికట్టుకొంటారు? ఈపని మేము చెయ్యలేదు. ఈబోయెత పరపురు షుని మరిగి ఇంతపని చేసింది. తలుపుసందులోనుంచి సర్వమూ నేను చూశాను. క్షమిస్తే యథార్థము ఋజువు చేస్తాను." అని ఘోషించి నాడు. అతడు బూడిదరాశిలో ఉన్నజారుని మొండెమునూ, శిర మునూ వాళ్ళకు చూపగా, బోయది తెల్లపోయి దోషాన్ని అంగీక రించింది. దానిని తిరస్కరించి శబరులు "కామిని పరపురుషేచ్ఛవల్ల ఎంతపని కయినా పడికట్టుతుంది." అన్నారు. విష్ణుదత్తూ మూర్ఖులూ చావు తప్పి కన్ను లొట్టపోయి బతుకు జీవుడా అని బయట పడ్డారు. మూర్ఖులు దత్తును ప్రశంస చేసి "దత్తూ, నిద్రిస్తున్న మాకు రక్షారత్న దీప మైనావు. నీఅనుగ్రహామువల్ల మృత్యువును దాటినాము." అన్నారు. శకున దుశ్శకునమువల్ల కార్యము చెడిపోవడము కద్దు.

ఇలా సోమప్రభ కళింగసేనకు ఏకాంతములో కథ చెప్పి తిరిగి ఇలా అన్నది: "సఖీ, శకునము చూడకుండా కార్యాచరణను చేసితే కార్యసాఫల్యము కానే కాదు. మందబుద్ధులు హితాన్ని పెడచెవిని పెట్టి యథేచ్ఛగా సంచరించి చివరకు పశ్చాత్తాపము పొందుతారు. శకునము చూడక నీవు వత్సరాజువద్దకు దూతను పంపడము ఉచితము కాదు. వివాహము నిర్విఘ్నముగా కొనసాగును గాక! దేవతలుకూడా నిన్ను వలచినారు. అందువల్ల నీవు శీలాన్ని కాపాడుకోవాలి. మహామంత్రి యౌగంధరాయణుడు నీతిశాస్త్రవేత్త. వత్సరాజు నిన్ను పెళ్ళాడి వ్యసనములకు పాలవుతాడని సందేహించి మంత్రి ఆలోచిస్తాడు. నీవివాహము కానీయడు. ఒకవేళ విధివశాన వివాహమైతే దోషారోపణ చేస్తాడు. అయితే ధర్మబుద్ధివల్ల నీయందు దోషారోపణ చేయడానికి సాహసించడు. అయినా సవతివిషయములో జాగరూకతతో ఉండాలి. అందుకు నిదర్శనము విను:

## సవతి కుట్ర

విశ్వామిత్రుడు ఇక్షుమతీనదిని త్రవ్వించి దానిపక్కనే ఇక్షుమతీ నగరాన్ని నిర్మించినాడు. పురోపకంఠమున ఉన్న ఉద్యానవనములో మంకణకుడు అనేమునీంద్రుడు ఊర్ధ్వపాదుడై తపస్సు చేస్తూ, ధ్యానభంగము కాగా గగనతలాన చరిస్తున్న మేనకచీరె గాలికి తొలగడము చూచినాడు. మహామునిమనసు వికలమై పోగా అతని తేజస్సు కదళీగర్భములో పడినది. మునీంద్రుని రేతస్సువల్ల చక్కనిచుక్క పుట్టింది. అతడు పిల్లకు కదళీగర్భ అని నామకరణము చేసినాడు. ఆబాలిక మంకణాశ్రమములో పెరుగుతున్నది.

ఒకసారి మధ్యదేశనృపాలుడు దృఢవర్మనామధేయుడు వేటకు వెళ్ళి అలిసి సమీపాన ఉన్న మంకణాశ్రమము చేరి మునికన్యావేషములో

ఉన్న కదళీగర్భను చూచి కామించినాడు. అతడు "ఎవరో వల్కలా లను ధరించిన ఈసుందరాంగి? దుష్యంతుడు కణ్వపాలిత అయిన శకుంత లను వివాహ మాడినట్లు నేనుకూడా ఈకన్యను పెళ్ళాడితేనా!" అని తలపోస్తున్నాడు. మునీంద్రుడు ఆసందర్భములో సమిత్కుశలు ఆశ్ర మానికి తీసుకొని వస్తున్నాడు. మహారాజు మునీంద్రునికి నమస్క రించి తన్ను తాను తెలియబరచుకొన్నాడు. రాజేంద్రునకు అర్ఘ్య పాద్యాదులు ఇమ్మని ముని కదళీగర్భను నియోగించినాడు. ఆమె ప్రసన్నై రాజుకు అర్ఘ్య మిచ్చింది. "నీకు ఈకన్య ఎలా లభించింది మునీంద్రా!" అని రాజు కుతూహలాయత్తచిత్తుడై మునీంద్రుణ్ణి అడిగినాడు. కదళీగర్భ జనన వృత్తాంతము మంకణకుడు చెప్పగా రాజు కదళీగర్భ అప్సరస అని తెలుసుకొని వ్యామోహపడి తన కిమ్మని మునిని కోరినాడు. ముని అంగీకరించినాడు. సురస్త్రీలు కదళీగర్భవివా హము నిమిత్తము భూలోకానికి అవతరించి మేనకమీద మమకారము వల్ల ఆకన్యకు అలంకారము చేసినారు. వాళ్ళు ఆమెచేతిలో ఆవాలు పెట్టి "త్రోవలో ఆవాలుకై పీటిని చల్లుతూ వెళ్ళు. ఒకవేళ భర్త వల్ల అవజ్ఞ పొందిన ట్లయితే, ఆవాలు పెరిగి మొక్కలై మార్గాన్ని నీకు తెలియజేస్తవి." అన్నారు. రాజు కదళీగర్భను గుర్రము మీద ఎక్కించుకొని నిజసైన్యము వచ్చి కలవగా రాజధానీనగరము చేరినాడు. ప్రయాణసమయములో కదళీగర్భ ఆవాలు చల్లుతూ వెళ్ళింది. మహారాజు ప్రియురాలి వృత్తాంతము మంత్రులకు తెలిపి, అంతఃపురస్త్రీలను, ఇతరభార్యలను రోసి కదళీగర్భతో సదా సుఖము అనుభవిస్తున్నాడు. రాజు అలా అన్యాసక్తుడై ఉండడమువల్ల పట్టపురాణి ప్రధానామాత్యుని పిలిపించి వగపుతో ఏకాంతములో "మహారాజు క్రొత్త రాణీమీది మోజుకొద్దీ నన్ను వదిలినాడు. సవతిపీడ ఎలా తొలగిపోతుందో ఉపాయ మాలోచించండి" అన్నది. అప్పుడు

మంత్రి "దేవి, అలా చేయడం ధర్మమా ? ప్రభువుని భార్యనుంచి వేరుచేయడము వినాశహేతువు. ఇలాటి కపటోపాయాలు నెరవేర్చ గలవారు పరివ్రాజికలు. అదే వారిజీవనము. వారు సన్యాసిను లయినా వృత్తి లౌకికవృత్తి. ఇళ్ళల్లో చేరి ఇంటివానాలు బాగా లెక్కపెడ తారు." అని పలికినాడు. రాణి వినీతయై "యోగ్యులు నిందించే అధర్మకార్యము చేయరాదు" అని అతన్ని పోనిచ్చి తాపసిని పిలిపించి నిజవాంఛితము తెలియజెప్పి, కార్యసిద్ధి అయితే కావలసినంత ధనము ఇస్తా నన్నది. ఆసన్యాసిని ధనాశవల్ల నానాప్రయోగాలు చేసి కార్యము సాధిస్తా నన్నది. దేవికి ఆశ పెట్టి ఆతాపసి మఠానికి వెళ్ళిపోయింది.

పరివ్రాజిక కార్యసాధన కష్టమని గ్రహించి బెంగపడింది. "ఆశ ఎంతపనైనా చేస్తుంది. రాణిదగ్గిర సాహసముతోటి ప్రతిజ్ఞ చేశాను. కార్యసాధనోపాయము అసలే నాకు తోచడము లేదు. అంతఃపురములో మాయోపాయముద్వారా కార్యాన్ని నెరవేర్చడము కష్టము. ప్రభువులకు కుట్ర తెలిస్తే నన్ను బతకనిస్తారా? ఒకటి తోస్తున్నది. నామిత్రుడు మంగలివాడు మాయోపాయము వల్ల కార్యము సాధించడంలో కుశలుడు." అని ఆలోచించి ఆతాపసి మంగల దగ్గిరికి వెళ్ళి వచ్చినపని చెప్పింది. ఆ వృద్ధుడు "అదృష్టముకొద్దీ నాకు ఇటువంటి సమయము దొరికింది. చిన్నరాణికి చెరుపు చేయక ఆమెను రక్షించాలి. ఆమె తండ్రి దివ్యదృష్టివల్ల విషయమంతా కనిపెట్టగల ప్రజ్ఞావంతుడు. రాజుకు ప్రియావియోగము కలిగించి దేవేరివల్ల కానుకలు సంపాదిస్తాను. కొంతకాలము అయినతరువాత రాజు కదళీగర్భను పొందే విధము చూస్తాను. తగినయుక్తి చెప్పి ఆదంపతులను రంజింపజేసి బహుమానాలు పొందుతాను. ఇలా చేస్తే పాతికము చుట్టుకోదు." అని ఆలోచించి సన్యాసినితో ఇలా పలికినాడు: "అమ్మా, ఇదంతా నేను చేస్తాను కదా! యోగశక్తివల్ల కొత్తరాణిని చంపడము యుక్తము కాదు. రాజుకు

తెలిస్తే మనపని పడతాడు. స్త్రీ హత్యా పాతకము చుట్టుకొంటుంది. కదళీ గర్భజనకుడయిన మంకణకుడు మనల్ని శపిస్తాడు. నా ధీప్రభావము వల్ల మహారాజుకు ప్రియావియోగము కలిగిస్తాను. అందువల్ల దేవి సుఖ పడుతుంది. మనకడుపులో చల్ల కదలదు. డబ్బు వస్తుంది. ఈ పని నావల్లనే సాధ్యము అవుతుంది. బుద్ధిబలమువల్ల ఎంతపనైనా సాధించ గలము. నా ప్రజ్ఞాశక్తి ఎలాంటిదో విను:

## ధూర్త*నాపిత కథ

ఈ దృఢవర్మరాజు తండ్రి పరమదుర్మార్గుడు. నే నతనికి నా కుల వృత్తి చేస్తూ ఉండగా ఆయన ఒకసారి అందగత్తె అయిన నాభార్యను చూచి మోహించినాడు. చుట్టుపక్కల ఉన్నవాళ్ళను అడిగి నా భార్య మంగలి దని తెలుసుకొని రాజు "ఈ మంగలి నన్నేమి చేస్తాడనే ధీమాతో నేను లేనిసమయములో నాకొంపలో చేరి నా భార్యను అను భవించి వెళ్ళిపోయినాడు. మర్నాడు నేను ఇంటికి వచ్చేసరికి నా భార్య కొత్తతరహాగా ఉంది. నేను గుచ్చి గుచ్చి అడగగా జరిగినసంగతి యావత్తూ పూస గుచ్చినట్టు చెప్పింది. అలా చేయడము తప్పు అని మాఆవిడను మందలించలేక, అశక్తుడనైనందువల్ల రాజు యథాప్రకార ముగా మాయింటికివచ్చి నాభార్యతో సుఖము అనుభవించి వెళ్ళిపోతూ ఉండేవాడు. దుర్మార్గప్రభువుకు గమ్య అగమ్య అనే తారతమ్యము ఎలా తెలుస్తుంది? ఆయనకు కిందు మీదు తెలిస్తేగా! ఆయనను అడ్డగించ డానికి, నేను భోజనము తగ్గించి అగ్నిమాంద్యవ్యాధి నటించాను. నేను క్షౌరవృత్తి చెయ్యలేక కృశించి నిట్టూర్పులు వదలుతూ పాలిపోయి రాజసన్నిధికి వెళ్ళినాను. నా రోగము రాజు కనిపెట్టి సాభిప్రాయముగా "ఒరే, ఇలా ఉన్నావేమిరా?" అని ప్రశ్నించగా నేను

* నాపితుడు = మంగలి.

ఆయనను అభయము వేడి "ప్రభూ! నా భార్య ఢాకిని. నేను నిద్రపోతున్నప్పుడు నా పేగులు లాగి జుర్రి తిరిగి లోపలికి తోస్తుంది. దానితో నేను చిక్కి శల్యమవుతున్నాను. శరీరపోషణకు తిన్నగా తిండీ తిప్పలూ లేవు దొరా!" అని సమాధాన మిచ్చినాను. రాజుకు సందేహము కలిగి "ఈమంగలిది ఢాకిని అన్నమాట నిజమేనా? ఆహారపుష్టీ, భోజన పరాక్రమమూ ఉన్న నాబలాన్ని కూడా అలాగే లాగేస్తుందా? ఈ సంగతి రాత్రి నేను పరీక్షిస్తాను" అని యోచించినాడు. రాజు నాకు తిండి పెట్టించినాడు. నేను యింటికిపోయి మాఆవిడ దగ్గర కళ్ళవెంట నీళ్ళు పెట్టుకొన్నాను. ఎందుకు ఏడుస్తారని అది అడుగగా నేను "ప్రేయసీ! ఎవరితో చెప్పకు. మనరాజు ఆసనములో వజ్రాలకొనలవంటి దంతాలు మొలిచినవి. నేను క్షౌరముచేస్తున్నప్పుడు నాకత్తి మంచిదైనా విరిగి ముక్కలైంది. రోజూ నాకత్తి విరిగి ముక్కలవుతూ ఉంటే నేనెలా కొత్తకత్తి సంపాయించను? నా కులవృత్తి పడిపోయింది. నానోట మన్ను!" అన్నాడు. అది విని నాభార్య రాత్రివేళ రాజు తనపక్కలో పరుండగా అతని వజ్రదంతములు చూడవలె నని నిశ్చయించుకొన్నది. మాఆవిడ తెలివి తక్కువది కావడంచేత గ్రహించలేక పోయింది. రాత్రి రాజు వచ్చి దాన్ని అనుభవించి నామాట జ్ఞాపక ముంచుకొని దొంగనిద్ర పోతున్నాడు. ఆయన నిద్రపోతున్నా డని మంగలిది నిశ్చయించుకొని దంతాలను పరీక్షించవలెనని మెల్లగా చెయ్యి చాచి తడివింది. రాజు హడిలిపోయి "బాబో ఢాకిని! ఢాకిని!" అని బొబ్బపెట్టి వెనక్కు చూడకుండా పారిపోయి అది మొదలు నాకొంపలో అడుగుపెట్టలేదు. అప్పటినుంచీ నాభార్య పతివ్రతగానే ఉంటున్నది. ఇలా నా ధీశక్తివల్ల రాజుతగులాటమునుంచి మాఆవిడను విడిపించుకొన్నాను.

తాపసీ! నీవు కోరిన పనిని ప్రజ్ఞవల్లనే సాధించవలె. ఈప్రయోగమును విను. అంతఃపురములో వృద్ధుణ్ణి వశము చేసుకోవలె. అతడు రహస్య

ముగా మహారాజుతో నీభార్య కదళీగర్భ ఢాకిని సుమా అని చెప్పవలె. కదళీగర్భ వనకన్య కావడంవల్ల ఆమెతో వచ్చిన పరిచారికాజనము ఎవ్వరూ లేరు. అంతఃపురదాసీజనము ఆమెకు అన్యులే. వాళ్ళందరూ భేదోపాయానికి వశ్యులవుతారు. దానోపాయానికి లొంగిపోతారు. రాజు అనుమానపడి ఉండగా ఎవరయినా రాత్రివేళ కాలు చెయ్యి మొదలయిన అవయవాలు కదళీగర్భ మందిరములో వేయవలెను. తెల్లవారగానే మనుష్యావయవాలను రాజు చూచి మునలివాడు చెప్పింది నిజమే అని తలచి భీతిల్లి కదళీగర్భను వదలివేస్తాడు. ఈప్రకారం సవతి తొలగిపోగా పట్టపురాణి సుఖపడుతుంది ; పట్టపుదేవి నిన్ను గౌరవిస్తుంది ; మాకూ కాస్తో కూస్తో లాభము కలుగుతుంది.”

మంగలి ఇలా చెప్పగా పరివ్రాజిక పట్టపురాణివద్దకు పోయి ఆయుక్తి చెప్పింది. దేవేరి దాన్ని ప్రయోగించింది. రాజు ప్రత్యక్షముగా చూచి కదళీగర్భను ఢాకిని అని భ్రమపడి త్యజించినాడు. పట్టపురాణి పరమానందము పొంది పరివ్రాజికకూ మంగలివానికీ పారితోషికములు ఇవ్వగా వాళ్ళు తృప్తిపడ్డారు. దృఢవర్మ మహారాజు కదళీగర్భను త్యజించినతరువాత ఆమె శోకాకులచిత్తయై తాను మొదట ఏమార్గాన రాజధానీనగరానికి వచ్చిందో ఆమార్గాన ఆవాలమొక్కల ఆనవాలువల్ల గుర్తించి జనకుని ఆశ్రమవాటికను చేరింది. తండ్రి యోగదృష్టివల్ల కుమారీవృత్తాంతము సమగ్రంగా ఎరిగి ఆమెను ఓదార్చినాడు. దృఢవర్మవద్దనుంచి వచ్చి వినీతుడైనవానితో మంకణముని సవతికుట్రవల్ల తనకుమారి కష్టాలపాలయినట్లు చెప్పినాడు. ఆ సమయమున మంగలి రాజుదగ్గిరికి వచ్చి జరిగింది జరిగినట్లు చెప్పి “దేవా, కదళీగర్భాదేవికి పట్టపుదేవిచేసిన అభిచారప్రయోగమునుంచి ఈప్రకారముగా నేను యుక్తితో రక్షించాను” అని పలికినాడు. రాజు ఆమాట ఆకర్ణించి మునివాక్కు నిశ్చయమని విశ్వసించి కదళీగర్భను తిరిగి

స్వీకరించి, మునిచంద్రుని సాగనంపి, ముంగలివానికి తన మీద భక్తి విశ్వాసము లున్న వని ఎరిగి ధన మిచ్చినాడు. ఇలాగే మహారాజుల సంపదను ధూర్తులు అనుభవిస్తారు. దృఢవర్మ అది మొదలు పట్టపు దేవిని త్యజించి కదలీగర్భతో కాపురము చేస్తున్నాడు.

కళింగసేనా! ఇలాగా సవతులు లేనిపోని దోషాలను సవతులమీద మోపి కష్టపెడతారు. నీవా కన్యవు. లగ్నము ఇప్పట్లో లేదు. దేవతలుకూడా నీమీద మోజుతో ఉన్నారు. అందువల్ల వత్సరాజ ప్రియురాల వైన నీవు జాగ్రతగా సంచరించాలి. నీకు నీఅందమే పరమ శత్రువు. సఖీ! పతియింట్లోఉన్న నీవద్దకు నేను రాను. దూరాలోచనతో చెపుతున్నాను. ఓసుగాత్రీ, నాభర్తకూడా నన్ను వారించినాడు. ఆయనమాట తోసి రాజని రావడము అధర్మము. ఇప్పుడు మాత్రము ఆయనసెలవు పొంది వచ్చాను. నేను నీకు చేయవలసింది ఏమీ లేదు. సెలవు. మావారు నాకు అనుమతిఇస్తే, వచ్చి నిన్ను చూస్తాను. ఇలా సోమప్రభ కన్నీళ్ళుకారుస్తూ కళింగసేనతో చెప్పి గగనమార్గాన నిజ నివాసానికి వెళ్ళింది. కళింగసేన కన్నీరు మున్నీరుగా ఏడ్చింది.

## తరంగము : 33

కళింగసేన స్వదేశానికి దూరమై సోమప్రభను స్మరిస్తూ వత్సరాజు ప్రాణిగ్రహణోత్సవము ఆలస్యము కాగా, కౌశాంబిలో అడవినుంచి తప్పినఆడులేడివలె ఉన్నది. జ్యోతిష్కులు ముహూర్తము త్వరలో పెట్టనందున వత్సరాజు వారిమీద అన్యాయాపరుడై మనోల్లాసమునకు వాసవదత్తామందిరానికి ఆనాడు వెళ్ళినాడు. మంత్రి యౌగంధ రాయణుడు చెప్పినప్రకారముగా వాసవదత్త కళింగసేనా వివాహమును స్మరించి ఈర్ష్యపడక, వికారరహితురాలై వత్సరాజుకు సముస్తోప చారములూ చేసింది. రాజు జిజ్ఞాసతో "కళింగసేనా వివాహవిషయము

తెలిసికూడా వాసవదత్త ఈర్ష్యారహితురాలై ఉన్నదే! అనుకొని ఆమెతో "దేవీ, కళింగసేన నన్ను వరించడము ఎరగవా? నీ అనురాగములో మార్పు ఏమీ గోచరించదే!" అని పలికినాడు. అప్పుడు వాసవదత్త "ఎరుగుదును స్వామీ! నాకు అమితానందము కలిగింది. ఆమె సాక్షాత్తు లక్ష్మీదేవి. ఆమె మనమందిరంలో అడుగు పెట్టడంచేత ఆమె తండ్రి కళింగదత్తుడు మనకు వశ్యుడు. రాజ్యమంతా మీదే! మీకు ఐశ్వర్యము కలిగితే నాకు సుఖము కాదా!" అన్నది. వత్సరాజు సంతోషించి ఆమెతోకూడా గోష్ఠీపానము చేసి నిద్రించి మధ్యలో మేల్కొని "ఎంతమహానుభావ వాసవదత్త! పాపము ఈకళింగసేనా వివాహాన్ని ఎలా సహించగలుగుతుంది? పద్మావతీ పరిణయ సందర్భములో వాసవదత్త ప్రాణత్యాగము చేయక నిలిచింది. ఇటువంటి సందర్భములో కళింగసేనను నేను ఎలా పెళ్ళాడను?". అనుకొన్నాడు.

తెల్లవారిన తరువాత వత్సేశుడు వెళ్ళి అపరాహ్ణవేళ పద్మావతీ దేవినగరికి పోయినాడు. పద్మావతి మంత్రి చెప్పినరీతిగా ఈర్ష్యావేశము చెందక భర్తను సేవించింది. వాసవదత్త చెప్పినట్లే పద్మావతి సమాధానము చెప్పింది. "దేవేరులమనస్సు ఒకేరకముగా ఉన్నది" అని వత్సరాజు మంత్రితో చెప్పినాడు. మహారాజు విచారములో ఉన్నందుకు యౌగంధరాయణుడు సంతోషించి "నాకు తెలుసును. దేవేరులు ప్రాణత్యాగనిశ్చయము చేసికొని అలా పలికినారు. పతి అన్యాసక్తుడయినా, మృతుడైనా ప్రాణత్యాగానికి సిద్ధమైన పతివ్రతలు నిస్పృహలై దైన్యము వదలి గంభీరముగా ఉంటారు. పతివ్రతలు అనురాగభంగము సహించరు. అందుకు నిదర్శనము వినండి:

### శ్రుతసేనుని కథ

దక్షిణదేశములో గోకర్ణపురమున శ్రుతసేనుడు అనేమహారాజు రాజకులాలంకారముగా మహావిద్వాంసుడై ఉన్నాడు. ఆయనకు అను

కాలమైన ప్రియురాలు లేకపోవడమువల్ల విచారిస్తూ ఉండగా [illegible] అనే బ్రాహ్మణుడు "రాజన్! నేను నా [illegible] వర్ణిస్తాను. తీర్థయాత్రాభిలాషినై పంచతీర్థానికి వెళ్ళగా అక్కడ అయిదుగురు అప్సరోంగనలు ఋషిశాపమువల్ల [illegible] వల్ల కడ తేరినారు. ఆతీర్థములో స్నానమాడి [illegible] ప్రవ-సించినవాళ్ళు ఇక్కట్లు అవుతారు. నేను అక్కడ [illegible] క్షేత్రాన్ని దున్నుతూ గీతము పాడుతున్నాడు. [illegible] సన్యాసి తోవ అడిగినాడు. గానమాధుర్యములో [illegible] సన్యాసి పిలుపు వినలేదు. అందుచేత సన్యాసి వాణ్ణి తిట్టినాడు. [illegible] మాని "ఆహా, నీవు సన్యాసివైనా ధర్మసూక్ష్మ [illegible] లేక పోయినావు. నేను మూర్ఖుణ్ణి అయినా ధర్మ [illegible] అన్నాడు. సన్యాసి "నీకు ధర్మలేశము ఏమి [illegible] అడి-నాడు. ఆకర్షకుడు ఇలా చెప్పుతున్నాడు: "తల్లిదండ్రులు [illegible] సోమదత్త విష్ణుదత్తు లనేఅన్నదమ్ముల్లో పెద్దవా [illegible] భార్య-లున్నారు. కడసారివాడికి పెళ్లి కాలేదు. ఆఖరువాడు అన్నలఆజ్ఞలు శిరసా వహించి అణకువతో కోపము ఎరగక ప్రవర్తిస్తున్నాడు. నేను వారి పాలేరును. అన్న లిద్దరూ తమ్ముణ్ణి [illegible] సన్యాసినీ, నిష్కపటి, సహిష్ణు వనీ గ్రహించినారు. ఒకసారి వదినెలు అతన్ని మోహించి ఏకాంతంలో ప్రార్థించినారు. వదినలను తల్లులవలె అతను చూస్తున్నాడు. వాళ్ళిద్దరూ ఈర్ష్యతో 'మీతమ్ముడు మమ్మల్ని కామించాడు' అని లేనిపోని అబద్ధాలు ఆడినారు. భార్యలమాటలు, నమ్మి అన్నలు తమ్మునిమీద ద్వేషముతో ఉన్నారు. వాళ్ళు తమ్ముని పొలములో నడిమిపుట్టను బాగుచేయమని ఆజ్ఞాపించినారు. తమ్ముడు పుట్ట తవ్వుతూ ఉండగా తవ్వ వద్దనీ అందులో తాచుపాము ఉన్నదనీ నేను వారించినాను. అతడు నామాట త్రోసి రాజని పుట్ట తవ్వేసరికి

బంగారునాణెములతో నిండినబిందె దొరికింది. లోచుపాము అందులో లేనే లేదు. సజ్జనులను ధర్మము కాపాడుతూ ఉంటుంది. నేను వద్దని మొత్తుకున్నా ఆయన వినక ఆ మొహిరీలబిందెను అన్నగార్లకు అప్ప గించినాడు. అన్నలు ఆధనమంతా హరించ దలచి తలవరులకు కొంత సొమ్మిచ్చి తమ్ముని కాళ్ళూ చేతులూ నరికించినారు. అప్పటికీ ఆతమ్ముడు కిక్కురు మనకుండా ఉన్నాడు. అన్నలమీద అతనికి కోపమే కలగ లేదు. ఆశ్చర్యము! అతనికి మళ్ళీ కాళ్ళూ చేతులూ వచ్చినవి. ఆవింత చూచి నేను కోపం విడిచినాను.

నీవు సన్యాసివై కోపగించడము మానలేదు. కోపము లేనినాకు స్వర్గము లభించింది. అంటూ ఆకర్షకుడు దేహాన్ని వదిలి స్వర్గలోకానికి వెళ్ళినాడు. ఇదో ఆశ్చర్యము! రెండో ఆశ్చర్యము చెపుతాను:

అక్కడనుంచి తీర్థయాత్రాభిలాషినై సముద్రతీరాన ఉన్న వసంత సేనుని రాజ్యానికి వెళ్ళినాను. రాజుగారి సత్రానికి భోజనార్థము నేను వెళ్ళుతుండగా బ్రాహ్మణులు నాతో "విప్రుడా! అక్కడికి వెళ్ళకు. అక్కడ విద్యుద్ద్యోత అనేరాకుమారి ఉన్నది. ఆకన్యను చూచినవాడు కామోద్రేకములో చనిపోతాడు" అని చెప్పినారు. నేను "నాకీ విషయము కొత్తగా లేదు. అపరకాము డైన శ్రుతసేనమహారాజును ఎప్పుడూ చూస్తూనే ఉన్నాను. ఆయన యాత్రలకు బయలుదేరితే కులాంగనలు భయపడి ఆయనకంట పడరు." అని సమాధానము చెప్పాను. అక్కడ పురోహితులు నన్ను పట్టి రాజసన్నిధికి తీసుకొని వెళ్ళారు. నేను జగన్మోహిని అయిన విద్యుద్ద్యోతను వీక్షించినాను. నామనసు ఆలోకనమాత్రాన వికలముకాగా తెప్పరిల్లి "ఈమె మా ఏలికకు భార్య అయితే ఆయన రాజ్యాన్ని తప్పక మరిచిపోతాడు. అయినా ఈవిషయము మా రాజుకు నివేదిస్తాను. చెప్పవలసింది చెప్పక పోతే ఉన్మాదినీ దేవసేనులవలె పరిణమిస్తుం దేమో?" అన్నాను.

ఉన్మాదినీ దేవసేనుల కథ

పూర్వము దేవసేనమహీపతి రాష్ట్రములో ఉన్మాదిని అని లోకోన్మాదకారిణి అయిన సుందరి ఉండేది. మహారాజుకు ఆకన్యపైన మనసు పోయింది. రాజహితము కోరిన బ్రాహ్మణులు "రాజన్! కన్య దుర్లక్షణలక్షిత. తమరు స్వీకరించవద్దు." అని మహారాజుగారి ఉత్సాహముమీద నీళ్ళు చల్లినారు. మంత్రి ఉన్మాదినిని వివాహ మాడినతరువాత ఉన్మాదిని ప్రాసాదోపరిభాగమున వచారు చేస్తూ మహారాజుపైన కన్ను వేసింది. ఆ వనితాభుజంగిని చూచిన మోహావేశ దృష్టివల్ల మహారాజు మూర్ఛిల్లి ఆహారముమాని కృశించినాడు. మంత్రి తనభార్యను స్వీకరించి అనుభవించ మని ప్రార్థించినా రాజు ధర్మబుద్ధి కలవాడు కనుక అంగీకరించ లేదు. విరహమువల్ల క్రమేణా కృశించి అతడు చనిపోయినాడు. అందువల్ల ఇలాంటిప్రమాదము జరిగేపక్షంలో నేను రాజద్రోహము చేసినవాణ్ణి అవుతాను — ఇలా ఆలోచించి ఈ అద్భుతాన్ని నీకు చెప్పినాను.

బ్రాహ్మణునివల్ల విద్యుద్ద్యోత అందచందాలు విని శ్రుతసేనుడు వెంటనే ఆకన్యను తెప్పించి పెళ్ళాడినాడు. రాజదంపతులు ఏకశరీరులై ఉంటున్నారు. అనంతరము మాతృదత్త అనేకన్య స్వయముగా వచ్చి మహారాజును వరించింది. ఆమెనుకూడా అతడు స్వీకరించినాడు. అది విని విద్యుద్ద్యోత గుండె పగిలి చనిపోయింది. రాజు శవాన్ని ఒడిలో పెట్టుకొని వడ్చి వడ్చి మృతి చెందినాడు. వైశ్యకన్య అయిన మాతృదత్త మరుక్షణములో అగ్నిప్రవేశము చేసింది. ఇలాగా రాష్ట్రము రాజుతో సర్వనాశన మైనది.

అందుచేత ప్రేమకు అంతరాయము వస్తే మనస్విని అయిన వాసవదత్తాదేవి భరించలేదు. మీరు కళింగసేనను వివాహ మాడితే వాసవదత్త ప్రాణాలు నిలువవు. రాజా! పద్మావతీదేవికూడా జీవించలేదు.

ఆ సవతుల ప్రాణాలు ఒక్కటే కదా! వాసవదత్త చనిపోతే నరవాహనదత్తుడు ఏమవుతాడు? ఇలా యౌగంధరాయణుడు వత్సరాజుకు చెప్పినాడు.

మంత్రిమాటలు వత్సరాజుకు నచ్చినవి. ఆయనకు వివేకము కలిగి "నిజముగా సర్వనాశనము! కళింగసేనా వివాహమువల్ల వాసవదత్తా పద్మావతులు, నరవాహనుడూ నష్టమవుతారు. కళింగసేన నాకెందుకు? తనంతట తానుగా వచ్చిన కళింగసేనను త్యజిస్తే వచ్చే అధర్మము ఏమున్నది! అస్తమయకూడా దూరములో ఉన్నదని గణకులు చెప్పుతున్నారు." అని పలికినాడు. తన నీతివల్లరి ఉపాయజలసేచన వల్ల పుష్పించినందుకు మహామంత్రి పరమానందము పొందినాడు. రాజుకు నమస్కరించి యౌగంధరాయణుడు తృప్తుడై గృహోన్ముఖుడైనాడు. వత్సరాజు వాసవదత్తవద్దకు వెళ్ళగా ఆమె భర్తృసేవ యథా ప్రకారముగా చేసింది. ఆమె ముఖరాగములో మార్పేమీ కలగనేలేదు!

వత్సరాజు "నేను చెప్పేదేముంది? నీకు తెలియనే తెలుసును. కమలానికి సిరి ఎలా అవసరమో నాకు నీ అనురాగమే గదా ప్రాణము! అన్యకాంత పేరయినా ఉచ్చరించలేను. కళింగసేన స్వయముగా మన మందిరానికి వచ్చింది. అర్జునుడు తపస్సు చేస్తున్నప్పుడు రంభను నిరాకరించినాడు. అందువల్ల అప్సరస అతన్ని నపుంసకుడవు కమ్మని శపిస్తే అతడు స్త్రీ వేషధారియై సంవత్సరకాలము విరాటనగరములో విరటుని వద్ద కొలువులో ఉండడం ప్రసిద్ధమే కదా? కళింగసేనను నేను ఆకారణం వల్ల నిషేధించలేదు. నీ ఇష్టము లేక నేను ఏ కార్యమూ చేయను." అని పలుకగా వాసవదత్తాదేవి రాగవంతమయిన నిజముఖాసవము తనహృదయమువలె అర్పించింది. దానివల్ల వాసవదత్త అభిప్రాయము నిజముగా క్రూరముగా ఉన్నదని వత్సరాజు గ్రహించి మంత్రివర్యుని ధీప్రభావానికి సంతోషించి ఆమెతో ఆ రాత్రి గడిపినాడు.

ఈలోగా కళింగసేనావృత్తాంతాన్ని అహోరాత్రాలు తెలిసికొమ్మని బ్రహ్మరాక్షసుని మంత్రి నియమించగా వాడు ఆరాత్రి స్వయముగా వచ్చి చెప్పాడు. నేను కళింగసేనా మందిరములో బాహ్యాభ్యంతరాలలో ఉంటున్నాను. అక్కడికి దేవమానవులు ఎవ్వరూ రాలేదు. ఈ సంజవేళ అక్కడ మేడమీద నేను ఉండగా హఠాత్తుగా అశరీరవాణి వినబడింది. దానికారణాన్ని తెలుసుకోదలచి నావిద్యను ప్రయోగించినాను. దానికి గ్రహించే శక్తి చాలలేదు. అప్పుడు నేను "ఇది కళింగసేన అందచందాలను వలచి వచ్చిన దేవపురుషుని కంఠస్వరము కావడంవల్లనే నాశక్తి పనికిరాకుండా పోయింది. జాగరూకులై ఉన్నవాళ్ళు పరులదోషాలు కనిపెట్టగలరు. ఈకార్యము మంత్రివర్యునికి ఇష్టముకదా. ఇలా కళింగసేన సఖి సోమప్రభ కూడా చెపుతూ ఉండగా విన్నాను. ఇదంతా నీతో చెప్పడానికి వచ్చాను. ఈసంగతి నాకు చెప్పు. 'తిర్యగ్జంతువులు కూడా తమ్ముతాము కాపాడుకొంటవి' అని రాజుతో చెప్పినావే, దాన్ని నేను యోగమువల్ల అదృశ్యరూపముతో ఉండి తెలుసుకొన్నాను. దీనికి తార్కాణము ఉంటే చెప్పు" అన్న రాక్షసుని మాటలు విని మంత్రి యౌగంధరాయణుడు చెపుతున్నాడు:

## నకులోలూక మార్జార మూషక కథ

పూర్వము విదిశానగరోపకంఠాన పెద్దమర్రిచెట్టులో, నకులోలూక మార్జార మూషకములు నివసిస్తున్నవి. ముంగిస మూషికము వేర్వేరు కలుగుల్లో ఉంటున్నవి. పిల్లి చెట్టుమధ్య పెద్దతొర్రలో, గుడ్లగూబ చెట్టుచివర ఎవరికీ చొరరాని తీగెగూటిలో ఉన్నవి. ఈమూటికి ఎలుక ఆహారము. పిల్లి మిగతా మూడింటినీ చంపుతుంది. ముంగిసా, ఎలుకా, గుడ్లగూబా పిల్లిభయమువల్ల స్వభావముచేత రాత్రివేళ మేతకు వెళ్ళుతున్నవి. పిల్లి అహోరాత్రాలు నిర్భయముగా సమీపంలో ఉన్న

యవక్షేత్రములో ఎలుకను పట్టడానికి తిరుగుతూ ఉన్నది. తక్కినవి కూడా తమకు అనుకూలసమయాలలో ఆహారార్థం వస్తూ ఉంటున్నవి. ఒకనాడు మాలవేటకాడు అక్కడికివచ్చి ఆపొలానికి పోతున్న పిల్లిజాడను చూచి దాన్ని చంపడానికి పొలముచుట్టూ వలలువన్ని పోయినాడు. రాత్రి పిల్లి ఎలుకను చంపేటందుకు వచ్చి, పొలంచేరి వలలో చిక్కుకొన్నది. ఆహారార్థము అక్కడికి చాటుగా మూషికము వచ్చి అలా కట్టుబడి ఉన్న పిల్లిని చూచి సంతోషముతో గంతులు వేస్తూ దూరాన క్షేత్రములో ప్రవేశిస్తున్నది. ఆసమయంలో గుడ్లగూబ ముంగిసా వచ్చి పిల్లి బంధనంలో ఉండటముచూచి ఎలుకను పట్ట దలచినవి. ఎలుక గ్రహించి ఇలాతలపోసింది: "నకులోలూకములకు భయంకర మయిన యీపిల్లిని ఆశ్రయిస్తే ఇది బంధనములో ఉన్నప్పటికీ దెబ్బ తీసి నన్ను చంపివేస్తుంది. మార్జాలానికి దూర మయితినా నన్ను ఉలూకనకులములు చంపివేస్తవి. శత్రుమధ్యములో ఉన్న నేను ఎలా తప్పించుకోను? కనుక మార్జాలాన్ని ఆశ్రయిస్తాను. ఇది ఇప్పుడు కష్టములలో ఉన్నది కదా? అందువల్ల ఆత్మసంరక్షణార్థము నన్ను రక్షిస్తుంది. నేను దీని తాళ్ళు తెంపివేస్తాను." ఆలోచన అయిన తరువాత ఎలుక పిల్లతో "నీవు కట్టుబడడంవల్ల నా కెంతో కష్టంగా ఉంది. నేను నీ తాళ్ళు కొరికివేస్తాను. అయినా నీ మనస్సు ఎరుగక ప్రవర్తించడానికి భయం వేస్తున్నది." అన్నది. పిల్లి "నా మీద విశ్వాసముంచి నన్ను రక్షించు. నాస్నేహితుడివి నువ్వు. నాప్రాణదాతవు." అన్నది. వెంటనే ఎలుక పిల్లిఒడిలో చేరింది.

దాన్ని చూచి నకులోలూకములు నిరాశతో వెళ్ళిపోయినవి. అప్పుడు పిల్లి బంధనంలో బాధపడుతూ "మిత్రమా, తెల్లవార వచ్చింది. నా పాశాలను తెంపవా?" అని జాలిగా వేడుకొన్నది. ఎలుక వేటవాడి రాకకోసము ఎదురు చూస్తూ మెల్ల మెల్లగా కొరుకుతూ ఊరికే వళ్ళు

వటపట లాడిస్తూ, తెల్లవారగానే వాడు రావడము చూచి వెంటనే పాశాలను తెగకొరికింది. తాళ్ళు తెగగానే పిల్లి వేటకాడికి వెరచి పారి పోగా, ఎలుక చావుతప్పించుకొని పారిపోయి కలుగులో దూరింది. పిల్లి మళ్ళీపిలవగా ఎలుక నమ్మక బైటికి రాక "పిల్లీ, విధివశాన శత్రువు మిత్ర మవుతాడు, ఎప్పుడూ కాదు" అన్నది. ఇలా ఎలుక తిర్యగ్జంతు వైనా తన్ను తాను కాపాడు కొన్నది. సర్వే సర్వత్రా బుద్ధిసూక్ష్మత కావాలి, పౌరుషము కాదు. అందుకు ఆఖ్యానము విను:

## బుద్ధిబలమే బలము

శ్రావస్తి నగరములో పూర్వము ప్రసేనజిత్తు అనే రాజు ఉండేవాడు. అక్కడికి క్రొత్తగా శూద్రాన్నభోజి యైనబ్రాహ్మణుడు వచ్చాడు. ఒక వైశ్యుడు అతన్ని గుణవంతు డని తలచి బ్రాహ్మణుపెంటిలో ఉంచి పోషిస్తున్నాడు. ఆ వైశ్యుడూ ఇతరవైశ్యులూ కలిసి అతనికి ఆహారమూ దక్షిణలూ ఇస్తూ గౌరవిస్తున్నారు. ఆబ్రాహ్మణలోభి వారూ వారూ ఇచ్చినదక్షిణలూ సంభావనలూ కూడబెట్టి వేయిబంగారు దీనారముల కింద మార్చి నిలవ చేశాడు. దగ్గిర ఉంటే ఖర్చయి పోతుం దనీ ఎవ రయినా అప్పు అడుగుతా రనీ భయపడి ఆలుబ్ధుడు దీనారములను చెట్టుకింద గోయి తీసి పాతిపెట్టినాడు. ప్రతిరోజూ అతడు ఏకాకిగా వెళ్ళి ధనసంచయాన్ని చూచి వస్తూ ఉండేవాడు. ఒకనాడు అతడు గోతి దగ్గిరికి వెళ్ళేసరికి గొయ్యే కాని అందులో ఏమీ లేదు. ఇన్నాళ్ళూ సంపాదించినధనము పోయేసరికి అతనిగుండెలు బరువెక్కినవి. దిక్కులు శూన్యముగా తోచినవి. అతడు ఏడుస్తూ మొత్తుకొంటూ తాను కాపు రమున్న బ్రాహ్మణునిఇంటికి వచ్చి, ఆయన అడగ్గా, తనసంగతి విశ దంగా చెప్పి పుణ్యతీర్థములో ప్రాణత్యాగము చేయ సంకల్పించినాడు. గృహయజమాని "ఏ మయ్యా, వెర్రిబ్రాహ్మడా! డబ్బు పోయిం దని

చస్తా నంటా వేమిటి? ధనము అకాలమేఘము వంటిది. హఠాత్తుగా వస్తుంది, హఠాత్తుగా పోతుంది. ధనము పోయేప్పుడు చెప్పి పోతుందా?'' అంటూ ధర్మోపదేశము చేసినాడు. లోభికి ప్రాణాలమీద తీపి తక్కువ కావడంవల్ల ఏ మయినా సరే చచ్చిపోడానికి నిశ్చయించుకొన్నాడు. రాజుకు ఆసంగతి తెలిసి వచ్చి ధనము ఎక్కడ పాతిపెట్టాడో దాని ఆన వాలు బ్రాహ్మణ్ణి అడిగినాడు. ఒక మొక్కకింద ధనము పాతి పెట్టా నని విప్రుడు సమాధాన మిచ్చినాడు. రాజు "నీకు ఆధన మైనా ఇప్పి స్తాను; కాదా నాకోశములోనుంచి ధనాన్ని తెప్పించి ఇస్తాను'' అనగా, అతని ప్రాణాలు కుదుట పడినవి. రాజు శిరోవేదనవల్ల త్వరగా అంతః పురానికి వెళ్ళి తలనొప్పి మిషచేత ప్రతీహారునిచేత చాటింపు చేయించి వైద్యులందరినీ పిలిపించి ఒక్కొక్కరినీ "నీరోగులు ఎంతమంది? ఎవరికి ఏమందు ఇచ్చావు?'' అని అడిగాడు. వైద్యులు ఉన్నది ఉన్నట్టు చెప్పారు. ఒకవైద్యుడు "దేవా! నేను మాతృదత్తు డనేవైశ్యునికి అడివి బీర అనే ఓషధిని నిన్న ఇచ్చాను.'' అని చెప్పినాడు. రాజు వర్త కుణ్ణి పిలిపించి "ఎవరిద్వారా అడివి బీర తెప్పించావు?'' అని ప్రశ్నించి నాడు. సేవకునిద్వారా తెప్పించా నని సమాధానము వచ్చింది. వెంటనే రాజు సేవకుని పిలిపించి "ఏమిరా, అడివిబీరకోసము చెట్టు మొదలు తవ్వుతూ ఉంటే బ్రాహ్మణద్రవ్యము దీనారములు నీకు దొరికినవి. తెచ్చి అప్పగించరా!'' అని ఆజ్ఞ చేసినాడు. తరువాత బ్రాహ్మణునికి దీనార ములు లభించినవి. మహారాజు ధీప్రభావమువల్ల ధనము పాతిపెట్టిన చోట ఆఓషధి మొలుస్తుం దని గ్రహించి ధనాన్ని తెప్పించినాడు. పౌరుషముకన్న బుద్ధిబలము గొప్పది.

నీవు ప్రజ్ఞవల్ల కళింగసేనలో దోషముఉంటే తెలియజెయ్యి. ఈవిడ మీద సురాసురులుకూడా అనురక్తులై ఉన్నారు. దానికి తగినట్టుగా రాత్రి ఎవరో దేవపురుషునివాక్కు విన్నావు. కళింగసేనలో దోషమే కనవడితే,

ఆమెను, రాజు వివాహము చేసుకోడు. ఇలా యౌగంధరాయణుని మాటలు విని రాక్షసుడు సంతోషించి "నీతో సమానసీతిశాలి బృహస్పతి తప్ప మరెవ్వరున్నారు? రాజ్యవృక్షానికి నీమంత్రము అమృత సేచనము. నేను సదా కళింగసేన నడవడిని కనిపెడుతూనే ఉంటాను." అని మంత్రివద్ద సెలవు తీసుకొన్నాడు.

కళింగసేన ప్రాసాదోపరిభాగాన విహరిస్తూ వత్సరాజు రాజ హర్మ్యముపైన తిరుగుతూ ఉండగా చూచి తపించి, తనమనస్సు వత్స రాజమయముగా చేసింది. ఆమె విరహతాపశాంతికై తామరతూళ్ళను దాల్చింది. చల్లదనానికి శరీర మంతా చందన చర్చ చేసుకొన్నది. మదనవేగు డనేవాడు ఇంతకుమునుపు కళింగసేనను కామించి ఆర్తుడై తిరిగి తిరిగి మహేశ్వరుణ్ణి గురించి తపస్సు చేసినాడు. అతడు శివాను గ్రహము పొందినప్పటికీ కళింగసేన వత్సరాజును ప్రేమించి ఉండడము వల్ల, అన్యదేశములో వత్సేశ్వరుని అంతఃపురములో ఉండడముచేత ఆమెను పొందలేక పోయినాడు. మదనవేగుడు సమయమునకయి ఎదురు చూస్తూ కళింగసేన మేడమీద తిరిగి, ఒకరాత్రి శివాదేశాన్ని స్మరించి తనవిద్యవల్ల వత్సరాజవేషము ధరించి ఆమెమందిరములో ప్రవేశించి నాడు. ద్వారికులు మదనవేగుణ్ణి వత్సరాజని వేషమువల్ల భ్రమపడి మందిరములోకి పోనిచ్చినారు. కళింగసేన కంకణములు ఝణత్కార ములు చేయగా లేచి మదనవేగుని సత్కరించింది. అతడు ఆమెను నమ్మించి గాంధర్వవిధిగా వివాహ మాడినాడు. ఆసమయములో అదృశ్యరూపుడైన యోగీశ్వరరాక్షసుడు ప్రవేశించి వత్సరాజును చూచి నట్లు భ్రమపడి, వెంటనే యౌగంధరాయణునికి చెప్పినాడు. మంత్రి చెప్పినరీతిగా యోగీశ్వరుడు వాసవదత్తాదేవివద్ద వత్సేశ్వరుణ్ణి చూచి, కళింగసేనవద్ద నిద్రిస్తున్న ప్రచ్ఛన్నకాముకుడైన మదనవేగుని నిజరూపాన్ని నిద్రాసమయములో చూచినాడు. ఆదేవపురుషుని పాదాలకు

ధూళి లేదు. ఛత్రధ్వజముల గుర్తులు ఆ పాదాల నున్నవి. వెంటనే బ్రహ్మరాక్షసుడు సంతోషించి మంత్రివద్దకు పరుగెత్తి "మంత్రీ! మాలాంటివాళ్ళకు ఏమీ తెలియదు. నీవు సమస్తాన్ని ప్రజ్ఞాదృష్టితో చూస్తావు. అసాధ్యమయిన ప్రభుకార్యము నీతంత్రమువల్ల సిద్ధించింది. మంత్రిలేని రాజ్యము సూర్యుడు లేని ఆకాశమువంటిది" అని పలికినాడు.

యౌగంధరాయణుడు బ్రహ్మరాక్షసునివద్ద సెలవు తీసుకొని ఉదయాన్నే వత్సేశ్వరుణ్ణి చేరి సమయము కనిపెట్టి ప్రస్తావవశమున "కళింగసేన విషయము ఏమి చేశాము!" అని రాజు అడగ్గా అతడు "దేవా, కళింగసేన ప్రసేనజిత్తును కాదనేందుకు స్వేచ్ఛగా వచ్చింది. ప్రసేనుడు వృద్ధుడని ఏవగించి ఆమె రూపలోభమువల్ల నీసన్నిధికి వచ్చింది. అలాగే అన్యపురుషసంగమము కూడా చేయగలదు" అనేసరికి వత్సరాజు "ఈమె కులీన. ఇలా చేస్తుందా? నా అంతఃపురములోకి అన్యుడు ఎవడు ప్రవేశించగలడు?" అని ప్రశ్నించినాడు. యౌగంధరాయణుడు "దేవా! తమ రీరాత్రి ఆమెవద్దకు రండి. ప్రత్యక్షంగా చూస్తారు. దేవపురుషులు కామరూపులు. వారి రాక పోకలను మానవులు ఆపలేరు. నాతో కూడా వచ్చి స్వయంగా చూడండి!" అని సమాధాన మిచ్చినాడు. వత్సరాజు మంత్రితో ఆరాత్రే కళింగసేనామందిరానికి వెళ్ళ దలచుకొన్నాడు. మంత్రి వాసవదత్తాదేవిదగ్గిరికి వెళ్ళి "దేవీ! పద్మావతి తప్ప నీకు సవతి ఉండదని నేను చేసిన శపథాన్ని నెరవేర్చుకొన్నాను!" అని కళింగసేన గుట్టూమట్టూ పూసగుచ్చినట్టు చెప్పినాడు. వాసవదత్త వినయపూర్వకంగా మంత్రికి ప్రణామము చేసింది. నడిరేయి జనమంతా నిద్రపోతూ ఉండగా వత్సేశ్వరుడు యౌగంధరాయణునితో కళింగసేనా మందిరానికి వెళ్ళి, అలక్షితంగా ప్రవేశించినాడు. కళింగసేన మదనవేగుడూ ఏకశయ్యలో ఉండగా కన్నారగా చూచి, సహించలేక కత్తి దూసి అతన్ని ఖండఖండాలుగా నరకబోయినాడు. మదన

వేగుడికి చెప్పిన మెళుకువ వచ్చింది. తనవిద్యాప్రభావంచేత అతడు దివ్యని నింటి కోసి పారిపోయినాడు. వెంటనే కళింగసేనకు మెళుకువ వచ్చి పక్క చూచుకోగా ప్రియుడు లేడు. "ఏమి! వత్సరాజు ఇవాళ నిద్రిస్తున్న దాన్ని వదలి వెళ్ళిపోయినాడే!" అని పలికింది కళింగసేన.

ఆమాట విని మంత్రి రాజుతో "దేవా! నీరూపము ధరించి దేవ పురుషుడు మందిరాంతము ప్రవేశించి ఈమెను వరించినాడు! యోగ బలమువల్ల ఈ విషయమును నేను గ్రహించి మీకు చెప్పినాను. దివ్యుడు కనుక వాణ్ణి మనము సంహరించలేము" అంటూ ఇద్దరూ కళింగసేన దగ్గిరికి వెళ్ళినారు. ఆమె రాజును చూచి గౌరవించి "నిద్రిస్తున్న నన్ను వదిలి వెళ్ళి మంత్రివర్యుని తీసికొని వచ్చేరేమి ప్రభూ?" అని కుతూహలముతో అడిగింది. "కళింగసేనా, ఎవడో దుర్మార్గుడు వత్సరాజు రూపములో వచ్చి నిన్ను మోసము చేసి వెళ్ళాడినాడు." అని మంత్రి సమాధాన మిచ్చినాడు. ఆమాటలు కళింగసేనగుండెలు దూసుకు పోయినవి. శరాఘాతమయినట్టు గిలగిల తన్నుకొంటూ కన్నీరు మున్నీరుగా ఏడ్చి "దుష్యంతుడు శకుంతలను మరచినట్టు నన్ను గాంధర్వ వివాహం చేసుకొని మరిచినావు ప్రభూ!" అని దీనముగా వేడుకొన్నది. రాజు "నిన్ను యథార్థముగా వివాహ మాడలేను" అని నిశ్చయముగా పలికినాడు. మంత్రి రాజును రాజమందిరానికి తోడ్కొని వెళ్ళినాడు.

కళింగసేన మందను బాసిన లేడిమాదిరి పరదేశములో వత్సరాజ్యములో ఉన్నది. మదనవేగుని వల్ల ఆమె కన్యాత్వము కోలుపోయి కర్తవ్యము తోచక ఆకాశాన్ని తిలకించి "వత్సరాజరూపములో వివాహ మాడినవాడు నాకు ప్రత్యక్షము కాను గాక! అతడే నా కౌమారపతి!" అన్నది. మదనవేగుడు హారకేయూర విభూషితుడై ఆకాశమునుంచి అవతరించినాడు. ఆమె 'నీవు ఎవరు?' అని ప్రశ్నించింది.

నేను విద్యాధరాధిపుణ్ణి. నా పేరు మదనవేగుడు. నేను పూర్వము

నిన్ను చూచి మోహించి నీకోసము తపస్సు చేసి శివానుగ్రహము పొందినాను. నీమనను వత్సరాజమయ మైన దనీ, ఆయనను పెళ్ళి చేసుకోక పూర్వమే వత్సరాజరూపములో నేను నిన్ను వివాహ మాడవలె ననీ వరము పొంది, అలాగే వివాహ మాడినాను'' అని పలికినాడు. కళింగసేనహృదయము సెమ్మదించింది. అతడు ఆమెను రంజింపచేసి, హేమరాశిని ఇచ్చి తిరిగి వస్తా నని చెప్పి గగనమార్గాన నిజనివాసానికి వెళ్ళినాడు. మదనవేగుని మందిరమునకు ఆమె వెళ్ళలేదు. కనుక, పుట్టింటికి పోలేక అక్కడే వత్సరాజమందిరములోనే ఉంటూన్నది.

## తరంగము : ౩౮

నాటినుండి వత్సరాజు కళింగసేన లావణ్యాన్ని స్మరిస్తూ ఉన్నాడు. అతనికి ఒకరాత్రి బొత్తిగా నిద్రపట్టక విరహతాపము ఎక్కువైనది. వత్సరాజు కృపాణహస్తుడై కళింగసేనమందిరానికి వెళ్ళినాడు. ఆమె అతనికి ఆతిథ్య మిచ్చింది. వత్సేశుడు ఆమెను ప్రియురాలినిగా స్వీకరిస్తా నని పలుకగా 'నేను పరస్త్రీని' అని సమాధానము ఇచ్చింది. అతడు "నీకు ముగ్గురు ప్రియులు ఏర్పడ్డారు. అందుచేత నీవు బంధకివి. నీవు నాకు కావాలి. పరదారవు ఎలా అవుతావు? ఆదోషము ఎలా సంభవిస్తుంది!'' అన్నాడు.

కళింగసేన దృఢనిశ్చయురాలై పలికింది "ప్రభూ! మీకై మీఅంద చందాలకు మురిసి పెళ్ళాడుదా మని వస్తే మదనవేగుడు మీరూపములో వచ్చి నన్ను గాంధర్వవిధిచేత వివాహము చేసుకొన్నాడు. అతడే నాకు పతి. అదే ధర్మము. నేను బంధకిని ఎలా అవుతాను? బంధువులమాట త్రోసి రాజని స్వచ్ఛందముగా సంచరిస్తే స్త్రీలకు ఇటువంటికష్టాలు వస్తూ ఉంటవి. అందులో కన్యలగతి చెప్పాలా? నాసఖి సోమప్రభ అపశకునములో ఏకార్యమూ చేయవ ద్దన్నది. దానిమాట పెడచెవిని

పెట్టినందుకు శకునఫలాన్ని అనుభవిస్తున్నాను. నన్ను బలాత్కరిస్తే చనిపోతాను. కులాంగనను కాని కులటను కాను. కాలీశ భర్తకు ద్రోహము చేయదు. అందుకు తార్కాణము వినండి:

వణిక్సాధ్వి కథ

పూర్వము చేదిరాజు ఇంద్రదత్తుడు శరీరము క్షణిక మని నమ్మి శాశ్వత మైనకీర్తికై పాపశోధనతీర్థమందు దేవాలయము కట్టించినాడు. భక్తిపరవశుడై రాజు ప్రతిదినమూ దేవాలయానికి వెళుతూ వస్తూ ఉండేవాడు. ఇలా ఉంటూ ఉండగా వైశ్యస్త్రీ తీర్థస్నానము నిమిత్తము రాగా రాజు ఆమెచక్కదనాన్ని చూచి వ్యామోహపడినాడు. రాజు పాదచారియై అనుసరించివెళ్ళి ఆవణిక్ సాధ్విని కోరినాడు. ఆమె సాధ్వి కనుక ధైర్యంగా "పరదారాభిగమనము పాపము. నన్ను బలాత్కరిస్తే వెంటనే చనిపోతాను" అని చెప్పింది. రాజు సాధ్విని చెరుప యత్నించి నాడు. ఆమె గుండె పగిలి చనిపోయింది. ఆయన సిగ్గుతో తలఎత్తుకొని నలుగురిలో తిరగ లేక మందిరానికి వెళ్ళి పశ్చాత్తాపముతో వేగి కొద్ది రోజులకు కాలము చేసినాడు.

ఇలా కళింగసేన భయభక్తులతో వత్సేశ్వరునకు కథ చెప్పింది. "నాప్రాణాలు తీయకు ప్రభూ! మీఆశ్రితురాలను. కనుక నన్నిక్కడనే ఉండనీ. లేదా మరోచోటికి వెళ్ళమంటే వెళ్లిపోతాను" అన్నది. వత్స రాజుకు ధర్మజిజ్ఞాస కలిగింది. వచ్చినదారిపట్టి నిజమందిరానికి వెళ్లినాడు.

మర్నాడు మదనవేగుడు వచ్చి భార్యకళింగసేన పాతివ్రత్యానికి పరి తుష్టుడై ఆమెను బుజ్జగించి ఆరాత్రి ఆమెతో గడిపి వస్తూపోతూ ఉంటు న్నాడు. వత్సరాజు మంత్రిహితవాక్యములు స్మరించి కళింగసేనపైకి బుద్ధి పోనీయక వాసవదత్తనూ నరవాహనదత్తునీ చూచుకొని క్రొత్తగా వాళ్ళు లభించినట్టు తలచి ఆనందపడుతున్నాడు. వాసవదత్తాదేవి యౌగంధ రాయణుడూ నీతికల్పవల్లి ఫలించినందుకు సంతోషపరవశులైనారు.

## మదనమంచుకా జననము

కళింగసేన గర్భిణి కాగా మదనవేగుడు "కళింగసేనా! దేవతలయిన మాకు ఒకనియమము ఉన్నది. మానుషగర్భము కలుగగానే మేము కాంతలను వదలి వెళ్ళుతాము. కణ్వాశ్రమములో మేనక శకుంతలను వదల్లేదా? పూర్వము నీవు అప్సరసవై ఉండి నీదోషమువల్లనే ఇంద్రుడు శపించగా మానవత్వాన్ని పొందినావు. అందుచేతనే నీవు సాధ్వీమణివి అయినా, బంధకి అనిపించుకొన్నావు. నీకు పుట్టే శిశువును కాపాడు. నేను నానివానానికి వెళ్ళిపోతాను. నన్ను నీవు ఎప్పుడు స్మరిస్తే అప్పుడు వస్తాను." అని పలికినాడు. కళింగసేనకన్నులు అశ్రువులతో తళతళ లాడినవి. మదనవేగుడు మనసంతా ఆమెమీదనే ఉంచి రత్నరాసులు కానుక లిచ్చి, నియమానికి కట్టుబడి దివ్యలోకానికి వెళ్ళినాడు.

కళింగసేన వత్సేశునిభుజచ్ఛాయను ఆధారము చేసుకొని ప్రసవము కోసము ఎదురు చూస్తున్నది. ఈలోగా రతీదేవి శరీరముతో ఉన్న మన్మథునికై మహాదేవుణ్ణిగురించి మహాతపము చేయగా శివుడు వర మిచ్చినాడు. "నీభర్త నన్ను ఉల్లంఘించినదోషంవల్ల నాకోపాగ్నికి కాలి, వత్సరాజమందిరములో నరవాహనదత్తుడై జన్మించి ఉన్నాడు. నన్ను ఆరాధించావు, కనుక నీవు మానవలోకములో అయోనిజవై జన్మించి సశరీరు డయిననీభర్తను పొందు" అని మహేశ్వరుడు రతీ దేవికి అనుమతి ప్రసాదించి, బ్రహ్మకు కళింగసేన ప్రసవించే దివ్యుని హరించి వానికి బదులుగా ఈరతీదేవి దివ్యశరీరాన్ని ఉంచి మానవ కన్యను చేయవలె" అంటూ ఆజ్ఞచేసినాడు.

శివాజ్ఞను బ్రహ్మ శిరసావహించి వెళ్ళగానే కళింగసేనకు నొప్పులు అధిక మైనవి. ఆమెకు దివ్యుడు పుట్టగానే బ్రహ్మ నిజమాయచేత ఆశిశువును హరించి వానికి బదులు రతిని మానవకన్యగా చేసి ఉంచి నాడు. రతీశరీరకాంతివల్ల నివాసగేహము రమణీయమై వెలిగింది. ఆమె

అంగానికి రత్నదీపశిఖావళి వెలవెలపోయింది. ఆడపిల్ల పుట్టిన దనీ పురుషశిశువు కలుగలేదనీ కళింగసేన విచారించక శిశుజన్మోత్సవము చేసింది. వత్సరాజు దేవీమంత్రిసహితముగా కళింగసేన స్త్రీ శిశువును కన్నదని ఎరిగి ఈశ్వరప్రేరితుడై వాసవదత్తతో మంత్రి వింటూ ఉండగా "కళింగసేన దివ్యాంగన. ఇంద్రశాపవశాన ఈలోకములో అవతరించింది. ఆమెకు పుట్టిన కన్యకూడా దేవతయే. ఆకన్య నా కుమారునికి ఈడూ జోడూగా ఉంటుంది." అన్నాడు.

వాసవదత్త "తొందరపడుతున్నారు. బంధకి అయిన కళింగసేన కుమార్తెను మనపిల్లవాడికి ఎలా చేసుకొంటాము? మనవాడు కులీనుడు కాడా? సంబంధము ఎలాచేస్తారు!" అన్నది. రాజు "నేను ఈమాటలు స్వయంగా చెప్పడం లేదు. అంతర్వాణి ప్రేరేపణవల్ల పలుకుతున్నాను. కళింగసేనకుమార్తె నరవాహనదత్తునికోసమే సృష్టిఅయిన దని అశరీరవాణి అన్నది. కళింగసేన కులాంగన, సాధ్వీమణి. పూర్వకర్మవల్ల బంధకి అని అనిపించుకోవలసి వచ్చింది." అని పలికినాడు.

మంత్రి యౌగంధరాయణుడు 'దేవా! మన్మథుడు కాలిపోగా రతి విలపించి భర్తకై పరమశివుని ప్రార్థించింది. మహాదేవుడు కనికరించి రతిని మానవలోకములో జన్మించమని, యోనిజు డయిన వానిని మన్మథుని వివాహమాడుమని అనుగ్రహించినాడు. మంత్రసాని నాతో రహస్యముగా "నేను కళింగసేన శిశువును చూచాను. వెంటనే మరోశిశువును చూచాను. ఇదీ సంగతి" అన్నది. అందుచేత దేవతలు మాయచేత రతిని కళింగసేనా కుమారిగా చేసినారు. ఈమె మన్మథావతారుడైన మీపుత్రుని పత్ని. దీనివివరము వినండి :

కుబేరునికి విరూపాక్షుడనే ఉద్యోగి ఉన్నాడు. ఆయన లక్షనిధులకు ప్రధానకోశాధ్యక్షుడు. అతడు మథురాపురము వెలుపల ఉన్న నిధిని కనిపెట్టి చూడమని ఒకయక్షుని కావలిఉంచినాడు. ఆనగరములో

బ్రాహ్మణపాశుపతుఁ డొకడు నిధిని వెతక వచ్చినాడు. అతడు మనుష్య వసతో దీపము వెలిగించి నిధిని పరీక్షిస్తూ ఉండగా ఆదీపము నేల కూలింది. అందుచేత దీపము పడినచోట నిధినిక్షేపము ఉన్న దని ఎరిగి తనస్నేహితు లయిన ఇతర బ్రాహ్మణులను పిలిపించి నిధిని తవ్వ నారంభించినారు. ఆ యక్షుడు కోశాధ్యక్షునికి కబురు పంపినాడు. విరూపాక్షుడు గని తవ్వేవాళ్ళను చంపివేయవలసిన దని యక్షునకు ఆజ్ఞ ఇచ్చినాడు. ఆకావలివాడు నిధి తవ్వుతున్న వాళ్ళను చంపివేసినాడు. కుబేరుడు బ్రాహ్మణ హత్యా వృత్తాంతము విని మండిపడి "పాపీ! బ్రహ్మహత్య చేయించావేమి? దరిద్రులను విఘ్నాలవల్ల కష్టపెట్టవలెను. అంతేకాని వాళ్ళను చంపుతారా? ఈ పాపమువల్ల నీవు మానవుడై జన్మించు" మని విరూపాక్షుణ్ణి శపించినాడు. కుబేరశాపమువల్ల విరూపాక్షుడు అగ్రహారికుని ఇంట్లో జన్మించినాడు. అప్పుడు ఆతనిభార్య యక్షిణి కుబేరునితో "దేవా, నాభర్తను ఎక్కడ పారవేశావో నన్నూ అక్కడే పారేసి కనికరించు. అతన్ని విడిచి బతకలేను" అని మొర పెట్టుకొన్నది. "నీభర్త బ్రాహ్మణగృహములో జన్మించాడు. నీవు అతని దాసీదానిఇంట్లో అయోనిజవుగా అవతరిస్తావు. అక్కడ నీభర్తను కలుసుకొంటావు. అతడు శాపము తీరి నావద్దకు వస్తాడు" అన్నాడు కుబేరుడు. ఆయన ఆదేశానుసారము ఆపతివ్రత ఆదాసి ఇంటిముందు గుమ్మముమీద మానవకన్యయై పడ్డది. హఠాత్తుగా అవతరించిన ఆ అందాలరాశిని చూచి దాసి తన యజమానితో చెప్పింది. ఆయన "ఆకన్య దేవత, అయోనిజ, నా అంతర్వాణి చెవుతున్నది. నిస్సందేహంగా ఆ పిల్లను మనవాడికి ఇచ్చి ముడిపెట్టాలి" అని దాసీదానితో సంతోషంతో పలికినాడు. ఆకన్య క్రమేణా పెరిగి యువతి అయింది. విప్రకుమారునికీ ఆమెకూ అనురాగము అంకురించి అన్యోన్యరక్తి అధికమైంది. క్రమేణా అతడు దేహన్యాసము చేయగా ఆమెకూడా అలాగే

చేసింది. ఇద్దరిశాపమూ తీరగా దేవలోకములో యథాప్రకారముగా దంపతులై సుఖపడ్డారు.

ఈరీతిగా దివ్యులు దైవమువల్ల కారణవశమున అయోనిజులై జన్మిస్తారు. ఈమె కళింగసేనా సుతగా దైవనిర్మిత మైనది. ఈమె నీపుత్రునికి తగినది.'' ఇలా మంత్రిమాటలు విని వాసవదత్తా వత్సేశులు కళింగసేనకుమార్తెను నరవాహనునికి చేసుకోడానికి అంగీకరించినారు. మంత్రి వెళ్ళగానే వత్సరాజు స్నానపాన క్రీడాగోష్ఠులలో ఆ దినము ప్రేయసితో గడపినాడు.

కళింగసేనకుమార్తె పూర్వజన్మజ్ఞానము విస్మరించి లావణ్యసంపదతో పెరుగుతున్నది. మదనవేగునికూతురు కావడంచేత ఆ కన్యకు మదనమంచుక అని పేరు పెట్టినారు. ఆమె చక్కదనము ముందు అందరి అందాలూ తీసిపోతవి. మదనమంచుక రూపసంపదను గురించి వాసవదత్త విని కౌతుకముచేత ఆకన్యను పిలిపించింది. వత్సరాజు మదనమంచుక తారుణ్యమును చూచినాడు. వాసవదత్తాదేవి లోకలోచనోత్సవుని తనకుమారుని నరవాహనుని అక్కడకు రప్పించినాడు. నరవాహనుడు మదనమంచుకను వికసిత ముఖారవిందుడై పద్మాకరము నవ్యసూర్య తేజమువలె వీక్షించినాడు. ఆమె లోచనానందుని వికచముఖాబ్జమై చూస్తూ శీతకిరణుని చూచే చకోరిణివలె తనివి తీరలేదు. వాళ్ళ నాలుగుచూపులూ కలసిపోగా ఒకరిని వదలి ఒకరు ఉండలేకుండా ఉన్నారు. వత్సరాజు వారిసంబంధము దైవనిర్మిత మని గ్రహించి వివాహప్రయత్నము ఆరంభించినాడు. కళింగసేన ఆవిషయము తెలుసుకొని నరవాహనదత్తుని అల్లునిగా చూచి సంతోషిస్తున్నది.

## నరవాహనదత్తుడు యువరాజగుట

వత్సరాజు మంత్రులతో ఆలోచించి నరవాహనునికి తన మందిరము

వంటి సుందరమందిరము నిర్మించినారు. అనంతరము అతడు కుమారునికి యౌవరాజ్యాభిషేకము చేసినాడు. మున్ముందు పుత్త్రోదయమప్పుడైన ఆనందబాష్పములు రాలినవి. తరువాత మంత్రపూతమైన తీర్థోదకము పడ్డది. అభిషేకజలముల వల్ల అతనిముఖపద్మము స్వచ్ఛముగా దిక్కులుకూడా నిర్మలము లయినవి. తల్లులు అతని తలమీద మంగళ లాజాకుసుమములు వేసినారు. దేవతలు దివ్యకుసుమాళి అతనిమూర్ధము మీద వర్షించినారు. మంగళతూర్యారావములతో ఆకాశము ప్రతిధ్వనించింది. వత్సేశుడు యువరాజుకు మంత్రులుగా మంత్రికుమారులను నియమించినాడు. యౌగంధరాయణుని కుమారుడు మరుభూతి మంత్రి, రుమణ్వంతునిపుత్త్రుడు హరిశిఖుడు సేనాపతి, వసంతకకుమారుడు తపంతకుడు క్రీడాసఖుడు, ఇత్యకునిపుత్త్రుడు గోముఖుడు ప్రతీహారుడు, పింగళికుని సుతులు, పురోహితపుత్త్రులు, వైశ్వానర శాంతిసోములు పురోహితులుగాను నియమితులయినారు. ఈరీతిగా నరవాహనునికి మంత్రివర్గము ఏర్పడగానే ఆకాశమునుంచి కుసుమవృష్టి కురిసింది. అశరీరవాణి "ఈమంత్రులు ఇతనికి సర్వార్థసాధకులు అవుతారు. గోముఖుడు రాజుకు ఏకశరీరముగా ఉంటాడు." అన్నది. వత్సరాజు ప్రీతితో అందరినీ వస్త్రభూషాభరణాలతో సత్కరించినాడు. రాజు అనుజీవులకు అర్థము వర్షించినాడు. దరిద్రశబ్దానికి మాత్రమే అర్థసంగతి లేకపోయింది! నర్తకీగణము చారణబృందము కౌశాంబీనగరములో నిండిపోయినారు. పట్టాభిషేకమహోత్సవవేళ విద్యాధరలక్ష్మివలె ఉన్న కళింగసేన కాబోయేఅల్లుని చూడవలెనని వచ్చింది. కళింగసేన, వాసవదత్తాదేవి, పద్మావతీదేవి ముగ్గురూ శక్తిత్రయమువలె ఉండి, రసోద్రేకముల్లో నృత్యము చేసినారు. పవమానకంపిత వల్లరీసహితముగా వనవాటికాతరువులు తమకాన తన్మయమై నృత్యము చేసినవి. అభిషేకానంతరము నరవాహనదత్తుడు విజయగజము ఆరోహించి

ఊరేగి సాగినాడు. నగరనారీజనములు నీలాబ్జపద్మాంజలులవలె తమ సితాసితారుణదృక్కులను నరవాహనునిమీద కురిపించినారు. వంది మాగధులు కైవారములు చేయగా యువరాజు మందిరప్రవేశము చేసినాడు. కళింగసేన దివ్యమైన పానభోజ్యములను సిద్ధము చేసింది. అల్లునిమీద ఆదరమువల్ల ఆమె అమాత్యవర్గానికి భృత్యులకూ దివ్య వస్త్రాభరణాలు అర్పించింది. వత్సరాజాదులు పట్టాభిషేకమహోత్సవమును తిలకించి అమందానందము అనుభవించినారు.

## మదనమంచుకోద్యానము

రాత్రివేళ కళింగసేన కుమారీవివాహమును నెరవేర్చే తలంపుతో సోమప్రభను స్మరించింది. స్మరణమాత్రాన నలకూబరుడు సోమప్రభతో "ప్రేయసీ, అక్కడ నిన్ను కళింగసేన ఔత్సుక్యముతో తలచుకొంటున్నది. నీవు వెళ్ళి కళింగసేనకుమార్తెకై దివ్యోద్యానాన్ని నిర్మించు" అని పలికినాడు. భర్త అనుమతి పొంది సోమప్రభ కళింగసేన వద్దకువచ్చి స్నేహమువల్ల కంఠాలింగనము చేసి కుశలప్రశ్నలు అడిగి, అన్నది: "సఖీ! విద్యాధరుడు నిన్ను వివాహము చేసుకొన్నాడు. శివానుగ్రహమువల్ల రతీదేవి నీకడుపున పడ్డది. నీకుమార్తె నరవాహనునిభార్య. అతడు విద్యాధరచక్రవర్తియై దివ్యకల్పమువరకూ పరిపాలన చేస్తాడు. అతని అన్యభార్యలు మదనమంచుక ఆజ్ఞలను శిరసా వహిస్తారు. నీవు ఇంద్రశాపమువల్ల భూలోకంలో అవతరించిన అప్సరాంగనవు. అన్యకార్యములు చేసి శాపమోక్షము పొందుతావు. ఇదంతా మహాజ్ఞాని అయిననా భర్త చెప్పినాడు. విచారించకు. నీకు అంతా శుభమే జరుగుతుంది. నేను నీకుమార్తెకు వనవాటిని నిర్మిస్తాను. అటువంటి దివ్యోద్యానము స్వర్గమర్త్యపాతాళలోకాలలో ఎక్కడా ఉండదు." సోమప్రభ మాయాశక్తివల్ల చక్కనిఆరామసీమ సృష్టించింది

కళింగసేనవద్ద సెలవు తీసుకొని వెళ్ళిపోయింది.

తెల్లవారినతరువాత జనులు మదనమంచుకోద్యానము చూచి నందనవనము అమరావతినుంచి భూలోకములోనికి వచ్చినదా అనుకొన్నారు. ఆవిషయము కర్ణాకర్ణిగా విని వత్సరాజు భార్యాసమేతుడై నరవాహనునితో, పరివారముతో అక్కడికి వచ్చినాడు. ఆవనవాటిలో పువ్వులచెట్లనూ, మణులతో పొదిగినభూభాగము గల దిగుడుబావిని, పరిమళము కొల్లగొని వీచే మలయమారుతమునూ, చల్లనిచెట్లనీడలనూ వాళ్ళు చూచి ఆనందించినారు.

కళింగసేన వారికి ఆతిథ్యము చేయడానికి త్వరపడుతూ ఉన్నది: "రాజన్! విశ్వకర్మ అపరావతారము మయుడు అనేమహాసురుడు ధర్మరాజుకూ, ఇంద్రునికీ పట్టణాలు కట్టినాడు. అతనికి సోమప్రభ అనే కుమార్తె ఉన్నది. ఆమె నానెచ్చెలి. ఆమె రాత్రి నన్ను చూడడానికి వచ్చి ఈవనవాటిని నిర్మించి వెళ్ళిపోయింది." సోమప్రభ చెప్పిన భూతభవిష్యద్వర్తమానములను కళింగసేన వాళ్ళకు చెప్పింది. ఆదినము కళింగసేనవల్ల సత్కారము పొందుతూ వత్సరాజు భార్యాపుత్రసమేతంగా ఆవనములో కాలము గడపినాడు.

## నరవాహనదత్తునికి విద్యాప్రాప్తి

మర్నాడు రాజు దేవదర్శనార్థము దేవాలయానికి వెళ్ళి సువర్ణవస్త్రాభరణాలతో ఉన్నచాలామంది స్త్రీలను చూచి మీరు ఎవ రని అడిగినాడు. 'మేము విద్యలము, వీరు లలితకళలు. నీకుమారునిలో ప్రవేశిస్తాము' అంటూ వాళ్ళు అదృశ్యలైనారు. వత్సరాజు అది చూచి నిజనివాసానికి వెళ్ళి వాసవదత్తకూ, మంత్రికీ ఆవిషయము చెప్పినాడు. దేవతానుగ్రహము విని అంతా సంతోషించినారు. రాజాదేశమువ వాసవదత్తాదేవి వీణను గ్రహించింది. సరిగ్గా అప్పుడే నరవాహన

దత్తుడు వచ్చాడు. వానవదత్త వీణవాయిస్తూఉండగా నరవాహనుడు సవినయముగా వీణమెట్లు తిన్నగా శే వన్నాడు. రాజు అతనినే వీణ వాయించ మన్నాడు. నరవాహనుడు వీణ మీటి అందరిఆశ్చర్యాన్ని చూరగొన్నాడు. తండ్రి కుమారునికళాప్రావీణ్యాన్ని పరీక్షించినాడు.

వత్సరాజు కళింగసేనాకుమారి, మదనమంచుకకు నృత్యము నేర్పించి నాడు. ఆమెవదనబింబము పూర్ణకళతో శోభిల్లగా నరవాహనునిఅంత రంగ సముద్రము పొంగిపోవసాగింది. మదనమంచుకా నాట్యనృత్యలాస్య గతులు చూచి అతడు పరవశు డైనాడు. ఆకన్య అతన్ని చూడకపోతే ఉదయము మంచు కురిసినకుముదినివలె అశ్రుపూరితలోచనయై ఉంటుంది. ఆమెను చూడవలె నని అతడు మదనమంచుకోద్యానానికి వెళ్ళుతాడు. ఒకసారి అతడు వనవాటికి రాగా కళింగసేన ప్రీతితో కుమారిని అతని దగ్గిరికి తెచ్చి రంజింపజేసింది. గోముఖుడు తెనయువరాజయినవరవాహ నుడు మదనమంచుకవద్ద చాలాసేపు ఉండవలె నని గ్రహించి కళింగ సేనకు కథ చెప్ప నారంభించినాడు. నరవాహనుడు ఆఉద్యానములో సంగీతశాలలో మదనమంచుకకు నృత్యవిద్య నేర్పుతున్నాడు. క్రమేణ నరవాహనుని కౌమారము గడిచిపోయింది.

## కులటల నడతలు

ఒకనాడు రాజపుత్రుడు ప్రియురాలితోను, మంత్రులతోను నాగవనము అనేఉద్యానానికి వెళ్ళినాడు. అక్కడ ఒకవైశ్యభార్య గోముఖుని కామించింది. అతడు ఆమెను తిరస్కరించాడు ఆమె అతనిని చంప వలె నని విషము కలిపినపానకము తెచ్చింది. ఆసంగతి దానిచెలికత్తె కనిపెట్టి చెప్పింది. ఆపానకమును పుచ్చుకోకుండా అతడు స్త్రీలోకాన్ని తూలనాడినాడు. స్త్రీలో విషమూ అమృతమూ ఉన్నవి. ఆమెను ప్రేమిస్తే అమృతాన్ని, తిరస్కరిస్తే విషాన్ని ఇస్తుంది.

ఒకగ్రామములో శత్రుఘ్నుడు అనేవానిభార్య జారిణి. ఆ భార్య జారునితో ఉన్న సమయాన శత్రుఘ్నుడు వెళ్ళి కత్తి దూసి జారుణ్ణి నరికివేసి రాత్రివరకూ భార్యను నిర్బంధించి గుమ్మములో తిష్ట వేశాడు. అప్పుడు బసకై బాటసారి వస్తే శత్రుఘ్నుడు అతనికి చోటిచ్చి అతని సహాయముతో జారునిశవాన్ని రాత్రి అడవికి తీసుకుపోయి చీకటి నూతిలో వేయబోగా, అతని భార్య వెనకనుంచి వచ్చి అతన్ని ఆనూతి లోకే తోసింది. గోముఖుడు ఈకథచెప్పి కులటలనడతను ఖండించాడు.

నరవాహనదత్తుడు నాగవనములో నాగులను స్వయంగా పూజించి పరివారసమేతముగా నిజమందిరానికి వెళ్ళినాడు. మరునాడు అతడు రాజనీతిసారమునుగురించి గోముఖుణ్ణి ప్రశ్నించినాడు. ఒకరి కొకరు కూడబలుకుకొని నీతిశాస్త్రముచెప్ప సాగిరి.

## రాజనీతి సారము

రాజైనవాడు ఇంద్రియాశ్వములను వశము చేసుకొనవలెను. కామ క్రోధాది అరిషడ్వర్గాన్ని జయించవలె. తనను జయించలేనివాడు అన్యులను జయించలేడు. రాజు నయవిశారదు లయినమంత్రులనూ, కుశలుడయినపురోహితునీ ఏర్పాటు చేసుకోవాలి. అమాత్యులను, పరీక్షించి రాజు నిజకార్యములందు నియమించవలె. వారిసత్యవచనము ద్వేషపూరితమో, స్నేహప్రయుక్తమో వారివారి రహస్యసంభాషణలవల్ల కనుక్కోవలె. సత్యమునకుసంతుష్టి, అసత్యానికిశిక్ష అవసరము. చారులవల్ల అమాత్యులచరిత్రకనిపెట్టాలి. రాజుచారులచేత స్వయముగా కార్యాకార్యములు గ్రహించవలె ఆతడు శత్రుశేషము ఉంచక కోశదండాదులను ఆర్జించవలె. ఉత్సాహప్రభుమంత్రశక్తులుకలిగి స్వపరాంతరమును విచారించి పరరాష్ట్రాన్ని దేశాన్ని జయించవలె. ఆప్తులూ పండితులుప్రాజ్ఞులుఅయిన వారితో భవిష్యత్తునుగురించి మంత్రాలోచన చేయాలి. వారు నిశ్చ

గుంచిన దాన్ని వివేకముతో విమర్శించి పరిశోధించవలె. సామదానాది ఉపాయాలు తెలిసి యోగక్షేమాలు వహించి సంధివిగ్రహాదు లగు షాడ్గుణ్యాలు ప్రయోగించాలి.

రాజు వివేకి కాక కామలోలుడై కష్టదారిని పోతే స్వయంగా తనగొయ్యి తానే తవ్వుకొంటాడు. రాజు దండనీతి ఎరిగి సమయోచితముగా ధర్మపద్ధతిగా తప్పు చేసినవాళ్ళను దండించాలి. జితాత్ముడై పారలౌకికజ్ఞుడు కావాలి. అతడు ముఖ్యముగా ప్రజలను కంటికి రెప్పవలె కాపాడాలి.

## శూ ర సే న మ హా రా జు

పూర్వము శూరసేనమహారాజు సేవకులు చెప్పినతీరున చేసేవాడు. ఆ మంత్రులు రాజును వంచించి జీవించేవారు. సేవకులూ మంత్రులు రాజు ఇష్ట మనస్తృప్తికి స్వల్పమైనా తప్పకుండా ఉంచేవారు. మంత్రులు అయోగ్యులకు ఉద్యోగాలు ఇప్పించేవారు. రాజు యుక్తిచేత వారిని భేదించినాడు. దుష్టసేవకులు, కపటసచివులు తొలగిపోగా అతడు రాజ్యాన్ని చక్కగా పాలించాడు. అతడు విశ్వాసపాత్రులయిన విద్వాంసులను మంత్రులను చేసుకొన్నాడు. క్రమంగా ప్రజలను రంజింపచేసి దుర్గమూ అర్థమూ సంపాదించాడు. ఈరీతిగా గోముఖాది అమాత్యులు రాజనీతి సారమును నరవాహనునికి ఉపదేశించినారు. యువరాజు వారి మాటవిని పురుషప్రయత్నము చింత్యమైనా దైవము అచింత్యమని పలికినాడు.

## మా న స వే గు డు

యువరాజు అమాత్యులతో లేచి, ఆలస్యము కావడమువల్ల ప్రియురాలిని చూడవలెనని మదనమంచుకా మందిరానికి వెళ్ళినాడు. అతడు మహాస్థానమును అలంకరించగానే కళింగసేన ఆశ్చర్యంతో గోముఖు

నితో అన్నది: "నరవాహనుడు రావడము ఆలస్యమయ్యేసరికి మదనమంచుక అతన్ని చూస్తా అని మేడమీదికి వెళ్ళింది. నేనుకూడా వెళ్లాను. అప్పుడు ఆకాశమునుండి ఒకపురుషుడు అవతరించి నాతో "నేను మానసవేగుడనే విద్యాధరేశ్వరుణ్ణి. నీవు సురభిదత్త అనే అప్సరసవు. ఇంద్రశాపమువల్ల ఇహలోకము అవతరించావు. నీకుమారి దివ్యస్త్రీ. నీకుమారిని నాకియ్యి. ఈసంబంధము అనుకూలము" అన్నాడు. నేను నవ్వి "మీ కంధరికీ చక్రవర్తి కాగల నరవాహనదత్తుడు మాఅమ్మాయిని వివాహము చేసుకొంటాడు. అసలు ఈసంబంధము దేవతలు ఏర్పాటు చేశారు." అన్నాను. మానసవేగుడు మెరుపుతో మెరిసి అదృశ్యమైనాడు. కళింగసేనమాటలు విని గోముఖుడు "ఈమావలిక తమప్రభువు అవుతాడని విద్యాధరులు ఎరిగి ద్రోహము చేయనెంచినారు శివుడు ఇప్పుడే మన నరవాహనుని రక్షిస్తాడు. నారదుడుకూడా అదివరకు చెప్పాడు. విద్యాధరులు మనకు శత్రుకోటిలోవారు" అని పలికినాడు.

## వివాహయత్నము

కళింగసేన గోముఖుణ్ణి "నన్ను మదనవేగుడు వంచించినట్లు మదనమంచుకను ఏదివ్యుడైనా మోసము చేసి పెళ్లి చేసికొంటాడేమో. అందుచేత నరవాహనుడు త్వరగా మాఅమ్మాయిని వివాహమాడితే బాగుండును." అన్నది. గోముఖాదులు "నీవే వత్సరాజును తొందర పెట్టు" మన్నారు. నరవాహనుడు ఆదినమంతా మదనమంచుకను వనములో చూస్తూ విహారము చేశాడు.

మర్నాడు కళింగసేన వత్సరాజును కుమార్తె పెళ్ళికి తొందర చేసింది. రాజు ఆమెను పంపివేసి మంత్రుల్ని పిలిపించి వాసవదత్త ఎదుట ఇలా పలికినాడు: "కళింగసేనకుమార్తె పెళ్ళికి త్వరపడుతున్నది. ఉత్తమ

స్త్రీని లోకులు బంధకి అంటున్నారు. లోకధర్మాన్ని అనుసరించాలి. లోకాపవాదానికి భయపడి శ్రీరాముడు సీతాదేవిని త్యజించినాడు. భీష్ముడు అంబను గ్రహించి అంతకుమునుపు ఆమెను ఎవరో ప్రేమించారని తెలిసి త్యజించలేదా? ఈప్రకారము కళింగసేన ముందు నన్ను వరించి మదనవేగునికి భార్య అయిన దని లోకు లందరూ నిందిస్తారు. అందువల్ల నరవాహనదత్తుడే స్వయంగా మదనమంచుకను గాంధర్వ విధిగా వివాహము చేసుకొంటాడు."

యౌగంధరాయణుడు "ప్రభూ! ఈఅనౌచిత్యాన్ని కళింగసేన ఎలా సహిస్తుంది? ఆమె దేవత. ఆమెకుమారి దివ్యాంగన. ఇలా గని నామిత్రుడు బ్రహ్మరాక్షసుడు చాలాసార్లు చెప్పినాడు" అని పలికినాడు. ఆకాశమునుంచి మహేశ్వరుడు "నా లోచనాగ్నివల్ల మన్మథుడు దగ్ధుడై నరవాహనదత్తుడై జన్మించాడు. రతీదేవి నన్ను మెప్పించగా మదనమంచుకగా నేను సృష్టించాను. నరవాహనదత్తుడు దివ్యకల్పాంతము వరకు విద్యాధరచక్రవర్తిగా రాజ్యముచేస్తాడు" అని ఆనతిచ్చినాడు. వత్సరాజు పరివారసమేతముగా శివునికి సాష్టాంగ నమస్కారము చేసి కుమారునివివాహవిషయము నిర్ధారణ చేసుకొన్నాడు.

రాజు అన్నిరహస్యాలూ అదివరకే తెలిసినయౌగంధరాయణుని పిలిపించి గౌరవించి, జ్యోతిష్యులచేత వివాహలగ్నము నిర్ణయము చేయించినాడు. సిద్ధాంతులు "నీకుమారుడు కొద్దికాలముమాత్రమే భార్యావియోగాన్ని అనుభవిస్తాడు" అని చెప్పారు. వత్సరాజు నరవాహనదత్తుని వివాహానికి ఏర్పాట్లు చేయించినాడు.

## నరవాహనుని వివాహము

సోమప్రభ, కళింగసేన తండ్రి యిచ్చిన దివ్యాభరణాలతో మదనమంచుకను అలంకరించినారు. ప్రతిసరమునూ ధరించి మదనమంచుక

కార్తికపూర్ణిమవలె ప్రకాశించింది. దిక్కాంగనలు ఆకన్యలావణ్యప్రభ ముందు దిగదుడుపైనారు. చారణులు గౌరిని స్తుతించినారు.

పెళ్లికుమారుడు ఆడపెళ్లివారింటికి మంగళవాద్యములు మోగుచుండగా వెళ్ళినాడు. వధూవరులు వివాహవేదికపైన కూర్చున్నారు. సూర్యచంద్రులు ఏకకాలములో మేరుప్రదక్షిణము చేస్తున్నట్లు ఆవధూవరులు అగ్నిప్రదక్షిణము చేసినారు. దుందుభితూర్యఘోషలు మిన్నుముట్టినవి. వధూశిరము పైనఉన్న హోమలాజలను పుష్పవృష్టి ముంచివేసింది.

వివాహసమయాన కళింగసేన అర్పించిన హేమరాసులను చూచి లోకులు కుబేరుని దరిద్రునిగా తలచినారు. వివాహానంతరము వధూవరులు అభ్యంతరగృహము ప్రవేశించినారు. నరేంద్రులు చాలమంది వచ్చి ఉపాయనములు సమర్పించినారు. వత్సరాజు అనుజీవులకు బంగారము వెదజల్లినాడు. దశదిశలనుంచి చారణనర్తకీగణము వచ్చి నృత్తగీతాభినయాలు చేసినారు. ఈరీతిగా వివాహమహోత్సవము జేగీయమానంగా జరిగింది.

యువరాజైన నరవాహనదత్తుడు ప్రియురాలితో చాలకాలము ఇహలోకసుఖాలను అనుభవిస్తూ ఉన్నాడు.

మదనమంచుకా లంబకము

---

# ర త్న ప్ర భా ల ం బ క ము

## త ర ం గ ము : 37

కేలికేశ గ్రహావ్యగ్ర
గౌరీకర నఖావృతమ్
శివా యానేకచంద్రాఢ్య
మివ శార్వం శిరోఽస్తు వః!

కరం దానాంభ సార్ద్రం యః
కుంచితాగ్రం ప్రసారయన్
దద త్సిద్ధి మి వాభాతి
స పాయా ద్వో గజాననః!
కేళి కేశగ్రహవ్యగ్ర గిరితనూజ
కరనఖావృతమై మహేశ్వరశిరమ్ము
బహుళచంద్రాఢ్య మైనట్టిభంగి దోఁచి
సకలశుభములు మీకు నొసంగు గాక!
దానాంభసార్ద్రమౌ తనకరం బెపుడు
వంచి యించుక ప్రసారించుచు దయను
సిద్ధి యిచ్చెడురీతి చెలువారుచున్న
యాగజాస్యుడు మమ్ము నవచునుగాక!

ఈప్రకారముగా వత్సరాజపుత్రుడు మదనమంచుకను పెళ్ళిచేసుకొని మనోరథసిద్ధి పొంది గోముఖాదిసచివులతో కాలక్షేపము చేస్తున్నాడు. ఒకపర్యాయము సచివులతోకూడ రాజు వసంతోత్సవ సమయాన ఆరామములోకి వెళ్ళినాడు. హఠాత్తుగా తపంతకుడు అనే చెలికాడు సంతోషముతో 'యువరాజా! ఎవరో చక్కని చుక్క అశోక వృక్షముక్రింద నిలిచింది. గగనమునుంచి ఆకన్య అవతరించి, చెలికత్తెలతో నాసమీపానికి వచ్చి నిన్ను తెమ్మన్నది' అని చెప్పినాడు. నరవాహనదత్తుడు మంత్రిసమేతుడై ఆమెను చూడవలెనని అశోకవృక్షము దగ్గిరికి వెళ్ళినాడు. ఆ దివ్యకన్య వనలక్ష్మివలె ఉన్నది. అతన్ని చూచి ఆవనదేవత వందనము చేసింది. ఆమె చూపులతో నరవాహనుని రూపమును తాగింది. యువరాజు ఆమెచక్కదనము చూచి ముగ్ధుడైనాడు. అందరూ ఆసీనులు అయినారు. అమాత్యుడైన గోముఖుడు "దేవీ! ఎవరవు? ఎందుకు వచ్చావు?" అని కుతూహలముతో అడిగినాడు.

ఆదివ్యకన్య నరవాహనునిముఖపద్మమును ఎంతచూచినా తనివితీరక అతి వేల మైన అనురాగముతో ముగ్ధురాలైనది. తనవృత్తాంతమును ఆమె ఇలా చెప్పింది:

"త్రిలోకాలలో హిమవత్పర్వతము ప్రసిద్ధమై గౌరీపతి నివాసమైన కైలాసముతో అలరారుతున్నది. హిమవత్సానువులపైన సిద్ధ సాధ్య కిన్నరకింపురుషులు విహారముచేస్తూ ఉంటారు. ఆపర్వతాలలో కాంచన శృంగము అనే నగరాన్ని శివభక్తుడైన హేమప్రభు డనే విద్యాధరేశ్వరుడు పరిపాలన చేస్తున్నాడు. ఆరాజు ప్రతిరోజూ అలంకారప్రియ అనే పట్టపుదేవితో కలిసి శివపూజ చేసి, మానవలోకానికి వేంచేసి నిర్ధనులకు ధనరాసులు దానము చేస్తాడు. అతడు రాజధానికి మరలి రాజకార్యాలు చేసి మునివలె నిరాగరిష్ఠుడై భోజనాదికము ముగిస్తాడు. అతనికి కుమారుడు లేడనే చింత కలిగింది. ప్రియురాలు అతని విచార కారణము అడిగింది. రాజు ఆమెతో ప్రేయసీ, సంపద లున్నప్పటికీ సుతుడు లేడు కద! అనపత్యచింత నన్ను వేధిస్తున్నది. పూర్వము విన్న సత్త్వవంతుని కథ స్మరించేసరికి నాకు విచారము కలిగింది" అన్నాడు. పట్టపుదేవి ఆకథ చెప్పమని కోరింది. అతడు ఇలా చెప్పినాడు:

## సత్త్వవంతుని కథ

చిత్రకూటనగరములో బ్రాహ్మణభక్తి గల ప్రభువుకు సత్త్వశీలుడు అనే వీరుడు భటుడు. ఆజేత నెలకు సువర్ణశతాన్ని వేతనము పుచ్చుకొంటున్నాడు. అతడు ధన మంతా దానాదికానికి వినియోగిస్తాడు. పిల్లా మేకా లేకపోవడము వల్ల సత్త్వశీలుడు ధన మంతా ఖర్చు చేస్తున్నాడు. డబ్బు చాలకుండా ఉన్నది. ఒకసారి అతడు "బ్రహ్మ నాకు ఒక్కకుమారుణ్ణి ఇవ్వలేదు. దానవ్యసనము మాత్రము ఇచ్చినాడు. త్యాగశక్తి కలిగి దరిద్రుడై పుట్టి బతకడముకన్న ఎండుచెట్టునై

పుట్టితే బాగుండును'' అని ఆలోచించినాడు. ఒకసారి ఇలా ఆలోచిస్తూ అతడు వనములో తిరుగుతూ ఉండగా రత్నాలతో వెలుగుతున్న నిధి దొరికింది. వచ్చేప్పుడు సిరి చెప్పిరాదు. నిధిలాభమువల్ల ఆబ్రాహ్మణుడు అనేకభోగాలు అనుభవిస్తూ అందరికీ సువర్ణదానము చేస్తున్నాడు. రాజభృత్యులు వెళ్ళి రాజుతో బ్రాహ్మణునికి నిధి దొరికిందని చెప్పినారు. మహారాజు ప్రతీహారునిద్వారా బ్రాహ్మణుడికి కబురు చేశాడు. సత్త్వశీలుడు రాజగృహాంగణములో ఒకచోట నిలిచి చేతిలో ఉన్న లీలావజ్రముతో నేలను గీరుతున్నాడు. అక్కడ అతనికి రాగిబిందెలో నిక్షేపము దొరికింది. అతడు వెంటనే ఆనిధిని మట్టితో కప్పి, ప్రతీహారుని పిలుపు విని రాజసన్నిధికి వెళ్లినాడు. మహారాజు నిధిని తనకు అర్పించమని ఆజ్ఞ చేసినాడు. సత్త్వశీలుడు "దేవా! మునుపటి నిధినా, ఇప్పటి నిధిని ఇమ్మన్నారా?'' అని అడిగినాడు. కొత్తగా దొరికిన నిక్షేపము రాజు కావా లని అన్నాడు. బ్రాహ్మణుడు ప్రాంగణములో ఉన్న నిధిని రాజుకు అర్పించినాడు. అదివరకు దొరికిన నిధిని హాయిగా అనుభవించ మని మహారాజు అనుమతి ఇవ్వగా బ్రాహ్మణుడు అలాగే భోగాలుఅనుభవిస్తూ దానశీలుడుఅని పేరు తెచ్చుకొని అనపత్యదుఃఖాన్ని విస్మరించినాడు. ఈసత్త్వశీలుని కథ జ్ఞప్తికి రాగా విచారము కలిగింది.

## వి క్ర మ తుం గు ని క థ

అప్పుడు దేవి అన్నది. "సత్త్వశీలు రైనవాళ్ళకు విధి అనుకూలము. సత్త్వశీలునికి రెండోనిధి దొరక లేదా? మీసత్త్వప్రభావమువల్ల అభీష్టము ఈడేరుతుంది. అందుకు తార్కాణము వినండి:

"పూర్వము పాటలీపుత్రనగరములోవిక్రమతుంగుడు అనే సత్త్వవంతుడయిన మహారాజు మహాత్యాగి, మహావీరుడు ఉండేవాడు. ఒకసారి ఆయన అరణ్యములో వేటాడి బిల్వహోమము బ్రాహ్మణుడు చేస్తూ

ఉంటే చూచి బిల్వము అడుగుదామని అనుకొని, వేటతమకాన దూరముగా వెళ్ళినాడు. రాజు బాణాలు వేయగా దెబ్బతిన్న సింహాలు ఎగిరెగిరి పడుతూ ఉండగా చూచి క్రీడించి తిరిగి యజ్ఞముదగ్గిరికి వచ్చినాడు. అతడు బ్రాహ్మణునికి నమస్కరించి యాగప్రయోజనము ఏమిటని అడిగినాడు. విప్రుడు రాజును ఆశీర్వదించి "రాజన్! నేను నాగశర్మ అనే విప్రుణ్ణి - బిల్వహోమమువల్ల అగ్ని తృప్తిపడితే బంగారుబిల్వాలు వస్తవి. అగ్నిదేవుడు ప్రత్యక్షమై వర మిస్తాడు. చిరకాలమునుంచీ యజ్ఞకర్మ చేస్తున్నా, నాపుణ్యాలోపమువల్ల అగ్నిహోత్రుడు తృప్తుడు కాలేదు." అని చెప్పినాడు. ధీరసత్త్వుడయినరాజు "నాకు ఒకబిల్వాన్ని ఇయ్యి. నేను అగ్నిదేవుణ్ణి ప్రసన్నుని చేస్తాను" అన్నాడు. 'అశుచివి నీవు అగ్నిని ఎలా తృప్తిపరుస్తావు?' అని బ్రాహ్మణుడు అడగగా రాజు "ఒక బిల్వము నా చేతికి ఇయ్యి. క్షణములో ఏమి జరుగుతుందో చూడు" అని పలికినాడు. బ్రాహ్మణుడు కుతూహలముతో రాజుకు మారేడుపండు ఇవ్వగా రాజు పరిశుద్ధమనస్కుడై అగ్నిదేవుణ్ణి "అగ్నిదేవా! ఈఫలము వేల్చినా నీవు తృప్తి పొందకపోతే నాశిరస్సును ఖండించి హోమము చేస్తాను" అని ధ్యానము చేసినాడు. అగ్నిహోత్రుడు మారేడుపండు చేతిలో పెట్టుకొని ప్రత్యక్షమై రాజును వరము కోరుకోఅన్నాడు. రాజు "నాకు వరముఅవసరము లేదు. ఈవిప్రునికి వరమును ప్రసాదించు" అని పలికినాడు. అగ్నిదేవుడు బ్రాహ్మణునకు అక్షయధనమును ప్రసాదించినాడు. విప్రుడు తృప్తుడై "అగ్నిదేవా! స్వచ్ఛందవృత్తితో ఉండే మహారాజుకు సాక్షాత్కరించినావు. కఠోర నియమనిష్ఠలతో ఉన్న నాకు నీవు దర్శనము ఇవ్వలేదు" అనేసరికి అగ్ని "నేను దర్శనము ఇవ్వకపోతే రాజు తన శిరాన్ని ఖండించి హోమము చేసేవాడు. తీవ్రసత్త్వానికి సిద్ధులు త్వరగా కలుగుతవి. నీవంటివాడికి త్వరగా కార్యసిద్ధి కాదు" అని చెప్పి అంతర్ధానము చెందినాడు.

నాగశర్మ రాజుదగ్గిర సెలవు పుచ్చుకొని క్రమేణ మహాధనికుడై సుఖములు అనుభవించినాడు. విక్రమతుంగమహారాజు నిజప్రభావమువల్ల గౌరవము పొందినాడు.

మహారాజు పాటలీపుత్రము వెళ్ళగా, శత్రుంజయుడు అనే ప్రతీహారుడు "దేవా! దత్తశర్మ అనే బ్రాహ్మణబ్రహ్మచారి తమతో ఏకాంతములో ఏదో విన్నవించుకోడానికి వచ్చాడు. ద్వారముదగ్గిర ఉన్నాడు ప్రభూ!" అని మనవిచేసుకొన్నాడు. రాజు ప్రవేశపెట్టమనగా వటువు వచ్చి రాజుతో స్వస్తిపూర్వకముగా "దేవా! నేను ఒకభస్మమువల్ల రాగిని బంగారముచేయగలను. నాకుస్వర్ణయోగాన్ని గురువు ఉపదేశించినాడు. ప్రత్యక్షంగా రాగిని బంగారము చేసి చూచాను," అని విన్నవించినాడు. రాజు రాగి తెప్పించి కరిగించమన్నాడు. రాగి కరిగిన తరువాత అందులో భస్మము వటువు వేయబోగా యక్షుడు అదృశ్యుడై వచ్చి భస్మాన్ని రాగిలో పడకుండా చేశాడు. రాజు మాత్రము ఆ యక్షుణ్ణి చూచినాడు. చూర్ణము సోకనందువల్ల తామ్రము సువర్ణము కాలేదు. ఆబ్రహ్మచారి మూడుసార్లు చూర్ణము చల్లినా అతనియత్నము బూడిదలో పోసినపన్నీరు అయింది. అతడు ఖిన్నుడైనాడు. రాజు వటువుచేతిలో చూర్ణము తీసి స్వయంగా తామ్రము మీాద చల్లగా, యక్షుడునవ్వి చూర్ణాన్ని హరించక వెళ్ళిపోయినాడు. తామ్రము బంగారము అయింది. వటువుకు ఆశ్చర్యము కలిగింది. రాజు యక్షువృత్తాంతము చెప్పినాడు. అప్పుడు రాజు బ్రహ్మచారివల్ల స్వర్ణయోగము గ్రహించి అతనికి వివాహము చేసినాడు. ఆరాజు స్వర్ణయోగమువల్ల కోశాగారము సువర్ణరాసులతో నింపి విప్రులదారిద్ర్యబాధతీర్చినాడు.

ఈరీతిగా తీవ్రసత్త్వుల అభీష్టమును ఈశ్వరుడే ఈడేరుస్తాడు. దేవా! నీకంటె ధీరసత్త్వుడైన దాత ఎవడు? శంభునినీవు పూజిస్తే సంతానము కలుగుతుంది.

ఉదారహృదయముతో ఇలా అలంకారప్రభా దేవి వలుకగా హేమ ప్రభమహారాజు అంగీకరించి మరునాడు దేవితో శుచియై స్నానానంతరము శివపూజ చేసి తొమ్మిదికోట్ల సువర్ణమును విప్రులకు దానముచేసినాడు. అతడు శివపూజా సమయములో శివునిసన్నిధిలో ఈశ్వరుడు సంతుష్టుడైనా కావలె, నాశరీరమైనా పోవలె!" అని దృఢబుద్ధితో నిరాహారుడై ఇలా స్తుతించినాడు: "సృష్టిస్థితిలయకారణుడా! ఈశ్వరా! వందనము! అష్టమూర్తీ! మహేశా! నిరంతరవికసితహృత్కమలశాయీ! మునిమానసహంసా! శివా! నమస్కారము! అర్ధనారీశ్వరా! కేవల బ్రహ్మచారీ! విశ్వాత్మా, నమస్కారము!" ఇలా దినత్రయము ఉపవసించి మహారాజు తపస్సుచేయగా శివదర్శనము అయింది. స్వప్నములో రాజుకు ఈశ్వరుడు ఇలా ఆనతి ఇచ్చినాడు: "రాజా, లే. నీకు కుల దీపకు డయినకుమారుడు కలుగుతాడు గౌరీప్రసాదమువల్ల ఉత్తమ కన్య కూడా నీకు కలుగుతుంది. చక్రవర్తికాగలనరవాహనదత్తునికి నీ కుమారి భార్య కాగలదు." శివుడు అంతర్ధానము కాగా, స్వప్నవిషయాన్ని రాజు భార్యకు చెప్పగా ఆమె సంతుష్టురాలు అయింది.

కొన్నాళ్ళకు అలంకారప్రియా దేవి గర్భవతి అయింది. ఆమెముఖము పాండుప్రభలతో ప్రకాశించింది. ఆమెనేత్రములు చంచలము లైనవి. గర్భలక్షణాలను రాజు చూచి సంతోషించినాడు. దేవి సూర్యునివంటి తేజస్సు గలసుతుని కనగా, పురుటిల్లు సిందూరకాంతితో అరుణమైనది. శత్రుభీకరుడు కాగలఆకుమారునికి రాజదంపతులు వజ్రప్రభుడని నామకరణము చేశారు. ఆకుమారచంద్రుడు కళలతో వర్ధిల్లగా కులార్ణవము పొంగిపోతున్నది.

కొన్నాళ్ళకు అలంకారప్రియకు నెల తప్పింది. వేవిళ్ళమనసు తీరేట్టుగా ఆమె పద్మవిమానాన్ని ఎక్కి తరుచుగా ఆకాశాన విహారించేది. రాణి నవమాసాలు మోసి గౌరీప్రసాదమువల్ల కూతుర్ని కన్నది.

ఆకాశవాణి ఆసమయములో "ఈమె నరవాహనదత్తునకు భార్య అవు తుం" దనిఅన్నది. రాజు ఉత్సవములు చేసి కుమారికి రత్నప్రభ అని పేరు పెట్టినాడు. రత్నప్రభకు త్వరలో చిత్తవికాసము కలిగింది. ఆమె అందచందాలు అన్నిఅవకాశములా వ్యాపించింది.

వజ్రప్రభునికి కవచధారణ చేసే ఈడు వచ్చింది. రాజు అతనికి వివాహము చేసి యువరాజును కావించి అతనికే రాజ్యభారము అప్ప గించి నిమిత్తమాత్రముగా ఉన్నాడు. రత్నప్రభకు వయసు వచ్చింది. తండ్రికి కుమారీవివాహవిషయము చింతగా ఉన్నది. పెళ్ళిఈడు వచ్చిన దాన్ని ఇంట్లో ఉంచుకోవడము రాజదంపతులకు కష్టంగా ఉన్నది. తండ్రి రత్నప్రభను దగ్గిర కూచోబెట్టుకొని దేవితో "ప్రేయసీ! కన్య చింతకు కారణము. మనరత్నప్రభకు చదువుసంధ్యలూ, వినయసంపదా, అందచందాలూ ఉన్నా వరుడు దొరక్కపోవడంవల్ల నాకు తోచడం లేదు" అన్నాడు. రాణి "నరవాహనదత్తుకు మనఅమ్మాయి భార్య అవుతుం దని దేవతలు అంటున్నారు. అతనికి అమ్మాయిని ఎందుకు ఇయ్యగూడదు?" అన్నది.

రాజు "మంచిదే. అతనే మనకు అల్లుడు అయితే అంతకన్న కావలసింది ఏ ముంది? అతను అపరమన్మధుడు! అసలు మన్మధావ తారమే. నరవాహనదత్తుకు జ్ఞానసంస్కారము కలగలేదు" అన్నాడు. తండ్రిమాటలు వింటున్న రత్నప్రభ మన సంతా నరవాహనదత్తమయ మైనది. తల్లికీ తండ్రికీ ఆమె నమస్కారముచేసి అంతఃపురములోకి వెళ్ళి చింతతో నిద్రపోయింది. రత్నప్రభ కల కన్నది. స్వప్నములో గౌరి "రేపు శుభదినము. ఉదయమే నీవు కౌశాంబికి వెళ్ళి నరవాహనుణ్ణి చూచి రా. నీతండ్రి, అతన్ని ఇక్కడికి తీసుకొని వచ్చి మీయిద్దరికీ వివాహము చేస్తాడు" అని ఆనతి ఇచ్చింది. రత్నప్రభ మేలుకొని తల్లితో చెప్పి అనుమతి పొంది నిజవిద్యాప్రభావమువల్ల నరవాహనుడు

ఉద్యానములో ఉన్నాడని గ్రహించి అతన్ని చూడవలెనని వెళ్ళింది.

నరవాహనుడు రత్నప్రభాలావణ్యము తిలకించి తన్మయుడౌతున్నాడు. రత్నప్రభ స్వయంగా ఆతనితో "ఆర్యపుత్రా! నేను రత్నప్రభను. మిమ్ము మనసార వలచి వచ్చినాను" అన్నది.

"అనవద్యాంగీ! నీవు నామీది అనురాగమువల్ల వెతుక్కుంటూ వచ్చావు. ధన్యుణ్ణి!" అంటూ సరససల్లాపాలు చేసినాడు. ఆకస్మికముగా ఆకాశాన విద్యాధరసైన్యము కనపడినది. రత్నప్రభతండ్రి ఆకాశమునుంచి అవతరించినాడు. నరవాహనదత్తుడు వాళ్ళను సత్కరించినాడు. సరిగా అప్పుడే వత్సరాజు మంత్రులతో కూడా అక్కడికి వచ్చి అతిథిసత్కారాలు చేసినాడు.

## రత్నప్రభా వివాహము

హేమప్రభమహారాజు తనకుమారి రత్నప్రభకు వచ్చినస్వప్నమును వత్సరాజుకు చెప్పి "రాజా అనుజ్ఞ ఇవ్వండి." అని నిజప్రభావమువల్ల విమానము సృష్టించినాడు. హేమప్రభుడు విమానములో నరవాహనుని, రత్నప్రభనూ గోముఖాదులతో కూర్చోబెట్టుకొని, వత్సేశ్వరునివద్ద సెలవు పుచ్చుకొని కాంచనశృంగపురమునకు వెళ్ళినాడు. అక్కడ రత్నప్రభకు వివాహమైనది. హేమప్రభుడు అల్లునికి అనేక రత్నరాసులను అరణమిచ్చినాడు. నరవాహనుడు అత్తవారింట దివ్యభోగాలు అనుభవిస్తున్నాడు. రత్నప్రభా ప్రభావమువల్ల దంపతులు ఆకాశములో సంచరిస్తూ దివ్యోద్యాన వాపీదేవమందిరాలను తిలకిస్తూ క్రీడిస్తున్నారు.

కొన్నాళ్ళకు మంత్రి యౌగంధరాయణుని హెచ్చరికవల్ల నరవాహనుడు కౌశాంబికి తరలినాడు. అత్తగారు ప్రయాణమంగళము జరిపింది. అతడు మామగారితో బావమరదితో విమాన మెక్కి వధూనమేతంగా

నిజరాజధానికివచ్చాడు. వత్సరాజు కుమారుని రాకకు సంతోషించి ఉత్స వము చేసినాడు. నరవాహనదత్తుడు తల్లికన్నుదోయిలో అమృతవర్షము కురిపినాడు. కొడుకూ కోడలూ వత్సరాజుకూ వాసవదత్తాదేవికీ వంద నము ఆచరించినారు. వత్సేశుడు హేమప్రభునుకూ, వజ్రప్రభునుకూ నిజవిభవానుకూలముగా సత్కారములు సలిపినాడు. నరవాహనదత్తుడు రత్నప్రభతో, మదనమంచుకతో, సుఖాలు అనుభవిస్తున్నాడు.

## త ర ం గ ము : 36

మర్నాడు గోముఖుడు మొదలయిన అమాత్యులు నరవాహనుణ్ణి దర్శించ వచ్చినారు. ప్రతీహారి లోపల తెలియజేసి అనుమతిపొంది అమా త్యులను ప్రవేశపెట్టింది. రత్నప్రభ ద్వారపాలికతో "వీరు వచ్చే ప్పుడు ఎప్పుడూ ఆటంకము చెయ్యకు. ఆర్యపుత్రుని మిత్రులు వీరు. వీరుమాస్వశరీరము" అని ఆజ్ఞ చేసింది. ఆమె భర్తతో "ఆర్యపుత్రా, ప్రస్తావవశమున చెపుతున్నాను. స్త్రీలకు అంతఃపురరక్షణ నీతిమాత్రము అని నాఅభిప్రాయము. కులాంగనలకు శీలమే కవచము. చపలమతు లను రక్షించేటందుకు బ్రహ్మకూడా అసమర్థుడు."

## రత్నాధిపతి చపలభార్యల కథ

సముద్రముమధ్య రత్నకూట మనే ద్వీపములో రత్నాధిపతి అనే అన్వర్థనామధేయు డైనవైష్ణవప్రభువు ఉన్నాడు. ఆరాజు పృథివీ చక్రము హస్తగతము చేసుకోవలె నని విష్ణువునుగూర్చి తపస్సుచేశాడు. దేవదేవుడు రాజుకు దర్శనమిచ్చి ఇలా పలికినాడు: "రాజన్! కళింగ దేశంలో ఒకగంధర్వుడు మునిశాపవశాన శ్వేతరశ్మి అనే నామముతో శ్వేతగజమై జన్మించినాడు. పూర్వతపఃపుణ్యమువల్ల, నామీద భక్తి వల్ల ఆఏనుగు జ్ఞాని ఆకాశగామి, పూర్వజన్మజ్ఞాని. నాఆజ్ఞవల్ల ఆగజము

నీకు వాహనయోగ్యము అవుతుంది. ఐరావతమువంటి ఆఏనుగ నెక్కి నీవు ఏరాజుమీదికి పోతే, ఆరాజుకు స్వప్నములో నేను కనపడి ఆజ్ఞ యిస్తాను. ఆరాజు నీకాళ్ళు కడిగి కన్యాదానము చేస్తాడు. అతడు కన్యాదానము పేరుతో కప్పమూ నీకు ఇచ్చుకొంటాడు. ఇలాగా పృథివీ మండలము నీహస్తగతము అవుతుంది. ఎనభైవేలమంది రాజకన్యలు నీకు లభిస్తారు.'' విష్ణువు అంతర్ధానమైనాడు. రాజు పారణ చేసి మర్నాడు ఆకాశమునుంచి అవతరించిన ఏనుగును ఎక్కి భూచక్రము జయించి, రాజకన్యలను తెచ్చి వాళ్ళతో రత్నకూటములో క్రీడిస్తున్నాడు. ఆదివ్యగజమునకు తుష్టి కలగడానికి ప్రతిదినము ఏడువందల బ్రాహ్మణ్యానికి భోజనము పెడుతున్నాడు.

ఒకసారి ఆరాజు గజము నెక్కి ద్వీపాంతరాలు తిరిగి తనద్వీపానికి వచ్చాడు. అతడు ద్వీపములో దిగేసమయాన గరుడపక్షి దైవవశాన వచ్చి ఏనుగుకుంభస్థలాన్ని ముక్కుతో రక్కింది. రాజు అంకుశముతో తీవ్రముగా కొట్టగా పక్షి రివ్వున ఎగిరిపోయింది. ఏనుగుమూర్ఛపోయింది. అయిదురోజులు ఆహారము మాని అలాగే పడిపోగా రాజు లోకపాలకులను విచారంతో "దిక్పాలులారా! నాకు ఈఅవస్థలో దారిచూపండి. దారిచూపకపోతే నాశిరస్సును ఖండించి బలి ఇస్తాను.!'' అంటూ కత్తి దూయగా అశరీరవాణి "రాజన్! వద్దు. సాహసంవద్దు, పతివ్రత ఏనుగును స్పృశిస్తే ఏనుగు జీవిస్తుంది. మరొకఉపాయము లేదు.'' అన్నది.

రాజు అంతఃపురములో పట్టపుదేవి అయిన అమృతలతను పిలిపించి గజమును స్పృశించ మని పలికినాడు. ఏమీ లాభము లేకపోయింది. తక్కినభార్య లంతా వచ్చి స్పర్శ చేసినా ఏనుగు లేవలేదు. రాణివాసమంతా పతివ్రతలు కా రని రాజు సిగ్గుతోచచ్చి, ఆశ్చర్యపడి నాగరక నారీమణులను రప్పించి ఏనుగును తాకించినాడు. అప్పటికీ ఆఏనుగు లేవ లేదు. రాజు సిగ్గుపడ్డాడు. తామ్రలిప్తినగరమునుంచి హర్షగుప్తు డనే

వర్తకుడు వచ్చి ఆసంగతి విన్నాడు. అతడు శీలవతి అనేతనదాసిని తెచ్చి నాడు. ఆమె గజమునుస్పృశిస్తూ 'నేనే పతివ్రతను అయితే ఈఏనుగు లేచుగాక' అన్నది. వెంటనే ఏనుగు లేచి కబళాన్ని గ్రహించింది. సృష్టి స్థితిలయ సమర్థ లయనసాధ్వీమణులు ఏకొద్దిమందో వేళ్ళమీద లెక్కించ డానికి ఉంటారు. అందరూ శీలవతిపాతివ్రత్యాన్ని ప్రస్తుతించినారు. మహారాజు రత్నమయనగరిని హర్షగుప్తునికి ఇచ్చి సత్కరించినాడు. అతడు రాణివాసమువైపు శీతకన్నువేసి అన్నోదకాలు మాత్రము వాళ్ళకు ఇస్తున్నాడు.

## రత్నాధిపునిభార్య రాజదత్త కథ

రాజు శీలవతితో హర్షగుప్తునిఎదుట 'శీలవతీ! మీఇంట పుట్టినకన్య నీవలె సాధ్వి కాక తప్పదు. ఆకన్యను నాకు ఇప్పించవలె' అని పలికి నాడు. ఆయనకు రాణులు అందరిమీద విరక్తి కలిగి పరమసాధ్వీమణే భార్య కావా లని ఉవ్విళ్ళూరుతున్నాడు శీలవతి రాజు మనోవేదన గ్రహించి 'ప్రభూ! తామ్రలిప్తినగరములో రాజదత్తఅనే నాచెల్లెలు అందగత్తె ఉన్నది. తమకు ఇష్టమైతే దాన్ని వివాహ మాడవచ్చును' అన్నది. రాజుఅందుకు అంగీకరించి శీలవతిని, హర్షగుప్తుణ్ణీ తోడ్కొని శ్వేతరశ్మి మీద నెక్కి తామ్రలిప్తికి వెళ్ళి హర్షగుప్తుని ఇంట్లో మకాముగా ఉన్నాడు. ఆయన సిద్ధాంతులను పిలిపించి తనకూ రాజ దత్తకూ లగ్నము ఏర్పాటు చేయ మని చెప్పినాడు. వాళ్ళు వధూ వరుల జన్మనక్షత్రాలు తెలుసుకొని "రాజా! మీకు మూడునెలలదాకా ముహూర్తము కుదరలేదు. ప్రస్తుతము కర్కుర్తిగా లగ్నము కుదిరిస్తే రాజదత్త అసతి అవుతుంది." అన్నారు. రాజదత్త చక్కదనానికి మురిసి రాజు ఆమె సమాగమానికి తహతహ లాడి ఇప్పుడే ఆకన్యను పెళ్ళాడు తా నన్నాడు. "రాజదత్త శీలవతిచెల్లెలు. అసతి ఎలా అవుతుంది!

సముద్రంమధ్యలో నిర్జనద్వీపములో చతుశ్శాలలో ఉంచుతాను నా ప్రేయసిని. మగపురుగుకూడా చొరడానికి అశక్యము ఆప్రదేశము. స్త్రీలనే నాభార్యకు పరివారముగా ఏర్పాటు చేస్తాను. పురుషులు లేని చోట రాజదత్త అసతి ఎలా అవుతుంది? " అని రాజు నిశ్చయానికి వచ్చి రాజదత్తను వివాహమాడి హర్షగుప్తుడూ శీలవతీ వెంట రాగా శ్వేతరశ్మిని ఎక్కి గగనమార్గాన ప్రయాణము చేసి, జన మంతా చూడగా రత్నకూట ద్వీపములో అవతరించినాడు. రాజదత్తకు అక్క గారివలె అచిరకాలములో సాధ్వీమణిగా ఖ్యాతి వచ్చింది. రాజు శ్వేత రశ్మిని ఎక్కి రాజదత్తతో నిర్జనద్వీపానికి వెళ్ళి, స్త్రీపరివారసహిత చతుశ్శాలలో ఆమెను ఉంచినాడు. ఆమెకు కావలసిన సామగ్రి శ్వేత రశ్మిద్వారా గగనమార్గాన అందచేయడమూ, రాత్రులు రాజదత్తతో రాజు అనురాగముకొద్దీ గడపి, పగళ్ళు రాజకార్యనిమిత్తము రత్నకూట ద్వీపానికి రావడమూ పరిపాటి అయినది.

ఒకరాత్రి రాజదత్తకు ఆఖరుజామున చెడ్డకల వచ్చింది. తెల్లవారిన తరువాత రాజు ప్రేయసితో మధుపానము చేసినాడు. రాజదత్త మత్తుతో అతన్ని వదలలేకుండా ఉన్నా ఆయన రాజకార్యాలమీద రత్నకూటము వెళ్ళాడు. వెళ్ళాడేగాని మననంతా పరిపరివిధాల పోతూఉండగా ఆయన రాజకార్యాలు నిర్వర్తిస్తున్నాడు. నాప్రియు రాలిని ఒంటరిదాన్ని చేసివచ్చానే అని అనుమానిస్తున్నాడు. ఆనిర్జన ద్వీపములో దాసీజనము వంటలోనూ ఇతరపనులలో ఉండగా రాజదత్త బిక్కుబిక్కు మంటూ ఏకాకినిగా ఉన్నది. ఆమెరాణివాసానికి భం గము కలిగించేందుకు వచ్చినవిధి అన్నట్టు ఎవరోపురుషుడు రాజదత్త దగ్గిరికి వచ్చినాడు. ఆమె "ఎలా వచ్చావు? ఎవరునీవు? " అనిఅడిగింది. అతడు తనవృత్తాంతము పూస గుచ్చినట్టు చెపుతున్నాడు: "సుందరీ! నన్ను పవనసేను డంటారు. మధురాపురంలో నేను వైశ్యుణ్ణి. నా

తండ్రిగతించగా ఆస్తి నాదాయాదులు హరించారు. పరదేశంలో అన్యులసేవ చేస్తూ జీవిస్తున్నాను. తరువాత వర్తకము చేసి నాలుగు రాళ్ళు వెనక వేసుకొని, దేశాంతరం పోతూ ఉండగా తోవలో దొంగలు నన్ను దోచారు. ఉన్న కాస్తాపోగా చిప్పచేతికి వచ్చింది. వాడవాడల తిరిగి తిరిపె మెత్తి పొట్ట పోసుకొంటున్నాను. నావంటి మరికొందరితో కలిసి రత్నపుగను లున్న కనకపురము వెళ్ళి, అక్కడ రాజుకు భాగము ఇవ్వడానికి ఇష్టపడి సంవత్సరంపాటు గనిని తవ్వినాను. ఎంత తవ్వినా రత్నాలు దొరక లేదు. తక్కినవాళ్ళకు రత్నాలు దొరకడంవల్ల వాళ్ళుసంతోషపడుతూ ఉండగా, నేను కట్టెలు పేర్చి అగ్నిలో దుముకడానికి సిద్ధంగా ఉన్నాను. జీవదత్తుడు అనే వైశ్యుడు వచ్చి నన్ను బతికించినాడు. అతడు నన్ను తననావలో ఎక్కించుకొని స్వర్ణద్వీపానికి తీసుకు వెళ్ళినాడు. అయిదురోజులు సముద్రప్రయాణము పట్టింది. హఠాత్తుగా మబ్బులు గుంపులై రోకళ్ళలావున వాయుబలంతో వర్షించినవి. నావ మదించినఏనుగువలె తిరిగి తిరిగి పగిలి మునిగిపోయింది. అదృష్టవశాన నాకు బల్ల దొరకగా పట్టుకొని ఎక్కి, వర్షము కురిసి వెలిసినతరువాత ఈచతుశ్శాలను చూచి, నానేత్రతాపోపశమనము కలిగించే నిన్ను చూచి ఇలా వచ్చాను.”

రాజదత్త మతి చలించింది. అతన్ని శయ్యమీద కూర్చోపెట్టుకొని కైపుతో కౌగిలించింది. కామార్తురాలికి ధర్మము తృణప్రాయము. ఇంతలో రాజు శ్వేతరశ్మి నెక్కి భార్య పరపురుషునితో ఉండగా చూచి నిర్జనద్వీపములో దిగినాడు. దిగీ దిగడముతో అతడు కత్తి దూసి ఆ జారుణ్ణి చంపబోయినాడు. వాడు రాజు కాళ్ళావేళ్ళా పడ్డాడు. రాజు వాణ్ణి చంపక ఇలా ఆలోచించినాడు: “కామానికి అనుకూలంగా ఉండే మధువును సేవించినఆడది పతివ్రత ఎలా అవుతుంది? చాపల్యాన్ని ఎవడు ఆపగలడు? ఝంఝామారుతాన్ని చేతులతో పట్టుకోడం శక్యమా

జ్యోస్యులమాట పాటించనందుకు ఫల మిది! ఆప్తవాక్యాన్ని తిరస్కరిస్తే కార్యము సఫలము కాదు. రాజదత్త శీలవతిచెల్లెలు కదా అని పెళ్ళాడితే విషమించింది. అమృతానికి తోబుట్టువు హాలాహలము. విధిని తరింప తరమా? పురుషప్రయత్నము ఏమి చెయ్యగలదు?"

రాజు ఆవైశ్యునివృత్తాంతము అడిగి తరిమివేసినాడు. వాడు బతుకు జీవుడా అని సముద్రములో దూరాన్నుంచి వస్తున్న నావను చూచి, ఈదుకొంటూ వెళ్ళి తనను ఎక్కించుకోమని కేకలు వేశాడు. ఆఓడలో క్రోధవర్మ అనేవాడు అతన్ని ఎక్కించుకొన్నాడు. దుష్కర్మ ఎక్కడికి వెళ్ళినా వెంట వస్తుంది. తనభార్యను ఆవైశ్యుడు అనుభవించగా అతడు చూచి సమయము దొరికిం దని తలచి అతన్ని నడిసముద్రములోకి తోసి చంపివేసినాడు.

రాజు కోపము మాని సపరివారముగా రాజదత్తను శ్వేతరశ్మిమీద ఎక్కించుకొని రత్నకూటానికి వెళ్ళి శీలవతికి ఆమెచెల్లెల్ని అప్పగించి ఆమెకూ, తన అమాత్యులకూ రాజదత్తవృత్తాంతము వివరముగా చెప్పినాడు. స్త్రీ, సంసారమూ దుఃఖకారణా లని రాజు గ్రహించి వానప్రస్థుడై జీవించా లని నిశ్చయించుకొనగా శీలవతీ, మంత్రులూ ఆయనను వారించినారు. దుఃఖావేశము కొద్దీ, వైరాగ్యమువల్ల తనకోశములో సగముధనము శీలవతికీ, మిగిలినధనము బ్రాహ్మణ్యానికీ ఇచ్చి, పాపభంజను డనే ఉత్తమబ్రాహ్మణునికి రాజ్యదానము చేసినాడు. అతడు శ్వేతరశ్మిని ఎక్కి గగనమార్గాన ప్రయాణము చేయగా ఆగజము నిజరూపముతో కేయూరహారవిరాజితు డైన దివ్యపురుషు డైనాడు రాజు ఆశ్చర్య పడి ఏమి టిది అని ప్రశ్నించినాడు.

ఆదివ్యుడు స్వవిషయము చెపుతున్నాడు. "మేము గంధర్వులము. మలయాచల నివాసులము. నాపేరు సోమప్రభుడు. నాఅన్నపేరు దేవప్రభుడు. నాఅన్నగారికి అనుకూల మైన భార్య ఉన్నది. దేవప్రభుడు

ప్రియురాలిని అంకతలాన ఆసీనురాలిని చేసి, నాతో సిద్ధక్షేత్రానికి వచ్చాడు. అక్కడ విష్ణుదేవుని ఆలయములో అర్చన చేసి గీతోపాసన ఆరంభించాము. మూవదినె రాజవతి రెప్ప లప్పళించక హాయిగా గొంతెత్తి పాడుతూ ఉంటే సిద్ధుడు తదేకదృష్టితో చూచినాడు. నా అన్నగారు అతన్ని ఈర్ష్యా సంశయదృష్టితో, కోపాన్ని బలాంతాన దిగమింగి "సిద్ధుడ వయినా పరస్త్రీని ఆశతో చూస్తావేమి?" అని అడిగినాడు. అతనికి కోపమువచ్చి "నేను పాటకు పరవశుణ్ణి అయినాను. నీకు ఇంత కన్నెర్రగా ఉంది కనుక నీవు మానవుడవై పుట్టి నీభార్య అన్యునితో ఉండగా స్వయంగా చూస్తావు" అని శపించినాడు. నేను కోపంతో మండిపడి తెల్లనిమట్టిపెనుగను సిద్ధుని మీదికి గిరాటు వేసినాను. "నన్ను దేనితో కొట్టినావో ఆభూలోకంలో తెల్లపెనుగవై జన్మిస్తావు అని సిద్ధుడు నన్ను శపించాడు. మా అన్న నాశాపాంతమును ప్రార్థించగా అతడు హరిప్రసాదమువల్ల నీవు ద్వీపాధిపతివి అవుతావు నీను పెనుగై నీకు వాహనము అవుతాడు. నీకు ఎనభై వేలమంది జనానా ఉంటుంది రాణివాసములో వాళ్ళ దుశ్శీలము అందరిసమక్షములో నీవు తెలుసుకొంటావు. మానవస్త్రీని పెళ్ళాడి, ఆమె అన్యాసక్త అయినప్పుడు ప్రత్యక్షంగా చూస్తావు. స్త్రీవ్యసనంవల్ల విసుగు పుట్టి విరక్తితో అడవికి వెళ్ళాలని సంకల్పించగా మొదట నీతమ్మునికి శాపవిమోచనము అవుతుంది" అన్నాడు. ఆశాపంవల్ల మనము ఈప్రకారంగా పుట్టినాము. ఇప్పుడే మనకు శాపము తీరిపోయింది.

ఇలా సోమప్రభుడు పలుకగా రత్నాధిపుడు పూర్వజన్మను స్మరించుకొని 'ఆహా! నేను దేవప్రభుణ్ణి! ఈమె ఆరాజవతి నాప్రేయసి!' అని భార్యా తానూ దేహాలను విడిచి క్షణంలో గంధర్వులై నిజనివాసమయిన మలయాద్రికి గగనమార్గాన వెళ్ళినారు. శీలవతి కులస్త్రీ అని పేరు పొంది తామ్రలిప్తిలో ధర్మజీవనము గడుపుతున్నది.

జగత్తులో ఎవరూ స్త్రీరక్ష చెయ్యలేదు. కులాంగనకు శీలమే కవచము వంటిది. ఈర్ష్య పురుషుల దుఃఖకారణము, స్త్రీలు ద్వేష కారణము. పురుషుల ఈర్ష్యవల్ల స్త్రీలు బాగుపడరు. అంతే కాదు వాళ్ళు చెడతారు.

ఇలా నరవాహనదత్తుడు భార్య రత్నప్రభ చెప్పిన కథ విని మంత్రులతో కూడా సంతోషపడినాడు.

## త ర ం గ ము : 32

## అనురాగపర కథ

గోముఖుడు నరవాహనదత్తుతో ఇల్లా చెప్పినాడు : నిజానికి లోకంలో పతివ్రతలు తక్కువ. అంగనలు చపలచిత్తలు, వాళ్ళను నమ్మరాదు. అందుకు ఉదాహరణము విను.

ప్రసిద్ధమైన ఉజ్జయినీపురములో నిశ్చయదత్తు అనే వైశ్యకుమారుడు ప్రతిదినమూ జూదములో గెలిచేవాడు. రోజూ అతను శిప్రానదిలో స్నానము చేసి మహాకాలనాథేశ్వరుణ్ణి అర్చించి విప్రులకు భోజనము పెట్టి చందనతాంబూలాలు ఇచ్చి సత్కరిస్తున్నాడు. స్నానార్చనాదికము అయిన తరువాత అతడు మహాకాల దేవాలయ సమీపములోని రుద్రభూమిలో శరీరానికి చందనచర్చ చేసుకొంటూ ఒంటరిగా శిలాస్తంభముమీద చందనవిలేపనము ఉంచి దానికి తనవీపును రాస్తున్నాడు. రోజూ ఇదే క్రమములో పని సాగుతూ ఉండడమువల్ల స్తంభము ఒక వైపున నునుపు అయింది. ఒకనాడు అక్కడికి ఒక చిత్రకారుడు ఒక కాసెపనివాడూ వచ్చారు. ఆశిల్పి నున్నగా ఉన్న శిలాస్తంభముమీద గైరికధాతువులతో గౌరిని రచించినాడు. కాసెవాడు ఉలితో సరదాగా గౌరిబొమ్మనే చెక్కినాడు. వారిద్దరూ వెళ్ళిపోయినతరువాత మహాకాలార్చనకై వచ్చినవిద్యాధరి స్తంభములో దేవీవర్ణచిత్రాన్ని

చూచి, సులక్షణంగా ఉన్నందున అదే గౌరీసాన్నిధ్యమనుకొని ఆ ప్రతిమను అర్చించి, విశ్రాంతికై ఆ స్తంభంలో ప్రవేశించింది. ఈలోగా నిశ్చయదత్తు వచ్చి, గౌరీప్రతిమను చూచి తెల్లపోయి ఒంటికి గంధము పూసుకొని, స్తంభానికి అవతలవైపు చందనము ఉంచి దానిమీద వీపు రాయ సాగినాడు. దాన్ని చూచి స్తంభములో ఉన్న విద్యాధరకన్య అతని అందానికి మురిసి "ఇంతచక్కనివాడికి వీపుమీద గంధము పూసే వాళ్ళు లేకపోయారే! నేను పూస్తాను" అని స్తంభాంతరంలోనుంచి చెయ్యి చాపి అనురాగముతో అతనివీపుమీద గంధము పులిమింది. వైశ్యకుమారుడు కామినీకోమలహస్తస్పర్శ అనుభవించి, గాజుల మోత విని ఆమె కరపల్లవాన్ని గ్రహించినాడు. విద్యాధరి అతనికి కనపడకుండా "మహాభాగా! నీ కేమి అపరాధము చేశాను? నా చెయ్యి వదులు" అన్నది. నిశ్చయదత్తు "నీవు ఎవరో తెలియదు. ప్రత్యక్షమై చెప్పు. చెయ్యి వదిలేస్తాను" అని పలికినాడు. ఆమె అలాగే ప్రత్యక్షము అవుతానన్నది. అతడామె చెయ్యి వదలివేశాడు.

శిలాస్తంభములోనుంచి ఆసుందరి బైటికి వచ్చి అతని ముఖాన్ని ఆశతో చూచి దగ్గిరే కూర్చొని హిమసానువులమీద పుష్కరావతీ నగరాధిపతి అయిన వింధ్యవరుడనే విద్యాధరుని పుత్రికను. నన్ను అనురాగపర అంటారు. అర్చనకు ఇక్కడకువచ్చి ఇక్కడవిశ్రమించి, నీసౌందర్యాన్ని చూచి నాహృదయము అనురాగపేశలమైంది. నీపృష్ఠమునకు అంగరాగము పూశాను. నేను ఇంటికి వెళ్ళాలి" అన్నది. నిశ్చయదత్తు "చండీ! నామనస్సు దొంగిలించి తిరిగి నీవు ఇవ్వడము లేదు! నామనస్సు నాకు ఇవ్వకుండా వెళితే ఎలాగ?" అని అడిగినాడు. విద్యాధరి ముగ్ధరాలై "నీవు మావూరు వస్తే నీశయ్యను అలంకరిస్తాను. నీకోరిక సఫలమవుతుంది. యత్నము చేస్తే అసాధ్యము ఏముంటుంది?" అంటూ ఆకాశాన వెళ్ళిపోయింది.

నిశ్చయదత్తు మనసు విద్యాధరీమయ మైనది. అతడు ఇంటికి వెళ్ళి విద్యాధరకన్యాకోమలకరస్పర్శను స్మరిస్తూ ఆమెనువివాహమాడలేకపోతినే అని విచారిస్తూ ఏమైనా సరే ప్రాణాలకు తెగించి పుష్కరావతీనగరము వెళ్ళితీరవలె నని నిశ్చయించుకొన్నాడు. నిశ్చయదత్తు మర్నాడు ఉదయమే ఉత్తరదిశకు ప్రయాణము చేయసాగినాడు.

ఉత్తరాభిముఖముగా ముగ్గురు వైశ్యకుమారులు వెళుతూ నిశ్చయదత్తును కలుసుకొన్నారు. అతడు ఆవణిక్పుత్రులతో కలసి నదీనదాలూ, పల్లీపురములూ, అడవులు కొండలు దాటి క్రమేణా మ్లేచ్ఛభూయిష్ఠమైన ఉత్తరభూమికి వెళ్ళినాడు. అక్కడ తాజికులు అతన్ని బంధించి మరొక తాజకునికి అమ్మివేశారు. అతడు మురవారు డనుతురకకు నిశ్చయదత్తును కానుకగా పంపినాడు. మురవారుడు చనిపోవడమువల్ల వణిక్పుత్రులందరినీ మురవారునికుమారుడు చంపివేసి తండ్రిగోరీలో పాతిపెట్టవలసినదిగా ఆజ్ఞ చేశాడు. ఆతురకవాసినౌకరులు వైశ్యపుత్రులను ఖైదులో ఉంచినారు. తెల్లవారగానే చావు తప్పదని వైశ్యులు విచారిస్తూ ఉండగా నిశ్చయదత్తు "మిత్రులారా! విచారించి ప్రయోజనము లేదు. ధైర్యముతో కార్యసాధన కర్తవ్య మని గ్రహించండి. కష్టాలు గట్టెక్కుతవి, మనమంతా దుర్గాదేవిని ధ్యానిస్తే" అంటూ వాళ్ళకు ధైర్యము కలిగించి తాను ఇలా దేవీస్తవము చేసినాడు: "దేవీ! ఖండితాసుర రక్తపంకారుణములై అలక్తకాంకితములవంటి నీ పాదపద్మాలకు నమస్కారాలు! మహేశ్వరుని విభూతికి నీవే కారణము. త్రిలోకాలు నీవల్లనే నిలుస్తున్నవి చరాచరజగజ్జననీ! మహిషాసురమర్దనీ! లోకపావనీ! శరణాగతులను రక్షించు జననీ!" నిశ్చయదత్తు అలసిసొలసి విశ్రమించగా ఎలాగో కంటిమీదికి కునుకు వచ్చింది. ఆ వైశ్యకుమారులకు స్వప్నములో దేవి సాక్షాత్కరమై 'లేవండి లేవండి! మీకట్లు తెగిపోయినవి' అని ఆనతి ఇచ్చింది. బంధవిముక్తి కలిగినతరువాత తెల్ల

వారగా వాళ్ళు కొంతదూరము నడచి, నిశ్చయదత్తునితో "మిత్రమా! ఈతురకలదేశానికి మేము రాము. దక్షిణాపథము పోతాము. నీ యిష్టము వచ్చినట్లు చెయ్యి" అన్నారు.

నిశ్చయదత్తు ఉత్తరదేశాలకేసి పోవ సంకల్పించుకోవడమువల్ల తక్కిన వైశ్యులను వదలివేశాడు. దత్తు తోవలో నలుగురు మహావ్రతులను కలుసుకొని పాంచాలదేశములోని వితస్తానదిని దాటినాడు. భోజనముచేసి సంధ్యవేళ అతడు వాళ్ళతో వనానికి వెళ్ళినాడు. కట్టెలు కొట్టేవాళ్ళు ఎదురుపడి వాళ్ళను "ఎక్కడికి వెడతారు? చీకటి పడుతుంది. దగ్గిరగా గ్రామము ఏదీలేదు. అడవిలో పాడు దేవాలయము ఉంది. ఆశివాలయములో లోపల గాని వెలుపల గాని ఎవ డయినా ఉంటే శృంగోత్పాదిని అనే యక్షిణి వాడితలమీాద కొమ్ములు మొలిపించి తెలివితప్పించి పశువును చేసి భక్షిస్తుంది అన్నారు. మహావ్రతులు వాళ్ళమాటలువిని లక్ష్యపెట్టక నిశ్చయదత్తుతో "రావోయి! చూదాము సంగతి ఏమిటో. ఆయక్షిణి ఏమి చేయగలుగుతుందో చూడాలి. రాత్రులు ఎన్నోశ్మశానాలలో మకాము చేశాము. మనకు భయమేమిటి!" అని పలికినారు. అందరూ కలిసి గుళ్ళో ఆరాత్రి గడపవలె నని ప్రవేశించారు. మహావ్రతులూ అతనూ ప్రాంగణములో భస్మముతో పెద్దమండలము రచించి అందులో ప్రవేశించి, కట్టెలు తగలపెట్టి రక్షణార్థము జపము చేస్తున్నారు.

## శృంగోత్పాదిని

రాత్రివేళ శృంగోత్పాదిని అనే యక్షిణి దూరమునుంచి కంకాళికిన్నరి వాయిస్తూ నృత్యము చేస్తూ వచ్చింది. నలుగురిలో ఒకరిని లక్ష్యము చేసి యక్షిణి మంత్రాన్ని పఠించింది. అతడు తెలివి తప్పి కొమ్ములు మొలవగా లేచి ఆడుతూ అగ్నిహోత్రములో పడ్డాడు.

అతనిశరీరము సగము కాలిపోగా ఇవతలకు లాగి శృంగోత్పాదిని భక్షించింది. యక్షిణి రెండోవాణ్ణి లక్ష్యముగా చేసి మంత్రోచ్చారణ చేస్తూ వికరనృత్యము చేసింది. అతనికి కొమ్ములు మొలుస్తూ ఉండగానే యక్షిణి చప్పరించి వేసింది. ఇలా వరసగా ముగ్గుర్నీ యక్షిణి పొట్టన పెట్టుకొన్నది. నాలుగోవాణ్ణి శృంగోత్పాదిని తింటూ, రక్తమాంసాల వల్ల మైకెక్కి విధివశాన తనకిన్నరీవాద్యాన్ని నేలమీద ఉంచింది. నిశ్చయదత్తుడు చప్పున ఆ కిన్నరిని పుచ్చుకొని నృత్యము చేస్తూ నవ్వుతూ తిరుగుతూ, యక్షిణి పలికిన మంత్రాన్ని యక్షిణిమీద ప్రయోగించి పునశ్చరణ చేశాడు. ఆప్రయోగమహిమవల్ల శృంగోత్పాదిని భయపడి వశము తప్పిపోగా కొమ్ములు మొలిచే సమయములో వినయపూర్వకముగా నిశ్చయదత్తుడు వేడుకొన్నది: "మహాసత్త్వా! దీనను స్త్రీని చంపకు. నీవేగతి! మంత్రోచ్చారణ చెయ్యకు! నన్ను రక్షించు. నీకోరిక నాకు తెలుసు. నిన్ను అనురాగపర అనే విద్యాధర కన్యదగ్గిరికి తీసుకుపోతాను." యక్షిణి దీనాలాపాలవల్ల నిశ్చయదత్తుని హృదయము కరిగింది. అతడు మంత్రోచ్చారణ మాని వేసినాడు.

దత్తు యక్షిణిభుజముమీద ఎక్కి గగనమార్గాన ఉత్తరదిక్కుగా ప్రయాణము చేస్తున్నాడు. వేకువవేళ వాళ్ళు గిరికాననము చేరినారు. యక్షిణి అతనితో "సూర్యోదయము అవుతున్నది. ఇక ముందుకు పోయేసామర్థ్యము నాకు లేదు. ఈపగలు ఇక్కడ కాలక్షేపము చేస్తే రాత్రికి వస్తాను. ఈవన్యఫలాలు తిని, సెలయేటినీటిని తాగు. నేను రాత్రికి వచ్చి నిన్ను హిమసానువులమీద ఉన్న పుష్కరావతీపురానికి తీసుకుపోతాను" అని వినయపూర్వకముగా విన్నవించింది. యక్షిణి భుజాలమీదనుంచి నిశ్చయదత్తు దిగి, అనుమతి ఇవ్వగా ఆమె వెళ్ళి పోయింది. అక్కడ అతనికి విషమయమై స్వచ్ఛశీతల మైనసరస్సు కన పడింది. అందులోవిషముఉన్న దని అతడు గ్రహించి, దాహముకోసము

పర్వతసానువుమీద తిరిగి తిరిగి, ఎత్తయినచోట పద్మరాగమణిప్రభ వంటి కాంతిని చూచి అక్కడ తవ్వినాడు. పైమట్టి తీసివేయగా విశ్వయదత్తుకు బతికి ఉన్న కోతితల కనపడినది. ఆ కపికన్నులు పద్మరాగ మణులవలె ప్రకాశిస్తున్నవి. అతడు ఆశ్చర్యముతో ఆలోచిస్తూ ఉండగా కోతి మనుష్యవాక్కుతో "సత్పురుషుడా! నేను మానవుణ్ణి, బ్రాహ్మణ్ణి. నాకర్మవల్ల కపి నైనాను. నన్ను లేవదీస్తే నాసంగతి మనవిచేస్తాను" అన్నది. దత్తు మన్ను తీసి కోతిని ఉద్ధరించినాడు. అది అతని పాదాల మీద మోకరిల్లి "అయ్యా, నాప్రాణ మిచ్చావు. అలసిపోయినావు. ఫలాలు తిను. నీరు త్రాగు. నేను నీదయవల్ల పారణ చేస్తాను" అని అతన్ని సెలయేటిదరికి తీసుకుపోయింది. దత్తు చల్లనినీళ్లల్లో స్నానము చేసి తియ్యనిపళ్లు తిని సేదతీర్చుకొని కోతిసంగతి కుతూహలముగా అడిగినాడు.

## కోతి అయిన సోమస్వామి కథ

కోతి మనుష్యవాక్కుతో విశ్వయదత్తుకు నిజవృత్తాంత మిలాచెప్పింది:

"కాశీలో చంద్రస్వామి అనే సద్బ్రాహ్మణుడు నాతండ్రి. నాతల్లి సువృత్త. నా పేరు సోమస్వామి నేను వయస్సులో మత్తగజముమీద విచ్చలవిడిగా తిరుగుతూ ఉండగా శ్రీగర్భుడు అనే వర్తకుని కుమార్తె బంధుదత్త నన్ను చూచి మోహించింది. పుట్టింట్లో ఉండి బంధుదత్త దూతికద్వారా నాకు కబురు పంపింది. నాయికాభావాన్ని దూతీముఖముగా నేను గ్రహించి నాయికదగ్గిరికి రహస్యంగా వెళ్లినాను. ఆమె నన్ను చూచీ చూడడముతో నాకంఠాన్ని కౌగలించుకొన్నది. ప్రతి దినమూ బంధుదత్తా నేనూ ఆమెచెలి ఇంట్లో కలుసుకొనేవాళ్లము. పుట్టింట్లో ఉన్న బంధుదత్తను తీసుకొని వెళ్లడానికి భర్త వరాహదత్తుడు వచ్చాడు. బంధుదత్త చెలికత్తెతో "చెలీ! నేను వెళ్లక తప్పదు. మానాన్న నన్ను తీసుకు పొమ్మని అల్లుడికి చెప్పినాడు. సోమస్వామి

నాప్రియుడు. ఆతన్ని వదిలి నేను జీవించలేను. ఏమి చెయ్యను!" అని దీనముగా పలికింది. సుభాశయ అనే ఆచెలి "నాకు మంత్రప్రయోగాలు రెండు తెలుసు. ఒకదాన్ని ఉచ్చారణ చేసి మెళ్ళో సూత్రము కడితే ఆమనిషి కోతి అవుతాడు. రెండోమంత్రమువల్ల సూత్రము విప్పితే మనిషి అవుతాడు. కోతిగా ఉన్నప్పుడు పూర్వప్రజ్ఞ పోదు. నీకు ఇష్టమైతే సోమస్వామిని కోతిపిల్లను చేస్తాను. నీప్రియుణ్ణి ఆటకోతి అనే మిష మీాద అత్తవారింటికి మధురానగరము తీసుకొని వెళ్ళు. ఆ మంత్ర ప్రయోగాలు నీకు నేర్పుతాను. బహిరంగంగా ఇతనిని కోతిగా ఉంచుకొని రహస్యంగా పురుషుణ్ణి చేసి సుఖము అనుభవిస్తూ ఉండు" అని సలహా ఇచ్చింది.

రహస్యముగా బంధుదత్త నామెళ్ళో మంత్రసూత్రము కట్టి నన్ను కోతిని చేసింది. నన్ను భర్తదగ్గిరికి తీసుకొనివెళ్ళి అతనితో చెలికత్తె వినోదార్థము ఆటవస్తువుగా ఇచ్చిందని చెప్పింది. బంధుదత్త భర్త వరాహదత్తుడు కోతిపిల్ల అయిన నన్ను చూసి సంతోషించినాడు. నేను స్త్రీల చాతుర్యాన్ని తలుచుకొని ఆశ్చర్యపడుతూ కోతిగానే ఉన్నాను. మన్మథుడివల్ల వికారము పొందనివా ళ్ళెవరు?

బంధుదత్త చెలిదగ్గిర మంత్రాలు నేర్చి భర్తతో మధురాపురికి బయలుదేరింది. తోవలో నేను నౌకరుబుజాన ఎక్కినాను. రెండు మూడు దినాలకు కోతులు ఉన్న గొప్ప అడివిలో ప్రవేశించాము. నన్ను చూసి కోతులు కిచకిచ లాడుతూ ఒక్కొక్కటి వచ్చి నన్ను మోస్తున్న నౌకరును కరవసాగినవి. వాడు బాధ పడలేక నన్ను వదిలేసి పారిపోగా, కోతులు నన్ను తీసుకొనిపోయినవి. నామీాద అనురాగమువల్ల, బంధుదత్త ఆమెభర్త నౌకర్లూ రాళ్ళతో కోతులను కొట్టినారు. కోతులతో విసుగుపుట్టి వాళ్లు వెళ్ళిపోగా కోతులు నన్ను గోళ్లతో రక్కి దంతములతో కరిచి నాశరీరముమీాది రోమములు

పీకివేసినవి. నాకంఠసూత్రప్రభావమువల్ల శివస్మరణవల్ల నాకు ప్రాణ కలిగింది. తక్కిన కోతి మూకలోనుండి తప్పించుకొని నేను చెట్లాకుల గుబురులో దూరి అరణ్యమునుంచి అరణ్యానికి దాటుతూ ఇక్కడికి వచ్చాను. పరదారాభిగమనము పరమపాతకము. ఆ కర్మఫలము ఎప్పుడో కాక ఈజన్మలోనే అనుభవించాను. బంధుదత్త దక్కలేదు. కోతినై మానవరూపాన్ని పోగొట్టుకొన్నాను. నావిధికి విచారిస్తూ తిరుగుతూ ఉండగా బ్రహ్మదేవుడు అంతటితో ఊరుకోక గోరుచుట్టు మీద రోకటిపోటులాగ మరొకకష్టము తెచ్చిపెట్టాడు. హఠాత్తుగా పిడిఏనుగు వచ్చి నన్ను తొండముతో పట్టుకొని వానకు తడిసి ముద్దగా ఉన్న పాములపుట్టలో పాతివేసింది. ఆగజము దేవత కాబోలు. అది నన్ను పుట్టలో పాతిపెట్టడంవల్ల ఇవతలికి రాలేక చచ్చీ చావకుండా ఉండి శివధ్యానము చేస్తున్నాను. ఈబురదలోనుంచి నీవు నన్ను లేవ తీసేదాకా నాకు ఆకలి దప్పికలు లేవు. నాకు పూర్వజ్ఞానము ఉన్నప్ప టికీ ఈమర్కటరూపాన్ని పోగొట్టుకొనేశక్తి లేదు. ఎవ రయినా సిద్ధు రాలు మంత్రోచ్చారణ చేస్తూ నాకంఠసూత్రాన్ని విప్పితే నేను మానవుణ్ణి అవుతాను. ఇదీ సంగతి. ఈఅగమ్యమైన అరణ్యానికి నీవు రావలసిన పని ఏమిటి?

సోమస్వామి కోతిరూపములో తనసంగతి పూసగుచ్చినట్టు చెప్పగా నిశ్చయదత్తు తాను విద్యాధరకన్యకోసము ఉజ్జయినినుంచి బయలు దేరి, తోవలో యక్షిణీసహాయమువల్ల ఇక్కడికి చేరా నన్నాడు. కోతి నిశ్చయదత్తుకు జ్ఞానము కలిగించే మాటలు అంటున్నది. "నామాదిరి నీవుకూడా స్త్రీమూలంగా దుఃఖము అనుభవిస్తున్నావు. శ్రీకి, స్త్రీలకు చాపల్యము సహజము. స్త్రీలు సంధ్యాకాలమువలె క్షణరాగిణులు, నదులవలె కుటిలాశయులు, భుజగులవలె అవిశ్వాస్యలు. విద్యుల్లతలవలె చంచలలు. విద్యాధరి ఎవరినో స్వజాతివాణ్ణి మోహించి నిన్ను

మోసము చేస్తుంది. మిత్రమా, నా మాట తోసివెయ్యక పుష్కరావతీ పురానికి వెళ్లకు. మీ ఉజ్జయినికి వెళ్ళు. నేను వరదారవల్ల పరమసుఖము అనుభవించా లని భ్రమసి ఆప్తవాక్యము వినక అన్నికష్టాలూ అనుభవిస్తున్నాను. బంధురక్తుపై మనసున్న నాకు భవశర్మ అనే మిత్రుడు హితము బోధించినాడు: "సోమస్వామి! ఆడదానికి లొంగిపోవద్దు. స్త్రీబుద్ధి దురవగాహము, అందుకు స్వవిషయము చెపుతాను:

## దుక్కిటెద్దు అయిన భవశర్మ కథ

కాశీనగరములో వడుచుదనములో సోమద అనే బ్రాహ్మణస్త్రీ చాటుగా అందాన్ని అమ్ముకొని జీవిస్తున్నది. నాకు విధివశాన దానితో సమాగమము కలిగింది. రుచి మరిగి దాన్ని విడవలేకపోవడమువల్ల క్రమేణా సోమదమీద ప్రీతి ఏర్పడ్డది. ఒకసారి కోపముతో దాన్ని ఒక్క తన్ను తన్నినాను. నా కోపానికి తాళలేక నా కంఠానికి పాశము తగిలించింది. వెంటనే నేను దుక్కిటెద్దును అయినాను. ఆమె తనకు తోచిన ధరకు నన్ను లొట్టిపిట్టల వర్తకుడికి అమ్మివేసింది. ఆ వర్తకుడు నాచేత బరువులు మోయిస్తూ కష్టపెడుతున్నాడు. బంధమోచనిక అనే సన్యాసిని జ్ఞానప్రభావంవల్లి నాగతి గ్రహించి, నా యజమాని లేని సమయము చూచి నా కంఠపాశాన్ని తెంపివేసింది. వెంటనే మనిషిని అయినాను. వర్తకుడు ఎద్దుకోసము వాడవాడల వెతికినాడు. నేను బంధమోచనితో వెడుతూ ఉండగా సోమద చూచి కోపముతో మండిపడుతూ "ఈపాపిని పశుత్వమునుంచి ఎందుకు విడిపించావు? పాపాత్మురాలా! ఈదుర్మార్గానికి ఫలము నీవే అనుభవిస్తావు! మీ ఇద్దర్నీ రేపు కడతేరుస్తాను" అని బెదిరించింది. బంధమోచని అందుకు కసి తీర్చుకోవలె నని నాతో "నన్ను చంపడానికి ఇది నల్లగోడిగా వస్తుంది. నేనూ అలాగే పశువునై దానితో యుద్ధము చేస్తాను. ఆసమయములో

నీవు కత్తి దూసి సోమదను నరికివెయ్యి. రేపు ఉదయాన నీవు మా ఇంటికి రావాలి” అని చెప్పింది. నేను కత్తి పుచ్చుకొని తెల్లవారగానే ఆ మెయింటికి వెళ్ళాను. ఆసమయములో సోమద నల్లని కోడిగగా వచ్చింది. బంధమోచని ఎర్రని పశువై దంతాలతో సోమదతో హోరాహోరిగా పోరాడుతున్నది. నేను కత్తి దూసి సోమదను కొట్టినాను. బంధమోచనిక కసికొద్దీ దాన్ని చంపివేసింది. నాకు భయము తీరింది. పశుత్వము వదలిపోయి మానవత్వము స్థిరముగా ఉన్నది. పరదారల మీదికి పాడుమనసును పోనీయక నిరోధించాను. స్త్రీలకు చాంచల్యము, సాహసము, మాయలు అతిసహజములు. అందువల్ల బంధుదత్త శాకిని, మాయలాడి. దానికి భర్తమీద ప్రేమలేనిదే నీమీద ఉంటుందా ?

ఇలా భవశర్మ నాకు హితము ఎంత చెప్పినా పెడ చెవిని పెట్టి పడరానిపాట్లు పడుతున్నాను. అందువల్ల కాచి వడపోసిన అనుభవముతో చెపుతున్నాను. నీవు అనురాగపరను ప్రేమించటం, దానికి స్వజాతివాడు దొరికితే నిన్ను తప్పక వదిలేస్తుంది. తుమ్మెద రకరకాల కుసుమాల మీదికి వెళ్ళినట్టు, ఆమ త్తకాశిని ఎప్పుడూకొత్తవాణ్ణి కోరుతూ ఉంటుంది, నామాదిరిగా నీవుకూడా పశ్చాత్తాపము అనుభవిస్తావులే!

ఇలా కోతిరూపములో ఉన్న సోమస్వామి ఎంత చెప్పినా అనురాగభరమైన నిశ్చయదత్తుని మనసులో చొరలేదు. పైగా నిశ్చయదత్తు స్త్రీ స్వభావములో విశ్వాసము ఉంచుకొని “శుద్ధవిద్యాధర వంశములో జన్మించినకన్య నన్ను మోసము చెయ్యదు,” అని పలికినాడు.

సూర్యుడు నిశ్చయదత్తుని ప్రియాభిలాషివలె సంధ్యారక్తుడై క్రమముగా అస్తమించినాడు. చీకటి పడగా శృంగోత్పాదిని నిశ్చయదత్తు దగ్గిరికి వచ్చింది. కోతి తనను మరవవద్దని అతన్ని వేడుకోగా అతడు యక్షిణిబుజ మెక్కి పుష్కరావతీపురము చేరినాడు. నిశ్చయదత్తుని రాక ‘విద్యాధరకన్య అయిన అనురాగపర నిజవిద్యాప్రభావము వల్ల

గ్రహించింది. యక్షిణి అతన్ని దింపి వెళ్ళిపోగా, అనురాగపర చిరాత్సు క్యము వల్ల సంభ్రమముతో నిశ్చయదత్తును గాఢాలింగనము చేసు కొన్నది. ప్రియులు ఆలింగనములో దేహాలు మరచినారు. ఆమె గాంధర్వపద్ధతిగా అతనికి భార్య కాగానే అంద మైనపట్టణాన్ని అక స్మాత్తుగా నిర్మించింది. అనురాగపర అన్యు లెవ్వరికీ అగపడక ఆపుర ములో అతనితో అనేకభోగాలు అనుభవిస్తున్నది. నిశ్చయదత్తు తాను పడినపాట్లు ప్రియురాలిదగ్గిర ఏకరువు పెట్టి స్తిమితచిత్తు డైనాడు. అతడు కోతి అయిన సోమస్వామి సంగతి ఆమెకు చెప్పినాడు. అతడు "ప్రేయసీ! నామిత్రుణ్ణి మానవుణ్ణి చెయ్యి; ఆకోతిరూపము పోగొట్టు. పుణ్యము దక్కుతుంది." అని ప్రియురాలిని కోరినాడు.

"ఈపని సన్యాసినివల్ల కావాలి. నాదగ్గిర బుధరూప అనేసిద్ధురాలికి మంత్రా లన్నీ తెలుసును. ఆమె సహాయమువల్ల సాధించి నీమిత్రుణ్ణి మానవుణ్ణి చేయిస్తాను" అని అనురాగపర అన్నది.

దత్తు సంతోషపడి ఆమెఅంకతలాన ఆసీనుడై గగనమార్గాన ప్రయా ణము చేసి కోతి ఉన్న వనానికి వెళ్ళినాడు. భార్యాభర్తలు ఆకోతిని కుశలము అడిగినారు. కోతిరూపములో ఉన్నసోమస్వామి "అనురాగ పరతో కూడా వచ్చావు. నాకు కుశలమే" అంటూ నిశ్చయదత్తునీ అతని భార్యనూ ఆశీర్వదించినాడు. అందరూ రమణీయశిలాతలాన ఆసీను లయినారు. కొంతసేపు వాళ్ళు గోష్ఠిసలిపినారు. నిశ్చయదత్తు కోతిదగ్గిర సెలవుతీసుకొని భార్యఒళ్ళో కూర్చొని ఆకాశమార్గాన పుష్క రావతీపురము వెళ్ళినాడు.

మర్నాడు నిశ్చయదత్తు కోతిదగ్గిరికి వెళ్ళా లని అనుకొన్నాడు. భార్య రావడానికి వీలుపడ దని అతనికి ఉత్పతన అవతరణ విద్యలు ఉపదేశించింది. విద్యాప్రభావమువల్ల అతడు ఆకాశమార్గాన కోతి దగ్గిరికి వెళ్ళి చాలాసేపు గోష్ఠిచేసినాడు.

ఈసమయములో అనురాగపర గృహోద్యానములో కూర్చుని ఉండగా విద్యాధరకుమారుడు గగనతలాన విహరించి ఆమెఅందాన్ని చూచి వలచి విద్యాధరి అనీ మానవుణ్ణి పెళ్ళాడిన దనీ గ్రహించి వనములో దిగినాడు. ఆ అందగాణ్ణి అనురాగపర చూచి "ఎవరు నీవు?" అని ప్రశ్నించింది. అతడు "నేను విద్యాధరుణ్ణి. ప్రజ్ఞాశాలిని. నన్ను రాగభంజను డని పిలుస్తారు. నిన్ను చూచి మోహించినాను. నీతండ్రికి చెప్పక నన్ను అనుభవించు" అని పలికినాడు. విద్యాధరీ విద్యాధరుల చూపులు ఏక మైనవి.

కొంతసేపటికి విద్యాధరుడు వెళ్ళిపోగా, నిశ్చయదత్తుడు సోమస్వామి (కపిమిత్రుని) వద్ద సెలవు తీసుకొని అనురాగపరదగ్గిరికి వచ్చినాడు. భర్త రాగానే అదివరకు ఆమె ఆలింగనముతో అతన్ని ఆదరించేది. ఇవాళ అనురాగపర తల నొప్పిగా ఉన్న దని వంక పెట్టింది. నిశ్చయ దత్తు అమాయికముగా తనప్రేయసికి స్వస్థత లే దని తలచినాడు. ఆరోజల్లా అతడు విచారముతో గడిపి మర్నాడు ఉదయాన్నే నిజ విద్యామహిమవల్ల కోతిదగ్గిరికి వెళ్ళినాడు. నిశ్చయదత్తు వెళ్ళడంచూచి విద్యాధరుడు రాత్రి అనురాగపరను కూడకపోవడమువల్ల, జాగరణ చేసి ఆమెకోసము వచ్చినాడు. ఆమె రాత్రల్లా విరహముతో వేగిపోయి, విద్యాధరుణ్ణి చూచి కంఠాలింగనము చేసింది. ఇద్దరూ కేళీసుఖము అనుభవించారు. అతడు సురతాంతములో విద్యాధరివొళ్ళో కూచుని కన్ను మూసినాడు. భర్త చూస్తే బాగా ఉండదని ఆమె గ్రహించి తనమాయాశక్తిచేత విద్యాధరుని దాచి, మేలుకొని ఉండడమువల్ల తాను ఒళ్ళెరగక నిద్రపోయింది.

ఈలోగా నిశ్చయదత్తు కోతిగా ఉన్న సోమస్వామి దగ్గిరికి వెళ్ళి నాడు. ఉభయులూ కుశలప్రశ్నలు వేసుకొన్నారు. సోమస్వామి మిత్రుణ్ణి "ఏమి, ఈరోజు కులాసాగా లేవు?" అని అడిగినాడు. నిశ్చయ

దత్తు "అనురాగపర అస్వస్థతగా ఉంది. ఆమె నాకు ప్రాణాధిక. అందు వల్ల నాకు విచారముగా ఉన్నది." అని సమాధానము ఇచ్చినాడు. సోమస్వామి జ్ఞాని కనుక దత్తుతో "మిత్రమా! పోయి అనురాగపరను ఒళ్ళో కూర్చోపెట్టుకొని ఇక్కడికి రా. నీకు చిత్రము చూపిస్తాను." అని చెప్పినాడు. నిశ్చయదత్తు ఆకాశాన ఎగిరి పుష్కరావతీపురము వెళ్ళి అనురాగపర నిద్రిస్తూఉండగా సోమస్వామిదగ్గిరికి తీసుకొని వచ్చి నాడు. ఆమెఒళ్ళో నిద్రిస్తున్న విద్యాధరుడు అదృశ్యరూపుడై ఉన్నందు వల్ల నిశ్చయదత్తు అతన్ని చూడలేకపోయినాడు. దివ్యదృష్టిచేత సోమ స్వామి అనురాగపర ఒళ్ళో ఉన్నవాడువిద్యాధరుడని గ్రహించి, ఒక యోగాన్ని దత్తుకు ఉపదేశించినాడు. నిశ్చయదత్తు ఆమంత్రయోగము వల్ల కంఠాలింగనతత్పరుడై నిద్రిస్తున్న విద్యాధరుణ్ణి కాంచి తెల్లపోయి క్రోధముతో మండిపడ్డాడు. విద్యాధరుడు అదిగ్రహించి అదృశ్యరూపుడై ఆకాశాన ఎగిరినాడు. నిశ్చయదత్తు కళ్ళవెంట నీళ్ళు గిరున తిరిగినవి. ఆమెతో "పాపినీ, నమ్మినవాణ్ణి ద్రోహము చేస్తావా? ఆడవాళ్ళమనసు పాదరసమువలె చంచలము!" అని నిశ్చయదత్తు కేకలు వేసేసరికి అను రాగపర ఆకాశమార్గాన ఇంటికి వెళ్ళిపోయింది.

సోమస్వామి "నేను చెప్పింది నీతలకు ఎక్కింది కాదు. నీవు ప్రేయసి కోసము కష్టాలు పడ్డావు. తీవ్రమైనఅనురాగవహ్నికి ఈతాపమే ఫలము. సంపదలూ, స్త్రీలూ చంచలములు. విధిరాతను ఎవరు చెరప గలరు?" అన్నాడు. నిశ్చయదత్తుడు విరక్తితో మహేశ్వరుని శరణు జొచ్చినాడు. అక్కడ అరణ్యములో మోక్షద అనేసిద్ధురాలు కనబడితే దత్తు ఆమెపాదాలమీద ప్రణమిల్లి సోమస్వామికి వచ్చినకష్టములు ఆ తాపసికి చెప్పి "భగవతీ! నీకు మంత్రతంత్రాలు తెలిస్తే మంత్రో చ్చారణ చేస్తూ నామిత్రునికంఠపాశాన్ని విప్పు. అప్పుడు ఈకోతి మానవుడు అవుతాడు." అని వేడుకొన్నాడు. అదే రీతిగా ఆతాపసి

నెరవేర్చగా కోతిరూపముపోయి సోమస్వామిగా పూర్వరూపాన్ని ధరించి నాడు. ఆసన్యాసిని మెరుపుతీగలా అదృశ్యురా లైనది. అనంతరము వా ళ్ళిద్దరూ తపస్సు చేసి శ్రేయస్సు పొందినారు.

ఈరీతిగా స్త్రీలు స్వభావచపలలు. వారికౌటిల్యమువల్ల పురుషులు విరక్తులు అవుతారు. ఆకాశానికి చంద్రుడువలె పతివ్రత కులానికి తేజస్సు నిచ్చి ప్రతిష్ఠ తీసుకు రావడము అరుదు.

ఇలా గోముఖుడు చెప్పినకథను రత్నప్రభా నరవాహనదత్తులు వీనుల విందుగా విని సంతోషించినారు.

## త ర ం గ ము : 39

## మదనమాల కథ

గోముఖుడు చెప్పినకథకు యువరాజు సంతోషించగా మరుభూతి శ్రద్ధతో "దేవా! స్త్రీలు సహజముగా చంచలస్వభావలు; అయినా అందరూ అటువంటివారు కారు. వేశ్యలలోనే మంచివాళ్లు ఉండగా, ఇతరులమాట వేరే చెప్పవలెనా? నేను చెప్పేది విను" అని కథ మొదలు పెట్టినాడు.

పాటలీపుత్రమును విక్రమాదిత్యు డనేరాజు పరిపాలిస్తూ ఉన్నాడు. అతని స్నేహితులు అశ్వపతి, గజపతి, అనేవాళ్లు. నరపతిఅనే ప్రతిష్ఠాన పురరాజుకు చాలా కొల్బలము ఉన్నది. విక్రమాదిత్యునకు నరపతి శత్రువు కావడమువల్ల, శత్రువునుజయించి అతనిని తన ద్వారపాల కునిగా చేసుకోవలె నని శపథముచేసినాడు. అతడు గజాశ్వసేనా సమూహముతో సామంతులతో నరపతి నరసింహరాజుమీదికి దాడి చేసినాడు. ఇద్దరికీ పోరు ఘోరముగాజరిగింది. పదాతులు గజాశ్వము లతో సమముగా యుద్ధము చేసినారు. నరసింహరాజుపదాతులు

కోటిమంది విక్రమాదిత్యుని హయగజాలను నాశనము చేసినాడు. విక్రమాదిత్యుడు అపజయముతో పాటలీపుత్రమునకు పోయినాడు. నరసింహరాజు విజయలక్ష్మిని వరించి, వందిమాగధులు కైవార ములు సలుపుతూ ఉండగా నిజరాజధాని చేరినాడు. విక్రమాదిత్యుడు "శస్త్రసాధ్యుడు కానిశత్రువును ప్రజ్ఞా ప్రభావముచేత జయిస్తాను. నాప్రతిజ్ఞ జవదాటను" అని నిశ్చయబుద్ధితో రాజ్యాన్ని యోగ్యు లైనఅమాత్యులకు అప్పగించి రహస్యముగా బుద్ధివరుడు అనే ప్రధాన మంత్రితో, రాజపుత్రులతో, అయిదుగురు శూరులతో కూడి తాను సన్యాసివేషము ధరించి శత్రునగరానికి వెళ్ళి అక్కడ మదనమాల అనే వేశ్యఇంటికి పోయినాడు.

మదనమాలామందిరము రాజహర్మ్యమువలె ఉన్నది. ఆగృహ ప్రాకారాలమీద జెండాలు పిల్లతెమ్మెరలకు కదులుతూ ఉన్నవి. తూర్పుద్వారమున ఇరవైవేలమంది ఆయుధపాణులు పదాతులు అహో రాత్రాలు కాపలా కాస్తున్నారు. తక్కిన ప్రతిద్వారముదగ్గిర పదివేల మంది శూరులు పహరా ఉన్నారు. ప్రతీహారులు లోపలికి వెళ్ళి చెప్పగా విక్రమాదిత్యుడు మందిరాంతఃప్రవేశము చేసినాడు. ఆనగరుకు ఒకవైపు ఉత్తమాశ్వములు, ఒకవంక గజసమూహము, మరొకతావున ఆయుధశాలలు, ఒకవైపు రత్నకాంతులతో ప్రకాశించే కోశాగార ములు, ఒకపక్క సేవకవర్గము, మరొకతావున కైవారములు చేస్తున్న వందిమాగధులు, ఒకప్రదేశమున మృదంగస్వనాలు ఈవిధముగాఉన్నవి. ఆనగరు ఏడుకక్ష్యలుగా విభక్తమైనది. విక్రమాదిత్యుడు పరివారముతో కక్ష్యాంతరాలు దాటి మదనమాలా వాసగృహమునకు వెళ్ళినాడు. మదనమాల అతనికి ఎదురుగా వచ్చి గౌరవించి ఉచితాసనముమీద కూర్చోబెట్టింది. దానిఅందచందాలు చూచి అతడు ఆశ్చర్యపడి తా నెవరో మదనమాలకు చెప్పక ఆమెను స్తుతి చేసినాడు. ఆమె స్నాన,

అనులేపనములతో వస్త్రాలంకారాలతో అతన్ని మన్నన చేసి అతని పరివారానికి దినభత్యము ఇచ్చి, అతనినీ అతనిమంత్రినీ ఆహారాలతో ఉపచరించి, పగటివేళ గోష్ఠీపానాదులతో గడిపింది. రాత్రి అతనికి మదనమాల శరీరాన్ని అర్పించింది. విక్రమాదిత్యుడు అక్కడ ఆరీతిగా ప్రచ్ఛన్నముగా ఉంటున్నాడు.

విక్రమాదిత్యునితో మదనమాల సుఖానుభవము పొంది ధన్యురాలైనట్టు తలచి ఇతరపురుషపరాఙ్ముఖి అయినది. నరపతి నరసింహరాజు అప్పుడప్పుడు ఆమెదగ్గిరికి వస్తూ పోతూ ఉండేవాడు. నరసింహరాజును యుక్తులచేత ఇంట్లోనుంచి పంపిస్తున్నది. ఒకసారి విక్రమాదిత్యుడు బుద్ధివరుడనేమంత్రితో ఇలా పలికినాడు: "వేశ్యలు ధనాన్ని దాహం తాగుతారు. ధన మివ్వనిదే వాళ్ళకు అనురాగము అంకురించదు. ఈమదనమాలకు లోభములేదు. ఈమె ధనము ఖర్చుచేస్తూ పైగా అతిస్నేహముతో మమ్మల్ని చూస్తున్నది. దీనికి ప్రత్యుపకారము ఏమి చెయ్యను? ప్రత్యుపకారముతోపాటు నాప్రతిజ్ఞకూడా నెరవేరాలి."

మంత్రి "దేవా! ప్రపంచబుద్ధి అనేసన్యాసి మీ కిచ్చినఅమూల్యరత్నాలను మదనమాలకు ఇవ్వండి" అని సలహా ఇచ్చినాడు.

రాజు "మహార్ఘరత్నాలు దానికి ఇచ్చినా అది ప్రత్యుపకారము కాదు" అన్నాడు. మంత్రి "దేవా! ఆసన్యాసి మిమ్మల్ని ఎందుకు అలా సేవించాడో చెప్పండి" అని కుతూహలముగా అడగగా రాజు చెపుతున్నాడు:

పూర్వము పాటలీపుత్రములో ప్రపంచబుద్ధి అనే భిక్షువు రోజూ నాదగ్గిరికి వచ్చి ఒక్కొక్క పెట్టె ఇస్తూ ఉండేవాడు. సంవత్సరంపాటు నేను పెట్టె తెరవక కోశాధ్యక్షుని చేతికి ఇస్తూ వచ్చాను. ఒకనాడు నాచేతుల్లోనుంచి పేటిక జారిపడి బద్దలు కాగా భిక్షువుహృదయము అనిపించే అద్భుతరత్నము వెలువడింది. నేను పేటిక లన్నిటినీ తెప్పించి

తెరిపించి రత్నాలు పైకి తీయించాను. ఆసన్యాసిని అడిగాను "ఎందు కిలా రత్నాలిచ్చి నన్ను ఆశ్రయిస్తావు" అని.

భిక్షువు "వచ్చే కృష్ణచతుర్దశినాడు మహాశ్మశానములో నేను విద్య సాధిస్తాను. మహావీరులసహాయమువల్ల ఎటువంటిసిద్ధు లయినా సాధించ వచ్చు. మీ రందుకు సహాయము చెయ్యాలి" అని కోరగానే నేను అంగీకరించాను. అతడు సంతోషముతో వెళ్ళిపోయినాడు. కృష్ణచతుర్దశి నాడు శ్రమణునివాక్యము స్మరించి ఆహ్నికక్రియలు పూర్తిచేసి, ప్రదోష కాలములో సంధ్యా వందనాదికము చేసి, దైవవశాన కంటిమీదికి కునుకు రాగా స్వప్నములో గరుడవాహనముమీద లక్ష్మీదేవితో శ్రీహరి వేంచేసినాడు. విష్ణువు నాకు ఇలా ఆజ్ఞ ఇచ్చినాడు: "ఈ ప్రపంచబుద్ధి అనర్థనాశ ధేయుడు. వీడు మండలార్చన చేసి నిన్ను బలి ఇస్తాడు. వీడు శ్మశానములో ఏపని చెబితే ఆపని నీవు చేయకు. ముందు నువ్వు చేసి చూపించు అని వాణ్ణి అడుగుతూ ఉండు. అప్పుడు వాడు అలాగే తాను చేసి చూపుతాడు. సమయముచూసి వాణ్ణి హత మార్చు. నాడు కోరినకోరిక నీకు సిద్ధిస్తుంది" అని అంతర్ధానమైనాడు.

శ్రమణుడు ఆలాగే తాను చెప్పింది ముందు చేసి చూపుతున్నాడు. నేను సమయము చూచి కత్తిదూసి భిక్షువుశిరాన్ని ఖండించినాను. అశరీరవాణి ఆకాశమునుంచి "రాజన్! మంచిపని చేశావు! పాపాత్ముణ్ణి బలి చేశావు. వీడు కోరినఖేచరీసిద్ధి నీకు కలిగింది. అందువల్ల నీవు స్వేచ్ఛగా గగనసంచారము చేయవచ్చును. నీధైర్యసాహసాలను నేను మెచ్చుకొన్నాను. నన్ను కుబేరుడని అంటారు. నావల్ల నీకు ఉపకారము కావలిస్తే చెప్పు" అని పలుకగా కుబేరునితో నేను "స్వామీ! స్మరించినమాత్రాన మీరు నాకోరిక సఫలము చేయవేడుతున్నాను" అని వేడినాను. కుబేరుడు తథాస్తు అని అంతర్ధాన మైనాడు. నేను సిద్ధి పొంది రాజధానికి వెళ్ళి నీకు జరిగిన దంతా చెప్పాను. ఈ ఉపాయము

చేత మదనమాలకు ప్రత్యుపకారము చేస్తాను. బుద్ధివరుడా! ప్రచ్ఛన్నస్థలిలో ఉన్న ఈరాజపుత్రులను తీసుకొని పాటలిపుత్రానికి వెళ్లు. సా॥ ప్రియుతమకు ఉపకారము చేసి, అక్కడికి వచ్చి తిరిగి ఇక్కడికి వస్తాను.

విక్రమాదిత్యుడు పరివారసమేతముగా మంత్రిని పాటలిపుత్రము పంపివేసినాడు. రాజు కలగబోయేవియోగాన్ని స్మరించి విచారించి రాత్రి మదనమాలతో సుఖముగా గడిపినాడు. అతడు వెళ్ళిపోతాడేమోనని మదనమాలహృదయము పలికింది కాబోలు. ఆమె ప్రియుణ్ణి పదే పదే కౌగలించుతూ రాత్రి నిద్ర పోలేదు. తెల్లవారింది. రాజు ఉదయాన్నే నిత్యనైమిత్తికకర్మలు జరిపి దేవతార్చనా మందిరములో ప్రవేశించి కుబేరుణ్ణి స్మరించేసరికి ధనదుడు దర్శనము ఇవ్వగా "దేవా, పూర్వము ఇచ్చిన వరంప్రకారము నాకు అక్షయసువర్ణపురుషులను అయిదుగురను ఇవ్వండి. వారిఅవయవాలు నరికి ఉపయోగించినా మళ్ళీ అవయవాలు పుడుతూ ఉండవలె" అని ప్రార్థించినాడు. కుబేరుడు అంగీకరించి అదృశ్యుడైనాడు.

రాజు దేవతార్చనాగృహములో అయిదుగురు సువర్ణమయపురుషులను చూచి ఆశ్చర్యపడి, గగనమార్గాన పాటలిపుత్రానికి వెళ్ళినాడు. అతడు తనశపథముమాత్రము మరచిపోలేదు. అక్కడ రాజు కొన్నాళ్ళు రాజకార్యాలు చూస్తూ మనసుమాత్రము ప్రతిష్ఠానపురము మీదనే ఉంచినాడు.

ప్రియుడు దేవతార్చనామందిరములోనుంచి ఇవతలకు రాడేమని మదనమాల వచ్చిచూసింది. ఆమె సువర్ణమయపురుషులను చూచి, విచారిస్తూ 'నిజముగా నాప్రియుడు గంధర్వుడో, విద్యాధరుడో అయి ఉంటాడు. నాకు బంగారుమనుష్యుల్ని ఇచ్చి ఆకాశాన ఆయన వెళ్ళిపోయినాడేమో! నాప్రియుడు లేకుండా ఈసువర్ణ మెందుకు!' అని అనురాగముతో విచారించి పరివారసఖీజనాన్ని అడిగింది. ఆమె మందిర

మంతా ప్రియునికోసము వెతికి పొర్లిపొర్లి వచ్చేదుఃఖాన్ని ఆపుకోలేక కన్నీరుమున్నీరుగా ఏడ్చింది. ఆరమణీయమందిరము, మందిరోద్యానము ప్రీతిదాయకములు కాకపోవడము వల్ల, మదనమాల శరీరాన్ని త్యజించా లని నిశ్చయించుకొన్నది. ఒకచెలికత్తె "దేవీ! దిగులు పడకు. ప్రియుడు నీదగ్గిరికి రాకపోడు" అని ఆశ కొలిపి ఆమెను ఓదార్చింది. ఆవేశ్యాంగన స్తిమితపడి "ఆరునెలలలో ఆయన రాకపోతే నేను సర్వస్వమూ దాన మిచ్చి అగ్నిప్రవేశము చేస్తాను" అని శపథము చేసింది. మదనమాల ప్రియుణ్ణి ధ్యానిస్తూ దానధర్మాలు పుష్కలముగా చేస్తున్నది. బంగారుబొమ్మలలో ఒకనిచెయ్యి తెగగొట్టి విప్రులకు దానము చేసింది. మర్నాడు ఆపురుషునికి చెయ్యి మొలిచింది! మదనమాల ఆశ్చర్యానికి మేర లేదు. తక్కినవాళ్ళ బంగారుబుజాలుకూడా కొట్టించి ఆమె బ్రాహ్మణులకు దానము చేసింది. ఆసువర్ణవిగ్రహాలకు యథాప్రకారము సువర్ణబాహువులు వచ్చినవి. మదనమాల నిత్యమూ, వేదాధ్యయనతత్పరులైన విప్రులకు కీ లెరగని దానములు చేస్తున్నది.

ఆమెకీర్తి అన్నిదేశాలకూ పాకింది. పాటలీపుత్రములో నాలుగు వేదాలూ అధ్యయనము చేసినసంగ్రామదత్తుడు అనేదరిద్రబ్రాహ్మణుడు మదనమాలదగ్గిర సువర్ణదానము పట్టవలె నని వచ్చి ద్వారపాలకుని ద్వారా ఆమెకు కబురుచేసి, మందిరాంతఃప్రవేశము చేసినాడు. మదనమాల విరహాతిశయమువల్ల చిక్కి సగమై విప్రుణ్ణి పూజించి, అతడుఅధ్యయనము చేసినవేదాలు ఎన్నో అన్నిబంగారు బాహువులను అతనికి దాన మిచ్చింది. సంగ్రామదత్తుడు మదనమాలవృత్తాంతము ఆకళింపుచేసుకొని, ఆమెశపథము విని, బంగారుబాహువులను లొట్టిపిట్టలమీద వేసి పాటలీపుత్రానికి వెళ్ళినాడు. "రాజు కాపాడకపోతే ఈబంగార మంతా ఏపాయిలో పొయ్యేను" అని అతడు అనుకొని రాజసన్నిధానానికి వెళ్ళి మనవిచేశాడు: "రాజన్! నేను బ్రాహ్మణ్ణి.

ఈపురవాసిని. నరసింహరాజుగారిసంస్థానములో మదనమాలకీర్తి విని దానిఇంటికి వెళ్ళినాను. ఎవరో దివ్యపురుషుడు ఆమెకు స్వర్ణవిగ్రహాలు అయిదింటిని ఇచ్చి ఎక్కడికో వెళ్ళాడట. ఎక్కడా అతని అయిపూ ఆనవాలూ లేదట. పాపము, ఆవేశ్యాంగన వియోగాన్ని భరించలేక బాధపడుతూ శరీరము వ్యర్థముగాను, ప్రాణములు విషతుల్యముగాను తలపోస్తున్నది. పరివారసఖీజనము మదనమాలను ఓదార్చగా ఆమె, 'ఆరుమాసాలలో ఆమహాపురుషుడు దర్శనము ఇవ్వకపోతే అగ్నిప్రవేశము చేస్తాను' అని ఘోరశపథము చేసింది. ఆమె చనిపోవ దలిచి బంగారము దానముచేస్తున్నది. వ్రతాలవల్ల వియోగదుఃఖమువల్ల మదనమాల పరిపాండుదుర్బలమై ఉన్నది. నేను చదివినచదువుకు ఉచితముగా యథావిధిగా నాలుగు బంగారుబొమ్మలను బహూకరించింది. ఏలినవారు దయచూస్తే నేను చక్కనియజ్ఞశాల నిర్మించి స్వధర్మానుష్ఠానము చేసుకొంటాను."

విక్రమాదిత్య భూపతి ప్రియావిరహ వృత్తాంతము బ్రాహ్మణునివల్ల విని ఉత్కంఠతో మదనమాలను స్మరించినాడు. అతడు సద్బ్రాహ్మణుని కోరిక నెరవేర్చేనిమిత్తము ప్రతీహారుని నియమించినాడు. రాజు చేసిన శపథము ఆరుమాసాలలో తీరవలెను. కనుక మంత్రులకు రాజ్యపాలనము అప్పగించి ప్రతిష్ఠానపురానికి వెళ్ళి విరహార్తిలో కృశించినదాన్ని, వెన్నెలవంటి తెల్లనిచీర కట్టినదాన్ని, విబుధులకు సంపద దానముచేసిన దాన్ని, ప్రతిపచ్చంద్రలేఖవంటి మదనమాలను ఉత్కంఠతో చూచినాడు. హఠాత్తుగా వచ్చి చిరౌత్సుక్యముతో మదనమాల అతని కంఠాన్ని పెనవేసుకొని 'అనపరాధను దయలేక ఎందుకు ఇలా వదిలివేశారు!' అంటూగద్గదకంఠముతో పలికింది. రహస్యము చెపుతానని రాజు ప్రియురాలిని గృహాభ్యంతరములోకి తీసుకొని వెళ్ళి తాను విక్రమాదిత్యుడ నన్నీ నరసింహరాజును యుక్తితో జయించడానికి తాను

అక్కడికి వచ్చినప్రతిజ్ఞ అన్నీ, శ్రమణకుణ్ణి చంపినది, కుబేరవరమువల్ల సువర్ణపురుషలాభము మొదలయిన విషయాలు సవిస్తరముగా చెప్పి నాడు. 'ప్రేయసీ! ఈనరసింహరాజుకు సేన చాలా ఉంది. దండుతో అతన్ని గెలవడము కష్టము. ద్వంద్వయుద్ధములో అతన్ని జయిస్తాను. నేలమీద తిరిగే అతన్ని ఆకాశచారనై చంపను. అధర్మయుద్ధము క్షత్రియుడు కోరడు. ఆనరసింహరాజు రాక ద్వారపాలకులూ వందిమాగధులూ నాకు చెప్పేటట్టు ప్రతిజ్ఞ చేశాను. ఇందుకు నీ సాహాయ్యము కోరుతున్నాను'' అని రాజు మదనమాలతో అనగా ఆమె తాను ధన్యురా లయినట్టు తలచి వందులకు "నరసింహరాజు నాయింటికి వచ్చేటప్పుడు మీరు ద్వారముదగ్గిర జాగ్రతగా చూస్తూ ఉండాలి. ఆయనప్రవేశించేసమయములో 'దేవా, నరసింహరాజు నీయందు అనురక్తుడూ భక్తుడూ అని చాలాసార్లు గట్టిగా పలకండి. ఈలోపల ఎవరున్నా రని నరసింహరాజు అడిగితే విక్రమాదిత్యుడు ఉన్నాడని చెప్పండి.'' అని ఆజ్ఞ ఇచ్చింది.

మదనమాల పాలికావయస్యతో "నరసింహరాజు మందిరములో అడుగు పెట్టేప్పుడు ఆటంకపరచవద్దు'' అని అనుమతి ఇచ్చింది. రాజుతో ఆమె సుఖము అనుభవిస్తూ స్వేచ్ఛగా దానధర్మాలు చేస్తూ ఉన్నది.

నరసింహరాజుకు మదనమాల దానశౌర్యము కర్ణాకర్ణిగా తెలిసింది. కొంతకాలమునుంచి నరసింహరాజు ఆమెమీద శీతకన్ను వేశాడు. అయితే సువర్ణవిగ్రహాలు ఆమె సంపాదించి దానము చేస్తున్న దని అతడు విని కుతూహలముతో మదనమాలను చూడవలె నని వచ్చి నాడు. బహిర్ద్వారముదాటి ఆయన మందిరములోకి పోతూఉండగా యావన్మంది వందిమాగధులూ ఏకకంఠముతో 'దేవా! నరసింహరాజు నీభక్తుడు, ప్రణతుడు' అని ఉచ్చైస్స్వరముతో పలికినారు. నరసింహరాజుకు అనుమానము కలిగి లోపల ఎవ రున్నారు? అని ప్రశ్నించగా వందులు విక్రమాదిత్య భూపతి అని సమాధానము చెప్పారు. అప్పుడు

నరసింహరాజు 'విక్రమాదిత్యుడు పూర్వము చేసినశపథము తీర్చుకొన్నాడు' అని ఆలోచిస్తూ ఆయనవిక్రమాదిత్యునిదగ్గిరికి వెళ్ళగా ఆయన నరసింహరాజును ఆలింగనముచేసి కుశలప్రశ్నలు వేసినాడు. ఉభయులూ కుశలప్రశ్నలువేసుకొన్నారు. మదనమాల వాళ్ళప్రక్కనే నిలవబడింది నరసింహరాజు మదనమాలను విక్రమాదిత్యునీ సువర్ణపురుషులు ఎలా వచ్చారని అడిగినాడు అతడు జరిగిన దంతా నరసింహరాజుకు చెప్పినాడు విక్రమాదిత్యుడు సత్త్వశాలి అని నరసింహరాజుగ్రహించి సేవకుడై నాడు.

అతడు పాటలీపుత్రానికి ప్రయాణ మైనాడు. విక్రమాదిత్యుని విడిచి ఉండలేక అత్యంతానురక్త అయినమదనమాల ఇల్లూ వాకిలీ బ్రాహ్మణానికి అర్పించి ప్రియునితో రాజధానికి వెళ్ళిపోయింది. ప్రియులు పాటలీపుత్రములో సుఖాలు అనుభవిస్తున్నారు.

దేవా, ఈరీతిగా వేశ్యాంగన రాణివాసమువలె నిత్యానురక్తగా ఉంటుంది. కులాంగనవిషయము వేరే చెప్పాలా? ఇలా మరుభూతివల్ల రత్నప్రభానరవాహనులు కథ విని సంతోషించినారు.

## తరంగము : 39

## గుణవరాదేవి కథ

నరవాహనదత్తునితో హరిశిఖుడు అనే సైన్యాధిపతి ఇలా అన్నాడు: నిజానికి పతివ్రతకు భర్తకన్న వేరే దైవము లేదు అందుకు తార్కాణము వినండి:

వర్ధమానపురమును వీరభుజుడనేధర్మాత్ముడైనరాజు పరిపాలన చేస్తున్నాడు. ఆయనకు నందమంది భార్యలుండగా వారిలో గుణవరాదేవి మాత్రము ప్రాణాధిక. రాణివాసములో ఎవరికీ సంతానమే లేదు.

మహారాజు ఘనవైద్యుణ్ణి పిలిపించి, 'శ్రుతవర్ధనా! సంతానము కలిగే మందూ మాకూ ఉన్నదా?' అని కుతూహలముతో అడిగినాడు. ఆ వైద్యుడు 'మందులేకేమిటి? అడివిమేకను తెప్పించండి' అన్నాడు. వీరభుజుడు ప్రతీహారుని ఆజ్ఞాపించి అడివిమేకను తెప్పించి వైద్యునికి ఇచ్చాడు. వైద్యుడు మేకను వంటవాళ్లకు అప్పగించి వంటచేయించాడు. రాజు రాణివాసాన్ని ఒకచోటికి రమ్మని కబురు చేసి దేవతార్చనకు వెళ్ళినాడు. రాణులు వచ్చారు. గుణవరాదేవి రాణివాసముతో ఉండక దేవతార్చన చేసేరాజుదగ్గిర కూర్చున్నది. రాణివాస మందరికీ వైద్యుడు అడివిమేక మాంసములో చూర్ణము కలిపి పుచ్చుకోమని ఇచ్చినాడు. గుణవరాదేవి అక్కడ లేకపోవడమువల్ల వాళ్ళు ఆమెసంగతి మరిచినారు. ఈలోగా రాజువచ్చి మాంసము యావత్తూ వినియోగము అయిందని తెలిసి వైద్యుడితో "ఏమయ్యా! గుణవరకు కొంచెమైనా మిగల్చలేదే? అసలు ఆమెకోసమే ఈయత్నమంతా. ఆమాట మరిచిపోయినావే?" అన్నాడు. వైద్యుడు తెల్లపోయినాడు. రాజు వంటవాళ్ళను పిలిచి మేకమాంసము ఇంకా మిగిలి ఉన్నదేమో అని అడిగితే కొమ్ములుమాత్రము మిగిలినవని చెప్పారు. కొమ్ములు కూడా పనికివస్తవని వైద్యుడు చెప్పి రసకముచేయించిచూర్ణము కలిపి గుణవరాదేవికి ఇచ్చినాడు.

సకాలానికి తొంబైతొమ్మిదిమంది రాణులూ పుత్రులను కన్నారు. గుణవరాదేవి ఉత్తమపుత్త్రుణ్ణి కన్నది. తల్లి శృంగమాంసరసమును పానము చేస్తే పుట్టిన పిల్లవాడు కనుక తండ్రి కొడుకుకు శృంగభుజుడు అని నామకరణము చేశాడు. పిల్లలందరిలో వయస్సులో కడసారివాడయినా శృంగభుజుడు గుణాలలో పెద్దవాడుగానే ఉన్నాడు. రూపములో మన్మథుడివలె, బలపరాక్రమములలో భీమసేనుడివలె పెరుగుతున్నాడు. గుణవరాదేవినీ, కొడుకునూ చూచి తక్కినరాణులకు

కన్నెర్రగా ఉంది. అయశోలేఖ అనేరాణి తక్కినసపత్నులతో కూడ బలుకుకొని రాజు తనదగ్గిరికి రాగా మొగమున చిన్నబోటుతో "ఆర్యపుత్రా! అన్యులదోషాలు పోగొట్టుతావు. నీదోషాన్ని తుడిచివెయ్యలేవు అంతఃపురములో ఉన్న సురక్షితుడుకీ గుణవరకూ సంబంధం కలసింది సుమా! అంతఃపురాన్ని కంచుకి రక్షించడంవల్ల మరొకడు దొరకక గుణవర సురక్షితుణ్ణి తగులుకొన్నది. ఈవిషయము నీకు కొత్త. అంతఃపురంలో అందరికీ తెలుసు" అని అన్నది. రాజు ఈర్ష్యావేశముతో రాణివాసములో వాళ్ళను అందరినీ అడిగినాడు. అంతా కూడబలుకుకొని ఉన్నందువల్ల ఒకమాటమీదనే ఉన్నారు. రాజు కోపాన్ని జయించి "ఇలాంటిసంబంధము అసంభవము. అపవాదు చూస్తే ఇలా ఉన్నది. యథార్థము తెలిసీ తెలియక నేనేమీ చెయ్యను" అని ఆలోచించి అంతఃపురరక్షకుని సురక్షితుని మర్నాడు ఆస్థానములో 'ఓరీపాపీ, నీవుబ్రహ్మహత్య చేశావని తెలిసింది. అందుచేత తీర్థయాత్రలు చేసివచ్చి నన్ను చూడు" అని శాసించాడు. వాడు విభ్రాంతితో "నే నెక్కడా బ్రహ్మహత్య చేయలేదు" అని సమాధానము ఇచ్చినా రాజు పెడచెవిని పెట్టి "గడుసుదనము నాదగ్గిర పనికిరాదు కాశ్మీర దేశానికి వెళ్ళు. విజయక్షేత్రము, పావనమైననందిక్షేత్రము, వారాహక్షేత్రము, అక్కడఉన్నవి. గంగ వితస్త అనేపేరుతో ప్రవహిస్తుంది. మడవ, ఉత్తరమానసక్షేత్రాలు అక్కడే ఉన్నవి. ఆతీర్థాలన్నీ తిరిగి పవిత్రుడవై నన్ను చూడు" అని ఆజ్ఞ చేసి వాణ్ణి దేశములోనుంచి పంపివేశాడు.

రాజు గుణావరాదేవిదగ్గిరికి వెళ్ళేప్పుడు అతనిమనస్సులో అనురాగమూ కోపమూ ఈర్ష్యావేశమూ నిండినవి. భర్తను చూచి ఆమె "ఇలాఉన్నారేమి? అని ప్రశ్నించింది. రాజు "దేవీ! ఈరోజు ఒకజ్ఞాని నాతో "రాజన్! కొద్దికాలము గుణవరాదేవిని నేలకొట్టులో పెట్టి నీవు బ్రహ్మచర్యము అవలంబించవలె. అలా చేయకపోతే నీకు రాజ్య

భ్రష్టత, ఆమెకు మారకము తప్పవు'' అని చెప్పి వెళ్ళాడు. నాకు చాలా ఖేదముగా ఉన్నది.'' అని పలికినాడు.

గుణవరాదేవి భీతురాలై 'ఆర్యపుత్రా! నన్ను వెంటనే నేలకొట్టులో పెట్టించండి. నాప్రాణాలు పోయినా సరే మీరు బాగా ఉండడమే నాకు కావలసింది. స్త్రీకి ఇహపరాలు భర్తే గద' అన్నది.

రాజు అశ్రుపూరితలోచనుడై "ఈమెలో దోషముఉన్నట్లు కనపడదు. ముఖలక్షణాలలో తప్పుచేసినదానివలె రాణి నాకు కనపడదు. అంతఃపురరక్షకుణ్ణి చూచినా ముఖభంగిమలో మార్పు ఏమీ కనపడలేదు. ఈప్రవాదము ఎందుకు పుట్టినదో నిజానిజాలు కనిపెట్టాలి' అని ఆలోచించి రాజు ఆమెను భూగృహములో ఉంచినాడు. శృంగభుజుడు తల్లిగతి తెలిసి ఖిన్నుడై రాగా రాజు భార్యకు చెప్పిన కారణాన్ని కుమారుడికే చెప్పినాడు. గుణవర రాజహితమునుకోరినది కనుక భూగృహమే స్వర్గ మని తలుస్తున్నది. పతివ్రతలకు స్వీయసుఖము లేదు; భర్తృసుఖమే వాళ్ళసుఖము.

నూరుమందిరాణులలో అయశోలేఖ నిర్వ్యాసభుజ డనేకొడుకుతో రాజు 'మనశత్రువైనగుణవరను నేలకొట్టులో పడవేసినాడు. ఆమె కుమారుడు, శృంగభుజుడు దేశములోనుంచి వెళ్ళిపోతే బాగుండును. నీఅన్నలతో ఆలోచించి శృంగభుజుణ్ణి వెళ్ళగొట్టించు. అందుకు యుక్తి ఆలోచించి అంతా ఒకమాటమీదనే ఉండండి' అని దురాలోచన చెప్పింది. నిర్వ్యాసభుజుడు అన్నలతో కూడి యుక్తి ఆలోచిస్తున్నాడు. ఒకసారి రాజకుమాళ్ళు మేడమీద భయంకర మైనకొంగను చూచి ఆశ్చర్యపడుతున్నారు. ఒకజ్ఞాని అతోవనే వచ్చి వాళ్ళతో 'రాజపుత్రులారా! ఇది కొంగ కాదు. వీడు అగ్నిశిఖుడు అనే రాక్షసుడు. వీడు బకరూపములో ఉండి సంచారము చేస్తూ అన్నిఊళ్ళనూ ధ్వంసము చేస్తూపోతాడు. బాణముతో వీణ్ణి కొట్టండి. ఒకదెబ్బ చాలు' అని సలహా

చెప్పినాడు. తొంభై తొమ్మిదిమంది రాజపుత్రులూ కొంగమీద బాణాలు ప్రయోగించారు. ఒక్కటీ కొంగకు తగలలేదు. అప్పుడు దిగంబరశ్రమణకుడు వాళ్ళతో "మీకు నేర్పు లేదు. శృంగభుజుడు కొంగను చంపి వెయ్యగలడు" అని చెప్పగా, దుష్టబుద్ధి అయిననిర్వ్యాసభుజుడు తల్లి మాట స్మరించి "శృంగభుజుణ్ణి వెళ్ళగొట్టే ఉపాయము ఇదే. ఇతనికి నాన్నగారి బంగారుధనుర్బాణాలు ఇస్తాను. ఆబంగారుబాణాన్ని రాక్షసుడు ఎత్తుకొని పోతే మేము ఆబాణముకోసము వెతుకుతాము. ఆ అంబుకోసము శృంగభుజుడు రాక్షసుడివెంట వెళ్ళి, రాక్షసుణ్ణి వెతికి శరాన్ని కనుక్కో లేక ఇటూ అటూ తిరుగుతాడు" అని నిర్వ్యాసభుజుడు తమ్ముడికి సువర్ణవికారము లయినధనుర్బాణాలు ఇవ్వగా శృంగభుజుడు విల్లు ఎక్కుపెట్టి రత్నపుంఖ మయినసువర్ణశరముతో కొంగను కొట్టినాడు. కొంగకు దెబ్బ తగిలింది. రక్తముకారుతున్నా బాణముతోనే ఆకొంగ రివ్వున పైకి ఎగిరిపోయింది. నిర్వ్యాసభుజుడు తక్కిన సోదరులకు కనుసన్న చేసి శృంగభుజుణ్ణి తండ్రిగారిసువర్ణబాణాన్ని తీసుకొరమ్మన్నారు. సోదరు లందరూ మిష పెట్టి శృంగభుజుణ్ణి దేశములో నుంచి వెళ్ళగొట్టవలె నని సంకల్పించి బంగారు బాణము పోగొట్టినందుకు తండ్రి తమను వెళ్ళగొడతా డని మొరపెట్టినారు. శృంగభుజుడు సోదరులతో రాక్షసుని చంపి సువర్ణబాణాన్ని తీసుకొనివస్తాను అని పలికి వాళ్ళకు ధైర్యము కలిగించి, ధనుర్బాణాలు చేత పుచ్చుకొని నెత్తురు జాడను బట్టి కొంగ పోయినమార్గము తెలుసుకొని ఆదిక్కునే వెళ్ళినాడు. అన్నలందరూ అమితానందముపొంది తల్లుల దగ్గిరికి వెళ్ళినారు.

## రూపశిఖ శృంగభుజుడు

శృంగభుజుడు సువర్ణబాణముకోసము వెళ్ళగా వెళ్ళగా అరణ్యమధ్య దేశములో పట్టణము కనపడినది. అక్కడ వృక్షమూలమున అతడు

కొంతసేపు విశ్రమించినాడు. ఆసమయములో త్రిలోకసుందరి అయిన కన్య ప్రేమవీక్షణాలతో అతన్ని చూస్తూ సమీపించింది. శృంగభుజుడు కన్యను 'హరిణాక్షీ! ఈపట్టణముపేరేమిటి? ఎవరి దీపురము? నీవు ఎవరవు? ఎందుకువచ్చావు? అని ప్రశ్నమీద ప్రశ్న కుతూహలముతో వర్షించినాడు. ఆకన్య ముఖము సిగ్గువల్ల ఎర్రబడినది. ఆమె నేల చూస్తూ "ఈధూమపురము మాతండ్రిగారిది. ఆయన అగ్నిశిఖుడు. నన్ను రూపశిఖ అని పిలుస్తారు. నీచక్కదనాన్ని చూచి ఇలా వచ్చాను. ఎవరు నువ్వు? ఎందుకు వచ్చావు?" అని అడిగింది. శృంగభుజుడు సంగతి అంతా చెప్పినాడు. రూపశిఖ సంతోషముతో "నీవంటివిలుకాడు త్రిలోకాలలో లేడు. నీవు బకరూపములో ఉన్నమాతండ్రిని కొట్టినావు. ఆ సువర్ణశరమును నేను క్రీడకై పుచ్చుకొన్నాను. మహాదంష్ట్రుడనే మంత్రి విశల్యకరణివల్ల మానాన్నగారిగాయలు మాన్పినాడు. నేను వెళ్ళి నా తండ్రితో సంగతి చెప్పి నిన్ను తీసుకొని పోతాను. ఆర్యపుత్రా, నా హృదయాన్ని నీకు అర్పించాను!" అని తండ్రిదగ్గిరికి వెళ్ళి దైవాంశసంభూతుడైన రాజపుత్రుడు వచ్చినాడు. అతడు మానవాతీతుడు. అతనికిచ్చి వివాహము చేయకపోతే నేను జీవించను" అని నిష్కర్షగా చెప్పింది.

తండ్రి "అమ్మాయీ! మనము రాక్షసులము. రాక్షసులు మానవుల్ని తింటారు. నీకు అతనిమీదమనసు ఉంటే అతన్ని ఇక్కడికే తీసుకురా' అనగానే రూపశిఖ శృంగభుజుణ్ణి తండ్రిదగ్గిరికి తీసుకొని వచ్చింది. అగ్నిశిఖుడు "రాజపుత్రా, నామాట మీరకుండా ఉంటే రూపశిఖను నీకిచ్చి పెళ్ళి చేస్తాను" అని చెప్పినాడు. శృంగభుజుడు నీ మాటను అతిక్రమించను అని వాగ్దానము ఇచ్చినాడు. రాక్షసుడు అతన్ని స్నానగృహానికి రమ్మన్నాడు. రూపశిఖ శృంగభుజునితో రహస్యంగా 'ఆర్యపుత్రా, నాకు నూరుమంది భగినులు ఉన్నారు. మా అందరిరూపమూ ఒకేతీరుగా ఉంటుంది. మా అందరికీ ఒకేరకమైన

కంఠహారాలు ఉన్నవి. మాతండ్రి మమ్మల్ని అందరినీ సమావేశపరిచి నీకు ఇష్టమైనదాన్ని వరించమని అంటాడు. మనఇద్దరికీ వివాహము కావడము ఇష్టము లేక మాభగినులందర్నీ ఒకచోటికి స్వయంవరానికి రమ్మన్నాడు. అందరూ హారాలు కంఠాలలో వేసుకొంటే నేను శిరస్సున ధరిస్తాను. ఆ ఆనవాలు చూచి స్వయంవరమాలను నాకంఠాన వెయ్యి. నాతండ్రి వట్టిపశుప్రాయుడు. ఆయనకు వివేకము లేదు. ఆయన చెప్పినదానికి సరే అంటూ సంగతినాకు చెపుతూ ఉండు. పైయుక్తి నేను ఆలోచిస్తాను" అంటూ భగినులదగ్గిరికి వెళ్ళింది. శృంగ భుజుడు జలకమాడి అగ్నిశిఖునిదగ్గిరికి వెళ్ళినాడు. రాక్షసుడు శృంగ భుజునికి పుష్పమాల నిచ్చి నీప్రియురాలికి ఈదండ వెయ్యి అనగా మాలికను స్వీకరించి రూపశిఖ చెప్పినఆనవాలు జ్ఞాపకము పెట్టుకొని ఆమెకంఠాన పుష్పదామము వేసినాడు. అగ్నిశిఖుడు రేపు మీావివా హము చేస్తాను అని చెప్పినాడు. స్వయంవరమంటపమునుంచి అందరూ వెళ్ళిపోయినారు.

రాక్షసుడు శృంగభుజుణ్ణి పిలిచి "ఈరెండుదుక్కి-ఎడ్లనూ ఊరివెలు పలికి తోలుకుపోయి, అక్క-డున్నపుట్టెడునువ్వులనూ చేనులో చల్లి రావోయి!" అనగానే అతడు సరే నని దిగులుపడుతూ రూపశిఖతో చెప్పినాడు. ఆమె తనమాయాశక్తివల్ల ప్రియునికి హాని కలుగకుండా చేస్తా నన్నది. శృంగభుజుడు ధైర్యముతో పొలానికి వెళ్ళినాడు. దుక్కి- దున్నుతూ అతడు దిగులుగా ఉన్నాడు. రూపశిఖామాయా శక్తివల్ల నువ్వులు వా టంతట అవే పొలములో పడినవి. ఇంటికి వచ్చి నువ్వులు చల్లివేశానని శృంగభుజుడు రాక్షసునితో చెప్పినాడు. రాక్ష సుడు "తిలలు చల్లి లాభము లేదు. మళ్ళీ వాటిని రాశి చెయ్యి" అని చెప్పగా శృంగభుజుడు తనప్రియురాలికి తెలియజేసినాడు. ఆమెప్రభా వమువల్ల చాలా చీమలను సృష్టించి వాటిచేత నువ్వులను రాశి చేయిం

చింది. శృంగభుజుడు నువ్వులు రాశి చేశానని రాక్షసుడితో చెప్పినాడు. రాక్షసుడు శృంగభుజుణ్ణి తిప్పలు పెట్టవలె నని సంకల్పించి "రాజపుత్రా, ఇక్కడికి దక్షిణముగా రెండుఆమడల దూరములో అడవిలో శివాలయము ఉన్నది. అక్కడ నాఅన్నగారు ధూమశిఖు డున్నాడు. నీవు అక్కడికి వెళ్ళి రేపుఉదయాన రూపశిఖకువివాహము జరుగుతుంది. మీ రంతా సపరివారముగా వివాహానికి రావాలి. మిమ్మల్ని పిలవమని అగ్నిశిఖుడు నన్ను పంపినాడు.' 'అని చెప్పి నీవువెంటనే రావాలి. రేపే నాకుమార్తెను నీవు వివాహము చేసుకొందువు గాని" అన్నాడు. శృంగభుజుడు సరే అని రూపశిఖతో చెప్పినాడు. ఆకన్య అతనికి నిప్పు నీళ్ళు, మన్ను, ముళ్ళూ ఇచ్చి "ఆర్యపుత్రా! నీవు ఈగుర్ర మెక్కి ఆ దేవాలయానికి వెళ్ళి నాతండ్రి చెప్పినతీరుగా ధూమశిఖుణ్ణి పెళ్ళికి ఆహ్వానించు. శీఘ్రమే నీవు గుర్ర మెక్కి దౌడు తీసి మాటిమాటికీ వెనక్కి తిరిగిచూస్తూ రావాలి. ధూమశిఖుడు నీదారికి అడ్డు వస్తే ఈమన్ను చల్లు. అతడు నిన్ను తరుముతూ వస్తే ఈనీళ్ళు తోవకు అడ్డముగా చల్లు. అప్పటికీ అతడు తరుముతూవస్తే ఈముళ్ళు దారికి అడ్డముగా వెయ్యి. ఇంకా అతడు వస్తూ ఉంటే ఈనిప్పుకణిక విసిరివెయ్యి. ఏమీ సందేహించకు. నామాయాశక్తి నీకు బోధపడుతుంది"

శృంగభుజుడు ప్రియురాలు ఇచ్చిన మృత్తు, జలము, కంటకములు, నిప్పుకణిక తీసుకొని గుర్ర మెక్కి అడవిలో శివాలయముదగ్గిరికి దౌడు తీసినాడు. ఆగుళ్ళో కుడివైపున విఘ్నేశ్వరునీ, ఎడమపార్శ్వములో పార్వతీదేవినీ, దర్శించి, ధూమశిఖుణ్ణి తనవివాహానికి పిలిచి శీఘ్రమే గుర్రమును హెచ్చరించినాడు. శృంగభుజుడు ధూమశిఖుని రాక చూచి గుర్రమును దౌడు తీయించినాడు. వెనక్కు తిరిగి చూచి అతడు దారికి అడ్డముగా మన్ను చల్లినాడు. అది వెంటనే పర్వతమైనది. రాక్షసుడు కష్టపడి పర్వతాన్ని చుట్టి శృంగభుజుణ్ణి తరుముకొని వస్తున్నాడు. శృంగ

భుజుడు నీరు తోవకు అడ్డముగ చల్లగా పెద్దనదీరూపమై ప్రవహించింది. రాక్షసుడు అల్లకల్లోలముగా ఉన్న నదిని తరించి రాజపుత్రునివెంట పడి నాడు. రాజపుత్రుడు కంటకాలను మార్గమధ్యమున వేయగా ధూమ శిఖుడు ముళ్ళను దాటి అతన్ని తరుము సాగినాడు. రాక్షసుడు సమీపించగా రాజపుత్రుడు ఖిన్నుడై అగ్నికణమును విసిరినాడు. ఆవిస్ఫులింగము వనమును కాల్చివేసింది. ఆభీకరాగ్ని జ్వాలలను చూచి రాక్షసుడు భీతిల్లి వెనకదారి పట్టినాడు. రూపశిఖమాయాశక్తివల్ల ఆరాక్షసుడు భూమిమీదనే సంచరించి వెనక్కు తిరిగి వెళ్ళినాడు. ఆకాశగమనము అతడు మరిచిపోయినాడు. తనప్రేయసీప్రభావానికి ఆశ్చర్యపడుతూ రాజపుత్రుడు ధూమపురము చేరినాడు.

శృంగభుజుడు రూపశిఖకు గుర్రాన్ని అప్పగించి జరిగినదంతా చెప్పి అగ్నిశిఖునిదగ్గిరికి వెళ్ళి నీఅన్న ధూమశిఖుని పిలిచి వచ్చినాను. అని పలికినాడు. ఆరాక్షసుడు రాజపుత్రునిరాకకు అపరిమితముగా ఆశ్చర్యము పొంది "నిజముగానీవు మాఅన్నగారిదగ్గికి వెళ్ళి వచ్చావా? వెళ్ళేవుంటే ఆనవాళ్ళు చెప్పు" అని అడిగినాడు. శృంగభుజుడు "అక్కడ దేవాలయములో ఎడమవైపు గౌరీదేవి, కుడివైపున విఘ్నేశ్వరుడూ ఉన్నారు" అనిసమాధానము ఇచ్చినాడు. రాక్షసుడు రాజపుత్రునిరాకకు ఆశ్చర్యపడి ధూమశిఖునినోట పడకుండా వచ్చినందుకు సంతోషించి వీడు మానవమాత్రుడు కా డని నిశ్చయించుకొని తన కుమారిని శృంగభుజుని కిచ్చి వివాహము చేయదలచినాడు. కుమార్తెవల్లనే రాక్షసమాయ సంభవిస్తున్న దని తండ్రి గ్రహించ లేదు. రాజపుత్రుడు రాత్రి రూపశిఖతో విందు ఆరగించి మధుపానము చేసి రాత్రి ఎలాగో గడపినాడు. తెల్లవారగానే రాక్షసుడు రూపశిఖను శృంగభుజుని కిచ్చి వివాహము చేసినాడు.

అక్కడే కొంతకాలము రాజపుత్రుడు రూపశిఖతో సుఖములు

అనుభవించి నిజరాజధాని అయిన వర్ధమానపురమునకు వెళ్ళదలచినాడు. రూపశిఖ భర్తతో కూడా రాజధానికి వస్తానన్నది. ఆమె తండ్రితో చెప్పకుండా భర్తతో వెళ్ళదలచి తండ్రిని తనమాయలో వేయదలచింది. శృంగభుజుడు అందుకు సరే నన్నాడు.

మర్నాడు రూపశిఖ రాజ్యములో సగభాగ మిచ్చి అమూల్యరత్నరాశితో నిండిన పేటికను, సువర్ణబాణమును పుచ్చుకొని భర్తతో శరవేగము అనే అశ్వమును ఎక్కింది. ఇద్దరూ పరివారజనాన్ని మోసగించి వనవిహారానికి అని వంక పెట్టి వర్ధమానపురమార్గమున వెళ్ళిపోతున్నారు. అగ్నిశిఖునికి కుమారిసంగతి తెలిసి గగనతలాన వెంటబడి వచ్చినాడు. ఆమెభర్తతో 'ఆర్యపుత్రా, మనను ఆటంకము చేసేందుకు మానాన్న వచ్చినాడు. నీవు ధైర్యవృత్తితో ఉండు. నేను ఆయనను మోసగిస్తాను. నామాయాశక్తివల్ల మాతండ్రికి నీవు కనపడకుండా చేస్తాను' అని చెప్పి నిజప్రభావమువల్ల భర్తను అదృశ్యుణ్ణి చేసి, తాను పురుషవేషము ధరించింది. రూపశిఖ కట్టెలుకొట్టేవాడితో "ఇక్కడికి పెద్దరాక్షసుడు వస్తున్నాడు. నీవు కుక్కినపేనులా మాట్లాడకుండా ఉండాలి." అని చెప్పి వాడిగొడ్డలి తానుపుచ్చుకొని కర్రలు కొడుతున్నది. మూఢరాక్షసుడు ఆమెను చూచి గగనమునుంచి అవతరించి "ఓయీ, ఈతోవనే స్త్రీపురుషులు ఎవరయినా వెళ్ళారా? నీవు చూచావా?" అని కట్టెలవానిరూపములో ఉన్నకుమార్తెను అడిగినాడు. అప్పు డామె విచారము అభినయించి "అయ్యా, కర్రలు కొడుతూ ఆయాసమువల్ల కన్నీరుకారుతూ ఉంటే మాకు ఎవరూ కనపడలేదు. మేము చనిపోయిన రాక్షసరాజు అగ్నిశిఖుని దహనము నిమిత్తము కర్రలు కొడుతున్నాము" అని సమాధానము ఇచ్చింది. ఆమూఢరాక్షసుడు "ఏమిటి? నేను చనిపోయినానా? అమ్మాయి మాట అలా ఉండనీ. నేను నిజముగా చచ్చానేమో ఇంటికి పోయి

కనుక్కోవాలి' అని ఆలోచనతో ఇంటిదారి పట్టినాడు.

వేసినపాచిక బాగా పారినందుకు రూపశిఖ భర్తతో సంతోషముగా ప్రయాణము చేస్తున్నది. రాక్షసేశ్వరుడు క్షణములో ధూమపురము వెళ్ళి పరిజనులను తాను బతికినదీ చచ్చినదీ అడిగినాడు. వాళ్ళంతా రాక్షసరాజు జీవించే ఉన్నా డని నొక్కి చెప్పినారు. తాను బతికే ఉన్నందుకు ఉబ్బి తబ్బిబ్బై బైటికి వచ్చినాడు. తండ్రి వెనకనే వస్తున్నా డని తెలిసి రూపశిఖ భర్తను మాయలో కప్పి, పురుషవేషము ధరించి ఆతోవనే పోతున్న లేఖాహారుని చేతిఉత్తరాలు తాను పుచ్చుకొన్నది. ఇంతలో రాక్షసుడు వచ్చి కూతుర్ని చూచి కూతుర రని తెలియక 'ఓయీ, ఈతోవనే స్త్రీతో పోతున్న పురుషుణ్ణి చూశావా?' అని ప్రశ్నించినాడు. రూపశిఖ వేడినిట్టూర్పులు వదలుతూ 'అయ్యా, నేను త్వరగా పరుగెత్తుతూ ఉండడంవల్ల ఎవరినీ చూడలేదు. ధూమపురములో అగ్నిశిఖుడు కాటికి కాళ్ళు చాచి ఈ జాబు నాచేతి కిచ్చి అతనిఅన్న ధూమశిఖునికి ఇవ్వ మన్నాడు. అక్కడికి పోతున్నాను' అని సమాధానము చెప్పింది. అగ్నిశిఖుడు తెల్లపోయి 'ఏమిటీ, నన్ను శత్రువులు చంపివేసినారా!' అని తాను జీవించిందీ లేనిదీ యథార్థము తెలుసుకోవలె నని తిరిగి తనపట్టణానికి వెళ్ళినాడు. బ్రహ్మ చేసినతామససృష్టి ఇలాగే ఉంటుంది! రాక్షసరాజు పరివారజనాన్ని అడిగితే 'స్వామీ, మీరు నిక్షేపంగా ఉన్నారు!' అని వాళ్ళు సమాధానము చెప్పినారు. అగ్నిశిఖుడు అందుకు సంతోషించి కూతురి కోసము బయలుదేర లేదు. రూపశిఖ పతివ్రత కనుక పతికోసము పడరానిపాట్లు పడి, తండ్రిని వంచించి వర్ధమానపురము చేరింది.

కొడుకూ కోడలూ వచ్చా రని వీరభుజుడు ఎదురుగా వచ్చి, అప్పుడే రాజ్యలాభము గలిగినట్టు అమందానందము అనుభవించినాడు. గుర్రము దిగి కొడుకూ కోడలూ నమస్కరించగా వీరభుజుడు ఆనందాశ్రువులతో

వారిశిరస్సులను తడిపినాడు. అతడు మహోత్సవము చేస్తూ కొడుకునూ కోడల్నీ రాజధానిలోకి ప్రవేశపెట్టినాడు. జరిగినవిషయ మంతా శృంగ భుజుడు తండ్రికి పూస గుచ్చినట్టు చెప్పినాడు. రూపశిఖ వారిసమక్షములో భర్తృసోదరులను రప్పించి బంగారుబాణాన్ని వాళ్ళకు ఇచ్చివేసింది. తండ్రి కుమాళ్ళదుశ్చేష్టితాన్ని గ్రహించి శృంగభుజుని మాత్రమే తనకుమారునిగా తలచినాడు. "నిరపరాధుడైన శృంగ భుజుణ్ణి అన్నలు ఎలా మాయచేసి వెళ్ళగొట్టినారో, అలాగే సవతులంతా ఏకమై గుణవరమీద దోషారోపణ చేసి నేలకొట్టులో పెట్టించారు. అందువల్ల గుణవరను భూగృహమునుంచి ఉద్ధరిస్తాను!" అని రాజు ఆలోచనముగిసినతరువాత అయశోలేఖ దగ్గిరికి వెళ్ళినాడు. ఆరాణి సంతోషముతో మదిరాపానముచేసి మత్తులో శరీరము తెలియకుండా ఉన్నది. రతాంతములో నిదురించిన ఆరాణి "ఆహా! గుణవరాదేవిమీద లేనిపోనిదోషాలు కల్పించాను. అలా చెయ్యకపోతే రాజు నాదగ్గిరికి వచ్చేవాడేనా!" అంటూ పలవరించింది. అయశోలేఖ దుర్మార్గమూ గుణవర నిర్దోషిత్వమూ రాజుకు తెలిసినది. వెంటనే అతడు ఉగ్రుడై లేచి వెళ్ళిపోయినాడు.

రాజు సేవకులనుపిలిచి గుణవరాదేవిని నేలమాళిగనుంచి ఉద్ధరించి స్నానము చేయించ మని ఉత్తరువు చేసినాడు. పరివారసఖీజనము రాణిని స్నానము చేయించి తీసుకువచ్చినారు. ఆరాత్రి రాజదంపతులు విరహానికి స్వస్తి చెప్పి తనివి తీరక జాగరణ చేశారు. రాజు శృంగ భుజునివృత్తాంతమును రాణికి విశదపరిచినాడు. ఈలోగా అయశోలేఖ మేలుకొని తనమాటపొరపాటువల్ల మహారాజు కోపగించి లేచి వెళ్ళినాడని తలచి విచారించింది. తెల్లవారినతరువాత రాజు గుణవరాదేవి దగ్గిరికి కొడుకునూ, కోడలినీ పిలిపించగా వారు వచ్చి రాజ దంపతులకు ప్రణామము చేసినారు. గుణవరాదేవి కొడుకునూ కోడలినీ చూచుకొని

అమితానందము అనుభవించింది. తండ్రిఆదేశానుసారముగా రూపశిఖా వృత్తాంతమును వర్ణించినాడు. గుణవరాదేవి "పుత్రా! నీ కోసము రూప శిఖ ఏమి చెయ్యలేదు? తనవాళ్ళనూ దేశాన్నీ వదిలి నీకోసము వచ్చింది. నిజముగా ఈమె గృహదేవత! పతివ్రతాశిరోమణి!" అన్నది. ఆమాట లకు రాజు సంతోషించినాడు. రూపశిఖ సవినయముగా శిరసువాంచినది.

అయశోలేఖవల్ల అపవాదు నెత్తిమీద వేసుకొని తీర్థయాత్రలు చేసి అంతఃపురరక్షకు డయినసురక్షితుడు వచ్చినాడు. అతడు రాగానే రాజు సంతోషించి సత్కారము చేసినాడు. సురక్షితుడు రాజాజ్ఞప్రకారము తక్కిన దుష్టరాణులను పిలిచి వాళ్ళందరినీ నేలమాళిగలలో వేసినాడు. సవతులు నేలకొట్టులో ఉండగా గుణవరాదేవి ఆర్ద్రహృదయముతో రాజుపాదాలమీదపడి "నన్నే భూగృహములో వేయుండి; వాళ్ళను చెర నుంచి తప్పించండి" అని వేడుకొన్నది. రాజు ప్రియురాలిమాట పాటించి తక్కిన దుష్టరాణులను బంధముక్తులను చేసినాడు. రాణీవాసమంతా సిగ్గుతో సగముచచ్చి, రాజు పొమ్మనగా వాళ్ళు తమతమ ఇళ్ళకువెళ్ళి నారు. రాజు గుణవరను గౌరవించి తాను కృతార్థుడైనట్టు తలచినాడు.

రాజు యుక్తిగా నిర్వాసభుజాదులను పిలిపించి 'పాపాత్ములు మీరు వర్తకపాంథుని చంపినారని తెలిసింది. మీరిక్కడ ఉండతగరు. తీర్థయాత్ర చేసిరండి' అని వాళ్ళను పంపేసమయములో శృంగభుజుడు తండ్రి పాదాల మీద మోకరిల్లి అశ్రుసిక్తనయనాలతో కుమారులతప్పు క్షమించమని వేడినాడు. రాజు ప్రియసతునిమాట నెరవేర్చినాడు. సోదరు లందరికీ శృంగభుజునిమీద విశేషానురాగము కలిగింది. వాళ్ళందరూ గుణశ్రేష్ఠు డయినశృంగభుజుణ్ణి యౌవరాజ్యపట్టాభిషిక్తుణ్ణి చేసినారు. అతడు దిగ్విజయార్థము బయలుదేరి నిజబాహుపరాక్రమముతో సకలరాజన్య మును జయించి దశదిశల తనయశమును వెదచల్లి సిరిని ఇంటికి తెచ్చి నాడు. శృంగభుజుడు రాజ్యభారమును వహించి, భ్రాత లందరూ తన్ను

సేవించగా, తల్లిదండ్రులను రంజింపచేసి, విప్రులకు దానధర్మములు చేస్తూ, మూర్తీభవించిన అర్థసిద్ధివలె రూపశిఖ విరాజిల్లగా సుఖముగా ఉన్నాడు. సాధ్వీమణులైన గుణవరా రూపశిఖలు భర్తలను ఆరాధిస్తున్నారు.

ఈప్రకారముగా హరిశిఖునివల్ల నరవాహనదత్తుడు రత్నప్రభాదేవి సమేతముగా కథ ఆకర్ణించి ఆనందించినాడు. అతడు లేచి ఆహ్నికము, చేసి భార్యాసహితుడై తండ్రివద్దకు వెళ్ళి సహపంక్తిగా భోజనము చేసినాడు. మధ్యాహ్నవేళ అతడు ప్రియురాలితో నృత్యగీతాదివినోదములు చూచి సంతోషించి రాత్రి, అంతఃపురములో ఆనందము అనుభవించినాడు.

## తరంగము : ౨౦

## మరుభూతి సురాపాన కథ

మర్నాడు ఉదయాన వత్సరాజు రత్నప్రభామందిరములో ఆసీనుడై ఉండగా గోముఖాదిమంత్రులు వచ్చినారు. యౌగంధరాయణుని కుమారుడు మరుభూతి మదిరాపానము చేసి మదాలసుడై మందారమాల ధరించి చందనము శరీరానికి అలదుకొని నరవాహనుణ్ణి సమీపిస్తూ వచ్చినాడు. గోముఖుడు "యౌగంధరాయణుని పుత్రుడవై నీతి ఎరుగవా? ఉదయాన్నే మధువు సేవించి తూలుతూ వచ్చావా ప్రభువుదగ్గిరకి?" అని అడిగినాడు. మరుభూతి కోపముతో కైపుగా "ఈమాట నీవు కాదు నాకుచెప్పవలసింది. మహారాజో మానాన్నగారో చెప్పాలి. ఇత్యకాత్మజుడివై నువ్వెవరవు చెప్పేందుకు!" అని పలికినాడు. గోముఖుడు నవ్వుతూ "ప్రభువులు అవినీతుణ్ణి స్వయంగా బెదిరిస్తారా! పార్శ్వవర్తులు యథోచితముగా చెపుతారు. నిజంగా నేను ఇత్యకాత్మజుణ్ణి. నీవు మంత్రివృషభుడవు. నీవృషభత్వము నీజడతను చెప్పుతున్నది. పాపము, నీకు రెండుకొమ్ములు తక్కువ" అన్నాడు.

మరుభూతి "నువ్వు దాంతుడవు. అందుకే నీ కీజాతిసాంకర్యము

కలిగింది" అన్నాడు. ఆమాటకు అంతావిరగబడి నవ్వగా గోముఖుడు తిరిగి ఇలా పలికినాడు: 'ఈమరుభూతి – యత్నములు ఎన్ని చేసినా రంధ్రము పడనివజ్రము. ఇందులో గుణమును ఎవరు కూర్చగలరు? అయత్నముగా రంధ్రము పడేది పురుషరత్నము. అది వేరు. దీనికి తార్కాణముగా ఇసుకఆనకట్ట కథ చెపుతాను:

పూర్వము ప్రతిష్ఠానపురములో తపోదత్తు డనేవిప్రుడు ఉండేవాడు. తండ్రి ఎన్నివిధాల యత్నించినా తపోదత్తునికి అక్షరము అంటలేదు. అందరూ వేళాకోళాలు చేస్తూ ఉంటే సహించలేక అతడు పశ్చాత్తాపము కలిగి విద్యాసముపార్జనకు గంగాతీరానికి వెళ్ళి తపస్సు ఆరంభించినాడు. అతడు కఠోరతపస్సు చేసేసరికి విప్రవేషములో ఇంద్రుడు తపస్సుకు భంగము కలిగించవలె నని వచ్చి గంగాతీరమునుంచి నీళ్ళల్లోకి ఇసుక కొంచెము కొంచెము విరజిమ్ముతున్నాడు. తపోదత్తుడు అది చూచి మౌనముద్ర వదలి "విప్రుడా! నిసుగూ విరామము లేకుండా, ఎందు కిలా గంగలో ఇసుక పోస్తావు?" అని ప్రశ్నించినాడు. ఆమాయవిప్రుడు "మనుష్యులు దాటి వెళ్ళేందుకు ఇసుకతో ఆనకట్ట కడుతున్నాను" అని సమాధానము ఇచ్చినాడు.

అప్పుడు తపోదత్తుడు "వెర్రిబాగులవాడా! ప్రవాహ వేగముతో ఉన్ననదిలో ఇసుకతోనా ఆనకట్ట కట్టడము? నీతరమే!" అని ప్రశ్నించినాడు.

విప్రుడు "ఇంత తెలిసినవాడి వైతే చదువూసంధ్యలు లేక తపస్సు చేసి విద్యాసముపార్జన చేయాలను కొంటున్నావా? అధ్యయనము చెయ్యక జ్ఞానార్జనసాధ్యమా? కుందేటికొమ్మును సాధించగలవా!" అని పలికినాడు. తపోధనుడు తపస్సు కట్టిపెట్టి ఇంటికి వెళ్ళినాడు.

బుద్ధిశాలికి ఇలా సుఖువుగా చెప్పవచ్చును. మరుభూతికి మెదడు తక్కువ. ఇతనికి చెప్పడము కష్టము. చెబితే వినడు, కోపగిస్తాడు.

ఇలా అన్నాడు హరిశిఖుడు : "దేవా, నిజముగా బుద్ధిమంతులకు తెలియ చెప్పడము సుళువు. పూర్వము కాశీనగరములో కురూపి, దరిద్రుడుఅయిన విరూపశర్మ ఉండేవాడు. అతడు సిరిసంపదలు లేవనీ, అందచందాలులేవనీ విచారించి అడివికివెళ్ళి తపస్సుచేసినాడు. ఇంద్రుడు అతని తపస్సుకు భంగము కలిగించాలని వికారపు నక్క-రూపాన్ని ధరించి ఎదుట కనపడినాడు. ఆనక్క శరీరము కనపడకుండా ఈగలు ముసరగా అతడు చూచి పూర్వకర్మవల్ల వికారజీవులు జన్మిస్తారు అని ఆలోచన చేసినాడు. తపస్సు చాలించి కర్మానుభవము తప్పదని ఎరిగి విరూపశర్మ ఇంటికి వెళ్ళినాడు. ఇలా బుద్ధిశాలికి స్వల్పయత్నముచేత బోధ చేయవచ్చును. మతిలేనివాడికి మాటలు ఏమివని చెయ్యగలవు?

మరుభూతి మత్తుతో ఒళ్ళెరగక కోపంతో "గోముఖా! నీలాంటి వాళ్ళకు శౌర్యము బాహువులలో లేదు, వాక్కులో ఉంది. వాచాలులతో కలహము బాహుశాలులకు సిగ్గుచేటు!" అంటూ గిల్లికజ్జా తెచ్చుకోదలచిన అతన్ని చూచి నవ్వి నరవాహనదత్తుడు, వత్సేశుడూ సముదాయించినారు. బాల్యస్నేహమువల్ల మరుభూతిని అంతా ఇంటికి పంపివేశారు.

మర్నాడు అమాత్యులందరూ రాగా మరుభూతి సిగ్గుతో ముఖము వంచి ఉండగా రత్నప్రభాదేవి రాజుతో 'ఆర్యపుత్రా! ఆబాల్యస్నేహపాశబద్ధులైన వీరు మీకు మంత్రులు కావడంవల్ల నిజంగా మీరు ధన్యులు. మీవంటి దయార్ద్రహృదయులు ప్రభువు కావడం వీళ్ళ అదృష్టము!" అని పలికింది.

వసంతకుని కుమారుడు తపంతకుడనేమంత్రి నరవాహనదత్తునితో ఇలా చెప్పినాడు: "మాపూర్వపుణ్యమువల్ల ఇటువంటిస్వామి లభించినాడు. ఈలోకములో సమస్తమూ పూర్వకర్మనుబట్టి నిర్ణయము అవుతుంది. అందుకు కాథానము వినండి :

## అజరుని కథ

శ్రీకంఠములో విలాసనగరిలో వినయశీలు డనేరాజు పేరుకు తగి నట్టు ఉన్నాడు. అతడు కమలప్రభ అనేప్రియురాలితో కొన్నాళ్ళు సుఖము అనుభవించినాడు. కాలవశాన రాజుకు ముసలితనము వచ్చింది. రాజు ముదిమికి విచారించి అశ్రుపూరితనయనాలతో "అయ్యో, నా ప్రేయసీముఖాన్ని ఎలా చూడను? మంచుతో తడిసినకమలాలవంటి పలితకేశాలను, వాడినముఖాన్ని దేవికి ఎలా చూపను? పాడు వార్ధకము! ఇంతకన్న చనిపోవడం మంచిది!" అని ఆలోచించి వక్రు డనే వైద్యుణ్ణి పిలిపించి కాయకల్పము చేస్తే తిరిగి పూర్వయౌవనము వస్తుం దని తలచి, "భిషగ్వరా! ఈముసలితనాన్ని పోగొట్టేఉపాయము ఏమైనా ఉందా?" అని కుతూహలముతో అడిగినాడు. రాజును వంచించి వక్రుడు 'రాజన్! ఎనిమిదిమాసాలపాటు మీరు భూగృహములో ఏకాంతములో ఉండి మందు తింటే ముసలితనము పోతుంది" అని ఆశ కొలిపినాడు. విషయలోలుడు నైన రాజుకు మంత్రులు ఎంత హితాన్ని చెప్పినా భోగతృష్ణామయ మైనఅతనిమనసు కెక్కలేదు. వైద్యుని మాట నమ్మి ఏకాకిగా రాజు భూగృహములో ప్రవేశించినాడు. ఏక భృత్యుడు రాజుకు ఔషధసేవలో ఉపచారనిమిత్తము ఆనేలమాళిగ లోనే ఉంటున్నాడు. అజ్ఞానమో అన్నట్టువ్యాపించిన అంధకారమయ మైనధరాగృహములో రాజు నివాసము చేస్తున్నాడు.

ఆరుమాసా లయింది. ఆరోజుకు ఆరోజుకు వలీపలితము హెచ్చ డమే గాని తగ్గడము లేదు. శఠు డైన ఆవైద్యుడు రాజును పోలిన ఒకయువకుణ్ణి "నిన్ను రాజును చేస్తాను." అని ఏర్పాటు చేసి తీసుకొని వచ్చినాడు. ఆనేలకొట్టుకు దూరమునుంచి సురంగము తవ్వి రాజు రాత్రి నిద్రిస్తున్నసమయము కనిపెట్టి అతన్ని చంపి అసురంగద్వారాన శవాన్ని మోసుకొనిపోయి చీకటివేళ పాడునూతిలో పారవేసినాడు.

వైద్యుడు రాజునుపోలిన ఆయువకుణ్ణి సురంగద్వారాన ధరాగృహము లోకి ప్రవేశపెట్టి సురంగాన్ని పూడ్చివేసినాడు. మర్నాడు వైద్యుడు మంత్రివర్గముతోను నౌకర్లతోను "ఆరునెలల్లో మనరాజేంద్రుని యువకునిగా చేశాను. ఇక రెండుమాసాల్లో ఆయన రూపముకూడా మారుతుంది. మీరందరూ దూరమునుంచి ఆయనను చూడండి." అని చెప్పినాడు. అమాత్యులు నౌకర్లు ఒక్కొక్కరే భూగృహద్వారముదగ్గిరికి వెళ్ళితమఉద్యోగాలను తెలుపుకొన్నారు. రెండుమాసాలలో ఆయువకునికి అంతఃపురవిషయాలు అన్నీ బోధపడినవి. సమయము రాగానే పుష్టి చెందిన ఆయువకుణ్ణి నేలమాళిగనుంచి వైద్యుడు బైటికి తీసుకొని వచ్చి "ఇతడే మనరాజు! ముసలితనము పోయి వయసువచ్చింది. చూడండి!" అని పలికినాడు. అందరూ అమాయికముగా మునుపటిరాజే ఓషధుల వల్ల ఇలా అందచందాలతో యువకు డైనా డని భావించినారు.

ఆయువకుడు స్నానాదికము ముగించి రాజ్యము స్వీకరించినాడు. అజరుడని పేరు పెట్టుకొని అంతఃపురకామినులతో ఆనందము అనుభవిస్తున్నాడు. అందరూ అతన్ని పూర్వపురాజే అని అనుకొంటున్నారు. అజరుడు అమాత్యులను సంతోషపెట్టి కమలప్రభాదేవిని రంజించినాడు. అతడు భేషజచంద్రుని పద్మదర్శనుణ్ణి సమానులుగాచూచి వాళ్ళకు పంపదలు ఇచ్చినాడు. రాజు లోకసమాధానముకోసము వక్రుణ్ణి గౌరవించినాడు కాని సత్యధర్మహీనుడయిన అతనిమీద విశ్వాసము ఉంచలేదు.

ఒకసారి వైద్యుడు ఏకాంతములో రాజుతో "రాజన్, నన్ను లెక్క చెయ్యక స్వతంత్రముగా వ్యవహారాలు చూసుకొంటున్నావే! ఎవరివల్ల నీవు రా జైనావో మరిచిపోయినావు" అనగా అజరుడు "ఎంతమూర్ఖుడవు! ఎవడు ఎవడికి కర్త? ఎవడు దాత? పూర్వకర్మవల్ల సమస్తమూ జరుగుతుంది. నీవు అహంకారపడకు. నాకు ఐశ్వర్యము తపస్సువల్ల వచ్చింది. ఈసంగతి నీకు తెలియ చేస్తాను." అని పలికినాడు. వైద్యుడు

భయపడి "ఓహో, ఇతడజ్ఞానివలె ఉన్నాడు. ఏమి చేస్తాడో ప్రత్యక్ష ముగా చూస్తాను కద" అనుకొన్నాడు.

మర్నాడు అజరుడు తరుణచంద్రాది మిత్రులతో షికారుకు వెళ్లి నదీతీరానికి చేరుకొన్నాడు. నదీప్రవాహములో అయిదుసువర్ణకమలాలు కొట్టుకొని వస్తూ ఉండగా రాజు చూచి సేవకులచేత తెప్పించి తరుణచంద్రునికీ, వైద్యునికీ చూపి 'నీవు ఈదరినే ఎగువకు పోయి బంగారుకమలాలు పుట్టినతావు వెతికి రా. నీవుశకిన మిత్రుడివి" అన్నాడు. రాజు చెప్పినరీతిగా వైద్యుడు వెళ్ళినాడు.

వైద్యుడు నదీతీరాన శివాలయాన్ని, వటవృక్షాన వేలాడుతున్న మనుష్యుని అస్థిపంజరాన్ని చూచినాడు. అతడు అలిసి స్నానము చేసి మహేశ్వరార్చన అయినతరువాత కూర్చుని ఉండగా వానకారు మబ్బులుకూడి వర్షము కురిసింది. వర్షబిందువులు పడి ఆమనుష్యకంకాళము మీదుగా జారి నదీజలములో కలసినవి. వెంటనే ఆచినుకులవల్ల పద్మాలు జన్మించినవి. వైద్యుడు వాటిని చూచి "ఏమి అద్భుతము! ఈసృష్టి అద్భుతాన్ని ఎవరిని అడగను? ఈకనకపద్మప్రదేశమును చూచినాను. ఈ కళేబరాన్ని నదిలో పడవేస్తాను. పుణ్యకర్మచేసిన ట్లవుతుంది. లేకపోతే ఇక్కడశవము మీద బంగారు తామరపువ్వు లయిపోతుంటవి" అని యోచించి ఆరోజల్లా అక్కడ గడపి మర్నాడు నిజదేశానికి వెళ్ళినాడు. కొన్నాళ్ళు ప్రయాణము చేసి అజరమహారాజువద్దకి వెళ్ళి రాజుఅడగగా వృత్తాంతము చెప్పినాడు.

రాజు ఏకాంతములో వైద్యునితో ఇలా పలికినాడు : "మిత్రమా, నీవుబంగారుతామరపువ్వులున్నతావు చూచినావు. ఆక్షేత్రముపవిత్రము. అక్కడ నీవుచూచినకళేబరము నాపూర్వజన్మదేహము. ఊర్ధ్వపాదుడనై వేలాడుతూ దేహాన్ని శుష్కింపచేసి తపస్సుచేశాను. ఆతపో మహిమవల్ల ఆదేహము మీద రాలినవర్షబిందువులు బంగారుతామర

పువ్వులైనవి. నీవు నాపూర్వజన్మ సఖుడవు. భేషజచంద్రుడు, పద్మ దర్శనుడు ఆజన్మలో మిత్రులు. తపశ్శక్తివల్ల నాకు రాజ్యప్రాప్తి, పూర్వజ్ఞానమూ కలిగినవి. నీకు యావత్తూ సయుక్తికముగా ప్రత్యక్షముగా చూపినాను. నీవు నీళ్ళల్లో వేసిన అస్థిపంజరాన్ని కూడా ఆన వాలుతో అభివర్ణించాను. అందుచేత నీవు నాకు రాజ్య మిచ్చినా నని గర్వించకు. నీమనస్సుకు సమాధానము చెప్పుకో. పూర్వజన్మకర్మకన్న దాత ఎవడూ ఉండడు. ప్రాణులు కర్మపాశబద్ధులు.

వైద్యుడు ఏమీా చెయ్యలేక సంతుష్టితో రాజసేవ చేస్తున్నాడు. రాజు అతన్ని ధనకనకవస్తువాహనాలతో సత్కరించి, నయవిశార దుడై ప్రజలను రంజింపచేసి రాజ్యపాలన చేస్తున్నాడు.

దేవా! ఇలాగే లోకములో సర్వప్రాణులూ కర్మఫలాన్ని అనుభ విస్తారు. కనుక నీవుకూడా మాకుజన్మాంతరసంబంధి వైనస్వామివి! అలా కాకపోతే ఎంతమందో ఉండగా మాకే ఎందుకుప్రసన్నుడవు కావాలి?

ఇలా తపంతకుడు చెప్పిన కథను జాయాసహితుడైనరవాహన దత్తుడు ఆకర్ణించి ఆనందించినాడు. నరవాహనుడు జననీజనకులకు లోచ నోత్సవము చేస్తూ అమృతము కురిపిస్తూ వాళ్ళతో భోజనముచేసి అమా త్యులతో భార్యతో పగలు రాత్రీ గడపినాడు.

## తరంగము: ౪౧

నరవాహనదత్తుడు అకస్మాత్తుగా ఆక్రందనము విని ఏమి టని ఆదుర్దాగా అడిగితే చేటికలు వచ్చి "ప్రభూ! కంచుకి ధర్మగిరి ఏడు స్తున్నాడు. ఎవడో మూర్ఖుడు తీర్థయాత్రలు చేసివచ్చి కంచుకితో అతనిఅన్న కాలము చేశా డని చావుకబురు చల్లగా చెప్పినాడట. రాజమందిరములో ఉన్నసంగతి మరిచి కంచుకి దుఃఖించగా పరిజనులు అతన్ని పిలుచుకొని పోయినారు." అని విన్నవించినారు. యువరాజు

అందుకు జాలిపడగారత్న ప్రభ "ప్రియబంధువుమృతిలవల్ల కలిగే దుఃఖము దుర్భరము. బ్రహ్మదేవుడు మనుష్యులను జరామరణవర్జితులను చెయ్యడేమి?" అన్నది.

మరుభూతి రాణితో ఇలా అన్నాడు: 'దేవీ! మర్త్యులకు అమరత్వము ఎలా వస్తుంది?

## నాగార్జునుని కథ

పూర్వము చిరాయు వనేనగరాన్ని చిరాయు వనేరాజు సార్థకనాముడై పరిపాలన చేస్తున్నాడు. ఆయనకు బోధిసత్త్వాంశతో దయాదానశీలుడై ప్రజ్ఞావంతుడైన నాగార్జునుడనే మంత్రివర్యుడు సమస్తఓషధులయోగాన్ని ఎరిగి రసాయనముసాధించి తాను చిరంజీవియై రాజును కూడ చిరంజీవిని చేసినాడు.

ఒకనాడు మంత్రిశేఖరుని ప్రియకుమారుడు చనిపోయినాడు. తండ్రి విచారించి మానవులమరణాన్ని తప్పించి అమరులను చేయడానికి తపస్సువల్ల అమృతము చేయ నారంభించినాడు. నాగార్జునుడు ఒక ఓషధిని అందులో చేర్చేందుకు ఎదురు చూస్తూ ఉండగా ఇంద్రుడికి ఆసంగతి తెలిసి అశ్వినీ దేవతలను పిలిపించి "మీరు భూలోకానికి వెళ్ళి నాగార్జునునితో నామాటగా "నీవు మహామంత్రివై అవినీతికార్యము ఆరంభించావేమిటి? బ్రహ్మనే జయిస్తావా ఏమి? సృష్టికర్త మానవులను మర్త్యులను చేస్తే, నీవు అమృతము సాధించి వాళ్ళను అమరులను చేస్తావా? ఇక దేవమానవభేదము ఉండదు. యజ్ఞభుక్కులు హోతలు అనేభేదము లేకపోతే లోకము తారుమారు కాదా? అందువల్ల నీ ప్రయత్నము కట్టిపెట్టి అలా చేయకపోతే దేవతలు కోపిస్తారు, శపిస్తారు. నీకుమారుడు స్వర్గములోసుఖంగా ఉన్నాడు. ఎందుకు నీప్రయత్నాలు? అని ఆజ్ఞ చేసినాడు. ఇంద్రాజ్ఞను అశ్వినీ దేవతలు నాగార్జును

నికి తెలిపి అతనిసుతుడు స్వర్గములో సుఖపడుతున్నాడని చెప్పినారు. నాగార్జునుడు విషాదముతో "ఇంద్రాజ్ఞ నెరవేర్చకపోతే అలా ఉండనీ. ఈఅశ్వినులు ఊరుకోరే. శపిస్తారే! ఏమి చెయ్యను? అమృతప్రాప్తి లేదు! పురాకృతమువల్ల నాకుమారుడు స్వర్గీయుడైనాడు" అని ఆలోచించి అశ్వినీదేవతలతో "ఇంద్రాజ్ఞను నెరవేర్చాను. అమృతము సాధించను. అయిదురోజులపాటు మీరురాకుండా ఉంటే మానవలోకము అజరామరమై ఉండేది!" అంటూ దేవతల సమక్షాన సిద్ధప్రాయమైన అమృతాన్ని నేలలో పాతిపెట్టినాడు. అశ్వినీదేవతలు నాగార్జునునివద్ద సెలవు తీసుకొని ఇంద్రునిదగ్గిరికి పోయి కార్యసిద్ధి చెప్పినారు. ఇంద్రుడు సంతోషించినాడు.

చిరాయుమహారాజు జీవహారుడనేపుత్రుణ్ణి యౌవరాజ్యపట్టాభిషిక్తుణ్ణి చేసినాడు. పట్టాభిషేకానంతరము తల్లి ధనపరకు నమస్కారము చేయడానికి కుమారుడు రాగా ఆమె "కుమారా! యౌవరాజ్యము వచ్చినదని ఎందుకు హర్షిస్తావు? రాజ్యప్రాప్తి నీకు లేనే లేదు. నీవలె యువరాజులు ఎంతమందో అయినారు. అందరూ చనిపోయినారు. ఒకరికీ రాజ్యపాలన చేసేయోగ్యత విధి వ్రాయలేదు. నాగార్జునుడు ఇచ్చిన రసాయనమువల్ల నీతండ్రి నూరేళ్ళపైగా జీవించిఉన్నాడు. ఈరాజు అల్పాయుపులను ఎంతమందిని యువరాజును చేస్తాడో!" అన్నది. ఆమాటకు కుమారుడు విచారపడినాడు. తల్లి 'నీకు రాజ్యము కావలసివస్తే ఒకయుక్తి చెయ్యి. నాగార్జునమంత్రి ప్రతిదినము ఆహ్నికము పూర్తిచేసి ఆహారదానము చేయదలచి ఎవరికేమి కావలెనని అడుగుతారు. ఆసమయములో ఆయనశిరస్సు కావలెనని యాచించు. ఆయన సత్యవ్రతుడు కనుక తలనరికి ఇచ్చి మృతిచెందుతాడు. మంత్రిపోయిన విషాదమువల్ల రాజు చనిపోవచ్చును. తపోవనానికి వెళ్ళవచ్చును. ఇంతకన్న ఉపాయము కనపడదు" అన్నది. మాతృవాక్యాలు విని కుమారుడు అలాగే

చేయనిశ్చయము చేసుకొన్నాడు. రాజ్యలోభము బంధుప్రేమను కూడా నాశనము చేస్తుంది.

మర్నాడు రాజకుమారుడు మంత్రియింటికి భోజనవేళకు వెళ్ళి కని పెట్టుకొన్నాడు అతడు 'ఏమి కావా' లని రాజపుత్త్రుని అడగ్గా వాడు నాగార్జుననిశిరస్సు కావలెనని కోరినాడు. మంత్రి నీకోరిక ఆశ్చర్యకర ముగా ఉంది. మాంసాస్థిమయ మైన నాతల ఎందుకు పనికి వస్తుంది? నీకు కావలిస్తే తీసుకో' అని మెడ చాచినాడు. రాజపుత్త్రుడు ఎన్ని రకాలకత్తులు ఉపయోగించినా అన్నీ విరిగిపోయినవి. నాగార్జునుని కంఠము రసాయనయోగమువల్ల అతిదృఢ మైనదని రాజకుమారునకు తెలియదు. మహారాజు సంగతిగ్రహించి వచ్చి కుమారుని వారించగా నాగార్జునుడు 'రాజన్! నాకు పూర్వజన్మజ్ఞాన మున్నది. ఇదివరలో నేను తొంభైతొమ్మిది జన్మలలో నాశిరస్సును ఖండించి ఇచ్చినాను. శిరో దానానికి నాకు నూరోజన్మ. నీ వేమీ అడ్డు చెప్పకు. నీకుమారునకు శిరోదానము చేస్తున్నాను. నీదర్శనార్థము ఎదురుచూచినాను' అంటూ మహారాజును ప్రేమపూర్ణముగా ఆలింగనము చేసి ఏదో చూర్ణము తెచ్చి రాజపుత్త్రుని కత్తికి పూసినాడు. అతడు ఆకత్తితో మంత్రి శిరమును నరికినాడు. రాజమందిరము హాహాకారాలతో సంకులమైనది. రాజు ప్రాణత్యాగానికి సంసిద్ధు డైనాడు. అప్పుడు అశరీరవాణి "రాజన్! అకార్యము చేయకు. నీస్నేహితుడు ఉత్తమగతి పొందినాడు. బోధి సత్త్వుడు అయినాడు" అని పలికింది. అది ఆకర్ణించి మహారాజు మరణ ప్రయత్నము మానినాడు. అతడు దానధర్మాలుచేసి తపస్సుకు వనానికి వెళ్ళి ఉత్తమగతి పొందినాడు. ఆయనకుమారుడు జీవహారుడు రాజ్యా నికి వచ్చినాడే గాని మంత్రికుమారులు తమతండ్రిని అతడుచంపినరోషము వల్ల అతనిని చంపివేసినారు. రాజమాత గుండె పగిలి చనిపోయింది. రాణికుమాళ్ళలో శతాయువు రాజ్యానికి వచ్చినాడు. ఇలా నాగార్జునుడు

మానవులను, అమరులను చేయవలె నని సంకల్పించి, దేవతలవల్ల సంక ల్పము త్యజించవలసి వచ్చింది. మర్త్యులు అమరులు కావడము వట్టిది.

ఇలా మరుభూతి చెప్పగా నరవాహనదత్తుడు అమాత్యులతో కూడా సభచాలించి లేచి ఆహ్నికము నెరవేర్చినాడు.

## తరంగము : ౪౨

## కర్పూరికా నరవాహనులు

మరునాడు ఉదయాన నరవాహనుడు త్వరగా వస్తా నని రత్నప్రభా దేవితో చెప్పి గజతురగసమేతముగా వేటకు వెళ్ళినాడు ఆ అరణ్య ములో సింహములు వదునైనగోళ్ళతో ఏనుగుల కుంభస్థలాలను చీల్చగా ముత్యాలు కోపవైరె రాలినవి. బల్లెములకు పులులనోరలు తుత్తునియ లైనవి. హరిణాల రక్తధారలవల్ల, శరములు శరీరమున గుచ్చుకొన్న వరాహములవల్ల, శరాఘాతపతితము లైనశరభాలచేత, తుమ్మెదల రొదలచేత వనీలతలు శోభిస్తూ అతనికి ప్రీతి కలిగించినవి. నరవాహనుడు అలసిసొలసి కొంతసేపు విశ్రమించి గోముఖునితో అశ్వ మెక్కి పోయి గుళికాక్రీడ ఆరంభించినాడు. సిద్ధురాలు అక్కడికి వచ్చింది. గుళికా ఖేలనలో ఒకగుళిక రాజుచేతిలోనుంచి తప్పి ఆమెతలకు తగిలింది. ఆమె మందహాసము చేస్తూ "ఇప్పుడే నీ కింత గర్వమైతే కర్పూరిక నీప్రియురా లయినపుడు ఇంకా ఎంత గర్విస్తావో! ఎవరూ నీకంటికి కనపడరు," అన్నది. నరవాహనదత్తుడు అశ్వము దిగి "అమ్మా, విధివశాన గుళిక నాచేతినుంచి తప్పిపోయింది. క్షమించు భగవతీ!' అని వేడినాడు. ఆ తాపసి "పుత్రా, నీమీద నాకు కోపము లేదు" అని శాంతముగా పలికి అతన్ని ఆశీర్వదించి సంతోషపెట్టింది. నరవాహనుడు తాపసిని విజితేంద్రియ అని గ్రహించి "అమ్మా! ఆకర్పూరిక ఎవరు? కుతూ హలముగా ఉన్నది. చెప్పు తల్లీ" అని కోరగా తాపసి చెపుతున్నది.

సాగరాంచలాన కర్పూరసంభవ మనే నగరమును కర్పూరకు డనే రాజు పరిపాలన చేస్తున్నాడు. అతనికుమారి కర్పూరిక ఒకలక్ష్మిని దేవతలు మథించి తీసుకొని పోయినా గని సాగరుడు రెండవలక్ష్మిని అక్కడ దాచినాడా అన్నట్లు క్షీరాబ్ధికన్యవలె కర్పూరిక పెరుగుతున్నది. ఆమె ఎవరినీ వివాహము చేసుకోనంటున్నది. నిన్నయితే పెళ్ళాడుతుంది. నీవు వెళ్ళేప్పుడు అరణ్యమార్గాన మార్గాయాసము మహాఖేదము అనుభవిస్తావు. అందుకు భయపడకు. అది నీకు శుభముగా పరిణమిస్తుంది" అని చెప్పి అంతర్ధానమైనది.

ఆ తాపసీవాక్కు మన్మథాజ్ఞవలె నరవాహనుని ఆకర్షించింది. అతడు పార్శ్వవర్తి అయినగోముఖుణ్ణి పిలిచి 'మనము కర్పూరసంభవనగరానికి వెళ్ళుదాము. కర్పూరికను చూడకుండా క్షణమైనా నిలువలేను. రా, వెళ్ళుదాము' అన్నాడు. గోముఖుడు 'రాజన్' ఏమిటి సాహసము! ఎక్కడ కర్పూరసంభవము? ఆకన్య ఎక్కడ? ఆసముద్ర మెక్కడ? పేరు విన్నమాత్రాన కర్పూరికకై ఎందుకు యత్నము?" అని నిరుత్సాహము కలిగించగా నరవాహనుడు 'అలాకాదు. సిద్ధురాలివాక్కులు అసత్యాలు కావు. నేను అవశ్యము ఆరాజకన్యను సంపాదించాలి" అంటూ వెంటనే అశ్వమెక్కి బయలుదేరినాడు. గోముఖుడు వల్లెత్తుమాట అవు ననీ కా దనీ ఏమీ అనక రాజువెంట వెళ్ళినాడు.

వత్సరాజూ మరుభూతీ నరవాహనునికోసము సేనాసమూహములో వెతికి వేసారి విచారిస్తూ రత్నప్రభదగ్గిరికి వెళ్ళినారు. ప్రియుడు కనపడక పోవడంవల్ల రత్నప్రభ దిగులుపడి, నిజశక్తివల్ల నరవాహనుడు కర్పూరికాదేవికోసము కర్పూరసంభవ నగరానికి వెళ్ళినా డని గ్రహించింది. ఆమె వత్సేశునికి ధైర్యము చెప్పి నరవాహనునికి మార్గక్లేశము కలగకుండా తనశక్తిని పంపింది.

ఈలోగా నరవాహనదత్తుడు అరణ్యములో గోముఖసహితముగా

ప్రయాణము చేసి బడలినాడు. అశ్వముమీద స్వారీ చేస్తూ పోతున్న అతన్ని ఒకకుమారి చూచి "నేను మాయావతి అనేవిద్యను. రత్నప్రభ నన్ను పంపినది. నిన్ను మధ్యేమార్గములో కాపాడుతాను. విచారించక ప్రయాణము చెయ్యి" అంటూ అతడు చూస్తూఉండగానే అంతర్థానమైనది. ఆమాయాశక్తివల్ల అతనిమార్గాయాసము తీరింది. రత్నప్రభాదేవి అనురక్తహృదయాన్ని స్తుతిస్తూ, సంధ్యావేళ తేటనీరున్న సరస్సును చేరినాడు. గోముఖుడూ రాజూ స్నానముచేసి తీయని పళ్ళు తిని, తేటనీరు తాగి అశ్వాలను ఒకచెట్టుకింద కట్టి గడ్డిగాదము పడవేసినారు. రాజు వృక్షశాఖలమీద నిద్రించి, గుర్రముల సకిలింపు విని బెదిరి కిందికి చూడగా సింహము గుర్రాలమీదికి వస్తున్నది. గుర్రాలను రక్షించవలె నని నరవాహనుడు చెట్టు దిగబోగా గోముఖుడు వారించి "ప్రాణాలకు తెగించి త్వరపడుతున్నావు. మంత్రాలోచన మాట మరిచిపోయినావు. తిర్యగ్జంతువులమీదికి పోరాదు." అన్నాడు. రాజు ఆలోచించి చెట్టుమీదనుంచి ఖడ్గాన్ని విసిరి వేసినాడు. సింహము కత్తిదెబ్బ తిని ప్రాణాలమీద, ఆశ వదిలి, కసికొద్దీ రెండో గుర్రాన్ని కూడా చంపివేసింది. నరవాహనుడు గోముఖుని ఖడ్గాన్ని తీసి సింహము మీద విసిరినాడు. ఆకత్తిదెబ్బకు సింహము రెండుఖండా లయింది. అతడు చెట్టుదిగి సింహముదగ్గిర పడిఉన్న కత్తిని తీసుకొని తరువు ఎక్కి ఆరాత్రి వృక్షశాఖమీదనే గడిపినాడు. తెల్లవారింది. నరవాహనుడు చెట్టుదిగి గోముఖునితో కలిసి కర్పూరసంభవ పురానికి పయనమైనాడు. త్రోవలో వినోదార్థము గోముఖుడు రాజుకు కథ చెపుతున్నాడు.

## ఇందీవరసేనుని కథ

అలకానగరిని తోసిరాజనే ఐరావతీనగరములో పరిత్యాగసేను డనే రాజుకు ఇద్దరుభార్యలు ఉన్నారు. ఒకభార్య మంత్రికుమార్తె.

ఆమె పేరు అధికసంగమ. రెండో భార్య 'కావ్యాలంకార' ఒక రాజపుత్రి రాజుకు సంతానము లేక పుత్త్రార్థము అంబికాదేవిని గురించి తపస్సు చేసి నాడు. దేవి తపస్సుకు మెచ్చి అతనికి స్వప్నములో సాక్షాత్కరించి రెండు దివ్యఫలాలను ఇచ్చి "ఈఫలాలను నీభార్యలు తిన్నయెడల ఇద్దరు మహావీరులు జన్మిస్తారు" అని అంతర్ధాన మైనది. రాజు లేచి సంతో షించి స్వప్నవృత్తాంతము భార్యలకు చెప్పి రజింపచేసినాడు. స్నానా దికము సాగించి దేవిపూజ చేసి వ్రతపారణ చేసినాడు. మొదటిరాత్రి రాజు అధికసంగమతో గడిపి ఒకఫలము ఆమెకు ఇచ్చినాడు. ఆమె ఫలాన్ని తిన్నది. ఆమె మంత్రికుమారి కనుక మంత్రిమీద గౌరవాతి శయమువల్ల రాజు రాత్రల్లా ఆమెతో గడిపినాడు. రెండోపండు రెండో భార్యకు ఇవ్వవలె నని రాజు తనతలగడకింద ఉంచినాడు. ఆయనకు నిద్ర రాగానే అధికసంగమ తనకే ఇద్దరు కుమారులు కలగవలె నని కోరి, రెండోఫలాన్ని కూడా తినేసింది. స్త్రీలకు సవతులమీద ద్వేషము సహజము. తెల్ల వారింది. రాజు లేచి పండుకోసము దిండు కింద వెతికితే కనపడ లేదు. అతడు విచారముతో మనసు మనసులో లేక పగలు గడిపి రాత్రి రెండోభార్యదగ్గిరికి వెళ్ళినాడు. ఆరాణి తనకు ఒకపండు ఇవ్వ మని భర్తను కోరింది. 'నీసవతి మోసము చేసి ఆపండు కూడా తానే తిన్నది.' అని రాజు చెప్పగా కావ్యాలంకార ఖేదపడినది.

నవమాసములు నిండగా అధికసంగమకు ఇద్దరు కుమాళ్ళు కలిగి నారు. రాజు అమందానందము అనుభవించి ఆనందోత్సవము చేసి నాడు. పెద్దకుమారునికళ్ళు ఇందీవరములవలె ఉండడమువల్ల ఇందీవర సేను డనీ, తనఇష్టములేకుండా భార్య ఫలము తిన్నది కనుక రెండో కుమారునికి అనిచ్ఛాసేనుడనీ పేర్లు పెట్టినాడు. సపత్నికి పుత్రద్వయము కలగడమువల్ల కావ్యాలంకార ఈర్ష్యాద్వేషములతో "అయ్యో! ఈ దుర్మార్గురాలు నాకు కొడుకులు లేకుండా మోసం చేసింది. దీనిమీద

తాచుపాముతో సవతిపోరు కొంటాను. దీనికుమాళ్ళను నాశనముచేస్తాను,” అని ఆలోచన చేసింది. ఆకుమాళ్ళు పెరుగుతున్నకొద్దీ సవతిహృదయములో వైరభావముకూడా ఎదుగుతున్నది. క్రమేణా కుమారులు యువకులై, జిగీషువులై తండ్రితో “తండ్రీ, మేము చాలా శస్త్రవిద్యను నేర్చినాము. మాకు వయసు వచ్చింది. ఈభుజాలను వ్యర్థముగా ఎలా భరించడము? జిగీష లేని క్షత్రియునికి పౌరుషము లెందుకు? ఈవయసు ఎందుకు? అందువల్ల మాకు దిగ్విజయము చేయవలెనని ఉత్సాహము పరవళ్ళు త్రొక్కుతున్నది. అనుమతి ఇవ్వండి” అని విన్నవించినారు. తండ్రి కుమారులదిగ్విజయయాత్రకు సన్నాహము చేయించి మీకు ఆపద కలిగితే అంబికను స్మరించండి. ఆదేవివరప్రసాదమే మీరు!” అని చెప్పి మంగళము పలికి ఆశీస్సులిచ్చి పంపినాడు. రాజకుమారుల సహాయార్థము ప్రజ్ఞాశాలి అయిన మంత్రినికూడా పంపినాడు.

రాకుమారులు ప్రథమములో తూర్పుదిక్కు జయించి, ఓడిపోయిన రాజులు వెంట రాగా దక్షిణదిశను జయించినారు. ఆవిషయము రాజదంపతులకు తెలిసి మురిసినారు. సవతితల్లి కావ్యాలంకార ద్వేషముతో మండిపడి సంధివిగ్రహకాయస్థునికి లంచమిచ్చి, వానిచేత “ఈనాకుమారులు భుజదర్పముచే భూమి నంతా జయించి నారాజ్యమును అపహరింప దలచినారు. మీరు నాభక్తులు అయితే విచారించక నాకుమాళ్ళను ఇద్దర్నీ వెంటనే హతమార్చవలసింది” అని రాజాజ్ఞగా ఉత్తరము వ్రాయించి, రహస్యముగా ఆజాబు వార్తాహరుని చేతికిచ్చి ఆకుమారులదండులో ఉన్న సామంతులకు పంపింది.

సామంతరాజులు రాజాజ్ఞ అతికఠినమనీ రాజనీతి కర్కశమనీ గ్రహించి ఏమీచేయలేక కూడబలుక్కొని రాజకుమారులమీద అనురాగము ఉన్నప్పటికీ వాళ్ళను సంహరింప దలచినారు. మంత్రికి ఆసంగతి తెలిసి, మనమలకు చెప్పి వాళ్ళను గుర్రాలమీద ఎక్కించి అరణ్యానికి

తీసుకు పోయినాడు. తాతగారితో రాజపుత్త్రిలు ప్రయాణము చేస్తూ వింధ్యారణ్యము ప్రవేశించారు. రాజపుత్త్రిల గుర్రములు మరునాడు మధ్యాహ్న వేళవరకూ ప్రయాణము చేయడమువల్ల దప్పికవల్ల కిందపడి చనిపోయినవి. ఆకలిదప్పికలవల్ల, ఎండదెబ్బవల్ల రాజపుత్త్రిలు చూస్తూ ఉండగా మంత్రి మరణించినాడు. "అయ్యో అపరాధమునేయనిమమ్మల్ని సవతితల్లి మాట విని తండ్రి మాప్రాణాలు తీయుస్తాడా!" అని వాళ్ళు దుఃఖపడి, పూర్వము తండ్రి చెప్పినప్రకారము అంబికాదేవిని స్మరించి నారు. దేవీస్మరణమాత్రాన రాజకుమారుల ఆకలిదప్పికలు తీరినవి, మార్గాయాసము శమించింది. వాళ్ళు వింధ్యాకాంతారవాసిని అయిన అంబికాదేవిని దర్శించి నిరాహారులై శతోరతపము ఆరంభించినారు.

ఈలోగా శిబిరములో సామంతులు కూడా రాజకుమారులను సంహరించాలని వచ్చి వాళ్ళు కనపడనందున రాజు ఏమనుకొంటాడో నని భయపడ్డారు. ఆసామంతులు పరిత్యాగిసేనరాజు దగ్గిరికి వెళ్ళి ఆజాబు చూపించి సంగతి యావత్తూ మనవి చేశారు. రాజు వృత్తాంతము విని ఆశ్చర్యపడి ఉగ్రుడై "ఇది నాఉత్తరము కాదు. మాయగా ఉంది! మీరు ఈమాత్రము గ్రహించలేదే! తపస్సు చేసి కన్నకొడుకులను చేతులారా చంపుతానా? మీరు పిల్లలను చంపేశారా?" అని ఆదుర్దాగా ప్రశ్నమీద ప్రశ్న అడిగి తప్పుడుజాబు వ్రాసిన కాయస్థుణ్ణి పిలిపించినాడు. ఆకాయస్థుడు పారిపోయి పట్టుపడినాడు. రాజు వాణ్ణి శిక్షించి వాడివల్ల తనభార్య కావ్యాలంకార చేసిన ద్రోహము తెలుసుకొని ఆమెను నేలమాళిగలో ఉంచినాడు. రాజు సామంతులను తప్పించి ఆఅధికారములో కొత్తవాళ్ళను నియమించి కుమారుల క్షేమసమాచారాలు తెలుసుకొంటూ అంబికాధ్యానము చేస్తూ ధర్మకార్యములు ఆచరిస్తున్నాడు.

వింధ్యారణ్యములో వింధ్యవాసినీదేవి ఇందీవరసేనుని తపస్సుకు ప్రీతి

చెంది స్వప్నములో సాక్షాత్కరించి ఖడ్గమిచ్చి "పుత్రా! ఈఖడ్గప్రభావమువల్ల శత్రుకోటిని అవలీలగా జయించగలవు. నీకోరిక లన్నీ సిద్ధిస్తవి" అని పలికి అంతర్ధానమైనది. ఇందీవరసేనుడు నిద్రలేచి చేతకత్తి చూచి తమ్మునికి చూపి స్వప్నవృత్తాంతము చెప్పి సంతోషపెట్టినాడు. ఉదయము అతడు వన్యాహారములతో పారణచేసి దేవీదర్శనము చేసి నమస్కరించి ఆమెఅనుగ్రహమువల్ల అమందానందము పొంది కత్తి చేతపట్టి సోదరసహితముగా బయలుదేరినాడు. అన్నదమ్ములు కొంత మేర ప్రయాణము చేసి మేరుపర్వతశిఖరాల వంటి బంగారుమేడలతో ఉన్ననగరాన్ని చూచినారు. నగరద్వారాన రాక్షసుడు పహారా ఇస్తూ ఉండగా అన్నదమ్ములు వాణ్ణి నగరనామము నగరపాలకుని నామము అడిగినారు. అది శైలపుర మనీ, యమద్రంష్ట్రు డనేరాక్షసుడు రాజనీ, శత్రునాశకు డనీ చెప్పినాడు. ఇందీవరసేనుడు రాక్షసరాజును హత మార్చవలెనని పురములో ప్రవేశించినాడు. ద్వారపాలకుడు రాజపుత్రుని పోనీయక ఆటంకపరచగా, ఇదీవరసేనుడు కత్తి దూసి వాని తల నరికి నాడు. అతడు రాజమందిరమున జొరబడి సింహాసనముమీద కూర్చున్న భీకరాకారు డయిన యమదంష్ట్రుని చూచినాడు. చూచి వెంటనే అతనిని తనతో యుద్ధానికి పిలిచినాడు. రాక్షసుడు కత్తి దూసి లేచి హోరా హోరిగా ఇందీవరసేనునితో పోరినాడు. ఆద్వంద్వయుద్ధములో రాక్షసుని తల చాలసార్లు తెగి పడిపోవడమూ, మళ్ళీ తల మొలవడమూ సంభవించింది. ఆరాక్షసమాయ గ్రహించి అతనిపక్కనే ఉన్న కుమారి, ఇందీవరసేనునిమీద అనురాగమువల్ల అతనికి సంజ్ఞ చేసింది. ఆకన్య చేసినసంకేతము గ్రహించి రాజపుత్రుడు ఒక్కవేటుతో రాక్షసుని శిరస్సును రెండుగా చీల్చివేసినాడు. రాక్షసునిశక్తి నిర్జీవమైపోగా తల తిరిగి మొలవలేదు. అతడు వెంటనే మరణించినాడు. అక్కడ ఉన్నవరాంగనా కుమారికలను ఇందీవరసేనుడు "ఎవ రీరాక్షసరాజు? ఇతనిమరణము

వల్ల మీాకు సంతోషము ఎందుకు? అని కుతూహలముతో అడిగినాడు. అప్పుడు కుమారి రాక్షసవృత్తాంతము చెప్పుతున్నది. "ఈశైలపురాన్ని వీరభుజుడనేరాజు పరిపాలిస్తున్నాడు. ఈమె మదనదంష్ట్ర రాజపత్ని. రాక్షసుడు రాజును మాంత్రికశక్తివల్ల భక్షించినాడు. రాజపరివారాన్ని కూడా రాక్షసుడు తనపొట్టన పెట్టుకొన్నాడు. అతడు రాజపత్నిని ఉంచుకొని, నిర్మానుష్యమైన యీనగరంలో సువర్ణగృహము కట్టించుకొని, పరివారాన్ని పంపి ఈమెతో సుఖము అనుభవిస్తున్నాడు. నాపేరు ఖడ్గదంష్ట్ర. నేను ఈమెచెల్లెలిని. కన్యను. నిన్ను చూచి వలచినాను. రాక్షసుడు మరణించగా మనవివాహానికి ఏమీా అడ్డంకి ఉండదు." ఇందీవరసేనుడు గాంధర్వవిధిగా ఖడ్గదంష్ట్రను వివాహము చేసుకొని దేవీ కరవాల మహిమాతిశయమువల్ల, స్మరణమాత్రాన కలిగినభోగములను అనుభవిస్తూ తమ్మునితో అక్కడే ఉన్నాడు.

ఒకనాడు ఇందీవరసేనుడు అంబికాదేవిని తలచినాడు. ఆదేవీకటాక్షమువల్ల విమానాన్ని నిర్మించి, తమ్ముడైన అనిచ్ఛాసేనుణ్ణి అందులో ఎక్కించి తనవిషయము విశదముగా తెలియచేయమని తల్లిదండ్రుల దగ్గిరికి పంపినాడు. అనిచ్ఛాసేనుడు ఐరావతీనగరికి వెళ్ళి, చంద్రునికి చకోరాలవలె ఉన్న జననీజనకులను తనరాకవల్ల సంతోషపెట్టి వారికి ప్రణమిల్లినాడు. అతడు అన్నగారికష్టసుఖాలు తల్లికీ తండ్రికీ చెప్పినాడు. సవతితల్లి చేసినద్రోహమని అతడు తెలుసుకొని అందరిఆదరము పొందుతూ అక్కడే కొన్నాళ్ళపాటు ఉన్నాడు. ఇలా ఉండగా అతనికి దుస్స్వప్నము వచ్చింది. అప్పు డతడు అన్నగారిని తలచి తండ్రితో "నాన్నా, నేను అన్నను తీసుకొని వస్తాను. నాకు సెలవియ్యండి!" అని అడిగి, విమానము ఎక్కి గగనమార్గాన ప్రయాణము చేసి శైల పురికి వెళ్ళి ఉదయాన అన్నగారిదగ్గిరికి వెళ్ళిచూడగా ఇందీవరసేనుని ప్రక్కనే ఖడ్గదంష్ట్రా మదనదంష్ట్రలు దుఃఖిస్తూ ఉన్నారు. ఇందీవర

సేనుడు మాట లేకుండా నేలమీదపడి ఉన్నాడు. అనిచ్ఛాసేనుడు అన్న గారిదురవస్థకు కారణము తెలుసుకోవలె నని వాళ్ళను అడిగినాడు. మదనదంష్ట్ర అక్కను తిట్టగా ఆమె ఇలా అన్నది: "నీవు వెళ్ళిన తరువాత నేను ఒకపర్యాయము స్నానానికి వెళ్ళగా నీఅన్న మాఅక్కయ్యతో కలిసి ఉండగా నేను వచ్చి ప్రత్యక్షముగా చూచాను. నాకు వల్లమాలిన ద్వేషము కలిగింది. ఖడ్గప్రభావమువల్ల నాభర్త లక్ష్య పెట్టక వ్యభిచరిస్తున్నాడు. ఈపొగరుఅణచా లని ఆయన నిద్రపోగా ఖడ్గాన్ని అగ్నిలో పడవేశాను. ఖడ్గము మలినమైనది. ఈయన ఇలా పడిఉన్నాడు. మదనదంష్ట్ర నన్ను తిట్టిపోసింది. నాకు పశ్చాత్తాపము కలిగింది. కర్తవ్యము తోచక అక్కచెల్లెళ్ళము చనిపో దలుచుకోగా సమయానికి నీవు వచ్చినావు. అందువల్ల నీవే మమ్మల్ని నరికి వెయ్యి" రాజపుత్రుడు బాధపడి కింకర్తవ్య తామూఢుడై కత్తిదూసి తనను పొడుచుకోబోగా అశరీరవాణి "రాజకుమారా, సాహసము వద్దు. నీఅన్న చావ లేదు. ఖడ్గాన్ని మరిచిన నీఅన్నకు బుద్ధి చెప్పా లని దేవి ఇతన్ని మూర్ఛపాలు చేసింది. ఖడ్గదంష్ట్ర అపరాధిని ఎంత మాత్రమూ కాదు. వీ రిద్దరూ పూర్వజన్మలో నీఅన్న భార్యలు. అందువల్ల నీఅభీష్టము నెరవేరేందుకు దేవిని ప్రార్థించు" అని పలికింది.

అనిచ్ఛాసేనుడు మరణప్రయత్నము మాని అగ్నికళంకిత మైనకత్తిని తీసుకొని విమాన మెక్కి వింధ్యవాసినీ దేవి పాదాలసన్నిధికి వెళ్ళి అక్కడ తనశిరసును బలి ఇచ్చి, దేవికి తృప్తి కలిగించా లని కత్తి దూసినాడు. అశరీరవాణి 'పుత్రా' సాహసించకు. నీఅన్న జీవిస్తాడు. నీభక్తి గొప్పది. కత్తి అమలినము అవుతుం" దని పలికింది.

కత్తి స్వచ్ఛమై తళతళ మెరయగా అతడుదాన్ని చేత పుచ్చుకొని దేవికి ప్రదక్షిణ నమస్కారాలు చేసి విమానము ఎక్కి ఉత్సుకుడై శైలపురికి వెళ్ళినాడు. సరిగా అప్పుడే ఇందీవరసేనుడు మూర్ఛనుంచి

లేచినాడు. తమ్ముడు అశ్రుపూరితలోచనుడై అన్న పాదాలమీద పడి నాడు. అన్న తమ్ముని కంఠాలింగనము చేసినాడు. భర్తను రక్షించి నందుకు వారి భార్లు అనిచ్ఛాసేనుని పాదాలదగ్గిర వాలినారు. ఇందీవర సేనుడు ఆతూనాలముతో సంగతి ఏమి టని ప్రశ్నించగా తమ్ముడు జరి గిన దంతా విశదముగా చెప్పినాడు. ఇందీవర సేనుడు ఖడ్గదంష్ట్రమీద కోపగించ లేదు. అతడు భ్రాతృభక్తికి చాలా మెచ్చుకొన్నాడు. అతడు జననీ జనకులను చూడవలె నని ఉవ్విళ్ళూరి, సవతి తల్లిచేసినద్రోహాము విని తమ్ముడిచ్చినకత్తిని గ్రహించి అంబికాదేవిని ధ్యానించగా వింధ్య వాసినీదేవి అయినఅంబిక కటాక్షించి విమాన మిచ్చింది. ఇందీవరసే నుడు, అతనితమ్ముడూ, ఖడ్గమతనదంష్ట్రలూ విమాన మెక్కి, లోకు లంతా ఆశ్చర్యపడుతూ ఉండగా ఐరావతీ నగరికి వెళ్ళి ఆకాశమునుంచి దిగినారు. అన్నదమ్ములు తల్లిదండ్రులకు నమస్కారము చేయగా వారి శిరములు జననీజనకుల బాష్పధారలతో తడిసినవి. స్నురద్రూపిణు లైనఇద్దరు కోడళ్ళను చూచి అత్తమామలు సంతోషించినారు.

ఇందీవరసేనుడు జాయాసహితముగా తల్లిదండ్రులవద్ద కొంతకాలము నివసించి తండ్రిఅనుమతి పొంది తమ్మునితో దిగ్విజయయాత్రకై బయలు దేరినాడు. దేవీదత్త ఖడ్గప్రభావమువల్ల ఇందీవరసేనుడు పృథివీచక్రాన్ని నిర్వక్రపరాక్రమముతో జయించి సామంతులనుంచి సువర్ణగజఘోటకము లనుతననగరికి తెచ్చినాడు. ఇందీవరసేనుడు సోదరసమేతముగా రాజ ధానీనగరి ప్రవేశించి, తల్లిని ఆమందానందములో ఓలలాడించినాడు. అతడు మరునాడు పృథివీమండలాన్ని తండ్రికి అర్పించినాడు. అతనికి సుప్తోత్థితునికివలె ఆకస్మికముగా పూర్వజన్మజ్ఞానము కలిగింది.

ఇందీవరసేనుడు తండ్రితో ఇలాఅంటున్నాడు: "తండ్రీ! పూర్వజన్మ జ్ఞానము నాకు కలిగింది. హిమపర్వతసానువులమీద ముక్తానగరాన్ని ముక్తాసేనుడు అనేవిద్యాధరేశ్వరుడు పరిపాలిస్తున్నాడు. ఆరాజుకు

కంబుమతి అనేవారివల్ల పద్మసేన రూపసేన నామధేయు లయిన ఇద్దరుకుమారులు కలిగినారు. పద్మసేనుడు స్వయంవరంగా ఆదిత్యప్రభ అనేవిద్యాధరకన్యను వరించినాడు. అది చూచి దానిచెలి చంద్రమతి అనేవిద్యాధరి కామాసక్తితో అతనిని వరించింది. ఇద్దరిభార్యల ఈర్ష్యవల్ల అతడు వేగిపోతున్నాడు. రెండుకొప్పులు ఒక చోట ఎలా ఇముడుతవి? భార్యలపోరు పడలేక తపోవనికి వెళ్ళి దుఃఖనివృత్తిమార్గము చూసుకొంటా నని అతడు తండ్రిఅనుమతి వేడినాడు. అందుకు తండ్రి అలిగి "తపోవనానికి పోవడము ఎందుకు! మానవలోకానికి వెళ్లు. కలహాసక్త అయిన నీభార్య ఆదిత్యప్రభ రాక్షసజాతిలో పుట్టి నీభార్య అవుతుంది. నీమీద ప్రేమతో ఉన్న చంద్రమతి మానవలోకములో నిన్నే పతిగా పొందుతుంది. నీవెంట రాదలచిన నీతమ్ముడు వచ్చేజన్మలో నీతమ్ముడై జన్మిస్తాడు. ఇద్దరిభార్యలపోరు ఇంతటితో తీరక ఇంకా కొంతకాలము అనుభవిస్తావు." అని "రాజపుత్రుడవై భూచక్రమును జయించి తండ్రికి నీ విచ్చినప్పుడు, వీరితో కూడా జాతిని స్మరించి విముక్తి పొందుతావు" అన్నాడు."

తండ్రి ఇలా పలుకగా పద్మసేనుడు స్వజనులతో మర్త్యలోకములో అవతరించినాడు. నాయనా, ఆపద్మసేనుడను నేనే; నీకుమారుడు ఇందీవర సేనుడనయి పుట్టి నాకృత్యము నెరవేర్చినాను. రూపసేనుడను రెండవ విద్యాధర కుమారుడు నాతమ్ముడు అనిచ్ఛాసేను డైనాడు. ఆఆదిత్య ప్రభ, చంద్రమతి ఈఖడ్గదంష్ట్రా మదనదంష్ట్రలు. ఇప్పటికి మాశాపము తీరింది. నాయనా! మేము విద్యాధరపదము పొందుతాము.

ఇలా అని అన్నదమ్ములు, భార్యలు మానవరూపములు విడిచి పెద్దలకు ప్రణామము చేసినారు. ఇందీవర సేనుడు (పద్మసేనుడు) భార్యలను నిజాంకమున కూర్చోపెట్టుకొని ముక్తాపురకి వెళ్ళినాడు. అతనిని అతనిభార్యలను చూచి ముక్తాసేనుడు కంబుమతి సంతోషించినారు. ఆదిత్యప్రభ, చంద్రమతి ఈర్ష్య లేకుండా సుఖముగా ఉంటున్నారు.

ఇలాగోముఖుడు నరవాహనదత్తునికి మార్గాయాసము ఆపనయించే నిమిత్తము కథ చెప్పి "గొప్పవారికి గొప్పక్లేశము కలిగినా, చివరకు మహాభ్యుదయము కలుగుతుంది. సామాన్యులసుఖదుఃఖాలు అల్పముగా ఉంటవి. రత్నప్రభాదేవి విద్యామహిమాతిశయముచేత నీవు సురక్షితముగా కర్పూరికను పొందగలవు."

నరవాహనుడు కథ విని మార్గాయాసము ఎరుగక నడిచి సందెవేళ రాజహంసరాజితమైన పద్మనిలయమైనసరస్తీరము చేరి సరస్సులో స్నానము చేసి భక్తితో శివపూజ కావించి సురభిమధురఫలములను ఆరగించి, మిత్రునితో చిగురుపాన్పుమీద రాత్రి శయనించినాడు.

## త రం గ ము : 43

మరునాడు ఉదయాన నరవాహన గోముఖులు సరస్సునుంచి ప్రయాణము సాగించినారు. రాజు గోముఖునితో "ప్రియమిత్రుడా ! రాత్రి నాకు స్వప్నములో తెల్లవారేముందు తెల్లచీరె కట్టుకొన్న దివ్యకన్య కనబడి, "వత్సా, చింతపడకు. సముద్రతీరాన అరణ్యముచివర మహానగర మున్నది. అక్కడ విశ్రాంతి తీసుకో. తరువాత కర్పూరసంభవ నగరము వెళ్ళగలవు. కర్పూరిక నీకు లభిస్తుంది' అన్నది" అని చెప్పినాడు. గోముఖుడు "దేవా! నీపైన దేవతానుగ్రహము కలిగింది. నీకు అసాధ్యమేమి ఉన్నది? నీకోరిక తప్పక ఈడేరుతుంది" అన్నాడు.

నరవాహనదత్తుడు లోలోపల సంతోషించి సముద్రతీరాన ఉన్న మహానగర విపణివీధిలో ప్రవేశించినాడు. ఎక్కడ చూచినా సాలభంజికలు వారవిలాసినీరూపములతో విలసిల్లి చేష్టలు మాత్రము చేస్తున్నవి. నరవాహనదత్తుడు గోముఖునితో రాజమందిరములోకి వెళ్ళి చూడగా అక్కడకూడా కొయ్యబొమ్మలు చేష్టలు చేస్తూ ఉన్నవి. అక్కడ అశ్వములు గజములుకూడా యంత్రాలవలెనే ఉన్నవి. రాజు గోముఖు

నితో కూడా సువర్ణవితారమైన రాజగృహమును చూచి ఆశ్చర్యపడుతూ అందులో ప్రవేశించి అక్కడి యంత్రములవలె చేష్టలతో ఉన్న ప్రతీహారినీ, వేశ్యాంగనాపరివృతుడై, జడము లయిన ఇంద్రియాలను నడిపించే ఆత్మవలె రత్నసింహాసనాధిష్ఠాతనూ చూచినాడు. ఆభవ్యపురుషుడు నరవాహనుని చూచి లేచి కుశల మడిగి నిజాసనము మీద కూర్చోబెట్టి “ఎవరు నీవు? ఎందుకు ఒక్కణ్ణే వెంటబెట్టుకొని వచ్చావు?” అని ప్రశ్నించినాడు. నరవాహనదత్తుడు స్వవిషయము చెప్పి అతని వృత్తాంతము చెప్పుమని కోరగా ఆభవ్యుడు ఇలా చెప్పుతున్నాడు:

## వ్రడంగి సోదరుల కథ

భూదేవీకాంచివలె గుణగుంభిత కాంచీనగరిని బాహుబలమహారాజు పరిపాలన చేస్తున్నాడు. అతడు భుజదర్పమువల్ల శ్రీని జయించి సిరిని కోశాగారములో బంధించి చాపల్యమును పోగొట్టినాడు. ఆయనరాజ్యములో మయశిల్పి ప్రాణములో మహాసమర్థులమై మే మిద్దరము అన్నదమ్ములము ఉన్నాము. నాఅన్న ప్రాణధరుడు వేశ్యాలోలుడు. నాపేరు రాజ్యధరుడు. మాఅన్న పిత్ర్యమైన ఆస్తిని స్వార్జితాన్ని కూడా ఖర్చు చేసి, ఆస్తి పోయినా వేశ్యను పోషించడానికి ధనార్జన చేయవలసి వచ్చింది. అతడు అతివ్యసనాన కొయ్యతో హంసలను రెండిటిని నిర్మించి, తాడువల్ల వాటిని కదలేటట్టు చేసినాడు. తాడు లాగితే ఆరెండు హంసలూ రాత్రి ప్రయాణము చేసి మహారాజ కోశాగారమునుంచి యంత్రప్రయోగముచేత కిటికీద్వారా ప్రవేశించి, పేటికలో ఉన్న ఆభరణము మాఅన్నకు తెచ్చి ఇచ్చేవి. మాఅన్న ఆనగను అమ్మి డబ్బు చేసుకొన్న దాన్ని పోషించుతున్నాడు. ఇలాగే ప్రతిరోజూ మాఅన్న మహారాజు ధనాగారాన్ని దోస్తున్నాడు. అకార్యకరణము కూడదని నేను హితము చెపితే వాడు పెడచెవిని పెడుతున్నాడు. కోశాగారాన్ని

పహారా ఇచ్చేవాడు, కోశాగారాధ్యక్షుడూ బొక్కసములో ధనము తరిగిపోవడము గ్రహించి తెల్లపోయి ప్రభువుకు నివేదించినారు. కోశాగారములో రక్షకులు రాత్రల్లా మేలుకొని సంగతి కనిపెట్టవలసిందని రాజు ఆజ్ఞ ఇచ్చినాడు.

పహారావాళ్ళు రాజాజ్ఞప్రకారము మేలుకొని ఉండగా, మాఅన్న పంపినరెండుహంసలూ యథాప్రకారముగా గవాక్షమార్గాన కోశాగారములో దిగి యంత్రప్రయోగమువల్ల జరుగుతూ ముక్కుతో నగను కరుచుకొని పోబోయినవి. పహారావాళ్ళు హంసల తాళ్ళను తెంపి వాటిని రాజుకు చూపించాలని నిశ్చయించుకొన్నారు. హంసలు తిరిగి రాకపోవడమువల్ల మాఅన్న తికమక పడుతున్నాడు. అతడు నాతో "తమ్ముడూ! తాడు తెగింది! యంత్రములో సీల జారిపోయినవి. ఇక్కడ నుంచి మనము మకాము ఎత్తెయ్యాలి. ఇక్కడే ఉన్నామా మనల్ని రాజు పట్టుకొంటాడు. అదివరకే మాయాయంత్రశిల్పులు మని మనకు పేరుప్రతిష్ఠ లున్నవి. ఒకసారి మర తిప్పితే ఎనిమిదివందల యోజనాలు వెళ్ళగల నావాయువిమానము ఎక్కి విదేశానికి పోదాము. ఆప్తవాక్యము విననందుకు ఫలము అనుభవిస్తున్నాను. దుష్కర్మానుభవము నీమీదికికూడా వచ్చింది" అంటూ సకుటుంబముగా అతడు ఆకాశవిమానము ఎక్కినాడు. నేను మాత్రము విమానము ఎక్కలేదు. మాఅన్న ఎక్కడికో విమానములో వెళ్ళిపోయినాడు.

తెల్లవారితే నాప్రాణాలకూ మోసము వస్తుందిఅని గ్రహించి నా వాయువిమానములో నేను ఎక్కి రెండువందలయోజనాలు ప్రయాణము చేశాను. సముద్రతీరాన ఈవిమానాన్ని వదిలి సందేహముతో ఈనిర్జన మైనపట్టణము చేరినాను. రాజమందిరములో ప్రవేశించి వస్త్రాభరణ శయ్యాభోగములు అనుభవించినాను. సంజవేళ నేను ఉద్యానములోని సరస్సులో స్నానము చేసి పళ్ళు తిని రాజశయ్యమీద పరుండి,

“మనుష్యులు లేనిచోట నేను ఏమి చెయ్యను? తెల్లవారినతరువాత ఎక్కడికయినా పోతాను. ఇప్పటికి బాహుబలమహారాజువల్ల భయము తీరిపోయింది,” అనే ఆలోచనలో నాకు కంటికి కునుకు పట్టింది. స్వప్నములో దివ్యపురుషుడు మయూరవాహనుడై వచ్చి “ఇక్కడే ఉండు. మ రెక్కడికీ వెళ్ళకు. ఆహారసమయాన మధ్యమపురము వెళ్ళు” అని చెప్పి అదృశ్యుడైనాడు. నేను నిద్ర లేచి కుమారస్వామి నిర్మించిన పవిత్రప్రదేశమే ఆపుర మని గ్రహించి కుమారస్వామివారి అనుగ్రహము నామీద కలిగిం దని అక్కడే ఉండ దలచినాను. ఆహ్నికము నెరవేర్చుకొని భోజనానికి మధ్యమపురము వెళ్ళినాను. వెళ్ళిచూచేప్పటికి సువర్ణపాత్రల నిండా నెయ్యి, పాలు, అన్నమూ ఉన్నవి. స్వేష్టకృత్తుగా కంఠదఘ్నముగా తిండి తిని తుష్టి పొందినాను. స్మరణమాత్రాన సమస్తభోగాలు అనుభవిస్తున్నాను. అయితే ధ్యానమువల్ల ప్రియాదిపరిజనము మాత్రము రాలేదు. నేను ఒంటరితనము ఓర్చలేక యంత్రమయజనాన్ని నిర్మించాను. ఇలా ఏకాకినై అదృష్టమువల్ల రాజఠీవితో రాజభోగాలను జరుపుకొంటున్నాను. దేవనిర్మితమైన ఈనగరములో మీరు ఉండండి. మీకు యథాశక్తి సపర్యలు చేయిస్తాను.”

రాజధరుడు ఇలా చెప్పి నరవాహన గోముఖులను నగరోద్యానవాటికకు తీసుకొని వెళ్ళినాడు. నరవాహనదత్తుడు దిగుడుబావిలో స్నానము చేసి తామరపువ్వులతో శివపూజ చేసినాడు. భోజనవేళ సమీపించగా రాజధరుడు వాళ్ళిద్దరినీ మధ్యమపురము తీసుకు వెళ్ళినాడు. రాజధరుడు ధ్యానము చేయగా బంగారుగిన్నెలలో షడ్రసోపేతమైనఆహారము నిండినది. అందరూ భోజనము చేసినారు. భోజనప్రదేశము దానంతట అదే పరిశుద్ధ మయింది. నరవాహనదత్తుడు తాంబూలము వేసుకొని ఆసవములు సేవించినాడు. అతను ఆనగరమహత్త్వమునకు ఆశ్చర్యపడి, రాజధరుడు రాత్రిభోజనము చేసినతర్వాత విశ్రమించి

నాడు. నరవాహనునికి సుఖభోజనము, సుఖతల్పము ఉన్నా కర్పూరిక మనసులో తారాడుతూ ఉండడమువల్ల నిద్రపట్టలేదు. రాజధరుడు "ఏమి, నిద్ర పట్టడం లేదా? నీప్రియురాలు లభ్య మవుతుంది. అంగన లక్ష్మివలె స్వయముగా మహాసత్వుణ్ణి వరిస్తుంది. ఇందుకు తార్కాణ ముగా కథ చెవుతాను :

## మానపర కథ

"నేను చెప్పిన కాంచీనగరరాజు బాహుబలునిదగ్గిర అర్థలోభుడనే సార్థకనామధేయుడు ప్రతీహారుడు. అతనిభార్య మానపర చక్కనిచుక్క. అతడు అర్థలోభమువల్ల పనివాళ్ళను విశ్వసించక, పనిపాటలూ, వర్తకవ్యాపారములూ చూడుమని భార్యను నియోగించినాడు. ఆమెకు ఇష్టము లేకపోయినా అతనిమాట తోసివెయ్య లేక వర్తకులతో బేర సారాలు చేస్తూ ఉన్నది. ఆమెఅందచందాలవల్ల మధురభాషణ ములవల్ల లోకు లందరూ ఆకర్షణలో పడ్డారు. గజాశ్వరత్న వ్యాపార ములో ఆమెకు కావలసినంత లాభము వచ్చింది. అర్థలోభుడు అర్థ ప్రధానుడు కనుక సంతోషించినాడు. ఒకనాడు అక్కడికి దూరదేశము నుంచి సుఖధను డనేవర్తకుడు అశ్వములు, వస్త్రాభరణాలు తీసు కొనివచ్చినాడు. అతనిరాక తెలిసి అర్థలోభుడు భార్యతో "సుఖధను డనే వైశ్యుడు వచ్చాడు. అతడు ఇరవైవేల గుర్రాలూ, చీనాదేశము నుంచి పట్టుబట్టలూ తెచ్చినాడు. నీవు అతని దగ్గిరికి వెళ్ళి అయిదువేల అశ్వములను, పదివేలపట్టుతాపితాలను కొను. ప్రస్తుతము నాదగ్గిర ఉన్నగుర్రాలతో, కొనబోయేవాటితో రాజదర్శనముచేసి వర్తకము చేస్తాను" అని చెప్పినాడు.

మానపర సుఖధనునిదగ్గిరికి వెళ్ళి అశ్వములను, వస్త్రాలను మూల్యా నికి అడిగితే ఆమెలావణ్యమును తిలకించి మోహించి ఏకాంతములో

"నీకు వస్త్రముగాని అశ్వముగాని ధరకు ఇవ్వను. నాతో ఒకరాత్రి గడిపితే అయిదువందల అశ్వాలను అయిదువేల పట్టుతాపితాలను ఇస్తాను" అని ఆమెను వేడినాడు. మానపర భర్తదగ్గిరికి వెళ్ళి వర్తకునికోరిక తెలిపింది.

అర్థలోభుడు అర్థలోభమువల్ల "ప్రియా, అయిదువందల అశ్వాలు, అయిదువేల పట్టుబట్టలు ఒకరాత్రి లభిస్తూ ఉండగా ఈవిషయములో దోషమేమిటి? వెళ్ళు. తెల్లవారగానే ఇక్కడికిరా" అని భార్యను వర్తకునిదగ్గిరికి పంపినాడు. మానపర "ఛీ! భార్యను అమ్ముకొనే మహాపాపి వీడు! మహాలోభి. వందలకొద్దీ గుర్రాలు, వేలకొద్దీవస్త్రాలు ఒకరాత్రే ఇచ్చే ఉదారుడయినవర్తకుడే నాభర్త!" అని తలచి సుఖధనుని దగ్గిరకి వెళ్ళింది. రాత్రి సుఖధనుడు మానపరతో గడిపి కృతార్థుడైనట్టు భావించి అన్నమాటప్రకారము అశ్వాలూ పట్టుబట్టలూ అర్థలోభునికి పంపినాడు. అర్థలోభుడు లజ్జాభిమానములు లేక, పరపురుషుని కూటమి పొందినభార్యను పిలుచుకొని రమ్మని నౌకరులను పంపినాడు. మానపర సేవకులతో "నేను అమ్ముడు పోయి ఇతరునిభార్యనైనాను. అర్థలోభుని అర్ధాంగిని ఎలా అవుతాను? ఆయనకు సిగ్గు లేకపోతే నాకు మాత్రము ఉండనద్దా? వెళ్ళండి. ఎవరు నన్ను కొన్నాడో వాడే నాభర్త" అని నిశ్చయముగా చెప్పింది. నౌకర్లు తలఎత్తుకోలేక అలాగే వెళ్ళి అర్థలోభునితో మనవి చేశారు. అర్థలోభుడు భార్యను బలాత్కారముగా తీసుకురా దలచినాడు. అప్పుడు హరబలుడు అనేవైద్యుడు అర్థలోభునితో "సుఖధనుడు వీరుడు. అతని దగ్గిర నీకు ధైర్యము ఉండదు. అతనిఔదార్యమును చూచి నీభార్య అతనినే భర్తగా తలచింది. నీతరం కాదు ఆమెను తీసుకురావడం! అతనికి ఎంతమందో స్నేహితు లున్నారు; చాలా బలగము ఉన్నవాడు. అసలు నీది లోపము. నీలోపము చూచి మానపర అసహ్యించుకొని ఆ వర్తకుణ్ణి ప్రేమించింది. నీవు చేతకానివాడవు. ఏమిచేయగలవు? నీసంగతి

తెలిస్తే రాజు కోపగిస్తాడు. భార్యను అమ్మినవాడు ఎవడయినా ఉంటాడా? నోరుమూసుకొని కుక్కిన పేనులా ఉండు. నలుగురినోళ్ళలో పడకు" అని హితము చెప్పినాడు. అతనిమాట అర్థలోభుడు పెడచెవిని పెట్టి ఉగ్రుడై సుఖధనుని ఇంటిని ముట్టడించినాడు. అర్థలోభుని పరివారము అడుగంటింది. కర్తవ్యము తోచక అతడు పారిపోయి రాజుతో "దేవా! నాభార్యను సుఖధనుడు అనే వర్తకుడు హరించినా" డని ఫిర్యాదు చేసినాడు. రాజు సుఖధనుని దండించ తలచినాడు. అప్పుడు సంధానుడనేమంత్రి రాజుతో "ప్రభూ! ఆవర్తకునికి పరివారము చాలా ఉంది. లక్షకు పైమాట అశ్వాలు. మీరు తొందర పడకండి. దూతను పంపి సుఖధనుని అభిప్రాయము తెలుసుకోండి" అని సలహా చెప్పగా రాజు దూతను పంపినాడు. మానపర తనసంగతి యావత్తూ చెప్పింది. రాజు దూతముఖముగా మానపరవృత్తాంతము తెలుసుకొని, ఆమెను చూడగోరి అర్థలోభునితో సుఖధనుని ఇంటికి వెళ్ళినాడు. సుఖధనుడు రాజును సన్మానించినాడు. రాజు మానపరను చూచినాడు. ఆమె అతని పాదాలమీద పడి భర్త వింటూ ఉండగా యథార్థము చెప్పింది. అర్థలోభుడు విని తూష్ణీంభావము వహించగా రాజు ఆమెను 'ఇప్పుడేమి చేయవలె?' అని అడిగినాడు. మానపర మనసులో నిశ్చయించుకొని "దేవా, ఆపద లేనప్పుడు నన్ను నాభర్త సుఖధనునికి విక్రయించినాడు. చేతగానిభర్తతో నేను కాపురము ఎలాచెయ్యాను?" అన్నది.

రాజు ఆమెమాటలకు అంగీకరించినాడు. అర్థలోభుడు మతిలేక మనసులో ఆరాటపడుతూ "దేవా సుఖధనుడూ నేను సైన్యము లేకుండా బాహుబలముతో యుద్ధము చేస్తాము. మాబలాబలాలు అప్పుడు తెలుస్తవి" అన్నాడు. సుఖధనుడు అందుకు అంగీకరించి "యుద్ధములో ఎవరు గెలిస్తే మానపర వానిసొమ్ము" అని చెప్పినాడు. రాజు సరే అన్నాడు. రాజూ మానపర చూస్తూండగా సుఖధన అర్థలోభులు గుర్రా లెక్కి-

యుద్ధభూమికి వచ్చారు. యుద్ధారంభములో అర్థలోభుని అశ్వము బెదిరిపోటువల్ల ఎగిరి పడగా అర్థలోభుని సుఖధనుడు నేల కూల్చి నాడు. అలాముూనుషార్లు బాధపడి గిలగిల కొట్టుకొని గుర్రము చని పోయింది. ఆగుర్రషుమీాదినుంచి అర్థలోభుడు నేలమీాద పడినాడు. అవకాశము దొరికింది కదా అని సుఖధనుడు అధర్మయుద్ధము చేసి శత్రువును చంపలేదు. చివరకు అర్థలోభుడు నూతనాశ్వమునుంచి కింద పడి చేతనము కోల్పోగా నౌకర్లు అతన్ని ఇంటికి తీసుకొని పోయినారు. సుఖధనుడు రాజువల్ల సత్కారములు పొందినాడు. అర్థలోభుడు అక్ర మముగా ఆర్జించినఆస్తి రాజు స్వాయత్తము చేసుకొన్నాడు. సుఖ ధనుడు నిజబలమువల్ల మానపరను సంపాదించి సుఖపడుతున్నాడు. సత్త్వవంతుణ్ణి అదృష్టము ఆశ్రయించి తీరుతుంది.

అందువల్ల ప్రభూ! చింత పడకు. సుఖంగా నిద్రపో. కర్పూరిక నీకు లభిస్తుంది. ఇలా రాజ్యధరుడు నరవాహనదత్తునకు కథచెప్పి సంతోష పెట్టినాడు.

## కర్పూరిక కథ

నరవాహనదత్తుడు ప్రియురాలి నామస్మరణ చేస్తూ ఎలాగో నిద్ర పోయినాడు. తెల్లవారిన తరువాత గోముఖుడు రాజ్యధరునితో 'స్వామీ! నాప్రభువు కర్పూరికాదేవికై కర్పూరసంభవపురము వెళ్ళ వలె. దయచేసి యంత్రవిమానము చేసి ఇవ్వండి' అని కోరినాడు. ఆ మాట విని రాజ్యధరుడు పూర్వము నిర్మించిన వాయువిమానమును తెప్పించినాడు. నరవాహనగోముఖులు తరంగసంకులమైన సముద్రమును దాటి విమానములో గగనమార్గమున ప్రయాణముచేసి ఉత్తరదిశ యందున్న కర్పూరసంభవపురము చేరినారు. ఆనగరములో ఆకాశము నుంచి నరవాహన గోముఖులు అవతరించగా అందరూ కుతూహల

ముతో వాళ్ళను తెలుసుకోవలె నని వచ్చారు. నరవాహనుడు వారినీ వీరినీ అడిగి రాజమందిరసమీపానికి వెళ్ళినాడు. అక్కడ వృద్ధురాలు అతనికి విడిది ఇవ్వగా యుక్తి ఆలోచిస్తూ నరవాహనుడు "అమ్మా! ఈనగరపాలకుడు ఎవరు? అతనికి ఎంతమంది సంతానము? ఆసంతానము చక్కగా ఉంటారా? పరదేశస్థులము కనుక అంతా అడుగుతున్నాను. చెప్పు' అని అడిగినాడు. వృద్ధాంగన చెపుతున్నది: "మహానుభావా! ఈకర్పూరసంభవనగరాన్ని కర్పూరకమహారాజు పరిపాలిస్తున్నాడు. ఆయనకు పిల్లలు లేక శివునిగూర్చి తపస్సుచేశాడు. పాపము, ఆరాణి బుద్ధివర కూడా అహోరాత్రాలు భర్తతోపాటు తపస్సుచేసింది. త్రిరాత్రములు ఉపవసింపగా అతనికి స్వప్నములో శివుడు సాక్షాత్కారించి "పుత్త్రునికన్న ఉత్తమకన్య నీకు కలుగుతుంది. ఆమెభర్త విద్యాధరచక్రవర్తి అవుతాడు" అని వరప్రదానము చేసినాడు. రాజు సుప్తోత్థితుడై స్వప్నవృత్తాంతమును ప్రియురాలికి చెప్పినాడు. సంతోషముతో రాజదంపతులు పారణ చేసినారు. త్వరలో రాణి గర్భవతి అయి నవమాసములు మోసి సుందరిని కన్నది. ఆశిశువుశరీరకాంతి పురుటింట్లోవ్యాపించి రత్నదీపికలను వెలవెలపోయేటట్టు చేసింది. ఆపిల్లకు తండ్రి కర్పూరిక అనే నామకరణము చేసి ఉత్సవము కావించినాడు. ఇప్పుడు కర్పూరిక సౌందర్యచంద్రికలు వెదచల్లుతూ నిండుయౌవనములో లోకలోచనచంద్రికగా ఉన్నది. తండ్రి కుమార్తెకు పెళ్ళిచేయవలె నని సంకల్పిస్తే పురుషవిరోధి అయినపిల్ల పెళ్ళిచేసుకోవడము లేదు. నాకుమారి కర్పూరికను అడిగింది ఎందుకు పెళ్ళాడ వని. అప్పుడు రాజకన్య ఇలా చెప్పింది:

"నాకు పూర్వజ్ఞానము ఉంది. నాపూర్వవృత్తాంతము విను. సముద్రతటాన గంధవృక్షసమీపాన కమలాలయమైననిర్మలసరస్సులో కర్మవశాన పూర్వజన్మలో హంసినై ఉండేదాన్ని. ఒకసారి నేను నాభర్తతో

వేటకు వెళ్ళేసరికి తోవలో తాపసి కనపడి వాత్సల్యముతో "కుమారా! పూర్వము కర్మయోగాన కాముడు హంస అయినాడు. అతనికి శాప వశాన ఒకదివ్యస్త్రీ హంసియై ప్రియభార్య కాగా ఆమెతో అతడు సముద్రతీరాన ఉన్న చందనద్రుమముమీద నివసిస్తున్నాడు. శిశువులు సముద్రతరంగాలలో పడి చనిపోగా హంసి దుఃఖభారము ఓర్వలేక సముద్రములో పడి చనిపోయింది. ఆహంస శివప్రసాదమువల్ల వత్స రాజకుమారుడై పుట్టినది. నీకు పూర్వజ్ఞానము కూడా ఉన్నది. ఆ హంసికూడా నీవలెనే కర్పూరసంభవ నగరములో కర్పూరిక అనే పేరుతో రాజకన్యగా జన్మించింది. వెళ్ళి నీప్రియభార్యతో సుఖించు అని ఆమె చెప్పి అంతర్ధానము కాగా వెంటనే ఇతడూ నేనూ కలిసి ఆకాశవిమానము ఎక్కి పర్వతాలు నదీనదాలు అడవులు అన్నీ దాటి ఇక్కడికి వచ్చాము. ఈకారణమువల్ల ఇతడు 'హంసి హంసి' అని స్మరిస్తున్నాడు. నీముఖచంద్రికలవల్ల ఇతనిదుఃఖతమము తొలగిపోతున్నది! దేవీ! ఈ మహాతిథిని నీచూపులనే నల్లకలువలతో పూజించు."

ఇలా గోముఖుడు చెప్పగా యావద్వృత్తాంతమూ కర్పూరిక అనుభవానికి సరిపోయింది. రాజపుత్రునకు తనపైన అనురాగము గాఢ మని గ్రహించి కర్పూరిక "అయ్యో, ఆర్యపుత్రుణ్ణి బాధపెట్టాను. నామీద ఎంతప్రేమ ఇతనికి! తెలియక విరక్తనయినాను." అని ఆలోచించి "అయ్యా, తమరు ఏహంసికోసము పలవరిస్తున్నారో ఆహంసి ధన్యురాలుకదా! మీకు నేను ప్రేమదాసిని!" అని నరవాహనదత్తుని ఉద్దేశించి ఆవేగముతో పలికింది. ఆమెతండ్రికి సంగతియావత్తూ తెలియచేసింది. విద్యాధరచక్రవర్తి లక్షణాలు కలిగిన నరవాహనదత్తుడు తనకు కాగల అల్లుడని రాజు సంతోషపరవశుడు అయినాడు. యథావిధిగా మహారాజు కర్పూరికను నరవాహనదత్తుని కిచ్చి పరిణయము చేసినాడు. అల్లునికి ఒక్కొక్క అగ్నిప్రదక్షిణాకు మూడుకోట్లబంగారమును,

అంతంతకర్పూరమునూ, కానుకలిచ్చినాడు. ఆహేమరాసులు కర్పూరమూ మేరుకైలాస సానువులవలె ఉన్నవి. రాజు అల్లునికి పదికోట్ల చీనిచీనాంబరములు మూడువందలమంది దాసీజనాన్ని కుమారికకు అర్పించినాడు. కొంతకాలము కర్పూరికా నరవాహనులు కర్పూరక మహారాజు దగ్గిరేఉన్నారు.

నరవాహనదత్తుడు కర్పూరికను కౌశాంబికి రమ్మని పిలిచినాడు. ఆమె అంగీకరించి త్వరితముగా సుఖముగా ప్రయాణము చేసేందుకు యంత్రవిమానమును తెప్పించమని ప్రియుణ్ణి కోరింది. నరవాహనుడు శిల్పియైన రాజ్యధరునకు కబురుచేసినాడు. కర్పూరిక ప్రయాణసన్నాహము తండ్రికి తెలియచేసింది. ప్రతీహారుడు వెళ్ళి శిల్పిని పిలుచుకొని వచ్చినాడు. నరవాహనుడు అతన్ని చూచి రాజ్యధరునిసోదరుడనీ, రాజభయమువల్ల స్వదేశము విడిచినాడనీ తలపోసినాడు. ప్రాణధరు డనేఆశిల్పి కర్పూరికతో "దేవీ! నాయంత్రవిమానము ఎన్నివేల మందినైనా మోయగలదు" అని పలికినాడు. అప్పుడు నరవాహనుడు "ఏమి నీవు రాజ్యధరుని అన్నవా? యంత్రప్రయోగ మెరిగిన ప్రాణధరుడవా?" అని కుతూహలముగా అడిగినాడు. ఆయంత్రశిల్పి అతనికి నమస్కారముచేసి 'నేనేవాణ్ణి, ఏలినవారికి ఎలా తెలిసింది?' అని ప్రార్థించినాడు. నరవాహనుడు రాజ్యధరునివృత్తాంతమూ తనతో అతనికి గల స్నేహము, మొదలయినవిషయము లన్నీ సవిస్తరముగా ప్రాణధరునికి తెలియచెప్పినాడు.

ప్రాణధరుడు యంత్రవిమానము తెచ్చినాడు. నరవాహనుడు మామగారిఅనుమతి తీసుకొని విమానము ఎక్కినాడు. కర్పూరిక తండ్రిఅనుమతి తీసుకొని విమానము అధిరోహించింది. గోముఖుడు ఆరాజదంపతులతో కూడా ఉన్నాడు. దాసీజనులతో కాంచనకర్పూరములతో ఆవిమానము కిటకిట లాడింది. కర్పూరికతల్లి ప్రయాణమంగళము

చేసింది. బ్రాహ్మణులు దానములు స్వీకరించినారు. విమానచోదకు డయినప్రాణధరునితో "ముందు రాజ్యధరునివద్దకు వెళ్ళి తరువాత కౌశాంబీనగరానికి వెళ్ళుదాము" అని నరవాహనుడు ఆజ్ఞ చేయగా క్షణములో విమానము మనోవేగమున హేమపురములో అవతరించింది. రాజ్యధరుడు విమానచోదకు డయిన అన్నను చూచి ఆనందించినాడు. అతడు రాజ్యధరునకు దాసదాసీజనాన్ని ఇచ్చినాడు. నరవాహనుడు రాజ్యధరునివద్ద సెలవు తీసుకొని కౌశాంబికి వెళ్ళినాడు.

కౌశాంబిలో నరవాహనునివిమానము దిగే దిగడములో పౌరుల ఉత్సాహకోలములతోపాటు, కుమారుడు వచ్చినా డని వత్సరాజు, పట్టపు దేవేరులతో అమాత్యాదిపరివారముతో నగరువీడి ఎదురు వెళ్ళినాడు. నరవాహనదత్తుడుడు కర్పూరికాసమేతముగా వచ్చి వత్సేశునిపాదాలకు ప్రణామము చేసినాడు. వాసవదత్తా పద్మావతులు అతనిని ఆలింగనము చేసుకొని దుఃఖగ్రంథివలె కన్నీరు వదిలినారు. రత్నప్రభ మదన మంచుక ఈర్ష్య లేక ప్రియునిపాదాలను హృదయాన్ని ఒక్కసారి గ్రహించినారు. నూతనవధూవరులను దర్శించేనిమిత్తము వచ్చినవాళ్ళను యౌగంధరాయణాదులు, మరుభూతి మొద లయినఅమాత్యులు గౌరవించినారు. మంత్రులను నరవాహనుడు యథోచితముగా సత్కరించినాడు. కర్పూరిక లోకలోచనచంద్రికయై అపరలక్ష్మీదేవివలె వత్సరాజాదు లందరిమన్ననలనూ చూరగొన్నది. వత్సరాజు వియ్యంకుని వద్దనుంచి వచ్చినప్రతీహారుని ఘనముగా గౌరవించినాడు. ఆప్రతీహారుడు కాంచన కర్పూరరాసులను చీనిచీనాంబరములను వత్సరాజుకు అర్పించినాడు. ప్రాణధరుడు ప్రయాణసందర్భములో మహోపకారము చేసి యంత్రవిమానము సృష్టించి నడిపినవా డని వత్సరాజుకు చెప్పినాడు. వత్సేశుడు ఆయంత్రశిల్పిని సమ్మానించినాడు.

వత్సరాజు గోముఖునివలన నరవాహనుని వృత్తాంతము వేటకు అరి

చేరినదని చెప్పినారు. మర్నాడు ప్రాణధరుడు రాజాజ్ఞ పొంది సకుటుంబముగా బయలుదేరి రాజ్యధరుని చూచి కొంతసేపు కాలక్షేపము చేసి, తిరిగి నరవాహన దత్తుని వద్దకు వచ్చినాడు. నరవాహనుడు విమాన శిల్పి అయిన ప్రాణధరునకు నగరోపాంతములో మందిరము కట్టించి ఇచ్చినాడు. ఆశిల్పి నిర్మించినవిమాన మెక్కి అంతఃపురములో నరవాహనుడు విహారము చేస్తూఉన్నాడు. ఈప్రకారముగా నరవాహన దత్తుడు బంధుమిత్రాదులను ఆనందపరిచి మదనమంచుకా రత్నప్రభా కర్పూరికా దేవేరులతో ఇహసుఖాలు అనుభవిస్తున్నాడు.

## రత్నప్రభా లంబకము

### ద్వితీయ సంపుటి

### సమాప్తము



# కథా సరిత్సాగరము

(సంపుటము: ౩)

## శ్రీ సోమదేవ భట్ట ప్రణీతము

(44 – 55 తరంగములు)

తల్లావఝ్ఝల శివ శంకర శాస్త్రి
తల్లావఝ్ఝల కృత్తివాస తీర్థులు
సంస్కృతము నుండి తెలిగించినది




పబ్లిషర్సు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# విషయానుక్రమణిక

### తరంగము: ౧౩



### తరంగము: ౧౪



### తరంగము: ౧౫

# సూర్యప్రభ లంబకము

## త ర ం గ ము : ౪౪

చలత్కర్ణానిలోద్ధూత
సిందూరారుణితాంబరః
జయ త్యకాలేఽపి సృజన్
సంధ్యా మివ గజాననః

కదలు కర్ణాల జనియించు గాలి వలన
నెగురు సిందూర రజముచే నెఱ్ఱబడగ
నంతరిక్ష మకాలసంధ్యను సృజించు
చున్నటు లెసంగు గజముఖుం డొందు జయము.

### వజ్రప్రభుని రాక

ఈప్రకారముగా నరవాహనదత్తుడు భార్యలతో కౌశాంబి నగరములో సుఖముగా ఉంటున్నాడు. ఒకనాడు అతడు తండ్రి ఆస్థానములో ఉన్నప్పుడు ఆకాశమునుంచి దివ్యపురుషుడు దిగి వచ్చి నమస్కారము చేసినాడు. తండ్రి, కుమారుడూ అతనిని సత్కరించి "ఎవరయ్యా నీవు ? ఏమిపనిమీద వచ్చినావు?" అని అడిగినారు. ఆదివ్యపురుషుడు ఇలా చెప్పినాడు.

హిమవత్పర్వతశిఖరాన వజ్రకూట పురానికి నేను ప్రభువును. విద్యాధరుడను. నాది వజ్రదేహము కావడముచేత వజ్రప్రభు డని సార్థకనామధేయము. మహేశ్వరుడు నాతపస్సునకు సంతోషించి శత్రువులకు అజయ్యుడ నవుతానని అనుగ్రహించినాడు. కామాంశసంభవు డయిన శ్రీ నరవాహనదత్తుడు మానవు డయినప్పటికీ శివానుగ్రహము వల్ల దివ్య

కల్పాంతమూ నరుడూ నాగా ఉత్తరవేద్యర్ధ చక్రవర్తి అవుతాడని విద్యాప్రభావమువల్ల తెలుసుకొని ప్రభావదర్శనార్థము వచ్చినాను.

పూర్వము సూర్యప్రభు డనే మానవుడు శివానుగ్రహమువల్ల దివ్య కల్పముపాటు విద్యాధరచక్రవర్తి అయినాడు. ఆయన దక్షిణవేద్యర్ధానికే ప్రభువు. ఉత్తరవేద్యర్ధానికి శ్రుతశర్మ చక్రవర్తి. ఉభయవేద్యర్ధాలకూ దివ్యకల్పముపాటు చక్రవర్తిగా ఉండగలిగిన ఉత్తమమానవు డీనాక్కుడనే జేనా!

విద్యాధరుని వాక్కులవల్ల కుతూహలము కలిగి "సూర్యప్రభుడు మర్త్యు డయినా విద్యాధరచక్రవర్తి పదవి ఎలా పొందినాడు?" అని తండ్రీకొడుకులు అడిగినారు. అప్పుడు రాణులు, మంత్రులూ, వింటూ ఉండగా వజ్రప్రభుడు కథ సవిస్తరముగా చెప్ప నారంభించినాడు:

## సూర్యప్రభుని వృత్తాంతము

మద్రదేశములో శాకలపురము ఉండేది. అంగారప్రభువు కుమారుడు చంద్రప్రభుడు రాజు. కీర్తిమతీదేవివల్ల అతనికి సమస్త శుభలక్షణోపేతుడు సార్వభౌముడు కాదగిన తనయుడు జన్మించినాడు. మహేశ్వరప్రసాదమువల్ల ఈశిశువు సూర్యప్రభుడనే పేరుతో పెరిగి పెద్దవాడయి, విద్యాధరచక్రవర్తి అవుతాడు అని ఆకాశవాణి తండ్రికి కర్ణరసాయనముగా పలికింది. నకాలములో గురువులవల్ల సమస్తవిద్యలూ కళలూ అభ్యసించి షోడశవర్షములు నిండినప్పుతునకు యౌవరాజ్యాభిషేకముచేసి, తండ్రి తనమంత్రిపుత్రు లైన భాస, ప్రభాస, సిద్ధార్థ, ప్రహస్తాదులను తోడు ఇచ్చినాడు.

ఇలా కొంతకాలము గడిచింది. ఒకనాడు మయాసురుడు అక్కడికి వస్తే రాజు అతనిని సత్కరించినాడు. సూర్యప్రభుడు వింటూ ఉండగా మయుడు ఇలా చెప్పినాడు : "రాజన్, మహేశ్వరుడు నీకుమారుని

సమస్తవిద్యాధరచక్రవర్తిగా నిర్ణయించినాడు. ఆపదవిని ప్రసాదించే విద్యలను ఇతడు ఎందుకు అభ్యసించగూడదు? శూలపాణి నన్ను ఇక్కడికి పంపినాడు. నీసెలవయితే ఇతనిని తీసుకు వెళ్ళి ఉచితవిద్యలన్నీ నేర్పి తీసుకొని వస్తాను. విద్యాధరేశ్వరుడైన శ్రుతశర్మ ఇతనికి విరోధిసుమా! మహేంద్రుడు అతనికి ఆపదవి అనుగ్రహించినాడు. ఇతడు శ్రుతశర్మను జయించి విద్యాధరచక్రవర్తి అవుతాడు."

"ధన్యుల మయినాము! ఇతడు అదృష్టవంతుడు! నీయిష్టప్రకారము ఇతనిని తీసుకు వెళ్ళు" అని రాజు చెప్పినాడు. మయుడు సెలవు తీసుకొని అమాత్యసుతులతోపాటు సూర్యప్రభుని పాతాళలోకానికి తీసుకుపోయి తపస్సులు చేయించినాడు. సూర్యప్రభుడు వయస్యులతోపాటు త్వరలోనే విద్యలు సాధించినాడు. మయాసురుడు విమానసాధనవిద్యకూడా ఉపదేశించినాడు. 'భూతాసనము' అనేవిమానము కల్పించిన సూర్యప్రభుని అమాత్యసహితముగా విమానములో ఎక్కించి మయుడు శాకలపురములో తండ్రిసన్నిధిలో దింపి, యువరాజుతో, "ఆర్యా, సెలవు. సిద్ధిభోగాలు అనుభవిస్తూ ఉండు. నేను మళ్ళీ వస్తాను" అని చెప్పి, సత్కారాలు పొంది వెళ్ళిపోయినాడు. పుత్రునికి విద్యలు లభించడముచేత చంద్రప్రభుడు చాలా ఆనందించినాడు.

విద్యాప్రభావముచేత ఆనాటినుంచీ సూర్యప్రభుడు అమాత్యసహితముగా విమానమెక్కి, వివిధప్రదేశాలకు వెళ్ళుతూ విలాసముగా కాలము గడపడము ప్రారంభించినాడు. ఎక్కడెక్కడి రాజకన్యలూ ఇతనిని చూడగానే వరించి వచ్చేవారు. తామ్రలిప్తిప్రభువు వీరభటుని పుత్రిక మదనసేన ప్రథమురాలు. పశ్చిమదేశప్రభువైన సుభటుని తనయ చంద్రికావతి రెండవది. కాంచీనాయకుడు కుంభీరుని కూతురు వరుణసేన మూడవది. నాలుగవది లావాణకప్రభువు పౌరవుని తనూజాత సులోచన. ఐదవకన్య చీనానేత సురోహుని పుత్రిక విద్యున్మాల.

ప్రసేనజిత్ దేశాధీశ్వరుడు కాంతిసేనునికూతురు కాంతిమతి ఆరవది. కౌశాంబీనగరాధిపతి జనమేజయునితనయ వరవృష్ట ఏడవది. సూర్య ప్రభుడు విద్యాబలముచేత వీరిని హరించినాడు. కన్యలబంధువులు ఏమీ చెయ్యలేక ఊరుకొన్నారు. విద్యాప్రభావముచేత సూర్యప్రభుడు వివిధ దేహాలు ధరించి ఆకాశాన విహరిస్తూ సంగీత, పానగోష్ఠులలో ప్రహస్తాదులతో కలిసి ఇష్టము వచ్చినభోగాలు అనుభవిస్తున్నాడు. చిత్రచిత్రకళ తెలిసి ఉండడముచేత విద్యాధరాంగనలరూపాలు లిఖించి, పరిహాసవాక్యాలు పలుకుతూ తనప్రియవనితలకు ప్రణయకోపాలు తెప్పిస్తాడు. వారు బొమముడిపాటుతో అరుణనేత్రాలతో అస్పష్ట వాక్కులు పలికితే ఆనందము అనుభవిస్తాడు.

సూర్యప్రభుడు తామ్రలిప్తికి ఆకాశమార్గాన వెళ్ళి అక్కడి ఆరామములో మదనసేనతో విహారము చేసేవాడు. తన ప్రియురాండ్రను అక్కడనే ఉంచి ప్రహస్తుని మాత్రము వెంటబెట్టుకొని, భూతాసన విమాన మెక్కి, వజ్రసారపురము వెళ్ళి, తనను మోహించి మదనాగ్నిలో వేగిపోతున్న తారావళిని తండ్రి రంభ మహారాజు చూస్తూ ఉండగానే హరించి తామ్రలిప్తికి వచ్చినాడు. అనగరప్రభువు పుత్రిక విలాసిని తనను మోహిస్తే అంగీకరించినాడు. ఆమె సోదరుడు సహస్రాయుడు కోపించి వస్తే విద్యచేత సూర్యప్రభుడు అతనిని స్తంభింపజేసి, అతనికి తోడు వచ్చిన మేనమామకు శిరోముండనము చేయించినాడు. వారిమీద కోపమువచ్చినప్పటికీ తనప్రియురాలి బంధువు లనే భావముతో సంహరించక పరిభవించి గర్వభంగము చేసి పరిహాస వాక్యాలతో విడిచి పెట్టినాడు.

తరువాత పిలువ నంపడముచేత తొమ్మిదిమంది కాంతలతో సూర్య ప్రభుడు శాకల నగరానికి వెళ్ళినాడు. తామ్రలిప్తి నుంచి వీరభటప్రభువు ఇతని తండ్రి దగ్గరకు దూతను పంపినాడు. మీపుత్రుడు మాపుత్రికలను

హరించినాడు. విద్యాసిద్ధుడు కావడముచేత తగిన వరుడే. మీకు మా యెడల స్నేహ మున్నట్టయితే ఇక్కడికి వెంటనే దయ చేయవలెను. అని రాజదూత చెప్పినవాక్కులు విని చంద్రప్రభువు దూతను సత్క రించి మరునాడే వెళ్ళడానికి నిశ్చయించినారు. అయినా వీరభటప్రభువు యాథార్థ్యాన్ని గ్రహించడానికి ప్రహస్త మంత్రిని పంపినాడు. దూతను పంపితే ఆలస్య మవుతుం దని ఆయన భావము. ప్రహస్తుడు త్వరలో తామ్రలిప్తికి వెళ్ళి రాజదర్శనము చేసి కార్యము నిర్ణయించి సత్కా రాలుపొంది ఆశ్చర్యపడుతున్న రాజుతో రేపే మాప్రభువులు దయ చేస్తారు అని చెప్పి అతిశీఘ్రముగా శాకలపురానికి తిరిగి వచ్చి వీర భటుడు వివాహానికి సంసిద్ధముగా ఉన్నాడని విన్నవించినాడు.

చంద్రప్రభుడు కీర్తిమతితోను, సూర్యప్రభుడు విలాసినీ మదనసే నలతోనూ మంత్రి పరివార సహితముగా భూతాసనవిమాన మెక్కి ఉదయమే బయలుదేరి జాముప్రొద్దు ఎక్కే సరికి తామ్రలిప్తి చేరి నారు. పౌరులు ఆశ్చర్యముతో ముఖాలు పైకి ఎత్తి చూస్తూ ఉండగా విమానము ఆకాశమునుంచి దిగినది. వీరభటమహారాజు ఎదురుపోయి వారికి సత్కారాలు చేసి రాచనగరికి తీసుకు వెళ్ళినాడు. నగరము అలంకరించాడు. వీధులలో అడుగడుగునా మంచి గంధము చల్లినారు. నగరవనితల కటాక్షాలు నల్లకలువలతోరణాలవలె ప్రకాశించినవి.

వీరభటుడు యథావిధిగా సూర్యప్రభునికి కన్యాదానము చేసి, వివా హము మహావైభవముగా జరిపినాడు. వివాహ వేదికమీద తనకొమా ర్తెల కిద్దరికి వెయ్యిబారువుల బంగారమూ, రత్నాభరణ భారముతో నూరులొట్టిపిట్టలనూ, అమూల్య వస్త్రభారముతో అయిదు వందల లొట్టెలనూ, ఏడు కోటిగుర్రాలను, అయిదువేల యేనుగులనూ, సర్వాభరణ భూషిత లయిన వెయ్యిమంది సుందర వారాంగనలనూ, అరణ మిచ్చినాడు. అల్లునీ, వియ్యంకునీ (సంబంధినీ) కాలోపచారాలతో

బహుమానాలతో సత్కరించి ప్రహస్తాది మంత్రులనుకూడా ఉచిత రీతిని సన్మానించినాడు. పౌరు లంతా సంతోషించే లాగున మహోత్సవము జరిగింది. సూర్యప్రభుడు భార్యలతో సమస్తసౌఖ్యములూ అనుభవిస్తూ-ఆనందములో ఓలలాడుతున్నాడు.

ఇంతలో వజ్రసారనగరమునుంచి రంభమహారాజు దూతవచ్చి తన ప్రభువాక్యములుగా చంద్రప్రభునితో ఇలా విన్నవించినాడు : "ఆర్యా విద్యాబలదర్పితుడైన మీకుమారుడు మాపుత్రికను అపహరించి మాకు అవమానము కల్గించినాడు. నిజవృత్తాంతముగా మాకిపుడు తెలిసింది. వీరభటమహారాజుతో వర్తించినట్టే మాతోకూడ వర్తించాలి. మాకోరిక మన్నించి మీరు ఇక్కడికి దయచేయవలెను. దానివల్లనే మరణామే మాకు శరణము" చంద్రప్రభుడు ఆకర్ణించి వీరభటుని ప్రోత్సాహముతో ప్రహస్తుని పిలిచి, నీవు వెళ్ళి రంభునితో "విచారము వద్దనీ, శివానుగ్రహమువల్ల మాసూర్యప్రభుడు విద్యాధరచక్రవర్తి అవుతాడనీ, ఈ కన్యలంతా అతనికి భార్య లవుతారని సిద్ధులు ముందే తెలిపినారనీ, మీపుత్రిక యుక్తస్థానమే చేరినదనీ, నీవు కర్కశుడవు కావడముచేత మేము ఇదివరలోనే నిన్ను వేడలేదనీ, మాకు సఖుడవనీ, మేము అక్కడికే వస్తామనీ చెప్పవలెను" అని ఆజ్ఞాపించినాడు. ప్రహస్తుడు వజ్రసారపురానికి జాము నేపటిలో చేరి, రంభమహారాజుకు ఈసంగతులు చెప్పి ఆయనసమ్మతి పొంది వచ్చి చంద్రపభునకు నివేదించినాడు. చంద్రప్రభుడు ప్రభాసు డనేమంత్రిని పంపించి, శోకములో ఉన్నరంభుని కూతురు తారావళిని రప్పించి, సూర్యప్రభ వీరభటాదులతో విమాన మెక్కి, వజ్రసారపురము వెళ్ళినాడు. రంభమహారాజు ఎదురువచ్చి, సత్కారపూర్వకముగా అందరినీ రాజమందిరానికి తీసుకొని పోయి వివాహమహోత్సవము జరిపించి, పుత్రికకు సువర్ణరత్నాదులు గజములను అరణ మిచ్చి, అల్లుని ఘనంగా సత్కరించినాడు.

సేనమహారాజు ఎదురు వచ్చి తీసుకొని పోయి యథావిధిగా వివాహము జరిపినాడు. కూతురికీ అల్లుడికీ ఇచ్చిన సువర్ణరాసులు చూచి రాజులు ఆశ్చర్య పడ్డారు.

అక్కడ సుఖముగా ఉండగా కౌశాంబినుంచి రాజదూత వచ్చి చంద్రప్రభుభుడితో "దేవా! జనమేజయమహారాజు మీకు పంపిన సందేశ మిది. నా కుమార్తె వరవృష్టను ఎవరో హరించినారు. ఆమె సూర్య ప్రభుని అధీనములో ఉన్నట్టు ఇప్పుడే మాకు తెలిసింది. నిస్సంశయముగా అతడు వరవృష్టతో మాయింటికి వస్తే యథావిధిగా వివాహము చేసి సత్కరిస్తాను. రానిపక్షములో మీకూ మాకూ వైరమే" అని విన్న వించినాడు. దూతవాక్కులు విని చంద్రప్రభువు రాజులతో ఏకాంత ముగా "ఇంత దర్పముతో పంపిన సందేశము విని మనము అతని యింటికి వెళ్ళవచ్చునా?" అన్నాడు.

సిద్ధార్థు డనే మంత్రి ఇలా పలికినాడు "దేవా, అన్యథా భావించ కూడదు. ఆయనవాక్కులు యుక్తములే. ఆప్రభువు సత్కులసంజాతుడు, అశ్వమేధయాజి, విద్వాంసుడు, పరాజయము ఎరుగని వీరుడు. ఆయన యథార్థమే పలికినాడు. ప్రస్తావన చేసిన వైరము ఇంద్రుడు కల్పించి నది. ఆయనమందిరానికి వెళ్ళవచ్చు. ఆయన సత్యసంధుడే. అయినా, ఆయన అభిప్రాయము గ్రహించడానికి ముందుగా దూతను పంపిం చండి." ఈప్రస్తావనకు అందరూ సమ్మతించినారు.

చంద్రప్రభుడు దూతను సత్కరించి జనమేజయుని వద్దకు ప్రహస్తుని పంపినాడు. ప్రహస్తుడు కౌశాంబికి పోయి ఇక్కడివారి అభిప్రాయము ఆయనకు తెలిపి ఆయనవద్దనుంచి లేఖ తెచ్చి చంద్రప్రభునకు ఇచ్చి నాడు. అప్పుడు రాజు ప్రహస్తుని శాకలమునకు పంపి వరవృష్టను రప్పించి అతని వెంట ఆమెను తండ్రి దగ్గరికి చేర్చినాడు. పిమ్మట అం దరూ కౌశాంబికి వెళ్ళినారు. జనమేజయుడు సవినయముగా సన్మానించి

యథావిధిగా వివాహము జరిగినాది. జామాతకు గోవులు, లక్ష ఉత్తమాశ్వములు, మణి, సువర్ణవస్త్ర కన్యాదానము ద్రవ్య భారముతో అయిదువేల లొట్టిపిట్టలను ఇచ్చి, బ్రాహ్మణులను రాజులను పూజించి వివిధ నృత్త వాద్యాదులతో మహోత్సవము చేసినాడు.

ఇంతలో అకస్మికముగా ఆకాశము ఎరుపెక్కింది. ప్రచండవాయువు వీచింది. విద్యాధరసైన్యాలు సింహనాదములు చేస్తూ తీవ్రవేగముతో వచ్చినవి. వారినడుమ సుందరవిద్యాధరకుమారుని చూచి సూర్యప్రభాదులు ఆశ్చర్యపడినారు. అప్పుడు విద్యాధరవంది సూర్యప్రభుని చూచి "మానవుడా, భూచరుడా, ఈయన మా యువరాజు. ఆషాఢేశ్వరుని పుత్రుడు, దామోదరుడు. ఈయనపాదాలమీద పడు! జనమేజయా, మా యువరాజుకు నమస్కరించు. నీతనూజను తగినవానికి ఇచ్చినావు. పాదాలమీద పడితే, మా ప్రభువు నిన్ను క్షమిస్తాడు" అని గొంతెత్తి పలికినాడు.

సూర్యప్రభుడు క్రోధపరవశుడై ఖడ్గము, డాలు పట్టుకొని ఆకాశానికి ఎగిరినాడు. వెంటనే ప్రహస్త, భాస, సిద్ధార్థ, ప్రజ్ఞాఢ్య, సర్వదమన, వీతభీతి, శుభంకర మంత్రులుకూడా గగనమార్గానికి ఎగిరినారు. వారికి ఘోరయుద్ధము జరిగింది. మానవులు కొద్దిమందీ, విద్యాధరులు అనేకులూ అయినప్పటికీ యుద్ధము సమంగానే నడిచింది. సూర్యప్రభువు దామోదరునితో తలపడి కత్తితో అతని డాలు నరికి అతనిని పడదోసి తలనరకబోతూ ఉండే సమయాన శ్రీహరి హుంకారము చేసినాడు. సూర్యప్రభువు హరికి నమస్కరించి, హరిమీది గౌరవముచేత దామోదరుని విడిచిపెట్టినాడు. శ్రీహరి అతనిని ఎక్కడికో తీసుకుపోయినాడు. దామోదరుని అనుచరులు ఎక్కడివారక్కడ పలాయనము చేశారు. సూర్యప్రభువు మంత్రిసమేతముగా తండ్రిసన్నిధిలో దిగినాడు. రాజులూ తదితరులూ అతనిపరాక్రమము ప్రత్యక్షముగా చూచి ప్రశంస చేసినారు.

ఇంతలో సుభటమహారాజువద్దనుంచి దూతవచ్చి, చంద్రప్రభునికి లేఖ యిచ్చినాడు. సిద్ధార్థుడు దానిని తెరిచి సభలో ఈ ప్రకారముగా చదివినాడు : "ఉన్నతకళంకసుక్షామణి శ్రీమాన్ చంద్రప్రభమహారాజుకు కొంకణదేశాధిపతి సుభటుని సాదరవిజ్ఞాపన. నా పుత్రికను రాత్రి వేళ ఏదో భూతము అపహరించుకు పోయినది. ఆమె మీ పుత్రునకు దొరికింది అని విని ఆనందించాను. మీరు పుత్రసహితముగా మా యింటికి దయచేస్తే సత్కారపూర్వకంగా వివాహము చేస్తాను." ఈ మాటలు విని చంద్రప్రభుడు దూతను సత్కరించి, వెంటనే ప్రహస్తుని ద్వారా చంద్రికావతిని ఆమె తండ్రి సుభటునివద్దకు పంపినాడు. మరునాడు అందరూ బయలుదేరి విమానములో పశ్చిమముగా కొంకణదేశము వెళ్ళినారు. పుత్రిక లభించినందుకు సుభటుడు ఆనందించి అందరినీ సత్కరించి కుమార్తెను సూర్యప్రభున కిచ్చి వివాహము చేసినాడు.

సుభటుడు తనతనయకు ఇచ్చిన రత్నాదులు చూచి తక్కిన రాజులు సిగ్గుపడ్డారు.

సూర్యప్రభుడు అక్కడ ఉన్న రోజులలో లావాణక దేశమునుంచి పౌరవరాజుదూత వచ్చి, తనప్రభువుమాటలుగా ఇలా విన్నవించినాడు : "నా పుత్రికను మీ పుత్రుడు హరించినాడు. అందుకు నాకు విచారము లేదు. అతనిని తీసుకొని మీరు మా యింటికి దయచేయ గూడదా? ఆచారప్రకారము వివాహము చేస్తానే." ఈమాటలకు సంతోషించి చంద్రప్రభుడు ప్రహస్తునితో సులోచనను జనకునిసన్నిధికి పంపి, మరునాడు పరివారసమేతముగా విమానములో లావాణము వెళ్ళినాడు. పౌరవరాజు యథావిధిగా వివాహము జరిపి అందరినీ, సత్కరించినాడు.

అక్కడ వీ రందరూ విందులు ఆరగిస్తూ హాయిగా ఉండగా చీనా ప్రభువు సురోహుడు దూతను పంపి, కన్యలు పోయినతక్కినప్రభువుల వలె తానుకూడా వివాహము చేస్తానని దూతద్వారా సందేశము పంపి

నాడు. చంద్రప్రభుడు సంతోషించి విద్యున్మాలను తండ్రిదగ్గరకు ప్రహస్తునిద్వారా పంపినాడు. మయుడు అంతయూ చూచి చెప్పినాడు. సురోహుడు అందరినీ సగౌరవముగా కోటకు తీసుకు వెళ్ళి కుమార్తెకు విధివిహితముగా వివాహము చేసి రత్నచీనాంబరగజాశ్వములు బహుమానము చేసినాడు. చంద్రప్రభాదులు కొన్నాళ్ళు అక్కడ సుఖంగా కాలక్షేపము చేసినారు.

సూర్యప్రభుడు ఒక్కొక్క మామ యింట్లో కొన్నాళ్ళు బంధుసమేతముగా కాలము గడిపి సిద్ధార్థాది మంత్రుల ఆలోచనప్రకారము వీరభటాదులను తమ తమ నివాసాలకు పంపి సుకోహమహారాజుదగ్గర సెలవు తీసుకొని భూతాసనవిమానమెక్కి శాకలనగరానికి వెళ్ళినాడు.

ఒకచోట నృత్యము, ఒకచోట సంగీతము, ఒకచోట పానక్రీడలు, ఇంకోచోట సుందరాంగనల అలంకారవిధానము మరొకచోట వైతాళికులస్తోత్రములు ఈవిధముగా పురమంతటా సంతోషమగ్నమై ఉన్నది. సూర్యప్రభుడు పుట్టిళ్ళలో ఉన్న భార్యలను రప్పించినాడు. వారికి తండ్రులిచ్చిన బహుమానాలు మోసుకువస్తున్న లొట్టిపిట్టలను అతని వైభవాన్ని చూచి పురజనులు చాలా ఆనందించినారు.

సూర్యప్రభుడు మదనసేనతోనూ, ఇతరభార్యలతోనూ సమస్తసుఖములు అనుభవిస్తూ మళ్ళీ వస్తానని చెప్పిపోయిన మయాసురుని రాకకు ఎదురుచూస్తున్నాడు.

## తరంగము: ౪౫

ఒకనాడు నిండుకొలువులో సిద్ధార్థాదులు చెప్పుతున్న కథలలో మయాసురుని సంగతి వచ్చింది. వెంటనే ఆకస్మికముగా సభామధ్యభూమిలో రంధ్రము పడ్డది. ముందు సువాసన వ్యాపించింది. తరువాత మయాసురుడు ఇవతలికి వచ్చినాడు. చంద్రప్రభుడు ఉచితసత్కారము చేసి

రత్నాసనము మీాద కూర్చోబెట్టినతర్వాత మయుడు ఈప్రకారము చెప్పినాడు. "మీారుభూలోకభోగాలు అనుభవించారు. ఇక అన్య భోగాలు అనుభవించవలసిన సమయము ఆసన్న మయినది. దూతలను బంపి మీాబంధుబాంధవులను పిలిపించండి. తర్వాత విద్యాధరచక్రవర్తి సుమేరుని కలుసుకుంటాము. శ్రుతశర్మను జయించి విద్యాధరవైభవము పొందుతాము. మహేశ్వరుడు పూర్వమే సుమేరునితో 'సూర్యప్రభు ఫును సంరక్షించు. నీపుత్రికను అతని కియ్యవలి' అని చెప్పినాడు. ఈవాక్య ములు చంద్రప్రభుడు గగనసంచారము చెయ్యగల ప్రహాస్త్రాదులను రాజులవద్దకు పంపినాడు. అంతకుముందు తాను ఉపదేశించని విద్యలను మయుని ప్రబోధమువల్ల మంత్రులకూ భార్యలకూ ఇచ్చినాడు.

## చంద్రప్రభునికి ఇంద్రుని సందేశము

ఇంతలో నారదమునిఆకాశమునుంచి దిగి సంగతి గ్రహించి రత్నా సనాసీనుడై చంద్రప్రభునితో "ఇంద్రుడు ఈవార్త తెలుప మని నన్ను పంపినాడు. శివాజ్ఞచేతనూ, మయాసురసహాయముచేతనూ మీారు మానవు డయిన సూర్యప్రభునికి సకలవిద్యాధరచక్రవర్తిపదవి సాధించా లని చూస్తున్నట్టు మాకు తెలిసింది. మీారు అలా చెయ్యగూడదు. శ్రుతశర్మకు ఆపదవి మేమిచ్చినాము. విద్యాధరకులశేఖరు డైన అతనికి పదవి వంశక్రమాగతము సుమా! మీారు మాకు విరుద్ధముగా ఏమి చేసినా, మీాకే నష్టము. మునుపు నీవు రుద్రయజ్ఞము ప్రారంభించ బోతుంటే ముందు అశ్వమేధము చెయ్య మని నేను బోధించినా విన్నావు కావు. దేవతలను ధిక్కరించి రుద్రునిమాత్రము ఆశ్రయిస్తే మీాకు ఏమి శుభము కలుగుతుందో చూస్తాను."

ఈమాటలకు మయాసురుడు మందహాసము చేసి "మునీంద్రా, ఇంద్రునిసందేశము సముచితము కాదు. సూర్యప్రభుడు మానవు డని

మహేంద్రుడు అన్నాడు. దామోదరునితో యుద్ధము జరిగినపుడు మర్త్యునిపరాక్రమము చూడలేదా ? మర్త్యత్వమువల్ల లోపము లేదు. మర్త్యులకు సమస్త శక్తులకూ సిద్ధులకూ అధికారమున్నది. పూర్వము మానవుడైన నహుషుడు ఇంద్రపదవి పొందలేదా ? తాను శ్రుతశర్మకు విద్యాధరచక్రవర్తి పదవి ఇచ్చినట్టు అది కులక్రమాగతమైనట్టూ మహేంద్రుడు అన్నాడు. అందులో ఔచిత్యము లేదు. సాక్షాత్తు మహేశ్వరుడు దాత అయినప్పుడు ఇతరులకు అధికారము లేదు. హిరణ్యాక్షునికి జ్యేష్ఠాగతమైనఇంద్రత్వము ఏమయినది ? మేము వహిస్తాము అని మహేంద్రుడు బెదిరించినాడు. చాలా లోపము ! అనవసరముగా మాతో కయ్యానికి కాలు దువ్వుతున్నాడు. మేము వైరిని జయించ దలుచుకొన్నాము. బ్రహ్మహత్య చెయ్యలేదు. మునియిల్లాలిని హరించ లేదు. అధర్మముతో మాకు ప్రసక్తి లేదు. తాను చెప్పినట్టు అశ్వమేధము చేయక దేవతలను ధిక్కరించినట్టు మహేంద్రు డన్నాడు. రుద్రయాగము చేసినతర్వాత ఇతరయజ్ఞాలవల్ల ఏమి లాభము ! సకలదేవతా మహేశ్వరుడైన శశిశేఖరుని ఆరాధిస్తే అందరినీ ఆరాధించినట్టు కాదా ? రుద్రునిమాత్రము భజించి తక్కిన దేవతలను లెక్కచెయ్యక పోతే అనుచిత మనేపక్షములో గొప్ప పొరపాటు ! మహేశ్వరుడు ఉన్నచోట ఇతరదేవతాగణమువల్ల ఏల ప్రయోజనము ? సూర్యుడు ఉదయించి నప్పుడు అన్యజ్యోతులు ప్రకాశిస్తవా ? మునీంద్రా, ఈవిషయా లన్నీ మహేంద్రునికి స్పష్టముగా చెప్పు. మాయత్నములో మే ముంటాము. ఇష్టము వచ్చినట్టు ఇంద్రుడు చేసుకోవచ్చును.”

మయాసురునిఉపన్యాసము విని సరే అని నారదుడు ఆప్రతిసందేశముతో ఇంద్రునివద్దకు వెళ్లినాడు. ఆయన వెళ్ళినతరువాత ఇంద్రసందేశానికి జంకుతున్న చంద్రప్రభుపుతో మయాసురుడు ఇలా అన్నాడు :

“ఇంద్రునివల్ల నీకూ నాకూ భయము లేదు. మనమీద కోపముచేత

ఇంద్రుడు దేవగణములతో కలిసి శ్రుతశర్మపక్షములో ఉంటాడు. ప్రహ్లాదాధిపత్యమున దైత్యదానవులతో మేము మీపక్షాన ఉంటాము. త్రిపురారి అనుగ్రహము ఉండగా ముల్లోకములలో ఎవరైనా మన నేమిచెయ్యగలరు ? మీరు ప్రయత్నములో ఉండండి." ఈవాక్కులకు చంద్రప్రభాదులకు ధైర్యమూ సంతోషమూ కలిగినవి.

దూతలవల్ల వృత్తాంతము యావత్తూ తెలుసుకొని వీరభటప్రభృతులు బంధుబాంధవసైన్యసమేతముగా వచ్చి, సత్కారాలు పొంది నారు. అప్పుడు మయాసురుడు చంద్రప్రభునితో "రాజా, ఈరాత్రి రుద్రునికి మహాబలి ఇయ్యవలె. నేను చెప్పినప్రకారము ఆ తరువాత అన్నిపనులూ చేతువుగాని" అని చెప్పినాడు. చంద్రప్రభుడు రుద్రబలికి సంభారాలు సిద్ధము చేయించి రాత్రి అరణ్యానికి వెళ్ళి మయుడు పురోహితుడుగా తంత్రము నడపగా రుద్రబలి శ్రద్ధతో చేసినాడు. రాజు హోమము చేస్తూ ఉండగా భూతగణాధిపతి నందీశ్వరుడు ప్రత్యక్షమయినాడు. రాజుయథావిధిగా సత్కరించినతరువాత నందీశ్వరుడు "రాజన్,వందమంది ఇంద్రులు యుద్ధానికి వచ్చినా నీకు భయము లేదు. సూర్యప్రభుడు విధిగా విద్యాధరచక్రవర్తి అవుతాడు. ఇలాగున మహేశ్వరుడు సెలవిచ్చినాడు" అని చెప్పినాడు. శివాజ్ఞ తెలియపరచి బలి భాగము గ్రహించి నందీశ్వరుడు భూతగణముతో అంతర్ధానమయినాడు. ధైర్యము పొంది చంద్రప్రభుడు బలి ముగించి మయునితో కలిసి నిజ నగరానికి వెళ్ళినాడు.

## చంద్రప్రభుడు సునీథుని శరీరములో ప్రవేశించుట

మరునాడు ప్రాతఃకాలము అందరితో కలసి సుఖాసీనుడైన చంద్రప్రభునితో మయుడు ఇలా చెప్పినాడు : "చాలాకాలమునుంచీ గుప్తముగా ఉంచినరహస్యము చెపుతాను. నీవు పూర్వజన్మలో నాపుత్రు

డవు. సునీథు డనే దానవుడవు. సూర్యప్రభుడు వెనకజన్మలో సుముండీకు డనే దానవుడు. నీకు తమ్ముడు. దేవతలతో యుద్ధములో మీరు మరణించి భూలోకములో తండ్రికొడుకులై పుట్టినారు. శాస్త్రోక్త ప్రకారముగా నీశరీరానికి ఘృతాదులూ, ఓషధిరసమూ పూసి భద్రముగా ఉంచినాను. నీవు బిలప్రవేశము చేసి పాతాళలోకానికి వెళ్ళి నేను ఉపదేశించే యుక్తిచేత స్వశరీరములో ప్రవేశించు. వెంటనే అఖండ తేజోవీర్యవంతుడవై దేవతలను జయించగలుగుతావు. నీకుమారుడు ఈశరీరముతోనే విద్యాధరచక్రవర్తి అవుతాడు."

చంద్రప్రభుడు సంతోషపూర్వకముగా అంగీకరించినాడు. సిద్ధార్థక మంత్రిమాత్రము మయునితో "పరకాయప్రవేశము చేసినవాడు మృతునితో సమానము. ఆమార్పువల్ల మా కేమి లాభము? అన్యదేహములో ప్రవేశించినతర్వాత లోకాంతరగతునిలాగే మమ్మలిని విస్మరిస్తాడు. అప్పుడు ఈయనకూ మాకూ ఏమీసంబంధము ఉండదు" అన్నాడు. అందుకు మయుడు ఈప్రకారముగా చెప్పినాడు: "యోగమహిమచేత బుద్ధిపూర్వకంగా పరకాయప్రవేశము చేసేవాడు ఎవరినీ విస్మరించడు. అస్వతంత్రముగా మృతి చెంది మాతృగర్భములో పుట్టి సమస్తక్లేశములూ అనుభవించేవానిసంగతి వేరు. స్వతంత్రముగా యోగశక్తివల్ల అంతఃకరణాదులతో ప్రవేశించే యోగిసంగతి వేరు. మీరు సంశయించకండి. ఇందువల్ల రాజు జరారోగాదులు లేని దివ్యదేహము పొందుతాడు. మీరందరూ దానవులే. పాతాళము ప్రవేశించి అమృతము సేవించి మీరుకూడా దివ్యదేహాలు పొందండి" దీనితో అందరికీ సందేహనివృత్తి అయినది.

మరునాడు చంద్రప్రభుడు రాజులను వెంటబెట్టుకొని ఇరావతీ చంద్రభాగా సంగమప్రదేశానికి వెళ్ళి రాజులను అక్కడఆపి సూర్యప్రభుడు భార్యలను వారికి అప్పగించినాడు. మయుడు జలములో బిలము చూపి

నాడు. చంద్రప్రభుపు కుమారునితో, భార్యలతో సిద్ధార్థాదిమంత్రులతో అందులో ప్రవేశించి చాలాదూరము వెళ్ళి, దేవాలయము కనబడితే అందరితో దానిలో ప్రవేశించినాడు. ఇంతలో విద్యాధరులు "రాజులను విద్యాప్రభావముచే స్తంభీభూతులనుచేసి సూర్యప్రభుని భార్యలను చెరలో పెట్టడానికి తీసుకొనిపోయినారు. "పాపీ, శ్రుతశర్మా, చక్రవర్తి భార్యలను తాకితివా వెంటనే సైన్యసమేతముగా నశిస్తావు. వీరిని మాతృభావముతో సగౌరవముగా సంరక్షించు. వీరిని నీవద్దనే ఉండనీ. తక్షణమే నిన్ను సంహరించి వీరిని విడిపించకపోవడానికి కారణమున్నది. జాగ్రత్త!" అని ఆకాశవాణి వినబడ్డది. అప్పుడే విద్యాధరులు అదృశ్యులయినారు. అంతఃపురస్త్రీలు పోయినారనే దుఃఖముచేత వీరభట ప్రభృతులు ఆత్మహత్యకు సంసిద్ధు లవుతుంటే ఆకాశవాణి "రాజులారా, సాహసించవద్దు. మీపుత్రికలకు లోపము లేదు, మీకూ వారికీ సమాగమ మవుతుంది. శుభం భూయాత్!" అని పలికింది. వారు యత్నమునుంచి విరమించారు.

పాతాళలోకములో దేవాలయములో ఉన్న రాజుతో మయుడు "రాజా! ఏకాగ్రతతో ఆకర్ణించు. నీకు పరకాయప్రవేశ యోగము ఉపదేశిస్తాను" అని సాంఖ్యయోగములు, దేహాంతరప్రవేశ యోగమూ ఉపదేశించి ఆసిద్ధి యిదే. అష్టసిద్ధులకూ కారణభూత మైన జ్ఞానస్వాతంత్ర్యములు నీకు లభ్యమైనవి. సురేశ్వరులు ఈవిభూతి అనుభవిస్తూ మోక్షముకూడా అపేక్షించరు. అన్యులు దీనికోసమే జపము, తపము చేస్తారు. లభించిన స్వర్గముకూడా స్వీకరించరు. అని నిదర్శనముగా ఈకథ చెప్పినాడు :

### కాలుని కథ

పూర్వకల్పములో కాలు డనే విప్రుడు పుష్కరద్వీపానికి పోయి, రాత్రింబగళ్లు తపస్సు చేస్తున్నాడు. రెండువందల దివ్యవర్షాలు గడిచినవి.

ఆయన తలలోనుంచి అఖండజ్వాల బయలుదేరి [illegible] వ్యాపించింది. జ్వాలవల్ల గగనములో సూర్య[illegible] చింది. అప్పుడు బ్రహ్మాదిదేవతలు బ్రాహ్మణుని [illegible] కావాలి? నీ తేజస్సువల్ల లోకాలు దహించుకు పోతు[illegible] తపస్సు?" అన్నారు. "జపముతప్ప అన్యవిషయ[illegible] కుండేలాగున వరము చాలు" అన్నాడు. బ్రాహ్మ[illegible] నిర్బంధముమీద ఆప్రదేశము విడిచి విప్రుడు [illegible] భాగము ప్రవేశించి యథాప్రకారము జపము చేస్తూ[illegible] తేజస్సు మరీ హెచ్చి దుస్సహ మయింది. తపోభంగ[illegible] ఇంద్రుడు దేవతాస్త్రీలను పంపినాడు. [illegible] లను విప్రుడు లెక్కచేయలేదు. మృత్యువు[illegible] దేవతలను విప్రునివద్దకు పంపినారు. మృత్యువు వచ్చి [illegible] కుడా, మానవులు ఇన్నాళ్లు బతకరు. క్రమము [illegible] త్యజించు" అన్నాడు. అందుకు బ్రాహ్మణుడు "[illegible] శరీరము చాలిస్తే ఆత్మహత్య అవుతుంది. నా ఆయుర్దాయ[illegible] నీవే నా ప్రాణాలు ఎందుకు హరించగూడదు?" అని చెప్పినాడు. అత నిని తానే తీసుకుపోవడానికి సామర్థ్యములేక మృత్యువు వెళ్ళి పోయి నాడు. కాలుని జయించిన కాలుని ఇంద్రుడు ఎత్తుకొని దే[illegible]లోకానికి తీసుకు వెళ్ళినాడు. అక్కడకూడా కాలుడు నిరంతరజపము చేస్తూఉంటే ఇంద్రుడు దింపివేసినాడు. తర్వాత కాలుడు హిమాలయానికి వెళ్లినాడు. ఇంద్రాదులు మళ్ళీవెళ్ళి వరము అడగ మని అతనిని కోరినారు.

ఆవేళకు ఇక్ష్వాకు అనే రాజు ఆమార్గాన వచ్చి సంగతి గ్రహించి కాలునితో "ఆర్యా, దేవతలవరము నీకు అవసరములేకపోతే నేనిస్తాను, తీసుకో" అన్నాడు. "దేవతలవరమే నాకు అక్కర లేదే, నీవు వర మివ్వగలవా?" అన్నాడు. కాలుడు "నాకు శక్తిలేదు. నీవు శక్తిమంతు

డవు. నీవే నాకు వర మియ్యవలె" అన్నాడు ఇక్ష్వాకుడు. "నీకోరిక యేమిటి?" అన్నాడు కాలుడు. ఇక్ష్వాకుడు సందేహము కలిగి తనలో "నేను ఇవ్వడము బ్రాహ్మడు పుచ్చుకోడమూ సహజము. ఈయన ఇవ్వడమూ నేను స్వీకరించడమూ విపరీతము" అనుకుంటూ ఊరకున్నాడు.

ఇంతలో ఇద్దరు బ్రాహ్మణులు వివాదపడుతూ అక్కడికి రావడము సంభవించింది. రాజును చూచి ఒకడు "ప్రభూ, దక్షిణాతోసహా గోవును ఈయన నా కిచ్చినాడు. నీవేతీసుకోవయ్యా, అంటే పుచ్చుకోడు" అని చెప్పుకొన్నాడు. రెండవవాడు "రాజా, నేటివరకూ నేను ప్రతిగ్రహము చెయ్యలేదు నాకు అవసరమూలేదు. ఎందుకు నన్ను ఈయన బలవంత పెట్టడము?" అన్నాడు. రాజు "ఈ బ్రాహ్మణుడు మొదట గోవును గ్రహించి దాతకే మళ్ళీ దానము ఎందుకు చెయ్యవలె? ఈయన ఆక్షేపణ బాగా లేదు" అని తీర్పు చెప్పినాడు. అప్పుడు ఇంద్రుడు ఇక్ష్వాకుతో "రాజా, నీవు కాలుని వరము వేసి ఎందుకు పుచ్చుకోవు? అన్నీ తెలిసినవాడవే!" అన్నాడు. ప్రత్యుత్తరము చెప్పలేక ఇక్ష్వాకు కాలుని చూచి "విప్రోత్తమా, నీజపములో అర్థఫలము నాకు అనుగ్రహించు. ఇదే నావరము" అన్నాడు. కాలుడు సరే అని అర్థఫలము ఇచ్చినాడు. అందువల్ల రాజుకు సకలలోకగమనము సిద్ధించింది. కాలుడు 'శివ' లోకము పొంది బహుకల్పాలు అక్కడే ఉండి మళ్ళీ భూలోకానికివచ్చి యోగసిద్ధివల్ల స్వతంత్రు డయినాడు.

ఉత్తములు స్వర్గాదిభోగాలు కోరక యోగసిద్ధినే వాంఛిస్తారు. నీకు యోగసిద్ధి అయింది. స్వతంత్రుడవై నీశరీరములో ప్రవేశించు.

ఈప్రకారము మయుడు పలికి యోగవిద్య ఇచ్చినాడు. చంద్రప్రభుడు అందరితోకూడా సంతోషించినాడు. మయుడు రాజును పుత్రాదులతో రెండవపాతాళానికి తీసుకుపోయినాడు. అక్కడ పెద్దపర్యంకము

మీద మహాకాయుడు నిద్రపోతూఉన్నట్టున్నాడు. శరీరానికి ఘృతమూ ఓషధీరసమూ పూసి ఉన్నది. ఆకారము వికృతమూ భయంకరమూ. చుట్టూ దీనవదనాలతో దైత్యవనితలు కూర్చున్నారు. మయుడు చంద్రప్రభునికి ఆశరీరము చూపించి "ఇదే నీవెనుకటిశరీరము. ఇందులో ప్రవేశించు. వీరంతా వెనుకజన్మలో నిభార్యలు" అని బోధించినాడు.

యోగప్రభావమువల్ల నిజదేహము చాలించి రాజు ఆశరీరములో ప్రవేశించినాడు. పర్యంకముమీది పురుషుడు ఆవులించి నెమ్మదిగా నేత్రములు తెరిచి నిద్రమేలుకొన్నవాడిలాగ పానుపుమీదనుంచి లేచినాడు. అంతట అసురస్త్రీలు ఆనందముతో "మాప్రాణేశ్వరుడు బతికినాడు!" అని ఆక్రోశించారు. ప్రాణహీనమై పడిపోయిన చంద్రప్రభుని చూచి సూర్యప్రభాదులు విచారపడినారు.

సునీథాసురుడు సుఖనిద్రనుంచి లేచినట్టులేచి తండ్రి మయాసురుని పాదాలమీద వాలినాడు. తండ్రి కుమారుని కౌగలించుకొని అందరి సమక్షములో "నాయనా, ఇప్పుడు నీరెండు జన్మలూ జ్ఞాపకము ఉన్నవా?" అని అడిగినాడు. సునీథుడు ఆ అని రెండుజన్మ వృత్తాంతాలూ చెప్పి కీర్తిమతిని సూర్యప్రభుని పూర్వజన్మలో భార్యలనూ పేరుపేరున పలకరించి ఓదార్చినాడు. చంద్రప్రభుని శరీరానికి ఘృతము ఓషధీరసమూ పూసి మయుడు భద్రము చేసినాడు. అతనికి పూర్వజన్మస్మృతి ఉన్నందుకు సూర్యప్రభాదులు సంతోషించినారు.

పిమ్మట మయాసురుడు సువర్ణమణిఖచితమైనమరొక పురానికి తీసుకుపోయి వారిని అమృతముతో నిండినవైడూర్యపు దిగుడు బావి ఒడ్డున కూర్చోబెట్టినాడు. సునీథునిభార్య అమృతరసము మణిపాత్రలో తెచ్చి అందరికీ ఇచ్చింది. సుధాపానముచేసి మైమరచి నిద్రించి లేచినవారివలె అయినారు. అందరికీ దివ్యదేహాలూ, మహాబలవీర్యములూ సంక్రమించినవి.

## సునీథుడు తల్లిని దర్శించుట

చంద్రప్రభ సునీథునితో మయాసురుడు “నాయనా, మీ అమ్మను చూతువుగాని, బహుకాల మయింది. రా” అని సూర్యప్రభప్రభృతులతో నాలుగవపాతాళానికి తీసుకొనిపోయినాడు. వారు విచిత్రనగరాలు చూస్తూ చివరకు రత్నస్తంభాలు కలసువర్ణనగరములో అసురకాంతలు పరివేష్టించి ఉన్నలీలావతీదేవిని చూచినారు. ఆమె సునీథుని చూచాక సంభ్రమముతో లేచి పాదాలకు ప్రణమిల్లిన కుమారుని లేవనెత్తి కౌగలించుకొని సునీథుని తీసుకు వచ్చినందుకు భర్తను ప్రశంసించింది. మయుడు “దేవి, ఈసూర్యప్రభువు పూర్వజన్మలో నీ రెండవ కుమారుడు సుముండీకుడు. ఇతడు సునీథునికి కుమారుడై పుట్టినాడు. ఈశరీరముతోనే విద్యాధరచక్రవర్తి అవుతాడని రుద్రుడు సెలవిచ్చినాడు” అని చెప్పినాడు. లీలావతి పాదాలమీద వాలినాడు సూర్యప్రభువు. “నాయనా, ఈదేహమే బాగున్నది” అని లీలావతి అతనిని దీవించింది.

ఈసమయములో మయుడు మండోదరిని విభీషణుని స్మరించినాడు. వారు వచ్చినారు. విభీషణుడు “దానవేంద్రా, నామాట విను. దానవులలో సుకృతివి. శుభజీవితుడవు నీ వొక్కడవే. వృథాగా దేవతలతో వైరము వద్దు. అందువల్ల చెరుపే కాని శ్రేయస్సు లేదు. యుద్ధాలలో దేవతలవల్ల అసురులు నశించారు. కాని అసురులవల్ల దేవతలు మరణించలేదు” అని చెప్పినాడు. “మేము ముందుగా మూర్ఖముగా పనీ చెయ్యము. ఇంద్రుడు మొండిపట్టు పట్టి ఉంటే ఎలా సహించడము! అప్రమత్తు లయిన బలిచక్రవర్తిప్రభృతులు నశించ లేదుగా!” అని మయాసురుడు బదులు చెప్పినాడు. పిమ్మట విభీషణుడు మండోదరిని వెంట బెట్టుకొని తననివాసానికి వెళ్ళినాడు.

## సునీధుడు బలిని సందర్శించుట

మయుడు సునీధుని సూర్యప్రభుని బలిచక్రవర్తిసందర్శనము కోసము మూడవపాతాళలోకానికి తీసుకు వెళ్ళినాడు. అక్కడ కిరీటహారా దులు ధరించి దైత్యదానవపరివేష్టితుడైన బలిచక్రవర్తిని చూచి సునీ థాదులు వరుసగా పాదప్రణామము చేశారు. బలి వారిని యథో చితముగా ఆదరించి మయునివల్ల సమస్తవృత్తాంతము విని ప్రహ్లాదాది దానవులను రప్పించినాడు. సునీథాదులు వారిపాదాలకు మొక్కిన మీదట, బలి యిలా చెప్పినాడు : "మన సునీధుడు భూలోకములో చంద్రప్రభువుగా అవతరించి, నిజదేహములో ప్రవేశించి ప్రాణాలతో లేచి వచ్చినాడు. సుముండీకుని అవతారమయిన సూర్యప్రభువు ఇతడే. ఇతడు విద్యాధరచక్రవర్తి అవుతాడని మహేశ్వరుడు పూర్వమే అనుగ్రహించినాడు. యజ్ఞప్రభావమువల్ల నాబంధనాలు తొలిగిపోయి నవి. వీరు లభించడముచేత మనకు నిస్సంశయముగా అభ్యుదయము కలుగుతుంది."

"సత్యపూర్వకముగా ధర్మమార్గాన చరించేవారికి ఎన్నడూ నష్టము కలుగదు. కాబట్టి ధర్మప్రకారము నడుచుకోండి. నామాట చొప్పున ప్రవర్తిస్తూ ఉండండి!" అని గురువు శుక్రాచార్యుడు పలికి నాడు. ఈమాటలకు సరే అని అచ్చట సమావిష్టు లయినసప్తపాతాళ లోకాధీశ్వరులు ప్రతిజ్ఞ చేశారు. సునీధుడు లభించడముచేత బలి ఉత్సవము చేసినాడు.

ఇంతలో నారదముని వచ్చి అర్ఘ్యపాద్యములు స్వీకరించి సముచితా సనాసీనుడై దానవులతో ఇలా చెప్పినాడు : "ఇక్కడికి నన్ను ఇంద్రుడు పంపినాడు. సునీధుడు ఉజ్జీవించినందుకు తనకు చాలా సంతోషము కలిగిందనీ, మీరు వృథాగా మళ్ళీ వైరము పెట్టుకోవద్దనీ, తన ఆశ్రితు

డైన సుశర్మమీద ద్వేషము పెట్టకోరా దనీ ఇంద్రునిసందేశము.''

ఆమాటలకు ప్రహ్లాదుడు ఇలా చెప్పినాడు. సునీధుడు జీవించినందుకు ఇంద్రునికి సంతోషముకా కేమి? నిష్కారణముగా మేము విరోధము పెట్టుకోము. ఇప్పుడే శుక్రాచార్యులవారి సన్నిధిలో ప్రతిజ్ఞ చేశాము. తనకు సహాయులు ఉన్నారు కదా అని శ్రుతశర్మ మామీద కత్తికట్టు తున్నాడు. మాదోషము ఏమీ లేదు. తన ఆరాధకుడైన సూర్యప్రభువుకు మహేశ్వరుడు విద్యాధర చక్రవర్తి పదవి పూర్వమే అనుగ్రహించినాడు. శివాజ్ఞ అయిన తర్వాత మేము అన్యథా ఏమి చేయగలము? నిష్కారణముగా ఇంద్రుడు అనుచిత సందేశము పంపినాడు'' అంతట నారదుడు మంచిదని, ఇంద్రునే నిందించి వెడలిపోయినాడు.

నారదముని వెళ్ళగానే దానవులతో శుక్రాచార్యుడు "ఈవిషయములో ఇంద్రునికి బద్ధద్వేషము. మనకు శివానుగ్రహ మున్నప్పుడు ఇంద్రు డేమిచేస్తాడు. అతని విష్ణుభక్తి అక్కరకు రాదు'' అన్నాడు.

గురువు మాటలకు దానవులు సమ్మతి చూపి తమతమ నివాసాలకు వెళ్ళినారు. ప్రహ్లాదుడు నాలుగవపాతాళానికి పోయినాడు. బలిచక్రవర్తి కొలువు చాలించి అంతఃపురానికి వెళ్ళినాడు.

భోజనపానములు అయినతర్వాత లీలావతి సునీధునితో "నాయనా, తెలుసుగదా నీభార్యలు గొప్పయింటి బిడ్డలని. తేజస్వతి ధనేశునిపుత్రిక మంగళావతి తుంబురుని తనయ. చంద్రప్రభుదేహముతో నీవు పెళ్ళాడిన కీర్తిమతి ప్రభాస వసువు తనూజ. వీరందరినీ నీవు సమానదృష్టితో చూస్తూఉండవలె'' అని బోధించి భార్యలను అతనివద్దకు పంపింది. సునీధుడు ఆరాత్రి పెద్దభార్య తేజస్వతిని స్వీకరించినాడు.

సూర్యప్రభుడు మంత్రులతో సహా శయన మందిరములో పండుకొన్నాడు. అతనికి నిద్ర పట్టలేదు. ఆలోచనాపరుడైన ప్రహస్తునికీ నిద్ర పట్టలేదు. తక్కిన మంత్రులు సుఖముగా నిద్రపోతున్నారు.

## కళావతి ఆగమనము

ఇంతలో చెలికత్తెలతో కూడా కన్యామణి అక్కడికి వచ్చింది. ఈమె యెవరో అని సూర్యప్రభువు ఆలోచిస్తున్నాడు. ఆమె ఆతని చుట్టు పండుకొన్నవారి ముఖాలు వేరువేరుగా పరిశీలిస్తూ చక్రవర్తి లక్షణోపేతులు కానివారి నందరినీ విడిచి, సూర్యప్రభుని చూడగానే "సఖీ, ఈయనే ఆయన! సలిల శీతలమైన హస్తాలతో తాకి నిద్ర లేపు" అన్నది. ఆమె అలాగే చేసింది. సూర్యప్రభువు నిద్ర లేచినట్టు కన్నులు తెరిచి "ఎవరమ్మా మీరు? ఇక్కడికి ఎందుకు వచ్చారు?" అన్నాడు కన్యలను చూచి.

అందులో ఒకతె ఇలాఅన్నది: "దేవా, హిరణ్యాక్షుని కుమారుడు అమీలుడు రెండవపాతాళములో ఉన్నాడు. ఈమె ఆయనప్రియపుత్రిక కళావతి. ఆయన బలిచక్రవర్తివద్దనుంచి వచ్చి 'ఈవేళ సునీథునికి ప్రాణాలు వచ్చినవి! సుమండీకుని అవతార మైన సూర్యప్రభువు వచ్చినాడు. అతనిని మహేశ్వరుడు విద్యాధరచక్రవర్తిగా నిర్ణయించినాడు. ఇప్పుడు సునీథునికి సన్మానము చెయ్యవలె. సునీథుడు సగోత్రుడు కావడముచేత అమ్మాయి కళావతిని వివాహము చెయ్యడానికి వీలులేదు. అందుచేత సూర్యప్రభువుకు ఇస్తాను. సునీథునికి ఇతడు కుమారుడు అనే శంక కలగ నక్కరలేదు. ఇతడు మానవజన్మలో కుమారుడు కాని అసురజన్మలో కాడు. కుమారునికి సన్మానముచేస్తే తండ్రికిచేసినట్టే' అన్నాడు. కాబట్టి కళావతి నీగుణాలకు ఆకృష్టురాలై నిన్ను చూడడానికి వచ్చింది."

కళావతి అభిప్రాయము గ్రహించడానికి సూర్యప్రభువు నిద్ర నటించినాడు. మేలుకొని ఉన్న ప్రహస్తునివద్దకు కళావతి వెళ్ళి సఖిద్వారా సమస్తమూ ఆయనకు తెలిపి వెళ్ళిపోయింది.

ప్రహస్తుడు లేచివచ్చి "దేవా? నిద్రా? మెళుకువా?" అన్నాడు సూర్యప్రభునితో. "మిత్రమా! మెళుకువతోనే ఉన్నాను. ఏకాకికి నిద్ర యెక్క-

డిది! నీతో విశేషము చెప్పాలి. ఇంతకుముందే ఎవరో కన్య పరీపమే తమగా ఇక్కడికివచ్చి నామనస్సు హరించి ఎక్కడికో వెళ్ళింది. వెతికితే దొరుకుతుంది. వెంటనే తీసుకురా” అన్నాడు సూర్యప్రభుడు.

ప్రహస్తుడు వెళ్ళి చూస్తే ఆమె సమీపములోనే ఉన్నది. “దేవీ, నీకోసమే స్వామిని మేలుకొలిపినాను. నీవు మాస్వామికి ఒక్కసారి దర్శన మియ్యవలె. నీచూపులకే అతడు వశ్యు డైపోయినాడు. నీప్రస్తావన చేసేసరికి ఆమెను ఎలాగైనా తీసుకువచ్చి నాకు చూపకపోతే, నేను జీవించడము వట్టిది! అన్నాడు. నిన్ను వెతుకుకొంటూ వచ్చాను. రా, దేవీ!” అన్నాడు. ఆమె సిగ్గుపడి వెళ్ళలేక సంశయిస్తూ ఉంటే ప్రహస్తుడు ఆమె చెయ్యి పట్టుకొని లోపలికితీసుకువెళ్ళి ప్రభువుకు సమర్పించి నాడు. పార్శ్వమములో నిలువబడిన కళావతిని చూచి సూర్యప్రభువు “చండీ, నిద్రపోతున్న నాహృదయాన్ని అపహరించావు. దొంగకు శిక్ష వెయ్యకుండా ఎలా విడిచిపెడుతాను!” అన్నాడు. చతురురా లయిన ఆమె చెలికత్తె “దేవా, ఈమె దొంగ అని మొదటనే గ్రహించి తండ్రి దండనార్థము ఈమెను నీకు సమర్పించడానికి నిశ్చయించినాడు. ఇక అడ్డ మెవరు. ఈమె చౌర్యానికి తగినశిక్ష వెయ్యవచ్చును” అన్నది.

సూర్యప్రభువు కౌగలించుకోబోయేసరికి కళావతి సిగ్గుపడి “వద్దు నేను కన్యను గదా!” అన్నది. అప్పుడు ప్రహస్తుడు “దేవీ, ఎందుకు సందేహము? అన్నివివాహాలలో గాంధర్వవివాహము అత్యుత్తమము” అని చెప్పి తక్కినఅనుచరులను వెంటబెట్టుకొని వెడలిపోయినాడు. కళావతీ సూర్యప్రభువులకు గాంధర్వవిధిని వివాహము జరిగింది. తెల్లవారు జామున కళావతి తననివాసానికి వెళ్ళిపోయింది.

## సూర్యప్రభువు ప్రహ్లాదుని దర్శించుట

సూర్యప్రభువు సునీథ మహాసురుల దగ్గిరికి వెళ్ళినాడు. తర్వాత అందరూ కలిసి ప్రహ్లాదుని సన్నిధికి వెళ్ళినారు. ప్రహ్లాదుడు వారిని

ఆదరించి సునీథుని అభ్యుదయానికి ఉత్సవము చేశాము. కాబట్టి నేడు అందరమూ ఇక్కడే భోజనము చేశాము" అన్నాడు. మయాసురుడు మంచిది అన్నదిమీదట దూతలను పంపి ప్రహ్లాదుడు అసురాధిపతుల కందరికీ ఆహ్వానము అందజేసినాడు. అన్ని పాతాళములనుంచీ అసురులు క్రమంగా వచ్చినారు. అనేకులు వెంట కొలిచి రాగా మొదట బలి చక్రవర్తి వచ్చినాడు. క్రమముగా అమీలుడు, దురారోహుడు, వీర్యవంతుడు, సుమాయుడు, తంతుకచ్ఛుడు, వికటాక్షుడు, ప్రకంపనుడు, ధూమకేతువు, మహామాయుడు మొదలయిన అసురనాయకులు తమ సామంతులతో వచ్చి పరస్పరవందనములు అయినపిమ్మట ప్రహ్లాదుడు వారిని సక్రమముగా ఉపవిష్టులను చేసి ఆదరించినాడు. భోజనాత్పూర్వము లేచి వారంతా మయునితో గంగకు వెళ్ళి స్నానములుచేసి భోజనశాలకు వచ్చినారు. ఆమహాశాలలో స్తంభాలు రత్నమయములు. నేల యావత్తూ బంగారవుగచ్చు. చాందినీలో మణులు పొదిగినారు. పాత్రలన్నీ విచిత్రమణిమయములు. ప్రహ్లాదుడు, సునీథుడు, మయుడు, మంత్రులతో కూడిన సూర్యప్రభువు, మహాసురులు షడ్రసోపేతభక్ష్యాదులు భుజించి, పానీయములు సేవించినారు. అనంతరము అందరూ లేచి దైత్యదానవకన్యల నృత్యము చూడడానికి మరోశాలలోకి వెళ్ళినారు.

ఆసమయములో ప్రహ్లాదునికూతురు మహల్లిక తండ్రి కోరిక ప్రకారము నృత్యము చేసింది. ఆమె లలాటమున తిలకము, పాదముల నూపురము చూచి అందరూ ముగ్ధు లయినారు. ఆత్రిలోకసుందరిని చూచిన మాత్రాన సూర్యప్రభువు ఆమెకు తనహృదయము కోల్పోయినాడు. మహల్లికకుకూడా అనురాగము ఉదయించి మనస్సు చలించి ఆంగికాభినయము ఆగిపోయింది. సభాసదులు వారిస్థితి కనిపెట్టి "రాజపుత్రిక చాలా శ్రమ పడ్డది. ఇక నృత్యము చాలు" అని మానిపించారు. మహల్లిక సూర్యప్రభునిమీద కటాక్షవీక్షణములు ప్రసారించి తండ్రి

నద్ద సెలవుతీసుకొని జానపదనాయకులకు నమస్కారముచేసి అంతఃపురానికి వెళ్ళిపోయింది.

రాత్రివేళ సూర్యప్రభుని పరివారము వెలుపల నిద్రిస్తున్నది. కొంత సేపటికి కళావతి వచ్చింది. సూర్యప్రభువు ఆమెను లోపలి శయనమందిరానికి తీసుకు వెళ్ళినాడు.

## మహల్లిక ఆగమనము

విశ్వాసపాత్ర లయిన ఇద్దరు చెలికత్తెలలో మహల్లిక అక్కడికి వచ్చి లోపలికి వెళ్ళబోతున్నది. ప్రజ్ఞాఢ్యుడు అనే మంత్రి లేచి "దేవీ, కొంచెము ఆగు. నేను లోపలికి వెళ్ళి వస్తాను" అన్నాడు. ఆమెకు సంశయము కలిగి, "మీరెవరు; ఇక్కడనే మమ్ములిని నిలపడానికి కారణ మేమిటి?" అని అడిగింది. "దేవీ, నిద్రపోతున్న వానివద్దకు చప్పున వెళ్ళవచ్చునా? వ్రతముపూని ప్రభువు ఏకాంతముగా శయనిస్తున్నాడు" అన్నాడు మంత్రి. ఆమె ఆశ్చర్యపడి సరే అన్నది. మంత్రి లోపలికి వెళ్ళి కళావతి నిద్రపోతూ ఉండడము గమనించి సూర్యప్రభువును మెల్లిగా లేపి మహల్లిక వచ్చిం దని చెప్పినాడు.

సూర్యప్రభుడు నెమ్మదిగా ఇవతలకు వచ్చి మహల్లికను చెలికత్తెలనూచూచి "ఈఅతిథి కృతార్థు డయినాడు! ఈ ప్రదేశముకూడా ధన్యము అగును గాక!" అన్నాడు. మహల్లిక చెలికత్తెలతో కూర్చున్నది. ప్రభువు మంత్రితోసహా కూర్చుండి "దేవీ, నీవు చూచిన చూపులు మనస్సులో నాటుకొనిపోయినవి. నా నేత్రములు సఫలము లయినవి" అన్నాడు. "ఆర్యపుత్రా, నాదోషము లేదు. ఎవరి చూపులవల్ల నా అభినయము అగిపోయిందో వారిదే దోషము" అన్నది మహల్లిక. "జితోఽస్మి (ఓడిపోయినాను)" అని మందహాసముతో ప్రభుడు ఆమెహస్తము గ్రహించినాడు. స్వేదము పొడమి కంపి

స్తున్నది ఆమె కరము. "ఆర్యపుత్రా, నేను కన్యను. చెయ్యి విడ వండి. పెద్దలఅధీనములో ఉన్నదాన్ని" అన్నది రాజపుత్రి. అప్పుడు ప్రజ్ఞాఢ్యుడు "దేవి, కన్యలకు గాంధర్వవివాహము ఉన్నదికదా! మీ నాయునగారికి నీభావము తెలుసు. ఈయనకే నిన్ను ఇచ్చి సత్కరిస్తాడు. భయము లేదు. సమాగమము నిష్ఫలము కాగూడదు" అని బోధించినాడు.

లోపల కళావతికి మెళుకువ వచ్చింది. పర్యంకముమీద ప్రాణేశ్వరుడు కనబడ లేదు. సంశయముతో లేచి ఆమె ఇటు అటు చూచి వెలుపలికి వచ్చి మహల్లికదగ్గర ఉన్నప్రియుని చూచి లజ్జాభయక్రోధములు పొందింది. మహల్లికకు లజ్జాభయములు కలిగినవి. చిత్రప్రతిమవలె సూర్యప్రభుడు నిశ్చేష్టు డయినాడు. నన్ను ఎలాగూ పెళ్ళిచూచినారు. తొలగిపోవడము ఎలాగు? ఎంత సిగ్గుచేటు! ఎంత అవమానము!" అనుకొని కళావతి మహల్లికవద్దకు వెళ్ళి అసూయతో "సఖి కుశలమేనా? రాత్రివేళ ఇక్కడికి రాగలిగినావు!" అని అడిగింది.

"ఇది మానివాసము. నీవు ఇంకోపాతాళము నుంచి వచ్చినదానవు! అతిథివి లభించినావు!" అన్నది మహల్లిక. కళావతి మందహాసముతో "బాగు, బాగు! ఇక్కడికి వచ్చినవారి కందరికీ అతిథిసత్కారము చేస్తూనే ఉంటావు! కనబడుతునే ఉన్నది!" అన్నది. మహల్లిక కోపముతో "సిగ్గులేనిదానా! నేను ప్రీతిపూర్వకముగా కుశలప్రశ్న వేస్తే ద్వేషముతో నిష్ఠురవాక్కులు చమత్కారముగా పలుకుతున్నావే! నేను నీలాటిదానను కాను. బంధువులు ఇవ్వకుండానే దూరప్రదేశము నుంచి వచ్చి పరస్థలంలో రాత్రివేళ ఒంటరిగా రహస్యంగా పరపర్యంకముమీద పడుకొన్నానా? మానాయనగారి అతిథిని మాప్రదేశము లోనే దర్శించి అతిథిసత్కారము చెయ్యడానికి ఇద్దరుచెలికత్తెలతో కూడా వచ్చాను. ఈసచివోత్తముడు మాయమాటలు చెప్పి లోపలికి

వెళ్ళినపుడే సంశయించాను. ఇప్పుడు నీఅంతట నీవే బయట పెట్టు కొన్నావు !" అన్నది.

కళావతి ప్రియునిమీద రోషకషాయవీక్షణాలు ప్రసాదించి వెళ్ళిపోయింది. తర్వాత మహల్లిక రోషముతో "బహువల్లభా, సెలవు!" అని బయలుదేరి పోయింది. అప్పుడు సూర్యప్రభుడు వినముఖుడయినా డంటే ఆశ్చర్యము లేదు. ఉభయకాంతలమీద లగ్న మయిన అతనిహృదయము ఇద్దరవెంటా వెళ్ళింది.

సూర్యప్రభుడు ప్రభాసమంత్రిని లేపి, కళావతి సంగతి కనుక్కొని రమ్మని చెప్పి, మహల్లికవద్దకు ప్రహస్తుని పంపించి, తాను ప్రజ్ఞాఢ్యునితో ప్రసంగిస్తూ వారికోసము ఎదురుచూస్తున్నాడు.

ప్రభాసుడు కళావతివృత్తాంతము గ్రహించి వచ్చి ఈప్రకారము నివేదించినాడు: "నేను విద్యాప్రభావముచేత రెండవపాతాళములో కళావతీనివాసానికి వెళ్ళి వెలుపల ఇద్దరుచేటికల సంభాషణ అదృశ్యుడనై విన్నాను. ఒకతె రెండవదానితో సఖి కళావతి చాలా విచారంగా ఉన్న దేమి? అన్నది. రెండవది ఇలా చెప్పింది. నాలుగవ పాతాళములో సుమండీకుని అవతార మయిన సూర్యప్రభుడు ఉన్నాడు. మనసఖి స్వయముగా తనను ఆయనకు అర్పించుకొన్నది. ఈరాత్రి ఈమె అక్కడికి వెళ్ళింది. ప్రహ్లాదుని కూతురు మహల్లిక అక్కడకు చేరింది. ఈర్ష్యవల్ల కళావతి ఆమెతో జగడమాడి వచ్చి ఆత్మహత్యకు ప్రయత్నిస్తుంటే సోదరి సుఖావతి ఆపి రక్షించింది. ఇప్పుడు కళావతి సుఖావతి దగ్గర ఉన్నది. ఇద్దరూ దిగులుపడి ఉన్నారు. ఈమాటలు విని నేను లోపలికి వెళ్ళి ఉభయులనూ చూచి వచ్చినాను."

## మహల్లికా వివాహము

ఇంతలో ప్రహస్తుడు వచ్చి ప్రభువు ప్రశ్నించిన మీద ఇలా చెప్పినాడు. "ఇక్కడ బయలుదేరి మహల్లికమందిరానికి అదృశ్యుడనై

వెళ్ళి చూచాను. ఆ మెముఖాన విచారరేఖ కనబడ్డది. మహామల్లిక కూర్చున్న రత్నపర్యంకము చుట్టూ పన్నెండుమంది చెలికత్తెలు ఉన్నారు. వారిలో ఒకతె సఖీ, ఎందుకింత ఆకస్మికంగా విచారముతో ఉన్నావు? రేపు వివాహ మనగా ఇవాళ ఇంత వైమనస్య మెందుకు? అన్నది. నాకు వివాహమా? ఎవరి కిస్తారు? ఎవ రన్నారు? అన్నది మహామల్లిక. రేపుఉదయమే వివాహమని నిర్ణయించారు. సూర్యప్రభునుకు ఇస్తారట. నీ విక్కడ లేనప్పుడు మీఅమ్మగారు వచ్చి చెప్పి, నిన్ను పెళ్ళికూతురిని చెయ్యమని ఆజ్ఞయిచ్చి వెళ్ళినారు. అంగనామన్మథుడైన సూర్యప్రభుడు నీకు భర్త అవుతాడు. ఇక మమ్మలిని మరచిపోతావని మేము దిగులుపడుతున్నాము అన్నారు చెలికత్తెలు. మీరు ఆయనను చూచారా? మీహృదయాలు ఆయనయందు లగ్నమైనవా? అన్నది మహామల్లిక. మేము ఆయనను సౌధముమీదనుంచి చూచాము. దర్శన మాత్రాన ఆయనమీద మనసు తగులని మగువ ఉన్నదా? అన్నారు చెలికత్తెలు. అయితే నాయనగారితో చెప్పి మిమ్మలినికూడా ప్రభువుకే ఇప్పిస్తాను. అప్పుడు మనకు వియోగమేఉండదు" అని మహామల్లిక చెప్పింది.

వద్దు సఖీ, అలా చెయ్యవద్దు. న్యాయము కాదు. మాకు చాలా సిగ్గు వేస్తున్నది అన్నారు చెలికత్తెలు. అందుకు మహామల్లిక "సఖులారా, దోషము లేదు. ఆయన నన్ను ఒకతెనే వివాహమాడుతాడా! దైత్య దానవప్రభులు తమకొమార్తెలను ఆయన కియ్యబోతున్నారు. ఇప్పటికే ఆయన భూలోకములో చాలామంది రాజపుత్రికలను పెళ్ళి ఆడినాడు. విద్యాధర కన్యలను కూడా వివాహము చేసుకొంటాడు. మీరు కూడా ఆయనకు భార్య లయితే ఏమి నష్టము? మనసులు కలిసిన సఖులము, కాబట్టి అందరమూ ఒకచోటనేఉంటాము. ఎందుకు మీకు సిగ్గు? యావత్తూ నేనే ఏర్పాటుచేస్తాను" అని చెప్పింది.

ఈవిధముగా ప్రహస్తుడు పలికినమీదట సూర్యప్రభుడు సంతోష

ముగా రాత్రి నిద్ర లేకుండా గడిపినాడు.

ప్రాతఃకాలము సునీథునితో కూడా సూర్యప్రభుపు అసురాధిపతి ప్రహ్లాదుని దర్శనార్థము వెళ్ళినాడు. ప్రహ్లాదుడు ఆదరము చూపి సునీథునితో "సూర్యప్రభువుకు మహాల్లిక నిస్తాను. ఇతనికి అతిథిసత్కారమూ నీకు ప్రియమూ చేయవలసినవాడను కదా" అన్నాడు. అందరూ సమ్మతించినారు.

సక్రమముగా ప్రహ్లాదుడు మహాల్లికకు వివాహము చేసి అల్లునికి రత్నరాసులు బహుమానమిచ్చినాడు. మహాల్లిక "నాయనా, నా చెలికత్తెలు పన్నెండుగురినీ ఈయనకే ఇయ్యవలె" అన్నది. ప్రహ్లాదుడు "అమ్మా, నేను ఇవ్వడానికి వీలులేదు. వారు నాసోదరుని అధీనలు" అని చెప్పినాడు. నాటిరాత్రి సూర్యప్రభుపు మహాల్లికతో మహానందమనుభవించినాడు.

## కళావతీ ప్రముఖుల కళ్యాణము

మరునాడు ప్రహ్లాదుడు అనుచరసమేతముగా సభకు వచ్చినపుడు ప్రహ్లాదాదులతో "మీరంతా మానివాసానికి రావలె. ఈ వేళ సూర్యప్రభునికి ఆతిథ్యము చేస్తాను. మీకు సమ్మతమయితే నాకుమార్తె కళావతిని అతని కిస్తాను" అని ప్రకటన చేసినాడు. అందరూ సరే అన్నారు. మయ, సూర్యప్రభాదిసమేతముగా తర్వాత అందరూ రెండవపాతాళానికి వెళ్ళినారు. అమీలుడు యథావిధిగా కళావతికి వివాహము చేసినాడు. ఆనాడు ప్రహ్లాదునియింట విందు జరిగింది. దురారోహుడనే అసురనాయకుడు మర్నాడు సూర్యప్రభువును అయిదవపాతాళానికి తీసుకు వెళ్ళి తనకుమార్తె కుముదావతి నిచ్చి సక్రమముగా పెళ్ళి చేసినాడు. ఆరాత్రి సూర్యప్రభుడు నూతన భార్యతో గడిపి తండ్రుకచ్చుని ఆహ్వానము అంగీకరించి ఏడవపాతాళానికి వెళ్ళి

అతని కూతురు మనోవతిని వివాహ మాడినాడు.

మరునాడు సుమాయుడు పిలిచి సూర్యప్రభుని అరవపాతాళానికి తీసుకు పోయి కూతురు సుభద్ర నిచ్చి వివాహము చేసినాడు. ఆమరు నాడు బలిచక్రవర్తి మూడవ పాతాళములో సుందరి అనేపుత్రికను అతని కిచ్చినాడు. తర్వాత మయుడు నాలుగవపాతాళానికి తీసుకొని పోయి రత్నప్రభాభాసమాన మైన తనప్రాసాదములో సమాయ అనే పుత్రికను ఇచ్చి మానవుడు కాబట్టి పెండ్లి చేసినాడు. సూర్యప్రభుడు విద్యాప్రభావముచేత వివిధదేహాలు ధరించి అందరితోను వీకకాలము లోనే విహరిస్తున్నాడు. అందరిలో ప్రియతమ అయిన మహాల్లికతో రాత్రి ఏకశరీరముతో క్రీడిస్తున్నాడు.

ఆభిజాత్యము కలిగిన మహాల్లికతో సూర్యప్రభువు ఒకరాత్రి సల్లాపము చేస్తూ "ప్రియా, ఆరాత్రి నీవెంట వచ్చిన యిద్దరు చెలికత్తెలూ ఏ మయినారు? వారినివాస మెక్కడ? మళ్ళీ కనబడలేదే!" అన్నాడు.

మహాల్లిక ఇలా చెప్పింది. "ఆర్యపుత్రా, బాగా జ్ఞాపకము చేశారు! వా రిద్దరే కాదు; ఇంకా అటువంటి చెలికత్తెలు పన్నెండుమంది ఉన్నారు. మాపెదనాయనగారు దేవలోకమునుంచి వారిని చెరపట్టి నారు. అమృతప్రభ, కేశిని పర్వత మునిపుత్రికలు — కాళింది, భద్రక, చారులోచన దేవల మహాముని కూతుళ్ళు—సౌదామని, ఉజ్వల హాహా గంధర్వుని తనయలు—పీవర హూహూ గంధర్వునిబిడ్డ—అంజనిక కాలుని తనయ— కేసరావళి పింగళుడను గణోత్తముని పుత్రిక — మాలిని కంబ ళుని బిడ్డ — మందారమాల వసువు కౌమార్తె. వీరంతా దివ్యకన్యలు, అప్సరోజాతలు. నావివాహము కాగానే వీరంతా ప్రథమపాతాళానికి వెళ్ళినారు. వీరినికూడా మీకేఇస్తే మాకు వియోగము ఉండేది కాదు. మాస్నేహాన్ని బట్టి వీరిని మీకు ఇప్పిస్తా నని ప్రతిజ్ఞ చేశాను. మా పెదనాయనగారి అభిప్రాయము తెలుసుకోవలెనని మానాయనగారు

నాకోర్కె వెంటనే నెరవేర్చలేము.”

సూర్యప్రభుడు ఆశ్చర్యపడి “ప్రియా, నీమనస్సు గొప్పది! కాని వీరిని నే నెలా స్వీకరిస్తాను!” అన్నారు. కొంచెము కోపము వచ్చి మహల్లిక “ఆర్యపుత్రా, మీరు నా సమక్షము లోనే ఇతరులను పెళ్ళి చేసుకోగలరు. క్షణమయినా నేను విడిచిపెట్టలేని నాచెలికత్తెలను మాత్రము స్వీకరించరు!” అన్నది. సూర్యప్రభువు ఆమెకోరిక తీర్చడానికి వెంటనే అంగీకరించినాడు.

మహల్లిక తక్షణమే అతనిని ప్రథమపాతాళానికి తీసుకు వెళ్లి పన్నెండుమంది చెలికత్తెలనూ అతనికి సమర్పించింది. ఆ రాత్రే సూర్యప్రభువు వరసగా పెళ్లిచేసుకొని మర్నాడు ప్రభాసుని పంపి, వారిని నాలుగోపాతాళములో మహల్లికకోరిక ప్రకారము దాచిపెట్టి తాను అదృశ్యుడై ఆమెతో క్రీడిస్తూ యథాప్రకారము ప్రహ్లాద దర్శనార్థము సభకు వెళ్లినాడు. ప్రహ్లాదుడు మయసునీథులతో “మన మంతా దితిని దనువును దర్శించడానికి వెళుదాము” అన్నాడు. మయ సునీథ; సూర్యప్రభువులు పాతాళమునుంచి ఉచితపరివారముతో బయలుదేరి, తలచుకోగానే వచ్చిన భూతాసనవిమాన మెక్కి సుమేరు సానువులో ఉన్న కశ్యపాశ్రమానికి వెళ్ళినారు.

### కశ్యప దర్శనము

వారిని మునులు ఆదరముతో ఆహ్వానించి దితికి దనువుకు ఎరుకపరిచినారు. అందరూ ఆతల్లులపాదాలకు భక్తితో ప్రణామము చేశారు. అనురమాతలు ఆనందించి వారిశిరస్సులు మూర్కొని ఆశీర్వదించి మయునితో ఇలా అన్నారు. “నాయనా, పునర్జన్మ ఎత్తిన నీపుత్రిని సునీథుని చూచేసరికి మాకన్నులపండుగ అయింది! నీవు అదృష్టవంతుడవు. సూర్యప్రభశరీరముతో జన్మించి దివ్యలక్షణోపేతుడైన సుముం

డీకుని చూస్తుంటే మాశరీరాలు పరవశ మవుతున్నవి! నాయనలారా, త్వరగా లేచి ప్రజాపతుల వారిదర్శనము చెయ్యండి. సకలకార్య సిద్ధి అవుతుంది. వారిమాటప్రకారము వర్తిస్తే మీకు సకల కల్యాణ ములూ కలుగుతవి"

వెంటనే మయాదులు లేచి కశ్యపముని సన్నిధికి వెళ్ళి తపః ప్రభావ ముచేత దేదీప్యమానముగా ఉన్న మహాముని పాదాలకు సాష్టాంగ ప్రణా మము చేశారు. ఆయన ఆనందముతో ఆశీర్వదించి ఇలా ప్రసంగించి నాడు. "నాయనలారా, మిమ్మలిని చూడడముచేత మహానందము కలుగుతున్నది. మయా, సన్మార్గమును అతిక్రమించక సకల విద్యలకూ నిలయుడైన నీవు శ్లాఘ్యుడవు. సునీథా, మళ్ళీ జీవించిన నీవు ధన్యుడవు. సూర్య ప్రభా, పుణ్యాత్ముడవైన నీవు విద్యాధర చక్రవర్తివి అవుతావు. నా యనాలారా, ధర్మమార్గాన్ని అతిక్రమించకుండా నడుస్తుంటే సమస్తై శ్వర్యాలూ, సుఖాలు పొందుతారు. పూర్వమువలె మీకు ఇప్పుడు శత్రువులవల్ల అపజయము ఉండదు. ధర్మాన్ని అతిక్రమించిన అసురులే విష్ణుచక్రమువల్ల హతు లయినారు. సునీథా, దేవతలచేత హతులైన అసురులే మానవవీరులుగా జన్మించారు. నీతమ్ముడైన సుముండీకుడే ఈసూర్యప్రభుడు. తక్కిన అసురులు ఇతనికి బంధువర్గముగా జన్మ ఎత్తి నారు. శంబరమహాసురుడే ఇతనిమంత్రి ప్రహస్తుడు మయుని సచివుడయిన త్రిశిరసుడే సిద్ధార్థకుడు. వాతాపిదానవుడు ఈప్రజ్ఞాఢ్యుడు. ఉలూకుడు శుభంకరు డయినాడు. కాలాసురుడే వీతభీతి. వృషపర్వాసురుడే భాస మంత్రి. ప్రబలాసురుడే ప్రభాసుడు. శత్రువులయినను దేవతలు యాచిస్తే జంకక తనశరీరాన్ని రెండుగా చీల్చి యిచ్చినాడు: ఇతనిశరీరములోనుంచి సమస్తరత్నములూ ప్రభవించినవి! చండికాదేవి వరప్రభావముచేత ఇతడు మహాబలవంతుడూ శత్రువులకు అజయ్యుడూ అయి జన్మించి నాడు. సుందోపసుందులు సర్వదమన భయంకరులు హయగ్రీవ వికటా

త్యులు స్థిరబుద్ధి మహాబుద్ధి అయినారు. ఇతని మాామలు మంత్రులు. పూర్వము ఇంద్రాది దేవతలలో యుద్ధాలు చేసినారు. ఈ ప్రకారముగా మీాపక్షము వృద్ధిపొందింది. కాబట్టి మీాకు భయములేదు. ధర్మమార్గములో వర్తించండి. సమస్తసిద్ధులూ సమకూరుతవి.”

ఇంతలో మాధ్యందినసవనకాల మయింది. దక్షపుత్రికలు అదితి మొదలయిన ఆయన భార్యలు వచ్చి నమస్కరించిన మయాసురాదులను దీవించి భర్తకు మాధ్యందినసవనములో తోడ్పడినారు. కశ్యప మహాముని దర్శనార్థము ఇంద్రుడు ఇతరలోకపాలకులూ వచ్చినారు. ఇంద్రుడు కశ్యపునికీ ఆయన భార్యలకూ నమస్కరించినాడు. మయాదులు అతనికి వందనము చేసినారు. ఇంద్రుడు సూర్యప్రభునివైపు చుర చురా చూస్తూ మయునితో “ఈచిన్నవాడు విద్యాధర చక్రవర్తి కా కోరుతున్నాడు కాదా? అంత స్వల్పవాంఛతోనే సరిపెట్టు కొంటున్నాడేల ఇంద్రత్వమే అపేక్షించ రేమి?” అన్నాడు. “దేవనాయకా, ఈశ్వరుడు ఇంద్రత్వము నీకూ ఖేచరత్వము ఇతనికీ నిర్ణయించినాడు” అని మయుడు పలికినాడు. కోపము వచ్చినా నవ్వుతూ “సల్లక్షణ లక్షితుడైన ఇతనికి ఖేచరత్వము చాలా అల్పముకాదా!” అన్నాడు ఇంద్రుడు. శ్రుతశర్మ “ఖేచరత్వానికీ, ఇంద్రత్వానికీ తగినప్పుడు ఇతని ఆకారము ఇంద్రత్వానికి తగి ఉన్నది” అని మయుడు ప్రత్యుత్తర మిచ్చేటప్పటికి రోషముతో ఇంద్రుడు వజ్రాయుధము తీసుకొని అతనిమీాదికి వేసినాడు. కశ్యపముని హుంకారము చేసినాడు. దితి మొద లయినవారు ఛీ ఛీ అన్నారు. శాపభయము వల్ల ఇంద్రుడు వజ్రాయుధాన్ని ఉపసంహరించి కశ్యపముని పాదాలమీాద వాలి లేచి, చేతులు జోడించి ఇలా విన్నవించినాడు: “స్వామీా, నేను శ్రుతశర్మకు ఇచ్చిన విద్యాధరాధిపత్యము హరించా లని సూర్యప్రభువు చూస్తున్నాడు. మయుడు అన్ని విధాలా ఇతనికి సహాయము చేస్తున్నాడు”

కశ్యపుడు "ఇంద్రా, శ్రుతశర్మ నీకిష్టుడు, సూర్యప్రభువు ఈశ్వరునకు ఇష్టుడు. ఈశ్వరేచ్ఛ అమోఘము. మయుడు ప్రయత్నము చేయవలసిందని శివాజ్ఞ అయినది. ఇందులో మయుని దోష మేమున్నది? మయుడు ధర్మాత్ముడు, జ్ఞాని, గురుభక్తి కలవాడు. ఇతనిని నీవు బాధిస్తే ఈపాటికే మాకోపాగ్నికి ఇంధనము అయ్యేవాడివి. నీశక్తి ఇతనిమీద పని చెయ్యదు. చూచినావు కదా ఇతని ప్రభావము!" అన్నాడు. లజ్జాభయాలతో ఇంద్రుడు తల వంచుకొన్నాడు.

"శ్రుతశర్మ ఎటువంటివాడో చూడవలె" అన్నది అదితి. వెంటనే ఇంద్రుడు మాతలిని పంపి శ్రుతశర్మను రప్పించినాడు. శ్రుతశర్మ వచ్చి నమస్కరించినాడు. శ్రుతశర్మ సూర్యప్రభువు లిద్దరిలో ఎవడు రూపలక్షణాధికుడో చెప్పండి అని భార్యలు కశ్యపుని అడిగినారు.

"సూర్యప్రభునికి కాదు — ఇతని సచివుని కయినా సమానుడు కాడు శ్రుతశర్మ. ఇతడు అసమానుడు, సూర్యప్రభుని రూపలక్షణాలు దివ్యమైనవి. ప్రయత్నము చేస్తే ఇంద్రత్వముకూడా ఇతనికి సిద్ధిస్తుంది" అన్నాడు కశ్యపుడు. అందరూ మేలు మేలు అన్నారు. అక్కడివారందరూ, ఇంద్రుడూ వినేలాగున కశ్యపుడు మయునికి ఇలా వర మిచ్చినాడు. "వత్సా, ఇతడు వజ్రాయుధ మెత్తినప్పటికీ నీవు నిర్వికారముగా ఉండడముచేత వజ్రదేహుడవు, అజరామరుడవు, అక్షతుడవు అయినావు. మహాసత్వసంపన్నులైన ఈ సునీథ సూర్యప్రభులు నీకు సమానులూ, శత్రువులకు అజయ్యులూ అయినారు. స్వచ్ఛ దేహుడయిన నా కుమారుడు సువాసుడు ఆపత్కాలములో మీరు తలుచుకొంగానే వచ్చి సహాయము చేస్తూ ఉంటాడు."

తర్వాత కశ్యపభార్యలు, మునులు, లోకపాలకులు అందరూ మయాదులకు వరము లిచ్చినారు. అదితి ఇంద్రునితో "ఈధూర్తత్వము విడిచిపెట్టు; మయుని ప్రసన్నుని చేసుకో, ఇతనికి ఇప్పుడు లభించిన వరము

లను బట్టి చూస్తే విసయమువల్ల ఎంత లాభమో నీకు తెలియలేదా!" అని బోధించింది. ఆమాటలకు ఇంద్రుడు మయుని హస్తము పట్టుకొని ఆదరము చూపినాడు. శ్రుతశర్మ వెలవెలబోయినాడు. లోకపాలసహితముగా ఇంద్రుడు సురాసురగురువయిన కశ్యపమహాముసికి నమస్కరించి వచ్చినదారినే వెళ్ళినాడు. మయాదులుకూడా సెలవు తీసుకొని ఆశ్రమమునుంచి బయలుదేరినారు.

## త ర ం గ ము: ౪౬

## సూర్యప్రభుడు శ్రుతశర్మతో యుద్ధానికి సిద్ధమగుట

కశ్యపాశ్రమమునుంచి బయలుదేరి వారు ఐరావతీ చంద్రభాగా సంగమ ప్రదేశానికి వెళ్ళినారు. అక్కడ కనిపెట్టుకొని ఉన్న రాజులు వారిని చూడగానే రోదనము చేసినారు. చంద్రప్రభుడు కనపడనందున వారు దుఃఖించారని సూర్యప్రభుడు జరిగినదంతా వారికి తెలిపినాడు. అప్పటికీ వారి విచారము తగ్గలేదు. శ్రుతశర్మ సూర్యప్రభు భార్యలను అపహరించడముచేత తాము ప్రాణత్యాగము చేయడానికి సిద్ధపడితే ఆకాశవాణి తమను నివారించిందని అతి కష్టముమీద వారు విన్నవించినారు. సూర్యప్రభుడు మండిపడి "పరదారహారణములో ప్రవీణుడయిన ఆశ్రుతశర్మను బ్రహ్మాదిదేవతలు అడ్డు పడినప్పటికీ సంహారించి తీరుతాను!" అని ప్రతిజ్ఞ చేసినాడు. గణకులు ఏడవనాడు మంచిలగ్నమున్నదని చెప్పినారు. ఆనాటికి దండయాత్రకు బయలుదేరడానికి నిశ్చయించిన సూర్యప్రభుని మరింత దృఢపరచడానికి మయుడు ఇలా చెప్పినాడు. "తప్పకుండా నీవు జైత్రయాత్ర చేసే పక్షములో, నిజము చెప్తాను. నేను మాయాప్రయోగము చేసి నీభార్యలను తీసుకుపోయి పాతాళలోకములో భద్రముగా ఉంచినాను. నీవు శీఘ్రముగా దండయాత్ర చేస్తావనే ఉద్దేశముతో అలా చేశాను. వాయువు లోడు

పడినప్పుడు వెలిగినంత బాగా సామాన్యసమయములో అగ్ని ప్రజ్వరిల్లు తుందా? పాతాళానికి నీవు వస్తే ప్రియురాండ్రను చూపుతాను"

మయునివాక్కులకు అందరూ ఆనందించి అక్కడి బిలముద్వారా మయాసురునివెంట నాలుగోపాతాళానికి వెళ్ళినారు. ఒకానొక శయ్యా మందిరము తెరిచి, మయాసురుడు మదనసేనాదులను సూర్యప్రభునకు అప్పగించినాడు. వారెన్నీ, అసురనాయకుల పుత్రిక లయిన తనతక్కిన భార్యలనూ స్వీకరించి సూర్యప్రభుడు మయునిసూచనప్రకారము ప్రహ్లాదదర్శనార్థము వెళ్ళినాడు. సూర్యప్రభుకు లబ్ధ మయినవరము లను గురించి మయుడు చెప్పినాడు. తనకు ప్రణామము చేసినసూర్య ప్రభుని సత్త్వమును పరీక్షించా లని కత్తి దూసి ప్రహ్లాదుడు క్రోధము అభినయిస్తూ "దుర్మార్గుడా, మాఅన్న తెచ్చిన పన్నెండుగురు కన్య లనూ హరించా వని తెలిసింది. నిన్ను ఖండిస్తాను" అంటూ మీాదికి వెళ్ళినాడు. సూర్యప్రభుడు ఏమీా వికారము చెందక "నాదేహము మీాకు స్వాధీనము. మీాయిష్టము వచ్చినట్టు చెయ్య వచ్చును" అన్నాడు. ప్రహ్లాదుడు నవ్వి "సూర్యప్రభా! చాలా సంతోషము! నీకు లేశ మయినా అహంకారము లేదు. మెచ్చినాను వరము అడుగు" అని పలికినాడు. "గురుభక్తి, శివభక్తి ఉండేలాగున అనుగ్రహించండి" అన్నాడు అతడు. అందరూ ఆనందిస్తూ ఉండగా తనరెండవ పుత్రిక యామినిని ప్రహ్లాదుడు అతని కిచ్చి తనపుత్రులలో ఇద్దరిని సహాయ మిచ్చినాడు.

తర్వాత సూర్యప్రభుడు అందరితో కలిసి అమీాలునిసన్నిధికి వెళ్ళి నాడు. ఆయన వరముసంగతి విని తనద్వితీయపుత్రిక సుఖావతినీ, తోడుగా ఇద్దరుకుమారులనూ సూర్యప్రభునకు ఇచ్చినాడు. సహా యార్థము సూర్యప్రభుడు తక్కిన అసురనాయకులను దర్శిస్తూ ఆరోజు అక్కడనే గడిపినాడు. సునీథునిభార్యలు ముగ్గురూ, తనభార్య లయిన

రాజకన్యలూ గర్భము ధరించినారని మయాదులతో మాటాడేటప్పుడు సూర్యప్రభునకు తెలిసింది. మీకు నూడిద ఏమి కావలె అని అడిగితే "మాకు మహాయుద్ధము చూడవలె ననేకోరిక ఉన్నది" అన్నారు. వారు. "వెనుక నిహతు లయినఅసురులు వీరిగర్భాలలో ఉండడము చేతనే వీరికిటువంటికోరిక కలిగింది" అన్నాడు మయుడు.

ఆరురోజులు దాటినవి. ఏడవనాడు సూర్యప్రభుడు మొద లయిన వారు భార్యలతో సహా పాతాళలోకమునుంచి బయలుదేరినారు. శత్రువులు వారికి విఘ్నము కలిగించడానికి ఉత్పాతమాయను ప్రయోగించినారు. స్మరించగానే వచ్చి సువాసకుమారుడు ఆమాయను సంహరించినాడు.

చంద్రప్రభుడు తనకుకలిగిన పుత్రునికి రత్నప్రభుపు అని పేరు పెట్టి మయుని ఉపదేశప్రకారము ఆశిశువుకు రాజ్యాభిషేకము చేసి అందరితో సహా భూతాసన విమానమెక్కి భాగీరథీతీరాన తపోవనములోఉన్న సుమేరుని నివాసానికి వెళ్ళినారు. ఆవిద్యాధరప్రభువుకు మయునివల్ల సమస్తమూ గ్రహించి శివాజ్ఞ స్మరించి మైత్రితో వీరిని సన్మానించినాడు. ఆప్రదేశము లోనే ఉండి సూర్యప్రభు ప్రభృతులు తమతమ బంధు బాంధవులనూ సైన్యాలనూ రప్పించినారు. మయుని ఆనతిప్రకారము విద్యలను సాధించి సంసిద్ధులై ఉన్న సూర్యప్రభుని బావమరదులు మొదట వచ్చినారు ఆహారిభటాదులు పదునలుగురు. ఒక్కొక్కనితో పదివేల రథాలు వచ్చినవి. ఇరవై వేలమంది సైనికులు వచ్చినారు. తర్వాత సూర్యప్రభువుమామలు, వారిబంధువులు, దైత్యదానవులూ వచ్చినారు. వ్యాఘ్రరోముడు, మహామాయుడు, సింహదంష్ట్రుడు, ప్రకంపనుడు, తంతుకచ్ఛుడు, దురారోహుడు, సమాయుడు, వజ్రపంజరుడు, ధూమకేతుడు, ప్రమథనుడు, వికటాక్షుడు మొదలయినవారు సప్త పాతాళములనుంచి వచ్చినారు. ముప్పయివేల రథాలతో ఒకడు, అరవై

వేలతో ఇంకొకడు, డెబ్బయివేలతో వేరొకడు, ఎనభై వేలతో ఒకడు, చివరవాడు పదివేలరథాలతోనూ వచ్చినాడు. పదాతులు ఒకనికి లక్ష, ఇంకొకనికి రెండులక్షలు, మరొకనికి మూడులక్షలు, అధమునికి అర్థ లక్ష. ఇలాగే ఒక్కనికి తగినట్టు ఏనుగులు, గుర్రములు వచ్చినవి. మయ, సునీథుల సైన్యము, సూర్యప్రభుని నిజసైన్యము వసుదత్త సుమేరుల సేనలూ వచ్చినవి.

తలచుకోగానే సువాసకుమారుడు వచ్చినాడు. మయుడు అతనితో "స్వామీ, సేన చెదరిపోయి ఉన్నది. సమగ్రముగా సైన్యము నంతా ఏకత్ర చూడడానికి ఎక్కడ వీలు పడుతుంది?" అన్నాడు. ఇక్కడికి ఒక్క యోజనములో కలాపగ్రామ మున్నది. అక్కడ సేనావిన్యాసము చేసి ఏకదృష్టిలో చూడవచ్చును" అని ఆమునికుమారు డన్నాడు. అందరూ అతనివెంట కలాపగ్రామము చేరినారు. వారు అక్కడి ఉన్నత ప్రదేశాన నిలిచి అసురసైన్యమునూ, రాజులసైన్యములనూ, విడివిడిగా నిలిపి వీక్షించినారు. సుమేరువు ఈప్రకారముగా పలికినాడు: సుశర్మకు ఎక్కువ సేన ఉన్నది. అతని పక్షాన నూటఒక్క విద్యాధరాధిపతు లున్నారు. వారిలో ఒక్కొక్కడు ముప్ఫయియిద్దరు రాజులకు నాయకుడు. భేదో పాయ మవలంబించి అందులో కొందరిని మనపక్షానికి తిప్పగలను. అందు కోసమై రేపు ఉదయమే వల్మీకము అనే ప్రదేశానికి పోదాము. రేపు ఫాల్గున బహుళ అష్టమి. చక్రవర్తిసముచిత మైన తూణీరము అక్కడ రేపు ఉద్భవిస్తుంది. విద్యాధరులు ఆఅమ్ములపొది కోసము పోతారు.

## సూర్యప్రభునికి దివ్యతూణీరము లభించుట

ఆరోజు సైన్య సంవిధానములో గడిపి మర్నాడు అందరూ రథబల సమేతముగా వల్మీకము వెళ్ళి, హిమాచల దక్షిణ సానువుదగ్గర దిగినారు. అనేక విద్యాధరాధిపతులు అక్కడికి వచ్చి అగ్ని జ్వలింపజేసినారు.

కొంతసేపుండి హోమాలు, కొంతసేపుండి జపాలూ ఆచరించినారు. సూర్యప్రభువు గొప్ప అగ్నికుండము చేసినాడు. అతని విద్యాప్రభావముచేత అగ్ని స్వయముగా వెలిగింది. అది చూచేసరికి సుమేరువుకు సంతుష్టి కలిగింది. విద్యాధరులకు మాత్సర్యము పుట్టింది. అందులో ఒకడు 'సుమేరూ, నీవు విద్యాధరుడ వయినప్పటికీ భూసంచారి అయిన సూర్యప్రభువును అనుసరిస్తున్నావే! ఛీ ఛీ" అన్నాడు. సుమేరువు కోపముతో అతనిని భయపెట్టినాడు. ఇతని పేరేమి అని సూర్యప్రభుడు అతనిని అడిగితే సుమేరువు "భీముడనే విద్యాధరుని భార్యను బ్రహ్మ మోహించినాడు. ఇతడు బ్రహ్మకు రహస్యముగా జన్మించడముచేత బ్రహ్మగుప్తుడు అని ఇతనిపేరు. జన్మకు తగినట్టే మాట్లాడినాడు." అని పలికి అగ్నికుండము చేసినాడు. సూర్యప్రభుడూ అతడూ అగ్నిలో హోమము చేసినారు. భూమిలో రంధ్ర మేర్పడి అందులో నుంచి పెద్ద పాము లేచింది. బ్రహ్మగుప్తుడు దానిని పట్టుకోబోయినాడు. పాము పెట్టిన బుసగాలికి అతడు నూరు బారల దూరాన పడినాడు. తర్వాత తేజఃప్రభువు అనే విద్యాధరాధిపతి దానిని పట్టుకోబోయి దూరాన పడిపోయినాడు. అనంతరము దుష్టదమను డనే విద్యాధరాధీశ్వరుడు వచ్చి ఎగిరి దూరముగా పడిపోయినాడు. విరూపాక్షుడు దానిబుసకు గడ్డిపోచవలె కొట్టుకొని పోయినాడు. అంగారక విజృంభకు లనే రాజులు వచ్చి వెనకటివారివలెనే వెళ్ళి దూరాన పడిపోయినారు. ఈ విధముగా విద్యాధరప్రభువు లంతా సర్పఫూత్కారానికి దూరముగా పడిపోయినారు! రాళ్ళకు తగిలి వారి శరీరాలు నలిగి పోయినవి.

తర్వాత శ్రుతశర్మ వచ్చి పామును పట్టుకోబోయి దాని శ్వాసవాయువు తగిలి తక్కినవారివలెనే పడ్డాడు; ఊరుకోక లేచి వచ్చి గాలి తగిలి దూరాన పడిపోయినాడు. శరీరము నలిగిపోయింది.

సర్పమును పట్టుకోమని సూర్యప్రభుని సుమేరువు ప్రోత్సాహపరచి

నాడు. "చూడండి, చూడండి! అజగరాన్ని పట్టడానికి మానవుడు లేచి
నాడు! మర్కటాలకువలెనే మానవులకు బుద్ధి లేదు. అన్యులు చెప్పిన
దానిని చూచి అనుకరిస్తారు" అని విద్యాధరులు నవ్వినారు. సూర్య
ప్రభువు వాళ్ళను లక్ష్యము చెయ్యక వెళ్ళి పాముతోకను పట్టుకొని బిల
ములోనుంచి వెలుపలికి లాగినాడు. అజగరము ధనుస్సుగా మారినది.
సూర్యప్రభునిశిరస్సుమీద ఆకాశమునుంచి పుష్పవర్షము కురిసినది.
"సూర్యప్రభా! నీకు అక్షయతూణీరము లభించినది. ఈ [illegible]
స్వీకరించు" అని అశరీరవాణి పలికింది. విద్యాధరులు విస్మయగ్రస్తు లయి
నారు. సూర్యప్రభువు అమ్ములపొది పుచ్చుకొన్నాడు. [illegible] సునీథ
సుమేరులు మహానందము పొందినారు.

శ్రుతశర్మ విద్యాధరసైన్యాన్ని వెంటబెట్టుకొని వెళ్ళి దూతను పంపి
నాడు. "సూర్యప్రభుడా, నీకు ప్రాణాలమీద అపేక్ష ఉన్న పక్షంలో
అమ్ములపొదిని తనకు వెంటనే పంపవలసినదని మా ప్రభువు శ్రుతశర్మ
ఆజ్ఞాపిస్తున్నాడు" అని చెప్పినాడు. "దూతా, నా తూణీరం ఆతని శరీ
రములో ప్రవేశించి దేహమే అమ్ములపొది అవుతుందని చెప్పు" అని
సూర్యప్రభుడు ప్రత్యుత్తరమిచ్చినాడు. దూత వెడలిపోయిన తరువాత
శ్రుతశర్మ పరుషవాక్యాలను అందరూ పరిహసించినారు. సుమేరువు
సూర్యప్రభుని ఆలింగనము చేసుకొని "మహేశ్వరునిమాట ఫలించింది!
అమ్ములపొది లభించింది. నీకు చక్రవర్తిపదవి సిద్ధించినట్టే! ఇక నిర్వి
చారముగా ధనుస్సును సాధించడానికి రా" అని పలికినాడు.

## సూర్యప్రభుడు ధనుస్సును సాధించుట

సుమేరునివెంట సూర్యప్రభాదులు బయలుదేరి హేమకూటము చేరి
దాని ఉత్తరదిక్కున మానససరోవరానికి వెళ్ళినారు. అందులో జలక్రీ
డలు చేస్తున్న దివ్యకాంతల ముఖకమలాలను వికసిత కనక కమలాల

మధ్య్య కనిపెట్టడానికి వీలులేకపోయింది. ఇంతలోనే శ్రుతశర్మాదులు కూడా అక్కడికి వచ్చారు. సూర్యప్రభాదులు నేటితో కమలములతో హోమము ప్రారంభించినారు. తక్షణము భీకరమేఘము సరస్సులో నుంచి బయలుదేరి ఆకాశాన్ని ఆవరించి గొప్పవర్షము కురిసింది. మబ్బులోనుంచి కాలసర్పము నేలమీద రాలింది. సుమేరువు ప్రోత్సహించేసరికి సూర్యప్రభుడు లేచి దాన్ని పట్టి కొట్టేసరికి అది ధనుస్సుగా మారింది! వెంటనే మబ్బులోనుంచి మరోసర్పము విషాగ్నులు కక్కుతూ నేలమీద పడేటప్పటికి విద్యాధరు లంతా పరుగెత్తినారు. సూర్యప్రభుడు దాన్ని పట్టుకొన్నాడు. అది ధనుర్గుణము (విల్లుతాడు) గా మారింది. "సూర్యప్రభా, నీకు మహాధనువు లభించింది. ఈవింటినారి తెగేది కాదు. ఈరెండూ స్వీకరించు" అని ఆకాశవాణి పలికింది. పుష్పవర్షము కురిసింది. నారితో సహా విల్లు సూర్యప్రభుడు తీసుకొన్నాడు. శ్రుతశర్మ విచారముతో పరివారసమేతముగా వెళ్ళిపోయినాడు. మయాదులు సంతోషించి ధనువృత్తాంతము అడిగితే సుమేరువు ఇలా చెప్పినాడు:

## ప్రభాసాదులకు దివ్యధనుస్సులు లభించుట

ఇక్కడి వేణువనములోనుంచి కొట్టితెచ్చి వెదుళ్ళు ఈ సరస్సులో వేస్తే దివ్యధనుస్సు లవుతవి. దేవాసురులూ గంధర్వవిద్యాధరులూ పూర్వము వాటిని సాధించారు. ఈసరస్సులో దేవతలు అమృత బల నామము లైనధనుస్సులను దాచిపెట్టినారు. భావికాలములో చక్రవర్తులు కాబోయేవారికి కొంతశ్రమమీద శివానుగ్రహమువల్ల లభిస్తవి. సూర్యప్రభునికి మహాకార్ముకము హస్తగత మయినది. ఇతరవిద్యున్మాలికుకూడా తగినధనువులు లభిస్తవి. విద్యాప్రభావము కలిగినవీరు వాటిని సాధించడానికి యోగ్యులే. నేటికీ అవి యోగ్యులకు లభిస్తవి"

సూర్యప్రభునివయస్యు లయిన ప్రభాసాదులు కీచకవనానికి పోయి దానిపరిపాలకుడైన చండదండు డనే ప్రభువును జయించి వెదుళ్ళు తెచ్చి సరస్సులో వేసి ఒడ్డున కూర్చుని జపహోమాదులు ప్రారంభించారు. సప్తాహములో వారికి ధనుస్సులు లభించినవి. మయాదులూ, సూర్యప్రభుడు సుమేరుని తపోవనానికి వెళ్ళినారు.

### సూర్యప్రభుడు మోహినీపరివర్తినులను సాధించుట

సుమేరువు సూర్యప్రభునితో ఇలా అన్నాడు: "అజేయుడైన చండదండుని నీమిత్రులు జయించడము చిత్రమే! మోహినీవిద్యాప్రభావముచేత అతడు అజేయ్యుడు. ప్రధానశత్రువైన నీమీద ప్రయోగించడానికే అతడు గుప్తముగా ఉంచినాడు. అందుచేతనే నీమిత్రుల మీద ఇప్పుడు ఉపయోగించ లేదు. ఆవిద్య ఒక్కసారే కాని రెండో సారి ఫలించదు. పూర్వము దాన్ని పరీక్షించడానికి ప్రయోగిస్తే, కోపము వచ్చి గురువు శాప మిచ్చినాడు. ఈవిద్యలప్రభావము చాలా గొప్పది. మహానుభావుడైన ఈమయుని అడిగితే తెలుస్తుంది."

అప్పుడు మయుడు ఇలా చెప్పినాడు: "సంగ్రహంగా చెప్తాను. అవ్యక్తములోనుంచి ఆయాశక్తులు అనుశక్తులూ పుట్టుతవి. ప్రాణశక్తి అనునాదము పుట్టి బిందుమార్గాన్ని పొంది పరతత్వాగళాసమన్వితమై విద్యాదిమంత్రిత్వాన్ని పొందుతుంది. ఆమంత్రవిద్యలను గ్రహించడమువల్ల కాని, తపస్సువల్లకాని సిద్ధులఆజ్ఞవల్ల కాని సిద్ధి పొందినవారి మహాత్త్వము అమోఘము. నాయనా, మోహినీ పరివర్తినీవిద్యలు తప్ప తక్కిన వన్నీ నీకు లభించినవి. యాజ్ఞవల్క్యుని ప్రార్థించి ఆరెండువిద్యలూ సాధించు."

సూర్యప్రభుడు యాజ్ఞవల్క్యుని సన్నిధికి వెళ్ళినాడు. ఇతనిని ఆయన ఏడురోజులు పాములమడుగులో, మూడురోజులు అగ్నిలో ఉంచి

తపస్సు చేయించినాను. సప్తాహము పాముకాటు సహించినతర్వాత మోహినీవిద్యనూ మూడుదినములు అగ్ని తాపము సహించిన పిమ్మట పరివర్తనీవిద్యనూ ప్రసాదించినాడు. ముని ఆనతిప్రకారము సూర్య ప్రభుడు మళ్ళీ అగ్నికుండములో ప్రవేశించినాడు. గగనసంచారము చేసే మహాపద్మవిమానము ఇతనిదగ్గిరికి వచ్చింది. అందులో వివిధరత్న వినిర్మితము లైన నూటయెనిమిది రేకులూ, నగరములూ ఉన్నవి "ఇది చక్రవర్తివిమానము. ఈనగరాలలో నీరాణులను ఉంచితే వారు వైరులకు దొరకరు" అని ఆకాశవాణి పలికింది. ఇతడు మునికి ప్రణామము చేసి గురుదక్షిణ ఏమి కావలెనో తెలిపి తనను కృతకృత్యుని చేయుమని ప్రార్థించినాడు. "నీఅభిషేకసమయములో నన్ను తలుచుకో" అని యాజ్ఞవల్క్యుడు ఆదేశించినాడు. సూర్యప్రభుడు మునికి నమస్కరించి విమాన మెక్కి సుమేరునివాససమీపములో ఉన్న సైన్యముపద్దకు వెళ్ళినాడు. ఇతనిని చూచి సంగతులు ఆకర్ణించి అందరూ ఆనందించినారు.

## శ్రుతశర్మకు దూత్యము

సునీథుడు తలుచుకోనేటప్పటికి సువాసకుమారుడు వచ్చి మయాదులతోనూ, ప్రభువులతోనూ "ఆర్యులారా, విమానము విద్యలూ సూర్యప్రభునికి లభించినవి. అయినా మీరందరూ ఇప్పటికీ శత్రు విజయము మాట తలపెట్ట రేమి?" అని అడిగినాడు. "మీమాటలు యుక్తమే. కాని దూతను ముందుగా పంపి చూతాము" అన్నాడు మయుడు. "మంచిది. ఈప్రహస్తుని పంపండి. ఇతడు బుద్ధిమంతుడు, ప్రగల్భవాక్కు దూతకు ఉండవలసిన అన్నిలక్షణాలూ ఉన్నవాడు." అని మునికుమారు డన్నాడు. అందరూ అంగీకరించి ప్రహస్తునికి సందేశము చెప్పి శ్రుతశర్మదగ్గిరికి పంపినారు. అతడు వెళ్ళిన తర్వాత

సూర్యప్రభుడు స్వప్నవృత్తాంతము చెప్పినాడు:

"తెల్లవారుజామున నాకు కల వచ్చింది. మన మందరమూ నదీ ప్రవాహములో కొట్టుకొనిపోతున్నాము. నీళ్ళల్లో, మునుగకుండా నృత్యము చేస్తున్నాము. ఎదురుగాలివల్ల నదీప్రవాహము తిరిగింది. అప్పుడు తేజోవంతు డైనపురుషుడు మనలను అగ్నిలో వేయగా మనము మాడిపోలేదు. ఈలోగా మేఘము రక్తము వర్షించింది. ఆ రక్తమువల్ల దిక్కు లన్నీ మునిగిపోగా నాకు మెలకువ వచ్చింది."

సువాసకుమారుడు ఇలా స్వప్నవిషయాన్ని వివరించినాడు: "ఈ స్వప్నము కష్టాలు గట్టెక్కినతరువాత అభ్యుదయాన్ని సూచిస్తున్నది. జలప్రవాహము యుద్ధాన్ని సూచిస్తుంది. నదీప్రవాహములో మునుగకుండా కొట్టుకొనిపోవడము మీధైర్యప్రవృత్తి. ప్రవాహాన్ని మరల్చినగాలి మీకు రక్షకుడు. తేజోవంతుడు సాక్షాత్తు పరమశివుడు. అతడు మనలను అగ్నిలో వేయడ మంటే యుద్ధము చేయు మని ప్రోత్సహించడ మని అర్థము. మేఘోదయము భయాన్ని సూచన చేస్తుంది. రక్తవర్షము భయనాశనము. దిక్కులు రక్తసిక్తము కావడము మీఐశ్వర్యము. స్వప్నము అనేకతీరులుగా వస్తుంది. ఏది వెంటనే అర్థాన్ని తెలియ చేస్తుందో అది అన్వర్థము. దేవత స్వప్నములో సాక్షాత్కరించి ఆదేశించడము యథార్థము. తీవ్రానుభవములు వాసనారూపాలై, స్వప్నముగా అపార్థము కలిగిస్తవి. రజస్సువల్ల మనస్సు బాహ్యవిషయాలను విడిచినప్పుడు స్వప్నము వస్తుంది. స్థూల దేహసంబంధము లేక సూక్ష్మదేహమువల్ల స్వప్నము సిద్ధ మవుతుంది. స్వప్నము కాలవిశేషాన్ని బట్టి చిర శీఘ్ర ఫలాలను ఇస్తుంది." అని సూర్యప్రభాదులు లేచి దినశేషాన్ని గడిపినారు.

ప్రహస్తుడు శ్రుతశర్మదగ్గరనుంచి తిరిగి వచ్చి మయుడు మొదల యిన వాళ్ళతో యథార్థము వివరించినాడు: "నేను ఇక్కణ్ణించి బయలు దేరి

త్రికూటాచలముమీద ఉన్న సువర్ణమయ మైన త్రికూటపతాకపురానికి వెళ్ళినాను. ద్వారపాలకులద్వారా నా రాక తెలియచేసి విద్యాధరుల మధ్య కూర్చున్న శ్రుతశర్మను చూచినాను. తండ్రి త్రికూటసేనుడు, విక్రమశక్తి, ధురంధరుడు, దామోదరుడు మొదలైనశూరులు కొలువులో కూర్చున్నారు. నేను ఆసీనుడనై శ్రుతశర్మతో అన్నాను: "శ్రీమంతుడైన సూర్యప్రభుడు నన్ను నీదగ్గిరికి పంపినాడు. శివాను గ్రహమువల్ల విద్యలు, రత్నాలు, భార్యలు, రక్షకులనూ అతడు సాధించినాడు. మీరు విద్యాధరులతో కూడా వచ్చి ఆయనసేనలో చేరవలె. అతడు వైరులను చంపి, ప్రణతులను రక్షిస్తాడు. తెలివి తక్కువవల్ల మీరు సునీధకుమార్తెను కామచూడామణిని హరించారట. ఆరాక్షసకన్యను త్యజించవలె. అలా చేస్తే మీకు శ్రేయస్సు కలుగుతుం దని సూర్యప్రభుడు తెలియచేయ మన్నాడు." అందరికీ కోపము వచ్చి "మాకు ఎవడు గర్వముతో సందేశము పంపేవాడు? మానవులకు సందేశము పంపినట్టు మాకు పంపుతాడా? గుడ్డిగవ్వ చెయ్యని వాడు మాకు కబురు పంపుతాడా? ఈగర్వము వాణ్ణి తప్పక అణచి వేస్తుంది" అని పలికినారు.

నేను వాళ్ళకు ఇలా సమాధాన మిచ్చినాను:

"అత డెవరో మీరు ఎరుగరు. ఆయన శివానుగ్రహమువల్ల విద్యాధరచక్రవర్తిగా జన్మించినాడు. ఆయన మానవు డని శంక చేస్తే, మానవులు దేవత్వాన్ని సాధించలేదా? ఆయనశౌర్యము మీవాళ్ళంతా చూచేఉన్నారు. ఆయన ఇక్కడికి వస్తే మీనాశనము తప్పదు." సభ సంక్షోభము చెందగా నన్ను సంహరించడానికి శ్రుతశర్మ ధురంధరులు నామీదికి వచ్చినారు. "మీశౌర్యము ఎలాంటిదో చూస్తాను" అన్నాను. దామోదరుడు లేచి విప్రదూతను సంహరించటము అధర్మ మని హితము చెప్పినాడు. విక్రమశక్తి నాతో "దూతా!

వెళ్ళిపో. మమ్మల్ని కూడా ఈశ్వరుడే సృష్టించాడు. నీస్వామి ఇక్కడే వస్తే అప్పటిమాట చూస్తాము. అతన్ని మేము సత్కరిస్తాము" అన్నాడు.

నవ్వుతూ నేను ఆకాశాన్ని ఆక్రమిస్తున్న మబ్బును చూచేదాకా పద్మవనిలో హంసలు సుఖంగా నాదము చేస్తవి! అని వాళ్ళను తృణీక రించి లేచి వచ్చినాను"

## రణ దీక్ష

ప్రహస్తుడు చెప్పగా మయాదులు విని సంతోషించినారు. సూర్య ప్రభుడు యుద్ధము చేయడానికి సిద్ధపడి రణనీతివిశారదు డైనప్రభానుని సేనాధిపతిని చేసినాడు. సువాసకుమారుని ఆదేశమువల్ల అందరూ రణదీక్షితు లైనారు.

## విలాసినీ సమాగమము

రాత్రి సూర్యప్రభుడు దీక్ష వహించి శయ్యామందిరములో శయ నించగా ఒకసుందరాంగి ప్రవేశించింది. అమాత్యులు అందరూ వరున్నారు. సూర్యప్రభుడు వ్యాజనిద్ర అభినయించినాడు. ఆకన్య చెలికత్తెతో "ఇతను నిద్రిస్తూ ఉండగా ఇంత అందముగా ఉంటే మేలు కొంటే ఎంత చక్కగా ఉంటాడో! ఇతన్ని ఎందుకు నిద్ర లేపడము? నాకుతూహలము తీరింది. నామనస్సు ఇతనిమీద లగ్నము చేసి ప్రయోజన మేమిటి? శ్రుతశర్మతో ఇతను యుద్ధము చేస్తాడు. ఫలితము ఎలా ఉంటుందో? రణోత్సవము వీరులప్రాణాలు హరిస్తుంది. ఇతనికి విజయము కలగవలె. గగనమార్గాన వెళుతున్న కామచూడామణి సౌందర్యాన్ని చూచి ఇతడు వివశు డైనాడు. నాబోటిదాన్ని చూచి వ్యామోహ పడతాడా? ఇతనిహృదయాన్ని నేను రంజించగలనా?" అన్నది.

చెలికత్తె సమాధానము ఇచ్చింది: "చండీ! ఎందుకమ్మా నీకితనిమీద ఇంత విరక్తి! ఇతడు కామునిసౌందర్యమునేమించినవాడు. పాతివ్రత్యాన్ని అరుంధతిమనస్సుకూడా హరిస్తాడు. ఇతడు ప్రతాపశాలి, వీరుడు. యుద్ధములో తప్పక ఇతనిదే జయము. ఇతడు విద్యాధరచక్రవర్తి అవుతాడని సిద్ధులు చెప్పనే చెప్పారు. కామచూడామణిని, సుప్రభ నీ గోత్రమువాళ్ళే. తమద్వారా ఇతడు సుప్రభను పెళ్ళాడినాడు. సిద్ధ వాక్యము యథార్థ మవుతుంది. ఇతడు చక్రవర్తి కాక తప్పదు. సుప్రభకన్న నీ చక్కదనము ఎక్కువ. సతులకు భర్తే బంధువు."

అప్పుడా కన్య పలికింది: "సఖీ, నీ వన్నది నిజం. ఆర్యపుత్రునికి జయము తప్పదని ఎరుగుదును. ఇతనికి రత్నాలూ విద్యలూ సంప్రాప్త మైనవి. ఇతనికి ఓషధులు సిద్ధించ లేదు. అందువల్ల నామనసు కొంచెము శంకిస్తున్నది. చంద్రపాదపర్వతగుహాలో పుణ్యాత్ములకు లభించేఓషధులున్నవి చక్రవర్తికి అవి లభిస్తవి. ఓషధులు సంపాదిస్తే రేపే యుద్ధము ఆరంభించవచ్చును."

వ్యాజనిద్రా నిమీలితాక్షుడై సూర్యప్రభుడు కన్యామణివచనాలు విని మేలుకొని ఆమెతో సవినయముగా "హరిణాక్షీ, నీవు నామీద పక్షపాతము కనపరిచినావు. ఓషధులకై చంద్రపాదపర్వతముదగ్గిరికి వెళ్లుతాను. నీవు ఎవరవో చెప్పవా?" అని కుతూహలముతో అడిగినాడు. సంగతి యావత్తూ అతడు విన్నా డని కన్య సిగ్గుపడి తల వంచింది. ఆమెసఖి అతనితో "ఈకన్య విద్యాధరరాజైన సుమేరుని తమ్ముని కుమార్తె. పేరు విలాసిని. మిమ్మల్ని చూడా లని వచ్చింది" అని పలికింది. విలాసిని చెలిని రమ్మని పిలిచి అక్కణ్ణించి వెళ్ళిపోయింది.

## ఓ ష ధీ సా ధ న ము

సూర్యప్రభుడు అమాత్యులైన ప్రభాసాదులను లేపి విలాసిని చెప్పిన ఓషధీసాధనము తెలియచేసినాడు. ఓషధీసాధనావిషయము

మరియు సునీథ సుమేరువులకు తెలియచేసే నిమిత్తము దౌహిత్యుడయిన ప్రహస్తుని రాజు పంపినాడు. మంత్రులు అంగీకరించగా సూర్యప్రభుడు వాళ్ళతో చంద్రపాదపర్వతానికి వెళ్ళుతూ ఉండగా దారిలో యక్ష గుహ్యక కూష్మాండులు ఆయుధపాణులై అడ్డగించినారు. మంత్రులు కొందరిని అస్త్రాలవల్ల మూర్ఛపాలు చేసి, కొందరిని విద్యాబలముచేత స్తంభింపచేసి సూర్యప్రభాదులు చంద్రపాద పర్వతముదగ్గిరికి వెళ్ళినారు. వాళ్ళు గుహాద్వారము చేరగా విచిత్ర వికృతాననులు హారప్రమథులు వచ్చి అడ్డగించినారు. సువాసకుమారుడు సూర్యప్రభాదులతో "ప్రమ థులతో యుద్ధము పనికిరాదు. అలాచేస్తే శివునికి కోపము వస్తుంది. అష్టోత్తర శతనామాలతో శివార్చన చేస్తే మహేశ్వరుడు ప్రసన్నుడై వరమిస్తాడు. అప్పుడు ప్రమథులు ప్రసన్నులు అవుతారు" అని సలహా ఇచ్చినాడు. అందరూ మహేశ్వరస్తుతి చేయగా ప్రమథులు ప్రసన్నులై పలికినారు: "ఈ చంద్రపాద పర్వత గుహను వదిలినాము. గుహలో ఉన్న మహౌషధులు గ్రహించండి. అయితే సూర్యప్రభుడు స్వయ ముగా గుహలో ప్రవేశించ వద్దు. ప్రభాసుని ప్రవేశపెట్టండి."

ప్రమథుల వాక్యములు విని అందరూ ఆనందించినారు. అంధకార నీరంధ్ర మైన గుహలో ప్రభాసుడు ప్రవేశించగా గుహ ప్రకాశమాన మైనది. భీకరాకారులు నలుగురు రాక్షసకింకరులు లేచి ప్రణామము చేసి ప్రభాసునికి దారి ఇచ్చినారు. అతడు నష్టదివ్యౌషధులు తీసుకొని ప్రభువుకు అర్పించగా, అప్పు డాకాశవాణి "సూర్యప్రభా! ఓషధీప్రభా వము వల్ల నీశక్తి అఖండము" అన్నది. సూర్యప్రభాదులు సంతో షించి సుమేర్వాశ్రమములోఉన్న నిజసేన దగ్గిరికివెళ్ళినారు. ఆశ్రమములో సునీథుడు సువాసకుమారునితో "మునీంద్రా! పర్వతగుహలో మన రాజుకు ప్రవేశము లేక ప్రభాసునికి ప్రవేశార్హతకు కారణ మేమిటి?

గుహాలో ఇతన్ని రాక్షసకింకరులు గౌరవించడానికి కారణము ఏమిటో?"
అని అగిడితే మునికుమారుడు చెప్పుతున్నాడు :

## ప్రభాసుని పూర్వవృత్తాంతము

"ప్రభాసుడు ప్రభుహితాన్ని కోరేవాళ్ళల్లో శ్రేష్ఠుడు. వా రిద్దరికీ మైత్రి అఖండము. ప్రభాసునివంటి పరాక్రమశాలి న భూతో నభవిష్యతి! ఆపర్వతగుహ పూర్వసుకృతమువల్ల ఇతనిది. ఎవరో తెలుసునా ప్రభాసుడు? పూర్వము నముచి అనే రాక్షసశ్రేష్ఠుడు. యాచకులపాలిటి కల్పతరువు. అతడు పదివేల సంవత్సరాలపాటు ధూమపానము చేస్తూ తపస్సు చేసి లోహపాషాణదారువులవల్ల మరణము లేకుండా బ్రహ్మానుగ్రహము సంపాదించినాడు. అతడు అనేకసార్లు మహేంద్రుణ్ణి తరిమివేసినాడు. కశ్యపమహర్షి ఆదానవుని ప్రార్థించి దేవతలతో సంధిఏర్పాటు చేసినాడు. అప్పుడు సురాసురులు యుద్ధము మాని కూడపలుకుకొని క్షీరసముద్రాన్ని మందరగిరితో మథించినారు. అచ్యుతాదులపాలికి లక్ష్మీప్రభృతులు, నముచిదగ్గిరికి ఉచ్చైశ్రవ మనేహయము వచ్చినది. ఇతరదేవతలు రాక్షసులు వేరువేరుగా బ్రహ్మదేవుడిచ్చినభాగాలు సముద్రమునుంచి వచ్చినవస్తువులలో గ్రహించినారు. మథనానంతరము లభించినఅమృతాన్ని దేవతలు హరించగా వాళ్ళకూ రాక్షసులకూ పోరు జరిగింది. సురాసురసంగ్రామములో చనిపోయినరాక్షసులను ఉచ్చైశ్రవ మనేగుర్రము వాసన చూచి ఉజ్జీవితులనుచేసింది. అందువల్లదైత్యరాక్షసులు దేవతలచేతుల్లో చనిపోలేదు. ఇంద్రుడు విచారముతో ఉండగా ఏకాంతములో దేవగురు వైనబృహస్పతి "మహేంద్రా, ఒకటే యుక్తి తోస్తున్నది. నీవు నముచిని ఉచ్చైశ్రవము యాచించు. అతడు దానవీరుడు. కనుక తప్పకుండా ఆగుర్రాన్ని నీకు అర్పిస్తాడు. ఆ జన్మసంచిత మైనదాతృత్వకీర్తిని అతను పోగొట్టుకోడు" అని హితోప

దేశము చేసినాడు.

వెంటనే దేవేంద్రుడు దేవతలతో కూడా వెళ్ళి నముచిని గుర్రము యాచించినాడు. శుక్రాచార్యుడు వద్దని వారిస్తున్నా లక్ష్యపెట్టక దానశౌండు డయిననముచి దాతృతాకీర్తి పోతుం దని యోచించి ఇంద్రుడు అడిగినవెంటనే గుర్రాన్ని ఇచ్చివేసినాడు. శస్త్రాలవల్ల అవధ్యు డైన నముచికి దేవేంద్రుడు వజ్రాలపొడి గంగాజలములోని నురుగులో వేసి ఇచ్చినాడు. తాగి నముచి మరణించినాడు. కుమారుని ఘోర మరణవృత్తాంతము విని నముచితల్లి శోకశాంత్యర్థై "నముచి తిరిగి నా కడుపునపుట్టి సర్వదేవతలకూ అజయ్యుడు అగుగాక" అని సంకల్పిం చింది. అప్పు డానముచి రత్నమయుడై బలశాలియై ప్రబలు డనే పేరుతో ఆమెకడుపున పుట్టినాడు. ప్రబలుడు తపస్సు చేసి అర్థులకు ప్రాణదానముకూడా చేసి మహేంద్రుణ్ణి నూరుసార్లు ఓడించినాడు. దేవతలు కూడపలుకుకొని అతనిదగ్గిరికి వెళ్ళి "మాకు పురుషమేధా ర్థము శరీరాన్ని అర్పించు" అని యాచించినారు. అడిగిందే తడవుగా అర్పించగా దేవతలు ప్రబలుణ్ణి ఖండఖండాలుగా నరికినారు. ప్రభాస రూపమున ప్రబలుడు భూమండలములో అవతరించినాడు. నముచి ప్రబలుడయి, తరువాత ప్రభాసుడై పుణ్యశక్తివల్ల అజేయు డైనాడు. ఓషధులున్న గుహ ఇతనిదే. కింకరు లందరూ ఇతనికి వశ్యులు. గుహలో కిందపాతాళములో ప్రబలునిమందిరము ఉన్నది. అక్కడ ఇతని ముఖ్య భార్యలు పన్నెండుమంది, వివిధరత్నాలు, నానాయుధాలు, చింతా మణి, లక్షయోధులు గుర్రాలతో ఉన్నారు. అ దంతా ఇతని ఆర్జితము."

సూర్యప్రభాదులు రత్నాలు తెచ్చుకోడానికి ప్రబలునిమందిరానికి గుహామార్గాన వెళ్ళినారు. ప్రభాసుడు ఒక్కడే ఆలోపనే వెళ్ళి తన పూర్వభార్యలను గ్రహించి చింతామణిని అశ్వాలను యోధులను ధన

మునూ తెచ్చి సూర్యప్రభుణ్ణి సంతోషపెట్టినాడు. సూర్యప్రభుడు ఓధులు స్వీకరించి మయ సునీథ ప్రభాస సుమేర్వాదులు, సామంతులు వెంట రాగా సేనాశిబిరానికి వెళ్ళినాడు. అక్కడి రాక్షసులూ రాజులూ తమఇళ్ళకు వెళ్ళగా సూర్యప్రభుడు రణోద్యోగక్రతుడై దర్భాసనముమీద రాత్రి నిద్రించినాడు.

## తరంగము: 42

## యుద్ధ యాత్ర

మర్నాడు ఉదయాన సూర్యప్రభుడు సుమేర్వాశ్రమమునుంచి సేనానీకముతో శ్రుతశర్మతో యుద్ధానికి బయలుదేరినాడు. అతడు త్రికూటాచలానికి వెళ్ళి అక్కడ శర్మబలాన్ని ఓడించి తరిమివేసి అక్కడ విడిసినాడు. సూర్యప్రభుడు సుమేరుమయాదులతో కొలువు తీర్చి ఉండగా త్రికూటాధిపతిదగ్గిర నుంచి రాయబారి వచ్చి విద్యాధరేంద్రు డయినసుమేరువుతో పలికినాడు: "శ్రుతశర్మతండ్రి నీకిలా సందేశ మిచ్చినాడు:

"దూరములో ఉన్న నీకు తగినగౌరవము చేయలేక పోయినాము. నీవు మాఇంటికి అతిథులతో వచ్చావు. అందువల్ల ఉచితంగా మీాకు ఆతిథ్యము ఇస్తాము!

శత్రుసందేశము విని సుమేరువు సమాధానము ఇచ్చినాడు: "మంచిది. మావంటిఅతిథులు నీకు దొరకరు. ఆతిథ్యము పరలోకములో కాదు, ఈలోకములో ఫలిస్తుంది. కనుక మేము సిద్ధము. ఆతిథ్యము చేయండి."

దూత శ్రుతశర్మదగ్గిరికి వెళ్ళినాడు. సూర్యప్రభాదులు ఉన్నతప్రదేశాన నిలువబడి విడిసినసేనను వీక్షించినారు.

సునీథుడు తండ్రినుయాసురుని సేనావిభాగము తెలియ చెప్ప

## రథాధి ప్రవిభాగము

మన్నాడు. సమస్తమూ ఎరిగిన ఆదానదేవేంద్రుడు వేలితో చూపుతూ చెపుతున్నాడు : "ఈను బాహువు, నిర్ఘాతుడు, ముష్టికుడు, గోహరుడు, ప్రలంబుడు, ప్రమాథుడు, కంకటుడు, వసుదత్తాది భూపతులు అర్ధరథులు. అంకురి, సవిశాలుడు, దండిభూషణ సోమిలులు, ఉన్మత్తకుడు, దేవశర్మ, కుమారకుడు, హారిదత్తాదులు పూర్ణరథులు. ప్రకంపన, దర్పిత, కుంభీర, మాతృపారిత, మహాభట, వీరస్వామి, సురాధార, భంజీర, సింహదత్త, గుణవర్మ, కీట, భీమ, భయంకరులు ద్విగుణరథులు. విరోచన, వీరసేన, యజ్ఞసేన, కుంజర, ఇంద్రవర్మ, శబరక, క్రూరకర్మ, నిరాసక రాజపుత్రులు త్రిగుణరథులు. సుశర్మ, బాహుశాలి, విశాఖ, క్రోధన, ప్రచండులు చతుర్గుణరథులు. జుంజరి, వీరవర్మ, ప్రవీరవర, సుప్రతిజ్ఞ, అమరరామ, చండదత్త, జాలిక, సింహభట, వ్యాఘ్రభట, శత్రుభటులు పంచగుణరథులు. ఉగ్రవర్మ అనే రాజపుత్రుడు షడ్గుణరథుడు. విశాఖ, సుతంత, సుగమ, నరేంద్రశర్మలు సప్తగుణరథులు. సహస్రాయువు మహారథుడు. శతానీకుడు మహారథచమూపతి. సూర్యప్రభుని వయస్యులయిన సుభాస హర్షవిమలులు, మహాబుద్ధి అచల, ప్రియంకర, శుభంకరులు మహారథులు. యజ్ఞరుచి, ధర్మరుచి, విశ్వరుచికి భాససిద్ధార్థులు ముగ్గురూ, సూర్యప్రభుని మంత్రులు మహారథ యూథపతులు. ప్రజ్ఞాఢ్య స్థిరబుద్ధులు రథయూథపతులు. సర్వదమన, ప్రమథన, ధూమకేతు, ప్రవహణ, వజ్రపంజర, కాలచక్ర మరుద్వేగులు రథాతిరథపతులు. ప్రకంపన సింహనాదులు రథాతిరథయూథపతులు. మహామాయ, కంబళిక, కాలకంపనక, ప్రహృష్టరోములు అతిరథ యూథాధిపతులకు అధిపతులు. శత్రుసేనలో బలవంతుల్ను మనకన్న ఎక్కువగా ఉన్నప్పటికీ శివానుగ్రహము వల్ల మనముందు వారు నిలవలేరు."

## యుద్ధము

శ్రుతవర్మతండ్రిదగ్గిరనుంచి ఒకదూత వచ్చి "త్రికూటాధిపతి మీకు తెలియచేస్తున్నాడు : యుద్ధము శూరులకు మహోత్సవము. యుద్ధానికి ఈప్రదేశము ఇరుకుగా ఉంది. అందువల్ల ఇక్కడనుండి కలాపగ్రామ మనేవిశాలగ్రామానికి వెళ్ళుదాము." అని సందేశము చెప్పినాడు. సునీథాదులు విని సరే అని సూర్యప్రభాసమేతులై కలాపగ్రామము వెళ్ళినారు. శ్రుతశర్మాదులుకూడా యుద్ధోద్యోగులై విద్యాధరబలముతో అక్కడికే వచ్చినారు. శ్రుతశర్మాదుల సేనానీకములో గజసమూహము ఉండడమువల్ల సూర్యప్రభాదులు గజాళిని విమాన మెక్కి తెప్పించుకొన్నారు. శ్రుతశర్మసేనలో దామోదరుడనే సేనాధిపతి మహాసూచీవ్యూహాన్ని నిర్మించినాడు. శ్రుతవర్మ, అతని మంత్రులూ పార్శ్వభాగములో ఉండగా, అగ్రభాగములో దామోదరుడు తక్కినచోట్ల మహారథులు కొందరు ఉన్నారు.

సూర్యప్రభునిసేనలో ప్రభాససేనాపతి అర్ధచంద్రవ్యూహము నిర్మించి వ్యూహమధ్యంలో తాను నిలిచినాడు. కుంజరకుమారుడు, ప్రహస్తుడు వ్యూహకోణాల్లోనూ, సూర్యప్రభ, సునీథాదులు అందరూ వెనకనూ నిలిచినారు. సుమేరువు సువాసకుమారునిదగ్గిర ఉన్నాడు. ఉభయసేనాసమూహాల్లో యుద్ధవాద్యములు మోగించినారు. దిక్పాలసమేతుడై అప్పుడు మహేంద్రుడూ, దేవతలూ యుద్ధము చూచేందుకు గగనమున నిలిచినారు. భవానీసమేతంగా ఈశ్వరుడు, ప్రమథగణభూతమాతృకలతో వచ్చినాడు. బ్రహ్మ సావిత్ర్యాదులతో, మూర్తిభవించిన నిగమాలతో, మునీంద్రులతో విచ్చేసినాడు. విష్ణుమూర్తి గరుడవాహన మెక్కి దేవేరులతో చక్రాయుధహస్తుడై వచ్చినాడు. కశ్యపమహర్షి భార్యలతో వేంచేసినాడు. ఆదిత్యులు, వసువులు యక్షరాక్షస నాగేంద్ర ప్రహ్లాదాది అసురులు వచ్చినారు. ఆకాశము

వారితో తెలిపిలేకుండా ఉండగా ఉభయసేనలలో శస్త్రసంపాత దారుణ మహానాదముతో సంగ్రామసంరంభము ఆరంభ మైనది. శరపరం పరలు మేఘములవలె దిక్చక్రవాళాన్ని ఆచ్ఛాదించగా, ఉభయసేనా సంఘర్షణవల్ల జనించినఅనలము విద్యుల్లతవలె ఉండగా, శస్త్రక్షత గజవాజి రక్తధారలలో వీరకాయములు మొసళ్ళవలె ఉండగా, శోణిత నదాలు వెల్లివిరిసినవి. రక్తవాహినిలో ఘోరభైరవభూతములు ఈదుతూ రణోత్సాహము అనుభవిస్తున్నవి. అనేకసేనాసమూహాలు చచ్చిపోగా యుద్ధము శాంతించింది. స్వపరసేనావిభాగము దృశ్య మానముకాగా యుద్ధనిమగ్నులయిన ప్రతిపక్షవీరుల నామములు సుమేరువు సూర్యప్రభాదులకు చెప్పినాడు. కొంతసేపటికి సుబాహు నరపతికి అట్టహాసవిద్యాధరపతికీ ద్వంద్వయుద్ధము ఆరంభ మైనది. హాహాహాహారి కేశాకేశి. బాహాబాహి ముష్టాముష్టి యుద్ధము చేసి అట్టహాసుడు సుబాహుశిరము అర్ధచంద్రశరప్రయోగమువల్ల తెగవేసి నాడు. సుబాహుడు పతితుడు కాగా ముష్టికుడు మహోగ్రుడై శత్రువును ఎదుర్కొన్నాడు. అట్టహాసుడు బాణమువేయగా ముష్టికుడు హృదయ ఘాతమువల్ల నేలకు ఒరిగినాడు. ప్రలంబుడు అట్టహాసునిఎదిరించి శర పరంపరలు అవిరళముగా వర్షించి అతన్ని ముంచినాడు. అట్టహాసుడు అతన్ని మర్మస్థానములో బాణప్రయోగముచేసి కూల్చినాడు. ప్రలం బుడు పడిపోగా మోహనధరాపతి అట్టహాసునిపైన బాణాలు కుప్ప తెప్పలుగా వర్షించినాడు. అట్టహాసుడు అతనికోదండము తెంపి సారథిని చితకగొట్టి మోహనుని చంపినాడు. ఇలా అతడు నలుగురు వీరులను వధించగా శ్రుతవర్మసేనానీకము మహోత్సాహమువల్ల పొంగిపోయి సింహనాదము చేసింది. సూర్యప్రభుని స్నేహితుడు హర్షుడు సేనానికాయముతో అట్టహాసునిపైన:పడి అతనిబాణాలను నిజశరపరంపరలచేత వారించి అతనిసేనను చెండాడి, సారథిని నరికి,

రెండుమూడు సార్లు విల్లు విరగగొట్టి శరప్రహారమువల్ల అట్టహాసుని శిరస్సు చీల్చినాడు. అట్టహాసుడు రక్తము కక్కుతూ రథపతితుడు కాగా శత్రుసేనలో మహాక్షోభము కలిగి, క్షణములో ప్రతిపక్షుల బలము అర్థావశిష్ట మైనది. గజాశ్వపదాతులు సంగర రంగములో హతులై ఒకరితరువాత ఒకరు క్రమంగా భూపతులై పోగా, కబంధములు లేస్తూ ఉన్నవి. వికృతదంష్ట్రనామక విద్యాధరేంద్రుడు హర్షునిమీద పడి శరవర్షము కురిపించినాడు. హర్షుడు వికృతుణ్ణి శర ధ్వజసారథులనూ శరాలతో ఎగరగొట్టి కుండలమండిత మైనశిరము తెగ నరికినాడు. చక్రవాళు డనేవిద్యాధరేశ్వరుడు ఉగ్రుడై హర్షునితో తీవ్రముగా పోరి, అతనిధనస్సు విరగగొట్టి తెగటార్చగా, ఆ క్రోధమువల్ల ప్రమాదరాజు వచ్చి యుద్ధము చేసి చక్రవాళునిచేతిలో స్వర్గానికి వెళ్ళినాడు. కంకట విశాల, ప్రచండ అంకురి నామక రాజన్యులు చక్రవాళునివల్ల హతులైనారు. నిర్ఘాతుడు ప్రచండుడై చక్రవాళునితో పరస్పరయుద్ధము చేయగా ఇరువురిరథాలు పొడిపొడి అయినవి. వారు పాదచారులై ఖడ్గచక్రధరులై మహోగ్రులై పోరి ఒండొరులతలలు చీల్చుకొని నేలమీద కూలినారు. ఆవీరు లిరువురూ కూలగా ఉభయబలాలు విషాదముతో సంకులము లైనవి. కాల కంపన నామకవిద్యాధరేశ్వరుడు రణాగ్రమునకు రాగా ప్రకంపన రాజ కుమారుడు అతన్ని ఎదిరించి క్షణములో వీరస్వర్గము చూరగొన్నాడు. జాలిక చండదత్త గోపక సోమిళ పితృశర్మలు కాలకంపనునిమీద శర పరంపరలు కురిపించినారు. కాలకంపనుడు ఆరాజన్యులను విరథులను చేసి ఒకేసారి సప్తశరాలు ప్రయోగించి వారిహృదయాలలో కొట్టగా విద్యాధరవర్గమువారు హర్షనాదాలు చేసినారు. మానవాసురులు విచారించినారు. ఉన్మత్తక ప్రశస్త విలంబ ధురంధరులు అనేరథికులు అతనిమీద పడి ఒక్కసారిగా పోరినారు. కాలకంపనుడు లీలాప్రాయ

ముగా శత్రుసంహారము చేసి తనపైన పడిన మహాసేనానీకాన్ని చీల్చి చెండాడి తేజిక గేయిక వేగిల శాఖిల భద్రంకర దండినామక రథులను నాశనము చేసినాడు. భీమ భీషణ కుంభీర వికట విలోచన వీరులు అతనిచేతుల్లో చనిపోయినారు. కాలకంపనుని అవక్ర పరాక్రమముచూచి మగుణు డనే రాజపుత్రుడు అతన్ని ఎదిరించి పోరగా ఉభయుల సారథులూ చనిపోయినారు. కాలకంపనుడు సుగుణుని కత్తివేటుతో నేల మీద కూల్చినాడు.

అప్పుడు విద్యాధరులకూ మానవులకూ సంగ్రామము అసంభావ్యమని సూర్యుడు ఖిన్నుడై అస్తమించినాడు. శోణితతరంగిణీ సంసిక్తమై రణావని శోణమైనది. ఆకాశము సంధ్యారాగమువల్ల శోణమైనది. కబంధాలతో భూతములు సాంధ్యనృత్యము ఆరంభింపగా పోరు ఆపి వీరులు శిబిరాలకుచేరినారు. ఆనాడు శ్రుతశర్మ సేనానీకములో వీరత్రయమే హతమైనది. సూర్యప్రభునిబలములో ముప్పదిముగ్గురు వీరులు వీరస్వర్గము అలంకరించినారు. బంధుమిత్రాదులు రణాంగణములో హతులై నందుకు సూర్యప్రభుడు విషణ్ణుడై అంతఃపురములో రాత్రి జాగరణచేసి మంత్రులతో యుద్ధవిషయమే ప్రస్తావనచేస్తూ కాలము గడిపినాడు.

## సూర్యప్రభుని భార్యల సల్లాపములు

అతనిభార్యలు బంధునాశమువల్ల బాధపడుతూ ఒకరి నొకరు ఓదార్చుకుంటున్నారు. రోదనసమయములో వాళ్ళు కథలు చెప్పుకొన్నారు. అప్పు డొక రాజపుత్రి "ఆశ్చర్యము! ఆర్యపుత్రుడు ఇప్పుడు అంగన లేకుండా ఎలా శయనించినాడో!" అన్నది.

"యుద్ధములో స్వజనవినాశమువల్ల విచారిస్తున్న ఆర్యపుత్రుడు స్త్రీజనముతో ఎలాక్రీడిస్తాడు!" అని ఒకత్తె ప్రత్యుత్తరమిచ్చింది. రాజపుత్రి "పరకన్య లభిస్తే ఈదుఃఖాన్ని మరిచిపోతాడు" అన్నది. "అలా

కాదు. స్త్రీలోలుడు అయినా ప్రకృతదుఃఖము వెంటనే మరిచి మరో దాన్ని చేపట్టడు" అన్నది రెండో ఆమె. మరొకామె ఆశ్చర్యముతో "నాకు చెప్పండి. ఆర్యపుత్రుడు ఎందుకు స్త్రీలంపటుడైనాడు! ఎంతమంది ఉన్నా రాజకన్యలు రాణివాసములో కొత్తగా చేరుతూ ఉన్నా ఆయనకు తనివి తీరదు!" అన్నది. విదగ్ధురాలు ఒకతె ఇలా పలికింది: "రాజులు బహువల్లభులు. కారణము లేక పోలేదు. దేశ రూప వయశ్చేష్టా విజ్ఞానాది భేదాలవల్ల స్త్రీగుణాలు వేరు వేరుగా ఉంటవి. అన్ని గుణాలూ ఒకతెకు ఉండవు. కర్ణాట లాట సౌరాష్ట్ర మధ్యదేశాది స్త్రీలు తమ తమ దేశాచారముల ప్రకారము ప్రీతి కలిగిస్తారు. కొందరు ఏణాక్షులు శరచ్చంద్ర సమాన వదనాలతో రంజింపచేస్తారు. ఒకతె జఘనసౌందర్యమువల్ల అంగరాగమువల్ల, ప్రియంగువలె శ్యామలచ్ఛవితో, మరొకతె నిండుయౌవనమువల్ల, వేరొకతె ప్రౌఢగా హావభావవిలాసాలతో, మరొకతె మంథరయానముతో మనస్సు హరిస్తారు. కొందరు భ్రూవిలాసముతో వాగమృతమువల్ల, మరి కొందరు నృత్తగీతాది కళాప్రావీణ్యమువల్ల అలంకారములవల్ల, భర్తృచిత్తగ్రహణమువల్ల సహజసౌభాగ్యముచేత పురుషులను ఆకర్షిస్తారు. ఒక్కొక్కవరారోహకు ఒక్కొక్కగుణము సహజము. నానారసాలు చవిచూడవలెనని ప్రభువులు రసికులై ఉండడము సహజము. ఉత్తములకు పరాంగనలపొత్తు పనికి రాదు. ఆర్యపుత్రునిలో ఈదోషము లేదు. అందువల్ల మనకు ఈర్ష్య ఉండదు."

మనోవతి ఇలా పలికితే మదనసేనాది సూర్యప్రభాంగనలు రకరకాల కథలు చెప్పినారు. రసోద్రేకమువల్ల వాళ్ళు కామతంత్రముకూడా ప్రసంగించారు. శత్రుబలవిజయము నిమిత్తము చీకటి పటాపంచలు కాసాగింది. రాణివాసములో దీర్ఘసల్లాపములు ముగిసినవి. సూర్యప్రభుని నిద్ర ముగిసింది.

# ప్రభాసుని యుద్ధము

మరునాడు ప్రభాతవేళ సూర్యప్రభాదులూ, శ్రుతశర్మాదులూ సేనా సమేతులై యుద్ధక్షేత్రానికి వచ్చినారు. ఇంద్రాదులు బ్రహ్మ విష్ణు మహేశ్వరులు సురాసురులు యక్షకిన్నర కింపురుష గంధర్వులు యుద్ధ దిదృక్షతో వచ్చినారు. శ్రుతశర్మ సేనానికాయములో దామోదరుడు చక్రవ్యూహము నిర్మించగా సూర్యప్రభుని సేనలో ప్రభాసుడు వచ్చి వ్యూహము చేసినాడు. తూర్యఘోష సింహనాదములు దిక్కులు పిక్కటిల్లేటట్లు చెలరేగి యుద్ధము ఆరంభమైనది. దామోదరకృత చక్రవ్యూహాన్ని అభేద్యమైనదాన్ని ప్రభాసుడు రాజాజ్ఞచేత భేదించినాడు. ఆవ్యూహఛిద్రమును దామోదరుడు స్వయంగా ఆవరించి నిలిచినాడు. ప్రభాసుడు ఏకాకిగా యుద్ధము చేసినాడు. అతడు స్వయంగా పరవ్యూహములో ప్రవేశించడము చూచి సూర్యప్రభుడు కూడా ప్రకంపన ధూమకేతు, కాలకంపన, మహామాయ, మరుద్వేగ, ప్రహస్త, వజ్రపంజర, కాలచక్ర, సింహనాద కంబళ, వికటాక్ష, ప్రవహణ, కుంజరకుమార, ప్రహృష్టరోమాదులను పంపినాడు. మహారథులందరూ వేగముగా వ్యూహద్వారము దగ్గిరికి వెళ్ళగా దామోదరుడు పదిహేనుమందితో పోరి శౌర్యము ప్రకటించినాడు. అది చూచి దేవేంద్రుడు పక్కనున్న నారదునితో "ఈసూర్యప్రభాదులందరూ రాక్షసావతారములు. శ్రుతశర్మ నాఅంశము వాడు. విద్యాధరులు దేవాంశసంభూతులు. మునీంద్రా, దేవాసురయుద్ధముగా ఉన్నది. విష్ణువు దేవతలకు రక్షకుడు. విష్ణ్వంశతో దామోదరుడు హోరాహోరిగా పోరాడుతున్నాడు." అన్నాడు. దామోదరునికి సహాయము నిమిత్తము బ్రహ్మగుప్త, వాయుబల, యమదంష్ట్ర, సురోషణ, రోషావరోషణ, అతిబల, తేజఃప్రభ, కుభేర

దత్త, వరుణశర్మ, కంబళిక, దుష్టదమన దోహన, ఆరోహణులనే మహారథులు వచ్చినారు. వీళ్ళంతా దామోదరునితో కలిసి వ్యూహాగ్రభాగాన పోరుతున్న సూర్యప్రభుని సేనను నిరోధించినారు. ద్వంద్వయుద్ధాలు చెలరేగినవి. దామోదరుడూ ప్రకంపనుడూ అస్త్రయుద్ధము చేశారు. బ్రహ్మదత్తునితో ధూమకేతువు, అతిబలునితో మహామయుడు, తేజఃప్రభునితో కాలకంపనుడు, వాయుబలునితో మరుద్వేగుడు, యమదంష్ట్రునితో వజ్రపంజరుడు, సురోషణునితో కాలచక్రుడు కుబేరదత్తునితో ప్రమథనుడు, వరుణశర్మతో సింహనాదుడు, దుష్టదమనునితో ప్రవహణుడు రోషావరోషునితో ప్రహృష్టరోముడు, ధురంధరునితో వికటాక్షుడు, కంబళికునితో కంబళికుడు, ఆరోహణునితో కుంజరకుమారుడు, మహోత్పాతుడను మారుపేరున్న దోహనునితో ప్రహస్తుడు ద్వంద్వయుద్ధము చేసినారు. అది చూచి సునీథుడు మయునితో "అయ్యో! మనవాళ్ళు యుద్ధవిశారదులయినా వ్యూహప్రవేశము చెయ్యలేకపోయినారు. ప్రభాసుడుమాత్రము అవిచారితముగా మొదట ప్రవేశించినాడు. ఎవని కేమి కీడు మూడుతుందో!" అని పలికినాడు.

సువాసకుమారుడు "త్రిలోకాల్లో వారు ప్రభాసుని ముందు గుడ్డిగవ్వ చెయ్యరు! ఈవిద్యాధరులు ఏపాటి! తెలిసికూడా మీరు శంకిస్తారేమి! "అని ధైర్యము కలిగించినాడు. ఇలా అతడు అంటూ ఉండగానే కాలకంపను డనేవిద్యాధరుడు ప్రభాసుని ఎదిరించినాడు. ప్రభాసుడు "ఓరీ, నీవు మాకు అపకారివి. రా, నీపౌరుషము చూతము!" అంటూ బాణప్రయోగము చేసినాడు. కాలకంపనుడు అతనిమీద వాడి మయూఖములు వేసినాడు. పరస్పరము వాళ్ళు అస్త్ర ప్రత్యస్త్రములతో పోరినారు. ప్రభాసుడు అద్భుతలాఘవమువల్ల ఒక్కఅలుగుతో కాలకంపనుని ధ్వజము కూల్చి, రెండోదానితో అతనిసారథిని కూల్చినాడు. నాలుగు కోలలతో నాల్గుగుర్రాలను, మరోదానితో విల్లును, రెండుకోలలతో

బాహుద్వయాన్ని, మరి రెండింటితో అతని కర్ణద్వయాన్ని, ఒక బాణముతో శిరస్సునుచీల్చి కాలకంపననిహతమార్చినాడు. ఆవిద్యాధరేశ్వరుడు మరణించగా మానవులూ రాక్షసులూ హర్షతూర్యారావములు చేసినారు. విద్యాధరులు విషణ్ణులైనారు.

విద్యుత్ప్రభుడూ, కాలంజరగిరీశ్వరుడూ తీవ్రకోపముతో యుద్ధము చేసినారు. ప్రభాసుడు విద్యుత్ప్రభుని మహాధ్వజము ఛేదించి అతడు ఎన్ని ధనస్సులు క్రొత్తగా గ్రహించినా వాటన్నిటినీ నాశనము చేసినాడు. విద్యుత్ప్రభుడు సిగ్గుపడి మాయాశక్తివల్ల అదృశ్యుడై ఆకాశానికి ఎగిరి ప్రభాసునిమీద ఆయుధపరంపరను నిజాస్త్రములవల్ల ఆవిద్యాధరుడు గోచరించేటట్లు చేసినాడు. అతడాగ్నేయాస్త్రము ప్రయోగించగా విద్యుత్ప్రభుడు భస్మమై నేలమీద రాలినాడు. శ్రుతశర్మ అది చూచి తల్లడిల్లి "చూడండి! ప్రభాసుడు మహారథయూథపతులను సంహరించినాడు! మీ రందరూ ఊరుకొన్నారేమీ? అందరూ కలిసి అతన్ని తెగటార్చండి" అని ఘోషించినాడు. ఆ ప్రోత్సాహమువల్ల పదకొండుమంది రథికులు క్రోధపూరితులై ప్రభాసుని చుట్టు ముట్టినారు. వెంకటగిరినివాసి రథయూథపతి అయినఊర్ధ్వరోము డనేవిద్యాధరేశ్వరుడు ధరణీధరశైలనాథుడు వి క్రోశనవిద్యాధరమహారాజు, లీలాపర్వతవాసి అయిన ఇందుమాలి నామకఅతిరథయూథపతి, మలయాచలవాసి కాకాండుకు డనేరథయూథపతి, నికేతపర్వతాధిపతి, అంజనగిరినాథుడయిన ధూర్తవయనుడూ కలిసి ప్రభాసుని ఎదిరించినారు, ఏడవవాడు గార్దభముల రథము గలవరాహస్వామి మహారథయూథపతి, దుందుభిపర్వతరథుడు మేధావరుడు ఎనిమిదవవాడు. ఎనమండుగురూ వచ్చి శరపరంపరలు కురిపించినారు. ప్రభాసుడు బాణాలతో ఒకనిహయాలను, ఒకనిసారథిని, ఒకని కేతువును, ఒకరిధనుస్సునూ కొట్టినాడు. మేధావరుడు నాలుగు బాణాలవల్ల నేలకూలినాడు. తక్కినవారితో

పోరు సలుపుతూ ప్రభాసుడు ఊర్ధ్వరోముని శిరాన్ని అంజలిక శరముతో కొట్టినాడు. మిగిలిన ఆరుగిరినీ ఒక్కొక్క భల్లముతో కంఠాలు తెగ నరికి అశ్వాలను చంపి, సారథిని చావచితక గొట్టినాడు. ప్రభాసుని శిరముపైన దివినుంచి పూలవాన కురిసింది. మానవులూ రాక్షసులూ పొంగిపోయినారు. విద్యాధరులు వెలవెలపోయినారు.

తరువాత కాచరకుడనే కురంకక గిరీశ్వరుని పంచకాద్రివాసి దిండిమాలిని, జయపురాద్రిరాజయిన విభాసుని భూమితుండకాధీశ్వరు డైన ధవళుని శ్రుతశర్మ పంపినాడు. ఆధనుర్ధరులు ప్రభాసుని మీద ఒకేసారి అయిదువందల బాణాలు ప్రయోగించగా ప్రభాసుడు క్రమంగా లీలా ప్రాయముగా మహారథ యోధాధిపతుల ధ్వజము, ధనుస్సు సారథిని ఒక్కొక్క బాణముతో అశ్వాలను నాలుగు అంబులతో శిరస్సు ఏకైక బాణముతో తెగటార్చినాడు. ఈరీతిగా ఒక్కొక్కని ఎనిదేసి బాణాలతో కూల్చి సింహనాదము చేసినాడు. శ్రుతశర్మ ఆనతి ప్రకారము నలుగురు విద్యాధరులు దివ్యాస్త్రములు పట్టి ప్రభాసునితో హోరాహోరి పోరగా ప్రభాసుడు నారాయణాస్త్రముచేత వారి అస్త్రాలను నిరోధించి వారి ఒక్కొక్క ధనుస్సును ఎనిమిదేసి మారులు తెగకొట్టి ఈటెలు గదలు మొదలయిన ఆయుధాలు ముక్కలుచేసి, అశ్వాలనూ సారథినీ కూల్చి అందరినీ విరథులను చేసినాడు. శ్రుతశర్మ పదిమంది రథయోధాధిపతులను విద్యాధరేశ్వరులను ప్రభాసునిపైకి పంపినాడు. శరములు కురిపిస్తున్న వారితో నదురు బెదురులేక ఏకాకిగా ప్రభాసుడు చిత్రయుద్ధము చేసినాడు.

సూర్యప్రభుని ఆనతి ప్రకారము ధవళశ్యామలాకారులయిన కుంజరకుమార ప్రహస్తులు సాయుధులై గగనానికి ఎగిరి ప్రభాసుని దగ్గిరికి వచ్చినారు. ఆఇద్దరూ పదాతు లయినప్పటికీ చాపములు కొట్టి సారథులను హతమార్చి సంక్షోభము కలగచేసినారు. దమ నియము లనే

వారు ఆకాశాన ఎగరగా కుంజరకుమార ప్రహస్తులు ఆయుధహస్తులై తాముకూడా మింటి కెగిరినారు. అది చూచి సూర్యప్రభుడు త్వరితంగా మహాబుద్ధి, అచలబుద్ధి అనే తనఅమాత్యులను వాళ్ళకు సారథులుగా పంపినాడు. మాయాశక్తివల్ల అగోచరులైన దమనియములను ప్రహస్త కుంజరులు సిద్ధాంజన ప్రయోగముచేసి కనిపెట్టి బాణప్రయోగము చేయగా వాళ్ళు పారిపోయినారు. ప్రభాసుడు తక్కిన పన్నెండుగురితో యుద్ధముచేసి వారి విల్లంబులు ముక్కలు చేసినాడు. ప్రహస్తుడు శత్రువుల సారథులను ఒక్కసారే నరికినాడు. కుంజర కుమారుడు ప్రతిపక్షుల గుర్రాలు కూల్చినాడు. అప్పుడు పన్నెండుగురు విరథులై వీరత్రయ ధాటికి ఆగలేక యుద్ధవిముఖులై పారిపోయినారు.

శ్రుతశర్మ దుఃఖమూ కోపమూ లజ్జా పెనగొనగా రథాతిరథయూథపతులనూ విద్యాధరులను పంపినాడు. చంద్రగుప్త, నగరంగముడూ విగతరథులై ప్రభాసాదులతో యుద్ధము చెయ్యలేక పారిపోగా మానవులూ అసురులూ కోలాహలము చేసినారు. శ్రుతశర్మ స్వయంగా నలుగురు మహారథులను మహౌఘు, ఆరోహణ, ఉత్ప్లుత వేత్రవంతులను పరాక్రములను కూడా తీసుకొని వెళ్ళి ప్రభాసునితో పోరినాడు. పూర్వము విరథు లయిన విద్యాధరులు శ్రుతశర్మతో కలిసినారు. సూర్యప్రభుడు ప్రభాసుని సాహాయ్యము నిమిత్తము మహారథులైన వీరసేన శతానీకాది రాజపుత్రులను గగనమార్గాన విమానములో పంపినాడు. వీరసేనాది వీరులకు విద్యాధరేశ్వరులకూ ఘోరయుద్ధము జరిగింది. ఉభయ సేనలలో ద్వంద్వయుద్ధము జరిగింది. ఉభయపక్షాలలో చాలామంది చనిపోయినారు. వీరసేనుడు ధూమలోచనుని అనుచరులతో కూల్చినాడు. హరిశర్మ వీరసేనుని విరథుని చేసినాడు. విద్యాధరవీరుడైన హిరణ్యాక్షుడు అభిమన్యుని చేతిలో చచ్చినాడు. సునేత్రుడు అభిమన్యు హరిభటులను కూల్చగా ప్రభాసుడు అతని శిరశ్ఛేదము చేసినాడు.

ఈప్రకారంగా విద్యాధరులు నాశన మవుతూ ఉండే శ్రుతశర్మ మహా కోపంతో స్వయంగా శతానీకుణ్ణి ఎదిరించినాడు. సంధ్యాసమయము దాకా యుద్ధము ఘోరంగా దేవతలకు ఆశ్చర్యము కలిగించేటట్లు జరిగింది. వందలకొద్దీ మొండెములు లేచి సాంధ్యనృత్తోత్సవసందర్భములో భూతాలకు ఆలంబనము లయినవి. సంధ్యవేళయుద్ధానంతరము విశేషసైన్యవినాశానికి విచారించి, బంధుమరణమువల్ల దుఃఖార్తులై విద్యాధరులూ విజయోత్సాహముతో మానవాసురులూ తమశిబిరాలకు వెళ్ళినారు.

అప్పుడు ఇద్దరు విద్యాధరరాజులు రథయూథాధిపతులు శ్రుతశర్మ పక్షము విడిచి వచ్చి సుమేరునివేదితులై సూర్యప్రభుని దర్శించి ప్రణామము చేసి ఇలా పలికినారు: "దేవా! మేము మహాయాన సుమాయులనే వారము. మూడోవాడు సింహబలుడు. ముగ్గురమూ "మహాశ్మశానాధిపతిత్వ సిద్ధులము. ఇతర విద్యాధరేంద్రులకు అధర్షణీయులము. మేము రుద్రభూమిలో సుఖంగా కూర్చోగా శరభానన అనే దివ్యయోగిని వచ్చింది. మేము నమస్కారము చేసి అడగ్గా ఆమె "మహాకాలనాథుని చూడా లని యోగినీగణముతో వెళ్ళినాను. అక్కడ బేతాళపతి నేను చూస్తూ ఉండగా దేవునితో ఇలా విన్నవించినాడు. "దేవా! విద్యాధరుల చేతుల్లో చచ్చిన మాసేనాధిపతి అగ్నికుని కుమారిని తేజప్రభుడనేవాడు హఠాత్తుగా హరించినాడు. ప్రభూ! ఆమె విద్యాధర చక్రవర్తి పత్ని అవుతుందని సిద్ధవాక్యము. ప్రభూ! చాలాదూరము ఆకన్యను తీసుకొని వెళ్ళకముందే ఆమెను విడిపించవా?" అని అగ్నికుని పుత్రికను విడిపించమని మహాకాలనాథుడు మాకు ఆజ్ఞ చేయగా మేము గగనమార్గాన వెళ్ళి ఆమెను చూచినాము. తేజఃప్రభుడు: "శ్రుతశర్మ కోసము ఈకన్యను తీసుకొని వెళుతున్నాను" అన్నాడు. అతన్ని మా శక్తివల్ల స్తంభింపచేసి ఆమెను విడిపించి మహాకాలనాథునికి అర్పించి

నాము. అయిన ఆకన్యను తండ్రికి ఇచ్చినాడు. ఆ అదృశ్యత్వము పొంది అక్కడ కొన్నాళ్ళపాటు ఉండి ఇంటికి వచ్చినాను."

మేము "ఎవరు విద్యాధరచక్రవర్తి అవుతారు? నీవు సమస్తము ఎరుగుదువు కదా!" అని కుతూహలముతో అడిగినాము. ఆమె సూర్యప్రభుడే విద్యాధరచక్రవర్తి అవుతాడని చెప్పింది. ఈ సింహబలుడు మాతో "అబద్ధము దేవతలూ ఇంద్రుడూ శ్రుతశర్మపక్షము వహించినారు" అని పలుకగా ఆ యోగిని "త్వరలో సూర్యప్రభునకూ శ్రుతశర్మకూ యుద్ధము జరుగుతుంది. మీరంతా చూస్తూ ఉండగానే ఈ సింహబలుడు చనిపోతాడు. అదే దృష్టాంతము." అని సమాధాన మిచ్చి అంతర్ధాన మైనది. ఇప్పుడు ప్రత్యక్షంగా చూచాము. సింహబలుడు చనిపోగా మాకు నమ్మకము కలిగి నీవే విద్యాధరేశ్వరులకు చక్రవర్తి వని నిశ్చయము చేసుకొని నీపాదాలు చేరి నీ ఆశ్రయములో ఉన్నాము."

ఇలా మహాయాన సుమాయకులు పలుకగా సూర్యప్రభుడు మయాదిజన సమేతుడై విశ్వసించి ధ్రువ మని సమ్మతించినాడు. అది విని శ్రుతశర్మ భయపడితే ఇంద్రుడు విశ్వావసువు ద్వారా "ధైర్యముతో ఉండు, దేవతలతో వచ్చి నీకు సాహాయ్యము చేస్తాను." అని దూత్యము జరిపినాడు. సూర్యప్రభుడు ప్రతిపక్ష బలక్షయమూ భేదమూ చూచి ఆనందించి రాత్రి యథాప్రకారంగా ప్రియకాంతలతో కూడక మంత్రులతో కూడా శయనము అంగీకరించినాడు.

## త రం గ ము : ౪౯

## గుణశర్మ కథ

ఆరాత్రి సూర్యప్రభుడు భార్యావిరహితుడై రణోత్సాహముతో పరుండగా కంటిమీది కునుకు రాక వీతభీతి అనే నర్మసచివుని పిలిచి

మనోల్లాసము కలిగించే వీరరస ప్రధాన మైన అద్భుతకథ చెప్పమని అడిగినాడు.

వీతభీతి కథ ఆరంభించినాడు: "ఉజ్జయినీ నగరిని మహాసేన మహీపతి పరిపాలన చేస్తున్నాడు. పట్టపురాణి అశోకవతి త్రిలోకసుందరి. మహా రాజు దగ్గర మహామాత్యుడూ, వీరుడూ, ఆగమపారగుడూ, లలితకళా ప్రవీణుడూ అతిసుందరుడూ అయిన గుణశర్మ అనే బ్రాహ్మణుడు ఉంటున్నాడు.

ఒకనాడు అంతఃపురములో నృత్తసందర్భములో రాజూ రాణీ దగ్గరే ఉన్న గుణశర్మను "నీవు సర్వజ్ఞుడవు, కళాచతురుడవు, మాకు కుతూ హలముగా ఉంది. నీనటనాకౌశలము చూపించవలె" అని కోరినాడు. గుణశర్మ చిరునవ్వుతో నేను నేర్చిన నృత్తము సభకు అనుకూలము కాదు. ప్రాయికముగా హాస్యజనకముగా ఉంటుంది. శాస్త్రము అంగీక రించని తీరుగా ఉంటుంది. కేవలము మీ ఎదుట, మహారాణి సమక్ష ములో నృత్తము చేయడానికి సిగ్గువేస్తున్నది" అన్నాడు. రాణి కుతూ హలము కొద్దీ రాజును ప్రేరేపించగా మహాసేనుడు "ఇది రంగభూమి మీద నృత్తముకాదు, అది పురుషునికి లజ్జాస్పదము. ఇది కాదు, మిత్ర గోష్ఠిలో కౌశలము ప్రదర్శించడమే గాని నే నిక్కడ రాజును కాను. నీవు స్వతంత్రుడవు. నామిత్రుడవు! నీనృత్తచాతురి చూడకుండా నేను భోజనముఆరగించను" అని పట్టుపట్టినాడు. గుణశర్మ అందుకు అంగీకరించి ఆంగికాభినయము చేయగా మహారాజూ మహారాణీ రసోద్గారమువల్ల మనసులో అభినయించుకొన్నారు. నృత్తము పూర్తికాగా మహాసేనుడు గుణశర్మకు వీణ ఇచ్చి వాయించమని కోరినాడు. గుణశర్మ సారిణీ తంత్రిని మీటి రాజుతో "దేవరా! ఈవల్లకి పనికిరాదు. మరొకటి తెప్పించండి. ఈవీణెతంత్రిలో శ్వానరోమము ఉన్నది. తంత్రీ ఝంకార లక్షణాన్ని పట్టి ఈవిషయము గ్రహించినాను" అంటూ అంకము

నుంచి వీణను కింద ఉంచినాడు. మహారాజు వీణాతంత్రిని తడిపి చూడగా అందులో కుక్కపెంట్రుక బైటికి వచ్చింది. గుణశర్మ సర్వజ్ఞత్వానికి అందరూ ఆశ్చర్యపడినారు. మహాసేనమహీపతి మరోవీణ తెప్పించినాడు. గుణశర్మ సత్ప్రోక్తానుగతా లయిన వాద్యరీతులు వీణమీద పలికించి గంగాఝరీవేగము చూపించి కర్ణరసాయనము చేసినాడు. రాజదంపతుల సమక్షములో విప్రశ్రేష్ఠుడు శస్త్రాస్త్రవిద్యాప్రావీణ్యము ప్రదర్శించగా నరపతి అతనిని "బాహుయుద్ధము నీకు తెలిస్తే నిరాయుధుడవై ఒక బంధకరణము చూపించు" అని అడిగినాడు. అప్పుడు గుణశర్మ "దేవా మీరు శస్త్రాలు చేపట్టి నన్ను కొట్టండి. అప్పుడు చూడవచ్చును." అని చెప్పినాడు. మహారాజు ఖడ్గాదిఆయుధాలతో ప్రహరిస్తూ ఉండగా గుణశర్మ బంధకరణము వల్ల నిరోధించి తాను గాయపడక మహారాజు కరమునూ దేహమునూ కట్టివేసినాడు. రాజు విప్రశ్రేష్ఠుని సర్వజ్ఞునిగా ఎరిగి రాజ్యపాలనకు తోడ్పడ గలవాడని తలచి స్తుతించినాడు.

అశోకవతీదేవి గుణశర్మ అందచందాలు ప్రజ్ఞాశక్తులూ చూచి కామించి యుక్తిగా "ఆర్యపుత్రా! నాకు వీణ నేర్చుకోవాలె నని కుతూహలముగా ఉంది. అతని వీణావాదన కౌశలమువల్ల నేర్చుకోవలెనను తాత్పర్యము కలిగింది" అని వేడుకొన్నది. రాజు పట్టపురాణికి వీణా శిక్షకోసము విప్రుని నియమించినాడు. గుణశర్మ మంచిరోజు చూచి రాణికి వీణావిద్య ప్రారంభిస్తానని మనవి చేసి సెలవు తీసుకొన్నాడు. రాణి మోహదృష్టి శర్మ గ్రహించి వీణ ప్రారంభించక కాలము గడుపు తున్నాడు.

ఒకనాడు మహాసేనుడు సువారములో ఆరగిస్తూ ఉండగా ప్రక్కనే ఉన్న గుణశర్మ కూరవడ్డిస్తున్న వంటవాణ్ణి వడ్డించ వద్దని వారించినాడు. రాజు కారణము అడిగినాడు. గుణశర్మ "దేవా, కూరలో విషమున్నట్టు తోచింది. వీడు కూర వడ్డిస్తూ బెదురుతూ సాముఖము చూచినాడు.

ఎవరికైనా దీన్ని వడ్డిస్తే విషమున్నదీ లేనిదీ బైట పడుతుంది. నేనా విషదోషము పోగొట్టుతాను" అని పలికినాడు. అప్పుడురాజు వంటవాణ్ణి కూర తిన మనగా వాడు విధిలేక తిని మూర్ఛపోతే శర్మ మంత్ర ప్రయోగమువల్ల విషదోషము పోగొట్టినాడు. వంటవాడు ఉన్నది ఉన్నట్టుగా "దేవా! నన్ను మీకు విషము పెట్టమని మీశత్రురాజు గాడేనుడు పంపినాడు. నేను పరదేశిని. తమ సువారంలో వలికఆజ్ఞ మీద చేరినాను. కూరలో విషము పెట్టగా ఈమహాత్ముడు కనిపెట్టినాడు" అని చెప్పగా వాణ్ణి రాజు దండించి ప్రాణదానము చేసిన గుణశర్మకు అగ్రహారసహస్రము అర్పించినాడు.

అశోకవతి దేవి పట్టువల్ల గుణశర్మ వీణ ప్రారంభించినాడు. అతడు వీణనేర్పుతూ ఉన్నప్పుడు రాణి భ్రూవిలాసము హావభావాది వికార ములు ప్రకటిస్తూ వచ్చింది. ఒకనాడు అశోకవతి కామార్తితో ఏకాం తములో గుణశర్మను పదే పదే గోళ్ళతో పొడిచింది. ఆధీరుడు వారిస్తూ ఉన్నా "సుందరుడా వీణావ్యాజమువల్ల నీపొందుకోరినాను. నన్ను స్వీకరించు" అని వేడింది రాణి. శర్మ చలించక "నీవు ప్రభు భార్యవు. ప్రభువుకు ద్రోహము చేయను. ఈసాహసము కూడదు" అని హితము పలికినాడు. రాణి "నీరసుడా! నీఅందచందాలు నీప్రజ్ఞలు కళలు అన్నీ వ్యర్థము, నన్ను ఉపేక్షిస్తావా?" అని నిరాశతో అన్నది. శర్మ "చక్కగా చెప్పావు. పరాంగనసొత్తు ఇహపరాలకు దూరము చేస్తుంది. అప్రతిష్ఠ కలిగించే అందచందాలెందుకు?" అని అపహసించినాడు. రాణికి అలకవచ్చింది. ఆగ్రహమూ ఈర్ష్యా పెనగొనగా అతని మీద పగసాధించ వలెనని సంకల్పించి "నామాటవినకపోతే నీచావు తప్పదు. ఈఅవమానము భరించలేను. నిన్ను హతమార్చి నేను చస్తాను." అని శపథము చేసింది.

"ధర్మబద్ధమైన జీవితము క్షణకాలమైనా మంచిదే. పాపము చేసి

రాజదండన అనుభవించడం కన్న పుణ్యాముచేసి మరణించడం మేలు" అని గుణశర్మ పలికినాడు. అది విని అశోకవతి "మన ఇద్దరికీ ద్రోహాము చెయ్యకు. మహారాజు నామాట జవదాటడు. ఆయనతో చెప్పి నీకు దేశాలు ఇప్పిస్తాను. సామంతులను నీఅనుచరులను చేస్తాను. నిన్నే రాజును చేస్తాను. ఎందుకు నీకీ పిరికి తనము? ఎవరు నిన్ను అవమానించే వారు." అని పలికింది. ఆమె నిర్బంధము తత్కాలములో తప్పించు కొని గుణశర్మ యుక్తిగా "దేవీ! ఇంత నిర్బంధిస్తే నీమాట కాదనను రహస్యము బైట పడుతుందని భయము. కొన్నాళ్ళు ఓపిక పట్టు. నామాట నమ్ము. సర్వ నాశన హేతువైన నీవైరము నా కెందుకు!" అని ఆశ కలిగించి ఒప్పించి ఇంటికి వెళ్ళినాడు.

మహాసేన మహారాజు సోమ కేశ్వరునికోట ముట్టడించినాడు. గౌడే శ్వరుడు విక్రమశక్తి మహాసేనుని ముట్టడించినాడు. రాజు గుణశర్మతో ఘనము ఒకరిని ముట్టడిస్తే మనము మరొకరిచేతులో చిక్కినాము, వీరిద్దరితో ఎలాపోరు? యుద్ధము చెయ్యక ఎంతకాలము ముట్టడిలో ఉంటాము? ఈవిషమపరిస్థితి ఎలా తీరుతుంది? ఏది ఉపాయము?" అని అడిగినాడు. శర్మ "రాజా! యుక్తి చెప్పనా? యుక్తివల్ల కార్యము సాధించ గలము" అని ప్రోత్సాహము కలిగించినాడు. గుణశర్మ కళ్ళకు అంతర్థానాం జనము పెట్టుకొని రాత్రివేళ విక్రమశక్తి దిగిన స్కంధావారానికి వెళ్ళి నిద్రిస్తున్న అతన్ని లేపి "రాజా! విను; నేను దేవదూతను. ఈ క్షణమే మహాసేన మహారాజుతో సంధి చేసుకొని వెళ్ళిపో. అలా చెయ్యక పోతే సేనతో నీవు నశిస్తావు. నీవు సంధికై అతనిదగ్గరికి దూతను పంపితే అతడు అంగీకరిస్తాడు" అని నీకుచెప్పమని నన్ను మహావిష్ణువు పంపినాడు. నీవు భక్తుడవు. భక్తుల మేలు కోరేవాడతడు అని పలికినాడు.

అది మానవాకృతి కాదని గ్రహించి విక్రమశక్తి గుణశర్మతో "నేను ధన్యుణ్ణి. దైవము నాకు సందేశము పంపేటంత పుణ్యాము చేసు

కొన్నాను. ఈశ్వరానతి అతిక్రమించను" అని వాగ్దానము చేయగా గుణశర్మ మహారాజుకు విశ్వాసము కలిగించ వలెనని అంతర్ధానాం జన మహిమవల్ల అంతర్హితుడై మహాసేనుని దగ్గిరికి వెళ్ళి సంగతి మనవి చేసినాడు. ప్రాణరాజ్య ప్రదాత అయిన గుణశర్మను మహారాజు కంఠా లింగనము చేసుకొని పొంగిపోయినాడు. విక్రమ శక్తి మర్నాడు దూత ముఖముగా మహాసేనునితో సంధి చేసికొని తరలినాడు. గుణశర్మ ప్రజ్ఞ వల్ల మహారాజు సోమకుణ్ణి ఓడించి గజాశ్వములు గ్రహించి ఉజ్జ యినికి వెళ్ళినాడు. అక్కడ సిప్రానదిలో మహాసేనుడు స్నానము చేసేనమయాన మొసలి మీాది మీాదికి రాగా శర్మ రక్షించినాడు. మహారాజు వనవిహారము చేస్తున్నప్పుడు పాము కరిచింది. వెంటనే గుణ శర్మ పాము విషము శరీరములో ఎక్కకుండా రాజునురక్షించినాడు.

కొన్నాళ్ళకు మహాసేనుడు మహాబలసమన్వితుడై విక్రమ శక్తిమీాదికి దాడిచేయగా యుద్ధము చేసే టందుకు నగరు వదలి వచ్చినాడు. ఉభ యుల మధ్యా పోరు ఘోరమైంది. కొంతసేపు ఇద్దరూ బాహా బాహీ ద్వంద్వ యుద్ధము చేసినారు. ఇద్దరి రథాలు కూలిపోగా కత్తులు దూసుకొన్నారు. తత్తరపాటులో మహాసేనుడు కిందపడగా సమయము చిక్కిందని విక్రమశక్తి కత్తితో అతన్ని పొడవ బోయినాడు. గుణ శర్మ చక్రాయుధముతో విక్రముని భుజము ఖండించి పరిఘతో వక్షాన్ని కొట్టి నేల కూల్చినాడు. మహాసేనుడు ఆనందపడి "మహావీరా! అయిదు సార్లు నాప్రాణాలు కాపాడినావు!" అని శర్మను పదే పదే స్తుతించినాడు. వెంటనే విక్రముని రాష్ట్రమూ సైన్యమూ మహాసేనుడు వశము చేసుకొన్నాడు. శర్మ సాహాయ్యము వల్ల రాజు ఇతర రాజన్య మును జయించి ఉజ్జయినికి తిరిగి వచ్చి సుఖంగా ఉంటున్నాడు.

మహారాణి అశోకవతి గుణశర్మకై తహతహలాడి, శర్మ యుద్ధా నంతరము రాజభానికి రాగా అతన్ని కోరికతీర్చమని అహోరాత్రాలు

వేదుతున్న ది. శర్మ అకార్యకరణానికి అంగీకరించ లేదు. అప్పుడా మెదుఃఖము అభినయించి ఏడుపు మొగము పెట్టగా మహాసేనుడు ఆమెనుచూచి "ప్రేయసీ! ఎవరు నీకు కష్టము కలిగించినారు? చెప్పు. వాని ధన మాన ప్రాణాలు హరిస్తాను" అనగా రాణి "నాకు అపకారము చేసినవాణ్ణి మీరు దండించలేరు. నాదుఃఖము పైకి చెప్పుకోడము వృథా" అని సమాధానము ఇచ్చింది. రాజు బలవంతము చేసిన మీదట ఇలా అబద్ధా లాడింది.

"ఆర్యపుత్రా! నిర్బంధించారుకనక మనవి చేస్తున్నాను. గౌడరాజు దగ్గిర ధనాశవల్ల ఈగుణశర్మ సంధి చేసి అతన్ని తనకు ధనము పంప వలసినదని రహస్యంగా దూత్యము జరిపినాడు. ఆదూతనుచూచి రాజుకు అప్తుడు ఒకవంటవాడు "దేవా ఈకార్యము అవలీలగా సాధిస్తాను. ధన నాశనము ఎందుకు చేసుకొంటావు?" అని చెప్పి గుణశర్మ దూతను ఖైదీచేయించి మంత్రము బైట పడకుండా ఇక్కడికి విషప్రయోగము చేయడానికి వచ్చినాడు. ఈలోగా గుణశర్మదూత కొట్లోనుండి తప్పించు కొని సంగతి శర్మకు చెప్పినాడు. అలా ఆవంటవాని విషప్రయోగము ఎరిగి మీకు చెప్పి ఈ బ్రాహ్మణాధముడైన గుణశర్మ వాణ్ణి హతమార్చి నాడు. ఈరోజు వంటవాణ్ణి వెతుక్కొంటూ వాడి తల్లీ తమ్ముడూ భార్యా రాగా శర్మకనిపెట్టి ఆతల్లినీ భార్యనూ చంపించినాడు. వంటవాడితమ్ముడు ఎక్కడికో పారిపోయినాడు. తర్వాత వాడు రహస్యంగా నాశరణువేడి నాతో ఈసంగతి విశదము చేస్తూ ఉండగా గుణశర్మ నా శయనమంది రములో ప్రవేశించినాడు. అతన్నిచూచి పేరువిని వంటవాడితమ్ముడు పారిపోయినాడు. గుణశర్మ తెల్లపోయి కర్తవ్యము ఆలోచించేవాడివలె నిలవబడగా నేను "గుణశర్మా, ఇవాళ అదోమాదిరిగా ఉన్నావేమి!" అని జిజ్ఞాసతో అడిగినాను. శర్మ నాతో "దేవీ! నీమీద మరులు కొన్నాను. నన్ను అనుగ్రహించు. అనుగ్రహించవా చనిపోతాను."

అంటూ నాపాదాలమీద వాలినాడు. నేను పాదాలు ఇవతలకు లాక్కొంటూ తత్తరపాటుతో లేవబోగా నన్ను గట్టిగా కౌగలించినాడు. సరిగా అప్పుడే చేటి పల్లవిక వచ్చింది. దాన్నిచూచి గుణశర్మ భయంతో వెళ్ళిపోయినాడు. పల్లవిక అప్పుడే రాకుండా ఉంటే నాభంగపాటు ఏమని చెప్పను! ఇలాజరిగింది" అని చిలవలూ పలవలూ కల్పించి ముగించి ఏడ్చింది.

సంగతివిని రాజు ఆగ్రహముతో మండిపడి రాణితో "విచారించకు. ఆ ద్రోహికి మరణ దండన విధిస్తాను. వాణ్ణి యుక్తిగా చంపకపోతే నాకు అపకీర్తి. పైగా వాడు నాకు అయిదుసార్లు ప్రాణదానము చేసినాడు. అంతఃపురంలో గుట్టు లోకానికి వెల్లడించే వీలుండదు" అని చెప్పినాడు. రాణి "నాథా, ఈదోషము చెప్పరాని దయితే మిమ్ము చంపడానికి శర్మ గాడేశునితో చేసిన సంధిని ప్రకటించ వచ్చునుకదా!" అన్నది. "సరే అలాగే చేదాము". అంటూ" మహాసేనుడు దర్బారులోకి వెళ్ళినాడు. రాజదర్శనము నిమిత్తము సామంతాదులు వచ్చినారు. గుణశర్మ దివాణములో ప్రవేశించబోతే దుర్నిమిత్తాలు ఎదురైనవి. కాకి ఎడమవైపు ఎగిరింది. కుక్క ఎడమనుండి కుడివైపు పరుగెత్తింది. పాము కుడినుండి ఎడమకు పోయింది. బాహువు భుజశిరముతో అదిరి ఈ దుశ్శకునాలు నాకేదో కీడు సూచిస్తున్నవి. ఏమయితే అది అవుతుంది. రాజు క్షేమంగాఉంటే అంతేచాలు. దివాణములో విపరీతము కలగకుండా ఉండుగాక" అని గుణశర్మ తలపోస్తూ రాజాస్థానికి వెళ్ళి రాజుకు నమస్కరించి ఉచితాసనము అలంకరించినాడు.

గుణశర్మను మహాసేనుడు యథాపూర్వముగా గౌరవము చేయక ఎర్రచూపు చూచినాడు. శర్మ తెల్లపోయి శంకిస్తూ ఉండగా రాజు సింహాసనము నుండి లేచి శర్మమీదికి లంఘించి అతని కంఠము మీద కూర్చున్నాడు. సభ్యులు ఆశ్చర్యపడ్డారు. రాజు సభాస్తారులతో "నాకూ

గుణశర్మకూ గల న్యాయము ఆలకించండి" అని ఆరంభించగా గుణశర్మ "నేను సేవకుణ్ణి, నీవు ప్రభువు. సమానులము కానప్పుడు వ్యవహారము ఎలా ఘటిస్తుంది? సింహాసనము అలంకరించండి. తర్వాత నీకు తోచినట్టు చెప్పవచ్చును" అని ధీరోదాత్తుడై పలికినాడు.

మహాసేనుడు సింహాసనము మీద ఆసీనుడై సదస్యులతో "మీ రందరూ ఎరిగిన సంగతి. కులక్రమాగతు లయిన మంత్రులను అతిక్రమించి ఈ గుణశర్మను నాతో సమానునిగా చేసినాను. వీడు దూతలను పంపి గౌడరాజుతో ఒడబడి నన్ను హతమార్చవలె నని యత్నము చేసినాడు" అంటూ రాణి చెప్పిన విషయమంతా సభకు తెలియచేసినాడు. రాజు తన ఆప్తులకు శర్మ రాణిని వలచిన సంగతికూడా చెప్పినాడు. గుణశర్మ "దేవా! ఇదియావత్తు అబద్ధము. నీకెవరు చెప్పారు? ఆకాశములో ప్రతిమలు ఎవరు వ్రాసినారు!" అని పలికినాడు. "పాపీ! ఇది నిజము కాకపోతే కూర తప్పేలాలో ఉన్న విషము నీకు ఎలా తెలిసినది?" అని రాజు ప్రశ్నించినాడు. గుణశర్మ సర్వమూ ప్రజ్ఞవల్ల తెలుస్తుందని సమాధాన మీయగా, మంత్రులు శర్మమీది ద్వేషము వల్ల అది అసాధ్యమన్నారు. గుణశర్మ "దేవా, నిజానిజాలు తెలుసుకోక తోచినట్లు మాట్లాడుతున్నారు. విచారణ చేయని ప్రభువును నీతికోవిదులు నిందిస్తారు." అంటూ ఉండగా రాజు హఠాత్తుగా శర్మను కత్తితో పొడిచినాడు. ఆకత్తిపోటు కరణ ప్రయోగమువల్ల శర్మ తప్పించుకోగా రాజుసేవకులూ తదితరులూ అతన్ని కత్తులతో పొడిచారు. గుణశర్మ మహాశక్తివంతుడు కనుక కరణప్రయోగ మహిమాతిశయమువల్ల కత్తిపోట్లు తప్పించుకొని ఒకరిజుట్టు ఒకరికి ముడివేసి సభ విడిచి వెళ్ళినాడు. నూరుగురు యోధులు కూడా వెంటాడగా శర వారిని వధించినాడు. చేలాంచలములో దాచుకొన్న అంతర్ధానాంజనము నేత్రాలకు పెట్టుకొని అదృశ్యరూపుడై ఆరాజ్యము విడిచిపెట్టినాడు.

దక్షిణాపథము వెళ్తూ "అశోకవతి ఆనూహ్యధ రాజుని ప్రేరేపించి ఇంతపని చేసింది. స్త్రీలు విషమునకన్న క్రూరులు. యథార్థము గ్రహించలేని రాజులు సాధువులకు అపకారులు" అనుకొంటూ గ్రామములో ఒక వటవృక్షముక్రింద శిష్యులకు అధ్యాపన చేస్తున్న బ్రాహ్మణునికి నమస్కరించినాడు. ఆయన శర్మకు అతిథి సత్కారములు చేసి "బ్రాహ్మణోత్తమా! నీవు ఏశాఖ అధ్యాపన చెయ్యగలవు?" అని అడిగినాడు. "బ్రాహ్మణా! పన్నెండుశాఖలూ చెప్పగలను. సామవేదీయ శాఖలు రెండు, ఋగ్వేదీయ శాఖలు రెండు యజుర్వేదీయములు ఏడు, అథర్వణము ఒకటీ నేను చెప్పగలను" అని శర్మ సమాధానమీయగా ఆ గురువు "అయితే నీవు సాక్షాత్తూ ఈశ్వరుడవు. నీదేశమేది? నీవంశమేది? నిన్నేమని పిలుస్తారు? ఇంత విద్వాంసుడవు ఎలా అయినావు?" అని కుతూహలముతో ప్రశ్నించినాడు. గుణశర్మ తనసంగతి ఆరంభించినాడు.

"ఉజ్జయినిలో ఆదిత్యశర్మ అనే విప్రకుమారుని శైశవములోనే తండ్రి చనిపోగా తల్లి సహగమనము చేసింది. ఆకుర్రవాడు అక్కడే మేనమామ ఇంట్లో పెరుగుతూ ఆగమశాస్త్రములు, లలితకళలూ నేర్చినాడు. విద్యాభ్యాసము అయినతరువాత అతనికి సన్యాసితో సఖ్యము ఏర్పడింది. ఆదిత్యశర్మతో పరివ్రాజకుడు వెళ్ళి రుద్రభూమిలో యక్షిణీసిద్ధికై హోమము చేసినాడు. సువర్ణవిమానములో వరకన్యాపరివృతురాలై ఒక దివ్యకన్య ఆవిర్భవించి మధురవాక్కుతో "యతీశ్వరా, నేను యక్షిణిని. నన్ను విద్యున్మాల అంటారు. వీళ్ళంతా యక్షిణులు. నాయక్షిణీగణములో నీకు యిష్టమైనదాన్ని స్వీకరించు. నీమంత్రసాధనమువల్ల ఇంతవరకే కార్యసిద్ధి. నామంత్రసాధన నీవు పూర్తిగా ఎరగవు. అందువల్ల నేను నీకు పూర్ణసిద్ధి కలిగించలేదు. వృథాశ్రమ పడకు" అని అనగానే యతి యక్షిణిని ఒకదాన్ని స్వీకరించినాడు. ఈలోగా విద్యున్మాల అదృశ్యురాలైంది. తనకు సిద్ధించిన

యక్షిణితో ఆదిత్యశర్మ "విద్యున్మాలకన్న ఉత్తమయక్షిణి ఉన్నదా?" అని అడిగినాడు. యక్షిణి "సుందరాకారా! ఉన్నది. విద్యున్మాల, చంద్రలేఖ, సులోచనలు ఉత్తమలు. సులోచన మహోత్కృష్ట" అని సమాధానమిచ్చి యథాసమయములోవచ్చేదిగా అప్పటికివెళ్ళిపోయింది. యతి ఆదిత్యశర్మతో అతని ఇంటికి వెళ్ళినాడు. ప్రతిదినమూ యథాకాలానికి యక్షిణి వచ్చి యతిని ఇష్టభోగాలతో తృప్తి పరుస్తుంది.

ఒకనాడు ఆదిత్యశర్మ పరివ్రాజకముఖముగా యక్షిణిని "సులోచనా మంత్రవిధి ఎవరెరుగుదురు?" అని అడిగితే యక్షిణి "దక్షిణదిశను తుంబు వనమనేచోట వేణానదీతీరాన విష్ణుగుప్త నామక సన్యాసి భదంతిశ్రేష్ఠుడు నివసిస్తున్నాడు. అతనికి ఆమంత్రము బాగా తెలును" అన్నది. ఆదిత్యశర్మ కిటుకు తెలుసుకొని ఉత్సాహపరవశుడుఅయినాడు. పరివ్రాజకుడు కూడా రాగా శర్మ తుంబువనము వెళ్ళి భదంతుణ్ణి కనిపెట్టి అతనికి మూడేళ్లు శ్రద్ధాభక్తులతో సపర్యచేయగా భదంతుడు యక్షిణీ మంత్రము శర్మకు ఉపదేశించినాడు. ఆదిత్యశర్మ మంత్రము నేర్చి పునశ్చరణ పూర్తిచేసి ఏకాంతములో యథావిధిగా పూర్ణ హోమము చేసినాడు. హోమాంతము విమానారూఢయై యక్షిణి సులోచన త్రిలోకసుందరిగా వచ్చి "నేను నీకు సిద్ధించాను. అర్ధ సంవత్సరముపాటు నీవు నాకన్నెచెర పోగొట్టకుండా ఉంటే నీకు వీరుడు ప్రజ్ఞావంతుడు, సర్వజ్ఞుడు, అపరాజితుడూ, ఐన తనయుడు కలుగుతాడు" అనిపలికింది. శర్మ అంగీకరించగా సులోచన అతన్ని విమానములో ఎక్కించి అలకానగరము తీసుకొనివెళ్ళింది. అతడు నాలిగల బ్రహ్మచర్యము ఆరుమాసాలు అసిధారావ్రతము ఆచరించినాడు. కుబేరుడు అందుకు సంతోషించి స్వయముగా సులోచనను ఆదిత్యశర్మకు అర్పించినాడు.

నేనా విప్రుని కుమారుణ్ణి. సుగుణాలవల్ల నాకు గుణశర్మ అని తండ్రి నామకరణము చేసినాడు. క్రమేణా నేను అక్కడే యక్షాధిపతి

అయిన మణిధరునివద్ద వేదశాస్త్రములు, లలితకళలు నేర్చినాను. ఒక సారి దేవేంద్రుడు కుబేరునిదగ్గిరికి రాగా అందరు అతన్ని చూచి లేచి నిలుచున్నారు. అప్పుడు ఆదిత్యశర్మ పరధ్యానముగా ఉండి తత్తరపాటుతో లేవలేదు. ఇంద్రుడికి ఆగ్రహము వచ్చి అతన్ని "మూర్ఖుడా! పో. మానవలోకములోకి వెళ్ళు. ఇక్కడ పనికి రావు" అని శాపము పెట్టినాడు. సులోచన మహేంద్రుని ప్రార్థించగా ఇతను స్వయంగా మర్త్యలోకానికి వెళ్ళక్కర్లేదు. ఇతనికుమారుడు వెళ్ళితే చాలు. నామాట వ్యర్థము కాకుండా ఉంటుంది" అని శాంతు డైనాడు. అప్పు డాదిత్యశర్మ నన్ను మేనమామ ఇంట్లో ఉజ్జయినిలో దిగపెట్టినాడు. దైవాత్తు నాకూ మహాసేన మహారాజుకూ స్నేహము కుదిరింది. అని గుణశర్మ తనకు మహారాణి చేసిన అవమానమూ రాజు చేసినదుర్మార్గమూ విశదముగా చెప్పినాడు.

ఆగురువు గుణశర్మతో "ప్రభూ, నేను ధన్యుణ్ణి. నన్ను అగ్నిదత్తుడు అంటారు. మాఇంటికి రా. ఈగ్రామము నాఅగ్రహారము. ఇక్కడ నీవు హాయిగాఉండవచ్చును" అని అతడు ఆవులు గేదెలు గుర్రాలతో ఉన్న తన ఇంటికి శర్మను తీసుకొని వెళ్ళి స్నానవస్త్రాభరణ వివిధ భోజనాలతో గౌరవించినాడు. త్రిలోకసుందరి అయిన తన కుమారిని శర్మకు కన్యాలక్షణాలు చూపే వ్యాజాన చూపించినాడు. కన్యను తిలకించి గుణశర్మ అగ్నిదత్తునితో "ఈమెకు సవతులు ఉంటారు. నాసికదగ్గిర మచ్చ ఉన్నది. దాన్నిబట్టి చెప్పాను. వక్షోభాగాన రెండోమచ్చ ఉన్నది" అనగా ఆమెఅన్న తండ్రి ఆజ్ఞమీద ఆమె పైట చెరగు ఎత్తితే పుట్టుమచ్చ కనపడ్డది. అగ్నిదత్తుడు ఆశ్చర్యపడి శర్మతో "అయ్యా, నీవు సర్వజ్ఞుడవు. ఈమె పుట్టుమచ్చలు అశుభములు కావు. సాధారణంగా భర్త సంపన్నుడయితే సవతు లుంటారు. దరిద్రుడు ఒక భార్యనే పోషించలేడు. చాలామందికి తిండి ఎవడు పెడతాడు!" అనగా శర్మ

"నీవు చెప్పింది నిజము. సులక్షణమైన ఈకన్యకు అశుభ మెక్కడిది!" అని సమాధాన మిచ్చినాడు.

ప్రసంగవశాత్తు అగ్నిదత్తుడు కుతూహలముతో అడిగితే గుణశర్మ స్త్రీపురుషులకు ప్రత్యవయవముమీద తిలకాదుల ఫలాన్ని వేరే వేరే వర్ణించినాడు. గుణశర్మను చూచీచూడడంతో ఆకన్య ఉత్సుకురాలై చకోరిక చంద్రునివలె చూపులతో అతన్ని తాగింది. ఏకాంతములో అగ్నిదత్తుడు శర్మతో "మహాశయా, నాకన్యను సుందరిని నీకిస్తాను. పరదేశాలకు వెళ్ళకు. నాఇంటిపట్టున హాయిగా ఉండు" అని పలికినాడు. శర్మ "నిజమే. ఇలా ఉంటే మాత్రము నాకు సుఖానికి ఏమి లోటు! అయినా రాజువల్ల అవమానము పొందినాను. అదంతా మిథ్య. కామిని, చంద్రోదయము, వీణావాదనము కులాసాగా ఉన్నవాళ్ళను సంతోష పెడతవి, విచారగ్రస్తులను బాధపెడతవి. అనురక్తురా లయిన భార్య వ్యభిచరించ మంటే అలా చేస్తుందా! అన్యతంత్రురాలై అశోకవతి వ్యభిచారిణికాలేదా! ఉజ్జయిని ఇక్కడికి దగ్గరేనా! రాజుకు నావిషయము తెలిస్తే ఉపద్రవము కలిగిస్తాడేమో. అందువల్ల తీర్థయాత్రలు చేసి ఆజన్మసంచితకల్మషాన్ని క్షాళన చేసి దేహత్యాగము చేస్తాను" అని చెప్పినాడు. ఆసమాధానము విని అగ్నిదత్తుడు చిరునవ్వుతో "మీకు ఇంత అజ్ఞాన ముండగా ఇతరుల సంగతి చెప్పవలెనా! అవివేకుడు నీ నిర్మలహృదయాన్ని బాధపెడితే ఆదుఃఖము న్యాయమా! ఆకాశాన చిమ్మిన బురద వేసిన వాడినెత్తినే పడుతుంది. ఆరాజే తగిన ఫలము అనుభవిస్తాడు. మోహాంధుని అవివేకుని సిరి వరించదు. అశోకవతిని చూచి స్త్రీలోకము మీద విరక్తిగా ఉంటే, సాధ్వీమణులను చూచి శ్రద్ధ చూపవేమి! ఉజ్జయినీ సమీపములో మనము ఉన్నప్పటికీ మహాసేనునికి తెలియకుండా నిన్ను ఉంచగలను. తీర్థయాత్రలు కర్మిష్ఠి కాని వాడికి చెప్పారు. గార్హస్థ్యములో లభించే పుణ్యము తీర్థాటనమువల్ల

ఎలా వస్తుంది? దేహత్యాగము వల్ల సుఖ మెలా వస్తుంది? కేవలమూ భ్రమ. యువకుడవు, విద్వాంసుడవు, నీ కీ అవివేకము పనికిరాదు. నీకు అందమైన నేలమాళిగ చేయిస్తాను. హాయిగా సుందరిని పెళ్ళాడి ఇహ సుఖాలు అనుభవించు" అన్నాడు.

గుణశర్మ సరే అని తల ఊపి "నీమాట కాదనలేను. నేను కృత కృత్యుణ్ణి కాకముందు నీకుమారిని వివాహము చేసుకోను. సంయమము వల్ల తపస్సు చేసి దేవతాప్రీతి కలిగించి తదనుగ్రహబలముచేత విశ్వాస ఘాతకుడైన మహాసేనుని మీద కసితీర్చుకొంటాను" అంటే అగ్ని దత్తుడు అంగీకరించినాడు. రాత్రి గుణశర్మ హాయిగా నిద్రపోయినాడు.

మర్నాడు అగ్నిదత్తుడు చక్కని నేలమాళిగ పాతాళవసతి అనే దాన్ని ఏర్పాటు చేయించగా గుణశర్మ అందులో ప్రవేశించి అగ్ని దత్తునితో "అయ్యా, ఏదేవుని ఏమంత్ర తంత్రాలతో ఆరాధించను?" అని సలహా అడిగినాడు. "నాకు గురువు కుమారస్వామి మంత్రము ఉప దేశించినాడు. అది తెలుసును. శత్రుబాధితులై దేవతలు కుమారసంభ వము నిమిత్తము మన్మథుని మహాదేవుని వద్దకు పంపగా కాముడు హరకోపాలనముచే భస్మీభూతుడై తిరిగి సంకల్ప జన్ము డయినాడు. మహేశ్వరునివల్ల అగ్నికుండలము, రెల్లుపొద, కృత్తికలవల్ల ఎవని పుట్టుపు చెపుతున్నారో, ఎవడు దుర్నిరీక్ష్య తేజస్సుచేత తారకాసురుని సంహరించి దేవలోకాన్ని సంతోష పెట్టినాడో ఆకుమారస్వామిని ఆరాధించు. ఆమంత్రము నీకు ఉపదేశిస్తాను" అని అగ్నిదత్తుడు గుణ శర్మకు కుమారమంత్రము ఉపదేశించినాడు. నేలమాళిగలో గుణశర్మ స్కందుని ఆరాధిస్తూ ఉండగా సుందరి ఉపచారాలు చేస్తూ ఉన్నది. షణ్ముఖుడు ప్రత్యక్షమై అతన్ని వరము కోరుకోమని పలికినాడు. గుణ శర్మ మహాసేన మహీపతిని జయించేనిమిత్తము అక్షయధనము కోరి నాడు. కుమారస్వామి అక్షీణకోశాన్ని అతనికి అనుగ్రహించి అంత

ర్ధాన మైనాడు. గుణశర్మ ప్రతిభా సంపదలకు అనుదినమూ అధికానురక్తురాలైనసుందరిని వివాహమాడి అక్షయసంపదవల్ల గజాశ్వపదాతి సేనలను సేకరించుకొని నిజదానశక్తివల్ల రాజన్యమును వశముచేసుకొని వారి బలముకూడా తనకు అండగా ఉండగా భూమండలము క్రమంగా ఆక్రమిస్తూ ఉజ్జయినీ నగరముమీద దాడి చేసినాడు. సకలజన సమక్షములో అశోకవతి దుశ్శీలము ప్రకటించి మహాసేన మహారాజును సంగ్రామములో జయించి తరిమి గుణశర్మ ఉజ్జయినీ నగరసింహాసనము అధిష్ఠించినాడు. గుణశర్మ సార్వభౌముడై అనేక రాజకన్యలను వివాహమాడి సుందరీ సమేతుడై ఇష్టభోగాలు యథేచ్ఛగా అనుభవించినాడు.

పీతిభీతి ఈరీతిగా గుణశర్మోపాఖ్యానము సూర్యప్రభునకు చెప్పగా ప్రభువు ఉత్సాహముతో విని క్రమంగా నిద్రించినాడు.

## తరంగము : ౫౦

### యుద్ధాంతము

సూర్యప్రభుడు ఉదయాన్నే లేచి అమాత్య మానవ దానవసేనా సమేతుడై రణరంగానికి వెళ్ళినాడు. శ్రుతశర్మ విద్యాధరబలముతో వచ్చినాడు. యుద్ధము చూడవలెనని దేవాసురాదులు వచ్చినారు. ఉభయసేనలు అర్ధచంద్రవ్యూహాలు పన్నినారు. యుద్ధము ఆరంభమైనది. వీరులచేతి ఖడ్గములు రక్తసిక్తములై, సుదీర్ఘలోలములై యమధర్మరాజు నాలుకలవలె విరాజిల్లినవి. ఆసంగ్రామరంగము సరస్సువలె ఉండగా శూరుల ముఖారవిందములతో ప్రకాశించింది. కదనములో ఖండిత శూరశీర్షములు పైకి ఎగురుతూ పడుతూ కృతాంతుని కందుక క్రీడవలె ఉన్నవి. రక్తసిక్తమై రణాంగణమున దుమారము అణిగింది. మహారథులు ప్రచండ కోపావేశులై ద్వంద్వయుద్ధములు చేసినారు.

సూర్యప్రభుడూ శ్రుతశర్మ, ప్రభాసుడూ దామోదరుడూ, సిద్ధార్థుడూ మహోత్పాతుడూ, ప్రహస్తబ్రహ్మగుప్తులూ వీతభీతి సంక్రములూ, ప్రజ్ఞాఢ్యచంద్రగుప్తులూ, ప్రియంకరాక్రములు, సర్వదమనాతిబలులూ, కుంజరకుమార ధురంధరులూ, ద్వంద్వయుద్ధాలు చేసినారు. మహోత్పాతుడు సిద్ధార్థుని బాణాలు పొడి పొడి చేసి, ధనుస్సు ముక్కలు చేసి అశ్వాలనూ సారథినీ చంపివేసినాడు. సిద్ధార్థుడు విగతరథుడై కోపాటోపముతో అతని మీదికి వెళ్ళి పరిఘతో అతని రథాన్ని పొడిచేసి, గుర్రాలను హతమార్చి, పాదచారియై మహోత్పాతునితో బాహాబాహీ పోరి అతన్ని నేల కూల్చినాడు. ఈలోపున అతని తండ్రి సూర్యుడు వాణ్ణి రక్షించినాడు. వాడు పారిపోయినాడు. ప్రహస్తబ్రహ్మగుప్తులు ఒకరి రథాన్ని ఒకరు ముక్కలు చేసుకొని ఖడ్గయుద్ధము చేసినారు. ప్రహస్తుడు కరణక్రమముతో కత్తితో బ్రహ్మగుప్తుని కాలు కొట్టి అతనిని నేలమీద పడవేసినాడు. వానితల నరకబోతూ ఉండగా వానితండ్రి బ్రహ్మ స్వయంగా వారించినాడు. రాక్షసులు దేవతలను "మీరు కుమారులను రక్షించుకోడానికి వచ్చారు. యుద్ధము చూచేందుకు రాలేదు." అని ఆక్షేపించారు. వీతభీతి సంక్రముని ధనస్సు పొడి చేసి సారథిని కూల్చి ప్రద్యుమ్నాస్త్రప్రభావమువల్ల హృదయభేదము చేసినాడు. ప్రజ్ఞాఢ్యుడు రథనాశనమువల్ల పదాతియై చంద్రగుప్తుని నరికినాడు. కుమారుని మరణమువల్ల చంద్రుడు కోపించి స్వయంగా ప్రజ్ఞాఢ్యునితో పోరినాడు. విగతరథుడై ప్రియంకరుడు అక్రముని ఒక్క కత్తివేటుతో రెండు చీలికలు చేసినాడు. సర్వదమనుని ధనుస్సు ఛిన్నాభిన్నము కాగా హృదయాన అంకుశముతో కొట్టి లీలాప్రాయంగా అతిబలుణ్ణి యమసదనానికి పంపినాడు. కుంజరకుడు అస్త్ర ప్రత్యస్త్ర యుద్ధములో ధురంధరుని విరథుని చేసినాడు. విక్రమశక్తి అతనికి మళ్ళీ మళ్ళీ రథాలు పంపి ఆపదలో అస్త్రాలను అస్త్రాలచేత వారిస్తూ అతన్ని

ఒకరంట కాపాడుతున్నాడు. కుంజరకుడు క్రోధముతో పదునెత్తి పెద్ద రాతిబండ తెచ్చి విక్రమశక్తి రథముమీద వేయగా రథము పొడిపొడి అయిపోయింది. విక్రమశక్తి ఏమీచేయలేక వెనక్కి వెళ్ళగా ఆకాశములో ధురంధరుణ్ణి నుగ్గు చేసినాడు.

సూర్యప్రభుడు, విరోచనుని చంపినాడనే కోపమువల్ల కపాలిని శకశరముతో కూల్చినాడు. ఆకోపము పట్టలేక అశ్వినీదేవతలు ఇతని మీదికి యుద్ధానికి వచ్చినారు. వాళ్ళతో సునీథుడు పోరినాడు. స్థిరబుద్ధి పరాక్రముని ఈటెతో చంపి, అతనిచావుకు కుపితులు అయిన ఎనమండుగురు వసువులతో యుద్ధము చేసినాడు. ప్రభాసుడు భానుని రథము చూర్ణము చేసి కోలతో కూల్చినాడు. ప్రకంపనుడు అస్త్రయుద్ధములో తేజఃప్రభువును చంపి, క్రుద్ధుడైన అగ్నితో పోరాడుతున్నాడు. ధూమకేతువు యమదంష్ట్రుని చంపగా అలిగి యముడు అతనితో తీవ్ర యుద్ధము చేసినాడు. సింహదంష్ట్రుడు పాషాణముతో సురోషణుని చూర్ణము చేసి ఆవధవల్ల కోపించిన నిర్ఋతితో పోర సాగినాడు. కాలచక్రుడు వాయుబలిని చక్రాయుధముతో రెండుతుండెములు చేసినాడు. ఆకోపముతో వాయుదేవుడు మండిపడి అతనితో యుద్ధము చేసినాడు. నాగాద్రివృక్షరూపాలు ధరించి మాయ చేస్తున్న కుబేర దత్తును మహామాయుడు తార్క్ష్యవజ్రవహ్ని రూపాలు ధరించి తెగటార్చి నాడు. అందువల్ల క్రుద్ధుడై కుబేరుడు అతనితో పోరినాడు. ఇతర దేవతలు ఈరీతిగా తమతమవారి మరణాలవల్ల యుద్ధములో ప్రవేశించినారు. కొద్దిమంది విద్యాధరరాజులు మానవరాక్షసులవల్ల నిహతులైనారు.

అప్పుడు ప్రభాసునికీ దామోదరునికీ అస్త్రప్రత్యస్త్రభీకరముగా యుద్ధము ఆరంభమైనది. దామోదరుడు చాపము విరిగిపోగా, సారథి చనిపోగా వేరే చాపము తీసుకొని తానే కళ్ళెములు చేతపట్టి పోరి నాడు. బ్రహ్మదేవుడు అతన్ని ప్రశంసించగా ఆయనను ఇంద్రుడు

"స్వామీ! చచ్చిపోవడానికి సిద్ధముగా ఉన్న ఇతన్ని చూచి సంతోషిస్తా వేమి?" అని అడిగినాడు. బ్రహ్మ ఇలా పలికినాడు : "ఇంత సేపు ప్రభాసునితో యుద్ధముచేస్తే ప్రశంస అయినా చేయవద్దా? హర్యంశమున పుట్టిన దామోదరుడు తప్ప మరెవ్వరూ ప్రభాసునితో యుద్ధము చేయ లేడు. ప్రభాసుడు అద్వితీయవీరాగ్రేసరుడు. దేవత లంతా ఒక్కటిగా వచ్చినా అతను అందరినీ హతమారుస్తాడు. పూర్వము నముచి అనే సురమర్దనుడైన రాక్షసుడే ప్రబలు డనేపేరుతో అవతరించి సర్వశత్రుమయుడై ఉండి, ఇప్పుడు భాసపుత్రుడై ప్రభాసుడైనాడు. ఇతడు అజేయుడు. ఈభాసుడు పూర్వము కాలనేమి అనే మహారాక్షసుడు. తరువాత హిరణ్యకశిపుడై ఆతర్వాత కపింజలుడైనాడు. పూర్వము నముండికుడై ఉన్నవాడే ఈసూర్యప్రభుడు. పూర్వపుహిరణ్యాక్షుడే ఈసునీథానుడు. ఈ సభాస్థు లందరూ దైత్యదానవులు. పూర్వము మీచేతుల్లో చచ్చిన అసురులే ఇప్పు డిలా జన్మించినారు. అందువల్ల మయాదులు వీరిపక్షము అవలంబించినారు. సూర్యప్రభాదులు రుద్రయాగము యథాశాస్త్రముగాచేసి ఉండడంవల్ల బలిచక్రవర్తి బంధనాలు వీడి ఈయుద్ధము చూడవచ్చినాడు. ఇతడు నిజసత్యవాక్కుతో నీ రాజ్యకాలము ముగిసేదాకా పాతాళములో ఉంటాడు. తర్వాత దేవేంద్రు డవుతాడు. వీరిని రుద్రుడు అవలంబించినాడు. అందువల్ల మీ కిప్పుడు జయము లేదు. పట్టువిడిచి సంధి చేసుకొనండి."

బ్రహ్మ ఇలా అన్న తరువాత ప్రభాసుడు పాశుపతాస్త్రము ప్రయోగించినాడు. ఆ అస్త్రవిజృంభణాన్ని చూచి విష్ణువు వాత్సల్యముచేత సుదర్శనచక్రము ప్రయోగించినాడు. ఆ దివ్యాస్త్రములు రూపములు ధరించి ఒకదానితో ఒకటి పోరసాగినవి. త్రిలోకాలూ దద్దరిల్లి పోయినవి. నీఅస్త్రము ఉపసంహరించు. నాఅస్త్రము నేను ఉపసంహరిస్తాను" అని హరి ప్రభాసుని అడిగినాడు. అప్పుడు ప్రభాసుడు "ప్రయోగించిన

అస్త్రము వృథా పోదు. దామోదరుడు యుద్ధము మాని పారిపోతే అస్త్రాన్ని ఉపసంహరిస్తాను” అని సమాధానము ఇచ్చినాడు. విష్ణుమూర్తి దామోదరుని రణమునుండి తొలగించినాడు. ప్రభానుడు అస్త్రాన్ని ఉపసంహరించినాడు. చక్రాయుధము రథముమీద పడగా ప్రభానుడు వేరొక రథ మారోహించి సూర్యప్రభుని దగ్గరికి వెళ్ళినాడు. దామోదరుడు శ్రుతిశర్మ దగ్గరికి వెళ్ళినాడు.

ఆరోజు ఇంద్రప్రభా గర్వితుడైన శ్రుతిశర్మకూ సూర్యప్రభునకీ యుద్ధము ఘోరముగా ఉన్నది. శ్రుతిశర్మ ప్రయోగించిన ఒక్కొక్క అస్త్రాన్ని సూర్యప్రభుడు ప్రత్యస్త్రమువల్ల నిరోధిస్తున్నాడు. శ్రుతిశర్మ ప్రయోగించిన మాయాశక్తిని సూర్యప్రభుడు నిజమాయా శక్తివల్ల నాశనము చేస్తున్నాడు. కోపముకొద్దీ శ్రుతిశర్మ బ్రహ్మాస్త్రము ప్రయోగిస్తే సూర్యప్రభుడు పాశుపతాస్త్రము ప్రయోగించినాడు. ఆ రౌద్ర మహాస్త్రము బ్రహ్మాస్త్రమును అణచి శ్రుతిశర్మను సంహరించే నిమిత్తము జ్వలిస్తున్నది. సూర్యప్రభుడు మహాస్త్రధ్యానము చేసి “స్వామీ, శ్రుతశర్మను చంపకుండా కట్టి తీసుకొని వస్తే చాలు” అని మనవి చేసుకొన్నాడు. దేవత లందరూ యుద్ధానికి సిద్ధపడినారు. రాక్షసులు యుద్ధసన్నాహములో ఉన్నారు. వీరభద్రుడు వచ్చి శివశాసనమును ఇంద్రాదులకు “మీరు చూడవచ్చినవాళ్ళు. మీరు యుద్ధములో పోరడము అన్యాయము. స్థితిని దాటడం కన్న అయుక్త మేమున్నది!” అని తెలియచేసినాడు. ఇంద్రాదులు “మా కుమారులు చనిపోతున్నారు. మేము చూస్తూ చస్తూ ఉంటే ఎలా ఊరుకోము! వాత్సల్యము వదల రానిది. కుమారులను చంపుతూ ఉన్న శత్రువులమీద కసి తీర్చుకొంటున్నాము. ఇందులో అన్యాయము ఏమున్నది!” అనేసరికి వీరభద్రుడు వెళ్ళినాడు. దేవాసుర సంగ్రామము ఘోరమై ప్రవర్తిల్లింది.

సునీథుడు అశ్వినీదేవతలతో, ప్రజ్ఞాఢ్యుడు చంద్రునితో, స్థిరబుద్ధి

వసువులతో, కాలచక్రుడు వాయువుతో, ప్రకంపనుడు అగ్నితో, సింహ దంష్ట్రుడు నిరృతితో, ప్రమథనుడు వరుణునితో, ధూమకేతువు యము నితో, మహామాయుడు కుబేరునితో అస్త్రప్రత్యస్త్రాలు ప్రయోగించి పోరుతున్నారు. దేవతలు ప్రయోగించిన అస్త్రాలను మహేశ్వరుడు హుం కారము వల్ల నాశనము చేసినాడు. కుబేరుడు గద ఎత్తగా శివుడు వారించినాడు. సురానీకము యుద్ధము చేయక వెనక్కు మరలింది. మహేంద్రుడు స్వయంగా సూర్యప్రభునితో యుద్ధానికి వచ్చి శరపరం పరలు వర్షించినాడు. సూర్యప్రభుడు అస్త్రాలను ఎగరగొట్టి, కర్ణాంతము వరకు అల్లెత్రాడు లాగి పుంఖానుపుంఖముగా విశిఖావళి ప్రయోగిం చగా దేవేంద్రుడు మహోగ్రుడై వజ్రాయుధము పట్టినాడు. శివుడు హుంకరించగా వజ్రాయుధము ముక్కలైనది. ఇంద్రుడు పరాఙ్ముఖుడు కాగా విష్ణువు స్వయంగా ప్రభాసునితో పోర తలచి బాణవర్షము అవిరళంగా కురిపించినాడు. ప్రభాసుడు జంకూ గొంకూ లేక అస్త్రాలను ప్రత్యస్త్రాలతో నాశనము చేస్తూ హతాశ్వుడై విగతరథుడై మరొక రథ మారోహించి ద్వైరథ యుద్ధము చేసినాడు. నారాయణుడు జ్వాల మాలాకులమైన చక్రము ప్రయోగించినాడు. నారాయణుని చక్రము ఖడ్గాన్ని ముక్కలు చేయగా పరమేశ్వరుడు హుంకరించినాడు. చక్రమూ ఖడ్గమూ క్షణములో అదృశ్యమైనవి.

## సూర్యప్రభుని విజయము

సూర్యప్రభుడు జయించినాడు. శ్రుతశర్మ బద్ధుడైనాడు. సురలు విచారించినారు. అసురులు అమందానందము పొందినారు. దేవతలు వృషభధ్వజుని స్తుతించి అర్చించినారు. అతడు సుప్రీతుడై దేవతలతో "సూర్యప్రభునికి నేను చేసిన ప్రతిజ్ఞ వినా మీకాక్షితమైన వరము కోరండి" అనగా దేవతలు "దేవా! నీ ప్రతిజ్ఞ ఎవరు తప్పించగలరు? మేము శ్రుత

శర్మకు చేసిన శపథముకూడా సత్యము అగును గాక! మాఅంశములకు నాశ ముండకుండుగాక” అని వేడినారు. భగవానుడు “సంధివల్ల ఇది ఏర్పడుతుంది. మీకు సంధి జరగవలె, సానుచరుడై శ్రుతశర్మ సూర్య ప్రభునికి వినమ్రుడు కాక తప్పదు. ఆతర్వాత ఉభయులకూ హితో పదేశము చేస్తాను” అని అనుగ్రహించినాడు. ఈశ్వరశాసన ప్రకారము శ్రుతశర్మ సూర్యప్రభునకు ప్రణమిల్లినాడు. వైరముమాని పరస్పరమూ వారు కంఠాలింగనము చేసుకొన్నారు. దేవాసురులు సంధిచేసుకొన్నారు. అందరూ ఆకర్ణిస్తూ ఉండగా మహేశ్వరుడు సూర్యప్రభునితో “దక్షిణ భాగములో నీవు సార్వభౌముడవు. ఉత్తరభాగము శ్రుతశర్మకిచ్చి వెయ్యి. కుమారా! నీకు సత్వరము కిన్నర కింపురుషులపై అధికారము కలుగుతుంది. ఇంతకు నాలుగింతలు సామ్రాజ్యము నీకు లభిస్తుంది. అనంతరము దక్షిణము కుంజర కుమారునకు ఇచ్చి వెయ్యి. సంగ్రామ హతులు ఉభయ పక్షాలవారూ ఉజ్జీవితులు అవుతారు. అంటూ శివుడు అంతర్ధాన మైనాడు. యుద్ధములో హతులైన వారందరూ సుప్తోత్థితుల వలె అక్షత శరీరులై లేచినారు.

## సూర్యప్రభాభ్యుదయము

సూర్యప్రభుడు శివాజ్ఞ శిరసావహించి వివిక్త విశాల ప్రదేశములో కొలువు తీర్చగా శ్రుతశర్మ వచ్చినాడు. వెంటనే సూర్యప్రభుడు అతనికి అర్ధసింహాసనమిచ్చి ఆసీనుని చేసినాడు. ప్రభాసుడు మొదలయిన వాళ్లు శ్రుతశర్మ మిత్రులయిన దామోదరాదులు సింహాసనమునకు రెండు వైపులా కూర్చున్నారు. సునీథుడు మయుడు తదితర రాక్షసులు, విద్యా ధరేశ్వరులు ఉచితాసనముల మీద ఉపవిష్టులైనారు. పాతాళాధీశ్వరు లయిన ప్రహ్లాదాది దైత్య దానవులు సభకు విచ్చేసినారు. లోకపాలాది సమేతుడై దేవేంద్రుడు దేవగురువును అనుసరించి వచ్చినాడు. విద్యా

ధర రాజయిన సుమేరువు సువాస కుమారునితో సభను అలంకరించి నాడు. దన్వాది కశ్యప కాంతలు, భూతాసన విమానమెక్కి సూర్య ప్రభుని భార్యలు కొలువుకూటానికి వచ్చినారు. సముచితాచారానంతరము వారందరూ కూర్చోగా దనుదేవి ఆజ్ఞచేత సిద్ధిఅనే సఖి ఇలా అన్నది: "సురాసురులారా! దనుదేవి మీకు ఇలా బోధిస్తున్నది. ఈసదస్యులకు కలిగిన తృప్తి ఇంతకు పూర్వము కలిగిందా? వైరము సుతరామూ కూడదు. స్వర్లోకాధిపత్యము కోసము హాహాకారి ఘోరి హిరణ్యాక్షుడు మొదలయిన వాళ్ళు ఏమైనారు? ప్రకృతము శక్రుడే పెద్దవాడు. ఎందుకు వైరము? వైరము విడిచి సుఖపడండి. మాకూ మీకూ లోకాలకూ క్షేమము." శక్రుడు తన ముఖము చూడగా దేవ గురువైన బృహస్పతి "ఈ అసురులు నిర్హేతుకముగా దేవతలతో వైరముపెట్టు కోకపోతే దేవతలు అనవసరంగా కయ్యానికి కాలుదువ్వారు" అని పలికినాడు. మయుడు "అసురులు కజ్జా తెచ్చుకొనే వారే అయితే నముచి మృత సంజీవనమైన ఉచ్చైశ్రవాన్ని ఇంద్రునికి ఇస్తాడా? ప్రబలుడు తన శరీరము దేవతలకు అర్పిస్తాడా? బలిచక్రవర్తి శ్రీహరికి త్రిలోకాలు ధారాదత్తముచేసి కారాగారములో ప్రవేశిస్తాడా? అయో దేవుడు నిజశరీరాన్ని విశ్వకర్మకు ఇస్తాడా? ఎన్ని దృష్టాంతాలియ్యను? ఈరీతిగా అసురులు సురలను గౌరవిస్తూ ఉంటే పరస్పరవైరము ఎందుకు ఉంటుంది? అని సమాధాన మీయగా హితబోధలు విని సురాసురులు అన్యోన్య కంఠాలింగనము చేసుకొన్నారు.

## కామచూడామణీ వివాహము

ఇంతలో పార్వతీదేవి ప్రతీహారి జయ ఉచిత గౌరవము పొంది సుమేరువుతో పలికింది. "నన్ను భవాని పంపింది. నీకిలా చెప్పమన్నది. నీదగ్గిర కామచూడామణి అనే కన్య ఉన్నదికదా. ఆమెను సూర్యప్రభుని

కిచ్చి వివాహం చెయ్యి" సుమేరువు వినయముతో "దేవ్యాజ్ఞ నిజముగా అనుగ్రహమే. మహాదేవుడు కూడా ఈవివాహవిషయము నాకు ఆజ్ఞాపించినాడు." అని సమాధాన మీయగా జయ సూర్యప్రభునితో రాణీవాసములో కామచూడామణిని భార్యలందరికంటే ప్రాణాధికగా చూచుకో. ఇది దేవి శాసనము సుమా" అని వెంటనే అంతర్ధానమైంది. ఆనాడే సుమేరువు సుముహూర్తము నిశ్చయించి మణిమయ వేదిక కట్టించి, స్తంభములు మణిఖచితము చేయించి చాందినీ ఏర్పాటు కావించినాడు. మణిప్రభలు అగ్నిశిఖాచ్ఛటలవలె విరాజిల్లుతూ ఉండగా కామచూడామణిని పిలిపించినాడు. దేవాసురుల చూపులు ఆమె లావణ్యరసమును తాగుతున్నట్టు ఉన్నవి. గిరిరాజసుత ఉమాదేవి. కామచూడామణి సుమేరుసుత. గిరికుమారితో సమంగా కామచూడామణి అందచందాలతో విలసిల్లింది. సుమేరువు వధువును పరిణయవేదిమీద కూర్చోపెట్టి, సూర్యప్రభునకు సాలంకృతకన్యాదానము చేసినాడు. సూర్యప్రభుడు కామచూడామణీ పాణి పంకజము గ్రహించినాడు. లాజహోమము ఆరంభము కాగా జయవచ్చి పార్వతీ దేవి పంపిన అమూల్య శాశ్వత దివ్యమాల, వరుని కిచ్చింది. మామ అల్లునికి రత్నరాసులు ఐరావత సంతానమైన మహాగజము అర్పించినాడు. లాజహోమము రెండవసారి అవుతూ ఉండగా జయరత్నమాల ఇచ్చింది. ఆరత్నావళిని కంఠదేశములో ధరిస్తే క్షుత్పిపాసలూ జరా మృత్యువులూ బాధించవు. సుమేరువు ద్విగుణీకృత రత్నరాశిని, ఉచ్చైశ్రవసంజాత మహాశ్వమును ఇచ్చినాడు. మూడవసారి లాజహోమసమయములో జయ వచ్చి యౌవన శ్రీలు నిలిపే ఏకావళిని బహూకరించింది. సుమేరువు త్రిగుణీకృత రత్నరాశిని సమస్త సిద్ధి ప్రదమైన గుళికనూ అల్లుని కిచ్చినాడు.

వివాహానంతరము సుమేరువు సురాసుర విద్యాధర దేవాదులను అంద

రినీ భోజనానికి ఉండ మని ఆహ్వానిస్తే వా రంగీకరించ లేదు. నందీశ్వరుడు రాగా అతనికి అందరూ ప్రణామములు చేసినారు. అప్పుడు నంది "సుమేరుడు మనల్ని విందుకు పిలిచినాడు. మీరందరూ తప్పక ఆతిథ్యము అంగీకరించవలె. ఇతనింట్లో విందారగిస్తే మీకు నిత్యతృప్తి కలుగుతుంది. ఈరీతిగా మహేశ్వరుడు మీకు ఆజ్ఞ ఇచ్చినాడు" అని పలికినాడు. అందరూ నందీశ్వరుడు చెప్పింది విని శివాజ్ఞ శిరసా వహించినారు. ప్రమథులు వినాయక, మహాకాల వీరభద్రాద్యధిష్ఠితులై వచ్చి వేదిక పైన విందుఏర్పాటు చేసి, సురాసుర విద్యాధర మానవులను ఆసీనులను చేసినారు. సుమేరుప్రభావజనితములు, శివశాసనమువల్ల కామధేనువు ఇచ్చినవంటకాలు అందరికీ వడ్డించినారు. ప్రతివారినీ నూరడిగి తృప్తిగా ఆరగించమని కనుక్కుంటూ వీరభద్ర మహాకాల భృంగీశ్వరాదులు వడ్డనలో ఉన్నారు. అప్సరాంగనలు విలాసలాస్యములవల్ల, మధురగానముచేత అందరినీ రంజింపచేసినారు. భోజనానంతరము నందీశ్వరాదులు సురాసురమానవాదులకు వస్త్రాభరణాదులు అర్పించినారు. నందీశ్వరాదులు నిజనివాసాలకు వెళ్ళినారు. దేవాసురులు సెలవు తీసుకొన్నారు. సూర్యప్రభుడు ప్రియాసమేతుడై విమాన మెక్కి సుమేరు ఆశ్రమానికి వెళ్ళినాడు. రాజు లందరికీ రత్నప్రభువుకూ సూర్యప్రభుడు నిజాభ్యుదయము తెలియచేయవలసిన దని మిత్రుడైన హర్షుని పంపినాడు.

రాత్రి మణిపర్యంకముతో విలసిల్లిన శయనమందిరములో సూర్యప్రభుడు ప్రియురాలితో ప్రవేశించినాడు. అతను నవోఢను తమితీర గాఢాలింగనము చేసుకుని అధరచుంబనము చేసి ముద్దరాలి సిగ్గు పోగొట్టి ఆమెను రంజింపచేసినాడు. తెల్లవారినతరువాత ప్రభువు రాణీవాసానికి వెళ్ళితే వాళ్ళు నవోఢారక్తు డయినప్రియుణ్ణి పరిహాసము చేస్తూ ఉండగా, ద్వారికుడు పానకములో పుల్లవలె సుషేణు డనే విద్యాధరుడు వచ్చినా డని చెప్పినాడు. విద్యాధరేశ్వరుడు వచ్చి సూర్యప్రభునకు వంద

నము చేసి ఇలా విన్నవించినాడు: "రాజన్! త్రికూటపాదాద్రి [illegible] రులు నన్ను నీవద్దకు పంపినారు. వారి విన్నపము ఇది: "[illegible] నాడు ఋషభాద్రిలో నీకు అభిషేకముహూర్తము: [illegible]"

"మేమంతా సిద్ధము. మిగతా సన్నాహము [illegible] చేయండి. ఇలా అని వాళ్ళకు చెప్పు" అని ప్రభువు సు[illegible] [illegible]డు. అతడు ఈవార్త చెప్పడానికి వెళ్ళినాడు. ప్రభువు [illegible] ప్రాజ్ఞ వల్ల్యాదులను సామంతులనూ విద్యాధరులనూ అభిషేక మహోత్స వానికి ఆహ్వానించడానికి ప్రభాసాదులను పంపినాడు.

## సూర్యప్రభుని విద్యాధర రాజ్యాభిషేకము

సూర్యప్రభుడు స్వయంగా పార్వతీ పరమేశ్వరులను పిలవడానికి కైలాసాచలము వెళ్ళినాడు. ప్రభుడు మహేశ్వరునివలె [illegible] కైలాసగిరిని దర్శించి కొంతమేర ఎక్కి అపైన ఎక్కలేక నాలుగు వైపుల చూడగా ప్రవాళ ద్వారము కంటికి కనపడింది. ప్రవేశము అసాధ్యము కాగా ప్రభుడు తదేకచిత్తుడై [illegible] చేస్తే గజముఖుడైనవాడు ద్వారము తెరచి "హేరంబుడు నీకు ప్రసన్నుడై నాడు. రా లోపలికి" అని పలికినాడు. సూర్యప్రభుడు ఆశ్చర్యముతో లోపలికి వెళ్ళినాడు. అక్కడ చంద్రకాంత శిలాతలముపైన ప్రమథ గణసేవితుడైన వినాయకుని చూచి పాదాలపైన వాలినాడు. విఘ్నేశ్వరుడు అతనిరాకను ప్రశ్నించి శివసాన్నిధ్యమునకు మార్గము చూపాడు. సూర్యప్రభుడు అయిదుయోజనాలు ఆరోహించి పద్మరాగద్వారమును చూచినాడు. ప్రవేశించలేక పరమేశ్వరుని ప్రస్తుతించగా విశాఖుడు స్వయంగా ద్వారము తెరిచి తన్ను తెలియ చెప్పి సూర్యప్రభుని లోపలికి రమ్మని ఆహ్వానించినాడు. సూర్యప్రభుడు స్కందుని దర్శించినాడు. కుమారస్వామి సంతుష్టుడై ఈశ్వరసన్నిధికి మార్గము తెలియచేసినాడు.

సూర్యప్రభుడు భైరవ విఘ్నేశ్వరాది వీరభద్రప్రమథులు రక్షిస్తున్న రత్న ద్వారసీమలను దాటి గిరిపైన స్ఫాటిక ప్రాకారము చేరినాడు. ప్రభుడు ఈశానస్తవము చేయగా రుద్రుడు శౌకడు ద్వారము తెరచి సాదరముగా అతనిని లోపలికి రమ్మన్నాడు. సూర్యప్రభుడు సదా పుష్పఫలద్రుమము దివ్యగంధవహద్వారము, గంధర్వ సంగీతము, అప్సరోనృత్తరసా త్స్వనము స్వర్గాధికము ఐన శివాలయము చూచినాడు. పార్శ్వమున గిరిజ సేవిస్తూ ఉండగా, స్ఫాటిక సింహాసనముపై ఉన్న పశుపతిని శూల పాణిని పింగళజటాజూటుని స్ఫాటికస్వచ్ఛసంకాశుని త్రిలోచనుని మహే శ్వరుని చూచి రసానందతన్మయుడై సూర్యప్రభుడు ప్రణమిల్లినాడు. పరమేశ్వరుడు అతనిని లేవతీసి వచ్చిన కారణము అడిగినాడు.

సూర్యప్రభుడు "ఈశ్వరా! నా అభిషేకము సమీపించింది. మిమ్మల్ని ఆహ్వానించ వచ్చినాను. ఈశ్వరుడు "పుత్రా, నా సాన్నిధ్యానికి ఇంతశ్రమపడి వచ్చావేమి? నేను రానా? భక్తులు స్మరిస్తే చాలు నేను వస్తాను" అంటూ ప్రమథుని పిలిచి అభిషేకార్థము ఋషభగిరి దరికి సూర్యప్రభుని తీసుకొని వెళ్ళమన్నాడు. మహేశ్వరుణ్ణి సేవించిన సూర్యప్రభుని ప్రమథుడు తన అంకసీమలో ఆసీనునిచేసి నిజసిద్ధివల్ల ఋషభపర్వతమువద్ద ప్రభువును వదలి అదృశ్యుడైనాడు. సూర్యప్రభుడు ఋషభాచలముపైన ఉండగా అతని మిత్రులు కామచూడామణి మొదలైన భార్యలు, విద్యాధరేంద్రులు ఇంద్రాదిదేవతలు, మయాదిఅసురులు, మహర్షులు, శ్రుతశర్మ, సుమేరువు, సువాసకుమారుడు వచ్చినారు. సూర్యప్రభుడు వచ్చినవారిని సమ్మానించినాడు. ప్రభువువల్ల ఈశ్వర దర్శన వృత్తాంతము విని అందరూ ఆనందించినారు.

ప్రభాసాదులు నానామహౌషధీసహిత నదీనద సాగర తీర్థజలమును మణి కనకకుంభములతో అభిషేకార్థము తెచ్చినారు. అర్ధనారీశ్వరుడు అక్కడికివిచ్చేయగా దేవాసురవిద్యాధరులు ప్రణమిల్లినారు. సురాసురులు

పుణ్యాహఘోషం చేయగా మహర్షులు సూర్యప్రభువును సింహాసనము మీద కూర్చోబెట్టి విద్యాధర రాజ్యాభిషేకము చేసినారు. మయాసురుడు అతనికి పట్టమహిషులు కట్టినాడు, దేవదుందుభులు చెలరేగినవి. దివిలో అప్సరాంగనలు నృత్యము సలిపినారు. మహర్షి మండలి కామచూడామణినికూడా అభిషేకము చేసి మహాదేవిని చేసినారు. దేవాసురులు వెళ్ళగా సూర్యప్రభుడు బంధుమిత్రులతో మహోత్సవము చేసినాడు. కొంతకాలానికి శివాజ్ఞాప్రకారము సూర్యప్రభుడు ఉత్తరవేద్యర్ధము ఇచ్చి మరికొందరు భార్యలను పొంది విద్యాధరరాజ్యలక్ష్మిని అనుభవిస్తున్నాడు. ఈరీతిగా సూర్యప్రభుడు మానవమాత్రుడై విద్యాధర చక్రవర్తి అయినాడు.

ఇలా వజ్రప్రభుడు వత్సరాజు ఎదుట కథ చెప్పి, నరవాహనదత్తునికి ప్రణమిల్లి గగనానికి ఎగిరినాడు. నరవాహనుడు మదనమంచుకతో తండ్రిఇంట విద్యాధరేంద్రపదవికై నిరీక్షిస్తున్నాడు.

## అలంకారవతీ లంబకము

### తరంగము : ౫౧

నిశుంభ భర సమ్రోర్వీ
ఖర్వీతాః పర్వతా అపి
యం నమంతీవ నృత్యంతం
నమామ స్తం వినాయకమ్!

అద్రులు నిశుంభ భార సమ్రావనిపయి
ఖర్వితము లయ్యు వందారుగతిని దోచు
చుండు నృత్యము సేయుచునుండ నెవడు,
నానమస్కృతి అట్టి వినాయకునకు!

నరవాహనదత్తుడు కౌశాంబీనగరములో విద్యాధరరాజుల మన్ననలు పొందుతూ తండ్రిదగ్గిర ఉన్నాడు. ఒకనాడు అతడు మంత్రి గోముఖునితో వేటకై మహారణ్యము ప్రవేశించినాడు. అతని కుడికన్ను అదరగా శుభశకునముగా వీణారవముతో మేళవించిన తీయని కంఠము వారి వీనులకు సోకింది. ఆ గీతనిస్వానాన్ని అనుసరించి వెళ్ళి నరవాహనదత్తుడు స్వయంప్రతిష్ఠితమైన శివలింగము చూచి గుర్రాన్ని కట్టివేసి దేవాలయములో ప్రవేశించినాడు. ఒక దివ్యకన్య వీణ వాయిస్తూ శివస్తోత్రము గానము చేస్తున్నది. ఆమె లావణ్యకాంతి సెలయేరై ప్రవహించి అతనిహృదయాన్ని కలతపెట్టింది. ఆముగ్ధ ప్రేమరస మొలికే చూపు చూచింది. ఆమెచిత్తము నరవాహనదత్తమయమై వీణావాదనము మరిచింది. గోముఖుడు నరవాహనదత్తుని మనసు కనిపెట్టి దివ్యకన్య సఖులను "ఎవరీమె? ఎవరికూతురు?" అని కుతూహలముతో అడిగినాడు. అప్పుడు గగనమునుండి హేమారుణప్రభ భూమిమీదికి అవతరించి దేవకన్య పక్కనే కూర్చున్నది. కన్య లేచి ఆ ప్రౌఢవిద్యాధరి పాదాలకు ప్రణమిల్లింది. ఆవిద్యాధరి "విద్యాధరచక్రవర్తి నిరాటంకముగా నీకు భర్త అవుతాడు" అని ఆశీర్వాదము చేసింది. నరవాహనుడు విద్యాధరికి వందనము చేయగా ఆసౌమ్య ఆశీర్వదించింది. అతడామెను కుతూహలముచేత "అమ్మా, ఈకన్య ఎవరో చెప్పు" అని అడిగినాడు. విద్యాధరి దేవకన్యా వృత్తాంతము చెపుతున్నది:

హిమవత్పర్వతములమీద శ్రీసుందరపురములో అలంకార శీలు డనే విద్యాధరేశ్వరునికి కాంచనప్రభ అనే పట్టపురాణివల్ల కుమారుడు పుట్టినాడు. [illegible]దేవి అనుగ్రహమువల్ల రాజకుమారుడు ధర్మపరాయణుడు అవుతా డని తెలిసి తండ్రి వాడికి ధర్మశీలు డని నామకరణము చేసినాడు. ధర్మశీలుడు పెరిగి పెద్దవాడై చదువులు నేర్చిన తరువాత యువరాజైనాడు. అతడు యువరాజై తండ్రిని మించిన ధర్మము చేస్తూ

రాజ్యములో ప్రజలను రంజించినాడు. తర్వాత కాంచనప్రభ నవమాస ములు మోసి కన్యను కన్నది. అశరీరవాణి అప్పుడు "ఈకన్య నర వాహనదత్తుని రాణి అవుతుంది" అన్నది. తండ్రి ఆమెకు అలంకారవతి అని పేరుపెట్టినాడు. ఆకన్య చంద్రకళవలె పెరుగుతున్నది. క్రమేణా ఈడురాగా ఆమె తండ్రి దగ్గిర సమస్త విద్యలూ కరతలామలకము చేసు కొని శివాలయములు శివభక్తివల్ల చూడ తలుచుకొన్నది. అలంకార వతి అన్న ధర్మశీలుడు చిన్నవాడైనా ఏకాంతములో తండ్రితో "నాన్నా, క్షణభంగురాలైన ఈభోగాలంటే నాకు అయిష్టము. చివరకు ఈసంసారము అసారము. వ్యాసమునీంద్రుని సుభాషితము ఆకర్ణించలేదా?

సర్వే క్షయాన్తా నిచయాః
పతనాన్తాః సముచ్ఛ్రయాః
సంయోగా విప్రయోగాన్తా
మరణాన్తం హి జీవితమ్.

సర్వపదార్థముల్ క్షయమును గాంచు:
పతనమే ఔన్నత్య పర్యవసాన,
మగును సంయోగాన కంతాన విరహ,
మీ జీవితమునకు మృత్యువే ఫలము.

ఈ క్షణికభోగాలు ఎంతమాత్రమూ వివేకులకు ప్రీతిదాయకములు కావు. చివరకు పుత్రాదికపుల్లయినా పోయేనాడు వెంటరాదు. ధర్మమే బంధువు. అది పురుషుని అడుగు విడవదు. అందువల్ల నేను తపము చేసి శాశ్వతమైన పరమపదము పొందుతాను." అని పలికినాడు. తండ్రి అలం కార శీలుడు కళ్ళవెంట బాష్పములునింపుతూ "కుమారా! పసితన ములో నీకు చిత్తవికారమెందువల్ల? పెళ్ళిచేసుకొని ఇహసుఖాలు అనుభ విస్తూ సంతానము కని రాజ్యపాలనచేయవలె కాని విరాగమెందుకు?"

అని పలికినతరువాత ధర్మశీలుడు "శమమునకూ అశమమునకు వయసుతో నిమిత్తము లేదు. ఈశ్వరానుగ్రహము ఉంటే బాలుడు శాంతి సుఖము కోరుతాడు. కుత్సితుడు వృద్ధుడయినా శాంతికోరడు. నాకు రాజ్యము వద్దు. పెళ్ళిచేసుకోను. తపస్సుచేసి శివప్రీతి కలిగించడమే జన్మ ఫలము" అన్నాడు. తండ్రి కుమారుని పట్టుదల పోగొట్టలేక జల జలా కన్నీరు కార్చి "కుర్రవాడికి నీకే ఇంత వైరాగ్యము కలిగితే కాటికి కాళ్ళు చాచిన వృద్ధుడికి నాకు మాత్రము విరక్తి లేదా? నేనూ అరణ్యములోకి తపస్సుకు వెళ్ళుతాను" అని మర్త్యలోకానికి వెళ్ళి పేద బ్రాహ్మణులకు రత్నరాసులు, పదివేల బారువుల సువర్ణమూ దానము చేసి భార్యతో "నా మాట పాటించి ఇక్కడే నీవు అలంకారవతిని కని పెట్టుకొని ఉండవలె. వచ్చేసంవత్సరం ఈ తిథినాడు వివాహముహూర్తమున్నది. నరవాహన దత్తునికి దీన్ని ఇస్తాను. అల్లుడు సార్వభౌముడై ఈ నగరమును పరిపాలిస్తాడు." అని పలికినాడు. కళ్ళనీళ్ళు పెట్టుకొన్న భార్యను ఓట్టుపెట్టి నిలిపి అతడు సుతునితో వనానికి వెళ్ళినాడు.

భర్త్రాజ్ఞాప్రకారము సాధ్వీమణి అయిన కాంచనప్రభ కుమారితో ఆ నగరములోనే ఉంటున్నది. ఆమె మాతృవాత్సల్య సుఖము అనుభవిస్తూ కుమారితో అనేక శివక్షేత్రాలు పర్యటనము చేస్తున్నది. ఒకనాడు అలంకారవతితో ప్రజ్ఞప్తి విద్య "కాశ్మీర దేశములో స్వయంభూక్షేత్రాలు అర్చించు, అందువల్ల నిర్విఘ్నముగా విద్యాధర చక్రవర్తి అయిన నరవాహన దత్తుడు నిన్ను వివాహము చేసుకొంటాడు" అని అనుగ్రహించింది. అప్పుడామె తల్లితో కాశ్మీరము వెళ్ళి శివారాధనము చేసింది. నందక్షేత్రము, మహాదేవగిరి, అమరాద్రి, సురేశ్వరాచలము, విజయకపటేశ్వరాది క్షేత్రాలు దర్శించి గిరిజాపతిని పూజించి ఆ విద్యాధరి, తల్లీ ఇంటికి వచ్చినారు. "ఓ సుభగుడా! ఆ అలంకారవతి ఈ కన్య, నేను కాంచన ప్రభను. నాతో చెప్పకుండా

ఈ కన్య ఈ శివాలయానికి వచ్చింది. ప్రజ్ఞప్తిమాత్రి విద్య వల్ల నేను గ్రహించి ఇక్కడికి వచ్చినాను. ఆ విద్యవల్ల నీవు ఇక్కడికి వచ్చావని తెలుసుకొన్నాను. దేవతాదిష్టమైన ఈ కన్యను స్వీకరించు. రేపే అమ్మాయి వివాహానికి సుముహూర్తము. సరే నీవు కౌశాంబీనగరము వెళ్ళు. మేమూ వెళ్ళిపోతాము. రేపు అమ్మాయి తండ్రి తపోవనము నుంచి వచ్చి నీకు కన్యాదానము చేస్తాడు" అని కాంచనప్రభ నరవాహనునితో అన్నది.

నరవాహనునికీ అలంకారవతికీ అన్యోన్యత కలిగింది. సంధ్యవేళ సమీపించగా చక్రవాక దంపతులవలె వారిద్దరూ రాత్రిమాత్ర విరహాన్ని సహించలేక రాత్రులనే నెలలు కాగా కాంచనప్రభ వారి అవస్థ గ్రహించి "ఒకరాత్రి ఎడబాటుకే నా ఇంత అధైర్యము? ధీరులు దీర్ఘవియోగవ్యధ సహిస్తారు. శ్రీరాముడు ప్రియావిరహవ్యథ సహించలేదా" అంటూ ఉత్తర రామచరిత్రము ఆరంభించింది.

## సీతా వనవాస కథ

పూర్వము అయోధ్యాధిపతి దశరథునికి రామ భరత లక్ష్మణ శత్రుఘ్నులు నలుగురు కుమారులు. శ్రీరామచంద్రుడు రావణాసురుని వధించేటందుకు విష్ణుమూర్తి అవతార మెత్తినాడు. ఆయన భార్య సీతాదేవి అతనికి ప్రాణము వంటిది. విధివశాన దశరథుడు భరతునికి రాజ్యమిచ్చి సీతా రామలక్ష్మణులను వనవాసానికి పంపినాడు. అరణ్యములో రావణుడు తన మాయాశక్తివల్ల సీతాదేవిని హరించి మార్గములో జటాయువును సంహరించి ఆమెను లంకాద్వీపానికి తీసుకొని వెళ్ళినాడు. శ్రీరామచంద్రుడు ప్రియావిరహకాతరుడై, సుగ్రీవుని వాలి వధవల్ల వశము చేసుకొని, ఆంజనేయుని పంపి ప్రియురాలివృత్తాంతము గ్రహించి సముద్రముదాటి, రావణుని వధించి లంకారాజ్యము విభీష

ణుని కిచ్చి సీతను తెచ్చుకొన్నాడు.

వనవాసానంతరము శ్రీరాముడు అయోధ్యకు వచ్చి భరతార్పిత రాజ్యము స్వీకరించి పరిపాలన చేస్తున్నాడు. సీతాదేవి కొన్నాళ్ళకు గర్భవతి అయింది. శ్రీరాముడు ప్రజారంజను డైన ప్రభువు కనుక ప్రజాచేష్టలు తెలుసుకోవలె నని నగరములో సంచరించగా ఒక పురుషుడు భార్యను లేచిపోయి వచ్చినదని దోషారోపణ చేసి, జుట్టు పట్టి త్రోసి వేస్తూ ఉండగా చూచినాడు. ఆమె "రక్షోగృహములో ఉండి వచ్చిన సీతను శ్రీరాముడు స్వీకరించా డట. దాయాది ఇంటికి వెళ్ళి వచ్చిన నన్ను స్వీకరించ డటః శ్రీరామునికన్న గొప్పవాడివి నువ్వు!" అన్నది. శ్రీరాముడు ఆకర్ణించి ఖిన్నుడై నగరుచేరి లోకాపవాద భీతివల్ల సీతాదేవిని వనవాసార్థము విడిచిపెట్టినాడు. యశస్వి విరహబాధ సహిస్తాడు, అప్రతిష్ఠ సహించలేడు. సీత గర్భభారాలసయై వనములో తిరిగి తిరిగి దైవవశాన వాల్మీకి మునీంద్రుని ఆశ్రమవాటికి వెళ్ళింది. ఋషీశ్వరుడు ఆమెను ఓదార్చి ఆశ్రమములో ఉంచి రక్షించినాడు.

అక్కడి మునులు 'నిజంగా సీత మంచిది కాదు. దుష్ట కనుకనే భర్త వదలివేసినాడు. సీతాదర్శనముచేత మనము పాపము ఒడి కట్టుకొన్న వాళ్ళము అవుతాము. దయవల్ల వాల్మీకి సీతను ఆశ్రమములో ఉంచి నాడు. పొమ్మనడు. పైగా ఈమెవల్ల వాల్మీకి తపస్సు పాడవుతుందే! రండి, మనము మరో ఆశ్రమము చూచుకొందాము" అని యథార్థము తెలుసుకోక కూడ పలుకుకొన్నారు. వాల్మీకి వాళ్ళతో "విప్రులారా, ఈమె పవిత్రురా లని సమాధిలో తెలుసుకొన్నాను." అని చెప్పినా, వాళ్ళకు తృప్తి కలగకపోవడము కనిపెట్టి సీత "మహాపురుషులారా! నన్ను పరీక్షించండి. నావల్ల దోషము ఉన్నదని తోస్తే నాతల తీసి వేయండి" అని పలికింది. మునీంద్రులు కనికరించి "ఇక్కడ అరణ్యములో టిటిభసర స్సనే తీర్థరాజము ఉంది. పూర్వము ఒకటిటిభని

భర్త అన్యసంగినిగా అనుమానించి దూషించగా పతివ్రత అయిన ఆ టీటిభ దిక్కులేక భూదేవినీ లోకపాలకులనూ వేడి విలపించింది. వారు పారిశుద్ధ్యము నిమిత్తము ఆతీర్థము నిర్మించినారు. శ్రీరామునిభార్య కూడా తన పవిత్రతను ఋజువుచేయాలి'' అని పలికినారు. సీతాదేవి మునులతో సరస్సుకు వెళ్లి "ఆర్యపుత్రునికన్న వేరొకరిని కలలోకూడా తలచని దాన్ని అయితే భూదేవీ, సరోవరనీరముదాటి అద్దరి చేరుదును గాక'' అని పలుకగానే భూదేవి సీతను అంకముపైన కూర్చో బెట్టుకొని అద్దరికి తీసుకొని వెళ్లి దిగవిడిచింది. మునులందరూ సీతా మహాసాధ్వికి ప్రణామము చేసి శ్రీరాముని శపింప తలచినారు. ఆమె అంజలి ఘటించి "మునులారా! ఆర్యపుత్రునికి అమంగళము తలపవద్దు. పాపినీ నన్నే శపించండి'' అని మొరపెట్టుకొని విలపించింది. వారందరు సంతోషించి వీరప్రసవవు కమ్మని ఆశీర్వదించినారు.

వాల్మీకి ఆశ్రమములో సీత యథాకాలాన పండువంటి కుమారుని కన్నది. వాల్మీకి మహర్షి కుర్రవాడికి లవుడని పేరుపెట్టినాడు. ఒకనాడు ఆమె పిల్లవాణ్ణి తీసుకొని స్నానానికి వెళ్లింది. అప్పుడు పర్ణశాలకు మహర్షి వచ్చి శిశువు కనపడక పోవడంవల్ల "ఈమె పిల్లవాణ్ణి ఇక్కడే ఉంచి స్నానానికి వెళ్ళేది. ఏడీ ఆపిల్లవాడు? బహుశా ఏక్రూరమృగమో శిశువును తీసుకొనిపోయిందేమో? సీత శిశువుకై శోకించక మునుపే పిల్లవాణ్ణి సృజిస్తాను.'' అని ఆలోచించి కుశతో పవిత్రముచేసి లవునివంటి శిశువును చేసి లవుని స్థానములో ఉంచినాడు. స్నానానంతరము సీత వచ్చి శిశువును చూచి వాల్మీకిని "స్వామీ! ఇదుగో మాఅబ్బాయి. ఈరెండోపిల్లవాడు ఎవరు?'' అని కుతూహలముతో అడిగింది. మహర్షి యథార్థము ఆమెకు చెప్పి "పుణ్యశీలా! కాగలదాన్ని తప్పించేవారెవరు? ఈరెండోపిల్లవాణ్ణి కూడా పుచ్చుకో. నాశక్తివల్ల కుశతో సృజించాను కనుక వీడికి కుశుడనే నామకరణము చేశాను'' అంటూ

ఉండగా ఆమె రెండోశిశువును స్వీకరించింది. శిశువు లిద్దరికీ వాల్మీకి మహర్షి సంస్కారములు యథావిధిగా జరిపినాడు. వాళ్ళు ఆశ్రమములో పెరుగుతూ బాల్యములోనే మహర్షి వల్ల అస్త్రవిద్యలు చక్కగా అభ్యసించినారు.

ఒకనాడు ఆక్షత్రియ కుమారులు ఆశ్రమ మృగాన్ని వధించి దాని మాంసము తిని మహర్షుల అర్చాలింగమును ప్రతిమగా చేసుకొని ఆటలాడుతూ ఉన్నారు. వాల్మీకి అందుకు విచారించి సీతాదేవి ప్రార్థన వల్ల పిల్లలకు ప్రాయశ్చిత్తము విధించినాడు. లవుడు కుబేర సరస్సుకు వెళ్ళి అందులో ఉన్న బంగారు తామరలూ, చైత్రరథవనమునుంచి మందారకుసుమాలూ, తీసుకురావలెనని ఆజ్ఞ అయింది. పిల్లలిద్దరూ ఆప్రతిమను అర్చించవలెనని మహర్షి ఆనతిచ్చినాడు. ఆమాట విని లవుడు పసివాడయినా కైలాసాచలానికి వెళ్ళి కుబేరుని చైత్రరథోద్యానమునూ సరోవరమునూ ఆక్రమించి అక్కడున్న యక్షులను కొట్టి తామరపువ్వులు కోసి తెస్తూ మార్గాయాసమువల్ల వృక్షచ్ఛాయలో విశ్రాంతి తీసుకొన్నాడు.

## సీతా సమాగమము

ఈలోగా శ్రీరామచంద్రుడు నరమేధము చేయతలచినాడు. అందు కోసము లక్ష్మణుడు సులక్షణ లక్షితుడైన వాడికోసము వెతుకుతూ, మధ్యేమార్గములో తటస్థపడిన లవుణ్ణి క్షత్రధర్మమున సమరానికి ఆహ్వానించినాడు. లక్ష్మణుడు ప్రయోగించిన మోహనాస్త్రమువల్ల లవుణ్ణి మోహితుణ్ణిచేసి బంధించి అయోధ్యకు తీసుకొని వెళ్ళినాడు. లవుడు రాకపోవడమువల్ల సీత బాధపడుతూ ఉండగా వాల్మీకి ఆమెను ఓదార్చి యోగదృష్టివల్ల విషయమంతా గ్రహించి కుశునితో "మీఅన్నయ్యను లక్ష్మణుడు కట్టి అయోధ్యానగరము తీసుకొని వెళ్ళినాడు. ఈ అస్త్ర

విద్యాబలమువల్ల లక్ష్మణుని జయించి అన్నయ్యను విడుపించుకొనిరా" అని దివ్యాస్త్రములు ఇచ్చి పంపినాడు. కుశుడు యజ్ఞభూమిని ఆక్రమించి తద్రక్షకుడైన లక్ష్మణుని అస్త్రాలచేత జయించినాడు. శ్రీరామచంద్రుడు యుద్ధరంగానికి వచ్చి వాల్మీకి తపోబలమువల్ల ఆపిల్లవాణ్ణి జయించలేక 'అబ్బాయీ! ఎందుకు యుద్ధము చేస్తావు? ఎవరు నీవు?' అని కుతూహలముతో అడిగినాడు. కుశుడు "లక్ష్మణుడు మా అన్నను బంధించి తెచ్చినాడు. నేను మా వాణ్ణి విడిపించవలెనని వచ్చినాను. మేము లవకుశులము. మా తల్లి జానకీ దేవి. మేము శ్రీరామచంద్రుని కుమారులమని చెప్పింది" అని తమ సంగతి చెప్పగా శ్రీరాముడు జలజలా కన్నీరు రాల్చి లవుని రప్పించి 'నేనే శ్రీరాముణ్ణి' అంటూ పుత్రులను తమితీర కంఠాలింగనము చేసుకొన్నాడు. నాగరకులందరూ జానికిని స్తవముచేస్తూ ఉండగా శ్రీరాముడు కుమారులను గ్రహించినాడు. అతడు ప్రియురాలిని వాల్మీకి ఆశ్రమమునుంచి రప్పించి రాజ్యభారము కుమాళ్ళమీద మోపి సీతతో సుఖముగా ఉన్నాడు. ధీరులు చిరవియోగము సహించగలరు. మీరు ఏకరాత్రి ఓపికపట్టకుండా ఉన్నారే?

ఇలా కాంచనప్రభ పరిణయోత్సుక అయిన అలంకారవతినీ, అల్లుడు నరవాహనదత్తునీ ఊరడించి గగనపథాన నిజనగరము వెళ్ళింది. నరవాహనదత్తుడు విరహముతో కౌశాంబీనగరకి ప్రయాణమైనాడు.

అతనికి రాత్రి కంటిమీద కునుకు లేదు. గోముఖుడు నరవాహనుని రంజింప చేయవలెనని కథ ఆరంభించినాడు:

## పృథ్వీ రూపరాజు కథ

దక్షిణాపథములో ప్రతిష్ఠాపురమును పృథ్వీరూపమహారాజు పరిపాలన చేస్తున్నాడు. ఒకసారి అతని సన్నిధికి ఇద్దరు జైన సన్యాసులు వచ్చి అతని అపురూపమైన అందచందములు చూచి ఇలా పలికినారు: "దేవా!

మేము భూమండల సంచారము చేస్తూ ఉంటాము. ఎక్కడా నీవంటి చక్కని వ్యక్తిని పురుషుల్లోగాని స్త్రీలలోగాని చూడలేదు. అయితే ముక్తిపురమనే ద్వీపములో రూపధరమహారాజు కుమారి అయిన రూపలత రూపములో నీకుసాటి. ఆకన్యకు నీవే తగిన వాడవు. మీ ఇద్దరూ భార్యాభర్తలయితే ఎంత శోభగా ఉటుందో కద!" శ్రమణుల వాక్కులతోపాటు మన్మథుని మార్గణములు అతని శ్రవణమార్గమున ప్రవేశించి హృదయాన్ని గాయపరిచినది. మహారాజు ఉత్సుకుడై చిత్రకారుని పిలిపించి ఆజ్ఞ ఇచ్చినాడు. "కుమారిదత్తా! నారూపాన్ని చక్కగా సరిగా ఆలేఖ్యము రచించి ఈభిక్షువులతో ముక్తిపురద్వీపానికి వెళ్ళు. అక్కడ రూపధర రాజేంద్రుని కుమారికి యుక్తిగా నాచిత్రాన్ని చూపు. రాజు కుమారిని నాకు ఇస్తాడో ఇవ్వడో కనిపెట్టు. ఆ అందాల రాణిని ఆలేఖ్యములో చిత్రించి పట్టుకురావాలి" పృథ్వీరూపుడు నిజరూపము వ్రాయించి భిక్షువులతో ఆరూపచిత్రకారుడైన మార్తికుని ముక్తిద్వీపానికి పంపినాడు.

ఆముగ్గురూ సముద్రతీరస్థ పత్రపురిని చేరి నావఎక్కి అయిదురోజులు ప్రయాణము చేసి ముక్తిద్వీపము చేరినారు. చిత్రకారుడు రాజద్వారమున "నాకు సాటి రూప చిత్రకారుడు ఈలోకములో లేనే లేడు" అని పతాకము ఎత్తినాడు. అదివిని రూపధర రాజేంద్రుడు శిల్పిని పిలిపించినాడు. చిత్రశిల్పి రాజుకు ప్రమాణము చేసి "దేవా! భూమండలమంతా సంచరించినా నావంటి శిల్పి ఎక్కడా కనపడలేదు. దేవాసుర మానవకోటిలో ఎవరి రూపాన్ని చిత్రించను? అనుజ్ఞ ఇవ్వండి" అని మనవి చేయగా రాజు రూపలతను పిలిపించి ఆమె రూపాన్ని చిత్రించమని పలికినాడు. కుమారిదత్తుడు రాజకన్యను సరిగా చిత్రించి రాజుకు చూపగా అతడు ఆనందించి ఆమార్తికుని వివేకిగా గ్రహించి అతనివల్ల అల్లుణ్ణి పొంద దలచి "శిల్పీ! భూలోకమంతా సంచరించావు కద!

మాఅమ్మాయికి దీటయిన పురుషుణ్ణి గాని స్త్రీనిగాని చూశావా! అన్నాడు. చిత్రకారుడు "దేవా! మీఅమ్మాయికి సాటి రూపవంతులు లేరు. అయితే ప్రతిష్ఠానపుర పాలకుడైన పృధ్వీరూపుడు రూపలతకు అనుకూలమైనవాడు. ఆయనతో ఈ రాజకన్య జోడయితే ఎంతో సొంపుగా ఉంటుంది. అతడు పడుచువాడయినా తుల్యరూప దొరకకపోవడం వల్ల వివాహము చేసుకోకుండా ఉన్నాడు. ఆ రాజచంద్రుని రూపము పటములో చిత్రించి తెచ్చినాను" అని చెప్పినాడు. రూపధరమహారాజు ఆలేఖ్యమును అవలోకించి పృధ్వీరూపనరేంద్రుని రూపసంపదకు ఆశ్చర్యపడి "చిత్రములో చూచి మేము ధన్యుల మైనాము. ప్రత్యక్షముగా అతన్ని చూచినవారికి నానమస్కారము!" అని పలికినాడు. తండ్రి మాటలు విని రూపలత చిత్తరువు చూచిన వెంటనే వరించింది. కుమారి చిత్తవృత్తి రూపధరుడు అవగతము చేసుకొని శిల్పితో "నీశిల్పరచనలో పొరపాటు ఉండదు. నిజంగా పృధ్వీరూపుడు మాఅమ్మాయికి అనుకూలమైన అందాలవాడు. నీవు వెంటనే నాకుమారి చిత్రపటము తీసుకొని వెళ్ళి అతనికి చూపి నాఅంతరంగము అతనికి తెలియచెప్పు. అతనికి ప్రీతి కలిగితే వెంటనే వచ్చి మాఅమ్మాయిని వివాహము చేసుకొంటాడు" అని పలికి జైనభిక్షువులకు ధన మిచ్చి గౌరవించి దూతనిచ్చి పంపినాడు.

వారు సముద్రప్రయాణముచేసి ప్రతిష్ఠానపురము చేరి మహారాజ సన్నిధికి వెళ్ళి రూపధరుని సందేశము తెలిపినారు. శిల్పి రూపలతా చిత్రమును రాజుకు చూపినాడు. రూపలతా లావణ్యసరసిలో అతని దృష్టి మగ్న మైనది. ఆమె సౌందర్యలహరిని అతడు చకోరమువలె ఆస్వాదించి నప్పటికీ తృప్తి లేదు. రాజు చిత్రశిల్పితో 'మిత్రమా! ఇంత అందగత్తెను సృజించిన విధాతా, రూపు లిఖించిన నీవూ ధన్యులు. రూపధరరాజేంద్రుని సందేశము అంగీకరిస్తున్నాను. ముక్తిద్వీపానికి వెళ్ళి ఆ రాజు కన్యను వివాహము చేసుకొంటాను' అని పలికి చిత్ర

కార దూత భక్షువులను సత్కరించినాడు. రాజు చిత్తరువుమీద చూపు నిలిపి దిన మంతా రూపలతను వీక్షిస్తూ ఉద్యానములో విరహాకాత రుడై కాలము గడిపినాడు. మరునాడు సుముహూర్తము ఏర్పాటు చేయించి నానారాజపుత్ర సేనా సమేతుడై చిత్రకార, దూత, శ్రమ ణులతో పృథ్వీరూపుడు ముక్తి ద్వీపానికి ప్రయాణ మైనాడు. తొలి నాడు మంగళఘట నామక నాగేంద్రము నెక్కి, సందెవేళ వింధ్యాటవీ ముఖాన విడిసినాడు. మరునాడు మహారాజు శత్రుమర్దన మనే మహా గజమును ఆరోహించి అరణ్యపథాన పోతూ ఉండగా ముందు నడుస్తున్న బలము వెనకకు తిరిగింది. అది చూచి పృథ్వీ రూపుడు తెల్లబోగా నిర్భయు డనే రాజపుత్రుడు ఏనుగుమీదవచ్చి " దేవా! భిల్లసైన్యము మీద పడింది. భిల్లులు మన యాభై ఏనుగులను వెయ్యిమంది భటు లను, మూడువందల గుర్రాలను వధించినారు. మనసైనికులు రెండు వేల మంది భిల్లులను చంపినారు. మనలో ఒకనికి శత్రువులలో ఇద్దరు పడిపోతున్నారు. అశనిపాతముల వంటి వారి శరపరంపరలకు మన వాళ్ళు ఆగలేక పారిపోతున్నారు. " అని మనవి చేసినాడు. పృథ్వీ రూపుడు ప్రచండుడై భిల్ల సేనా సమూహముమీద పడి తరిమి రూపు మాపినాడు. నిర్భయాది రాజపుత్రులు ఇతర దస్యులను వధించినారు. పృథ్వీరూపుడు బల్లెముతో భిల్లాంగనలను హత మార్చినాడు. శరగళిత రక్తధారలవల్ల అతని ఏనుగు ఎర్రని కొత్తనీటి సెలయేళ్ళతో ఉన్న అంజన పర్వతమువలె ఉన్నది. విజయానంతరము రాజసైన్యము వచ్చి పృథ్వీరూపుని కలుసుకోగా హతశేషు లయిన భిల్లులు చెల్లాచెదరై పారిపోయినారు. రూపధరుని దూత పృథ్వీరూప నరేంద్రుని పరాక్ర మము ప్రస్తుతించగా, రాజు గాయపడినవారికి విశ్రాంతికై సరస్తీరాన ఆనాడు విడిసినాడు. మర్నాడు వేకువను రాజు తరిలి సముద్ర తీరాన ఉన్న పత్త్రపురము చేరినాడు. పత్త్రపురీపాలకు డైన ఉదార చరితుడు

పృథ్వీరూపుని సత్కరించగా అతడు డక్కడ సపరివారముగా విశ్రాంతి తీసుకొని మరునాడు ఆ రాజు ఏర్పాటు చేయించిన నౌక నెక్కి పృథ్వీ రూపుడు సముద్రము దాటి ముక్తిద్వీపము చేరినాడు.

పృథ్వీరూపునిరాక తెలిసి రూపధరుడు పొంగిపోయి ఎదురువచ్చినాడు. ఇద్దరూ కంఠాలింగనము చేసుకొన్నారు. పౌరాంగనావీక్షణపంక్తులు పృథ్వీరూపుని రూపసంపదను వీక్షించగా అతడు రూపధరునితో పుర ప్రవేశము చేసినాడు. హేమలతా రూపధరులు తమకన్యకు అనుకూలు డైన అల్లుడు లభించినందుకు అమందానందము పొందినారు. అత్త మామల మన్ననలు పొంది మరునాడు శుభముహూర్తాన పరిణయ వేదిమీద ఆసీనుడై రూపలతాకరమును గ్రహించినాడు. రూపధరుడు లాజమోక్ష సమయాన రత్నరాశి నిచ్చి రత్నాకరు డని అనిపించు కొన్నాడు. పరిణయానంతరము రూపధరుడు రూపశిల్పినీ శ్రీమణు లనూ దివ్యవస్త్రాభరణాలతో సత్కరించినాడు. పగ లల్లా నృత్తగీతా దులతో గడచింది. రాత్రి పృథ్వీరూపుడు ఉత్కంఠతో శయన మంది రము ప్రవేశించినాడు. రతనాల పర్యంకముపైన రూపలతా పృథ్వీరూ పులు భోగ విలాసాలు అనుభవించి అలసి సొలసి నిద్రించగా వేకువవేళ వందిమాగధులు గీతావళి పాడగా దంపతులు నిద్ర లేచినారు.

పృథ్వీరూపుడు అత్తవారింటిలో పదిరోజులు గడపి పదకొండోనాడు కార్తాంతికులు నిశ్చయించిన శుభముహూర్తాన అత్తమామల దగ్గిర సెలవు తీసుకొని ప్రియురాలితో బయలుదేరినాడు. మామ సముద్ర తీరము దాకా అల్లుణ్ణి సాగనంపగా వధూవరులు నావ నెక్కినారు. ఎనిమిది రోజులు రాజు ప్రయాణముచేసి సముద్రము దాటి తీరాన విడిసిన తన సేనను కలిసినాడు. పత్రపురాధీశ్వరుడు అతనికి ఎదురు సన్నాహముగా వచ్చినాడు. కొన్నాళ్ళపాటు పృథ్వీరూపుడు ప్రియ కాంతతో విశ్రమించి, అనంతరము జయమంగళ నామక నాగేంద్రము

పైన భార్య నెక్కించి, తాను కల్యాణ గిరినామక గజరాజమును అధి రోహించి ప్రయాణించి ప్రతిష్ఠాన పురము ప్రవేశించినాడు. ప్రతిష్ఠాన పురాంగనలు రెప్ప లప్పళించక తమితీర రూపలతాదేవిని చూచి తమ రూపగర్వాన్ని వదిలి వేసినారు. పృథ్వీరూపమహారాజు ఉత్సవముచేసి చిత్రకారునికి అగ్రహారాలు ధారాదత్తము చేసి జైన శ్రమణకులను ఉచిత సత్కారాలతో గౌరవించినాడు. సామంత సచివాదులను యథోచితముగా సమ్మానించి రూపలతతో పృథ్వీరూపుడు ఇహలోక సుఖము అనుభవిస్తున్నాడు.

ఈరీతిగా గోముఖుడు నరవాహనునికి కథ చెప్పి, ఉత్సుకుడైన అతనితో "ధీరులు విరహక్లేశాన్ని సహించగలరు. దేవా! నీవు ఏకరాత్రి విరహము సహించలేవేమి? రేపు ఉదయము నీవు అలంకారవతిని వివాహమాడుతావు" అన్నాడు. అప్పుడే వచ్చిన యౌగంధరాయణుని కుమారుడు మరుభూతి "స్మర సంతాపము ఎరగని నీవు చెప్పకేమి చేస్తావు? కామోద్రేకము లేనంతవరకూ పురుషుడు ధీరవివేకశీలుడే. చేలాంచలాన అంటిన గడ్డిపరకను నలిపివేసినట్టు, దులిపివేసిన సరస్వతీ జనస్కంధులు ముగ్గురే కృతకృత్యులు" అని పలికినాడు. గోముఖుడు పల్లెత్తుమాట సమాధానము చెప్పలేదు. నరవాహనదత్తుడు గోముఖుణ్ణి ఇలా సమర్థించినాడు" వినోదముగా గోముఖుడు చెప్పింది యుక్తి యుక్తంగా ఉంది. విరహులను ఓదార్చడము హితుల ధర్మము. ఆతర్వాత మన్మథుని చిత్తము" పరిజనులు చెప్పే కథలు విని ఊకొడుతూ నరవాహనుడు రాత్రి పదిగంటలు గడిపినాడు.

మర్నాడు అతడు ఉదయాన లేచి కాలోచితక్రియలు పూర్తిచేసు కొంటూ ఉండగా, ఆకాశమునుండి కాంచనప్రభ భర్తనూ, కుమారుడైన ధర్మశీలునీ, కుమారి అలంకారవతినీ తీసుకొని దిగింది. వాళ్ళందరూ నరవాహనుని గౌరవము పొందినారు. ఈలోగా వేలాది విద్యా

ధనులు గగనమునుండి రత్నసువర్ణరాసులు మోసి తెచ్చినారు. ఆ సంగతి తెలిసి వత్సరాజు కుమారాభ్యుదయము వల్ల ఆనందించి సన్మిత్రులతో భార్యలతో వచ్చినాడు.

వత్సరాజు అలంకారశీలునికి ఆతిథ్యమివ్వగా అతడు వత్సరాజుని పాదాభినందనము చేసి "రాజన్, నాకుమార్తె అలంకారవతి జన్మించినప్పుడే విద్యాధరచక్రవర్తి కాగల నీకుమారునకు భార్య అవుతుందని ఆకాశవాణి చెప్పింది. మా అమ్మాయిని నీకుమారునికి ఇస్తాను. ఈ నాటి ముహూర్తము అనుకూలంగా ఉంది, అందుకే మేమందరము తరలి వచ్చినాము" అన్నాడు. వత్సరాజు అలంకారశీలుని మాటలు అంగీకరించగా విద్యాధరరాజు విద్యవల్ల తన అరచేతిలో పుట్టిన నీళ్ళు ప్రాంగణములో చల్లినాడు. వెంటనే దివ్యవస్త్రాచ్ఛాదితమైన సువర్ణవేదిక, రత్నమయమైన కౌతుకాగారమూ ఉద్భవించినవి. అలంకారశీలుడు వచ్చి జ్యోతిష్కుడైన వత్సేశునితో "లేవండి. లగ్నము సమీపించింది. కుమారుని స్నానము కానీయండి" అని చెప్పగా నరవాహనుడు మంగళస్నానము చేసినాడు. వివాహకంకణము ధరించిన నరవాహనుణ్ణి వివాహమంటపము మీద కూర్చోబెట్టినారు. అలంకారశీలుడు అతనికి సాలంకృత కన్యాదానము చేసినాడు. లాజహోమకాలములో అలంకారశీలుడూ అతని కుమారుడూ వధువుకు మణికనక దివ్యాంబరాలు అర్పించినారు. వివాహానంతరము అలంకారశీలుడు యావన్మందినీ సమ్మానించి భార్యాపుత్రులతో గగనమార్గాన నిజరాజధానికి వెళ్ళినాడు. విద్యాధరనేతయైన కుమారుని అభ్యుదయము చూచి వత్సరాజు చాలాకాలము ఆనందోత్సవము చేయించినాడు. నరవాహనదత్తుడు సద్వృత్త, మనోహారిణి, గుణాలంకారవతిని పొంది, తాదృశవాణిని పొందిన మహాకవివలె సుఖముగా ఉన్నాడు.

## తరంగము : ౯౩

### నరవాహనదత్తుడు సుందరపురానికి ప్రయాణమగుట

నరవాహనదత్తుడు ప్రియురాలితో ఆమె చెలుల నృత్తగీతాలవల్ల ప్రీతిపొందుతూ, అమాత్యులతో పానగోష్ఠి సలుపుతూ ఉన్నాడు. ఒక నాడు అతని అత్త వచ్చి అల్లుని ఆతిథ్యము పొంది "అల్లుడా! మా ఇంటికి రావాలి, సుందరపురము చూడాలి. అక్కడ చక్కని వనాల్లో మాఅమ్మాయీ నీవూ విహారాలు చేయవచ్చును" అని ఆహ్వానించింది. అత్తగారి మాట పాటించి నరవాహనుడు తండ్రితో చెప్పి ఆయన అనుమతి పొంది సచివసమేతుడై కాంచనప్రభా దివ్యప్రభావకల్పిత మయిన విమానరాజ మెక్కి కిన్నరీ సంగీతమువల్ల ప్రతిధ్వనిస్తున్న హిమకందరాలూ శీతాచలసానువులూ దాటి సుందరపురి చేరినాడు. రత్నమయ ప్రాసాదాలవల్ల హిమనగము సుమేరుశిఖరమని భ్రాంతి కలిగించింది. కాంచనప్రభాదేవి అల్లునికి నీరాజన మిచ్చింది. అలంకారవతీ సమేతుడై వసంతకాది సచివసమన్వితుడై సుందరపురి రాజనగరు ప్రవేశించి మామగారి మందిరములో దివ్యభోగాలు అనుభవిస్తున్నాడు.

కాంచనప్రభ అల్లునితో 'ఈనగరములో మహేశ్వరుడు స్వయముగా వెలిసినాడు. ఆపరమశివుడు భక్తుల అభీష్టములు నెరవేరుస్తాడు. మా వారు శివప్రీత్యై దేవాలయము వెనుక రమణీయోద్యానము నిర్మించి, గంగా సరస్సును తీర్థాన్నికూడా తెచ్చినారు. ఈరోజు మీదంపతులు శివపూజ చేసి ఆరామములో విహరించండి'' అని చెప్పింది. నరవాహనుడు ప్రియురాలితో మహేశ్వరోద్యానానికి వెళ్ళినాడు. దంపతులతో కూడా వసంతకాది వయస్య సచివులు వచ్చినారు. ఆరామములో వృక్షప్రకాండములు స్వర్ణవికారములు, శాఖలు రత్నమయములు, మౌక్తికములే ప్రసూనములు, పగడాలే చివుళ్ళు, నరవాహనుడు గంగాసరస్సులో

స్నానము చేసి మహేశ్వరార్చన చేసి, రత్నమయ సోపాన విరాజితమై కాంచన పద్మవిలసిత మైన వాపికలలో జలక్రీడలు హాస్యసకములు సలిపి నాడు. కల్పలతా నికుంజాలలో సానుచరుడై ప్రేయసితో విహారము చేసినాడు. కొంతసేపు వారు పాన గోష్ఠి సంగీతకములతో, మరుభూతి నర్మ పరిహాసములతో కాలము గడిపినారు. నరవాహనుడు మాస కాలము మామగారింటిలో భోగాలు అనుభవిస్తూ వనవాటికలలో క్రీడారసములో మగ్న మైనాడు. అత్తగారు కూతురికీ అల్లునికీ దివ్యాంబ రాలు చదివించి గౌరవించింది. ఈలోగా కాంచనప్రభా కల్పిత దివ్యవిమానము రాగా నరవాహనుడు అలంకారవతితో అమాత్యు లతో కాంచనప్రభతో విమానమెక్కి కౌశాంబీనగరము చేరి జననీ జనకులకు లోచనోత్సవము చేసినాడు. వాసవదత్తా వత్సేశుల సమక్ష ములో కాంచనప్రభ కుమారి అలంకారవతితో "అమ్మాయీ! నీభర్తను ఈర్ష్యా క్రోధములవల్ల దుఃఖపెట్టకు. ఆపాపమువల్ల విరహము కలుగుతుంది. విరహజనితమైన అనుతాపము దుర్భరము. నేను మునుపు నాభర్తను అలాగే కష్టపెట్టినాను. ఆయన వానప్రస్థు డైనాడు. నేను పశ్చాత్తాపమువల్ల వేగిపోతున్నా నమ్మా" అని స్వానుభవ హితోప దేశము చేసింది. కన్ను కొలుకుల కన్నీరు జారగా తల్లి కుమార్తెను కౌగలించుకొని గగనానికి ఎగిరి సుందరనగరము వెళ్లింది.

## హాతశర్మ కథ

నరవాహనదత్తుడు అమాత్యులతో గోష్ఠిలో ఉండగా అలంకారవతి దగ్గిరికి ఒక విలాసిని భయముతో వణుకుతూ వచ్చి 'దేవీ! ఈఅబలను రక్షించాలి! ఆబ్రాహ్మణుడు తరుముతున్నాడు. బాబో, నన్ను చంపు తాడు! శరణు వేడుతున్నాను" అని మొరపెట్టింది. అలంకారవతి సంగతి ఏమిటని ఆమెను అడిగింది. అవిలాసిని స్వవిషయము ఇలా

ఆరంభించింది. "దేవా, నన్ను అశోకమాల అని పిలుస్తారు. ఈనగరవాసి బలసేనుడనే క్షత్రియుని కుమార్తెను. నేను కన్యగా ఉండగా నా అందచందాలకు ముగ్ధుడై హఠశర్మ అనే ధనవంతుడు నాతండ్రిని కోరినాడు. అందుకు నేను చెప్పిన మాట వినక ఆవికృతాకారుణ్ణి పెళ్ళాడననీ కాపురుషుడు వీడనీ నొక్కిచెప్పినాను. నాశపథము విని హఠశర్మ ప్రాయోపవేశ దీక్ష ఆరంభించగా, అతడు చనిపోతాడేమో నని నాతండ్రి భయపడి నన్నతనికి ముడిపెట్టినాడు. అతడు మూడుముళ్ళు వేసి బలవంతాన నన్ను తన ఇంటికి తీసుకొని వెళ్ళినాడు. నేను అతనితో కాపురము చెయ్యలేక క్షత్రియ కుమారుణ్ణి చేపట్టినాను. హఠశర్మ అతని మీద అభియోగము తెచ్చి సొమ్ము ఖర్చుచేసి ఆ క్షత్రియుణ్ణి పరాభవింపగా నేను వేరొకణ్ణి ఆశ్రయించినాను. ఒకరాత్రి హఠశర్మ అతని ఇంటికి నిప్పుపెట్టినాడు. అతడు నన్ను విడిచిపెట్టేసరికి మూడవ క్షత్రియుణ్ణి చేరినాను. అతని కొంపకూడా శర్మ కాల్చివేయగా క్షత్రియుడు నన్ను విడిచిపెట్టినాడు.

నేను పారిపోయి మీనౌకరు వీరశర్మఅండ చేరినాను. వీరశర్మ బలశాలి కావడంవల్ల హఠశర్మ చేసేదిలేక వియోగమువల్ల శుష్కించి పోయినప్పటికీ పిలుదొరికితే నన్ను హతమార్చవలె నని ఒక కంట కనిపెట్టే ఉన్నాడు. వీరశర్మ హఠశర్మను కారాగారములో వేదా మని సంకల్పిస్తే నేను నివారించినాను. దైవవశాన నేను బైటికి రాగా హఠశర్మ కనిపెట్టి వెంటనే కత్తి దూసి నన్ను తరుముకొని వచ్చినాడు. ప్రతిహారి స్త్రీహృదయ కనుక నాకు దారి ఇచ్చింది. మీఅండ చేరాను. హఠశర్మ ప్రాకారముదగ్గిర కనిపెట్టుకొని ఉన్నాడు." వెంటనే నరవాహనదత్తుడు హఠశర్మను పిలిపించినాడు. ఆవికారాకారుడు కోపముతో మండిపడి అశోకమాలకేసి చూచి ఖడ్గహస్తుడై వణుకుతూ వచ్చి నిలబడినాడు. నరవాహనుడు "బ్రాహ్మణుడా స్త్రీహత్యచేస్తావా? దీని

కోసము తక్కినవాళ్ళ కొంపలు కాలుస్తావా? పాపము ఎందుకు ఒడి కట్టావు?" అని ప్రశ్నించగా అతడు "ఇది నాధర్మపత్ని. నన్ను విడిచి లేచిపోయింది. నేనెలా ఈర్ష్యావేశము సహిస్తాను?" అన్నాడు. అశోక మాల వడవడ వణుకుతూ "దిక్పాలులారా! చెప్పండి యథార్థము. నా కిష్టము లేకుండా బలాత్కారముగా రాక్షసంగా పెళ్ళాడి ఇంటికి తీసుకొని పోయినాడు. అతనింట్లో ఉండ లే నని అప్పుడే నేను మొర పెట్టలేదా?" అని గగ్గోలు పెట్టింది.

అప్పుడు ఆకాశవాణి ఇలా అన్నది: "అశోకమాల నిజము చెప్పింది. ఆమె మానవస్త్రీ కాదు. అశోకవరు డనే విద్యాధర రాజు కూతురు అశోకవరుడు కుమారికి వివాహవయస్సు రాగా సంబంధాలు వెతికినాడు. అశోకమాల అందగత్తె కావడంవల్ల వరులు ఎవరూ నచ్చక రూపాభిమానమువల్ల ఎవరినీ పెళ్ళాడలేదు. తండ్రి విసుగుతో ఇలా శాప మిచ్చినాడు: "ఈపేరుతోనే మానవస్త్రీగా జన్మించు. వికారరూపు డయిన విప్రుడు నిన్ను వివాహము బలవంత ముగా చేసుకొంటాడు. నీవు కట్టుకొన్నవాణ్ణి విడిచి లేచిపోయి ముగ్గుర్ని వరసగా ఆశ్రయిస్తావు. అయినప్పటికీ విప్రుడు నిన్ను బాధిస్తాడు. నీవు రాజభవనములో రాజపుత్రుని దాసిగా ఆశ్రయిస్తావు. అయినా సరే ఆబ్రాహ్మణుడు నిన్ను ఒకకంట కనిపెట్టి వధించవలె నని నీ వెంట పడతాడు. నీవు రాజభవనము ప్రవేశి స్తే నీశాపము తొలిగిపోతుంది. తండ్రి శపించిన విద్యాధరి ఈఅశోకమాల. ఈమె శాపము పోయింది. కనుక ఈశరీరము విడిచి విద్యాధరి అవుతుంది. తరువాత ఈమె అభి రుచితుడు అనే విద్యాధరరాజును వరించి వివాహము చేసుకొని పూర్వ శాపము స్మరిస్తుంది." అశరీరవాణి పలికిన తరువాత అశోకమాల ప్రాణాలు పోయి నేలకూలింది. దాన్ని చూచి అలంకారవతీ నర వాహనదత్తులు సపరివారంగా కంట తడిపెట్టినారు. వాతశర్మ దుఃఖో

ద్రేకములో కోపము విడిచి రాగాంధుడై విలపించినాడు. హఠాత్తుగా ఎందుకో హర్షమువల్ల అతనిముఖము వికసించింది. ఇదేమిటని అందరూ కుతూహలముతో అడిగినారు. శర్మ స్వవిషయము ఆరంభించినాడు: "నాకు పూర్వజన్మజ్ఞానము కలిగింది. హిమసానువులపైన మదనపుర మును ప్రలంబభుజు డనే విద్యాధరేశ్వరుడు పరిపాలిస్తున్నాడు. అతని పుత్రుడు స్థూలభుజుడు వయస్సులో ఉండగా సురభివత్స నామక విద్యాధరేశ్వరుడు తనంతట తాను కుమార్తెను తీసుకొని వచ్చి "రాజన్! ఈకన్య నాకుమారి, సురభిదత్త. ఈమెను స్థూలభుజునకు ఇచ్చినాను. నీకుమారుడు నాకుమారుని వివాహమాడ వేడుతున్నాను" అని ప్రలంబునితో పలికినాడు. స్థూలభుజుడు చక్కనివాడు కావడమువల్ల గర్వముచేత "తండ్రీ, నా కీ కన్యవద్దు. ఈమె మధ్యమరూప" అని సంబంధము అక్కర్లే దని చెప్పినాడు. తండ్రి "రూపమే ప్రధానము కాదు. ఈమె వంశము గొప్పది. ఈమె గుణవతి. తప్పక వివాహము చేసుకో" అని చెప్పగా కుమారుడు కుపితుడైనాడు. ప్రలంబుడు పుత్రుని శపించినాడు. "రూపాహంకారమువల్ల నీవు మర్త్యలోకంలో వికృతాననుడవై ఘోరరూపుడవై జన్మించు. అశోకమాలను రాక్షసంగా వివాహము చేసుకొంటావు. ఆమె నిన్ను విడిచి అన్యులను ఆశ్రయించగా వియోగము భరించలేక అన్యుల గృహములు భస్మము చేస్తావు." అప్పుడు ప్రలంబుని పాదాలమీద సురభిదత్త మోకరిల్లి కన్నీరు కారుస్తూ "నాకూ శాప మివ్వండి. మా ఉభయులకూ సమానగతి కావాలి. నా అపరాధమువల్ల నాభర్తకే కష్టము కలిగితే సహించ లేను" అని ప్రార్థించగా రాజు ఆమెను ఓదార్చి తనకుమారునికి శాప మోక్షము అనుగ్రహించినాడు: "అశోకమాల శాపముక్త అయి నప్పుడు ఇతడు పూర్వజన్మజ్ఞానముపొంది శాపవిముక్తుడై త్వరలో నిన్ను వివాహము చేసుకొని సుఖపడుతాడు" ఆసాధ్వి విచారము

ఉపశమించింది. నేనే శాపముక్తుడనైన స్థూలభుజుణ్ణి. అహంకారమువల్ల ఇంతఅవస్థ పట్టింది. అహంకారులకు శ్రేయస్సు లేదు. నాకు శాపము ఇప్పుడు పోయింది." హరశర్మ ఇలా పలికి వెంటనే విద్యాధరుడై విద్యాశక్తివల్ల అశోకమాల శరీరాన్ని కరుణించి అదృశ్యముగా గంగలో వదిలినాడు. గంగాజలము తెచ్చి క్షణంలో అలంకారవతీ మందిరము శుభ్రముచేసి కాబోయే విద్యాధర ప్రభువైన నరవాహన దత్తునికి ప్రణమల్లి గగనమార్గాన కార్యసిద్ధికై వెళ్ళినాడు. గోముఖుడు ప్రాసంగికముగా ఒక కథ ఆరంభించినాడు.

## అ న ం గ ర తి వృ త్తా ం త ము

శూరపురనగర రాజేంద్రుడయిన మహావరాహునికి భవానీ ప్రసాదమువల్ల భార్య పద్మరతీదేవియందు అనంగరతి అనే అందగత్తె జన్మించింది. ఆపిల్ల క్రమేణా ఎదిగినకొద్దీ చక్కదనము ఎక్కువైనది. రూపాహంకారమువల్ల ఎన్నిసంబంధాలు వచ్చినా ఆమెకు నచ్చలేదు. శూరుడై విద్వాంసుడైనవాడయితే పెళ్ళి చేసుకొంటా నని తండ్రికి స్పష్టంగా చెప్పింది. అనంగరతి కోరిన కోరికకు అనుకూలముగా నలుగురు వీరులు దక్షిణదేశమునుంచి వచ్చి ద్వారపాలకులద్వారా ఆస్థానములో తెలియచేసి రాజసన్నిధికి వచ్చినారు. కుమార్తె యెదుట మహావరాహుడు వారి నామధేయాలు కులగోత్రములూ చదువు సంధ్యలూ అడిగినాడు. వాళ్లల్లో ఒకడు "దేవా! నేను జాతివల్ల శూద్రుణ్ణి. నన్ను పంచపట్టికు డని పిలుస్తారు. రోజుకు అయిదు ధోవతుల చాపులు నేస్తాను. ఒకటి బ్రాహ్మణునికి దానము చేస్తాను. రెండో చాపు పరమేశ్వరునికి అర్పించి మూడోది నేను కట్టుకొంటాను. నాలుగవది భార్య ఉంటే ఇస్తాను. అయిదవది అమ్ముకుని జీవించగలను" అని సమాధాన మిచ్చినాడు.

రెండోవాడు "వైశ్యుణ్ణి నేను. నన్ను భాషాజ్ఞు డంటారు. సర్వ మృగముల భాషలనూ ఎరుగుదును" అని పలికినాడు. మూడోవాడు తాను క్షత్రియవీరుడ ననీ, పేరు ఖడ్గధరు డనీ, ఖడ్గయుద్ధములో తనకు సాటి ఎవరూ ఉండ రనీ సమాధాన మిచ్చినాడు. నాలుగోవాడు జీవదత్త నామక బ్రాహ్మణుడు. చనిపోయినస్త్రీని భవానీ ప్రసాదాన నిజ శక్తివల్ల బతికిస్తా నన్నాడు. ఇలా వాళ్ళు తమ శక్తులు చెప్పుకొన్నారు. రాజు దౌవారికునితో "వెంటనే వీరిని తీసుకొని వెళ్లి నీ ఇంట్లో మకాము ఏర్పాటుచెయ్యి" అని ఆజ్ఞ చేసినాడు. దౌవారికుడు రాజాజ్ఞ ప్రకారము వాళ్ళను కూడా తీసుకొని ఇంటికి వెళ్ళినాడు.

మహారాజు కుమార్తెతో "అమ్మాయీ, నలుగురు వీరులలో ఎవరు నీకు ఇష్టుడు?" అని అడిగినాడు. అనంగరతి తండ్రికి ఇలా సమాధాన మిచ్చింది. నలుగురిలో ఒక్కడూ నా కిష్టుడు కాడు. ఒకడు శూద్రుడు నేతగాడు. వాడెందుకు నాకు? రెండోవాడు వైశ్యుడు. అతనికి పశు పక్ష్యాదుల భాషలు వస్తే ఏమి ప్రయోజనము? నేను క్షత్రియ కన్యనై అతనిని ఎలా వివాహ మాడను? మూడోవాడు సవర్ణుడు గుణవంతుడు అయినా అతడు సేవాజీవి. రాజకన్యనై అతన్ని ఎలా పెళ్ళాడను? నాలుగోవాడు జీవదత్త నామక విప్రుడు, నాకు తగనివాడు. వైదికధర్మము గంగలో కలిపి, కర్మలు అనుష్ఠించనివాడు, కురూపి భ్రష్టుడూ, నాకెందుకు? వాణ్ణి అన్నివిధాలా దండించడము యుక్తము. వర్ణాశ్రమధర్మాలు రక్షించేవాడవు కదా? ఖడ్గశూరుడైన రాజుకంటె ధర్మశూరుడు శ్రేష్ఠుడు. వేలమంది ఖడ్గశూరులకు ధర్మశూరుడు పతి అవుతాడు." రాజు కర్తవ్యము తోచక కుమార్తెను అంతఃపురములోకి పంపి స్నానార్థము లేచినాడు.

మరునాడు ఆవీరులు దౌవారికుని ఇల్లు విడిచి కుతూహలముతో ఊరంతా తిరుగుతున్నారు. అప్పుడు పద్మకవల మనే మదగజము కట్లు

కంబము విడిచి శాలనుండి బైట పడి జనాన్ని తొక్కుతూ వీరులను చూచి చంపవలె నని తరుమ సాగింది. వాళ్లు ఆయుధాలెత్తి ఏనుగు మీదికి పరుగెత్తినారు. వాళ్ళలో క్షత్రియు డయిన ఖడ్గధరుడు తక్కినవారిని నివారించి తా నొక్కడే ఏనుగు మీదికి లంఘించి దాని తొండమును ఒక్క వేటుతో తామరతూడువలె నరికి, దాని పాదమధ్యము నుండి బైటపడి, లాఘవము ప్రదర్శించి వెనకవైపు రెండో దెబ్బ కొట్టినాడు. మూడో వేటుతో ఏనుగ రెండుకాళ్ళనూ నరికినాడు. అప్పుడా హస్తి ఘీంకారముచేస్తూ నేల కూలి ప్రాణము విడిచింది. అతని విక్రమము చూచి అందరూ ఆశ్చర్యపడినారు. మహారాజుగారూ సంగతి విని విస్మితు డైనాడు.

మరునాడు రాజు గజారూఢుడై ఖడ్గధరుడు మొదలయిన వీరులతో వేటకు వెళ్ళినాడు. అక్కడ రాజు సైనికులూ వ్యాఘ్రవరాహాది వన్యమృగాలను వేటాడుతూ ఉండగా, సింహములు గజఘీంకారాలు విని కోపముతో గుహాలు విడిచి వాళ్ళమీదికి వచ్చినవి. పైపడుతున్న సింహమును ఖడ్గధరుడు కత్తివేటుతో రెండుతునకలుగా నరికినాడు. అతడు ఎడమచేతితో మరోసింహపాదము పట్టుకొని గిరగిర తిప్పి నేల వేసి కొట్టినాడు. ఆ రెండో సింహము చచ్చిపోయింది. భాషాజ్ఞ జీవదత్త పంచపట్టికులు ఒక్కొక్కరూ ఒక్కొక్క సింహాన్ని చంపినారు. రాజు చూస్తూ ఉండగానే ఆవీరులు పాదచారులై అవలీలగా ఆ సింహవ్యాఘ్రాదులను తెగటార్చినారు. రాజు విస్మితుడై సస్మితుడై వేట చాలించి రాజధానికి వచ్చినాడు. ఆవీరులు దౌవారికుని గేహమునకు వెళ్ళినారు.

మహారాజు శుద్ధాంతము ప్రవేశించి మృగయాఖేలనవల్ల అలసినా వెంటనే అనంగరతిని రప్పించి వేటలో వీరులు చూపిన పరాక్రమము అభివర్ణించి చెప్పగా ఆరాజకన్య ఆశ్చర్యపడినది. రాజు కుమారితో "అమ్మాయీ, పంచపట్టిక భాషాజ్ఞలు అసవర్ణు లయితే, జీవదత్త

విప్రుడు రూప ధర్మ కర్మహీను డయినప్పుడు, క్షత్రియుడైన ఖడ్గధరునిలో ఏదోషము లేదే? అతడు పరాక్రమశాలి, రూపవంతుడు. పైగా మదగజాన్ని చంపి, సింహాలను నేలపెట్టి రాచినాడు. దరిద్రుడు సేవకుడూ అనే దోషము నీవు ఆపాదిస్తే నేను అతన్ని దొరనుచేసి అన్యులు అతని సేవచేసే విధము చూస్తాను. కుమారీ, నీకు అభిమత మయితే అతన్ని వరించు" అని హితము చెప్పినాడు. అనంగరతి "అలా అయితే వీరు లందరినీ పిలిపించి వారి జన్మ నక్షత్రాలు అడిగి తెలుసుకోవాలి. జ్యోతిష్కుణ్ణి పిలిపించి అడిగితే అతనేమి అంటాడో చూదాము" అని సమాధాన మిచ్చింది. వీరులందరూ రాగా జ్యోతిష్కుడు కూడా వచ్చి వారి నక్షత్రాలు అడిగి తెలుసుకొని, అనంగరతికి అనుకూలుడు ఎవడో చాలాసేపు గణించినాడు. గణకుడు రాజుతో "దేవా, మీకు కోపము రాదంటే మనవి. అమ్మాయికి అనుకూలమైన వరుడు ఒకడూ లేడు. ఈమెకు వివాహయోగము లేదు. ఈమె విద్యాధరి శాపవశాన మానుషిగా జన్మించింది. ఆశాపము మాసత్రయము దాకా ఉంటుంది. అంతవరకూ ఈవీరులు కనిపెట్టుకొని ఉండనీయుండి. మూడుమాసాలు గడిచిన తరువాత ఈమె విద్యాధరలోకము వెళ్ళకపోతే ఆపైన వివాహము కావచ్చును" అనగా అక్కడివా రందరూ నమ్మినారు.

ఆవీరులు మూడుమాసాల పాటు ఆనగరములోనే ఉంటున్నారు. మహారాజు వీరులను, గణకుని, అనంగరతిని పిలిపించినాడు. అనంగరతి అధికలావణ్యముతో మెరిసిపోతూ ఉండగా తండ్రి ఆమెను చూచి సంతోషించినాడు. జ్యోతిష్కుడు మీనమేషాలు లెక్కపెట్టి ఆమెకు కాలము సమీపించిం దని భావించినాడు. తండ్రి కుమార్తెతో, "మూడు మాసాలూ గడువు దాటింది గదా! ఏమిటి కర్తవ్యము? చెప్పమ్మా" అని అడిగినాడు. అప్పు డాకన్య ముఖాన పైటకొంగు మునుగుపెట్టి మానుష దేహము వదిలివేసింది. మహారాజు దద్దరిల్లి

ముసుగు తొలిగించి చూచి, కుమారి చనిపోయిందని గ్రహించినాడు. ఆమె కన్నులు సోలి, ముఖారవిందము కళ తప్పి, హిమహత పద్మినివలె ఉన్నది. ఆదుఃఖావేగము అశనిపాతమువలె అతన్ని బాధించగా రెక్కలూడిన కొండవలె చేష్ట లుడిగి నేలవాలి మూర్ఛపోయినాడు. రాణి పద్మరతీదేవి అలిసి, భూషణములు అనే సుమములు రాలగా ఏనుగు తెంపిన పువ్వులగుత్తి వలె నేల కూలింది. పరివారజనము హాహోరుమని రోదించింది. వీరులు శోకమగ్నులైనారు. మహారాజుకు కొంత సేపటికి తెలివి రాగా జీవదత్తుడనే వీరుణ్ణి పిలిచి, 'ఇతరులకు ఎవ్వరికి లేనిశక్తి నీకు కల దన్నావు. చనిపోయిన నాకుమారిని బతికించు. నీవు అలా ప్రతిజ్ఞకూడా చేశావుగదా? నీకు అంతశక్తి ఉన్నట్లయితే మాఅమ్మాయి బతుకుతుంది. దాన్ని నీవు వివాహము చేసుకోవచ్చును'' అని పలికినాడు.

జీవదత్తుడు మంత్రించిన నీళ్ళు చల్లి చాముండేశ్వరిని ప్రార్థించినాడు. జీవదత్తుడు చేసిన ప్రయత్నము విఫలమైనది. అతడు విషణ్ణుడై "వింధ్యవాసినీ వరప్రసాదమువల్ల లభించిన విద్య నిష్ఫలమై, హాస్యాస్పదమైనప్పుడు నాబతుకు నిరర్థకము'' అని కత్తిదూసి తన శిరము ఖండించుకోదలచినప్పుడు అశరీరవాణి ఇలా పలికింది: 'జీవదత్తా! సాహసము వద్దు. ఈచనిపోయిన అనంగరతి అనంగప్రభ నామక విద్యాధరి. జననీ జనకుల శాపము చేత ఇంతకాలమూ మర్త్యాంగనగా ఉండి శాపమోచనమువల్ల తిరిగి విద్యాధరీ దేహము పొందింది. నీవు తిరిగి వింధ్యవాసినీ దేవిని పూజించు. ఆదేవి ప్రసాదముచేత అనంగప్రభను పొందగలవు. ఆమె భోగాలు అనుభవిస్తూ విద్యాధరలోకములో ఉన్నది. మహారాజుగాని నీవుగాని ఆమెకోసము బెంగపెట్టుకోవద్దు'' మహారాజు కుమార్తెకు ఉత్తరక్రియలు జరిపి చింత మానినాడు. రాణి పద్మరతీదేవి ఊరడిల్లింది.

తక్కిన ముగ్గురు వీరులూ వచ్చిన దారినే వెళ్ళిపోయినారు. జీవదత్తుడు శ్రద్ధాభక్తులతో వింధ్యేశ్వరీదేవిని ఉపాసించినాడు. ఆదేవి

అతనికి స్వప్నములో సాక్షాత్కరించి ఇలా అనుగ్రహించింది. 'కుమారా! నీతపస్సుకు మెచ్చినాను. నేను చెప్పేది విను. ప్రాలేయాచల సానువులమీద వీరపురాన్ని సమరు డనే విద్యాధరేశ్వరుడు పరిపాలిస్తున్నాడు. అతనికి రాణీ అనంగవతీదేవియందు అనంగప్రభ అనే సార్థకనామధేయ కుమార్తె జన్మించింది. అనంగప్రభ రూపాహంకారమువల్ల ఎవరినీ పతిగా అంగీకరించలేదు. కుమార్తె పట్టు చూచి తల్లిదండ్రులు కోపగించి శపించారు. "నీవు మర్త్యలోకములో జన్మించి పతివల్ల సుఖము పొందక పదహారేళ్ళు కన్యాత్వములోనే ఉండి శరీరము త్యజించి ఇక్కడికి వస్తావు. అప్పుడు నీకు రూపములేని మర్త్యుడు ఖడ్గసిద్ధుడు భర్త అవుతాడు. అతడు మునికన్యను కామించిన దోషమువల్ల మానవుడైనాడు. నీకు ఇష్టమున్నా లేకపోయినా అతడు నిన్ను మానవలోకము తీసుకొని వెళ్ళుతాడు. నిన్ను మరొకడు తీసుకొనిపోవడమువల్ల నీకు పతివియోగము తప్పదు. పూర్వజన్మలో అతడు పదకొండుమంది పరదారలను హరించినవాడు. ఆకారణముచేత వాడు అష్టజన్మముల దుఃఖము ఒక్కజన్మలోనే అనుభవిస్తాడు. ఎనిమిది జన్మల సంసారతాపము నీవుకూడా ఒక్కజన్మలోనే అనుభవిస్తావు. మానవస్త్రీగా ఉంటావు. పాపాత్ముల సంపర్కము పాపఫలాన్ని ఇవ్వకుండా ఉంటుందా? నీకు పూర్వస్మృతి ఉండదు. చాలామంది మానవులను వివాహమాడుతావు. అనేకమందిని నీవు రూపగర్వమువల్ల నిరాకరించావు. కనుక నీకు బాధ తప్పదు. నిన్ను కోరిన విద్యాధరుడు మదనప్రభుడు మానవుడై మహారాజై అంతములో నీకు పతి అవుతాడు. అప్పుడు నీశాపము తీరిపోగా నీవు ఈలోకానికివచ్చి తిరిగి విద్యాధరుడుగాగల మదనప్రభుని పతిగా పొందుతావు."

ఆ శాపవశాన ఆకన్య అనంగరతిగా భూలోకములో జన్మించింది. ఇప్పుడు తల్లిదండ్రుల దగ్గర అనంగప్రభ అనే పేరుతో ఉన్నది. నీవు

వీరపురికి వెళ్ళి తత్పురాధీశ్వరుణ్ణి గెలిచి అనంగప్రభను చేపట్టు. ఈఖడ్గాన్ని పుచ్చుకో. ఖడ్గసిద్ధివల్ల ఆకాశగమనము అవలీలగా చేస్తావు. నీకు అజేయత్వము సిద్ధిస్తుంది.'' ఇలా వింధ్యవాసినీదేవి అతన్ని అనుగ్రహించి అంతర్ధానమైనది.

జీవదత్తుడు మేలుకొని చేతిలో దివ్యఖడ్గము చూచి లేచి సంతోషముతో దేవికి ప్రణామము చేసినాడు. దేవీప్రసాదామృతమువల్ల అతనిశ్రమ శమించగా చేత కత్తిపట్టి గగనానికి ఎగిరి హిమాచలసానువు పైన ఉన్న వీరపురము చేరినాడు. చేరినవెంటనే జీవదత్తుడు తత్పురాధీశ్వరుడైన సమరుని పోరికి రమ్మని పిలిచి అతనిని గెలిచి, అనంగప్రభను వివాహమాడి ఇహలోక సుఖాలు అనుభవిస్తూ కొంతకాలము అత్తవారింట్లో ఉన్నాడు. ఒకనాడు జీవదత్తుడు అత్తమామలతో "నేనూ అనంగప్రభా మర్త్యలోకానికి వెళ్ళుతాము. ప్రాణికోటికి జన్మభూమి ప్రియతమము'' అనేసరికి మామ అంగీకరించినాడు. అనంగప్రభకూడా మానవలోకానికి వెళ్లేటందుకు అంగీకరించింది. జీవదత్తుడు ప్రియురాలిని అంకసీమలో కూర్చోబెట్టుకొని గగనపథాన మర్త్యలోకాన అవతరించినాడు. అక్కడ రమణీయ పర్వతము చూచి అనంగప్రభ మార్గఖేదము అపనయించుకో దలచింది. సరేనని ప్రియుడు అంగీకరించినాడు. పర్వతప్రదేశములో విద్యాధరీ విద్యాప్రభావమువల్ల ఆహారపానీయములు ఉద్భవించినవి. ఇద్దరూ మద్యసహితముగా భోజనము చేసినారు. కొంతసేపటికి జీవదత్తుడు భార్యను ఏదైనా చక్కని గీతము పాడమని కోరగా అనంగప్రభ శివస్తుతి గానము చేసింది. ఆమాధుర్యమువల్ల అతడు సొమ్మసిలి నిద్ర పోయినాడు.

ఈలోగా హరివరుడనే రాజు వేటలో అలిసి రథమువిడిచి ఒంటరిగా నడుస్తున్నప్పుడు విద్యాధరీ మధురసంగీతము ఆకర్షించగా ఆమెదగ్గిరికి వచ్చినాడు. అతనికి ముందు అన్నీ శుభశకునాలే! ఆరాజు అనంగ

ప్రభ అనంగునిప్రభ వలె చూచి ఆశ్చర్య పడ్డాడు. మన్మథుడు పుంఖానుపుంఖముగా శరపరంపరలు వేయుగా అతని హృదయము గాయపడింది. ఆవిద్యాధరి అందగాణ్ణి చూచి కామవికార వశవర్తిని కాగా "ఎవ రితను? పూలబాణములు వదిలి వచ్చిన మన్మథుడా? గీతాసంతుష్టుడైన పరమేశ్వరుని ప్రసాదము మూర్తీభవించిందా?" అనుకొని అతనిని "నీ వెవరు? ఈ వనానికి ఎందుకు వచ్చావు?" అని కుతూహలముతో అడిగింది. అతడు మనసులో కోరిక పదిలపరుచుకో లేక "నీ వెవరు? ఈ పరున్నవా డెవడు?" అని అడిగినాడు. ఆమె సంగ్రహముగా "నేను విద్యాధరిని. ఇతడు దేవ్యానుగ్రహమువల్ల దివ్య ఖడ్గము పొందినవాడు. నాభర్త. దర్శనమాత్రమువల్ల నీమీద వలపు కలిగింది. నాభర్త లేవకముందే త్వరగా నీరాజధానికి వెళ్ళి అన్నివిష యాలూ మాటాడుకొందాము" అన్నది. మహారాజు పరమానంద ముతో ఆమె కోరిక అంగీకరించి త్రైలోక్యరాజ్యప్రాప్తికన్న అధిక సంతుష్టి అనుభవించినాడు. అనంగప్రభ మనసులో 'ఈరాజును నా అంకసీమలో కూర్చోబెట్టుకొని ఆకాశాన ఎగురుతాను" అని తలచింది. భర్తకు ద్రోహము చేయసంకల్పించిన కారణమువల్ల విద్యాధరి శక్తులు వెంటనే ఉడిగిపోయినవి. జననీజనకు లిచ్చిన శాపము స్మరించి విచారిం చింది. ఆమె విచారకారణము రాజు అడిగి "ఇది విచారించే సమయము కాదు. నీభర్త నిద్రలేస్తాడు. ప్రియా! దైవదత్తకార్యము. ఎందుకు దుఃఖము? తలనీడను విధివిలాసమును ఎవడు తప్పించుకోగలడు? రా, వెళ్ళిపోదాము" అని హెచ్చరించి ఆమెను ఒప్పించి అంకముపైన ఆసీనను చేసి దరిద్రునికి నిధానము దొరికినతీరుగా సంతుష్టుడై రథములో కూర్చుండి వేగముగా నిజరాజధాని చేరి లోకలోచనోత్సవము చేసి నాడు. హరివరాధిపుడు అనంగప్రభతో అనంగలీలలు అనుభవిస్తూ ఉన్నాడు. ఆవిద్యాధరి శాపముచేత నిజశక్తి కోలుపోయి అతనిమీద

అనురాగముతో అక్కడే ఉన్నది.

ఈలోగా పర్వతప్రదేశములో జీవదత్తుడు మేలుకొని చూడగా ప్రియురాలుగాని కత్తిగాని కనపడలేదు. "అనంగప్రభ దివ్యఖడ్గము హరించి ఎక్కడికైనా వెళ్ళిపోయిందా? ఆమెనే ఎవరయినా హరించారా?" అని తెల్లపోయి మూడునాళ్ళు విరహముతో వేగి పర్వత సానువుమీద పరిభ్రమించినాడు. పర్వతము దిగి పదిరోజులు అరణ్యములో వెతికి వెతికి వేసారి ప్రేయసి అడుగు జాడయినా అగపడక 'అయ్యో' పాపిష్టి దైవమా! ఖడ్గాన్ని ప్రసాదించి అనంగప్రభను హరించావే!" అని తపించి కర్తవ్యముతోచక ఒక గ్రామములో సంపన్న బ్రాహ్మణ గృహము చేరినాడు. ఆగృహిణి జీవదత్తునికి ఉచితాసనమిచ్చి కూర్చోబెట్టి చేటికలతో 'జీవదత్తుని కాళ్ళు కడగండి. పాపము విరహమువల్ల ఇతడు తిండితినకుండా పదమూడురోజు లైంది" అన్నది. అతడు ఆశ్చర్యపడి 'ఏమిటి' ఇక్కడికి అనంగప్రభ వచ్చిందా? కాక ఈఇల్లాలు యోగిని అవుతుందా?' అని ఆలోచిస్తూ పాదప్రక్షాళనానంతరము భోజనము చేసి ఆగృహిణికి పాదాభివందనము చేసి ఆర్తితో "నాసంగతి నీకు ఎలా తెలిసిందమ్మా? నాప్రియురాలు ఎక్కడికి పోయింది? నాదివ్యఖడ్గము ఏమైంది తల్లీ!" అని అడిగినాడు.

ప్రియదత్త అనే ఆపతివ్రత పలికింది: 'కలలో కూడా భర్తకన్న అన్యుని తలచను. పురుషులను పుత్రభ్రాతృసమానులుగా చూస్తాను. అతిథిపూజ చేయకుండా ఉండను. అందుచేత త్రికాలజ్ఞానము నాకు కలిగింది. నీవు పర్వతదేశాన నిద్రపోగా నీప్రేయసీ సంగీతమాధుర్యమువల్ల హరివరుడనే రాజు వచ్చి ఆమెను తీసుకొని వెళ్ళినాడు. ఆమె నీకు లభ్యము కాదు. ఆకులట అతన్నికూడా విడిచి అన్యుణ్ణి చేపట్టుతుంది. అనంగప్రభను సాధించే నిమిత్తము దేవి నీకు దివ్యఖడ్గము ప్రసాదించింది. అన్యుడామెను అపహరించినాడు. కనుక ఖడ్గము దేవీసన్నిధికే

పోయింది. వింధ్యవాసినీదేవి స్వప్నములో నీకు సాక్షాత్కరించి అనంగ ప్రభా శాపవిషయము చెప్పే సమయములో నీకు సంభవించే సంగతి కూడా చెప్పింది. నీ వది మరచిపోయినావా? భవితవ్యము గురించి ఎందు కీ వ్యామోహం. దుఃఖకారణమైన పాపబంధము పరిత్యజించుము. అన్నా! ఆకులట అన్యసంగినియై మానవస్త్రీగా మారింది. నీకు ద్రోహము చేయవలె నని సంకల్పించింది. అందువల్ల ఆమె శక్తులన్నీ పోయినవి. అటువంటి దౌర్భాగ్యురాలు నీ కెందుకు?

జీవదత్తుని వ్యామోహము తొలిగిపోయింది. అతడామెతో "సాధ్వీ మణీ! నీ హితోపదేశముచేత నాఅజ్ఞానము తొలిగిపోయింది. పుణ్యాత్ముల సమాగమము ఎవరికి శ్రేయోదాయకము కాదు? పూర్వకర్మ వశాన నా కీ సంసారదుఃఖము ప్రాప్తమైంది. ఆకల్మషము క్షాళనచేసు కొనేందుకు దీర్ఘాటన చేయాలి. అనంగప్రభ నిమిత్తము అన్యులతో నాకు వైరము వృధా. క్రోధము జయించినవాడు లోకవిజేత"

ఆగృహయజమాని వచ్చి జీవదత్తునికి ఆప్యాయముగా ఆతిథ్యమిచ్చి దుఃఖోపశమనము చేసినాడు. అతడు కొంతసేపు విశ్రాంతి తీసుకొని సెలవు తీసుకొని తీర్థక్షేత్రాలకు ప్రయాణమైనాడు. భూమండలములో తీర్థాలన్నీ చూచి అతడు అనేక అరణ్యాలలో తిరిగి కష్టాలపాలై కంద మూలాదులు తిని, వింధ్యవాసినీదేవి సన్నిధి చేరి నిరశనవ్రతము చేసి కుశాస్తరాసీనుడై తీవ్రతపము చేసినాడు. అంబికాదేవి అత్యంతము తృప్తురాలై ఇలా పలికింది: "కుమారా! మీరు నలుగురూ ప్రమథులు నీ అసలుపేరు వికటవదనుడు. నీసోదరులు పంచమూల, చతుర్వక్ర, మహోదరముఖులు. ఒకనాడు మీరందరూ గంగా సైకత ప్రదేశానికి విహారార్థము వెళ్ళినారు. కపిలజట మహాముని కుమారి చాపలేఖ గంగలో స్నానము చేస్తున్నప్పుడు మీఅన్నదమ్ములు ఆమెను చూచి వ్యామోహముతో ప్రార్థించినారు. ఆమె 'నేను కన్యను వెళ్ళిపోండి'

అని నిరాకరించగా నీసోదరులు ముగ్గురు ఊరుకొన్నారు. నీవు మాత్రము చావలేకను బలాత్కరించినావు. 'బాబో నన్ను కాపాడు' అంటూ ఆకన్య గగ్గోలు పెట్టగా సమీపములో ఉన్న మునీంద్రుడు వస్తే ఆమెను వదిలి పెట్టినావు. ఆఋషీశ్వరుడు మీసోదరులందరినీ మానవ జన్మము ఎత్తమని శపించినాడు. వారు శాపాంతము ప్రార్థించగా మునీం ద్రుడు "మీరు అనంగప్రభ అనే రాజకన్యను కోరగా ఆమె విద్యాధర లోకానికి వెళ్ళినప్పుడు మీశాపమోక్షము అవుతుంది. ఓప్రమథా! ఆవిద్యాధరీ వియోగ దుఃఖమువల్ల నీవు దేవిని ఆరాధించి శాపముక్తు డవు అవుతావు. నీవు మునికన్యా కరస్పర్శ చేసినావు, కనుక పరదారాభి హార పాప పంకిలము అధికముగా ఉంటుంది." అని అనుగ్రహించినాడు. నాకింకరులైన మీరు మునీశ్వర శాపవశాన దక్షిణాపథాన మహా శూరులై జన్మించినారు. నీస్నేహితు లయినారు. పంచపట్టిక భాషాజ్ఞ ఖడ్గధరులు. నీవు జీవదత్తుడ వైనావు. అనంగరతి విద్యాధరలోకానికి వెంచేయగా ఆముగ్గురూ నాఅనుగ్రహమువల్ల శాపముక్తులై వచ్చినారు. నన్ను నీవు పూజించడముచేత నీశాపము తీరిపోయింది. ఆగ్నేయ ధారణను నేర్చి శరీరత్యాగము చెయ్యి. అష్టజన్మలలో అనుభవించ వలసిన పాపము ఒక్కసారే దగ్ధము చెయ్యి. అంతట దేవి ఆగ్నేయ ధారణ జీవదత్తునికి నేర్పి అంతర్ధాన మైనది. అతడు మర్త్యదేహము దగ్ధము చేసి ప్రమథు డైనాడు. దేవతలుకూడా పారదారికా పాప ఫలము అనుభవించవలసినప్పుడు సామాన్యమానవుల విషయము వేరే చెప్పవలసిన దేముంది!

హరివర మహారాజు శుద్ధాంతములో అనంగప్రభ ప్రాధాన్యము పొందినది. రాజు రాజ్యభారము మంత్రులమీద ఉంచి అహో రాత్రాలు ఆ కాంతతో రమిస్తున్నాడు. ఒకనాడు రాజసన్నిధికి మధ్యదేశమునుంచి లబ్ధవరు డనే నాట్యాచార్యుడు వచ్చినాడు.

మహారాజు అతని నాట్యనైపుణి చూచి సమ్మానించి అంతఃపుర ములో నాట్యము నేర్పమని నియోగించినాడు. లబ్ధవరుడు అనంగ ప్రభకు నాట్యవేదము చక్కగా నేర్పినాడు. ఆమె నృత్యవైఖరి చూచి సవతులు కూడా ఆమెయందు అనురక్తలైనారు. సహవాసము చేతనూ, నృత్య శృంగారసముచేతనూ అనంగప్రభ నాట్యాచార్యుని వల చింది. ఆమె చక్కదనమూ నాట్యమూ చూచి ఆచార్యుడు అను రక్తుడైనాడు. అతడు శిష్యురాలికి నాట్యము నేర్పుతూ ఉండగా మన్మథుడు అతని మనసులో నర్తించినాడు. ఒకనాడు నర్తనశాలలో ఏకాంతముగా అనంగప్రభ తనంతటతాను ఆచార్యుని మీద వాలింది. గురుశిష్యులు ప్రియులై కాముక వ్యాపారము సాగించినారు. అనంగ ప్రభ అలసి సొలసి అనురాగముతో అతనితో "నీవులేక క్షణము నిలువలేను. రాజేంద్రుడు మనప్రణయం గ్రహిస్తే క్షమించడు. ఆయనకు తెలియనిచోటికి వెళ్ళిపోదాము. నీకు మహారాజు ప్రసాదించిన హేమ మయ ఉష్ట్రాదికము లున్నవి. నాకు వంటినిండా ఇంటినిండా కావలసి నంత బంగారము ఉంది. వెంటనే రహస్యముగా వెళ్ళిపోదాము" అన్నది. నాట్యాచార్యుడు అంగీకరించినాడు.

అనంగప్రభ పురుషవేషము ధరించి తన అంతరంగిక సఖిని వెంట తీసుకొని నాట్యాచార్యుని గృహానికి వెళ్ళింది. వెంటనే అతడు ధన మంతా లొట్టిపిట్టలమీద ఎక్కించి బయలుదేరినాడు. ఆమె అశ్వ మెక్కి ప్రయాణము చేసింది. ఆమె ప్రథమములో విద్యాధరలక్ష్మిని విడిచి రాజశ్రీని ఆశ్రయించింది. ప్రస్తుతము ఆమె చారణ లక్ష్మిని కోరింది. ఇద్దరూ వియోగపురము చేరి సుఖముగా ఉంటున్నారు.

అనంగప్రభ నాట్యాచార్యునితో వెళ్ళిపోయిందని దుఃఖించి హరి వరుడు చనిపోవాలని యత్నించినాడు. మంత్రి సుమంత్రుడు అతనిని ఓదార్చి ఇలా పలికినాడు: 'దేవా, మీకు తెలియనిసంగతి ఏముంది?

పతి అయిన ఖడ్గసిద్ధుని వదిలి నిన్ను చూచి వలచి వెంటవచ్చినదానికి నిలకడ ఎలాఉంటుంది? రత్నశలాకను వదిలి తృణాన్ని వరించి ఆచార్యునితో లేచిపోయింది. సంధ్యవలె ఆవిలాసిని క్షణరాగిణి."

రాజు విచారించి 'ఇతడు నాకు హితము చెప్పినాడు. ప్రతిక్షణమూ మారిపోయే జగత్తువలె ఈవిలాసిని అనిత్యసంబంధ. పడినవాణ్ణిముంచుతూ ఉత్కలికలు చూపే అగాధనదుల్లో, అలాంటి అంగనలవలపులో ప్రాజ్ఞుడు ఎవడూ పడడు' అని తలచి రాణీవాసముతో సంతృప్తి పడుతున్నాడు.

అనంగప్రభ వియోగపురములో నాట్యాచార్యునితో కొన్నాళ్లు కాపురము చేసింది. అతనికి దైవవశాన సుదర్శనుడనే పడుచుజూదగాడు మిత్రుడైనాడు. అనంగప్రభ సమక్షములో జూదగాడు నాట్యాచార్యుని ద్యూతములో ఓడించి బైరాగిని చేసినాడు. ఆరోషమువల్ల అనంగప్రభ ఆచార్యునికి హస్తోదక మిచ్చి సుదర్శనునితో లేచిపోయింది. నాట్యాచార్యుడు కర్తవ్యము లేక విరక్తితో జడలు పెంచి గంగాతీరాన తపస్సుకు వెళ్లినాడు.

అనంగప్రభ సుదర్శనునితో ఉండగా ఒకరాత్రి దొంగలుపడి ఇల్లు గుల్ల చేసినారు. లేమికి విచారిస్తున్న అనంగప్రభతో దైవోపహతుడైన సుదర్శనుడు "ప్రేయసీ, హిరణ్యగుప్తుడనే ధనవంతుడు నామిత్రుడు ఉన్నాడు. అతని దగ్గిర సొమ్ము అప్పు తెచ్చుకొందాము" అని ఆమెను వెంట పెట్టుకొని షావుకారుదగ్గిరికి వెళ్ళి ఋణము అడిగినాడు. వర్తకుడూ అనంగప్రభా ఒకరి నొకరు చూచుకొని సాభిలాషులు అయినారు. హిరణ్యగుప్తుడు ఆప్యాయముగా "రేపు మీకు బంగారము ఇస్తాను. ఈరోజు మీరు మాయింట్లో భోజనము చేయాలి" అన్నాడు. సుదర్శనుడు అనంగప్రభ పరాయత్తచిత్తగా ఉండడము కనిపెట్టి "నాకు శరీరములో స్వస్థత లేదు. ఏమీ తినలేను" అని సాకు చెప్పినాడు. హిరణ్యగుప్తుడు 'అలా అయితే పోనీ, మీతరఫున మీభార్య మా

ఇంట్లో భోజనము చేయనీయండి. ఇదే తొలిసారి గదా మాయింటి గుమ్మము తొక్కడం!' అంటూ బలవంతము చేసినాడు. సుదర్శనుడు ఏమీ అనలేదు. వైశ్యుడు ఆమెను గృహాభ్యంతరములోకి తీసుకొని వెళ్ళి పానాహారాదులు జరిపినాడు. ఆమె లోపలినుండి బైటికి వస్తుందని కనిపెట్టుకొని, వర్తకుని సేవకులవల్ల సుదర్శనుడు హెచ్చరిక పొందినాడు: "మీభార్య భోజనానంతరము ఇంటికి వెళ్ళినారు పోతూ ఉంటే మీరు చూడనైనా లేదే. ఇంకా ఇక్కడే ఉన్నారేమి? వెళ్ళండి."

సుదర్శనుడు "నాభార్య లోపలే ఉంది. నేను పోను" అనగా అతన్ని సేవకులు తన్ని తరిమివేసినారు. సుదర్శనుడు ఏడుస్తూ 'అయ్యో వైశ్యుడు నామిత్రుడై ఇంతపని చేస్తాడా? నేను చేసిన పాపానికి ఇదే ఫలము! కర్మానుభవము తప్పదు. మళ్లీ నాకిలాంటి పరాభవము జరగకుండా పునరావృత్తిరహిత మైన బ్రహ్మానుభవము పొందాలి' అని ఆలోచన చేసి కోపము మాని బదరికాశ్రమానికి వెళ్ళినాడు.

అనంగప్రభ స్వరద్రూపి అయిన వైశ్యునితో పుష్పమునుండి పుష్పమునకు వచ్చిన తుమ్మెదవలె క్రీడిస్తున్నది. అతని ధనప్రాణాలకు ఆమె స్వామిని అయింది. అపుర రాజేంద్రుడైన వీరబాహుడు ఆసుందరీ సౌందర్యము వినికూడా ధర్మబద్ధుడై హరించలేదు. వైశ్యుడు ఉన్నదంతా వ్యయము చేసి దరిద్రుడైనాడు. హిరణ్యగుప్తుడు వ్యాపారము నిమిత్తము మూలధనముతో సువర్ణభూమి అనే ద్వీపానికి ప్రయాణమైనాడు. ప్రియావిరహానికి తాళలేక అనంగప్రభను వెంట బెట్టుకొని సాగరపురముదాకా తీసుకొని వెళ్ళినాడు. అక్కడ సాగరవీరు డనే బెస్తవాడు వైశ్యునితో కలిసినాడు. బెస్తవాడు శ్రేష్ఠికి నావ తెప్పించగా ప్రియాసహితుడై ఓడ ఎక్కినాడు. ప్రయాణము కొన్నాళ్లు పట్టింది.

ఒకనాడు కాలమేఘము మెరుపుకన్నులతో భయంకరముగా వచ్చి [illegible] ధారలతో వర్షించింది. జనమంతా గగ్గోలు పెట్టి

నారు. హిరణ్యగుప్తుని మనోరథమువలె ఓడ భంగమవుతున్నది. అప్పుడతడు నడుము కట్టి అనంగప్రభా వదనము కనబడక పోవడముచేత 'ప్రేయసీ, ఎక్కడున్నావు!' అంటూ సముద్రములో దుమికినాడు. అతడు కొంతదూరము సముద్రములో ఈదుతూ వెళ్ళి దైవవశాన ఎదురైన వర్తకునావను ఎక్కినాడు. సాగరవీరుడు పగిలిన పడవముక్కలను తాళ్ళతో కట్టి తెప్ప చేసి అనంగప్రభను ఎక్కించుకొని తానుకూడా ఎక్కి ఆమె భీతి పోగొడుతూ చేతులతో నీళ్లుతోస్తూ తెప్ప పోనిస్తున్నాడు. క్షణములో తెప్ప విరిగి ముక్కలైనది. మేఘములు పోయిన తరువాత సముద్రము కోపము తీరి శాంతించింది. దైవాత్తు అనుకూల వాయువువల్ల హిరణ్యగుప్తుడు అయిదురోజులు ప్రయాణించి రేవు చేరినాడు. ప్రియావియోగదుఃఖమువల్ల విధివిలాస ప్రతీకారము చేయలేక తన నగరముచేరి ధైర్యముగా ఉంటూ వర్తకము ప్రారంభించి సొమ్ము చేస్తున్నాడు.

అనంగప్రభ పడవపలకమీద కూర్చుని ఒకరోజు ప్రయాణము చేసి దరి చేరింది. సాగరవీరు డామెను తన ఇంటకి తీసుకొనివెళ్ళినాడు. ప్రాణదానము చేసిన ఆయువకుణ్ణి అనంగప్రభ వలచి భర్తగా చేసుకొన్నది. ఒకనాడు మేడమీదనుండి ఆమె వీధిలోపోతున్న విజయవర్మ అనే క్షత్రియుణ్ణి చూచింది. గబగబ ఆమె మేడ దిగి వచ్చి ఆ అందగాడితో 'నిన్ను వలచి వచ్చినాను. నన్ను స్వీకరించవా!' అని కోరింది. అతడు ఆమెకోరిక మన్నించి తన ఇంటికి తీసుకొనివెళ్ళినాడు. అనంగప్రభ ఎక్కడికో వెళ్ళిపోయిందని సాగరవీరుడు బాధపడి కుమిలి పోయి శరీరత్యాగము చేయడానికి గంగాతీరానికి వెళ్ళినాడు.

అనంగప్రభ విజయవర్మతో ఇహసుఖములు అనుభవిస్తున్నది. ఆనగర రాజేంద్రు డయిన సాగరవర్మ పురమును పరిశీలించవలెనని సంచారము చేస్తూ ఉండగా, రాజదర్శనార్థము అనంగప్రభ తహతహలాడి మేడ

మీదికి ఎక్కింది. రాజును చూచినవెంటనే వలపు ఆమె తల కెక్కింది. ఆమె మావటివానితో 'మావటీ! మావటీ! నేను ఎన్నడూ ఏనుగు ఎక్క లేదు. నన్నొక్కసారి ఎక్కించవూ? ఎలావుంటుందో" అన్నది. మావటి రాజాననము వీక్షించినాడు. రాజు చకోరమువలె అనంగప్రభా ముఖ జ్యోత్స్నను చూచి వ్యామోహములో పడినాడు. అతడామావటితో "మావటీ! ఏనుగును దగ్గరికి తోలి ఆసుందరిని ఎక్కించు" అని ఆనతిచ్చి నాడు. ఆధోరణుడు గజమును మేడదరికి రానిచ్చినాడు. వెంటనే అనంగప్రభ రాజు ఒడిలో చేరింది. పితృశాపవశాన ఆమె కర్మగతి ఎవరు తప్పిస్తారు? ఏనుగు మీదనుండి జారి పడతానని భయమువల్ల కాబోలు అనంగప్రభ రాజు కంఠాన్ని ఆలింగనము చేసుకొన్నది. సుందరీ కోమలగాత్ర లతికా సంస్పర్శవల్ల రాజహృదయము స్నిగ్ధమై పులకలతో విరిసింది. యుక్తిగా అనంగప్రభ తనను మహారాజుకు అర్పించుకొని అతన్ని ముద్దు పెట్టుకొనగా రాజామెను రాణిని చేసినాడు. క్షత్రియకుమారు డైన విజయవర్మ భార్యకై వచ్చి రాజసేవకులతో హోరాహోరిగా పోరి చనిపోయినాడు.

అనంగప్రభ దేవరియై భోగాలు అనుభవిస్తూ క్రమేణా గర్భవతియై పండువంటి కుమారుని కన్నది. తండ్రి కుమారునికి సముద్రవర్మ అని పేరు పెట్టి పుత్రోత్సవము చక్కగా జరిపించినాడు. ఆకుమారుడు చక్కగా ఎదిగి యువకుడై వీరుడై యౌవరాజ్య పట్టాభిషేకము చేసు కొన్నాడు. తండ్రి కుమారునికీ, కమలవతి అనే కన్యకూ వివాహము చేయించినాడు. అనంతరము తనరాజ్యభారము కుమారుని పైన ఉంచి నాడు. సముద్రవర్మ క్షాత్రధర్మమును గ్రహించి తండ్రికి ప్రమాణముచేసి "తండ్రీ నేను దిగ్విజయార్థము వెళ్ళతలచినాను. సెలవు కోరుతున్నాను. జయశీలుడే భూపతి కనుక దిగ్విజయయాత్ర చేస్తాను" అని విన్నవించినాడు.

సాగరవర్మ "కుమారా! నీకు రాజ్యము కొత్త. రాజ్యాన్ని స్థిరము

చేసుకోవాలి. ప్రజారంజన పరాయణు డయిన ప్రభువుకు అపుణ్యము అపకీర్తి అంటూ ఉండవు. స్వశక్తి తెలుసుకోకుండా దిగ్విజయము పనికి రాదు. నీవు వీరుడ వైనా, మహాసేన ఉన్నా, నమ్మరాదు. రణములో జయలక్ష్మికి చాపల్యము ఎక్కువ" అని హితము చెప్పినాడు.

తండ్రిని బలవంతాన అంగీకరింపజేసి సముద్రవర్మ దిగ్విజయార్థము బయలుదేరి క్రమముగా అన్నిదిక్కులూ గెలిచి రాజులను గెలిచి గజాశ్వములతో హేమరత్నరాసులతో రాజధానికి వచ్చి, రత్నరాశితో తల్లిదండ్రుల పాదపూజ చేసినాడు. పెద్దవారికి ఆజ్ఞాప్రకారము విప్రులకు గజాశ్వ సువర్ణ మహాదానములు చేసినాడు. నిరుపేదలకు అర్థులకు సేవకులకూ బంగారము వర్షించి, దరిద్ర శబ్దాన్ని అర్థహీనము చేసినాడు. మహారాజు, దేవేరి కుమారుని అభ్యుదయము చూచి తాము కృతకృత్యు లైనట్లు భావించినారు. రాజు కుమారునితో 'నాయనా' నేను ఈ జన్మలో చేయవలసినది అంతా చేశాను. రాజ్యభోగాలు అనుభవించాను. పరాజయమే ఎరుగను. నీ సామ్రాజ్యప్రాప్తివల్ల సంతోషించాను. నాకు ఏమి కావాలి ఇంతకన్న ? దేహము ఉన్నంత వరకూ తీర్థయాత్రాటనము చేస్తాను. ఈ శరీరముమీాద నీకు ఇంకా మమకారమా! అని అంటున్న దానివలె ముదిమి నా చెవిమూాల చేరింది." అనిపలికినాడు. కుమారుడు విచారించినప్పటికీ సాగరవర్మ అనంగప్రభతో ప్రయాగక్షేత్రానికి వెళ్ళినారు. తండ్రిని సాగనంపి కుమారుడు రాజ్య మేలుతున్నాడు.

సాగరవర్మ అనంగప్రభతో ప్రయాగలో తపస్సు చేసి వృషభధ్వజుని సంతోషపెట్టినాడు. అతనికి స్వప్నములో శివుడు సాక్షాత్కరించి "కుమారా, నీ తపస్సుకు మెచ్చినాను. నీవూ ఈ అనంగప్రభా విద్యాధరులు. రేపే మీాశాపము తీరిపోతుంది. విద్యాధరలోకానికి వెళ్ళుతారు" అని అనుగ్రహించినాడు. అనంగప్రభకూ అలాగే కలవచ్చి,

చప్పున మేలుకొన్నది. ఒకరి కొకరు తమ కలలను గురించి చెప్పుకొని మురిసినారు. ఆమె రాజుతో, "ఆర్యపుత్రా, ఇప్పటికి పూర్వజన్మ జ్ఞానము కలిగింది. నేను వీరపురములో సమర నామక విద్యాధరుని కుమార్తెను. అప్పుడూ నన్ను అనంగప్రభ అని పిలిచేవారు. పితృశాపము వల్ల ఇక్కడికి నేను వచ్చి విద్యలన్నీ మరిచిపోయినాను. ఇప్పుడు మేలుకొన్నాను. మానవస్త్రీనై నన్ను నేనే మరిచినాను." అంటూ ఉండగా గగనమునుంచి ఆమె తండ్రి సమరుడు అవతరించినాడు. సాగరవర్మ మామగారికి నమస్కారము చేసినాడు. అనంగప్రభ పితృచరణాల దగ్గిర మోకరిల్లింది. తండ్రి కుమార్తెతో 'అమ్మాయీ, రా అమ్మా! నీ విద్యలు స్వీకరించు. నీ శాపము తీరిపోయింది. అష్టజన్మల దుఃఖము ఒకే జన్మలో అనుభవించా వమ్మా' అంటూ ఆమెను ఒడిలో కూర్చొపెట్టుకొని విద్యాదానము చేసినాడు. సాగరవర్మతో అన్నాడు: "నీవు విద్యాధర నృపతివి, మదనప్రభుడవు. నేను సమరుణ్ణి. ఈ అమ్మాయి నాకుమార్తె. పూర్వము మా అమ్మాయిని చాలామంది వరించారు, యాచించినారు. రూపగర్వమువల్ల మా అమ్మాయి ఎవరినీ పెళ్ళిచేసుకోక భీష్మించుకొన్నది. నీవు ఉత్సుకుడవై యాచించినావు. విధివశాన నిన్నుకూడా అంగీకరించలేదు. అప్పుడు విసుగుతో నేను కుమారిని మానవస్త్రీగా జన్మించమనీ, మానవలోకానికి వెళ్ళమనీ శాపము పెట్టినాను. అనురాగమువల్ల నీవు మా అమ్మాయినే కోరి శివధ్యానముచేసి విద్యాధర దేహము త్యజించి మానవుడవై పుట్టినావు. రండి, మీ భార్యాభర్తలు మీలోకానికి."

సాగరవర్మ పూర్వజన్మ స్మరించి వెంటనే తన శరీరాన్ని ప్రయాగ తీర్థములో త్యజించి మదనప్రభు డైనాడు. అనంగప్రభ తిరిగి విద్యలు పొంది ఆశరీరముతో చక్కని విద్యాధరిగా మారింది. అన్యోన్యరూపానురక్తులై ఆప్రియులూ సమరుడూ గగనానికి ఎగిరి వీరపురము చేరు

కొన్నారు. వెంటనే సమరుడు కుమార్తెను మదనప్రభునకు వివాహము చేయించినాడు. మదనప్రభుడు శాపవిముక్తుడై శ్రీ జానకితో నిజరాజధాని చేరి సుఖముగా ఉన్నాడు.

ఈరీతిగా దివ్యులు తప్పుత్రోవలో నడిచి శాపవశాన మానవులై జన్మించి తత్కర్మానుభవము పూర్తి అయిన తరువాత పూర్వసుకృత పరిపాకమువల్ల నిజలోకము చేరుతారు.

ఇలా నరవాహనదత్తుడు గోముఖునివల్ల అలంకారవతీ సమేతముగా కథ విని సంతోషించి దైనికచర్యకై లేచినాడు.

## తరంగము : ౯౩

మర్నాడు అలంకారవతీదేవితో ఉన్న నరవాహనదత్తునితో మిత్రుడు మరుభూతి ఇలా మనవి చేసినాడు: "దేవా! నీ హజారముదగ్గిర ఒక కార్పటికుడు చర్మఖండము కట్టుకొని అహోరాత్రాలు చలిలో ఎండలో ధూళిధూసరుడై కృశించి కనిపెట్టుకొని ఉన్నాడు. అకాలములో ఎక్కువ ఇవ్వడంకన్న అవసరము వచ్చినప్పుడు కొంచెమిచ్చినా అది పదివేలు. వీడు చనిపోకముందే కనికరించు."

అది విని గోముఖుడు ఇలా పలికినాడు: "మరుభూతి చెప్పింది బాగానే ఉంది కాని రాజన్, ఈవిషయములో నీదోషము రవంతయినా లేదు. పాపముతీరే సమయమువస్తే దాత కనికరిస్తాడు. కర్మానుభవముతప్పదు."

## పాపము తీరని కార్పటికుని కథ

పూర్వము లక్షపురాన్ని లక్షదత్తుడనే మహారాజు పరిపాలిస్తూ ఉండేవాడు. అతడు అర్థులకి లక్షరూపాయలకు తక్కువ ఇచ్చి ఎరుగడు. అందుకే అతనికి లక్షదత్తుడనే పేరు వచ్చింది. అతని సింహద్వారాన లబ్ధదత్తుడనే కార్పటికుడు తోలుగోచి మాత్రము పెట్టుకొని ఎండలో

వానలో తడిసి కదలక నిలిచినాడు. అతడు ఎంతకాలము సింహద్వారము దగ్గిర వేచిఉన్నా మహారాజు దయార్ద్రహృదయుడైనా ఏమీ ఇవ్వలేదు.

ఒకనాడు రాజు వేటకు వెళ్ళుతుంటే కూడా కార్పటికుడు దుడ్డు కర్ర చేత పుచ్చుకొని అనుసరించినాడు. అరణ్యములో రాజు సేనా సమేతుడై చేరి వాహన మెక్కి విల్లు ఎక్కు పెట్టి శరప్రయోగము చేసి శార్దూల వరాహ మృగాదులను సంహరిస్తున్నాడు. రాజ సమక్షములో కార్పటికుడు శార్దూల వరాహ హరిణములను దుడ్డుకర్రతో కొట్టి చంపసాగినాడు. రాజు అతని శౌర్యమునకు ఆశ్చర్యపడి సంతోషించాడే కాని అతని కేమీ ఇవ్వలేదు. వేట చాలించి రాజు నగరు చేరినాడు. కార్పటికుడు యథాప్రకారము సింహద్వారముదగ్గిర నిలువబడినాడు. ఒకసారి లక్షదత్తుకూ దాయాదులకూ యుద్ధము సంభవించింది. ఆయుద్ధములో రాజసమక్షములో కార్పటికుడు చంద్ర కర్రతో శత్రువులను వధించినాడు. యుద్ధవిజయానంతరము రాజు రాజధానికి వచ్చినాడు. రాజు కార్పటికుని బాహుపరాక్రమము చూచి అతనికి ఏమీ ఇవ్వలేదు. ఇలా అయిదేళ్ళు గడిచినవి. కార్పటికుడు దుడ్డుకర్రతో జీవిస్తున్నాడు.

ఆరోసంవత్సరము వచ్చింది. రాజుకు కార్పటికునిమీద కనికరము కలిగింది. "వీడు ఎంతకాలమునుంచి కష్టపడినా ఏమీ వీడికి ఇవ్వలేదు. యుక్తిగా ఇప్పుడు ఏదయినా ఇస్తాను. ఈదరిద్రుని పాపము తీరి పోయిందో లేదో ఇప్పటికైనా శ్రీదేవికటాక్షము ఉన్నదో లేదో చూస్తాను" అని మహారాజే స్వయముగా ధనాగారము ప్రవేశించి మాతులుంగఫలాన్ని బరిణెవలె చేసి అందులో రత్నాలు నింపినాడు. వెంటనే రాజసభ తీర్చినాడు. పౌరసామంతాదులు సభను అలంకరించినారు. సదస్యులతోపాటు కార్పటికుడుకూడా రాజసభలో ప్రవేశించగా మహారాజు అతనిని రమ్మని ఆదరముగా పిలిచినాడు. అందు కతడు

సంతోషించి రాజసన్నిధిలో సమక్షమున ఆసీనుడైనాడు. రాజు అతనిని ఏదయినా సుభాషితము పాడమని ఆజ్ఞ ఇచ్చినాడు.

కార్పటికుడు ఆర్యాగీతము పాడినాడు

పూరయతి పూర్ణ మేషా
తరఙ్గిణీసంహతి స్సముద్ర మివ
లక్ష్మీ స్స రధనస్య పునః
లోచనమార్గేఽపి నాయాతి.

పూర్ణుడై యుండెడి పురుషుని నింపు
సాగరమ్మును నదీసందోహ మట్లు
కాని దరిద్రుని కనుచూపుత్రోవ
జేరనే చేరదు శ్రీమహాలక్ష్మి.

ఆగీతము విని మహారాజు మళ్ళీ పాడించి సంతోషించి రత్నాల భరిణెను అతని కిచ్చినాడు. రాజసభలోవారు అనుకొన్నారు 'ఈరాజేంద్రుడు ఎవరినైనా చూచి సంతోషిస్తే అతని దారిద్ర్యము పోతుంది. పాపము ఈకార్పటికి అదృష్టహీనుడు. రాజు సంతోషించికూడా కేవల మాతులుంగఫలాన్ని ఈదరిద్రునికి ఇచ్చినాడు. అదృష్టహీనులకు కల్ప వృక్షము మోదుగ అవుతుంది.'' సభలోవారు కార్పటికుని చూచి జాలిపడ్డారు. అత డా ఫలము స్వీకరించి వెళ్లిపోయినాడు. రాజవంది అనే ఒకభిక్షువు వచ్చి కార్పటికునికి శాలువా ఇచ్చి మాతులుంగఫలము స్వీకరించి రాజదర్శనము చేసి ఆఫలము మహారాజుకు అర్పించినాడు. రాజు అది చూచి గుర్తించి "భదంతా, ఈఫలము నీ కెక్కడిది!'' అని శ్రమణుని అడిగినాడు. శ్రమణుడు కార్పటికుడు ఇచ్చినాడని సమాధాన మిచ్చినాడు. రాజు 'అయ్యో! వాని పాపము ఇంకా తీరిపోలేదే!' అని విచారించి ఆఫలము స్వీకరించి సభ చాలించి దినాంతకృత్యములు జరిపి

నాడు. కార్పటికుడు వాటిని అమ్మి ఆకలి తీర్చుకొని యథాప్రకారము సింహద్వారము దగ్గిర కనిపెట్టుకొన్నాడు.

మర్నాడు మహారాజు యథాప్రకారము సభ చేసినాడు. పుర వాసులు అందరూ ఓలగానికి వచ్చినారు. కార్పటికుడు రాగానే రాజు అతన్ని పిలిచి కూర్చోమని పూర్వము పాడిన గీతాన్ని మళ్ళీ పాడ మని ఆజ్ఞ చేసినాడు. అతడు గొంతెత్తి పాడగా రాజు కనికరించి రత్నములతో నిండిన మాతులుంగ ఫలాన్నే అతనికి కానుక ఇచ్చి నాడు. సభాసదులు 'ఆహా! ప్రభువు ఇతనిని రెండోసారి అనుగ్రహిం చినా వృథా అయింది. ఏమిటిది!'' అని తెల్లపోయినారు. కార్పటికుడు రాజదత్తమైన ఫలము స్వీకరించి వ్యాకులుడై సభ విడిచి వెళ్ళినాడు. అప్పుడే ఒకడు రాజదర్శనార్థము వచ్చి, శుభశకునముకోసము ఎదురు చూస్తూ కార్పటికుని చేతిలో ఫలము చూచి రెండువస్త్రా లిచ్చి దాన్ని పుచ్చుకొని రాజసభ ప్రవేశించి మహారాజుకు వందనము చేసి, మాతు లుంగ ఫలము మరొక కానుకనూ రాజుకు అర్పించినాడు. 'ఈపండు నీకెక్కడిది?' అని రాజు ప్రశ్నించగా 'కార్పటికుడు నాకు ఇచ్చినాడు.' అని పరదేశి ప్రత్యుత్తర మిచ్చినాడు. రాజు 'ఇప్పటికీ లక్ష్మీ కటా క్షము వాడిమీాద పడలేదే!' అని విచారించి పండు చేత్తోపట్టుకొని సభ చాలించి లేచినాడు. కార్పటికుడు రెండువస్త్రాలలో ఒకటి అంగడిలో అమ్మి ఆకలి దప్పికలు తీర్చుకొని రెండోబట్ట చింపి ముక్కలు చేసి తాను ధరించినాడు.

మూడోనాటి సభలో మహారాజు కార్పటికుణ్ణి అదివరకు పాడిన పాటనే పాడమన్నారు. రాజు అతన్ని కనికరించి యథాప్రకారంగా ఆ మాతులుంగఫలాన్నే ఇచ్చినాడు. అందరూ ఆశ్చర్య పడినారు. కార్పటికుడు నగరు వెలువడి ఆ ఫలమును రాజు విలాసినికి ఇచ్చినాడు. ఆ కామిని అతనికి బంగారము ఇవ్వగా దాన్ని అమ్మివేసి కార్పటికుడు

ఆరోజు సుఖంగా ఉన్నాడు. విలాసిని రాజదర్శనము చేసి ఆ ఫలము అర్పించింది. ఆ ఫలము ఎలా వచ్చిం దని రాజు అడిగేసరికి ఆమె చెప్పింది. రాజు 'అయ్యో, ఈకార్పటికుణ్ణి లక్ష్మి కటాక్షించలేదే! ఫలములో ఉన్న మహారత్నములు నాదగ్గరికే వస్తున్నవి' అని విచారించి ఆహ్నికవిధి నెరవేర్చడానికి లేచినాడు.

నాలుగోనాటి సభలో సామంతసచివాదులు అందరూ ఉండగా రాజు కార్పటికుని తనదగ్గిర కూర్చోపెట్టికొని ఆసూక్తినే పాడించి అమాత్యులుంగ ఫలాన్నే ఇచ్చినాడు. ఆపండు అతనిచేతిలోనుండి జారి పడి రెండుడిప్ప లైనది. అమూల్యరత్నాలు దివ్యకాంతులు విరజిమ్మి నవి. సభ్యులు '(ప్రభుకటాక్షము ఇలా ఉండగా యథార్థము ఎరగక మూడుదినములు పరిపరి విధాల భ్రమపడ్డాము'' అన్నారు. రాజు ఆమాట విని "ఇతన్ని లక్ష్మీదేవి కటాక్షిస్తుందో లేదో అని ఈయుక్తి అవలంబించి పరీక్షించాను. ఈమూడురోజులూ ఇతని పాపము పండింది కాదు. ఇప్పుడు క్షయమైంది. అందుచేతనే లక్ష్మి దర్శన మిచ్చింది.'' అని పలికినాడు. రాజు కార్పటికునికి రత్నములు గ్రామములు గజాశ్వములు సువర్ణమూ ఇచ్చి సామంతుని చేసినాడు. అందరూ మహారాజును స్తవము చేసినారు. ఆనాటికి సభచాలించగా రాజుదగ్గిర సెలవు పుచ్చు కొని కార్పటికుడు తన బసకు వెళ్లినాడు.

ఈకథ చెప్పి గోముఖుడు నరవాహనదత్తునితో "దేవా! నీదగ్గిరికి వచ్చిన కార్పటికుని పాపముక్షయము కాలేదు, కర్మక్షయము కాలేదు. కనుక అతన్ని నీవు అనుగ్రహించలేదు'' అన్నాడు. నరవాహనుడు కార్పటికునికి వెంటనే అగ్రహారాలు గజాశ్వములు సువర్ణరాసులు ఇచ్చి నాడు. ఈప్రకారంగా కార్పటికుడు రాజతుల్యు డైనాడు. ప్రభువు కృతజ్ఞుడై కూడా ఉండేవాళ్లు సజ్జనులయితే సేవ నిష్ఫలము అవుతుందా?

## ప్రలంబబాహుని కథ

ఇలా నరవాహనదత్తుడు కాలము గడుపుతూ ఉండగా ఒకనాడు దాక్షిణాత్యుడైన ప్రలంబబాహువు అనే బ్రాహ్మణ వీరయువకుడు రాజసేవకై వచ్చి మనవి చేసుకొన్నాడు: 'దేవా! నీయశస్సు విని నీపాద పద్మాలు ఆశ్రయించినాను. గజాశ్వరథములతో నీవు వెళుతూ ఉంటే నిన్ను అనుసరిస్తాను. గగనమార్గాన నీవు వెళ్ళితే నేను రాలేను. నీవు విద్యాధరేంద్రుడవు అవుతా వని ప్రసిద్ధి కనుక ఇలా విన్నవించినాను. నాకు రోజుకు సువర్ణశతము జీతము ఇప్పించాలి." ఆ విప్రవీరుని తన కొలువులో రాజు ఏర్పాటు చేసుకొన్నాడు.

ఆసమయములో గోముఖుడు ఈకథ ఆరంభించినాడు:

## వీరవరుని కథ

విక్రమతుంగ మహారాజు విక్రమపురాన్ని పరిపాలిస్తున్నాడు. అతడు నీతికోవిదుడు, సంతతధర్మాసక్తి కలవాడు. ఒకనాడు అతని దగ్గిరికి అందగాడైన మాళవదేశీయ శూరుడు వీరవరు డనే విప్రుడు రాజసేవార్థము వచ్చినాడు. అతని భార్య ధర్మవతి; కుమారి వీరవతి; కుమారుడు సత్త్వవరుడు. ఇదే అతని బలగము. సేవార్థము అతనికి పరికరాలు మొలకత్తి, కరతిల, డాలు, అద్దము ఉన్నవి. ఈపరికరాలతో వచ్చి అతడు రాజును వేడి రోజుకు ఏడువందల దీనారములు భత్యము అడిగినాడు. రాజు అతనిశక్తి గ్రహించతలచి 'ఇతని విశేషము చూడాలి' అని అలాగే జీతము ఇస్తూ నౌకర్లతో 'ఇతడు ఈదీనారములు ఏమి చేస్తాడో కనిపెట్టండి' అని చెప్పినాడు. వీరవరుడు నూరు దీనారములు భార్యచేతుల్లో పోసి భోజనార్థము ఖర్చుచేయమన్నాడు. నూరు దీనారములు వెచ్చించి వస్త్రమాల్యములు కొన్నాడు. దీనారశతము హరిహర పూజార్థము ఖర్చుచేస్తున్నాడు. మిగతా రెండువందల దీనార

ములు విప్రులకు దానధర్మాలకై సరిపోయేవి. ఇలా దినదినము అయిదు వందల దీనారములు ఇంటిఖర్చు చేస్తున్నాడు. మధ్యాహ్నము దాకా అతడు రాజద్వారము దగ్గిర నిలిచి, ఆహ్నికము పూర్తిచేసుకొని వచ్చి మళ్ళీ అక్కడే రాత్రి గడుపుతాడు. ఆ విప్రవీరుని దినచర్య చారులు కనిపెడుతూ రాజుకు తెలియజేస్తూ ఉన్నారు. ఆ వీరవరుడు స్నానపానాది సమయాలలో తప్ప తక్కిన అహోరాత్రాలు రాజద్వారము దగ్గిరే సాయుధుడై ఉంటున్నాడు.

వీరవరుని ప్రతాపము సహించలేక కాబోలు మేఘము గర్జిస్తూ వర్షించింది. వీరవరుడు స్తంభమువలె సింహద్వారముదగ్గిర కదలకుండా ఉన్నాడు. ద్వారముదగ్గిర వీరవరుడు ఏమిచేస్తున్నాడో అని కుతూహలముతో రాజు మేడమీదనుంచి చూచినాడు. 'ఎవరా సింహద్వారము దగ్గిర?' అని రాజు కేక వేయగా 'స్వామీ, నేనిక్కడే ఉన్నాను' అని వీరవరుడు ప్రత్యుత్తరము ఇచ్చినాడు. వర్షము కురుస్తున్నా తడిసిముద్దయినా కదల మెదలకుండా ఉన్నాడు. మరోసేవకుడు వానలో కూడా ఇలా నిలుస్తాడా? అని రాజు తలచినప్పుడు హఠాత్తుగా స్త్రీరోదనము వినబడింది. 'నా రాజ్యములో బాధితులు లేరే. ఎవరీమె? ఎందుకో ఏడుస్తున్నది' అని రాజు ఆలోచించి వీరవరునితో 'ఏమోయీ, ఎవరో స్త్రీ ఏడుస్తున్నది. ఆమె కష్టము కనుక్కో' అని ఆజ్ఞ చేసినాడు. విప్రవీరుడు ఖడ్గహస్తుడై బయలుదేరినాడు. ఆకాశము రంధ్రము పడే విధంగా వర్షము హోరున కురుస్తున్నా అతడు వెళ్ళడము చూచి రాజు కౌతుకముతో కారుణ్యముతో ప్రాసాదము దిగి అతనికి తెలియకుండా వెంట వెడుతున్నాడు. వీరవరుడు రోదనధ్వనిని బట్టి నగరకంఠమున ఉన్న సరస్సు చేరి, అక్కడ 'హా నాథా! శూరుడా! నిన్ను విడిచి నేను ఎలా జీవించను!' అని సరోమధ్యమున వెలువడిన స్త్రీ కంఠము ధ్వని విన్నాడు. అప్పుడు వీరవరు డామెను 'ఎవరమ్మా నీ భర్త! ఎందుకు

ఏడుస్తున్నావు?" అని జాలిగా అడిగినాడు.

ఆమె యీప్రకారము చెప్పింది: "నాయనా, నేను భూదేవతను. ధర్మాత్ముడు విక్రమతుంగుడు ఇప్పుడు నా భర్త. ఇక మూడురోజులకు ఈయనకు మృత్యువు సంభవిస్తుంది. ఇటువంటి నాథుడు మళ్ళీ ఎలా లభిస్తాడు! అందుకే దుఃఖిస్తున్నాను. సుప్రభ దేవకుమారుడు స్వర్గములో నుంచి చూచినట్టే నేనూ దివ్యదృష్టిచేత భవిష్యత్తు చూడగలను.

పుణ్యక్షయము కావడముచేత తనకు ఏడోరోజున స్వర్గభ్రంశమూ, సూకరజన్మమూ, కలుగుతవని సుప్రభుడు దివ్యదృష్టివల్ల గ్రహించి బిగ్గరగా విలపించినాడు. ఆవిలాపాలు విని ఇంద్రుడు ప్రశ్నిస్తే సుప్రభుడు దుఃఖకారణము చెప్పినాడు. అప్పుడు ఇంద్రుడు "దీనికి ఉపాయమున్నది. ఓం నమశ్శివాయ అని పంచాక్షరీ జపము చేస్తూ మహేశ్వరుని ఆశ్రయించు. శివానుగ్రహము వల్ల నీ పాపము క్షయించి పుణ్యము ప్రభవిస్తుంది. నీవు స్వర్గభ్రష్టుడవు కావు" అని ఉపదేశించినాడు. సుప్రభుడు సరే అని ఓం నమశ్శివాయ అంటూ మహేశ్వరుని శరణు జొచ్చినాడు. పంచాక్షరీజపము చేస్తూ అతడు ఆరురోజులు తన్మయత్వములో ఉన్నాడు. అతనికి నీచజన్మ తప్పిపోయింది. స్వర్గముకంటె పైలోకానికి వెళ్ళిపోయినాడు. ఏడవనాడు మహేంద్రుడు అతనికోసము స్వర్గలోకము వెతికించినా కనబడలేదు. సుప్రభుడు కాబోయే అమంగళాన్ని గ్రహించిన తీరున నేను కూడా నాస్వామికి ఆసన్నమైన మృత్యువును గ్రహించి దుఃఖిస్తున్నాను. వీరవరుడు భూదేవిమాటలు విని "తల్లీ, మాప్రభువును రక్షించే ఉపాయము ఉంటే చెప్పు" అని వేడినాడు. "ఒకటే ఉపాయమున్నది. ఇది నీకే సాధ్యమవుతుంది" అన్నది భూదేవి. "ప్రభువుకు ప్రాణాలు దక్కేపక్షములో మాప్రాణాలు అర్పిస్తాము" అన్నాడు వీరవరుడు. "రాచనగరుకు సమీపములో వెలిసిన చండికాదేవికి నీకుమారుని వెంటనే బలి యిస్తే ప్రభువు బతుకుతాడు. ఇంతకన్న వేరే ఉపాయము

లేదు" అని భూదేవి చెప్పేసరికి వీరవరుడు అంగీకరించినాడు. "ఇటువంటి స్వామిభక్తి పరాయణుడు లేడు! మంచిది చెప్పు. నీకు శుభము అవుతుంది" అని భూదేవి ఆశీర్వదించి అంతర్ధాన మయింది.

చాటున ఉన్న విక్రమతుంగుడు యావత్తూ విని, వీరవరుడు ఇంటికి బయలుదేరి పోతూ ఉంటే అతని వెంట రహస్యముగా వెళ్ళినాడు. వీరవరుడు తనభార్య ధర్మవతిని నిద్ర లేపి, భూదేవిమాటలు తెలిపినాడు. "ప్రభుకార్యము ప్రధానము. సత్త్వవరుని నిద్ర లేపి తెలియజెప్పండి" అన్నది ధర్మవతి. కుమారుని లేపి తండ్రి విషయమును వివరించినాడు. ఆబాలుడు సంతోషముతో "నాయనా, ప్రభుకార్యానికి నా ప్రాణాలు వినియోగపడితే నేను ధన్యుడను! ప్రభువు మనను పోషిస్తున్నాడు. ఆఋణము తీర్చుకోవాలి. నన్ను చండికాదేవికి బలి వెయ్యి" అన్నాడు. తండ్రి సంతృప్తి చెందినాడు. విక్రమతుంగప్రభువు చాటునుంచి ఈ విషయాలన్నీ విని చాలా ఆశ్చర్యపడినాడు. వీరవరుడు కుమారుని బుజాన ఎక్కించుకొని చండికాలయానికి ప్రయాణ మయినాడు. అతని భార్య ధర్మవతి కూతురు వీరవతిని తీసుకొని అతని వెంటనే బయలుదేరింది. విక్రమతుంగుడు చప్పుడుకాకుండా గూఢముగా వారిని అనుసరించినాడు.

వారంతా చండికా మందిరానికి వెళ్ళినతర్వాత సత్త్వవరుడు తండ్రి బుజముమీదినుంచి దిగి, దేవికి ప్రణామము చేసి "మాప్రభువుకు శుభము కలుగుగాక! నాశిరస్సు బలి పుచ్చుకో దేవీ!" అన్నాడు. వీరవరుడు కత్తి దూసి, కుమారునిశిరస్సు ఖండించి ప్రభువుకు శుభము కలుగునుగాక అని చండికాదేవికి సమర్పించినాడు. ఆకాశవాణి వీరవరుని సాహసానికి మెచ్చి బళి బళి అన్నది. రాజు చాలా ఆశ్చర్యపడ్డాడు. వీరవతి అన్నశిరస్సు పైకితీసి ముద్దుపెట్టుకొని అన్నా అని ఏడుస్తూ గుండె పగిలి ప్రాణాలు విడిచింది. కూతురు చనిపోవడము చూచి ధర్మవతి చేతులు జోడించి భర్తతో "మన ప్రభువుకు శుభము

కలుగుతుంది. ఇక నాకు అనుజ్ఞ ఇవ్వండి. నేను ఈ యిద్దరు బిడ్డలతోను అగ్ని ప్రవేశము చేస్తాను. ఇక నాకు జీవితముమీద ఆసక్తి లేదు!" అన్నది. వీరవరుడు భార్యతో "సరే జీవితములో ఇం కేమున్నది! నీకోసము చితి పేరుస్తాను. కాస్త శాంతించు" అన్నాడు. చండికాలయ నిర్మాణార్థము దగ్గరలో పెట్టి ఉన్న కర్రలతో చితి పేర్చి వీరవరుడు దీపముతో దాన్ని వెలిగించినాడు. ధర్మవతి భర్తపాదాలకు ప్రణామము చేసి "మరోజన్మలోకూడా మీరే నాభర్త కావలె. ప్రభువుకు శుభము అగునుగాక!" అని అగ్నిప్రవేశము చేసింది. విక్రమతుంగుడు ఇది అంతా చాటునుంచి చూచి ఆశ్చర్యపడి "వీరి ఋణము ఎలా తీర్చుకుంటాను!" అనుకొని విచారిస్తూ ఉన్నాడు.

"స్వామికార్యము నెరవేరింది. రాజు ఋణము తీర్చుకున్నాను. దివ్య వాణి వినబడ్డది. ఏకాకిగా ఉండి నేను చేసే దేమిటి? అమ్మవారికి ఆత్మార్పణం చేసుకుంటాను." అని భావించి వీరవరుడు సంకల్పపూర్వ కముగా దేవిని ఇలా స్తుతించినాడు:

"మహేశ్వరీ, ప్రణతాభయదాయినీ, నీకు నమస్కారము! సంసార పంకనిమగ్నుడనై శరణాగతుడనైన నన్ను ఉద్ధరింపుము! నీవు భూతము లకు ప్రాణశక్తివి. ఈజగత్తుకు నీవల్లనే చేష్టకలుగుచున్నది. నీవు సృష్టికి పూర్వము స్వయంభూత వయి, శంభునకు కనబడినావు. ఉచ్చండాకాండ బాలార్కకోటిపంక్తివలె దుర్నిరీక్ష్య మైన తేజస్సుతో జాజ్వల్యమాన వయి విశ్వమునువెలిగించుచు ఖడ్గఖేటకకోదండశరశూలాదులు ధరించిన భుజచక్రవాళముచే దిగంతరముల సంఛాదించినావు. అప్పుడు నిన్ను త్రిశూలిస్వామి "చండీ, చాముండా, మంగళా, త్రిపురా, జయా, నీకు నమస్కారము! అఖండా, శివా, దుర్గా, నారాయణీ, సరస్వతీ, భద్ర కాళీ, మహాలక్ష్మీ స్త్వ, సిద్ధా, రురువిదారిణీ! నీవు గాయత్రివి, మహారాజ్ఞివి, రేవతివి, వింధ్యవాసినివి, ఉమాదేవివి, కాత్యాయనివి, కైలాసపర్వత

వాసినివి" అని ఇత్యాదినామములతో స్తుతించినాడు. ఇలా హారుడు స్తోత్రము చేయుచుండగా స్కందుడు, బ్రహ్మ, వసిష్ఠాదులు నిన్ను స్తుతించినారు. భగవతీ! అమరులు, ఋషులు, నరులు నిన్ను వినుతించి కోర్కెకు మీరిన ఫలములు పొందినారు. వరదాయినీ, అనుగ్రహించి ఈనాశరీరోపహారార్చన స్వీకరింపుము. నాప్రభువునకు శ్రేయమగుగాక!"

ఇలా స్తుతించి వీరవరుడు తనశిరస్సు ఖండించుకో బోయేసరికి ఆకాశ వాణి "బిడ్డా సాహసించకు. నీసత్వానికి మెచ్చినాను. వరము అడుగు" అన్నది. "నీవు సంతుష్టురాల వయితే విక్రమతుంగమహారాజు ఇంకా నూరేళ్ళు జీవించాలి. నాభార్యా బిడ్డలూ బతకాలి దేవీ!" అని వీర వరుడు వేడినాడు. సరే అని మళ్ళీ వాణి వినిపించింది. వెంటనే అతని భార్య సంతానము అందరూ సుగాత్రములతో సజీవు లయినారు. వీర వరుడు ఆనందముతో వారిని ఇంట్లోకి చేర్చి రాజద్వారానికి వచ్చి యథాప్రకారముగా నిలుచున్నాడు.

విక్రమతుంగుడు ప్రచ్ఛన్నముగానే ఉండి అంతా చూచి ఆశ్చర్య ఆనందాలు పొంది తన సౌధముమీదికి పోయి "ఎవరు సింహద్వార ములో?" అని కేక వేసినాడు. "నేను వీరవరుడను. ఆస్త్రీ దేవత. నేను చూడబోతే అంతర్ధాన మయినది" అన్నాడు వీరవరుడు.

సమస్తమూ ప్రత్యక్షముగా చూచిన రాజు అతని మాటలకు సంతోషించి "ఇతడు మహానుభావుడు; దొడ్డపని చేసినప్పటికీ చెప్పుకోడు. నాప్రాణము కాపాడిన ఈధీరుని ఋణము ఎలా తీర్చుకుంటాను" అని విచారించినాడు. తెల్లవారింది. ప్రభువు బహిరంగసభలో యావత్తు సంగ తులు వర్ణించి వీరవరునికి అశ్వములు గజములు సువర్ణము రత్నములు గ్రామములూ ఇచ్చి పట్టము కట్టి రాజతుల్యుని చేసినాడు.

గోముఖుడు ఇలా కథ ముగించి "దేవా! అటువంటి సేవకులు అదృష్టమువల్ల దొరుకుతారు. ఈబ్రాహ్మణుడు ప్రలంబబాహువు అటు

వంటివాడే అనిపిస్తున్నది" అని చెప్పినారు. విని రాజపుత్రుడు సుప్రీతుడయినాడు.

## తరంగము : ౫౮

## ప్రలంబబాహువు కథ

ఒకనాడు నరవాహనదత్తుడు రథ మెక్కి ప్రలంబబాహువు ముందు నడుస్తూ ఉండగా అనుచరులతో అరణ్యానికి వేటకు వెళ్లినాడు. రథము ఎంతవేగముగా వెళ్ళుతున్నప్పటికీ ప్రలంబబాహువు అంతకంటె ముందుగానే వెళ్లుతున్నాడు. రాజు రథములోనుంచి బాణాలు విడిచి సింహాది మృగాలను సంహరిస్తూ ఉంటే ఆవిప్రవీరుడు కత్తితోనే జంతువులను నరుకుతున్నాడు. ప్రభువు ఆశ్చర్యపడినాడు. వేట చాలించి నరవాహనుడు గోముఖాదులతో ప్రలంబబాహువుతో కలిసి నీటికోసమై పోయి పోయి మహావనము ప్రవేశించినాడు. సరస్సులో స్నానముచేసి నీరు తాగినతర్వాత సమీపములో నలుగురు పురుషులు కనబడినారు రాజుకు.

దివ్యాంబరాభరణభూషితులూ దివ్యాకృతులూ అయిన పురుషులు సరస్సులో ఒకచోట సువర్ణకమలాలు కోస్తున్నారు. రాజు వారిని సమీపించి పరస్పరపరిచయమైనతర్వాత ప్రశ్నిస్తే వారు ఇలాచెప్పినారు:

## నలుగురు అప్సరసలు

"నారికేళద్వీపములో మైనాకము, వృషభము, చక్రము, బలాహకము అనె నాలుగుపర్వతాలమీద మానివాసాలు. మాలో రూపసిద్ధి నానారూపాలు ధరిస్తాడు; ప్రమాణసిద్ధి చిన్న పెద్ద ప్రమాణాలను గ్రహిస్తాడు. జ్ఞానసిద్ధి త్రికాలవేత్త; దేవసిద్ధికి సమస్తదేవతాసిద్ధి ఉన్నది. ఈ బంగారు తామరపూలు తీసుకొని శ్వేతద్వీపములో శ్రీహరిని

పూజించడానికి పోతున్నాము. నీవుకూడా రా. నీకిష్టమయితే గగన మార్గాన తీసుకు వెళ్ళుతాము.''

నరవాహనదత్తుడు అంగీకరించి గోముఖాదులను అక్కడే నిలిపి దేవసిద్ధి ఒడిలో కూర్చుని ఆకాశమార్గాన వెళ్ళి కొంతదూరాన దిగి, ఆ నలుగురు పురుషులతోపాటు శ్రీహరి సందర్శనము చేసి హస్తములు మోడ్చి స్తుతి చేసినాడు.

శ్రీహరి అతనిమీద అనుగ్రహదృష్టి నిలిపి పక్కన ఉన్న నారదునితో "మునీంద్రా ఇంద్రునివద్ద ఇల్లడ వుంచిన నలుగురు అప్సరసలనూ నామాటప్రకారము అతని రథములో ఎక్కించి వెంటనే తీసుకురా గోరుతాను'' అన్నాడు. నారదుడు మాతలి సారథిగా వారిని తెప్పించినాడు. మాతలి నమస్కరించి అచ్చరలను చూపినాడు. శ్రీహరి నరవాహనదత్తునితో "నీవు కాగల విద్యాధరచక్రవర్తివి. నీవు మన్మథుని అవతారానివి. కాబట్టి నీకు యోగ్యలయిన ఈనలుగురు భార్యలునూ ఇస్తున్నాను'' అని అనుగ్రహించినాడు. తర్వాత సెలవు పుచ్చుకొని నరవాహనుడు మాతలి సారథిగా నారికేళద్వీపములో దిగినాడు. నాలుగురోజులు ఆదివ్యపురుషుల నగరాలలో సమస్త భోగములూ అనుభవించి "తండ్రిని చూడడానికి వెళుతాను. మీరు మానగరానికి రావలసింది'' అని ఆహ్వానించారు. "నిన్ను చూచినాము చాలు; నీకు విద్యలు లభించినప్పుడు మమ్మలిని స్మరించు'' అని అతనిని వారు సాగనంపినారు.

మాతల్లితో చెప్పి నరవాహనుడు గోముఖాదు లున్నచోటికి వెళ్లి "మీరు మామూలుతోవనే నగరానికి పదండి'' అని చెప్పి ఆకాశ మార్గాన రాజధాని ప్రవేశించి అచ్చరలను తన అంతఃపురములో దింపి, తాను తండ్రికి వాసవదత్తకు పద్మావతికి ప్రణామము చేసినాడు. త్వరలోనే గోముఖ ప్రలంబబాహులు వచ్చినారు. వత్సరాజు అడి

గితే నరవాహనుడు జరిగిన దంతా చెప్పినాడు. కుమారునికి శ్రీహరి ప్రసాదము లభించినందుకు ఉత్సవానికి వత్సరాజు ఆజ్ఞ యిచ్చినాడు. దేవరూప దేవరతి దేవప్రియులను గోముఖుడు తీసుకొని వచ్చి రాజుకు రాణులకూ వారిచేత ప్రణామములు చేయించినాడు. కోడళ్ళను చూచి అత్తమామలు ఆనందించినారు.

నరవాహనుడు ప్రలంబబాహువు శౌర్యము వర్ణించి భార్యల సరస సల్లాపాలతో చాటుకారుని చమత్కారవాక్యాలతో మధురపానముతో మహానందము అనుభవించినాడు.

## రుద్ర శ్రేష్ఠి కథ

ఒకనాడు నరవాహనదత్తుడు వయస్యులతో అలంకారవతీమందిరములో ఉండగా వెలుపల వాద్యధ్వని వినబడినది. అప్పుడు సేనాపతి హరిశిఖునితో అతడు "ఏమిటీ, హఠాత్తుగా వాద్యములు మోగుతున్నవే ఇక్కడ!" అన్నాడు. హరిశిఖుడు వెళ్ళి సంగతులు తెలుసుకొని వచ్చి ఇలా విన్నవించినాడు: "ఈనగరవాసి రుద్రశ్రేష్ఠి వర్తకానికి సువర్ణద్వీపము వెళ్ళి బాగా ధనము సంపాదించి తిరిగి వచ్చేటప్పుడు ఓడ మునిగిపోయింది. తానుమాత్రము ఎలాగో బతికి వచ్చి ఆరురోజులయింది. శ్రేష్ఠి తన తోటలో తవ్వుతూ ఉంటే శివానుగ్రహమువల్ల నిధి దొరికింది. దాయాదులు మహారాజుగారికి తెలియపరిచినారు. ఇంతలో శ్రేష్ఠి స్వయముగా వచ్చి ప్రభువువారితో "దేవా, నాకు రత్నరాసులతో నాలుగుకోట్ల సువర్ణాలు దొరికినవి. ఆజ్ఞ అయితే ఏలినవారి సన్నిధిలో సమర్పించుకొంటాను" అని విన్నపము చేసినాడు. ప్రభువువారు "శ్రేష్ఠీ, నీసంపద జలము హరించింది. అయితే భూమి ఇంకోసంపద ఇచ్చింది. నీవే అనుభవించు" అని అనుగ్రహించారు. శ్రేష్ఠి సంతోషముతో నాయనగారి పాదసన్నిధిలో ప్రణమిల్లి లేచి

వాద్యములు మోగిస్తూ వెళ్ళిపోతున్నాడు."

నరవాహనుడు తనతండ్రి ధర్మబుద్ధిని కొనియాడి మంత్రులతో "చిత్రము: అదృష్టదేవత జనుల ఉచ్చనీచస్థితులతో క్రీడిస్తుంది" అన్నాడు. "అవును విధివిలాసము ఇలాగే ఉంటుంది" అని గోముఖుడు కథ ప్రారంభించినాడు:

## సముద్ర శూరుని కథ

వెనుకటిరోజుల్లో హర్షవర్మ పరిపాలించే హర్షనగరములో సముద్ర శూరు డనే ధర్మాత్ముడు ఉండేవాడు వ్యాపారార్థము ఆ శ్రేష్ఠి సువర్ణ ద్వీపానికి వెళ్ళే ఓడ యెక్కినాడు. ప్రయాణము బాగానే సాగింది. కాని సువర్ణద్వీపము చేరకుండానే తుపానుచెలరేగి నావను నాశము చేసింది. సముద్రశూరుడు నడుముబిగకట్టుకొని నీటిలోకి దూకి ఈదుతూ ఉంటే మనుష్యశవము దగ్గిరికి కొట్టుకువచ్చింది; అది ఆధారము చేసు కొని ఈదుతూ ద్వీపము చేరుకున్నాడు. శవమునడుమునకట్టిన శాటిలో రత్నాలు చెక్కిన కంఠాభరణము ఉన్నది. అది తీసుకొని సముద్ర స్నానము చేసి కలశపురము వెళ్ళి దేవాలయపుష్కరిణిలో స్నానము చేసి బడలికవల్ల అక్కడే పడుకొని నిద్రపోయినాడు.

రాజభటులు వచ్చి ఆకంఠాభరణమును గుర్తించి రాజపుత్రిక చక్రసేన మెడలో నగ అతడే అపహరించినా డని తలచి అతనిని రాజు సన్నిధికి తీసుకొని వెళ్ళినారు. నేను నిర్దోషి నని అతడు చెపుతున్న సమయములో గద్ద హఠాత్తుగా వచ్చి ఆకంఠాభరణాన్ని తన్నుకొని ఎగిరిపోయింది. రాజు సముద్రశూరునికి ఉరిశిక్ష వేసినాడు. వర్తకుడు విచారముతో మహేశ్వరుని ప్రార్థించినాడు. అప్పుడు ఆకాశవాణి సంగతు లన్నీ చెప్పి ఈసాధువును సత్కరించి పంపవలసింది అనిపలికింది. రాజు అతనికి ధన మిచ్చి విడిచిపెట్టినాడు.

సముద్రశూరుడు పడవ యెక్కి, సముద్రము దాటి, సార్థవాహులతో చేరి, ఒకానొక సాయంకాలము అరణ్యములలో ప్రయాణము చేసి రాత్రి అక్కడ ఆగినాడు. దొంగలగుంపు వచ్చి బిడారముమీద పడ్డది. సముద్రశూరుడు మేలుకొని ఉండడముచేత సరుకులు విడిచి చాటుగా వెళ్ళి మర్రిచెట్టుమీదికి ఎక్కినాడు. దొంగలు సమస్తమూ హరించుకు పోయినారు. శ్రేష్ఠి విచారముతో చెట్టుమీదనే ఉండి తెల్లవారుతూ ఉండగా పైకి చూచినాడు. కాంతి పుంజము కనబడ్డది. పై కొమ్మమీదికి ఎక్కి పరిశీలిస్తే అక్కడ గద్దగూటిలో రత్నాభరణాలున్నవి. స్వర్ణద్వీపములో గద్ద తన్నుకొనిపోయిన కంఠాభరణము కూడా అందులో ఉన్నది. అవి అన్ని తీసుకొని సముద్రశూరుడు సంతోషముతో చెట్టుదిగి హర్షపురము వెళ్ళి బంధువులతోసహా హాయిగా కాలక్షేపము చేసినాడు. యోగ్యునికి మధ్యమధ్య కష్టాలు వచ్చినా చివరకు సౌఖ్యము లభిస్తుంది. ఇది అంతా విధివిలాసము.

ఇలా గోముఖుడు చెప్పిన కథకు సంతోషించి నరవాహనుడు స్నానాదులకు లేచినాడు.

## స మ ర తుం గు ని క థ

మరునాడు నరవాహనదత్తుడు ఆస్థానములో ఉండగా అతని బాల సేవకుడు సమరతుంగుడు వచ్చి "దేవా, మా దాయాది సంగ్రామవీరుడు తన పుత్రచతుష్టయముతో మా దేశమును నాశము చేసినాడట. నేను వెళ్ళి వారిని పట్టి కట్టి యిక్కడికి తెస్తాను. దేవరకు ముందుగా విన్నవించుకొంటున్నాను" అని బయలుదేరినాడు. అతనికి సేన చాలా తక్కువ అని తనసేన పంపినాడు నరవాహనుడు. ఈసేనాసాహాయ్యము లేకుండానే సమరతుంగుడు దాయాదులను గెలిచి కట్టి తీసుకొని వచ్చినాడు. నరవాహనుడు అతనిని సన్మానించి ప్రశంసించినాడు.

గోముఖుడు "దేవా, చమరువాల మహారాజు కథ ఆకర్ణించండి" అని ప్రారంభించినాడు:

### చ మ ర వా ల మ హా రా జు

హస్తినాపురము ఏలుతున్నాడు చమరవాలుడు. అతనిదాయాదులు సమరబలాదులు అయిదుగురు అన్నిపక్కలా దేశాలు ఏలుతున్నారు. వాళ్ళు ఒకసారి ఆలోచించి "ఈచమరవాలుడు మనలను విడివిడిగా వేధిస్తున్నాడు. అందరమూ కలిసి ఇతనిని పట్టుకొందాము" అని నిర్ధారణ చేసుకొని దండెత్తడానికి శుభముహూర్తము చూడవలసిందని జ్యోతిష్కుని కోరినారు. అతడు గుణించి "సంవత్సరములోగా మంచి ముహూర్తము లేదు. అయినా అతని మీాదికి ఎందుకు పోతారు? అతనికంటె మీాకే ఎక్కువసంపద లున్నవి" అని ఈకథ చెప్పినాడు:

### అ ర్థ వ ర్మ – భో గ వ ర్మ లు

కౌతుకపురములో బహుసువర్ణకు డనే రాజుకు యశోవర్మ అనే క్షత్రియసేవకు డున్నాడు. అతడు ఎన్నిమార్లు అర్థించినా "నేను ఇవ్వవలె ననుకొంటున్నాను! కాని దైవము అడ్డుపడుతుంటే ఏమిచెయ్యను" అని రాజు తప్పించుకొంటున్నాడు. కొన్నాళ్ళకు సూర్యగ్రహణము వచ్చింది. దానధర్మాలు చేస్తున్న రాజును సమీాపించి యశోవర్మ "దేవా, నాకుఏమీా ఇవ్వనియ్యని సూర్యదేవుడు ఇప్పుడు రాహుగ్రస్తుడయినాడు. ఈసమయములోనే దేవర నాకు ఏమయినా అనుగ్రహించాలి" అని విన్నవించినాడు. రాజు సంతోషించి అతనికి చాలా వస్త్రములూ ధనమూ ఇచ్చినాడు. అవి వ్యయ మయినతర్వాత మళ్లీ అతడు ప్రార్థించినా రాజు ఏమీాఇవ్వలేదు. ఇంతలో అతనిభార్య చనిపోయింది. ప్రాణము విసిగి యశోవర్మ వింధ్యవాసినీదేవి సన్నిధికి వెళ్ళి అభీష్టసిద్ధి కావాలి; కాదా

ప్రాణా లయినా పోవాలి అని దర్భలు పరుచుకొని ఘోరతపస్సు చేసినాడు. స్వప్నములో అమ్మవారు ప్రత్యక్ష మయి "వత్సా, నీకు అర్థశ్రీ కావలెనా? భోగశ్రీ కావలెనా?" అన్నది. 'తల్లీ, నాకు భేదము తెలియదు' అన్నాడు యశోవర్మ. 'మీ దేశములో భోగవర్మ అర్థవర్మ అని ఇద్దరు వణిజు లున్నారు. వాళ్ళను చూచి వచ్చి నీకు ఎటువంటి శ్రీ కావలెనో కోరుకో' అన్నది దేవి.

మరునాడు యశోవర్మ భోజనము చేసి కౌతుకపురము చేరి ముందు అర్థవర్మ యింటికి వెళ్ళినాడు. అతడు యశోవర్మను భోజనానికి ఉండమన్నాడు. ఇద్దరూ భోజనము ప్రారంభించారు. సుష్ఠుగా భోజనము చేస్తున్న యశోవర్మ వణిజుని చూచి "మిత్రమా, సరిగా ఏమీ తినవేమి?" అన్నాడు. "ఈ తిన్నదే ఎక్కువ. నాకు జీర్ణము కాదు" అన్నాడు అర్థవర్మ. రాత్రి యశోవర్మ మళ్ళీ తృప్తిగా భోజనము చేసినాడు. అర్థవర్మ కాసినిపాలు మాత్రము తాగినాడు. తర్వాత ఇద్దరూ ఒకగదిలోనే నిద్రించినారు. యశోవర్మకు స్వప్నములో భయంకరాకారులు కనబడి, అర్థవర్మను పట్టుకొని "దౌర్భాగ్యుడా, రోజూ కంటె ఈవేళ ఎందుకు ఎక్కువ భోజనము చేశావు?" అని కర్రలతో కొట్టినారు. ఇంతలో యశోవర్మకు మెళుకువ వచ్చింది. అర్థవర్మ కడుపులో శూలనొప్పితో బాధపడుతూ రోదనము చేసినాడు. పరిచారకులు వచ్చి అతనికడుపు నొక్కినారు. అతడు తిన్నతిండి కక్కుకొన్నాడు. కడుపునొప్పి తగ్గింది. ఎందుకు ఇతనిసంపద! నిరుపయోగము' అనుకొంటూ యశోవర్మ రాత్రి గడిపి మరునాడు భోగవర్మ యింటికి పోయినాడు.

భోగవర్మ అతనిని భోజనార్థము నిలిపినాడు. అతనియింట్లో విశేష ధన మున్నట్టు కనబడ లేదు; కాని అంతా శోభాయమానముగా ఉన్నది. భోగవర్మ దళారివ్యాపారము చేస్తాడు. యశోవర్మ యెదటనే అతడు ఒకరిసరకులు మరొకరికి అమ్మి వెంటనే లాభము తీసి, సేవకు

చేత దీనారములు భార్యకు పంపినాడు. ఇంతలో ఇచ్ఛాభరణు డనే మిత్రుడు వచ్చి తనయింటికి విందుకు పిలిచి స్నేహితు లంతా వచ్చారనీ, భోగవర్మ కోసమే ఎదురు చూస్తున్నా రనీ చెప్పి బలవంతము చేసినాడు. "ఈవేళ రావడానికి వీలు లేదు. ఈ అతిథి ఉన్నాడు" అని అతడు అనేసరికి "ఈయనకూడా రావాలి. ఈయనమాత్రము మాకు చెలికాడు కాడా?" అని ఇచ్ఛాభరణుడు ఇద్దరినీ తీసుకువెళ్ళినాడు. అక్కడ మిత్రులిద్దరూ మృష్టాన్నభోజనము చేసి ఇంటికి వచ్చి, రాత్రి మళ్ళీ భోగవర్మయింట్లో విందు ఆరగించినారు. రాత్రి పుచ్చుకోడానికి ఆసవము ఉన్నదా అని భోగవర్మ అడిగితే లే దని పరిచారకులు చెప్పినారు. అపరరాత్రి దాహ మయితే వట్టినీళ్ళు ఎలా తాగడము అంటూ భోగవర్మ పండుకొన్నాడు. అతని సమీపములోనే యశోవర్మ శయినించినాడు. స్వప్నములో అతనికి కొందరు పురుషులు కనబడినారు. కొంతమంది ఆయింట్లోకి వచ్చి తక్కినవాళ్ళనుచూచి దౌర్భాగ్యులారా, భోగవర్మకోసము ఆసవము ఎందుకు జాగ్రత్తచేసి ఉంచలేదు? అపరరాత్రి వేళ దాహమయితే ఎలాగు? అని వాళ్ళను కర్రలతో కొట్టినారు. తప్పు క్షమించాలి అని వాళ్ళు బతిమాలుకొన్నారు. తర్వాత వాళ్ళు వెళ్ళిపోయినారు. యశోవర్మకు మెళుకువవచ్చింది. భోగవర్మ ఐశ్వర్యానికి ఆనందిస్తూ అర్థవర్మ సంపదను అసహ్యించుకొంటూ అతడు నిద్రపోయినాడు.

తెల్లవారిన తర్వాత యశోవర్మ మిత్రునివద్ద సెలవు పుచ్చుకొని వింధ్యవాసినీదేవి సన్నిధానానికి వెళ్ళి తపస్సు చేసి ఆమెను మెప్పించి భోగశ్రీ కావలె నని వేడినాడు. అమ్మవారు అనుగ్రహించింది. భోగమున్న సంపద ఉత్తమము."

ఎందుకు మీరు చమరవాలుని సంపదకోసము ఆశిస్తారు? అతని మీదికి దండయాత్ర యెందుకు? పైగా లగ్నశుద్ధి లేకుండా బయులుదేరితే జయము కలగదు.

గణకుడు ఇలా బోధించినప్పటికీ వారు వినక చమరవాలమహారాజు మీాదికి యుద్ధయాత్ర చేసినారు. చమరవాలుడు స్నానముచేసి మహేశ్వరుని పూజించి అరవై శుభనామములతో స్తుతి చేసినాడు. 'రాజన్, నీకు భయము లేదు. శత్రువులు ఓడిపోతారు' అని ఆకాశవాణి పలికింది. అతడు మహోత్సాహముతో సంసిద్ధుడై శత్రువుల మీాదికి బయలు దేరినాడు. అతనికి ఇరవై లక్షల కాల్బలము, లక్షగుర్రాలు, పదివేలయేనుగులు మాత్రము ఉన్నవి. అతని శత్రువులకు కోటికాల్బలము, మూాడులక్షలగుర్రాలు, ముప్ఫయివేల యేనుగులూ ఉన్నవి. వీరుడనే ప్రతీహారుడు ముందు వెళుతున్నాడు. చమరవాలుడు అతనితర్వాత యుద్ధరంగములో ప్రవేశించినాడు. తనసైన్యముకంటె శత్రుసేన చాలా హెచ్చుగా ఉన్నప్పటికీ వైరులను సంహారించి ఎదురు వచ్చిన సమరబలుని బల్లెముతో పొడిచి పడవేసి పాశముతో కట్టివేసినాడు. సమరశూరుడు ఎదుర్కొంటే అతనికీ అదేగతి పట్టింది. ప్రతీహారుడు సమరజితుని పట్టి కట్టి ప్రభువు దగ్గరకు తీసుకొని వచ్చినాడు. సేనాపతి దేవబలుడు ప్రతాపచంద్రుని పట్టుకు వచ్చినాడు. కోపముతో ప్రతాపసేనుడు చమరవాలునిమీాదికి దూకినాడు. ఇద్దరికీ యుద్ధము జరిగింది. చివరకు ప్రతాపసేనుడు పట్టుపడినాడు. శత్రుసేన చెల్లాచెదరయియింది. సువర్ణము, రత్నములు, రాణివాసస్త్రీలు అతని వశమయినారు. అందులో ప్రతాపసేనుని భార్య యశోలేఖ అనే నామధేయముకల మహాదేవి లభించింది. చమరవాలుడు విజయము పొంది నగరము ప్రవేశించి వీరునికి దేవబలునికి చాలా బహుమానాలిచ్చినాడు. యుద్ధములో లభించడముచేత క్షాత్రధర్మప్రకారము యశోలేఖాదేవిని తన రాణివాసములో చేర్చుకొన్నాడు. చపలస్వభావము కలది కావడముచేత ఆమె అంగీకరించింది.

తర్వాత యశోలేఖాదేవి ప్రార్థించడముచేత చెరలో ఉన్న రాజులను

అయిదుగురినీ చమరవాల మహారాజు విడిపించి సత్కరించి వారి వారి రాజ్యాలకు పంపివేసి తాను సుఖముగా కాలము గడిపినాడు.

స్వబలము పరబలము గ్రహించలేక ద్వేషమే పెట్టుకొన్న వాళ్ళు వెనుకముందులు చూడక యుద్ధములోకి దిగి పరాజయము పొందు తారు. ధీరునికి విజయము కలుగుతుంది.

ఇలా గోముఖుడు చెప్పగా నరవాహనుడు చాలా సంతోషించినాడు. ఆనాటిరాత్రి అతడు స్త్రీగోష్ఠిలో స్వయముగా సంగీతము పాడినాడు.

## త ర ం గ ము : ౫౫

మరునాడు నరవాహనదత్తుడు అలంకారవతీ మందిరములో ఉండగా అంతఃపురరక్షకు డయిన సౌవిదల్లుని సోదరుడు వచ్చి మంత్రుల సన్నిధిలో ప్రభువును ఉద్దేశించి "దేవా నేను ఈమరుభూతి సేవ రెండుసంవత్సారాలు చేసాను. నాకూ నాభార్యకూ అన్నవస్త్రాలు మాత్రము ఇచ్చినాడు. సంవత్సరానికి యాభై దీనారాలు ఇస్తా నని మొదట చెప్పినాడు. అనడమే కాని ఏమీ ఇవ్వలేదు. వెళ్ళి అడిగితే కాలితో తన్నినాడు. అందుచేత దేవరవారి హాజారములో భోజనము మానివేసి కూర్చున్నాను. దేవరవారు విచారణ చెయ్యకపోతే నేను అగ్నిప్రవేశము చెయ్యాలి. ఇంతకంటె ఏమి చెప్పుకోను" అని విజ్ఞాపన చేసినాడు. "దేవా, ఇతనికి దీనారాలు ఇవ్వవలసిన మాట సత్యమే. కాని, ఇప్పుడు నాదగ్గర దీనారాలు లేవు" అని మరుభూతి అన్నాడు. ప్రభువు మరుభూతితో "ఏమి మూర్ఖత! వెంటనే వెళ్ళి ఇతనికి దీనారాలు ఇచ్చిరా" అని చెప్పినాడు. అందరూ నవ్వినారు. మరుభూతి సిగ్గుపడి వెంటనే దీనారాలు తెప్పించి అతనికి ఇచ్చినాడు.

అప్పుడు గోముఖుడు నరవాహనునితో "దేవా, మరుభూతిని అని లాభ మేమి? సృష్టి చిత్ర చిత్రముగా ఉన్నది. చిరదాత అనే రాజు భృత్యుడు ప్రసంగుడు, వారికథ చెప్తాను.

## చిరదాత ప్రసంగుడు

పూర్వకాలములో చిరపురమును చిరదాత అనే రాజు పరిపాలి స్తున్నాడు. ఆయన మంచివాడయినా దగ్గరఉన్నవాళ్ళు అయోగ్యులు. దేశాంతరమునుంచి ప్రసంగుడు అనే పురుషుడు ఇద్దరు మిత్రులతో సహా వచ్చినాడు. వచ్చి రాజు కొలువులో కుదిరి అయిదుసంవత్సరాలు సేవచేసి నాడు. ఉత్సవసమయాలలో నయినా రాజు అతనికి ఏమీ ఇవ్వలేదు. రాజు సన్నిధానములో విజ్ఞాపన చెయ్యడానికి వారికి అవకాశము చిక్కనే లేదు. ఎప్పుడూ పరివారజనము ఏదో ఆటంకము కల్పించేవారు.

ఒకానొక సమయములో రాజపుత్రుడు చనిపోయినాడు. ఆబాలుని కోసము విచారపడుతూ, ఉన్న రాజుచుట్టూ పరివారము ఉన్నది. వద్దు అంటూ ఉన్నప్పటికీ ఆసమయములో ప్రసంగుడు రాజుతో "దేవా, బహుకాలమునుంచీ మేము మీ సేవ చేస్తున్నాము. తమరు ఏమీ అనుగ్రహించలేదు. రాజపుత్రుడు పెద్దవాడయిన తర్వాత మమ్మలిని కనికరిస్తా డని ఆశ పెట్టుకొని కొలువులో ఉన్నాము. ఇప్పుడు కుమారుని దైవము ఎత్తుకపోయింది. ఇక్కడ మాకు ఇక మీదట ఏమీ పనిలేదు" అని ప్రభువుకు నమస్కరించి మిత్రులతో సహా బయలుదేరినాడు.

రాజుకు మనసు కరిగింది. "వీళ్ళు బాలునిమీద ఆశ పెట్టుకొని ఉన్నారు. ఇటువంటిభృత్యుల్ని వదులుకోకూడదు" అని చిరదాత వారిని వెనుకకు రప్పించి దారిద్ర్యము కనబడకుండా చాలా ధనము ఇచ్చినాడు.

లోకులస్వభావాలు చిత్రముగా ఉంటవి. చిరదాత తన భృత్యులకు సకాలములో ఏమి ఇవ్వక అకాలములో అన్నీ ఇచ్చినాడు.

## కనకవర్షుని కథ

ఇలా చెప్పి కథాఖ్యానప్రవీణు డయిన గోముఖుడు రాజకుమారుని ఆజ్ఞప్రకారము మరొక కథ ప్రారంభించినాడు. పూర్వము గంగానదీ

తీరాన కనకపురము ఉండేది. కనకవర్షుడు ఆనగర పరిపాలకుడు. వాసుకి పుత్రు డయిన ప్రియదర్శనుడు అతని తండ్రి. యశోధర అతని తల్లి. ఆయన చాలా యోగ్యుడు.

శరత్కాలములో ఒకనాడు కనకవర్షుడు చిత్రప్రాసాదము మీాదికి వెళ్లి, అక్కడనుంచి కనబడే విచిత్రదృశ్యాన్ని వర్ణించే సమయములో ప్రతీహారుడు వచ్చి "మహాప్రభూ, విదర్భదేశమునుంచి చిత్రకారుడు వచ్చి తనపేరు రోలదేవు డనీ తనకు సాటి చిత్రకారుడు ఎవడూ లేడనీ వస్త్రముమీాద చిత్రించి సింహద్వారమువద్ద కట్టినాడు" అని విన్నపము చేసినాడు. ప్రభువు చిత్రకారుని లోపలికి రప్పించినాడు. రోలదేవుడు రాజుకు నమస్కరించి "దేవా, మీాపాదపద్మదర్శన కాంక్ష చేత ప్రతిజ్ఞ వస్త్రఖండముమీాద లిఖించి సింహద్వారములో ప్రకటన చేశాను. విజ్ఞానమదముచేత ఈపని చెయ్యలేదు. ఈ అవినయకార్యము దేవరవారు క్షమించి ఏచిత్రము లిఖించ మని ఆనతి ఇస్తారో నా కళానైపుణి సఫలముకావాలి" అని విన్నవించినాడు. రాజు సంతోషించి అతనిని ఆదరించి కూర్చోబెట్టి "ఉపాధ్యాయా, నీయిష్టము వచ్చినది చిత్రించి చూపించు. నీవిద్యావిషయములో మాకు సంశయము లేదు. మాకు నేత్రోత్సవము చెయ్యవలె" నని అన్నాడు.

సౌందర్యహీనులను చిత్రించడ మెందుకు? ప్రభువు రూపమునే చిత్రించ వలసినదని అక్కడ ఉన్నవారు చెప్పినారు. రోలదేవుడు రాజు రూపమును లిఖించినాడు. చూచి అక్కడివా రంతా చాలా బాగున్న దని రాజు పార్శ్వములో రాణులతో ఎవరినైనా చిత్రించి మాకు కన్నులపండువు చెయ్యవలె" నని కోరినారు.

రోలదేవుడు రాణివాసమును బాగా పరిశీలించి చూచి ఇలా అన్నాడు. "వీరందరూ సౌందర్యవతు లయినప్పటికీ ప్రభువువారికి తగిన తరుణి విదర్భదేశములో కుండినసగరాన ఉన్నది. ఆ దేశప్రభువు

దేవశక్తి. పట్టమహిషి అనంతవతి. వారిపుత్రిక మదనసుందరి. ఆమెరూప లావణ్యగుణ వంశప్రతిష్ఠలలో మన మహారాజుకు తగినది.

మదనసుందరి ఒకనాడు చేటికద్వారా నన్ను అంతఃపురానికి ఆహ్వా నించింది. ఆసమయములో ఆమె ఒంటినిండా మంచిగంధము పూసుకొని తామరతూండ్లు ధరించి తామరాకు పానుపుమీద పండుకొని ఉన్నది. చెలికత్తెలు అరటాకులతో విసురుతున్నారు. ఆమెముఖము పాలిపోయి విరహబాధ పడుతున్నట్టు స్పష్టముగా కనిపించింది. "చెలులారా, ఎందుకీ శీతలోపచారాలు! ఈ చల్లని వస్తువులవల్ల నాకు తాపము హెచ్చుచున్నది" అని పలికింది. ఆమెస్థితికి చెలికత్తెలు ఏమీ తోచక విచారముతో ఉన్నారు. నేను నమస్కరించి ఆమె సముఖాన కూర్చున్నాను. "ఉపాధ్యాయా, ఇటువంటి చిత్తరువు వ్రాసి పెట్టు" అని మదనసుందరి తూలిక పట్టుకొని వణుకుతున్న హస్తముతో నెమ్మదిగా నేలమీద సుందరమూర్తిని లిఖించి చూపింది.

నేనుకూడా ఆసుందరాకారుని పటముమీద చిత్రించి "ఈయన ఎవరో కామరూపుడు! ఈమె ఇతనిని ఇదివరలో చూచి ఉండదు. అయినప్పటికీ ఈమె విరహబాధకు ఇతడే కారణభూతుడు. ఈమె జనకుడు దేవశక్తి చండశాసనుడు. ఈసంగతి ఆయనకు తెలిస్తే నన్ను క్షమించడు. తక్షణమే ఇక్కడనుంచి వెళ్ళడము మేలు" అని భావించి రాజపుత్రికి నమస్కరించి సత్కారాలు అందుకొని బయలుదేరినాను.

మదనసుందరి మీసంగతివిని మీయందు అనురక్తురాలయినట్టు ఆమె చెలికత్తెల మాటలవల్ల గ్రహించినాను. చాటుగా ఉండి ఆమెరూపము పటముమీద చిత్రించి మీపాదసన్నిధానానికి తెచ్చాను. మాటిమాటికి ఆమె రూపము చిత్రించడము కష్టము."

ఆమె చిత్తరువును చూపించమని కనకవర్షుడు కోరినాడు. రోలదేవుడు వెదురుగొట్టములోనుంచి మదనసుందరీ పటము బయటకుతీసి రాజుకు

చూపించినాడు. రాజు సుందరీరూపముచూచి మదనపరవశు డయినాడు. తర్వాత రోలదేవునికి సువర్ణము లిచ్చి పంపి పటము తీసుకొని అంతః పురములోకి వెళ్ళి పటముమీదనే దృష్టి ఉంచి తక్కిన వ్యాపారాలన్నీ మానుకొన్నాడు. తన అందచందాలకు వలపు చెందిన వనితలను పెట్టిన విరహాబాధకు ప్రతిఫలముగా తానే యిప్పుడు నూరింతలు బాధ పడడము ప్రారంభించినాడు. క్రమేణా రాజు చిక్కిపోయి కారణ మేమి టని ఆప్తమంత్రులు అడిగితే నిజము చెప్పినాడు. వా రంతా ఆలోచించి కన్యను యాచించడానికి దేవశక్తి దగ్గిరికి సంగమస్వామి అనే బ్రాహ్మణ దూతను పంపినారు. ఆయన కులీనుడు, కార్యవేది, కాలజ్ఞుడు, మధుర వాక్కు కలవాడు. సంగమస్వామి వెలగల పరికరాలు పట్టించుకొని కుండిననగరానికి వెళ్ళి దేవశక్తి దర్శనము చేసి తన ప్రభువుకు ఆయన కన్యను ఇవ్వవలసిందని వేడినాడు.

దేవశక్తి ఆలోచించి సరే అని మదనసుందరిని పిలిపించి బ్రాహ్మణ దూతకు చూపి ఆమెచేత నృత్యము చేయించి, సంగమస్వామిని సుప్రీతునిచేసి సత్కరించి పంపినాడు; "వివాహముహూర్తము నిర్ణయించి ముందుగా మాకు తెలియజేయ వలె" నని చెప్పి సంగమస్వామి వెంట తనదూతను పంపించినాడు.

తనప్రభువుసన్నిధికి చేరి సంగమస్వామి కార్యసిద్ధి అయినదని తెలిపి నాడు. రాజు ప్రతిదూతను సత్కరించి, మదనసుందరికి తనమీద అను రాగ మున్న దని అతనివల్ల విని లగ్నము నిర్ణయించినాడు. తర్వాత సకాలానికి కనకవర్షుడు పరివారసమేతముగా కుండినపురము చేరగానే దేవశక్తి ఎదురు వచ్చి అతనిని రాచనగరులోకి తీసుకుపోయినాడు. ఆరోజు కనకవర్షుడు విశ్రాంతి తీసుకొన్నాడు. మర్నాడు మహా వైభవముతో వివాహము జరిగింది. తనరాజ్యము తప్ప తక్కిన సమస్త సంపదలూ దేవశక్తి అల్లునికి అరణ మిచ్చినాడు. కనకవర్షుడు మామ

గారి యింట్లో పదురోజు లున్నతర్వాత నూతనభార్యతో కనకనగరానికి వెళ్ళినాడు. ఆయనకు అంతఃపురస్త్రీలు ఎంతమంది ఉన్నప్పటికీ రుక్మిణి మీద కృష్ణునకు ఉన్నట్టు మదనసుందరిమీద నే ఎక్కువ అభిమానము.

ఇంతలో వసంతఋతువు వచ్చింది. కోకిలలు కూయ సాగినవి. కనకవర్షుడు అంతఃపురాంగనలతో విహారార్థము మధూద్యానములో ప్రవేశించినాడు. మొదట అందరూ పూలు కోసి జలకేళి కోసము గోదావరీనదిలో దిగినారు. వస్త్రములు లేకుండా కొంతసేపు జలక్రీడ జరిగింది. రాజు ఒకరాణి స్తనములమీద చేతితో నీళ్ళు కొట్టినాడు. మదనసుందరి ఈర్ష్యతో "ఎంతసేపు నదీజలాన్ని కల్లోలము చెయ్యడము?" అని వెలుపలకి వెళ్ళి, చీరకట్టుకొని ప్రియునిమీద కోపగించి తన చెలికత్తెలతో అంతఃపురానికి వెళ్ళిపోయింది.

కనకవర్షుడు సంగతి గ్రహించి జలక్రీడ చాలించి మదనసుందరీ మందిరానికి వెళ్ళినాడు. అక్కడి పంజరాలలో ఉన్న చిలుకలుకూడా రాజుతో లోపలికి వెళ్ళవద్దు అన్నవి. రాజు పోయి కోపముతో ఉన్న మదనసుందరిని చూచినాడు. ఆమె చెక్కిట చెయ్యి పెట్టుకొని నేత్రముల వెంట బాష్పబిందువులు రాలుతుండగా గద్గదస్వరముతో ద్విపదీ ఖండము పాడుతున్నది.

"జఇ విరహో ణ సహిజ్జఇ మాణో సుహో వి పరివజ్జణీఓ తే
విరహో హిఅఅ సహిజ్జఇ మాణో (వ్వ) పరివడ్ఢనీ ఓ తే.
ఇఅ జాణిఊణ ణిఉణం చిత్తను ఓలమ్బిఊణ ఇక్కదరమ్
ఉహ అతడదిణ్ణపాఓ మజ్ఝణి విడిఓ ధువం విణిస్సిహసి."

సహింపలేవేని స్వాంతమా, విరహ
ముజ్జగించుట కోప ముచితము నీకు,
ఒకవేళ విరహంబు నోర్చెద వేని
మానాభివృద్ధియే మంచిది నీకు.

ఇందులో నొకదానినే గ్రహించి
నిపుణమ్ముగా నీవు నిలువగా వలయు.
ఉంచుచో పాదమ్ము లుభయతటాల
మధ్యమునం బడి మడియుట ధ్రువము.

కోపదశలో కూడా చాలా మనోహరముగా ఉన్న ప్రియురాలిని రాజు సమీపించి పెడమొగము పెట్టినప్పటికీ ఆమెను కౌగలించుకొని బతిమాలినాడు. ఆమె చెలికత్తెలు రాజు దోషమును చమత్కారముగా సూచించారు. కనకవర్షుడు తనను నిందించుకొని ఆమె పాదాలమీద వాలినాడు. ఆమె కన్నీరు తుడుచుకొని ప్రసన్నురాలై అతని కంఠము కౌగిలించుకొన్నది. ప్రణయకలహానంతరము రాజు ఆమెతో ఆరాత్రి గడపినాడు.

స్వప్నములో వికృతస్త్రీ కనబడి రాజు మెడలో ఉన్న హారమునూ శిరోరత్నమునూ అపహరించింది. బేతాళుడు వచ్చి రాజుతో మల్లయుద్ధము ప్రారంభించినాడు. రాజు అతనిని భూమిమీద పడవేసినాడు. బేతాళుడు రాజును బుజానఎత్తుకొని ఆకాశమార్గానపోయి సముద్రములో విడిచిపెట్టినాడు. రాజు కష్టముమీద సముద్రతీరము చేరినాడు. చూచుకొనేసరికి అతనిమెడలో హారమూ, తలమీద శిరోరత్నమూ ఉన్నవి.

తెల్లవారిన తర్వాత తనకు పరిచితు డయిన ఒకానొక క్షపణకుడు తనసన్నిధికి వచ్చినప్పుడు రాజు స్వప్నవృత్తాంతము అతనికి చెప్పి ఫలము తెలియజెయ్యవలె నని కోరినాడు.

అందుకు క్షపణకుడు "అప్రియవార్త చెప్పకూడదు. అడిగినప్పుడు సత్యము చెప్పకుండా ఉండరాదు. హారమూ, రత్నమూ పోవడము చేత దేవితోనూ కుమారునితోనూ మీకు వియోగము కలుగుతుంది. సముద్రములోనుంచి ఒడ్డుకు చేరడమువల్ల దుఃఖము తొలిగి సుఖము

కలుగుతుంది. భార్యాపుత్రులతో మళ్ళీ సమాగమము అవుతుంది" అని వివరించినాడు.

రాజు ఆలోచించి "ఇంతవరకూ నాకు కుమారుడు లేడు. ఇక ముందు కలుగుతాడు" అన్నాడు. ఇంతలోకే అక్కడికి రామాయణ పౌరాణికుడు వచ్చినాడు. పుత్రులకోసము పరితపించిన దశరథమహారాజు కథ ఆపౌరాణికునివల్ల రాజు విన్నాడు.

పుత్రోత్పత్తిమీదికి దృష్టి మరలి రాజు ఆలోచనలో పడ్డాడు. ఆరోజల్లా పరధ్యానముగా గడిపినాడు. రాత్రి నిద్రపట్టలేదు. తలుపులు మూసి ఒంటరిగా రాజు గదిలో శయ్యమీద పండుకొని ఉన్నాడు. తలుపులు తెరవకుండానే ఒకానొక స్త్రీ లోపలికి వచ్చింది. చూచి ఆశ్చర్యపడి లేచి రాజు ఆమెకు నమస్కరించినాడు. ఆమె ఆశీర్వదించి "నాయనా నేను నాగరాజు వాసుకి పుత్రికను. మీనాయన నాతమ్ముడు. నాపేరు రత్నప్రభ. కనపడకుండా ఉండి నిన్ను సర్వదా సంరక్షిస్తున్నాను. ఈవేళ నీవు చాలా విచారముతో ఉండడముచేత నీకు కనబడినాను. నీకష్టముచూచి ఓర్చుకోలేను" అని చల్లగా అన్నది.

"అత్తా నీఅనుగ్రహామువల్ల నేను కృతార్థుడను. కుమారుడు లేడని నాకు విచారము కలిగింది. స్వర్గప్రాప్తికోసము దశరథుడు మొదలయిన రాజర్షులు పుత్రులను కోరినారు. నావంటివానికి కొమారునిమీద కోరిక ఉండదా!" అన్నాడు కనకవర్షుడు.

రత్నప్రభ మేనల్లునితో "నాయనా, ఇందుకు మార్గము చూపిస్తాను. కుమారస్వామి సన్నిధికి వెళ్ళి తపస్సు చెయ్యి. నీశిరస్సుమీద కుమార జలధార దుర్భరంగా పడుతుంది. నీశరీరములో నేను ప్రవేశిస్తాను. నీవు ఆభారము ఓర్చుకోగలుగుతావు. అన్నివిఘ్నాలనూ జయించి అభీష్టము పొందుతావు" అని చెప్పి అంతర్ధానము పొందింది. రాజు సంతోషించి మర్నాడు రాజ్యము తనమంత్రుల అధీనము చేసి పుత్రేచ్ఛతో కుమార

స్వామి పాదసన్నిధికి వెళ్ళినాడు.

కనకవర్షుడు తీవ్రతపస్సు ప్రారంభించినాడు. అతని శరీరములో ప్రవేశించిన నాగాంగన రత్నప్రభ శక్తివల్ల అతడు అన్నిశ్రమలూ ఓర్చుకో గలిగినాడు. ఇంతలో కుమారస్వామి జలధార అతనిశిరస్సుమీద పిడుగు వలె పడడము ప్రారంభించింది. లోపల ఉన్న నాగస్త్రీ బలము చేత అతడు ఆభారము సహించినాడు. రాజుకు విఘ్నములు కలిగించ మని కుమారస్వామి వినాయకునితో చెప్పినాడు. ఎడతెగకుండా రాజు తల మీద పడుతున్న జలధారలో వినాయకుడు పెద్ద పామును సృష్టి చేసినాడు. రాజు చలించలేదు. వినాయకుడు తన దంతముతో రాజు రొమ్ము కుమ్మినాడు. కనకవర్షుడు ఆపోట్లు సహించి వినాయకుని ఇలా స్తోత్రము చేసినాడు.

సర్వార్థసంసిద్ధినిధీ, కుంభోపమ స్వరూప, లంబోదరా, విఘ్నేశ్వరా, వ్యాళాలంకారా, నీకు నమస్కారము! గజాననా, నీలీలాచాలిత కరాఘాతముచేత బ్రహ్మదేవుని పంకజాసనమును కదలించి జయింపుము. శంకరప్రియా, నీవు సంతుష్టి నొందని యెడల సురాసుర మునీంద్రులకు గూడ సిద్ధులుండవు. ఘటోదర, శూర్పకర్ణ, గణాధ్యక్ష, మదోత్కట, పాశహస్త, అంబరీష, జంబక, త్రిశిఖాయుధ, అనెడి పాపహరము లయిన నామములతో అష్టషష్టి సంఖ్యాస్థాన నియతముగా నిన్ను దేవతలు నుతించినారు. నిన్ను స్మరించి స్తుతించువారికి రణ రాజకుల ద్యూత, చౌర్య అగ్నిశ్వాపదాది కృతభయము కలుగదు ప్రభూ!

ఇలా వినాయకుని స్తుతించిన కనకవర్షునితో "రాజా, సంతుష్టి పొందినాను. ఇక నీకు విఘ్నము కలుగదు. నీకు కుమారుడు కలుగుతాడు" అని వినాయకుడు అంతర్ధాన మయినాడు.

తనజలపాతభారము ఓర్చుకొన్నందుకు కుమారస్వామి సంతోషించి రాజుతో "ధీరుడా, వరముకోరుకో" అని పలికినాడు. "దేవా,

నీ అనుగ్రహమువల్ల నాకు కుమారుడు కలగవలె" అన్నాడు రాజు. "సరే, నాగణాంశలో నీకు హిరణ్యవర్షు డనే పుత్రుడు పుట్టుతాడు" అని కుమారస్వామి విశేషానుగ్రహము చూపడానికి రాజును గర్భగృహము లోకి రమ్మని పిలిచినాడు.

శాపభయమువల్ల స్త్రీలు స్వామివారి గర్భగృహములోకి వెళ్ళరు. అందుచేత రాజు శరీరములో ఉన్న నాగస్త్రీ అతని దేహము విడిచి కనబడకుండా వెళ్ళింది. రాజు గర్భగుడిలోకి పోయినాడు. కనకవర్షుని కాంతి తగ్గిపోయింది. కుమారస్వామి ఈమార్పు గమనించి ఆలోచించి గ్రహించి "నీవు మోసము చేసినావు. కాబట్టి నీకు పుట్టేపుత్రునితోనూ, భార్యతోనూ, వియోగము కలుగుతుంది" అని శాపము పెట్టినాడు.

రాజు మూర్ఛపోయి తెప్పిరిల్లి లేచి కుమారస్వామిని స్తుతించినాడు. స్వామి సంతుష్టి చెంది "రాజా, నీకు భార్యాపుత్రవియోగము సంవత్సర కాలము మాత్రమే ఉంటుంది. ఈలోగా మూడుసార్లు నీవు అపమృత్యువు తప్పించుకొంటావు. తర్వాత భార్యాపుత్రులతో సంయోగము కలుగు తుంది" అని అనుగ్రహించినాడు. రాజు స్వామికి ప్రణామము చేసి తన రాజధానికి వెళ్ళినాడు. కాలక్రమేణ మదనసుందరీదేవికి కుమారుడు పుట్టినాడు. పుత్రుని వదనము చూచి తల్లిదండ్రులు నిర్భరానందము పొందినారు. కనకవర్ష మహారాజు మహోత్సవము చేసి తనపేరు సార్థక మయ్యేలాగున సువర్ణము అర్థులకు వర్షించినాడు. బిడ్డడు పుట్టిన ఆరవ నాటి రాత్రివేళ ఆకాశాన చిన్నమబ్బు బయలుదేరి త్వరలో నభో మండలము యావత్తూ ఆక్రమించింది. కుంభవృష్టి కురిసింది. ఝంఝా వాతము వృక్షాలను పెకలించి వేసింది. పురిటింటిలో సమస్తరక్షా విధానములూ ఉన్నప్పటికీ, తలుపుగడియవేసి ఉన్నప్పటికీ ఒకానొక స్త్రీ చేతితో చిన్నకత్తి పట్టుకొని ఇంట్లో ప్రవేశించి తల్లిపాలు తాగు తున్న శిశువును అపహరించి అక్కడ ఉన్న పరివారస్త్రీలకు మైకము

కలిగించి బయలుదేరింది. రాణి మదనసుందరీదేవి కేకలు వేసి 'ఎవరో రాక్షసి నాకుమారుణ్ణి ఎత్తుకుపోతున్నది' అని అరిచి వెంట బడ్డది. ఆరాక్షసి శిశువుతోసహా సరస్సులో మునిగింది. రాణి పుత్రమోహము చేత సరస్సులో దూకింది.

ఆకాశము నిర్మలమయింది. తెల్లవారింది. సూతికాగృహములో స్త్రీలు యావన్మందీ రోదనము చేసినారు. కనకవర్షుడు వచ్చి, భార్యా పుత్రులు పోవడముచేత మూర్ఛపోయి, తెప్పిరిల్లి, సంవత్సరభోగ్య మైన కుమారశాపము జ్ఞప్తికి వచ్చేవరికి రోదనము చేసినాడు. మంత్రులు ఎంత ఓదార్చినా శాంతించలేదు.

రాజు క్రమేణ పట్టణము విడిచి వింధ్యారణ్యములో ప్రవేశించి విచారముతో తిరుగుతూ అలిసిపోయి సెలయేటినీరు తాగి వృక్ష చ్ఛాయలో విశ్రమించినాడు. ఇంతలో సింహము భయంకరముగా గర్జిస్తూ రాజుమీాద పడబోయింది. ఎవరో విద్యాధరుడు ఆకాశ మార్గాన వచ్చి సింహాన్ని రెండుముక్కలుగా నరికి, కనకవర్షుని సమీా పించి "ఇక్కడికి ఎందుకు వచ్చినావు రాజా?" అని అడిగినాడు. "నన్ను ఎలా గుర్తించావు?" అన్నాడు రాజు. "వెనుక మనుష్యజన్మలో నేను నీ నగరములో ప్రవ్రాజకుడను. నీసేవ చేసి నీ సహాయంతో బేతాళ సాధనచేసి విద్యాధరుణ్ణి అయినాను. నిన్ను ఆనవాలు పట్టినాను. నీఋణము తీర్చుకోడానికి సింహాన్ని చంపినాను. నాపేరు బంధుప్రభుడు" అని విద్యాధరుడు తెలియజెప్పినాడు.

కనకవర్షుడు సుప్రీతుడై "మిత్రమా, భార్యాపుత్రులు నాకు ఎప్పుడు లభిస్తారో చెప్పు" అన్నాడు. బంధుప్రభుడు విద్యాప్రభావముచేత సమ స్తమూ గ్రహించి "నీవు వింధ్యవాసినీదేవి దర్శనము చేసిన తర్వాత భార్యాపుత్రులతో నీకు పునస్సమాగమము. కాబట్టి అక్కడికి వెళ్ళు. నేను విద్యాధరలోకానికి వెళ్ళుతాను" అని గగనమార్గాన వెళ్ళి

పోయినాడు.

కనకవర్షుడు సంతోషించి నెమ్మదిగా వింధ్యవాసినీ దర్శనార్థము బయలు దేరినాడు. మార్గమధ్యములో వనగజము అతనిని తరిమింది. రాజు గుంటలు ఉన్న వైపు పరుగెత్తినాడు. అడవియేనుగు అతని వెంట బడి, తోవలో గడ్డికప్పి వేసిన గోతిలో పొరపాటున పడి మృతి చెందినది. కనకవర్షుడు కష్టముమీద ప్రయాణము చేస్తూ ఒకానొక సరోవరము చేరి, స్నానము చేసి, తామరతూడులు తిని వృక్షచ్ఛాయలో పండుకొని నిద్రపోయినాడు. ఇంతలో వేటకు వెళ్ళి తమపల్లెకు మరలి పోతున్న శబరులు ఆమార్గాన వస్తూ శుభలక్షణోపేతు డయిన కనకవర్షుని చూచి అమ్మవారికి బలి ఇవ్వడానికి తగినవా డని తలచి పట్టుకొని వెళ్ళినారు. శబరునాయకు డైన ముక్తాఫలుడు కనకవర్షుని వింధ్యవాసినీ దేవి మందిరానికి తీసుకు పోయినాడు. దేవీదర్శనము చేసి కనకవర్షుడు నమస్కారము చెయ్యగానే అతని కట్లు తెగి రాలిపోయినవి. శబరునాయకుడు ఆశ్చర్యపడి అతనిని బలి ఇవ్వకుండానే వదలిపెట్టినాడు. అమ్మవారి అనుగ్రహముచేతనూ, కుమారస్వామి వరప్రభావముచేతనూ అతనికి మూడవసారి మరణము తప్పిపోయింది. ఇంతలో శాపముకూడా పూర్తి అయింది. అతని అత్త నాగాంగన మదనసుందరినీ కుమారుణ్ణీ కూడా తీసుకువచ్చి "కనకవర్షా, కుమారస్వామివారి శాపము సంగతి తెలిసి, వీళ్ళను మా నివాసానికి తీసుకుపోయి కాపాడినాను. నేటితో నీ శాపము తీరింది. భార్యాపుత్రులను తీసుకు వెళ్ళి సుఖంగా రాజ్యము చేసుకో" అని చెప్పింది.

పునస్సమాగమము అయిన తర్వాత భార్యాభర్తలు చాలా ఆనందించారు. శబరనాయకు డైన ముక్తాఫలుడు కనకవర్షప్రభువు సంగతి తెలుసుకొని అతని పాదాలమీద వాలి క్షమార్పణ పొంది వారందరినీ తనపల్లెకు తీసుకొని వెళ్ళి సమస్తోపచారాలూ మర్యాదలూ చేసినాడు.

కనకవర్షుడు ఆప్రదేశమునుంచి దూతలను పంపి శీఘ్రముగా దేవశక్తినీ, రాజధానినుంచి సేననూ రప్పించి, ఆజయమేఘమునుమీద మదనసుందరీదేవిని ఎక్కించినాడు. కుమారస్వామి తనకుమారునికి హిరణ్యవర్షుడని నామకరణము చేసినట్లు తెలుసుకొన్నాడు. ఆబాలుని తనవెంటను భద్రగజముమీద ఎక్కించి బయలుదేరి కొన్నిరోజులలో విదర్భదేశ రాజధాని అయిన కుండినవగరము చేరినాడు. అక్కడ అతని మామ సమస్త ఉపచారాలూ చేయించినాడు. కుండినవగరములో అన్నిభోగములూ అనుభవిస్తూ కొన్నాళ్లు ఆగి తర్వాత కనకపురము వెళ్ళి కనకవర్షుడు మదనసుందరీదేవిని పట్టమహిషిని చేసినాడు. నిత్యోత్సవాలు చేస్తూ ఆరాజు మళ్ళీ వియోగముగాని విచారముగాని లేకుండా బహుకాలము ఆనందముతో రాజ్యము చేసినాడు.

ఈప్రకారము గోముఖుడు చెప్పిన కథవిని అలంకారవతి నరవాహనదత్తుడూ చాలాసంతోషించారు.

గోముఖుడు చెప్పిన కథ విని నరవాహనదత్తుడు సంతోషించినాడు. ఈర్ష్యవల్ల మరుభూతిముఖము వెల వెల బొరింది. ప్రభువు అతని నైఖరి కనిపెట్టి మృదువాక్కులతో "మరుభూతీ, నీవుకూడా ఏ మయినా కథ చెపుతావా?" అన్నాడు. ఉత్సాహము పొందిన మరుభూతి ఈప్రకారముగా కథ ప్రారంభించినాడు:

## మ హీ పా లు ని క థ

పూర్వకాలములో కమలపురములో చంద్రస్వామి అనే బ్రాహ్మణుడు ఉండేవాడు. అతనిభార్య దేవమతి. వారికి శుభలక్షణ సంపన్నుడైన కుమారుడు కలిగినాడు. ఆబాలకుడు పుట్టగానే ఆకాశవాణి "చంద్రస్వామీ, ఈశిశువుకు మహీపాలుడు అని నామకరణము చెయ్యి. ఈకుర్రవాడు ముందుముందు రాజయి బహుకాలము రాజ్యము

చేస్తాడు" అని పలికింది. చంద్రస్వామి ఆనందించి పండుగచేసి కుమారునికి మహీపాలుడు అని పేరు పెట్టినాడు. బిడ్డడు పెరిగి పెద్దవాడయి విద్యలు అభ్యసిస్తూ, ధనుర్వేదము కూడా బాగా నేర్చినాడు. ఇలాఉండగా కొంతకాలానికి దేవమతి చక్కదనాల ఆడుబిడ్డను కన్నది. పిల్లకు తండ్రి చంద్రవతి అని పేరు పెట్టినాడు. అన్నా చెల్లెలూ దినదిన ప్రవృద్ధి పొందుతున్నారు.

ఇంతలో ఆ దేశాన వర్షాలు కురవలేదు. ఆకూ అలమూ మాడి పోయినవి. కరువు వచ్చింది. అక్కడి రాజు కమలవర్మ ఆ కాటకసమయములో న్యాయమార్గము విడిచి దుర్మార్గము అవలంబించి లోకులధనము అపహరించడము ఆరంభించినాడు. దేశములో కల్లోలము హెచ్చింది. దేవమతి ఒకనాడు భర్తతో "ఈ రాష్ట్రము విడిచి మాతండ్రిగారి గ్రామానికి పోదాము. ఇక్కడ ఉంటే అన్నములేక బిడ్డలు చచ్చిపోతారేమో!" అని విచారపడ్డది. అందుకు చంద్రస్వామి భార్యతో "ఇటువంటి రోజుల్లో ఇల్లువిడిచి వెళ్ళకూడదు. పిల్లలను తీసుకు వెళ్ళి మామాయనగారి యింట్లో దిగబెట్టి నేను త్వరలోనే వస్తాను. నీవు ఎక్కడికీ కదలకు" అని ఒప్పించి, బిడ్డలను తీసుకొని మామగారి యింటికి బయలుదేరినాడు.

మార్గములో మరుభూమి తగిలింది. చెట్లు దూరదూరముగా ఉన్నవి. అన్నీ యెండిపోయినవి. ఎండవేడికి ఇసుక కాలుతున్నది. చంద్రస్వామి తనబిడ్డలను ఒకచోట ఉంచి, మంచినీళ్ళు తేవడానికి బయలుదేరినాడు. ఇంతలో సింహదంష్ట్రుడు అనే శబరనాయకుడు ఆమార్గాన వెళ్ళుతూ బ్రాహ్మణుని చూచినాడు. అతడు మంచినీళ్ళ కోసము వెదుకుతున్నా డని తెలుసుకొని జల మున్నచోటికి ఆయనను తీసుకొని వెళ్ళవలసిం దని అనుచరులకు సంజ్ఞ చేసినాడు. ఇద్దరు భిల్లులు ఆ అమాయిక బ్రాహ్మణుని తమపల్లెకు తీసుకొనివెళ్ళి కాళ్ళూ చేతులూ కట్టివేశారు. తనను దేవతకు బలి ఇవ్వడానికి కట్టివేశారని చంద్రస్వామి

గ్రహించి అరణ్యములో తాను విడిచి వచ్చిన బిడ్డలను తలుచుకొని "అయ్యో, మహీపాలా! అయ్యో, చంద్రవతీ! అరణ్యములో మిమ్మలిని సింహశార్దూలాలకు విడిచి వచ్చాను. నన్ను ఆటవికులు పట్టుకొన్నారు. రక్షించేవాళ్లు లేరు" అని దుఃఖించి సూర్యుని చూచి "అజ్ఞానము విడిచి పెట్టి ఈసూర్యభగవానుని స్తుతిస్తాను" అని స్తోత్రము ఆరంభించినాడు:

విభో, పరాపరాకాశశాయి జ్యోతివి, బాహ్యాభ్యంతర తమో విదారకుడవు అయిన నీకు నమస్కారము! నీవు త్రిజగద్వ్యాపి అయిన విష్ణుమూర్తివి! శ్రేయస్సులకు నిధి అయిన మహేశ్వరుడవు. ప్రసుప్తమయిన విశ్వమునకు చేష్ట కలిగించు ప్రజాపతివి నీవు! ప్రకాశహీను లయిన అగ్నిచంద్రులు ప్రకాశించవలె నను దయచేత ఉంచినట్లు వారలయందు నీ తేజస్సునుంచి యామినీసమయమున అంతర్ధానము పొందుచున్నావు. భాస్వన్, నీ యుదయమున రాక్షసులు, దస్యులును పలాయనము చేయుదురు; గుణవంతులు ప్రమోదింతురు. త్రిలోకైక ప్రదీపా, శరణాపన్నుడ నైన నన్ను రక్షింపుము. ఈ దుఃఖాంధకారమును పోద్రోలి నన్ననుగ్రహింపుము.

ఇట్లు భక్తితో చంద్రస్వామి చేసిన స్తుతికి ఆకాశమునుంచి అశరీరవాణి "చంద్రస్వామీ, సంతోషము. నీఆపద తప్పిపోతుంది. నాఅనుగ్రహము వల్ల నీకు పుత్రాదులతో సమాగమము అవుతుంది" అని వినబడ్డది. ఈవాక్కులకు ధైర్యము తెచ్చుకొని శబరులు సిద్ధము చేసిన స్నాన భోజనాదులు చేసినాడు చంద్రస్వామి.

చెల్లెలితో అరణ్యములో ఉన్న మహీపాలుడు తండ్రి రాకపోవడము వల్ల ఏదో కీడు మూడిందని అనుమానిస్తున్నాడు. ఇంతలో సార్థధరుడనే గొప్ప వర్తకుడు బిడారముతో ఆమార్గాన వెళ్ళుతూ మహీపాలుని సంగతి అడిగి తెలుసుకొని, అన్నాచెల్లెళ్ళను తన దేశానికి తీసుకు వెళ్ళినాడు. తనను పుత్రునివలె ఆదరిస్తున్న వర్తకునిగృహములో ఉంటూ

మహీపాలుడు బ్రాహ్మణోచిత మైన అగ్ని కార్యము చేస్తున్నాడు.

తారాపురప్రభు వైన తారాధర్ముని మంత్రి అనంగస్వామి. ఆబ్రాహ్మణుడు చతురంగబలముతో ఆపట్టణములోనుంచి వెళుతూ తమ స్నేహితుడయిన సార్థధరుని యింటికి వచ్చి విశ్రాంతి తీసుకొంటున్నాడు. అగ్ని కార్యము చేస్తున్న మహీపాలుడు ఆయనకు కనబడినాడు. అనంగస్వామి ఆబాలుని వృత్తాంతము వర్తకునివల్ల తెలుసుకొని తనకు సంతానము లేనందున "బాలుని నాకు ఇస్తే పెంచుకొంటాను" అని అడిగినాడు. వర్తకుని సమ్మతిమీద మహీపాలుని, చెల్లెలిని తారాపురానికి తీసుకువెళ్ళినాడు. మహీపాలుడు సమస్తసంపదలతో నిండిన మంత్రిభవనములో సుఖముగా ఉంటూ విద్యలు అభ్యసిస్తున్నాడు.

శబరనాయకుడు సింహదంష్ట్రుడు తనవల్లెకు మరలివచ్చి చంద్రస్వామిని చూచి "బ్రాహ్మణోత్తమా! సూర్యభగవానుడు నాకు స్వప్నములో కనిపించి నిన్ను చంపరాదనీ, నిన్ను ఆదరించి భోజనాదులు సమకూర్చవలసిందనీ ఆజ్ఞ ఇచ్చాడు. లే; నీయిష్టము వచ్చినచోటికి పోదువుగాని" అని చెప్పి ముత్యాలు కస్తూరి మొద లయినవి ఇచ్చి సన్మానించి తన అనుచరులను ఆయనకు తోడు పంపినాడు.

చంద్రస్వామి అరణ్యములో ఎక్కడ వెతికినా బిడ్డలు కనబడ లేదు. తిరిగి తిరిగి చివరకు సముద్రతీరాన ఉన్న జలపురము చేరి బ్రాహ్మణుని యింట అతిథిగా వెళ్ళి ప్రసంగవశాన తన స్థితిగతులు చెప్పినాడు. ఆ యజమాని "ఆర్యా, కనకవర్మ అనే వర్తకుడు కొద్దిరోజుల క్రిందట ఇక్కడికి వచ్చినాడు. అరణ్యమార్గములో అతనికి ఇద్దరు బ్రాహ్మణబిడ్డలు దొరికినారు. మంచిలక్షణాలు కలిగిన ఆబిడ్డలను కనకవర్మ నారికేళద్వీపానికి తీసుకువెళ్ళినాడు. ఆ బిడ్డలు నామధేయాలు నాకు తెలియవు." అని చెప్పినాడు. వారు తనబిడ్డలే అని నిశ్చయించుకొని చంద్రస్వామి ఆరాత్రి అక్కడే గడిపి మర్నాడు నారికేళద్వీపానికి వెళుతున్న

విష్ణువర్మ అనే వర్తకుని పడవలో ఎక్కి ఆద్వీపానికి వెళ్ళినాడు.

అక్కడికి వెళ్ళినతర్వాత "కనకవర్మ అడవిలో దొరకిన బిడ్డలతో ఇక్కడికి వచ్చి పనిమీద కటాహద్వీపము వెళ్ళినాడు" అని చంద్రస్వామికి ఎవరో చెప్పినారు. అంతట దానవర్మ అనే వర్తకుని ఓడలో ఎక్కి కటాహద్వీపము చేరినాడు.

కనకవర్మ బిడ్డలతో కర్పూరద్వీపము వెళ్ళినట్లు అక్కడివారు చెప్పడముచేత చంద్రస్వామి కర్పూరద్వీపము వెళ్లి అక్కడ కనకవర్మ లేడంటే సువర్ణద్వీపానికి, తర్వాత సింహళద్వీపానికీ వెళ్లినాడు. కనకవర్మ చిత్రకూటనగరానికి వెళ్ళినట్లు సింహళములో తెలుసుకొని చంద్రస్వామి చిత్రకూటముచేరి కనకవర్మను కలుసుకొని బిడ్డలసంగతి అడిగినాడు. కనకవర్మ తనకుదొరికిన బిడ్డలనుచూపినాడు. వాళ్ళు చంద్రస్వామిసంతానము కాలేదు. అప్పుడతడు "అయ్యో నాబిడ్డలుదొరకలేదు. విధాత వృథా ఆశ పెట్టి బహుదూరప్రదేశాలు తిప్పినాడు. అని వాపోయినాడు.

కనకవర్మ అతనిని ఓదార్చినాడు. "సంవత్సరములోగా బిడ్డలు దొరకకపోతే గంగాతీరాన తపఃపూర్వకంగా దేహము చాలిస్తాను" అని చంద్రస్వామి ప్రతిజ్ఞ చేసినాడు. అక్కడ ఉన్న జ్ఞాని ఒకాయన ఈమాటలు విని "ఆర్యా, నారాయణీదేవి అనుగ్రహమువల్ల నీకు బిడ్డలు లభిస్తారు" అన్నాడు.

చంద్రస్వామి సంతోషించి సూర్యభగవానుని స్మరించి వర్తకుని వీడ్కొని బయలుదేరి ప్రయాణము చేసి చేసి ఒకసాయంకాలము అరణ్యములో ప్రవేశించాడు. అక్కడ పండ్లుతిని నీరుతాగి అడవిజంతువుల భయముచేత చెట్టెక్కి కూర్చున్నాడు. ఎంతకూ నిద్ర పట్టలేదు. అర్ధరాత్రి అయ్యేసరికి నారాయణీదేవి తక్కిన మాతృకలతోసహా అక్కడికి వచ్చింది. రకరకాల ఉపహారాలు తీసుకొని మాతృకలు భైరవదేవునికోసము ఎదురుచూస్తూన్నారు. ఈరాత్రి ఎందుకు ఆలస్యము

చేస్తున్నాడో భైరవదేవుడు!" అని వాళ్లు అడిగితే నారాయణీదేవి నవ్వింది. చెప్పమని వాళ్ళు బలవంతపెడితే ఆమె "ఈసంగతి చెప్పడానికి సిగ్గుగా ఉంటుంది. అయినా చెపుతాను" అని ఇలా ప్రారంభించింది:

## విద్యాధరి కథ

సురపురప్రభువు సురసేనుడు; ఆయన కొమార్తె విద్యాధరి. విమలప్రభువు కుమారుడు. ప్రభాకరునికి ఆచక్కనిచుక్కను ఇచ్చి . పెండ్లి చేశాడు. అత్తవారింటికి విద్యాధరి వెళ్ళి రాత్రి భర్తతో శయనించింది. భర్త నపుంసకు డని గ్రహించి విద్యాధరి విచారపడి తండ్రికి లేఖ వ్రాసింది. సురసేనుడు చాలాకోపించి విమలప్రభువుకు జాబువ్రాసినాడు. "నీవు మోసము చేసి నపుంసకునికి నాపుత్రికను భార్యను చేసినావు. నిన్ను సంహారించక తప్పదు. చేసిన పనికి ఫలము అనుభవించు" అని ఆ లేఖ తాత్పర్యము. విమలుడు భయపడి మంత్రులతో ఆలోచించినాడు. 'సురసేనుడు చండశాసనుడు, అతనికోపము పోగొట్టె ఉపాయ మేమిటి' అని రాజు అంటే, పింగదత్తుడు అనేమంత్రి "దేవా, ఉపాయ మున్నది. స్థూలశిరు డనే యక్షుని ఆరాధించే మంత్రము నాకు తెలుసును. ఆ మంత్రము ఉపదేశిస్తాను. దాని ప్రభావమువల్ల యక్షుడు సుప్రీతుడై వరము కోరుకో అంటాడు. అప్పుడు మీ కుమారునికి లింగము అనుగ్రహించ మని కోరండి. సురసేనుడు సంతృప్తి పొంది వైరము మానుతాడు" అని బోధించినాడు.

అంతా యథావిధిగా జరిగింది. ప్రభాకరుడు పురుషు డయినాడు, యక్షుడు నపుంసకు డయినాడు. విద్యాధరి భర్తవల్ల సౌఖ్య మనుభవించి తండ్రికి జాబు వ్రాసింది. నేను పొరపాటు పడ్డా నన్నది. నాభర్త సుందరుడు, పురుషపుంగవుడు అన్నది. ఆమెతండ్రి శాంతించినాడు.

ఈ సమాచారాలు తెలిసి భైరవుడు స్థూలశిరుని పిలిపించి కోపగించి

"మూర్ఖుడా, నీవు చేసినపనికి పండుడవై ఉంటావు. ప్రభాకరుడు మరణించే వరకూ వీర్యవంతుడుగా ఉంటాడు" అని శాపము పెట్టినాడు. ఈ వ్యవహారము కుదటపడడములో భైరవదేవుని రాకకు ఆలస్య మయింది. ఇక త్వరలోనే వస్తాడు."

నారాయణీదేవి ఇలా అంటూ ఉండగానే చక్రేశ్వరుడైన భైరవుడు వచ్చినాడు. యోగినులు ఆయనను అర్చించినారు. భైరవుడు కొంచెము సేపు నాట్యము చేసినాడు. వృక్షముమీదనుంచి చూస్తున్న చంద్రస్వామికి నారాయణీదేవి పరివారములో ఒకతెమీద అభిలాష కలిగింది. ఆయువతి అతనిని చూడడము సంభవించింది. ఇద్దరికీ పరస్పరమూ ప్రణయము అంకురించింది. భైరవదేవుడు మాతృకలతో కూడా బయలుదేరి పోతూ ఉంటే నారాయణీదేవి కొంచెము ఆగి, చంద్రస్వామిని చెట్టుదిగి రమ్మని "మీకు అన్యోన్యాభిలాష ఉన్నదా!" అని ఇద్దరినీ అడిగింది. అవును దేవీ, అని ఉభయులూ సత్యము చెప్పినారు.

వారు నిజము చెప్పినందువల్ల దేవి కోపము పోయింది. "సత్యము చెప్పినారు. మీకు శాపము పెట్టను. ఈదాసిని నీకిస్తాను. ఉభయులూ సుఖముగా ఉండండి" అని దేవి అనుగ్రహించింది. చంద్రస్వామి "దేవీ, మనస్సు చంచల మయినది. అయినా నిగ్రహిస్తాను. చిత్తచాంచల్యము కలుగుతుంది. శరీరదోషము మాత్రము నాకు వద్దు. పరస్త్రీ అక్కర లేదు" అని విన్నవించినాడు. దేవి అతని ధీరవాక్కులకు సంతోషించి నీబిడ్డలు త్వరలో దొరుకుతారు అని వర మిచ్చి ఎన్నడూ వాడి పోకుండా ఉండే, విషము హరించగలిగిన నల్లకలువ అతని కిచ్చి పరిచారికతో కూడా అంతర్ధాన మయింది.

చంద్రస్వామి తెల్లవారగానే బయలుదేరి తిరిగి తిరిగి చివరకు తారాపురము చేరుకొన్నాడు. అక్కడి మంత్రి అతిథిప్రియు డని విని ఆయనయింటికి వెళ్ళి ద్వారప్రదేశాన నిలుచుని వేదము చెప్పుతున్నాడు.

ప్రతీహారుడు విన్నవించడముచేత మంత్రి వచ్చి అతనిమాటలు విని బ్రాహ్మణుడు విద్వాంసు డని గ్రహించి భోజనానికి ఉండమని ఆహ్వానించినాడు. చంద్రస్వామి స్నానార్థమై పవిత్ర మైన అనంగహ్రదానికి వెళ్ళి స్నానము చేసి తిరిగి వస్తుంటే అయ్యో అయ్యో అని కేకలు వినబడినవి. ఏమిటని బ్రాహ్మణుడు అడిగితే ప్రజలు ఇలా చెప్పినారు. "మంత్రిగారి పెంపుడు బిడ్డ, రాజుగారికి ప్రీతిపాత్రుడును అయిన మహీపాలుడు అనే బ్రాహ్మణబాలుని తాచుపాము కరిచింది. ఎరిగినవాళ్ళు అంతా విచారపడుతున్నారు."

ఆ బాలుడు తనకుమారుడే అని ఊహించి వెంటనే మంత్రి యింటికి వెళ్ళి మహీపాలుని చూచి గుర్తుపట్టి నల్లకలువ బాలుని ముక్కుదగ్గర పెట్టినాడు. పువ్వుపరిమళమువల్ల విషము దిగిపోయింది. బాలుడు నిద్ర పోయి మెలకువ వచ్చి లేచినట్లు లేచినాడు. చంద్రస్వామి దేవాంశవల్ల పుట్టిన మహానుభావు డని మంత్రి మొదలయినవారు భావించినారు. రాజు ఉత్సవము చేయించి చంద్రస్వామిని గౌరవించినాడు.

చంద్రస్వామి మంత్రియింట్లోనే ఉండి తనకుమారుని, కూతురునీ చూస్తూ సంతోషముతో కాలక్షేపము చేస్తున్నాడు. వాళ్లు ఒకరి నొకరు గుర్తు పట్టినప్పటికీ నిజవృత్తాంతము బయలుపెట్ట లేదు. ఆలోచనాపరులు తరుణము వచ్చేవరకూ రహస్యము బయలుపెట్టరు.

తారావర్మ మహారాజు తనకుమార్తె బంధుమతిని మహీపాలుని కిచ్చి వివాహము చేసి అర్ధరాజ్య మిచ్చినాడు. పుత్రుడు లేకపోవడము చేత తారావర్మ కొన్నాళ్ళకు అల్లునికి రాజ్య మంతా అప్పగించి శాంతముగా కాలము గడపడము ప్రారంభించినాడు.

రాజ్యము సంపూర్ణముగా తనచేతికి రాగానే మహీపాలుడు చంద్రస్వామి తన తండ్రి అని వెల్లడిచేసి తన చెల్లెలిని యోగ్యుని కిచ్చి వివాహము చేసినాడు.

ఇకనాడు మహీపాలునితో చంద్రస్వామి "నాయనా, ఒకసారి స్వదేశానికి వెళ్ళి మీఅమ్మను తీసుకొని వస్తాము. నీవు రాజువు అయి తనను మరచిపోయినావని భావించి నీతల్లి దుఃఖపడవచ్చును. ఒకవేళ శాపము పెట్టినా పెట్టవచ్చును. తల్లిశాపముగాని తండ్రిశాపముగాని పొందినవాడు కష్టాలపాలవుతాడు. అందుకు ఉదాహరణము విను:

## చక్రశ్రేష్ఠి కథ

ధవళపురములో చక్రశ్రేష్ఠి అనే వర్తకులబిడ్డ ఉన్నాడు. తల్లిదండ్రులు వద్దని అడ్డుపెట్టినా వాడు లక్ష్యపెట్టక వ్యాపారము నిమిత్తము స్వర్ణద్వీపానికి వెళ్ళినాడు. అక్కడ అయిదేళ్ళు వర్తకము చేసి చాలా ధనము సంపాదించి రత్నాలు మొదలయినవి ఓడలో నింపుకొని చక్రశ్రేష్ఠి ఇంటికి బయలుదేరినాడు. పడవ గమ్యస్థానానికి కొద్ది దూరములో ఉండగా మేఘము పట్టి గాలివాన కొట్టింది. తల్లిదండ్రులను ధిక్కరించినవాడు ఎందుకు ఇల్లు చేరాలి అనే కోపముచేత కొట్టినట్టు కొట్టి ఓడను ముంచివేసింది. చక్రశ్రేష్ఠి ఆయుర్దాయము ఉండడముచేత ఎలాగో ఒడ్డున పడ్డాడు. అలిసిపోయిన అతనికి స్వప్నము వచ్చింది. అందులో పాశహస్తుడైన పురుషుడు అతనిని కట్టివేసి లేపి, సభలో సింహాసనముమీద కూర్చున్న పురుషుని సన్నిధిలో నిలిపినాడు. ప్రభువు ఏదో ఆజ్ఞ యిచ్చినాడు. వెంటనే పాశహస్తుడు చక్రశ్రేష్ఠిని తీసుకువెళ్ళి ఇనపయింట్లో పడవేసినాడు.

ఆయింట్లో ఒకానొక పురుషుడు కూర్చుని ఉన్నాడు. అతని నెత్తిమీదుగా వేడి యినుపచక్రము తిరుగుతున్నది. చక్రశ్రేష్ఠి అతన్ని చూచి "ఎవరు నీవు బాబూ? ఏ పాపమువల్ల ఈపీడ పట్టుకొన్నది? ఎలా బతికి ఉండ గలిగావు!" అని అడిగినాడు.

అందుకు ఆపురుషుడు ఇలా చెప్పినాడు: "నేను వైశ్యకుమారుడను.

పేరు ఖడ్గుడు. తమమాట వినవందుచేత తల్లిదండ్రులు నాకు శాప మిచ్చి నారు. నేను దుఃఖించాను. వారు జాలిపడి ఈశాపము నెలరోజులు మాత్రము అనుభవిస్తావు అని చెప్పినారు. ఆరోజల్లా విచారముతో గడిపాను. రాత్రి స్వప్నములో భీకరాకారుడు కనిపించి నన్ను బల వంతాన పడవేసి ఈలోహచక్రము శిరస్సు మీాద పెట్టినాడు. ప్రాణ ములు పోవడము లేదు. మాసము గడిచింది. ఈలోహచక్రము ఇంకా నన్ను వీడి పోలేదు.''

ఖడ్గునిమాటలు విని చక్రుడు జాలిపడి ''బాబూ, నేను ధనార్జనకు బయలుదేరుతూ తల్లిదండ్రులమాటలు వినలేదు. వారి శాపప్రకారము నేను సంపాదించిన ధనము యావత్తూ పోయింది. మళ్ళీ వర్తకముచేసినా ధనము లభించను. ఈజన్మలో నేను చెయ్యవలసినపని కనబడడము లేదు. ఆ లోహచక్రము నాశిరస్సుమీాద పెట్టు. నీశాపము తీరిపో తుంది'' అన్నాడు. అప్పుడు ఆకాశవాణి ''ఖడ్గా, నీశాపము ముగిసింది. చక్రము ఇతనినెత్తిమీాద పెట్టు'' అని ఆకాశవాణి వినబడ్డది. ఖడ్గుడు ఆప్రకారమే చేసినాడు. దివ్యపురుషుడు వచ్చి అతనిని తల్లిదండ్రుల సన్నిధికి ఎత్తుకు వెళ్ళినాడు. అప్పటినుంచీ ఖడ్గుడు తల్లిదండ్రులమాట జవదాటకుండా సుఖముగా ఉన్నాడు.

చక్రశ్రేష్ఠి శిరస్సుమీాదికి చక్రము రాగానే దానితో ''లోకములో ఉన్న పాపాత్ములను విముక్తి చెయ్యి. అందరిపాపము క్షీణించి పోయే వరకూ నీవు నాశిరస్సు మీాదనే ఉండు'' అన్నాడు. ఆమాటలకు దేవతలు అతనిమీాద పుష్పములు చల్లి ''మహాసత్వా, ఇంతటి కరుణ వల్ల నీపాపము క్షయించింది. నీకు అక్షయ సంపద కలుగుతుంది'' అన్నారు. వెంటనే లోహచక్రము అదృశ్యమయింది. ఇంద్రుడు పంపిన రత్నములు పట్టుకొని విద్యాధరకుమారుడు వచ్చి మెచ్చి చక్రుని తన ఒడిలో కూర్చోబెట్టుకొని ధవళపురములో అతని తల్లిదండ్రుల దగ్గర

విడిచి వెళ్ళినారు. తనవృత్తాంత మంతా చక్రుడు బంధువు లందరికీ చెప్పి ధర్మమార్గము తప్పక సుఖముగా ఉన్నాడు.

ఈకథ చెప్పి చంద్రస్వామి "నాయనా, జననీజనకులకు విరుద్ధముగా ఉంటే అలా అయింది. వారియెడల భక్తి ఉంటే ఎటువంటి ఫలము కలుగుతుందో విను" అని ఇలా చెప్పినాడు:

## మహాతపుని కథ

పూర్వకాలములో ఒకముని అరణ్యములో తపస్సు చేస్తూ ఉన్నాడు. ఒకనాడు ఆయన చెట్టునీడలో కూర్చుని ఉండగా వృక్షముపై నుంచి బలాక "ఒకరెకము కొంగ" ఆయనమీద రెట్ట వేసింది. కోపము వచ్చి ఆయన దానికేసి చూచేసరికి అది భస్మమై నేలమీద రాలింది. నేను తపస్సంపన్నుడ నన్న అహంకారము మునికి కలిగింది. తర్వాత కొన్నాళ్ళకు ఆయన నగరములోకి వెళ్ళి, ఒక బ్రాహ్మణగృహముదగ్గర నిలుచుని ఇల్లాలిని భిక్ష వేడినాడు. "తీరిక లేదు. యజమానిక శుశ్రూష చేస్తున్నాను. కాస్తసేపు ఆగు" అన్నది అగృహిణి. కోపముతో ముని ఆమె కేసి చూచినాడు. ఆపతివ్రత అతనితో "ముని, నేను కొంగను కానుసుమా" అన్నది. ఈమె కీసంగతి ఎలా తెలిసిందో అని ఆశ్చర్య పడుతూ ముని అక్కడ కూర్చున్నాడు. గృహిణి భర్త చేసే అగ్ని కార్యములో తోడ్పడి తర్వాత వచ్చి మునికి భిక్ష పెట్టింది. ముని ఆమెకు నమస్కరించి "తల్లీ, ఎక్కడో జరిగిన సంగతి నీ కెలా తెలిసిందో చెపితే తర్వాత భిక్ష స్వీకరిస్తాను" అన్నాడు. "భర్తసేవకంటే నాకు వేరే ఏమీ తెలియదు, అందుచేతనే ఇటువంటి జ్ఞానము కలిగిం దను కుంటాను. ఇక్కడ సమీపములో ధర్మవ్యాధు డనే మాంసవిక్రేత ఉన్నాడు. ఆయనదగ్గిరికి వెళ్ళితే నీకు శుభము కలుగుతుంది" అన్నది. ముని భిక్ష గ్రహించి ఆమెకు ప్రణామము చేసి వెళ్ళినాడు.

మర్నాడు ముని బజారులో మాంసము విక్రయిస్తున్న ధర్మ వ్యాధుని దగ్గరికి పోయినాడు. అతనిని చూచి "స్వామీ, ఆపతివ్రత నిన్ను ఇక్కడికి పంపించిందా?" అన్నాడు ధర్మవ్యాధుడు. ముని ఆశ్చర్యపడి "మాంసము అమ్మే నీకు ఇటువంటిజ్ఞానము ఎలా కలిగింది?" అన్నాడు. "స్వామీ, తల్లిదండ్రుల సేవ నాకు ప్రధానము. వారికి స్నానము చేయించి నేను స్నానము చేస్తాను. వారికి భోజనము పెట్టి నేను భోజనము చేస్తాను. వారిని పరుండబెట్టినతర్వాత నేను పడుకొంటాను. ఇతరులు చంపి తెచ్చిన జంతువులమాంసము జీవనార్థము విక్రయిస్తాను. ధనముమీద ఆశ లేదు. జ్ఞానానికి అహంకారము చాలా అడ్డము. ఆపతివ్రత, నేనూ అహంకారము విడిచిపెట్టినాము. నీవుకూడా అహంకారము విడిచి తపస్సుచేసి స్వధర్మము ఆచరిస్తే జ్ఞానజ్యోతి కనిపిస్తుంది" అని ధర్మవ్యాధుడు బోధించినాడు. ముని అతనియింటికి వెళ్ళి ప్రవర్తనము చూచి అతని ఉపదేశానుసారముగా అరణ్యములో తపస్సు చేసి సిద్ధుడయినాడు. ధర్మవ్యాధుడు, ఆసాధ్వికూడా ధర్మ చర్యవల్ల సిద్ధిపొందినారు.

భర్తకూ తల్లిదండ్రులకూ భక్తితో శుశ్రూష చేయడమువల్ల అటువంటి ప్రభావము కలుగుతుంది. కాబట్టి నీజననిని చూడబోదాము.

ఈప్రకారము చంద్రస్వామి చెప్పినమీదట మహీపాలుడు సమ్మతించి తన ధర్మపిత అయిన అనంతస్వామికి చెప్పి రాజ్యము అప్పగించి రాత్రి వేళ తండ్రితోకూడా బయలుదేరినాడు. క్రమేణ స్వదేశము చేరి తల్లిని ఆనందపరిచినాడు. జరిగిన వృత్తాంతాలన్నీ చెపుతున్న తండ్రితోనూ, ఆదరిస్తున్న బాంధవులతోనూ కొద్దిరోజులు గడిపినాడు.

తారాపురములో అతని భార్య బంధుమతీదేవి ప్రాతఃకాలాన నిద్ర లేచి భర్త కనబడక పోవడముచేత వెతికించి విఫల మనోరథురాలయి శోకోద్యానములో తిరిగి తిరిగి విచారమువల్ల మరణానికి ఉన్ముఖురాలై

లయింది. అప్పుడు మంత్రి అనంతస్వామి ఆమెను ఊరడించి "అమ్మా, మహీపాలుడు పనిమీద పరదేశము వెళ్ళినాడు. త్వరలోనే తిరిగి వస్తాడు" అని చెపితే బంధుమతి ఎలాగో శాంతించింది. పరదేశాల నుంచి వస్తున్న బ్రాహ్మణులను ఆమె సత్కరించి భర్తసంగతి అడుగు తున్నది. అందులో సంగమదత్తుడనే బ్రాహ్మణునికి తనభర్త ఆనవాలు చెప్పి వృత్తాంతము అడిగితే ఆయన "దేవి, అటువంటి పురుషుని నేను చూడలేదు. ఆశ్చర్యపడకు. సత్కార్యాలు చేస్తూ ఉంటే కాలక్రమేణ కార్యసిద్ధి అవుతుంది. నేను చూచిన విచిత్రవిషయ మొకటి నీకు చెవు తాను అని కథ ఆరంభించినాడు:

## త్రి భు వ న రా జు క థ

నేను తీర్థయాత్రలు చేస్తూ హిమాలయ పర్వతాలలో ఉన్న మానస సరస్సుకు వెళ్ళి, అక్కడ అద్దమువంటి మణి మందిరము చూచాను. అందులోనుంచి ఖడ్గహస్తుడొకడు దివ్యాంగనలతో బయలుదేరి తీరము చేరి అక్కడి ఉద్యానములో మధుపానక్రీడ చేస్తున్నాడు. వాళ్ళకు నేను కనబడకుండా దూరమునుంచి చూస్తున్నాను. ఇంతలో సుందరపురు షుడు ఒకడు ఎక్కడినుంచో తటాలున నాదగ్గిరికి వచ్చినాడు. అతనికి నేను చూచిన ఘటన చెప్పి ఉద్యానవనములో స్త్రీపురుషులను చూపిం చాను. ఆసుందరుడు తనసంగతి ఇలా చెప్పినాడు:

"నేను త్రిభువనపురము పరిపాలించే త్రిభువనప్రభువును. ఒకపాశు పతుడు కాపాలికుడు నన్ను చాలాదినములు ఆశ్రయించాడు. 'నీకేమి కావాలి?' అని నేనడిగితే ఆకాపాలికుడు బలఖడ్గము సాధించే సందర్భ ములో నాసహాయము కావలె నన్నాడు. సరే అన్నాను. వాడు నన్ను తీసుకొని అరణ్యములోకి వెళ్ళి రాత్రివేళ హోమాదులు చేసి బిలము కనిపెట్టి "వీరుడా, ముందునీవు ఇందులో ప్రవేశించు. దివ్యఖడ్గము లభించ

గానే బయటికి వచ్చి నన్ను లోపలికి తీసుకువెళ్ళు. ఇలా చేస్తానని ప్రతిజ్ఞ చెయ్యి" అని చెప్పినాడు. నేను అలాగే చేసి బిలములో ప్రవేశించి అక్కడ మణిగృహము చూచాను. ఆరత్నమందిరములోనుంచి అసురకన్యాకామణి వచ్చి నన్ను తీసుకు పోయి ప్రేమతో ఖడ్గ మిచ్చి "ఇది సర్వసిద్ధిప్రదము. ఆకాశగమనశక్తిప్రదము. దీనిని భద్రముగా కాపాడుకో" అని చెప్పింది. ఆమెతో నేను కొంతకాలముండి శపథము జ్ఞప్తికి వచ్చేసరికి వెలుపలికి వెళ్ళి ఆపాశుపతుని రత్నగృహములోకి తీసుకు వెళ్ళాను. పరివారముతో కూడిన ప్రమథకన్యతో నేనూ రెండో అసురకన్యతో పాశుపతుడూ ఉన్నాము. ఒకనాడు నేను మధుపానము చేత మైమరచి ఉన్నప్పుడు వాడు దొంగపాటున నాఖడ్గము అపహరించి దాని ప్రభావమువల్ల నన్ను బిలము వెలుపలికి నెట్టివేసినాడు. నేను వానిని పట్టుకోవలె నని పన్నెండేళ్ళనుంచి బిలద్వారములు వెతుకుతున్నాను. నాఅసురకన్యతో వాడు ఇన్నాళ్ళకు ఇక్కడ కనిపించాడు.

ఇంతలో ఆపాశుపతుడు మధుపానముచేత మత్తెక్కి పడుకొన్నాడు. త్రిభువనప్రభువు నెమ్మదిగా వాని దగ్గిరికి వెళ్ళి ఆఖడ్గము తీసుకొని దివ్యప్రభాసంపన్ను డయినాడు. ప్రభువు వానిని సంహరించక కాలితో తన్ని లేపి జడిపించి మళ్ళీ తనకు లభించిన అసురకన్యతో రత్నగృహములోకి వెళ్ళినాడు. పాశుపతుడు సిద్ధిభ్రష్టు డయినాడు. కృతికృత్యు లయినప్పటికీ కృతఘ్నులు చివరకు భ్రష్టు లవుతారు. నేను కళ్ళార చూచిన సంఘటన యిది.

దేవీ నీకుకూడా భర్తతో సంయోగము కలుగుతుంది. త్రిభువనప్రభువుకు ప్రియురాలితో పునస్సమాగమము కలగలేదా! సత్కర్మలు చేసేవారికి ఎన్నడూ నష్టము రాదు.

సంగమదత్తుడు ఈవిధముగా చెప్పినమీదట బంధుమతీదేవి ధనాదులతో అతనిని సత్కరించి పంపి కొంత శాంతి వహించింది.

మరునాడు సుమనసు డనే బ్రాహ్మణుడు అన్యదేశమునుంచి వస్తే అతనికి భర్త అనవాళ్ళు చెప్పి బంధుమతి వృత్తాంతము అడిగింది. "అమ్మా, నీభర్త లభిస్తాడు. సందేహము లేదు" అని బ్రాహ్మణుడు ఈకథ మొగలు పెట్టినాడు.

## దమయంతి కథ

పూర్వము నిషధదేశాన్ని నలుడు పరిపాలిస్తూ ఉండేవాడు. అతడు భార్యకోసము వెతుకుతూ దమయంతి ఉన్నదని విన్నాడు. ఆమె తండ్రి విదర్భరాజు భీమదేవుడు. తనకన్యకు వరుని కోసము వెతుకుతూ నలుడు తగిన వాడని విన్నాడు. దమయంతి ఒకనాడు అంతఃపురోద్యానములో ఉన్న సరోవరములో జలక్రీడార్థము దిగింది. అకొలనులో ఒక రాజహంస కమలములూ, ఉత్పలములూ కొరుకుతూ ఉంటే దమయంతి చూచి ఉత్తరీయము తెచ్చి దానిమీద వేసి పట్టుకొన్నది. రాజహంస మనుష్య వాక్కులతో "రాజపుత్రీ, నన్ను విడిచిపెట్టు. నీకు మేలు చేస్తాను. నలమహారాజు నీకు తగిన భర్త. నీవు ఆ నిషధరాజుకు తగిన భార్యవు. మీఉభయులసంయోగానికి నేను కామదూత నవుతాను" అని పలికింది. దమయంతి సరే అని హంసను విడిచిపెట్టింది. అప్పుడే నలునిమీద అనురాగము కలగడముచేత దమయంతి నలునితప్ప ఇంకొకరిని వరించను అని హంసతో చెప్పింది.

హంస బయలుదేరి నిషధదేశము చేరి నలుడు కూర్చుని ఉన్న సరోవరతీరాన వాలింది. ఉత్తరీయము మీదవేసి నలుడు దాన్ని పట్టుకొన్నాడు. "రాజన్, నీకు మేలు చేయడానికి వచ్చాను. నన్ను విడు. విదర్భాధిపతి భీమరాజుకూతురు దమయంతి మహాసౌందర్యవతి. నిన్ను గురించి నేను చెప్పేసరికి ఆమె నిన్నే వరించింది. ఆవార్త చెప్పడానికే వచ్చాను" అని పలికింది హంస. "విహగోత్తమా ధన్యుడను!" అని

నలుడు హంసను విడిచినాడు. హంస దమయంతి సన్నిధికి వెళ్ళి ఈసంగతి చెప్పింది.

దమయంతి అభిలాష ఎక్కువ అయింది. స్వయంవరోత్సవము ఏర్పాటు చేయించమని తల్లితో చెప్పింది. ఆమె భర్తతో చెప్పింది. రాజులను ఆహ్వానించడానికి భీమరాజు దూతలను పంపినాడు. సకాలానికి రాజులు స్వయంవరార్థము విదర్భనగరానికి బయలుదేరినారు. నలుడుకూడా రథమెక్కి వెళ్లుతున్నాడు. ఇంద్రాది దిక్పాలకులు దమయంతీ స్వయంవరము నారదమునివల్ల విని తమకుకూడా ఆమెమీద అభిలాష కలగడమువల్ల బయలుదేరినారు. నలునికి ఆమెమీద అనురాగ మున్నదని తెలిసినప్పటికీ అతడు మార్గములో కనబడి ప్రణామము చెయ్యగానే వారు కూడబలుక్కొని ఉపాయముచేత "రాజా, నీవు దమయంతితో మాసంగతి చెప్పు. మాలో ఒకరిని వరించమను. మానవుని కోరడముకంటె మరణము లేని దేవతను వరించడము మంచిదని చెప్పు. మా వరప్రభావముచేత నీవు అదృశ్యుడవై అక్కడికి వెళ్ళగలవు" అని అతనిని కోరినారు. తప్పనిసరిగా నలుడు అంగీకరించి దమయంతి ఉన్న అంతఃపురానికి వెళ్ళి దేవతాసందేశము తెలిపినాడు. విని దమయంతి "దేవతలు మహానుభావులే. అయినప్పటికీ నామనస్సు నలమహారాజుమీద లగ్నమయినది. ఆయనే నాభర్త" అని ఖండితముగా చెప్పింది. నలుడు నిజవృత్తాంతము ఆమెకు తెలిపి దిక్పాలకుల సన్నిధికి వెళ్లి జరిగిన సంగతి విన్నవించినాడు. వారు సంతోషించి "సత్యవాదీ, నీకు మేము వశ్యుల మయినాము. నీవు తలచుకొన్నప్పుడు మేము వస్తాము" అన్నారు. తర్వాత దేవతలు నలునిరూపము ధరించి స్వయంవరమండపములోకి వెళ్ళి నలుని పార్శ్వమున ఉన్న పీఠాల మీదనే కూర్చున్నారు.

దమయంతిని వెంట బెట్టుకొని ఆమెసోదరుడు ఒక్కొక్కరాజునే

చూపించి వర్ణిస్తూ స్వయంవరమందిరములో నడుస్తున్నాడు. నలమహా రాజు రూపాన ఉన్న ఆరుగురు పురుషులను ఆమెసోదరుడు వింతగా చూస్తూఉంటే, దమయంతి తనలో "దిక్పాలకులు అయిదుగురు నన్ను వంచించడానికి ఇలా చేస్తున్నారు. ఆరవపురుషుడు నలుడు" అని ఆలోచించి దేవతలవైపు తిరిగి స్పష్టముగా "లోకపాలకులారా, మీ నిజరూపాలు ధరించండి. నన్ను అనుగ్రహించండి. నామనస్సు నలమహా రాజుమీద లగ్నమైనది. అన్యులు నాకు పరపురుషులు. మీకు ఈబుద్ధి ఎందుకు పుట్టింది?" అని ప్రార్థించింది. ఆమెవాక్కులు విని ఇంద్రాదులు నిజరూపాలు ధరించారు. నలుడు మాత్రము యథాప్రకారముగానే ఉన్నాడు. దమయంతి సంతోషముతో అతనిని చూచి మెడలో వరమాల వేసింది. పైనుంచి పుష్పవర్షము కురిసింది.

భీమరాజు నల దమయంతులకు వివాహము చేసినాడు. దేవతలు, రాజులు అతిథిసత్కారాలు పొంది నిజనివాసాలకు వెళ్ళినారు.

కలి, ద్వాపరుడు ఇంద్రాదులకు మార్గములో కనిపించారు. వారిద్దరూ దమయంతీ స్వయంవరానికి బయలుదేరారని గ్రహించి ఇంద్రాదులు వారితో "ఎందుకు విదర్భదేశానికి పోవడము? స్వయంవరము అయిపోయింది. దమయంతి నలుని వరించింది. మేము అక్కడ నుంచే వస్తున్నాము" అన్నారు. దుర్మార్గు లయిన కలిద్వాపరులు మాటలు విని "మీవంటి దేవతలను విడిచిపెట్టి నరుడైన నలుని వరించిందా? అందుకు శిక్ష చేస్తాము. వాళ్ళిద్దరికీ వియోగముతప్పదు" అని ప్రతిజ్ఞ చేసి పోయినారు.

నలుడు మామగారింట్లో ఏడురోజు లుండి తర్వాత దమయంతిని తనరాజధానికి తీసుకువెళ్ళినాడు. వారి ప్రేమ గౌరీశంకరుల ప్రేమకంటె అధికముగా ఉన్నది. శివునికి గౌరి అర్ధశరీరము. నలునికి దమయంతి ఆత్మ. వారికి కాలక్రమేణ ఇంద్రసేనుడు అనే కుమారుడూ, ఇంద్రసేన

అనే కూతురూ కలిగినారు.

తన ప్రతిజ్ఞ నెరవేర్చుకోడానికి కలి బహుకాలము కనిపెట్టుకొని ఉన్నాడు. శాస్త్రవిహితకర్మలు చేసే నలునిలో దోష మేమీ దొరక లేదు. చిరకాలానికి ఒకనాడు నలుడు మధుపానముచేత మైమరచి కాళ్లు కడుగుకోడము సంధ్య వార్చడమూ మరిచి పడుకొన్నాడు. ఎప్పుడూ కనిపెట్టుకొని ఉన్న కలికి ఈఅవకాశము దొరికింది. నలుని పొరపాటువల్ల కలి సందు చేసుకొని అతనిశరీరాన్ని ఆవహించినాడు. అప్పటినుంచీ నలుడు ధర్మమును మరిచి దురాచారాలు ప్రారంభించి నాడు. జూద మాడినాడు; దాసీజనముతో రమించినాడు; అసత్య వాక్కులు పలికినాడు; పగలు నిద్రించినాడు; రాత్రివేళల జాగరము చేసినాడు; వృథాగా ఇతరులను కోపపడినాడు; అన్యాయముగా ధనము పుచ్చుకొన్నాడు; యోగ్యులను అవమానించినాడు; అయోగ్యులను ఆదరించినాడు. ఇటువంటిపనులు చేసినాడు.

నలుని తమ్ముడు పుష్కరుడు సమయము కనిపెట్టి ద్వాపరుడు అత నిని ఆవహించినాడు. పుష్కరుడుకూడా దురాచారు డయినాడు.

పుష్కరునికి దాంత మనే పేరుగల సుందరధవళవృషభము ఉన్నది. నలుడు ఒకనాడు దాన్ని చూచి తనకు ఇమ్మని తమ్ముని అడిగినాడు. ద్వాపరుని ప్రేరణవల్ల పుష్కరుడు "ఈయెద్దు నీకు కావలిస్తే జూద ములో నన్ను గెలిచి తీసుకు వెళ్ళు" అన్నాడు. నలుడు వివేకహీను డయిపోయి అతనితో జూదము ప్రారంభించినాడు. పందెములో వృష భము ఒకయెత్తు, నలుని యేనుగులు ఒకయెత్తు. ఎన్నిసారులు పందెము వేసినా నలుడు ఓడిపోతున్నాడు. మూడు రోజులలో నలుని కోశము (ఖజానా) బలగమూ పోయినవి. ఆట మానవలసిదని ఎంతమంది చెప్పినా కలి ప్రభావమువల్ల నలుడు వినలేదు. సమస్తమూ పోతుందని గ్రహించి దమయంతి తనబిడ్డలను రథ మెక్కించి తన తండ్రియింటికి పంపించింది.

నలుడు చివరకు రాజ్యము ఓడిపోయినాడు. పుష్కరుడు జయించిన ఉత్సాహములో "నీసొత్తు యావత్తూ జూదములో ఓడిపోయినావు. నావృషభానికి ఎదురుపందెముగా దమయంతిని ఉంచు" అన్నాడు. నలుడు మండిపడి ఏమీ మాటాడలేదు, పందెము వెయ్యలేదు. "నీభార్యను పణముగా (పందెములో సొత్తు) ఉంచని పక్షాన ఇద్దరూ నా దేశము విడిచిపెట్టి వెళ్ళవలె" అన్నాడు పుష్కరుడు.

దమయంతీసహితముగా నలుడు బయలుదేరినాడు. రాజపురుషులు వారిని రాష్ట్రము పరిహద్దుదాకా సాగనంపి వచ్చారు.

భార్యాభర్తలు అడవిలో నడుస్తున్నారు. దమయంతి పాదాన దర్భ మొన గుచ్చుకోడముచేత ఉభయులూ అక్కడి సరోవర తీరాన విశ్రాంతి కోసము కూర్చున్నారు. వారికి ఆకలి వేసింది. ఇంతలో అక్కడికి రెండుహంసలు వచ్చినవి. పట్టుకొని ఆకలిబాధ తీర్చుకోవచ్చు నని నలుడు హంసలమీదికి ఉత్తరీయము విసిరినాడు. అవి ఉత్తరీయముతో పైకి ఎగిరిపోయినవి. "నీవు జూదమాడిన పాచికలు హంస రూపములో వచ్చి నీఉత్తరీయాన్ని కూడా ఎత్తుకు పోయినవి" అని ఆకాశవాణి వినబడ్డది. నలుడు చాలా విచారపడి దమయంతితో "ఇది విదర్భకు మార్గము: నీతండ్రియింటికి వెళ్ళుతుంది. ఈతోవ అంగదేశానికి పోతుంది. ఇది కోశలదేశానికి వెళుతుంది" అన్నాడు. "భర్త నన్ను విడిచిపెట్టి వెళుతాడేమో, ఈమార్గాలు ఎందుకు చూపిస్తున్నాడు!" అని దమయంతి భావించి భయపడ్డది.

దంపతులు వనఫలాలు తిని దర్భశయ్యమీద రాత్రి పడుకొన్నారు. ప్రయాణపుబడలికవల్ల దమయంతికి వెంటనే గాఢనిద్ర పట్టింది. కలి ప్రభావమువల్ల నలునికి నిద్రపట్టలేదు. ఆమె ఉత్తరీయము సగము చింపి కట్టుకొని నలుడు అక్కడినుంచి వెళ్ళిపోయినాడు.

తెల్లవారిన తర్వాత దమయంతి నిద్ర లేచింది. భర్త కనబడలేదు.

నలుడు తనను విసర్జించి వెళ్లినాడని ఆసాధ్వి నానావిధాల దుఃఖించి అతడు వెనుకటిరోజు చూపిన మార్గాన వెళ్లింది. భర్తమీద ఆమెకు భక్తి ఏమాత్రమూ తగ్గలేదు. పాతివ్రత్య తేజస్సు ఆమెను ప్రయాణములో కాపాడింది. పామునోట్లోనుంచి ఆమెను రక్షించిన బోయవాడు కామాతురుడై కష్టపెట్టబోయి భస్మమైనాడు. దైవవశాన ఆతోవలోకే వచ్చిన వర్తకుల బిడారముతో వెంట దమయంతి ప్రయాణముచేసి క్రమేణా సుబాహువుగారి రాజనగరము చేరింది. రాజపుత్రిక ఆమెను మేడమీద నుంచి చూచి పిలిపించింది. దమయంతిని మహాదేవి ఆదరించింది. దమయంతి వారిఅంతఃపురములోనే కాలక్షేపము చేస్తున్నది.

ఆమెతండ్రి భీమరాజు వీరిని వెతికించడానికి అప్తులను అన్ని వైపులకూ పంపినాడు. బ్రాహ్మణవేషము ధరించిన సుషేణమంత్రి సుబాహురాజు ధానికి వచ్చినాడు. క్రమేణ అతనిని దమయంతి, దమయంతిని అతడు గుర్తుపట్టి దుఃఖించారు. ఈసంగతి తెలిసి మహాదేవి భర్తతో దమయంతి తన చెల్లెలికూతురని చెప్పింది. ఆమెను ఆదరించి రథ మెక్కించి సైన్యము సహాయము మిచ్చి సుషేణునివెంట విదర్భకు పంపించింది.

దమయంతి తనబిడ్డలను తీసుకొన్నది. తర్వాత తండ్రి సేవకుల ద్వారా భర్తను వెతికిస్తున్నది.

బాలాం వనే ప్రసుప్తాం
నృశంస సంత్యజ్య కుముదినీకాన్తామ్
ప్రాప్యైవాంబరఖండం
చంద్రాదృశ్యః క్వ యాతోఽసి!

బాలిక, కుముదినీబాల నయ్యయ్యో!
వనసుప్త యగుదాని వంచించి విడిచి
కైకొని అంబరఖండంబు చంద్ర,
ఎచ్చోటికి కగపడ కేగితి వక్కటా!

అని నలుడు ఉండవచ్చు ననుకొన్న ప్రదేశాలలో బిగ్గరగా పాడ వలసిం దని భీమరాజు చారులకు ఆజ్ఞ ఇచ్చినాడు.

ఆరాత్రి నలుడు భార్యను విడిచి అరణ్యములో కొంతదూరము వెళ్ళినాడు. దావాగ్నిలో కాలిపోవడానికి సిద్ధముగా ఉన్న సర్పము రక్షించ మని వేడుకొన్నది. దయతో నలుడు ఆ నాగమును రొమ్ముకు ఎత్తుకొని దూరముగా తీసుకువెళ్లి కింద విడిచిపెట్టబోయినాడు. "బిగ్గరగా పదిఅడుగులు లెక్క పెడుతూ వెళ్ళి నన్ను విడిచిపెట్టు" అని ప్రార్థించింది. సరే అని నలుడు పది లెక్కపెట్టేసరికి నాగము అతని లలాటభాగాన కాటు వేసింది. వెంటనే నలునిశరీరము నల్లబడిపోయింది చేతులు పొట్టి అయినవి. వికారాకారము ఏర్పడ్డది. నాగమును చూచి నలుడు "ఎవరు నీవు? ఎందుకు ఇటువంటి ఉపకారము చేశావు?" అన్నాడు. "రాజన్, నేను కర్కోటక నాగరాజును. నీక్షేమము కోరి నిన్ను కరిచాను. అజ్ఞాతవాసములో ఉండేటప్పుడు ఉత్తమపురుషులు వికారరూపము ధరించడమువల్ల కార్యసిద్ధి అవుతుంది. అగ్నిశౌచము అనే పేరుగల ఈవస్త్రములజంట తీసుకో. ఈవస్త్రాలు చుట్టుకొన్నప్పుడు నిజరూపము వస్తుంది" అని ఇచ్చి కర్కోటకుడు వెళ్ళినాడు.

నలుడు ఆ అరణ్యముదాటి కోసలదేశము చేరి ఋతుపర్ణ మహారాజు దర్శనము చేసి అక్కడ హ్రస్వబాహువు అనే పేరుతో వంటవాడుగా కుదిరినాడు. పాకవిద్యలోనే కాక రథవిద్యలోకూడా పేరు పొందినాడు.

విదర్భాధిపతి చారులలో ఒకడు ఋతుపర్ణుని రాజధానికి వచ్చి హ్రస్వబాహువుచరిత్ర విని నలుడే అని భావించి, అతను ఆస్థానానికి వచ్చినప్పుడు యుక్తిగా—

బాలిక, కుముదినీబాల నయ్యయ్యో
వనసుప్త యగుదాని వంచించి విడిచి

నైకొని అంబరఖండంబు చంద్ర
ఎచ్చోటికి కగపడ కేగితి వాక్కా!

వైరివాళ్ళవాక్కులవంటి ఆమాటలను అక్కడ ఉన్నవారు లెక్క చెయ్య లేదు. హ్రస్వబాహువుమాత్రము గీతికారూపములో ఇలా అన్నాడు.

క్షీణో ప్య వైక దేశం
చన్ద్రః ప్రా ప్యాన్యమణ్డలం ప్రవిశన్
కుముదిన్యా యదదృశ్యో
జాత స్తత్కా నృశంసతా తస్య?

క్షీణుడై అంబరమ్మున కోణ మొంది
అన్యమండల సంగతు డైన యపుడు
కుముదినీకాంత కనులకు గోచరింప
డేని చంద్రుడు బాలిశు డెట్టు లగును?

ఈప్రత్యుత్తరము విని అతడు "ఏదో ఆపదవల్ల వికారరూపముతో ఉన్న నలు డని నిశ్చయించుకొని విదర్భాధిపతిదగ్గిరకి వెళ్ళి జరగిన వృత్తాంతము విన్నవించినాడు. అప్పుడు దమయంతి తండ్రితో ఇలా చెప్పింది. "ఆయన మీఅల్లుడే అయితీరాలి. వంటవాని వేషములో ఉన్నాడు. ఆయనను ఇక్కడికి రప్పించడానికి ఋతుపర్ణమహారాజును రప్పించాలి. మీరు ఆరాజుసన్నిధికి దూతను పంపి ఇలా చెప్పమనండి: "నలమహారాజు ఏమయినాడో తెలియదు. ఆయన వృత్తాంతము ఏమీ తెలియులేదు. దమయంతికి రేపు ప్రాతఃకాలమే మళ్ళీ స్వయంవరము. మీరు వెంటనే విదర్భకు వెళ్ళండి — అని." రథవిద్యలో నిపుణు డైన మీ అల్లుని శక్తివల్ల కోసలదేశమునుంచి ఒక్కరోజులోనే ఇక్కడికి మీరు రాగలుగుతారు"

ఈమాటలకు భీమరాజు అంగీకరించినాడు. దమయంతి సందేశము నేర్పి దూతను కోసలదేశానికి పంపింది. అంతా అనుకొన్నట్టే జరిగింది. ఋతుపర్ణుడు "హ్రస్వబాహూ, నీకు అశ్వహృదయము తెలుసునన్నావు కదా. నీకు నేర్పుఉంటే నన్ను నేడే విదర్భకు తీసుకువెళ్ళు" అన్నాడు. వెంటనే హ్రస్వబాహువు ఉత్తమాశ్వములను కట్టి రథము సిద్ధము చేసినాడు. దమయంతి విషయమై అతనికి అనుమాన మేమీ లేదు. తనను అతనికి రప్పించడానికే మళ్ళీ స్వయంవరప్రశంస జరిగింది అనుకొన్నాడు.

ఋతుపర్ణుడు ఎక్కగానే హ్రస్వబాహువు రథమును మహావేగముగా తోలినాడు. మార్గములో గాలితాకుడుచేత రాజు ఉత్తరీయము జారి పడిపోయింది. ఉత్తరీయము తెచ్చుకొంటాను. రథము కొంచెము ఆపు అని ఋతుపర్ణుడంటే "రాజా, చాలా యోజనాలు వచ్చినాము. ఇంకెక్కడి ఉత్తరీయము" అన్నాడు హ్రస్వబాహువు. "నీవు నాకు రథవిద్య అశ్వహృదయము ఉపదేశించు. నీకు నేను అక్షవిద్య (జూదములో పాచికలు) ఉపదేశిస్తాను. దానివల్ల పాచికలు వశ్యమవుతవి. అన్నిపదార్థాల సంఖ్యలు వెంటనే తెలుస్తవి" అని ఋతుపర్ణుడు చెప్పి దృష్టాంతముగా పక్కన ఉన్న వృక్షముమీద పండ్లు మొదలయిన వాటిసంఖ్య ఇంత అని పలికినాడు. హ్రస్వబాహువు పరీక్షించాడు. లెక్క సరిపోయింది. అప్పుడు ఒకరివిద్య ఒకరు గ్రహించారు. అంతట హ్రస్వబాహువు శరీరములోనుంచి నల్లని పురుషుడు బయటికి వచ్చినాడు. అతనిని ఎవరు నీవు అని హ్రస్వబాహువు అడిగితే, వాడు "నేను కలిని. దమయంతి నిన్ను వరించిందన్న కోపముచేత నిన్ను ఆవహించాను. నీ సమస్త సంపదలూ పోగొట్టినాను. కర్కోటకుడు నిన్ను అడవిలో కాటు వేసినవుడు నీవు దగ్ధుడవు కాలేదు. నేను దగ్ధుడనై నీలో ఉన్నాను. అకారణముగా అన్యులకు అపకారము చేసే

వాళ్ళకు ఎలా మేలు కలుగుతుంది. వత్సా, వెళుతాను. ఇతరులమీదికి వెళ్ళడానికి నాకు అవకాశము లేకపోలేదు" అని అంతర్ధానము పొందినాడు. నలుడు పూర్వమువలె ధర్మబుద్ధి కలవాడయినాడు.

మళ్ళీ రథముతోలి నలుడు ఋతుపర్ణుని ఆనాడే విదర్భకు తీసుకువెళ్ళినాడు. ఋతుపర్ణుడు వచ్చిన కారణము తెలుసుకొన్న వాళ్ళు నవ్వినారు. అతడు రాజభవనము సమీపములో ఉన్న మందిరములో దిగినాడు.

ఆశ్చర్యకరమైన రథధ్వనము విని నలుడు వచ్చినాడని భావించి సంగతి తెలుసుకొనిరమ్మని చేటికను పంపింది. చేటిక వెళ్ళి సంగతులు తెలుసుకొని దమయంతితో "దేవీ, నేను పోయి గ్రహించాను. నీకు మళ్ళీ స్వయంవరమని విని కోసలరాజు వచ్చినాడు. హ్రస్వబాహువు అనే వంటవాడు గొప్పరథసారథి అట. అతడు రాజును ఇంతదూరము ఒకరోజులో చేర్చినాడట. నల్లనివికారరూపముతో ఉన్న ఆవంటవానిని పాకశాలలో చూచినాను. అతనిది విచిత్రశక్తి. పాత్రలలో నీరు స్వయముగా నిండుతుంది. వంటచెరుకు దాని అంతట అదే మండుతుంది. త్వరలోనే రకరకాల భోజనవస్తువులు సిద్ధమవుతవి" అని విన్నవించింది.

"అగ్నిదేవుడు వరుణదేవుడు నాభర్తకు వశ్యులు. ఆయన అశ్వహృదయము గ్రహించి రథము నడపడములో అద్వితీయుడు. ఏ కారణముచేతనో వికారరూపము వచ్చింది. నాతో వియోగమువల్ల నేమో. ఇంకా బాగా విచారించాలి" అని దమయంతి ఆలోచించి తన బిడ్డలను అతని దగ్గిరికి తీసుకొని వెళ్ళమని చేటికి ఆన తిచ్చింది.

బిడ్డలు కనబడగానే నలుడు తన ఒడిలో కూర్చోబెట్టుకొని కన్నీరు విడిచినాడు. "నాబిడ్డలుకూడా ఇలాగేఉంటారు. వాళ్ళు మాతామహుని గృహములో ఉన్నారు. వీళ్ళను చూచేసరికి వాళ్ళు జ్ఞప్తికి వచ్చారు. అందుచేత కళ్ళనీళ్ళు పెట్టుకొన్నాను" అని అతడు సమాధానము చెప్పినాడు. ఈసంగతు లన్నీ చేటిక వెంటనే దమయంతికి తెలియజేసింది.

ఆదుర్దా హెచ్చి దమయంతి మర్నాడు చేటికను పిలిచి ఋతుపర్ణ మహారాజుగారి వంటవానితో "నీకు సాటి వంటవాడు లోకములో లేడని ప్రసిద్ధి. ఈపూట మామందిరానికి వచ్చి పాకము చేసిపెట్టు" అని నామాటగా ఆయనతో చెప్పు" అని పంపించింది. చేటిక మాటలు విని నలుడు ఋతుపర్ణుని సమ్మతిమీద దమయంతీమందిరానికి వచ్చినాడు.

అతనితో దమయంతి "నీవు ఈవేషములో ఉన్న నలమహారాజువు కావా? ఎందుకు నన్ను ఈవిచారసముద్రములోనుంచి ఒడ్డుకు చేర్చవు?" అని ప్రార్థించింది. సిగ్గు, అనురాగము, సంతోషము కలతపెట్టుతూ ఉండగా తల వంచుకొని "అవును. నిన్ను సంతాపపెట్టిన ఆనలుడ నిట్లయినాను!" అని గద్గదకంఠముతో అన్నాడు.

"మీకు ఈరూపము ఎందుకు వచ్చింది?" అని దమయంతి అడిగితే నలుడు కర్కోటకనాగుని సంగతి మొదలుకొని కలి విడిచిపోయిన క్షణము వరకూ తన వృత్తాంతము చెప్పి కర్కోటకు డిచ్చిన అగ్నిశౌచ వస్త్రములు ధరించి నిజరూపము పొందినాడు.

దమయంతి మహానందములో మునిగిపోయింది. ఈవృత్తాంతము వెంటనే భీమరాజుకు ఆమె పరిచారికలు చెప్పినారు. ఆయన వచ్చి నలదమయంతులను అభినందించి నగరములో మహోత్సవము చేయించినాడు. భీమరాజు చేసిన సత్కారాలకు ఋతుపర్ణుడు చాలా ఆనందించి నలమహారాజును ఆదరించి సెలవు పుచ్చుకొని కోసలదేశానికి వెళ్ళిపోయినాడు.

నలుడు కొద్దిరోజులు మామగారింట్లో ఉండి తర్వాత భీమరాజు సైన్యమును తీసుకొని నిషధదేశానికి వెళ్ళి జూదములో పుష్కరుని గెలిచినాడు. ద్వాపరుడు విడిచిపోవడముచేత పుష్కరుడు వినతుడయినాడు. నలుడు కరుణతో అతనికి కొంతదేశ మిచ్చినాడు. తర్వాత నలదమయంతులు సుఖముగా ఉన్నారు.

ఇలా చెప్పి సుమనసుడు బంధుమతితో "దేవీ, ఈవిధముగా ఉన్నతవంశజులుకూడా కష్టాలు అనుభవించి చివరకు సుఖాలు పొందుతారు. సూర్యుడు అస్తమించి కదా ఉదయిస్తాడు? కాబట్టి పుణ్యాత్మురాల వయిన నీకు శీఘ్రముగానే భర్తతో సమాగమ మవుతుంది. ధైర్యము వహించు. దుఃఖము విడిచిపెట్టు. భర్తను రప్పించే శుభకర్మలు చేయిస్తూ ఉండు" అని చెప్పినారు.

చల్లని మాటలు చెప్పిన ఆ మంచిబ్రాహ్మణునికి బంధుమతీదేవి ధనాదిసత్కారము చేసి భర్తరాకను ఎదురు చూస్తూ ఉన్నది. తర్వాత కొద్దిరోజులలో మహీపాలుడు తల్లిదండ్రులతోసహా వచ్చి భార్యకు నేత్రోత్సవము చేసినాడు.

మరుభూతి చెప్పిన కథ విని నరవాహనదత్తాదులు చాలా సంతోషించారు.

## అలంకారవతీ లంబకము

మూడవ సంపుటము

సమాప్తము.

పగటి వేళ భోజనాదికృత్యములు సరిగా చేయక ఎవరు పలకరించినా మాట్లాడక విచారముగా ఉంటున్నాడు. విరహములో మలయమాలి కుంగి కృశించి నిద్ర లేక పాండురవర్ణుడై ఉండగా అతని ఆప్తమిత్రుడైన మంధరకు డనే సంస్థానశిల్పి "మిత్రుడా! గోడకు అంటుకుపోయి తెల్లగా పాలిపోయి చిత్రములో ప్రతిమలా ఉన్నావేమి?" అని నిర్బంధము చేసి అడిగినాడు, అప్పుడు కనుక అతడు ప్రణయవృత్తాంతము చెప్పగా మంధరకుడు "మిత్రమా? రాజకన్యను ప్రేమించడమేమిటి? హంస సరస్సులో పద్మాలు విడిచి శ్రీహరినాభికమలభోగము అభిలషించడమా?" అని ఎంత బోధించినా మలయమాలి విరహతాపము అధికమైనది. కాని శమించలేదు.

ఆస్థానశిల్పి మిత్రుని ఉత్కంఠ తీర్చడానికి రాజకన్య రూపు లిఖించి చిత్రాన్ని ఇచ్చినాడు. మలయమాలి చిత్తరువులో ఉన్న రాజకన్య యథార్థమైన దని భ్రమించి ఆమెనుచూచి అనునయాలాపాలు స్పర్శాదికము చేస్తూ తన్మయుడై పోతున్నాడు. భావనాశక్తివల్ల మలయమాలి చిత్రములో ఉన్నకన్య చెక్కిలి ముద్దాడి, సరస మాడి, మనసులో సంభోగ శృంగారము అనుభవిస్తున్నాడు. నెలపొడుపు కాగా ఆ విరహి చిత్తరువును తీసుకొని వన విహారము చేసినాడు. అతడు మానుమీద ఆలేఖ్యమును ఉంచి ప్రేయసికై పుష్పాపచయార్థము వనములోకి వెళ్ళినాడు.

ఆసమయాన వినయజ్యోతి అనే మునీంద్రుడు గగనమార్గాన సంచరిస్తూ మలయమాలి అవస్థ చూచి నిజప్రభావమువల్ల సజీవసర్పమును లిఖించి తాను కనపడకుండా ఉన్నాడు. మలయమాలి పువ్వులుకోసి తెచ్చి చిత్రములో ఉన్నసర్పాన్ని చూచి "ఇదేమిటి? ఎక్కడిదీ పాము? ఓహో నాప్రేయసిని సుందరమూర్తిని రక్షించేందుకు బ్రహ్మ సృష్టించినపాము కాబోలు" అని ఆలోచించి పువ్వులతో చిత్రము

లోని రాజకన్యను అలంకరించి ఆలింగనము చేసుకోగా హఠాత్తుగా పాము ఆమెను కరిచినట్టూ ఆమె మరణించినట్టూ అతడు తలచినాడు. ప్రియా మరణానికి మలయమాలి వియోగ దుఃఖము అనుభవిస్తూ ప్రాణత్యాగానికి సిద్ధపడి వృక్షము మెక్కి కిందపడగా సిద్ధుడు అతన్ని కిందపడనీయక పట్టుకొన్నాడు. "మూఢా! నీవు ప్రేమించిన రాజకన్య అంతఃపురములో హాయిగా జీవించే ఉంది. చిత్తరువులో రాజకన్య నిర్జీవప్రతిమ. ఎవరిని నీవు కౌగలించావు? ఎవరెను పాము కరిచింది. రాగాంధుడవై భ్రమలో బాధ పడుతున్నావా? ఇంత దృఢ ధ్యానమువల్ల తత్త్వజ్ఞాన మెందుకు సాధించవు? విషయాల పాలు చేసి నీచిత్తమును పాడు చేసుకోక, ఏకాగ్రత కలిగి తథాగతుణ్ణి ధ్యానించు"అని సిద్ధుడు ఉపదేశించగా మలయమాలి విరక్తితో వనములో తపస్సుచేసి బుద్ధాంశను పొందినాడు. మలయమాలి బుద్ధత్వమును పొంది దయ కలిగి ఇందుకేసరి భూపాలునకు ఉపదేశము చేసి పౌరులతోసహా అతనికి మోక్షసామ్రాజ్యమార్గము చూపినాడు.

## ప్రజ్ఞా పారమిత

సింహళ ద్వీపములో సింహవిక్రము డనే చోరుడు చిన్నప్పటినుంచీ దొంగతనము వల్లనే పొట్ట పోషించుకుంటూ కాలము గడుపుతున్నాడు. కొన్నాళ్ళకు అతనికి వార్ధకము వచ్చింది. అప్పుడు సింహవిక్రముడు "ముదిమి రాకుండా ఏమైనా మార్గ మున్నదా? ఈ లోకములో తప్పించుకొన్నాను. పరలోకబాధ తప్పించుకోడము ఎలాగ? ఎవరి శరణుకోరను? చిత్రగుప్తుని ఆశ్రయిస్తే అతడు నన్ను కాపాడుతాడు. ఈ విశ్వమంతా అతని చేతుల్లోఉంది" అని తలచి ఆముసలిదొంగ చిత్రగుప్తుని భక్తుడై అతన్నే పూజిస్తూ నిత్యము బ్రాహ్మణ సమారాధన చేస్తున్నాడు.

ఒకసారి దొంగను శిక్షించవలెనని చిత్రగుప్తుడు అతిథిరూపములో అతనిఇంటికి వచ్చాడు. చోరుడతన్ని బ్రాహ్మణున్ని పూజించి దక్షిణ ఇచ్చి "చిత్రగుప్తుడు నీయందు ప్రీతుడు అగుగాక" అని అనుకున్నాడు. విప్రరూపములో ఉన్న చిత్రగుప్తుడు "హరిహరులను విడిచి చిత్రగుప్తుణ్ణి పూజిస్తావేమిటి?" అని కుతూహలముతో అడిగినాడు.

అప్పుడు దొంగ "నీకెందుకు ఆ విచారము? నాకు చిత్రగుప్తుడే దేవుడు!" అని పలికినాడు. అతిథి "నీభార్యను నాకిస్తే నీవు అనుకున్నట్టు అంటాను" అని పలికినాడు. దొంగ సంతోషించి "నా దేవుని సంతోషింపచేయడంకన్న కావలసిందేముంది? తీసుకో నా భార్యను" అని వచించినాడు. చిత్రగుప్తుడు భక్తుని మెచ్చి నిజస్వరూపముతో "నీభక్తికి మెచ్చాను. వరము కోరుకో" అన్నాడు. సింహవిక్రముడు అమందానందముతో "స్వామీ, నాకు మృత్యువు తప్పించాలి" అని కోరగా చిత్రగుప్తుడు "మృత్యువును తప్పించడం కష్టము. అయినా యుక్తి చెపుతాను. పూర్వము శ్వేతముని కోసము యముడు హరకోపాగ్నివల్ల దగ్ధుడై తిరిగి కార్యార్థము నిర్మితుడు అయినప్పటినుంచీ శ్వేతముని ఎక్కడ ఉంటే అక్కడి జంతువులనుకూడా యముడు ఈశ్వరాజ్ఞాబద్ధుడై బాధించడము లేదు. ఆ శ్వేతముని సముద్రము అద్దరి తరంగిణి అనేనదికి అవతల తపోవనములో ఉన్నాడు. మృత్యువు రాని ఆ తావుకు నిన్ను తీసుకొని వెళ్ళుతాను. నీ వెప్పుడూ తరంగిణి ఈవలి ఒడ్డుకు రాకు. పొరపాటున వచ్చావా నిన్ను మృత్యువు పరలోకానికి లాగుకొని వచ్చినపుడు అక్కడ ఏ ఉపాయమైనా ఆలోచించవచ్చును" అంటూ చిత్రగుప్తుడు సింహవిక్రముని తీసుకొని వెళ్ళి ఆశ్రమవాటికలో విడిచి అంతర్ధానమైనాడు.

తర్వాత కొన్నాళ్ళకు యముడు సింహవిక్రముని తన సభకు తీసుకొని పోవడానికి యత్నించినాడు. కాలుడు తరంగిణీ యావలిదరి నిలబడి

యుక్తిలోచక చివరకు దివ్యాంగనిని తన మాయాశక్తినల్ల సృష్టించి సింహవిక్రముని దగ్గిరికి పంపినాడు. ఆ అందాలరాశి అతనివద్దకు వెళ్ళి అతన్ని తన వ్యామోహములో వేసుకొన్నది. కొన్నాళ్ళపాటు అతనితో సుఖాలనుభవించి దివ్యాంగన చుట్టుపక్కాలను చూచి రావలెనని వంక పెట్టి తరంగిణి దాటుతూ తాను నీళ్ళల్లో మునిగిపోతున్నట్టు నటించి మొర పెట్టగా సింహవిక్రముడు వెంటనే నదిలో దుమికినాడు. నదీ వేగవశాన కొట్టుకొని పోయినదానివలె నటించి ఆమె అతన్ని అవతలి గట్టుకు రప్పించింది. సింహవిక్రముడు ఇద్దరి చేరగానే కాలుడు అతని కంఠాన పాశము తగిలించి విషయలోలసులకు ఆపద నెత్తిమీదనే సిద్ధమని పలికి తన సభకు అతన్ని తీసుకొని పోయినాడు. సింహవిక్రముడు యమునికి వశ్యుడు కాగా చిత్రగుప్తుడు రహస్యముగా "నిన్ను యముడు ముందు నరకము అనుభవిస్తావా? స్వర్గము అనుభవిస్తావా? అని అడిగితే స్వర్గమే అనుభవిస్తానని చెప్పు. స్వర్గానికి నీవు వెళ్ళి పుణ్యకర్మలు చేస్తే పుణ్యాత్ముడము కాగా తపస్సు చెయ్యి" అని సలహా ఇచ్చినాడు. సింహవిక్రముడు చిత్రగుప్తుని హిత వాక్యములు విని అద్భుతపడి సిగ్గుతో తల వంచి భయముతో అలాగే చేస్తానని సమాధాన మిచ్చినాడు.

యముడు చిత్రగుప్తుణ్ణి "ఏమోయి! ఈచోరుడు పుణ్యకర్మ ఏమైనా చేశాడా? లేదా?" అని ప్రశ్నించాడు. చిత్రగుప్తుడు "దేవా! వీడు అతిథిపూజాపరాయణుడు. తనయిష్టదేవతాప్రీతికై భార్యను కూడా యాచకునికి అర్పించినాడు. అందువల్ల వీడికి స్వర్గములో స్థానముఉన్నది" అనగా యముడు దొంగను "ఒరే! నీవు శుభాశుభములు రెంటిలో ముందేది అనుభవిస్తావు?" అని అడిగినాడు. సింహవిక్రముడు సుఖాభిలాష కనబరచినాడు. యమధర్మరాజు ఆజ్ఞచేత విమానము వచ్చింది. దొంగ చిత్రగుప్తుడు చెప్పినహితవాక్యములు స్మరిస్తూ విమాన మెక్కి స్వర్గానికి వెళ్ళినాడు. సింహవిక్రముడు స్వర్గఫలభోగవిరాగిగా మందాకినీస్నాన

పవిత్రుడై జపతపాలు ఆచరించగా రెండవదివ్యదినము వచ్చింది. అతను శివార్చనచేసి ధ్యానయోగమువల్ల పాపపంకిలాన్ని పోగొట్టుకొన్నాడు. యమదూతలు అతనిముఖము చూడలేక పోయినారు. చిత్రగుప్తుడు లెక్కల్లో సింహవిక్రమునిపాపము రద్దు చేసినాడు. యముడు పల్లెత్తు మాట అనలేదు. ఇలా ప్రజ్ఞాబలమువల్ల చోరుడు బుద్ధాంశ పొందినాడు. బుద్ధభగవానుడు ఉపదేశించిన పారమితవట్క మనేనావ నెక్కి జిజ్ఞాసువులు భవసాగరాన్ని తరిస్తారు.

ఈరీతిగా అరణ్యములో బోధిసత్త్వుడైన వినీతమతి సోమశూరునకు చేసిన జ్ఞానోపదేశసారమును వినడమువల్ల కాబోలు సూర్యుడు శమించి రాగకషాయము ధరించి అస్తమించినాడు. గురుశిష్యులు యథాప్రకారముగా సంధ్యోపాసన చేసి రాత్రి గడిపినారు. మర్నాడు గురువు శిష్యునకు బౌద్ధశాసనాన్ని రహస్యముగా ఉపదేశించినాడు. తదారభ్య సోమశూరుడు గురుపూజ చేస్తూ పర్ణశాలలో వసిస్తూ సమాధిసుఖము అనుభవిస్తున్నాడు. గురుశిష్యులు క్రమేణా యోగసిద్ధులు పొంది బుద్ధత్వమును అనుభవించినారు. ఈలోగా కనకకలశుడు అన్నగారి ఖడ్గాశ్వమహిమాతిశయమువల్ల అహిచ్ఛత్రరాజ్యము విడిచి మంత్రిసమేతముగా తిరిగి తిరిగి విధివశాన వినీతమతి వసించిన ఆశ్రమవాటికకే వచ్చినాడు. కనకకలశుడు క్షుత్పిపాసలతో బాధపడుతూ వినీతమతిదగ్గిరికి అతిథిగా రాగా ఇంద్రుడు వినీతమతిని పరీక్ష చేయాలని తలచి ఫలపుష్పభరితవనమును మండుటెడారిగా మార్చివేసినాడు. ఆకస్మికముగా కలిగిన విపరీతపరిణామము చూచి వినీతమతి కాలు కాలినపిల్లివలె ఇటూ అటూ తిరిగి కర్తవ్యము తోచక కంఠగతప్రాణాలతో ఉన్న కనకకలశుని చూచి అతనివృత్తాంతము గ్రహించి "ఈఅరణ్యము హఠాత్తుగా ఎడారిగా మారింది. ఆతిథ్యము ఇక్కడ దుర్లభము. అయినా మీకు యుక్తి చెపుతాను. ఇక్కడికి అరకోసు దూరములో గోతిలో లేడి చచ్చి పడి

ఉన్నది. నీవూ నా నిజమాంసము తిని ప్రాణాలు నిలబెట్టుకోండి" అని చెప్పినాడు. కనకకలశుడు మంత్రులతో గోతిదగ్గిరికి వెళ్ళేలోగా, వినీతమతి యోగశక్తివల్ల తాను ముందుగా వెళ్ళి గోతిలో లేడిగా మారి ప్రాణాలు పరార్థము వదలివేసినాడు. కనకకలశుడూ మంత్రులూ లేడి మాంసము తిని తృప్తిచెందినారు.

ఇంతలో వినీతమతి భార్యలు నాగకన్యారాజకన్యకలు అతన్ని కానక సమాధిలో వృత్తాంతాభిముఖుడై ఉన్న సోమశూరునితో విషయము విశదముగా చెప్పారు. అతను యోగదృష్టివల్ల గురువృత్తాంతము ఎరిగి వాళ్ళతో గోతిదగ్గిరికి వెళ్ళినాడు. నాగకన్య రాజకన్య కొమ్ములు ఎముకలు మాత్రము శేషించిన మృగరూపియైన ప్రియుని అస్థిపంజరాన్ని చూచి రోదించి శవాన్ని ఆశ్రమానికి తెచ్చి చితి పేర్చి అగ్నిప్రవేశము చేసినారు. సంగతి యావత్తూ తెలిసినతరువాత దుఃఖభారముతో కనకకలశుడు కూడా అగ్నిప్రవేశము చేసినాడు. సోమశూరుడు గురుమరణ సంజాత బాధ పడలేక దర్భాసనముమీద ప్రాయోపవేశము చేసినాడు. అప్పుడు మహేంద్రుడు అతనిదగ్గిరికి వచ్చి "సోమశూరుడా! ఇలా చెయ్యకు. ఇదంతా నీగురుపరీక్ష! అస్థిమాత్రశేషులైన నీగురువునూ, గురుపత్నులనూ అమృతసేచనము చేసి బతికించినాను." అనిపలికినాడు. మహేంద్రుని మాటలు విని సోమశూరుడు అద్భుతానందము పొంది అతనికి సాష్టాంగపడిలేచి వెళ్ళి చూడగా వినీతమతీ అతనిప్రియకాంతలూ కనబడ్డారు. అతడు గురుపాదాలముందట మోకరిల్లి వాక్పుష్పాలతో పూజించి కన్నీటితడితో అభిషేకము చేసినాడు. కనకకలశాదులు వినీతమతికి సాష్టాంగపడినారు. బ్రహ్మాది దేవతలు ఆ బోధిసత్త్వుని సాత్త్వికశక్తికి సంతుష్టి చెంది వరము కోరుమని అడిగినారు. వినీతమతి పరోపకారార్థమే ఉపకారరూపములైన వరాలు కోరినాడు. అన్నివరాలు బ్రహ్మాదిదేవతలు అతనికిచ్చి అదృశ్యులుకాగా

వినీతమతి సోమశూరాదులతో దివ్యమైన మహాతపోవనానికి వచ్చినాను.

వత్సా! ఈరీతిగా భస్మసాత్కృతమైన జీవులుకూడా మళ్ళీ కలుసుకొంటారు. బతికి తిరుగుతున్నవారు తప్పక తమవారిని కలుసుకోకుండా ఉంటారా? అందువల్ల మరణప్రయత్నము మానివెయ్యి. నిశ్చయము, నీవు తప్పక మృగాంకదత్తుని కలుసుకోగలవు.

ఇలా వృద్ధతాపసి చెప్పిన పుణ్యగాథ ఆకర్ణించి ఆశ్రమంలో ఆమెకు పాదాభివందనము ఆచరించి కత్తి చేతపట్టి బయలుదేరి ఈ అరణ్యానికి వచ్చినాను. ఇక్కడ ఈ శబరులు నన్ను పట్టి చండికాదేవికి బలివేయాలని తెచ్చినారు. నేను వీళ్ళతో బాహాబాహి కచాకచి పోరాపోరి పోరి గాయపడి సొమ్మసిల్లినాను. అప్పుడు నన్ను ఈ శబరులు శబరరాజు దగ్గిరికి తెచ్చినారు. మహారాజా! మంత్రిసహితంగా మిమ్మల్ని దర్శించాను. అమ్మయ్య! ఇప్పటికి నామనసు ఊరడిల్లింది.

ఈ ప్రకారముగా గుణాకరమంత్రివల్ల అతని వృత్తాంతము విని మృగాంకదత్తుడు అమదానంద తరంగితాంతరంగుడై గుణాకరుని గాయములకు చికిత్సాదికము పథ్యపానములు ఏర్పాటుచేయించి ఆహ్నికము నెరవేర్చినాడు. మృగాంకదత్తుడు మిత్రునికి ఔషధము చేయిస్తూ తక్కిన అమాత్యులకోసమూ, శశాంకవతి కోసమూ ఉజ్జయినికి వెళ్ళదలచి కొన్నాళ్ళు శబరపల్లెలో గడిపినాడు.

## తరంగము 73

## విచిత్రకథకునికథ

గుణాకరమంత్రికి గాయాలు నయమైనతరువాత మృగాంకదత్తుడు మంచిరోజు చూచి ఉజ్జయినికి ప్రయాణము కాగా శబరరాజు కొంత దూరము వారిని సాగనంపినాడు. మృగాంకదత్తుడు శ్రుతధి, విమలబుద్ధి, గుణాకరులు, ఇతరమంత్రులను వెతికి వేసారి మధ్యేమార్గములో అడవిలో చెట్టుక్రింద నిద్రపోయినారు. హఠాత్తుగా మృగాంకదత్తునికి మెళు

కువ వచ్చి చూడగా తనపక్కనే ఇంకొకపురుషుడు అధికముగా నిద్రి స్తున్నవాడు కనపడ్డాడు. అతనిముఖముమీదిడి ముసుగు తొలిగించి చూస్తే అతడు విచిత్రకథకుడు!

మృగాంకదత్తుడు అతన్ని గుర్తుపట్టినాడు. విచిత్రకథకుడు రాజుకు నమస్కారముచేసి హర్షోత్కర్షతో నిలిచినాడు. రాజు తనివి తీర మంత్రినిచూచి గాఢాలింగనము చేసుకోగా తక్కిన మంత్రివర్గము లేచి సంతోషించింది. వారు విచిత్రకథకునికి తమతమ వృత్తాంతములు వ్రాస నుచ్చినట్టు చెప్పగా విచిత్రకుడు నిజవృత్తాంతము తెలియచేస్తున్నాడు:

పారావత నాగ శాపవశాన నేను మిమ్మల్ని ఎడబాసి తెలివి తప్పి వాడవాడల బహుకాలము సంచరించాను. దూరగమనాయాసమువల్ల మూర్ఛపాలైనాను. తెలివి వచ్చి చూచేసరికి అరణ్యములో దివ్యనగ రిలో ఉన్నాను. అంగనామణులు ఇద్దరితో ఒక దివ్యపురుషుడు నన్ను ఓదార్చి శీతలోదకస్నానము చేయించి, లోపలికి తీసుకొని వెళ్ళిమృష్టా న్నభోజనము పెట్టించి తరువాత భార్యాసహితంగా తానున్ను తిన్నాడు. భోజనాయాసము తీర్చుకొని నీవెవరు? నన్నెందుకు కాపాడినావు? నేను నారాజుకు దూరమైనాను, చనిపోతాను అని నాసంగతి చెప్పాను. అప్పు డాదివ్యుడు ప్రీతిపూర్వకముగా నాతో “నేను యక్షుణ్ణి. ఈయిద్దరూ నా భార్యలు. నీవునా అతిథివి. అతిథిపూజ గృహస్థధర్మముకదా? ఎందుకు నీవు చనిపోవడం? నాగశాపమువల్ల మీకు కొంతకాలమే వియోగము. శాపానంతరము మీకు సమాగమము సంప్రాప్తమవుతుంది. సంసారికి దుఃఖము లేకుండా ఉంటుందా? యక్షుణ్ణే అయినా నేను ఎరిగిన విష యము చెపుతాను:

## శ్రీ ద ర్శ ను ని క థ

త్రిగర్తపురములో పవిత్రధరు డనే విప్రకుమారుడు, కులీనుడు, దరి ద్రుడు. అతనికి కావలసిన బలగము ఉన్నది. అతడు సంపన్నులమధ్య

కాపురముచేస్తూ "అర్థవంతులమధ్య వృత్తస్థుడనైనప్పటికీ సత్కావ్య శబ్దాలమధ్య నిరర్థకశబ్దమువలె శోభించలేకపోతున్నాను. వరుపు ప్రతిష్ఠ లున్నవాణ్ణి. దేహి అని చేయిచాచని నప్రతిగృహీతను. ఎక్కడికైనా పోయి యక్షిణీవిద్య సాధించి, మంత్రోపాసనవల్ల ఇష్టార్థము సాధిస్తాను" అని నిశ్చయించి అరణ్యానికి వెళ్ళి ప్రేయసికోసము యక్షిణిని సాధించినాడు. సౌదామని అనే ఆమె అతనికి ప్రాప్తించింది. ఆమెతో అతడు శీతువు దాటి మధువనలక్ష్మిని పొడవుకొన్న మామిడివలె ఉన్నాడు. సంతానము లేక అతడు చింతించగా భార్య "ఆర్యపుత్రా! మనకు పండువంటి కొడుకు పుడతాడు. నామాట కాస్త వినండి." అంటూ కథ ప్రారంభించింది.

దక్షిణదిశలో వర్షాకాలానికి పుట్టిల్లుఅయిన ఘనశ్యామమనే తమాల వనవాటిలో పృథూదరుడనేయక్షుడు నివసిస్తున్నాడు. ఆయనకు సౌదామని అనేనేను ఏకపుత్త్రికను. నన్ను గారాబంతో చూస్తూ కులగిరులకు తీసుకొనిపోతూ ఉండేవాడు. నేను తరుచుగా వనాలలో క్రీడారసములో కాలము గడిపేదాన్ని. ఒకసారి కపిశభ్రువు అనే చెలితో నేను ఆడుతూ ఉండగా కైలాసములో అట్టహాసుడు అనే యక్షకుమారుని చూచాను. మాఇద్దరిచూపులు కలిసినవి. మా అన్యోన్యభావము తండ్రి గ్రహించి వెంటనే మాకు వివాహము ఏర్పాటుచేసి నన్ను ఇంటికి తీసుకొని వెళ్ళి నాడు. అట్టహాసుడు గృహాభిముఖుడైనాడు.

మర్నాడు కపిశభ్రువు వింతగా నవ్వుతూ నాదగ్గిరికి వచ్చింది. నేను బలవంతముచేసి అడిగితే ఇలా చెప్పింది: "సఖీ అప్రియమైన విషయము చెప్పడానికి కష్టము; అయినా చెపుతాను. నేనిక్కడికి వస్తూ ఉంటే త్రోవలో నీప్రియుడైన అట్టహాసుడు ఉత్కంఠార్తితో అలిసిపోగా అతన్ని హిమసానూద్యానవనములో మిత్రులు క్రీడార్థము యక్షరాజును చేసినారు. అతని తమ్ముణ్ణి దీప్తశిఖుణ్ణి నలకూబరుణ్ణి చేశారు. వారందరూ

నాదులకు లేచినాడు. కుమారుడు తండ్రిని అనుసరించినాడు.

ఆ రాత్రి నరవాహనదత్తునికి నిద్ర పట్టలేదు. తక్కిన మంత్రులు అందరూ వింటూ ఉండగా మరుభూతి 'దేవా, దాసీసంగమేచ్ఛచేత అంతఃపురముమాట మీరు తలపెట్టలేదు. దానిని పిలిపించలేదు. మీకు ఎలా నిద్రపట్టుతుంది? వాళ్ళసంగతి తెలిసికూడా వేశ్యలవిషయంలో ఇంకా మీకు ఆసక్తిపోలేదు. వేశ్యలకు సద్భావమనేదే ఉండదు.

## మర్కటము కథ

సంపత్సమృద్ధమైన చిత్రకూట మహానగరములో ధనవంతుడైన రత్నవర్మ అనే వణిక్పుంగవుడు ఉండేవాడు. ఈశ్వరారాధనవల్ల పుట్టిన కుమారునికి ఈశ్వరవర్మ అని ఆయన పేరు పెట్టినాడు. క్రమంగా విద్యాభ్యాసము చేసి యౌవనారంభములో ఉన్న కుమారుని చూచి రత్నవర్మ ఇలా ఆలోచించినాడు: "ధనికులై యౌవనమదాంధులైనవారి ధన ప్రాణాలు హరించమని విధి నిర్మించిన యంత్రము వేశ్య. కాబట్టి వేశ్యల మాయలలో పడిపోకుండా ఉండడానికి వేశ్యాతంత్రము నేర్పేందుకు ఎవరైనా వేశ్యమాతవద్ద నా కుమారుని అప్పగిస్తాను." ఈప్రకారముగా యోచించి, యమజిహ్వ అనే కుట్టని (వేశ్యమాత) యింటికి పుత్రసహితంగా వెళ్ళినాడు. పెద్దదౌడలు పొడుగాటి పళ్ళు చప్పిడిముక్కు కల వేశ్యమాత కనబడ్డది. ఆ సమయాన ఆమె కుమార్తెతో "బిడ్డా, ధనమువల్లనే అందరికీ గౌరవము. విశేషించి వేశ్యకు విత్తమువల్లనే ఆదరము. అనురాగముంటే వేశ్యకు ధనము లభించదు. కాబట్టి వేశ్య అనురాగము విడిచిపెట్టాలి. నేర్పుగలనటివలె అది మిథ్యానురాగాన్నే చూపాలి. ప్రథమంలో అనురాగము నటించి విటుని రంజించి తర్వాత అతని ధనాన్ని పిండుకోవాలి. పట్టిపోయిన తర్వాత వానిని విడిచిపెట్టాలి. వానికి ధనప్రాప్తి అయితే మళ్ళీ వానిని

గ్రహించాలి. కురూపి అయినా రూపవంతు డయినా యువకు డయినా వృద్ధు డయినా - ఎవ రయినా సరే- అందరిమీదా వేశ్య సన్యాసిని వలె సమభావముతో ఉండాలి. ధనమే పరమార్థముగా స్వీకరించాలి. అని బోధ చేస్తున్నది. వచ్చిన రత్నవర్మకు వేశ్యమాత సత్కారము చేసింది. అప్పుడు రత్నవర్మ కుమారుని చూపి "ఆర్యురాలా, మావానికి గణికాకళ బోధించు. వీడు అందులో నేర్పరి కావాలి. ఈ శ్రమకై నీకు వెయ్యిదీనారా లిస్తాను" అని పలికినాడు. వేశ్యమాత అంగీకరించింది. కుట్టనికి దీనారా లిచ్చి రత్నవర్మ కుమారుని అప్పగించి వెళ్ళినాడు. ఈశ్వరవర్మ వేశ్యాకళలు సంవత్సరములోగా అభ్యసించినాడు.

ఈశ్వరవర్మ ఒకనాడు తండ్రితో "నాయనా, అర్థమువల్లనే ఆదరము, కీర్తి కలుగుతవి" అన్నాడు. తండ్రి సంతోషించి వ్యాపారార్థము కుమారునికి అయిదుకోట్ల ధన మిచ్చినాడు. ఈశ్వరవర్మ సుముహూర్తాన సువర్ణద్వీపానికి బిడారులతోపాటు ప్రయాణమయినాడు. త్రోవలో కాంచనపురము వెలుపలి ఉద్యానవనములో దిగి, స్నానపానాదు లయిన తర్వాత నగరములో వినోదాలు చూడబోయి ఒకానొక దేవాలయములో ప్రవేశించినాడు. సుందరి అనేనటి అప్పుడు నాట్యము చేస్తున్నది. దానిని చూచీ చూడకముందే ఈశ్వరశర్మ మోహావిష్టు డయినాడు. అతడు వేశ్యవద్ద నేర్చినకళ యేదోవన పోయిందో తెలియదు. తర్వాత చెలికానిద్వారా తన అభిలాష నివేదిస్తే సుందరి ధన్యురాల నయినా నని సమ్మతించింది.

ఈశ్వరవర్మ తననివాసములో నిపుణు లైన భాండరక్షకులను నిలిపి, సుందరీసౌధానికి వెళ్ళినాడు. దానితల్లి మకరకటి సమయోచిత మైన గృహమర్యాదలతో అతనిని సత్కరించి, రాత్రివేళ సుందరితో సహా గదిలోకి చేర్చింది. అందులో రత్నాలచాందినీ కట్టి ఉన్నది. నృత్యము లోనూ శృంగారకళలోనూ నిపుణురా లయిన సుందరివల్ల అతడు

సౌఖ్యము అనుభవించినాడు. ప్రాతఃకాలాన గాఢానురాగము చూపుతూ తనపార్శ్వమును విడవలేకుండా ఉన్న సుందరిని ఈశ్వరవర్మ విడవలేక పోయినాడు. రెండురోజులలో దానికి ఇరవై రెండు లక్షల వెలగల బంగారమూ రత్నాలూ ఇచ్చినాడు. "నాకు చాలా ధనమున్నది. నీవంటివాడు నాకు లభ్యము కాలేదు. నీవే లభ్యమయినప్పుడు నాకు ధనముతో ఏమిపని?" అని సుందరి స్వీకరించలేదు. దానితల్లి మకరకటి వచ్చి 'అమ్మాయీ, ఈ మనసంపద యావత్తూ ఈయనదే. అందులో ఈ భాగముకూడా కలిపి తర్వాత తీసుకోవే. ఇందులో నష్టమేమిటి?' అని బోధించింది. తల్లి బలవంతముమీద గ్రహించినట్టు గ్రహించింది ఆ ధనము. ఆ మందబుద్ధి సుందరిప్రేమ నిజమని నమ్మి, దానిసౌందర్య నృత్యగీతాదులకు మతిపోయి దానియింట్లో రెండునెలలు గడిపినాడు. అప్పటికి దానికి రెండుకోట్ల సంపద లబ్ధమయింది.

అతనిస్నేహితుడు అర్థదత్తుడు వచ్చి ఈ వ్యవహారము యావత్తూ గ్రహించి రహస్యముగా "చెలికాడా, వేశ్యమాత నేర్పినవిద్య సమయానికి ఉపయోగించలేదే! వారాంగనానురాగము వాస్తవమని నీవు నమ్ముతున్నావు. ఎండమావులలో నీరు ఎంతనిజము! నీధనము యావత్తూ అయిపోకముందే ఇక్కడినుంచి బయలుదేరడము ప్రశస్తము. ఈసంగతి తెలిస్తే మీనాయన నిన్ను క్షమించడు" అని బోధించినాడు.

"నీవు చెప్పింది నిజమే. వేశ్యలకు ప్రేమ ఉండదు. అయితే సుందరి సంగతి వేరు. క్షణమాత్రమైనా నన్ను చూడకపోతే సుందరి నిజంగా ప్రాణాలు విడుస్తుంది. మనప్రయాణము తప్పనిసరి అయితే నీవే వెళ్ళి సుందరిని ఒప్పించు" అన్నాడు ఈశ్వరవర్మ. అర్థదత్తుడు వెళ్ళి మకరకటి ఈశ్వరవర్మ సమక్షములో ఉండగా "సుందరీ, నీకు ఈశ్వరవర్మ మీద అసాధారణప్రేమ అని నాకు తెలుసును. ఇప్పుడు వ్యాపారార్థము ఈశ్వరవర్మ సువర్ణద్వీపము వెళ్ళవలసి వచ్చింది. అక్కడ ధనము సంపా

డించుకొని వచ్చి శాశ్వతంగా నీవద్దనే ఉంటాడు. ప్రస్తుతం ఇతనికి సెలవు ఇవ్వాలి” అన్నాడు. సుందరి కన్నీళ్ళతో ఈశ్వరవర్మకేసి చూసి “నే నేమి చెప్పగలను! సమస్తమూ మీకే తెలుసు. మీయిష్టం వచ్చినట్టు చెయ్యండి. నాకర్మ ఎలావుంటే అలా జరుగుతుంది” అని విచారముతో పలికింది. “పిల్లా, ఏడవబోకు. వ్యవహారము చక్కబెట్టు కొని వచ్చి నీప్రియుడు శాశ్వతముగా నీవద్దనే ఉంటాడులే” అని తల్లి కుమార్తెను ఓదార్చింది.

తర్వాత తల్లీ కూతురు ఆలోచించి పన్నాగము పన్నినారు. ఈశ్వర వర్మ వెళ్ళవలసిన మార్గములో పాడువడ్డ బావి ఉన్నది. అందులో గట్టివల నమ్మకమైన వారిచేత కట్టించి తాను ఆహారాదులు తగ్గించి నృత్య గీతాదులు పూర్తిగా మానివేసి దుఃఖము నటిస్తున్న సుందరికి తనమీద చాలా ప్రేమ ఉన్నదని వణిక్కుమారుడు నమ్మి దానిని సంతోషపెట్టడానికి బహువిధాల ప్రయత్నాలు చేసినాడు.

తన స్నేహితుడు నిర్ణయించిన రోజున ఈశ్వరవర్మ ప్రయాణ మయి నాడు. అతడు బయలుదేరేటప్పుడు వేశ్యమాత మంగళకార్యము చేసింది. తల్లిని వెంటబెట్టుకొని సుందరి ఈశ్వరవర్మ వెనుక కన్నీరువిడుస్తూ నూతి వరకూ వెళ్ళి అందులో దూకింది. దానితల్లీ పరిజనులూ కోలాహలము చేశారు. ఈశ్వరవర్మ మిత్రులతో సహా వెనుకకు తిరిగివచ్చి నూతిలోపడ్డ సుందరిని చూచి మూర్ఛపోయినాడు. మకరకటి విశ్వాసపాత్రులను నూతిలో దిగ మన్నది. వాళ్ళుదిగి సుందరి ప్రాణాలతోనే ఉన్నది అని కేకలు వేశారు. తర్వాత తాళ్ళు కట్టిన మంచములో సుందరిని కూర్చో బెట్టి బయటికి తీసినారు. అది కొంతసేపు చనిపోయినట్టు కనబడి కొంత సేపటికి ఈశ్వరవర్మ పలకరిస్తే ప్రత్యుత్తరమిచ్చింది. అతను ప్రయాణము మానుకొని దాని ప్రేమను నమ్ముకొని దాని యింటికే వెళ్ళి మళ్ళీ వ్యాపారము మాటే తలపెట్టలేదు. ఇలా కొన్నాళ్ళు గడిచినవి.

ఒకనాడు, అర్థదత్తుడు అతనితో "మిత్రమా, ఎందుకు చెడిపోతావు! బావిలోపడ్డ మాత్రాన దాని ప్రణయము నిజ మని నమ్మవచ్చునా! వేశ్యలు కపటోపాయాలలో గట్టివారు. నీధనమంతా తగులబడిపోయిన తర్వాత మీనాయనకు ఏమి సమాధానము చెపుతావు? ఆతర్వాత ఎక్కడికి వెళ్ళుతావు? కాబట్టి ఇకనైనా ఇక్కడనుంచి వెంటనే బయలు దేరడం భావ్యము" అని హితబోధ చేసినాడు. ఈశ్వరవర్మ వినక ఆమాస ములో తక్కిన ధనమంతా వారాంగనకు సమర్పించాడు. నిర్ధనహీనుడైన వణిక్కుమారుణ్ణి ఒకనాడు మెడపట్టి బయటికి నెట్టించింది వేశ్యమాత.

అర్థదత్తప్రభృతులు తమ పురమునకు వెళ్ళి ఈ వృత్తాంతము యావత్తూ రత్నవర్మకు తెలిపినారు. ఆయన చాలా విచారపడి వేశ్య మాత యమజిహ్వాదగ్గిరికి వెళ్ళి సంగతి వివరించి "నీవు నాకుమారునికి నేర్పినవిద్యకు ఇదీ ఫలితం! మకరకటి బహు తేలికగా వాణ్ణి మోస గించింది' అన్నాడు. మీఅబ్బాయిని ఒకసారి ఇక్కడకు రప్పించండి. ఆయన ధనము యావత్తూ తిరిగి వచ్చేటట్టు చేస్తాను" అన్నది. యమ జిహ్వ తర్వాత రత్నవర్మ అర్థదత్తుని చేతికి కొంత ధన మిచ్చి మంచి మాటలతో తనకుమారుని తీసుకురమ్మని కోరినాడు. అతను బయలు దేరి కాంచనపురము వెళ్ళి ఈశ్వరవర్మకు ఇంటి సంగతులు చెప్పి 'మిత్రమా, నామాట వినకపోయితివి. వేశ్యలను ఇసుకను ఎవడు నమ్ముతాడు? అయిదుకోట్లు పోయినవి. అర్ధచంద్రప్రయోగముకూడా అయింది; అయిపోయింది. ఇక మీనాయన వద్దకువచ్చి కోపశాంతి చెయ్యడము మంచిది' అని బోధించినాడు. అతను బయలుదేరి వచ్చి తండ్రి కాళ్ళ మీదపడి క్షమాపణ వేడినాడు. రత్నవర్మ కొడుకును యమజిహ్వవద్దకు తీసుకువెళ్ళినాడు.

కథ యావత్తు విని యమజిహ్వ 'నాదే పొరపాటు. ఈమాయను గురించి నేను చెప్పలేదు. మకరకటి ఆనూతిలో వల కట్టించింది. సుందరి

దానిమీద పడకంచేత చావలేదు. ఇది చేసినపనికి విరుగుడు చెవు తాను' అని తనపెంపుడుకోతిని తెప్పించింది. దానిపేరు ఆలము. దాని మొదట రెండువేల దీనారాలు పెట్టి మింగ మన్నది. కోతి నాణెములు మింగింది. 'నాయనా వీరికి ఇరవై వీరికి ఇరవై వారికి అరవై చొప్పున దీనారాలు ఇచ్చి వెయ్యి' అని వేశ్యమాత చెప్పేసరికి ఆలము తప్పు లేకుండా సరిగా అలాగేచేసింది. యమజిహ్వ కోతిసామర్థ్యమును వర్ణించి ఈశ్వరవర్మతో "ఈకోతిని తీసికొని సుందరి యింటికి వెళ్ళు. ముందుగా దీనిచేత రెండురోజులకు కావలసినంతడబ్బు మింగించు. సుందరి చూచేటప్పుడు దీనారాలు ఖర్చులకు కోతిచేత ఇప్పిస్తూఉండు. సుందరి చింతామణివంటి ఈఆలము తనకిమ్మని చాలా బతిమాలుతుంది. తన సంపద యావత్తు కోతి మూల్యము కింద ఇస్తానంటుంది. వెంటనే పుచ్చుకొని కాంచనపురము విడిచిపెట్టి ఇక్కడికి రా" అని బాగా బోధచేసి ఆలమును అతని కిచ్చింది.

రత్నవర్మ కొమారునికి కొంతధన మిచ్చినాడు. ఈశ్వరవర్మ కోతితో సహా కాంచీనగరము వెళ్ళి తన ఆగమనవార్త ముందుగా తెలియపరచి తర్వాత సుందరి యింటికి చేరినాడు. మిత్రుని మొదటనే సుందరి ఈశ్వరవర్మను కౌగలించుకొని విలాసచేష్టలు చేసి సంతోషించి పెట్టడానికి ప్రయత్నించింది. అర్థదత్తుని తనబసకు పంపి ఆలమును తెప్పించి 'బాబా, భోజనాదులకు మూడువందల దీనారాలూ తాంబూలాదులకు వందదీనారాలు ఇస్తావా? అమ్మగారికి (మకరకటికి) వంద, బ్రాహ్మణులకు వందపోగా వదివందలలో మిగిలినవి సుందరికి ఇయ్యి' అని చెప్పినాడు. ముందుగానే వదివందల దీనారాలు మింగినకోతి లెక్కప్రకారము నాణెములు కక్కి సక్రమంగా ఇవ్వవలసిన వారికి ఇచ్చి వేసింది. ఇలావదిహేనురోజులపాటు జరిగింది. ఈవింత చూచి తల్లీ కూతురూ కూడబలుకుకొన్నారు. ఇది చింతామణి కాని కోతి కాదు. రోజుకు

వెయ్యిదీనారాలు ఇస్తున్నది. ఇతను కోతిని మనకిస్తే అంతకంటె కావలసిందేమి? అని తల్లితో రహస్యముగా ఆలోచన చేసిన తర్వాత ఈశ్వరవర్మ ఖులాసాగా ఉన్నసమయముచూచి సుందరి అతనితో 'మీకు నిజంగా నామీద ప్రేమఉంటే కోతిని నాకు ఇచ్చి వెయ్యండి' అన్నది. నీమీద నాకు ఎంతప్రేమ ఉన్నప్పటికీ ఇవ్వడానికి వీలులేదు. ఈమర్కటమే మానాయనగారి సమస్త సంపదకూ మూలమూ. అందు చేత ఇవ్వడం పడదు' అన్నాడు వర్మ. 'మీఅయిదుకోట్లూ మీకు తిరిగి ఇచ్చివేస్తాను దీన్ని ఇవ్వండి' అని బతిమాలింది. నీసర్వస్వమే కాక కాంచననగర మంతా ఇచ్చినా ఆలమును ఇవ్వడం అసాధ్యము' అని బెట్టుచేసినాడు వణిక్కుమారుడు. 'అమ్మకు నామీద కోపం వస్తే రానీ. నాసమస్తమూ మీకిస్తాను. కోతినిమాత్రము ఇచ్చివేసి నన్ను అనుగ్రహించండి.' అని సుందరి అతనిపాదాలమీద పడ్డది. అక్కడనే ఉన్న అర్థదత్తాదులు 'పోనీ' చాలా బతిమాలుతున్నది. ఏమయితే ఏమి, కోతినిఇచ్చి వెయ్యి' అని అతనికి బహువిధాల బోధచేసినారు. మిత్రుల బలవంతముమీద ఈశ్వరవర్మ చివరకు సమ్మతించినాడు.

సుందరి సంతుష్టురా లయింది. ఆరోజు దానితో ఖులాసాగా గడిపి చాటుగా కోతిచేత రెండువేలదీనారాలు మింగించి అవి సుందరికి ఇప్పించి దానిధనము యావత్తూ తీసుకొని ఈశ్వరవర్మ వెంటనే వ్యాపారార్థము సువర్ణద్వీపము వెళ్ళినాడు.

సుందరి చాలా సంతోషముతో అడిగేసరికి మొదటిరోజున కోతి వెయ్యిదీనారాలు రెండవనాడు మరో వెయ్యిదీనారాలు ఇచ్చింది. మూడోరోజున ఎన్నిసార్లు అడిగినా కోతి ఏమీ ఇయ్యకపోయేటప్పటికి కోపమువచ్చి సుందరిదాన్ని పిడికిటితో పొడిచింది. కోతి సుందరీ మకరకటులముఖాలు పీకి, గోళ్ళతో గీరింది. వృద్ధురాలు ఒళ్ళు మండి కర్రతో కోతినెత్తిమీద మోదింది. మర్కటము మరణించింది. ఆలము

అర్థమూ అన్నీ పోవడముచేత సుందరి తల్లితో కూడా ప్రాణాలు విడవడానికి నిశ్చయించుకొన్నది. ఇంతలో పౌరులు కొంతమంది వీళ్ళగోలవిని, గుమిగూడి మకరకటి ఎవనిని మోసముచేసిందో వాడే మర్కటము తెచ్చి యిచ్చి బలేమోసము చేశాడు. తాను ఇతరులను టోపీ వేశానని సంతోషించిందే కాని తాను టోపీ పడేసంగతి కనుక్కోలేక పోయింది. బాగా అయింది.' అని నవ్వారు. కొంతమంది చేరి వాళ్ళ ప్రాణత్యాగప్రయత్నము మానిపించారు.

ఈశ్వరవర్మ స్వర్ణద్వీపములో వ్యాపారము చేసి చాలా ధనము గణించి నిజనగర మైనచిత్రకూటానికి వచ్చి తండ్రిని కలుసుకొన్నాడు. రత్నవర్మ కుమారుని చూచి సంతోషించి ఉత్సవము చేయించి యమజిహ్వాకు బహుమానము చేసినాడు. ఈశ్వరవర్మ బుద్ధిపూర్చుకొని, వేశ్యాసంగతి విడిచిపెట్టి వివాహము చేసుకొని సుఖముగా ఉన్నాడు.

దేవా వారవిలాసినుల హృదయాలలో ప్రేమఉండదు. అంతా కపటమే. కాబట్టి వారిపొందు అనుచితము.

ఈప్రకారము మరుభూతి చెప్పిన కథ విని నరవాహనదత్తుడూ గోముఖాదులూ సమ్మతించినారు.

## త ర ం గ ము : ౫౭

## కు ము ది క

తర్వాత గోముఖుడు కుముదిక కథ చెప్పినాడు. ప్రతిష్ఠాన నగరములో సింహవిక్రము డనే రాజశ్రేష్ఠునికి శశిరేఖ రాణి. ఆమె మహాసౌందర్యవతి. ఆ రాజుదాయాదులు అయిదుగురు - మహాభటుడు, వీరబాహువు, సుబాహువు, సుభటుడు, ప్రతాపాదిత్యుడు అనేవారు సైన్యసమేతముగా వచ్చి నగరము ముట్టడించినారు. శత్రువులతో సామోపాయము అవలంబించిన మంత్రిని విక్రమసింహుడు నిరాకరించి యుద్ధము

నకు బయలు దేరినాడు. ఉభయసైన్యములకు ఘోరయుద్ధము జరిగినది. మహాభటాది ప్రభువులు ఐదుగురు ఒక్కసారిగా విక్రమసింహుని చుట్టు ముట్టినారు. రాజు భీకరముగా పోరినాడు గాని అతని సైన్యము చెల్లా చెదరు కావడము ప్రారంభించింది. ఇంతలో అతనిమంత్రి అనంతగుణుడు వచ్చి 'మనసైన్యము పని అయిపోయింది. విజయము పట్టిది. బలవంతు లతో మీరు పోరుపెట్టుకున్నారు. ఇకనైనా నామాట విని యుద్ధరంగ ములో నుంచి అవతలికి పదండి. పరదేశము వెళ్లుదాము. జీవించిఉంటే శత్రువులను తర్వాత జయించవచ్చు అని బోధచేసినాడు. విక్రమ సింహుడు ఏనుగుదిగి గుర్రమెక్కి మంత్రితో కూడా వెళ్లిపోయినాడు. మారువేషాలు వేసుకొని వారిద్దరూ క్రమముగా ఉజ్జయినికి పోయి ధని కురా లయిన కుముదిక అనే వేశ్యయింటికి చేరినారు.

అనుకోకుండా వచ్చినవారిని చూచి కుముదిక ఆలోచించి 'ఇతడెవరో మహాపురుషుడు. తేజస్సువల్ల రాజేమో అనిపిస్తున్నది. ఈయనను స్వీకరిస్తే నాకోరిక నెరవేరుతుంది' అనుకొని వారిద్దరికీ ఆతిథ్య మిచ్చింది. కొంతవిశ్రాంతి తీసుకొన్నతరువాత కుముదిక రాజును చూచి దేవా, నేను ధన్యురాలను. ప్రభువువారు మాగృహము పవిత్రము చేసినారు. మీకు నేను క్రీతదాసిని. నాకు నూరుఏనుగులు, ఇరవైవేల గుర్రములు, రత్నములతో నిండిన భాండారము ఉన్నవి. ఈ మందిరముతో సహా సమస్తమూ తమదిగా భావించాలి' అని ఉభయులకూ ఉచితోప చారాలు చేయించింది. విక్రమసింహుడు ఖిన్నుడయినప్పటికీ కుముదిక చేసేఉపచారాలు స్వీకరిస్తూ మంత్రితో కూడా దానిఇంటనే ఉన్నాడు. పైగా దానిధనము స్వేచ్ఛగా ఖర్చుపెడుతూ యాచకులకు కూడా ఇస్తున్నాడు. కుముదిక అందుకు విచారపడక సంతోషించింది. దీనికి నామీద చాలాప్రేమ అని ఆనందిస్తున్న రాజుతో మంత్రి రహస్యముగా 'దేవా, వేశ్యలకు సద్భావము ఉండదు. కుముదిక చూపే భక్తికి

నాకు చాలా ఆనందము! సంప్రీతుడ నయినాను. నీకోరిక యేమో తెలిపితే తప్పకుండా నెరవేరుస్తాను' అన్నాడు. 'దేవా, మీకు నిజముగా నాపైన అనుగ్రహ ముంటే నాహృదయశల్య మొకటి మనవిచేస్తాను. ఉజ్జయినిలో నాప్రియుడు శ్రీధరుడు చిన్న పొరపాటు చేసినాడని అతనిని చెరసాలలో పెట్టించినాడు రాజు. మిమ్మలిని చూడగానే ఉత్తమరాజ లక్షణాలు కనబడ్డవి. మీరు మహైశ్వర్యము పొందుతా రనిపించింది. అందుచేత మీసేవచేసి ఉపచారము పొందుదా మనుకొన్నాను. మీరు మరణించా రనుకొని, నాకోరిక ఇక ఈడేర దనే దుఃఖముతోనూ, నాప్రియుడైన విప్రకుమారుడు లేని జీవితము వృథా అనే విరక్తితోనూ ప్రాణాలు వీడుదా మని మీచితిమీదికి ఎక్కినాను.' అని కుముదిక వివరించింది. 'సరే, నీకోరిక ఈడేరుతుంది. కొంచెము ఓర్పు వహించి ఉండు' అని రాజు పలికి మంత్రిమాటలు స్మరించి "వేశ్యకు సద్భావము ఉండదు. అయినా ఈదీనురాలికోరిక నెరవేర్చాలి' అని విక్రమసింహుడు ఉజ్జయినికి వెళ్ళి, శ్రీధరుని విడిపించి; ప్రియులను సమావేశపరిచి కుముదికకు ధనరాసు లిచ్చినాడు.

నాటినుంచీ విక్రమసింహుడు మంత్రిమాట మీరక సుఖముగా రాజ్యము చేసినాడు. కుముదికను బట్టి ఆలోచిస్తే వేశ్యలహృదయము అగాధమూ అజ్ఞేయమూ అని తేలుతుంది. గోముఖుడు ఈకథ చెప్పి విరమించగా తపంతకుడు మరొకకథ చెప్ప నారంభించినాడు:

## చంద్రశ్రీ కథ

దేవా, చలచిత్తలకు విశ్వాస ముండదు. గణికలకువలెనే కులస్త్రీలకు కొందరికి విశ్వాస మనేదే లేదు. నాకు తెలిసిన చిత్రవార్త చెవుతాను. మన నగరములోనే బలవర్మ అనే వర్తకుడు ఉండేవాడు. అతని భార్య చంద్రశ్రీ మేడకిటికీలోనుంచి శీలహారుడు అనే వర్తకపుత్రుని చూచింది.

అతను చాలా అందమైనవాడు. ఆమె అతనిని కామించి వెంటనే తన చెలికత్తెను దూతికగా పంపింది. ప్రతిదినము అతనిని తన చెలికత్తె యింటికి రప్పించుకొని రహస్యముగా కాలక్షేపము చేసింది. ఈసంగతి సేవకులకూ చుట్టాలకు తెలిసింది. భర్తకు మాత్రము తెలియలేదు. భార్యమీద మోహముతో ఉన్నవాడు దాని దుర్మార్గవృత్తి కనుకోలే లేదు. కొన్నాళ్ళకు దాహజ్వరముతగిలి బలవన్మ చావుకు సిద్ధమయినాడు. భర్త అటువంటి అవస్థలో ఉన్నప్పటికీ భార్య దురాచారము మానలేదు. ఆమె మర్నాడు ఉపపతితో క్రీడిస్తూ ఉండగా, ఇంట్లో భర్త చనిపోయి నాడు. చంద్రశ్రీ కాముకుని విడిచి ఇంటికి వచ్చి యేడ్చి దీని దుర్గుణము తెలిసిన బంధువులు వద్దు అంటూ ఉన్నప్పటికీ భర్తతో సహగమనము చేసింది. స్త్రీలచిత్తవృత్తి గ్రహించడానికి వీలులేదు. పరపురుషునితో సాంగత్యము భర్తతో సహగమనము.

వసంతకుని కథ అయిన తర్వాత హరిశిఖుడు ఇలా చెప్పినాడు:

## దే వ దా సు క థ

దేవా, దేవదాసు అనే గృహస్థు మన నగరములో ఉండేవాడు. అతని భార్యపేరు దుశ్శీల. పేరుకు తగిన గుణాలుకల స్త్రీ. ఆమె పర పురుష నిరత అని ఇరుగు పొరుగువారు గ్రహించారు. ఒకరోజున దేవ దాసు పని ఉండి రాచనగరికి వెళ్ళినాడు. భర్తను హత్య చేయించాలి అని దుర్బుద్ధి పుట్టి దుశ్శీల పరపురుషుని రప్పించి ఇంటిలో పై భాగాన కూర్చోబెట్టింది. భర్త యింటికివచ్చి భోజనముచేసి పండుకొని నిద్ర పోయినాడు. పైన ఉన్నవాడు దిగి దేవదాసును చంపి వెళ్ళిపోయినాడు. తన భర్తను చోరులు సంహరించారని దుశ్శీల కేకలుపెట్టి యేడ్చింది. బంధువులు గుమిగూడి ఇతనిని దొంగలు చంపినారా? ధనమేమి అపహ రించలేదే?' అన్నారు. అందులో ఒకరు కుర్రవానిని చూచి 'మీనాయన

నను ఎవరుచంపినారు?' అని అడిగితే 'పైనుంచి ఎవరో పడుచువాడు దిగి నాన్నను చంపేశాడు. అమ్మ నన్ను అవతలకి లాక్కుపోయింది' అని పిల్లవాడు చెప్పినాడు. బంధువులు ఆజారుని తెలుసుకొని పట్టి వధించారు. అన్యపురుషాసక్తురాలు భుజంగివలె ప్రాణాలు తీసివేస్తుంది.

హరిశిఖుడు చెప్పగానే గోముఖుడు మరొక కథ ప్రారంభించినాడు:

## వ జ్ర సా రు ని క థ

ఇతరులదాకా ఎందుకు, ఇక్కడి సేవకుడు వజ్రసారుడు నవ్వుల పాలు అయిన సంగతి చెపుతాను. వాని భార్యపేరు సురూప, అది మాళవ దేశాంగన. అది వానికి ప్రాణాధిక. ఒకరోజున వాని మామ బావమర దులు వచ్చి మాళవదేశానికి అందరినీ తీసుకువెళుతా మని చెప్పినారు. వజ్రసారుడు వత్సరాజుగారివద్ద సెలవు పుచ్చుకొని భార్యతోకూడా అత్తవారింటికి వెళ్ళి మాసము సుఖముగా కాలక్షేపము చేసి, వచ్చి తన నౌకరీలో చేరినాడు. సురూప పుట్టింటనే ఉన్నది. కొన్నాళ్ళయిన తరువాత క్రోధను డనే మిత్రుడు వచ్చి 'ఓరి వజ్రసారా, నీభార్యను పుట్టింట విడిచిపెట్టి వచ్చావు; కొంప మునిగింది! ఆదౌర్భాగ్యురాలు ఇతరులను మరిగింది. నాప్రాణస్నేహితుడు ఒకడు వచ్చి ఈసంగతి చెప్పి నాడు. ఎన్నటికీ అసత్యము కాదు. నీవు దీన్ని విడిచిపెట్టి మంచిదాన్ని మరొకతెను పెండ్లి చేసుకోరా!' అని హితము చెప్పి వెళ్ళినాడు. వాడు తికమక పడి, ఆలోచించి నిజమే అయి ఉంటుంది. రమ్మని వార్త పంపినా సురూప రాలేదు. నేనే వెళ్ళి ఏమి జరుగుతుందో కనిపెట్టుతాను. అని బయలుదేరి పోయి అత్తమామల సమ్మతిమీద భార్యను వెంట బెట్టుకొని నిజగృహానికి మరలినాడు.

కొంతదూరము ప్రయాణము చేసి వజ్రసారుడు తోడివారిని నెమ్మ దిగా తప్పించుకొని భార్యతో అరణ్యమార్గముపట్టి సురూపను ఏకాంత

ము:లో కూచోబెట్టి 'నీవు ఇతరులను మరిగావని స్నేహితుడు నాతో చెప్పినాడు. నిన్ను పిలిపిస్తే నీవు రాలేదు. నిజము చెప్పు. చెప్పకపోతే శిక్ష తప్పదు' అని గట్టిగా అన్నాడు. 'నీవు నమ్మితే నీయిష్టం వచ్చినట్టు చేసుకోవచ్చు' అని సురూప నిర్లక్ష్యముగా అన్నది. వజ్రసారుడు దానిని తీగలతో చెట్టుకు అంటగట్టి నాలుగు కొట్టి చీరెలాగి పారవేసినాడు. వస్త్రము ఊడిపోయిన తర్వాత భార్యనుచూచి వాడు మోహాపరవశుడై వేడుకొన్నాడు. నన్ను ఏప్రకారంగా చెట్టుకుకట్టి కొట్టినావో అలాగే నిన్నుకూడా చెయ్యనిస్తే తర్వాత అంగీకరిస్తాను' అన్నదిసురూప. ఆమందబుద్ధి అందుకుఅంగీకరించినాడు. అంతట ఆమాయలాడి భర్తను చెట్టుకు గట్టిగా కట్టివేసి వానిఖడ్గముతోనే వాని ముక్కుచెవులూ కోసి భర్తవస్త్రాలు ధరించి పురుషవేషముతో ఎక్కడికోపలాయనము చేసింది. వజ్రసారుడు అవమానముతో బాధతో మూలుగుతూ ఉన్నాడు.

ఒకానొక వైద్యుడు ఓషధుల కోసము ఆప్రాంతాలకు వచ్చి అతనిని చూచి తనయింటికి తీసుకువెళ్ళి గాయాలు నయము చేసినాడు. బాధ తగ్గిపోయినతర్వాత వజ్రసారుడు భార్యకోసము కొన్ని ప్రదేశాలు వెతికి విసికి చివరకు తనమిత్రుడు,క్రోధనునికి సమస్తమూ వివరించినాడు. వాడు వత్సరాజేశ్వరునికి యావత్తు విన్నవించినాడు. 'వీడు పౌరుషహీనుడని వీని భార్య పురుషవేషము ధరించి వెళ్ళిపోయింది. బాగా జరిగింది. రాజకులములో పరిహాసము చేసినప్పటికీ వజ్రసారుడు వజ్రసారమైన హృదయముతో ఇక్కడే ఉన్నాడు.

## తరంగము: ౫౭

## కల్యాణవతి కథ

తర్వాత మరుభూతి ఇలా పలికినాడు. స్త్రీలమనస్సుకు స్థైర్యము లేదు కాని ఈకథ వినండి. పూర్వము దక్షిణాపథములో సింహబలుడనే

రాజుకు కల్యాణవతి భార్య. ఆమె మాళవరాజపుత్రిక. రాజుకు అందరు రాణులకంటె ఆమెమీద ఎక్కువ ప్రేమ. వారు కొంతకాలము సుఖముగా ఉన్నమీదట దాయాదులు ప్రబలసైన్యముతో వచ్చి సింహబలుని దేశములోనుంచి వెళ్ళగొట్టినారు. అతడు భార్యతో కొద్ది వస్తువులతో మాళవదేశానికి ప్రయాణ మయినాడు మార్గమధ్యాన అరణ్యములో సింహముమీదికి వచ్చేసరికి ఖడ్గముతో నరికివేసినాడు. మరొక ప్రదేశాన వనగజము అడ్డమయినది. దానిపాదములు ఖండించినాడు. దొంగలగుంపు చుట్టుముట్టింది. వీరవిహారము చేసి చోరు లందరినీ సంహారించినాడు. ఇలా మార్గములో అవసరము వచ్చినప్పుడల్లా రాజు పరాక్రమము చూపిస్తూ క్రమముగా మాళవదేశము చేరి భార్యతో మార్గములో జరిగిన విషయాలను గురించి 'మామగారితో చెప్పవద్దు. క్షత్రియుని పరాక్రమానికి ప్రశంస అక్కరలేదు' అని బోధించినాడు. తర్వాత అతడు మామగారింటికి చేరి, ఆయన అడిగినమీదట శత్రు వృత్తాంతము చెప్పినాడు. ఆయన అల్లుని ఆదరించి, గుర్రాలు, ఏనుగులూ, ఇచ్చి శత్రువిజయానికి పంపినాడు.

కల్యాణవతిని పుట్టింటనే ఉంచి విక్రమసింహుడు మహాప్రబలు డైన గజానీక ప్రభువువద్దకు వెళ్ళినాడు. భర్త వెళ్ళిన కొంతకాలానికి ఒకనాడు కల్యాణవతి కిటికీలోనుంచి సుందరుని ఒకనిని చూచి మోహించి ఆలోచనలో పడి నాభర్తకంటె సుందరుడూ, శూరుడూ కనపడడు. అయినా ఇతనిమీదికి బుద్ధిపోతున్నది. ఏమిచెయ్యను! ఏమయినా సరే, ఇతనితో భోగించవలె' అని నిశ్చయించుకొని విశ్వాసపాత్రురాలైన చెలికత్తెకు చెప్పింది. ఆమె దౌత్యముజరిపి ఆయువకుని రాత్రివేళ రహస్యముగా తీసుకువచ్చి తాడుమీదుగా అంతఃపురములో ప్రవేశ పెట్టింది. వాడు కల్యాణవతివైఖరి చూచి కొంచెము భయపడి, శయనముమీద కూచోడానికి జంకి, సమీపాన పీఠముమీద కూర్చున్నాడు.

అయ్యో, వీడు సామాన్యుడు, ఉత్తముడు కాదు' అని కల్యాణవతి మనసులో విచారించింది. ఇంతలో పైనుంచి పాము వచ్చింది. దగ్గరలో ఉన్న ధనస్సులో బాణము సంధించి ఆయావకుడు పాము మీాద విడిచి చచ్చిన సర్పమును కిటికీలోనుంచి వెలపల పారవేసి సంతోషముతో నాట్యము చేయడము మొదలు పెట్టినాడు. 'వీడు నిర్వీర్యుడు' అని కల్యాణవతి అసహ్యపడి జుగుప్స ముఖాన కనబరిచింది. వైఖరి కనిపెట్టి చెలికత్తె అవతల గదిలోకి వెళ్లి మళ్ళీవచ్చి 'మీానాయనగారు ఎందుకో ఇక్కడికి వస్తున్నారు!'' అని తత్తరపాటుతో చెప్పింది. వాడు భయపడినాడు. చెలికత్తె అతని కిటికీవెంట తాడు మీాదిగా కిందికి పొమ్మన్నది. వాడు దిగుతూ గడ్డిదుబ్బుమీాద పడి లేచి వెళ్ళినాడు.

వాడు వెళ్ళగానే కల్యాణవతి చెలికత్తెతో 'సఖీ, మంచిపని చేశావు. నాహృదయము నీకు తెలిసింది. చాలా విచారంగా ఉన్నది. పొరపాటు చేశాను. నాభర్త సింహాదులను సంహరించి ఎవరితోనూ చెప్పడు. ఈనీచుడు పామును చంపినందుకే గంతులు వేసినాడు. ఇటువంటి పామరునితో నాకు రతి యేమిటి! చలచిత్తనైన నాకు జీవితముమీాద అసహ్యము పుట్టుతున్నది. చాలా పొరపాటుపని చేశాను. ఛీ! ఉత్తమ భర్తలను విడిచిపోయే భార్యలు కర్పూరాన్ని విడిచి దూరంగా వాలే ఈగలలాంటి వాళ్ళు!' అని చాల పశ్చాత్తాప పడ్డది.

సింహబలుడు గజానీకప్రభువుసహాయముతో దాయాదులను జయించి రాజ్యము స్వాధీనము చేసుకుని, వచ్చి మామగారిని సత్కరించి కల్యాణవతిని తీసుకువెళ్ళి సుఖముగా రాజ్యము పరిపాలించినాడు.

దేవా, మంచివివేకము కలస్త్రీలకుకూడా మనస్సు చలిస్తూ ఉంటుంది. లోకములో విశుద్ధసత్యమూర్తులు చాలా తక్కువ.

ఇలా మరుభూతి చెప్పినకథ ఆలకించి నరవాహనదత్తుడు హాయిగా నిద్రపోయినాడు.

## శక్తియశ

మర్నాడు ఉదయము నరవాహనుడు మంత్రిసమేతముగా ఉద్యానానికి వెళ్ళినాడు. అప్పుడు ఆకాశమునుంచి కొంతమంది విద్యాధర స్త్రీలు దిగినారు. అందులో మహాసౌందర్యవతిని చూచి నరవాహనుడు మంత్రులతో సహా ఆమెదగ్గిరికి పోయి అనురాగార్ద్రము లయిన కటాక్షవీక్షణములు ప్రసారిస్తున్న ఆకన్యతో 'కల్యాణీ, నీవెవరు? ఎందుకు ఇక్కడికి వచ్చినావు?' అని అడిగినారు.

ఆమె ఇలా చెప్పింది: 'హిమాలయములో కాంచనశృంగ మనే బంగారునగరములో స్ఫటికయశుడు అనే విద్యాధరప్రభువు నాతండ్రి. తల్లి హేమప్రభాదేవి. నాపేరు శక్తియశ. నాకు అయిదుగురు అన్నలు. వారిఆజ్ఞానుసారంగా గౌరీవ్రతము చేసి స్తోత్రాలు చేశాను. అమ్మవారు సుప్రీతురా లయి 'నిజకులనికంటె దశగుణము నీకు విద్యామహిమ కలుగుతుంది. వత్సరాజుపుత్రుడు నరవాహనదత్తుడు ముందుముందు విద్యాధరచక్రవర్తి అవుతాడు. ఆయన నీకు భర్త కాగలడు' అని అనుగ్రహించి అంతర్ధానమయినది. గౌరీదేవికృపవల్ల నాకు విద్యలు లభ్య మయినవి. గతరాత్రి దేవి స్వప్నములో సాక్షాత్కరించి, 'బిడ్డా, ప్రాతఃకాలం నీవు భర్తసన్నిధికి వెళ్ళు; మళ్ళీ వెంటనే తిరిగి రా. నీతండ్రి నెలరోజులలో మీకు వివాహము చేస్తాడు.' అని ఆనతిచ్చి అదృశ్యురా లయింది. తర్వాత తెల్లవారింది. నేను మీదర్శనార్థము ఇక్కడికి వచ్చాను. ఇక సెలవు!' అని సఖీజనముతో కూడా ఆకాశానికి ఎగిరి పోయింది.

నరవాహనుడు వివాహమహోత్సవానికి ఎదురుచూస్తూ దినము యుగమువలె గడుపుతున్నాడు. అతనివినోదముకోసము గోముఖుడు ఈకథ చెప్పినాడు:

## తరంగము: ౫౯

## మకరందిక

పూర్వము కాంచనపురి అనే నగరములో సుమనసుడు అనే మహా ప్రభువు ఉండేవాడు. ఒకనాడు కొలువుతీర్చి ఉండగా ప్రతీహారుడు వచ్చి 'మహాప్రభూ, నిషాదరాజు పుత్రిక ముక్తాలత దేవరవారి దర్శనార్థము వచ్చింది దానిచేతులో చిలకపంజరము ఉన్నది. దానిసోదరుడు వీరప్రభుడు కూడా వచ్చినాడు' అని విన్నవించినాడు. రానీ, అని రాజు అనుజ్ఞ ఇచ్చినాడు. ముక్తాలత వచ్చింది. ఇది మానవాంగన కాదు. ఎవరో దివ్యయువతి అనుకొన్నారు అక్కడివారు. ముక్తాలత రాజుకు ప్రణామము చేసి 'దేవా, ఈ చిలకపేరు శాస్త్రగంజ. ఇది నాలుగు శాస్త్రాలు అభ్యసించింది. కళలలో, విద్యలలో కుశలత కలది. కవిత్వము చెవుతుంది. దేవరవారికి సమర్పించడానికి తెచ్చాను' అని చిలకను అర్పణచేసింది. ప్రతీహారుడు దానిని ప్రభువువద్దకు తెచ్చినాడు. శుకము ఇలా పలికింది:

రాజన్, యుక్తమిదం సదైవ యదయం దేవస్య సంధుక్ష్యతే
ధూమశ్యామముఖో ద్విషద్విరహిణీ నిశ్వాసవాతోద్గమైః;
ఏత త్వద్భుత మేవ యత్పరిభవా ద్బాష్పాంబుపూరప్లవై
రాసాం ప్రజ్వలతీహ దిక్షు దశసు ప్రాజ్యః ప్రతాపానలః.

స్వస్త్యస్తు ధూమికాశ్యామల ముఖమైన
నీప్రతాపజ్వాల నిఖిలదిక్కులయందు
శాత్రవ విరహిణీ సంతత నిశ్వాస
వాతోద్గమమ్ములన్ వర్ధిల్లి వర్ధిల్లి
వెలుగొందు చుంటలో వింతయేమియు లేదు.

వారల బాష్పాంబుపూరసేకమ్ములన్
క్లిన్నమైన కొలంది కెరలి మండుటమాత్ర
మత్యద్భుతావహం బగునుమిా రాజేంద్ర!

ఈ పద్యము పలికి చిలక 'దేవా, ఏశాస్త్రమునుంచి ఏసందర్భము వివరించ మని సెలవు?' అన్నది. రాజు చాలా ఆశ్చర్యపడినాడు. మంత్రి అందుకొని 'దేవా, పూర్వజన్మలో ఎవరో ఋషి, ఈజన్మలో చిలకగా అవతరించినాడు అని తోస్తున్నది. సుకృతవశాన జన్మాంతర విద్యాజ్ఞానస్మరణకూడా ఇతనికున్నది' అన్నాడు. అప్పుడు ప్రభువు 'ఆర్యా, నీవృత్తాంతము వివరించు. చిలక వయినప్పటికీ ఈశాస్త్రజ్ఞానము నీకు ఎలాకలిగింది? ఎవరు నీవు?' అని అడిగినాడు. శుకము కన్నీరు విడిచి 'చెప్పదగని విషయ మయినప్పటికీ నీఆజ్ఞవల్ల చెపుతాను దేవా!' అని ఇలా చెప్పనారంభించింది :

## శాస్త్రగంజవృత్తాంతము

దేవా, హిమలచలప్రాంతాన గొప్పరోహిణవృక్ష మున్నది. దాని మీాద అనేకపక్షులు నివాసము చేస్తూ ఉంటవి. నాతల్లిదండ్రులు కూడా గూడు కట్టుకొని దానిమీాదనే ఉంటున్నారు. కొన్నాళ్ళకు నేను పుట్టినాను. నేను పుట్టగానే నాతల్లిచనిపోయింది. మానాయనే నన్ను పెంచుతున్నాడు. ఒకనాడు నానావిధవాద్యాలు వాయిస్తూ, బూరలు ఊదుతూ భిల్లులదండు అక్కడికి వేటకు వచ్చింది. పగలంతా వివిధజంతువులను సంహరించి సాయంకాలానికి భిల్లులు మాంసపు కావిళ్ళు మోసుకుని ఆచెట్టుకిందికి వచ్చారు. అందులో ఒకవృద్ధభిల్లునికి జంతువు లేవీ దొరకలేదు కాబోలు, వృక్షముమీాది కెక్కి వాడు పిట్టల గొంతులు నులిపి, చంపి, కిందపారవేశాడు. మాదగ్గిరికి వాడు వచ్చే సరికి నేను మానాయన రెక్కలలో దాక్కున్నాను. మానాయన

చేసి తన మంత్రి ప్రభాసుని పుత్రుడైన ప్రియంకరుని మంత్రిగా ఇచ్చి నాడు ఆతరుణములో మాతలి ఆకాశమునుంచి దివ్యాశ్వమును తెచ్చి సోమప్రభునితో 'మహేంద్రుని మిత్రుం డయిన విద్యాధరుడవు నీవు. మానవలోకములో అవతరించావు. ఉచ్చైశ్శ్రవ హయము బిడ్డ అయిన ఆశుశ్రవము అనే ఈ అశ్వరాజమును మహేంద్రుడు పూర్వస్నేహము చేత నీకు పంపినాడు. ఈ గుర్రముమీద ఎక్కినప్పుడు నిన్ను శత్రువులు ఓడించలేరు. అని అశ్వమును సమర్పించి సత్కారములు పొంది వెడలి పోయినాడు. సోమప్రభుడు ఆనాడు ఉత్సవము చేసి, మరునాడు జన కునితో 'నాయనా, జిగీష క్షత్రియులక్షణము. నేను దిగ్విజయార్థము బయలు దేరుతాను. అనుజ్ఞ ఇవ్వాలి' అని వేడితే జ్యోతిష్ప్రభుడు జైత్రయాత్రకు కావలసిన సన్నాహము చేయించినాడు.

## మనోరథప్రభ

శుభవాసరమున సోమప్రభుడు తండ్రికి నమస్కారము చేసి దివ్యాశ్వ మెక్కి సైన్య సమేతముగా బయలుదేరి, రాజుల నందరినీ జయించి తిరిగి వస్తున్నాడు. హిమవత్పర్వత సమీపాన సేనలు నిలిపి వినోదార్థము అతడు వేటకు వెళ్ళినాడు. అక్కడ రత్నఖచితమైన కిన్నరము కన బడితే సోమప్రభుడు గుర్ర మెక్కి దానిని తరుముకొని పోయినాడు. అది కొండగుహలో దూరి కనబడకుండా పోయింది. సాయంకాల మయింది. అతడు చాలా బడలికచెంది సమీపాన సరోవరము కన బడితే అక్కడ రాత్రి గడుపుదామని గుర్రము దిగి, దానికి మేత వేసి చెట్లమీద పండ్లుకోసి, తిని, మంచినీరు తాగి విశ్రమించినాడు. ఇంతలో గీతధ్వని వినిపించింది. సోమప్రభుడు లేచి, ఆనాదము వస్తున్నచోటికి వెళ్ళి చూచేసరికి శివలింగ సన్నిధిలో పాట పాడుతున్న దివ్యస్త్రీ గోచ రించింది. అన్యోన్య సందర్శన మయింది. ఆమె సోమప్రభునికి అతిథి

సత్కారము చేసి 'ఆర్యా, తమ రెవరు? ఈ దుర్గమప్రదేశానికి ఏకాకిగా ఎలా వచ్చారు?' అని అడిగింది. తన వృత్తాంతము చెప్పి అతడు ఆమె సంగతి అడిగినాడు. మహానుభావా మీకు కుతూహలము ఉంటే వినండి అని కన్నీళ్ళతో ఇలా చెప్పింది.

## ర శ్మి మం తు ని చ రి త్ర

ఇక్కడ హిమాచలముమీద కాంతనాథ మనే నగర మున్నది. అందులో పద్మకూటు డనే విద్యాధరప్రభువు మానాయన. మాఅమ్మ హేమప్రభాదేవి. నాపేరు మనోరథప్రభ. విద్యాప్రభావమువల్ల నేను ప్రతిదినమూ చెలికత్తెలతో సహా పర్వతాలలో ఆశ్రమాలలో ద్వీపాలలో ఆరామాలలో విహారము చేస్తూ నాయనగారి భోజనవేళలకు ఇంటికి వస్తూ ఉంటాను. ఒకనాడు ఇక్కడి సరోవర తీరాన విహరిస్తూ ఉండగా సుందరమునికుమారుడు వయస్యునితోసహా కనిపించినాడు. ఆకర్షణవల్ల నేను అతని దగ్గరికివెళ్లి కూర్చున్నాను. నాచెలికత్తె మా ఉభయుల అభిప్రాయాలూ గ్రహించి ఆయన వయస్యునితో ఈమహానుభావు డెవరు? అన్నది.

ఆయన ఇలాచెప్పినాడు: ఇక్కడికి సమీపాన ఆశ్రమములో దీధితిమంతు డనే బ్రహ్మచారి ఋషి సరస్సుకు స్నానార్థము వెళ్ళినాడు. శ్రీదేవి దైవవశాత్తు అక్కడ విహరిస్తూ అతన్నిచూచి మానసపుత్రుని కన్నది. పిల్లవానికి ఋషి రశ్మిమంతుడు అని పేరుపెట్టి క్రమేణ ఉపనయనము చేసి సమస్తవిద్యలు నేర్పినాడు. ఈమిత్రుడే రశ్మిమంతుడు. మేము కలిసి తిరుగుతూ ఉంటాము.

ఇలాచెప్పి ఆయన నావృత్తాంతమునుగురించి నాసఖిని అడిగినాడు. ఆమె అన్నివిషయాలూ తెలియపరచింది. పరిచయమై పరస్పరానురాగముతో ఉన్న సమయాన మాయింటినుంచి భోజనానికి రమ్మని పిలుపు

వచ్చింది. త్వరగానే తిరిగి వస్తానని మునిపుత్రునితో చెప్పి నేను జంకుతూ మానాయనగారివద్దకు వెళ్ళాను. భోజనము చేసి నేను ఇవతలికి వచ్చేటప్పటికి నాచెలికత్తె వచ్చి ఆమునికుమారుని మిత్రుడు రశ్మిమంతు డిచ్చిన విద్యాధరప్రభావమువల్ల చప్పున వచ్చి మన ద్వారముముందర నిలిచి ఉన్నాడు. మనోరథప్రభను విడిచి క్షణమైనా ఉండలేను. అని వార్త పంపినాడు. ఆవాక్కులు వినగానే నేను సఖితో ఆపయస్కుడు చూపిన మార్గాన ఇక్కడికి వచ్చి చూచేసరికి మునికుమారుడు వెన్నెలలో నిర్జీవుడై పండుకొని ఉన్నాడు. నేను చాలా దుఃఖించి అతని శరీరముతోపాటు అగ్నిప్రవేశము చేతా మనుకొన్నాను. అంతలో ఆకాశమునుంచి దివ్యపురుషుడు వచ్చి ఆకళేబరము తీసుకువెళ్ళినాడు. నేను అగ్నిప్రవేశము చేయబోతూ ఉంటే ఆకాశవాణి 'వద్దు మనోరథప్రభా, ఈమునికుమారునికీ నీకూ సముచిత సమయములో సమాగమము సంభవిస్తుంది' అని ఆనతిచ్చింది. నాటినుంచి నేటివరకూ ఆశతో ఆయనకోసము ఎదురుచూస్తూ శివారాధన చేస్తున్నాను. ఆయన మిత్రుడు ఎక్కడికి వెళ్ళినాడో తెలియదు.

'మరి నీవు ఒక్కతెవే ఇక్కడ ఉన్నావు? నీచెలికత్తె ఏమయినదో' అన్నాడు సోమప్రభుడు. మనోరథప్రభ ఇలా చెప్పింది.

## మ క ర ం ది క

సింహవిక్రము డనే విద్యాధరేశ్వరుని పుత్రిక మకరందిక నాప్రాణసఖి. నాస్థితిగతులు తెలుసుకొని రమ్మని తనచెలికత్తెను పంపింది. ఆమె వెంట నాసఖిని పంపి నేను ఏకాకినిగా ఉన్నాను అని ఆమె చెపుతుండగానే సఖి ఆకాశమునుంచి దిగింది. మనోరథప్రభ సోమప్రభునితో సఖికి పరిచయము చేసింది. సఖి మకరందిక వృత్తాంతము చెప్పి, ఆయనకు వర్ణశయ్య ఏర్పాటు చేసి, ఆయన గుర్రానికి మేత వేసింది. అందరూ

నిద్రించి తెల్లవారగానే మేలుకొన్నారు. అప్పుడు దేవజయు డనే విద్యాధరుడు వచ్చి, 'మనోరథప్రభా, నీకు వరుడు కుదిరితేనే కాని కూతురు మకరందిక వివాహ మాడదట. అందుచేత నీవు వచ్చి హితబోధ చెయ్యవలసిందని సింహవిక్రమమహారాజు నీతో చెప్పమన్నాడు' అని పలికినాడు. ఆమె బయలుదేరబోతూఉంటే సోమప్రభుడు 'విద్యాధరలోకము చూతామనే కుతూహల ముస్నది. నన్నుకూడా తీసుకొని వెళుతావా? అశ్వము ఇక్కడే తృణాదులు మేస్తూ ఉంటుంది' అన్నాడు. సరే అని ఆమె దేవజయుని ఒళ్ళో అతనిని కూచో మని చెలికత్తెతోకూడా గగనమార్గాన మకరందిక వద్దకు వెళ్ళింది. ఆతిథ్యము జరిగినతర్వాత సోమప్రభునిగురించి అడిగితే మనోరథప్రభ చెప్పింది. అతనిని చూడగానే మకరందిక మోహించింది. ఇష్టాగోష్ఠి అయినతర్వాత మనోరథప్రభ మకరందికతో 'చండీ ఎందుకు వివాహము చేసుకోవు?' అని అడిగింది. 'నీకు వివాహము కాకుండా నేను ఎలా పెళ్ళాడుతాను!' అని మకరందిక చమత్కారముగా అన్నది. వెర్రిదానా, నాకు వరు డున్నాడు. ఆయన సమాగమముకోసము ఎదురు చూస్తున్నాను' అని ఆమె అంటే "సరే. అలా అయితే నీమాట ప్రకారమే నడుచుకుంటాను. అన్నది మకరందిక.

మనోరథప్రభ ఆమెహృదయము గ్రహించి 'సఖీ, ఈసోమప్రభుడు లోక మంతా తిరిగి ఇక్కడికి వచ్చినాడు. ఈయనకు అతిథిసత్కారము చెయ్యవలె' అన్నది. నాశరీరముతోసహా సమస్తమూ ఈయనకు ఇప్పుడే అర్ఘ్యముగాఇస్తున్నాను. ఇష్టమయితే స్వీకరించవచ్చు'అన్నది మకరందిక.

ఈవిషయము మనోరథప్రభ మకరందికతండ్రికి తెలియజేసి వారికి వివాహనిశ్చయము చేయించింది. సోమప్రభుడు చాలా ఆనందించి ఒకసారి మనోరథప్రభ ఆశ్రమానికి వెళ్ళివస్తాను. అక్కడికి మామంత్రిసైన్యమూ వచ్చి ఉండవచ్చు. వారు నాకోసము వెతుకుతూ ఉంటారు.

అక్కడి వార్తలు తెలుసుకొని మంచిరోజున మకరందికను వివాహ మాడుతాను' అన్నాడు. అంతట అతనిని దేవజయుని ఒళ్ళోకూచోబెట్టి మనోరథ తనఆశ్రమానికి తీసుకు వెళ్ళింది. అతని మంత్రి ప్రియంకరుడు సైన్యసమేతుడై అక్కడికి వచ్చినాడు. తండ్రివద్దనుంచి దూత ఉత్తరము తెచ్చినాడు. సోమప్రభుడు వెంటనే బయలుదేరి రావలెనని అందులో ఉన్నది. మంత్రి సమ్మతిమీద అతడు తండ్రిని చూచి త్వరలో వస్తానని వారి కందరికీ చెప్పి వెళ్ళినాడు.

దేవజయుడు వెళ్ళి ఈవృత్తాంతము మకరందికకు చెప్పినాడు. ఆమె విరహోన్మాదిని అయిపోయింది. ఉద్యానవిహారము మానివేసింది. సంగీతకము మీద ఆసక్తి విడిచింది. చెలికత్తెలను విసర్జించింది. అన్నపానాలు మానుకొంది. తల్లిదండ్రులు ఏమి చెప్పినా వినలేదు. తామరాకుపాన్పు విడిచి వెర్రిదానివలె తిరగడము ప్రారంభించింది. జననీజనకులు ఎన్ని విధాలనో బతిమాలి బతిమాలి చివరకు ప్రాణము విసికి శాపము పెట్టారు. అందుచేత మకరందిక ఆశరీరముతోనే నిషాదకన్యక అయింది. వెనకటివిషయాలు మరచిపోయింది. పాపము, తల్లిదండ్రులు తొందరపడ్డామే అని చాలా విచారపడి చివరకు మరణించారు. ఆవిద్యాధరప్రభువు పూర్వము సమస్తశాస్త్రవేత్త, ఋషి, దుష్కర్మవల్ల చిలక అయినాడు. అతని భార్య వనవరాహమయింది. ఈశుకమే అతడు. తపోబలముచేత వెనకటి విద్యలు జ్ఞాపకమున్నవి. ఇతనికి వచ్చిన మార్పులకూ కర్మగతి వైచిత్రికీ నాకు నవ్వు వచ్చింది. ఇతడు రాజసభలో ఈకథ చెప్పినతర్వాత విముక్తు డవుతాడు. ఇతని కుమార్తె మకరందికను ప్రస్తుతము నిషాదకన్యగా ఉన్న దానిని విద్యాధరజన్మలో వివాహ మాడుతాడు. ప్రస్తుతము రశ్మిమంతుడుగా ఉన్న రాజును మనోరథప్రభ అప్పుడే భర్తగా పొందుతుంది. సోమప్రభుడు తండ్రిని దర్శించి ఆశ్రమానికి వెళ్ళి ప్రియాప్రాప్తికోసము మహేశ్వరుని గురించి

తపస్సు చేస్తున్నాడు.

పులస్త్యమహాముని ఇలా చెప్పినమీదట నాకు పూర్వజన్మ వృత్తాంతము జ్ఞప్తికి వచ్చింది. చాలా విచారమూ ఆనందమూ కలిగినవి. మరీచి ముని నన్ను తన ఆశ్రమానికి తీసుకువెళ్ళి పెంచుతున్నాడు. రెక్కలు వచ్చి ఎగిరేశక్తి కలగగానే పక్షి సహజచాపలముచేత అక్కడక్కడ తిరుగుతూ విద్యామహిమలు చూపుతూ చివరకు ఈనిషాదునికి దొరికి ఇప్పుడు నీసన్నిధికి రావడము సంభవించింది. నేటితో నాదుష్కర్మ క్షయ మయింది.

ఈవిధముగా శుకము చెప్పగానే రాజు చాలా ఆనందించినాడు.

అక్కడ తపస్సు చేస్తున్న సోమప్రభునికి స్వప్నములో మహేశ్వరుడు సాక్షాత్కరించి 'లే. సుమనోరాజు వద్దకు వెళ్ళు. అక్కడ నీప్రియురాలు లభిస్తుంది. ఇప్పుడు ముక్తాలత అనే నామముతో నిషాదకన్యగా ఉన్నది. చిలకరూపములో ఉన్న తండ్రిని తీసుకొని రాజసన్నిధికి వెళ్ళింది. నిన్ను చూడగానే ఆమెకు శాపమోక్షమవుతుంది. పూర్వజన్మ జ్ఞప్తికి వస్తుంది' అని సెలవిచ్చినాడు. తర్వాత ఆశ్రమములో ఉన్న మనోరథప్రభకు దర్శన మిచ్చి 'బిడ్డా, రశ్మిమంతుడు ఈజన్మలో సుమనోరాజు నీవు అతనివద్దకు వెళ్ళు. నిన్నుచూడగానే పూర్వజన్మ స్మరిస్తాడు' అని కరుణతో ప్రబోధించినాడు.

విద్యాధరకన్య, సోమప్రభుడు తక్షణమే సుమనోరాజు ఆస్థానానికి వెళ్ళినారు. మకరందిక సోమప్రభుని చూచి శాపవిముక్తురాలై విద్యాధర కన్య అయింది. సుమనోరాజు మనోరథప్రభను చూడగానే పూర్వజన్మ స్మరించినాడు. ఆకాశమునుంచి కిందికి జారిన తన పూర్వదేహములో ప్రవేశించి రశ్మిమంతుడయి ప్రియురాలితో కూడా తన ఆశ్రమానికి వెళ్ళినాడు. సోమప్రభుడు ప్రేయసితో తన రాజధానికి వెళ్ళినాడు. చిలుక పక్షి దేహము విడిచి పుణ్యలోకానికి వెళ్ళిపోయింది.

కాలయాపన మయినప్పటికీ జీవులకు పునస్సమాగమము కలుగుతూ ఉంటుంది.

గోముఖుడు ఇలా చెప్పిన మీదట నరవాహనుడు శక్తియశను తలచుకొన్నాడు.

## తరంగము: ౬౦

తర్వాత గోముఖుడు నరవాహనదత్తునితో దేవా, లోకములో ప్రజ్ఞకలవారు కష్టములు తప్పించుకో గలరు. తిర్యగ్జంతువులుకూడా పరాక్రమమువల్ల కాక ప్రజ్ఞవల్లనే క్షేమసుఖములు పొందుతారు.

## సింహవృషభములు

పూర్వము వణిక్కుమారుడు వ్యాపారార్థము మధురాపురము వెళ్ళుతుండగా అతని బండిఎద్దులలో సంజీవక మనేది కొండవాగుబురదలో కాలు జారి పడిపోయింది. ఎంతప్రయత్నముచేసినా లేవలేదు. ప్రాణము విసిగి వర్తకుడు నిరాశ చేసుకొని దానిని అక్కడే విడిచి పోయినాడు. తర్వాత కొన్నిగడియలకు సంజీవకము ఎలాగో లేచి సమీపములో మంచిపచ్చిక మేసి క్రమక్రమముగా యమునాతీరము చేరింది. అక్కడి మేతవల్ల, నదీజలమువల్ల త్వరలోనే బాగా బలిసింది. క్రమేణ మదించి, పుట్టలమీద కుమ్ముతూ తిరుగుతూ ఖణిల్లు మని రంకె వేసింది.

అక్కడికి దగ్గరలో పింగళక మనే మృగరాజు గుహలో నివాసము చేస్తున్నది. ఆసింహానికి కరటకదమనకు లనే నక్కలు మంత్రులు. ఒకనాడు పింగళకము దాహము తాగడానికి యమునానదికి వెళ్లుతూ సంజీవకము రంకె విని భయపడి 'సమీపములో ఏదో మహాజంతు వున్నది. అది నన్ను చూచి చంపవచ్చును. అరణ్యములోనుంచి అవతలికి తరిమివేయవచ్చును' అనుకొని నీరు త్రాగకుండా వెనక్కు వచ్చి,

అనుచరజంతువులకుకూడా చెప్పకుండా రహస్యంగా దాక్కొన్నది. ప్రాజ్ఞుడు దమనకుడు కరటకునితో 'భద్రా, మనప్రభువు యమునో దకము తాగకుండా చప్పున మరలి వచ్చినాడు. కారణ మేమిటో కనుక్కొందాము' అన్నాడు. 'మన కెందుకు? చీలమేకు లాగిన కోతి సంగతి తెలుసునా?' అని కరటకుడు ఇలా చెప్పినాడు.

## చీ ల మే కు లా గి న కో తి

ఒకవర్తకుడు కలప తెప్పించి దేవాలయము కట్టిస్తున్నాడు. కోతి పనివాళ్ళు ఒకదూలము రంపముతో కొంతవరకు కోసి అక్కడ సందులో చీలమేకు దిగగొట్టి భోజనాలకు వెళ్ళినారు. ఇంతలో అక్కడ తిరుగుతున్న కోతులలో ఒకటి సహజచాపల్యముచేత దూలముచీలికల మధ్యకువచ్చి కూర్చుని కొట్టిన కొయ్యమేకు లాగివేసింది. దూలము చీలికలు రెండూ టక్కునకలుసుకొన్నవి. కోతి నడుమ నలిగిప్రాణాలువిడిచింది.

కరటకునిమాటలు విని దమనకుడు 'ప్రభువుమనసులో జొరబడి ప్రాజ్ఞులు నిరంతరము విశేషభోగములు అనుభవిస్తారు. సామాన్యంగా ఉదరపోషణ ఎవడైనా చేసుకోగలడు' అన్నాడు.

'తనంతట తానే ప్రభుచిత్తానికి ఎక్కువగా ఎక్కడం మంచిది కాదు' అన్నాడు కరటకుడు.

'అలా కాదు, ప్రతివాడూ తమశక్తికి తగినట్టు ఫలము అపేక్షిస్తాడు. కుక్కకు ఎముక దొరికి తేనే తృప్తి. సింహానికి ఏనుగు కావాలి' అన్నాడు దమనకుడు.

'ప్రభువుకు మనమీద అనుగ్రహానికి బదులు ఆగ్రహము కలిగితే ఏమి లాభము? ప్రభువులు పర్వతాలవలె కర్కశులు, స్తబ్ధులు, విషములు' అన్నాడు కరటకుడు.

'నిజమే. కాని బుద్ధిమంతుడు స్వామిచిత్తము గ్రహించి స్వాధీనము

'చేసుకోవలె' అన్నాడు దమనకుడు.

కరటకుడు సరే అంటే దమనకుడు పింగళకుని సన్నిధికి వెళ్ళి నమస్కారము చేసి మన్నన పొంది ఇలా విన్నపము చేసినాడు: 'మహాప్రభూ, వంశపారంపర్యముగా నేను మీభృత్యుడను, హితుడను. హితము చెప్పేవాడు పరుడయినప్పటికీ రానివ్వవలె. తన బంధువయినా సరే అహితుణ్ణి దూరముగా పంపివెయ్యాలి. హితమైన మార్జాలాన్ని కొని తెచ్చుకొంటాడు: అహితమైన యెలుకను ఇంట్లో పుట్టినదానినైనా హతమారుస్తాడు. తనమేలు కోరిన భృత్యునిమాటలు ప్రభువు వినవలె. రాజు అడగకపోయినా అవసరమని తోచినట్టయితే సేవకుడు హితము చెప్పవలె. ప్రభూ, నామీద నీకు విశ్వాసము ఉన్నట్టయితే, కోపపడక, గోపనము చెయ్యక ఉండే పక్షములో, నిన్ను ఒకవిషయము అడుగుదామని ఉన్నది.'

ఈమాటలకు పింగళకుడు 'దమనకా, నీవు విశ్వాసపాత్రుడవు, భక్తి కలవాడవు. సంశయించకుండా అడుగు' అన్నాడు.

'దేవా, నీవు దాహమయి యమునానదికి వెళ్ళుతూ తిరిగివచ్చావు. నీరు తాగలేదు. ఏమో చింతాక్రాంతునివలె ఉన్నావు' అన్నాడు దమనకుడు.

ఆమాటలకు సింహము తనలో 'ఆహా, వీడు రహస్యము కనిపెట్టినాడు. అయినప్పటికీ భక్తితాత్పర్యములు కలవాడు. వీనిదగ్గర దాపరికముతో పనిలేదు' అనుకొని 'దమనకా, నీటిదగ్గిరికి వెళ్ళుతుంటే పెద్ద గర్జ వినబడ్డది. అంతధ్వని ఇదివరకెప్పుడూ వినలేను. ఆనాదము నాకన్న చాలా గొప్పజంతువుది అయి ఉండాలి. శరీరమునుబట్టి ధ్వని ఉంటుంది కదా, కాబట్టి ఇక మనపని అయినట్టే! ఆజంతువు ఈవనములో ప్రవేశించడమువల్ల నేను అడవి వదలి ఎక్కడికైనా వెళ్ళిపోతాను' అన్నది.

సింహామువద్దకు వెళ్ళి వృషభము భయపడుతున్న దని చెప్పింది. 'ఏమీా అపాయము లేదని చెప్పు' అని సింహాము అభయమిచ్చిన తర్వాత నక్క ఎద్దును తీసుకు వచ్చింది. సంజీవకము వచ్చి ప్రణామము చేసింది. 'రా, నీ కేమీా భయములేదు. నావద్దనే ఉండు' అని సింహాము ఆదరము చూపింది. ఆరోజునుంచీ వారిద్దరికీ స్నేహాము క్రమక్రమముగా వృద్ధిపొందింది. సింహాము తక్కినజంతువులను చూడడము మానివేసింది.

సందర్భము కనిపెట్టి దమనకుడు కరటకునితో ఇలా చెప్పినాడు. 'చూచావా, మృగరాజు మనవైపు చూడడము లేదు. సంజీవకుని వశ మయినాడు. తాను ఒక్కడే మాంసభక్షణ చేస్తున్నాడు. మనకు భాగము ఇవ్వడము లేదు. రాజు వట్టి మూర్ఖుడు. వృషభము బోధ చేస్తున్నది. దీనిని తీసుకురావడము నాదే తప్పు. ఇప్పుడు వీళ్ళ మైత్రి చెడగొట్టవలె. మృగరాజు వృషభాన్ని విడిచిపెట్టే వ్యవహారము నడప వలె' అన్నాడు.

'ఇప్పుడు వీరికి మనస్పర్థ కలిగించడము సీతరముకాదు.' అన్నాడు కరటకుడు.

'ప్రజ్ఞవల్ల ఆపనిచేస్తాను. ప్రజ్ఞఉంటే ఏపనిఅయినా చెయ్యవచ్చు' అని దమనకుడు ఈకథ చెప్పినాడు:

## కొం గ : ఎం డ్ర కా య

చేపలు నిండుగా ఉన్న చెరువులోకి కొంగ వెళ్ళింది. భయపడి చేపలు దాక్కొన్నవి. కొంగ వాటిని పట్టుకోలేక ఉపాయము అవలంబించ దలచి 'మత్స్యములారా, జాలరి వచ్చినాడు. మిమ్మలిని త్వరలోనే వల వేసి పట్టి చంపివేస్తాడు. నామాటమీాద మీాకు నమ్మకముంటే నేను చెప్పినట్టు చెయ్యండి. జాలరులకు ఎవరికీ తెలియని మంచిసరస్సు మూరు మూాల ఉన్నది. మిమ్మలిని ఒక్కొక్కరినే తీసుకుపోయి అందులో

విడిచిపెట్టుతాను. అక్కడ హాయిగా ఉండవచ్చును' అని బోధించింది. పిరికిచేపలు కంగారుపడి 'అయ్యా, మమ్మలిని రక్షించు. ఇకమీద నీవే దిక్కు' అని వేడుకొన్నవి. అంతట కొంగ ఒక్కొక్క చేపనే ముక్కున కరుచుకొనిపోయి సమీపములో ఉన్న బండమీద పెట్టుకొనితినివేసింది. ఒక ఎండ్రకాయ కొంగతో 'ఎక్కడికి చేపలను తీసుకుపోతున్నావు?' అన్నది. చేపలకు చెప్పినమాటలే ఎండ్రకాయకు కొంగ చెప్పింది. భయముతో ఎండ్రి 'నన్ను కూడా రక్షించు' అని వేడుకొన్నది. కొంగ దాన్ని నోటకరుచుకొని రాతిబండదగ్గిరకి వెళ్ళింది. అక్కడ చేపల బొమికలు చూచి ఎండ్రకాయ బెదరి ఓహో ఈజిత్తులమారి చేపలను మోసగించి తినివేస్తున్నదే' అని మనసులో అనుకొని కొంగ తనను బండమీద పెట్టగానే దానిమెడ కటాలున పట్టుకొని రెండు గోళ్ళతో పీక నొక్కి కొరికి చంపివేసి, నెమ్మదిగా పాకిపోయి జరిగిన సంగతి యావత్తూ చెరువులో చేపలకు చెప్పింది. అవి చాలా ఆనందించినవి.

కాబట్టి ప్రజ్ఞయే బలము. బలము ఉన్నప్పటికీ ప్రజ్ఞలేకపోతే లాభము లేదు. అని ఈకథ చెప్పింది.

## సింహము, కుందేలు

పూర్వకాలము ఒకానొక అరణ్యములో సింహము కనబడిన జంతువును సంహరిస్తూ ఉంటే జంతువు లన్నీ కూడబలుక్కొని దానివద్దకు రోజుకు ఒకజంతువుప్రకారము పంపడానికి అంగీకారము అడిగినవి. సింహము సమ్మతించింది. ఆవిధముగా జరుగుతూ ఉండగా ఒకనాడు కుందేలువంతువచ్చింది. జంతువులు దాన్ని సాగనంపినవి. ఆచెవులపిల్లి మార్గములో ఆలోచిస్తూ వెళుతూ 'మృత్యువు ఆపదలో ఆసన్నమయినది. ఈఅపాయము తప్పించుకోవాలి. ధీరులు ఆపదలోకూడా ధైర్యము కోలుపోరు. ఉపాయము చూస్తాను' అనుకొని నెమ్మదిగా

ఆలస్యముగా సింహముదగ్గిరికి పోయింది.

సింహము మహాకోపముతో 'ఓరి మూర్ఖుడా, నా భోజనవేళ దాటి ఎంతసే పయిందో తెలుసునా? నిన్ను చిత్రవధ చేస్తాను చూసుకో!' అని గర్జించింది.

'మహాప్రభూ, ఇందులో నాఅపరాధము లేదు. ప్రస్తుతము నేను అస్వాధీనుడను. మార్గములో మరొకసింహము నన్ను అడ్డగించి కొంత సేపటికి విడిచిపెట్టింది' అని వినయపూర్వకముగా మనవిచేసింది. సింహము కళ్ళు ఎర్రజేసి తోకతో నేలమీద బాదుతూ 'ఎక్కడ ఉన్నది ఆసింహము? నాకు వెంటనే చూపించు' అన్నది. కుందేలు చిత్తమని ఆసింహాన్ని నూతిదగ్గరకు తీసుకుపోయి 'ఇందులో ఉన్నది చూడు' అని చెప్పింది. వెంటనే సింహము గర్జించి నూతి నీటిలో తన ప్రతిబింబము చూచి అదే మరోసింహమనీ, తన గర్జకు బయలుదేరిన ప్రతిధ్వని రెండోసింహాని దనీ భ్రమపడి, నూతిలోకి దూకి మృతిచెందింది.

కాబట్టి ప్రజ్ఞవల్ల శశకము బతికి, తక్కినమృగాలకు సంతోషము సమకూర్చింది.

నేనుకూడా ప్రజ్ఞాశక్తి ఉపయోగిస్తాను అని దమనకుడు పలికితే కరటకుడు మాటాడలేదు. తర్వాత దమనకుడు వెళ్ళి ప్రభువుదగ్గర దీనముఖముతో నిలుచున్నాడు. 'ఇలా ఉన్నావేమి?' అని పింగళకుడు అడిగినాడు. 'దేవా, సంగతి తెలిసి ఊరుకోగూడదు. నిజముగా స్వామి మేలు కోరినవాడు అడగకపోయినా హితము చెప్పి తీరవలె. దేవా, అన్యథా భావించక నామాట విను. సంజీవకము, నిన్ను పడదోసి రాజ్యము స్వాధీనము చేసుకోవలె నని చూస్తున్నది. తాను మంత్రి అయినప్పటినుంచీ నీవు బెదురు బోతువని గ్రహించింది. కొమ్ములు చిమ్ముతూ ఉంటుంది. ఎందుకో తెలుసునా? మాంసభోజనము కావల సిన సింహమును చీల్చివేతాము. నేను పచ్చిక మొదలయినవి తినేవాడను.

నావల్ల మీకు ప్రాణాపాయము లేదు.' అని ఇతర మృగాలకు చెప్పి కూడగట్టుకొని తాను రాజు కావలె నని ప్రయత్నిస్తున్నది. ఈ వృషభము నీకు సమీపములో ఉన్నంతకాలమూ క్షేమము లేదు అని దమనకుడు ఉపన్యసించినాడు.

'గడ్డి మేసే క్షుద్రజంతువువల్ల నాకేమి అపకారము కలుగుతుంది? పైగా ఈవృషభము నన్ను శరణు వేడింది. అభయమిచ్చి నేనే దీనిని ఎలా చంపడము' అన్నాడు పింగళకుడు.

'దేవా, అలా అనకూడదు. రాజు ఎవనినైన తనతో సమానుణ్ణి చేసినప్పుడు లక్ష్మి ఒకరిదగ్గిరనుంచి తప్పకుండా వెళ్ళిపోతుంది. దుష్ట రోగిని వైద్యుడు విసర్జించినట్టు, హితము వినని స్వామిని బుద్ధిమంతుడు విసర్జించవలె. మొదట కష్టముగా ఉన్నా తర్వాత హితమయితే మంచిది. అటువంటి ఆలోచన చెప్పేవాడూ వినేవాడూ ఉండేచోట సిరి నిలుస్తుంది. యోగ్యులమాటలు వినక అయోగ్యుల వాక్కులు వినేవాడు చిక్కులలో పడిపోతాడు. దేవా, ఈ వృషభముతో నీకు మైత్రి యెందుకు? నీకు ద్రోహము తలపెట్టిన దీనికి అభయ ప్రదాన మేమిటి? ఎల్లప్పుడూ నీదగ్గర ఉండే ఈ వృషభము విడిచే మూత్రపురీషాలలో పుట్టే పురుగులు ఏనుగుదంతాల తాకిడి వల్ల నీశరీరాన కలిగే గాయాలలో ప్రవేశించి నీకు తెలియకుండానే ప్రాణాలు తీయవచ్చునుకదా? దుర్మార్గుడు తెలివి కలవాడయితే స్వయముగా అపకారము చెయ్యడు. వాడి సాంగత్యమువల్ల కలుగుతుంది.

## చీరపేను, నల్లి

మందవిసర్పిణి అనే చీరపేను చాలా రోజుల నుంచీ ఒక రాజుశయనములో ఉంటున్నది. ఒకనాడు టిట్టిభ మనే నల్లి గాలికి కొట్టుకు వచ్చి ఆపడకలో నేచేరింది. "ఎవరు నీవు? ఎందుకు వచ్చావు ఇక్కడికి

వెళ్ళిపో'' అన్నది మందవిసర్పిణి. చాలాకాల నెత్తురు తాగాను కాని రాజరక్తము తాగలేదు. అనుగ్రహించి కొంత కాలము నన్ను ఇక్కడ ఉండనీ' అని నల్లి చాలా బతిమాలినమీదట చీరపేను సరే! అని 'వేళాపాళాలేకుండా రాజు నెత్తురు తాగకు. ఆయన బాగా నిద్రపోతున్నప్పుడు మాత్రమే తాగు' అని సలహా యిచ్చింది. ఆరాత్రి రాజు పడుకోగానే నల్లి తొందరపడి అతనిని కరిచింది. రాజు నన్ను ఏదో కరిచింది. అని కేకవేసి లేచినాడు సేవకులు వచ్చి వెతికారు. నల్లి ముందుగానే తప్పించుకు పోయింది. చీరపేను దొరికింది. దాన్ని వాళ్లు నలిపివేశారు. టీటిభపుతో సహవాసమువల్ల మందవిసర్పిణికి మరణము సంభవించింది. అదేప్రకారంగా సంజీవకముతో సాంగత్యము వల్ల నీకూ సంకటము సంభవిస్తుంది. నామాటలమీద నీకు విశ్వాసము లేకపోతే సంజీవకము నీవద్దకు వచ్చినప్పుడు వాడికొమ్ములు అటూ ఇటూ చిమ్మడము గమనించు'' అని దమనకుడు బోధచేసినాడు.

పింగళకుడు దాని మాటలకు వశమై సంజీవకాన్ని చంపడానికి నిశ్చయించాడు. పింగళకుని మనసు గ్రహించిన తర్వాత దమనకుడు సంజీవకుని వద్దకు వెళ్ళి విచారము నటిస్తూ ఉంటే సంజీవకుడు 'మిత్రమా ఇలా ఉన్నావేమి? ఒంట్లో బాగా ఉన్నదా?' అని అడిగిన మీదట దమనకుడు 'మిత్రమా సేవ చేసేవానికి క్షేమ మెక్కడిది? ప్రభువులకు ఎప్పుడూ ఒకని మీద ఇష్టముంటుందా? యాచకునికి అగౌరవము తప్పదు. మృత్యువు దాటినవా డెవడు?' అన్నాడు. 'చాలా దీనంగా పలుకుతున్నావు ఏమి జరిగింది. మిత్రమా చెప్పు' అని సంజీవకుడు అడిగినాడు. 'మిత్రమా, నీమీది ప్రీతివల్ల చెవుతున్నాను. ప్రస్తుతము పింగళకునికి నీమీద ద్వేషము. ఆచలచిత్తుడు నిన్ను వధించి భక్షించే అపేక్షతో ఉన్నాడు. అతని చుట్టూ ఉన్నవారు క్రూరులు. తరుచు ప్రేరేపణ చేస్తున్నారు.' అని దమనకుడు పలికినాడు. పూర్వవిశ్వాసము

చేత సంజీవకుడు ఇతని మాటలు నమ్మి చింతాక్రాంతుడై 'ఛీ, ఎంత సేవ చేసినప్పటికీ నీచులు చుట్టూ చేరిన క్షుద్రప్రభువు ఉదార హృదయముతో ఉండడు. దృష్టాంతము విను' అని ఈకథ చెప్పినాడు.

## మదోత్కటు సింహము

ఒకానొక అడివిలో మదోత్కటు డనే సింహమున్నది. పులి, కాకి నక్క దాని భృత్యులు. వర్తకుల బిడారులోనుంచి తప్పించుకొని ఒక నాడు ఆ అరణ్యములో చేరిన లొట్టిపిట్టను చూచి దాని వికారరూపానికి నవ్వు వచ్చి సింహము తన అనుచరులతో అది ఏమి జంతువు అన్నది. బహుదేశములు తిరిగి అనేక విషయాలు చూచిన కాకి అది లొట్టిపిట్ట అని చెప్పింది. సింహము కుతూహలము పొంది లొట్టిపిట్టకు అభయ మిచ్చి తన అనుచరులలో చేర్చుకొన్నది. ఒకసారి సింహానికి ఏనుగుతో పోరాటము సంభవించింది. అందులో చాలా గాయపడి సింహము లంఖణాలు చేసింది. దాని అనుచరులకూ ఏమీ బాగాలేదు. సింహము లేచి ఒకనాడు చాలా తిరిగింది. ఆహారము ఎక్కడా దొరకలేదు. లొట్టియ లేనప్పుడు అనుచరులు ఇలా చెప్పినారు: 'దేవా, ఆపత్సమయములో మేము ఉచితాలోచన చెప్పవలె. లొట్టియమీద మీకు ప్రీతి యేమిటి! అది గడ్డిమేసే పశువు. మాంసభుక్కుల మైన మనకు అది సహజంగా ఆహారవస్తువు. మీ ఆశ్రితుల కందరికీ భోజనము పెట్టేటప్పుడు ఒక జంతువును చంపడానికి సంశయ మెందుకు? అభయ మిచ్చిన దాన్ని ఎలా చంపడ మనే సందేహ ముంటే మీరేమీ చెయ్యనక్కరలేదు. దాని అంతట అదేవచ్చి దేహము సమర్పించుకొనేటట్టు మేము ఏర్పాటు చేస్తాము.

సింహము అంగీకరించిన తర్వాత కాకి వెళ్ళి లొట్టిపిట్టతో 'మన ప్రభువు ఆకలితో చాలా బాధపడుతూకూడా మన కేమీ చెప్పడ

లేదు. కాబట్టి మేమందరమూ దేహాలు మీకు సమర్పించుకొంటా మని విన్నవిస్తాము. నీవుకూడా అలాగే చేస్తే ప్రభువుకు సింహానికి ప్రీతి కలుగుతుంది' అని నచ్చచెప్పి, దాన్ని తనవెంట సింహముదగ్గిరికి తీసుకొని వచ్చింది; వచ్చి కాకి 'దేవా, నేను మీభృత్యుడను. నాశరీరము స్వీకరించి భక్షించండి' అని విన్నవించింది. 'నీదేహము చాలా చిన్నది, నిరుపయోగము' అని సింహము నిరాకరించింది. 'ప్రభూ, నన్ను ఆరగించండి' అన్నది జంబుకము. సింహము దాన్నికూడా నిరాకరించింది; తనను వ్యాఘ్రము అర్పించుకోబోతే దాన్ని వద్దన్నది. తనను స్వీకరించవలసిం దని లొట్టిపిట్ట విన్నవించింది. వెంటనే సింహము దానిమీద పడి చీల్చి చంపివేసింది. కాకి, నక్క, పులి, సింహము — అన్ని కలసి దాన్ని భక్షించినవి.

ఈవిధముగా ఎవడో చాడీలమారివాడు నామీద ప్రభువుకుకోపము తెప్పించి ఉంటాడు. హంసలమధ్య ఉన్న గద్దను సేవించవచ్చు, గద్దలు చుట్టూ ఉన్నహంసను ప్రభువుగా సేవించలేము.

సంజీవకుడు ఇలా చెప్పినమీదట ధూర్తదమనకుడు 'ధైర్యముతో ఉంటే అన్నీ సాధ్య మవుతవి. అందుకు దృష్టాంతము చెపుతాను' అని ఈకథ చెప్పినాడు:

## లకుముకి పిట్ట కథ

సముద్రసమీపాన లకుముకిపిట్ట భార్యతో కాపురము చేస్తున్నది. ఆడపిట్ట గర్భము ధరించి ఒకనాడు భర్తతో 'మనము ఎక్కడికైనా వెళ్ళిపోదాము. ఇక్కడనే ప్రసవమయితే మనబిడ్డలు సముద్రతరంగాలలో కొట్టుకుపోవచ్చును' అన్నది. అందుకు టిట్టిభపక్షి భార్యతో 'ఏమిటే! నాతో వైరముపెట్టుకోడానికి సముద్రునికి గుండెలా చెరువా? నీకేమీ భయము లేదు' అన్నది. అందుకు భార్య ఇలా అంటా

నేమిటి! నీవెక్కడ, సముద్రమెక్కడ! మంచిమాట వింటే మంగళము వినకపోతే ఉపద్రవము అని దృష్టాంతంగా ఈకథ చెప్పింది:

## కంబుగ్రీవము కథ

ఒక సరోవరములో కంబుగ్రీవము అనే తాబేలు, సంకటవికట ములు అనే హంసలూ నివాసము చేస్తున్నవి. వర్షాలు కురవక ఒకసారి చెరువు ఎండిపోయింది. హంసలు మరొకసరస్సుకు వెళ్ళబోతూ ఉంటే తననుకూడా తీసుకు వెళ్ళ మని కంబుగ్రీవము ప్రార్థించింది. 'మేము వెళ్ళుదా మనుకొన్న సరస్సు ఇక్కడికి చాలాదూరము. మేము చెప్పి నట్లు నీవు చేస్తే తీసుకువెళ్ళగలము. కర్ర ఇటూ అటూ మేము ముక్కులతో గట్టిగా పట్టుకొంటాము, నీవు నడుమ నోటితో గట్టిగా పట్టుకో. నోరు తెరిస్తే నాశమే! మనము ఆకాశమార్గాన ఎగిరిపోదాము' అన్నవి హంసలు. తాబేలు అంగీకరించింది. ఆప్రకారముగా హంసలు ఎగిరిపోతూ ఉంటే ఒకపట్నములో జనులు చూచి గోల చేశారు. ఆ కలకలము విని తాబేలు మైమరచి ఏమిటాగోల? అంటూ జారి భూమి మీద పడ్డది. జనులు దాన్ని కర్రలతో కొట్టి చంపివేశారు.

కాబట్టి హితము విననివాడు కర్ర విడిచిన తాబేలు మోస్తరుగా నాశము చెందుతాడు.

అందుకు బదులుగా టిట్టిభపక్షి ఈకథ చెప్పింది.

## మూడు చేపలు

ఒకనదిలో ఒకప్రదేశాన మడుగువలె ఏర్పడ్డది. అందులో అనాగత విధాత. ప్రత్యుత్పన్నమతి, యద్భవిష్యకము అనే మూడుచేపలు ఉన్నవి. ఒకరోజున జాలరులు మడుగుదరినే వెళ్ళుతూ, ఈమడుగులో చాలా చేప లున్నవి. అనుకొంటూ పోయినారు. మూడుచేపలూ ఆమాటలు

విన్నవి. అనాగతవిధాత అనేచేప వెంటనే నీటిజాలున మరోప్రదేశానికి వెళ్ళింది. అపాయము వచ్చినపుడు ఆలోచించుకో వచ్చు నని ఊరు కొన్నది ప్రత్యుత్పన్నమతి. యద్భవిష్యకము ఏమీ ఆలోచించనే లేదు. త్వరలోనే జాలరులు వచ్చి వలవేశారు. ప్రత్యుత్పన్నమతి చచ్చి నట్టు పడిఉండడముచేత చేపలవాళ్ళు దాన్ని చంపక వదలివేశారు. అది నదీప్రవాహములో కొట్టుకుపోయి బతికింది. యద్భవిష్యము వలలో ఎగురుతూ ఉండడముచేత జాలరులు చావగొట్టినారు. నేను ప్రజ్ఞచేత అపాయమునుంచి తప్పించుకొంటాను భయపడి ఎక్కడికీ వెళ్ళను.

ఇలా అని టిట్టిభము ఆగూటిలోనే ఉన్నది. సముద్రుడు దాని అహంకారవాక్కులు విన్నాడు. తర్వాత కొన్నాళ్ళకు ఆడపిట్ట గుడ్లు పెట్టింది. కుతూహలము కలిగి ఏమవుతుందో చూతామని సముద్రుడు గుడ్లు అపహరించినాడు. టిట్టిభి రోదనముచేస్తూ నేను చెప్పలేదా? అను కొన్నంతపని అయింది' అని భర్తతో గోలపెట్టింది. ఈసముద్రుడి సంగతి చూస్తాను అని భర్త పక్షులతో తన నష్టమును గురించి చెప్పినాడు. పక్షులు సభచేసి, పక్షిజాతినాయకుడైన గరుత్మంతునితో మొరపెట్టినవి. గరుత్మంతుడు విష్ణుమూర్తికి విన్నవించినాడు. విష్ణువు ఆగ్నేయాస్త్రము ప్రయోగించేసరికి సముద్రుడు గుడ్లు తీసుకువెళ్ళి టిట్టిభికి ఇచ్చినాడు.

ఆపత్సమయములో బుద్ధిమంతుడు ధైర్యము విడిచిపెట్టడు. ఇప్పుడు నీకు పింగళకునితో వైరము సంప్రాప్తమయింది. సింహము తోక నిక్క బొడిచి నాలుగుకాళ్ళమీదా సమంగా లేస్తున్నప్పుడు నీకు అపాయ మని తెలుసుకో. అప్పుడునీవు జాగ్రత్తగా ఉండి, తలవంచి, కొమ్ములతో సింహముపొట్టలో పొడిచి పేగులు పైకి లాగు.

ఈవిధముగా బోధించి దమనకుడు కరటకునివద్దకు వెళ్ళి సింహ వృషభాలకు బాగా మనస్పర్థ ఏర్పడ్డదని చెప్పినాడు.

## ధర్మబుద్ధి — దుష్టబుద్ధి

పూర్వము ఒకనగరములో ధర్మబుద్ధి దుష్టబుద్ధి అనే వర్తకపుత్రులు ఉండేవారు. వాళ్లు కలిసి దేశాంతరము వెళ్లి రెండువేల సువర్ణ దీనారాలు సంపాదించి తమనగరానికి తిరిగి వచ్చి ఊరివెలుపల చెట్టుమొదట పాతి పెట్టినారు. నూరుదీనారాలు మాత్రము తీసుకొని ఉభయులూ సమంగా పంచుకొన్నారు. దుష్టబుద్ధి వ్యసనాలు హెచ్చి ఒకనాడు రహస్యముగా వెళ్ళి తవ్వి, దీనారాలు అన్నీ తీసుకొన్నాడు. నెలరోజు లయిన తర్వాత వాడు 'అన్నా నాకు అవసరం వచ్చింది. వెళ్లి దీనారాలు తెచ్చుకొందాము అన్నాడు. సరే అని ధర్మబుద్ధి వానితో కూడా వెళ్లి చెట్టు మొదట తవ్వి చూస్తే ధన మేమీ కనబడలేదు. 'నాకు చెప్పకుండా ఎప్పుడో దీనారాలు తవ్వి నీవే తీసుకొన్నావు' అన్నాడు దుష్టబుద్ధి. నాకు తెలియకుండా నీవే తవ్వుకు వెళ్లిపోయినావు అన్నాడు ధర్మబుద్ధి. ఇద్దరికీ వివాదము పెరిగింది. దుష్టబుద్ధి రాయితీసి నెత్తిమీద కొట్టుకును ధర్మబుద్ధిని న్యాయస్థానానికి తీసుకుపోయినాడు. అక్కడ ఉభయులు తమ తమ వాదాలు చెప్పుకొన్నారు. అధికారులు ఏమీ నిర్ణయించలేక ఉభయులనూ సాయంకాలముదాకా అక్కడే నిలిపినారు. ఏవృక్షమూలములో ధనము పాతిపెట్టినామో ఆవృక్షమే సాక్ష్యమిస్తుంది. ధర్మబుద్ధి ధనము అపహరించినట్టు స్పష్టంగా పలుకుతుంది అని దుష్టబుద్ధి అధికారులతో చెప్పినాడు. వాళ్ళు ఆశ్చర్యపడి సరే రేపుదయము వెళ్ళి సాక్ష్యం వింటాము అని వాళ్ళను జామీనుమీద విడుదల చేసినారు. ఇంటికి వెళ్లి దుష్టబుద్ధి రహస్యముగా తండ్రితో తనకు అనుకూల సాక్ష్యము చెప్పవలెనని కోరితే తండ్రి అంగీకరించినాడు. రాత్రివేళ నే తండ్రిని దుష్టబుద్ధి చెట్టు తొఱ్ఱలో నిలిపి ఇంటికి వచ్చినాడు. తెల్లవారిన తర్వాత అందరూ చెట్టుదగ్గర చేరినారు. అధికారులు 'వృక్షరాజా, ఎవరు దీనారాలు తీసుకువెళ్లినారు?' అని అడిగేసరికి 'ధర్మబుద్ధి తీసుకు

వెళ్లినాడు,' అని సమాధానము వచ్చింది. తొర్రలో ఎవరో ఉండి ఈమాటలు పలికినట్టు అధికారులు గ్రహించి చెట్టుతొర్రలో గడ్డిపెట్టించి నిప్పు ముట్టించినారు. పొగకూ మంటలకు తాళలేక లోపలనుంచి దుష్టబుద్ధి తండ్రి ఇవతలకు దూకి తలకిందులై నేలమీద పడి ప్రాణాలు విడిచినాడు. విషయము గ్రహించి అధికారులు ధర్మబుద్ధికి ధనమిప్పించి దుష్టబుద్ధి నాలుక, చేతులు కోయించి దేశములోనుంచి వెళ్ళగొట్టించినారు.

## కొంగ నేర్పు

కొంగకు పిల్లలు పుట్టగానే సర్పము వచ్చి తినేది. చాలా విచార పడి కొంగ ఒకచేపతో చెప్పుకొన్నది. దాని సలహా ప్రకారము మత్స్య మాంసఖండాలు ముంగిస ఉండేచోటినుంచి సర్ప రంధ్రముదాకా కొంగ చల్లింది. ముంగిస మాంసపుముక్కలు తింటూ క్రమేణ పాము పుట్ట వద్దకు వెళ్ళి పిల్లలతోకూడా పామును చంపివేసింది. ఉపాయము వల్ల కార్యము సాధించుకోవలె.

## ఇనప కాటా

ఒక వర్తకపుత్రుడు పిత్రార్జిత మంతా కోలుపోయి దరిద్రుడయినాడు. ఇనపకాటా మాత్రము మిగిలితే దాన్ని మరోవర్తకునివద్ద దాచి పెట్టు కొని ఆవర్తకపుత్రుడు దేశాంతరము పోయినాడు. కొన్నాళ్ళకు అతను వచ్చి ఆవేయి పలములకాటా ఇమ్మని అడిగితే ఆ యినపత్రాసును ఎలు కలు తిన్నవని చెప్పినాడు. వర్తకపుత్రుడు నవ్వుతూ అవును ఆలోహము చాలా తియ్యనిది. అందుచేతనే మూషికాలు తినివేశాయి' అని 'ఈవేళ మీయింట్లో నాభోజనము అన్నాడు. వర్తకుడు సంతోషముతో సరే అన్నాడు. కొంతసేపటికి అతని చిన్నకుమారుని తీసుకొని వర్తక పుత్రుడు స్నానానికి వెళుతూ తోవలో ఒకమిత్రుని యింట్లో ఆపిల్ల

వానిని దాచిపెట్టినాడు. తర్వాత వర్తకుని యింటికి భోజనానికి వెళ్ళితే 'మాపిల్లవాడు ఏడీ?' అన్నాడు. యజమాని పిల్లవాణ్ణి గ్రద్ద తన్నుకు పోయింది' అన్నాడు ఆయువకుడు. మాపిల్లవాణ్ణి నీవెక్కడో దాచి పెట్టావు' అన్నాడు తండ్రి. ఇద్దరికీ వివాదము జరిగింది. తండ్రి ఆయువకుని న్యాయస్థానానికి తీసుకుపోయినాడు. అక్కడకూడా ఆయువకుడు వెను కటి సమాధానమే ఇచ్చినాడు. 'పిల్లవాణ్ణి గద్ద తన్నుకు వెళ్ళడ మేమిటి? నమ్మేందుకు వీలులేదు అన్నారు అక్కడివారు.' ఈ దేశములో ఎలుకలు ఇనుప ముక్కలను తింటున్నప్పుడు గద్ద ఏనుగునే తన్నుకు పోవచ్చు. కుర్రవాణ్ణి ఎత్తుకు పోవడము ఆశ్చర్యమా?' అన్నాడు యువకుడు. అప్పుడు సభ్యులు అసలు సంగతి అడిగి తెలుసుకొని యువకునికి ఇనప కాటా ఇప్పించారు. పిల్లవాణ్ణి తండ్రికి ఇప్పించారు. ఇలా ఉపాయము చేత బుద్ధిమంతులు కార్యము సాధిస్తారు.

నీవు సాహసము చేసి రాజును ప్రాణాపాయస్థితిలోకి తెచ్చావు.

ఇలా కరటకుడు చెప్పగా దమనకుడు నవ్వి వృషభముతో పోరాడే టప్పుడు సింహానికి అపజయము కలుగుతుందా? ఏనుగు దంతాల పోట్లు తినే సింహానికీ కొరడా దెబ్బలు తినే వృషభానికీ సామ్యమా?' అన్నాడు. ఉభయులూ ఇలా మాటాడుతుండగనే సింహము ఎద్దును సంహరించింది. సంజీవకుడు పోయినమీదట దమనకుడు సంతుష్టి చెంది కరటకునితో కూడా మృగరాజు సన్నిధికి చేరి మంత్రిపదవి అనుభవించినాడు.

ఈప్రకారము గోముఖుడు చెప్పిన కథలు విని నరవాహనదత్తుడు సంతోషించినాడు.

## తరంగము: ౬౧

శక్తియశోదేవి కోసము ఉవ్విళ్ళూరుతున్న నరవాహనదత్తునికి వినోదము కలిగించడానికై గోముఖుడు మళ్ళీ కథలు చెప్పడము ప్రారం

తించినాడు. దేవా, ఇదివరకే ప్రాజ్ఞుల కథలు విన్నావు, ఇక మూర్ఖుల కథలు విను:

## అ గ రు దా హ కు డు

పూర్వకాలములో ధనికవర్తకుని కుమారుడు వ్యాపారార్థము కటాహద్వీపానికి వెళ్ళినాడు. అతని సరుకులో చాలాభాగము అగరు. మిగిలిన వస్తువు లన్నీ అమ్ముడు పోయినవి. కాని అగరుమాత్రము ఖర్చు కాలేదు. ఆ ద్వీపవాసులకు దానిఉపయోగము తెలియదు. కట్టెలు అమ్మే వాళ్ళు బొగ్గులు చెయ్యడమూ, అవి విక్రయము కావడమూ చూచి ఆమూర్ఖుడు అగరు కాల్పించి బొగ్గుచేసి, బొగ్గులధరకు విక్రయించినాడు. స్వదేశానికి వచ్చి తనప్రజ్ఞను గురించి నలుగురితో చెప్పుకొని నవ్వులపాలయినాడు.

## నువ్వుల కాపు

పల్లెటూరికాపు ఒకరోజున వేయించిన నువ్వులు తిని చాలా రుచిగా ఉండడము గ్రహించి, అటువంటివే పండడానికి వేయించిన నువ్వులు భూమిలో చల్లినాడు. మొక్క మొలవలేదు. తెలిసిన వారంతా నవ్వినారు.

## అగ్ని కుంభుడు

ఒకానొకమందుడు తెల్లవారగానే దేవతాపూజ చేయదలచి ఉదయాన స్నానాదులకు కావలసిన నీరు నిప్పు చప్పున అందుబాటులో ఉండేలాగున జలభాండములోనే అగ్నికూడా ఉంచి రాత్రి పడుకొన్నాడు. ప్రాతఃకాలములో వాడు లేచి చూస్తే అగ్ని ఆరిపోయి బొగ్గులు మిగిలినవి. నీళ్ళు నల్లబడిపోయినవి. వానినిచూచి నవ్విన జనుల ముఖాలు తెల్లబడ్డవి. వాడిముఖము మాత్రము నల్లబడిపోయింది.

## నాసికారోపణము

తన భార్యది చప్పిముక్కు, తండ్రిది దీర్ఘనాసిక కావడముచేత ఒకానొకమూఢుడు ఒకరాత్రివేళ ఇద్దరిముక్కులూ కోసి వినిమయము చేసినాడు. వాళ్ళిద్దరూ ముక్కులు పోయి గోలపెట్టినారే కాని వాడు అనుకొన్నట్లు జరగలేదు.

## పసుల కాపరి

ఒకానొక అరణ్యములో పసులకాపరికి చాలా ధన ముండడము కనిపెట్టి కొంతమంది టక్కరులు స్నేహరూపములో వాణ్ణి ఆశ్రయించారు. 'మిత్రమా, నగరములో ధనవంతునికుమార్తెను నీకు ఇమ్మని చెప్పినాము అతను ఇస్తానన్నాడు' అని ఒకనాడు అన్నారు వాళ్ళు. పశుపాలకుడు సంతోషించి వాళ్ళకు ధన మిచ్చినాడు. కొన్నాళ్ళు పోనిచ్చి వాళ్ళు నీకు పెళ్ళి అయింది అన్నారు. సంతోషించి వాడు మళ్ళీ ధనమిచ్చినాడు. మరి కొన్నిరోజులు పోనిచ్చి, వాళ్ళు వచ్చి నీకు కొడుకు పుట్టినా డన్నారు. ఆమందబుద్ధి ఆనందముతో అంతధనమూ వాళ్ళ కిచ్చివేసినాడు. వాళ్ళు వెళ్ళిపోయినారు. ఆమూఢుడు కుమారునికోసము బెంగపెట్టుకొని ఏడవడము ప్రారంభిస్తే చుట్టుపక్కలవాళ్ళు నవ్వు ఆపుకోలేక పోయినారు.

## ఆభరణమూర్ఖుడు

నేల తవ్వుతుంటే పల్లెటూరివానికి నగలమూట దొరికింది. గతరాత్రి రాచనగరులోనుంచి చోరులు ఆభరణాలు అపహరించి అక్కడ పాతిపెట్టినారు. పల్లెటూరిమనిషి నగలు తీసుకుపోయి భార్యను అలంకరించినాడు. ఒడ్డాణము తలమీద పెట్టినాడు. హారాలు నడుముకు కట్టినాడు. కంకణాలు చెవులకుకట్టి, అందెలు చేతులకు తొడిగినాడు. చూచినవాళ్ళంతా

పరిహాసము చేశారు. ప్రభువుకు ఈసంగతి తెలిసి ... ... మాత్రమూ తెప్పించుకొని, అజడబుద్ధిని శిక్షించా ...

## దూది శుద్ధి

ఒకానొకబుద్ధిహీనుడు దూది అమ్ముకోడానికి అంగడివీథికి వెళ్ళినాడు. శుద్ధిచేసినదూది కాదని దాన్ని ఎవరూ కొనలేదు. ... స్వర్ణకారుడు బంగారము శుద్ధి చెయ్యడమూ దాన్ని ఎం... ... కొనడమూ చూచిన ఆమందమతి తనదూదిని శుద్ధిచెయ్య... ... వేసినాడు. అందరూ పకపకా నవ్వినారు.

## ఖర్జూర చ్ఛేదకులు

రాజుగారి ఆనతిప్రకారము ఉద్యానవనాధికారులు ఖర్జూరపు మొక్కలు కావలె నని పల్లెటూరివాళ్ళకు ఉత్తరువిచ్చినారు. విరిగి పడిపోయిన ఖర్జూరపు చెట్లనిండా పండ్లు ఉండడము చూచి పల్లెటూరి వాళ్ళు తమగ్రామములో కాయలతో ఉన్న ఖర్జూరపుచెట్ల నన్నిటిని నరికి తెచ్చి ఉద్యానములో పాతిపెట్టినారు. ప్రభువుకు ఆసంగతి తెలిసి వాళ్ళను శిక్షించినాడు.

## నిధి పరీక్షకుడు

భూమిలో ఉన్న నిధినిధానము కనిపెట్టేశక్తి కలవానిని ఒక రాజు పిలిపించినాడు. ఆపురుషుడు మరోచోటికి వెళ్ళకుండా ఉండేందుకు మంత్రిమతని కన్నులు తీసివేయించినాడు. ఆపురుషుడు వచ్చినపని కాకపోగా అంధుడు కూడా అయినాడు. మంత్రిమతికి అందరూ అసహ్యించుకొన్నారు.

## లవణ భక్షకుడు

నగరవాసము చేసేపురుషుడు గ్రామనివాసము చేసే ... ఇంటికి తీసుకుపోయి కూరలు మొదలైనవి రుచిగా చేయించి భోజన

[illegible] ఎలా వచ్చింది అని పల్లెటూరిమనిషి అడిగితే '[illegible]' అన్నాడు నగరవాసి. నూరినఉప్పు పిడికెడుతీసు కొని [illegible] నోట్లో పోసుకొన్నాడు. వాని పెదిమలకూ మీసాలకూ ఉప్పు [illegible]కొన్నది. చూచినవాళ్ళు నవ్వినారు.

## పా ల వా డు

[illegible] పల్లెటూరివానికి మంచిగోవు ఉన్నది. అది రోజుకు నూరు పలముల పాలు ఇచ్చేది. ఒకసారి నెలరోజుల్లో పండగ వస్తుం దనగా అమాయకుడు ఆలోచించి 'ఈ నెలదినములూ పాలు పితకకుండా ఉంటే పండగనాడు ఆవు ఇన్నివేల పలముల పాలూ ఇస్తుంది. పరమాన్నా నికి ఉపకరిస్తవి పాలు' అని, పితకడము మానవేశాడు. తీరా పండగనాడు ఎంతపితికినా ఆవు పాలచుక్క అయినా ఇవ్వలేదు. సంగతి తెలిసినవాళ్ళంతా తెగనవ్వినారు.

## బ ట్ట త ల వా డు

బట్టతల మూర్ఖుడొకడు వెలగచెట్టుక్రింద కూర్చున్నాడు. ఖులాసా మాంద యువకుడు తోవన వెళుతూ చెట్టుకిందికి వచ్చి చేతికి అందు తున్న వెలగపండు కోసి వినోదార్థము బట్టతలమీద వేశాడు. వాడు ఊరుకొన్నాడు. రాగిచెంబువలె నిగనిగలాడుతున్న ఆశిరస్సుమీద యువకుడు మరికొన్ని వెలగపళ్ళు ఒక్కటొక్కటిగా వేసినాడు. తలమీద గాయము అయి, నెత్తురు కారింది. బట్టతలవాడు ఏమీ అనలేదు. చూచినవాళ్ళు 'ఏమిరా, దెబ్బలు తగులుతుంటే ఏలా ఊరుకొన్నావు?' అని అడిగితే 'వెలగపళ్ళతో ఎన్ని దెబ్బలు తగిలినా నాకు ఇష్టమే' అన్నాడు వాడు. నలుగురూ నవ్వినారు.

[illegible]నా ఈప్రకారముగా మందమతులు నవ్వులపాలవుతారు, పైగా

పనులు చేసుకొంటారు. బుద్ధిమంతులకే గౌరవము. ఇలా గోముఖుడు చెప్పిన మందబుద్ధులకథలు విని నరవాహనదత్తుడు ఆహ్నిక కృత్యాలు నిర్వర్తించడానికి లేచినాడు.

సాయంకాలము వారంతా మళ్ళీ సమావేశ మయినప్పుడు గోముఖుడు ప్రజ్ఞావంతులకథలు చెప్పడము ప్రారంభించినాడు:

## చిత్రగ్రీవుని కథ

ఒక అడివిలో గొప్పశాల్మలీవృక్ష మున్నది. లఘుపాతి అనే కాకి ఆ బూరుగుచెట్టుమీద గూడుకట్టుకొని ఉంటున్నది. ఒకనాడు ఉదయమే బోయవాడు వచ్చి ఆచెట్టుకిందనే వల పన్ని, ధాన్యము చల్లి కొద్దిదూరాన చెట్టుచాటున దాగిఉన్నాడు. ఇంతలో చిత్రగ్రీవు డనే పావురములరాజు సపరివారముగా ఆకాశమార్గాన పోతూ ఉంటే, నేలమీద ధాన్యము కనబడ్డది. గింజలమీద ఆశచేత పావురములన్నీ నేలమీద వాలగానే మాటుపెట్టినవలలో చిక్కుకొన్నవి. చిత్రగ్రీవుడు 'వెంటనే ముక్కులతో వల పట్టుకొని అందరూ ఒక్కసారిగా పైకి ఎగరండి' అని ఆజ్ఞ యిచ్చినాడు. బోయవాడు దగ్గిరికి రాకముందే పావురాలు పైకి ఎగిరిపోయినవి. పిట్టలు పట్టేవాడు దీనముఖముతో వెనక్కు వెళ్ళిపోయినాడు.

కాకి ఇది యావత్తూ చూచి, పావురాలవెనకాలే వెళ్ళింది. కొంత దూరము పోయినతర్వాత చిత్రగ్రీవుడు తన పరివారముతో 'సమీపములో నామిత్రుడు హిరణ్యకు డనే మూషికరాజు ఉన్నాడు. అతని బిలముదగ్గిర మనము వాలితే, అతను ఈ వల తెగకొరికి, మనను విడిపిస్తాడు' అన్నాడు. పావురాలన్నీ అలాగే రంధ్రమువద్ద వాలినవి. చిత్రగ్రీవుడు హిరణ్యకుని పిలిచి 'మిత్రమా, నేను చిత్రగ్రీవుడను. వలల్లో పరివారముతో సహా చిక్కుకున్నాను. నీవు బయటికి వచ్చి మాబంధనాలు

ఛేదించు' అని పలికినాడు. మూషికము లోపలినుంచి పూని బయటికి వచ్చి వల కొరికి, అందరినీ విముక్తులను చేసింది. కొంచెముసేపు మిత్రులకు ఇష్టాగోష్ఠి అయినతర్వాత పావురాలు వెళ్ళిపోయినవి.

## కా క మూ షి కా లు

లఘుపాతి ఇది అంతా చూచి ఆశ్చర్యపడి బిలముదగ్గిరికి పోయి 'ఆర్యా, నేను లఘుపాతి అనే వాయసమును. నీతో మైత్రికోరి వచ్చినాను. చిత్రగ్రీవునికి నీవు చేసినఉపకారము చూచి నీమిత్రవాత్సల్యానికి ముగ్ధుడనయినాను' అని పలికింది. హిరణ్యకము రంధ్రములోనుంచి బయటికి రాకుండానే 'వెళ్ళిపో. నీకూ నాకూ మైత్రి యేమిటి! నేను భక్ష్యాన్ని, నీవు భక్షకుడవు' అన్నది. 'ఆర్యా, అలా అనకు. నిన్ను భక్షించినమాత్రాన ఆకలి తీరుతుందా? క్షణకాలము తృప్తి కలుగుతుంది. నీతో మైత్రి ముఖ్యము. నీవంటిస్నేహితుడుంటే కష్టము వచ్చినప్పుడు కాపాడుతాడు' అని శాంతవచనాలు పలికి ప్రమాణము చేసి, విశ్వాసము కలిగించింది కాకి. అంతట హిరణ్యకుడు బిలములోనుంచి ఇవతలకు వచ్చినాడు, కాకమూషికాలకు సఖ్యము కుదిరింది.

నాటినుంచి కాకి మాంసపుముక్కలు తెచ్చేది. ఎలుక ధాన్యము గింజలు తెచ్చేది. ఉభయులూ కలిసి భుజిస్తూ సుఖముగా ఉంటున్నారు. కొంతకాలము గడిచిన మీదట ఒకనాడు లఘుపాతి హిరణ్యకునితో 'మిత్రమా అడవిలో దూరముగా నది ఉన్నది. అందులో నాస్నేహితుడు మంథరకుడు అనే తాబేలు ఉన్నది. అక్కడ మనకు బాగా ఆహారము దొరుకుతుంది. ఇక్కడ ఆహారము తేలికగా దొరకడము లేదు. పైగా బోయవాళ్ళవల్ల భయముకూడాను. అక్కడికి పోతాను.' అన్నది. 'నన్నుకూడా అక్కడికే తీసుకొనిపో; అందరమూ అక్కడే ఉందాము. ఈప్రదేశముమీద నాకు విరక్తి ఏర్పడ్డది. కారణము తర్వాత

పులగం చేసిపెట్టు' అని చెప్పినాడు. 'పేదవాడికి పులగము ఎక్కడనుంచి వస్తుంది?' అని భార్య ఆక్షేపించింది. అందుకాయన 'ఓసీ, డబ్బు జాగ్రత్త చేయ్యవలసిందే, కాని అధికంగా కూడబెట్టడము తగదు'' అని కథ చెప్పినాడు:

## నక్క కథ

ఒక వేటగాడు వేటాడి విల్లు ఎక్కుపెట్టి బాణము సంధించి, మాంస ఖండాలను ధనస్సుకు కట్టి, అడవిపంది కనబడేసరికి దాన్ని తరుముకు పోయి బాణము విడిచినాడు. అది అమాంతంగా వానిమీద పడి కోరలతో పొడిచి చంపింది. కొంతదూరమునుంచి చూస్తున్న నక్క ఆకలిగా ఉన్నప్పటికీ మనిషిని గాని అడవిపందిని గాని తినక, అవి దాచి పెట్టుకోవచ్చుని భావించి, ధనస్సుకు కట్టిన ఖండము తినబోయి విల్లునారిని కొరికింది. వెంటనే బిసతప్పిపోయి వింటికోపు నక్కగుండెలలో టక్కున తగిలింది. అలాగే అది ప్రాణాలువిడిచింది. కాబట్టి లోభిత్వము పనికిరాదు.

ఈ మాటలతో బ్రాహ్మణభార్య లోబడి అంగీకరించి పులగము చేయడానికి నువ్వులు ఎండబోసింది. ఆమె లోపలికి వెళ్ళినతర్వాత ఎక్కడినుంచో వచ్చి కుక్క నువ్వులు కొన్ని తిని అంతా మైల పడవేసింది. అవి ఎవ్వరూ కొనలేదు. కాబట్టి లోభమువల్ల లాభ మేమీ లేదు.

ఇలా చెప్పి కొత్తసన్యాసి 'గడ్డపలుగు ఉంటే తీసుకురా. ఈ ఎలుక సంగతి తేలుస్తాను' అని, పలుగు వచ్చినతర్వాత కలుగు తవ్వడము ప్రారంభించినాడు, నేను చాటున ఉండి చూస్తూనే ఉన్నాను. వాడు చాలా దూరము తవ్వినతర్వాత మణిహారము కనబడ్డది. దాన్ని తీసుకొని 'ఈ మణిహారము ఉన్నందువల్ల దూకడానికి శక్తి వచ్చింది' అని మఠములోకి వెళ్ళినాడు. స్వాములు ఇద్దరూ నిద్రపోయినతర్వాత నా మణిహారము మళ్ళీ తెచ్చుకుందామని నేను వెళ్ళేసరికి మఠస్వామి నామీదికి కర్ర విసిరినాడు.

నా తలమీద గాయమయింది. ప్రాణాలు మాత్రము పోలేదు. ఎలాగో వచ్చి బిలములో దూరాను. ఆహారపదార్థాలు తెచ్చే శక్తి పోయింది. ధన ముంటే బలమూ, తేజస్సు, ఉత్సాహమూ ఉంటవి. ధననాశమే వార్ధకము. నాదు పరివారమంతా నన్ను విడిచి పోయింది. ఎలాగో నేను పొట్టపోసుకోంటూ కాలక్షేపము చేశాను. అన్నము పెట్టలేని యజమానిని సేవకులూ, పుష్పాలులేని వృక్షాలను తుమ్మెదలూ, సలిలము లేని సరస్సును హంసలూ, వదలిపెట్టడము నిశ్చయము. చాలారోజులు అక్కడ నేను విచారముతో ఉండగా ఈలఘుపాతితో ఒకరోజున మైత్రి కుదిరింది. కూర్మరాజా, ఇప్పుడు నీతో సఖ్యము ఏర్పడ్డది.

అంతట కూర్మరాజు మంథరుడు హిరణ్యకునితో 'మిత్రమా, ఈప్రదేశము నీదే. సంతుష్టితో ఉండు. గుణవంతునికి విదేశము లేదు, సంతుష్టచిత్తునికి అసౌఖ్యము లేదు, ధీరునికి ఆపద లేదు, ప్రయత్నపరునికి అసాధ్యము లేదు' అంటూ ఉండగానే —

## చిత్రాంగమురాక

చిత్రాంగమనే లేడి అక్కడికి పరుగెత్తుకు వచ్చింది. దానిని వేటకాడు కొంతదూరము తరిమి వెళ్ళిపోయినాడు. లేడికి, కాక, కూర్మమూషికాలకూ స్నేహము ఏర్పడ్డది. ఒకరికొకరు తోడుపడుతూ అందరూ సుఖముగా ఉంటున్నారు. కొంతకాలము గడిచింది. ఒకనాడు చిత్రాంగము ఎంతసేపటికీ తిరిగి రాకపోవడముచేత లఘుపాతి చెట్టుమీద వాలి చూచింది. లేడి నదీతీరాన వలలో చిక్కుకొని ఉన్నది. దానిని కనిపెట్టి కాకి మూషికముతోనూ కూర్మముతోనూ చెప్పింది. అందరూ కలిసి ఆలోచించారు. కాకి ఎలుకను నోటకరుచుకు పోయి వలదగ్గర విడిచింది. మూషికము వలకొరికి లేడిని విడిపించింది. తాబేలు మనస్సు ఉండబట్టలేక నదీప్రవాహములో కొట్టుకు వచ్చి నెమ్మదిగా

గట్టుమీదికి పాకి మిత్రులను కలుసుకున్నది. ఇంతలోకే వేటకాడు వచ్చేసరికి కాకి, ఎలుక, లేడి తప్పించుకుపోయినవి. తాబేలు మాత్రము దొరికింది. వాడు దానిని వలలో చుట్టబెట్టి తీసుకుపోతున్నాడు.

తక్కినమిత్రులు ఉపాయము ఆలోచించారు — తాబేలును రక్షించ డానికి. వేటకాడు వెళ్లుతున్న మార్గములో ఎదురుగా కనబడేటట్టు లేడి చచ్చినదానివలె పడుకున్నది. కాకి దాని నెత్తిమీద వాలి దాని కళ్ళు పొడుస్తున్నట్టు నటించింది. బోయవాడు లేడిని తీసుకోడానికి తాబేలును నదీతీరాన పెట్టి దానిదగ్గిరికి వెళ్లినాడు. తక్షణమే ఎలుక వలతాళ్లు కొరికి, తాబేలును విడిపించింది. కూర్మము మెల్లిగా పాకి పోయి నదీ జలములో మునిగింది. వేటకాని చేతిలో కూర్మము లేకపోవడము గమనించి వానిని తనదగ్గిరికి రానిచ్చి లేడి తటాలున లేచి పరుగెత్తింది. కాకి ఎగిరిపోయి చెట్టుమీద వాలింది. వాడికి మతిపోయిన ట్టయింది. కూర్మమును ఉంచినచోటికి వాడు వెళ్లి చూస్తే అది లేదు. వాడు మొగము వేలవేసి ఇంటికి వెళ్లిపోయినాడు.

తర్వాత ఆజంతువులన్నీ ఒకచోట చేరి సుఖంగా ఉంటున్నవి. ఈప్రకారము తిర్యగ్జంతువులు కూడా మైత్రితో పనులు నెరవేర్చు కొంటూ అవసర మయితే తమ ప్రాణాలను కూడా తెగించి మిత్రులను రక్షించుకుంటవి. స్నేహితుల మీద ఆసక్తి మంచిదే. స్త్రీలమీద ఆసక్తి ఎక్కువ ఉంటే ఈర్ష్య పెరుగుతుంది. దానివల్ల చెరుపు.

## ఈర్ష్యావరుడు

తన భార్య చాలా చక్కనిది కావడముచేత ఒకానొకభర్తకు చాలా అపనమ్మకము వర్పడ్డది. అందుచేత వాడు ఆమెను ఎన్నడూ విడిచే వాడు కాడు. ఒకసారి పనిమీద దేశాంతరము వెళ్ళవలసివచ్చి వాడు భార్యను వెంట దీసుకొని పోతూ భిల్లులు నిండుగా ఉన్న అడవిలో

వెళ్ళడానికి భయపడి, భార్యను పక్క గ్రామములో వృద్ధబ్రాహ్మణుని ఇంట్లో ఉంచి వెళ్ళిపోయినాడు. భర్త వెళ్ళిపోయిన తర్వాత త్రోవన వెళుతున్న భిల్లయువకుని చూచి అదుర్మార్గురాలు మోహించి వానివెంట వెళ్ళిపోయింది. అసూయాగ్రస్తుడైన భర్త లేకపోవడముచేత ఆనకట్ట తెగిన నదివలె ఆపడుచుది స్వేచ్ఛగా ప్రవర్తిస్తున్నది. కొన్నాళ్ళకు దాని భర్త తిరిగివచ్చి వృద్ధబ్రాహ్మణుని అడిగితే 'నాకు తెలియదు. భిల్లులు వచ్చారు. వెంట తీసుకుపోయినారేమో, వాళ్ళపల్లె ఇక్కడికి సమీపంలోనే ఉన్నది. వెళ్ళి విచారించు' అన్నాడా బ్రాహ్మణుడు.

భర్త చాలా మనోవ్యధ చెంది భిల్లుల పల్లెకు వెళ్ళి భార్యను కనుక్కొన్నాడు. ఆపాపాత్మురాలు భర్తను చూచి 'నాదోష మేమీలేదు. భిల్లుడు నన్ను బలాత్కారముగా తీసుకువచ్చాడు. భర్తకు భార్యమీద మోహము పోదు. అందుచేత వాడు 'రా, వెళ్ళిపోదాము వెంటనే, ఎవరికీ తెలియకుండా' అని ప్రోత్సహించాడు.

నన్ను తెచ్చిన భిల్లుడు వేటనుంచి వచ్చేవేళ అయింది. మన పలాయనము సంగతి తెలిస్తే వెంటబడి మనను హతమారుస్తాడు. దగ్గరలో ఉన్న గుహలో నీవు దాక్కో; రాత్రి వాడు నిద్రపోయిన తర్వాత చల్లగా వాణ్ణి సంహరించి మనము పోదాము' అన్నది మోహాసక్తె. ఆమోహాంధుడు దాని మాటలు నమ్మి గుహలో కూర్చున్నాడు. భిల్లుడు ఇంటికి రాగానే ఆచెడిపె గుహలో ఉన్న భర్తను భిల్లుడికి చూపింది. వాడు క్రూరుడు బలిష్ఠుడు. వెంటనే గుహలోనుంచి అతన్ని బయటికి లాక్కొని వచ్చి చెట్టుకు గట్టిగా కట్టివేసి మర్నాడు ఉదయము కాళికాదేవికి బలియిస్తానన్నాడు. రాత్రి భోజనానంతరము స్త్రీని తీసుకు వచ్చి భర్త చూస్తూ ఉండగానే దానితో రమించి నిద్రపోయినాడు.

చెట్టుకు బద్ధుడయినవాడు చండికాదేవిని స్తుతించినాడు. అమ్మవారు ప్రత్యక్షమై అతనికి వరము అనుగ్రహించింది. వరప్రభావమువల్ల

కట్లు తెగిపోయినవి. వాడు భిల్లుని ఖడ్గముతోనే భిల్లుని శిరస్సు ఖండించి మోహాంధుడు కావడముచేత భార్యను బయలుదేర మన్నాడు. ఆదుశ్శీల భిల్లుని శిరస్సు చాటుగా తన సంచిలో వేసుకొని మహాదుఃఖముతో బయలు దేరింది.

ఉదయానికి వాళ్ళు ఒకానొక నగరములో ప్రవేశించారు. ఆకులట భిల్లుని శిరస్సు జనానికి చూపి 'నాభర్తను పీకు చంపాడు.' అని గోల పెట్టింది. రాజపురుషులు వారిద్దరినీ ప్రభువు సన్నిధిలో నిలిపినారు. భర్త యావద్వృత్తాంతమూ రాజుకు విన్నవించినాడు. రాజు దాని ముక్కూ చెవులూ కోయించి వెళ్ళ గొట్టించినాడు. ఆభర్తను మోహాగ్రహము విడిచి పెట్టింది. ఈవిధంగా ఈర్ష్యవల్ల స్త్రీలకు అన్యపురుషాసక్తి ఏర్పడుతుంది పైకి తెలియనీయకుండా బుద్ధిమంతుడు స్త్రీని రక్షించుకోవాలి. తన మేలు కోరుకొన్నవాడు స్త్రీలకు రహస్యము చెప్పకూడదు. చెప్పితే ముప్పు తప్పదు.

## నాగుని కథ

గరుత్మంతుని భయమువల్ల నాగుడొకడు పారిపోయి భూలోకానికి వచ్చి ఒక వేశ్యయింట్లో మానవరూపముతో ఉన్నాడు. ఆవేశ్య రాత్రికి అయిదువందల ఏనుగులు పుచ్చుకొంటుంది. ఆనాగుడు దివ్యప్రభావము చేత ప్రతీరాత్రికీ అయిదేసి వందలఏనుగులను ఇస్తున్నాడు. ఒకనాడు వేశ్య కుతూహలముచేత అడిగితే రాగాంధుడైననాగుడు తనవృత్తాంతము చెప్పివేసినాడు. ఈసంగతి వేశ్యమాతకు తెలిసింది.

గరుడుడు పురుషాకారము ధరించి లోకమంతా తిరుగుతూ ఆవేశ్య యింటికి వెళ్ళి 'ఈరాత్రి మీఅమ్మాయి వద్దకు వస్తాను; ఏమి ఇవ్వావలి?" అన్నాడు. 'రాత్రికి అయిదునూర్లఏనుగులు ఇచ్చేనాగుడు కొంతకాలము నుంచీ మాయింట్లో ఉంటున్నాడు. ఇతరులకు ఇక్కడ చీలుండదు!

అన్నది వేశ్యమాత. నాగుని విషయము గ్రహించి గరుడుడు అతిథిగా ప్రవేశించి మేడమీద నాగునిపట్టుకొని నిజరూపముతో భక్షించివోయి నాడు. కాబట్టి వివేకి స్త్రీలకు ధారాళముగ రహస్యము చెప్పకూడదు.

ఇలా పలికి గోముఖుడు మళ్ళీమందబుద్ధులకథలు మొదలు పెట్టినాడు.

## బట్టతలవాని కథ

రాగిచెంబువలె నిగనిగలాడే బట్టతలవాడు చాలామూర్ఖుడు, ధన వంతుడు తనకు జుట్టులేకపోవడము గొప్ప అవమానముగా ఎంచుకొంటు న్నాడు. ధూర్తుడొకడు ధనము హరించడానికి చల్లగా బట్టతలవాని దగ్గరచేరి 'అయ్యా, తలవెంట్రుకలు పెరిగే ఔషధము తెలిసిన వైద్య శిఖామణి ఉన్నాడు.' అని చెప్పినాడు. 'అతన్ని నాదగ్గరికి తీసుకువస్తే, నీకూ అతనికీ చాలా ధనమిస్తాను అన్నాడు మూఢుడు. డబ్బుతీసు కొంటూ కొన్నాళ్ళకు ఆధూర్తుడు డాబుసరివైద్యుణ్ణి తీసుకు వచ్చాడు. వాడు కొన్నాళ్ళు మూర్ఖుని డబ్బుతింటూ మధ్యమధ్య పాగాతీసి తన శిరస్సు మందమతికి చూపిస్తూ ఉండేవాడు. వాడు ఔషధము కావలె ననేవాడు. ఒకనాడు దొంగవైద్యుడు నవ్వుతూ 'వెర్రివాడా, నాబట్ట తల నీకు చూపుతూనే ఉన్నానుగదా? నానెత్తినవెంట్రుకలు మొలిపించు కోలేని వాణ్ణి నీకు మొలిపించగలనా? ఈమాత్రము గ్రహించలేక పోయినావయ్యా! అంటూ అక్కడినుంచి వెళ్ళిపోయినాడు. ఈవిధ ముగా టక్కరులు జడబుద్ధులతో చమత్కారాలు చేస్తూ ఉంటారు.

## తైలముగ్ధుడు

యజమాని నూనెతెమ్మని నౌకరును బజారుకు పంపినాడు. ఆ మూఢుడు గిన్నెతో నూనె తెస్తూంటే మిత్రుడు కనబడి 'గిన్నె అడుగున కారుతున్నది. భద్రము' అన్నాడు. వాడు గిన్నె తిరగవేసి చూచి

నాడు. నూనెఅంతా నేలపాలయింది. సంగతి తెలిసినమీదట యజ మాని నౌకరును వెళ్ళగొట్టినాడు.

## అస్థిముగ్ధుడు

పూర్వము ఒకమందబుద్ధి దేశాంతరము వెళ్ళవలసి వచ్చింది. వాని భార్య చెడిపె. తనకు ఆప్తురాలైన దాసికి అన్నిపనులూ చెప్పి ఇంట్లో ఉంచి తన ఉపపతియింటికి ఆదుర్మార్గురాలు వెళ్ళిపోయింది. భర్త దేశాంతరమునుంచి వచ్చినాడు. ఆదాసి కన్నీళ్ళతో 'నీభార్య చని పోయింది. దహనముకూడా జరిగింది.' అనిచెప్పి వాణ్ణి శ్మశానానికి తీసుక పోయి ఒకచితిలో ఎముకలు చూపించింది. వాడు అస్థులు తీర్థములో వేసి వచ్చి భార్యకు శ్రాద్ధకర్మలు చెయ్యడం ప్రారంభించినాడు. దాసి వెళ్ళి 'సద్బ్రాహ్మణుడు ఈయన అని అతనిభార్య ఉపపతినే శ్రాద్ధభోక్తగా పిలిచింది. ప్రతిమాసికానికీ వానినే పిలిచేవారు. వానివెంట ఆదుర్మార్గు రాలుకూడా అలంకరించుకొని వచ్చి భోజనము చేసేది. పాతివ్రత్య ప్రభావంచేత నీభార్య పరలోకంలోనుంచి వచ్చి ప్రత్యక్షంగా భోజనము చేసి వెళ్లుతున్నది.' అని దాసి పొగడేది. మందమతులను ధూర్తులు ఈప్రకారంగా మోసగిస్తారు.

## చండాలకన్య

'రాజును వివాహము చేసుకోవలె ననే సంకల్పముతో ఉన్నది ఒకానొక చండాలకన్య. ఒకనాడు రాజు ఊరేగుతూ ఉంటే చూచి అది పతి భావముతో ఆయన వెనక వెళ్ళింది. కొంచెము దూరము పోయే సరికి ఋషి కనబడ్డాడు. వెంటనే రాజు ఏనుగు దిగి ఆయన పాదాలకు ప్రణామముచేసి ఏనుగుఎక్కి వెళ్ళినాడు. రాజుకంటే ఋషి గొప్పవాడని ఆకన్య ఋషివెంట పడ్డది. మార్గములో శూన్యశివాలయము కనబడితే

ఋషి సాగిలపడి మొక్కి వెళ్ళినాడు. అది చూచి మహేశ్వరుడే మహోత్తము డని తలచి పతిభావముతో శివాలయమువద్ద కూర్చున్నది. చిత్తశుద్ధి ఉంటే బాగుండేది! ఇంతలో కుక్క వచ్చి శూన్యపీఠము మీద మూత్రము విడిచింది. కుక్క గొప్పదని నిశ్చయించి కన్య దాని వెంటబయలుదేరింది. ఆకుక్క పోయిపోయి చండాలవాటికలో తనకు పరిచయ మున్న యువకుని పాదాలమీద వాలి, పొర్లడము మొదలు పెట్టింది. ఆయువకుడే ఉత్తము డని చండాలకన్య అతనినే భర్తగా వరించింది. కాబట్టి మందమతులు ఎంత ముందుకు సాగిపోయినా చివరకు మొదటికే వస్తారు.

## మూర్ఖ ప్రభువు

ఒకానొకప్రభువు ధనవంతు డయినప్పటికీ చాలా లోభి. ఒకనాడు ఆయన మంత్రులు 'దేవా, దానధర్మాలవల్ల పరలోకములో దుర్గతి రాకుండా పోతుంది' అని పెద్దలు సెల విస్తారు. కాబట్టి దానధర్మాలు చెయ్యడము యుక్తము. పైగా అర్థము కాని, ఆయుస్సు కాని శాశ్వతము కాదు' అని బోధించారు. 'నాకు పరలోకములో దుర్గతి కలిగిన తర్వాత చూచి దానధర్మాలు తప్పకుండా చేస్తాను' అన్నాడు రాజు. మంత్రులు మళ్ళీ నోరెత్తక, తమలో తాము నవ్వుకొన్నారు.

## ఇద్దరు స్నేహితులు

కన్యాకుబ్జప్రభువు చంద్రాపీడునివద్ద ధవళముఖు డనే సేవకుడు ఇంట్లో భోజనము చెయ్యకుండా ఎక్కడో అన్నపానాలు కానిచ్చి ఇంటికి వస్తూ ఉండేవాడు. ఒకనాడు భార్య ప్రశ్నిస్తే వాడు 'ప్రియా, నేను రోజూ స్నేహితులతో కలిసి భోజనముచేసి వస్తాను. నాకు ముఖ్యమిత్రు లిద్దరు: కల్యాణవర్మ భోజనాదులతో ఉపచరిస్తాడు. వీరబాహువు ప్రాణా లిచ్చి

రక్షిస్తాడు' అన్నాడు. కుతూహలము కలిగి ఆమె ఆమిత్రులను తనకు చూపించ మని భర్తను అడిగింది. ధవళముఖుడు భార్యను తీసుకొని కల్యాణవర్మ యింటికి వెళ్ళినాడు. అతను వాళ్ళను చాలా ఆదరించినాడు. మర్నాడు వాళ్ళు వీరబాహుగృహానికి వెళ్ళినారు. వాడు జూదమాడుతూ స్వాగతవాక్యము మాత్రము పలికి మళ్ళీ వాళ్ళకేసి చూడలేదు. ఇంటికి వచ్చినతర్వాత భార్య భర్తతో ఏమండీ కల్యాణవర్మ అంత ఆదరించాడు. వీరబాహువు స్వాగతము మాత్రము అని ఊరుకున్నాడు. వీరబాహువు అతనికంటె ఎక్కువ మిత్రు డని ఎలా అనుకుంటున్నారు?' అన్నది. 'వెర్రిదానా, తారతమ్యము గ్రహిస్తావు: వెళ్ళి రాజుగారికి మామీద కోపము వచ్చిం దని ఇద్దరికీ చెప్పు. అప్పుడు ఏ మవుతుందో చూడు' అన్నాడు ధవళముఖుడు. ఆమె వెళ్ళి కళ్యాణవర్మతో చెప్పింది. 'నేను వ్యాపారము చేసేవాణ్ణి. రాజుగారి కెదురు ఏమి చెయ్యగలను!' అన్నాడు కల్యాణవర్మ. ఆమె వీరబాహువద్దకు వెళ్ళి భర్తమాటలు చెప్పింది. అతను తత్క్షణమే ఖడ్గము డాలు తీసుకొని ధవళముఖుని యింటికి వచ్చినాడు. 'మిత్రమా, మంత్రులమాటలవల్ల రాజు శాంతించినాడు. మరేమీ చిక్కు లేదు' అని ధవళముఖుడు చెప్పి, వీరబాహువును పంపివేసి, భార్యతో 'ఇద్దరిలో తారతమ్యము చూచావా?' అన్నాడు. ఆమె సంతోషించింది. బిడ్డు అనే గుణము సమానమే అయినప్పటికీ నూని వేరు నెయ్యి వేరు.

గోముఖుడు నరవాహనదత్తునికి మళ్ళీ మూర్ఖులకథలు చెప్పడము మొదలు పెట్టినాడు:

## జలభీతుడు

ఒకబాటసారి కష్టపడి అరణ్యము దాటి నదీతీరము చేరినాడు. చాలా దాహము అవుతున్నప్పటికీ నీరు ముట్టుకోలేదు. దగ్గిర ఉన్న

నాడు. కొందరు 'ఎందుకు ఏడుస్తావు?' అని అడిగితే నాకు 'మూడు కాలముల సంగతి తెలుసు: త్రికాలవేత్తను. ఈపిల్లవాడు నేటికి ఏడో రోజున చనిపోతాడు' అన్నాడు. అక్కడివాళ్ళంతా కంగారుపడ్డారు. కొంతమంది ఆశ్చర్య పడ్డారు. ఏడోరోజు తెల్లవారుజామున ఆమూర్ఖుడు నిద్రపోతున్న బిడ్డను చంపివేసినాడు. చనిపోయిన పిల్లవాణ్ణి ఉదయము చూచి విశ్వాసము కుదిరి జనులు గణకుడికి చాలా ధనమిచ్చి సత్కరించారు. వాడు డబ్బు తీసుకొని స్వదేశానికి వెళ్ళినాడు. ధనము కోసము మహామూర్ఖులు బిడ్డలను కూడా చంపుకొంటారు.

## కోపధారి

ఇంటివెలుపల ఒకపురుషుడు నిలుచుని ఉన్నాడు. వాడికి వినపడే టట్టు ఇంట్లో ఒకడు తన బంధువులతో అతని గుణగుణాలను గురించి చెప్పుతున్నాడు. అందులో ఒకడు 'మిత్రమా, అతను మంచివాడే, కాని అతనిలో రెండు దోషాలుమాత్ర మున్నవి. సాహసమూ క్రోధమూ చాలా ఎక్కువ' అన్నాడు. వెలుపల నిలుచున్నవాడు ఆమాటలు విన బడేసరికి చప్పున ఇంట్లో ప్రవేశించి ఆమాటలు అన్నవాని మెడకు ఉత్తరీయముచుట్టి పట్టుకొని 'మూర్ఖా, చెప్పు. నాకు సాహసమెక్కువా? కోప మెక్కువా?' అని కళ్ళు బాగా ఎర్రజేసినాడు. అప్పుడు అక్కడి వాళ్ళు నవ్వుతూ 'నీసాహసమూ క్రోధమూ స్పష్టంగానే కనపడు తున్నవి. వేరే చెప్పడ మెందుకు?' అన్నారు. తన దోషము ఎంత బహిరంగ మైనప్పటికీ మూర్ఖుడు గ్రహించుకో లేడు.

## కన్యావర్ధయిత

ఒకానొక రాజుకు చక్కని కూతురు పుట్టింది. ఆరాజు మహా మూర్ఖుడు. అతనికి పిల్లమీద చాలా ప్రేమ. వైద్యులను పిలిపించి 'మహా

అమ్మాయి వెంటనే పెద్దది అయి తగినవరుణ్ణి వివాహం చేసుకొనడానికి యౌవనము వచ్చేటట్టు వెంటనే చేయాలి' అని ఆజ్ఞ ఇచ్చినాడు. ఆ వైద్యులు అసాధ్యులు 'ప్రభూ, దీనికి ఓషధులు కావాలి. అవి చాలా దూరదేశంలో ఉన్నవి. వెతికించి మేము తెప్పిస్తాము. అవి వచ్చేవరకూ అమ్మాయిని ప్రత్యేక ప్రదేశములో ఉంచాలి. మీరు పొరపాటున అయినా పిల్లను చూడకూడదు. ఇది మా వైద్యపద్ధతి' అని వాళ్ళు చెప్పి, రాజు సమ్మతిపొంది చాలా ధనము తీసుకొని పిల్లను దూరప్రదేశానికి పంపినారు. మధ్య మధ్య రాజు అడుగుతూ ఉన్నప్పటికీ ఔషధాలు అన్నీ ఇంకా తయారు కాలేదు, అంటూ ధనము తీసుకుంటూ ఆపిల్లను చాటుగా భద్రముగా పెంచుతున్నారు. ఇలా కొన్ని సంవత్సరాలు గడచినవి. కాలక్రమేణా పిల్లకు యవ్వనము వచ్చింది. వైద్యులు గమనించి ఔషధములు పూర్తిగా తయారైన వనీ, వాటి ప్రభావము వల్ల అమ్మాయి పెద్దదైందనీ చెప్పి రాజుకు కొమార్తెను అప్పగించినారు. సంతోషించి రాజు వారికి చాలా ధనమిచ్చి సన్మానము చేశాడు. ఈప్రకారము ధూర్తులు మూర్ఖప్రభువును వంచించి ధనము అపహరిస్తారు.

## అర్థపణుడు

పట్నవాసి ఒకడు చాలా తెలివిగలవాడిననే గర్వముతో ఉండేవాడు. పల్లెటూరివాడు వానిదగ్గర సంవత్సరకాలము సేవచేసి జీతం చాలక సెలవు తీసుకొని స్వగ్రామానికి వెళ్ళినాడు. వాడు వెళ్ళగానే ఈబడాయికోరు భార్యతో 'వాడు నీదగ్గర ఏమైనా పట్టుకొని వెళ్ళలేదుకదా?' అని అడిగినాడు. అర్థపణము తీసుకొని వెళ్ళినాడని అతని భార్య చెప్పింది. ఆమూర్ఖుడు పదిపణాలు ఖర్చు పెట్టి ఆగ్రామము వెళ్ళి నౌకరువద్ద అర్థపణము పుచ్చుకొని వచ్చి డాంబికముగా ఈసంగతి

పదిమందితో చెపితే అంతా నవ్వినారు. ఈప్రకారముగా లోభబుద్ధి స్వల్పమైన సుఖము కోసమై ఎక్కువడబ్బు ఖర్చుపెట్టిస్తుంది.

## అభిజ్ఞాన కర్త

ఒక మూర్ఖుని సముద్రము మీద పడవలో వెళుతుండగా వాడి చేతిలోనుంచి వెండిగిన్నె జారి సముద్రములో పడ్డది. తిరుగు ప్రయాణంలో దిగి ఆగిన్నె తీసుకోవచ్చునని వాడు అదిపడినచోట సుళ్ళు, బుడగలు మొదలైనవి గుర్తుపెట్టుకొన్నాడు. తిరిగివచ్చేటప్పుడు నీళ్ళలో బుడగలు చూసి ఒడ్డుకు దగ్గరలోనే వాడు నీళ్ళలో మునుగుతూ తేలుతూ ఉన్నాడు. ఏమిది అని అడిగితే జరిగినసంగతి చెప్పి పదిమందిలో పరిహాసపాత్రుడైనాడు.

## మాంసవినిమయము

ఒక మూర్ఖప్రభువు మేడమీద నిలుచుని ఉన్నాడు. కింద ఇద్దరు పురుషులు నిలబడినారు. అందులో ఒకనిచేతిలో వంటఇంట్లోనుంచి హరించి తెచ్చిన ఐదుపలములమాంసము ఉన్నది. రాజు ఇది గమనించి వానిశరీరములోనించి ఐదుపలములమాంసము కోయించినాడు. వాడు బాధకు తాళలేక ఏడుస్తూ నేలమీద పడిపోయినాడు. ఆమూర్ఖప్రభువుకు అనుగ్రహం కలిగింది. 'ఐదుపలములమాంసము శరీరములోనుంచి కోయించడముచేత వీడికి ఇంతబాధ కలిగింది. కాబట్టి వీడికి అంతకంటె ఎక్కువ మాంసము ఇప్పించు' అని రాజు ప్రతీహారునికి చెప్పినాడు. తల నరికినవానికి నూరుశిరస్సులు ఇస్తేమాత్రము వాడు బతుకుతాడా? అనుకొని ఆప్రతీహారుడు చిత్తంఅని వెళ్ళి ఆపురుషుణ్ణి వైద్యులకు అప్పగించినాడు. ఈసంగతి విన్న వాళ్ళంతా లోలోపల నవ్వుకొన్నారు. మూర్ఖప్రభువుకు నిగ్రహానుగ్రహములు ఎలా చూపవలెనో ఎప్పుడు చూపవలెనో తెలియదు.

## పుత్రాంతరకాంక్షిణి

ఒకమతిమాలిన దానికి ఒకడే కొడుకు. ఇంకోకొడుకు కూడా కావాలనేకోరికతో అది పాషండురాలిని ఉపాయము అడిగింది. 'అమ్మా, ఈకుమారుని వధించి దేవతకు బలివేస్తే ఇంకోకుమారుడు తప్పకుండా కలుగుతాడు' అని ఆ క్షుద్రతాపసి చెప్పింది. ఈసంగతి తెలిసి ఒక ముసలమ్మ 'ఓసిపాపాత్మురాలా, లేనికుమారుడికోసం ఉన్నకుమారుణ్ణి చంపుకుంటావా! వాడు పుట్టకపోతే ఏం చేస్తావు?' అని రహస్యంగా చెప్పి చివాట్లు పెట్టి బలిప్రయత్నం మాన్పించింది. ఈరీతిగా మతి లేనిస్త్రీలు శాకినులబోధవల్ల దుష్కార్యములకు పూనుకొంటారు.

## ఉసిరికపండ్లు

ఒకగృహస్థు నౌకరును 'ఓరీ, తోటకు వెళ్ళి తీయటి మంచి ఉసిరిక పళ్ళు నాకోసం కోసుకురా' అని నియమించినాడు. ఆ మూఢుడు ఒక్కొక్క పండే కొరికి రుచి చూసి తియ్యగా ఉన్న వని తెలుసుకొని తెచ్చి 'స్వామీ, ఈపళ్ళు తీయటివి. నేను రుచి చూచి తెచ్చాను' అని ఎదుట పెట్టినాడు. యజమాని అసహ్యించుకొని సగముకొరికిన పళ్ళనూ నౌకరునూ అవతలకి తోసివేయించినాడు. మందమతి స్వామికార్యమూ తనకార్యమూ పాడుచేస్తాడు.

## సోదరద్వయము

పాటలీపుత్రనగరములో యజ్ఞసోముడు కీర్తిసోముడు అని ఇద్దరు బ్రాహ్మణసోదరులు ఉండేవారు. వారికిచాలా పిత్రార్జితధనము ఉండేది. కీర్తిసోముడు వర్తకముచేసి తనవంతు వృద్ధిచేసుకొన్నాడు. యజ్ఞసోముడు బాగా అనుభవించి దానధర్మాలు చేసి తనభాగ మంతా ఖర్చు పెట్టుకొన్నాడు. ఒకనా డతను భార్యతో మనడబ్బు యావత్తూ అయి

పోయింది. ఇన్నాళ్ళూ బాగా బతికి ఇప్పుడు సాటివాళ్ళనడుమ ఎలా ఉండగలను? దేశాంతరము వెళ్ళుదాము' అన్నాడు. 'చేతిలో ఏమీ లేదని దేశాంతరము ఎలా వెళ్ళగలము?' అన్నది భార్య. భర్త వెళ్ళక తప్పదన్నాడు. అయితే మీతమ్ముని దగ్గరకి వెళ్ళి కొంతడబ్బు అడిగి తీసుకొనిరండి' అన్నది భార్య. యజ్ఞసోముడు వెళ్ళి తమ్ముణ్ణి డబ్బు అడిగినాడు. అతనిభార్య అడ్డుపడి ఈయన ఉన్నదంతా పోగొట్టుకొన్నాడు. అటువంటివారికి మనము డబ్బు ఎందుకు ఈయాలి? దరిద్రులైనవాళ్ళంతా మనదగ్గరకే వస్తారు' అని ఈసడించింది. అన్నగారి మీదఅనురాగమున్నప్పటికీ భార్యాభయమువల్ల కీర్తిసోముడు ఏమీ ఇవ్వలేక పోయినాడు. దుష్టభార్యలవశములో ఉండే పురుషుల కష్టము ఇలా ఉంటుంది.

యజ్ఞసోముడు ఉత్తచేతులతో ఇంటికివెళ్ళి భార్యకు చెప్పి భగవంతుణ్ణి నమ్మి ప్రయాణమైనాడు. ఆదంపతులు అరణ్యములో కొంత దూరం వెళ్ళిన తరువాత భర్తను కొండచిలువ మింగింది. భార్య భూమి మీద పడిపోయి రోదనము మొదలు పెట్టింది. అప్పుడు అజగరము మనుష్యవాక్కుతో 'అమ్మా, ఎందుకుఏడుస్తావు?' అని అడిగింది. 'మహానుభావా, పరదేశములో నాభిక్షాభాజనాన్ని నీవు హరించినావు. ఏడవక ఏంచేస్తాను!' అన్నది బ్రాహ్మణి. అజగరము తన నోటిలోనుంచి పెద్ద బంగారుపాత్ర తీసి 'ఇదిగో నీభిక్షాభాజనము. తీసుకో' అని ఆమెకిచ్చింది. 'మహానుభావా, ఆడదానిని, నాకు ఇందులో భిక్ష యెవరు పెడతారు' అన్నది ఆబ్రాహ్మణి. 'నీవు అడగగానే ఈపాత్రలో భిక్షము పెట్టని వాళ్ళ తల నూరు వక్కలు అవుతుంది. నామాట ముమ్మాటికీ నిశ్చయము' అన్నది అజగరము. 'స్వామి, ఇందులో పతిభిక్ష పెట్టు' అన్నది ఆప్రతివత. ఆమె ఈమాటలు అనగానే అజగరము బ్రాహ్మణ్ణి బయటకు తీసి ఇచ్చి దివ్యపురుషునుగా మారింది. 'నేను కాంచనవేగు డనే విద్యా

ధర ప్రభువును. గౌతమఋషి శాపమువల్ల అజగరము నైనాను. పతివ్రతతో సంవాదము జరగగానే నాకు శాపమోక్షం కలిగినది' అని ఆదివ్యపురుషుడు బంగారు పాత్రనిండా రత్నములు పోసి వారి కిచ్చి ఆనందముతో ఆకాశమార్గాన వెళ్ళినాడు. ఆ బ్రాహ్మణదంపతులు ఇంటికి వెళ్ళి సుఖంగా అక్షయంగా ఉన్నారు ఈశ్వరుడు ఎవరికి తగిన సుఖం వారికి ఇస్తాడు.

## నా పి తా ర్థి

కర్ణాటభటుడు ఒకానొక రాజువద్ద సేవచేస్తూ యుద్ధంలో ప్రభువును మెప్పించినాడు. సంతోషించి రాజు నీకేమి కావలెనో కోరుకో అన్నాడు 'దేవా, మీామంగలిని నాకు దయ చేయించండి' అని ఆమూఢుడు ప్రార్థించినాడు. ఎవరికి తగినట్టు వాళ్ళు ప్రతిఫలం కాంక్షిస్తారు.

## న కిం చి న్మా ర్గ ణు డు

ఒకమూఢుడు దారివెంట వెళుతూంటే తనబండి కొంచెం సరిగా పెట్టిపొమ్మని ఒకబండిఆసామీా వానిని అడిగినాడు. నాకేమి ఇస్తావు అని ఆమందమతి అడిగినాడు. 'నకించిత్ దదామి' అన్నాడు బండి ఆసామీా. ఆమందమతి బండిని సరిగా నిలిపి 'ఇయ్యవోయి నాకు నకించిత్' అన్నాడు. (నకించిత్ దదామి = ఏమి ఇవ్వను అని అర్థము) బండివాడు నవ్వినాడు.

దేవా, ఈప్రకారముగా మూర్ఖులు పరిహాస పాత్రులు కావడమే కాక నిందలపాలు, ఆపదలపాలు అవుతూ ఉంటారు. యోగ్యుడు ఎప్పుడూ పూజ్యత పోగొట్టుకోడు.

నరవాహనదత్తుడు గోముఖుని వలన వినోదకథలు విని త్రిలోక విశ్రాంతి హేతు వైన నిద్రాసుఖము అనుభవించినాడు.

మర్నాడు ఉదయము నరవాహనదత్తుడు తండ్రిని చూడడానికి వెళ్ళినాడు. అక్కడ పద్మావతీదేవి సోదరుడు సింహవర్మ మగధ దేశము

నుండి వచ్చిఉన్నాడు. నరవాహనుడు కుశల ప్రశ్నలడిగి అక్కడే భోజనము చేసి సాయంకాలము తనసౌధానికి వచ్చినాడు. శక్తియశోదేవిని తలుచుకొంటూ ఆసద్గాగా ఉన్న అతనికి వినోదార్థము గోముఖమంత్రి కథ చెప్పసాగినాడు.

## కాకులు – గుడ్లగూబలు

ఒకచోట పెద్దమర్రిచెట్టుమీద మేఘవర్ణుడనే కాకిరాజు నివాసము చేస్తున్నాడు. అవమర్దుడు అనే గుడ్లగూబరాజు ఆకాకికి శత్రువు. ఒక రాత్రివేళ గుడ్లగూబలు వచ్చి కాకిరాజు పరివారాన్ని సంహరించి పోయినవి. ప్రాతఃకాలమున మేఘవర్ణుడు తన మంత్రులైన ఉడ్డీవి, ఆడీవి, సండీవి, ప్రడీవి, చిరజీవి, అనేవాళ్ళను పిలిపించి ఆదరముతో 'అమాత్యులారా, శత్రువు ఈవిధముగా మనను పరిభవించి వెళ్ళుతున్నాడు. దీనికి ఏమి ప్రతిక్రియ? ఆలోచించి చెప్పండి' అని అడిగినాడు.

ఉడ్డీవి 'ప్రభూ, శత్రువు బలవంతుడు అయి ఉన్నప్పుడు మనము అన్యదేశానికి వెళ్ళాలి. కాదా అతని నాశ్రయించాలి' అన్నాడు.

'మన కిప్పు డేమీ భయములేదు. శత్రువు ఉద్దేశ్యమునూ, మన బలమునూ బాగా ఆలోచించిచూచి చేయవలసినది చేతాము' అన్నాడు ఆడీవి.

'ప్రభూ, ప్రాణములు పోయినాసరే, శత్రువును శరణు వేడడము కాని దేశాంతరము వెళ్ళడము కాని ఉచితము కాదు. మనకు అపకారము చేసే ఈ వైరితో పోరడమే ముఖ్యము. సహాయము శౌర్యము ఉత్సాహము ఉండేరాజు శత్రువులను జయిస్తాడు' అన్నాడు సండీవి.

'అవమర్దుడు చాలా బలవంతుడు. అతనిని జయించడం మనకు సాధ్యం కాదు. ప్రస్తుతం అతనితో సంధి చేసుకొని తరుణం వచ్చినప్పుడు శిక్షించవచ్చును' అని ప్రడీవి చెప్పినాడు.

'నీతివేత్తలారా, వారికీ మనకూ సంధినిబంధన లేమిటి? ఎవరు

దూత! అనాదినుంచీ కాకులకు గుడ్లగూబలకూ వైరము. అతని దగ్గిరికి ఎవరు చూస్తూ వెడతారు? ఇది మంత్రాంగమువల్ల జరగవలసినది. రాజ్యానికి మంత్రము మూలము' అని చిరజీవి అన్నాడు.

మేఘవర్ణుడు 'మంత్రిసత్తమా, నీవు వృద్ధుడవు. నీకు అన్నీ తెలిసిఉంటవి. కాకులకూ గుడ్లగూబలకూ ఎందుకు వైరం కలిగింది? ఆసంగతి ముందు చెప్పి తరవాత ఆలోచన చెప్పుదువు గాక' అని చిరజీవితో అన్నాడు.

ఈ వైరము వాగ్దోషమువల్ల ఏర్పడ్డది. గార్దభకథ వినలేదా అని చిరజీవి ఇలా చెప్పినాడు:

## గా డి ద క థ

చాకలివాడు తనగాడిదను బలిపించడానికి పెద్దపులి తోలు కప్పి ఇతరుల పొలాలలోకి తోలేవాడు. అది పైరుపచ్చలు బాగా మేస్తూ ఉండేది. పులితోలు కప్పిఉండడముచేత చూచినవారు దూరమునుంచే భయాన తొలిగిపోయేవాళ్ళు. కొన్నాళ్లకు కాపువాడు ధనుర్బాణాలు చేత పట్టుకొని ఆ దోవన వెడుతూ తటాలున దాన్ని చూచి పులి అని భయపడి మీద ఉన్నకంబళి కప్పుకొని వంగి వంగి వెళుతున్నాడు. గాడిద అతనిని చూచి మరోగాడిద అనుకొని ఓండ్రపెట్టింది. వాడు వెంటనే దానిమీద బాణము ప్రయోగించి చంపినాడు. ఈ విధముగా వాగ్దోషముచేత గాడిద వైరము తెచ్చిపెట్టుకొన్నది. వాగ్దోషముచేతనే మనకూ గుడ్లగూబలకూ పూర్వము వైరము వచ్చింది.

పూర్వము అరాజకముగా ఉంటే పక్షు లన్నీ కలిసి ఏదో ఒకపక్షిని తమకు ప్రభువును చేసుకోవలె నని పట్టాభిషేకప్రయత్నము ప్రారంభించినవి. గుడ్లగూబకు పట్టము కట్టవలెనని ఛత్రచామరాలు సిద్ధము చేసినారు. ఇంతలో కాకి ఎక్కడినుంచో వచ్చి 'మూర్ఖులారా, హంసలూ, కోకిలలూ మొద లయిన మంచిపక్షు లున్నవే! క్రూరదృష్టి,

అమంగళ దర్శనమూ కల ఈ గుడ్లగూబకా అభిషేకము చేసేది! ప్రభావము కలవాణ్ణి ప్రభువును చేసుకొంటే అతని పేరుచెబ్తే మన పనులు అవుతూ ఉం డాలి' అని ఉపన్యసించింది.

### తరంగము : ౬౪

## కుందేలు తెలివి

చంద్రసరస్సు అనే గొప్ప తటాకము ఒడ్డున శిలీముఖుడు అనే కుందేళ్ళరాజు ఉన్నాడు. వర్షాలులేక తక్కిన చెరువు లన్నీ ఎండి పోయినవి. ఇది మాత్రము జలసమృద్ధిగా ఉన్నది. చతుర్దంత మనే గజరాజు మందతో జలపానార్థము చంద్రసరస్సుకు వచ్చినాడు. ఆఏనుగుల తాకిడిలో కుందేళ్లు అనేకము నలిగి చచ్చిపోయినవి. కుందేళ్ల నాయకుడు చాలా విచారపడి ఏనుగులు వెళ్ళిన తరువాత మిగిలిన కుందేళ్ళను పిలిచి అందులో విజయుడు అనే కుందేలుతో ఇలా చెప్పినాడు: 'ఏనుగులు ఈ చెరువునీటి రుచి గ్రహించినవి. మాటిమాటికీ ఇక్కడికే వస్తవి. వాటి పాదాలకింద పడి మనవాళ్ళంతా నలిగిపోతారు. నీవు చాలా ఉపాయశాలివి. నీవు చేపట్టిన ప్రతికార్యమూ శుభంగా నెరవేరింది. కాబట్టి గజరాజుదగ్గరకు నీవు వెళ్ళి ఏదో సానుకూలము చేసుకొని రావాలి'.

విజయుడు బయలుదేరి గజరాజు సన్నిధికి పోయి కొంచెము ఆలోచించి పర్వతశిఖరము ఎక్కి "గజరాజా, నేను చంద్రదేవుని దూతను. ఆయన నీతో ఇలా చెప్పమన్నాడు:- చంద్రసరస్సు నానివాస స్థానము. ఆ ప్రాంతములో నాకు ప్రియమైన కుందేళ్ళు ఉన్నవి. వాటి వల్లనే నాకు శశి అనే పేరు వచ్చింది. నా శశకములను నీవు తెలిసో తెలియకో చంపినావు. నాకు శీతాంశు డనే పేరు కూడా ఉన్నది. నా శీతసరస్సును కలిచి చెడగొట్టినావు. భద్రము. తగిన ఫలము అనుభవిస్తావు—' అని పలికింది. దూతవాక్యములు విని గజరాజు

బాగా నిర్ణయించి ధర్మము చెప్పనివానికి ఇహపరాలలో హాని కలుగుతుంది' అని ధర్మపన్నాలు పలికింది. అవి మార్జాలముమాటలు నమ్మి దగ్గిరికి వెళ్ళి కూర్చున్నవి. పిల్లి ఒక్కసారిగా రెంటినీ పట్టి చంపివేసింది. నీచుణ్ణి నమ్మడంవల్ల ఇటువంటిగతి పట్టుతుంది. కాబట్టి ఈ గుడ్లగూబను రాజును చేయకూడదు.'

కాకి చేసినబోధవల్ల పక్షులు గుడ్లగూబకు అభిషేకము మానివేసినవి. 'నేడు మొదలుకొని మీరూ మేమూ శత్రువులము. జాగ్రత్త! జ్ఞాపక ముంచుకో' అని గుడ్లగూబ కోపముతో పలికి కాకిని బెదిరించి వెళ్ళిపోయింది. 'అనవసరంగా మాటలు అన్నానుకదా' అని కాకి విచారపడ్డది. మాటమాత్రానికి మనకూ గుడ్లగూబలకూ శత్రుత్వము ఏర్పడ్డది.

చిరజీవి ఈప్రకారముగా చెప్పి 'గుడ్లగూబలు చాలా ఉన్నవి; వాటి బలము కూడా అధికము. సంఘబలము ఉన్నప్పుడు జయించడము అసాధ్యము' అని ఈ కథ చెప్పింది:

## సం ఘ బ ల ము

పదిమందిమాట ఎప్పుడూ పాటిలోకి వస్తుంది. యజ్ఞార్థము ఒక బ్రాహ్మడు చిన్నమేకను కొని బుజాన పెట్టుకొని గ్రామమునుంచి పెద్ద నగరానికి వెళుతున్నాడు. మార్గములో కొంతమందిధూర్తులు ఆమేకను అపహరించవలె ననుకొన్నారు. అందులో ఒకడు తొందరతొందరగా ఆయనదగ్గరకు వచ్చి 'అయ్యా, ఏమి టిది! కుక్కను బుజాన మోస్తున్నారే' అన్నాడు. బ్రాహ్మడు లక్ష్యపెట్టక వెళుతున్నాడు. మరి ఇద్దరు ఆయనదగ్గరకు పోయి మొదటివాడిలాగే అన్నారు. బ్రాహ్మడికి సందేహం కలిగింది. మరిముగ్గురు ఆయన్ను సమీపించి, 'అయ్యా, యజ్ఞోపవీతమునూ కుక్కనూ సమానముగా మోస్తున్నావు. నీవు బ్రాహ్మడవా, బోయవాడవా! ఈకుక్కతో జంతువులను వేటాడ

లావా!' అన్నారు. బ్రాహ్మడు బాగా అనుమానపడి ఏదో భూతము తనను పట్టుకొని మోసపుచ్చుతున్న దనీ, అంతమందికి కుక్కవలె కన బడ్డది నిజముగా కుక్కే అయిఉంటుం దనీ తనలో అనుకొని మేకను కింద విడిచిపెట్టి వెళ్ళిపోయినాడు. ధూర్తులు దాన్ని తీసుకొనిపోయి కోసుకతిన్నారు.

దేవా, ఈవిధముగా పదిమంది చేరితే బలవంతు లవుతారు. వాళ్ళను జయించడం ఉత్తదే! కాబట్టి ఈబలవంతులతో వైరములో నేను చెప్పినట్టు చేయండి. నారెక్కలు కొద్దిగా తెంపి ఈచెట్టుకింద వదిలి పెట్టి నేను వచ్చేవరకూ మీరు ఈకొండలో దాగి ఉండండి.

చిరజీవి ఇలా చెప్పినమీదట అతనిమాటప్రకారము చేయించి వాయసరాజు అనుచరులతో కొండకు వెళ్ళినాడు. చిరజీవి చెట్టుకింద పడి ఉన్నాడు.

రాత్రి ఉలూకరాజు అవమర్దుకు కాకులకోసం వెతికితే ఒకటీ కన పడలేదు. చిరజీవి నెమ్మదిగా కూయడం ప్రారంభించేటప్పటికి అవ మర్దుడు వచ్చి 'ఎవరు నీవు? ఎందుకు ఇలా అయినావు?' అని ఆశ్చర్య ముతో అడిగినాడు. చిరజీవి బాధ అభినయిస్తూ హీనస్వరముతో ఇలా చెప్పినాడు: 'దేవా, నేను వాయసరాజుమంత్రిని. నన్ను చిరజీవి అంటారు. మేఘవర్ణుడు మంత్రులఆలోచనమీద నీ మీదికి దాడి వెడలడానికి సిద్ధపడ్డాడు. నేను తక్కినమంత్రులను వారించి, నాఆలో చన విూ కిష్టమే అయితే బలవంతుడైన ఉలూకరాజుతో యుద్ధము వద్దనీ, రాజనీతిని అనుసరించి ఆయనను ఆశ్రయించవలసిన దనీ బోధిం చాను. నేను శత్రుపక్షము వాడ నని నన్ను వాళ్ళు ఈస్థితికి తెచ్చారు. నన్ను ఈచెట్టుకింద పడవేసి వాళ్ళంతా ఎక్కడికో వెళ్ళిపోయినారు.

ఇలా పలికి తల కాయ వాల్చి ఆయాసపడుతున్న కాకిని చూచి 'ఇప్పుడు మనము ఇతనిని ఏమి చేయవలె?' అని గుడ్లగూబనాయకుడు

తన మంత్రులను అడిగినాడు. వారిలో దీప్తనయనుడు అనే మంత్రి ఇలా చెప్పినాడు.

### చోరుడు — వర్తకుడు

దొంగను రక్షించకూడదు కదా, అటువంటివాడు ఉపకారి అయ్యే పక్షములో యోగ్యులు వాణ్ణి రక్షిస్తారు. దృష్టాంతము చెవుతాను. ముసలి వర్తకుడు డబ్బుపెట్టి కన్యను కొని వివాహం చేసుకొన్నాడు. ఆమె మంచముమీాద భర్తకు ఎప్పుడూ పెడమొహముగానే పడుకొనేది. కొన్నాళ్ళు ఇలా గడిచినవి. ఒకరాత్రి చోరుడు వారిఇంట్లో ప్రవేశించినాడు. భర్తకు తెలియదు. భార్య దొంగను చూచి భయపడి తటాలున భర్తను కౌగలించుకొన్నది. ఆ సంబరానికి వృద్ధుడు ఆశ్చర్యపడి కారణమేమా అని ఇటూ అటూ చూచేసరికి చోరుడు ఒకమూల కనపడ్డాడు. 'భయము లేదు. నీవు నాకు ఉపకారివి. నా సేవకులు నిన్ను కొట్టకుండా బయటికి పంపివేస్తాను.' అని వృద్ధుడు ఆ ప్రకారమే చేశాడు.

ఈ చిరజీవి మనకు ఉపకారి కాబట్టి మనము రక్షించాలి, అని దీప్తనయనుడు విరమించినాడు. ఉలూకరాజు ఆజ్ఞ ప్రకారము వక్రనాసుడు అనే మంత్రి ఇలా చెప్పినాడు: 'ఇతనిని మనము రక్షించవలె. ఇతనికి అనేక మర్మములు తెలుసును. ఈమంత్రికీ ప్రభువుకూ కలిగిన స్పర్ధవల్ల మనకు లాభం. దృష్టాంతము చెవుతాను'.

### చోర రాక్షసులు

ఒక బ్రాహ్మడు రెండుగోవులు దానం పట్టి తెచ్చి ఇంట్లో కట్టివేసుకొన్నాడు. చోరుడు వాటిని అపహరించాలి అనుకొన్నాడు. రాక్షసుడు అతనిని మింగివేదా మనుకొన్నాడు. రాత్రి బయలుదేరి వారిద్దరూ దోవలో తారసిల్లి ఒకరి సంగతి ఒకరు చెప్పుకొని బ్రాహ్మడింటికి వెళ్ళినారు. 'ముందు నేను గోవులను ఎత్తుకుపోతాను. తరువాత

నీవు అతనిని భక్షించవచ్చు. నీవే ముందు అతన్ని పట్టుకుంటే లేస్తాడు. అప్పుడు గోవులను తోలుకు పోవడం సంభవించదు' అని చోరుడు రాక్షసుడితో అన్నాడు. 'నేనే ముందుగా బ్రాహ్మణ్ణి హరిస్తాను. గోవుల గిట్టలు చప్పుడైతే అతను మేలుకొంటాడు. నాప్రయత్నం నిష్ఫలం అవుతుంది' అన్నాడు రాక్షసుడు. ఇద్దరూ నిర్ణయానికి రాక వివాద పడుతుంటే మెలుకువ వచ్చి బ్రాహ్మడు లేచి కత్తితీసుకొన్నాడు. దొంగ పారిపోయినాడు. బ్రాహ్మడు రక్షోఘ్నమంత్రాలు జపించేసరికి రాక్షసుడు పరుగెత్తినాడు. వారి వివాదం బ్రాహ్మడికి ఉపకరించినట్లు వాయస రాజుకూ ఇతనికీ వచ్చిన వైరము మనకు ఉపకరిస్తుంది.

ఉలూకరాజు ప్రాకారకర్ణు డనే మంత్రిని ఆలోచన అడిగితే 'శరణాగతుణ్ణి ఆపన్నుణ్ణి జాలివహించి రక్షించాలి' అన్నాడు అతను. క్రూరలోచనుడనే మంత్రికూడా ఆవిధముగానే చెప్పినాడు. చివరకు రక్తాక్షుడనేమంత్రి మాత్రం చిరజీవిని రక్షించకూడ దన్నాడు. నీతివేత్తలు శత్రువును ఎప్పుడూ నమ్మరన్నాడు. చిరజీవిని ఉపేక్షించడము కూడా ఉచితము కాదన్నాడు.

పాపము చిరజీవి మన పక్షాన మాటాడి ఈస్థితికి వచ్చినాడు. ఇతన్ని రక్షించితీరాలి. పైగా ఇతడు ఒంటరివాడు, మన నేమి చేయగలడు?' అని ఉలూకరాజు చిరజీవిని ఓదార్చినాడు. అప్పుడు చిరజీవి రాజుతో 'దేవా, ఈ దుస్థితిలో నేను బతికి మాత్రము ఏమిలాభం? పుల్లలు తెప్పించండి, అగ్నిప్రవేశం చేస్తాను. ఆవాయసరాజును సాధించడానికి నాకు ఉలూక జన్మ అనుగ్రహించమని అగ్ని దేవుని ప్రార్థిస్తాను' అన్నాడు.

రక్తాక్షుడు నవ్వుతూ 'మాప్రభువుదయవల్ల నీకుసుఖమే; అగ్నిహోత్ర మెందుకులే; కాకిగా ఉన్నంతకాలము గుడ్లగూబవు కాలేవు. బ్రహ్మదేవుడు ఎవనిని ఎలా సృష్టిస్తే వాడు అలాగే ఉంటాడు. అందుకు దృష్టాంతము చెపుతాను.

## ఎలుకపిల్ల — ఋషి

జాలరి కాళ్ళలోనుంచి జారిపడ్డ ఎలుకపిల్లను ఒకఋషి మానవకన్యగా చేసి తన ఆశ్రమములో పెంచుతున్నాడు. ఆ పిల్లకు యవ్వనము రాగానే బలవంతున కిచ్చి పెళ్ళి చేతా మనుకొని ఋషి సూర్యదేవుని పిలిచి 'ఈకన్యను బలవంతుని కిత్తా మని నాకోరిక. నీవు దీన్ని పెళ్ళిచేసికో' అన్నాడు. 'మేఘుడు నాకన్న బలవంతుడు. క్షణములో నన్ను కమ్మివేస్తాడు' అని సూర్యుడు చెప్పినాడు. ఋషి సూర్యుని పొమ్మని మేఘుని పిలిచి తన కోరిక తెలిపినాడు. 'వాయువు నాకన్న బలవంతుడు, నన్ను దిక్కులకు చెదరగొట్టుతాడు' అన్నాడు మేఘుడు. తరువాత ఋషి వాయువును పిలిచి తన కోరిక చెపితే వాయువు 'నాకంటె పర్వతాలు బలవంతములు. నేను వాటిని కదిలించలేను' అన్నాడు ఋషి. ఒక పర్వతరాజును పిలిచి పిల్లనిస్తా నన్నాడు. 'స్వామీ, నాకంటె ఎలుకలకు బల మెక్కువ. అవి నా శరీరము నిండా తూట్లు పొడుస్తున్నవి' అన్నాడు పర్వతరాజు. మొదల ఈ కన్య ఎలుకపిల్ల అనేమాట జ్ఞప్తికి వచ్చి ఋషి అరణ్యమూషికాన్ని పిలిచి పిల్లను పెళ్ళిచేసుకో అన్నాడు. 'ఈ కన్య నా బిలములో ఎలా ప్రవేశిస్తుంది' అని మూషికము అడిగింది. యథాప్రకారముగా ఇది ఎలుక కావా లని ఋషి దానిని ఎలుకను చేసి ఆ మూషికానికి ఇచ్చివేసినాడు. కాబట్టి చిరజీవీ, ఎన్నటికీ నీవు గుడ్లగూబవు కాలేవు.

రక్తాక్షుని మాటలు విని 'వీడు నీతివేత్త. తక్కినవాళ్ళంతా మంద బుద్ధులు. రాజు ఇతని మాట లక్ష్యపెట్టుటలేదు. కాబట్టి నేను తలపెట్టిన పని సిద్ధిస్తుంది' అనుకొన్నాడు చిరజీవి. బలగర్వితుడైన ఉలూకరాజు చిరజీవిని తన నివాసానికి తీసుకొనిపోయినాడు. అక్కడ అసమర్ధుని అజమాయిషీలో ఉండి అతను తెచ్చిపెట్టిన మాంసాదులు తిని బాగా బలిసి చిరజీవి నెమలిఅంత ఐనాడు.

ఒకనాడు చిరజీవి ఉలూకరాజుతో 'మహాప్రభూ, నేనువెళ్ళి వాయస రాజును ఓదార్చి మంచిమాటలు చెప్పి యథాస్థానానికి తీసుకొని వస్తాను. రాత్రివేళ మీరు వెళ్ళి అతనిని సంహరించి రావచ్చును. నేను మీ ఋణము తీర్చుకొన్నట్టవుతుంది. పగటిపూట వాయసరాజు మీమీద వచ్చిపడకుండా గడ్డి గాదము కప్పి ద్వారము మొదలైన వాటిని రక్షించుకోండి. గూళ్ళలోనుంచి బయటికి రాకండి' అని బోధచేసి గుడ్లగూబల గుహాద్వారము గడ్డీ ఆకూ అలముతో కప్పించి చిరజీవి వెళ్ళిపోయినాడు. ఈ సంగతులన్నీ మేఘవర్ణునికి చెప్పి అతనిని తీసుకొని తాను తక్కిన కాకుల్లూ మండే కొరువులు నోట కరుచుకొని గుడ్లగూబల గుహాద్వారానికి నిప్పు ముట్టించినవి. గుడ్లగూబలన్నీ దగ్ధమైపోయినవి. ఆకాకి తనవారిని వెనుకటి మర్రిచెట్టుకడకు తీసుకు పోయి తాను శత్రువులమధ్య జీవించిన విధానము చెప్పి మేఘవర్ణునితో 'దేవా, ఉలూకమంత్రి రక్తాక్షుడు ఒకడే బుద్ధిమంతుడు. అతనిమాట ఉలూకరాజు లక్ష్యపెట్టలేదు. అందుచేత కప్పలను పాము వంచించిన విధముగా నేనూ అతనిని వంచించాను.

## ముసలిపాము — కప్పలు

ఒకానొక ముసలిపాము శ్రమ లేకుండా కప్పలను మింగడానికి ఆలోచన చేసి సరస్సుదరిని నిశ్చలంగా ఉన్నది. దూరమునుంచి కప్పలు దానిని చూసి 'స్వామీ, పూర్వమువలె మమ్మల్ని ఇప్పుడు మింగవేమి' అని అడిగినవి. 'నేను ఒక మండూకాన్ని తరుముకు పోతూ పొరపాటున బ్రాహ్మణకుమారుని కాలిబొటనవ్రేలును కరిచాను. ఇకనుంచి నీవు మండూకములకు వాహన మవుతావు.' అని అతను శాపము పెట్టినాడు. కాబట్టి మమ్మల్ని నేను ఎలా మింగుతాను? మీకు వాహనమౌతాను' అన్నది పాము. మండూకరాజు వాహన మెక్కుదా మనే కోరికతో

మంత్రులతో సహా నీటిలోనుంచి నిర్భయముగా బయటికి వచ్చి సర్పము వీపుమీద సంతోషముతో సవారీ చేసినాడు. కొంతసేపు మోసి పాము బడలిక చెంది 'స్వామీ, నాకు ఓపిక లేదు. ఆకలి అవుతున్నది. ఆహారము పెట్టు. నౌకరు ఆహారము లేకుండా పని చేయగలడా! అన్నది. మండూకరాజు వాహనప్రీతిచేత 'నా సేవకులలో కొద్దిమందిని భక్షించు' అని అనుజ్ఞ ఇవ్వగానే సర్పము కప్పలన్నిటిని క్రమక్రమముగా మింగివేసింది. వాహన అభిమానంచేత మండూకరాజు మాటాడకుండా ఊరుకొన్నాడు. చివరకు అతన్నికూడా పాము మింగివేసింది.

బుద్ధిమంతుడు మూర్ఖులమధ్య ప్రవేశించి ఈ విధముగా వంచన చేస్తాడు. నేను కూడా ఇలాగే ఆ మందమతులను నాశము చేశాను. 'మహాప్రభూ, నీవుకూడా నీతివేత్తవు కావాలి. రాజు జడబుద్ధి అయితే భృత్యులు పీల్చి పిప్పిచేస్తారు, శత్రువులు సంహరిస్తారు. రాజ్యలక్ష్మి చంచలస్వరూపిణి. ధీరుడై నీతివేత్త అయి వ్యసనహీనుడైన రాజును విడిచిపెట్టదు. నీ శత్రువులు నశించినారు. ఇక నీ రాజ్యమును నిష్కంటకంగా పాలించుకో.

చిరజీవి ఈ ప్రకారము చెప్పినమీదట మేఘవర్ణుడు అతనిని సన్మానించి చక్కగా రాజ్యము చేస్తూ సుఖముగా ఉన్నాడు.

గోముఖుడు ఇలా చెప్పి 'దేవా, తిర్యగ్జంతువులు ప్రజ్ఞవల్ల బాగుపడతవి. ప్రజ్ఞాహీనులైన మానవులు పాడైపోతారు.

## అన్నదమ్ములు

మాళవదేశములో ఇద్దరు బ్రాహ్మణులు అన్నదమ్ములు. పిత్రార్జితము పంచుకొనేటప్పుడు వారికి వివాదము కలిగింది. ఛాందసుడైన తమ ఉపాధ్యాయుని వాళ్ళు మధ్యవర్తిగా పెట్టుకొన్నారు. ఆ వెర్రివాడు ప్రతివస్తువూ రెండు భాగాలు చేసి చెరోభాగము పుచ్చుకొంటే ఎక్కువ

కొక్కడ ఉండవు అని నిర్ణయించినాడు. ఆ ప్రకారమే వాళ్ళు గృహమూ, ను చతురా కరువూ మొదలైన వస్తువులనూ, పశువులనూ రెండు ముక్కలు చేసి పంచుకొన్నారు. చివరకు దాసిని కూడా రెండు తుండెములు చేసినారు. ఈ సంగతి తెలిసి రాజపురుషులు వచ్చి వాళ్ళ ధన మంతా స్వాధీనము చేసుకొని ఊరిలోనుంచి వెళ్ళగొట్టినారు. మూర్ఖులు ఇహపరాలకు కాకుండా పోతారు. అసంతుష్టివల్ల కూడా అధిక కష్టము కలుగుతుంది.

## అ స ం తు ష్టి

భిక్షలు పుచ్చుకొని బలిసిన సాధువులను చూసి వీళ్లు మహా బలిసినారు అని కొంద రనుకొన్నారు. అందులో ఒకడు 'వీళ్లు యథా ప్రకారంగా భోజనాదులు చేస్తున్నప్పటికీ క్షీణించిపోయేటట్టు చేస్తాను, చూసుకో' అన్నాడు మిత్రులతో. తరవాత సాధువులను తన ఇంటికి భోజనానికి పిలిచి షడ్రసోపేతముగా భోజనము పెట్టినాడు. ఆ మరునాటినుంచి సాధువులకు భిక్షాన్నముమీద ప్రీతి పోయింది. వాళ్ళు ఆ విందు తలంచుకొంటూ క్రమేణా కృశించిపోయినారు. వెనకటి మిత్రులకు వాళ్ళను చూపి వీళ్లు ఎందుకు కృశించినారో తెలునునా అన్నాడు. వెనక భిక్షాన్నముతోనే వీళ్ళు సంతుష్టి పొందేవారు. విందు జరిగిన మర్నాటినుంచీ వీళ్ళకు అసంతుష్టి ఏర్పడ్డది. అసంతుష్టివల్ల ఇహపరలోకాలకు మనుష్యులు దూరు లవుతారు అని వివరించినాడు. సాధువులు అసంతుష్టి విడిచి సుఖపడ్డారు.

## సు వ ర్ణ ము గ్ధు డు

ఒక యూపకుడు నీళ్ళు తాగడానికి చెరువులోకి దిగినాడు. ఒడ్డున చెట్టుమీద హైడికల అనే పక్షి వాలి ఉన్నది. నీటిలో దానిప్రతిబింబము

చూసి ఆమూఢుడు బంగారమనుకొని పట్టుకోబోయేవాడు. నీరు కదలగానే ప్రతిబింబము మాయమయ్యేది. బంగారువన్నె ఉన్నచోటు బాగాగుర్తుపట్టడానికి వాడు గట్టుమీదికి ఎక్కుతూ దిగుతూ అవస్థపడు తున్నాడు. ఇంతలో వానితండ్రి అక్కడికి వచ్చి సంగతి అడిగి తెలుసు కొని నీటిలో పైడితల ప్రతిబింబము చూసి పిట్టను చెట్టుమీదనుంచి ఎగరగొట్టి పక్షిస్వరూపము వానికి బోధించి ఇంటికి తీసుకొని పోయి నాడు. విమర్శలేని మూఢులు ఇలా భ్రాంతి పడుతూ ఉంటారు.

## మహామూఢులు

ఒకవర్తకుడు లొట్టిపిట్టమీద సరుకులు వేసి ప్రయాణము చేస్తూం డగా దోవలో అది చతికిలపడి మళ్లీ లేవలేదు. 'నేను వెళ్ళి ఇంకొక లొట్టిపిట్టను కొని తీసుకవచ్చి దీనిమీద సరుకులు దానిమీద కెక్కి స్తాను. నేను వచ్చేలోపలగా వర్షం వస్తే ఈబట్టల పెట్టెలమీద తోలు తడిసిపోకుండా జాగ్రత్తగా చూడుండి' అని వర్తకుడు చెప్పి వెళ్ళినాడు. కొంతసేపటికి చినుకులు పడడం ప్రారంభించింది. [illegible] పెట్టెలమీది చర్మం తడవకుండా ఉండడానికి ఆమూర్ఖులు పెట్టెలలో బట్టలు తీసి పైన కప్పినారు. వర్తకుడు వచ్చి జరిగిన నష్టం గమనించి వాళ్ళను చివాట్లు పెట్టి 'చర్మము తడిస్తే పెట్టెలోని సరుకు పాడై పోతుంది అనే సంగతి గమనించకుండా మీరు ఇలా చేశారు' అని రెండో లొట్టిపిట్టమీద సరుకులు ఎక్కించి ఇంటికి [illegible] లను వెళ్ళగొట్టినాడు. తాత్పర్యము గ్రహించకుండా [illegible]రించి మూర్ఖులు నష్టపోతారు.

## అ ప్రా పి కా మూ ర్ఖు డు

ఒకబాటసారి పణము పెట్టి ఎనిమిది అరిసెలుకొని ఒకటి [illegible] ఒకటిగా ఆరు అరిసెలు తిన్నాడు. ఆకలి తీరలేదు. ఏడో అరిసె తినేసరికి

అసత్యం చెప్పవు. ఎప్పుడూ నిజం చెప్పేవాడవు. మీరంతాకలిసి ఆమహిషాన్ని భక్షించారా? లేదా?' అని అడిగినాడు.

'మహాప్రభూ, మానాయన పోయిన మూడేళ్ళకు నేను పుట్టాను. మానాయనవల్లనే నాకు మాటకారితనం వచ్చింది. నే నెప్పుడూ అసత్యం చెప్పను. మేము దున్నను తిన్నమాట నిజము ఇతను చెప్పిన తతిమ్మా విషయాలన్నీ అబద్ధము' అని విన్నవించినాడు ముసలివాడు. అందరూ నవ్వినారు. వాళ్ళచేత మహిషయజమానికి మరో మహిషం రాజు ఇప్పించి వాళ్ళను శిక్షించినాడు. మూఢులు తమ మాటలమీద ఎదటివారికి నమ్మకం పుట్టించడానికి బహిరంగము చేయవలసిన విషయాలను దాచిపెట్టి రహస్యముగా ఉంచవలసినవిషయాలను బయటపెడతారు.

## చక్రవాకబుద్ధి

ఒకదరిద్రుని భార్య మహామూర్ఖురాలు. 'నేను ఉదయం మా పుట్టింటికి పోవాలి. అక్కడ ఉత్సవానికి నన్ను పిలిచారు. నీవు కలువదండ తెచ్చిపెట్టవలె. లేకపోతే ఇక మనకు సంబంధం ఏమీ ఉండదు' అని ఖండితంగా చెప్పింది. వాడు వెళ్ళి చీకటిలో రాజుగారిచెరువులో కలవ పువ్వులు కోస్తున్నాడు. ఎవరక్కడ అని కావలివాళ్ళు కేక వేస్తే చక్రవాకపక్షిని అని వాడు జవాబు చెప్పినాడు. కావలివాళ్ళు వాణ్ణి పట్టుకొని ఠాణాలో పెట్టి తెల్లవారినతరువాత ప్రభుసమక్షానికి తీసుకు వెళ్ళారు. అక్కడ వాడు చక్రవాకమువలె కూయడం మొదలుపెట్టినాడు. రాజు వానిని బుజ్జగించి సంగతి తెలుసుకొని కనికరించి విడిచిపెట్టినాడు.

## వైద్యుడు—మరుగుజ్జు

ఒకబ్రాహ్మడికొడుకు మరుగుజ్జు. వైద్యుని పిలిపించి తనకుమారుని గూను లోపలికి నెట్టవలసిన దని బ్రాహ్మడు కోరినాడు.

'నాకు పదిపణములు ఇవ్వవలె. నేను ఈపని సాధించలేకపోతే దీనికి

పదిరెట్లు నీకు ఇస్తాను' అని ఆమూర్ఖుడు ప్రతిజ్ఞచేసి డబ్బు పుచ్చుకొని ఆపిల్లవానికి వైద్యం చేసినాడు. ఎన్నాళ్ళు స్వేదనాదిక్రియలు చేసినా గూను పోలేదు. చివరకు వైద్యుడు ప్రాణం విసిగి పదిరెట్లుధనము బ్రాహ్మడికి ఇచ్చివేసినాడు. గూను ఎవరైనా తీర్చగలరా? అసాధ్య కార్యము సాధించ బూనుకొనేవాడు పరిహాసపాత్రుడౌతాడు. ఇటు వంటి మూఢులతో బుద్ధిమంతుడు సహవాసం చేయకూడదు.

ఈవిధముగా గోముఖమంత్రి చెప్పిన కథలు విని నరవాహనదత్తుడు శక్తియశోదేవికోసము ఉద్విగ్నుడౌతూ ఉన్నప్పటికీ కథావినోదము వల్ల శాంతించి నిద్రపోయినాడు.

## తరంగము : ౬3

నరవాహనదత్తుడు ఉదయాన నిద్రలేచి తన ప్రియురాలు శక్తి యశను స్మరిస్తూ కలతగా ఉన్నాడు. అతడు ఆమెను నెల రోజులలో వివాహము చేసుకోవలెనని గడువు ఏర్పాటయింది. ఇంకా కొద్ది రోజుల్లో నెల పూర్తి అవుతుంది. అంతవరకూ అతడు స్తిమితముగా ఉండలేక విరహబాధ పడుతున్నాడు. గోముఖుడు నరవాహనదత్తుని సంగతి వత్సరాజుకు చెప్పగా వత్సేశుడు, కుమారునకు ఉల్లాసము కలి గించే నిమిత్తము పుత్రవాత్సల్యము చేత తన మంత్రులను వసంతక సమే తముగా పంపినాడు. నరవాహనుడు అమాత్యులమీద అభిమానము వల్ల, కొంచెము ధైర్యము చిక్కబట్టినాడు. గోముఖుడు వసంతకునితో 'వసంతకా! ఆర్యపుత్రుని అంతరంగము విరహాకులమై ఉన్నది. గడువు చెక్కలయ్యే కథ చెప్పవయ్యా' అని కోరినాడు. వసంతకుడు యువ రాజుకు తుష్టి కలిగించే కథ మొదలు పెట్టినాడు.

### యశోధర లక్ష్మీధరుల కథ

మాళవ దేశములో శ్రీధరుడనే విప్రునికి కవలపిల్లలు యశోధర

లక్ష్మీధరులు అనేవారు ఉన్నారు. ఆ ఇద్దరూ నూనూగు మీసాల నూత్న యౌవనములో చదువు సంధ్యలకై తండ్రి అనుమతి పొంది దేశాంతరానికి వెళ్ళినారు. మధ్యమార్గములో వారికి చెట్టూ పుట్టా, నీళ్ళు నిప్పు లేని ఎడారిలో ప్రయాణము చేయవలసి వచ్చింది. కాళ్ళు మాడగా నెత్తి కాలగా నీడలేక ఎండదెబ్బ తిని గుక్కెడు నీళ్ళు దాహము దొరకక వాళ్ళు డస్సిపోయి, సంజవేళ ఛాయాసమృద్ధమూ ఫలపుష్ప భరితమైన వృక్షమును చూచినారు. ఆ చెట్టుమూలమున కొంచెము ఎడముగా చల్లని తేటనీటితో పరిమళము విరజిమ్ము తామరపువ్వులతో కన్నుల పండువుగా ఒక బావి వారికి గోచరమైనది. అక్కడ హాయిగా వారు స్నానము చేసి తిండి తిని, చల్లని నీరు కడుపార త్రాగి రాతిపలక మీద విశ్రమించినారు. ఈలోగా సూర్యుడు అస్తమించినాడు. ఇద్దరూ సంధ్య వార్చి జంతుభీతివల్ల ఆ రాత్రి గడిపేందుకు చెట్టెక్కినారు. చెట్టు మీదనుంచి వాళ్ళిద్దరూ చూస్తూ ఉండగా ఆ దిగుడుబావిలోనుంచి చాలా పురుషులు బైటికి వచ్చినారు. వాళ్ళల్లో ఒకడు నేల శుభ్రపరిచినాడు, ఒకడు అలికినాడు, మరొకడు ఐదు రంగుల పువ్వులను విరజిమ్మినాడు. ఒకడు బంగారు మంచము తెచ్చి వాల్చినాడు. మరో పురుషుడు దానిమీద హంసతూలికా తల్పమును పరిచి దానిమీద దుప్పటి కప్పినాడు. కొందరు మంచిపువ్వులు, మైపూతలు, పానము భోజనము తెచ్చి చెట్టుకింద ఒకచోట పెట్టినారు. దిగుడుబావినుంచి మన్మథునికంటె సొగసుకాడైనవాడు అలంకారాలు ధరించి ఖడ్గ హస్తుడై బైటికి వచ్చినాడు. అతడు ఆసీనుడు కాగానే అతనిని పుష్ప మాలికలతో అలంకరించి, పుష్పాడి, మంచిగంధము ఒంటికి పూసి, తక్కినపురుషు లందరూ నూతిలో మునిగి అదృశ్యులైనారు. అప్పు డారక్షకుడు తన ముఖమునుంచి వినీతవేష, మంగళమాల్యాభరణ శోభిత అయినస్త్రీని వెళ్ళ కక్కినాడు; మరొక చక్కనిచుక్కనుకూడా కక్కి

నాడు. ఆఇద్దరూ అతని భార్యలు; వారిలో అతని రెండోభార్యమీద మక్కువ ఎక్కువ. ప్రథమభార్య రత్నపాత్రములు పెట్టి రెండింటిలో భర్తకూ సవతికీ అన్నపానాలు వడ్డించింది. అతడు భోజనము చేసినతరువాత తాను తిన్నది. అతడు రెండోభార్యతో శయనించి నిద్రించినాడు. మొదటిభార్య అతని పాదాలు ఒత్తింది. రెండోది శయ్యలో నిద్రపట్టక పరున్నది. చెట్టుమీద ఉన్న బ్రాహ్మణకుమారులు ఇదంతా చూచి "ఈపరున్నవాడు ఎవడో! పిడికాళ్ళు పిసుకుతున్న ఈమెను అడుగుదాము. వీరు యోగ్యులుగా కనిపిస్తున్నారు." అని పెద్దదాని దగ్గరికి వెళ్ళేలోగా, రెండోభార్య సుందరాకారుడైన యశోధరుణ్ణి చూచి, తనప్రియుడు నిద్రపోవడము గమనించి శయ్యమీదినుంచి లేచింది. ఆమెయశోధరుని సమాగమానికి పిలిచింది. ఆవిప్రకుమారుడు 'పాపాత్మురాలా! నీవు పరభార్యవు. ఇలా మాటాడుతా వేమి?' అని అంటే, ఆమె "నీవంటివాడిని వందమందిని చూశాను. చూడు. నూరు ఉంగరాలు ఉన్నవి" అంటూ కొంగు విప్పి నూరుఉంగరాలు చూపింది. యశోధరుడు "నీవు వందమందిని చూడు, ఎంతమందినైనా చూడు. నాకు మాతృసమానవు" అని ఆమెమాట తోసి రా జన్నాడు. అప్పుడు ఆశఠ కసికొద్దీ భర్తను లేవగొట్టి అతనికి యశోధరుణ్ణి చూపి "నీవు నిద్ర పోతూ ఉండగా ఈదుర్మార్గుడు నన్ను చెడగొట్టినాడు" అని అబద్ధాలు ఆడింది. అది విని దానిభర్త కత్తిదూసి యశోధరుని హతమార్చ బోగా, సాధ్వీమణి అయిన పెద్దభార్య భర్తపాదాలమీద వాలి "ఆర్యపుత్రా, అనవసరముగా పాపాన్ని ఒడి కట్టుకోకు. నామాట పాటించు. నాసవతిమీద ఈర్ష్య లేదు. యథార్థము చెపుతున్నాను. నీవు పరుండగా నాసవతి ఆబ్రాహ్మణ్ణి పిలిచింది. చెవులార విన్నాను, కళ్ళారా చూచాను. భర్తతో అబద్ధము ఆడడము సతీధర్మము కాదు. నీకు పాపము సోకకుండా నిజము చెపుతున్నాను. నాపాతివ్రత్య ప్రభా

వము చూడ దలిస్తే చూడు" అంటూ ఎదుటఉన్న వృక్షాన్ని కాల్చి వేసింది. భస్మసాత్కృతమైన అతరువును వెంటనే మునుపటికంటె చక్కగా కలకల చిగిర్చేలాగ చేసింది! అది చూచి భర్త అమాంతము ప్రేమ భార్యను గాఢాలింగనము చేసుకొన్నాడు; రెండోదాని ముక్కు తెగ కోసినాడు. దానికొంగు విప్పి అతడు నూరుఉంగరాలను పుచ్చుకొని భార్యను తరిమివేశాడు. అతడు యశోధరునితో మంచిమాటలాడి క్షమా పణ వేడి 'అయ్యా! ఈర్ష్యవల్ల ఇద్దరుభార్యలనూ నాహృదయములో దాచి పెట్టాను, రక్షించాను. అలా దీన్ని దాచినా దీనిశీలాన్ని రక్షించ లేకపోయినాను. మెరుపుతీగను కదలకుండా చెయ్యలేము. చంచలను ఎవడు రక్షిస్తాడు? సాధ్వి తనశీలాన్ని తానే కాపాడుకోవాలి" అని యశోధరుణ్ణి కూర్చోబెట్టి 'ఎక్కడనుండి దయచేస్తున్నారు? ఎక్కడికి వెళుతున్నారు?' అని అడిగినాడు. యశోధరుడు తనసంగతి అతనికి విశదముగా చెప్పి అతని వృత్తాంతము కుతూహలమువల్ల అడిగినాడు.

"హిమాలయానికి దక్షిణభాగాన కాశ్మీరదేశము భూలోక స్వర్గ సీమ. పుణ్యజనులు కైలాస శ్వేతద్వీపాది పుణ్యక్షేత్రాలూ నిజ నివాసాలూ మరిచి కాశ్మీరములో నివసిస్తున్నారు. ఆ దేశములో వితస్తానది ప్రవహించి పవిత్రము చేస్తున్నది. ఆ దేశము అజేయము. అక్కడ పూర్వజన్మలో నేనొక గ్రామములో సామాన్య బ్రాహ్మణ కుమారుడను. నాకు ఇద్దరు భార్యలు. ఒకసారి శ్రమణులతో సాంగత్యము సంభవించగా వారు నాకు శాస్త్రప్రసిద్ధ మయిన ఉపోషణ అనే వ్రతాన్ని నేర్పినారు. ఆవ్రతాన్ని నేను సమాప్తి చేసే సమయములో నియమము లెక్కచెయ్యక నా భార్యల్లో ఒకతె బలాత్కారంగా వచ్చి నా శయ్యలో పరుండి నిద్రించింది. రాత్రి నాలుగో జామున నేను వ్రతదీక్ష మరిచి మత్తులో ఆమెతో గడిపినాను. నియమభంగమువల్ల నేను జలపురుషుణ్ణిగా జన్మించాను. పూర్వజన్మలో ఆ ఇద్దరూ ఈ జన్మలో

భార్యలైపుట్టారు. నన్ను వేధిస్తున్నారు. భార్యల్లో ఒకతె కులట, మరొకతె సాధ్వి. వ్రతభంగము కలిగినా ప్రియసాధ్వీ ప్రభావమువల్ల పూర్వజన్మ జ్ఞానమువల్ల ప్రతిరాత్రి సుఖభోగాలు అవిచ్ఛిన్నముగా అనుభవిస్తున్నాను. వ్రతభంగము లేకపోతే నాకీ పునరావృత్తి ఉండేదికాదు."

ఇలా అతడు స్వవిషయము చెప్పి ఆ బ్రాహ్మణ కుమారులను మృష్టాన్న సంతృప్తులను చేసి సత్కరించినాడు. పతివ్రత అయిన అతని భార్య పూర్వజ్ఞానము స్మరించి చంద్రుణ్ణి చూచి "దిక్పాలకులారా! నిజముగా నేను సాధ్వినైతే నా భర్త జలవాసజన్మము మాని స్వర్గానికి పోవునుగాక" అని పలుకగానే గగనమునుంచి విమానము వచ్చింది. ఆ విమానమెక్కి పుణ్యదంపతులు స్వర్గానికి వెళ్ళినారు.

అదంతా చూచి విప్రకుమారులు ఆశ్చర్యపడి అక్కడే రాత్రి గడిపి ఉదయాన ప్రయాణమైనారు. వారు సందెవేళ నిర్జనారణ్యములో చెట్టు చూచి నీళ్ళు ఎక్కడయినా దొరుకుతవేమో అని వెతకగా వృక్షమునుంచి "ఓ విప్రులారా, ఉండండి నేనిప్పుడే మీకు స్నానపానాలతో ఆతిథ్యము ఇస్తాను" అని వాక్కు వినపడినది. వెంటనే సలిలపూర్ణమైన కూపము, దానిగట్టున చిత్రవిచిత్రములైన అన్నపానములు ఆవిర్భవించినవి. విప్రులు ఆశ్చర్య పడుతూ నూతిలో స్నానముచేసి హాయిగా కడుపార కమ్మని భోజనము చేసినారు. తరువాత వారు సంధ్య వార్చి చెట్టుకిందికి రాగా అక్కడ అందగాడైన యువకుడు దిగి వచ్చినాడు. వారు అతనికి వందన మాచరించినారు. ఉభయులూ కుశలప్రశ్నలు వేసుకొన్నారు. విప్రులు అతని వృత్తాంతము అడిగినారు.

అతడు స్వవిషయము ఇలా చెప్పినాడు: "పూర్వము నేను నష్ట దరిద్రుణ్ణి, విప్రుణ్ణి. విధివశాన నాకు శ్రమణులతో సాంగత్యము కలిగింది. వారి శాస్త్రానుసారము నేను ఉపోషణ వ్రతాన్ని ఆచరించాను. ఒక

సాయంత్రము ఒకశఠుడు బలవంతము చేసి భోజనము పెట్టాడు. నా వ్రత భంగము వల్ల యక్షుడనై జన్మించాను. వ్రత సమాప్తి అయి ఉంటే స్వర్గలోకాన దేవకోటిలో చేరేవాణ్ణి — ఇదీ సంగతి. మీ రెవరు? ఎక్కణ్ణించి ఎక్కడికి దయచేస్తున్నారు? ఈమరుభూమికి వచ్చారేమి?"

యశోధరుడు యక్షునికి నిజవృత్తాంతము పూసగుచ్చినట్టు తెలియ చెప్పినాడు. యక్షుడు "నా ప్రభావమువల్ల మీకు సమస్తవిద్యలూ కర తలామలకము అవుతవి. విదేశాలకు వెళ్ళకండి; స్వదేశానికి వెళ్ళుదురు గాక" అని చెప్పి వాళ్ళకు విద్యలను అనుగ్రహించినాడు. విప్ర కుమారులను యక్షుడు "నేను గురుదక్షిణ అడుగుతాను. నానిమిత్తము మీరు ఉపోషణవ్రతము ఆచరించాలి. సత్యపాలనము, బ్రహ్మచర్యము, దేవప్రదక్షిణము, భిక్షాటనము, మనోనిగ్రహము, క్షమ ఒకనాడు జరిపి ఆవ్రతఫలాన్ని నాకు అర్పించాలి. అందువల్ల నేను దివ్యత్వాన్ని పొందుతాను" అని పలికినాడు. విప్రులు వినమ్రులై అందుకు అంగీక రించగా యక్షుడు వృక్షమెక్కి అదృశ్యుడైనాడు. అన్నదమ్ములు ఇలా అయత్నకార్యసిద్ధులై రాత్రి గడిపి ఉదయాన్నే ప్రయాణము చేసి స్వగృహము చేరినారు. వారు జననీ జనకులకు విషయమంతా విశదపరిచి ఉపోషణవ్రతము చేసినారు. యక్షుడు విమానము మీద వచ్చి విప్రకుమారులతో "శిష్యులారా! మీదయవల్ల నా యక్షత్వము పోయి దేవపురుషుడను అయినాను. మీరు ఈవ్రతాన్ని వదిలి పెట్టక మీక్షేమము నిమిత్తము చేసుకొనండి. దేహపతనానంతరము మీకు దేవత్వము సిద్ధిస్తుంది. నా వరమువల్ల మీకు అక్షయ సంపదలు కలుగు తవి" అని అనుగ్రహించి విమానము మీద స్వర్గానికి వెళ్ళినాడు. యశోధర లక్ష్మీధరులు ఉపోషణవ్రతము ఆచరించి సిరిసంపదలు పొందినారు. ధర్మపరులను సదాచారము సతతము సంరక్షిస్తుంది, సకలా భీష్టములనూ ఇస్తుంది.

ఇలా వసంతకుడు చెప్పిన అద్భుతకథను విని నరవాహనదత్తుడు ప్రియాసమాగమోత్కంఠను సహించ గలిగినాడు. వత్సరాజు కుమారుణ్ణి భోజనవేళ కబురు చేయగా అమాత్యులతో తండ్రిదగ్గిరికి వెళ్ళినాడు. నరవాహనుడు భోజనము చేసి సంజవేళ వయస్యులతో నిజనివాసానికి వచ్చినాడు. అతని వినోదార్థము గోముఖుడు వేరొక కథ చెవుతున్నాడు.

## మూర్ఖుల కథలు

వలీముఖము అనే కోతి తన గుంపులోనుంచి చెదిరి సముద్రతీరాన అరణ్యములో అత్తిపండు తింటూ ఉండగా అది జారి సముద్రోదకములో పడింది. ఒక మొసలి ఆపండు తిని సంతోషముతో ధ్వని చేసింది. ఆమధురనాదము వినవలె నని కోతి చాలా అత్తిపళ్ళను అలాగే నీటిలో వేస్తూ వచ్చింది. ఇలారోజులు వెళ్ళినవి. వాటిరెంటికీ స్నేహము కుదిరింది. గట్టుమీద ఉన్న మొసలి చెట్టుమీది కోతితో కబుర్లు చెప్పి సంజవేళ ఇంటికి పోతూవచ్చింది. మొసలిభార్య, పగలు విరహము సహించలేక, తనప్రియునికీ కోతికీ ఏర్పడిన మైత్రి ఓర్వలేకుండా ఉంది. మొసలి ఇంటికి రాగా దాని భార్య మాంద్యవ్యాధి అభినయించింది. అప్పుడు మకరము 'ప్రియురాలా! నీ కేమిటి జబ్బు? ఎలాతగ్గుతుంది?'' అని బెంగతో భార్యను నిర్బంధించి వ్యాధికారణము అడిగితే ఆమె పల్లెత్తుమాట పలుక లేదు. ఆమెచెలి మకరి రుగ్మతకు కారణము అతనితో "నీభార్యవ్యాధి తగ్గవల నంటే కోతిగుండెలు కాచి చారు తీసుకురండి'' అన్నది మకరము. కోతినిచంపితేగాని గుండెలు దొరకవు. అంత ద్రోహము మిత్రునికి చేయడమా? మిత్రుడు ఎక్కువా? భార్యఅధికమా? ఇలా మకరము ఆలోచించి భార్యతో "ప్రేయసీ! కోతినే తీసుకొని వచ్చి ఇస్తాను'' అని నిశ్చయముగా చెప్పినది. భార్యను సముదాయించి

మకరము కపిదగ్గిరికి వెళ్ళి "మిత్రమా! నీవు మాఇల్లూ వాకిలీ, మాఆవిణ్ణి చూడ లేదు. ఒకసారి రావోయి! ఒకరోజు మాఇంట్లో ఉందువు గాని" అని కోతినిమోసగించి సముద్రములోకి దానిని దింపి వెంటబెట్టుకొని పోతున్నది. కోతికూడా వెళుతూఉండగా మొసలి పూర్వరీతిగా లేక కలతగా ఉన్నది. కోతి "మిత్రమా! నీవు ఎప్పటిమాదిరిగా లేవేమి? కలతగా ఉన్నావే?" అని అడగగా జడమతి అయినఆముసిలికోతి తనచేత చిక్కి తప్పించుకొని పోలే దని నమ్మి మొసలి "నాభార్యకు అస్వస్థతగా ఉంది. రోగశాంతికి కోతిగుండెకాయ కావా లని అన్నది. అందువల్ల నాకు దిగులుగా ఉంది" అని యథార్థము చెప్పింది. "ఈపాపి ఇందుకా నన్ను తీసుకు పోతున్నాడు. స్త్రీవ్యసనమువల్ల వీడు మిత్రద్రోహానికి ఒడి కట్టినాడు. ఆశ్చర్యము! దయ్యము పట్టినవాడు తనమాంసాన్ని తానే కరుచుకోడము లేదా?" అని కోతి ఆలోచనచేసి మొసలితో "మిత్రమా, అలా అయితే, ఆమాట నాతో మొదటనే ఎందుకు చెప్పలేదు? ముందే చెపితే నేను కోతిహృదయాన్ని తెచ్చేదాన్ని. ఆకపిగుండె నేనున్న చెట్టుమీద ఉన్నది." అని చెప్పింది. ఆమాట విని దానిఆవేదనకు ఖేదపడి "అలా అయితే వెళ్ళితీసుకురా" అని మొసలి కోతిని సముద్రతీరాన వదిలిపెట్టింది. అక్కడ కపి మృత్యుముఖాన్నుంచి తప్పించుకొని ఎగిరి చెట్టుకొనకు పోయి మొసలితో "పోరా, మూఢుడా! గుండెకాయ దేహములో ఉండక విడిగా ఉంటుందా? నేను ఈయుక్తివల్ల నీబారినుంచి తప్పించుకొన్నాను. బతుకు జీవుడా అని బైటపడ్డాను. ఇక రాను పద! గాడిద కథ ఎప్పుడూ వినలేదూ!" అని చెప్పసాగింది :

## గర్దభ కథ

ఒకఅరణ్యములో సింహము నక్క ఉంటున్నవి. ఒకసారి రాజు వేటకని వచ్చి సింహాన్ని గాయపరచినాడు. అప్పుడు సింహము ఎలాగో గుహలోచేరి

ఆ విప్రుడికి గొల్ల వేషము వేసి కరణముగారింటి దాసీదానితో చెప్పి ప్రవేశపెట్టించినాడు. దాసీ చీకట్లో రుద్రసోముణ్ణి గొల్లవా డని భ్రమ పడి స్త్రీవేషము వేసి రా అని చెప్పి వెంట తీసుకుపోయింది. ఇంటావిడ గొల్లవాడే వచ్చాడని భ్రమసి భర్తను కౌగలించుకొన్నది. రుద్రసోముడు "ఛీ! జారస్త్రీలు ఎవణ్ణి మోహించరు!" అని రోసి విరక్తితో భార్యను విడిచి ధనదేవునితో వనవాసార్థము వెళ్ళినాడు.

## శశిగృహిణీ వృత్తాంతము

ధనదేవ రుద్రసోములు గృహిణీవిరక్తులై అరణ్యానికి వెళుతూ ఉండగా దారిలో శశి అనే అతడు కలవగా అతనికి తమ తమ గృహచ్ఛిద్రాలు ఏకరువు పెట్టినారు. శశి చిరప్రవాసానంతరము భార్యదగ్గిరికి వెళ్ళే ఉత్కంఠలో ఉన్నవాడు ధనదేవరుద్రసోముల మాటలు విని తన భార్యను అనుమానించి ఆమె శీలాన్ని పరీక్షించేటందుకు సాయంత్రము ఇంటిదగ్గిరికి వచ్చాడు. అక్కడ కుష్ఠువాడు పాటపాడుతూ ఉండగా వాణ్ణి శశి "ఇలా ఉన్నావు ఎవరయ్యా నీవు?" అని అడిగితే "నేను కామదేవుణ్ణి" అంటూ కుష్ఠువాడు సమాధానము ఇచ్చినాడు. శశి "నీ అందచందాలే చెప్పుతున్నవి" అనగా వాడు "ఇక్కడ శశి అనే ధూర్తభర్త ప్రియురాలిమీద ఈర్ష్యచేత నేలకొట్టులో పెట్టి ఒకపరిచారికను సహాయ మిచ్చి దేశాంతరము వెళ్ళి తిరిగి రాలే దట. అతని భార్యకు నామీద మనసు కలిగి దూతిద్వారా కబురంపి నాచెలిమి చేసింది." అన్నాడు. ఆమాటలు విని శశి అశనిపాతమువలె బాధపడి గుండెల్లో దాచుకొంటూ వాడితో "నిజముగా నీవు కామదేవుడవే. నిన్నొకటి కోరుతున్నాను. నీ వేషముమీద నేను ఈరాత్రి ఆవిడ దగ్గిరికిపోతాను. నాకు సరదా పుట్టింది." అనగా కుష్ఠువాడు "అలాగే" అని తనవేషము శశికిఇచ్చినాడు. దాసివచ్చి అతడుకుష్ఠువాడని భ్రమపడి

తన వీపుమీద ఎక్కించుకొని మణమూను రాలిదగ్గరికి వెళ్ళింది. ఆమె జారునికోసము ఎదురుచూస్తూ కూర్చున్నది. చీకట్లో ఆమెశరీరాన్ని స్పృశించగా అతనికి తనభార్య అని తెలిసి విరక్తి పొంది ధనదేవ రుద్ర సోములదగ్గరికి వచ్చి తనభార్య చరిత్ర చెప్పినాడు.

తెల్లవారగా ముగ్గురూ కలసి వనవాసానికి బయలుదేరినారు. తోవలో ఒకచెట్టు ఒకనుయ్యి కనపడినవి. అక్కడ మకాము చేసి భోజనము చేసి మంచినీరు తాగి రాత్రివేళ చెట్టెక్కినారు. వాళ్ళు చూస్తూ ఉండగా బాటసారి వచ్చి చెట్టుకింద నిద్ర పోయినాడు. నూతిలోనుంచి పురుషుడు వెలికి వచ్చి నోటిలోనుంచి స్త్రీని బైటకు రప్పించి ఆమెతో నిద్రించినాడు. చెట్టుకింద పరున్న తెరువరిని చూచి ఆవనిత వానితో కూడింది. ఆబాటసారి కుతూహలముతో నీ వెవరవు? నీసంగతి సందర్భమూ తెలియజెప్పవా?" అని అడిగితే ఆమె "నేను నాగునిభార్యను. నాగకన్యను. భయపడకు. నీవంటివాళ్ళను వందమంది చూశాను. నేటికి శతమానము పూర్తి అయింది" అని చెప్పింది. నాగకన్య మాట్లాడుతూ ఉండగా నాగుడు మేలుకొని నోటివెంట అగ్నిజ్వాలలు పంపగా వాటి వల్ల ఆనాగకన్య, బాటసారి దగ్ధులై పోయినారు. వెంటనే నాగుడు నూతిలో మునిగినాడు. వృక్షశాఖలమీద పరున్న ముగ్గురూ 'స్త్రీలను కడుపులో దాచినా వాళ్ళశీలాన్ని రక్షించలేము' అని తమలో తాము చెప్పుకొని రాత్రి జాగరణ చేసి తెల్లవారగానే వనానికి వెళ్ళినారు. ముగ్గురూ వనవాసముచేసి యోగసాధనలో ఆరితేరి సమాధినిష్ఠులై మోక్షము పొందినారు.

స్త్రీవ్యామోహము అనర్థకారణము. ప్రాజ్ఞులు విరక్తులై మోక్షార్థులవుతారు.

గోముఖుడు చెప్పినకథలను నరవాహనదత్తుడువిని మనోవిల్లాసము పొంది సుఖముగా రాత్రి నిద్రపోయినాడు.

## తరంగము: ౬౯

## ఒక బోధిసత్త్వుని కథ

గోముఖుడు చెపుతున్నాడు:

ఒకనగరములో బోధిసత్త్వాంశతో వర్తకునికుమారుడు మాతృహీనుడనేవాడు ఉంటున్నాడు. తండ్రి మళ్ళీ పెళ్ళి చేసుకొని రెండో భార్యమాట విని కొడుకును ఇంట్లోంచి తరిమివేశాడు. మాతృహీనుడు భార్యాసమేతుడై వనవాసానికి వెళ్ళినాడు. మాతృహీనుని తమ్ముడు కూడా సవతితల్లి పోరువల్ల ఇంట్లో నిలువనీడలేక వనవాసార్థము వెళ్ళినాడు. మాతృహీనుడు తమ్ముణ్ణి చూచీచూడకుండా మరొక మార్గాన ప్రయాణము చేసి ఎండకు మండుతున్న మరుభూమి చేరినాడు. తినడానికి తిండీ తిప్పలులేవు. వారంరోజులనుంచీ అతనిభార్య తిండిలేక కృశించిపోగా ఆమెను తన బుజాలమీద ఎక్కించుకొని మాతృహీనుడు తన రక్తమాంసాలతో దాన్ని పోషిస్తున్నాడు. ఆ దురాత్మురాలు వాణ్ణి తింటూఉన్నది. ఎనిమిదోనాడు మాతృహీనుడు గిరి కాననము చేరి, బడలిన భార్యకు దాహమిచ్చి తాను స్నానానికి సెలయేటిలో దిగినాడు. ఆజలప్రవాహములో కాళ్ళు చేతులు తెగిన మనుష్యుని మొండెము కొట్టుకుపోతూ 'బాబో రక్షించు, రక్షించు' అని మొర పెట్టింది. ఉపవాసాలవల్ల నీరసించిన మహాసత్త్వుడు లోతుకుపోయి మొండెమును గట్టుకు తెచ్చి దయార్ద్రకంఠములో "తమ్ముడా! ఏమి పాపము!" అనేసరికి అతడు "అన్నా నాకు మరణదుఃఖము కలిగించాలని శత్రువులు ఇంతపని చేశారు నన్ను రక్షించావు. చచ్చి నీకడుపున పుట్టుతాను" అని పలికినాడు. ఆబోధిసత్త్వుడు అతని గాయాలకు కట్టు కట్టి, ఆహార మిచ్చి, తరువాత వెళ్ళి స్నానము చేసినాడు. ఆవనములోనే మాతృహీనుడు భార్యతో వన్యఫలాలు తింటూ తపస్సు చేస్తు

న్నాడు. ఒకసారి అతను కందమూలఫలాదుల్కై వెళ్ళగా భార్య సమయము కనిపెట్టి గాయాలు మాని ఉన్న ఆమొండెముతో క్రీడించింది. వాళ్ళిద్దరికి స్నేహము కలవగా మాతృహీనుణ్ణి చంప నిశ్చయించుకొని భార్య మాంద్యవ్యాధి అభినయించింది. దాటరాని నదిలో దిగరాని గోతిలో ఉన్న లతను ఆమె పతికి చూపి "ఆమహౌషధి తెస్తే నేను జీవించగలను. ఈఓషధి ఇక్కడే దొరుకుతుందని కొండదేవత నాకలలో కనబడి చెప్పింది" అన్నది. మాతృహీనుడు ఒకతాటికి గడ్డి చుట్టి చెట్టుకు వేలాడ గట్టి దాన్ని గట్టిగా పట్టుకొని మూలికకోసము గోతిలో దిగినాడు. వెంటనే భార్య తాడు విప్పి వదలివేసింది. ఆబోధిసత్త్వుడు నదిలో చాలాదూరము కొట్టుకుపోయి ఒకనగరము దగ్గర గట్టెక్కి స్త్రీమాయ అని వగచి, బడలికవల్ల వృక్షమూలమున నిద్రించినాడు. అప్పుడు ఆనగరాధీశ్వరుడు చనిపోయినాడు. ఆదేశాచారాన్ని బట్టి మంగళమత్తేభమును ఊరంతా తిప్పుతారు. ఆఏనుగుతుండముతో ఎవరిని ఎత్తి మీద ఎక్కించుకొంటుదో అతడు నగరానికి రాజు అవుతాడు. భద్రగజము మాతృహీనుని దగ్గరికి వచ్చి తుండముతో ఎత్తి తన మీద ఎక్కించుకోగా ఆబోధిసత్త్వమూర్తిని రాజుగా ఊరివారు అభిషేకము చేసినారు. అతను రాజ్యమును పొంది క్షమా కారుణ్యాలతో క్రీడించినాడే గాని స్త్రీలతో రమించలేదు. భర్త నదిలో పడి మరణించి నాడని భ్రమపడి ఆమె జారుని మొండెమును వీపుమీద పెట్టుకొని ఇటు అటు తిరుగుతున్నది. "నేను సాధ్విని. నాపతి పాదాలను శత్రువులు నరికినారు. ఇతన్ని నేను బిచ్చమెత్తి రక్షిస్తున్నాను. భిక్షపెట్టండి" అంటూ ఆమె వాడవాడలూ తిరిప మెత్తుతూ క్రమేణా తనపతి ఏలుతున్న నగరికి వచ్చింది. పౌరులందరూ ఆమెను పరమసాధ్వి అని ప్రస్తుతించడము రాజు కర్ణాకర్ణిగా విని భార్యను పిలిపించినాడు. "నీవేనా ఆమహాపతివ్రతవు!" అని ప్రశ్నించగా రాజలక్షణా

లతో తీవితో ఉన్న భర్తను గుర్తించలేక "దేవా! నేనే ఆపతివ్రతను!" అని సమాధానము ఇచ్చింది. రాజు మందహాసము చేసి 'నీపాతివ్రత్యము నేను అనుభవపూర్వకముగా గ్రహించాను. చేతులు చక్కగా ఉన్న భర్త మాంసము తిని కొవ్వెక్కి, అతడు పనికిరాడని భర్తను సెల యేటిలో తోసినావు. పాపకర్మము అనుభవిస్తూ జారుని మొండెమును మోస్తున్నావు!' అనగా ఆమె రాజును భర్తగా గ్రహించి మూర్ఛ పోయింది. అమాత్యులు అందరూ రాజును అడగగా రాజు యదార్థము చెప్పి తనకు ద్రోహము చేసిన భార్య ముక్కు చెవులు కోయించి జారుని మొండెముతోపాటు దేశాంతరము వెళ్ళగొట్టినాడు. బోధి సత్త్వుడు రాజ్యవైభవము అనుభవిస్తూ సుఖపడ్డాడు.

గోముఖుడు మరొకకథ నరవాహనదత్తునకు చెప్పసాగినాడు.

ఒకబోధిసత్త్వాంశుడు వనవాటిలో కుటీరము నిర్మించుకొని కరుణా పూరితహృదయముతో ఘనతపస్సు చేస్తూ ఆపదలో శరణు చొచ్చిన అన్నిజంతువులనూ పిశాచముల బారినుండి రక్షిస్తూ అన్నోదకాలు ఇస్తున్నాడు. ఒకసారి అతడు పరోపకారార్థము అరణ్యములో సంచ రిస్తూ పెద్దనూతిలో చూడగా అందులో ఒకవనిత ఆర్తితో "మహాను భావా! నను ఉద్ధరించు. నేను స్త్రీని. నేనూ స్వర్ణశిఖ అనే ఈవిహంగమూ ఈసింహమూ సర్పమూ నలుగురమూ రాత్రి నూతిలో పడిపోయినాము. రక్షించాలి!" అని వేడింది. బోధిసత్త్వుడు "మీరు ముగ్గురూ చీకట్లో నూతిలో పడ్డారంటే అర్థము ఉంది. పక్షి నూతిలో పడిపోవడ మేమిటి?' అని అడిగితే ఆమె "బోయవాని బాణము తగలి పిట్ట పడ్డది" అన్నది. అతడు తపశ్శక్తితో వాళ్ళను నూతిలోనుంచి బయలు పడ చేయ యత్నించినాడు. తపసిద్ధి పోవడముచేత లాభము లేక పోయింది. పాపాత్మురాలితో మాట్లాడె నందువల్ల తపశ్శక్తి పోయిందని బోధి సత్త్వుడు మోదించి గడ్డిచుట్టినతాటిని నూతిలో వేసి వాళ్ళను పైకి తీసి

రక్షించినాడు. ఆజంతువులు, ఆస్త్రీ, ఆమహాకారుణికుణ్ణి స్తుతించినారు. అతడు అద్భుతపడి "వ్యక్తవాక్కు ఎలా వచ్చింది? మీసంగతి ఏమిటి?" అని అడిగితే, సింహము తనసంగతి చెవుతున్నది:

"మేము వ్యక్తవాక్కులము. పూర్వజ్ఞానము కలవాళ్ళము. అన్యోన్యఘాతకులము. హిమాలయపర్వతాలలో వైడూర్యశృంగ నగరిలో పద్మవేగుడు అనే విద్యాధరేశ్వరుడు ఉన్నాడు. అతనికుమారుడు వజ్రవేగుడు విద్యాధరలోకములో ఉన్నవారితో శౌర్యమువల్ల గిల్లికజ్జా తెచ్చుకొన్నాడు. తండ్రి వద్దని హితము చెపితే కుమారుడు మాట పెడచెవిని పెట్టగా అతనికి పద్మవేగుడు మానవుల్లో జన్మించమని శపించినాడు. వజ్రవేగునిపొగరు అణిగింది. విద్యలు పోయినవి. అతడు శాపమోచనము వేడగా తండ్రి "భూలోకములో విప్రకుమారుడవై, మళ్ళీ ఇలాంటిపని చేసి జనకునిశాపమువల్ల నూతిలో పడతావు. మహాసత్త్వుడు నిన్ను ఉద్ధరిస్తాడు. అతనికి కష్టకాలములో నీవు సహాయపడి శాపమోచనము పొందుతావు" అని అనుగ్రహించినాడు.

వజ్రవేగుడు మాళవరాజ్యములో హరఘోషు డనే బ్రాహ్మణుని సుతుడై దేవఘోషు డనేనామముతో జన్మించాడు. దేవఘోషుడు పొగరుకొద్దీ అందరితో కజ్జాతెచ్చుకోడమువల్ల తండ్రి విసుగెత్తి కుమారుణ్ణి "దుర్బుద్ధీ! నీపొగరు అణగుతుంది. సింహముగా జన్మించు" అని శపించగా దేవఘోషుడు విద్యాధరపతారుడు అయినప్పటికీ వనములో సింహమైఉన్నాడు. నేనే ఆసింహాన్ని. రాత్రి అడివిలో తిరుగుతూ కూపములో పడ్డాను. మహానుభావా! నన్ను రక్షించావు. నేను వెళ్ళిపోతాను. నీకు ఎప్పుడయినా కష్టకాలమువస్తే నన్ను స్మరించు. నీకు ఉపకారము చేసి శాపమోక్షము పొందుతాను."

సింహము తనవృత్తాంతము చెప్పినతరువాత సువర్ణచూడ మనే పక్షి తనసంగతి చెవుతున్నది.

హిమాలయములో విద్యాధరేశ్వరు డయిన వజ్రదంష్ట్రునికి ఐదుగురు కన్యలు పుట్టారు. అతడు పుత్రులకోసము మహేశ్వరుణ్ణిగూర్చి తపస్సు చేస్తే రజతదంష్ట్రుడనేకుమారుడు కలిగినాడు. కుమారుడు సమస్తవిద్యలూ తండ్రివల్ల గ్రహించి అందరికీ కన్నులపండుగగా వర్ధిల్లుతున్నాడు. ఒక సారి అతడు తనపెద్దఅక్క గౌరి, పింజరకము అనే వాద్యము వాయిస్తూ ఉండగా చూచి "నాచేతికి పింజరకాన్ని ఇవ్వ" మని అడిగి లాక్కొని మింటికి ఎగిరినాడు. అక్క "నీవు స్వర్ణపక్షి విఅవుదువుగాక" అని శాపమిచ్చి, అతడు వేడుకోగా దయదాల్చి "మూఢా! నీవు పక్షివై చీకటినూతిలో పడతావు. అప్పుడు దయాశీలి నిన్ను ఉద్ధరిస్తాడు. అతనికి ప్రత్యుపకారము చేస్తే శాపము పోతుంది" అని శాపమోక్షము అనుగ్రహించింది. "నేనే ఆపక్షిని. మహానుభావా! నీవల్ల బతికినాను. నీకు కష్టకాలములో ఉపకారము చేస్తాను. అప్పుడు నేను ముక్తిపొందుతాను" అని పక్షి వెళ్ళిపోయింది.

భోధిసత్త్వుడు అడగగా సర్పము నిజవృత్తాంతము ఇలా చెప్పింది:

"పూర్వము నేను కశ్యపాశ్రమములో మునికుమారుణ్ణి. నాకు ముని పుత్రుడు మిత్రుడు. అతనితో నేను స్నానార్థము సరస్సులో దిగినాను. నేను సరస్తీరాన ఉండగా మూడుతలలపాము వచ్చింది. నామిత్రుణ్ణి వేళాకోళానికి భయపెట్టాలని పామును మంత్రబలమువల్ల కట్టివేసాను. నావయస్యుడు స్నానము ముగించి గట్టు ఎక్కగా మహాసర్పము కన పడింది. అతడు భయపడి మూర్ఛపోయినాడు. చాలాసేపటికి అతనికి తెలివి వచ్చింది. నేను చేసిన కుచోద్యము కనిపెట్టి "నీవు మూడు తలల పాము అవుదువుగాక" అని శపించగా నేను శాపమోచనము వేడుకొంటే అతడు "నీవు చీకటి నూతిలో పడతావు. మహాసత్త్వుడు నిన్ను రక్షిస్తాడు" అని అనుగ్రహించి "నీవు మహాసత్త్వునకు కష్ట దశలో ఉపకారము చేస్తే నీసర్పదశ వదిలిపోతుంది" అన్నాడు. నేనే ఆసర్పాన్ని. నీవల్ల జీవించాను. నీకష్టకాలములో ఉపకారము చేస్తాను.

అప్పుడు నా శాపము పోతుంది” అని పాము వెళ్ళిపోయింది.

తనసంగతి స్త్రీ ఇలా చెప్పింది.

“నాభర్త అందగాడయినా, మహావీరుడయినా, మహాదాత అయినా, రాజాస్థానములో పదవిలో ఉన్నా, నేను అతన్ని తృణీకరించి పరపురుషుణ్ణి ఆశ్రయించాను. భర్తకు నాగుట్టూ మట్టూ తెలిసి దండించా లని నిశ్చయించుకోగా సభాముఖాన ఆవిషయము గ్రహించి నేను ఈ అడివికి పారిపోయి వచ్చాను. చీకట్లో కన్ను కనపడక నూతిలో పడ్డాను. నూతిలోనుంచి నన్ను ఉద్ధరించావు. మహానుభావా మీకష్టాల్లో నేను ఆదుకొంటాను.”

ఇలా ఆకులట పలికి అతనిదగ్గిర సెలవు తీసుకొని గోత్రవర్ధనమహారాజు నగరికి వెళ్ళింది. పట్టపుదేవికి దాసీగా చేరి కాలము గడుపుతున్నది. కులటతో మాట్లాడినందువల్ల బోధిసత్త్వుని శక్తులు పోగా అరణ్యములో వన్యఫలాలు కందమూలాదులు కూడా లభించలేదు. అతడు ఆకలిమంటకు అటమటించి సింహాన్ని స్మరించగా మృగరాజు మాంసాహారము అతని కిచ్చి ఆకలి పోగొట్టి తాను సింహరూపము వదిలి విద్యాధరుడై బోధిసత్త్వునివద్ద సెలవు పుచ్చుకొని వెళ్ళినాడు.

బోధిసత్త్వుడు కష్టాలు పడుతూ స్వర్ణచూడపక్షిని స్మరించినాడు. ఆవిహంగము ఎక్కడికో ఎగిరి రత్నాభరణపూర్ణమయిన భరిణెని తెచ్చి అతని కిచ్చి “ఈధనముతో నీవు బతకవచ్చును. నాకు శాపము తీరింది. నీకు క్షేమము కలుగుతుంది. వెళ్ళి వస్తాను” అంటూ పక్షి విద్యాధర కుమారుడై నిజలోకానికి గగనమార్గాన పోయి తండ్రివల్ల రాజ్యాధికారాన్ని పొందినాడు. బోధిసత్త్వుడు రత్నాలనువిక్రయిస్తూ కులట ఉన్న నగరము వెళ్ళినాడు. అతడు వృద్ధబ్రాహ్మణిగృహములో ఆభరణకరండము ఉంచి రత్నవిక్రయార్థము విపణికివెళ్ళగా తాను అదివరకు రక్షించిన కులట కనపడినది. మాటలప్రస్తావనలో అది పట్టపుదేవిదగ్గిర దాసీగా

ఉన్నట్టు చెప్పింది. ఆమె అతనిసంగతి అడిగితే తనకు స్వర్ణచూడపక్షి వల్ల రత్నాభరణకరండము లభించినవిధము తెలియచెప్పి దాన్ని వృద్ధబ్రాహ్మణి ఇంటికి వెంట పెట్టుకుపోయి రత్నాభరణాన్ని చూపించినాడు. ఆకులట రత్నవృత్తాంతము రాణికి చెప్పింది. కొద్దిరోజులకిందట రాణీ చూస్తూ ఉండగా స్వర్ణచూడపక్షి రత్నకరండము ఎగర తన్నుకు పోయింది. రాణి రాజుతో రత్నకరండము పోయిందనీ తిరిగి నగరములో వృద్ధబ్రాహ్మణిగృహములో ఉన్న దనీ చెప్పింది. రాజు నౌకర్లను పంపి రత్నకరండసహితముగా బోధిసత్త్వుణ్ణి కట్టించి తెప్పించినాడు. రాజు బోధిసత్త్వునిదోషములేకపోయినాభరిణెగ్రహించిబంధముక్తుణ్ణిచేయలేదు.

బోధిసత్త్వుడు బంధనములో ఉండి మునికుమారుని స్మరించగా, ఆ అవతార మయిన సర్పము వచ్చి విషయ మంతా తెలిసికొన్నది. "బోధిసత్త్వా! నేను రాజు సిగవరకూ చుట్టుకుంటాను. నీవు వచ్చి విడవమని అనేదాకా విడిచిపెట్టను. ఇక్కడ నీవు "సర్పమునుంచి నేను రాజును విడిపిస్తాను" అని పలికితే అప్పుడు రాజును వదలిపెడతాను. రాజు నీకు అర్ధరాజ్యము అర్పిస్తాడు" అని చెప్పింది. సర్పము సరసరా వెళ్ళి రాజును చుట్టుకొని అతని శిరస్సుమీద మూడుపడగలు ఎత్తుకొని ఉన్నది. ప్రజలంతా 'అయ్యో పాము! అయ్యో పాము! రాజును పాము కరిచింది' అని గగ్గోలు పెట్టారు. బోధిసత్త్వుడు "నేను పాము బారినుండి రాజును విముక్తుణ్ణి చేస్తాను" అని సంకల్పించి పలికినాడు. ఆమాట పరివారజనులు వెళ్ళి రాజుకు చెప్పినారు. రాజు బోధిసత్త్వునితో "సాధూ! నన్ను పాము బాధనుంచి తప్పించు నీకు అర్ధరాజ్యము అర్పిస్తాను" అని శపథము చేసినాడు. అమాత్యులు అంగీకరించారు. బోధిసత్త్వుడు రాజును తక్షణము విడువమని సర్పానికి ఆజ్ఞ ఇచ్చాడు. పాము అతన్ని విడిచిపెట్టింది. రాజు బోధిసత్త్వునికి అర్ధరాజ్యము సమర్పించినాడు. సర్పమునకు శాపము తీరి మునికుమారరూపము రాగా

అని సలహా చెప్పగా అలాగే చేసింది. ఆలోభి మిత్రుడు లోపలికి వచ్చి ఇదేమి టని అడిగినాడు. "నాథర్త కాలము చేశాడు" అని గృహిణి ఏడుస్తూ అన్నది. ఆధూర్తుడు "ఇంతకు ముందు హాయిగా పాయసము వండుతున్నది. భర్త కాటికి కాళ్ళు చాచి సిద్ధముగా ఉంటే భార్య పాయసము వండుతుందా? ఇది టక్కరితనము!" అని ఆలోచించి తినూ వాళ్ళతోపాటు ఏడ్చినాడు. ఈగగ్గోలు విని చుట్టాలు పక్కాలు చేరి ఆలోభిని శ్మశానానికి తీసుకు పోతున్నారు. భార్య మగనిచెవిలో "నిన్ను కాటికి ఈడుస్తారు. ఏమి చెయ్యను? పాయసము మాటేమిటి?" అన్నది "చస్తే చచ్చాను! పాయసాన్ని విడువను. ఆధూర్తుడు మన కొంపలో చేరి పాయసము తాగా లనే కోరికతో ఉన్నాడు. వాడిపని చప్పగా కుదర్చాలి. పాడుప్రాణాలకన్న పట్టెడుఅన్నము ఎక్కువ" అన్నాడు. ఆకృపణుణ్ణి అంతా కలిసి శ్మశానానికి తీసుకుపోయి దహనము చేయ సిద్ధపడగా లోభి పాయసము మీద ఆశ పెట్టుకొని మాట్లాడకుండా ఉన్నాడు. వాడు ప్రాణాలయినా వదిలినాడే కాని పిసినిగొట్టుతనము వదల్లేదు.

ఒక మఠములో ఏకోశానా తెలివి తేటలు లేని బడిపంతులు మకాముగా ఉన్నాడు. ఆమఠములో ఎలుకలవల్ల అతనికి రాత్రివేళ కంటి మీద కునుకు ఉండేది కాదు. అతడు మిత్రునితో ఎలుకలబాధ ఎడతెకుండా ఉన్నా నని చెప్పగా పిల్లిని సంపాదిస్తే ఎలుకలను చంపివేస్తుందని స్నేహితుడు సలహా ఇచ్చాడు. మొదడు లేని ఉపాధ్యాయునికి పిల్లి ఎలా ఉంటుందో తెలియక దాని లక్షణాలు మిత్రుణ్ణి అడగ్గా అతడు "పిల్లికళ్లు గాజువారి ఉంటవి. కపిలధూసరవర్ణము. శరీరమంతా రోమము. వీధిబళ్ళో పిల్లి తిరుగుతూ ఉంటుంది" అని చెప్పినాడు. ఉపాధ్యాయుడు అలాంటి పిల్లి అనే జంతువును లక్షణాలవల్ల కనిపెట్ట దలచి శిష్యుల్ని వీధిబడి వెదికి తెమ్మని పంపినాడు. మార్జాలలక్షణాలతో జంతోలు

ధరించిన వటువు బళ్ళో ఉండగా శిష్యులు వాణ్ణి గురువుగారిదగ్గరికి పట్టి తెచ్చారు. ఉపాధ్యాయుడు తెల్లపోయి "వొరే వీణ్ణి తెచ్చారేమిరా?" అని అడిగితే శిష్యులు "తమరు చెప్పిన లక్షణాలు అన్నీ ఉన్న ఈ మార్జాలాన్ని తెచ్చినాము" అని సమాధానము చెప్పినారు. అందుకు గురువు "బ్రాహ్మణు డెక్కడ? మార్జాల మెక్కడ? మార్జాలము జంతువుగద! దానికి నాలుగుకాళ్ళు ఉంటవి. అదీ పిల్లి!" అన్నాడు. శిష్యులు వటువును విడిచిపెట్టినారు. మూఢులు పరిహాసపాత్రులే కదా!

ఒకమఠములో మతిలేనివాళ్ళందరూ చేరగా అందులో మూర్ఖశిరోమణి పురాణము విని చెరువు తవ్విస్తే పుణ్యము వస్తుందని తెలుసుకొని కొన్నాళ్ళకు ఆగ్రామములో చెరువు తవ్వించినాడు. ఒకనాడు చెరువుకు గండి కనపడగా ఎవరు గండి తవ్వినారో అని కనిపెట్టాడు. ఒకఎద్దు ఆతటాకముదగ్గిరికివచ్చి కొమ్ములతో ఒడ్డును కోరాడింది. ఆవృషభము సాక్షాత్తూ కైలాసగిరినుంచి వేంచేసిందని అతనికి తోచింది. అతడు దానితోక పట్టుకోగా ఆ వృషభము కైలాసానికి వెళ్ళింది. ఆ మూర్ఖశిరోమణి అక్కడ కొన్నాళ్ళపాటు కడుపునిండా భోజనాలు చేస్తూ, ప్రతిరోజూ భూకైలాసాలకు ప్రయాణాలు సాగిస్తున్నాడు. కొన్నాళ్ళకు అతడు బంధువులను చూడాలని మనసుపడి వాళ్ళకు కైలాసమహిమ వర్ణించి చెప్పి వద్దామని సంకల్పించి భూలోకానికి వస్తున్న ఎద్దుతోక గట్టిగా పట్టి మఠానికిచేరినాడు. మిత్రులందరూ అడిగితే అతడు కైలాసములో మోదకభోజనము మహాబాగా ఉన్నదని లొట్టలు వేస్తూ చెప్పినాడు. ఆస్నేహితులు "ఏమోయి! మమ్మల్ని కూడా నీపుణ్యాన కైలాసానికి తీసుకొనిపోయి మోదకాలు తినిపిద్దూ" అని వేడినారు. మర్నాడు మూఢాగ్రేసరు లంతా చెరువుగట్టున పొంగి ఎదురు చూడగా కైలాసమునుండి ఎద్దు వచ్చింది. మూఢశిరోమణి పూర్వానుభవమును పురస్కరించుకొని వృషభపుచ్ఛాన్ని గట్టిగా పట్టుకొన్నాడు. ఆఎద్దు కాళ్ళు

ఒకడూ, మరొకడు దానిమెళ్ళో గొలుసునూ పట్టుకోగా అది ఆకాశానికి ఎగిరింది. ఆనందీశ్వరుడు మూఢజనంతో ఆకాశాన ఎగురుతూ ఉండగా మూర్ఖులు మూఢాగ్రేసరుణ్ణి "మిత్రమా! కైలాసంలో ఎంతెంత మోదకాలు తిన్నావు? నిజము చెప్పవోయి!" అని కోరినారు. వెంటనే వాడు తోకను వదలి పద్మాకారముగా చేతులు అమర్చబోయి కిందపడ్డాడు. వాడితోపాటు అంతా నేలకూలినారు. మూర్ఖుల ప్రశ్నోత్తరాలు ప్రమాదకరాలు.

తెలివితక్కువసన్నాసి ప్రయాణము చేస్తూ తోవతప్పి దాపున ఒకణ్ణి చూచి దారి అడిగితే వాడు "ఈఏటిగట్టున ఆమానుమీదుగా పో" అని చెప్పినాడు. ఆవెర్రివాడు ఆలాగే చెట్టెక్కినాడు. వాడిబరువుకు కొన కొమ్మ వంగి విరిగేందుకు సిద్ధమైనది. కన్నులొట్టపోయి వాడు తప్పించుకొన్నాడు, సరిగా అప్పుడే అక్కడికి మావటివాడు ఎక్కిన ఏనుగు దాహానికి వస్తూ ఉండగా, మూఢుడు బిక్కమొగము వేసి మహాత్మా! నన్ను ఏనుగుమీదికి ఎక్కించి రక్షించు" అని వేడినాడు. మావటివాడు అతన్ని అందుకొనేందుకు చేతి అంకుశాన్ని విడిచి అతని కాళ్ళను తనచేతులతో గట్టిగా పట్టుకొన్నాడు. ఇంతలో మత్తేభము అవతలికి వెళ్ళింది. మావటివాడు చెట్టుమీదివానిపాదాలు విడవలేదు. పైవాడు హస్తికునితో "మావటీ, నీవు పాట పాడగలిగితే, నీపాట విని ఎవరైనా వచ్చి మనల్ని రక్షిస్తారు. ఆలా కాకపోతే మనము ఈనదిలో పడక తప్పదు. చావు మూడింది" అని సలహా ఇచ్చాడు, అప్పుడు మావటి, వృక్షాగ్రముమీద ఉన్న వెర్రిబాగులవాడు సంతోషించే విధమదే కమ్మని కంఠ మెత్తి గానము చేశాడు. చెట్టు మీద ఉన్న మేధావి సంగీతం వింటూ తాళము వేయగా అతనూ మావటివాడూ నదీగర్భములోపడ్డారు. మతితేనివాళ్ళతో స్నేహము కూలుతాడు.

## మృగాంకలేఖా హిరణ్యాక్షులు

హిమసానువులు విజ్ఞానధర్మక్షేత్రములు. హిమాలయప్రాంతమున మహీమండలానికి శిరోరత్నమువంటి కాశ్మీరములో హిరణ్యపురాన్ని కనకాక్షుడనే రాజు పరిపాలిస్తున్నాడు. అతనికి శివానుగ్రహమువల్ల రత్నప్రభాదేవికడుపున హిరణ్యాక్షుడనేకుమారుడు కలిగినాడు. ఆకుమారుడు ఆటగా పాపటగొట్టాన ఉండలు ఊదుతూ ఉండగా ఆతోవనే వస్తున్న తాపసికి ఉండ తగిలింది. ఆమె కోపగించక మందహాసముతో "వత్సా! నీకు యౌవనముననే ఇంత గర్వమైతే, ఇక మృగాంకలేఖను పెళ్ళాడితే పట్టపగ్గా లుంటవా? అనేసరికి ఆరాజపుత్రుడు "ఎవరమ్మా ఆమృగాంకలేఖ?" అని కుతూహలముతో అడిగినాడు. ఆతాపసి "హిమవత్పర్వతప్రాంతాన శశితేజుడనేవిద్యాధరరాజుకుమారి మృగాంకలేఖ. ఆకన్య చక్కనిచుక్క. నీకు అనుకూలమైన భార్య. నీవూ తగిన భర్తవు" అన్నది. హిరణ్యాక్షుడు "ఆసుందరి నాకెలా లభిస్తుంది?" అంటే ఆమె "వత్సా, నేను వెళ్ళి ఆమె అభిప్రాయము కనిపెట్టి నిన్ను తీసుకుపోతాను. నే నీ పట్టణములో అమరేశ్వరుణ్ణి దర్శించేటందుకు అప్పుడప్పుడు వస్తూ ఉంటాను, నేను నీకు అక్కడ కనిపిస్తాను" అని హిమాలయ పర్వతాలదగ్గిరికి గగనమార్గాన వెళ్ళి మృగాంకలేఖతో హిరణ్యాక్షుని గుణగణాలు వర్ణించింది. మృగాంకలేఖ అతనికై తపించి పగలు గడిపి రాత్రి తాపసితో ప్రియునిగురించి మాట్లాడుతూ ఉండేది. హిరణ్యాక్షుడు మృగాంకలేఖమీద వలపువల్ల రాత్రి కలతగా నిద్రిస్తున్నాడు. అతనికి స్వప్నములో గౌరి కనపడి "వత్సా, నీవు విద్యాధరుడవు. ఒక మునీంద్రుని శాపమువల్ల మానుషజన్మ పొందినావు. తాపసీకరస్పర్శవల్ల నీకు మర్త్యత్వము పోయి అమరత్వము ప్రాప్తిస్తుంది. పూర్వజన్మలో నీకు మృగాంకలేఖ ప్రియురాలు. నీవు ఈజన్మలో

ఆమెను వివాహ మాడగలవు. దిగులు పెట్టుకోకు" అని అంతర్ధానమైనది. హిరణ్యాక్షుడు నిద్ర లేచి అమరేశ్వరాలయానికి వెళ్ళి మహేశ్వరునకు ప్రణామము చేసి తాపసిరాకకు ఎదురు చూస్తూ ఉన్నాడు. పార్వతీదేవి మృగాంకలేఖకు కలలో కనపడి హిరణ్యాక్షుని పెళ్ళి చేసుకొంటావు. ఎందుకు వేదన? నీప్రియుడు అసలు విద్యాధరుడు. శాపము వల్ల మనుష్యుడై జన్మించాడు. తాపసీకరము అతనికి సోకితే అమరత్వము వస్తుంది." అని చెప్పింది. ఆమె మేలుకుని స్వప్నవిషయాన్ని తాపసికి చెప్పగా ఆసిద్ధురాలు భూలోకానికి వెళ్ళి అమరేశ్వరునివద్ద హిరణ్యాక్షుని చూచి "కుమారా! వెడదాం రావోయి, విద్యాధరలోకానికి" అని అతన్ని వెంటపెట్టుకొని గగనమార్గాన ప్రయాణము చేసింది.

హిరణ్యాక్షుడు శాపము తీరగా పూర్వజాతిని స్మరించి ఆమెతో "తాపసీ! నేను శీతాచలమున వజ్రకూటనగరిలో అమృతతేజుడు అనే విద్యాధర మహీపతిని. నేను మునిని తిరస్కరించి ఆయన శాపమువల్ల మనుష్యజన్మ ఎత్తినాను. అదీ నాకరస్పర్శవల్లనే నావియోగము సహించలేక చనిపోయిన నాపూర్వప్రేయసి ఈమృగాంకలేఖ. ఇప్పుడు నీతో వచ్చి ఆమెపాణిని గ్రహిస్తాను" అని తాపసితో హిమాచలానికి వెళ్ళినాడు. నగరోపవనములో మృగాంకలేఖ హిరణ్యాక్షుడూ పరస్పరము చూచుకొన్నారు. తాపసి "నీవు ఇతన్నే పెళ్ళాడుతానని నీతండ్రికి తెలియచెప్పు" అనగా ఆకన్య సిగ్గుతో తలవంచి సఖీముఖాన వివాహ వృత్తాంతము తండ్రికి కబురు చేసింది. రాజుకు స్వప్నములో అదివరకే గౌరీదేవి కనపడి చెప్పడమువల్ల అతడు విద్యాధరేంద్రుణ్ణి పిలిపించి పూజించి మృగాంకలేఖను ఇచ్చి పెళ్ళి చేసినాడు. అమృతతేజుడు ఆవధువును పరిగ్రహించి వజ్రకూటానికి వెళ్ళినాడు. అక్కడ అతడు జననీజనకులను అర్చించి హాయిగా ఉన్నాడు. అందువల్ల పూర్వకర్మను అనుసరించి శుభాశుభాలను అనుభవిస్తారు జీవులు.

గోముఖుడు చెప్పిన ఈకథ విని నరవాహనుడు నిద్రాసుఖము అనుభవించినాడు.

## తరంగము: ౬౬

మర్నాడు రాత్రి గోముఖుడు యువరాజుకు ఉల్లాసము కలిగిస్తూ కథ ఆరంభించినాడు :

## పాటలీపుత్ర స్త్రీల వృత్తాంతము

ధారేశ్వరము అనే శైవక్షేత్రములో శిష్యబృందపరివేష్టితుడై ఒకమహర్షి ఉంటున్నాడు. అతడు ఒకసారి శిష్యులను చూచి "మీలో ఎవరైనా అపూర్వవిషయాన్ని చూచిఉంటే చెప్పండి" అనిఅడిగినాడు. ఒక శిష్యుడు ఇలా చెపుతున్నాడు: "కాశ్మీరములో విజయమని శైవక్షేత్రము ఉన్నది. విద్వాంసుడైన సన్యాసి శివునికి ప్రదక్షిణముచేసి పండితులతో వాదించే నిమిత్తము పాటలీపుత్రనగరమునకు బయలుదేరి త్రోవలో నదీనదాలు అడవులు కొండలు అతిక్రమించి చీమ దూరని చిట్టడవిలో చెట్టునీడలో విశ్రాంతి తీసుకొన్నాడు.

చల్లనిఛాయావృక్షముదగ్గిరికి మార్గాయాసఖిన్నుడై దండకమండలు హస్తుడై ఒకధార్మికుడు వచ్చి సన్యాసిని చూచి "మిత్రుడా! నేను విద్యాక్షేత్ర మయిన పాటలీపుత్రమునుంచి కాశ్మీరదేశానికి పండితులతో వాదించి వారిని జయించేందుకు పోతున్నాను" అని చెప్పినాడు. అప్పుడా సన్యాసి "పాటలీపుత్రవాసి అయిన ఇతన్ని జయించలేకపోతే అనేకులను ఎలా ఓడిస్తాను?" అని యోచించి ధార్మికునితో "నీకృత్యము విరుద్ధముగా ఉంది. నీవుచూడబోతే మోక్షకాముని. వ్యసనాశ్రయముకాదా వాదము? వాదపణమువల్ల మోక్షము వస్తుందా? అగ్నిచేత ఉష్ణాన్ని, మంచుచేత శైత్యాన్ని రాతిపడవతో సముద్రాన్ని దాటి అగ్నితో గాలిని ఆర్పవలె నని అనుకొంటున్నావు. విప్రులకు క్షమ, క్షత్రియులకు

ఆర్తిరక్షణ, ముముక్షువులకు శమము, రాక్షసులకు కలహము స్వాభావ ధర్మములు. సంసారవృక్షాన్ని అహంకారముతో నరక లేవు. శాంతిపరశువుతో భవతరువును ఖండించగలవు"అని పలికినాడు. ధార్మికుడుసంతోషించి యతికి నమస్కరించి నీవునాకు ఆచార్యుడవు అంటూ స్వేచ్ఛగా వెళ్ళినాడు. భిక్షువు వృక్షమూలమున సంతోషిస్తూ కూర్చున్నాడు.

కొంత సేపటికి అతనికి భార్యారతిలో ఉన్న యక్షుని ఆలాపము వినపడినది. యక్షుడు పుష్పమాలతో భార్యను కొట్టగా ఆమె మరణమునభినయించింది. చుట్టుపక్కల ఉన్న వాళ్ళు శీఘ్రమే గొల్లుమన్నారు. కొంత సేపటికి యక్షపత్ని చైతన్యము ఉన్నదానివలె కళ్ళు తెరిచి చూడగా యక్షుడు నీ వేమి చూచినావు అని అడిగినాడు. ఆమె అబద్ధాలాడింది. "పూలమాలతో నీవు కొట్టగానే పాశహస్తుడు నిప్పు కళ్ళవాడు పొడుగైన భీకరమైనవాడు, నీల దేహుడు నన్ను యమలోకానికి తీసుకొని పోయినాడు. అక్కడ ఆలోకాధికారులు అతన్ని అడ్డుపెట్టి నన్ను విడిపించినారు." యక్షుడు నవ్వుతూ "స్త్రీమాయ పూలదండతో కొడితే మాఆవిడ యమలోకాన్ని చూశా నంటుంది. అని "నీవుసరిగ్గా పాటలీపుత్ర స్త్రీలవలె ఉన్నావు" అని పలికి కథఆరంభించినాడు.

పాటలీపుత్రనగరిని సింహాక్షు డనేమహీపాలుడు పరిపాలిస్తున్నాడు. అతనిభార్య శుక్లత్రయోదశినాడు మంత్రిపురోహితాది పరిజనులతో సరస్వతీ దర్శనానికి వెళుతూ ఉంటే మధ్యమార్గములో కుంటి గుడ్డి బీదా బక్కా రోగమూ రొష్టూతో ఉన్న వాళ్లు అంతా కలిసి మొరపెట్టినారు. "అమ్మా తల్లీ! రోగిష్టివాళ్ళము; మందూ మాకూ దయచేయించు మహాతల్లీ! సంసారము చంచలము, క్షణసుందరము. ఆది అపార మైనా దీన దయ దీనిసారము. గుణశాలి ఎక్కడైనా జీవిస్తాడు? కడుపునిండా తిన్నవాడికి గారెలు చేదు. శీతబాధ పడేవానికి చందన చర్చ ఎందుకు? రోగిష్టివాళ్ళను ఉద్ధరించుతల్లీ!" మహారాణి రోగులను నీరోగులను

చేసాగి కలిసి సరస్వతీపూజ చేసి నిజమందిరానికి వెళ్ళింది. రోగులు ఆమె దగ్గరకు వచ్చారు. రాణి వాళ్ళకు వైద్యము చేయించింది. నగరనారీమణులు తమభర్తలను ప్రేరేపించి రోగులకు వైద్యము చేయించారు.

రోగులతో సహవాసమువల్ల స్త్రీల చిత్తాలు కామవికారము చెందినవి. వారిసాంగత్యమువల్ల కలిగిన దంతక్షతాదులను రాజప్రభృతులు చూచి ఒకరితో ఒకరు చెప్పుకొన్నారు. రాజు అంతఃపురానికి వెళ్లి రాణితో "నఖక్షతములూ దంతక్షతాలూ ఎలా వచ్చినవి? నిజము చెప్పు. చెప్పకపోతే ప్రమాదము" అని స్నేహమూ భయమూ ప్రకటిస్తూ అడిగినాడు. రాజపత్ని కృత్రిమంగా "చెప్పరానిదయినా ఒకఆశ్చర్యాన్ని చెపుతాను. ఈఎదట ఉన్న గోడలోనుంచి రాత్రులు చక్రగదాధరుడు బైటికి వచ్చి నాతో ఉండి తెల్లవారుజామున గోడలో అంతర్ధానము అవుతున్నాడు. అసూర్యంపశ్య నైన నన్ను ఈ పురుషుడు ఇలా చేస్తున్నాడు. అందువల్ల నాశరీరముమీద నఖక్షతాలూ, దంతపుగాట్లూ పడినవి" అని విచారము అభినయిస్తూ అన్నది. అది విని ఆమూర్ఖ మహారాజు విష్ణుమాయ కాబోలని నమ్మి తన మంత్రులకు సంగతి చూపుతూ చెప్పివేసినాడు. అమాత్యులంతా అతని మాటలు నమ్మినారు. యక్షుడు "కులటలు భర్తల్ని మోసగిస్తారు. అలాగే నీవూ నన్ను వంచించలేవు"అని భయపెట్టినాడు.

ఆ విషయ మంతా వృక్షమూలమున ఉన్న సన్యాసి విని అంజలి ఘటించి యక్షునితో "భగవాన్, ఇక్కడ ఆశ్రమవాటికలో నీమాటలు విన్నాను. ఆదోషాన్ని క్షమించు" అని విన్నవించినాడు. సన్యాసి సత్యవాక్యానికి సంతుష్టుడై యక్షుడు "వరము కోరుకో" అనగా భిక్షువు "నీభార్యమీద కోపము మాను. ఇదే వరము" అని కోరినాడు. యక్షుడు అందుకు అంగీకరించి సన్యాసిని మరోవరము కోరుకో" మనగా పరివ్రాజకుడు "ఇది మొదలు నన్ను మీరు కుమారునిగా చూచుకొనండి. ఇదే

నాఅభీష్టము'' అనగా యక్షదంపతులు ప్రత్యక్షమై సరే అని చెప్పి "కుమారా! మా అనుగ్రహము వల్ల నీకు కష్టాలు కలగవు. జగడములో, ద్యూతములో, వాదములో జయశీలుడవు అవుతావు'' అని వరమిచ్చి అంతర్ధాన మయినారు. భిక్షువు యక్షునికి నమస్కరించి తిరుమూలమున ఆరాత్రి గడిపి మర్నాడు పాటలీపుత్రములో రాజస్థానమునకు వెళ్ళి పండితులను వాదములో యక్షానుగ్రహమువల్ల జయించినాడు. ఆభిక్షువు రాజసన్నిధిలో పండితులలో "గోడలోనుంచి చక్రగదాధరుడు ఉద్భవించి నన్ను గోళ్ళతో దంతాలతో నొక్కి అనుభవించి మళ్ళా గోడలో లయిస్తున్నాడు. దీని సారాంశము చెప్పండి'' అని అన్నాడు. పండితులు పరమార్థము ఎరగక మొహామొహాలు చూసుకొని నోరెత్తలేదు. రాజు "నీవు అడిగిన ప్రశ్నకు నీవే సమాధానము చెప్పాలి'' అనగా భిక్షువు రాజమహిషీవృత్తాంతము విశదముగా చెప్పినాడు. రాజు స్త్రీవ్యసనము మాని అర్ధరాజ్యము యతికి దానము చేస్తానన్నాడు. యతి స్వదేశాభిలాషవల్ల రాజ్యము స్వీకరించక రత్నరాశిని గ్రహించి కాశ్మీరదేశానికి వెళ్ళిపోయినాడు.

ఈవిషయాన్ని మునీంద్రుడు శిష్యునివల్ల విని శిష్యకోటిసహితముగా అద్భుతపడ్డాడు.

గోముఖుడు నరవాహనదత్తునకు మరొక కథ చెపుతున్నాడు.

## ఏ కా ద శ మా రి ణి క థ

మాళవదేశములో ఒకగ్రామములో ఒకకుటుంబీకునికి ముగ్గురు కుమాళ్లు, ఒక్కతే కుమార్తె కలిగినారు. కుమారి పుట్టడముతోటే తల్లి కాలము చేసింది. మరికొంతకాలానికి ఇద్దరుకొమాళ్లూ చనిపోయినారు. తండ్రి కుమార్తెకు త్రిమారిక అని అర్థవంతముగా నామకరణము చేసినాడు. ఆకుమార్తెకు వయసు రాగా తండ్రి పిల్లను ధనికునికిచ్చి

అగచాట్లు పాలవుతూ ఉండగా అతడు వింధ్యవాసినీదేవిదగ్గర దర్భాస నముమీద కూర్చుని తపస్సు చేశాడు. అర్థాసక్తితో తపస్సు చేయు డమువల్ల దేవి అతనికి స్వప్నములో సాక్షాత్కరించి "వత్సా, లే! ఎప్పుడూ ఎద్దు నీఆస్తిగా ఉంటుంది. దాన్ని అమ్ముకొని జీవయాత్ర చెయ్యి" అని చెప్పింది. మేలుకొని అతడు ఉదయాన కొంచెము పారణచేసి గృహోన్ముఖు డయినాడు. ఆచేతకానివాడు ఎద్దును అమ్మి జీవించలేనని అమ్మలేకపోతున్నాడు. ఒకమిత్రుడు "ఒరే, తిండిలేక ఎండి పోతున్నావు. స్వప్నములో నీకు దేవి కనపడి ఎద్దును అమ్మి జీవించ మన్నది. అది గ్రహించకుండా ఉన్నావేమి? దేవతానుగ్రహము వల్ల నీవు ఒక ఎద్దును అమ్మితే మరొకవృషభము రావచ్చును" అని సలహా చెప్పినాడు. ఆప్తవాక్యము విని అతడు అలాగే ఎద్దును అమ్మి సిరిసంప దలు సుఖభోగాలు అనుభవించినాడు. సత్త్వవంతుణ్ణి సిరిసంపదలు ఆశ్రయిస్తవి. నీరసుడు నిత్యదరిద్రుడు.

దక్షిణా పథములో ఒక రాజ్యములో పరులను మోసము చేసి జీవించే ఒకవంచకుడు దురాశతో "ఆహారమాత్రానికి ఈధూర్తవ్యా పార మెందుకు? ఉన్నన్నాళ్ళూ కాలిమీద కాలు వేసుకొని కడు పులో చల్ల కదలకుండా జీవించే నిమిత్తము బాగా ధనార్జన చేయాలి" అని ఆలోచించి గొప్పవర్తకునివేషము వేసి రాజు మొగసాలకు వెళ్ళి ప్రతీహారునిద్వారా లోపలికి మనవి పంపి రాజుకు కానుక అర్పించి "దేవా, తమతో ఏకాంతమున ఒకటి మనవి చెయ్యాలి" అని కోరగా మహారాజు అతనివేషభాషలు చూచి ఎవడో గొప్పవాడని భ్రమ పడ్డాడు. ఆధూర్తుడు రాజుతో "దేవా! ప్రతీరోజూ కొలువులో కొంతసేపు అందరి సమక్షములో నాతో మీరు సంభాషించవలె. అందుకోసము మీకు రోజుకు ఏడు వందల బంగారుటంకాలు కానుక ఇస్తాను" అని విన్నవించుకొన్నాడు. "ఏడువందల టంకాలు శ్రమపడ

కుండా కోశాగారములోకి వస్తూ ఉంటే ఎందుకు పోగొట్టాలి'' అని రాజు ఆలోచించి ధూర్తునితో సంభాషించడానికి అంగీకరించినాడు. అప్పటినుంచీ దినదినమూ రాజు బంగారము పుచ్చుకొంటున్నాడు. లోకులు ధూర్తుణ్ణి మంత్రిగా తలచినారు. కొంతకాలము గడచిన తరువాత సభలో ఒక అధికారముఃఖము చూచి ధూర్తుడు సాభిప్రాయముగా మహారాజుతో సంభాషిస్తూ ఉన్నాడు. గోష్ఠి ముగిసినతర్వాత అధికారి ధూర్తునితో "నాసంగతి నీవు రాజుతో ఏమని చెప్పావు?" అని అడిగినాడు. అతడు "నీవు రాజ్యాన్ని అపహరించ దలచినట్టు తెలిసి రాజు చాలా కోపంగా ఉన్నాడు. అందుకు నీమొగము చూచాను. నేను ఆయన కోపాటోపాన్ని శాంతింప చేస్తాను.'' అని పలికినాడు. ఆఅధికారి వంచకుని మాటలు నిజమని నమ్మి ఇంటికి వెళ్ళి భయముతో వెయ్యివరహాలు అతనికి లంచ మిచ్చినాడు. మర్నాడు యథాప్రకారముగ ధూర్తుడు, రాజుతో కొంతసేపు మాటాడి వెళ్ళేటప్పుడు దగ్గిరికి వచ్చిన అధికారితో "మిత్రమా యుక్తిపలికి రాజును ప్రసన్నుని చేశాను. బెంగపడకు. ధైర్యముగా ఉండు. ఏఆపద వచ్చినా నిన్ను కాపాడుతాను అని'' అప్పటినుంచి అధికారి ధూర్తుణ్ణి సేవిస్తున్నాడు. వంచకుడు సామంతుల దగ్గిరా సేవకులదగ్గిరా రకరకాల మోసాలుచేసి అయిదుకోట్ల ధనము ఆర్జించి, ఒకనాడు ఏకాంతములో "ప్రభూ! ప్రతిదినమూ నీకు ఏడువందల బంగారుటంకాలు ఇస్తూ నేను అయిదుకోట్లు ఆర్జించినాను. ఇవిగో తీసుకో'' అని ఆసొమ్ము రాజు ముందు పెట్టినాడు. రాజు సగభాగము తీసుకొని మిగతాసొమ్ము అతనికి ఇచ్చి అతనినే అమాత్యుని చేసినాడు. వంచకుడు సిరిసంపదలు అనుభవిస్తున్నాడు. నుయ్యి తవ్వేవాడికి ధనరాశి దొరికినట్టు ప్రాజ్ఞుడు విశేష పాపము చెయ్యకుండా ధనము ఆర్జిస్తాడు.

గోముఖుడు మరొక కథ యువరాజుకు చెప్పసాగినాడు.

## హేమప్రభా లక్ష్మీసేనుల కథ

రత్నాకరనగరాన్ని అరిలోకభయంకరుడైన బుద్ధిప్రభ మహీపాలుడు పరిపాలిస్తున్నాడు. అతని కుమార్తె హేమప్రభ శాపము వల్ల విద్యాధరలోకభ్రష్టయై బుద్ధిప్రభుని మందిరములో జన్మించింది. భూలోకములో ఆమె విద్యాధరి కనుక ఆకాశగమనము అలవాటై ఆ అలవాటుకు బదులు ఎప్పుడూ ఉయ్యాల ఊగుతూ ఉంటుంది. "అమ్మాయీ! కింద పడతావు! ఊగవద్దని రాజు నిషేధించినా హేమప్రభ ఆయనమాట తోసివేసింది. వెంటనే తండ్రి కుమార్తెదవడమీద లెంపకాయ కొట్టినాడు. అంతమాత్రానికే హేమప్రభకు రోషమువచ్చి వన విహారార్థము అనేమిష పెట్టి ఉద్యానవనికి వెళ్ళింది. అక్కడ పరిజనులు మధుపానమువల్ల మత్తులై ఉండగా ఆరాజకన్య చెట్లగుబురులమాటున తప్పించుకొని పోయి కారడవిలో పర్ణశాల ఏర్పాటు చేసుకొని కందమూలాదులు తింటూ మహేశ్వరుణ్ణిగూర్చి తపస్సు చేస్తున్నది. తండ్రి కుమార్తెకోసము వెతికి వెతికి మహారణ్యములో తపస్సులో ఉన్న హేమప్రభను చూచినాడు. తండ్రిని చూచి తనయ లేచి ప్రణామము చేయగా, అతడు కన్యనుఒళ్లో కూర్చోబెట్టుకొన్నాడు. చిరకాలానికి ఒకరు ఒకరిని చూచుకొని అడవిలో జంతువులుకూడా ఏడ్చేటట్టు దుఃఖించినారు. కొంతసేపటికి రాజు హేమప్రభను ఓదార్చి "అమ్మాయీ! రాజ్యలక్ష్మిని వదలి వనవాస మెందుకమ్మా? మీ అమ్మదగ్గిరికి రా తల్లీ!" అని పిలిచినాడు. రాజకన్య తండ్రితో "నాయనా, దైవము నన్నిలా చేశాడు. నేనేమీ చెయ్యలేను. అరణ్యవాససుఖాన్ని వదిలి నగరవాసము చెయ్యలేను" అన్నది. తండ్రి ఎన్ని విధాల చెప్పినా కుమార్తె వినలేదు. అప్పుడా రాజు హేమప్రభ కోసము వనములో నివాసమందిరాన్ని కట్టించి అతిథి పూజార్థము

కావలసిన సామగ్రిని పంపుతూ ఉన్నాడు. హేమప్రభ ఆవస్తువులతో అతిథి పూజ చేస్తున్నది. తాను ఫలహారము చేస్తున్నది.

ఇలా ఉండగా హేమప్రభ ఆశ్రమానికి కుమారబ్రహ్మచారిణి రాగా ఆమె సత్కారములు యథావిధిగా జరిగినవి. హేమప్రభ తాపసిని "అమ్మా, నీవు సన్యసించా వెందుకు? కారణము చెప్పవా?" అని అడగగా ఆబ్రహ్మచారిణి "నేను కన్యగా మా తండ్రిదగ్గర ఉన్నప్పుడు ఒకనాడు ఆయన కాళ్ళు పట్టమన్నాడు. నేను పాదసంవాహనము చేస్తూ ఉండగా మత్తు వచ్చి తూలితే నిద్రపోతున్నావా? అంటూ నన్ను తన్నినాడు. అందుకు కోపగించి నేను ఇల్లు విడిచి సన్యాసాశ్రమము స్వీకరించాను" అని చెప్పింది. ఈసంగతివిని హేమప్రభ సన్యాసినిని సమానశీలగా గ్రహించి తన సంగతి ఆతాపసికి తెలియజెప్పింది. ఉభయులూ వనవాస సఖులుగా ఉన్నారు.

ఒకనాడు రాజకన్య పరివ్రాజికతో "చెలీ! గడిచినరాత్రి కలలో పెద్ద నదిని దాటి శీతాచలము అధిరోహించి అర్ధనారీశ్వరుణ్ణి చూచి అపరమేశ్వరుని సమక్షములో ఒక సుందరుడు వీణ వాయిస్తూ ఉండగా చూచి నీతోకూడ ఆకాశానికి ఎగిరినాను. ఇలా కల వచ్చి మెళుకువ వచ్చింది. తెల్లవారింది" అని చెప్పింది. తాపసి హేమప్రభ చెప్పిన స్వప్నవృత్తాంతాన్ని విని "కల్యాణీ! శాపవశాన నీవు ఈలోకాన జన్మించావు. ఈస్వప్నము నీశాపముక్తిని తెలియజేస్తున్నది" అన్నది. రాజకన్య సఖివచనానికి సంతోషించింది. జగజ్జ్యోతి అయిన సూర్యుడు ఉదయాచలశిఖరాన్ని అలంకరించగా ఒకరాజపుత్రుడు అశ్వము దిగి వచ్చి తాపసీవేషములో ఉన్న హేమప్రభను చూచి నమస్కరించినాడు. హేమప్రభ అతనికి అతిథి పూజ చేసి ఉచితాసనము ఇచ్చి అతడు ఆసీనుడు కాగా అతని వృత్తాంతము కుతూహలముతో అడిగింది.

రాజపుత్రుడు ఇలా చెప్పినాడు. "కల్యాణీ! ప్రతాపసేనుడనే

పార్థకనాముడు పుత్రులకై శివపూజ చేయగా మహేశ్వరుడు ఆయనకు సాక్షాత్కరించి "రాజా! శాపగ్రస్తు డయిన విద్యాధరుడు నీకు పుత్రుడై పుట్టి శాపమోచనము అయినతరువాత విద్యాధరలోకానికి వెళ్ళుతాడు. రెండోకుమారుడు కులదీపకుడు అవుతాడు" అంటూ వరమిచ్చినాడు. రాజు సంతుష్టాంతరంగుడై యథావిధిగా పారణచేసినాడు. కొంతకాలానికి లక్ష్మీసేన శూరసేనులు అనే కుమారుళ్ళు పుట్టినారు. నేను నేటకై వచ్చిన లక్ష్మీసేనుణ్ణి"

హేమప్రభ తన సంగతి అతనికి చెప్పి జాతిస్మరణ కలదై అతనితో "మహాత్మా! నీదర్శనమువల్ల నాకు జాతిస్మరణ కలిగింది. నేను విద్యాధరిని. శాపమువల్ల ఈలోకములో పుట్టినాను. ఈమె నాచెలి, నీవు నాప్రియుడవు. నీఅమాత్యుడు నాసఖికి ప్రియుడు. మాఇద్దరి శాపాలూ క్షీణించినవి. మనందరికీ విద్యాధరలోకములో మళ్ళీ సమాగమము సంప్రాప్త మవుతుంది" అని హేమప్రభ చెప్పి సఖితో దివ్య రూపముతో గగనమార్గాన నిజలోకానికి వెళ్ళిపోయింది.

లక్ష్మీసేనుడు తెల్లపోయి చూస్తూ ఉండగా అతని మంత్రి కూడా వచ్చినాడు. అతడు అమాత్యునితో జరిగిన దంతా చెవుతూ ఉండగా బుద్ధిప్రభ మహారాజు కుమార్తెకై అన్వేషిస్తూ అక్కడికి వచ్చినాడు. కుమారి కనపడకపోవడమువల్ల రాజు లక్ష్మీసేనుణ్ణి అడిగినాడు. రాజపుత్రుడు జరిగిన దంతా అతనికి చెప్పినాడు. బుద్ధిప్రభుడు దుఃఖిస్తూ ఉండగా లక్ష్మీసేనుడికి శాపావసానము కలిగింది. వెంటనే అతడూ మంత్రీ విద్యాధరలోకానికి వెళ్ళిపోయినారు. లక్ష్మీసేనుడు హేమప్రభను వివాహమాడి భూలోకానికి వచ్చి బుద్ధిప్రభుణ్ణి దర్శించినాడు. అల్లుడు మామ దగ్గిర సెలవు తీసుకొని తన నగరానికి వెళ్ళి జనకుడైన ప్రతాపసేనునికి తన సంగతి యావత్తూ చెప్పినాడు. లక్ష్మీసేనుడు తన రాజ్యమును తమ్ముడు శూరసేనునికి అప్పగించి విద్యాధరలోకానికి

వెళ్ళిపోయినాడు. లక్ష్మీసేనుడు హేమప్రభతో విద్యాధరైశ్వర్యాన్ని అనుభవించినాడు. ఇలా నరవాహనదత్తుడు గోముఖునివల్ల చిత్ర విచిత్ర కథలను వింటూ శక్తియశను వివాహము చేసుకోవాలె నని ఉత్కంఠతో ఉన్నప్పటికీ ఆరాత్రి క్షణముగా గడపినాడు.

ఇలా ఆరాజపుత్రుడు దినములు లెక్కపెట్టుకొంటూ ఉండగా ఒక సారి ఆకాశమునుంచి విద్యాధరబలము వచ్చింది. విద్యాధరప్రభువు స్ఫటికయశుడు తనకుమార్తె శక్తియశను నరవాహనునికి సమర్పించ డానికి వస్తున్నాడు. నరవాహనదత్తుడు మామగారికి అతిథిసత్కారాలు ఆచరించినాడు. విద్యాధరరాజేంద్రుడు తాను వచ్చిన కార్యము అత నికి తెలియజెప్పి, నిజశక్తిప్రభావమువల్ల నిమేషకాలములో వివాహ సన్నాహము చేయించినాడు. మామ అల్లుణ్ణి రత్నాభరణాలతో అలం కరించి తనకుమార్తె శక్తియశను ఇచ్చి వివాహము చేసినాడు. నర వాహనదత్తుని విద్యాధర రాజపుత్రి శక్తియశ పరిణయమాడి సూర్యా లోకము పొందిన నళినివలె శోభతో ప్రకాశించింది. మామ స్ఫటిక యశుడు నిజనగరికి వెళ్ళినాడు. శక్తియశ వదనపద్మమునకు నర వాహనదత్తుడు మత్తమధుపమై సుఖముగా ఉంటున్నాడు.

## వేలాలంబకము.

### తరంగము : ౬౭

నమ తాశేష విఘ్నౌఘ
వారణం వారణాననమ్
కారణం సర్వసిద్ధీనాం
దురితార్ణవ తారణమ్.

నరవాహన దత్తుడు శక్తియశ, మదనమంచుక మొదలైన ప్రియు

రాళ్ళతో మిత్రులతో కాలక్షేపము చేస్తూ కౌశాంబీనగరములో వత్స రాజు దగ్గిర ఉంటున్నాడు. ఒకనాడు నరవాహన దత్తుడు ఉద్యాన ములో ఉన్నప్పుడు పర దేశీయులు ఇద్దరు సోదరులువచ్చి అతిథి సత్కా-రాలు పొంది తమ వృత్తాంతము నివేదించినారు. దేవా, వైశాఖపుర పాలకులము రాజపుత్రులము, సవతికుమారులము. నన్ను రుచిరదేవు డనీ ఇతన్ని పోతకుడు అనీ అంటారు. నాదగ్గిర జవశీల అనే పిడీఏనుగు ఇతనిదగ్గిర వేగముగా వెళ్లే రెండుగుర్రాలూ ఉన్నవి. వీటి విషయ ములో మాకు తగాదా వచ్చింది. నా పిడీఏనుగ ఎక్కువని నావాదము నాజోడుగుర్రాలు వేగంగా పోతవని ఇతని పట్టు. నిజానిజాలు స్వామీ మీకు తెలియాలి. దేవా, మీరు మామందిరానికి దయచేసి ఈపరీక్ష చేసి యథార్థము చెప్పండి. దూరదేశమునుంచి యాచకులమై వచ్చాము. అర్థిజనులకోరిక తీర్చవేడుతున్నాము." అని రుచిరదేవుడు ప్రార్థించగా నరవాహనదత్తుడు అందుకు అంగీకరించి రుచిరదేవుడు తెప్పించిన రథాన్ని ఎక్కి వాళ్ళతో వైశాఖపురము వెళ్ళినాడు. పురనారీ మణులు నరవాహనదత్తుని సుందరాకారము చూచి అపరమన్మథు డని వర్ణించడము మొదలుపెట్టినారు. మార్గములో నరవాహనుడు అలిసినా మన్మథుని దేవాలయము కనపడడమువల్ల శ్రమమరిచి మన్మ థునికి నమస్కరించి విశ్రమించినాడు. అతడు రుచిరదేవుని మందిరానికి వెళ్లి అతనివల్ల అతిథిసత్కారములు పొంది ఉత్తమ గజాశ్వములతో ఉన్న అతని గృహముచూచి చాలా సంతోషించినాడు. అక్కడ అతడు రుచిరుని చెల్లెలిని లోకసుందరిని వీక్షించగా అతని మనసు ఆమె రూపమునే ధరించింది. నరవాహనదత్తుడు నవవధువు అయిన శక్తి యశను విడిచి ప్రవాసములో ఉన్నప్పటికీ విరహాన్ని తలచకుండా ఉన్నాడు. ఆకన్య నిజ దృష్టిమాలికతో స్వయంవరము చేసింది. రాత్రి నరవాహనుడు జయేంద్రసేన అనే ఆకాంతను తలపోస్తూ గడిపినాడు.

మరున్నాడు వాయువేగముతో వెళ్ళే జోడుగుఱ్ఱాలను పోతకుడు తీసుకొని రాగా అతడు రుచిరదేవుని పిడివమనగను ఎక్కి అశ్వాలను జయించినాడు. నరవాహనుడు అభ్యంతరమందిరములో ఉండగా వత్సేశుడు పంపిన దూత వచ్చి "స్వామిన్! మీరిక్కడికి వచ్చింది మీతండ్రిగారికి తెలియక నన్ను వెతకమన్నారు. చెప్పకుండా ఇంతదూరము ఉద్యానవనమునుండి వెళ్ళినారట. మాఅందరికీ దిగులుగా ఉంది. మీరు వెళ్ళిపోవడము" అని చెప్పినాడు. నరవాహనదత్తుడు ప్రియాసమాగమానికి ఉవ్విళ్ళూరుతూ ఆందోళిత మనస్కుడు అయినాడు.

ఆసమయములో అక్కడికి ఒకవణిక్కుమారుడు వచ్చి ఆనంద కందళిత హృదయుడై దూరమునుంచి నరవాహదత్తునికి నమస్కరించి "వీరాగ్రేసరా, విజయాభవ నవమన్మథా! భవిష్యద్విద్యాధర చక్రవర్తీ! మానసము హరించినావు! శత్రువులకుభీతి కలిగిస్తున్నావు. ప్రభూ! శీఘ్రమే బలివిజయముచేసి ఆకాశము ఆక్రమించే అఖండ గుణశాలివి; నిన్ను దేవతలు చూస్తారు" అని ప్రస్తుతించి, యువరాజువల్ల సత్కారములుపొంది స్వప్నవృత్తాంతము ఇలా మనవిచేసినాడు.

భూదేవీ శిరోమణి అనతగిన లంపానగరములో కుసుమసారుడు అనే వర్తకునికి శివానుగ్రహమువల్ల నేను చంద్రసారుడనే నామముతో జన్మించినాను. స్నేహితులతో నేను ఉత్సవాన్ని చూచే నిమిత్తము పట్టణానికి వెళ్ళి అక్కడ అర్థికోటికి దానమిచ్చే మహాదాతలను చూచినాను. నాకు ఆధనసంచయాన్ని చూడగా ధనార్జనమీద మనసు కలిగింది. ద్వీపాలన్నీ తిరగవలె నని నవరత్నరాసులతో నిండిన నావ ఎక్కినాను. గాలి అనుకూలముగా ఉండగా నానావ ఒకలంకను చేరింది. అక్కడ నేను గుట్టుగా రత్నవ్యాపారము చేస్తున్నాను. ఆరాజు అర్థలోభమువల్ల నన్ను దోచి చెరలో పెట్టినాడు. ఆకారాగారములో నేను దుష్టుల సాంగత్యముతో కొన్నాళ్ళపాటు ఉండగా మా

వంశమర్యాదలు ఎరిగిన మహీధరు డనే వ్యాపారి నాసంగతి రాజుతో "దేవా, లంపానగరవాసి యీవణిక్పుత్రుడు దోషము చేయలేదు. పాపము, ఇతన్ని ఖైదులో పెట్టినారే" అని పలికినాడు. రాజు నన్ను విడిపించి గౌరవించినాడు. అక్కడ నాకు రాజాశ్రయము, మిత్రసహాయము లభించగా చాలాకాలము సుఖంగా వ్యాపారము చేశాను. ఒకనాడు వనయాత్రాసందర్భములో ఒక వైశ్యపుత్రిని కందర్ప దర్పసాగరలహరి వలె ఉన్నదానిని చూచి మనసు తగులగా దాని తండ్రిదరిచేరి ఆకన్యను ఇవ్వమని కోరినాను. ఆవైశ్యుడు కొంతసేపు ఆలోచించి "స్వయంగా నేను ఇవ్వను. అందుకు కారణము లేకపోలేదు. ఈకన్యను సింహళ ద్వీపానికి తాతగారింటికి పంపుతాను. నీవు అక్కడికి వెళ్ళి ఈకన్యను పెళ్ళాడు. నీకు కన్యాలాభము కలిగే రీతిగా సందేశము పంపుతాను" అనిపలికి గౌరవించి పంపినాడు. మర్నాడు వైశ్యుడు కుమారిని ఓడలో ఎక్కించి సముద్రముమీద సింహళదేశానికి పంపినాడు. నేనుకూడా లంకకు పోవ యత్నించగా ఆసింహళములో పిడుగుకన్న భయంకరవార్త చెవియలు దేరింది. "శిఖరునికుమార్తె ఎక్కిపోతున్న ఓడ సముద్రములో మునిగింది. ఒక్కప్రాణి కూడా బతికి బయట పడలేదని తెలిసింది. ఆకబురు విని దిగులుపడి నేను విచారములో కుంగిపోగా కొందరు పెద్దలు నన్ను ఓదార్చగా సమాధానపడి సింహళానికి వెళ్ళ సంకల్పించాను. నావ నెక్కి కొంతమేర ప్రయాణము సాగించగా ప్రతికూల దైవమువలె గాడుపు చెలరేగింది. నావ పగిలిపోయింది. నాసొమ్ము పోయింది, పరివారజనము నీళ్ళపా లయినారు: నేను సముద్రములో పడిపోయినాను. విధివశాన కొయ్య చేతికిచిక్కింది. దైవము అనుకూలమై చాచినబాహువువంటి ఆకొయ్యపట్టుకొని సముద్రతీరము చేరినాను. వేలా ప్రదేశములో తిరుగుతూ ఉండగా దైవవశాన బంగారుకడ్డీ దొరికింది. అది పుచ్చుకొని చెంతనే ఉన్న పల్లెటూరికి వెళ్ళి దాన్ని విక్రయించి

"యమునా! ఈపిల్లను జాగ్రత్తగా చూడు" అని నాకు అప్పజెప్పినాడు. సముద్ర వేలాతటమునుంచి తెచ్చిన కన్య కనుక వేల అని ఆమెకు పేరు వచ్చింది. ఆపిల్లమీద నాపంచప్రాణాలూ ఉంటవి. బ్రహ్మచర్యములో ఉన్నా నన్ను సంసారము బాధిస్తున్నది. వేల నీపూర్వజన్మపత్నిగా నేను దివ్యజ్ఞానమువల్ల గ్రహించి నీదగ్గిరికి వచ్చాను. ఈకన్యను స్వీకరించు. మీరు అనుభవిస్తున్నకష్టాలు గట్టెక్కుతవి" అకాలవృష్టివంటి ఆమె మాటలు నాబాధపోగొట్టినవి. నేను మున్యాశ్రమము చేరగా, యమునా దేవిప్రేరణవల్ల మునీంద్రుడు వేలాదేవిని నాకిచ్చి పెళ్ళిచేసినాడు.

వేలతో కొంతకాలము సుఖముగా ఉంటూ ఒకసారి ప్రియురాలితో కలసి చెరువులో జలక్రీడలు చేస్తూ మతంగమహర్షిమీద నీళ్ళు చల్లినాము. అప్పుడా మునీంద్రుడు కోపముతో నీకు ప్రియావియోగము కలుగుగాక అని శాపము ఇచ్చినాడు. వేల దీనముగా మహర్షిపాదాల మీద వాలగా అతడు "చంద్రసారుడా! విద్యాధరచక్రవర్తి అయిన నరవాహనదత్తుడు గజవేగముచేత అశ్వయుగ్మమును గెలువగా నీవు చూడడము సంభవిస్తే నీశాపము తీరిపోతుంది. నీవు ప్రియురాలిని కలుసుకొంటావు" అని అనుగ్రహించి స్నానముచేసి శ్వేతద్వీపానికి గగనమార్గాన వెళ్ళినాడు.

యమున లేత మామిడిమొక్కను నా కిచ్చి శ్వేతద్వీపానికి వెళ్ళిపోయింది. నేను కొన్నాళ్ళు భార్యతో ఉండి వనవాసమువల్ల విసిగి వియోగానికి వెరచి స్వదేశానికి వెళ్ళవలెనని సముద్రతీరానికి వెళ్ళి పడవ చూచి మొదట భార్యను ఎక్కించి నేను ఎక్కడానికి ప్రయత్నిస్తూ ఉండగా మునిశాపమువల్ల గాలి వీచింది. నావ దూరముగా వెళ్ళిపోయింది. ప్రియావియోగమువల్ల నాకు మూర్ఛ వచ్చింది. ఒక మునీంద్రుడు నాఅవస్థ చూచి నన్ను తన ఆశ్రమానికి తీసుకొనిపోయినాడు. నాకు శాపాంతసమయము రాగా అతడు తెలుసుకొని నాకు చెప్పినాడు. నేను

సముద్రప్రయాణము చేసి నావ మునగడమువల్ల తీరము చేరి వర్తక మిత్రునితో కలిసి ప్రియురాలిని అన్వేషిస్తూ అనేక కష్టాలపాలై చివరకు ఈ వైశాఖపురానికి వచ్చి నిన్ను చూచాను. అందువల్ల నా శాపము తీరిపోయింది. కొంతసేపటికి నాస్నేహితులైన భేహారులు నాప్రియు రాలిని వెతికి తెచ్చి నాకు అప్పగించినారు. నాశాపమోచనకారణము నీవే కనుక నీదర్శనానికి వచ్చాను. నేటికి నాకష్టాలు గట్టెక్కినవి. నేను ప్రియాసహితముగా స్వదేశానికి వెళ్ళుతాను.

ఈప్రకారంగా చంద్రసారుడు స్వవిషయము నివేదించి కృతార్థుడై పోయిన తరువాత రుచిరదేవుడు నరవాహనదత్తునికి సవినయముగా తన చెల్లెల్ని జయేంద్రసేనను గజాశ్వయుగ్మసమేతముగా అర్పించినాడు. నరవాహనదత్తుడు ప్రియురాలిని తీసుకొని రుచిరదేవుణ్ణి వీడ్కొని స్వీయ రాజధానికి కౌశాంబీనగరానికి వెళ్ళి మదనమంచుకాది దివ్యకాంతలతో ఇహలోకభోగా లనుభవిస్తూ ఆనందకందళితాంతరంగుడు అవుతున్నాడు.

## శ శాం క వ తీ లం బ క ము

### త రం గ ము : ౯౨

అవ్యా ద్వో విఘ్నవిధ్వంస
కీర్తిస్తమ్భ మి వోత్క్షిపన్
కరం గణపతిః క్రీడా
లీనభృఙ్గాఙ్క రావలిమ్!

అరాగ మపి రాగాఢ్య
రచనాచతురం పరమ్
హారం నవనవాశ్చర్య
సర్గచిత్రకరం నుమః

జితం స్మరశరై ర్యేషు
పౌష్పై స్వపి వత త్స్వహో
వజ్రాదీ స్వపి జాయన్తే
కుణ్ఠితా స్యేవ తద్భృతాన్.

నరవాహనుడు చాలామంది భార్యలతో ఉన్నప్పటికీ మదనమంచుకాదేవిని ప్రాణాధికముగా ప్రేమిస్తూ కౌశాంబిలో నివసిస్తూ ఉండగా రాత్రి ఎవరో దేవత గగనమార్గాన వచ్చి అతన్ని తీసుకొని వెళ్ళినట్టుగా కల వచ్చింది. అతడు మెళుకువ రాగానే తాను శీతాచలసానువున తరుచ్ఛాయలో గరుడపచ్చల వేదికమీద ఉన్నట్టు తెలుసుకొన్నాడు. ఆదివ్యకన్య తన కాంతిచేత గిరికాననమును ఉజ్వలము చేస్తూ అతని పక్కనే ఉన్నది.

దివ్యకన్య తనను తీసుకొని వచ్చిందని అతడు గ్రహించి ఆమెను చూచినాడు. ఆమె తనకోరిక పైకి చెప్పలేక సిగ్గుపడినది, అతడు దివ్యకన్య మనోభావాన్ని పరీక్షించాలని కపటనిద్ర అభినయించి ధూర్తుడై "సఖీ, మదనమంచుకా! ఎక్కడ ఉన్నావో! నన్ను నీ బాహువుల్లో చేర్చుకోవా!" అని పలవరించినాడు. ఆదివ్యకన్య మదనమంచుకారూపిణిగా మారి నరవాహదత్తుని కౌగలించింది. ఆమె సిగ్గు విడిచి నిజరూపముతో అతనికి కనపడి "ఆర్యపుత్త్రా, నిన్ను వరించాను. నన్ను పరిగ్రహించు" అన్నది. నరవాహనదత్తుడు గాంధర్వవిధి ప్రకారము దివ్యకన్యను వివాహమాడినాడు. రాత్రి అతడు ప్రియురాలితో గడిపి తెల్లవారుజామున ఆమె వంశమూ పరువు ప్రతిష్ఠలూ తెలుసుకో దలచి ఒక గాథ ఆరంభించినాడు.

## నక్క, పిడిఏనుగు కథ

ఒక తపోవనములో బ్రహ్మసిద్ధి అనే మునీశ్వరుని వద్ద ఒక గుహాలో వృద్ధ జంబుకము ఉంటున్నది. ఒకరోజు ముసురుగా ఉన్నప్పుడు ఆ ఆడ

నక్క ఆకలితో అన్వేషించి బైట ఆహారము వెతుక్కొంటూ ఉండగా, అతని దేహము ... విడిచి పోవడంవల్ల బాధ్ను తీరిపోయింది. దయా శీతలహృదయుడైన ఆ మునిచంద్రుడు జంబుకాన్ని చూచి రెండు జంతువులనూ కటాక్షించినాడు. అతడు వెంటనే నక్కను ఆడఏనుగను చేసినాడు. పిడిఏనుగు క్రొత్తగా వచ్చిన ఏనుగును చూచి మరులు కొన్నది. నక్కకు చావు తప్పింది. కొంతకాలములో ఏనుగు ఆడఏనుగుతో కూడా విహరిస్తూ దానికి తామరపువ్వు తెచ్చి ఇవ్వవలెనని మడుగులో అడుగు పెట్టగా అడుసులో దిగబడి వజ్రనిర్భిన్న పక్షమయిన పర్వతమువలె కదలక మెదలక ఉన్నది. ఏనుగు కష్టకాలములో ఉండగా నక్కఏనుగు అప్పుడు మరొక ఏనుగుతో వెళ్ళిపోయింది. ఈలోగా మడుగులో ఉన్న పిడి ఏనుగు భార్య పిడిని వెతుక్కొంటూ విధివశాన అక్కడికే వచ్చింది. భద్రజాతి పిడిఏనుగ మడుగులో కూరుకుని ఉండగా భార్య విచారపడి భర్తతో సహగమనము చేసేటందుకు అడుసులోకి చొరపడింది. అప్పుడు బ్రహ్మసిద్ధి మునీంద్రుడు శిష్యబృందముతో వచ్చి ఏనుగుల బాధ కళ్ళార చూచి వాటికి బలము కలిగేటట్టు చేసి అడుసులో నుంచి బైటికి రప్పించినాడు. ఆనాగదంపతులు చావుతప్పించుకొని వియోగము తీరి సుఖముగా ఉన్నారు. కష్టాలలో ఉన్న పతిని సతి వదిలి వేస్తుందా? తిర్యగ్జంతువులలోకూడా అటువంటి దాంపత్యము ఉంటుంది. నీచజాతిలో పుట్టిన చంచల స్నేహానికి తగదు.

## లలితలోచనా జన్మగాథ

అతని కథ ఆకర్ణించి ఆమె అతని భావాన్ని గ్రహించి "ఆర్యపుత్రా, నీమనస్సు నాకు బోధపడింది. నేను చెప్పేకథవిను.

కన్యాకుబ్జనగరిలో బాహుశక్తి అనే మహారాజు దగ్గిర శూరదత్తుడనే విప్రుడు మొఖాసాదారుగా ఉన్నాడు. అతని భార్య మహాపతివ్రత

వసుమతి. ఆపుణ్యదంపతులకు వామదేవుడనే సుపుత్రుడు ఉద్భవించినాడు. ఆకుర్రవాడు అతిగారాబముతో పెరుగుతూ సమస్తవిద్యలనూ స్వల్ప కాలములో నేర్చి శశిప్రభ అనే పిల్లను వివాహము చేసుకొన్నాడు. కాలక్రమేణ తండ్రి కాలము చేసిన తరువాత తల్లి సహగమనము చేసింది. వామదేవుడు గార్హస్థ్యధర్మమును యథావిధిగా నిర్వర్తిస్తూ ఉన్నాడు. దైవవశాన అతనిభార్య శాకినీసిద్ధిపొంది భర్తకు తెలియకుండా యథేచ్ఛగా వ్యభిచరిస్తున్నది. వామదేవుడు రాజధానికి వెళ్ళి రాజసేవ చేసి తిరిగి రాగా పినతండ్రి అతనితో ఏకాంతముగా "అబ్బాయీ, మనకొంపలో పేరుప్రతిష్ఠలు మాసిపోయినవిరా! నీభార్య దున్నలకాపరిని తగులుకొనగా దిక్కుమాలిన పాపిష్ఠికళ్ళతో పాపాన్ని చూడవలసి వచ్చింది" అని పలికినాడు. ఆమాటలు విని వామదేవుడు కత్తి తెచ్చి పువ్వులతోటలో రాత్రి దాగినాడు. ఆవేళకు అక్కడికి దున్నలవాడు రాగా వామదేవునిభార్య ఆహారము పళ్ళెములో పెట్టుకొని విటుణ్ణి చేరింది. తర్వాత ఇద్దరూ ఏకశయనములో ఉండగా, కళ్ళారా చూచి వామదేవుడు కత్తిదూసి మీదికి వచ్చినాడు. భార్య భర్తను తిట్టి దుమ్మెత్తిపోయగా వామదేవుడు దున్నపోతుగా మారినాడు. అతని పూర్వజ్ఞానము మాత్రము పోలేదు. ఆకులట వామదేవుణ్ణి దున్నలతో కలిపి తోలుతూ దుష్టుకర్రతో దున్నలకాపరిచేత చితక కొట్టిస్తున్నది. తరువాత ఆమె పతిని వర్తకునికి విక్రయించింది. ఆబేహారి దున్నరూపములో ఉన్న వామదేవుణ్ణి తన గ్రామానికి తోలుకొనిపోయి సరుకులు మోయిస్తున్నాడు. వామదేవుడు బరువులు మోయలేక కృశించి శల్యమై "నమ్మిన భర్తను బుట్టలో పెట్టినదాన్ని పెట్టుకొని కాపురము చేయడము చంకలో సర్పాన్ని పెట్టుకొన్న వాడివలె ఉంటుంది." అని ఆలోచించి దుఃఖిస్తూ ఉండగా ఒకసిద్ధురాలు ప్రజ్ఞావిశేషమువల్ల సంగతి యావత్తూ కనిపెట్టి మంత్రోదకాలు చల్లి అతన్ని మనుష్యుని చేసింది.

ఆయోగిని అతన్ని తన ఇంటికి తీసుకుపోయి తన కుమార్తె కాంతిమతి నిచ్చి పెళ్ళిచేసి అతని చేతికి కొన్ని ఆవాలు ఇచ్చి "వీటిని మంత్రించాను; ఈ ఆవాలతో నీ మొదటిభార్యను కొట్టు. అది గోడిగమృగము అవుతుంది." అని చెప్పింది. వామదేవుడు రెండోభార్యతో, ఆవాలు జాగ్రత చేసి తన ఇంటికి వెళ్ళి దున్నలకాపరిని హతమార్చి ఆఆవాలతో మొదటిభార్యను కొట్టి గోడిగ మృగాన్ని చేసి లాయములో (పశువుల శాల) కట్టించినాడు. అది మొదలు ప్రతిరోజూ అతడు కసితీరే లాగ ఏడుసార్లు ఆగోడిగను బాది తరువాత భోజనము చేస్తానని శపథము పట్టినాడు.

ఒకసారి వామదేవుని ఇంటికి అతిథి వచ్చి విస్తరిముందు కూర్చున్నాడు. అతిథితో భోజనానికి కూర్చున్న వామదేవుడు భార్యగోడిగను కొట్టడము మాట జ్ఞప్తికి వచ్చి చప్పున లేచి పశువులశాలలో ఉన్న గోడిగను ఏడుసార్లు చావగొట్టి భోజనానికి వచ్చినాడు. ఇదంతా చూచి అతిథి ఆశ్చర్యపడి కుతూహలముతో "తిండిమాని పశువులశాలలోకి వెళ్ళావేమి?" అని అడిగినాడు. అతిథికి వామదేవుడు పూర్వవృత్తాంతము సమగ్రంగా తెలియ జెప్పినాడు. అతిథి "ప్రయోజనములేని పగ నీ కెందుకు! నీపశురూపాన్ని పోగొట్టిన నీఅత్తగారిని స్మరించి సేవించి ఏదయినా శక్తినిపొందు" అని సలహా ఇచ్చినాడు. వామదేవుడు సంతోషించి అతన్ని సత్కరించి మర్నాడు పంపినాడు. అతడు సిద్ధురాలిని పూజించి ఉపదేశము దీక్షాపూర్వకముగా పొంది భార్యతోకూడా శక్తిని సాధించినాడు. విద్య సిద్ధించగా శక్తి అతనికి కత్తి నిచ్చింది. అతడు కత్తిపుచ్చుకొని భార్యతో అప్పుడే విద్యాధరుడై మలయపర్వత శృంగమున రజతకూటము అనే నగరిని నిర్మించి రాజ్యము చేస్తున్నాడు. ఆదంపతులకు లలితలోచన అనే కన్య ఉద్భవించింది. ఆమె విద్యాధర చక్రవర్తికి భార్య అవుతుందని అశరీరవాణి అన్నది. నేనే లలితలోచనను.

నావిద్యాశక్తివల్ల నిన్ను మలయాచల సానువులకు తెచ్చినాను. నిన్ను ప్రేమించినాను.”

నరవాహనుడు ఆమె విద్యాధరి అని గ్రహించి మన్ననచేసి ఆమెతో అక్కడే ఉన్నాడు. వత్సరాజాదులు రత్నప్రభాదేవి శక్తివల్ల లలితలోచన జన్మగాథను తెలుసుకొన్నారు.

## తరంగము: ౬౯

### లలితలోచనా నరవాహనుల వియోగము

నరవాహనదత్తుడు లలితలోచనను వివాహమాడి మలయాచల సానువులమీద వసంతఋతువులో ఆమెతో విహారము చేసినాడు. ఒకసారి ప్రియురాలితో గిరివనీస్థలిలో తిరుగుతూ ఉండగా లలితలోచన అతని కనుచూపుమేర దాటిపోగా, ఆమెకోసము వెతుకుతూ పోయి పోయి రాలినపువ్వులతో చుక్కలవలె నున్న సరోవరమును చూచినాడు. పుష్పాపచయానికి ప్రియురాలు దూరముగా వెళ్ళి వచ్చేలోగా నరవాహనుడు సరస్సులో స్నానము చేసి దేవతార్చన యథావిధిగా నిర్వర్తించి, చందనతరుచ్ఛాయలో శిలావేదికమీద ఆసీనుడైనాడు. అతడు రాజహంసలనడకలు, కోకిలకుమారికల కలకంఠములు, శఫరీవిలాసవీక్షణాలు, తనివితీర చూచి మదనమంచుకాదేవిని స్మరించి వలపువేడిమివల్ల సొమ్మసిల్లినాడు. అప్పుడు పిశంగజట నామధేయుడైన మునీంద్రుడు స్నానార్థము వచ్చి నరవాహనదత్తుని విరహావస్థనుచూచి జాలిపడి మదనమంచుకా స్పర్శతో సమానములయిన గంధపుతుంపురులను అతనిమీద చల్లినాడు. నరవాహనుడు మూర్ఛతేరి మునిచంద్రునకు నమస్కారము చేసినాడు. పిశంగజటుడు యోగదృష్టివల్ల ఇలా అన్నాడు: “కుమారా! నీఅభీష్టము సిద్ధిస్తుంది! ధైర్యముతో ఉండు. అదే నీకు శ్రేయోదాయకము. అందుకు నిదర్శనమువిను:

## మృగాంకదత్తుని కథ

త్రిలోకాలలో ప్రసిద్ధమైన అయోధ్యాప్రభువు అమరదత్త మహారాజుకు అనురక్త సురతప్రభాదేవి అనే పట్టపుదేవేరికి మృగాంకదత్తుడనే సుపుత్రుడు కలిగినాడు. ఆకుమారునికి ప్రచండశక్తి స్థూలబాహువు, విక్రమకేసరి, దృఢముష్టి, మేఘబలుడు, భీమపరాక్రముడు, విమలబుద్ధి, వ్యాఘ్రసేనుడు, గుణాకరుడు విచిత్రకథకుడు అని పదిమంది కులీనులు ప్రాజ్ఞులు ప్రభుహితపరాయణు లయినవాళ్ళు మంత్రులు. మృగాంకదత్తుడు సుఖముగా ఉన్నాడే కాని అనురూప అయినప్రియురాలు లభించలేదు. భీమపరాక్రముడు ఆతనికి ఇలా చెప్పినాడు: "రాత్రి ఒకవిచిత్రము జరిగింది. మేడమీద పరున్నాను. మెళుకువ వచ్చి కళ్ళు తెరిచి చూడగా పిడుగులవంటిగోళ్ళతో సింహము నామీదికి వచ్చింది. నేను సురకత్తి చేత్తో పుచ్చుకొని లేవగానే అది పారిపోతూ ఉంటే, దాన్ని వడిగా నేను తరుముతూ వెళ్ళాను. ఆసింహము ఏటిదరి చేరి నామీదకి తనపొడవునాలుక సాచింది. నేను దానినాలుకనుకోసి పెద్ద ఆనకట్ట వలె ఉన్నదాని జిహ్వామీదే ఏరు దాటినాను. వెంటనే ఆసింహము భీకరాకారముతో మనుష్యు డయినది. తాను భేతాళుడ నని చెప్పి నాసాహసానికి అతడు మెచ్చుకొన్నాడు. నేను "నాశౌర్యాన్ని మెచ్చుకొంటే నేనోపంగతి అడుగుతాను. చెప్పు. మాప్రభువు మృగాంకదత్తునకు ప్రియురాలు ఎక్కడ ఉంది?" అని అడగ్గా బేతాళుడు అన్నాడు: "ఉజ్జయినిలో కర్మసేను డనేరాజుకు శశాంకవతి అనే కుమార్తె ఉన్నది. ఆ అమ్మాయి అందచందాలముందు అప్సరసల సౌందర్యము తీసికట్టు. బ్రహ్మదేవుని సృష్టిలో ఉన్న సొగసంతా శశాంకవతిలోనే ఉన్నది. ఆకన్య నీరాజుకు భార్య అవుతుంది, అప్పు డతడు భూమండల మంతా జయిస్తాడు"! అంటూ అదృశ్య మైనాడు. నేను ఇంటికి వచ్చాను. దేవా ఇది రాత్రి జరిగిన విచిత్రవిషయము!"

మృగాంకదత్తుడు స్వప్నవృత్తాంతమును అమాత్యులకు ఇలా విశద పరుస్తున్నాడు. "మన మందరమూ దట్టంగా ఉన్న అరణ్యములో ప్రవేశించినాము. మార్గాయాసమువల్ల దాహము వేసి మంచినీరు తాగే సమయములో నీళ్ళల్లోనుంచి ఏడుగురు ఆయుధహస్తులు బైటికి వచ్చి మనల్ని ఎదిరించినారు. వాళ్ళను చంపి నీళ్ళు తాగబోతే వాళ్ళు కనపడ లేదు. ఆనీరూ లేదు. కష్టాల్లో మనము ఉండగా వృషభ వాహన మెక్కి మహేశ్వరుడు వచ్చినాడు. ఆయునకు మనమందరమూ వందనము చేసినాము. పరమశివుడు తనకన్నీటికణాన్ని నేలమీద రాల్చగా అదిమహాసముద్రము అయినది. అందులో ముత్యాలహారము ఉద్భవించింది. నేనుహారాన్ని కంఠసీమలో ధరించి రక్తముతో తడిసిన మనుష్యుని పుర్రెతో సముద్రోదకాన్ని తాగివేసినాను. వెంటనే మెళుకువ వచ్చింది. తెల్లవారింది."

స్వప్నవృత్తాంతాన్ని విమలబుద్ధి అనే అమాత్యుడు విని "రాజన్! శివానుగ్రహానికి పాత్రుడ వయితే నీవు ధన్యుడవు. కలలో ముత్యాల హారము ధరించి సముద్రోదకపానము చేయడము, శశాంకవతిని పొందుతా వనీ భూమండలాన్ని ఏలుతా వనీ ద్యోతకములు; క్లేశము లేకుండా కార్యసిద్ధి కాదు" అని పలికినాడు.

మృగాంకదత్తుడు మంత్రులను హెచ్చరించినాడు: "నాస్వప్నానికి విమలబుద్ధి చెప్పినఫలము, భీమపరాక్రముడు భేతాళునివల్ల తెలుసుకొన్న వృత్తాంతముతో సరిపోతున్నవి. కర్మసేనుడు సేనాబలగర్వితుడు. అతనికుమార్తెను శశాంకవతిని ప్రజ్ఞాబలమువల్ల సంపాదించి తీరాలి. కార్యసిద్ధికి ప్రజ్ఞాబలము కావాలి. అందుకు నిదర్శనము విను :

## అనంగలీలా భద్రబాహులు

మగధదేశాన్ని భద్రబాహుమహారాజు ఏలుతున్నాడు. అతనికి మంత్రగుప్తుడు అనేప్రజ్ఞాశాలి అయినమంత్రి ఉన్నాడు. రాజు మంత్రిని

కర్ణములో పాముప్రవేశపెట్టి రాత్రి అక్కడగడపి మర్నాడు నిజదేశానికి వెళ్ళిపోయినాడు. గజము చనిపోయింది. ఇలా ధర్మగోపమహారాజు భద్ర గజము చనిపోయింది. మహామంత్రి తనను దర్శించేందుకు రాగా భద్ర బాహు మహారాజు సంతోషించి కాశీకి ధర్మగోపునిదగ్గిరికి అనంగలీలను అడిగేందుకు రాయబారము పంపినాడు. భద్రగజ మరణమువల్ల ధర్మ గోపుడు నీరసుడై పోగా మగధరాజుకు అనంగలీలను ఇచ్చి వివాహము చేసినాడు. మహామంత్రి మంత్రిగుప్తుని ప్రజ్ఞాబలమువల్ల భద్రబాహుకు అనంగలీల రాణి అయింది."

మృగాంకదత్తుడు ఇలా చెప్పగా విచిత్రకథకుడు అనే మంత్రి పలికి నాడు : "కలలో లభించిన ముత్యాలహారమువల్లనూ, శివానుగ్రహము చేతనూ నీకు కార్యసిద్ధి కాక తప్పదు. ఈశ్వరానుగ్రహము ఎన్నటికీ వృథా కాదు. అందుకు ఆఖ్యానముగా విను:

## వినయవతీ పుష్కరాక్షులు

తక్షశిలాధిపతి భద్రాక్షుడు సంతానము కోసము ఖడ్గము మీదికి లక్ష్మీదేవిని ఆవాహనచేసి దిన దినమూ తెల్లతామర పువ్వులతో అష్టోత్తరశతపూజ చేస్తున్నాడు. ఒకసారి పూజాసమయాన ఒకపువ్వు తక్కువ కాగా మౌనముద్ర వదలక తన హృదయాన్ని ఖండించి రాజు అర్చన చేసినాడు. అతని ప్రణిధానబుద్ధికి దేవి మెచ్చి సాక్షాత్కరించి చక్రవర్తి కాగల కుమారుడు కలుగుతాడని వరమిచ్చి అతని దేహాన్ని వజ్రదృఢము చేసి, అదృశ్యమైంది. అతనికి దేవేరివల్ల సులక్షణుడనే కుమారుడు కలిగినాడు. హృదయపుష్కరమువల్ల పుత్రుడు జన్మించి నాడు, కనుక రాజు పిల్లవానికి పుష్కరాక్షుడనే నామకరణము చేసి నాడు. కుర్రవాడు యువకుడై గుణవంతుడై ఎదిగి తండ్రికి అక్కరకు వచ్చినాడు. భద్రాక్షుడు కుమారునికి రాజ్యాభిషేకము చేసి తపోవనా

నికి వెళ్ళినాడు. పుష్కరాక్షుడు మహాదేవుణ్ణి నిష్ఠ ఉపవాసాలతో ఆరాధన చేస్తూ తనకు తగినట్టి అయిన ప్రేయసి కావాలని కోరినాడు. అశరీర వాణి అతని కోరిక నెరవేరుతుందని పలికింది. పుష్కరాక్షుడు సంతోషముతో పొంగిపోయి అశరీరవాణిమీద విశ్వాసముతో అరణ్యానికి వేటకై వెళ్ళినాడు. సర్పదంపతులను లొట్టిపిట్ట తినబోతూ ఉండగా అతడు చూచి కనికరించి లొట్టిని బాణముతో కూలవేసినాడు. లొట్టి పిట్ట శరీరాన్ని వదలి విద్యాధరుడై ఆనందపరవశుడై పుష్కరాక్షునితో ఇలా అన్నాడు: "నాయనా! నీవు నాకు మహోపకారము చేసినావు. రంకుమాలి అనే విద్యాధర కుమారుడు ఉన్నాడు. అతని అందాన్ని చూచి తారావళి అనే విద్యాధరి మురిసి స్వయముగా వలచింది. ఇద్దరూ వివాహము చేసుకోగా తారావళి తండ్రికి కోపము వచ్చి ఆదంపతులకు వియోగము కలుగుగాక అని శపించినాడు. తారావళీ రంకుమాలులు కొంతకాలము విహరించి శాపవశాన అరణ్యములో ఒకరి కొకరు దూరమై పోయినారు. అప్పటించి తారావళి ప్రియుణ్ణి వెతుక్కొంటూ, పశ్చిమసముద్రతీరాన సిద్ధజన సేవితమైన వనవాటిలో నేరేడుచెట్టు చుట్టూ తుమ్మెదలు గుమికూడగా చూచి తానుకూడా తుమ్మెదరూపము ధరించి పుష్పమకరందాన్ని ఆస్వాదిస్తూ అలసట తీర్చుకొంటున్నది. సరిగా అప్పుడే విధివశాన ఆమెప్రియుడు వచ్చేప్పటికి తారావళీభృంగి పుష్పముమీద వాలి భర్తను చూచి నిజరూపాన్ని పొంది అతనితో ఇంటికి వెళ్ళింది. తారావళి తుమ్మెదరూపములో ఉండగా తద్వీర్యప్రభావమువల్ల ఆపుష్పము కాయ కాచి ఫలవంతముకాగా ఫలములో కన్య ఉదయించింది. ఒకనాడు విజితాసువు అనే మునీంద్రుడు ఆ చెట్టుదగ్గిరికి వచ్చినాడు. ఆయన దగ్గిర నేరేడు పండు రాలి పగిలింది. ఫలములోనుండి దివ్యకన్యక వెలువడి వినయముతో ఆయునకు ప్రణామము చేసింది. ఆమునిచంద్రుడు యోగదృష్టిచేత కన్యావృత్తాంతము

ఆమూలాగ్రము గ్రహించి ఆశ్చర్యపడి ఆమెను తన ఆశ్రమానికి తీసుకొని వెళ్ళినాడు. అతడు ఆమెకు వినయవతి అనే నామము ఉంచి పెంచుతున్నాడు. క్రమేణా వినయవతి యువతి కాగా నేను ఆకాశాన గగనతలాన వెళ్ళుతూ ఆమెను చూచి మోహించాను. కామమువల్ల నాకన్నులు కనపడలేదు. ఆమె నన్ను ఒల్లకపోయినా నేను బలాత్కారంగా తీసుకొని పోదామని నిశ్చయించుకొన్నాను. ఆమె ఏడుపులకు పెడబొబ్బలకు మునీంద్రుడువచ్చి నన్ను చూచి "ఓరీ! నీకు రూపగర్వము మహాఎక్కువగా ఉంది. నీవు రోతగా లొట్టిరూపాన్ని పొందు. పుష్కరాక్షుడు నిన్ను చంపగా నీవు ముక్తుడవై వినయవతికి భర్తవు అవుతావు" అని శాపము ఇచ్చినాడు. నేనులొట్టిపిట్టనై ఇప్పటికి శాపముక్తుణ్ణి అయినాను. నీవు సముద్ర తీరాన ఉన్న సురభిమారుత మనే ఆశ్రమానికి వెళ్ళు. వినయవతీదేవిని వివాహము చేసుకో" అని విద్యాధరుడు పలికి నిజనివాసానికి వెళ్ళినాడు.

పుష్కరాక్షుడు రాజధానికి వెళ్ళి, రాజ్యాన్ని మంత్రుల చేతుల్లో పెట్టి అశ్వారూఢుడై ఏకాకిగా బయలుదేరి పశ్చిమ సముద్రతీరానికి వచ్చి సముద్రాన్ని ఎలా దాటడమా అని ఆలోచిస్తున్నాడు. అక్కడ చండికాలయము అతని కంటపడింది. అతడు స్నానముచేసి దేవీపూజ చేసినాడు. అక్కడ ఎవరో వీణ ఉంచి వెళ్ళగా రాజు స్వయముగా వల్లకీశ్రుతులు సారించి దేవతానుగ్రహప్రాప్తికి దేవీస్తోత్రాలు గానము చేసినాడు. అతడు వీణావాదనమువల్ల అలిసి రాత్రి అక్కడే నిద్రించినాడు. అతని వల్లకీస్వరాలు హృదయాన్ని కరిగించగా, చండిక తన భూతవర్గముచేత అతన్ని సముద్రపు ఆవలిగట్టున దింపించింది. తెల్లవారింది. అతడు మేలుకొని చూచుకునేప్పటికి దేవ్యాలయము లేదు. తాను అడవిలో ఉన్నాడు. అతనికి ఆశ్చర్యము కలిగింది. ఆశ్రమమంతా దిమ్మ తిరిగినాడు. ఫలభారనమ్రములైన వృక్షాలు అతిథి సత్కారము చేస్తున్నవి. శకుంతముల కలకలరవములు అతనికి స్వాగతము

పలుకుతున్నట్టున్నవి. పుష్కరాక్షుడు వనవాటిలో ప్రవేశించి శిష్య బృందముతో ఉన్నమునీంద్రుణ్ణి చూచి పాదాలకు ప్రణామము చేసినాడు. మునీంద్రుడు అతనికి అతిథిసత్కార మిచ్చి యోగదృష్టివల్ల సమస్తవృత్తాంతమూ తెలుసుకొని "పుష్కరాక్షా! నీప్రియురాలు వినయవతి సమిధలకై వనానికి వెళ్ళింది. క్షణములో వస్తుంది. ఆమె నీపూర్వభార్య. ఆమెను పెళ్ళాడు" అని చెప్పినాడు. పుష్కరాక్షుడు మనసులో "ఈమహానుభావుడే విజితాసువు. ఇదే సురభిమారుతాశ్రమము. దేవి నన్ను సముద్రము దాటించింది. ఈమె నాపూర్వభార్య! ఆశ్చర్యమే!" అని తలచి ఆనందము వెల్లివిరియగా మునీంద్రునితో "స్వామీ! ఈకన్య నాపూర్వభార్య ఎలా అయిందో తమరు సెలవీయండి" అని కోరగా, మునీంద్రుడు చెప్ప నారంభించినాడు :

## విద్యుల్లేఖా ధర్మసేనుల కథ

తామ్రలిప్తినగరములో విద్యుల్లేఖాధర్మసేనులు అనే వైశ్యదంపతులు నివసిస్తున్నారు. ఒకసారి చోరులు ధర్మసేనుని కొట్టి, సర్వస్వమూ దోచుకోగా అతడు భార్యాసహితంగా అగ్నిప్రవేశానికి సిద్ధమైనాడు. ఆ వణిగ్దంపతులు ఆకాశములో హంసల జంటను చూచి వాటినే తలపోస్తూ అగ్నిప్రవేశము చేయగా తరువాతజన్మలో వారు అంచజంటగా జన్మించారు. ఒకప్పుడు ఆహంసలు వర్షాకాలములో ఖర్జూరవృక్షము మీద గూటిలో ఉండగా పెద్దతుపాను వచ్చి చెట్టు పడిపోయింది. హంసదంపతులకు వియోగము కలిగింది. తుపాను తగ్గినతరువాత హంస హంసికోసము జలాశయములలో సరస్సులలో నానాదిశలూ వెతికి వేసారి హంసలకు వర్షాకాలసేవ్యమైన మానససరోవరానికి వెళుతున్న ఒక హంసిని చూచి తనప్రియురా లని భ్రమపడి కామార్తితో దానివెంట వెళ్ళి మానససరస్సు చేరింది. ఆ హంస తన ప్రియహంసిని చూచి

సుఖభోగాలతో నభోమాసము గడిపింది. ఆ అంచజంట విహారము నిమిత్తము కొండకొమ్ము చేరగా క్రూరుడైన వేటకాడు బాణముతో హంసిని కూల వేసినాడు. హంస ప్రియావియోగార్తితో ఎక్కడికో వెళ్ళిపోగా వేటకాడు చచ్చిన హంసిని తీసుకొని, ఆయుధపాణు లైనపురుషులను ఆతోవను వస్తున్నవారిని దూరాన చూచి వారు హరించకుండా కోసినపచ్చిగడ్డిలో దాచినాడు. సాయుధు లైన పురుషులు వెళ్ళిపోగా బోయవాడు గడ్డిని కదిలించి చూడగా హంసి గడ్డిలో ఉన్న మృతసంజీవనీరసము సోకడమువల్ల జీవించి రివ్వు రివ్వున మింటి కెగిరి పోయింది. ఈలోగా హంస ప్రియాన్వేషణలో సర్వమూ మరిచింది. ఆహంస అంచపిండును చూచి తన హంసి ఉన్న దని భ్రమపడి అందులో చేరింది. బోయవాడు అంచపిండుమీద వల పన్నినాడు. ఆసమయాన హంసి ప్రియుణ్ణి వెతుక్కొంటూ వల పన్నిన చోటికి వచ్చి తనభర్త వలలో ఉండగా చూచి దిగులుపడి దిక్కులు చూస్తూ గతి కానక నిరాశతో ఉన్నది. ఎవరో పురుషుడు వచ్చి సరస్తీరాన వస్త్రముమీద తన రత్నహారాన్ని ఉంచి స్నానము చేస్తూ ఉండగా, హంసి అతనికి తెలియకుండా రత్నహారాన్ని హరించి తెచ్చి బోయవానికి చూపి సమీపములో ఎగురుతున్నది. వాడు హంసలను భుజించడము మాని దుడ్డుకర్ర చేత పట్టి హంసలను వలతో అక్కడే విడిచి హంసిమీద లక్ష్యముంచి వెంబడించినాడు. వాడు చూస్తూ ఉండగా హంసి రత్నహారాన్ని కొండకొమ్మున ఉంచింది. హారాని పొందా లనే ఆశతో వేటకాడు గిరిశృంగాన్ని ఆ[illegible]
హంసి వేగంగా వెళ్ళి వలలో తనభర్తచెంత [illegible]
ముక్కుతో పొడిచింది. కోతి వలమీదికి ఉ[illegible]
హంసలు క్షేమముగా వలలోనుంచి బైటికి [illegible]
వేటకాడు రత్నహారాన్ని తీసుకొని వల ఉన్న[illegible]

ఆపురుషుడు స్నానము చేసి ఒడ్డుకు వచ్చి చూడగా రత్నహారము కనపడలేదు. అతడు వెతికి వేసారి బోయవానిచేతిలో హారాన్ని చూచి బెదిరించి దానిని గ్రహించి వేటకాని కుడిచేతిని సురకత్తితో నరికినాడు.

ఒకనాడు అంచదంపతులు తామరపువ్వును గొడుగుగా ధరించి ఆకాశాన విహరిస్తూ క్రమంగా ఒకవేటిదరిని శివారాధకు డైనమునిచంద్రుని ఆశ్రమవాటిమీదుగా ఎగిరి పోతున్నవి. బోయవాడు ఆ హంసమిథునమును ఒక్క-కోలతోనే కూల్చినాడు. అంచలతామరగొడుగు శివలింగము మీద పడింది. బోయవాడు హంసను తనదగ్గర ఉంచుకొని, హంసిని మునికిచ్చినాడు. మునీంద్రుడు దానిని శివార్పణము చేసినాడు. పుష్క-రాక్షా! నీవే ఆహంసవు. శివలింగముమీద తామరపువ్వు పడిన పుణ్యముచేత మహారాజుగా జన్మించావు. ఆహంసి వినయవతి విద్యాధరిగా జన్మించింది. ఈమె నీపూర్వజన్మలో ప్రియురాలు.

విజితానునిమాటలు విని పుష్కరాక్షుడు "స్వామీ! అగ్నిప్రవేశము పాపసంచయాన్ని దహిస్తుంది గదా, మాకు పక్షిజన్మ ఎందుకు రావాలి" అని ప్రశ్నించినాడు. మునీంద్రుడు సమాధానపూర్వకముగా చెప్పుతున్నాడు: "అంత్యకాలములో జీవుడు దేనిని తలపోస్తూఉంటాడో, మరణాంతరజన్మలో ఆరీతిగా జన్మిస్తాడు. అందుకు దృష్టాంతము విను :

పూర్వము ఉజ్జయినిలో లావణ్యమంజరి అనే విప్రకుమారి నైష్ఠిక బ్రహ్మచారిణి. ఒకసారి కమలోదయు డనే విప్రయువకునిచూచి కామార్తితో తపించి వ్రతభంగానికి ఇష్టపడక గంధవతీతటానికి వెళ్ళి ప్రియుణ్ణి స్మరిస్తూ శరీరత్యాగముచేసింది. ఆభావనవల్ల ఆమె రూపవతి అనేపేరుతో వేశ్యగా ఏకలవ్యనగరములో పుట్టింది. కొంతకాలము ఆమె వ్రతనిష్ఠలో ఉన్నందువల్ల, వేశ్యాజన్మలో ఉన్నప్పటికీ ఆమెకు పూర్వజ్ఞానము ఉన్నది. ఒకసారి ఆవేశ్య చోదకరు డనే బ్రాహ్మణునికి జపకాలములో ఏకాగ్రత ఉండవలె నని చెప్పుతూ తన పూర్వవృత్తాంతము తెలియ

చెప్పింది. అంత్యకాలములో ఆ వేశ్య శుద్ధమనస్కగా ఉండడమువల్ల సద్గతి పొందింది."

మునీంద్రుడు రాజును స్నానానికి వెళ్ళిరమ్మని తాను మాధ్యాహ్నికము యథావిధిగా నెరవేర్చినాడు. పుష్కరాక్షుడు అరణ్యములో సెలయేటిదరికి పోగా వినయవతి పుష్పాపచయము చేస్తూ కనపడినది. ఆకన్య ఎవరో తెలుసుకోవలె నని రాజు కుతూహలాయత్తచిత్తుడై ఉండగా ఆమె చెలితో "సఖీ! పూర్వము నన్ను కోరిన విద్యాధరుడు శాపముక్తుడై వచ్చి ఈరోజు నాభర్త వస్తా డని చెప్పి వెళ్ళినాడు" అని పలికింది. చెలి "ఇవాళ ఉదయాన్నే విజితాసు మునీంద్రుడు మంజుకేశు డనే శిష్యుణ్ణి పిలిచి 'వత్సా! త్వరగా వెళ్ళి తారావళీ రంకుమాలులను ఇక్కడికి తీసుకురావోయి. ఈనాడు వారికుమారి వినయవతికీ పుష్కరాక్షునికీ వివాహము" అని ఆనతి ఇచ్చాడు. మంజుకేశుడు గుర్వాజ్ఞాప్రకారము వెళ్ళినాడు. అందుచేత చెలీ మనము ఆశ్రమపదానికి వెళ్ళుదాము" అన్నది. వినయవతి సఖీసమేతంగా ఆశ్రమానికి వెళ్ళింది. పుష్కరాక్షుడు ఆసంభాషణ చాటునుంచి విని స్నానము చేసి మునీంద్రుని ఆశ్రమానికి వెళ్ళినాడు. అక్కడికి తారావళీరంకుమాలులు వచ్చే ఉన్నారు. వారు మహారాజుకు ప్రణమిల్లి అతన్ని సత్కరించారు. మునీంద్రులు వివాహము జరిపించేందుకు వచ్చారు. విజితాసువు యోగతేజస్సుతో మూర్తి దాల్చిన అగ్నిహోత్రునివలె ప్రకాశిస్తూ వివాహవేదిక దగ్గిరే కూర్చుని వినయవతీ పుష్కరాక్షుల వివాహము చేయించినాడు. శుభసమయములో రంకుమాలి అల్లుడికి గగనచారిణి అయినదివ్యరథాన్ని కానుక ఇచ్చినాడు. విజితాసువు 'ఈమెతో నీవు చతుస్సముద్రముద్రిత వసుంధరను ఏలుతావు" అని పుష్కరాక్షుని ఆశీర్వదించినాడు. పుష్కరాక్షుడు మునిచంద్రుని సెలవు పొంది దివ్యరథ మెక్కి ప్రియాసమేతుడై సముద్రము తరించి నిజరాజ

ధానిలో అవతరించి లోకలోచనచంద్రుడై ఆహ్లాదము కలిగించినాడు. అతడు దివ్యరథ మహిమాతిశయముచేత పృథివీచక్రము సక్రమముగా జయించి సార్వభౌముడై వినయవతితో సకలభోగాలు అనుభవిస్తూ చిర కాలము ఉన్నాడు.

దేవా! దుస్సాధ్యము లయినకార్యములు దేవతానుగ్రహమువల్ల సిద్ధిస్తవి. శివానుగ్రహమువల్ల నీమనోరథము ఫలిస్తుంది.

విచిత్రకునివల్ల ఈకథ విని మృగాంకదత్తుడు శశాంకవతీలబ్ధికయి ఉవ్విళ్ళూరుతూ అమాత్యులతో ఉజ్జయినికి తరలినాడు.

## తరంగము: 20

### మృగాంకదత్తుడు ఉజ్జయినికి తరలుట

మృగాంకదత్తుడు భేతాళుడు చెప్పినశశాంకవతిని వివాహమాడ తలచి మంత్రులతో కలిసి యతివేషము ధరించి ఉజ్జయినీనగరానికి బయలుదేరినాడు. అతడు వెళ్ళేటప్పుడు మంచవుకోడు, వుర్రెలు సమ కూర్చవలె నని భీమపరాక్రముని నియమించినాడు. ఆతడు వాటిని సేక రించుకొన్న సంగతి వేగులవానివల్ల ముఖ్యమంత్రికి తెలిసింది. ఒకనాడు మృగాంకదత్తుడు మేడమీాద తాంబూలము నములుతూ పచారు చేస్తూ తాంబూలరసము కింద ఉమ్మివేశాడు. వధివశాన తోవలో వెళుతున్న మంత్రితలమీాద తమ్మి పడింది. మృగాంకదత్తుడు అదిచూడ లేదు. మంత్రి రాజు ఉమిసినా డని తెలిసి స్నానము చేసి కలిగిన అవమాన మునకు చింతిస్తూ పగ వూనినాడు. ఆమర్నాడే హఠాత్తుగా అమర మహారాజుకు విషూచికావ్యాధి వచ్చింది. సమయము చిక్కిం దని మంత్రి ఏకాంతములో రాజు అభయాన్ని వేడి, "రాజన్! భీమపరాక్ర ముని ఇంట్లో నీపుత్రుడు మృగాంకదత్తుడు నీమీాద అభిచారప్రయోగము చేస్తున్నాడు. అందువల్ల నీకీరోగము వచ్చింది. నేను వేగులవానివల్ల

విన్నాను. కళ్ళారా చూస్తున్నాను. మృగాంకదత్తుడు [illegible] జరిపించే
హించి వారి [illegible] చూపక, [illegible] [illegible] [illegible]
చికిత్సచేసినట్లు అతన్ని దేశములోనుంచి తరిమివేయండి” అని మనవి
చేయగా అమరదత్తుడు కింకర్తవ్యతామూఢుడై విషయము విశద
ముగా గ్రహించి [illegible] భీమపరాక్రముని [illegible] సేనాధిపతిని
పంపినాడు. అతడు వెంటనే వెళ్ళి భీమపరాక్రముని ఇంటిలో గుం
డెంత్రములు పెట్టినట్లు, ఇంకా క్షుద్ర సామగ్రీ [illegible] [illegible] తెచ్చి
రాజుకు చూపినాడు. రాజు రోషము ద్విగుణీకృతము కాగా “నా కొడుకు
రాజ్యలోభముచేత ఇంత ద్రోహము చేస్తాడా? వాణ్ణి వాడి మంత్రులనూ
దేశములోనుంచి తరిమివేయండి” అని సేనాధ్యక్షునకు ఉత్తరువు చేసి
నాడు. దళవాయి వెళ్ళి రాజాజ్ఞను మృగాంకదత్తునికీ, అతని అమాత్య
వర్గానికీ తెలియచేసి నగరమునుంచి వారిని పంపించినాడు. మృగాంక
దత్తుడు సంపదను తృణప్రాయముగా భావించి, * గణపతిని సేవించి మన
నులో జననీజనకులకు నమస్కారాలుచేసి, అయోధ్య దాటి [illegible]
వెళ్ళి ప్రముఖసచివులతో ఇలా పలికినాడు: “శక్తిరక్షితుడు అనే కిరాత
రాజుఉన్నాడు. అతడు నాకు సతీర్థుడు, బాల్యస్నేహితుడు. పూర్వము
అతనితండ్రిని మాతండ్రి యుద్ధములో ఖైదీగా చేసి అతడు తనకుబదులు
తనకుమారుని కాపుగా ఉంచినాడు. కొన్నాళ్ళకు తండ్రిచనిపోగా
నావిన్నపమువల్ల మాతండ్రి ఇతని జ్ఞాతులను ఓడించి, ఇతన్ని రాజును
చేసినాడు. మనము ఇతనిదగ్గిరికి పోదాము. తరువాత శశాంకవతికై
ఉజ్జయినికి వెళ్ళవచ్చును.”

మంత్రులు సరే నన్నారు. అందరూ కలిసి అరణ్యములో ప్రయా
ణము చేశారు. ఆ అడవిలో ఎక్కడా గుక్కెడుమంచినీళ్ళు నాలిక
పీక్కున్నా దొరకలేదు. వారు తిరిగి తిరిగి వేసారి ఒకచోట సర
స్త్రీరాన ఒక మోదుమాను చూచి సాంధ్యకృత్యములు చక్కగా

నా అన్న వాళ్ళు ఎవ్వళ్ళూ లేరు, అతడు రాజనీతినిపుణుడు; అందుచేత మృగాంకదత్తుని అనుసరించ కోరగా రాజు అందుకు అంగీకరించి ఆరాత్రి అక్కడే గడిపి మర్నాడు అమాత్యులతో శ్రుతధితో తరలినాడు. వారు కరిమండితము అనే మహారణ్యము ప్రవేశించగా ఏడుగురు భీకరాకారులు రోమభూయిష్ఠులైనవాళ్లు వచ్చి తమ్ము చూచి ఆశ్చర్యపడుతున్న మృగాంకదత్తునితో ఇలా పలికినాడు: "అయ్యా! మేము కాశీ బ్రాహ్మలము. గోధనమే మాకు జీవనాధారము. వర్షాలు వెనకపట్టడం వల్ల కాశీ వదిలి ఆవులను తోలుకుంటూ తృణకాష్ఠజలసమృద్ధమైన ఇక్కడికి వచ్చాము. ఇక్కడినూతినీరు రసాయననీరము. గట్లమీది చెట్లనుంచి కరకతాడి ఉసిరికాయలు నీటిలో పడడంవల్ల వాటిసారము నీళ్ళల్లో కలుస్తుంది. ఈ నీరూ పాలూ తాగుతూ అయిదువందల సంవత్సరాలనుంచీ ఉంటున్నాము. మాపుణ్యాన మీరు నేడు మాకు అతిథులుగా వచ్చారు." మృగాంకదత్తుడు సపరివారముగా వారి ఆశ్రమానికి వెళ్ళి క్షీరాశనము స్వీకరించి ఆదినము అక్కడ గడిపినాడు.

## మృగాంకదత్తుడు కిరాతరాజును కలియుట

మర్నాడు ఉదయాన మృగాంకదత్తుడు త్రోవలో వినోదాలు చూస్తూ కిరాతదేశానికి చేరినాడు. అతడు తనరాకను కిరాతపతికి తెలియచేయు మని శ్రుతధిని ముందుగా పంపినాడు. మృగాంకదత్తుడు వస్తున్నాడని కిరాతరాజుకు తెలిసి ఎదురు వచ్చి వందనము చేసినాడు. మృగాంకదత్తుడు తనరాకకు కారణము తెలిపి, కొన్నాళ్ళపాటు కిరాతరాజుదగ్గిర అతిథిసత్కారాలు అంగీకరిస్తూ, తనకు అవసరము వస్తే సాహాయ్యము చేయడానికి కిరాతుని సన్నద్ధుని చేసి, మంచిరోజు చూచి అమాత్యసహితముగా ఉజ్జయినికి మరలినాడు. అతడు మధ్యేమార్గములో విజనవనములో వృక్షమూలాన కూర్చున్న

సన్యాసిని చూచి "స్వామీ, నిర్జనవనంలో మీరు ఏకాకిగా ఉంటున్నారేమి?" అని కుతూహలముతో అడిగినాడు. అందుకు ఈప్రకారముగా సన్యాసి చెపుతున్నాడు:

నాగపతిరాజుతో మృగాంకదత్తాదులు జయించుట

"నేను భద్రకీర్తి అనే గురువు శిష్యుణ్ణి. ఎన్నో మంత్రతంత్రాలు నేర్చి సిద్ధులు సంపాయించాను. ఒకసారి సంతుష్టుడైన ఒక క్షత్రియ కుమారునికి ఉపదేశము చెప్పించి నేను అడిగితే సిద్ధౌషధులు, రసములు క్షేత్రాలూ చెప్పి అతను ఇలా అన్నాడు: 'ఉత్తరముగా వింధ్యారణ్యములో శింశుపావృక్షముకింద నాగేంద్రుని నివాసస్థానము ఉన్నది. అది తడిదుమ్ముతో కప్పిన కోటవలె ఉంటుంది. నీలకంఠపక్షులు ఆకాశంలో హంస మిథునాలతో అందమైన సరస్సుగా ఉంటుంది. పారావతి అయిన నాగ రాజు అక్కడ ఉన్నాడు. దేవాసురయుద్ధములో అతను దివ్యఖడ్గాన్ని సంపాయించినాడు. దాన్ని వైడూర్యకాంతి అంటారు. ఆశక్తిని సాధించినవాడు సిద్ధులు పొంది రాజై అజేయుడై సుఖపడతాడు. మహా వీరుల సాహాయ్యము ఉన్నట్లయితే ఆశక్తి దొరుకుతుంది.'' నేను అతని ఉద్దేశాన్ని శాంతింపచేసి ఆఖడ్గాన్ని ఎలా సంపాయించాలని ఆలోచించి వీరుల సహాయార్థము ఈభూమండలము పరిభ్రమించి సహాయము దొరకక మరణానికి సిద్ధపడ్డాను.'' ఈమాటలు విని మృగాంక దత్తుడు సన్యాసితో "నేనూ నామంత్రులూ నీకు సాయము చేస్తాము'' అని అభయమిచ్చినాడు. ఆతాపసి సంతోషించి అడుగులకు పసరు పూసి దానిప్రభావము చేత మృగాంకదత్తాదులతో నాగేంద్ర నివాసానికి వెళ్ళినాడు. ఆసన్యాసి ఆనవాళ్ళవల్ల దాన్ని కనిపెట్టి రాత్రి మంత్రోచ్చారణవల్ల దిగ్బంధనము చేసి అక్కడ మృగాంకదత్తాదులను నిలిపి, మంత్రించిన ఆవాలతో భూమిమీద కొట్టి అందులోనుండి నీరు

ఉబికేలాగు చేసి నాగ[illegible] హోమము ఆరంభించి నాడు. అకాలమేఘాలు. ఉరుములు [illegible] అతావసి మంత్రశక్తి వల్ల విఘ్నాలను [illegible] అప్పుడు శింశుపావృక్షములోనుండి దివ్యస్త్రీ రత్నాల[illegible] [illegible] పలుకుతున్నదో అన్నట్టు క్రీగంట చూచి ధైర్యాన్ని కోల్పోయి [illegible] ఆలింగనము చేసుకొన్నది. ఆ సన్యాసి [illegible] మంత్రతంత్రాలు మరిచి, హోమద్రవ్యము కింద [illegible] సమయము కనిపెట్టి పారావత నాగుడు గృహము వదలి [illegible] గర్జించినాడు. నాగుని కళ్ళల్లో జ్వాలలు [illegible] గుండె పగిలి వెంటనే చని పోయినాడు. నాగరాజుకు [illegible] నాగేంద్రుడు మృగాంక దత్తాదులను "మీరు అనవసరంగా [illegible] చేరి ఇలాచేశారు, కనుక కొన్నాళ్ళపాటు ఒకర్ని ఒకరు [illegible] ఎడబాటులో ఉంటారు." అని శాపము పెట్టినాడు. మృగాంకదత్తాదుల కన్నులు చీకట్లు కమ్మగా ఒకర్ని ఒకరు వెతుక్కొంటూ [illegible] అయినారు. మృగాంకదత్తుడు ఏకాకిగా అరణ్యములో సంచరిస్తున్నాడు.

రెండుమాసాలు అయినతరువాత శ్రుతధి మృగాంకుణ్ణి కలుసుకోగా ఆనందాశ్రువులు వెల్లివిరిసినవి. మృగాంకదత్తుడు శ్రుతధిని సత్కరించి మంత్రులసమాచారాలు అడిగినాడు. శ్రుతధి "మంత్రులు నాకు కనపడ లేదు. వారు ఉజ్జయినికి వెళ్ళి ఉంటారని తోస్తున్నది. మీ రందరూ వెళ్ళవలసినది అక్కడికే కదా" అని చెప్పగా మృగాంకదత్తుడు మిత్ర సహితముగా ఉజ్జయినికి ప్రయాణమైనాడు. కొన్నాళ్ళకు మార్గమధ్య ములో హఠాత్తుగా విమలబుద్ధి వచ్చి మృగాంకదత్తుని చేరి బాష్ప తరంగితనేత్రుడై నమస్కారము చేయగా, రాజు మంత్రిని గాఢాలింగ నము చేసి, ఆసీనుణ్ణి చేసి ఇతరమంత్రులమాట అడిగినాడు. విమలబుద్ధి ఇలా పలికినాడు :

## విమలబుద్ధి కథ

రాజన్! నాగశాపముచేత మంత్రులు తలో దారిపట్టి ఎక్కడికి వెళ్ళారో నాకు తెలియదు. వారు మిమ్మల్ని తప్పకుండా కలుస్తా రని మాత్రము చెప్పగలను. నా కాసంగతి ఎలా తెలిసిం దని అడుగుతా రేమో వినండి.

నేను నాగశాపమువల్ల ఎక్కడికో వెళ్ళి అడివికి తూర్పువైపున తిరిగి తిరిగి డస్సిపోగా ఒక పుణ్యమూర్తి నాఅవస్థచూచి కనికరించి బ్రహ్మదండి మహర్షి ఆశ్రమానికి తీసుకొని వెళ్ళినాడు. ఆమునీంద్రుడు తీయని పళ్లు తినడానికి ఇచ్చి నన్ను సత్కరించినాడు. తరువాత నేను ఇటూ అటూ తిరుగుతూఉండగా ఒకకొండగుహ చూచి కుతూహలముకొద్దీ అందులో ప్రవేశిస్తే మణిమందిరము కనపడింది. నేను గవాక్షమార్గాన చూస్తున్నాను. ఆమందిరములో ఒకకన్య తేనెటీగలతో చక్రము గిరగిర తిప్పుచున్నది. తేంట్లు కొంతసేపటికి దగ్గిరే ఉన్న గేదె మీదా కొన్ని గాడిదమీదా వాలినవి. అప్పుడు గేదెపాలనూ, గాడిద రక్తాన్నీ కక్కినవి. కొన్ని తేనెటీగలు పాలనూ కొన్ని రక్తాన్నీ తాగి తెల్లనివీ ఎర్రనివీ అయినవి. తేంట్లు అన్నీ సాలెపురుగులై వలలు పన్నినవి. తెల్లపురుగులు తమతాళ్ళల్లో సుగంధకుసుమాలను, ఎర్రనిపురుగులు తమతాళ్ళల్లో విషకుసుమాలను ఉంచుకొన్నవి. తమతమ పాశాలలో ఆయా సాలిపురుగులు సుఖంగా ఉండగా పెద్దపాము రంగులపడగ విప్పి వన్నెలసాలెపురుగులను కరిచింది. మణిమందిరములో ఉన్న ఆకన్య వాటిని వేరువేరుకుండల్లో వేయగా సాలెపురుగులు పాశాల్లోంచి బైట పడవలె నని యత్నముచేసి తిరిగీ పాశాల్లోనే చిక్కుకొన్నవి. విషపుష్పాలున్న వలలో సాలిపురుగులు రోదనము ఆరంభించినవి. వాటిని చూచి గంధకుసుమాల వలల్లో ఉన్నపురుగులు కనికరించి ఏడ్చినవి. ఈ ఊర్ణనాభీరోదనమువల్ల ఒకమునీంద్రుని సమాధిభంగము కాగా

పాశబద్ధము లైన పురుగులకష్టాలుచూచి దయతో నుదుటినుంచి ఆయన జ్వాలలు రానిచ్చినాడు. ఆమునీంద్రుని నిటలాగ్నికీలలవల్ల వలలతాళ్లు కాలిపోగా సాలిపురుగులు బంధము విడివడి పగడాలగొట్టములో దూరినవి. ఆగొట్టము పైన ఉన్న జ్వాలలో పురుగు లన్నీ అంతరించినవి. అప్పుడు ఆవనిత చక్రవృషభగర్దభాలతో అంతర్ధాన మైనది. ఈదృశ్యమంతా చూచి నేను తెల్లపోయి తిరుగుతూ ఉండగా నాకు పుష్కరిణి కనపడింది. ఆపుష్కరిణీ జలమధ్యమున మహారణ్యములో వేటకాడు తను పెంచిన పదిచేతుల సింహాపుపిల్లను తనకు వశముకా లేదని మండిపడి అడివిలోనుంచి తరిమివేశాడు. ఆసింహాము మరొకఅడివిలో ఆడసింహాము చేసిన శబ్దము విని దానికోసము పోయి తోవలో జంఝామారుతము వల్ల చేతు లన్నీ కోలుపోయింది. అప్పుడు బొజ్జకడుపువా డొకడు వచ్చి సింహానికి చేతులు ప్రసరించినాడు. సింహాము సింహికనిమిత్తము దానిఅరణ్యములోకి పోయి కష్టాలు పడి దాన్ని తీసుకొని తన మొదటి అడివికి వెళ్ళింది. ఇదంతా చూచి నేను ఆశ్చర్యపడి బ్రహ్మదండిమహర్షికి నివేదించగా త్రికాలవేది అయిన ఆమునీంద్రుడు ఇలా నాతో పలికినాడు:

"వత్సా! కృతకృత్యుడవు. ఈశ్వరానుగ్రహం వల్ల నీకు అద్భుతము కనపడింది. నీకు కనపడినస్త్రీ మాయాశక్తి. ఆమె తిప్పుతున్నది సంసారచక్రము. ఆచక్రములో ఉన్న తేనెటీగలు జీవులు. ఆమహిష గర్దభాలు ధర్మాధర్మాలు. అవి కక్కిన క్షీరరక్తాలు పుణ్యపాపాలు. ఆసాలిపురుగులు తమంతట తామే పుత్రాది రూపమయిన ఈషణత్రయాలను సూచించే వలతాళ్ళను అల్లుకొన్నవి. వివపుష్పాలు పరిమళ సుమాలు కష్టసుఖాలు. కాలమనే సర్పముచేత శుభాశుభాలనే ముఖాల చేత పురుగులు చనిపోయినవి. మరణానంతరము ఊర్ణనాభులు ఘట వికారములతో నానాజంతువులందు స్త్రీరూప మైన మాయాశక్తివల్ల నిక్షిప్తము లైన్నీఅక్కడ జన్మించి యథాప్రకారము తమతమ తెల్లని

ఎర్రనిరూపములు పొందిన [illegible] జాలపాశరూపవృత్తా దులను పొందినవి. అప్పుడు [illegible] తమమూలాల్లో తామే తగులుకొని దుఃఖ మనే విషముచేత ఉజ్ఞాన కలిగి పరమేశ్వరుని కై మొర పెట్టినవి. తెల్లనిపురుగులుకూడా [illegible] నూరి విరక్తితో పాశ బంధముక్తులను చేయు మని [illegible] ప్రార్థించినవి. ఈశ్వరుడై ఆ తాపసి జ్ఞానాగ్నిచేత [illegible] దగ్ధము చేసినాడు. అప్పు డవి వగడపుగొత్తి [illegible] ప్రవేశించి పరమపదము పొందినవి. సంసారచక్రము [illegible] మైన మహిమ గర్భాలు మాయమై పోయినవి.

బావినీటిలో కనపడినవి [illegible] ప్రతిబింబ రూపముగా ఈశ్వరుడు [illegible] ఆసింహము మృగాంక దత్తుడు. ఆ వేటకాడు [illegible]. సింహబాహువులు పదిన్ని అతని మంత్రులు. అతని అమాత్యులు కూడా పదిమంది కదా. అమరదత్తు డనేబోయవాడు పదిచేతులసింహము అనే మృగాంకుడు లొంగ డని నన మనే రాజ్యమునుంచి తరిమివేసినాడు. వనాంతరాన సింహికశబ్దము సింహము వినడ మంటే మృగాంకదత్తుడు అవంతిదేశ వాసిని అయిన శశాంకవతి యశస్సు గ్రహించడ మన్నమాట. సింహము అక్కడికి వెళ్ళడము మృగాంకదత్తుడు అమాత్యసహితంగా ఉజ్జయినికి ప్రయాణము చేయడ మని సూచన. మహామారుతమువల్ల సింహము బాహువులు మాయము కావడము పారావత నాగశాపవశాన అమా త్యులు మిమ్మల్ని ఎడబాయడము, బొజ్జకడుపున్న వాడు మళ్ళీ సింహా నికి చేతులు తెప్పించడము మంత్రులతో మృగాంకదత్తుడు చేరడము ద్యోతకములు. సింహమైన మృగాంకదత్తుడు వెళ్ళిపోయి కష్టాలపాలై మరొకతావున ఉజ్జయినిలో సింహిక అయినశశాంకవతిని పొంది ప్రియా సమేతుంగా నిజదేశానికి రాగా, ఆదేశాన్ని పరిపాలిస్తున్న బోయవంటి

అమరదత్తుడు తన యీనిజరాజ్యాన్ని [illegible]దత్తునికి ఇచ్చి పట్టాభిషేకము చేసి వనాంతర మందే తపోవనానికి వెళ్ళినాడు. ఈప్రకార ముగా ఈశ్వరుడు నీకు సూచించినాడు."

ఇలా మునీంద్రుడు చెప్పేసరికి దిగులు తీరి ఆనందాతిశయము పొంగు లెత్తగా అక్కడనుండి బయలుదేరి నీకోసము అన్వేషిస్తూ నిన్నిక్కడ కలుసుకొన్నాను. వినాయకుని కటాక్షమువల్ల నీవు అమాత్యులతో కలిసి నీఅభీష్టాన్ని సాధించగలవు.

ఇలా విమలబుద్ధి చెప్పగా మృగాంకదత్తుడు ప్రసన్నుడై నప్పటికీ, అమాత్యులు కనపడనందువల్ల మనోభారముతో ఉజ్జయినికి ప్రయాణ మైనాడు.

## తరంగము : 72

మృగాంకదత్తుడు శ్రుతధీ విమలబుద్ధి సమేతుడై శశాంకవతికై ఉజ్జయినికి వెళుతూ మధ్యేమార్గంలో నర్మదానదిదగ్గిరికి వచ్చినాడు. నర్మద నురుగుసొత్తముతో నవ్వుతూ అలలతో ఆనందము పొంగు లెత్తగా అమాత్యులు రాజును కలుస్తారని, శశాంకవతి లభిస్తుం దనీ ఆశ కొలుపుతున్న ట్టున్నది. మృగాంకదత్తుడు స్నానార్థము నర్మ దలో దిగేసరికి అకస్మాత్తుగా నీటిమనుష్యులు ముగ్గురు వచ్చి రాజపరి వారాన్ని చూచి పారిపోయినారు. మృగాంకదత్తుడు నీటిమనుష్యులను పట్టి సంహరించినాడు. స్నానానికి వచ్చిన బోయరాజును మృగాంక దత్తుడు రక్షించినాడు. బోయరాజు అతనిపాదాలకు మొక్కరిల్లి "ఎవ రవు మహాత్మా? నాప్రాణాలు రక్షించావు. నీవు జనించిన వంశ మేది? ఏదేశము నీజన్మభూమి?" అని ప్రశ్నించి శ్రుతధివల్ల మృగాంకుని వృత్తాంతము సమగ్రముగా విని కుతూహలము తీర్చుకొని తిరిగి రాజు పాదాలకు నమస్కరించి "నీకార్యసాధనకు నన్నూ, నాచెలికాడు దుర్గ

గించాలి. [illegible] యముగా తగాదాలు వస్తూ [illegible] మృగాంకుడు సంతోషించి "నీ పేరేమి?" అని అడిగినాడు. అతను [illegible] నని సమాధాన మీయగా మృగాంకదత్తుడు "అలాగయితే నేను నీ చెయ్యి నా కిచ్చి [illegible]" అని [illegible] అతని వెంట వెళ్ళినాడు. ఇద్దరూ [illegible] దగ్గరికి వచ్చినారు. పురుషుడు [illegible] బోయరాజు అంతఃపురానికి వెళుతూ [illegible] మృగాంకదత్తుని [illegible] వెంటవెళ్ళినాడు. దీపపువెలుగులో అతడు [illegible] చండకేతువు అని గ్రహించినాడు. బోయరాణిని వలచిన అప్రశస్తుడు [illegible] వ్యాపారానికి వచ్చి [illegible] ఉన్న మృగాంకదత్తుని కీనీడలో గుర్తించలేక పోయినాడు. బోయరాణి ప్రతీక్షిస్తూ [illegible] ఉత్కంఠతో కంఠాలింగనము చేసి పర్యంకముమీద కూర్చోబెట్టుకొన్నది.

"నీతో వచ్చిన పురుషుడెవరు?" అని రాణి అడిగింది. చండకేతువు "భయపడకు, అతడు నా స్నేహితుడు" అని సమాధాన మీయగా ఆమె "ప్రియుడా, ఈ అభాగ్యురాలి విచారము ఎప్పుడు పోతుంది? ఇప్పుడే కదా ఈ రాజు మృత్యుముఖానపడి మృగాంకదత్తుని వల్ల జీవించినాడు" అన్నది. చండకేతువు "ప్రియా, త్వరలో రాజును, మృగాంకదత్తునీ సంహరిస్తాను" అని సమాధాన మిచ్చినాడు. ఆమె "ఎందుకు ఉత్తరకుమార ప్రజ్ఞలు! నర్మదానదిలో రాజును మొసలి పట్టుకోగా మృగాంకదత్తుడే కదా రక్షించినవాడు. అప్పుడు వారిని నీవెందుకు చంపలేకపోయినావు? భయపడి పారిపోయి, వచ్చావు? ప్రగల్భాలెందుకు? నీమాటలు వింటే నవ్విపోతారు. పైగా మృగాంకదత్తుని చేతిలో నీచావు మూడింది" అనేసరికి చండకేతువు సహించలేక "పాపీ, నిజంగా నీకు మృగాంకదత్తునిమీద మనసు కలిగింది. అందుకు తగిన ఫలము అనుభవించు" అంటూ కత్తిదూసి బోయరాణిని నరకబోయి

ప్రతిమ చెక్కి ఉన్నది. దాన్ని చూచి నేను ప్రణామముచేసి అలిసిపోయి చెట్టు మొదట కూర్చున్నాను. "అయ్యో! నేనెందుకు రాత్రివేళ జేతాళ వృత్తాంతము చెప్పవలె? నావల్లనే స్వామికి ఇక్కట్టు కలిగింది. దోషి అయిన నేను ఇక్కడనే చచ్చిపోతాను!" అని నిశ్చయానికి వచ్చి ఆదేవుని సన్నిధిలో నిరాహారినై ఉన్నాను. కొన్నాళ్ళు గడచిన తరువాత ఆతోవనే ఒకముసలి బాటసారి వచ్చి ఆచెట్టునీడలో కూర్చున్నాడు. నన్ను చూచి "వత్సా! నీవు ఇమంతా వాడిపోయినావేమి? నిర్జనప్రదేశములో ఒక్కడివే కూర్చున్నావే?" అంటే నాసంగతి యావత్తూ అతనికి సమగ్రంగా చెప్పాను. అతను నాకు గుండెధైర్యము కలిగిస్తూ "వత్సా వీరుడివై స్త్రీవలె ఆత్మహత్య చేసుకొంటావా? స్త్రీలుకూడా కష్టకాలంలో ధైర్యం తెచ్చుకొంటారు. అందుకు నిదర్శనము విను.

## హంసావళీ కమలాకరులు

కోసలనగరాధీశ్వరు డయిన విమలాకరునకు కమలాకరు డనే నవమన్మథాకారుడైన కుమారుడు ఉన్నాడు. వందులలో మనోరథసిద్ధు డనేవాడు తరుచుగా రాజకుమారుని దగ్గిర ఈగాథ పాడుతూ ఉండేవాడు.

పద్మాసాదనసోత్సవ నానాముఖర ద్విజాలి పరిగీతమ్
కమలాకర మప్రాప్తా క్వ రతిం హంసావలీ లభతామ్!

పద్మసమాగమ ప్రముద వాచాల
బహువిధ ద్విజకుల పరిగీత మైన
కమలాకరప్రాప్తి కాకుండ నెట్టి
విధిని హంసావళి విహరింప గలదు!

ఇలా చాలాసార్లు గాథ గానము చేయగా కమలాకరుడు కుతూ

హలముతో "ఏమిటి చెప్పు" అని అడిగినాడు. మనోరథసిద్ధుడు విషయము వివరిస్తున్నాడు.

దేవా! నేను దేశదేశాలు తిరుగుతూ సింహళద్వీపము ఆట పట్టు అయిన విదిశానగరానికి వెళ్ళినాను. ఆవిదిశను మేఘమాలి అనే రాజు పరిపాలిస్తున్నాడు. నేను పద్మరథుడనే భరతశాస్త్రజ్ఞుని గృహములో ఉన్నాను. ఒకనాడు అతడు ప్రసంగవశాన నాతో "రేపు ఉదయాన రాజసభలో రాజపుత్రి హంసావళి క్రొత్తగా నేర్చిన నృత్తము ప్రదర్శిస్తుంది" అని చెప్పినాడు. ఆనృత్తవిద్యాకౌశలము చూడవలెనని నాకు కుతూహలము కలగగా అతను ఉపాయముచేసి నన్ను తీసుకొని వెళ్ళి నాట్యరంగ మంటపాన కూర్చోపెట్టినాడు. మృదంగాది వాద్యములు మోగగా తండ్రి సమ్ముఖాన హంసావళి బంగారు తీగెవలె నృత్తము ఆరంభించింది. అప్పుడు నేను "ఈకన్యకు కమలాకరుడే తగిన భర్త. కమలాకరునికి ఈహంసావళిని కూర్చకపోతే లాభం ఏమిటి? అందుకు ఉపాయము ఆలోచించాలి" అని తలచి నృత్తము పూర్తికాగానే రాజద్వారము చేరి "నాతో సరిగా ఎవరయినా చిత్రకారుడు ఆలేఖ్యములు రచించగలిగితే రచన చేయాలి" అని పత్రఖండముమీద రాసి దాన్ని అక్కడే వేలాడ కట్టినాను. ఆపత్రఖండాన్ని ఎవరూ చింపలేదు. రాజు ఆసంగతి తెలుసుకొని నన్ను పిలిపించి హంసావళీగృహములో చిత్రాలు రాయడానికి నియోగించినాడు. నేను హంసావళి శయన మందిరములో సపరివారంగా నీరూపము లిఖించాను. "ఈ రాజకన్యతో స్పష్టముగా చెప్పకపోతే నన్ను మోసగాణ్ణిగా భావిస్తుంది. యుక్తితో రాజకన్యకు ఈవిషయము తెలియ చెప్పాలి" అని నేను ఆలోచించి నమ్మకమైన స్నేహితుణ్ణి తీసుకొనివచ్చి అతనికి పెర్రివాడి వేషము వేసినాను. పిచ్చివాడివలె తిరుగుతున్న నాస్నేహితుణ్ణి క్రీడార్థము రాజకుమారులు తమ దగ్గిరికి పిలిపించుకొన్నారు. సరదా పడి హంసావళి ఆపెర్రివాణ్ణి తన

మందిరానికి పిలిపించింది. నాకు మందిరములో ఉన్న చిత్రాన్ని చూపి "ఇతడే కమలాకరుడు, గుణాకరుడు శ్రీమంతుడు లక్ష్మీసింహాసనాధిపుడు, వారి వలె సంభవించాలి కదా?" అని నిట్టూర్పు విడుస్తూ ఆనందములో శరీరము మరచి ఆడినాను. హంసావళి ఆశ్చర్యపడి నన్ను చూచి "ఏమిటి పలుకుతున్నావు! ఎవరిని నీవు ఈ చిత్రములో వర్ణించావు!" అని ఔత్సుక్యముతో అడిగింది.

ఆమె మరీ బలవంతము చేసినమీదట నేను "అనవద్యాంగీ, చిత్రములో ఉన్న వాణ్ణి ఈ వెర్రివాడు ఎప్పుడో చూచాను. ఈ ఆలేఖ్యములో ఉన్నవాడు రాజపుత్రుడు. అందమైనవాడని గౌరవాభిమానాలతో నేను ఈ రాజకుమారుణ్ణి చిత్రించాను" అంటూ ఏ గుణరూప ప్రశంస చేసినాను. నీప్రశస్తివల్ల హంసావళీహృదయములో వలపువాన కురిసి అనురాగలత క్రమంగా వృత్తమైనది. అప్పుడు మహారాజు వచ్చి వెర్రివాణ్ణి చూచి కోపించి మమ్మల్ని అక్కడ్డించి తరిమివేసినాడు. అప్పణ్ణించీ హంసావళి విరహోత్కంఠగా కృశించి కృశించి అగ్ని మాంద్యమనే వ్యాధి సెపముమీద హరిమందిరములో తండ్రి సెలవు మీద ఏకాకినిగా ఉంటూ వెన్నెలరాత్రులు భరించలేక, చేతనాచేతన జ్ఞానము లేక కామార్తితో బాధపడుతున్నది. నేను హరి దేవాలయము మీదికి ఎక్కి ఆమెదగ్గిరికి వెళ్ళి కనపడగా నాకు వస్త్రాభరణాలిచ్చి గౌరవించింది. నీకై ఆమె రాసిన గాథను వస్త్రఖండముమీద చూచినాను. అదే ఇందాక నేను పాడినది. మళ్ళీ పాడమంటే గాథ గానము చేస్తాను విను.

పద్మసమాగమ ప్రమద వాచాల
బహువిధ ద్విజకుల పరిగీత మైన
కమలాకరప్రాప్తి కాకుండ చెట్టి
విధిని హంసావళి విహరింప గలదు!

కమలాకరుడు గాథ విని హంసావళిని స్పృశిస్తూ అనంగపరవశుడై ఆమెను పొందాలని యుక్తి వెతుకుతున్నాడు. వైనాశికోపాఖ్యానంవల్ల తండ్రి విమలాకరుడు కమలాకరుణ్ణి పిలిపించి "కుమారా! రాజులకు సోమరితనము ఎంతమాత్రమూ పనికిరాదు. మంత్రబద్ధమైన సర్పము వలె సోమరులైనరాజులు వినాశము పొందుతారు. ఎంతకాలము చూచినా నీవు సుఖలోలుడవై రాజ్యసంపాదనేచ్ఛ చూపకుండా ఉన్నావు. మన్ను తిన్న పామువలె నీవు ఈ కూర్చుండటము కూడదు. నే నుండగానే సుఖభోగవ్యసనాలు నీవు కొంత తగ్గించుకొని పురుషకారం పూనుకోవలె" అని మందలించినాడు. కమలాకరుడు సేనాసమేతుడై భూమి దద్దరిల్లేటట్టు, శత్రువులహృదయాలు తల్లడిల్లేటట్టు తరలి కొన్నాళ్ళు ప్రయాణము చేసి అంగరాజును ఎదుర్కొని అతని దళాన్ని సంహరించినాడు. కమలాకరుడు శౌర్యము ప్రదర్శించి అంగరాజును పట్టుకొని బంధించి, విశ్వాసపాత్రుడైన ప్రతీహారునికి అప్ప చెప్పి, తండ్రిదగ్గరికి పంపినాడు. అతడు ప్రతీహారముఖముగా తనరాజ్యసంపాదనేచ్ఛ తెలియచేసి క్రమేణా శత్రురాజులను జయించి విదిశానగరోపాంతమున సేనతో విడిసి మేఘమాలి వద్దకు దూతను పంపినాడు. మేఘమాలిమహారాజు దూతముఖాన కమలాకరుడు కన్యార్థము వచ్చినాడని గ్రహించి సంతోషించి అతనిదగ్గరికి వచ్చి అతిథిసత్కారములు చేసి దూతచేయదగినపనికి స్వయంగా ఇంత శ్రమ పడ్డా వేమి? నీవు కోరినదీ నేను కోరినదీ ఒకటే. కారణము విను. పసితనంనుంచీ మా అమ్మాయి హంసావళి హరిపూజాయుక్తచిత్త. ఈశిరీషకుసుమకోమలికి ఈడైనవరుడు ఎవరా అని తలచి తలచి నిద్ర పట్టక నాకు జ్వరము తగిలింది. తచ్ఛాంతికై హరిపూజ చేసి నిద్రించగా స్వప్నములో హరి సాక్షాత్కారమై "హంసావళి చేతితో నిన్ను స్పృశిస్తే నీజ్వరము శాంతిస్తుంది. హంసావళీవివాహానికై చింతపడకు. ఈమెకు కమలాకరుడు

భర్త కాగలడు. కొన్నాళ్ళపాటు ఈమెకు శ్రమ తప్పదు" అని అనుగ్రహించినాడు. నేను మేలుకొని కుమారీహస్తస్పర్శవల్ల జ్ఞానము పోగొట్టుకొన్నాను. మీసమాగమము కేవలము దైవనిశ్చితము. నీకు హంసావళిని దానము చేస్తున్నాను" అన్నాడు. మేఘమాలి కుమారికి లగ్నము నిర్ణయించి నిజరాజధానికి వెళ్ళినాడు.

## కనకమంజరి సాహసము

తండ్రి చేసిన నిర్ణయానికి హంసావళి సంతోషించింది కనకమంజరి అనే చెలికత్తెతో రహస్యంగా "సఖీ, చిత్తరువులో ఉన్నవాడు నా హృదయాన్ని దొంగిలించినాడు. నాతండ్రి కుదిర్చిన సంబంధము ఇదేనా! చిత్తరువులో ఉన్న అతనిపేరు పెట్టుకొని అన్యుడు ఎవరయినా వస్తే అతనికి నన్ను ఇవ్వడానికి తండ్రి సంకల్పించాడా? ఈసంగతి నీవు కని పెట్టు" అని పంపగా కనకమంజరి సిద్ధయోగినీ వేషము వేసికొని కమలాకరుని విడిదికి వెళ్ళి అతని యౌవనశ్రీలు చూచి, అతని. రూపు తన హృదయములో హత్తుకోగా ఆక్షణములో సమాధిలో ఉన్నదానివలె అభినయించి అతనితో కూడనిజన్మ జన్మకాదని తలపోసి అతనికి ఒక మణి కానుకగా ఇచ్చింది. కమలాకరుడు ఆమణిని స్వీకరించి ఆదరించగా ఆమె "రాజపుత్రా! ఈమణిప్రభావము నాకు తెలునును. ఈమణిని ధరించి యుద్ధము చేస్తే శత్రువు చేతిలో ఖడ్గము స్తంభిస్తుంది. నీగుణాలకు మెచ్చి అనురాగముతో నీకు దీన్ని అర్పించాను. నీకు మణివల్ల చాలా ఉపయోగము. నాకు అవసరములేదు" అన్నది.

కమలాకరుడు సంతోషముతో పొంగిపోయి ఆమెను భిక్షకు ఉండమని వేడగా ఆమె "ఒక భిక్షకన్న ఎక్కువ చెయ్యను" అని వెళ్ళిపోయింది. కనకమంజరి యోగినీవేషము తీసివేసి హంసావళి దరికి వెళ్ళి "సఖీ! చెప్పడానికి వీలులేకపోయినా నీమీది భక్తివల్ల చెపుతాను. నేను

సిద్ధురాలు కేవలం నేను రాజపుత్రికను కన్యకని నమ్మి నన్ను పరిచా
పించి "అమ్మా నీవు నాకు ఇచ్చిన వస్త్రము" అని అడిగినాడు. అతను
ప్రతీకారమునకై నేను చూపించిన దారిని భూతావిష్టమైనట్టు తెలుసుకున్నాను. అందుకే
వచ్చానమ్మ. ఆపైన నన్ను కమలాకరుని దగ్గిరికి తీసుకొని వెళ్ళి
నారు. అతని స్థితి నాకు బాగా తెలిసివచ్చింది. అతనికి భూతావేశము పట్టగా
అనుచరులు ఉపకరణాలతో పాములతో కట్టి బలాత్కారంగా అతన్ని బంధిం
చారు. నేను మాంత్రికురాలినని చెప్పి అతని దోషాన్ని పోగొడతానని
చెప్పి నీదగ్గిరికి అవకాశంతో వచ్చాను. ఇప్పుడు నీ మనస్సు ఎలా
ఉంటే అలా చెయ్యి" అని చెప్పింది.

అతని పాతకముకంటె అనిష్టవార్త విని సరళహృదయ హంసావళి సొమ్మసిల్లి లేచి "అయ్యో! బ్రహ్మకు నేను ఉత్తమ సృష్టిమీద ద్వేషమా? ఇతన్ని నేను ప్రియునిగా వరించాను. నాకు సాధ్యమవు తాడా! మరణమో మంగళమో తేలవలె. కర్తవ్యము చెప్పు" అని పలికింది. మాయావిని కనకమంజరి "సఖీ! నీవేషాన ఒక చేటికకు ఇత నితో పెళ్ళిచేసి ఆపెళ్ళిహడావిడిలో మనము ఎక్కడికైనా పారిపోయి సాధిద్దాము." అని యుక్తి చెప్పింది.

అప్పుడు హంసావళి "అలా అయితే చెలీ నీవే నావేషము వేసు కొని రాజపుత్రునితో వివాహము కానీ; నీకన్న ఆప్తురాలు నాకు ఎవరు?" అని ఆ కపటసఖిని వేడింది. కనకమంజరి "మంచిది. దిగులు పడకు. యుక్తిగా అలాగే చేస్తాను. అప్పుడు నేను ఎలాచెపితే నీవు అలాగే తూచా తప్పకుండా చేయాలి" అని ఆమెను సమాధానపరిచి వెళ్ళి తనకు విశ్వాసపాత్రమైన అశోకకరి అనే సఖికి తన గుట్టూమట్టూ కోరిక చెప్పివేసింది. కనకమంజరి హంసావళికి కర్తవ్యము బోధించి వెంగపోగొట్టింది. వివాహకాలము సమీపించగా వరుడు కమలాకరుడు చతురంగబల సమేతుడై సంధ్యవేళ వచ్చినాడు. అందరూ ఉత్సవకోలా

హంసావళితో ఉండగా [illegible] మాయాహంసావళి [illegible] అవతరించవలె నని చెలులతో చెప్పి [illegible] తీసుకొని వెళ్ళింది. అక్కడ కనకమంజరి తాను హంసావళి వేషాన్ని వేసుకొని హంసావళికి అశోకకరి వేషము వేసి, అశోకకరికి తన వేషము వేయించి ముహూర్తము సమీపించగా హంసావళితో "సఖీ! నీవు ఉదకనాట ద్వారాన ఊరివెలుపలకు వెళ్ళి కొంచెము దూరములో ఉన్న శాల్మలీవృక్షపు తొర్రలో దాగి ఎదురుచూస్తూ ఉండు" అని చెప్పింది. హంసావళి సరళహృదయ కావడంచేత కనకమంజరి కాపట్యము గ్రహించలేక దానిమాట పాటించి కన్నుమూసుకొన్నా కానరాని చిమ్మచీకట్లో ఊరుదాటి బూరుగుచెట్టు తొర్రలో దూరేందుకు భయపడి మర్రిచెట్టు మీదికి ఎక్కి ఆకులగుంపములో దాగి కనకమంజరికై నిరీక్షిస్తున్నది.

నగరులో వివాహలగ్నము సమీపించగా రాజు హంసావళీరూపములో ఉన్న కనకమంజరిని తెచ్చి పెళ్ళిపీటలమీద కూర్చోపెట్టినాడు. ఆమె శిరస్సుమీద మేలిముసుగు ఉండడమువల్ల వరుడు కమలాకరుడు ఆమెను సరిగా చూడక అనుమానించక ఆతన్ని వివాహమాడినాడు. నక్షత్రము బాగా ఉన్నందువల్ల కమలాకరుడు మాయాహంసావళిని తోడ్కొని పురీశ్చిమద్వారాన తరలిపోయి శాల్మలీవృక్షాన్ని సమీపిస్తున్నాడు. ఆతరువును చేరగానే పెళ్ళికుమారునితో వినుగుమూయి ఉన్న కనకమంజరి హఠాత్తుగా భయపడిన దానివలె నటించి అతన్ని ఆలింగనము చేసికొన్నది. కమలాకరుడు ఉలిక్కిపడి ఏమిటని అడగ్గా మాయాహంసావళి అయిన కనకమంజరి కంట తడి అభినయించి "ఆర్యపుత్రా! నాస్వప్నములో ఈశాల్మలీవృక్షములోనుంచి ఒక రాక్షసి వచ్చి నన్ను చంపి తినేందుకు సిద్ధమైంది. అప్పుడొక విప్రుడు దాన్ని తరిమి నన్ను రక్షించినాడు. 'ఈచెట్టులోనుంచి రాక్షసి బైటికి వస్తే దాన్ని అగ్నిలో ఆహుతిచెయ్యి. వృక్షాన్ని కాలిపించు' అని అతడు చెప్పి

అదృశ్యుడైనాడు. నాకు మెలకువ వచ్చింది. ఈతరువును చూడగానే స్వప్నవృత్తాంతము కళ్ళకు కట్టినట్టుంది. భయపడ్డాను'' అని పలికింది. మాయాహంసావళి మాటలు నమ్మి శాల్మలీతరువును దగ్ధముచేయమని అనుచరులకు అతడు ఆనతి ఇచ్చినాడు. వారు అవృక్షాన్ని తగలబెట్టినారు. కనకమంజరి హంసావళి తరువుతో దగ్ధమైనదని లోలోపల సంతోషములో పొంగిపోయింది. ఆమె మనసు స్తిమిత పడింది. తనకు హంసావళి లభించిం దని కమలాకరుడు భ్రమపడి స్కంధావారానికి చేరినాడు. మర్నాడు ఉదయము వరుడు వధూ సమేతముగా తరలి త్వరితగతితో ప్రయాణము చేసి కోసలదేశము చేరినాడు. తండ్రి కమలాకరునికి రాజ్యాభిషేకము చేసి తపోవనానికి తరలినాడు. మాయాహంసావళీ రూపములో ఉన్న కనకమంజరి పట్టపురాణిగా భూమండలాన్ని పరిపాలన చేస్తున్నది.

శిల్పి మనోరథ సిద్ధుడు మాయాహంసావళి ఐన కనకమంజరిని చూచి ఆమె తనను గుర్తుపట్టి తలతీయిస్తుం దేమో నని వెరచి రాచనగరు వదలి ఎక్కడికో వెళ్ళినాడు. హంసావళి ఆరాత్రి వృక్షము మీదినుంచి కమలాకరుణ్ణీ కనకమంజరి చేయించిన వృక్షదహనము చూచి ఓహో నన్ను కనకమంజరి వంచన చేసి నాప్రియుణ్ణి హరించింది. నిజమనోరథసిద్ధికై నాచెలి నన్నే చంప యత్నించిందే! దుర్మార్గులను నమ్మినందుకు శాస్తి బాగా జరిగింది. ఈ కాలిన చెట్టు ఇంకా రగులుతూనే ఉంది. ఈఅగ్నిలో పడి చచ్చి కనకమంజరిని పట్టి పగ తీర్చుకొంటాను'' అని యోచించి వటవృక్షముదిగి అగ్నిలో ప్రవేశించదలచి క్షణములో మనసు మార్చుకొని "ఆత్మహత్య చేసుకోడం ఎందుకు! బతికి ఎప్పటికైనా కనకమంజరి మీద పగ సాధిస్తాను. నేను కొంత కాలము కష్టాలపాలు కావలసి ఉంటుం దనీ పెళ్ళికి బెంగపెట్టుకో వద్దనీ కమలాకరుడే నా భర్త అవుతాడనీ హరి స్వప్నములో నాకు చెప్పినాడు.

కొన్నాళ్ళపాటు నిదానించి చూస్తాను” అని నిశ్చయానికి వచ్చి నిర్జ నారణ్యానికి వెళ్ళింది. ఆమె దీనావస్థ కళ్ళారా చూచి చల్లగా రాత్రి ప్రవేశించింది. ఆకాశము, మంచుతుంపురు లనే కన్నీటిజడి కురిపించింది. హంసావళీ గుణానురక్తుడై ఆమె కన్నీరు తుడిచి బుజ్జగించే నిమిత్తము సూర్యుడు ఉదయించి కరములు సాచి, ఆశల అరుణిమ చూపి ఓదార్చి నాడు. హంసావళి మానవుల కంట పడక చిట్టడవులు తిరిగి నడిచి నడిచి దర్భలు గుచ్చుకొని అడుగులు గాయములు పడగా రమణీయారణ్యము చేరి అలసి కూర్చున్నది. వృక్షాలు పవనాహతికి కదులుతున్న కొమ్మ వీవనలతో వీచి ఆమెకు విశ్రాంతి కలిగించినవి. విరియపూచిన తీయ మావుల మీద కోయిలలు గొంతెత్తి పాడి మధువు చిలికినవి. పూల మొత్తాలు పుష్పాళ్ళు బహుళమై ఉండడమువల్ల హంసావళి శ్రీపాదా ర్చన చేయదలచింది. అడవినూతుల్లో స్నానాలు చేస్తూ ఫలాలు ఆరగిస్తూ హంసావళి ప్రియునికై నిరంతర హరిపూజాపరాయణ అయింది.

కోసలదేశములో కమలాకరునికి విధివశాన పురాణజ్వరము తగులు తున్నది. మాయాహంసావళి ఇలా ఆలోచన చేసింది. “నా చెలి అశోక కరి నేను చేసిన మోసాన్ని బైటపడవేస్తుం దేమో నని భయము వేస్తు న్నది. ఇది ఇలా ఉండగా గోరుచుట్టుమీద రోకరిపోటువలె రెండో భయము వచ్చి పడింది. పూర్వము అందరి సముఖములో హంసావళి తండ్రి కమలాకరునితో తన కుమారీ హస్తస్పర్శవల్ల పురాణజ్వరము ఎటువంటిదైనా తగ్గిపోతుందని చెప్పినాడు. కమలాకరునికి ఆమాట జ్ఞాపకము ఉంటే నేను హంసావళి అని భ్రమ పడి జ్వరాన్ని పోగొట్టే శక్తినాకు లేనందువల్ల గుట్టు బైటపడుతుంది. నన్ను నాశనము చేస్తాడు. ఈఅపాయము దాటి ఒడ్డున పడవలె. సిద్ధురాలిని పిలిపించి గాని వైద్యుణ్ణి పిలిపించికాని రాజు జ్వరముపోగొట్టాలి. ఆభూత వైద్యు నికే అశోకకరిని బలి వేసి దాని అవయవాలతో అతన్ని పూజిస్తాను.

ఆమూలాగ్రము కమలాకరునికి నివేదించి అభయము అడిగింది. కమలాకరుడు వృత్తాన్నన్ని శోకాక్రాంతుడై నాజాపెంకను పొందినందుకు పరితాపపడినాడు. అయ్యో! హంసావళి కరస్పర్శమాత్రాన జ్వరశాంతి కలుగుతుందన్నమాట నాకు జ్ఞప్తి లేకపోయిందే హంసావళిని వృత్తసహితముగా కాల్పించానే" అని వగచి హంసావళిని స్వప్నములో శ్రీహరి సాక్షాత్కరించి పలికిన పలుకులు కమలాకరుడు స్మరణకు తెచ్చుకొని ఆమె జీవించి ఉంటుం దనీ, తనకు సంప్రాప్త మవుతుం దనీ శ్రీహరి మాటలు యథార్థములు అవుతవనీ మనోరథసిద్ధుడు నిజమనోరథము తీర్చగలడనీ తలచి వెంటనే మనోరథసిద్ధుని పిలిపించి "భద్రుడా! ఈమధ్య నీవు శీతకన్ను వేశావు. క్షేమమా? దుష్టుల మాయలకు లొంగిన వాళ్ళకు మనోరథము ఎలా సిద్ధిస్తుంది?" అని అడిగినాడు.

మనోరథ సిద్ధుడు "ప్రభూ! అశోకకరివల్లనే ఈగుట్టు బైట పడింది. హంసావళికై ఏలినవారు విచారించవలసిన పని లేదు. ఆమె హరి పూజాయత్తచిత్త. ఆపూజ వృథాపోదు. ధర్మము తప్పక హంసావళిని కాపాడుతుంది" అని మనవిచేసి కమలాకరునివెంట హంసావళిని వెతకడానికి బయలుదేరినారు. కమలాకరుడు రాజ్యభారాన్ని ప్రజ్ఞాఢ్యు డనే మంత్రి చేతుల్లో పెట్టి, రాజధానినుండి రహస్యముగా బయలుదేరినాడు. అతడు మనోరథునితో పుణ్యక్షేత్రాలు, తపోవనాలు, వనాలు శరీరశ్రమకు లెక్కచేయక తిరుగుతున్నాడు. తిరిగి తిరిగి కమలాకరుడు హంసావళి తపస్సు చేస్తున్న అరణ్యములో ప్రవేశించి రక్తాశోకవృక్ష మూలమున పాండుక్షామ మనోహరమై చంద్రరేఖవలె కళామాత్రశేషమై నన్నగిల్లి ధ్యానముద్రలో ఉన్నదానిని చూచి అమరాంగన కాబోలని తలచినాడు. మనోరథసిద్ధుడు హంసావళిని ఆనవాలు పట్టి "హంసావళి దొరికింది!" అన్నాడు. హంసావళి ఇద్దరినీ చూచి వియోగదుఃఖము క్షణములో ముమ్మరమై కన్నీటితో కన్నులు కనపడకపోగా శరీర

పెరుగక మూర్ఛపాలైనది. కమలాకరుడు ప్రియాదర్శనో ద్రేకము అపారముకాగా సుఖదుఃఖములు కలిసిమెలిసి పోగా శరీరము ఎరుగక అవనీతలాన పడినాడు. మనోరథసిద్ధి హంసావళీ కమలాకరులను ఓదార్చి నాడు. కొంతసేపటికి అతనికి తెలివిరాగా అమందానందము అనుభ వించినాడు. ప్రియులు వియోగ వృత్తాంతము పరస్పరము చాలాసేపు చెప్పుకొన్నారు. ప్రియాసమేతంగా మనోరథసిద్ధితో కమలాకరుడు కోసలదేశానికి వెళ్ళినాడు. అతడు మామగారైన మేఘమాలిని పిలిపించి యథావిధిగా హంసావళీ హస్తస్పర్శను అనుభవించి పురాణజ్వరాన్ని పోగొట్టుకొన్నాడు. ధైర్యమువల్ల కార్యసిద్ధి పొందిన హంసావళీ దేవితో కమలాకరుడు సుఖము అనుభవిస్తూ మనోరథసిద్ధుని విడువక రాజ్యము పరిపాలిస్తున్నాడు.

ఇలాగా కష్టాల్లో అచంచల మైన ధైర్యమే కార్యసిద్ధికి కారణము అవుతుంది. జీవించి ఉంటే నీరాజును తప్పక చూస్తావు. ఈరీతిగా ముసలిబాటసారి కథ చెప్పి నామరణ ప్రయత్నాన్ని మానిపించి తన తోవను వెళ్ళినాడు. ఇలా చండకేతునిగృహములో భీమపరాక్రముడు నెమలిరూపము విడిచి మృగాంకదత్తునితో తిరిగి ఇలా పలికినాడు.

నేను బాటసారి మాటను పాటించి ఆత్మహత్యాప్రయత్నము విర మించి ఉజ్జయినికి వెళ్ళినాను. మీారెవ్వరూ అక్కడ కనపడక పోవడం చేత వెతికి వెతికి వంటపూటిల్లు చేరి తిండి తిని పూటకూళ్ళమ్మ ఇచ్చిన పక్కమీాద పరుండి నిద్రించి మేల్కొని కుతూహలముతో అక్కడి విష యాలు కనిపెట్టవలె నని కపటనిద్ర అభినయించినాను. పూటకూళ్ళమ్మ పిడికెడు యవధాన్యము ఇల్లంతా చల్లుతూ పెదవులు అదరగా మంత్రిం చింది. ఆయవలు వెంటనే మొలిచి మొక్కలై వెన్నులు వేసి పండి నవి. ఆమె వాటిని కోసి వేయించి విసిరి పేలపిండి చేసి ఆపిండి గిన్నెలో పోసి పెట్టి నీళ్ళు దానిమీాద చిలకరించి స్నానానికి వెళ్ళింది. ఆమె

మాంత్రికురా లని నేను గ్రహించి లేచి త్వరగా ఆగిన్నెలో పేలపిండి మరొక పేలపిండి కుండలో పోసి, ఆకుండలో పేలపిండి గిన్నెలో పోసి యథాప్రకారముగా ఉంచి పరున్నాను. పూటకూళ్ళమ్మ వచ్చి నన్ను లేపి మడికట్టుకో మని నాకు గిన్నెలో పేలపిండి వడ్డించి తాను కుండలో పిండి పెట్టుకొని మజ్జిగలో కలుపుకొని తిన్నది. వెంటనే ఆ పూటకూళ్ళది ఆడమేక అయింది. నేను కసికొద్దీ ఆ మేకను కటికవానికి అమ్మగా వాడిభార్య కోపగించి "నాస్నేహితురాలిని పూటకూళ్ళమ్మను మోసము చేశావా? తగినఫలము అనుభవిస్తావు" అన్నది. దానిబెదిరింపు విని పూటకూళ్ళకొంప వదిలి ఊరిబైట వటవృక్షముకింద నిద్రపోయినాను. కటికవాడిభార్య వచ్చి నామెడకు ఈతాడు కట్టి పోగా శాకినీమాయవల్ల నెమలినై పూర్వజ్ఞానంతో ఉంటూ వెంగవసి ఇటూ అటూ నేను తిరుగుతూ ఉండగా పిట్టలు పట్టేవాడు నన్ను పట్టుకొని బోయరాజుదగ్గిర ప్రతీహారుడైన ఈచండకేతువుకు కానుకగా ఇచ్చినాడు. ప్రతీహారుడు తనభార్యకు ఇవ్వగా ఆమె నన్ను వినోదార్థము మంటపములో ఉంచింది. దైవానుకూలంవల్ల నీవుఇక్కడికివచ్చి నామెళ్ళో తాడు విప్పివేయడంవల్ల పూర్వ నరరూపము పొందినాను. మనము ఇక్కణ్ణించి తప్పించుకొని పోదాము. రాత్రి జరిగిన విషయాన్ని చూస్తే నిన్ను బతకనీయడు. నేను యుక్తిచెబుతాను. యోగిని చేసిన సూత్రాన్ని నీవు కంఠానికి కట్టుకో. నెమలివై నీవు కిటికీలోనుంచి బైటపడు. ద్వారము బంధించినాడు కనుక గవాక్షమార్గమే మనకు శరణ్యము. నీవు మెడచాచితే నేను నీకంఠపాశాన్ని విప్పుకొని నామెళ్ళో కట్టుకొంటాను. నేను నెమలినై గవాక్షమార్గాన బైటికిరాగా నామెడలో తాడు నీవు విప్పితే మనము ఇద్దరము యథాప్రకారం మానవులము అవుతాము."

భీమపరాక్రమునిమాటలు విని మృగాంకదత్తుడు అతడు చెప్పినట్లు చేసి ఇద్దరూ చండకేతునిగృహములోనుంచి తప్పించుకొని తమ నివా

సానికి వెళ్ళినారు. ఇద్దరూ తమకష్టాలు చెప్పుకొని రాత్రి గడిపినారు. తెల్లవారిన తరువాత మృగాంకదత్తునిదగ్గిరికి బోయరాజు వచ్చి రాత్రి హాయిగా నిద్రించారా అని అడిగి వినోదముగా పాచికలాటకు పిలిచి నాడు. సరిగా అప్పుడే ప్రతీహారుడు చండకేతువు రాగా శ్రుతధి జ్ఞాపకము ఉంచుకొని "పాచిక లెందుకు, నెమలిని ఆడిస్తా నన్నావు కదా!" అని పలికినాడు. శబరరాజు వెంటనే ప్రతీహారుని పంపి నెమలిని తెమ్మని ఆజ్ఞచేసినాడు. చండకేతువు మయూరాన్ని తీసుకొని వద్దామని ఇంటికి వెళుతూ "రాత్రి నాతో వచ్చినవాణ్ణి నెమలి ఉన్న గదిలో పరుండబెట్టి నాను. అదొంగను పంపివేయడం మరిచిపోయినాను! సరే ఆ నెమలినీ వాణ్ణీ ఒక్కసారే పాతమారుస్తాను" అనుకొంటూ వెళ్ళి గదిలో వెతకగా చోరుడూ లేడు మయూరమూ లేదు. చండకేతువు హాతాశుడై దుఃఖపడుతూ బోయరాజుదగ్గిరికి వచ్చి నెమలిని దొంగఎత్తుకొని పోయినా డని విన్నవించినాడు. శ్రుతధి చండకేతువుకేసి తేరిపార చూసి నవ్వినాడు. మృగాంకదత్తుడూ అక్కడివారూ తెగనవ్వడము సాగించారు. అభిప్రాయ మేమో శబరరాజుకు తెలియకపోవడంవల్ల నిర్బంధ పెట్టి మృగాంకదత్తుని అడగ్గా అతడు రాత్రి జరిగిన చర్య వూసగుచ్చినట్టు చెప్పినాడు. చండకేతువునూ అంతఃపురరక్షకుణ్ణీ వెంటనే ఉరి తీయ మని శబరరాజు ఆజ్ఞ చేసి పాపిష్ఠిభార్యను దూరముగా కనపడకుండా వెళ్ళిపొమ్మని తరిమివేసినాడు. శబరరాజు వేడుకోవడము చేత మృగాంకదత్తుడు సపరివారంగా పెల్లెలో కొన్నాళ్ళు మిత్రుని ఆతిథ్యము స్వీకరిస్తున్నాడు.

## తరంగము : ౭౨

## గుణాకరుని కథ

మృగాంకదత్తుడు విమలబుద్ధి శ్రుతధి మొదలైన వారితో శబరరాజు గృహములో ఉండగా శబర సేనాధిపతి తత్త్వరపాటుతో వచ్చి

రాజుతో "దొరా! తమ ఆజ్ఞాప్రకారము దేవికి బలి నిమిత్తము తగిన వాణ్ణి సంపాయించినాము. ఆపురుషుడు మన నూరుగురు వీరులను చావ చితకకొట్టినాడు. అమితముగా దెబ్బలు తిని గాయాలతో అలసిపోయి నాడు. అతన్ని తీసుకొని వచ్చాము" అని మనవి చేస్తే శబరరాజు ఆపురుషుని తనకు కనపరచ మన్నాడు. సేనాధిపతి ఆజ్ఞ చేసినాడు. ఆపురుషుడు మదపుటేనుగువలె కనబడినాడు. శరీరము ధూళిధూసరితమై రక్తసిక్తమై ఉన్నది. పాశము తెంపుకోవలెనని ప్రయత్నము చేసినాడు. మృగాంకదత్తుడు పాశబద్ధుని మంత్రి గుణాకరునిగా ఆనవాలు పట్టి దుఃఖిస్తూ అతని కంఠమును కౌగలించినాడు. శబరరాజు అతన్ని మంత్రి గుణాకరుడని గ్రహించి వినయముతో ఓదార్చి తనగృహమునకు తీసుకొని వెళ్ళి స్నానము చేయించి గాయాలకు కట్లుకట్టి, వైద్యము చేయించి పథ్యముగా అన్నపానాదు లిచ్చి స్వస్థుని చేసినాడు. మృగాంకదత్తుడు అడిగినమీదట గుణాకరుడు స్వీయవృత్తాంతము నివేదిస్తున్నాడు.

"దేవా! పారావతనాగశాపముచేత మనము ఒకరిని ఒకరు ఎడబాసి తలోదారి అయినాము. కర్తవ్యతామూఢుణ్ణి కాగా ఎడారిలో తిరిగాను. కొన్నాళ్ళకు నాకు తెలివి వచ్చింది. 'అయ్యో! విధి ఇంత అననుకూలమా? నగరులో నడవలేని నాజూకు మృగాంకదత్తుడు మండుటెడారిలో కాలుతీసి పెట్టగలడా? నాస్నేహితు లందరిగతి ఏమయిందో' అని పదేపదే బాధపడి వింధ్యవాసినీదేవి దగ్గిరికి వెళ్ళినాను. అహోరాత్రాలు బలులవల్ల ఆలయము రక్తసిక్తమై యమాలయమువలె కనపడినది. నేను దేవికి సాష్టాంగపడి లేచిచూడగా నాప్రక్కనే ఒక శవము కనపడింది. ఆశవకంఠమున కత్తి నిలబడి ఉన్నది. అతన్ని చూచిన తరువాత నీఎడబాటు సహించలేక ఆత్మబలి చేదామని సంకల్పము ఉదయించింది. నేను పరుగున పోయి శవము మీది కత్తి లాగుకొనే లోగా సన్యాసి నాయత్నాన్ని వారించి కనికరించి నాకు బోధ చేసి

నాడు. "కుమారా, చచ్చి చేసే దేముంది? బతికితే ఎడబాటు తీరి నీస్నేహితులను కలుసుకోగలవు. అందుకు దృష్టాంతము విను.

## వి నీ త మ తి క థ

పూర్వము అహిచ్ఛత్రనగరాన్ని ఉదయతుంగు డనే రాజు పరిపాలిస్తూ ఉండేవాడు. అతని ప్రతీహారుడు కమలమిత్రు డనేవానికి వినీతమతి అని సార్థకనామ ధేయమున కుమారుడు ఉన్నాడు. ఒకనాడు వినీతమతి రాత్రి మేడమీద తల్పముపైన పరుండి దిగంగనా తాటంకమువలె నున్న చంద్రలేఖను చూచి "ఆహా! ఈవెన్నెలవల్ల లోవలన్నీ గచ్చు చేసినట్టున్నది. హాయిగా ఈవెన్నెల్లో విహారము చేస్తాను" అని తలచి కోరిక తీరిక లెత్తగా షికారు వెళ్ళినాడు. వినీతమతి కొంతదూరము వెళ్ళగా రోదనధ్వని వినపడింది. కొంతదూరము అతడు నడక సాగించినాడు. ఒకకన్య చెట్టుదగ్గిర కూర్చుని ఎలుగెత్తి ఏడుస్తున్నది. వినీతమతి ఆమెదగ్గిరికి వెళ్ళి "కల్యాణీ! ఎవరు నీవు? ఎందుకు ఏడుస్తావు?" అని అడిగినాడు.

ఆకన్య చెపుతున్నది. "మహానుభావా! నేను గంధమాలి అనే నాగరాజపుత్త్రిని. నన్ను విజయవతి అనిపిలుస్తారు. పోరులో పారిపోయిన నాతండ్రిని వాసుకి "పాపీ! శత్రువుల చేతుల్లో ఓడి వారివశమై పో" అని శపించినాడు. వాసుకీ శాపవశాన నాతండ్రి కాలజిహ్వు డనే యక్షుని చేతుల్లో ఓడి అతనికి పువ్వులు ఏరి తెచ్చి పెట్టే దాసు డయినాడు. నేను పార్వతిని మెప్పించి వరము వేడినాను. గిరిజ ప్రత్యక్షమై ఇలా ఆనతి ఇచ్చింది. "అమ్మాయీ, విను. మానససరస్సు సహస్రదళ పద్మము బాలారుణాతపమువల్ల ఆదిశేషుని ఫణామణి మరీచివలె ప్రకాశిస్తూ ఉంటుంది. ఒకనాడు కుబేరుడు మానససరోవరములో స్నానము చేసి భక్తిప్రపత్తులతో సహస్రదళపద్మములో ఈశ్వరార్చన ఆరంభించి

నాడు. అప్పుడు అతని అనుచరులు యక్షులు సరస్సులో చక్రవాక ములై హంసలై విహరిస్తున్నారు. ఆమానస సరోవరములో మీతండ్రికి విరోధి అయిన కాలజిహ్వుని సోదరుడు విద్యుజ్జిహ్వుడు తన ప్రియు రాలితో చక్రవాకరూపము ధరించి రమిస్తున్నాడు. సురతసమయాన విద్యుజ్జిహ్వుడు పక్షములు జాడించగా, కుబేరుని చేతిలో అర్ఘ్యపాత్రము జారి కింద పడినది. కుబేరుడు కోపముతో మండిపడి శివార్చనకు అవ రోధము కలిగిందని విద్యుజ్జిహ్వుణ్ణి అతని ప్రేయసినీ నిరంతరమూ జక్కవలై సరసిలో ఉండమని శాపమిచ్చినాడు. ఆజక్కవ రాత్రిపూట భార్యకై విరాళితో ఉండగా, ఆవిద్యుజ్జిహ్వుని తమ్ముడు కాల జిహ్వుడు జక్కవపెంటిరూపుతో అతన్ని రంజింపచేస్తూ, పగలు యక్షరూపాన్ని ధరిస్తున్నాడు. నీతండ్రి అతనికి సేవకుడై నిరంతరము సాహచర్యము చేస్తూ ఉంటాడు. అమ్మాయీ! అహిచ్ఛత్రనగరాధీశ్వ రుని ప్రతీహారకుమారుడైన వినీతమతిని పరాక్రమశాలిని పంపు. ఈఅశ్వాన్నీ ఖడ్గాన్నీ తీసుకుపో. వినీతమతి అశ్వమెక్కి ఖడ్గపాణియై ఆయక్షుని గెలిచి నీజనకుని విడిపిస్తాడు. ఈఖడ్గము ఎవనిచేతుల్లో ఉంటే అతడు రాజన్యమును జయించి భూమండలాన్ని పరిపాలిస్తాడు" ఆదేవి అశ్వాన్నీ ఖడ్గాన్నీ ఇచ్చి అంతర్ధానమైంది. నాకోరికను తీర్చు మహానుభావా!" ఇలా ఆమె ప్రార్థించగా వినీతమతి అంగీకరించినాడు.

అప్పుడానాగకన్య అశ్వాన్నీ, వీరకటాక్ష శ్రీలవలె, తారామండిత గగన శ్రీలవలె మెరసిపోతున్న ఖడ్గాన్నీ తెచ్చి వినీతిమతికి ఇచ్చింది. అతడు ఖడ్గహస్తుడై అశ్వారూఢుడై నాగకన్యను ఎక్కించుకొని అశ్వ ప్రభావమువల్ల వెంటనే మానససరోవరానికి వెళ్లినాడు. వినీతమతి యక్షుల వశములో ఉన్న గంధమాలిని చూచి విడిపించ దలచి వారిని కత్తితో కొట్టి తరిమివేసినాడు. అదిచూచి కాలజిహ్వుడు చక్రవాకి రూపము విడిచి ప్రళయకాల మేఘమువలె గర్జిస్తూ లేచినాడు. ఆకాశ

ములో పోరు ప్రారంభమైనది. వినీతమతి అశ్వముతో గగనముమీదికి ఎగిరి కాలజివ్హ్వుని జుట్టు పట్టుకొని తల నరకబోగా వాడు కనికరించ మని అతన్ని వేడినాడు. కాలజిహ్వుడు ముక్తుడై సర్వబాధలను దూరీకరించే తపఃఖంగాన్ని వినీతమతికి కానుకగా అర్పించి వినీతుడై గంధ మాలిని దాస్యమునుంచి విడిపించినాడు. గంధమాలి ఆనందాంబుధిలో తేలి వినీతమతికి తన కుమారి విజయవతి నిచ్చి ఇంటికి వెళ్లినాడు. వినీతమతి ఖడ్గాంగుళీయకములతో ప్రియాసమేతుడై అశ్వారూఢుడై ప్రభాతవేళ నిజనివాసము చేరినాడు. తండ్రి కొడుకునూ కోడలినీ చూచు కొని పొంగిపోయినాడు. అహిచ్ఛత్రాధిపతి వినీతమతి వీరకృత్యము విని సంతోషించినాడు. వినీతమతి విజయవతిని పరిణయమాడినాడు.

గుణవర్ధనుడైన వినీతమతిని చూచి, తండ్రి ఒకనాడు ఏకాంతములో పలికినాడు "కుమారా! మన ఏలికకు ఉదయవతి అనే విద్యావతి కుమార్తె కలదు కదా. బ్రాహ్మణ క్షత్రియులలో ఎవరైనా ఉదయ వతి శాస్త్రవాదములో జయిస్తే అతడు ఆమెను వివాహము చేసుకో వచ్చును. మనరాజు ఏర్పరచిన స్వయంవరవిధాన మిది. చాలామంది ఆమెతో శాస్త్రవాదము చేసి తల ఎత్తుకోలేక తిరిగి వెళ్లిపోయినారు. క్షత్రియకులదీపకుడవై, వీరుడవై వనితను వాదములో ఓడించ లేని వాడవా? రాజపుత్రిని గెలిచి వివాహమాడు."

వినీతమతి "తండ్రీ! స్వభావముచేత సుకుమార లయిన కోమలాంగ నలతో వాదించడ మేమిటి. అయినా మీమాట పాటిస్తాను" అని సమాధాన మిచ్చినాడు.

వినీతమతితండ్రి రాజసన్నిధికి వెళ్ళి "దేవా, నాకుమారుడు రేవు ఉదయవతిని రాజపుత్రితో వాదిస్తాడు" అని మనవి చేసుకొన్నాడు. వినీత మతి అందుకు అంగీకరించి కమలాకరమువంటి రాజసభలో ప్రవేశించగా గుణశాలుల భ్రమరాక్షులు అతనిపై పడినవి. కొంచెము సేపటికి

రాజపుత్రి ఉదయవతి గుణోత్కృష్టయై మన్మథుని లతా ధనస్సువలె ప్రవేశించినది. ఆరంభములోనే పూర్వపక్షము చేస్తున్నవా అన్నట్లు ఆమె కరకంకణములు క్రమమై శబ్దించినవి. ఉదయవతి మరకతపీఠమున కూర్చున్నది. వినీతమతి ఆమెతో నీతిశాస్త్రంతుడై ధీవిభవాన్ని ప్రకటిస్తూ శాస్త్రవాదన చేసి నిగ్రహస్థానాలలో నైపుణ్యము చూపి ఆమెను జితాస్మి అనిపించినాడు. ఉదయవతి నిరుత్తరకాగా, విద్వత్సభ వినీతమతిని స్తుతించింది. ఉదయతుంగుడు తగిన అల్లుడు దొరికినందు వల్ల కుమార్తె వాదములో ఓడినా జయముగా తలచి సంతోషించినాడు. అతడు ఉదయవతిని వినీతమతి కిచ్చి వివాహము చేసినాడు. మామ గారు అల్లునికి అరణముగా అనేక రత్నరాసులు అర్పించినాడు. వినీతమతి నాగకన్య రాజకన్యలతో ఇహలోకసుఖాలు అనుభవిస్తూన్నాడు.

ఒకసారి వినీతమతి జూదమాడి ఓడిపోయే సమయమురాగా విప్రుడు అతిథిగా వచ్చి భోజనసామగ్రి ఇప్పించమని వేడినాడు. వినీతమతి కోపముతో సేవకుని పిలిచి చెవిలో చెప్పి, ఇసుకతో నిండిన పాత్ర పైన ఆచ్ఛాదన ఉంచి బ్రాహ్మణునికి ఇప్పించినాడు. విప్రుడు అమాయకుడై అందులో బంగారము ఉన్నదని భ్రమసి ఏకాంతములో పాత్రను చూడగా ఇసుక కనపడింది. మోసపోయినాను గదా అని అతడు విచారిస్తూ ఇంటికి వెళ్లినాడు. వినీతమతి తాను చేసిన అకార్యము తలపెట్టక జూదముమాని ప్రియురాండ్రతో హాయిగా యథేచ్ఛగా ఉంటున్నాడు.

ఉదయతుంగ మహారాజుకు వార్ధకము వచ్చింది. రాజ్యపాలనా పటిమ తగ్గిపోగా అతడు అల్లునికి రాజ్య మిచ్చి ఆత్మశ్రేయస్సుకై మందాకినీ తీరానికి వెళ్ళినాడు. వినీతమతి రాజై దశదిశలు జయించి అంగుళీయక మహిమాతిశయమువల్ల ఈతిబాధలు లేక రామరాజ్యము వలె పరిపాలిస్తున్నాడు.

రత్నచంద్రమతి అనే వాదీభసింహుడు రాజసన్నిధికి వచ్చి రాజును

బౌద్ధ భిక్షువుకు తెలియచెప్పినాడు. రాజు పదికోట్ల సవర్ణాలు అర్థులకు అర్పించాడు. యథాప్రకారంగా అతనికి రాత్రి స్వప్నములో పరలోక యాత్ర సంభవించినది. దండహస్తులు యథాపూర్వకముగా సికతము భోజనముగా పెట్టినారు. వారు కారణము చెప్పారు. "రాజా! నిన్న చేసిన దానము వృథా. అరణ్యములో చోరులు విప్రుణ్ణి కొంచి చంపి వేశారు. నీవు రక్షించ లేవు. రక్షణ చేయని నీదానము వృథా. ఈసారి రెండింతలు దానము చెయ్యి" ఆ మాటలు విని మేలుకొని బౌద్ధభిక్షువుతో రాజు చెప్పినాడు. వినీతమతి ద్విగుణీకృతముగా దాన ధర్మాలు చేసి గురువుదగ్గిరికి వెళ్ళి "ఆచార్యా! ధర్మాచరణలో ఇన్ని ఇక్కట్లూ లోపాలూ సంభవిస్తూ ఉంటే ఎలాగ?" అని అడిగితే గురువు "దేవా, ధీరులు ధర్మము ఆచరిస్తారు. అందుకు దృష్టాంతము విను:

## వ రా హ బో ధి స త్త్వు ని క థ

పూర్వము వింధ్యాద్రిగుహలో బుద్ధాంశసంభూతమైన వరాహము మిత్రమైన మర్కటముతో నివసిస్తున్నది. అది అన్ని జంతువులకూ మేలు చేస్తూ స్నేహితునితో అతిథిపూజలతో కాలక్షేపము చేస్తూన్నది. ఇలా ఉండగా ఒకసారి అయిదురోజులు విరామము లేకుండా ముసురు పట్టింది. ఏజీవమూ ఇటూ అటూ తిరిగేందుకు శక్యము కాకుండా ఉన్నది. అయిదవనాడు కోతి నిద్రపోతూ ఉండగా గుహాద్వారాన ఒకసింహము భార్యాపుత్ర సహితంగా వచ్చి భార్యతో "ప్రేయసీ! ఈముసురులో మనకు ఏజంతువూ దొరకదు. ఆకలి దహించివేస్తున్నది. మనము చనిపోతాము. ఏమిచేదాము?" అన్నది.

ఆడసింహము "ఆకలితో చచ్చిపోతాము. మీాఇద్దరూ నన్ను తినండి. నీవు దొరవు. సుతుడు ప్రాణాధికుడు. అందువల్ల నన్ను చంపితిను. నేను పోతే మరోభార్య నీకు లభించకపోదు. నావల్ల నీకు సుఖము కలుగుగాక" అన్నది.

ఒకసారి ఉత్తరదేశమునుంచి ఇందుకలశు డనేరాజపుత్త్రుడు అతిథిగా వినీతమతిదగ్గరకు వచ్చినాడు. రాజు అతన్ని గౌరవించి వచ్చినపని అడగితే ఆరాజకుమారుడు "దేవా! అర్థిజనచింతామణివి! ప్రఖ్యాతి పొందిన దానవీరుడవు! ప్రాణాలు అర్థించినా నీవు అర్పించే మహానుభావుడవు. నాతమ్ముడు కనక కలశుడు నన్ను రాజ్యములోనించి వెళ్ళగొట్టినాడు. నీసహాయార్థము వచ్చాను. మహావీరా! నీఖడ్గాశ్వములు నా కిస్తే, వాటిప్రభావమువల్ల దాయాదిని జయిస్తాను". అని ప్రార్థించినాడు. వినీతమతి వెంటనే రాజ్యక్షేమకారణము లైన ఖడ్గాశ్వములను రాజ కుమారునికి ఇచ్చివేసినాడు. మంత్రులు ఖడ్గమునూ గుర్రాన్నీ ఇవ్వవద్దని తలలు వంచి ఉస్సురని నిట్టూర్పులువదలినా వినీతమతి వినలేదు. ఇందు కలశుడు ఖడ్గాశ్వములవల్ల దాయాదిని జయించి రాజ్యముపొందినాడు. రాజ్యముపోగొట్టుకొన్న అతనిసోదరుడు కనకకలశుడు వినీతమతి దగ్గరికి వచ్చి దుఃఖముతో చిచ్చులో పడ సంకల్పించినాడు. వినీతమతి మంత్రులతో "అయ్యో! పాపము! ఇతడు నాదోషమువల్ల ఈదశకు వచ్చినాడు. నారాజ్యాన్ని ఇతనికి అర్పించి నాదోషాన్ని దిద్దుకొంటాను. సంతానము లేనినాకు ఇతనేపుత్త్రుడై రాజ్యభారము నిర్వహిస్తాడు" అని పలికి మంత్రులు కూడ దని చెప్పినా కనకకలశుని రప్పించి అతనికి తనరాజ్యము అర్పించి, సమస్తకోరికలనూ జయించి, నిర్వికల్పచిత్తుడై రాజధాని వదలి భార్యలతో వెళ్ళిపోయినాడు. ప్రజలు కల్పవృక్షము వంటి మహీపతి రాజ్యత్యాగము చేయుడమువల్ల చింతించి నగరము వదలి రాజును అనుసరించినారు. రాజు ఎలాగో శ్రమపడి ప్రజానీకాన్ని సంతృప్తి పరచి అడవికి పోయినాడు. క్రమేణ భార్యాసహితముగా వినీతమతి కాలుతున్నఎడారిలో ప్రవేశించి ఒక్కచోట మార్గాయాసము వల్ల అలిసి కూర్చోగా అతనికీ భార్యలకూ నిద్రపట్టింది. తర్వాత వినీతమతి నిద్ర లేచి చూడగా భూలోకనందన వనమని అనిపించే

చక్కని ఉద్యానవనముగా ఎడారి మారిపోయింది. తామరలు చల్లని తియని నీటితో నూతులు, పచ్చనిపచ్చిక, ఫలభారనమ్రము లైన తరువులు, శీతలచ్ఛాయలలో శిలావేదికలతో తోట కళకళ లాడింది. మతిభ్రమా ? స్వప్నమా? దేవతానుగ్రహమా? అని వినీతమతి అద్భుత పడగా గగనమార్గాన సంచరిస్తున్న సిద్ధదంపతులు "రాజన్! నీసాత్త్విక శక్తివల్ల పూవులు పూచి కాయలు కాచి ఎడారి వనమై విలసిల్లింది. ఈ ఉద్యానవనములో నీవు స్వేచ్ఛందముగా విహరించు" అనగా అతడు భార్యలతో తపస్సు ఆరంభించినాడు. శిలావేదికమీద ఒకపురుషుడు ఉరి పోసుకుని చనిపోతూ ఉంటే వినీతమతి అతని మరణప్రయత్నము మాన్పి మరణోద్యోగానికి కారణము అడిగినాడు. అతడు ఇలాచెవు తున్నాడు.

"అయ్యా, నావృత్తాంతము ఆమూలాగ్రము విను. నేను నాగశూరుని కుమారుణ్ణి, సోమశూరుణ్ణి. నేను పుట్టగానే జ్యోతిష్కులు దొంగను అవుతా నని చెప్పారు. అందుచల్ల నాతండ్రి నన్ను ధర్మశాస్త్రములో ప్రవేశ పెట్టినాడు. ధర్మశాస్త్రాధ్యయనము చేసి దుష్టసహవాసమువల్ల దొంగతనము నేర్చాను. విధిలిఖితము ఎవడు చెరపగలడు? ఒకసారి చోరులమధ్యలో ఉన్న నన్ను రాజసేవకులు పట్టుకొని తక్కిన వాళ్ళతోపాటు వధ్యస్థానానికి తీసుకొని పోయినారు. సరిగా అప్పుడు రాజుగారిఏనుగు కట్టు తప్పి జంతువులను చంపుతూ రాగా తలారులు నన్ను విడిచి పారిపోయినారు. నేనూ పారిపోయినాను. నన్ను కొరత వేశా రని వదంతి మాతండ్రిచెవుల పడగా ఆయన చనిపోయినాడు. మా అమ్మ సహగమనము చేసింది. ఆదుఃఖభారాన్ని భరించ లేక పాడు బతుకు బతక లేక చావడానికి వచ్చాను. ఒకదివ్యస్త్రీ దర్శన మిచ్చి నన్ను ఓదార్చి 'కుమారా, ఎందుకు సాహసిస్తావు? నీవు వినీతమతిఆశ్రమానికి వచ్చావు. అందుచేత నీపాపపంకిలము క్షాళితమైపోయింది.

బోధి సత్త్వాంశుడవు" అని స్తుతించి ప్రజాసహితముగా దేవలోకానికి వెళ్ళినాడు. రాజపుత్రుడు వృక్షాకారము వదలి నిజరూపముతో వనములో తపస్సుచేసి బోధిసత్త్వుడైనాడు. దానశీలురకు ఈప్రకారముగా సిద్ధి ప్రాప్తిస్తుంది.

### శీ ల పా ర మి త

పూర్వము వింధ్యాద్రిలో జితేంద్రియుడై తథాగతుని అంశతో హేమప్రభు డనే శుకరాజు పూర్వ జన్మజ్ఞానముతో ఉంటూ సద్ధర్మము ఉపదేశిస్తూ ఉండేవాడు. హేమప్రభునిదగ్గిర ప్రతీహారశుకము ధర్మబోధ ఎంతవిన్నప్పటికీ చారుమతి అనే ప్రియురాలియందు రాగాసక్తి వదల కుండా ఉన్నది. ఒకనాడు వేటకాడు ప్రతీహారుని భార్యను వలపన్ని చంపివేయగా ప్రతీహారశుకము, వియోగవ్యథవల్ల కుమిలిపోతున్నది. శుకరాజు ప్రతీహారుని బాధ పోగొట్ట వలెనని సంకల్పించి "నీప్రియ వలతాళ్ళలో పడి చావలేదు. అది బతికే ఉండి చచ్చినట్టు అభినయించి తప్పించుకొని పారిపోయింది. నేను చూచాను. నాతో రా. నీకు చూపిస్తాను" అంటూ రాజు అతన్ని సరస్సుదగ్గిరికి తీసుకొని వెళ్ళి అక్కడ కావలిగా ఉన్న చిలుక ప్రతిబింబాన్ని నీటిలో చూపగా, ప్రతీహారశుకము ప్రియశుకి అని భ్రమసి నీటిలోపడి ప్రతి బింబాన్ని ముద్దాడి కౌగలించి ప్రియా స్పర్శ అనుభవించలేక ప్రియభాషణము వినలేక "ఏమి ప్రియురాలు! సమాధాన మియ్యవే. నన్ను ఆలింగనము చేసుకోవే" అని విసిగి ప్రియురాలి కోప మేమో అని తలచి, అన్యాసక్త అయినదేమోనని అనుమానించింది. ప్రతీహారశుకము ఉసిరికపండు తెచ్చి తన ప్రతిబింబాన్ని చూచి ప్రేయసి అని భ్రమపడి నీటిలో దాన్ని పడ వేసింది. ఆ ఆమలకఫలము సరస్సులో తేలగా తన ప్రియశుకి పారవేసిం దని ప్రతీహారశుకము తలచి రాజుతో "దేవా! శుకి సమాధానము ఇవ్వదు. నేనిచ్చినఫలము విసిరి పారవేసింది" అని చెప్పినాడు.

హేమప్రభుడు విని "మిత్రమా! చెప్పవలసిన సంగతి కాదు. అయినా నీమీాది అనురాగమువల్ల చెప్పుతున్నాను. నీ భార్య అన్యుని కామించి వలచింది. నీకు ప్రత్యక్షముగా చూపుతాను" అని ప్రతీహారుని సరస్సుకు తీసుకొని వెళ్ళి నీటిలో తమ రెండు ప్రతిబింబాలు తాకే ట్లుగా చేసినాడు. మూఢప్రతీహారుడు తన ప్రియురాలికి అన్యసంగతి అయినదని విరక్తి చెంది రాజుతో "దేవా! నేను మూఢమతినై రాగాంధుణ్ణి అయినాను, నీ ధర్మోపదేశము అప్పుడు నా చెవి చేరలేదు. నీ ఉపదేశము నాకు కావాలి" అని మనవి చేసుకోగా హేమప్రభుడు, ప్రతీహారుడు ఉపదేశ స్వీకారానికి అర్హుడని తలచి ఇలా పలికినాడు: "కాలకూట విషాన్ని త్రాగవచ్చు. త్రాచుపామును మెళ్ళో వేసుకొనవచ్చు. స్త్రీ స్వభావమును మాత్రము విశ్వసించకు. గాలి వలె వారు చంచలస్వభావలు, రజో గుణాధికలు ప్రాజ్ఞులు రాగాంధులు కాక జితేంద్రియులై విరాగమే అభ్యసించవలె" హేమప్రభుని ఉపదేశము విని చిలుక విరక్తితో తపస్సు చేసి బుద్ధాంశను పొందింది.

## క్షమా పారమిత

కేదారాచలములో శుభనయుడనే మహాముని దాంతుడై తపశ్చర్యవల్ల కృశించి, నిత్యమూ మందాకినీ నదిలో స్నానము చేస్తూ ఉంటున్నాడు. ఒకరాత్రి చోరులు తాము పాతి పెట్టిన సువర్ణము వెతకడానికి వచ్చి వెతికి వెతికి వేసారి మునీంద్రుడు సువర్ణము హరించాడని తలచి కూడ బలుక్కొని మునీంద్రుని దగ్గిరికి వెళ్ళి "స్వామీ, తాము దొంగిలించిన బంగారము మాది. మాకు ఇవ్వండి" అని అడిగితే శుభనయుడు తన కేమీ తెలియదని సమాధాన మిచ్చినాడు. అందుకు దొంగలు ఆగ్రహించి దుడ్డుకర్రతో మునీంద్రుని చావగొట్టి బంగారము తెమ్మనగా అతడు పూర్వము వలెనే సమాధాన మిచ్చినాడు. దొంగలు ఆగ్రహము ఆపుకోలేక అతని నేత్రములు పెరికి వెళ్ళిపోయినారు.

హోత్రాలు ఉన్నవి. అతడు నిరుపేద కావడంవల్ల ధనపుత్రకాముడై తపస్సుచేయగా అగ్నిహోత్రుడు అతనికి స్వప్నములో సాక్షాత్కరించి "నీకు ఔరసపుత్రుడు లేడు. కృత్రిమపుత్రునివల్ల నీ దారిద్ర్యము పోతుంది" అని అనుగ్రహించినాడు. విప్రుడు శుభానుభవములకై ఎదురు చూస్తున్నాడు. అతనికి మనపిల్లవాణ్ణి ఇద్దాము, కర్మము ఇలాఉన్నది."

అట్టహాసుడు శిశువును సువర్ణఘటముమీద కూర్చోపెట్టి వాడిమెళ్ళో రత్నమాలవేసి రాత్రి దేవదర్శనుడూ అతనిభార్యా నిద్రపోతున్నప్పుడు వాళ్ళఇంట్లో వదిలి వెళ్ళినాడు.

దేవదర్శనుడు సుప్తోత్థితుడై రత్నావళివల్ల మెరిసిపోతున్న బాలచంద్రుని చూచి అద్భుతపడి బంగారునాణెము లున్నకుండను చూచి అగ్నిహోత్రుని అనుగ్రహాన్ని స్మరించి అమందానంద మనుభవించినాడు. జననీజనకుల హృదయాలలో వాత్సల్యరసము వెల్లువలై నిండింది. తెల్లవారిన తరువాత విప్రుడు పుత్రోత్సవము చేసి పదకొండోనాడు శ్రీదర్శను డని పిల్లవానికి నామకరణము చేసినాడు. దేవదర్శనుడు సంపన్నుడై యాగాదులు చేసి భోగాలు అనుభవించి భార్యాపుత్రులతో సుఖించినాడు. శ్రీదర్శనుడు దినదినప్రవర్ధమానుడై వేదశాస్త్రములు అధ్యయనము చేసి ఆరితేరి అస్త్రశస్త్రాలలో అద్భుతశక్తి సంపాదించినాడు. క్రమేణా శ్రీదర్శనునికి నూనూగుమీసాల నూత్న యౌవనము రాగా తండ్రి యాత్రార్థము ప్రయాగక్షేత్రానికి వెళ్ళి గతించినాడు. తల్లి అగ్నిప్రవేశము చేసింది. శ్రీదర్శనుడు శ్రాద్ధక్రియలు శాస్త్రీయంగా నిర్వర్తించినాడు. దుఃఖోపశమనము కాగా వివేక మున్నా అతడు ద్యూతవ్యసనములో పడినాడు. జూదములో అతనిసొత్తు యావత్తూ పోయింది. అతనికి తినడానికి తిండీ లేదు. కట్ట బట్టా లేదు. బట్టలు లేక సిగ్గువల్ల ఇంట్లో ఉంటున్నాడు. కడుపు కాలుతూ ఉంటే పొరుగింట్లో అతడు భోజనము చేయడానికి ఇష్టము లేక బాధ పడు

తుంటే ముఖుడు అనే మిత్రుడు "ఏమోయి! దిక్కుమాలినజూదము కొంపతీసింది! బ్రహ్మదేవుడు జూదగానికి బాహువులు వస్త్రముగాను, దుమ్ము పడకగాను, విపణి ఇల్లుగాను, దౌర్భాగ్యమే భార్యగాను సృష్టిస్తాడు. తిండి తినవేమి? వస్తుండి పనిపాటలు ఏమి చెయ్యగలవు? బతికితే ధీరుడు నిజాభీష్టము నెరవేర్చుకోగలడు. అందుకు దృష్టాంతము విను:

## భూ నం దు ని క థ

భూమండల మండనాయమానమైనకాశ్మీర దేశములో వితస్తానది ప్రవహిస్తూ, కలిపురుషుని లోనికి రానీయకుండా ఆనదిని చుట్టుకొని హిమాచలముఉన్నది. భూనందమహారాజు వర్ణాశ్రమగురువై విద్యాసంపన్నుడై పరిపాలిస్తున్నాడు. ద్వాదశినాడు మహారాజు విష్ణుమూర్తిని సేవించి రాత్రిపరుండగా స్వప్నములో దైత్యకన్య వస్తే ఆమెతో సంభోగశృంగారము అనుభవించి నిద్ర లేచి ఆకన్య కనపడక పోవడముచేత శరీరముమీద నఖక్షతదంతక్షతచిహ్నములు చూచుకొని "ఇది స్వప్నము కాదు. ఇవే సంభోగచిహ్నములు. ఎవరో కన్య నన్ను చాలా మోసము చేసింది" అని నిశ్చయించుకొని, విరహావ్యథలో తపించి రాజకార్యాలు మానివేసినాడు. ఆకన్యకోసము అనేకయుక్తులు వెతికి లాభము లేక రాజు "హరికటాక్షమువల్ల ఆమెతో భోగము లభించింది. అందువల్ల హరినే ఆరాధించి రాజకార్యము వదిలివేస్తాను" అని సంకల్పించి అమాత్యులను పిలిపించి తమ్ముడైన సునందనునకు రాజ్యమిచ్చి క్రమసరస్సనే క్షేత్రము చేరినాడు. ఆతీర్థముదగ్గిర బ్రహ్మ విష్ణు మహేశ్వరులు గిరిశృంగాలరూపములో ఉంటున్నారు. రాజు విషువతీ నదీ తటాన అన్యచింతలేక వేసవిలో చకోరమువలె సోలి తపస్సుచేస్తున్నాడు.

పన్నెండు సంవత్సరాలు భూనందుడు తపస్సుచేయగా ఒక సన్యాసి తీర్థశైలమునుంచి దిగి వచ్చిన ఈశ్వరునివలె అతన్ని చూచి కనికరించి

విషయ మంతా గ్రహించి ధ్యానానంతరము ఇలా అనుగ్రహించినాడు. "రాజన్! నీప్రియకాంత దైత్యకన్య పాతాళలోకములో ఉంది. నిన్ను ఆ మెదగ్గిరికి తీసుకొనిపోతాను. నేను దక్షిణదేశ బ్రాహ్మణ్ణి. యజ్ఞ సోమయాజి కుమారుణ్ణి. భూతివసు వని అంటారు నన్ను. నేను యోగము బాగా నేర్చినవాణ్ణి. నాతండ్రి పాతాళశాస్త్రములో హాటకేశ్వర మంత్రతంత్ర విధానము నాకు నేర్పినాడు. శ్రీపర్వతము దగ్గిర తపస్సుచేయగా ఈశ్వరుడు కనపడి ఇలా చెప్పినాడు: "వెళ్ళు, పాతాళములో దైత్యకన్యతో భోగాలు అనుభవించి రా. అప్పుడు నన్ను పొందుదువుగాని. నీకు యుక్తి చెపుతాను. ఈభూగర్భములో చాలా పాతాళబిలములు ఉన్నవి. కాశ్మీరములో మయుడు అనేకశిల్పి నిర్మించిన మహాబిలము ఉన్నది. ఆ బిలద్వారమున బాణాసురుని కుమార్తె ఉషాదేవి ప్రియుడైన అనిరుద్ధుని రహస్య దానవోద్యానములలో ప్రవేశపెట్టి సంతోషపెట్టింది. అప్పుడు ప్రద్యుమ్నుడు తనపుత్త్రుని కాపాడేందుకు ద్వారము చేసి, ద్వారరక్షణకై దుర్గాదేవిని ఉంచగా అప్పటినుంచీ పర్వతశిఖరాన్ని ప్రద్యుమ్నశిఖర మనీ, శారికాకూట మనీ రెండుపేర్లతో పిలుస్తారు. ఆబిలమార్గాన నీవు పాతాళలోకానికి వెళ్ళు. నా అనుగ్రహమువల్ల నీ కోరిక సిద్ధిస్తుంది." అని ఈశ్వరుడు అంతర్ధానమైనాడు. శివానుగ్రహమువల్ల నేను విజ్ఞానము పొంది కాశ్మీరదేశము వచ్చినాను. రాజా! నీవు మాతోకూడా ప్రద్యుమ్నశిఖరము దగ్గిరికి రా. పాతాళలోకానికి నిన్ను తీసుకొని వెళ్ళుతాను." భూనందనభూపాలుడు యతితో ప్రద్యుమ్న శిఖరము దగ్గిరికి వెళ్లినాడు. అక్కడ ఆ యతి వితస్తాస్రవంతిలో స్నానము చేసి, గణపతిపూజ చేసి, దిగ్బంధపూర్వకముగా శారికాదేవిని యథావిధిగా అర్చించి ఆవాలు చల్లినాడు. వెంటనే బిలము సిద్ధము కాగా తన్మార్గమున భూనందుడు, ముని, శిష్యులతో పాతాళలోకానికి అహోరాత్రాలు అయిదు రోజులు ప్రయాణము

చేసినాడు. మరసరోజున అందరూ పాతాళగంగను దాటినారు. అక్కడ నేల రజతమయముగా ఉన్నది. అక్కడే నిండార విరిసిన బంగారు మెట్టతామరలు నెత్తావులు వెదజల్లగా, ప్రవాళకర్పూర చందనాగురు తరువులూ మోసులెత్తగా ఇంపు లొలికే వన మున్నది. వనమధ్యమున బంగారుగోడలతో మాణిక్యస్తంభాలతో చంద్రోపల వేదికలతో పెద్ద శివాలయమూ వారికి కనపడింది. మునీంద్రుడు శిష్యులతో "ఈ పాతాళ నిలయుడే హాటకేశ్వరుడు, త్రిలోకరక్షాదక్షుడు. శివారాధనము చేదాము" అన్నాడు. అందరూ పాతాళ గంగలో స్నానము చేసి పాతాళ కుసుమాలతో శివార్చన చేశారు. క్షణముసేపు విశ్రాంతికై వారు ఆసీనులై తిరిగి ప్రయాణము చేసి నేరేడు వృక్షము చూచినారు. ఆ నేరేడు పళ్లు తినవద్దనీ, తింటే కార్యము విఘ్నమవుతుం దనీ ముని శిష్యులను హెచ్చరించినాడు. ఆమాట విని ఒక ఛాత్రుడు నేరేడుపండు తిని వెంటనే చేష్టలు లేక స్థావరాకారాన్ని పొందినాడు. వాడి అవస్థ చూచి తక్కినవాళ్లు పళ్ళు తినలేదు. మునీంద్రుడు తక్కిన శిష్యులతో పోగా స్వర్ణప్రాకారము మణిమయ ద్వారముతో ఒక సౌధము కనపడింది. ద్వారపార్శ్వమున రెండువైపుల రెండు ఇనుపపొట్టేళ్లు వీరిని పోనీయక కొమ్ములతో కుమ్మసాగినవి. మునీశ్వరుడు మంత్రదండముతో వాటితలలపైన కొట్టినాడు. అవి పారిపోగా వారు ప్రవేశించి లోపల స్వర్ణరత్నమయ మందిరములు చూచినారు. ప్రతిమందిరపార్శ్వాన ఇరుపక్కలా ఇనుపరోకళ్లు పట్టుకొని భీకరాకారులు నిలవబడి ఉన్నారు. మునీంద్రుడు దుష్టఘ్ని అనే యోగాన్ని ధారణ చేయగా ద్వారపాలకులు పారిపోయి మళ్ళీ కనపడలేదు. ద్వారాలు తెరిచి దైత్యకన్యల ప్రతీహారులు వచ్చి తమరాణి ఆజ్ఞగా వారిని లోపలికి రమ్మని తీసుకొని వెళ్ళినారు.

ఆ మునీంద్రుడు "మీరు లోపలికి వెళ్ళి మీమీ ప్రేయసీ వాక్య

ములు జవ దాట వద్దు" అని శిష్యులను హెచ్చరించి, కొందరు వేశ్యా వనితలతో దివ్యమందిరము ప్రవేశించి దైత్యకన్యతో సుఖభోగములలో తేలినాడు. శిష్యులు ఒక్కొక్కరు ఒక్కొక్కవనితను అనుభవించి నారు. ఒక స్త్రీ భూనంద భూపతికి వందన మాచరించి మణిమయ మందిరానికి తీసుకొనివెళ్ళింది. ఆమందిర మణికుడ్యములమీద చెలుల ప్రతిబింబాలు ప్రతిఫలించి సజీవచిత్రములవలె ఉన్నవి. మహానీల మణిస్థగితమైన నేల మనోహరముగా ఉన్నది. ఆమందిరము సుందరీ మణుల దివ్యసంగీతమువల్ల ప్రతిధ్వనిస్తూ ఉండగా రాజు కలలో చూచి దైత్యకన్యను మందిరములో చూచినాడు. ఆ అసురకన్య అందచందాలు అతడు కళ్ళారచూడగా ఆనంద బాష్పములు జలజల కురిసినవి. కుముదిని అనే అసురకన్య అతన్ని చూచి అమందానంద కందళితాంతరంగ కాగా, లేచి అతని కేలు గ్రహించి 'నావల్ల చాలా శ్రమ పడినారు.' అని అనురాగముతో పలికి ఉచితాసనమున అతన్ని ఆసీనుని చేసింది. అసురవనిత చెప్పినప్రకారము అతడు స్నానముచేసి వస్త్రాలంకారములు ధరించి పానోత్సవానికి వనానికి వెళ్ళినాడు. అక్కడ గట్టున ఉన్న చెట్టున పీనుగు శరీరమునుంచి రక్తమూ కొవ్వూ కారి నూయినిండగా అతనితో కుముదిని కూర్చున్నది. ఆమె సుర అందీయగా అతడు స్వీకరించక అసహ్యించుకొన్నాడు. ఆమె "సురాపానము చేయక పోతే నీవు జీవించవు" అంటూ అతన్ని బలవంత పెడితే భూనందుడు నేను తాగ నని అన్నాడు. ఆమె చురచుర లాడుతూ వెళ్ళగా అతడు కోరచూపులు చూచినాడు. ఆమె చెలులు అతన్ని పంపివేసినారు. పూర్వము తాను తపస్సు చేసిన క్రమసరస్సు దగ్గరకు చేరినాడు. తన అవస్థకు అద్భుతపడి ఆలోచించినాడు. "ఆఅసురులతోట ఎక్కడ? ఈ సరోవర మెక్కడ? మాయా, మతిచాంచల్యమా? ముని చెప్పినట్టు దైత్య కన్యమాట వింటే ఇలా గతి పట్టదేమో? సురాపానము దూష్యము

కాదు! నన్ను పరీక్షించేందుకు సుర ఇచ్చింది. ఇంతకూ అదృష్టహీనులు ఎంత శ్రమ పడినా కార్యసిద్ధి కాదు. విధిప్రతికూల మైతే దురదృష్టము!"

అసురకన్య సుర తాగుతూ ఉండగా కొన్ని చుక్కలు అతనిశరీరాన పడి ఉండడమువల్ల ఆవాసనకు తేంట్లుమురిసినవి. "సత్వహీనునికి వేతాళో త్థాపనమువలె నాకు కార్యసిద్ధి లేకపోగా చేటువాటిల్లిందే"అనుకొంటూ ఉంటే అతన్ని తేనెటీగలు కుట్టి కుట్టి బాధ పెట్టగా ఆత్మహత్యా ప్రయ త్నము చేసినాడు. అప్పుడు ఆతోవనే దైవికముగా మునికుమారుడు వెళ్ళుతూ భూనందుని అవస్థచూచి కనికరించి ముసిరిన తేంట్లను తోలి సంగతి అడిగి తెలుసుకొని "రాజా" దేహ మున్నంతవరకూ దుఃఖము క్షయము కాదు. ప్రాజ్ఞులు పురుషార్థము సాధించాలి. ద్వైతబుద్ధి ఉన్నంతవరకూభేదోపాసనాలబ్ధము లైన సిద్ధులు క్షణికములు. అద్వైత సాధన చేస్తూ పన్నెండే ళ్ళయిన తర్వాత నీకు అసురకన్య లభిస్తుంది శాశ్వతమైన సిద్ధి పొందుతావు ఆతర్వాత. దివ్యపరిమళముతో నీశరీర మున్నది. ఈలేడిచర్మము మంత్రపూర్వకముగా స్వీకరించు. ఈకృష్ణా జినము కప్పుకో. తేనెటీగలు నిన్ను ఏమీ చెయ్యలేవు"అని హితబోధ చేసినాడు. మునికుమారుడు వెళ్ళినతర్వాత భూనందుడు ధైర్యముతో ద్వాదశ వర్షములు తపస్సు చేయగా కుముదిని స్వయముగా అక్కడికి వచ్చింది. వారిద్దరూ కలిసి పాతాళలోకానికి వెళ్ళి భోగాలు అనుభ వించారు. భూనందభూపాలుడు తర్వాత సిద్ధిపొందినాడు.

శ్రీదర్శనా! నీకు శుభము చేకూరుతుంది. బెంగతో తిండి మాని శుష్కిస్తా వేమి? జూద మాడేచోట ముఖరకుడు చెప్పగా శ్రీదర్శనుడు "మిత్రమా! నీవు చెప్పినది నిజము. వ్యసనమువల్ల ఆస్తి పోగొట్టుకొని నేను ఈ ఊళ్ళో ఎల్లా తల ఎత్తుకోను? పువ్వు లమ్మిన ఊళ్ళో కట్టెలు అమ్మడమా? ఈరాత్రి దేశాంతరము నన్ను పోనిస్తే భోజనముచేస్తాను" అని సమాధానమిచ్చి భోజనము చేసినాడు. శ్రీదర్శనుడు దేశాంతరము

బయలుదేరుతూ ఉంటే తోవలో దైవికముగా తల్లితండ్రులైన యక్షులు, సౌదామని అట్టహాసులు అతన్ని చూచి గగనమునుంచి స్నేహముతో "శ్రీదర్శనా! మీతల్లి మీఇంట్లో నగలు పాతిపెట్టింది. అవి తీసుకొని మాళవదేశము వెళ్లు. శ్రీసేనమహారాజు చిన్నతనములో చెడినవాళ్ళకూ జూదగాళ్లకూ మఠము కట్టించాడు. అక్కడికి వెళ్ళి పొట్టపోసుకో అని" చెప్పినారు.

శ్రీదర్శనుడు ఇంటికి వెళ్ళి తానూ చెలికాడూ కలిసి నేల తవ్వి నగలు తీసి దేవతానుగ్రహ మని సంతోషించి మిత్రునితో మాళవ దేశము వెళ్ళినాడు. ఆరాత్రి మర్నాడూ వారు ప్రయాణము చేసి సంధ్యవేళ బహుసస్య మనే పల్లె చేరినారు. మార్గాయాసమువల్ల అలిసి వాళ్ళిద్దరూ చెరువుగట్టున కూర్చున్నారు.

వాళ్ళు కాళ్ళూ చేతులూ కడుక్కొని మంచినీరు తాగి విశ్రాంతిగా కూర్చున్న తరువాత ఒక కన్య నీలాటిరేవుకు వచ్చినది. ఆ అందగత్తె శ్రీదర్శనుని చూచి, ప్రథమ వీక్షణములో ప్రేమ మొలకెత్తగా "మహానుభావులారా! ఈ అపాయస్థలానికి వచ్చారేమి? మంటలో తెలియక దుమికే మిడతలవలె వచ్చారేమి?" అని వారిని అడిగింది. ముఖరకుడు దిగులు పడి "కల్యాణీ, నీవు ఎవరు? నీ అభిప్రాయమేమిటి?" అని ప్రశ్నించినాడు. ఆ తన్వి చెపుతున్నది:

"ఇక్కడ సుఘోష మనే అగ్రహార మున్నది. పద్మగర్భు డనే వేదపండితునికి శశికళ అనే పరమసాధ్వి భార్య. ఆయనకు ముఖరకు డనే కుమారుడు, పద్మిష్ఠ అనే నేను జన్మించినాము. మాఅన్న చిన్నతనములో ఇల్లూ వాకిలీ అక్కర లేక జూదగాళ్లతో దేశాంతరము వెళ్లినాడు, పుత్రశోకము పట్ట లేక మాఅమ్మ చనిపోయింది. మా తండ్రి ఇల్లు విడిచి నన్ను వెంట బెట్టుకొని మాఅన్నను వెతుకుతూ దేశదేశాలూ తిరిగి చివరకు ఇక్కడికి వచ్చినాడు. ఇక్కడ బందిపోటు

నాయకుడు వసుభూతి అనే బ్రాహ్మణశబ్దవాచ్యు డున్నాడు. ఆదురాత్ముడు మాతండ్రిదగ్గిర ఉన్న బంగారము దోచుకొని ఆతనిప్రాణాలు తీసినాడు. అతడు నన్ను బంధించి తనకుమారుని కిచ్చి పెళ్లిచేయదలచినాడు. ఆనాయకునికుమారుడు వర్తకసమూహమును దోపిడి చేసేందుకు ఎక్కడికో వెళ్ళి నాఅదృష్టమువల్ల ఇంతవరకూ తిరిగి రాలేదు. నాకు దేవుడే దిక్కు. దొంగలనాయకుడు మిమ్మల్ని చూచి బతకనివ్వడు. ఎక్కడయినా తల దాచుకొని అపాయము తప్పించుకొనండి".

ముఖరకుడు పద్మిష్ఠను చెల్లె లని ఆనవాలు పట్టి "అమ్మాయీ, నేను బంధుద్రోహిని ముఖరకుణ్ణి. ఎంత దౌర్భాగ్యుణ్ణి చెల్లీ!" అంటూ విలపించినాడు. ఆమె శోకవార్ధిలో మునిగిపోయింది. ఇద్దరిఅవస్థ చూచి శ్రీదర్శనుడు వాళ్ళను ఓదార్చి కనికరించి సమయానుకూలముగా "దుఃఖించేసమయము కాదు. ఆత్మరక్షణకు యుక్తి వెతకవలె. ఆదొంగకు ధన మిచ్చి ప్రాణాలు నిలవబెట్టుకొని మనపగ తీర్చుకోవాలి" అని నిశ్చయించగా అన్నకూ చెల్లెలికీ ధైర్యసాహసాలు వచ్చినవి. ముగ్గురూ పన్నాగము పన్నినారు. శ్రీదర్శనుడు ఇంతకుమునుపు తిండీ తిప్పలు లేక కృశించి ప్రస్తుతము మాంద్యవ్యాధివల్ల బాధ పడుతున్నట్టు మిష పెట్టి ఆచెరువుగట్టునే పడిఉన్నాడు. ముఖరకుడు అతనికాళ్లు పట్టి రోదిస్తున్నాడు. పద్మిష్ఠ దొంగలనాయకునిదగ్గిరికి వెళ్ళి "చెరువుగట్టున మాంద్యవ్యాధితో ఒకబాటసారీ అతనిఅనుచరుడూ ఉన్నారు" అని పలికింది. దొంగ తనబంటులను పంపగా వాళ్ళు వెళ్ళి ముఖరకుని ముందు చూచి "అయ్యా! ఈయన కేమి వ్యాధి? నీ వెందుకు ఏడుస్తున్నావు? అని అడిగినారు. ముఖరకుడు విచారము అభినయిస్తూ పలికినాడు. "మేము బ్రాహ్మణులము. ఇతడు మాఅన్న. తీర్థయాత్రలు చేస్తున్నాము. ఇతనికి అకస్మాత్తుగా వ్యాధి వచ్చింది. మేము అక్కడక్కడ తిరిగి ఇక్కడికి చేరుకొన్నాము. మేము వచ్చీ రావడంతోనే

ఇతను చేష్ట లుడిగి నాతో "ఓరీ, లేలే. నాకు దర్భాసనము పరు. గుణ వంతు డైన విప్రుణ్ణి తీసుకొనివస్తే అతనికి నాసర్వస్వమూ ధారాదత్తము చేస్తాను" అన్నాడు. విదేశములో సంధ్యవేళ నేనివ్వాడు ఏమి చెయ్యాలో తెలియక విచారముతో శరణు వేడినాను. సాధుపుంగవులారా! సద్బ్రాహ్మణుని తీసుకొని రండి. ఇతడు జీవించి ఉండగానే తీసుకొని రండి. ఇతడు ఈరాత్రివరకూ జీవిస్తాడు. తరువాతమాట చెప్పలేము. ఇతన్ని విడిచి నేను బతకలేను. రేపు చిచ్చులో ప్రవేశిస్తాను. మీరు దయతో వచ్చిన అకారణబంధువులు."

దొంగలు జాలితో తమనాయకునిదగ్గిరికి వెళ్ళి "స్వామీ, చంప తలచుకొన్నవాణ్ణి బతికించి వాడిదగ్గిర నగలు నాణ్యాలు దానంగా పుచ్చుకొందువు గాని" అని చెప్పినారు. వసుభూతి "అదేమిటి? అతన్ని చంపకుండా ధనాపహారణము అసంభవము, నీతి విరుద్ధము. ధనము దోచినతరువాత అతడు జీవించిఉంటే మనకు ముప్పువస్తుంది" అన్నాడు. బంటుదొంగలు "స్వామీ! ఎందు కింత అనుమానము? దొంగతనము ఎలాగ? కాటికి కాళ్ళు చాచినవాడిదగ్గర దానము పట్టడము ఎలాగ? రేపు వాళ్ళిద్దరూ బతికే వుంటే చంపివేదాము. అనవసరంగా బ్రహ్మ హత్యాపాతకము ఒడికట్టడము ఎందుకు?" అని సమాధాన మిచ్చి నారు. వసుభూతి దానము స్వీకరించేనిమిత్తము శ్రీదర్శనునిదగ్గిరికి వచ్చి నాడు. శ్రీదర్శనుడు నిట్టూర్పులు విడుస్తూ తల్లి నగలూ నాణ్యాలూ ఆదొంగలనాయకునికి ఇచ్చినాడు. అతడు దానము పుచ్చుకొని తక్కిన దొంగలతో ఇంటికి వెళ్ళినాడు.

చోరు లందరూ రాత్రి నిద్రపోతూ ఉండగా పద్మిష్ఠ తప్పించుకొని అన్న ముఖరకునిదగ్గిరికి చల్లగా వచ్చింది. వెంటనే శ్రీదత్త ముఖర కులూ పద్మిష్ఠ కలిసి చోరభయము లేని మార్గాన ప్రయాణము చేసి మాళవదేశానికి వెళ్ళదలచినారు. రాత్రి ముగ్గురూ బయలుదేరి మహా

లోపమువల్ల రాజుకు క్షయరోగము వచ్చి కుదరకుండా ఉంది. రాజు తనకు తగిన వీరుడు మంత్ర తంత్రాలు తెలిసినవాడు దొరికితే బేతాళుని సాధించి తన క్షయవ్యాధి మాన్పుకో గల నని శపథము చేశాడు. రాజు ఈసంగతి చాటింపు చేయించినా ఊళ్ళోవాళ్లు ఒక్కళ్లూ బైటికి రాలేదు. అప్పుడు అమాత్యులతో మహారాజు "జూద గాళ్ళ మఠములో టక్కరివాళ్ళను కనిపెట్టండి. మోసగాళ్లు దిక్కులేక దరిద్రులై భయ రహితులై తెగిస్తారు." అని హెచ్చరించగా మంత్రులు మఠాధిపతికి తెలియ జేసినారు. అప్పటినుంచీ మఠాధిపతి మఠానికి వచ్చేవాళ్ళల్లో శూరుణ్ణివెతుకుతున్నాడు. మీారు జూదగాళ్లు. శ్రీదర్శనా! నీవు తెగిస్తే మఠాధిపతి దగ్గిరికి తీసుకొని పోతాను. మహారాజు నీకు ఆతిథ్యము ఇస్తాడు. నాకు మహోపకారము చేసిన వాడివి అవుతావు. రాజుకు ఈరోగము ఎలా నయమవుతుందా అని దిగులుగా ఉంది"

బ్రాహ్మణి మాటలు విని శ్రీదర్శనుడు "అవ్వా! నేను సిద్ధము. నన్ను రాజసన్నిధికి తీసుకుపో" అని కోరినాడు. బ్రాహ్మణి శ్రీదర్శన పద్మిష్ఠా ముఖరులను మఠాయతనానికి తీసుకొనివెళ్ళి మఠాధిపతితో "ఈ శ్రీదర్శనుడు బ్రాహ్మణుడు, జూదగాడు, పరదేశి. రాజుకు సహాయము చేయ సిద్ధముగా ఉన్నాడు." అని చెప్పింది. మఠాధిపతి సంతోషించి శ్రీదర్శనుని ఆస్థానానికి తీసుకొని వెళ్ళగా కృష్ణపక్ష చతుర్దశినాటి చంద్రునివలె కృశించి తెల్లగా ఉన్న రాజు చూచి తనవ్యాధి నయము చేసుకోడానికి అవకాశము దొరికిందని సంతోషించినాడు. అప్పుడు రాజు శ్రీదర్శనునితో "సౌమ్యుడా! నిన్ను చూడగానే నా రోగము కుదురుతుందని దృఢనిశ్చయము కలిగింది. నీవు నాకు సహాయము తప్పక చెయ్యాలి." అని చెప్పినాడు. మంత్రవేత్త శ్రీదర్శనునితో "భేతాళుని ఆహ్వానించేందుకు సమర్థుడ వైతే ఈ కృష్ణచతుర్దశి రాత్రి

చీకట్లో ఊరివెలుపల శ్మశానములో కార్యసిద్ధికి నన్ను కలుసుకో అని హెచ్చరించి వెళ్ళినాడు.

శ్రీదర్శనుడు రాజాజ్ఞ పొంది మఠాయతనానికివెళ్ళి అక్కడ వద్మిష్ఠా ముఖరకులలో పంక్తిభోజనముచేసి రాత్రి ఒక్కడే ఖడ్గము చేతపట్టు కొని వల్లకాటికి పోయినాడు. అక్కడ మంత్రసాధకుడు అతనికి కనపడి నాడు. ఆమంత్రవేత్త శరీరమంతా బూడిద పూసుకొని వెంట్రుకలే యజ్ఞోపవీతముగా ధరించి, పీనుగులమీది వస్త్రము తలపాగా చుట్టు కొని నీలిగుడ్డ దాల్చినాడు. శ్రీదర్శనుకు అతనికి తను ఫలానా అని చెప్పి నడికట్టుకట్టుకొని "ఏమిచేయాను?" అని అడిగినాడు. సాధకుడు సంతోషముతో "ఇక్కడికి పడమటదిక్కుగా శింశుపా తరుమూలమున ఒకశవము ఉన్నది. ఆ శవానికి గాయము తగలకుండా ఇక్కడికి తీసుకొనిరావాలి" అని ఆజ్ఞ ఇచ్చినాడు. శ్రీదర్శనుడు త్వరగా తరువును చేరి శవమును మరొకడు తీసుకొనిపోతూ ఉండగా చూచి పరుగెత్తి వానిభుజముమీదనుంచి శవాన్ని బలవంతముగా లాగినాడు. వాడు దాన్ని వదలక గట్టిపట్టుపట్టినాడు. శ్రీదర్శనుడు "నేను దహనము చేయవలసిన మిత్రుని శవాన్ని నీ వెక్కడికి తీసుకొని పోతావు? అంటూ వాడిపట్టు విడిపించినాడు. ఆ పురుషుడు "వదలను కాక వదలను. ఈశవము నా మిత్రునిది. దీనికి నీ వెవడవు?" అని శవాన్ని పట్టుకొని ఇద్దరూ లాక్కొగా ఆపీనుగు బేతాళావిష్టమై భీకరంగా అరిచింది. ఆకొత్తవాడు అరుపు విని గుండె పగిలి చనిపోయి నాడు. అప్పుడు శ్రీదర్శనుడు ఆ శవాన్ని తీసుకొని నడుస్తుండగా చచ్చినవాడు భేతాళాధిష్ఠితుడై అతన్ని అడ్డుపెట్టి "నిలు, నిలు. నాస్నేహితుణ్ణి బుజాన వేసుకొని ఎక్కడికిపోతావు?" అని తోవకు అడ్డువచ్చాడు. శ్రీదర్శనుడు భూతావేశముతో అత డున్నాడని గ్రహించి "ఇతను నీ మిత్రుని దని ఎలా రుజువు చేస్తావు? ఇతను

నామిత్రుడు" అని పలికినాడు. అప్పుడు ఆపురుషుడు "అలా అయితే ఇతనే మనకు ప్రమాణము" అని సమాధాన మిచ్చినాడు. శ్రీదర్శనుడు "మాయిద్దరిలో ఎవరు నీమిత్రము!" అని దయ్యము పట్టిన శవముతో అన్నాడు. శ్రీదర్శనునిబుజాన ఉన్న శవము "నాకు చెడ్డ ఆకలిగాఉంది. నాకు తిండి పెట్టినవాడే స్నేహితుడు. వాడు నన్ను ఇష్టమువచ్చిన చోటుకు తీసుకుపోవచ్చును." అని పలికింది. మాతకపురుషుని దగ్గిర ఆహారము లేదు. శ్రీదర్శనుడు రెండోశవాన్ని బుజాన వేసుకొని నేను తిండి పెడతాను అని బేతాళునికి అర్పించడానికి కత్తి దూసేలోగా రెండోవాడు భేతాళాధిష్ఠితుడై సిద్ధివల్ల కనపడకుండా పోయినాడు. శ్రీదర్శనునిబుజాన ఉన్న బేతాళుడు "ఏదీ నాకు తిండి పెడతా నన్నావు. పెట్టవేమి!" అని అడగగా శ్రీదర్శనుడు మాంసము లేక పోవడంవల్ల తనశరీరాన్ని కత్తితో కోసి శవానికి తిండిపెట్టాడు. అప్పుడు బేతాళుడు తృప్తి చెంది "శక్తిమంతుడా! నిన్ను మెచ్చినాను. నీశరీరము అక్షత మగునుగాక! నన్ను తీసుకొనిపో. నీపని నెరవేరుతుంది. ఆ మంత్రవేత్త అంత శక్తి కలవాడు కాడు. వాడు జీవించడు" అని పలుకగా శ్రీదర్శనుడు ఆరోగ్యవంతుడై బేతాళుని తీసుకొనివెళ్లి సాధకునికి అర్పించినాడు. మంత్రసాధకుడు పొంగిపోయి పూలమాలలతో, మైపూతలతో పూజించి, మనుష్యుని ఎముకలపొడితో ముగ్గు వేసి, మండలాకృతిలో కోణాలమీద రక్తఘటాలుంచి, మనిషికొవ్వుతో దీపము వెలిగించి, మండలమధ్యమున శవాన్ని పరుండబెట్టినాడు. వాడు శవము రొమ్ముమీద కూర్చుని మనుష్యాస్థితో తయారయిన స్రుక్స్రువములతో దాని ముఖాన వేల్చ సాగినాడు. క్షణములో ఆ బేతాళుని నోటిలోనుంచి మహాజ్వాల బయలుదేరగా సాధకుడు హడలిపోయి కొంచెము జరిగినాడు. వాడిచేతిలో స్రుక్స్రువములు జారిపోయినవి. ఆ మంత్రసాధకుడు శక్తి కోల్పోయి పారిపోబోతూ ఉండగా బేతాళుడు

వాణ్ణి తరుముకొంటూ వెళ్లి నోరు తెరిచి పూర్తిగా మింగినాడు. శ్రీదర్శనుడు అదిచూచి ఖడ్గము దూసి మీదికి వచ్చేప్పటికి బేతాళుడు "శ్రీదర్శనా! నీధైర్యము గొప్పది. నానోటిఆవాలు నీవు తీసుకో. ఈ ఆవాలు తలకు కట్టుకొని చేతిలో ఉంచుకొంటే రాజయక్ష్మవ్యాధి శాంతిస్తుంది. త్వరలో నీవు భూమండలానికి నేతవు కాబోతావు" అని పలికినాడు. శ్రీదర్శనుడు "సాధకుడు లేకుండా ఏకాకిగా రాజసన్నిధికి ఎలా వెళ్ళను! నేను స్వార్థముతో మంత్రవేత్తను చంపివేశానని రాజు భ్రమపడ వచ్చును". అనగా బేతాళుడు "నీకు దృష్టాంతము చెపుతాను. అందువల్ల నీమీదదోషము ఉండదు. నేను మింగిన సాధకునిశవము కడుపు చీల్చి మహారాజుకూ మంత్రులకూ చూపుదువు గాని" అని పలకా ఇచ్చాడు. శ్రీదర్శనుడు బేతాళుడు ఇచ్చిన ఆవాలు పుచ్చుకొని శవాన్ని విడిచి ఎక్కడికో వెళ్లగా శవము నేల కూలింది. అతడు తనవాళ్ళున్న మఠానికి వెళ్లి రాత్రి గడిపి తెల్లవారినతరువాత రాజ సన్నిధానానికి వెళ్లి ఆయనతో జరిగిన దంతా నివేదించినాడు. తాను తెచ్చిన పీనుగుకడుపు చీల్చి అందులో చచ్చిఉన్న మంత్రవేత్తను రాజుకు చూపినాడు. శ్రీదర్శనుడు పిడికెడు ఆవాలు మూటకట్టి మహారాజు శిరమునకు కట్టినాడు. వెంటనే అతని క్షయరోగము నయమైనది. శ్రీసేనమహారాజు అమితానందము అనుభవించి సంతానము లేకపోవడంవల్ల శ్రీదర్శనుని పుత్త్రునిగా చేసుకొని వెంటనే అతనికి యౌవరాజ్య పట్టాభిషేకము చేసినాడు. శ్రీదర్శనుడు పద్మిష్ఠను వివాహ మాడి ఇహలోకసుఖాలు అనుభవిస్తూ ముఖరకుని తనదగ్గిర ఉంచుకొన్నాడు.

ఇలా ఉండగా ఉపేంద్రశక్తి అనే వర్తకుడు తనకు సముద్ర తీరాన లభించిన రత్నగణపతి విగ్రహాన్ని తెచ్చి యువరాజు శ్రీదర్శను నకు కానుక అర్పించినాడు. అమూల్యమైన వినాయక విగ్ర

హాన్ని యువరాజు అర్చిస్తూ భక్తిశ్రద్ధలతో స్వామికి నిత్యభోగార్థము వేయిగ్రామాలు దానపట్టా వ్రాసి ఇచ్చి ఉత్సవము చేయించినాడు. ఉత్సవసమయములో నృత్యగీతవాయిద్యాలకు గణపతి మెచ్చి గణాలతో పలికినాడు " ఈ శ్రీదర్శనుడు మదీయానుగ్రహమువల్ల చక్రవర్తి అవుతాడు. పశ్చిమసముద్రమందున్న హంసద్వీపములో ఆనందోదయ మహారాజ పుత్రిక అనంగమంజరి నాభక్తురాలు, ఆకన్య నన్ను సేవిస్తూ చక్రవర్తి తనకు భర్త కావాలని తపిస్తున్నది. అందువల్ల అనంగమంజరి శ్రీదర్శనుని భార్యగా జత పరుస్తాను. అప్పుడు నామీద వాళ్ళకున్న భక్తి ఫలించినట్టు అవుతుంది. మీరు వెంటనే శ్రీదర్శనుణ్ణి యుక్తిగా హంసద్వీపానికి తీసుకొనిపోయి అనంగమంజరీ దర్శనము అయ్యేటట్టు చూడండి. ప్రియుల అన్యోన్య వీక్షణాంతరము క్రమేణా వాళ్ళకు సంయోగము కలుగుతుంది. నావిగ్రహాన్ని ఇక్కడికి తెచ్చి అర్పించిన ఉపేంద్రదత్తునికి మహోపకారము కలుగుతుంది." గణపురుషులు ఆరాత్రి నిద్రపోతున్న శ్రీదర్శనుని హంసద్వీపానికి తీసుకొనివెళ్ళి అనంగమంజరీదేవి శయనమందిరములో సెజ్జమీద పరుండ బెట్టినారు.

కొంతసేపటికి శ్రీదర్శనుడు మేలుకొని రత్నదీపాల వెలుగులో శయ్యాగృహము చూచినాడు. అతడు శయ్యమీద వెన్నెలవెదచల్లే తెల్లపట్టువలువ కప్పినదానిమీద అనంగమంజరిని, తారకల చెలువముతో తెల్లమబ్బు తునకమీద ఉన్న శరచ్చంద్రునివలె నేత్రానందము కలిగించే అమృత సుందరాంగిని చూచి పొంగిపోయి ఆశ్చర్యపడి "ఏమిటి! నేనెక్కడ పరున్నాను? ఈసుందరి ఎవరు? ఇది కలకాదుగదా? అయినా స్వప్నమో కాదో ఈ తన్విని మేలుకొలుపుతాను" అని ఆలోచించి అనంగమంజరి బుజము కదిలించినాడు. అతనిచెయ్యి తగలగానే ఆకన్య చంద్రకిరణము సోకిన కలువతీగవలె కళ్ళు అల్లనల్లన విప్పి అతన్ని చూచి "ఇతనెవరో దివ్యుడు. ఎవరూరాలేనిచోటికి ఎలా ప్రవేశించాడు?"

అని క్షణము ఆలోచించి విస్మయసంభ్రమాలు పెనగొనగా "ఎవరు మీరు? ఎందుకిలా వచ్చారు? దయచేసి చెప్పండి" అని శ్రీదర్శనుణ్ణి అడిగింది. అతడు తన విషయమంతా తెలియచేసినాడు. అనంగమంజరి తన పేరు కులము దేశము తెలియచెప్పింది. పరస్పరము వాళ్ళు అది స్వప్నము కాదని నిశ్చయపరచుకోవలెనని నగలు మార్చుకొన్నారు. నాయికానాయకులు వివాహానికి త్వరపడుతూ ఉండగా, గణపురుషులు ఇద్దర్నీ మోహా పెట్టి నిద్రపుచ్చి శ్రీదత్తుడు నిద్రింపగానే అతన్ని ఇంటికి తెచ్చినారు.

శ్రీ దత్తునికి తన మందిరములో మెళుకువ వచ్చింది. అతడు తన శరీరముమీద ఉన్న నగలను చూచుకొని "ఇదేమి! హంసద్వీపాధిపతి కూతురు ఎక్కడ? అందమైన ఆ పడకగది ఏది? ఇదేమిటి ఇక్కడికి మళ్ళీ నేనెలావచ్చాను? ఈ నగలు నాకెలావచ్చాయి? ఇదంతా విధి విలాసము!" అనిఆలోచిస్తూ భార్య పద్మిష్ఠాదేవికి మెళుకువరాగా నిద్ర పుచ్చి రాత్రి గడిపినాడు. శ్రీదర్శనుడు ఉదయాన నగలమీద అనంగ మంజరి పేరుచూచి శ్రీసేనునికి తెలియచేసినాడు. మహారాజు హంస ద్వీపమార్గము తెలుసుకోదలచి పురములో చాటింపు చేయించినాడు. ద్వీపమార్గము ఎవరికీ తెలియలేదు. యువరాజు అనంగమంజరి కోసము విరహముతో వేగి నిద్రాహారాలు మాని అనంగమంజరీదేవి హారాన్ని అవలోకిస్తూ నిమిషాలు యుగాలుగా గడుపుతూ ఉన్నాడు.

హంసద్వీపములో అనంగమంజరి తూర్యఘోషతో తల్పమునుండి లేచి రాత్రివృత్తాంతము స్మరించి శ్రీదర్శనుని హారము తన కంఠములో చూచుకొని విరహవ్యాకుల చిత్తముతో "పోనీ అంతా స్వప్నమని అనుకోడానికి వీలులేకుండా ఈహారము శ్రీదర్శనునిదికదా! ఎలా సందేహము తీరుతుంది?" అని పరిపరివిధాల తలపోస్తూ ఉండగా ఆమెతండ్రి అనంగోదయుడు వచ్చి వాత్సల్యముతో కుమారిని తనఒడిలో కూర్చో

పెట్టుకొని "అమ్మా! ఈ మొగాడివేషమేమిటే? ఈసిగ్గెందుకే? ఏమి టమ్మా చెప్పు" అని బుజ్జగించి అడిగినాడు. అనంగమంజరి తండ్రిలాల నకు వశురాలై బిడియము విడిచి రాత్రివృత్తాంతము చెప్పింది. తండ్రి ఇంద్రజాలము వంటి అమానుషచర్య విని ఆశ్చర్యపడి తనమిత్రుడైన బ్రహ్మసోముడనే సిద్ధుని దగ్గిరికి వెళ్ళి చెప్పినాడు. ఆసిద్ధుడు యోగ దృష్టివల్ల సమస్తమూ గ్రహించి ద్వీపాధిపతితో "రాజన్! మాళవ దేశమునుంచి గణపురుషులు శ్రీదర్శన రాజేంద్రుని తీసుకొని వచ్చినారు. గణాధిపతి అతన్ని నీ కుమార్తెనూ ప్రీతితో చూస్తున్నాడు. వినాయ కుని ప్రభావమువల్ల శ్రీదర్శనుడు చక్రవర్తి అవుతాడు. అతడు నీకుమార్తెకు తగినభర్త." అని చెప్పినాడు. రాజు నమ్రుడై "స్వామీ! మాళవదేశము ఎక్కడ? ఈ ద్వీపమెక్కడ? ఎంతకాలమో ప్రయా ణము? నీవే నాకీసంబంధవిషయములో దిక్కు" అని వేడినాడు.

సిద్ధుడు అతనికార్యము నెరవేరుస్తానని చెప్పి క్షణములో మాళవ రాజ్యములో శ్రీసేనుని రాజధానికి వచ్చినాడు. అతడు శ్రీదర్శనుడు నిర్మించిన దేవాలయము ప్రవేశించి గణపతికి మొక్కి స్తోత్రము చేసి నాడు. "సుమేరుశిఖరమువలె కల్యాణమూర్తివై నక్షత్ర మాలాలం కృత శిరస్కుడవైన నీకు నమస్కారము. త్రైలోక్యభవన స్తంభము వలె ఉన్న నీకరమునకు నమస్కారము. విఘ్ననివారణా! సర్వసిద్ధముల కారణమైన నీఉదరానికి వందనము."

సిద్ధుడు గణపతి స్తోత్రము చేస్తూ ఉండగా ఉపేంద్రశక్తి కుమారుడు మహేంద్రశక్తి అనేవాడు పిచ్చెత్తి పరుగెత్తుతూ సిద్ధుని పట్టుకొన్నాడు. సిద్ధుని మంత్ర ప్రభావమువల్ల వాడిపెర్రి కుదిరింది. తన దిశమొలకు సిగ్గుపడి వాడు కౌపీనముకోసము ఇంటికి పరుగెత్తినాడు. ఉపేంద్రశక్తి కొడుకు పిచ్చికుదిరినందుకు బ్రహ్మానందపడి వాడికి స్నానము చేయించి నూతనవస్త్రాలు కట్టించి, కుమారుణ్ణి వెంటపెట్టుకొని సిద్ధుని దగ్గిరికి వచ్చి

సిద్ధునికి కావలసినంత ధనము అర్పించినాడు. యోగీంద్రుడు ధనము తృణప్రాయముగా చూచి స్పృశించలేదు.

ఈవిషయము తెలిసి శ్రీదర్శన సమేతముగా శ్రీసేన మహీపాలుడు వచ్చి సిద్ధుని పాదాలకు వందనముచేసి "మహాత్మా! తమరాకవల్ల ఈవర్తకుని కుమారుడు బాగుపడ్డాడు. అలాగే నన్ను అనుగ్రహించాలి. నాకుమారుని క్షేమము కోరండి" అని ప్రార్థేయపడగా యోగి నవ్వుతూ "రాజన్! ఈ దొంగకు అభీష్టసిద్ధి చేయమంటావా! ఇతడు రాత్రి అనంగమంజరి ఆభరణాలు హరించి హంసద్వీపమునుంచి ఇక్కడికి పారిపోయివచ్చాడు. అయినా రాజు కనుక నీమాట నెరవేర్చక తప్పదు. "అంటూ శ్రీదర్శనునితో అతడు అంతర్ధానమైనాడు. సిద్ధుడు శ్రీదర్శనుని హంసాద్వీపాధిపతికి అప్పగించినాడు. అనంగోదయుడు సంతోషించి అనంగమంజరిని శ్రీదర్శనునికిచ్చి వివాహము చేసి సిద్ధప్రభావమువల్ల మాళవదేశము చేర్చినాడు. శ్రీదర్శనుడు నిజ రాజధానిలో ఇద్దరు భార్యలతో సుఖముగా ఉన్నాడు. కొన్నాళ్ళకు శ్రీసేనమహారాజు కాలము చేయగా శ్రీదర్శనుడు రాజై భూమండలము జయించి చక్రవర్తి అయి, పద్మిష్ఠా అనంగమంజరులవల్ల పద్మసేన అనంగసేను లనే కుమాళ్లను పొందినాడు.

కాలము గడుస్తూ ఉండగా శ్రీదర్శనుడు అంతఃపురములో భార్యలతో ఉన్నప్పుడు ఒకవిప్రుడు బైట ఏడుస్తున్నాడు. రాజు వెలుపలికి వచ్చి అతని దుఃఖకారణము అడగ్గానే అతడు "రాజన్! ఆపావకుడు దీప్తశిఖుడు అతనిప్పుడు కాలమేఘుడు అట్టహాసమోచనుడు జ్యోతిర్లేఖాధూమలేఖా సమేతముగా నాశనము చేసినాడు" అని వెంటనే అంతర్ధానమైనాడు. రాజు ఆశ్చర్యపడుతూ "ఏమిటంటాడు? ఎక్కడికి వెళ్ళినాడు!" అంటూ దేవేరులను చూడగా వాళ్ళు క్షణములో కన్నీరు కారుస్తూ చనిపోయినారు. అశనిపాతకర్కశమైన

జే వేరుల మరణానికి రాజు విలపించి మూర్ఛపాలైనాడు. ముఖరకుడు రాణులను దహనము చేయించినాడు. రాజుకు తెలివి వచ్చి భార్యల మరణానికి బాధపడి శ్రాద్ధకర్మలు జరిపించినాడు. అతడు కన్నీటిమునురు వల్ల అంధకారములో సంవత్సరము గడిపి రాజ్యాన్ని కుమార్లకు పంచి పెట్టి రాజధాని త్యజించి ప్రజలను ఓదార్చి తపోవనానికి వెళ్లినాడు.

శ్రీదర్శనుడు వానప్రస్థుడై కందమూలఫలాలు తింటూ తిరిగి తిరిగి వటవృక్షముదగ్గిరికి వెళ్ళగా అక్కడ దివ్యాకారులు ఇద్దరు ఫలమూలాల ములు చేతులో పెట్టుకొని బైటికి వచ్చి "రాజా, ఈఫలమూలాలు స్వీక రించు" అని కోరినారు. శ్రీదర్శనుడు వా ళ్ళెవ్వరో చెప్ప మన్నాడు.

దివ్యవనితలు శ్రీదర్శనుని తమనివాస మైనబంగారునగరానికి తీసు కొని వెళ్ళి దివ్యఫలములు అతని కిచ్చి ఇలా పలికినారు: మహారాజా! పూర్వము ప్రతిష్ఠానపురములో కమలగర్భుడనే విప్రునికి ఇద్దరు భార్యలు ఉండేవారు. క్రమేణా ముగ్గురికీ ముసలితనము ఒకేసారి రాగా ప్రేమతో నిలవలేక ముగ్గురూ ఒక్కసారి అగ్నిహోత్రములోకి ఉరికినారు. అప్పుడు వాళ్ళు అగ్నిహోత్రుని "మాకు జన్మజన్మలలో భార్యాభర్తృత్వము కలి గించు దేవా" అని ప్రార్థించినారు. అప్పుడు కమలగర్భుడు కఠోర తపమువల్ల యక్షజాతిలో ప్రదీప్తాక్షకుమారుడుగా, అట్టహాసుని తమ్ముడై దీప్తశిఖు డనేనామముతో జన్మించినాడు. అతనిభార్యలు ధూమకేతు డనేయక్షుని కుమార్తెలై పుట్టి జ్యోతిర్లేఖా ధూమలేఖా నామాలతో పెరిగినారు. ఆకన్యలు యువతులై అడివికి వెళ్ళి మంచిభర్తల్కై శివుణ్ణి గురించి తపస్సుచేశారు. శివానుగ్రహము కలిగి "కన్యలారా! మీరు పూర్వజన్మలో ఎవనితో భార్యాపతిత్వము అన్నిజన్మాలకు వేడినారో ఆభర్త ఇప్పుడు అట్టహాసుని తమ్ముడై దీప్తశిఖు డనేనామముతో యక్షుడై జన్మించాడు. అత నిప్పుడు శాపవశాన మానవజాతిలో శ్రీదర్శను డనేపేరుతో పుట్టినాడు. అందువల్ల మీరు మానవలోక

# కథా సరిత్సాగరము

( సంపుటము : ౫ )

## శ్రీ సోమదేవ భట్ట ప్రణీతము

( 74—104 తరంగములు )

తల్లావజ్ఝుల శివ శంకర శాస్త్రి
తల్లావజ్ఝుల కృత్తివాస తీర్థులు
సంస్కృతమునుండి తెలిగించినది.

2½ రూ


ప్రకాశకులు: అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# విషయానుక్రమణిక

# శశాంకవతీ లంబకము

## తరంగము: ౨౮

మృగాంకదత్తుడు మంత్రిసమేతుడై ఉజ్జయినీనగరికి బయలుదేరి, వింధ్యారణ్యములో ఫలపుష్ప భరితమై, ఛాయావృక్షములతో స్వాదుజలము గలచోట, నయనోత్సవము కలిగించే వనములో విడిసినాడు. అతడూ అమాత్యులూ చల్లని తేటనీటిలో స్నానముచేసి, పళ్ళు తిన్నారు. మృగాంకదత్తుడు ఒకవైపు తీగజొంపములో మాటలసవ్వడి విని కుతూహలముగా దగ్గిరికి వెళ్ళిచూడగా ఆగుబురులో పెద్దవనగజము ప్రయాణముచే అలిసిన అంధుడైన బాటసారికి తొండముతో నీళ్ళూ పళ్ళూ తెచ్చిఇస్తూ, తన చెవులతో గాలి వీస్తూ, దాహము తీరుస్తూ మనుష్యవాక్కుతో "అయ్యా! ఆయాసము తీరిందా? అని పదేపదే ఔదార్యముతో ఊరడిస్తున్నది. ఆ అద్భుతము చూచిన మృగాంకదత్తుడు మిత్రులందర్నీ పిలిచి "చూడండి! వనగజము ఎలా అతిథిపూజ చేస్తున్నదో, నిజానికి ఈ అడవిఏనుగు ఎవరో మహాపురుషుడు! ఏకారణము చేతనో ఈ స్థితిలో ఉన్నాడు. ఈ బాటసారి మనమిత్రుడయిన ప్రచండశక్తివలె ఉన్నాడు. ఇతనికి అంధత్వము వచ్చిందేమి? సంగతి ఏమిటో తెలుసుకోవలె" అని మాటున నక్కి పొంచి చూస్తున్నాడు. దాహము తీరినతరువాత అంధుణ్ణి వనగజము "అయ్యా! నీవు ఎవరు? నీకీగుడ్డితనం ఎలావచ్చింది? అంధుడవై ఇక్కడికి ఎలారాగలిగినావు?" అని కుతూహలముతో అడిగింది. అంధుడు గజేంద్రునికి నిజవృత్తాంతము తెలియచేస్తున్నాడు. "అమరదత్తుడనే రాజు అయోధ్యను ఏలుతున్నాడు. ఆయనకుమారుడు మృగాంకదత్తుడు; మహాగుణవంతుడు. అతనిమంత్రిని నేను. నన్ను ప్రచండశక్తి అంటారు. విధివశముచేత రాజు కుమారుణ్ణీ అతని మంత్రుల్నీ దేశమునుండి వెళ్ళగొట్టినాడు. మేమందరమూ

శశాంకవతికై ఉజ్జయినికి ప్రయాణమై మధ్యమార్గములో పారావత నాగశాపమువల్ల అరణ్యములో తలోదారిఅయినాము. నేను ఆశాపము వల్ల అంధుడినై తిరుగుతూ ఫలజలసమృద్ధిగా ఉన్న ఈవనము చేరి పొట్టపోసుకొంటూ క్రమేణా ఇక్కడికి వచ్చాను. కళ్ళుకనపడక తోవ తెలియక గోతుల్లోపడి తిండిలేక నానాఅవస్థలు పడి మృత్యువును ఎంత వేడినా లాభములేకపోయింది. నా ఆకలిమంట నీవల్లనే తీరింది. నా అంధత్వముకూడా నీవల్లనే తొలిగిపోవాలి. నీవెవరో దేవుడివలెఉన్నావు. ఈమాటలు పొంచుని విన్న మృగాంకదత్తుడు హర్షశోకరసముల నడిమి వెల్లువలో పడి అమాత్యులతో "ఇతడు మన ప్రచండశక్తి. అయ్యో, ఎంతకష్టము వచ్చింది! మనము వెంటనే ఇతన్ని పలకరించి ప్రయోజనము లేదు. ఈగజము ప్రచండశక్తికి నేత్రదానముకూడా చేయ వచ్చును. మనలను చూచి ఏనుగు తొలిగిపోతుందేమో! అందువల్ల మాటున దాగి సంగతి ఏమిటో కనిపెడదాము" అని హెచ్చరించి నాడు. ప్రచండశక్తి అడివిఏనుగను "మహానుభావా! నీవు ఎవరో నాకు తెలియదు. నీవు ఏనుగు కావడము ఎందువల్ల? నీకీ మనుష్యవాక్కు ఎలా వచ్చింది?" అని అడగ్గా గజేంద్రుడు స్వవిషయము చెప్ప నారంభించినాడు:

## వారణకథ

ఏకలవ్యనగరములో శ్రుతధరుడనేమహారాజుకు ఇద్దరుభార్యలు. ఇద్దరికీ ఇరువురుకుమాళ్ళు. తండ్రి కాలము చేసినతరువాత సత్యధరుడు అన్న శీల ధరుణ్ణి తరిమి రాజ్యము లాక్కొన్నాడు. వైరముతో శీలధరుడు శివుని గూర్చి తపస్సుచేసి శివసాక్షాత్కారము పొంది "దేవా, నేను గంధ ర్వుణ్ణి కావాలి. అప్పుడు గగనసంచారము చేసి నాసోదరుణ్ణి అవలీలగా జయిస్తాను. నాకు ఆరీతిగా అనుగ్రహించు" అని వరము వేడినాడు.

శివుడు "అలాగే. అయితే నీశత్రువు మరణించినాడు. రాధానగరములో ఉగ్రభటుడనేరాజుకు సమరభటుడనేకుమారుడై జన్మిస్తాడు. నీవు అతనికి అన్నవై సవితితల్లికడుపున పుడతావు. నీవు అతన్ని హత మార్చి రాజ్యానికి వస్తావు. పగవల్ల నీవు తపస్సు చేశావు కనుక ముని శాపమువల్ల పదభ్రష్టుడవై వనగజ మవుతావు. పూర్వ జన్మజ్ఞానంవల్ల నీకు మనుష్యవాక్కు కలుగుతుంది. మార్గాయసమువల్ల వచ్చిన అతిథిని సత్కరించినప్పుడు నీ గజత్వము పోయి గంధర్వుడవు అవుతావు. అప్పుడే ఆ అతిథికి ఉపకారము కలుగుతుంది" అని అనుగ్రహించి అంతర్ధానము కాగా శీలధరుడు తపస్సువల్ల చిక్కినశరీరాన్ని గంగలో వదిలినాడు.

రాధానగరములో ఉగ్రభటమహారాజు రాణి మనోరమతో సుఖంగా ఉండగా లాసకుడనే నటుడు వచ్చి అమృతమధనము అనే రూపకము ఆడించినాడు. ఆనాటకములో అతనికుమార్తె లాస్యవతి దైత్యుల చేతిఅమృతాన్ని హరించిన జగన్మోహినీభూమిక ధరించింది. మహారాజు మోహినీవేషము చూచి వ్యామోహములో చిక్కి క్రమంగా కామపీడితుడై నటునికి కావలసినంత ధన మిచ్చి లాస్యవతిని వివాహమాడి ఆమెతోడిదే లోకముగా ఉంటున్నాడు. సంతానము ఎన్నాళ్లకూ కలగకపోగా రాజు యజుస్వామి అనేపురోహితుణ్ణి పిలిచి పుత్రకామేష్టి చేయించినాడు. పుత్రకామేష్టికి చాలామంది విద్వాంసులు విచ్చేసినారు. మంత్రపూత మైన పాయసము మొదట పట్టపురాణి స్వీకరించింది. మిగతాపాయసము లాస్యవతి పుచ్చుకొన్నది. వారి కడుపులు ఫలించగా శీలధర సత్యధరులు జన్మించినారు. పట్టపుదేవి కల్యాణలక్షణుడైన కుమారుని కనగా ఆసమయములో గగనవాణి "ఈశిశువుకు భీమభటుడు అని పేరు. యశస్సు గడించి మహారాజు అవుతాడు" అని స్పష్టంగా పలికింది. మర్నాడు లాస్యవతీదేవి సమర

భటు డనే కుమారుని కన్నది. కుమారులు క్రమంగా దినదినప్రవర్ధ మానులై విద్యాసంపన్నులైనారు. భీమభటుడు గుణాధికుడు. అందు వల్ల అన్నదమ్ములకు ఎప్పుడూ వైరమే! ఒకనాడు సమరభటుడు యుద్ధకేళిలో మత్సరుడై బలత్కారంగా భీమభటుని కంఠముమీద కొట్టినాడు. భీమభటుడు కోపముకొద్దీ అతన్ని తన బాహువులతో నొక్కి పట్టి నేలమీద పడవేయగా సమరభటుడు గట్టిదెబ్బలు తిని నవరంధ్రాలనుండి రక్తము కక్కినాడు. వెంటనే అతని అనుచరులు అతన్ని తీసుకొనిపోయి తల్లికి అప్పగించారు. ఆమె కుమారుని చూచి భీమభటుడు ఇంతపని చేశా డని గ్రహించి అతని ముఖముమీద ముఖ ముంచి స్నేహాకాతరమై గొల్లున ఏడవగా రాజు వచ్చి సంగతి అడిగినాడు. లాస్యవతి తత్తరపడుతున్న రాజుతో "ఇది భీమభటుని వల్ల వచ్చిన అవస్థ. నాకుమారుడు ఎప్పుడూ వాడిచేతుల్లో తన్నులు తింటూ ఉంటాడు. వాడు ఇలాటివాడయితే మీకు మాత్రము క్షేమ మెక్కడ? ఆలోచించండి" అనగానే రాజు భీమభటుని దూరముగా ఉండమన్నాడు. అతనితల్లి మనోరమ అతన్ని పిలిచి "కుమారా! నర కిని వలచి తండ్రి నిన్ను వదలిపెట్టినాడు. నీవు తాతగారింటికి పాటలీ పుత్రము వెళ్ళు. ఆయనకా కుమారుళ్ళు లేరు. తాత నీకు సగమురాజ్యము ఇస్తాడు. శత్రువు బలశాలి. సమరభటునివల్ల నీకు ప్రాణాపాయము కలుగవచ్చు. అందువల్ల నీవువెళ్ళిపో" అని హితము ఉపదేశించింది. భీమభటుడు "క్షత్రియుణ్ణిగా పుట్టి పిరికిపందవలె పారిపోతానా? అమ్మా, ధైర్యముతో ఉండు. ఈ గుడ్డిగవ్వ న న్నేమిచేస్తాడు!" అనగా తల్లి "అలా అయితే అబ్బాయీ! నాదగ్గిర ధనము తీసుకో. నీరక్షణార్థై సహాయులను ఏర్పాటు చేసుకో" అని బోధించింది. కుమారుడు తల్లితో "అమ్మా, అలా చేస్తే అనవసరంగా కయ్యానికి కాలు దువ్వినట్లవుతుంది. నీ ఆశీర్వచనబలమే నాకు క్షేమము" అని సమాధాన పరిచి

వెళ్ళినాడు. పౌరులు అందరూ "భీమభటుణ్ణి రాజు అన్యాయము చేసినాడు. సమరభటుడు ఇతని రాజ్యాన్ని హరించేటంత ప్రగల్భుడు కాడు. అందువల్ల మనము భీమభటుణ్ణే సేవిద్దాము" అని నిశ్చయానికి వచ్చినా, రహస్యముగా అతనికీ అతనిరక్షకులకూ అనుచరులకూ సరిపోయే విధంగా, అతని సుఖానికి లోటులేకుండా ధనము అర్పించినారు. కనిష్ఠుడు ఇతన్ని వధించాలని ఉపాయము వెతుకుతూనే ఉన్నాడు. వాడు తండ్రికికూడా ఆ ఆశయాన్నే పుట్టించినాడు. ఇలా ఉండగా శంఖదత్తుడనే వీరవిప్రుడు, యువకుడు ధనవంతుడు, ఆసోదరుల మిత్రుడు. ఒకనాడు సమరభటుని దగ్గిరికి వచ్చి "మిత్రుడా, అన్నయ్యతో తగాదా ఎందుకు? ఇది ధర్మముకాదు. పెద్దవాణ్ణి బాధించడం తగదు. ఎంత అప్రతిష్ఠ!" అని హితోపదేశము చేసినాడు. సమరభటుడు అతన్ని తిట్టి పంపినాడు. మూర్ఖునికి హితోపదేశమువల్ల కోపమువస్తుంది. శంఖదత్తుడు కోపమువల్ల అతనిమీద పగ సాధించవలెనని, అతన్ని జయించాలని భీమభటునితో స్నేహము చేసినాడు.

మణిదత్తుడనే వైశ్యుడు విదేశమునుండి వచ్చేటప్పుడు అశ్వరత్నము విక్రయార్థము తెచ్చినాడు. ఆగుర్రము చంద్రునివలె శ్వేతముగా ఉంటుంది. దాని కంఠస్వరము శుద్ధశంఖారవమనోహరము. అది గంధర్వకులములో జన్మించడం చేతకాబోలు చూడామణి అంగదాదులతో అలంకృతమైంది. శంఖదత్తునివల్ల అశ్వవిషయము ఎరిగి భీమభటుడు మూల్యమిచ్చి హయాన్ని కొనబోతూ ఉండగా సమరభటుడు ఆసంగతి ఎరిగి రెట్టింపుఖరీదిచ్చి గుర్రము కొంటానన్నాడు. వర్తకుడు అలా అధర్మానికి అంగీకరించలేదు. సమరభటుడు బలాత్కారముగా గుర్రాన్ని ఎక్కబోగా అన్నదమ్ములకు పోరు జరిగింది. సమరభటుడు చావు దెబ్బలుతిని పారిపోతూ ఉంటే శంఖదత్తుడు పగవల్ల అతనిజుట్టు పట్టి చంపబోయినాడు. అప్పుడు భీమభటుడు "వీణ్ణి ఇంకా బతికే

ఉండని స్తే నయం" అని విప్రునితో అన్నాడు. సమరభటుడు చావు తప్పి కన్ను లొట్టపోయి భయంతో తండ్రి దగ్గరికి పారిపోయి గాయాల్లోంచి రక్తము కారుతూ ఉండగా తండ్రికి కనపడ్డాడు. ఈలోగా క్షణములో గుర్రాన్ని కొన్న భీమభటుని దగ్గిరికి ఒక విప్రుడు వచ్చి ఏకాంతములో "అయ్యా, మీతో మీఅమ్మ మనోరమాదేవీ, మీపురోహితుడూ, మంత్రీ ఇలా చెప్పుమన్నారు— వత్సా! మొదటినుంచీ రాజు నీమీద ఏఅభిప్రాయముతో ఉంటున్నాడో తెలును కద! ప్రకృతము నీకు రాజు ప్రబలవైరి. నీవు యశస్సునూ ధర్మాన్నీ కాపాడుకొనదలచితే, భవిష్యత్తు ఆలోచిస్తే, మమ్మల్ని నీహితులనుగా తలిస్తే సూర్యాస్తమానము కాగానే పిట్టకుకూడా తెలియకుండా ఊరు విడిచి కార్యసిద్ధికై మీ తాతగారి ఊరు వెళ్ళిపో. ఇలామీకు వార్త పంపినారు. ఈసువర్ణ రత్నభాండము మీకు ఇవ్వమన్నారు. దీన్ని స్వీకరించండి" అని పలికినాడు. భీమభటుడు అందుకు అంగీకరించి రత్నభాండము పుచ్చుకొని మంత్రిపురోహితులకూ తన తల్లికీ తగిన సమాధానము విప్రునిద్వారా చెప్పిపంపి, సందెచీకట్లో ఖడ్గహస్తుడై అశ్వమారోహించి వేరొక అశ్వముమీద హేమరత్నాల సంచులు పదిలపరుచుకొని, శంఖదత్తుడు తోడురాగా ప్రయాణమైనాడు.

ఆరాత్రి రాజకుమారుడు చాలాదూరము ప్రయాణముచేసి తోవలో కెల్లుపూవులఅడవిలో ప్రవేశించినాడు. దూకుతూ పోతున్న గుర్రాల గిట్టలవల్ల కెల్లుచప్పుడు కాగా, అక్కడి సింహామిథునము శాబకములతో కూడా లేచి గర్జించి గుర్రాలకడుపులు గోళ్ళతో చీల్చినది. అప్పుడు భీమభటుడు అతని మిత్రుడూ సింహాలన్నింటినీ కత్తిపోట్లతో రూపుమాపి తమ అశ్వాలను చూచుకోగా అవి రెండూ పేగులు తెగి నేలమీద వాలి చనిపోయినవి. భీమభటుడు విషణ్ణుడై శంఖదత్తునితో మిత్రమా, ద్వేషులయిన దాయాదులనుంచి తప్పించుకో గలము కాని, యత్న

శతమువల్ల విధినెలా తప్పించుకోగలము! మనవాహన యోగ్యతచూచి విధిఓర్వలేక ఇంతపనిచేసింది! ఏఅశ్వముకోసము దేశము వదిలిపెట్టవలసి వచ్చిందో ఆగుఱ్ఱమే చనిపోయింది. కాలినడకవల్ల ఈ అడివి ఎలా దాటగలము!'' అని పలికినాడు. శంఖదత్తుడు అతని మాటలకు "మిత్రమా, పురుషకారము విధికి వశమై ఉంటుంది. ఆసంగతి కొత్త కాదు. అలాగేధీరుణ్ణి విధి ఏమి చెయ్యగలదు? గాలి కొండనుకదల్చ లేదు. ధైర్య హయాల నెక్కి వెళ్ళిపోదాము'' అని ప్రోత్సాహము చేయగా భీమభటుడు అందుకు అంగీకరించి అతనితో బయలు దేరి నాడు. అతడు అడివిలో ప్రయాణము చేస్తూంటే పాదాలు గాయా లయినవి. వాళ్లు అరణ్యము దాటేప్పటికి పలవల తెల్లవారింది. జగ జ్జ్యోతి అయిన సూర్యుడు ఉదయించగా "ఆహా ఇతడు పూర్వపుణ్యము వల్ల వన్యమృగా లున్నప్పటికీ అడివిదాటినాడు'' అని అతన్నిచూచి పరస్పరము పలుకతున్నట్టు తుమ్మెదల ఝుంకారాలతో పద్మినులు విరిసినవి. భీమభటుడు క్రమంగా వయస్యునితో నడిచి తపోధనుల పర్ణ శాలలున్న జాహ్నవీ పులినసీమ చేరినాడు. చంద్రామృతమువలె స్వాదు శీతలజలములో రాజపుత్రుడు స్నానమాడి విశ్రమించినాడు. శంఖ దత్తుడు బోయవానిదగ్గిర లేడిమాంసముకొని వేయించి దేహధర్మము తీర్చుకొన్నాడు. గంగ అలల చేతులెత్తి ఎవరినీదాటవద్దని నిందుగా ఉండగా భీమభటుడు తీరాన కొంతదూరమునడచి అక్కడ పర్ణశాలా ప్రాంగణములో ఏకాకిగా వేదాధ్యయనము చేస్తున్న విప్రకుమా రుణ్ణిచూచి "ఆర్యా, మీరెవరు? ఒంటరిగా ఈవిజనస్థలాన ఏమి చేస్తు న్నారు?''అని ప్రశ్నించినాడు.

అతడు ఇలా చెప్పినాడు: "నానివాసము వారణాసి. శ్రీకంఠుడనే విప్రుని కుమారుణ్ణి. నన్ను నీలకంఠు డని పిలుస్తారు. తండ్రి నాకు చేయవలసిన సంస్కారములు యథావిధిగా చేసినాడు. నేను గురుకుల

వాసము చేసి, ఇంటికి వచ్చినాను. ఇంట్లో మా వాళ్ళందరూ చనిపోయి నారు. దిక్కులేనివాణ్ణి, తృణమూ కణమూ లేనివాణ్ణి. వివాహము చేసుకొనవలె నని తలచి కఠోరంగా తపస్సు చేసినాను. స్వప్నములో గంగాభవాని నాకు దర్శన మిచ్చి తిన మని ఫలాలు ఇస్తూ, నా కోరిక ఈడేరుతుం దని అనుగ్రహించింది. మేలుకొని తెల్లవారు జామున నేను గంగాస్నానము చేస్తున్నప్పుడు ఫలాలు నీళ్ళల్లో కొట్టుకొని వస్తున్నవి. ఆపళ్ళు తీసుకొని పర్ణశాలలో భుజించినాను. ఈవిధముగా దినదినమూ ఫలాలు లభిస్తున్నవి. ఫలహారము చేస్తూ ఇక్కడ ఉంటున్నాను. ఇదీ నాసంగతి.''

భీమభటుడు నీలకంఠుని వృత్తాంతము విని శంఖదత్తునితో మిత్రుడా! ఇతని పెళ్ళికి కావలసినంత ధనము ఇస్తాను'' అని పలికినాడు. అతనూ అంగీకరించినాడు. భీమభటుని దగ్గిర తల్లి పంపిన ధనము ఉన్నది. ఆ ధనము విప్రకుమారునికి ఇచ్చినాడు. ఆ బ్రాహ్మణకుమారుణ్ణి భీమభటుడు సంతృప్తునిచేసి, తీరాన ఎంతదూరము వెళ్ళినా దాటే ఉపాయమే కనపడ లేదు. భీమభటుడు కత్తిని తలకు కట్టుకొని మిత్రునితో ఏటిలో దిగి అడ్డముగా ఈదసాగినాడు. ఏరు ఎక్కువ వడిగా ఉంది. అందువల్ల మిత్రులు ఒకరొకరికి దూరమైపోయినారు. భీమభటుడు చావుతప్పి కన్ను లొట్టపోయి గట్టుచేరి స్నేహితునికోసము గట్టుపొడుగునా వెతుకు తున్నాడు. పొద్దుకూకింది. మిత్రుడాఅంటూ గట్టిగా పిలుస్తూ భీమ భటుడు నిరాశతో దుఃఖాతిశయంవల్ల గంగలో దూకవలెనని నిశ్చయించు కొన్నాడు. "గంగాదేవీ! మిత్రుడు శంఖదత్తుడు నాప్రాణము. అతన్ని నీపొట్టన పెట్టుకొన్నావుకద. అతడు లేకపోయినప్పుడు శూన్య మైన నాశరీరాన్నికూడా నీవేతీసుకో'' అంటూ నీళ్ళల్లో పడబోతున్నాడు. అంతలో గంగాభవాని సాక్షాత్కరించి సంతోషించి అతనితో "కుమారా! సాహసము కూడదు: నీమిత్రుడు బతికే ఉన్నాడు. త్వరలో

మీాఇద్దరకీ సమావేశము కలిగేట్టు చేస్తాను. ప్రతిలోమము అనులోమము అనే రెండు విద్యలు నీకు ప్రసాదిస్తాను. మంత్రము అనులోమముగా చదివితే, తాను కోరినరూపము ఇతరులకు కనిపిస్తుంది. ఇది సప్తాక్షరీ మంత్రము. దీనిమహిమవల్ల నీవు భూలోకంలో రాజవుతావు" అని అనుగ్రహించి అదృశ్యురా లైంది.

మిత్రుడు లభిస్తాడనే ఆశతో భీమభటుడు చనిపోదలుచుకో లేదు. రాత్రల్లా గడిపి తెల్లవారిన తరువాత స్నేహితుని కోసము వెతుక్కుంటూ క్రమేణా లాటదేశము చేరినాడు. లలితకళలకు ఆటపట్టయిన రాజధానిలో భీమభటుడు దేవాలయా లన్నీ కలయచూచి, ప్రతిగుమ్మమూ ఎక్కుతూ దిగుతూ మిత్రునికై భోగట్టా చేస్తున్నాడు. ఒకచోట కొందరు జూదమాడు తున్నారు. వారిమొలలకు మాత్రమే గోచీగోనాలున్నవి. నాలుగురాళ్ళు ఏదోవిధంగా ద్యూతకళవల్ల సంపాయించాలని ఈవేషము వేశారని తెలుస్తూనే వుంది. శరీరాలు పుష్టిగా ఉన్నవి. భీమభటుడు వాళ్ళతోపాటు జూద మాడసాగినాడు. కొత్తగా వచ్చినవాడు నగలూ నాణ్యాలూ ఉన్నవా డనీ, తరువాత జోగిని చేసి పంపవచ్చుననీ జూదగాళ్ళు ఆలోచించి ఆట ఆడుతున్నారు. భీమభటుడు పాచిక లాడి వాళ్ళందరినీ ఓడించి, వాళ్ళ ఇల్లూ వాకిళ్ళూ గుల్ల చేసినాడు. ఆట ఆడినవాళ్ళు ఇళ్ళకు వెడతా మని లేవగా వాళ్ళను పోనివ్వక ద్వారానికి అడ్డంగా భీమభటుడు నిలవబడి "మిత్రులారా! ఎక్కడికి పోతున్నారు? తీసుకోండి డబ్బు. నాకెందుకు! నాధనము నాయిష్టు లైనవాళ్ళకు ఇచ్చుకోవలె. మీారు నాయిష్టులు. పుచ్చుకోండి "అని బలవంతపెట్టినాడు. వా ళ్ళంతా సిగ్గుతో సగం చచ్చిపోయినారు. అక్షక్షపణకు డనేవాడు "గెలుచుకొన్నదాన్ని తిరిగి ఇవ్వకూడదని జూదములో మర్యాద. నిజమే అయినా, అతను ఇష్టముతో ఇస్తూఉంటే, స్నేహరీత్యా మనము ఎందుకు పుచ్చుకో

కూడదు!" అన్నాడు. అతనిమాటకు తక్కిన జూదగాళ్ళు, "ఇతను మనతో ఎప్పుడూ స్నేహము చేస్తే తప్పకుండా మనము పుచ్చుకో వలసిందే" అని నిర్ణయము చేసినారు. భీమభటుడు వాళ్ళతో స్నేహంగా ఉండదలచి సొమ్ము యావత్తూ ఇచ్చివేసినాడు.

ఆ ఆటగాళ్ళు బతిమాలుకోగా వాళ్ళతో భీమభటుడు ఉద్యాన వనానికి వెళ్ళినాడు. వాళ్ళందరూ కుటుంబాలతో వచ్చినారు. వాళ్ళు తెచ్చిన భోజనాదికము పుచ్చుకొని భీమభటుడు వనవిహారానికి సిద్ధ పడినాడు. వాళ్ళు అడిగితే తన కులగోత్రాలు ఊరూ పేరూ చెప్పినాడు. భీమభటుడు అడిగేసరికి అక్షక్షపణకుడు తనవిషయము ఇలా చెప్పినాడు:

## అక్షక్షపణకుని కథ

హస్తినాపురములో శివదత్తుడనే సంపన్న విప్రుని కుమారుడను. నన్ను వసుదత్తుడని పెద్దలు పిలుస్తారు. చిన్నతనంలోనే శస్త్రాస్త్రములు వేద శాస్త్రములు అధ్యయనము చేసినాను. ఆశ్రేయ పౌరుషేయాలు చూచి సమానస్థాయిలో వున్న గొప్పయింటి పిల్లను పెళ్ళి చేసు కొన్నాను. మాఅమ్మకు తగని కోపం. మాఆవిడ మాఇంట్లో కాలు పెట్టగానే అత్తపోరు ఎక్కువైంది. కోడలిని రాచి రంపాన పెడుతూ వచ్చింది. మాఅమ్మ ఇష్టప్రకారం నడుచుకోడం ఎవ్వరితరమూ కాదు. కోడలు ఇంటికి రాగానే మానాన్న మాఅమ్మపోరు పడలేక వినలేక ఎక్కడికో వెళ్ళిపోయినాడు. అప్పటినుంచీ మాఅమ్మ చెప్పినట్టు తూచా తప్పకుండా నడుచుకోవాలని నాభార్యకు మరీ మరీ చెప్పి, నేను అదే విధంగా ఉంటున్నాను. కోడలు ఎంత వినయంగా ప్రవర్తించినా అత్త తీరేవిధం కనపడలేదు. అత్త కోపగిస్తే మాఆవిడ మెదలకుండా ఊరు కొనేది. ఊరుకొంటే అంతటితో కలహం ఆగిపోయేదికాదు. మాఆవిడ జాలిగా మాట్లాడితే మాఅమ్మకు వంచనగా తోచేది. అత్తపోరు పడ.

లేక నాభార్య ఎక్కడికో లేచిపోయింది. నేను విచారంలో కుంగిపోయి దేశాంతరము వెడదామని సంకల్పించగా బంధువులు నాపాలిట యము లై మళ్ళీ పెళ్ళి చేసినారు. మాఅమ్మ కొత్తకోడలిని వేధించుకు తినేది. పోరుపడలేక నారెండో భార్య ఉరి పోసుకొని ప్రాణాలు తీసుకొన్నది. సంసారబాధ పడలేక దేశాంతరం పోదామని నిశ్చయించుకొన్నాను. మాబంధువులు నన్ను పోనివ్వలేదు. మాఅమ్మ చేస్తున్న దుర్మార్గము ఎంత నేను చెప్పినా బంధువులు వినిపించుకోలేదు. మాతండ్రి ఇల్లువిడిచి పెట్టి వెళ్ళినందుకు ఏవేవో కారణాలు బంధువులు చెప్పినారు. వాళ్ళను నమ్మించాలని ఉపాయం ఆలోచించినాను. కొయ్యబొమ్మ చేయించి నేను రహస్యంగా ఒకామెను పెళ్ళాడినట్టు నటన చేసినాను. ఆకొయ్య బొమ్మను గదిలో పెట్టి ఆగదిలోకి ఎవ్వరినీ వెళ్ళనీయక గడియ వేయించి నాను. గది గుమ్మము దగ్గిర దాసీదాన్ని కాపలా ఉంచినాను. నేను నాతల్లితో "అమ్మా, నాకొత్తభార్యను వేరేగదిలో ఉంచాను. నువ్వూ నేనూ వేరే గదిలో ఉందాము. అమ్మా, నువ్వు దాని గుమ్మము తొక్కకు. నేను దాని మొహమే చూడను. దానికి అశుభమూ శుభమూ తెలియదు. నువ్వు గీచిన గీటులో అది మెసలలేదు" అని చెప్పినాను. అమ్మ అందుకు అంగీకరించింది. గదిలో వున్న వాళ్ళకి కోడలిని లొంగ తీసుకోలేక మాఅమ్మ నెత్తీనోరూ కొట్టుకొన్నది. అమ్మ రాతికి తల మోదుకోగా జలజల రక్తం కురిసింది. ఇంటిముందు పడి ఆలగోలుగా ఏడ్చింది. ఆఏడుపు విని అందరూ తెల్లపోయి మాఅమ్మను అడిగి నారు. ఆమె ఈసుగా "అయ్యో, కోడలి చేతుల్లో దెబ్బలుతినే రాత పట్టింది. నిర్హేతుకంగా కోడలు నన్ను చావచితక కొట్టింది. బాబో నాకు చావు తప్పదు" అని మొరపెట్టింది.

బంధువులందరూ నన్నూ మాఅమ్మనూ వెంటతీసుకొని గదిగుమ్మం దగ్గిరకి వెళ్లినారు. వారు గడియ తీసి లోపలికి వెళ్ళి కొయ్యబొమ్మను

చూచి ఆశ్చర్యపడినారు. బంధువులంతా మూఅమ్మను వేళాకోళము చేసి నామాట నమ్మి ఎవరి దారిని వారు వెళ్ళిపోయినారు. నేను స్వదేశం విడిచి మీదేశము వచ్చి దైవవశాన ఈజూదము ఆడుతున్న తావుకు చేరుకొన్నాను. ఈచండభుజంగునితో ఈపాంసుపటునితో ఈశ్మశాన ఖేతాళునితో ఈకాలవరాటకునితో ఈశారిప్రస్తరునితో మొత్తము ఏడుగురితో జూదమాడినాను. ఓడినవాడు గెలిచినవానికి దాసుడు కావలెనని పందెము వేసుకొన్నాము. వీరందరూ నాచేతిలో ఓడిపోయి నారు. వారిగుణాలవల్ల నేను వారికిలొంగిపోయినాను. నేను స్నేహము వల్ల విచారాన్ని మరిచిపో గలిగినాను. ప్రస్తుత స్థితికి తగినరీతిగా అక్షక్షపణు డనేపేర సంచరిస్తున్నాను. నేనీరీతిగా గొప్పవారితో స్నేహము చేసినాను. నీవుకూడా మాతోవచ్చి చేరినావు. నీవు మాకు దొరవు. నీబుద్ధివల్లనూ గుణానురాగముచేతనూ నీధనము పుచ్చుకొన్నాము.

## శంఖదత్తుని చేప మింగుట

ఇలా అక్షక్షపణకుడు తన సంగతి చెప్పగా మిగతావారు తమతమ వృత్తాంతములు భీమభటునికి చెప్పినారు. ప్రయోజనము సాధించేనిమిత్తము ప్రసన్నులై ఉన్న ఆవీరమిత్రులను నమ్మి భీమభటుడు పగలు విహారములో కాలక్షేపం చేసినాడు. రాత్రివేళ అతడు అక్షక్షపణకాదులతో ఉద్యానవనము విడిచి వారి నివాసమునకు వెళ్లినాడు. భీమభటుడు మిత్రులతో నివసించగా మిత్రప్రాప్తిని తెలియచేస్తున్నవా అన్నట్లు వానకారుమబ్బులు ఉరిమినవి. భర్తమీద కోపగించినభార్య వలె విపాశానది సముద్రమువైపు ప్రవహించక వెనుకకు ప్రవహిస్తున్నది. నీరు ఇసుక తిన్నెలను ముంచి పొంగిపోయింది. వంతు తీసిన తరువాత అలక తీరినట్లు నది సముద్రునివైపు ప్రవహించింది. ఆవరదలో సముద్రపునీటిపోటుతో పెద్దచేపవచ్చి నదీతీరాన తగులుకొన్నది.

దాన్ని చూచి చాలామంది ప్రజలు పరుగుపరుగున ఆయుధాలు తెచ్చి చేప కడుపు చీల్చి వేసినారు. మత్స్యగర్భమునుంచి సజీవుడైన విప్ర కుమారుడు బైటికి వచ్చినాడు. అక్కడ ఉన్న వారందరూ తెల్లపోయి నారు. ఊళ్ళో కోలాహలము బయలుదేరగా భీమభటుడు వెళ్ళి విప్ర కుమారుణ్ణి గుర్తించి కౌగలించుకొన్నాడు. అతడు శంఖదత్తుని ఆనంద బాష్పములతో ముంచెత్తినాడు. శంఖదత్తుడు తిమింగలము కడుపు నుంచి వెలువడి స్నేహితుని చూచినతరువాత అతని సంతోషమునకు మేరలేదు. భీమభటుడు మిత్రుని వృత్తాంతము తెలుసు కొనడానికి కుతూహలపడినాడు.

శంఖదత్తుడు తన సంగతి చెప్పసాగినాడు: మిత్రమా "నేనప్పుడు నీకు కనపడకుండా కొట్టుకొనిపోయినాను. గంగాప్రవాహములో నన్ను తిమిం గలము మింగి వేసింది. దాని కడుపులో నేను ప్రవేశించి ఆకలిబాధకు ఓటమటించి దానిమాంసమును కత్తితోకోసి తింటూ కాలం గడిపి నాను. దైవవశాన తిమింగిలము నదీతీరానికి వచ్చింది. ఇక్కడివాళ్లు తిమింగిలాన్ని చంపి నన్ను బైటికి తీసినారు. నాఅదృష్టంవల్ల నూర్యుణ్ణి నిన్నూ చూడగలిగినాను.

అది విని అందరూ ఆశ్చర్యపడి "గంగాప్రవాహములో తిమింగిలము మింగటమూ, వరదలో తిమింగిలము గట్టుచేరటమూ, దానిని చంప టమూ సజీవుడవై నీవు బైటికిరావడమూ ఆహా విధివిలాసముకద" అని పలికినారు. అక్షతపణకాదులు శంఖదత్తుని నిజనివాసమునకు తీసుకొని వెళ్ళినారు. వారు అతన్ని స్నానముచేయించి వస్త్రాభరణాదు లిచ్చి గౌరవించి ఉత్సవము చేసినారు.

నాగేంద్రుని తీర్థము వచ్చింది. భీమభటుడు స్నేహితులతో తీర్థము చూడాలని నాగేంద్రుని దేవాలయానికి వెళ్ళినాడు. ఆదేవాలయము విరులదండలతోను, పాములతోను నిండిపోయింది. పాతాళలోకమువలె

ఉన్న గుడిలో భీమభటుడు నాగరాజుకు మొక్కి అక్కడనుండి దక్షి ణంగా వెళ్ళి నాగేంద్రుని మడుగు చూచినాడు. ఆకొలనులో నాగేంద్రుని ఫణామణికాంతులవలె ఎర్రతామరపూవులు, విషజ్వాలాకీలాసమూహమువలె నల్లకలువలూ ఉన్నవి. గట్టుమీది చెట్లు గాలికి రాలే పుష్పాడితో నాగేంద్రుని పూజిస్తున్నట్లున్నవి. కన్నుల పండువుగా కొలను చూచి భీమభటుడు ఆశ్చర్యపడుతూ ఉండగా హంసావళి అనే లాటరాజకుమారి జలక్రీడకై వచ్చింది. ఆమె ఎంత అందగత్తె అయినా రెప్పపాటువల్ల మానవస్త్రీ అని స్పష్టమవుతున్నది. పిడికిట ఒదిగే నడుముతో మన్మథుని విల్లువలె హంసావళి మనోహరముగా అతనికి కనపడ్డది. ఆమె వలపు చూపులతో భీమభటుని హృదయమును ముక్కలుచేసి మోహములో ముంచి వేసింది. ఆమె రహస్యంగా ఆప్తురాలైన చెలిని పిలిచి అతనిదగ్గరకు పంపి నామమూ నివాసమూ తెలుసుకొని రమ్మన్నది. హంసావళి జలక్రీడార్థము ముందుకు సాగిపోతూ వెనుకకు మొగము త్రిప్పి చూస్తున్నది. భీమభటుడు ప్రేమబంధములో చిక్కుకొని అడుగు వేయలేక అతికష్టంమీద మిత్రులతో నిజనివాసానికి వెళ్ళినాడు. అతనిదగ్గరికి హంసావళి చెలికత్తె వచ్చి ఏకాంతములో "స్వామీ" రాజకుమారి హంసావళి మిమ్మల్ని వేడుతున్నది. వలపు వేడిమికి సోలిపోయి మీకోసం తపిస్తున్నా నని చెప్పమన్నది." అని చెప్పింది.

భీమభటుడు ప్రేయసీ వచనామృతము గ్రోలి, దుడుకు వలపువిరాళిని తీర్పదలచినాడు. అతడు 'నేను నేటిరాత్రి అంతఃపురానికి వచ్చి ప్రియురాలిని గౌరవిస్తాను. నావిద్యాప్రభావమువల్ల అంతఃపురములో అన్యులెవ్వరూ నన్ను చూడలేరు" అని లేఖ వ్రాసి దూతికి ఇచ్చినాడు. చేటి ఆడుత్తరము హంసావళికి ఇచ్చింది. హంసావళి ప్రియునికోసము తహ తహ లాడుతూ అతని రాకకు శరీరమంతా కళ్ళుచేసుకొని ఎదురు

చూస్తున్నది. చీకటి పడగానే భీమభటుడు సువర్ణాభరణములు ధరించి
ంగా దేవివల్ల లభించిన విద్యను అనులోమక్రమములో జపించి రాజ
కన్యాంతఃపురము ప్రవేశించినాడు. ఆప్రదేశము నిర్జనమై నిశ్శబ్దముగా
ఉంది. అయిదురంగుల పువ్వుల మొత్తములచేత శోభిల్లే కామోద్యా
నమువలె రతిప్రీతికరమైనచోట దివ్యసౌరభముతో కూడుకొన్నదై భీమ
భటునకు కనపడగా ప్రతిలోమముగా మంత్రోచ్చారణ చేసినాడు.
మంత్రమహిమాతిశయమువల్ల అతనికి హంసావళీ దర్శనము లభించింది.
ప్రియుని దర్శనమువల్ల ఆమె శరీరము ఆనందములో పొంగి పోయింది.
హంసావళి శరీరము పులకరించింది. ఆమె వణికిపోయింది. శరీరము కంప
మొందగా ఆభరణములు కదిలిపోయినవి. మణినూపురములు మోగితే
ఆమె నాట్యము చేస్తున్నదా అనిపించింది. కన్యకావడమువల్ల సిగ్గుతో
తలవంచి కర్తవ్యము ఏమిటో హృదయాన్ని ఆమె అడుగుతున్నట్లు
న్నది. భీమభటుడు "ముగ్ధా! హృదయము తేటతెల్లమైంది. దాచు
కొందామన్నా దాచుకోలేక పోయినావు. సిగ్గుతో హృదయాన్ని
కప్పివేయ తరమా ? నీశరీరము మీద గగుర్పాటు కప్పివుచ్చ గలవా !"
అని ప్రియురాలితో పలికినాడు. ఇలా అతడు ఆమెసిగ్గును ఒత్తిగిల్ల
చేసి గాంధర్వ విధిని హంసావళిని వివాహము చేసుకొన్నాడు. ఆమె
ముఖపద్మము నంటిన తుమ్మెదగా భీమభటుడు ప్రియకాంతతో రాత్రి
గడిపి మరునటిరాత్రి తిరిగి వస్తానని చెప్పి నిజనివాసమునకు వెళ్ళినాడు.

తెల్లవారగానే రాజసేవకులు వచ్చి హంసావళి తీరు కనిపెట్టినారు.
రేగిన ముంగురులు, వదులైన వాలుజడ, కెంపుమోయని గోటినొక్కులు
అనుభవించిన సుఖానికి చిన్నలైనవి. కంచుకులు రాజసన్నిధికి వెళ్ళి
జరిగిన సంగతి వివరించినారు. రాజు సేవకులతో మరునాటిరాత్రి తన
కుమార్తె చర్య కనిపెట్ట వలసిందని అనుమతి ఇచ్చినాడు.

పగలల్లా శ్రమపడిన భీమభటుడు రాత్రివేళ ప్రియురాలి అంతః
పురములోకి వచ్చినాడు. రాజసేవకులు అతని రూపు చూడలేక ఎవరో

సిద్ధుడు అంతఃపురములో ప్రవేశించినాడని రాజుతో విన్నవించినారు. మహారాజు ఇలా ఆజ్ఞ ఇచ్చినాడు: "సిద్ధుడు కాబోలు అంతఃపురములో ప్రవేశించినాడు. అతన్ని నాదగ్గిరికి తీసుకొని రండి. నామాటగా మృదువుగా అతనితో చెప్పండి. "మహానుభావా! సిద్ధా! బహిరంగంగా నా కుమార్తెను వివాహము చేసుకోవేమి? నన్ను అడిగితే నేను కాదు అంటానా? నీవంటి ఘనుడు నాకు ఎలా లభిస్తాడు? ఈరహస్య విధానం ఎందుకు?"

రాజసేవకులు అంతఃపుర ద్వారము దగ్గిర నిలవబడి రాజు చెప్పినట్లే ఆమాటలు భీమభటునితో అన్నారు. రాజు గ్రహించినాడని భీమభటుడు ఎరిగి అంతఃపురములో ఉండే "రాజసేవకులారా, రేపు ఉదయమే ఆస్థానములో సంగతి యావత్తూ విశదపరుస్తాను. ఈరాత్రి గుడ్డిది కదా" అని ఉత్తరము వ్రాసి వారికి ఇచ్చినాడు. ఆయన భీమభటుని రాకకై ఎదురుచూస్తున్నాడు.

మర్నాడు ఉదయాన్నే భీమభటుడు అతనిమిత్రులు తక్కిన ఏడుగురు వీరులూ అమూల్యవస్త్రాలంకారాలు ధరించి చంద్రాదిత్య మహారాజు ఆస్థానానికి వెళ్ళినారు. భీమభటుని తేజస్సును చూచి మహారాజు అతనినీ తక్కినవారినీ ఉచితాసనములమీద ఆసీనులను చేసినాడు. భీమభటుని మిత్రుడైన శంఖదత్తుడు రాజుతో "రాజన్, ఇతడు రాధాపతిఅయిన ఉగ్రభటుని పెద్దకుమారుడు. అతర్కణీయ విద్యాశక్తివల్ల అన్యులకు వశముకాని పరాక్రమశాలి. ఇతనిని భీమభటుడని వ్యవహరిస్తారు. మీకుమార్తెను వివాహము చేసుకోదలచి వచ్చినాడు" అని తెలియచెప్పినాడు. ఆమాట విని రాత్రి వృత్తాంతము స్మరణకు తెచ్చుకొని చంద్రాదిత్యుడు తాను ధన్యుడైనట్లు విశ్వసించి వెంటనే హంసావళిని భీమభటునికిచ్చి వైభవంగా వివాహము జరిపించినాడు. భీమభటుడు లెక్కలేనన్ని గజతురగాగ్రహారములను అరణముగా స్వీకరించి

ప్రియురాలితో అక్కడ సుఖంగా ఉన్నాడు. చంద్రాదిత్యుడు రాజ్యాన్ని అతనికిచ్చి తపస్సుకై వనానికి వెళ్ళినాడు.

భీమభటుడు శంఖదత్తాది మిత్రులతో లాటరాజ్యాన్ని పరిపాలిస్తున్నాడు. కొంతకాలం గడిచిన తరువాత అతనితండ్రి ఉగ్రభటుడుప్రయాగలో మరణించినాడనీ అవసానకాలములో నర్తకీసుతుడైన సమరభటుణ్ణి రాధారాజ్యానికి అభిషేకము చేసినాడనీ కర్ణాకర్ణిగా భీమభటుడు విన్నాడు. అతడు జనకుని మరణానికి విచారించి శ్రద్ధాభక్తిపూర్వకముగా ఔర్ధ్వదైహిక కర్మలు యథావిధిగా, ఆచరించి తమ్ముడైన సమరభటునికి ఇలా దూతముఖముగా కబురు పంపినాడు. "మూర్ఖుడా! నర్తకీ పుత్రుడా! మాతండ్రి సింహాసనముమీద కూర్చోడానికి నీ వెవరు? ఆసింహాసనము నాదే కాని నీది కాదు." దూత వెళ్ళి సమరభటునికి కబురు చెప్పినాడు. సమరభటుడు కోపముతో మండిపడి ఇలా తిరిగి సమాధానము రాసినాడు. "నీవు అయోగ్యుడ వని గ్రహించి తండ్రి నిన్ను దేశాంతరము తరిమివేసినాడు. నీతినియమాలు లేని నీకు మిథ్యాభిమానము ఎందుకు? తనగుంటలో నక్కకూడా సింహమువలె పరాక్రమిస్తుంది. సింహాన్ని చూస్తేగాని నక్కకుయథార్థమైన బలహీనత బైటపడదు"

దూత వెళ్ళి సమరభటుని ఉత్తరము భీమభటుని కిచ్చినాడు. అతడా లేఖ చదివి ఉప్పెనగా నవ్వి దూతతో ఇలా పలికినాడు. "ఓరీ, వెళ్ళి మామాటగా నర్తకీసుతునికి చెప్పు. పూర్వము అశ్వము కోసము పోరుతున్నప్పుడు శంఖదత్తుడు నిన్ను చంపకుండా నేను రక్షించాను. పదేపదే నిన్ను అలాక్షమించను. నీమీద మక్కువతో ఉన్న తండ్రి దగ్గిరికి పరలోకానికి నిన్ను పంపుతాను. నీరోజులు దగ్గిరికి వచ్చినవి. కొద్దిరోజుల్లోనే నేను వస్తాను" భీమభటుడు దూతను పంపి వెంటనే దండయాత్ర ప్రకటన చేసినాడు. భీమభటుడు సేనాసమేతుడై పూర్వాద్రి

ఎక్కుగా దిక్కులు పిక్కటిల్లినవి. వణకుతున్న భూమి గజాశ్వభారము వల్ల బద్ద లవుతుందేమో, అన్నట్టున్నది. సేనలు రేగగొట్టగా ధూళి సూర్యుని కప్పివేసింది. భీమభటుడు రాధానగరి చేరినాడు. సమర భటుడు దండయాత్ర తెలుసుకొని సహించలేక సేనను ముందుకులోసి యుద్ధానికి సన్నాహము చేసినాడు. భీమభట సమరభటుల సేనలు యుద్ధము చేయగా ప్రళయమువలె తోచింది. సేనలు కత్తులతో పోరేటప్పుడు అగ్ని బయలుదేరి ఆకాశమువరకూ వ్యాపించింది. నారసములు వాడికొనలతో నిడుపులై రెప్పలవలె వీరులను చూచే తరుణీ కటాక్షములవలె సాగుతున్నవి. నెత్తురు ఏరులవలె ప్రవహించి కాళరాత్రివలె ఉన్నది. భీమభటుడు శంఖదత్త అక్షక్షపణక చండభుజంగాది మల్లులతో వీరులతో సమరభటుని సేనను పీడించినాడు. శత్రు సైన్యము వెంటనే చెల్లా చెదరైనది. రథముమీద కూర్చున్న సమరభటుడు కోపంతో యుద్ధముచేసి మున్నీటిలో మలయపర్వతమువలె తిరుగుతున్నాడు. భీమభటుడు సమరభటుని వింటిని విరుగగొట్టినాడు. రథాశ్వములు అతని అలుగులవల్ల హత మైనవి. సమరభటుడు రథము దిగి పరుగున వచ్చి తోమరాయుధముతో భీమభటుని ఏనుగుకుంభస్థలముపై ఒక్కపెట్టు పెట్టినాడు. ఆ దెబ్బతో ఏనుగు నేల కూలింది. అప్పుడు పదాతులు ఇద్దరూ కత్తితో హోరాహోరిగా పోరినారు. భీమభటునికి గొప్పశక్తి ఉన్నప్పటికీ రూపము మరుగుచేయడము అధర్మ మని ఆలోచించి, కత్తితో యుద్ధముచేసి నర్తకీసుతుడైన సమరభటుణ్ణి కడతేర్చినాడు. ఆకాశసంచారము చేస్తున్న సిద్ధచారణులు వందిమాగధులు బళాబళీ అంటూ అతన్ని స్తోత్రము చేసినారు. మిత్ర సమేతంగా భీమభటుడు రాధానగరీప్రవేశము చేసినాడు. కుమారుని రాకకు ఎదురుచూస్తున్న తల్లికి భీమభటుడు అమందానందము కలిగించినాడు. అతని విజయోత్సవముచూచి ప్రజలు సంతోషించినారు. పూర్వ

మున్న మంత్రులు అతనిని గౌరవించగా భీమభటుడు సింహాసనారూఢు డైనాడు. అతడు మంత్రులను గౌరవించి సమ్మానోత్సవము జరిపించినాడు.

శుభ ముహూర్తము ఏర్పాటుచేసి అతడు లాటరాజ్యాన్ని శంఖదత్తుని కిచ్చి, అతన్ని లాటసేనతో పంపివేసినాడు. భీమభటుడు అతడు తపణకా దులకు అగ్రహారములు రాసి ఇచ్చినాడు. అతడు వా రందరినీ తనసన్ని ధిలో ఉంచుకొని, హంసావళితో భోగములు అనుభవిస్తూ తండ్రి సంపా దించిన స్థానంలో హాయిగా ఉన్నాడు. క్రమేణా భీమభటుడు భూమం డలము జయించి రాజకన్యలను స్వీకరించి, సుఖాల్లో మునిగి రాజ్య పాలన ఎటువంటిదో మరిచి అంతఃపురములోనే ఉంటున్నాడు.

ఇలా ఉండగా ఒకసారి యాదృచ్ఛికంగా ఉత్తంకు డనే మహర్షి వచ్చి రాజద్వారమున నిలవబడినాడు. అతనిరాక కంచుకులు వెళ్ళి తెలియ చేసినా భీమభటుడు సంపదలో కన్నూ మిన్నూ తెలియకుండా ఉండడంవల్ల మాట పెడచెవిని పెట్టినాడు. మహర్షికి కోపం వచ్చి 'మదాంధుడా! రాజ్యము పోగొట్టుకొని వనగజము అయిపోతావు' అంటూ శాపము ఇచ్చినాడు. అందుకు భయపడి రాజు మునీంద్రుని పాదాలదగ్గర మోకరిల్లుతూ శాపావసానము అనుగ్రహించ వలసిం దని వేడుకొన్నాడు. కోపము శమించగా మహర్షి "పెట్టిన శాపము తిప్పుకోను. నీవు వనగజము కావడం తప్పదు. మృగాంకదత్తునిమంత్రి ప్రచండశక్తి అనేవాడు నాగశాపంవల్ల గుడ్డివాడై. తిరుగుతాడు. అతన్ని నీవు ఎప్పుడు ఓదార్చి అతిథిసత్కారం చేసి అతనికి నీవిషయము చెవుతావో అప్పుడు నీశాపము పోతుంది. శివానుగ్రహంవల్ల నీకు గంధర్వత్వము ప్రాప్త మవుతుంది. ప్రచండశక్తి అనే నీఅతిథికీ అప్పుడే నేత్రాలు తిరిగి వస్తవి" అంటూ తనదారిని వెళ్ళిపోయినాడు. భీమ భటుడు గజముగా మారినాడు. మిత్రుడా, నేనే ఆభీమభటగజమును. నీవు ప్రచండశక్తివి. ఇప్పుడు నీకు నావిషయంచెప్పినందువల్ల నా

శాపంతీరింది. అంటూ ఆవనగజము గంధర్వుడైనాడు. ప్రచండశక్తికి తిరిగి నేత్రములు వచ్చినవి. అతను నయనానందకరంగా గంధర్వునిచూచినాడు.

తీగెలమాటున పొంచి వారిసంగతి యావత్తూ గ్రహించి మృగాంక దత్తుడు మంత్రులతో బైటపడి ప్రచండశక్తిని గాఢాలింగనము చేసు కొన్నాడు. అకాలవృష్టివల్ల కలిగే ఆనందముకన్న అధికానందముతో ప్రచండశక్తి మృగాంకునిపాదాలకడ మోకరిల్లినాడు. ఇద్దరూ స్నేహపాశ బద్ధులై చిరవిరహాన్ని స్మరిస్తూ విచారించి ఆలింగనసౌఖ్యము పొందినారు.

మృగాంకదత్తుడు గంధర్వునికి నమస్కరించి "మాకు మిత్రలాభము, ఇతనికి దృష్టిలాభము కలగడం కేవలము మీప్రసాదమువల్లనే" అన్నాడు. గంధర్వుడు "రాజపుత్రా! తక్కినమంత్రులు నీకు త్వర లోనే లభిస్తారు. శశాంకవతి దొరుకుతుంది. సామ్రాజ్యము నీకు చేకూరుతుంది. అధైర్యపడకు. వెళ్ళి వస్తాను. స్మరణమాత్రంవల్ల నేను నీదగ్గిరికి వస్తాను" అంటూ ఆకాశాని కెగిరినాడు. ప్రచండశక్తి దొరికినందువల్ల మృగాంకదత్తుడు సంతోషించి మంత్రులతో పగలు అక్కడే కాలక్షేపము చేసినాడు.

తరంగము: ౭౫

నృత్యకాలంబునం దేవ్వానికరము
తాకులపూలాన తారకావితతి
సూనవృష్టివిధాన చ్యుతి మగుచుండు
అంబరస్థలినుండి, ఆవిఘ్నరాజు
జయ మొందుగావుత సర్వలోకముల!

తెల్లవారగానే మృగాంకదత్తుడు ప్రచండశక్త్యాదిమంత్రులతో శశాంక వతికై మళ్ళీ ఉజ్జయిని వైపు ప్రయాణము సాగించినాడు. మార్గమధ్య ములో మంత్రు లెవరైనా కనపడతా రేమో నని వెతుకుతూ

వెడుతున్నాడు. కొంతదూరము మృగాంకదత్తుడు ప్రయాణము చేయగా ఆకాశములో వికారరూపు డైనవా డొకడు విక్రమకేసరి అనే మంత్రిని మోసి తెస్తున్నాడు. ఆవింత చూడ మని మృగాంకుడు మంత్రులతో హెచ్చరించేలోగా విక్రమకేసరి వికారరూపుని బుజము నుండి దిగి సంతోషముతో కన్నీరు కారుస్తూ రాజుకు నమస్కారము చేసినాడు. మృగాంకదత్తుడు సంతోషించి అతనిని కౌగలించుకొన్నాడు. తక్కినమంత్రివర్గము అతన్ని గౌరవించింది. తాను తలచుకొన్న వెంటనే ఆవికారరూపుడు రావలసినదిగా విక్రమకేసరి చెప్పినాడు. వికారస్వరూపుడు అతని దగ్గిర సెలవు పుచ్చుకొని వెళ్ళిపోయినాడు. మృగాంకదత్తుడు విక్రమకేసరి వృత్తాంతము తెలియచేయమని కోరినాడు. అందరూ చెవులు దోర పెట్టుకొని వినవలె నని కుతూహలంగా ఉండగా విక్రమకేసరి తనసంగతి ఆరంభించినాడు :

అప్పుడు నాగశాపమువల్ల మిమ్మల్ని విడిచి చాలాకాలం దిమ్మతిరిగి మిమ్మల్ని కనుక్కోలేకపోయినాను. మీరు ఉజ్జయినికే వెళ్ళివుంటారని ఉజ్జయినీమార్గాన ప్రయాణముచేస్తూ దాని సమీపములో బ్రహ్మస్థలము అనే పల్లె దగ్గిర నూతిగట్టున చెట్టునీడలో కూర్చున్నాను. పాముకాటువల్ల బాధపడుతూ ఒక వృద్ధవిప్రుడు అక్కడికి వచ్చి నాతో చెప్పినాడు: “కుమారా! ఇక్కడ ఉండకు. నాగతి నీకూ పడుతుంది. ఇక్కడే ఒక మహాసర్పము నన్ను కాటువేసింది. దేహము చాలించేదామని ఇక్కడికి వచ్చాను. అతన్ని చూచేసరికి నాకు జాలి వేసింది. అతని మరణ ప్రయత్నము మాన్పి నామంత్రప్రభావమువల్ల విషము ఎక్కకుండా చేసి బాధ పోగొట్టినాను. ఆబ్రాహ్మణుడు కృతజ్ఞత చూపి నాసంగతి తెలుసుకొని “కుమారా! నీవు నాకు ప్రాణదానము చేశావు. మాతండ్రి నాకు ప్రసాదించిన బేతాళవిద్య నీకిస్తాను. నీవంటి వీరునికి ఆసాధనము బాగా పనిచేస్తుంది” అని చెప్పినాడు.

అప్పుడు నేను "బ్రాహ్మణోత్తమా! మృగాంకదత్తుడు లేని బేతాళ విద్య నా కెందుకు?" అన్నాను. విప్రుడు నవ్వుతూ "వత్సా! బేతాళునివల్ల నీకోరికలన్నీ ఈడేరుతవి. పూర్వము త్రివిక్రమసేన మహారాజు బేతాళుని అనుగ్రహమువల్ల విద్యాధరైశ్వర్యము కూడా అనుభవించినాడు. ఆకథ విను:

## త్రివిక్రమసేనుని కథ

గోదావరీ తీరములో ప్రతిష్ఠాన మనే పట్టణాన్ని విక్రమసేనుని కుమారుడైన త్రివిక్రమసేనుడు పరిపాలిస్తున్నాడు. ప్రతిరోజూ రాజసభకు క్షాంతిశీలుడనే శ్రమణుడు వచ్చి ఫలము కానుక ఇచ్చి వెళ్ళిపోతూ ఉన్నాడు. రాజు పండు పుచ్చుకొని కోశాగారాధ్యక్షునికి ఇస్తూవచ్చాడు. ఇలా పది సంవత్సరాలు గడిచినవి. ఒకనాడు కావలివాళ్ళను తప్పించుకొని ఒకకోతి ఆడుతూ రాజసభలో ప్రవేశించింది. త్రివిక్రమసేనుడు శ్రమణుడు ఇచ్చిన ఫలము కోతికి ఇవ్వగా అది పండు కొరికింది. ఆఫలములోనుంచి అమూల్యమైన రత్నము కిందపడింది. అది చూచి రాజు కోశాధికారిని పిలిపించి "ఆ సన్యాసి మనకు ఇచ్చిన పళ్ళన్నీ ఏంచేశావు? ఎక్కడున్నవి?" అని అడిగినాడు. కోశాధిపతి "దేవా, ఆ పళ్ళన్నీ దొడ్డి వెనుకవున్న గుంటలో పడేశాను. తమ ఆజ్ఞ అయితే తలుపు తెరచి చూస్తాను" అని మనవి చేసినాడు. అతడు వెళ్ళి వెంటనే వచ్చి 'రాజన్, పళ్ళన్నీ కుళ్ళిపోయినవి; అక్కడ రత్నాలు ప్రకాశిస్తున్నవి!" అని చెప్పినాడు. రాజు సంతోషించి మణులు కోశరక్షకునికి ఇచ్చివేసినాడు. యథాప్రకారంగా మర్నాడు శ్రమణుడు రాజసభకు వచ్చి ఫలము కానుక ఇచ్చి ఏకాంతంగా "రాజన్, వీరుని సహాయమువల్ల కావలసిన మంత్రసాధన నాదగ్గిర ఉన్నది. నీవు వీరుడవు నాకు సహాయము చేయాలి"

అని విన్నవించుకొన్నాడు. రాజు అంగీకరించినాడు. "వచ్చే కృష్ణచతుర్దశి రాత్రి ఈనగరపు వల్లకాటిలో మర్రిచెట్టుకింద .నేను ఉంటాను. అక్కడికి వచ్చి నీవెవరో నాకు ఎరుక పరుచుకోవలె' అని శ్రమణుడు చెప్పినాడు. రాజు అందుకు అంగీకరించినాడు. క్షాంతిశీలుడు సంతోషంతో వెళ్ళినాడు.

కృష్ణచతుర్దశి రాత్రి త్రివిక్రమసేనుడు నల్లబట్టలు కట్టుకొని కానుగ పువ్వులు సిగలో పెట్టుకొని రాజధాని విడిచి భయంకరమైన శ్మశానములో ప్రవేశించినాడు. శ్రమణభిక్షువు వటవృక్షముకింద మండలన్యాసము చేస్తూఉండగా రాజు అతన్ని చూచి "శ్రమణుడా, నేను వచ్చినాను. నీకేమి సాయము కావలె?" అని అడిగినాడు. శ్రమణుడు అందుకు సంతోషించి 'రాజా, దయచేసి సాయముచేయాలి. సమీపములో శింశుపా వృక్షాన శవము వేలాడుతున్నది. వీరాగ్రేసరుడవు నీవు వెళ్ళి ఆశవమును ఇక్కడికి తీసుకొని రావలె. నాకు మహోపకారము చేసినవాడవు అవుతావు" అని పలికినాడు.

త్రివిక్రమసేనుడు మండుతున్న కొరివి చేత్తోపుచ్చుకొని చీకట్లో దక్షిణ దిక్కుగా వెళ్ళి శింశుపావృక్షమును కనుక్కొన్నాడు. చెట్టు కొమ్మకు వేలాడుతున్న శవాన్ని అతిడుచూచి తరువెక్కి తాడు తెంపి వేసినాడు. వెంటనే శవము నేలమీద కూలింది. నేల కూలుతున్న శవము దెబ్బతగిలిన దానివలె రోదించింది. రాజు చెట్టుదిగివచ్చి; దేహములో ప్రాణము తుదముట్ట లేదని తలచి జాలిపడి శవమును స్పృశించినాడు. శవము భయంకరముగా నవ్వింది. శవములో బేతాళుడు ప్రవేశించాడని రాజు గ్రహించి భయపడక 'ఎందుకలా నవ్వుతావు? వెడదాము, నాతో రావాలి' అని పిలిచినాడు. రాజు పిలుస్తూ ఉండగానే శవము నేలమీద నుంచి లేచి యథాప్రకారంగా చెట్టుకొమ్మకు వేలాడుతూ ఉంది. త్రివిక్రమసేనుడు మళ్ళీ చెట్టెక్కి తాడు త్రెంపగా శవము నేలకూలింది. వీరుల చిత్తములు వజ్రముకన్న నిష్ఠురములు కదా.

రాజు శవాన్ని బుజాన పెట్టుకొని శ్మశానములో నడక సాగించినాడు. శవములో దాగిన బేతాళుడు 'రాజా! మార్గాయాసము తెలియకుండా నీకు కథ చెవుతాను విను' అని ఇలా ప్రారంభించినాడు:

బే తా ళ క థ : ౧

కైలాసగిరివలె వారాణసి పుణ్యజనసేవ్యమానంగా ఉంది. ఆనగరికి గంగ ముత్యాలహారమువలె ప్రకాశిస్తు ఉంటుంది. ప్రతాపముకుటుడు అనే వీరరాజేంద్రుడు వారాణసిని ఏలుతూ ఉన్నాడు. అతనికుమారుడు వజ్రముకుటుడు మాన్మథాతిశయమైన అందాలరాశి. అతని మంత్రికుమారుడు మహామతి బుద్ధిశరీరు డనేవాడు ప్రాణమిత్రుడుగా ఉన్నాడు. ఒకసారి రాజకుమారుడు, మంత్రిసుతునితో వేడుకగా వేటకు బయలుదేరి చాలాదూరము వెళ్ళినాడు. అతడు అలుగులతో సింహశిరములు తెగనరుకుతూ కారడవిలోకి వెళ్ళగా కమలాలయమైన సరోవరము కనపడింది. సరిగా అప్పుడే జలక్రీడార్థము అందాలరాశియైన ఒకకన్య పరివారసమేతంగా వచ్చింది. ఆ చిన్నది శరీరకాంతితో చెరువును నిందిస్తూ, చూపులతో సరికొత్త తామరగుబురులు కల్పిస్తూ, శీతాంశుని ధిక్కరించే నెమ్మోముతో రాజకుమారుని హృదయమును ఆకర్షించింది. అతడు ఆమెకందోయిని హరించినాడు. ఆకన్య ఎవరిపిల్ల? ఏఊరు? పేరేమిటో అతనికి తెలియలేదు. ఆ అమ్మాయిని ఎలా పలకరించడమా అని ఆలోచిస్తున్నాడు. తన ఊరూ పేరూ మొదలయిన విషయాలు ఆకన్య రాజకుమారునికి తెలియచేయవలె ననే నెపముతో వొయ్యారము అభినయించింది. ఆమె సిగలోనుంచి కలువను తీసి చెవిలో చేర్చింది. విలంబము చేస్తూ దంతధావనము చేసింది. తామరపువ్వు కోసి తలలో తురుముకొన్నది. రాజకుమారుడు సాభిప్రాయము లైన కన్యచేష్టలు తెలుసుకోలేకపోయినాడు. మంత్రికుమారుడు బుద్ధిశరీరుడు ఆమె చేష్ట

లను గ్రహించినాడు. పరిజనులు ఆకన్యను అక్కడనుండి తీసుకొనివెళ్ళి నారు. ఇల్లు చేరిందేకాని శరీరము తల్పముమీదా మనస్సు రాజ కుమారునిమీదా ఉంది. ఆకన్య వెళ్ళినందువల్ల అతనికిన్నీ ఏమీ తోచ లేదు. విద్య పోగొట్టుకొన్న విద్యాధరునివలె ఉన్నాడు. బుద్ధిశరీరుడు రాజపుత్రుని వేదన కనిపెట్టి కన్య తప్పక లభిస్తుందని అతనికి ఉత్సా హము కలుగచేసినాడు. వజ్రముకుటుడు "మిత్రమా, ఆకన్య ఊరూపేరూ తెలియదే. నన్ను వాళ్ళక్కడగా ఊరడిస్తావేమి?" అని ప్రశ్నించినాడు. మంత్రిసుతుడు "దేవా! ఆ కన్యచేష్టలు సాభిప్రాయములు. ఆమె చెవిలో కలువ ఉంచుకొన్నది. అందుచేత నీకు కర్ణోత్పల రాజ్యములో తననివాస మని చెప్పింది. దంతధావనమువల్ల తనతండ్రిపేరు దంతఘాతకు డని తెలియచేసింది. పద్మమును కర్ణాభరణగా పెట్టుకొన్నది. కనుక తనపేరు పద్మావతి అని సూచించింది. హృదయముమీద చేతులుంచు కొని తనప్రాణాలు నీ అధీన మని చెప్పింది!" అని తెలిపినాడు. బుద్ధి శరీరుడు నిజంగా బుద్ధిశరీరుడని రాజసుతుడు అతనిని అభినందించినాడు.

రాజకుమారుడు మంత్రిసుతునితో ఆలోచించి వేటనెపమున శశాంక వతిక్తై బయలు దేరినాడు. ఇద్దరూ కళింగదేశములో కర్ణోత్పల రాజేంద్రుని నగరు చేరి దంతఘాతకుని నివాసము కనిపెట్టి అక్కడికి సమీపములో ఉన్న వృద్ధాంగన ఇంటిలో బస చేసినారు. రాజ కుమారుడు గుర్రాలకు దాణా పెట్టి గడ్డి వేసి సురక్షితంగా కట్టివేసి నాడు. బుద్ధిశరీరుడు ముసలిదానితో "అమ్మా, ఇక్కడ సంగ్రామ వర్ధను డని దంతఘాతకుడు ఉన్నాడట. ఎరుగుదువా?" అన్నాడు. వృద్ధాంగన ఇలా సమాధాన మిచ్చింది: "ఉన్నాడు. నేను ఎరుగుదును. నే నతనిదాదిని. ఆయన కుమార్తె పద్మావతికి నేను పెద్ద దిక్కుగా ఉన్నాను. నే నక్కడికి తరుచుగా వెళ్ళడంలేదు. నాకు మంచిబట్టలు లేవు. మంచిబట్టలు కనిపిస్తే నాదుష్టకుమారుడు దొంగిలిస్తాడు."

మంత్రికుమారుడు వృద్ధురాలికి తన ఉత్తరీయము ఇచ్చి తృప్తిపరిచి "అమ్మా, నీవు తల్లిలాంటిదానివి. నీతో ఒక రహస్యము దాచక చెప్పేస్తున్నాను. దంతఘాతుని కుమార్తె పద్మావతి దగ్గిరికి వెళ్ళి నీవు చెరువు దగ్గిర చూచిన రాజకుమారుడు ఇక్కడికి వచ్చినాడు. అతడు ప్రేమతో నీకు చెప్పమని నన్ను నీదగ్గిరికి పంపినాడు. అని చెప్పు" అన్నాడు. అతని దాతృత్వానికి ముసలిది లొంగిపోయి అందుకు అంగీకరించి పద్మావతి దగ్గరకు వెళ్ళి వచ్చి "నేను పోయి రహస్యంగా మీరాక తెలియచేసినాను. విని ఆమె కోపంతో బెదరించి చేతులకు కర్పూరపుపొడి పూసుకొని ఆచేతులతో చెంపలు వాయించింది. ఆఅవమానము భరించలేక ఇంటికి వచ్చాను. చూడు నాముఖాన కర్పూరపుగుర్తులు ఎలా అచ్చుపడినవో" అని చెప్పింది.

ముసలిదానిమాటలు విని రాజకుమారుడు నిలువునా నీరైపోయినాడు. బుద్ధిశరీరుడు అతని అవస్థ కనిపెట్టి ఏకాంతములో "మిత్రుడా, విచారపడకు. గుట్టుకాచుకోవలె నని ఆకన్య అలా బెదిరించింది. కర్పూరపువేళ్ళు పదీ అంటించడంలో అభిప్రాయము కనిపెట్టావా? ఈశుక్లపక్షములో పదిరాత్రులు సమాగమానికి పనికిరావు అని అభిప్రాయము" అని చెప్పి ఓదార్చినాడు.

బుద్ధిశరీరుడు చేతిలో ఉన్న బంగారము కొంత బజారులో అమ్మివేసి ముసలమ్మచేత వంట చేయించుకొని ఇద్దరూ తిండి తింటున్నారు. ముసలిదానికి తిండిఖర్చు లేకపోయింది. పదిరోజులు అయినతరువాత అతడు పద్మావతివద్దకు ముసలిదాన్ని పంపినాడు. వారితిండికి ఆశపడి వృద్ధాంగన పద్మావతిదగ్గిరికి వెళ్ళి వచ్చినది. 'నేను అక్కడికి వెళ్ళి ఊరికే నిలుచున్నాను. పెదవులు కదల్చ లేదు. పద్మావతి మూడు వేళ్ళకు లత్తుక పూసి వానితో నారొమ్మున కొట్టింది. నేను అక్కణ్ణించి మీదగ్గిరికి వచ్చినాను.' అని ముసలమ్మ పలికింది. ఏకాంతముగా రాజ

కుమారునితో మంత్రికుమారుడు "మిత్రమా! ఆమూడు లత్తుక రేఖలు ఎందుకు చేసింది? మూడురోజులదాకా సమాగమానికి వీ లుండ దని భావము" అని చెప్పినాడు. మూన్నాళ్ళు వెళ్ళిపోయిన తరువాత బుద్ధిశరీరుడు వృద్ధాంగనను పద్మావతిదగ్గిరికి పంపినాడు. పద్మావతి ముసలిదానిని గౌరవించి భోజనాదికముతో తృప్తి పరిచింది. పగలంతా వృద్ధురాలు ఆమెదగ్గిరేఉంది. సంజవేళ ముసలిది వెళ్ళిపోతానని సెలవు తీసుకోబోతున్నప్పుడు, మదపుటేనుగు కట్టుకంబము ఊడతీసుకొని జనాన్ని తొక్కుతూ వస్తున్నదని కోలాహలము వినవచ్చినది. పద్మావతి "ముసలమ్మా, మదంతో ఏనుగ మనుష్యులను తొక్కివేస్తున్నది. ఆతోవను నీవు వెళ్ళలేవు. నిన్ను పీటమీద కూచోపెట్టి ఈపెద్దకిటికీనుండి తాళ్ళతో కింద ఉన్నతోటలో చెలికత్తెలు దింపుతారు. ఉపవనములో చెట్టెక్కి ప్రాకారము మీది కెక్కి, ప్రాకారముమీదినుండి పక్కనున్న చెట్టెక్కి దిగి ఇంటికి వెళ్ళిపో" అని ముసలిదానికి చెప్పి పంపివేసింది. వృద్ధురాలు వెళ్ళిపోయి బుద్ధిశరీరునితో జరిగిన దంతా చెప్పింది. పద్మావతి యుక్తిగా తనయింటికి దారి చెప్పింది. నీకోరిక ఫలించింది" అని మంత్రికుమారుడు రాజకుమారుని ఉత్సాహపరిచినాడు. అతడు రాజసుతునకు సలహాగా "ఈరాత్రి తోటతోవనే వెళ్ళి తాటిపీటమీద కూర్చో. అప్పుడు పద్మావతిచెలులు తాళ్ళు మేడమీదికి లాగుతారు. నీవు ప్రియురాలిదగ్గిరికి వెళ్ళవచ్చును" అని చెప్పినాడు.

రాజపుత్రుడు బుద్ధిశరీర సమేతంగా ఆ రాత్రి ప్రాకారమార్గాన ఉద్యానవనిలో ప్రవేశించినాడు. మేడమీద పద్మావతి చెలులు తాళ్లు పట్టుకొని సిద్ధముగా ఉన్నారు. వెంటనే రాజకుమారుడు పీటఎక్కగా చేడియలు తాళ్ళు పైకి లాగినారు. అతడు పద్మావతికోసము అంతఃపురికి వెళ్ళినాడు. బుద్ధిశరీరుడు ఇంటికి వెళ్ళినాడు. రాజపుత్రుడు చక్కని చుక్కవంటి పద్మావతిని చూచినాడు. చాలదినములు విరాళిక

తపించిన ఆ కామిని అతనిని కంఠాలింగనాది కామకైంకర్యములతో గౌరవించింది. అతడామెను గాంధర్వరీతిగా వివాహము చేసుకొని రహస్యంగా అక్కడే కొన్నాళ్ళు గడిపినాడు. అతడు ఒకరాత్రి ప్రియురాలితో "ప్రేయసీ, నాతో కూడా నామిత్రుడు మంత్రికుమారుడు వచ్చినాడు. నన్ను విడిచి మీముసలమ్మఇంటిలో ఒంటరిగా ఉన్నాడు. నాకోసం అతను ఎదురుచూస్తూ ఉంటాడేమో. వెళ్ళిపోయి మళ్ళీ వచ్చేస్తాను" అన్నాడు. పద్మావతి ఊహాపోహలున్నమనిషి. వెంటనే "ఆర్యపుత్రా! అయితే నా సంకేతములు నీవా తెలుసుకొన్నది లేక మంత్రిసుతుడా?" అని కుతూహలంతో ప్రశ్నించింది. అప్పుడు రాజసుతుడు "నీసంజ్ఞలు నాకు బోధపడలేదు. మంత్రిసుతుడైన బుద్ధిశరీరుడే నీ సంకేతములను గ్రహించినాడు." అని చెప్పినాడు. పద్మావతి "ఆర్యపుత్రా! అతని సంగతి ఇన్నాళ్లు దాచిపెట్టావు. నీ మిత్రుడు నాకు అన్నగారివరస. ముందుగా అతనికి చందనతాంబూల సత్కారములు చేయవలసింది" అన్నది. రాజకుమారుడు ఆరాత్రి ప్రాకారమార్గాన ఇంటికివెళ్ళి బుద్ధిశరీరునితో జరిగినదంతా చెప్పినాడు. మంత్రిసుతుడు "నేను సంకేతాలను తెలుసుకొన్నానని నీవు చెప్పడం పొరపాటు" అన్నాడు.

తెల్లవారింది. ఇద్దరూ సంధ్యావందనాదికము ముగించి మాట్లాడుతూఉండగా పద్మావతి చెలికత్తెవచ్చింది. ఆమె పక్వాన్న తాంబూలములు తెచ్చి మంత్రిసుతునకుఇస్తూ కుశలమడిగింది. రాజకుమారుడు పక్వాన్నము భక్షించబోగా మాటలధోరణిలో చెలి అతన్ని వారించింది. పద్మావతి రాకుమారునికై ఎదురు చూస్తున్నదనిచెప్పి సెలవు తీసుకొని వెళ్ళిపోయింది. బుద్ధిశరీరుడు రాజసుతునితో 'మిత్రమా! వింత చూపిస్తాను' అన్నాడు. మంత్రికుమారుడు పక్వాన్నము తాను తినక మొదట కుక్కకు వేయగా వెంటనే కుక్కతిని గిరగిరాతిరిగి చనిపోయింది. 'ఆహా ఏమిటీ అద్భుతము!' అని రాజసుతుడు అడిగేసరికి బుద్ధిశరీరుడు

"పద్మావతి సంకేతాలను నేను తెలుసుకొన్నానని, నేను ధూర్తుణ్ణి అని తలచి నన్ను చంపివేతామని విషాన్నము పంపించింది. నీమీద వలపు దీనికంతకూ కారణము. నేను జీవించిఉండగా నీవామెకు వశుడవు కావేమోననీ, నావశంలోఉంటే మననగరానికి వెళ్ళిపోతావనీ అనుకొన్నది. పద్మావతిమీద నీవుకోపగించకు. ఆమెనుహరించి మననగరికి తీసుకొనిపోదాము. అందుకు తగినయుక్తి చెవుతాను." అని తెలియచెప్పినాడు. 'నిజంగా నీపేరు బుద్ధిశరీరుడని సార్థకమైంది మిత్రమా' అని రాజకుమారుడు అభినందించినాడు. ఆకస్మికంగా వీధిలో రాజకుమారుని బాలుడు చనిపోయినాడని కేకలు వినబడినవి. బుద్ధిశరీరుడు రాజసుతునితో "ఈరాత్రి యథాప్రకారము పద్మావతి ఇంటికివెళ్ళు. దానిశరీరము దానికి తెలియనంత మద్యము తాగించు. అది కైపులో పడిఉండగా నిప్పులో కాల్చిన శూలాన్ని తెచ్చి దాని పిరుదులమీద వాతపెట్టు. దానివళ్ళు వొలిచి నగలన్నీ పుచ్చుకొని గవాక్షమార్గాన తాటిపీట ఉయ్యాలెక్కి ఉద్యానములో దిగి ప్రాకారముదాటి ఇంటికి రా. ఆతరువాత ఆలోచన చెవుతాను." అంటూ పేదుపంది ముళ్ళవంటి మొనలతో శూలము చేయించి అతనికి ఇచ్చినాడు. దృఢమైనశూలాన్ని పుచ్చుకొని రాత్రిప్రాకారము దాటి, తాటిపీట ఎక్కి రాజకుమారుడు పద్మావతి మందిరానికి వెళ్ళినాడు. అతడు పద్మావతికి కైపెక్కించి కాల్చిన శూలముతో దాని పిరుదులమీద వాతపెట్టినాడు. దానినగలన్నీ అతడు వొలిచి మంత్రికుమారుని దగ్గిరికి వెళ్ళినాడు. తన యోచన నెగ్గినందుకు బుద్ధిశరీరుడు సంతోషించినాడు.

అతడు రాజకుమారుని వెంటపెట్టుకొని శ్మశానమునకు వెళ్ళి తాను తాపసవేషముధరించి, అతనికి శిష్యవేషము వేసినాడు. "రాజకుమారా! ఈ అలంకారములలో ఈ ముత్యాలహారము తీసుకొనిపోయి బజారులో అమ్మివెయ్యి. ఎవరూ కొనకుండా ఉండేటట్లు ఎక్కువ ధర చెవుతూ

హారాన్ని అందరికీ చూపు. ఎవరైనా కనిపెట్టి నిన్ను పట్టుకొంటే భయ పడకుండా వారితో మాగురువు దీనిని అమ్మిపెట్టమన్నాడు' అని చెప్పు. రాకుమారుడు ముత్యాలహారము బజారులో అమ్మచూపుతున్నాడు. రాజసేవకులు దంతఘాతకుని కుమార్తె నగలకై వెతుకుతూ ముత్యాల పేరుతో ఉన్న రాజకుమారుని పట్టుకొని కొత్వాలుదగ్గిరికి తీసుకొని వెళ్ళినారు. తాపసవేషంలో ఉన్న అతన్ని చూచి కొత్వాలు మంచి తనంగా "స్వామీ, తమకు ఈముత్యాలపేరు ఎలావచ్చింది? రాత్రి దంతఘాతకుని కుమార్తె అయిన పద్మావతి మందిరములో దొంగలుపడి నగలూ నాణ్యాలూ దోచుకొన్నారు. ఈ ముత్యాలహారము ఆనగల లోది" అని అడిగినాడు. సన్యాసివేషములో ఉన్న రాజపుత్రుడు 'దీనిని మాగురువుగారు ఇచ్చినారు. వచ్చి ఆయననే అడగండి' అని ఉత్తరము ఇచ్చినాడు. నగరాధ్యక్షుడు బుద్ధిశరీరునిదగ్గిరికి వచ్చి 'స్వామీ, ఆ ముత్యాలపేరు మీశిష్యునిచేతికి ఎలావచ్చింది?' అని అడిగినాడు. తాపస వేషధారిగా ఉన్న బుద్ధిశరీరుడు "అయ్యా, నేను సన్యాసిని. నిత్యమూ అరణ్యసంచారము చేస్తూ ఉంటాను. విధివశాన ఇక్కడికి వచ్చి రాత్రి శ్మశానంలో ఉన్నాను. రాత్రే యోగినీగణము అక్కడక్కడ నుంచి వచ్చి చేరింది. ఆగుంపులో ఒకయోగిని రాజు కొడుకును తెచ్చి గుండెలు చీల్చి భైరవునికి నైవేద్యము పెట్టింది. తరువాత ఆమె మద్యముతాగి కైపెక్కి జపము చేస్తున్న నాచేతుల్లో తావళము లాక్కు న్నది. ఆ మాయదారియోగిని ముఖాన నానావికారములు ప్రకటిస్తూ నామీాద పడ్డది. నేను మంత్రాగ్నిలో శూలాన్ని కాల్చి దానిపిరుదుల మీాద వాత పెట్టినాను. దానిమెడలో ఉన్న ఈముత్యాలపేరు హరించి నాను. మేము సన్యాసులము. దీనిని ఉంచుకోడము ధర్మము కాదు. అందుచేత హారాన్ని అమ్మవలసి వచ్చింది." అన్నాడు. సంగతి యావత్తూ విని నగరాధ్యక్షుడు దంతఘాతకునికి మనవిచేసినాడు. అతడు

ముత్యాలహారాన్ని ఆనవాలు పట్టి నమ్మకమయిన ముసలమ్మను పద్మావతి జఘనముమీద వాతఉన్న దేమో చూచి రమ్మని పంపినాడు. ఆవృద్ధురాలు తిరిగి వచ్చి పద్మావతి పిరుదులమీద శూలపుగుర్తున్నదని చెప్పింది. పద్మావతి పిశాచిగా మారి తన సుతునిహరించిందని రాజు నిశ్చయించుకొన్నాడు. అతడు స్వయంగా తాపసవేషములో ఉన్న బుద్ధిశరీరుని దగ్గిరికి వెళ్ళి పద్మావతికి తగినశిక్ష అడిగినాడు. ఆసమయములో పద్మావతి కన్నీరు మున్నీరుగా ఏడుస్తూఉండగా ఆమెను బంధువులనుండి ఎడబాపు చేసి ఊరునించి వెళ్ళగొట్టినారు. ఆమె అడవులపా లయి మంత్రిపుత్రుని తంత్రశక్తివల్ల తనకాగతి పట్టిం దని తలుచుకొని కుంగిపోతున్నది. చీకటిపడగానే రాజకుమారమంత్రికుమారులు తాపసవేషాలు తీసివేసి గుర్రా లెక్కి పద్మావతి దగ్గిరికి వచ్చి ఆమెను ఓదార్చి అశ్వముమీద ఎక్కించి తమ నగరికితీసికొని వెళ్ళినారు. వజ్రముకుటుడు పద్మావతితో సుఖంగా ఉంటున్నాడు. దంతఘాతకుడు కుమార్తెగతి ఏమయిందో తెలియక ఏ వన్యమృగమో ఆమెను చంపి వుంటుం దని తలచి కృశించి చనిపోయినాడు. అతని భార్య వియోగదుఃఖభారము సహించలేక భర్తతోసహగమనము చేసింది.

త్రివిక్రమమహారాజుతో కథ చెపుతున్న బేతాళుడు "రాజన్, నాసంశయాన్ని పోగొట్టవలె. దంతఘాతకుడూ అతని ప్రియురాలు చనిపోయినారు కద. ఆపాపము ఎవరిని చుట్టుకొంటుంది? బుద్ధిశరీరుడినా? వజ్రముకుటునా? నీవు చాలా బుద్ధిశాలివి గద. నీకు తెలిసి చెప్పకపోతేనీతల నూరుచెక్క లవుతుంది." అన్నాడు.

శాపమువల్ల త్రివిక్రమసేనుడు 'యోగీశ్వరా, నీకు తెలియని ధర్మసూక్ష్మము లేదుగద. పాపము ఎవరిదీకాదు. పాపానికి కర్ణోత్పలరాజేంద్రుడే కారణము" అని చెప్పగా బేతాళుడు "అలా అంటావేమి?

కర్ణోత్పలుడు ఏమీ చేయలేదే. అముగ్గురే కదా పాపానికి మూలకార ణము? హంసలు వరి మేసిపోతే తప్పు కాకులదా?" అని ప్రశ్నించినాడు.

అప్పుడు రాజు "అముగ్గురూ ఏపాపమూ ఎరుగరు. ప్రభుకార్యము నిర్వహించవలసింది మంత్రి కుమారుని పని. అది అతనికి పాతకంకాదు. పద్మావతీ వజ్రముకుటులు కామార్తులు. వారు వివేకము లేక విరాళిలో ఉన్నవారు, గుణదోషవిచారానికి అర్హులుకారు. కర్ణోత్పల రాజేంద్రుడు వివేకహీనుడై చారులవల్ల యథార్థము కనిపెట్టక అవిచారితముగా కార్యమాచరించినాడు. అందువల్ల పాపము అతన్నే చుట్టుకొంటుంది" అని చెప్పగా సమాధానానికి బేతాళుడు సంతుష్టుడై అతనిని పరీక్షించ వలెనని తలచి క్షణంలో అదృశ్యమైనాడు. త్రివిక్రమసేనుడు బేతాళు డున్న శవంకోసం మళ్ళీ శింశుపావృక్షసమీపానికి వెళ్ళినాడు.

## తరంగము: ౨౬

## బేతాళకథ: ౨

శవములు కాలుతున్న వెలుతురులో త్రివిక్రమసేనుడు బేతాళుని తేవడానికి వెళ్ళగా శవము నేలమీద ధ్వని చేసింది. అతడు శవములో ఉన్న బేతాళుని తనబుజాన ఎక్కించుకొని మౌనముతో వేగంగా నడు స్తున్నాడు. బుజాన కూర్చున్న బేతాళుడు త్రివిక్రమసేనునికి మళ్ళీ కథ చెపుతున్నాడు:

యమునానదీ తీరాన బ్రహ్మస్థల మనే అగ్రహారములో అగ్నిస్వామి అనే వేదశాస్త్ర పండితుడైన బ్రాహ్మణోత్తముడు ఉన్నాడు. అతని కుమారి మందారవతి చిదిపి దీపము పెట్టినట్లు ఉంటుంది. బ్రహ్మదేవుడు ఆ అందాలరాశిని సృష్టించి పూర్వము తాను చేసిన దేవతాసృష్టికి రోత పడినాడు. ఆమెకు యౌవనమురాగా ముగ్గురు బ్రాహ్మణ కుమా

రులు సమాన రూపగుణులు వచ్చి మందారవతి నాకు కావాలంటే నాకు కావాలని పోటీపడుతూ అగ్నిస్వామిని అడిగినారు. ఆ బ్రాహ్మణుడు ఒక రికి పిల్లదాన్ని ఇస్తే మిగతా ఇద్దరూ ప్రాణాలు తీసుకొంటారని తెలిసి ఎవరికీ పిల్లను ఇవ్వనని చెప్పినాడు. ఆ విప్రకుమారులు ముగ్గురూ మందార వతి మీదనే లక్ష్యముంచి చాంద్రాయణవ్రతము ఆరంభించినారు. ఆకన్య హఠాత్తుగా జ్వరంవచ్చి చనిపోయింది. ఆముగ్గురూ తపించి మందారవతి శవాన్ని శ్మశానానికి మోసుకుపోయి అగ్ని సంస్కారము చేసినారు. ముగ్గురిలో ఒక విప్రుడు శవాన్ని కాల్చిన చోటనే మఠము కట్టుకొని ఆమె బూడిద శయ్యగా చేసుకొని తిరిపెమెత్తి తపస్సు చేస్తు న్నాడు. రెండోవాడు ఆమె ఎముకలను తీసుకుపోయి గంగలో వేసినాడు. మూడోవిప్రుడు సన్యాసియై దేశ దేశాంతరాలు దిమ్మతిరిగి చివరకు వక్రోలక మనే గ్రామము చేరి ఒక బ్రాహ్మణ గృహములో ఆతిథ్యము కోరినాడు. గృహయజమాని ఉచితరీతిగా అతన్ని సమ్మానించినాడు. యజమాని శిశువు మకురుతనం చేసి ఏడవడం మొదలుపెట్టింది. ఎంత సముదాయించినా శిశువు ఒకటే ఏడుపు. తల్లి విసుగుతో శిశువు నెత్తి మండుతున్న అగ్నిలో వేసింది. వేసీవేయుడంలో శిశువు కాలిపోయింది. అది చూచిన విప్రాతిథి శరీరము గగుర్పొడిచింది. అప్పుడా విప్రుడు "అమ్మా! తెలియక రాకాసి కొంపలో కాలు పెట్టాను. మీఇంట్లో అన్నము పాపరాశి; నేను తీసుకోలేను వెళ్ళిపోతాను" అంటూ లేచినాడు.

గృహయజమాని "అయ్యా, మంత్రాన్ని పఠించినమాత్రాన శిశువు జీవిస్తుంది. చూడు, మంత్ర మహిమ" అంటూ చిన్న పుస్తకము తెచ్చి మంత్రము పఠించి అభిమంత్రిత మయిన దుమ్మును శిశువు బూడి దలో వేసినాడు. వెంటనే శిశువు తిరిగి బతికింది. బ్రాహ్మణుడు నిశ్చిం తగా భోజనము చేసి లేచినాడు. భోజనాలు అయిన తరువాత యజ మాని మంత్ర గ్రంథమును చిలకకొయ్యకు తగిలించి నిద్రించినాడు.

బ్రాహ్మణాతిథి లేచి సమయము కనిపెట్టి మంత్రగ్రంథాన్ని హరించి పగ లనక రాత్రి అనక నడిచి నడిచి శ్మశానానికి చేరినాడు. గంగలో మందారవతి ఎముకలు వేసిన విప్రుడూ, ఆమెచితాభస్మరాశిమీద శయనించిన విప్రుడూ అక్కడే ఉన్నారు. ఆఇద్దరితో మూడోవాడు "ఈమతాన్ని తీసివెయ్యి. నేను మంత్ర ప్రభావమువల్ల ప్రియురాలిని చితాభస్మరాశినుంచి జీవింప చేస్తాను" అని పలికినాడు. భస్మరాశి మీాద పరున్న విప్రుణ్ణి మూడోబ్రాహ్మణుడు తోసివేసి మతాన్ని పెరికివేసి మంత్రము పఠించి, చితిమీాద అభిమంత్రించిన దుమ్ము రవంత వేసినాడు. భస్మరాశిలో బంగారు శలాకవలె మందారవతి బతికి లేచింది. ముగ్గురూ మరుబారికిసోలి తహతహలాడుతూ కలహించడము మొదలు పెట్టినారు. నేను మంత్రమహిమవల్ల ప్రియురాలిని బతికించాను. అందువల్ల మందారవతి నాప్రేయసి అని ఒకడివాదన. నేను తీర్థములో అస్థిసంచయము కలపడంవల్ల మందారవతి బతికి లేచినది. అందుచేత మందారవతి నాప్రేయసి అని రెండోవాడి తగాదా. నేను ప్రియురాలి భస్మమును కాపాడి బతికించినాను. అందువల్ల మందారవతి నాప్రేయసి అని మూడోవిప్రుడు పేచీపెట్టినాడు. న్యాయంగా ఆలోచించి రాజేంద్రా, ఎవరు మందారవతికి భర్త కావలసినవాడో నిర్ణయించు. సమాధానము సరిగా చెప్పకపోతే నీతల ముక్కలవుతుంది" అని బేతాళుడు బెదిరించినాడు. త్రివిక్రమసేనుడు ఇలా సమాధానము ఇచ్చినాడు. కష్టపడి మంత్రబలంవల్ల మందారవతిని బతికించినవాడు ఆమెకు తండ్రి గాని భర్త కాడు. గంగలో అస్థికలు కలిపినవాడు సుతుడు గాని భర్త కాడు. గాఢానురాగముతో శ్మశానంలో చితాభస్మరాశిని శయ్యగా చేసుకొని తపస్సు చేసినవాడు మందార వతికి మగడు" భేతాళుడు వెంటనే మాయమై పోయినాడు. రాజు అతన్ని వెతకడానికి శింశుపావృక్షముదగ్గిరికి వచ్చినాడు.

## తరంగము: ౭౭

## బేతాళకథ: ౩.

త్రివిక్రమసేనుడు బేతాళాధిష్ఠిత మైన శవమును బుజాన పెట్టుకొని నడుస్తున్నాడు. మార్గాయాసము పోగొట్టవలె నని బేతాళుడు రాజుకు కథ చెవుతున్నాడు.

“పూర్వము పాటలీపుత్రనగరమును విక్రమకేసరి అనే రాజు పరిపాలించినాడు. ఆగుణనిధివద్ద శాస్త్రమర్మములు తెలిసిన విదగ్ధచూడామణి అనే చిలుక శాపవశాన శుకమై ఉంది. దానిఉపదేశము శిరసా వహించి రాజకుమారుడు మగధేంద్రునికుమార్తె అయినచంద్రప్రభను వివాహము చేసుకొన్నాడు. చంద్రప్రభదగ్గిర విజ్ఞానశాలిని అయిన సోమిక అనే గోరువంక ఉన్నది. శుకశారికములు తమ విజ్ఞానమువల్ల ఆ రాజదంపతులను సేవిస్తూ ఉన్నవి. ఒకరోజున శుకము వలపుతమకముతో శారికపొత్తు కోరింది. నేను పురుష సంపర్కము కోరను అని శారిక తిరస్కరించింది. శుకము “పురుషులు దుష్టులు కారు. స్త్రీలే దుష్టస్వభావలు అని సమాధానము ఇచ్చింది. శుకశారికలకు తగాదా వచ్చింది. శుకము ఓడితే శారికదగ్గిర దాసత్వమునకూ, శారిక ఓడితే శుకమునకు భార్యగానూ పందెములు ఏర్పాటు చేసుకొన్నారు. శుకశారికలు రాజపుత్రుని మధ్యవర్తిగా నియమించుకొన్నవి. వివాదకారణము తెలుసుకొని రాజసుతుడు శుకశారికలను తండ్రి సన్నిధికి తీసుకొని వెళ్ళినాడు. అప్పుడు శారిక ‘పురుషులు కృతఘ్నులు. ఇదిగో నిరూపిస్తున్నాను. వినండి అని కథ ప్రారంభించింది.

భూమండలంలో కామందిక అనే నగరంలో అర్థదత్తు డనే ధనికవర్తకుడున్నాడు. అతనికుమారుడు ధనదత్తుడు తండ్రి చనిపోగానే స్వతంత్రుడై యౌవనములో వొళ్ళు తెలియక జూదమాడి ఇల్లు గుల్ల చేసు

కొన్నాడు. వ్యసన మనే వృక్షానికి దుర్జనసాంగత్యము వేరు. దుర్జన మిత్రులు అతన్ని అన్నింధాలా చెడగొట్టగా ధనదత్తుడు పువ్వు లమ్మిన ఊళ్ళో కట్టెలు అమ్మ లేక త లెత్తుకో లేక దేశాంతరము వెళ్ళినాడు. అతడు చందన పుర మనే పట్టణము చేరి వైశ్యుని ఇంట్లో భోజనము చేసినాడు. ఆ వైశ్యుడు ధనదత్తుని అందచందాలు చూచి కులగోత్రా లడిగి కులీను డని తెలుసుకొని కుమార్తె రత్నావళి నిచ్చి పెళ్ళి చేసినాడు. ధనదత్తుడు అత్తవారింట్లోనే ఉండి కష్టాలు మరిచి పోయి నాడు. అక్కడ అతనికి భార్యమూలంగా ఆస్తి కలిసింది. చేతికి ధనము చిక్కినందు వల్ల అతడు జూద మాడవలె ననీ, స్వదేశము వెళ్ళవలె ననీ నిశ్చయించుకొన్నాడు. మామగారిని ఒప్పించి ధనదత్తుడు భార్యతోను ఒక వృద్ధురాలితోను స్వదేశము బయలుదేరినాడు. మధ్య మార్గములో అతడు భార్యదగ్గర నగలు నాణాలు పుచ్చుకొని దొంగల భయమని కల్లమాట లాడినాడు. ఆపాపాత్ముడు భార్యను ధనంకోసం చంపివేయ దలచి గుంటలో తోసినాడు. అంతటితో ఊరుకోక ముసలి దాన్ని కూడా గోతిలోకి తోసినాడు. వృద్ధురాలు వెంటనే చని పోయింది. అతనిభార్యకు ఇంకా ఆయుర్దాయము ఉండడంవల్ల గాయా లతో గట్టెక్కింది. ఆమె మాటమాటకీ దారి అడుగుతూ చివరకు యాతనపడి ఇల్లుచేరింది. హఠాత్తుగా ఆమె పుట్టింటికి రావడంవల్ల తల్లి తండ్రులకు ఆశ్చర్యము వేసింది. ఆపతివ్రత భర్తమీద నేరము చెప్పక దారిలో దొంగలు పడి సొమ్ము దోచుకొని భర్తను కట్టి తీసుకువెళ్ళినా రనీ, వృద్ధురాలూ తానూ గుంటలో పడ్డా మనీ చెప్పింది. ఒక బాట సారి తనను ఉద్ధరించినట్టూ ముసలిది చనిపోయినట్టూ ఆపుణ్యశీల తల్లికీ తండ్రికీ చెప్పింది. వా రిద్దరూ కూతురిని ఓదార్చినారు. పుట్టింట్లో ఉంటూ ఆ పతివ్రత భర్తమీద మనసు పెట్టుకొని రోజులు ఎలాగో వెళ్ళ బోస్తున్నది. కొంతకాలము అయిన తరువాత జూదములో

సొమ్ము సంపాదుచేసుకొని ధనదత్తుడు మామగారి దగ్గిరికి వెళ్ళి మళ్ళీ ధనము కావాలనీ, తనభార్య క్షేమంగా ఉందనీ అబద్ధాలాడ నిశ్చయించు కొన్నాడు. ధనదత్తుడు అత్తవారింటికి వచ్చి మామగారితో మాట్లాడ బోతూ ఉండగా అతనిభార్య వచ్చి పాదాలదగ్గిర మోకరిల్లింది. మగడు దుష్టుడైనా మగువ కించపరచదుకదా, భార్యముఖము చూచి ధన దత్తుడు భయపడినాడు. భర్తను పక్కకు తీసుకొని వెళ్ళి ఏకాంతంగా "నాథా! మీమామగారిని చూచి భయపడకండి. మనను దొంగలు కొట్టినారని మాతల్లిదండ్రులతో చెప్పాను" అంటూ ఆపతివ్రత అతన్ని లోపలకుతీసుకొని వెళ్ళింది. అత్తమామలు అల్లుని చూచుకొని ప్రాణా లతో బతికి బైటపడినందుకు సంతోషించినారు. ధనదత్తుడు కొన్నాళ్లు సుఖంగా అత్తవారింట్లో షడ్రసోపేతంగా తింటూ కాలం వెళ్ళతీస్తు న్నాడు. ఒకరాత్రి అతనికి దుర్బుద్ధి పుట్టింది. పక్కలో ఉన్న భార్యను ధనదత్తుడు కైజారుతో నరికి, నగలు ఒలుచుకొని కిక్కురుమనకుండా ఎక్కడికో వెళ్లిపోయినాడు. పురుషులు ఎంతపాపాత్ములో గద! శారిక ఈకథ ముగించగానే చిలక ఇంకోకథ అందుకున్నది.

స్త్రీలు దుష్టస్వభావలు. పురుషులు ఉత్తములు. హర్షవతి అనే పట్టణములో కోట్లకు పడగలెత్తిన ధనదత్తు డనే వైశ్యు డున్నాడు. అతని కుమార్తె వసుదత్త అపరరతీదేవివలె ఉంటుంది. తండ్రి కుమా ర్తెకు మంచిసంబంధం చూచి తామ్రలిప్తినగరవాసి స్ఫురద్రూపి అయిన సముద్రదత్తు డనే వైశ్యకుమారునకు ఇచ్చి వివాహము చేసినాడు. భర్త తామ్రలిప్తిలో ఉండగా వలపు తలకెక్కిన వసుదత్త ఒక కోడెగానిని చూచి చెలికత్తెద్వారా కబురు చేసింది. చాటుగాఆమె అతనితో భోగ ములు అనుభవిస్తూ కాలక్షేపము చేస్తున్నది. ఇలా ఉండగా తామ్ర లిప్తినుండి భర్త తిరిగి వచ్చినాడు. అల్లుడు రావడంవల్ల అత్తగారు పిండి వంటలు చేసి పెట్టింది. రాత్రి తల్లి కుమార్తెకు పూలజడ వేసి ముస్తాబు

చేసి గదిలోకి పంపింది. భర్తతో వసుదత్త ఏకశయ్యలో ఉండి కూడా పరపురుషుని ధ్యానిస్తూ ఉంది. ఆమెకు భర్తమీద రక్తి లేదు. అతడు అధికంగా ఆసవము తాగడంవల్ల కైపెక్కి ఒళ్ళు తెలియక నిద్ర పోయినాడు. మధ్యరాత్రి దొంగవాడు కన్నము త్రవ్వి దంపతు లున్న పడకగదిలో చొరబడినాడు. సమయము కనిపెట్టి వసుదత్త కన్నములో నుండి వెలుపలికి వెళ్ళి సంకేతస్థలములో పరపురుషుణ్ణి కలుసుకో బోయింది. వసుదత్త వెళ్ళిపోతూ ఉండగా దొంగవాడు నిరుత్సాహ ముతో ఆయ్యో, నగలకోసం వస్తే ఈచిన్నది కోడెకానికోసము వెళ్ళి పోతున్నదే అనుకొన్నాడు. ఆచోరుడు వసుదత్తకు తెలియకుండా ఆమెను అనుసరిస్తూ వెళ్ళి ఒకచోట పొంచిఉన్నాడు. తోవలో వసు దత్తను చెలికత్తె కలుసుకొని పువ్వులు సుగంధద్రవ్యాలు తెచ్చి ఇచ్చింది. ఆమె వాటిని తీసుకొని బాహ్యోద్యానమునకు వెళ్ళింది. ఆకామిని సంకేతస్థలానికి వెళ్ళిచూచేసరికి కాముకుడు చెట్టున ఉరిలో వేలాడుతూ ఉన్నాడు. ఆకాముకుడు రాత్రి సంకేతస్థలానికి రాగా నగరరక్షకులు చూచి వాడు చోరుడని తలచి ఉరితీసినారు. వసుదత్త గుండె నీరై పోగా దీనముగా తల నేలకు కొట్టుకొని ఏడ్చింది. కొంత సేపటికి ఆమె లేచి ఉరితాడు తొలిగించి కాముకునిశవాన్ని కిందికి దింపింది. ఆకామిని శవానికి గంధము రాచి పువ్వులు చుట్టి రాగాతి రేకంవల్ల గాఢాలింగనము చేసుకొని వానిమొగ మెత్తి ముద్దుపెట్టుకో బోయింది. అప్పుడు శవములో ప్రవేశించిన బేతాళుడు దంతముతో వసుదత్తముక్కు కొరికినాడు. ఆమె నొప్పితో బాధపడుతూ, ప్రియుడు ఇంకా జీవించి ఉన్నాడని భ్రమపడి శవసమీపము చేరింది. వసుదత్త పరీక్షించి శవాన్ని చూచి లాభము లేదని రోదిస్తూ బయలుదేరింది. చాటున నక్కి కనిపెట్టిన దొంగ 'ఈచిన్నది ఎంత పాపాత్మురాలు! స్త్రీహృదయము అంధకూపమువంటిదే. ఎంత భయంకరము! ఇంకా

ఈమె ఏమి చేస్తుందో కనిపెట్టవలె' అని నిశ్చయించుకొన్నాడు. వసుదత్త భర్త నిద్రిస్తున్న శయ్యాగారము చేరి అయ్యో నన్నురక్షించాలి! భర్తరూపంలోఉన్న శత్రువు నాముక్కు కోసినాడు! అంటూ గగ్గోలు పెట్టింది. తండ్రి వచ్చి రక్తము కారుతున్న కుమార్తె నాసికను చూచి కోపము పట్టలేక భార్యకు ద్రోహము చేశా డని అల్లుణ్ణి కట్టివేయించినాడు. అందరూ వచ్చి అతన్ని తలోబాదు బాదినారు. అతడు మారుమాటాడక సంగ తేమిటో తెలియక కళవళపడుతూ దెబ్బలు తింటూ ఉన్నాడు. దొంగవాడు ఇదంతా కనిపెట్టి తనతోవనే వెళ్ళిపోయినాడు. మామగారు అల్లునిమీద ఫిర్యాదు చేసినాడు. అతడు కూతురినీ అల్లుణ్ణీ రాజసన్నిధికి తీసుకుపోయి అల్లుడు కూతురి ముక్కు కోసినాడని పలికినాడు. రాజు అల్లునిసమాధానము పెడచెవిని పెట్టి మరణశిక్ష విధించినాడు. తలవరులు తాషా వాయిస్తూ అతన్ని వధ్యశిల దగ్గిరికి తీసుకొని వెళుతున్నారు. చోరుడు అది విని రాజపురుషులతో 'అయ్యా, నిష్కారణంగా అతన్ని ఎందుకు చంపుతారు.' నిజమైన సంగతి నేను కళ్ళారా చూచాను. నన్ను రాజసన్నిధికి తీసుకొని వెళ్ళండి. చెప్పవలసింది అక్కడచెపుతాను" అని విన్నవించినాడు. చోరుడు తలవరులతో రాజసన్నిధికి వెళ్ళినారు. దొంగ తాను చూచింది చూచినట్టు చెప్పి చివరకు ఇలా అన్నాడు. "దేవరా, నా మాట మీకు నమ్మకము లేకపోతే ఆశవాన్ని చూచి రండి. ఆకాముకుని శవమునోటిలో ముక్కు చిక్కుకొని ఉంటుంది."

రాజు భటులను పంపి దొంగ చెప్పినమాటలు యథార్థములని విశ్వసించి అల్లుని వదిలిపెట్టినాడు. అతడా దుష్టశీలను భార్యను చెవులు కోయించి దేశమునుండి వెళ్ళగొట్టినాడు. రాజు దాని తండ్రి యావదాస్తిని పుచ్చుకొని, చోరుని తెలివితేటలకు సంతోషించి, అతనిని కొత్వాలుగా ఏర్పాటుచేసినాడు. స్త్రీలు దుష్టస్వభావలు. వారే ద్రోహ

బుద్ధికలవారు. అని శుకము పలికి శాపము తీరిపోగా గంధర్వుడై దివ్య విమానమెక్కి స్వర్లోకమునకు వెళ్ళింది. అప్పుడే శారికకు ఇంద్రశాపము తీరిపోగా తిలోత్తమ నామక అప్సరసగా స్వర్గమునకు వెళ్ళింది. తగవులాటలో న్యాయము కాలేదు. రాజన్ ఎవరిది న్యాయమో నీవు నిర్ణయము చేయవలె. నీవు చెప్పకపోతే తల ముక్కలవుతుంది.

అప్పుడు రాజు "యోగీశ్వరా! ఇందులో తెలియనిదేముంది? స్త్రీలే పాపాత్ములు. పురుషులలో అరుదుగా దుర్మార్గులు ఉంటారు, ప్రాయికముగా స్త్రీలు అందరూ దుష్టస్వభావలే." అని పలుకగా బేతాళుడు త్రివిక్రముని బుజముమీదినుంచి మాయమైపోయినాడు. అతడు బేతాళుని వెతకడానికి బయలుదేరినాడు.

తరంగము : ౭౮

బేతాళకథ : ౮

త్రివిక్రమసేనుడు స్మశానవాటిలో చీకటిలో శింశుపావృక్ష సమీపానికి వెళ్ళినాడు. అతడు బేతాళుని బుజమెక్కించుకొని నదురూ బెదురూ లేకుండా నడుస్తూ ఉండగా బేతాళుడు 'రాజన్! ఎందుకు శ్రమణుని కోసం బాధపడతావు? నీ శ్రమ వ్యర్థము. నీ మార్గాయాసము పోవడానికి కథ చెపుతాను' అని ప్రారంభించినాడు.

శోభావతీపురాన్ని శూద్రకుడనే మహావీరుడు పరిపాలిస్తున్నప్పుడు ధర్మము నాలుగుపాదాల నడుస్తున్నది. మాళవదేశమునుండి వీరవరుడనే విప్రుడు రాజసేవాసక్తుడై శూద్రకుని వద్దకు వచ్చినాడు. ఆ విప్రునకు ధర్మవతి అనే ధర్మపత్ని సత్యవరనామక పుత్రుడు వీరవతి నామకపుత్రిక బలగము. రాజుదగ్గర అతడు కొలువుచేయడానికి చేతులో కత్తి, డాలు—మొలలో కటారి, సాధనలుగా ఉన్నవి. ఆ విప్రుడు దినా

నికి అయిదువందల దీనారములు జీతముకోరినాడు. రాజు అతని రూపాన్ని చూచి వీరుడని గ్రహించి అడిగినంతజీతము ఇచ్చి కొలువులో ఏర్పాటు చేసినాడు. రాజు 'ఇతనికి ఇంతజీతము ఇస్తున్నాను. ఈ దీనారములు ఎలా ఖర్చుపెడుతున్నాడో ఇతడు వ్యసనాల్లో చిక్కుకున్నాడో ఏమో' అని విప్రుని కనిపెట్టదలచినాడు. బ్రాహ్మణుని భోగట్టా తెలుసుకోమని రాజు చారులను పంపినాడు. ప్రతిరోజు ఉదయాన వీరవరుడు రాజును దర్శించి అపరాహ్ణవేళ బజారముదగ్గర నిలవబడి దీనారాలు పుచ్చుకొని ఇంటికి వెళ్ళి దీనారశతాన్ని భోజనార్థము భార్యచేతిలో పెడుతూ ఉండేవాడు. అతడునూరుదీనారాలు వస్త్రాలకు అంగరాగానికి తాంబూలానికి వ్యయముచేసేవాడు. వీరవరుడు దీనారశతము దానధర్మాలకు, ఖర్చుచేసేవాడు. ఇలా ఆవిప్రుడు అయిదువందల దీనారములు వ్యయము చేయని దినమేలేదు. అగ్నికార్యము అతడు పూర్తిచేసుకొని భోజనాదికము ముగించుకొని రాజద్వారముదగ్గర ఒక్కడూ పహారాఇచ్చేవాడు. చారముఖాన మహారాజు విప్రుని నిత్యదినచర్య తెలుసుకొని మహదానందము పొంది చారులను మాన్పించినాడు. వీరవరుడు గొప్పవాడనీ గౌరవార్హుడనీ రాజు తలచినాడు. మండుటెండలతో ఫెళ్ళున వేసవి చెలరేగింది. వీరవరుడు కష్టంమీద వేసవి గడిపినాడు. జడిధారలతో వర్షాగమము ప్రాప్తించింది. భోరున వానలు కురిసినా ఉరుములు ఉరిమినా వీరవరుడు రాజద్వారమువద్ద కొలువుమాన లేదు. పగటివేళమహారాజు ప్రాసాదాగ్రభాగమునుంచి రాజద్వారమువద్ద నున్న బ్రాహ్మణుని చూచినాడు. రాత్రి ద్వారమువద్ద చీకటిలో రాజు అతనినిచూచి 'ఎవరు ద్వారందగ్గిర?' అని హెచ్చరించినాడు. 'నేనున్నాను' అని వీరవరుడు సమాధానమిచ్చినాడు. మహారాజు 'ఈ విప్రుడు రాజభక్తుడు. ఇతన్ని తప్పకుండా ఉచ్చస్థితికి తీసుకొని రావలెను' అని గ్రహించి మేడదిగి అంతఃపురములో పరున్నాడు. మరునాడు తెరిపి లేకుండా రోకళ్ళలావున

వాన కురుస్తూఉన్నా, చీకటి సూచికాభేద్యంగాఉన్నా రాజు జిజ్ఞాసతో ప్రాసాదమెక్కి 'సింహద్వారము దగ్గిర ఎవరు వారు!' అని హెచ్చరించి నాడు. స్పష్టముగా 'వీరవీరుణ్ణినేను' అని విప్రుడు సమాధాన మిచ్చినాడు. రాజు విప్రుని నిష్ఠకు మెచ్చుకొని వింతపడుతూ ఉండగా దూరాన. స్త్రీ రోదనము వినపడింది. 'నారాజ్యములో బాధితులు దరిద్రులు ఎవరూ లేరే! ఎవరీరాత్రి ఏకాకిని ఏడుస్తున్నది!' అని రాజు తలపోసి వీరవరుణ్ణి పిలిచి 'వీరవరా, దూరాన ఎవరో స్త్రీ ఏడుస్తున్నది. వెళ్ళి చూచిరా' అని అనుమతి ఇచ్చినాడు. విప్రుడు సరేఅంటూ కఠారి మొలలో కట్టుకొని కత్తి చేతపట్టి కదిలినాడు. మెరుపులు జడివాన, చీకటి లెక్క చెయ్యక వీరవరుడు వెళ్ళడంచూచి మహారాజు కనికరించి మేడదిగి ఖడ్గహస్తుడై అతనివెనక కొంతదూరంగా నడుస్తున్నాడు. బ్రాహ్మణుడు ఏడ్పుసవ్వడిని బట్టి ఊరివెలుపల సరస్సుదగ్గరకు వెళ్ళినాడు. సరోమధ్యమున ఒక వనితామణి 'అయ్యో కరుణామయుడా! దాతా! నీవు లేక నేను ఎలాబతకను' అని విలపిస్తున్నది. వీరవరుడామెనుచూచి 'ఎందుకు తల్లీ! అలాఏడుస్తున్నావు!' అనిజాలిగా అడిగినాడు. రాజు సమస్తమూ రెప్పవేయక కనిపెడుతూ ఉన్నాడు. 'వీరవరా! నేను భూమిని. నాపతి దేవుడు శూద్రక రాజేంద్రుడు. నేటికి మూడోనాడు అతనికి మృత్యువు సంభవిస్తుంది. రాజు చనిపోతాడని విచారిస్తున్నాను. మళ్ళీ అటువంటి వాడు రాడని నాగతికి తపిస్తున్నాను' అని ఆమెసమాధానము ఇచ్చింది. వీరవరుడు భయపడినవాడివలె 'భూదేవీ! రాజుజీవించే ఉపాయము చెప్పు తల్లీ!' అని వేడినాడు. భూదేవి "విప్రవీరా! ఉంది ఉపాయము. నీవే దాన్ని నెరవేర్చగలవాడవు" అని హెచ్చరించింది. విప్రుడు "అలా అయితే చెప్పు. నాప్రాణాలు నాకు తృణప్రాయం. సాధించి రాజు క్షేమముకోసము జీవిస్తాను. ఈ జీవితం ఉన్నందుకు ప్రయోజనము ఏమున్నది!"అని భూమాతను అడిగినాడు. ఆమె 'వీరాగ్రేసరా! నీవంటి

స్వామిభక్తుడు ఎక్కడా కనపడడు. నగరివద్ద రాజుప్రతిష్ఠించిన చండికా లయము ఉన్నది. చండికి నీకుమారుని బలిఇస్తే మహారాజు నూరేళ్ళు బతుకుతాడు. ఇవాళే నీవు కార్యము నెరవేర్చాలి. అలా చెయ్యకపోతే మూడోనాటికి రాజుచనిపోతాడు" అనిచెప్పి అంతర్థానమైంది. మహారాజు చాటునేఉండి, సమస్తమూవిన్నాడు. రాజు వెనుకవస్తూఉండగా వీరవరుడు ఇంటికి వెళ్ళి రాజక్షేమార్థము కుమారుని వదులుకోవలె నని భార్యకు చెప్పినాడు. భార్య 'నాథా, మహారాజుక్షేమము మనముకోరి కుమారుని వదులుకొందాము. కుర్రవాణ్ణి లేపి విషయము చెప్పండి" అని భర్తతో అన్నది. వీరవరుడు కుమారుణ్ణి లేపి సంగతి చెప్పినాడు. కుమారుడు 'నాయనా, నావల్ల రాజు జీవించేపక్షములో నేను కృతార్థుణ్ణి. ఆయన ఋణము మనము తీర్చుకొన్నట్టే. ఆలస్యం చెయ్యక నన్ను చండికా దేవికి అర్పించు" అని పలికినాడు. తండ్రి మహాసంతోషంతో 'భేష్! నిజంగా నీవు నాకుమారరత్నం. అంటూ పొంగిపోయినాడు. వీర వరుడు కుమారుని బుజముమీద ఎక్కించుకొని ఆలయానికి బయలు దేరగా వీరవరుని ధర్మపత్ని కుమార్తెను బుజ మెక్కించుకొని చండికాలయానికి వెంటనే నడిచింది. విప్రవీరుడు కుమారుని తన బుజముమీదినుంచి కిందికి దింపి చండీవిగ్రహానికి చేతులు జోడించి 'దేవీ, శూద్రకరాజేంద్రునకు ప్రాణదానము చేయి తల్లీ! ఆయనకు శత సంవత్సరాల ఆయుర్దాయము ఇయ్యి తల్లీ!' అంటూ కుమారుని బలి ఇచ్చినాడు. ఆకాశవాణి అతని స్వామిభక్తికి మెచ్చి ఇలా అన్నది. "నీరాజసేవాపరతంత్రతకు మెచ్చినాను. శూద్రకమహారాజేంద్రునకు ప్రాణదానము చేసినాను' మహారాజు గగనవాణి విన్నాడు. వీరవరుని కుమార్తె వీరవతి సోదరునిమరణంవల్ల గుండెపగిలి వెంటనేచనిపోయింది. భార్య వీరవరునితో "రాజుకు మేలు చేసినాము. మనపిల్ల గుండెపగిలి చనిపోయింది. నేను తెలివిలేనిదాన్ని. మొదట నన్నే మీరు బలిస్తే

బాగుండేది. ఇప్పుడైనా నన్ను దేవికి అర్పించండి. నా తల ఖండించండి" అని వేడుకొన్నది. అప్పుడు వీరవరుడు "మానవతీ, నీశిరము అంబికకు అర్పించు. చింతించకు.' నీవు అర్పించలేకపోతే నేనే అర్పణమవుతాను. క్షణంసేపు ఆగు. చితి నేనే పేర్చుకొంటాను" అంటూ చితి పేర్చి వెలిగించినాడు. పతివ్రతామణి ధర్మవతి చండికి నమస్కరించి 'జన్మాంతరములో కూడా ఈఆర్యపుత్రుడే పతి కావాలి. నా శరీర త్యాగంవల్ల ప్రభువుకు మేలు కలుగుగాక' అంటూ ఆమె మింటికి ఎగురుతున్న మంటలలో పడిపోయింది.

వీరవరుడు 'రాజకార్యము నెరవేరింది. మహారాజు ఋణము తీర్చుకొన్నాను. నేను మాత్రము ఎందుకు జీవించవలె? నా కుటుంబము పోయినతరువాత నా మనుగడ ఎవరికి శోభ? నా శరీరము అర్పించి చండికను ప్రసన్నను చేస్తాను' అని ఆలోచించి చండీస్తవము చేసినాడు.

వీరవరుడు చండికాదేవిని పూజించి కరవాలము తీసి కంఠమును నరుకుకొన్నాడు. చాటున దాగిన మహారాజు మహాశ్చర్య పరవశుడై "ఇతను సకుటుంబముగా నా కోసము మహాత్యాగము చేసిన ధీరుడు. ఇలాంటి వీరాగ్రేసరుడు జగత్తులో ఉండడు. ప్రత్యక్షంగా రాజును స్తుతి చేసేవారే ఉంటారు. పరోక్షంలో రాజు క్షేమము కోరి ప్రాణత్యాగము చేసేవా రుండడము అరుదు. ఈ త్యాగమూర్తికి ప్రత్యుపకారము చేయని నా జన్మ సార్థకముగాదు. నా దొరతనము మాత్రమెందుకు?" అని పలుకుతూ ఒరలోనుండి కత్తిదూసి చండీసన్నిధిలో ఇలా వేడినాడు: "దేవీ! ఈ భక్తుని శిరస్సును స్వీకరించి, నాకు వరప్రదానము చెయ్యవా? వీరవరుడు సకుటుంబముగా నాకై త్యాగము చేసినాడు. దేవీ, ఇతనిని, సకుటుంబముగా బ్రతికించు తల్లీ."

శూద్రకమహారాజు కత్తి దూసి తనశిరసు తుంచుకొనబోగా గగనవాణి ఇలా పలికింది: "పుత్రా! సాహసము కూడదు. నీశౌర్యానికి

సంతోషించినాను. వీరవరుడు సకుటుంబముగా ఉజ్జీవితుడు అవుతాడు'' సుప్తోత్థితుని వలె వీరవరుడు సకుటుంబముగా బతికినాడు. మహారాజు ఆనంద బాష్పములు స్రవించగా అద్భుత దృశ్యాన్ని తిలకిస్తూనే ఉన్నాడు. వీరవరుడు ఆనందగరిమతో భార్యాపుత్రాదులను కౌగలించుకొని 'ఏమిటి, ఎలా మళ్లీ బతికినాము? చండీశ్వరీ కృపాకటాక్షమేమో?' అని పలికినాడు. ఆ విప్రవీరుడు దేవియెదట సాష్టాంగపడి కుటుంబమును ఇంటిలో చేర్చి వెళ్ళి కోటగుమ్మముదగ్గర యథాప్రకారంగా నిలవబడినాడు. ఇది అంతా చూచి శూద్రకుడు ప్రాసాద మెక్కి 'సింహద్వారందగ్గిర ఎవరు వారు?' అని పలుకగా 'ప్రభూ, నేను వీరవరుణ్ణి' అని సమాధానము ఇచ్చినాడు. శూద్రకరాజేంద్రుడు సంభ్రమాశ్చర్యములతో 'సముద్ర గంభీరహృదయులు మానవంతులు. కార్యశూరులై స్వీయకార్యము ఘనంగా చెప్పుకోరు!' అని తలపోసి అంతఃపురి ప్రవేశించి శేషించిన రాత్రి గడిపినాడు. మరునాడు మహారాజు సభలో వీరవరుని వీరకృత్యము అభివర్ణించినాడు. సభాసదులు ఆశ్చర్యపడినారు. శూద్రకరాజేంద్రుడు ఆనందకందళితహృదయుంతో విప్రవీరునికి లాటరాజ్యాన్ని అతని కుమారునకు కర్ణాటకాన్ని దానంచేసినాడు. అప్పటినుంచీ మహారాజు విప్రవీరుడు సమానవిభవోపేతులై పరస్పర సాహాయ్యముతో కుశలంగా ఉన్నారు.

ఈ కథ చెప్పిన బేతాళుడు త్రివిక్రమసేన మహీపతిని 'రాజన్! కథలో ఎవ రెక్కువవారు? నీ అభిప్రాయము చెప్పకపోతే తల నీబుజాన నిలవదు' అని పలుకగా రాజు 'శూద్రకుడు మహానుభావుడు' అని ముక్తసరిగా సమాధాన మిచ్చినాడు. బేతాళుడు అతని ప్రత్యుత్తరం విని "వీరవరుడు ఘనుడు కాడా! అతని భార్య ఎంత ఘన మైనది! అబలఅయినా చేతులారా కన్నకొడుకును త్యాగం చేసిందే? విప్రకుమారుడు ప్రాణత్యాగానికి సిద్ధపడినాడే? ఎంతవాడు కాకపోతే అత

నికి త్యాగబుద్ధి ఎక్కడిది! అందరికన్నా శూద్రకుడు గొప్పవాడు ఎలా అవుతాడు?" అని మళ్ళా ప్రశ్నించినాడు. రాజు 'వీరవరుడు మహా కులీనుడు. అతడు కుటుంబాన్ని త్యాగం చేసి రాజభక్తి చూపడం వ్రతం. బ్రాహ్మణి మహాకులీన, సాధ్వి. పతి త్యాగము చేయమన్నాడు. కనుక పత్ని అతన్ని అనుసరించింది. వారికడుపున పుట్టినవాడు త్యాగమూర్తి కాక మరొకడు ఎలా అవుతాడు? భృత్యులకోసం మహారాజు త్యాగం చేశాడు. అందువల్ల అతనే గొప్పవాడు' అని సమాధానము ఇచ్చినాడు. బేతాళుడు వెంటనే కనపడకుండా పోగా అతన్ని పట్టి తీసుకురావలె నని త్రివిక్రమసేనుడు శింశుపావృక్షము దగ్గిరకి వెళ్ళినాడు.

తరంగము : ౭౯

బేతాళ కథ : ౫

త్రివిక్రమసేనుడు చీకటిలో శ్మశానములో నడచి శింశుపావృక్ష శాఖకు వేలాడుతున్న శవాన్ని చూచి తరుశాఖ నెక్కి కత్తితో ఒక్క వేటు వేయగా తాడు తెగి శవము నేలకూలింది. బేతాళుడు అధిష్ఠించిన ఆశవాన్ని మహారాజు బుజాన పెట్టుకొని నడుస్తున్నాడు. అతని అధ్వ ఖేదము పోగొట్టవలె నని బేతాళుడు కథ ఆరంభించినాడు.

ఉజ్జయినీమహారాజు పుణ్యసేనునివద్ద అమాత్యుడు హరిస్వామి అనే గుణవంతుడు ఉన్నాడు. అతనికి దేవస్వామి అనే కుమారుడు కలిగినాడు; సోమప్రభ అనే చక్కనిచుక్క జనించింది. ఈడు వచ్చినకొద్దీ సోమప్రభ యౌవనప్రభలతో మిసమిసలాడుతూ ఉన్నది. ఆకన్య శూరునిగాని జ్ఞానినిగాని శాస్త్రపండితునిగాని వివాహమాడతా నని జననీజనకులకు చెప్పింది. మహారాజు కుమారి కోరికప్రకారం సంబంధం కోసం వెతికిస్తున్నాడు. అప్పుడు శత్రురాజు పుణ్యసేనునిపైన దండయాత్ర చేయగా పుణ్యసేనుడు సంధికై రాయబారిని పంపినాడు.

వెళ్ళినపని కావడంవల్ల రాజు సంతోషంతో ఉండగా సోమప్రభా లావణ్యము విన్న విప్రకుమారుడు వచ్చి రాజపుత్రిని తనకు ఇమ్మని కోరినాడు. హరిస్వామి అతనిని "నీవు జ్ఞానివా? పండితుడవా? వీరుడవా?" అని ప్రశ్నించినాడు. నేను శాస్త్రపండితుడను" అని అతడు సమాధాన మిచ్చినాడు. "ఏదీ నీవిజ్ఞానమును ప్రదర్శించు" అనికోరగా ఆవిప్రకుమారుడు శాస్త్రజ్ఞానంవల్ల చక్కని విమానమును నిర్మించి, అందులో హరిస్వామిని ఎక్కించుకొని స్వర్గాదిలోకములు తిరిగినాడు. విమానయానము ముగిసినతరువాత ఇద్దరూ దిగి వచ్చినారు. హరిస్వామి పొంగిపోయి సోమప్రభను అతనికే ఇస్తానని మాట ఇచ్చి ఏడవ దినమున వివాహము జరుగుతుం దని చెప్పినాడు. అప్పుడే ఉజ్జయినిలో మరొకబ్రాహ్మణుడు వచ్చి "నేను శస్త్రాస్త్రవిద్యాప్రవీణుణ్ణి" అని చెప్పగా దేవస్వామి అతని శస్త్రపాండిత్యము ప్రదర్శించవలసిం దని కోరినాడు. ఆవిప్రుడు నిజవిద్యాప్రభావము చూపగా దేవస్వామి సంతోషించి ఏడవరోజున వివాహానికి రమ్మని అతనితో చెప్పినాడు. సోమప్రభ కోసము ఆమెతల్లిదగ్గిరికి ఒకవిప్రుడు వెళ్ళి 'నేను మీఅమ్మాయిని పెళ్ళిచేసుకోడానికి వచ్చాను' అని పలికినాడు. 'మాఅమ్మాయిని పెళ్ళాడేందుకు నీవు జ్ఞానివా! వీరుడవా? పండితుడవా" అని తల్లి ప్రశ్నించగా "నేను జ్ఞానిని" అని సమాధానము చెప్పినాడు. అప్పుడు సోమప్రభ తల్లి 'నీవు జ్ఞాని వైనపక్షములో భూతభవిష్యత్తులు చెప్పు" అని కోరగా అతడు భూతభవిష్యత్తులు చెప్పినాడు. ఆమె సంతోషించి నాటికి ఏడవరోజున అతనిని వివాహానికి రమ్మన్నది. మరునాడు హరిస్వామి భార్యాపుత్రులకు తాను చేసిన వాగ్దానము తెలియచేసినాడు. ఒకరికి తెలియకుండా ఒకరు ముగ్గురు విప్రులకూ కన్యను ఇస్తామని మాట ఇచ్చినారు. ముగ్గురువరులూ ఒకనాడే వచ్చినారు. హరిస్వామికి మతిలేక విచారిస్తున్నాడు. వరులు ఇంట్లో ఉండగానే ఒక

అద్భుతం జరిగింది. ఆకన్య ఎక్కడికి వెళ్ళిందో ఏమో తెలియలేదు. అతడు బెంగపెట్టుకొని జ్ఞానిని "జ్ఞానీ! నాకుమార్తె ఎక్కడ ఉన్నదో చెప్పు" అని అడిగినాడు. జ్ఞాని "నీ కుమార్తెను ధూమశిఖుడనే రాక్షసుడు ఎత్తుకొనిపోయి వింధ్యారణ్యంలో తనఇంట్లో దాచినాడు" అని సమాధానము చెప్పినాడు. "అయ్యో, నాకు ఎలా లభిస్తుంది! అమ్మాయికి పెళ్ళి ఎలా చేయను!" అని గగ్గోలుపడసాగినాడతడు. అప్పుడు విజ్ఞాని "భయమెందుకు? మీకుమార్తె ఉన్న చోటికి మనము వెళ్ళిపోదాము" అన్నాడు. విజ్ఞాని శాస్త్రీయమైన దివ్యమువల్ల విమానము నిర్మించి వారిని అందులో ఎక్కించుకొని వింధ్యాటవిలో ధూమశిఖుని ఇంటివద్ద నిలిపినాడు. ధూమశిఖుడు కోపాటోపంతో వారితో పోరు సలిపినాడు. శూరుడు అర్ధచంద్ర బాణప్రయోగంవల్ల రాక్షసుని తల తెంపివేసినాడు. వారు సోమప్రభను విమానములో కూర్చో పెట్టుకొని హరిస్వామి ఇంటికి చేరినారు. సోమదత్తను వివాహ మాడవలెనని ముగ్గురూ లగ్న సమయాన పోట్లాడుకొన్నారు. జ్ఞాని "నేను చెప్పకపోతే మీకు సోమదత్త ఎలా దొరుకుతుంది! అందువల్ల ఈకన్య నాభార్య" అని పలికినాడు. విజ్ఞాని "నేను విమానమే చేయకపోతే సోమదత్తను తీసుకురావడం అసాధ్యం కదా. అందుచేత ఈకన్యను నాకే ఇయ్యవలె" అన్నాడు. అప్పుడు వీరుడు "నేను రాక్షసునితో పోరి, అతన్ని చంపకపోతే ఈకన్య లభించేది కాదు. మీప్రయత్నాలు అన్నీ వ్యర్థమయ్యేవి. అందువల్ల ఈకన్యను నాకు ఇవ్వవలసి ఉంటుంది" అంటూ ముగ్గురూ హోరాహోరీగా తగాదా పెట్టుకొన్నారు. హరిస్వామి కర్తవ్యముతోచక ఊరుకొన్నాడు.

బేతాళుడు త్రివిక్రమసేనునితో అన్నాడు "రాజన్! ఆకన్యను ఎవరి కిస్తే ధర్మమో చెప్పు. చెప్పకపోతే నీతల ఎగిరి పోతుంది" త్రివిక్రమ మహీపతి "ఆకన్యను శూరునకే ఇవ్వక తప్పదు. అతడు ప్రాణాలను

లెక్క చెయ్యక రాక్షసునితో పోరాడి గెల్చినాడు. అతడు కన్యను ఆర్జించిన వీరుడు, జ్ఞాని, విజ్ఞానులు శూరునకు సాధనములుగా పని చేశారు. జగత్తులో గణితవేత్త, వడ్రంగి అన్యుల ఉపకరణాలే కదా'' అని సమాధానము ఇచ్చినాడు. బేతాళుడు రాజు బుజము మీదినుంచి అంతర్ధానమై శింశుపావృక్షాన వేలాడుతున్న శవములో చేరినాడు. శవాన్ని వెతకడానికి రాజు మళ్ళీ శింశుపాతరువుదగ్గరికి వెళ్ళినాడు.

తరంగము: ౮౦

బేతాళకథ: ౬

మరునాడు రాత్రి శ్మశానములో త్రివిక్రమసేనుడు శింశుపావృక్షము నుండి బేతాళాధిష్ఠిత మైన శవమును బుజాన పెట్టుకొని సన్యాసి దగ్గరకు బయలుదేరగా మార్గాయాసము పోగొడుతూ బేతాళుడు కథ ఆరంభించినాడు.

యశఃకేతువు అనే రాజు శోభావతీనగరిని రాజధానిగా చేసుకొని పాలన చేస్తున్నాడు. ఆనగరంలో గౌరీనిలయానికి దక్షిణంగా గౌరీతీర్థ మనే పుష్కరిణి ఉన్నది. ఏటేటా ఆషాఢ శుక్ల చతుర్దశినాడు దేవీ యాత్రోత్సవము జరుగుతుంది. అప్పుడు అనేకమంది యాత్రికలు వచ్చి పుష్కరిణీ జలములో స్నానం చేస్తారు. ఒకసారి బ్రహ్మస్థల గ్రామమునుండి ధవళుడు అనే చాకలివాడు స్నానానికి రాగా, మదనసుందరి అనే అంద్గాల చాకెతస్నానం చేసి వెళ్లిపోతూ ఉంది. ఆపడుచు దాని అందానికి మురిసిన చాకలి వలపుతో ఇంటికి వెళ్ళినాడు. తండ్రి కొడుకు విరహావస్థ కనిపెట్టి 'ఎందుకలా బాధ పడతావు? నీ కోరిక ఈడేరుతుంది. నేను అడిగితే శుద్ధపటుడు తనకుమారిని నీకు ఇవ్వకపోడు. మనమేమీ కులంతక్కువవాళ్ళము కాము'' అని పలికినాడు. తండ్రి హెచ్చరికవల్ల కుమారుడు తిండి తినడానికి సిద్ధపడినాడు. మరుసటి

రోజున తండ్రి కుమారుని వెంటబెట్టుకొని శుద్ధపటునివద్దకు వెళ్లి మదన సుందరి ధవళునికి ఇమ్మని కోరినాడు. శుద్ధపటుడు అందుకు అంగీకరించి కుమారి నిచ్చి ధవళునకు వివాహము చేసినాడు. వివాహానంతరము వరుడు వధువును తోడ్కొని తన గ్రామానికి వెళ్ళినాడు. భార్యా భర్తలు సుఖంగా ఉండగా ఒకసారి ధవళుని బావమరిది వచ్చినాడు. అతడు తల్లిదండ్రుల కోరికమీద బ్రహ్మస్థలగ్రామము వచ్చి అక్కనూ బావనూ తీసుకొని వెళ్ళా లని వచ్చినాడు. అందరూ ఆనాడు షడ్రసో పేతంగా భోజనాలుచేసి శుద్ధపటుని గ్రామానికి ప్రయాణ మైనారు. శోభావతీపురము వెళ్ళే తోవలో దేవ్యాలయము చూచి ధవళుడు అమ్మవారికి పాదాభివందనము చేసి వస్తా నని ఆలయములోకి వెళ్ళి నాడు. 'రిక్తహస్తాలతో నేను గుళ్ళోకి ఎలారాను' అని బావమరిది బైటనే ఉన్నాడు. ఆలయములోని మహిషాసురమర్దనీ స్వరూపమును చూచి ధవళుడు భక్త్యావేశముతో ఉద్రూతలూగుతూ "ఈదేవిని ప్రాణ బలులతో లోకులు కొలుస్తున్నారు" అని తలచి స్వయంగా దేవికి బలి కావాలని ఉవ్విళ్ళూరినాడు. వెంటనే గర్భగృహములో చూడగా ఎవరో బలికై ఉపయోగించిన కత్తి ఉన్నది. ఆకరవాలముతో ధవ ళుడు తన తలను నరుకుకొని దేవికి అర్పించినాడు. ధవళుడు ఎంత సేపటికీ దేవ్యాలయమునుండి రాకపోవడం వల్ల అతని బావమరిది గుళ్ళోకి వెళ్ళి భీభత్సదృశ్యమును చూచినాడు. అతనికీ ధవళునికి పుట్టిన బుద్ధే పుట్టింది. వెంటనే కత్తితో తల నరుకుకొని దేవి పాదాల మోాల వాలినాడు. మదనసుందరి - చాలాసేపు మార్గములో భర్తకై అన్నకై ఎదురుచూచి కన్నులు కాయలు కాయగా దేవ్యాలయము లోకి వెళ్ళింది. తలలు తెంచుకొని పడియున్న భర్తనూ అన్ననూ చూచి విలపిస్తూ మూర్ఛపోయింది. తెలివి వచ్చిన తదుపరి మదన సుందరి లేచి తానుమాత్రము బ్రతికిన ప్రయోజన మే మని తలచి

అమ్మవారితో "దేవీ! సౌభాగ్యము నాకు ప్రసాదించు తల్లీ! అందాల భర్తనూ నాఅన్నగారినీ బలిగా స్వీకరించావా జగజ్జననీ! నాగతి ఏమిటి మాతా? నాశరీరాన్ని వదిలేస్తాను. వచ్చేజన్మలోకూడా నాపతి నాకు లభించే విధం చూడవా?" అని మొరపెట్టుకొన్నది. మదనసుందరి అశోకతరులతతో ఉరిపోసుకొనే వేళ గగనవాణి ఇలా పలికింది. "కుమారీ! బాలిక వైనా నీగుణోన్నతికి మెచ్చినాను. ఉరి వేసుకోకు. నీభర్త మొండెమునకు నీఅన్న మొండెమునకు శిరములు తగిలించు నావరంవల్ల ఇద్దరూ జీవిస్తారు" మదనసుందరి మహానందముతో విధి విలాసము వల్ల హడావిడిలో భర్త మొండెమునకు అన్నగారి తలను, అన్నగారి మొండెమునకు భర్తశిరస్సునూ తగిలించగా ఇద్దరూ సజీవులై లేచినారు. ఒకరు మరొకరికి తమతమ వృత్తాంతములు చెప్పుకొని సంతోషపడినారు. ముగ్గురూ శోభావతీనగరానికి ప్రయాణ మైనారు.

రాజేంద్రా! మదనసుందరి భర్తఎవరు? అని బేతాళుడు త్రివిక్రమ సేనుని ప్రశ్నించినాడు. త్రివిక్రముడు "ఏమొండెమునకు పతిశిరస్సు ఉన్నదో అతడే మదనసుందరికి భర్త. శరీరముకన్న శిరసు ప్రధాన మైనది. శిరసును ఉత్తమాంగము అని వ్యవహరిస్తారు. అందుచేత భర్తశిరసున్న శరీరమును మదనసుందరి భర్తగా స్వీకరించాలి" అని ధర్మనిర్ణయము చెప్పగా బేతాళుడు సంతోషించి యథాప్రకారంగా అంతర్ధాన మైనాడు. త్రివిక్రముడు బేతాళాధిష్ఠితమయిన శవమును తీసుకురావలె నని శింశుపావృక్షముదగ్గరకు వెళ్ళినాడు.

## తరంగము : ౮౧

## బేతాళకథ : ౭

యథాప్రకారంగా త్రివిక్రమసేనుడు శవాన్ని బుజాన పెట్టుకొని నడుస్తూ ఉండగా, శవములో ఉన్న బేతాళుడు కథ ఆరంభించినాడు :

తూర్పుసముద్రతీరాన ఉన్న తామ్రలిప్తినగరమును చండసింహు డనే రాజేంద్రుడు పరిపాలన చేస్తున్నాడు. అతడు పరస్త్రీ విషయంలో పరాఙ్ముఖుడుకాని యుద్ధరంగాలలో కాదు. శత్రులక్ష్మినేకాని పరద్రవ్యమును హరించడు. ఒకసారి సత్త్వశీలుడు అనే రాజపుత్రుడు నగరీ ద్వారముదగ్గర పేదరికముతో బాధపడుతూ, రాజుకు తనసంగతి చెప్పుకొని తన పేలికలు తక్కిన రాజపుత్రులతోపాటు చింపుకొన్నాడు. మహారాజు పేదవాని మొర విన్నప్పటికీ నిశ్చలంగానే ఉన్నాడు. "రాజవంశములో పుట్టిన నా కీ దారిద్ర్య మేమిటని" అన్నానికీ గుడ్డకూ వాచిపోయి సత్త్వశీలుడు రాజసేవమాత్రము విడిచిపెట్టలేదు. అతడు సన్యాసివేషము ధరించి రాజువెంట వేటకు బయలుదేరినాడు. సత్త్వశీలుడు దుడ్డుకర్ర పుచ్చుకొని ముందు గుర్రముమీద వెళ్ళి పోయినాడు. చండసింహుడు కొంతసేపు వన్యమృగాలతో పాటు పరుగెత్తి అలిసిసొలిసి మరొకవనములో అడివిపందితో ప్రవేశించినాడు. అక్కడ అతనికి తోవ కనపడలేదు. సత్త్వశీలుడు ఆకలిదప్పులు మాని అశ్వముమీద వచ్చినాడు. రాజు అతనికి "ఏమోయి మనము వచ్చిన దారి ఎరుగుదువా?" అని అడిగినాడు. చేతులు జోడించి "స్వామీ, ఎరుగుదును" అని సమాధాన మీయగా రాజు "ఇప్పు డెన్ని ఘడియలై ఉండవచ్చు" నని ప్రశ్నించినాడు. అతడు "దేవా, సూర్యుడు నింగి నడుమ నున్నాడు" అనేసరికి రాజు "అలా అయితే ఈసమీపములో దాహము తీరేందుకు మంచినీళ్లు దొరుకుతవేమో చూడు" అని వేడినాడు. సత్త్వశీలుడు సరే అని పొడవుగా ఉన్న తరువు ఎక్కి ఒక యేటిని చూచి దిగి చండసింహుని అక్కడికి తీసుకొనివెళ్ళినాడు. అతడు రాజేంద్రుని గుర్రమును విప్పి జీను తీసి మేత పెట్టి సేద దీర్చినాడు. రాజు స్నానము చేసినతరువాత సత్త్వశీలుడు తన చింపిరి గుడ్డకొంగున ఉన్న ఆమలకఫలములు తీసి కడిగి అతనికి అర్పించి "రాజా, పదేళ్ళ

పాటు నేను ఈ ఉసిరికపళ్లు తింటూ కడుపులో కాళ్లు పెట్టుకొని ముని వ్రతము ఆచరిస్తూ ఉన్నాను" అని చెప్పుకొన్నాడు. రాజు ఆశ్చర్యపడి "నిజంగా నీవు సత్త్వశీలుడవే!" అని పలికి కష్టాల్లో ఉన్న వాళ్ళను కరుణించలేక పోయాను గదా అని లోలోపల విచారించినాడు. రాజు ఉసిరిపళ్ళను తిని మంచినీళ్లు తాగి కొంతసేపు విశ్రాంతి తీసుకొన్నాడు. తరువాత సత్త్వశీలుడు సజ్జీకరించిన హయమును ఆరోహించినాడు రాజు. రాజు ఎంత బతిమాలుకొన్నప్పటికీ వినక అతడు ముందుదారి చూపుతో నడచి రాజపరివారాన్ని కలుసుకొన్నాడు. అందరూ కలిసి తామ్రలిప్తీనగరము చేరినారు. తన ఉపకారానికి ప్రత్యుపకారము జరగదని సత్త్వశీలుడు భావించినాడు. అతడు సన్యాసివేషము మాని చండసింహరాజేంద్రుని పార్శ్వచరుడైనాడు.

ఒకసారి రాజు సింహళద్వీపరాజేంద్రుని కుమార్తెని వివాహమాడ దలచి, కన్య నడిగి రమ్మని సత్త్వశీలుని పంపినాడు. సత్త్వశీలుడు ఇష్టదేవతారాధనము చేసుకొని సముద్రమార్గమున నావలో రాజ ప్రేషితులైన విప్రులతో పయనమైనాడు. నావ నడిసముద్రములో ఉండగా వింతగా బంగారుకొన గల గొప్పటెక్కెము ఆకాశాన్ని ఒరుస్తూ ఉండగా, రంగురంగులపటము గాలికి ఆడుతూ ఉండగా సముద్రములోనుంచి లేచింది. హఠాత్తుగా వానకారు మబ్బులు గుమికూడి జల్లు కురిసింది. ఝంఝామారుతము పెల్లుబికింది. ఆతుపానుకు నావ నడిసముద్రములో మునుగబోగా విప్రులు భయపడి చండసింహుని తలచి రక్షించమని వేడుకొన్నారు. ఆగగ్గోలు లెక్కచేయక సత్త్వశీలుడు చేత్తో ఖడ్గము పుచ్చుకొని సముద్రజలములో దుమికినాడు. తుపాను గాలికి ఓడపై కెగిసి పగిలిపోయింది. నావలోనివారు జలచరములకు ఆహారమైనారు. సముద్రములో మునిగిన సత్త్వశీలుడు దివ్యనగరిని చూచినాడు. మణిమయస్తంభాలతో రత్నఖచితమైన గోడలతో రత్నాల

ధ్వజస్తంభముతో కాత్యాయనీమందిరము అతనికి గోచరమైంది. సత్త్వశీలుడు దేవికి పాదాభివందనము చేసి ఆసీనుడు కాగా, దేవీప్రభా మండలమధ్యమునుండి ఒక సుందరి పరివారసమేతంగా బహిర్గమించి దేవికి మొక్కి తిరిగి ప్రభాపుంజములో ప్రవేశించింది. అతడుకూడా ఆమె వెంటనే దేవీ ప్రభామండలములో ప్రవేశించి దివ్యనగరిని చూచినాడు. అక్కడ రత్నాలశయ్యపై ఆ కన్యకామణి ఆసీన కాగా ఆమెపక్కనే సత్త్వశీలుడు కూర్చుండి ఆమెవదనమున తనచూపులు నాటి చిత్తరువులో ప్రతిమవలె ఉన్నాడు. అతనిహృదయము పొంగిపోగా శరీరము పులకలెత్తగా తరుణిని కౌగలించవలె నని తలచినాడు. ఆసుందరి అతని ఇంగితము కనిపెట్టి చెలికత్తెలకేసి చూచింది. వారు సత్త్వశీలునితో "ఆర్యపుత్ర! మాఅమ్మగారు తమకు ఆతిథ్యము ఇస్తారు. లేచి తమరు స్నానము చేసి భోజనానికి దయచేయ్యండి" అని హెచ్చరించినారు. సత్త్వశీలుడు కన్యమీదిఆశతో లేచి ఉద్యానవాపికలో స్నానార్థము అవతరించగా అకస్మాత్తుగా తామ్రలిప్తినగరిలో చండసింహరాజేంద్రుని ఉద్యానవాపికామధ్యమున తేలినాడు. అతడు తనస్థితి చూచుకొని కలగా ఎంచి 'ఈఉద్యాన మెక్కడ? ఆదివ్యనగర మెక్కడ? అమృత ద్వీపమువంటి ఆరమణీస్పృహణీయవదన మెక్కడ? ఆమెతో వియోగ వేదన ఎలా భరించను" అని తలపోసినాడు. అతడు చండసింహుని ఉద్యానములో వియోగవేదనాశ్రువులు కురిపిస్తూ మతిలేక తిరుగుతూ ఉండగా ఉద్యానపాలకులు రాజేంద్రునితో విన్నవించారు. విరహానల కీలలవలె గాలికి రేగిన పూవులపుప్పొడి అతని శరీరమునిండా కమ్ముకొన్నది. మహారాజు సత్త్వశీలుని చూచి ఆదరించి "మిత్రమా, ఎక్కడికి వెళ్ళినావు? ఎక్కడికి చేరినావు? సంగతి యావత్తూ పూస గుచ్చినట్టు చెప్పవలసిం" దని కోరినాడు. సత్త్వశీలుడు నిజాన్ని కప్పిపుచ్చక నిజవృత్తాంతము పలికకు నివేదించినాడు. రాజు "నాపుణ్యము

వల్ల ఇతడు విరహము అనుభవిస్తున్నాడు. ఇతని ఋణము తీర్చుకో వల్నే. ఇతని విరహము తీరేపద్ధతి యోచించవలె" అని తలపోసి "మిత్రమా; విచారపడకు. ఆసుందరి దరి చేరుస్తాను. నీవిరాళి శమిస్తుంది" అని ఆదరించి స్నానాద్యుపచారాలు ఏర్పాటు చేయించినాడు.

మర్నాడు మహారాజు రాజ్యభారమును సచివులకుఅప్పగించి సత్త్వశీలునితో నావపై ప్రయాణము సాగించినాడు. సముద్రమధ్యమున బంగారు టెక్కెముతో స్తంభము యథాపూర్వంగా పైకి వచ్చినది. సత్త్వశీలుడు దానిని రాజేంద్రునకు చూపి "రాజన్! ఇక్కడే నీటిలో నేను మునుగుతాను. ఆ తర్వాత మీరు సముద్రజలములో ప్రవేశించండి" అని చెప్పి అతడు సముద్రములో దుమికినాడు. కొంత సేపటికి చండసింహుడు కూడా సముద్రోదకములో ప్రవేశించినాడు. ఇద్దరూ దివ్యనగరి చేరి కాత్యాయనీ మూర్తిని దర్శించినారు. వారు విశ్రాంతి తీసుకొనేలోగా దేవీ ప్రభామండలమధ్యనుండి దివ్యాంగన చెలికత్తెలతో నిర్గమించి దేవికి పూజాపునస్కారములు చేసింది. ఆ లావణ్యమయి చండసింహుని ఉజ్జ్వలాకృతిని కన్నులారా చూచి అతడు మహానుభావు డని తలచింది. ఆ కన్య దేవికి పాదాభివందనము చేసి తనకు మంచి మగని ఇమ్మని ప్రార్థించి గర్భాలయమునుండి బైటికి వచ్చి చెలికత్తెలను పిలిచింది: మహారాజు .సత్త్వశీలునితో ఉద్యానములో విహారార్థము వెళ్ళినాడు. ఆయన కనపడకపోవడంవల్ల ఆ రమణి 'చెలీ! ఆమహాపురుషుడు ఎక్కడ ఉన్నాడో చూడవే! అతన్ని పిలిచి ఆతిథ్యము ఇవ్వాలి" అని చెప్పి పంపింది. చేటిక రాజేంద్రుని దర్శించి సవినయంగా చెప్పవలసింది చెప్పింది. రాజు నిర్లక్ష్యంగా "మాకు ఇదే ఆతిథ్యము. ఇంతకన్న ఉపచారాలతో నిమిత్తములేదు" అని పలికినాడు. చేటి వెళ్ళి రమణితో మనవిచేయగా ఆమె స్వయంగా రాజును తీసుకొని వెళ్ళవలెనని ఉద్యానములోనికి వెళ్ళింది. ఆవనీస్థలి శకుంతముల కూజితాలతో, పవమాన సంచలచ్ఛాఖ

కలతో, పుష్పపరాగముతో కన్యాప్రయత్నమును అభినందిస్తున్నట్లు న్నది. సవినయంగా ఆకన్య చండసింహుని సమీపించి తన ఆతిథ్యాన్ని స్వీకరించ వలసిం దని వేడుకొన్నది. రాజేంద్రుడు సత్త్వశీలుని చూపుతూ "ఇతని సాహాయ్యమువల్ల నేను దేవీదర్శనము చేసుకోగలిగి నాను. నిన్ను చూచినాను. ఇంతకన్న వేరే అతిథిపూజ అవసరము లేదే!" అని బింకముతో పలికినాడు. అసురకన్య 'మహానుభావా, అలా అయితే త్రిలోకాల్లో లేని అద్భుతమైన నా నగరిని మరొకదానిని చూపుతాను. దయచేయండి" అంటూ ఆహ్వానించింది. రాజు "నేను ఎరుగుదును. స్నానముచేసే దిగుడుబావి గల నగరమేనా!" అని పలికినాడు. "దేవా! అలా అనకండి. నేను మోసగించను. పూజ్యుల విషయములో మోసమా! మీ సాత్త్వికశక్తి వల్ల నేను చరణదాసి నైనాను. నాకోర్కె తోసివేయక రండి" అని వేడింది. మహారాజు మాట తీసివేయక అంగీకరించి సత్త్వశీలునితో దేవీప్రభామండల సన్నిధికి వెళ్ళినాడు. ఆ కన్య ప్రభాపుంజములో ద్వారము తెరిచింది. ఇద్దరూ ఆమెను అనుసరించి లోనికివెళ్ళగా దివ్యనగరి వారికి గోచరించింది. ఆ నగరములో నిత్యమూ అన్నిఋతువుల పువ్వులూ ఫలాలూ ఉంటవి. ఆ నగరి మేరువు నెత్తమువలె ప్రకాశిస్తున్నది. ఆ సుందరి రాజేంద్రుని తన పర్యంకతలాన ఆసీనుని చేసి అర్ఘ్యపాద్యాదులు అర్పించి ఇలా అన్నది: "నేను కాలనేమి అనే అసురేంద్రుని కుమార్తెను. చక్రాయుధుడు నాతండ్రిని కడతేర్చి స్వర్గలోకములో చేర్చినాడు. విశ్వకర్మ నాతండ్రికోసం ఈ రెండు దివ్యనగరాలను సృజించినాడు. మనోరథాలు ఈ సీమలలో ఈడేరుతవి. ఇక్కడ జరామృత్యువులు లేవు నాకు నీవు తండ్రివి. నేను నీ వశములో ఉన్నాను."

రాజు "కన్యామణీ! నేను నిన్ని సత్త్వశీలుడైన రాజపుత్రునకు ఇస్తున్నాను." అని పలికినాడు. ఆకన్య సత్త్వశీలుని భర్తగా స్వీకరించింది.

మహారాజు వారిద్దరికీ వివాహముచేసినాడు. అప్పుడు ఆయన "మిత్రమా నీ ఆమలక ఫలములు రెండిటిలో ఒకదాని ఋణము మాత్రమే తీర్చుకొన్నాను. రెండోదానిఋణముకూడా తీర్చుకొంటాను." అన్నాడు. మహారాజు నిజనగరానికి దారి చూపవలసిందని అసురభామను కోరగా, ఆమె రాజుకు అపరాజితమనే ఖడ్గమూ, జరామృత్యుహారమైన ఫలమునూ అర్పించింది. వాటిని పుచ్చుకొని రాజు ఉద్యాన వాపీజలములో మునిగినాడు. వెంటనే చండసింహుడు నిజోద్యాన వాపీజలములో తేలి కోరికలు ఈడేరగా సుఖంగా ఉన్నాడు.

బేతాళుడు 'త్రివిక్రమా! రాజసత్త్వశీలురలో ఎవరు సత్త్వాధికుడు?' అని ప్రశ్నించినాడు. త్రివిక్రమసేనుడు "ఇద్దరిలో సత్త్వశీలుడే సత్త్వాధికుడు. నిస్పృహతో అతడేకదా సముద్రోదకములో దుమికినవాడు. ఆశతో దిగినవాడు చండసింహుడేకద. రాజు దైత్యకన్య కోరికలకు దొరకదని కోరలేదు" అని సమాధానమిచ్చినాడు. బేతాళుడు యథాప్రకారంగా అంతర్ధానమై శింశుపాతరులంబిత శవదేహములో ప్రవేశించినాడు. రాజు శవమును మోసితేవాలని శింశుపావృక్షముదగ్గిరికి వెళ్ళినాడు.

## తరంగము: ౮౨

## బేతాళకథ: ౮

యథాప్రకారంగా త్రివిక్రమసేనుడు శవమును బుజాన మోసి తెస్తున్నప్పుడు వినోదార్థముగా బేతాళుడు కథ ఆరంభించినాడు. పూర్వము ఉజ్జయినీ నగరాన్ని వీరదేవుడు పరిపాలిస్తూ ఉండేవాడు. అతని భార్య పద్మరతి. ఆ దంపతులకు సంతానము లేకపోవడంవల్ల ఇద్దరూ మందాకినీ తీరానికి వెళ్లి చిరకాలము తపస్సుచేసి మహేశ్వరుని మెప్పించినారు. ఈశ్వరార్చనానంతరము ఆదంపతులకు గగనవాణి వినబడింది. ఆ వాణి చెప్పినప్రకారము పద్మావతికి శూరదేవుడు అనే పుత్రుడు, అనంతరము

౭

అనంగవతి అనే కుమారి జన్మించినారు. ఆ అందాలరాశికి వివాహము చేయవలెనని తండ్రి సంకల్పించి ఎన్నో సంబంధాలు చూస్తున్నాడు. ఆయన రాజపుత్రులు చిత్తరువులు తెప్పించి కుమార్తెను చూడమని చెప్పినాడు. ఆ కన్యకు ఏ రాజకుమారుడూ నచ్చలేదు. తండ్రి స్వయం వరము ఏర్పాటుచేస్తా నన్నాడు. కుమార్తె స్వయంవరానికి అంగీకరించక 'తండ్రీ! అందమైనవాడు చదువుకున్న వాడు, పడుచువాడు నాకు వరుడుగా కావాలి. అంతకన్న అధికం కోరను'' అన్నది. మహారాజు దేశ దేశాలవారికి కబుర్లు పంపినాడు. దక్షిణదేశమునుండి నలుగురు వీరులు విజ్ఞానులు సుందరులు వచ్చినారు. వారిలో ఒకడు శూరుడు. అతని పేరు పంచపట్టికుడు. అతడు దినదినమూ అయిదు పంచలచాపులు నేస్తాననీ, ఒకటి భగవంతునికీ, ఒకచాపు విప్రునికీ, మరోచాపు తనకూ, ఇంకొకటి భార్యకూ మిగిలినచాపు విక్రయించి జీవిస్తాననీ చెప్పగా అనంగ రతి అతన్ని వరించింది. రెండోవాడు వైశ్యుడు. అతడు జంతువుల భాషలన్నీ తెలిసిన పండితుడు. అతడు అనంగరతిని కోరినాడు. మూడోవాడు ఖడ్గధరుడు అనే క్షత్రియవీరుడు. అతడు కన్యను అడిగినాడు. నాలుగో వాడు జీవదత్తుడనే విప్రుడు. అతనికి అన్ని ఇంద్రజాలవిద్యలూ తెలుసును. ఆవిప్రుడు అనంగరతిని కోరినాడు. కన్యను ఎవరికి ఇవ్వవలెనో తోచక రాజు ఆందోళనపడినాడు. బేతాళుడు 'రాజన్! అనంగరతికి తగినవరుడు ఎవడు?'' అని ప్రశ్నించినాడు. త్రివిక్రమసేనుడు "ఆమెకు తగినవాడు క్షత్రియుడే. శూద్రునికీ పాలెవానికీ రాజకన్యను ఎలాఇస్తారు? '' అని సమాధానముచెప్పగా బేతాళుడు అంతర్ధానమైనాడు. శవమును తీసుకు రావలెనని త్రివిక్రమసేనుడు శింశుపావృక్షము దరికి వెళ్లినాడు.

తరంగము : ౧౩

బేతాళకథ : ౯

త్రివిక్రమసేనుడు శవమును మోసుకొని పోతున్న సమయములో బేతాళుడు అతనిశ్రమ పోగొడుతూ కథ మొదలుపెట్టినాడు.

అంగదేశములో వృక్షపుటాగ్రహారములో విష్ణుస్వామి అనే ధనిక సోమయాజికి అనుకూలమైన భార్యవల్ల ముగ్గురుకుమారులు కలిగినారు. ఒకసారి సోమయాజి యజ్ఞము తలపెట్టి తదర్థమై తాబేలు తెమ్మని పుత్రులను పంపినాడు. ముగ్గురూ మున్నీటిదరికి వెళ్లి ఒకతాబేలును సంపాదించినారు. పెద్దవాడు చిన్నవాళ్ళతో "నాన్నగారు చేస్తున్న యాగానికి మీఇద్దరిలో ఎవరో ఒకరు తాబేలు మోసి తీసుకొని వెళ్ళవలె" నని పలికినాడు. తాబేలు దుర్వాసనకొడుతూ ఉండడంవల్ల పెద్దవాడు తీసుకొని వెళ్ళలేకపోయినాడు. తమ్ముళ్ళుఇద్దరూ నీకు ఎలారోతగా ఉందో, మాకూ అలాగేవుంది." అని పలికినారు. అన్న "మీరుతాబేలును తీసుకువెళ్ళకపోతే నాన్నగారి యాగము భంగమవుతుంది. పాపఫలము మీరు అనుభవించాలి. నరకానుభవము తప్పదు" అంటూ మందలించినాడు. సోదరులు నవ్వుతూ "నీవుచెప్పిన ధర్మము మాకే కాదు నీకూ వర్తిస్తుంది" అని పలికినారు. "అలా అంటారేమిటి ? నా నేర్పు మీరు ఎరగరా? రోతవస్తువును బొత్తిగా ముట్టలేను" అని అన్న తిరిగి చెప్పినాడు. అప్పుడు మధ్యముడు "నేను నీకన్న రెండాకులు ఎక్కువ. నీవు తిండినేర్పరివి, నేను స్త్రీ నేర్పరిని" అని సమాధానము ఇవ్వగా, కడసారపువాడు కనుబొమ్మలు ముడిచి "మూర్ఖులారా! నేను పడకనేర్పరిని. మీఅందరికన్న మిన్నను" అంటూ తగాదా పెట్టినాడు. ముగ్గురూ బాహాబాహి కలహించుకొని తాబేలును అక్కడ పారవేసి, ఆ సమీపములో విటంకపురాన్ని ఏలుతున్న ప్రసేనజిత్తుదగ్గిరికి వెళ్ళి వచ్చినపని చెప్పుకొన్నారు.

రాజు ముగ్గురినీ పరీక్షించ దలచినాడు. అతడు భోజనవేళ వారిని అగ్రభోక్తలుగా కూర్చోబెట్టి స్విష్టకృత్తుగా కంఠదఘ్నంగా భోజనము పెట్టినాడు. అందరూ తిండి తింటూఉంటే భోజనచంగుడు అసహ్యపడుతూ రెండుమెతుకులుకూడా ముట్టలేదు. రాజు 'విప్రోత్తమా!

సువాసనగా కమ్మగా ఉన్న భోజనము చెయ్యవేమి!" అని ప్రశ్నించి నాడు. అప్పు డా విప్రుడు ముక్కు బిగపట్టుకొని కూర్చున్నాడు. రాజుకు నాకర్లవల్ల బియ్యము మంచివి కావనీ వల్లకాటిదరి చేనిలో పండిన వనీ తెలిసింది. రాజు తెల్లపోయి "నిజంగా నీవు చంగుడవే" అని స్తుతి చేసినాడు. అప్పుడు రాజు విప్రునకు సుష్టుగా వేరే దివ్యమైన భోజనము పెట్టినాడు. భోజనానంతరము రాజేంద్రుడు విప్రులను శయనాగారములకు పంపి తన ఉపపత్ని సుందరిని రెండోవాని దగ్గిరికి పంపినాడు. రాజసేవకులు వెంట రాగా ఆరమణి ముఖము వెన్నెల కాయగా, మదనుని నారాచమువలె మెరుస్తూ నారీచంగుడు వేచిఉన్న పడకగదిలో ప్రవేశించింది. వెంటనే నారీచంగుడు మూర్ఛపోయినాడు. అతడు లేచి ముక్కుమూసుకొని వారకాంతను తీసుకొని పొమ్మని రాజ సేవకులకు చెప్పినాడు. అతని చేష్టలను చూచిన గణిక తెల్లపోయింది. సేవకులు వారకాంతను తీసుకొని వెళ్ళి రాజుకు మనవి చేసుకొన్నారు. రాజు నారీచంగుని రప్పించి "విప్రోత్తమా! ఈగణికామణి శరీరము చందనాగురు ఘనసార చర్చితమై పరిమళాన్ని గుబాళిస్తూ ఉంటే మేక వాసన ఎక్కడిది?" అని అడిగినాడు. నారీచంగుడు "లేదుప్రభూ! ఈ వేశ్య బాల్యములో తల్లీ దాదీ లేక మేకపాలతో పెరిగింది" అని తెలియ చెప్పినాడు. అందరూ ఆశ్చర్యపడి అతనిని మెచ్చుకొన్నారు. ఆద్భుగుణీకృతోత్సాహముతో వారు తూలికాచంగునికి శయ్యపైన ఏడుపరుపులు ఒకదానిమీద ఒకటి పరిపించి, పైన తెల్లని దుప్పటి కప్పి పడక సిద్ధముచేసినారు. నడిరాత్రి తూలికాచంగుడు శయ్యమీద పరుండ లేక, శరీరము నొప్పిగా ఉందని కళ్ళనీళ్లు పెట్టుకొన్నాడు. సమీపములో ఉన్న రాజసేవకులు అది గమనించి అతని తల్పముమీద వక్రంగా ఎర్రగా తలవెంట్రుక వాసిగా ఉన్న ఒక ముద్రను చూచి రాజు దగ్గరకు వెళ్ళి మనవి చేసినారు. రాజు ఆనతిప్రకారం సేవకులు

శయ్యమీాదఉన్న పరుపులన్నీ వెతికి తల వెంట్రుకను కనిపెట్టి రాజుకు తూలికాచంగుని దేహపార్శ్వమున ఉన్న ముద్రకు ఆకేశలేశము సరిపోవడము చూవగా "ఏడుపరుపులకిందఉన్న వెంట్రుక ఇతని శరీరాన్ని ఒత్తుకొన్నది. ఎంత సుకుమారుడో గదా!" అని రాజపరమిత్యాశ్చర్యమగ్నుడైనాడు. మరునాడు మహారాజు ముగ్గురు బ్రాహ్మణుల చాకచక్యము గ్రహించి ముగ్గురికీ మూడులక్షల బంగారు నాణెములు కానుకగా ఇచ్చినాడు. బ్రాహ్మణులు తండ్రి తీసుకురమ్మని చెప్పిన తాబేటిసంగతి మరిచి తాతపాదులయాగాన్ని ధ్వంసము చేసిన పాతకాన్ని ఒడిగట్టుకొన్నారు. వారు సుఖంగా అక్కడే ఉంటున్నారు. బేతాళుడు "రాజన్! ముగ్గురిలో ఎవడు గొప్పవాడని నీమతం?" అని త్రివిక్రమసేనుని ప్రశ్నించినాడు. బుద్ధిశాలి అయిన రాజేంద్రుడు బేతాళా! ముగ్గురిలో తూలికాచంగుడు నిష్కపటి. అతడు కేశస్పర్శవల్ల శరీరము ఒత్తుకొంటున్నదని ఎంత సుకుమారంగా గ్రహించాడు! కడమ విప్రులు ఉపాయాంతరాలవల్ల చాకచక్యంగా ప్రవర్తించినారని చెప్పవచ్చును" అని సమాధానము ఇచ్చినాడు. బేతాళుడు యథాప్రకారంగా అంతర్ధానమై పోగా అతన్ని పట్టి తీసుకురావలెనని త్రివిక్రమసేనుడు శింశుపాతరువు దరికి వెళ్ళినాడు.

తరంగము: ౮౪

బేతాళకథ: ౧౦

త్రివిక్రమసేనుడు బేతాళుని బుజాన ఎక్కించుకొని తాపసునివద్దకు ప్రయాణముకాగా, శ్రమాపనోదార్థము బేతాళుడు కొత్తకథ ఆరంభించినాడు.

పూర్వము వీరబాహువు అనే రాజు పరిపాలిస్తున్న అనంగపురంలో అర్థదత్తుడనే మహాధనికుడు ఉండేవాడు. అతనికి ధనదత్తుడనే సుతుడూ

మదనసేన అనే కూతురూ ఉన్నారు. ఆకన్య ఉద్యానవనిలో విహారము చేస్తున్నపుడు ఆమె అన్నగారి మిత్రుడు ధర్మదత్తు డనే వైశ్యుడు చూచినాడు. ఆరమణీ సౌందర్యమును చూచే చూడడంతో. ధర్మదత్తుడు మదనుని బాణానికి గురిఅయినాడు. అతనికి ప్రథమవీక్షణములో వలపు తల కెక్కింది. అతడు చాలా సేపు ఆకన్న సొబగు రెప్పలు అప్పళించక తనివితీర చూచినాడు. సాయంకాల మైనది. చీకటి పడినది. క్రమేణ చంద్రోదయ మవుతున్నప్పుడు ధర్మదత్తుడు ఇంటికివెళ్ళి మదనసేన నామాన్ని జపిస్తూ శయ్యమీద కూర్చుండి చంద్రకిరణ స్పర్శను సహించలేకపోయినాడు. బంధువులు ఎంతమంది పలకరించినా మదనపిశాచావేశపరవశు డైన ఆధనదత్తుడు పల్లెత్తుమాట ఆడలేదు. రాత్రి ఎలాగో అతనికి నిద్రపట్టింది. స్వప్నంలో అతడు వనవిహారంలో ఏకాంతంగా ఉన్న ప్రియకామినిని కౌగలించవలెనని కాంక్షతో వనమునకు వెళ్ళి కామిని చరణాలమీద వాలినాడు. అతన్ని చూచి ఆకన్న "నేను నీకు పరదారను. నాతండ్రి నన్ను సముద్రదత్తునికి వాగ్దానం చేసినాడు. తాంబూలాలు పుచ్చుకోడం అయింది. త్వరలో నాకు మూడుముళ్ళూ పడతవి. వెళ్ళిపో, ఎవరైనా చూస్తే అప్రతిష్ట" అని పలికింది. అతడు విరాళికిసోలి ఏమయితే అది అవుతుంది. నీవులేని జీవితం నిష్ఫలం. నేను చనిపోతాను" అని దీనంగా సమాధానము చెప్పినాడు. తన్ను బలాత్కరిస్తాడేమోనని మదనసేనఅన్నది. "అలాఅయితే నావివాహం కానీ, తరువాత మనంకలుసుకోవచ్చు. మొదట నాతండ్రికి కన్యాదాన ఫలం దక్కనియ్యి. నీప్రేమవల్ల నన్ను లోకువ చేసుకొన్నావు" అన్నది. ధర్మదత్తుడు గొంటుతనంగా "వాసనచూచి వదలివేసిన కుసుమాన్ని మళ్ళీ ఆఘ్రాణించడమేమిటే?" అని ప్రశ్నించినాడు. అప్పుడు మదనసేన "అలాఅయితే నేను పెళ్ళయినా భర్తృస్పర్శలేకుండా గడిపి, తరువాత నిన్ను కలుస్తాను. మనఇద్దరం కలుసుకొన్నాకనే నేను భర్తతో కాపరం చేస్తాను" అని

అతన్ని సముదాయించింది. చేతిలో ఆమెను చేయి వేయుచున్నాడు. అలాగే ఆమె ఒట్టుపెట్టింది. వివాహ కాలంలో సుముహూర్తము గడిచింది. పగలల్లా మంత్రతంత్రాలూ భోజనాలూ ఉత్సవాలూ ఊరేగింపులతో సరిపోయింది. రాత్రి శయ్యాగారంలో భర్తతో శయ్యమీద ఉన్నప్పటికీ భర్తస్పర్శ తప్పించుకొని అనవోధ కన్నీళ్ళు పెట్టుకొన్నది. భర్త "ఎందుకలా విచారంగా ఉన్నావు!" అని వేడినాడు. కొంతసేపటికి అను నయమువల్ల లాభం లేదని అతడు "సుందరీ! నేనంటే వెగటుగా ఉంటే నీకు ఎవరు ఇష్టుడో అక్కడికే వెళ్ళు" అని పరుషంగా పలికినాడు. ఆమె తలవాల్చి "ఆర్యపుత్రా, నీవు నాకు ప్రాణసమానుడవు. ఒట్టువేస్తే నామనవి నీకు చెప్పుకోవాలి" అన్నది. భర్త తల ఊపి సరే నన్నాడు. "పూర్వం నేను మాఉద్యానవనంలో విహారము చేస్తున్నప్పుడు ధర్మదత్తు డనే నాఅన్నగారి స్నేహితుడు నన్ను చూచి అడ్డుపడి కౌగలించు కొంటానని పలికినాడు. అతడు ఇబ్బంది చేయగా, నాతండ్రి కన్యాదాన ఫలం నిష్ఫలం అవుతుందని గ్రహించి, వివాహం అయినతరువాత అతన్ని కలుస్తానని చెప్పినాను. నాకు నీసెలవయితే వెళ్ళివస్తాను." అని పలికింది.

తల్పముమీద పరున్న భర్త ముఖంలో రక్తం చుక్కలేదు. నిలువునా నీరై అతడు 'ఈకులటకోసం నేను పట్టుపట్టడం వ్యర్థం' అని మదనసేనను పోనిచ్చినాడు.

మదనసేన వనంలో సంకేతస్థానంలో కనిపెట్టుకొన్న ధర్మదత్తుని కలుసుకోవలె నని వెడుతున్నది. తోవలో దొంగ ఆమె అభిసారానికి అడ్డు వచ్చి "నేను చోరుణ్ణి. నన్ను ఎలా తప్పించుకొంటావు? ఎక్కడికి ఆవెళ్ళడం!" అని ఆపినాడు. ఆమె నవ్వుతూ తనమెడలో హారము తీసి ఆతని కిచ్చింది. ఆచోరుడు హారము పుచ్చుకోక "ముద్దరాలా! నీ ఆభరణాలు నాకెందుకు! నీఅందచందాలు, నీవు కావలెగాని తక్కినవెందుకు?"

అని సమాధాన మిచ్చినాడు. మదనసేన తాను వెళుతున్నపని చెప్పి "స్వామ్యుడా! కొంతసేపు తాళు. తిరిగివచ్చి నిన్నుకలుస్తాను" అని ధర్మదత్తునిదగ్గిరికి వెళ్ళింది. ఏకాంతంలో పడుచు లభ్యమైనది కదా అని అతడు వేగిరపడక తమకము కట్టిపెట్టి "రమణీ, నీసత్యనిరతికి మెచ్చుకొన్నాను. నీవుపరదారవు. పరదారగ్రహణం పాపహేతువు. వచ్చిన దారినే వెళ్ళిపో" అని హెచ్చరించినాడు.

మదనసేన నవ్వుతూ ఇంటికి బయలు దేరింది. తోవలో చోరుడు ఆమెకు ఎదురై "నామాట ఏమంటావు?" అని వేడినాడు. ఆమె జరిగిన విషయం సవిస్తరంగా చెప్పగా చోరుడు "అలా అయితే నీసత్యసంధతకు నేనూ మెచ్చుకొన్నాను. ఆభరణాలతోపాటు నిన్ను వదిలివేస్తున్నాను" అని ఉత్సాహంతో పలికినాడు. శీలము అల్లరిపాలు కాకుండా మదనసేన రహస్యంగా భర్తదగ్గిరికి వెళ్ళింది. వాడిపోని ఆమె అందాలను చూచి భర్త గ్రహించి 'నాపత్ని మహాసాధ్వి' అని నిశ్చయించుకొని కాపురము చేస్తున్నాడు.

బేతాళుడు "రాజన్, సముద్రదత్త, చోరదత్త ధర్మదత్తులలో ఎవరు గొప్పత్యాగి? అని ప్రశ్నించగా త్రివిక్రమసేనుడు "అందరిలో మహాత్యాగి, చోరుడే. వైశ్యులు ఇద్దరూ కానేకారు. కులీనుడు పరదారను ఎలాస్వీకరిస్తాడు? అదీగాక ధర్మదత్తుడు సముద్రదత్తునివల్ల భయపడి, రాజదండనకు వెరిచి మదనసేనను వదలినాడు. చోరుడు ఎవరినీ లక్ష్యం చెయ్యక వ్యవహరించేందుకు వీలు ఉన్నప్పటికీ మదనసేనను వదలినందువల్ల, అతడే మహాత్యాగి" అని సమాధాన మిచ్చినాడు. బేతాళుడు వెంటనే అంతర్ధాన మైనాడు. అతన్ని పట్టి తీసుకురావలెనని త్రివిక్రమసేనుడు మళ్ళీ శింశుపావృక్షముదగ్గిరికి వెళ్ళినాడు.

## తరంగము : ౧౭

## బేతాళ కథ : ౧౧

యథాపూర్వము త్రివిక్రమమహీపతి శ్మశానములో బేతాళుని బుజాన పట్టుకొని శ్రమణునివద్దకు వెడుతూఉండగా మార్గాయాసము పోగొట్టదలచి, బేతాళుడు రాజుకు కథ చెవుతున్నాడు :

పూర్వము ఉజ్జయినీ నగరిని ధర్మధ్వజు డనే మహారాజు పరిపాలిస్తూ ఉండేవాడు. ఆయనకు అతివల్లభ లైన ఇందులేఖ, తారావళి, మృగాంకవతి అనే దేవేరులు ఉండేవారు. ముగ్గురి చక్కదనాన్నీ చిదిపి దీపము పెట్టవచ్చును. శత్రువులను సంహరించి రాజేంద్రుడు రాణుల యందు అనురక్తితో అఖండభోగములు అనుభవిస్తూ ఉన్నాడు. అలా ఉండగా వసంతాగమములో మహారాజు దేవేరులతో విహారార్థము ఉద్యానవనికి వెళ్ళినాడు. ఆమని మన్మథునికి తుమ్మెదబారులనారిని, వంగిన పూలతీగెలవిండ్లను సిద్ధముచేసింది. కోయిలలు చిగిర్చిన కొమ్మల కొసలనుండి మనోభవుని ఆజ్ఞను పలుకుతున్నవి. రాజచంద్రుడు కోకిలల కూజితాలవల్ల మన్మథాజ్ఞలను వింటూ, మహేంద్రుని వలె భోగరతుడై కాంతలతో మధువు ఆరగించినాడు. అతడు ప్రియాముఖోచ్ఛ్వాస వికంపితమై ప్రియాపీతావశేష మయిన ఆసవమును తాగుతూ క్రీడారసములో మునిగి తేలుతూ ఉన్నాడు. రాజచంద్రుడు ప్రణయ సందర్భములో ఇందులేఖశిఖ పట్టుకోగా, చెవిని వేలాడుతున్న నల్ల కలువ జారి ఆమెతొడపై పడ్డది. ఆకోమలి జానుప్రదేశము కలువ వల్ల గాయమైంది. సఖులు చల్లనినీరు తెచ్చి ఆమె తొడపైన చిలకరించినారు. శీతోపచారాలు పూర్తిచేసి, మహారాజు ప్రియకామినిని ఉజ్జయినికి పంపి వైద్యము చేయించి గాయానికి కట్టు కట్టించినాడు. క్రమేణా మహారాణి ఉపశాంతి అనుభవిస్తున్నది. ఆరాత్రి రాజేంద్రుడు

తారావళితో ధవళప్రాసాద మెక్కి విహరిస్తున్నాడు. ఆకోమలాంగి వల్లభునితో ఏకశయ్యలో చీర తొలిగిపోయి నిద్రిస్తూ ఉండగా, గవాక్షమునుంచి శీతలచంద్రకిరణావళి సోకగా, చప్పున ఆమెకు మెళుకువ వచ్చింది. "అబ్బ, నాశరీరం కాలింది." అంటూ శయ్యమీదినుంచి తారావళి కళ్లు నలుపుకొంటూ లేచింది. మహారాజు నివ్వెరపడి "ఎంత సుకుమారివి తారా! చల్లనికాంతులకే నీశరీరం కాలిపోయింది! ఎంత చిత్రము" అని పలికి ఆమెతనువుపైన ఉన్న బొబ్బలు చూడలేక పోయినాడు. తారావళి మంటలకు తాళలేక కన్నీరు కారుస్తున్నది. సఖీమణులు వచ్చి చల్లనినీటితుంపురులతో నింపిన తామరాకుదళాలతో రాణికిశయ్యఏర్పాటుచేసినారు. వారామెకు(శ్రీఖండార్ద్ర)లేపముపూసినారు.

ఆసంగతి తెలిసిన మూడవరాణి మృగాంకవతి నిజమందిరమునుంచి బయలుదేరి సడిలేని నడిరేయి రాజసన్నిధికి రాబోగా, దూరమునుంచి వడ్లదంపు రోకళ్ళసవ్వడి విన్నది. వినీవినడంతో మృగాంకవతి "అబ్బా చచ్చాను" అని చేతులు జాడిస్తూ బాధకు తట్టుకోలేక చప్పున చతికిల పడింది. పరివారసఖీజనము ఆమెను లేపి చేతులు పట్టుకొని మెల్లిగా నడిపించుకొని పోయినారు. ఆమె తల్పముమీద వెన్ను వాల్చింది. వారందరూ ఆమె హస్తములు పరిశీలించగా తామరపువ్వులమీద వాలిన తుమ్మెదలవలె ఉన్నబొబ్బలు చూచి నివ్వెరపోయి మహారాజుకు మనవి చేసుకొన్నారు. మహారాజు అది విని విహ్వలుడై వచ్చి "ప్రియా ఏమిజరిగింది?" అని అడిగేసరికి మృగాంకవతి హస్తాలు చూపింది. రాజు ఆమె చేతులమంట శమించేనిమిత్తము చందనలేపనము పూయించినాడు. రాజు తోచీతోచక రాత్రి ఎలాతెల్లవారుతుందా అనుకొని "ఒకతెకు నల్లకలువవల్ల గాయమా! తారావళి చంద్రకిరణాలకే తట్టుకోలేక పోయింది! మృగాంకవతి ముసలధ్వని వినేసరికి చేతులకు బొబ్బ లెక్కడమా? వీరి నాజూకుతనం విధివశాన ఎగ్గుకే వచ్చింది" అని విచారపడి

నాడు. ఆ రాత్రియామ శతయామగా రాజు గడిపినాడు. ఉదయాన్నే రాజేంద్రుడు వ్రణవైద్యులను పిలిపించి ముగ్గురు రాణులకూ వైద్యము చేయించి స్వస్థపరచినాడు.

భేతాళుడు "రాజన్! ఆ ముగ్గురిలో ఏ రాణి అతికోమలి?" అని ప్రశ్నించగా త్రివిక్రమసేనుడు "రోకటిపోటు విన్నమాత్రానే మృగాంకవతి కోమలహస్తాలు బొబ్బలెక్కినవి. ఆమె అతికోమలి" అని సమాధానము ఇచ్చినాడు. యథాప్రకారంగా బేతాళుడు కనపడకుండా వెళ్ళి శింశుపాతరువున వేలాడుతున్న శవములో దాగినాడు. రాజు శవాన్ని మోసి తీసుకురావడానికి చెట్టుదగ్గిరికి వెళ్ళినాడు.

తరంగము: ౮౭

బేతాళకథ: ౧౨

త్రివిక్రమసేనుడు శవమును బుజాన పెట్టుకొని నడుస్తూ ఉండగా బేతాళుడు కథ ఆరంభించినాడు.

అంగదేశరాజు యశఃకేతువు చక్కనివాడు. అతడు పరాక్రమము చూపి శత్రువులను జయించినవాడు. బృహస్పతివంటి దీర్ఘదర్శి అనే అతనిమంత్రి పరిపాలనాభారము నిర్వహిస్తున్నాడు. రాజు భోగాసక్తుడై అంతఃపురములో ప్రమదలతో కాలం గడుపుతూ ఉన్నాడు. దీర్ఘదర్శి జాగరూకుడై అహోరాత్రములు ప్రభుభక్తితో రాజ్యపాలన చేస్తున్నాడు. నగరంలో ఒక అపవాదు బయలుదేరింది. "పేరుకు రాజుగాని పరిపాలన మంత్రిదే. మంత్రి రాజేంద్రుని వ్యసనాలలో పెట్టి, రాజ్యభోగము తాను అనుభవిస్తున్నాడు" అనేవాదు కర్ణాకర్ణిగా మంత్రికి తెలిసింది. అతడు మేధావిని అనే సార్థకనామధేయను భార్యను పిలిచి "ప్రేయసీ! రాజ్యమును నేను అపహరిస్తున్నాననే వాదు పుట్టింది. జనాపవాదము నాకు చేటు తెస్తుంది. జనాపవాదము

వల్లనే శ్రీరాముడు సీతను వదిలిపెట్టలేదా? ఈవిషయములో ఎలా చేయమంటావు?'' అని అడిగినాడు. అతనిభార్య "మహామంత్రీ! తీర్థ యాత్ర అనే మిషపెట్టి కొంతకాలంపాటు దేశాంతరాలు తిరిగిరండి. మీా విరక్తి లోకానికి అప్పుడు స్పష్ట మవుతుంది. జనాపవాదమూ చల్లారిపోతుంది. మీారులేక పోవడం వల్ల మహారాజు నిరంతర భోగా సక్తి వదిలిపెట్టి జాగరూకతతో స్వయంగా పరిపాలన చేస్తాడు. మీారు తిరిగి వచ్చేసరికి మీాపదవి, మీాకు ఉండనే ఉంటుంది'' అని సలహా చెప్పింది. దీర్ఘదర్శి సంభాషణలో రాజుతో "నేను కొన్నాళ్ళపాటు తీర్థయాత్రలు చేసి వస్తాను. సెలవు ఇప్పించవలె'' అని కోరినాడు. అప్పు డా రాజు "మంత్రీ! స్వర్గసుఖము పొందడానికి దానధర్మాలు చేస్తే చాలవా? తీర్థయాత్ర లెందుకు? అనగానే మంత్రి "రాజా! దానాదుల వల్ల అర్థశుద్ధి అవుతుంది. తీర్థములు నిత్యశుద్ధములు. శరీర పటుత్వము సడలక పూర్వమే తీర్థాటనము చేసి రావలె. ఏవేళ ఈతనువు రాలి పోతుందో'' అని విన్నవించినాడు. ప్రతీహారుడు వచ్చి మహారాజుకు నమస్కారము చేసి "దేవా! మధ్యాహ్నవేళ అయినది. ఏలినవారు మాధ్యాహ్నికము నిర్వర్తించుకొనే తరుణం దాటుతున్నది'' అని మనవి చేసినాడు. వెంటనే రాజేంద్రుడు స్నానానికి లేచినాడు. రాజుదగ్గిర సెలవుతీసుకొని దీర్ఘదర్శి ఇంటికి వెళ్ళినాడు. మంత్రి యాత్రోన్ముఖుడు కాగా భార్య కూడా వస్తానన్నది. 'నీవు రావద్దు' అని చెప్పి మంత్రి కొన్ని దేశాలుతిరిగి పుండ్రదేశము చేరినాడు. ఆదేశములో సముద్ర సామీాప్యంలోఉన్న ఒక పట్టణములో దీర్ఘదర్శి శివదర్శనము చేసు కొని ఆలయ ప్రాంగణములో ఆసీనుడైనాడు. శివపూజకై వచ్చిన వర్తకుడు అలిసిపోయి, మాసినబట్టలతోఉన్న దీర్ఘదర్శిని చూచి, అతని శుభలక్షణాలవల్ల సద్బ్రాహ్మణుడని గుర్తించి "అయ్యా! ఎవరు నీవు ఎక్కడికి వెడుతున్నావు?'' అని అడిగినాడు. మంత్రి తీర్థయాత్రలకై

వెడుతున్నాననీ, పేరు దీర్ఘదర్శి అనీ తెలియజేసినాడు. నిధిదత్తు డనే వర్తకుడు "తీర్థయాత్రలవల్ల బడలినట్లున్నావు. నేను బేరసారానికి సువర్ణ ద్వీపానికి వెళుతున్నాను. అలసట తీర్చుకొని కొంతకాలం మాఇంట్లో ఉండు. నేను మళ్ళీ సువర్ణద్వీపంనుంచి వస్తాను" అన్నాడు. దీర్ఘదర్శి సువర్ణద్వీపము వెళ్ళదలచినాడు. వర్తకుడు అంగీకరించినాడు. ఆరాత్రి అతడు సార్థవాహుని గృహములో భోజనముచేసి నిద్రించినాడు.

మరునాడు మంత్రి వర్తకుని వ్యాపారనావలో ఎక్కి మహాగంభీర మైన సముద్రమును చూస్తూ క్రమేణా సువర్ణద్వీపము చేరినాడు. నిధి దత్తుడు ద్వీపములో కొంతకాలము బేరసారములు చేసినాడు. అతనితో కూడా మంత్రి సముద్రము మీాద ప్రయాణము చేసేటప్పుడు హఠా త్తుగా అలలు వెనుక కల్పవృక్షము పైకి లేచింది. ఆసువర్ణతరుశాఖకు రతనాలమంచము వేలాడుతున్నది. మంత్రి రత్న పర్యంకముపైన సౌందర్యరాశి అయిన కన్యను వీణ వాయించుతుండగా కాంచి అబ్బుర పడినాడు. ఆరమణి వీణ మీటుతూ ఇలా గానము చేసింది.

ఏబీజమును కర్మ యెన్నడో నాటె
అయ్యేనో నిర్ణీత మాదినే యెద్ది
అనుభవించుచునుండు నద్దాని జీవి
పూర్వకృతంబు నంభోజ సూతియును
అనమర్థుడే యగు నన్యథా సేయ.

వీణావాదనము ముగించి వెంటనే దివ్యకన్య, కల్పతరుశాఖాసహి తముగా మున్నీటిలో మునిగి అంతర్ధానమైంది. దీర్ఘదర్శి జరిగిందంతా కన్నులారా కాంచి ఆశ్చర్యపడగా నావ నడిపేవాడు "అయ్యా, మీాకది కొత్త గాని మాకు కాదు. నావయాత్ర చేసేటప్పుడు ప్రతిసారీ మే మీా వింత చూస్తూ ఉంటాము" అని చెప్పినాడు. మంత్రి సార్థ వాహునితో కలిసి రేవులో దిగినాడు. సరుకులు వెంట తీసుకొని వర్త

కుడు మంత్రితో నిజవాసము చేరినాడు. ఇంట్లోవారు వర్తకుని రాకకు సంతోషించి పండుగ చేసినారు. దీర్ఘదర్శి అక్కడే కొన్నాళ్ళపాటు బస చేసి అంగదేశములో అడుగుపెట్టినాడు. అంగదేశ ప్రభువు మహా మంత్రికై చారులను పంపగా మధ్యమార్గములో దీర్ఘదర్శిని చూచి వెళ్ళి రాజుతో మనవిచేసినారు. రాజు ఎదురేగి మంత్రిశేఖరుని కౌగ లించుకొన్నాడు. యాత్రలవల్ల అలిసినవానిని, ధూళిధూసరితాంగుని మంత్రిని ఆదరించి రాజు "అయ్యో, నీమనసువలె దేహము కృశించి పరువమైంది. విధివిలాసము విపరీతము! తీర్థయాత్రాభిలాష నీకు కలగడ మేమిటి! ఏదేశాలు చూచావు." అని కుతూహలముతో అడిగినాడు. మంత్రి సువర్ణద్వీపయాత్రా వృత్తాంతము దివ్యకన్యాదర్శనము మొద లయిన విషయాలు విస్తరించి చెప్పగా రాజేంద్రుని కుతూహలము అధికమైంది. అతడు "మంత్రివరా! ఆదివ్యకన్యను చూస్తేగాని జీవించ లేను. నీవు చెప్పినదారినే వెళ్ళి ఆకన్యను కాంచవలెను. రాజ్యరక్షణము చేస్తూఉండు" అని వెళ్ళిపోయినాడు. మంత్రి స్వగృహానికి వెళ్ళగా మహోత్సవము జరిగింది.

రాజు రాజ్యభారము దీర్ఘదర్శి భుజస్కంధాలమీాద ఉంచి వెడుతూ ఉండగా, దారిలో కుశనాభుడు అనే ఋషి కనపడినాడు. రాజు అతనికి పాదాభివందనము చేసినాడు. తాపసి "రాజన్! లక్ష్మీదత్తు డనే వైశ్యునితో నావఎక్కి సముద్రమధ్యములో ఇష్టకన్యను పొందుతావు. వెళ్ళు శుభం" అని హెచ్చరించినాడు.

ఆఋషీశ్వరుని మాటలకు అలరి మహారాజు సువర్ణద్వీపానికి వెడు తున్న లక్ష్మీదత్తుని కలుసుకొన్నాడు. లక్ష్మీదత్తుడు శుభలక్షణ లక్షితు డైన రాజేంద్రుని చూచి వినయపూర్వకంగా తన నౌకలో ఎక్కించు కొని ప్రయాణము చేసినాడు. రాజు నడిసంద్రాన సువర్ణకల్పవృక్ష శాఖను వేలాడుతున్న రత్నపర్యంకమునూ, వీణ వాయిస్తున్న దివ్య

సుందరినీ కన్నులపండువుగా కాంచినాడు. ఆకన్య వీణావాదనకు తోడు ఎలుగెత్తి ఇలా పాడింది.

ఏబీజమును కర్మ యెన్నడో నాటె
అయ్యెనో నిర్ణీతమాదినే యెద్ది
అనుభవించుచునుండు నద్దాని జీవి
పూర్వకృతంబు సంభోజసూతియును
అసమర్థుడే యగు నన్యథా సేయ
ఎచట నేవిధమున నేది కావలయు
దైవయోగంబుచే దానినే పొంద
వేచియుండును జీవి వివశుడై పోయి.

ఆ లావణ్యమయిని చూడగానే అతని హృదయము మదన బాణాలకు గురి అయింది. అతడు రత్నాకరునకు నమస్కరిస్తూ "నీ హృదయంలో ఏమున్నదో ఎవరు ఎరుగుదురు? నీ హృదయము ఎంతఅగాధమో! ఈ కన్యాలాభము నాకు అయ్యేటట్టు అనుగ్రహించు" అని వేడుకొన్నాడు. దివ్యసుందరి క్షణంలో సముద్రములో మునిగిపోయింది. రాజచంద్రుడు కామానల శాంతికో అన్నట్టు సముద్రములో దుమికినాడు. లక్ష్మీదత్తుడు మిత్రునికై వగచి ప్రాణాలుపోగొట్టుకోదలచినాడు. అప్పుడు ఆకాశవాణి "సాహసంవద్దు. సముద్రములో మునిగిన రాజుకు అపాయమేమీ లేదు. ఇతడు అంగదేశాధిపతి అయిన యశఃకేతువు. తాపసివేషముతో నీఇంట్లో ఉన్నాడు. ఈకన్యకోసము ఇక్కడికి వచ్చినాడు." అని పలుకగా లక్ష్మీదత్తుడు ఊరడిల్లి బేరసారాలకై వెళ్లినాడు.

యశఃకేతుమహారాజు మున్నీటిలో దివ్యనగరిలో ముత్యాలకిటికీలు, బంగారుగోడలు, మణిస్తంభాలుగల ప్రాసాదములు, రతనాల సోపాన పంక్తులతో దిగుడుబావులు, ఉద్యానవనములు చూచినాడు. రాజు వాడవాడల తిరిగి ప్రియురాలిని కనుక్కోలేకపోయినాడు. చివరకు అతడు

దివ్యభవనములో రత్నపర్యంకముపైన వస్త్రము కప్పుకొని పరున్న కామినిని చూచి, ఆమెవదనముపైన ఉన్న వస్త్రము ఓసరిల చేసినాడు. ఆమె వదనము మందహాస చంద్రికలతో వున్నమివలె విరిసింది. వేసవిలో దాహపీడితుడైన పాంథుడు ఎడారిలో ఏటిని చూచినట్లు యశః కేతుడు ప్రియావదనబింబము చూచి అనిర్వచనీయమైన ఆనందమును అనుభవించినాడు. ఆ దివ్యకన్య కల్యాణ లక్షణములతో వెలుగుతున్న రాజచంద్రుని వీక్షించి, తత్తరపాటుతో తల్పమునుంచి దిగి, గౌరవించి, చూపుల నల్లకలువలతో అతనిపాదాలు పూజించింది. ఆమె సిగ్గుతో తలవాల్చి "మహానుభావా! నీవెవరు? ఈ రసాతలానికి ఎలా వచ్చినావు? నీముఖబింబముచూడగా రాజలక్షణాలు గోచరమవుతున్నవి. నీవేషము చూస్తే తాపసునివలె తోస్తున్నావు. దయచేసి సంగతిచక్కగా తెలియ చెప్పండి" అని కోరింది.

రాజు "సుందరీ! నేను అంగరాజు యశఃకేతువును. నీవు సముద్ర గర్భమున దినదినము పైకివస్తూ చూచేవారలను ఆశ్చర్యములో ముంచి వేస్తున్నట్లు విని నేను రాజ్యాన్ని విడిచి, ఈ తాపసవేషంతో నీదగ్గిరికి వచ్చినాను. మరి నీవు ఎవరో నాకు తెలియజెప్పు" అని కోరినాడు.

ఆకన్య లజ్జానురాగానందములు ముప్పిరిగొనగా ఇలా చెప్పింది. "మృగాంకసేనుడు అనే విద్యాధర రాజు కుమార్తెను; నన్ను మృగాంకవతి అని పెద్దలు పిలుస్తారు. తండ్రి నన్ను ఈ నగరిలో ఒంటరిదాన్ని చేసి ఎక్కడికో పురజన సమేతంగా వెళ్ళిపోయినాడు. ఈ శూన్యగృహములో, కల్పవృక్షశాఖకు వేలాడే రత్నపర్యంకాన కూర్చుండి వీణ మీటుతూ పాడుతూ ఉంటాను. అప్పుడప్పుడు సముద్రము పైభాగానికి వస్తూఉంటాను." ఆకన్య పలుకులు విని రాజు మునీంద్రుని వచనములు స్మరించినాడు. అతడు తీయని మాటలతో ఆమెను బుజ్జగించి అనురాగము రేకెత్తించి ఆమెను కైవసముచేసికొని వివాహమాడినాడు.

ఆ గాంధర్వ వివాహానికి ఆమె నియమము ఏర్పాటు చేసింది. "ఆర్య పుత్రా ! శుక్ల కృష్ణచతుర్దశి, అష్టమీతిథుల్లో నెలకు నాలుగురోజులు నీతో ఉండను. అప్పుడు నేను ఎక్కడికో వెళ్ళిపోతాను. వెళుతూ ఉంటే నన్ను నీవు అడ్డగించకు. అందుకు వేరే కారణం ఉంది" అన్నది. ఆమె ఏర్పరచిన నియమానికి రాజు అంగీకరించినాడు. వివాహానంతరము రాజు మృగాంకవతితో సుఖము అనుభవించినాడు.

భోగలాలసుడైన యశఃకేతువు కొన్నాళ్ళు గడిపినాడు. ఒకనాడు ఆమె మహారాజుతో "ఆర్యపుత్రా! ఇవాళ కృష్ణచతుర్దశి. ఈ వటికవు గదిలోకిమాత్రం నీవు వెళ్ళవద్దు. ఇందులో బావి ఉన్నది. అందులో నీవు దిగితే భూలోకానికి వెళుతావు. అలా చెయ్యకు" అని పలికింది. మృగాంకవతి వెళ్ళిపోతున్నప్పుడు కుతూహలముతో ఉన్న రాజు కత్తి చేతపట్టి ఆమెకు కనపడకుండా వెనువెంటనే బయలుదేరినాడు. కొంత దూరము వెళ్ళగా తమశ్శ్యాముడు అనే రాక్షసుడు పెద్దనోరు తెరుచు కొని మూర్తీభవించిన పాతాళలోకమువలె వారికి కనపడినాడు. రాక్షసుడు వెంటనే మృగాంకవతిని మింగివేసినాడు. యశఃకేతువు కోపా టోపముతో కత్తిదూసి, తనమీదికి లంఘిస్తున్న రాక్షసుని తల నరికి నాడు. రాకాసి మొండెము రక్తసిక్తము కావడంవల్ల అతని కోపాగ్ని చల్లారిందే కాని మృగాంకవతీ వియోగాగ్ని మాత్రము చల్లారలేదు. వియోగదుఃఖముతో రాజేంద్రుడు కుమిలి కుమిలి కర్తవ్యము తోచక అటూ ఇటూ తిరుగుతూ ఉండగా, రాక్షసుని దేహములోనుంచి రాకా చంద్రునికళలతో వెలుగుతూ దిక్కులను కాంతివంతముచేస్తూ మృగాంక వతి ఉదయించగా ప్రేయసిని చూచి రాజేంద్రుడు గాఢముగా కౌగ లించుకొన్నాడు. "ప్రియతమా, ఇది యథార్థమా! స్వప్నమా?" అని అతడు అడిగేసరికి విద్యాధరి పూర్వస్మృతితో ఇలా పలికింది: "ఆర్య పుత్రా! కలకాదు. మాయకాదు. విద్యాధరేంద్రుడయిన నాతండ్రి

నాకు శాపము ఇచ్చినాడు. నాతండ్రికి కుమార్తెళ్ళు చాలామంది ఉన్న ప్పటికీ నామీద అతివాత్సల్యము చూపుతూ, ఆయన భోజనసమయ ములోకూడా తనపంక్తినే నన్ను కూర్చోబెట్టుకొనేవాడు. నేను ఎప్పుడూ శివపూజార్థము అష్టమీ చతుర్దశీతిథులల్లో కృష్ణ శుక్లపక్షాలలో ఇక్క డికి రావడం కద్దు. ఒక చతుర్దశినాడు పగటివేళ శివపూజకై ఇక్కడికి వచ్చినాను. ఆనాడు గౌరీపూజ చేస్తూఉండగా చీకటిపడింది. పగలల్లా నాతండ్రి తిండీతిప్పలూ లేకుండా నాకోసం ఎదురుచూచి కోపగించి పరు న్నాడు. నేను ఇంటికి వెళ్ళి సాపరాధను కనుక వంచినతల ఎత్తక మసు లుతూ ఉండగా నాతండ్రి అతికోపముకొద్దీ నన్ను శపించినాడు. 'ఈరోజు నేను ఆకలికి తట్టుకోలేక ఎలా గురిఅయినానో అలాగే నీవు శివపూజా ర్థము మానానికి నాలుగురోజులు వెళ్ళినప్పుడు రాక్షసుడు నిన్ను మింగి వేస్తాడు. నీవు సజీవంగా రాక్షసుని గర్భములోనుంచి పైకి వస్తావు. రాక్షసుడు నిన్ను మింగివేస్తా డన్న సంగతి నీవు ఎప్పటి కప్పుడే మరిచి పోయి పూజకై వెళ్ళుతావు. ఈనగరంలో నీవు ఏకాకినివై ఉంటావు" అని చెప్పినాడు.

శాపావసానము అనుగ్రహించమని నాతండ్రిని వేడినాను. శాపాంతము నాతండ్రి ఇలా అనుగ్రహించినాడు. "యశఃకేతువు అనే రాజేంద్రుడు నీకు భర్తయై నిన్ను రాక్షసుడు మింగివేయగా, అతనిని చంపివేస్తాడు. దానితో నీకు శాపము తీరిపోతుంది" నాతండ్రి పరివారముతో భూలో కములో ఉన్ననిషధాచలమునకు వెళ్ళినాడు. నేను నీదయవల్ల బతికి బైట పడ్డాను. నాతండ్రి ఉన్న తావుకు వెళ్ళిపోతాను. నీవు ఈ నగ రంలో ఉన్నా సరే మీరాజధానికి వెళ్ళినాసరే నీచిత్తము వచ్చినట్టు చేయవచ్చును అన్నది.

మృగాంకవతి మాటలు విని యశఃకేతువు "సుందరీ! నాకోసం వారంరోజులు మాత్రము నీవు ఉండాలి. ఇక్కడ ఉద్యానవనిలో క్రీడా

రసములో అన్నీ విస్మరించుదాము. తరువాత నీవు తండ్రిదగ్గిరికి వెళ్ళు. నేను రాజధానికి వెళ్ళుతాను" అని పలికినాడు. ఆముగ్ధాంగన ప్రియుని మాటలకు అంగీకరించింది. రాజు ప్రియకామినీసుఖములు ఉద్యానవనిలో అనుభవించినాడు. తరుశాఖలు మమ్మల్ని వదిలివెళ్ళవద్దు అన్నట్టుగా చలించినవి. ఆ వని అలలచేతులెత్తి, హంసపారసకలస్వనాలతో, నీటి బిందువులతో, ఉన్న కలువకన్నులతో ప్రియులను బతిమాలుకొన్నది. ఏడవనాడు భూలోకములోకి చేర్చేయంత్రద్వారమునుంచి, ప్రియురాలిని కౌగిటిలోనుంచి విడివడనీయక భూలోకమునకు వెళ్లినాడు. మృగాంక వతీ యశఃకేతువులు భూలోకములో వనమునందు చేరగా తోట మాలులు చూచి మంత్రికి మనవి చేసినారు. రాజు ప్రియాసమేతంగా రాజధానిలో ప్రవేశించి పౌరుల హృదయాలు చూరగొన్నాడు. మంత్రి అసంభావ్య మయిన కార్యమును సాధించిన రాజును మెచ్చుకొని ఆశ్చర్యపడినాడు

వారంరోజులు గడిచినా విద్యాధరి మృగాంకవతికి పూర్వస్మృతి లేక పోవడంవల్ల తండ్రిదగ్గిరికి వెళ్ళవలె నన్న ఊహలేదు. ఆమె గగనము మీదికి ఎగిరే ఉత్పతనవిద్య మరిచిపోయింది. ఆమె హృదయములో అవ్యక్తమైన వేదన బయలుదేరింది. రాజు "ప్రియతమా! ఏమి అలా ఉన్నావు!" అని అడిగినాడు.

"ఆర్యపుత్రా, నీమీది అనురాగమువల్ల ఇంతకాలము ఇక్కడ ఉండడంవల్ల నా ఉత్పతనవిద్య మరిచిపోయినాను. నా దివ్యత్వము పోయింది అన్నది.

విద్యాధరీలాభంవల్ల యశఃకేతువు అమందానందముతో ఉత్సవము చేయించినాడు. మంత్రి దీర్ఘదర్శి ఇంతలో మృతిపొందడమువల్ల రాజు బాధనూ, యథాప్రకారంగా మృగాంకవతితో భోగములనూ అనుభ విస్తూ ఉన్నాడు.

కథ చెప్పడం అయినతరువాత బేతాళుడు "రాజన్, రాజు ఉత్సవంలో ఉండగా మంత్రి ఎందుకు గుండె పగిలి చనిపోయినాడు. అని రాజును అడిగినాడు. "మంత్రి కల్యాణచరిత్రుడు స్త్రీ లంపటుడైన రాజేంద్రునకు విద్యాధరి లభించింది. ఎంత చెరువు వచ్చింది. రాజ్యం అధోగతిపాలవుతుందనే బెంగతో మంత్రి ప్రాణాలు విడిచిపెట్టినాడు." అని విక్రముడు సమాధానమిచ్చినాడు. బేతాళుడు యథాప్రకారంగా అంతర్ధానముకాగా త్రివిక్రమసేనుడు అతన్ని పట్టి తీసుకు రావలెనని శింశుపావృక్షం సమీపానికి వెళ్ళినాడు.

## త రం గ ము : ౮౭

## బే తా ళ క థ : ౧౩

త్రివిక్రమసేనుడు బేతాళుని శింశుపావృక్షశాఖనుంచి తన బుజాన ఎక్కించుకొని వస్తూఉండగా, మహారాజుకు మార్గాయాసము పోగొట్టవలె నని బేతాళుడు కథ ఆరంభించినాడు.

వారణాసీనగరములో ధనికుడైన దేవస్వామి అనే విప్రునికి హరిస్వామి అనేకుమారుడు ఉన్నాడు. అతనిభార్య, లావణ్యవతి సార్థకనామధేయ. ప్రియకామినితో ప్రణయకేళి సలిపి, హరిస్వామి అలిసి నిదురించగా కిటికీనుంచి చల్లని చంద్రకిరణములు అతనిపైన ప్రసరిస్తున్నవి. అప్పుడు ఆకాశవీధిలో మదనవేగుడు అనే విద్యాధరుడు ఏకశయ్యలో ఉన్న లావణ్యవతీ హరిస్వాములను చూచినాడు. ఆమె కాంతికి విద్యాధరుడు చిత్తవికారమునకు లోనై, లావణ్యవతిని హరించి గగనవీధిని వెళ్ళిపోయినాడు. కొంతసేపటికి హరిస్వామికి మెళుకువ వచ్చి చూడగా పక్కన భార్య కనపడలేదు. కర్తవ్యము ఏమీ తోచక అతడు తత్తరపాటుతో "ఏమైంది! ఎక్కడికి పోయింది! ప్రియకాంతకు నామీద

రోషం వచ్చిందా? నన్ను వేళాకోళము చేయవలె నని దాక్కోడానికి వెళ్ళిపోయిందా? నన్ను పరీక్ష చేయడానికి ఎక్కడికి వెళ్ళింది!" అని తలపోసినాడు. హరిస్వామి ప్రియురాలికై ఇల్లుయావత్తూ వెతికి వేసారి కంట తడిపెట్టినాడు. అతడు హృదయభారము తీరేటట్టు విలపించినాడు. "చంద్రవదనా, చంద్రికాగౌరీ! ప్రియసీ! నీవియోగమువల్ల నేను తాళ లేక పోగా శీతలచంద్రకిరణాలు నన్ను బాధిస్తూ ఉన్నవి!" అంటూ దుఃఖించినాడు. క్రమేణా తెల్లవారింది. రాత్రి చక్రవాకములు తమ దుఃఖమును అతనికి ఇచ్చినవా అన్నట్లు, తెల్లవారినా అతని వేదన మరింత గాఢమైంది. బంధువు లందరూ సానుభూతి చూపినారు. అతని శోకము మితిమీరి పోయింది. ప్రియావిరహము యువజనులను ఎంతో బాధిస్తుంది. హరిస్వామి "ఇక్కడ నా ప్రేయసి పాట పాడింది. ఇక్కడ కూర్చున్నది. ఇక్కడనవ్వింది"అంటూ వేలగుండెతో కుంగిపోతున్నాడు. బంధువులు "హరిస్వామీ! నీభార్య జీవించే ఉంది. అంతగా బెంగపెట్టు కోకు. నీవు జీవించే ఉంటే తప్పక నీ ప్రియకాంత లభ్య మవుతుంది. ధైర్యం తెచ్చుకో" అని హెచ్చరిక చేసినారు. అతడు ప్రియాసమాగమ ప్రత్యాశవల్ల ధైర్యం తెచ్చుకొని దినములు లెక్కపెడుతూ ఉన్నాడు.

హరిస్వామి తన సర్వస్వమూ విప్రులకు దానధర్మాలు చేసి, తీర్థ యాత్రలు చేసి, పాపక్షయము చేసుకోవలె నని నిశ్చయించుకొని మరు నాడు బ్రాహ్మణులకు సంతర్పణ చేసి దానాలు ఇచ్చినాడు. అతడు తన ఆస్తిని విప్రులకు పంచిపెట్టి ప్రియకాంతకై తీర్థాలు వెతకబోయినాడు.

హరిస్వామి యాత్రలు చేస్తున్నప్పుడు గ్రీష్మము ప్రచండ మైంది. కాంతావిరహమువల్ల పాంథుల విరహనిశ్వాసములవలె గాలి వేడెక్కింది. సరస్సులు ఇంకిపోయి దుఃఖమువల్ల గుండెపగిలి పోయినట్లు బీటలు వారినవి. గ్రీష్మతాపానికి తరుపత్రములు వాడి తోవలో రోదిస్తున్నట్టు ఉన్నవి. హరిస్వామి దిమ్మతిరిగి ఆకటికి వేగలేక ఒకగ్రామములో పద్మ

నాథుడనే విప్రుని గృహద్వారము దగ్గర నిలిచినాడు. ఆఇంటిలో బ్రాహ్మణ సమారాధన జరుగుతూ ఉన్నదని తెలిసి హరిస్వామి ఇంటి గుమ్మముదగ్గిరే ఉన్నాడు. ఆఇంటావిడ అతని వాలకము కనిపెట్టి "అయ్యో, ఎవరో పరదేశి అన్నాతురుడై వచ్చినాడు. పాపము ముఖము వేలాడవేసి దీనంగా ఉన్నాడు. ఇతనికి అన్నము పెట్టడం అవసరం" అనుకొని లోపలికి వెళ్ళింది. ఆఇల్లాలు పాత్రలో క్షీరాన్నము పోసి అందులో పంచదార వేసి హరిస్వామికి వినయపూర్వకంగా ఇస్తూ "అయ్యా, ఎక్కడికైనా వెళ్ళి ఈపరమాన్నమును పుచ్చుకోండి. ఇక్కడ అంతా ఎంగిళ్ళు; ఇంటి నిండా ఇంకా బ్రాహ్మణులు భోజనాలు చేస్తున్నారు" అన్నది. హరిస్వామి పరమాన్నపాత్రము తీసుకుపోయి సమీపములో ఉన్న వటవృక్షము దగ్గర నూతిగట్టున ఉంచి, దిగి కాళ్ళూ చేతులూ కడుక్కొని ఆచమనం చేసేలోగా, డేగ నల్లత్రాచుపామును కాళ్ళతో ముక్కుతో గట్టిగా పట్టుకొని మర్రిచెట్టుమీద వాలింది. వెంటనే పామునోటినుండి విషపుచుక్కలు క్రిందపడుతున్నవి. పరమాన్న పాత్రలో ఆవిషము, పడినట్టు తెలియక విప్రుడు క్షుధార్తితో నిశ్శేషంగా భుజించేసరికి అతని హృదయములో వేదన ఆరంభించింది. "అయ్యో, విధివిలాసము! పరమాన్నము విషమై పోయిందేమి?" అంటూ బాధపడుతూ ఆతిథ్యము ఇచ్చిన ఇల్లాలి దగ్గిరికి వచ్చి "అమ్మా, నీవు పెట్టినపరమాన్నము నాపాలిటి విషమైపోయింది. వైద్యుణ్ణి పిలిపించకపోతే బ్రహ్మహత్యాపాతకము నీకు చుట్టుకొంటుంది" అని మొరపెట్టినాడు. ఆమె విచారముతో కర్తవ్యము తోచక తికమక పడేలోగా హరిస్వామి మరణించినాడు. ఆఇంటి యజమాని కోపముతో భార్య అతిథిని చంపినదనే భ్రమవల్ల ఆమెను తరిమివేసినాడు. ఆమె మంచిచేయబోతే చెడే ఎదురువచ్చింది. తలఎత్తుకోలేక ఆసాధ్వి తపస్సు చేయవలెనని తీర్థానికి వెళ్ళింది. యమధర్మరాజు దగ్గర "సర్ప శ్యేన

అన్నదాతలలో బ్రహ్మహత్యా పాతకము ఎవరిది” అనే తర్జన భర్జ నలు వచ్చినవి.

బేతాళుడు “త్రివిక్రమా! బ్రహ్మహత్యాదోషము ఎవరికి సక్రమి స్తుంది?” అని ప్రశ్నించినాడు. రాజు “సర్పాన్ని పాపము చుట్టుకోదు. డేగ బలవంతాన సర్పాన్ని బాధిస్తూ ఉంటే దాని దోషము ఎలా అవుతుంది? డేగ చేసిన ప్రత్యవాయము ఏముంది? లభించిన సర్పాన్ని తినబోతూవుంటే విషము చిందింది. అన్నదాతలయిన భార్యాభర్తల దోషముకాదు. విచారించక బ్రహ్మహత్యను నిర్ణయించేవాడికే పాపము చుట్టుకొంటుంది” అంటూ ఉండగనే బేతాళుడు యథాప్రకారంగా అంత ర్ధానమై పోయినాడు.

## తరంగము : ౮౯

## బేతాళకథ : ౧౮

త్రివిక్రమసేనుడు బేతాళాధిష్ఠితమైన శవమును మోసి తేవడానికి శింశుపావృక్షసమీపానికి వెళ్ళినాడు. బేతాళుని రాజు బుజానఎక్కించు కొని పోతూఉంటే బేతాళుడు యథాప్రకారంగా కథ ఆరంభించినాడు.

అయోధ్యానగరమును వీరకేతు మహారాజు పరిపాలిస్తున్నప్పుడు రత్నదత్తుడనే వైశ్యునికి రూపలావణ్యగుణరాశి అయిన రత్నవతి అనే కుమార్తె ఉన్నది. ఎంతమందివరులను చూచినా ఎవరూ నచ్చక ఆమె ప్రతిసంబంధాన్ని తోసిరాజుఅనేది. క్రమేణా ఆమెపురుషద్వేషి ణిగా మారింది. పెండ్లిమాట ఎత్తితే ప్రాణాలు వదిలి వేస్తానని ఆకన్య తెగింపు చేస్తుంది. వైశ్యులు, రాజపుత్రులు ఆఅందాలరాశిని వివా హము చేసుకోవలెనని తహతహలాడి మనసు నీరై ఊరుకొన్నారు.

ఇది ఇలాఉండగా అయోధ్యలో దొంగతనము విపరీతంగా జరు గుతూ ఉన్నది. అందరూ ఏలిక దగ్గిరికివెళ్ళి మొరపెట్టుకొన్నారు.

మహారాజు చారులమూలంగా దొంగలను పట్టవలెనని యత్నించి లాభములేక స్వయంగా ప్రచ్ఛన్నవేషము ధరించి రాత్రి ఊరంతా తిరిగినాడు. వీరకేతుమహారాజు పిట్టగోడమీాద ఉన్న ఒక పురుషుని చూచినాడు. "ఎవరు నీవు" అని రాజును ప్రశ్నించినాడు. "నేను చోరుడను" అని వీరకేతువు సమాధానము ఇచ్చినాడు. అప్పుడా చోరుడు "అలాఅయితే నీవు సాటివాడివి. నాఇంటికి రావోయి. మన చోరతంత్రం ఒకసారి కూడపలుకోవచ్చును" అని రాజును సమ్మాని౦చినాడు. రాజు చోరునితో వెళ్ళి నేలకొట్టులో ప్రవేశించినాడు. నేలమాళిగ సువర్ణరత్న రాసులతో మిలమిలా మెరిసి పోతున్నది. రాజు ఉచితాసనమును అలంకరించగానే చోరుడు లోపల వున్న కొట్టులోనికి వెళ్ళినాడు. వెంటనే దాసీయునిషి వచ్చి రాజుతో "మహాభాగా నీవు మృత్యుసమీాపములో ఉన్నావు. చోరుడు పరమదురాత్ముడు. నీవు ఇక్కడఉండక తప్పించుకొని పారిపో" అని సలహా ఇచ్చింది.

వెంటనే రాజేంద్రుడు నేలమాళిగ విడిచి రాజధానికి వెళ్ళి సేనా సమేతంగా తిరిగివచ్చి నేలకొట్టును బంధించినాడు. తనగుట్టు బైట పడింది అని చోరుడు గుర్తించి కత్తి చేతపూని హాహాకారిగా రాజ సేనతో పోరినాడు. అతడు ఏనుగుల తొండములు కోసినాడు. గుర్రాల పిక్కలు తెగగొట్టినాడు, భటులతలలు తరిగినాడు. చివరకు చోరుడు ఖడ్గహస్తుడై రాజుమీాదికి వచ్చినాడు. రాజు అతనిచేయి గట్టిగాపట్టి కత్తి కింద పడవేయించినాడు. ఇద్దరూ ముష్టాముష్టి పోరినారు. వీరకేతువు చోరుని కిందపడవేసి వాని గుండెలమీాద కూర్చున్నాడు. తరువాత మహారాజు తలారులకు ఆనతీయగా వారు చోరుని పట్టి వధ్యశిలవద్దకు తీసుకొని పోతున్నారు.

వైశ్యకుమారి రత్నావతి చోరునిచూచి మోహించి తండ్రి దగ్గిరికి పరుగులెత్తి "తండ్రీ, కొరతవేయడానికి తీసుకొని పోతున్నారు. అతన్నే

నేను ప్రేమిస్తున్నాను. అతనిచావు ఆపలేకపోతే నా సహగమనం తప్పదు" అని అఘోరించింది. తండ్రి "అదేమిటమ్మా, దొరక్క దొరక్క చోరుడే దొరికినాడా! చావుకు తెగిస్తావా తల్లీ" అని దీనంగా పలికినాడు. కుమార్తె పట్టుదల చూచి తండ్రి రాజు దగ్గిరికి వెళ్ళి చోరుని విడిపించవలసిం దనీ, ఎంతయినా సువర్ణము ఇస్తాననీ కాళ్ళావేళ్ళా పడినాడు. రాజు అంగీకరించ లేదు. రత్నావతి ప్రాణాలను తృణప్రాయముగా ఎంచి మంటలో పడి చనిపోవడానికి సిద్ధపడ్డది. చోరుడు చనిపోయేముందు ఆమెను చూచి నవ్వినాడు, కన్నీళ్లు విడిచినాడు. వధ్యశిలమీద చోరుని నిలవబెట్టి తలారులు నిలువునా అతని నిండుప్రాణాలు తీసినారు. చోరుని దేహముమీద పడి పోవడానికి రత్నావతి ఉద్యుక్తురాలుకాగా ఆకాశవాణి పలికింది. "అమ్మా, స్వయంవరపతిమీద నీకుగల భక్తిశ్రద్ధలకు చాలా మెచ్చుకొన్నాను. సాధ్వీమణీ, నీయిష్టమువచ్చిన వరంకోరుకో" రత్నావతి "అపుత్రుడైన నాతండ్రికి వందమంది పురుషసంతానం కావాలి. నేను చనిపోయిన తరువాత సుతులు లేరనే శోకంవల్ల ఆయన చనిపోకుండా ఉండాలి." అనే వేడుకొన్నది. గగనవాణి "అలాగే నీతండ్రికి నూరుగురు కుమాళ్లు కలుగుతారు. నీవంటి సాధ్వీమణి ఇంతమాత్రమేనా కోరడం?" అని పలికింది. ఆమె నామీద దయవుంచి నాభర్త జీవించి పరమ కారుణికుడు ధార్మికుడు అయ్యేరీతిగా అనుగ్రహించాలి" అని కోరుకొన్నది. వెంటనే చోరుడు అక్షతశరీరంతో ఉజ్జీవితుడై లేచినాడు.

రత్నదత్తుడు అల్లుణ్ణీ కూతుర్నీ చూచుకొని అమందానందముతో పొంగిపోయినాడు. అతని ఇంట్లో దోసతోటవలె ఇంతవాళ్లు అంతవాళ్ళూ కళకళలాడుతూ మగపిల్లలు మసులుతూ ఉండగా రత్నదత్తుడు వాళ్ళను చూచుకొని పొంగిపోయినాడు. వీరకేతుమహారాజు చోరునిపిలిపించి సేనాపతిని చేసినాడు.

బేతాళుడు "రాజన్, కాటికి కాళ్ళు చాచిన చోరుడు రత్నవతినిచూచి నవ్వడానికీ దుఃఖించడానికీ కారణమేమిటి?" అని అడిగినాడు. త్రివిక్రమసేనుడు "అకారణబంధువైన రత్నదత్తుని ఋణము ఎలాతీర్చుకొననని విచారించి కళ్లనీళ్లుపెట్టుకొన్నాడు. రాజపుత్రులను ఎవరినీ వరించక అధముడైన తనను వరించిందేమా అని చోరుడు తెల్లపోయి నవ్వినాడు" అని సమాధాన మిచ్చినాడు. బేతాళుడు అదృశ్యుడై పోయినాడు. బేతాళుని తేవలెనని త్రివిక్రమసేనుడు శింశుపాతరువు కడకు మళ్ళీ వెళ్ళినాడు.

## తరంగము: ౮౯

## బేతాళకథ: ౧౫

త్రివిక్రమసేనుడు యథాప్రకారంగా బేతాళుని బుజాన ఎక్కించుకొని బయలుదేరినాడు. బేతాళుడు మహారాజుకు మార్గాయాసము పోగొట్టుతూ కథ ఆరంభించినాడు.

నేపాళదేశాన్ని యశఃకేతువు అనే మహారాజు శివపురిని రాజధానిగా చేసుకొని పరిపాలిస్తున్నాడు. కొన్నాళ్ళకు రాజేంద్రుడు రాజ్యభారాన్ని మంత్రి ప్రజ్ఞాసాగరుని చేతుల్లో ఉంచి, చంద్రప్రభ అనే దేవేరితో భోగములు అనుభవిస్తూ ఉన్నాడు. ఇలా ఉండగా ఆదంపతులకు శశిప్రభ అనేకుమార్తె జన్మించింది. వయసు వచ్చినతరువాత శశిప్రభ పువ్వులు కోయడానికి ఉద్యానవనానికి వెళ్ళింది. విప్రకుమారుడు మనస్వామి అనేవాడు చూచి, ఆసుందరిని వనదేవతగా భావించినాడు. శశిప్రభ పుష్పాపచయము చేయడము మరచిపోయి అతని అందాన్ని చూచి పరవశ అయింది. ఆలేతహృదయాలు వలపులో మునిగిపోగా అకస్మాత్తుగా జనుల హాహా కారము బయలుదేరింది. ఆప్రియులు ఏమి టీ గగ్గోలు అని దృష్టి సారించి చూడగా మదపు

ఏనుగు కట్టుకంబాన్ని తెంపుకొని తోవలో చెట్లు విరుస్తూ మావటి వానిని తోసివేసి మనుష్యులమీద విరుచుకుపడుతున్నది. ఆహడావిడిలో శశిప్రభ వణికిపోతూ ఉండగా మనస్వామి ఆమెను ఎత్తుకొని దూరంగా తీసుకొని వెళ్ళినాడు. ఆకన్య హృదయములో లజ్జా ప్రణయములు రేకెత్తినవి. ఈలోగా పరిజనులువచ్చి మనస్వామిని స్తుతిచేసి రాజ కుమారిని నగరుకు తీసుకొని వెళ్ళినాడు. ఆమె శరీరము రాజమంది రములోనూ మనసంతా మనస్వామి మీదనూ ఉండగా తండ్రి కని పెట్టలేదు. మనస్వామి విరహముతో వేగి మూలదేవుడు అనే గురువు దగ్గిరికి వెళ్లినాడు. మూలదేవుడు శిష్యుని సంగతి గ్రహించి అది తీర్పదలచినాడు. ఆయన యోగగుళికను మింగి మరియొకటి మన స్వామికి ఇచ్చినాడు. మూలదేవుడు వృద్ధవిప్రాకారము ధరించినాడు. మనస్వామి మనోహరమైన కన్యా రూపమును పొందినాడు. ఆ బ్రాహ్మణవేషధారి అయిన మూలదేవుడు మనస్వామిని వెంటబెట్టుకొని యశఃకేతుమహారాజు దగ్గిరికివెళ్ళినాడు. ఆయన రాజుకు నమస్కరించి "రాజన్! నాకొకుమారుడు ఉన్నాడు. వాడికోసము ఈకన్యను తీసు కొనివచ్చినాను. కుమారుడు ఎక్కడికో వెళ్ళిపోయినాడు. వాణ్ణి వెతక డానికి బయలుదేరినాను. అంతవరకూ ఈకన్యను నీవు రక్షించాలి" అని మనవి చేసుకొన్నాడు. అతని శాపభీతివల్ల రాజు కన్యను అంతః పురములో ఉంచినాడు. రాజేంద్రుడు తనకుమారి శశిప్రభతో "అమ్మాయీ! ఈకన్యను నీదగ్గరనే ఉండనీ. భోజనశయ్యాదికము నీవక్కనే సుమీ, జాగ్రత్తగా ఈకన్యను రక్షించవలసినభారం మనది" అని అప్పగించినాడు. తండ్రిమాట పాటించి శశిప్రభ కన్యారూపములో ఉన్న మనస్వామిని వెంటబెట్టుకొని అంతఃపురానికి తీసుకొనివెళ్లింది. మూలదేవుడు యథేచ్ఛగా వెళ్ళిపోయినాడు. మనస్వామి మారు రూపుతో ప్రియురాలిదగ్గిరే ఉన్నాడు.

క్రమేణా కొన్నాళ్ళకు ఇద్దరికీ చెలిమి బలపడింది. ఒకరాత్రి శశిప్రభ విరహావేదనవల్ల కంట తడిపెట్టి మనస్వామిన్త్రైకి తపించింది. చెంతనేఉన్న శయ్యమీద కూర్చున్నమనస్వామి "శశీ! ఇలా ఉంటున్నావేమి? ఆ రోజుకు ఆరోజు తెల్లగా పాలిపోతున్నావమ్మా! ఎందు కిలా ఉన్నావో చెపితే గాని ఒక్క మెతుకుకూడా నేను ముట్టను సుమీ" అనేసరికి శశి ప్రభ సమాధానం ఇచ్చింది.

"చెలీ నీమీద నమ్మకమే. సంగతి ఇది. నేను ఒకసారివసంత ములో పుష్పాపచయమునిమిత్తం వనంలోకి వెళ్ళినాను. అప్పుడు అందగా డయిన విప్రకుమారుణ్ణి చూచి వలచినాను. మా ఇద్దరి హృదయాలూ కలిసినవి. సరిగా అప్పుడే ఏనుగు కట్టుకంబాన్ని ఊడపెరికి దబ్బు విరగ గొడుతూ, మనుష్యులమీద పడింది. ఆవిప్రకుమారుడు నన్నుఎత్తుకొని వనగజముబారినుంచి రక్షించినాడు. అతనిశరీరస్పర్శ నాశరీరాన హరి చందనచర్చవలె తోచింది. ఒకసారి అమృతసరోవరములో మజ్జనమాడి నట్టు తోచింది. అభాగ్యురాలను! ఇద్దరమూ తలోదారీ అయినాము. ప్రాణేశ్వరునికోసం బాధపడుతున్నాను."

మనస్వామి నోటిలో ఉన్న యోగగుళికను తీసివేసి నిజ మైనరూపు ఆమెకు చూపినాడు. వెంటనే ఇద్దరూ గాంధర్వవివాహము చేసు కొన్నారు. రాత్రివేళ మనస్వామి విప్రకుమారుడై పగటివేళ కన్యా రూపంతో ఉంటూ ఎవరికీ సంశయానికి చోటు ఇవ్వలేదు.

ఇలా కాలం గడిచింది. యశఃకేతుని బావమరిది మృగాంకదత్తు డనే వాడు తనకుమార్తె అయిన మృగాంకవతిని, మంత్రి ప్రజ్ఞాసాగరుని కుమారునికిచ్చి వివాహము చేసినాడు. ఆవివాహానికి మేనమామఇంటికి శశిప్రభకూడా వెళ్ళింది. ఆమెతోకూడా కన్యారూపములో ఉన్న మన స్వామికూడా వెళ్ళినాడు. పెళ్ళికొడుకు పెళ్ళికుమార్తెతో వెళుతున్న ప్పటికీ అతని మన సంతా శశిప్రభవెంట కన్యారూపములో ఉన్న మన

స్వామిమీదనే ఉంది. వరుడు విరహంతో సొమ్మసిల్లినాడు. గోరు చుట్టుమీద రోకటిపోటువలె అతన్ని తాచుపాముకరిచింది. వెంటనే అతనుపడిపోయినాడు. ప్రజ్ఞాసాగరుడు వచ్చి కుమారునిచూచి తల్లడిల్లి నాడు. మంత్రికుమారుడు మూర్ఛలో వెర్రిగా కేకలు వేస్తూ మనో గతము ఎరుకపరిచినాడు. రాజమందిరములో గుప్తధనము వలెఉన్న కన్యారూపధారి మనస్వామిని మంత్రికుమారుడు ప్రేమించినాడు. ఈ కోరిక తీరడం అసాధ్య మని వరునితండ్రి తలచినాడు. యశఃకేతువు అక్కడికే వచ్చినాడు. వరుడు విరహములో మరణావస్థలో ఉన్నాడు. అప్పుడు రాజు మంత్రులను పిలిచి ఇలాపలికినాడు: "ఎవరో బ్రాహ్మ ణుడు వచ్చి ఈకన్యను నామందిరములో ఇల్లడ ముంచినాడు. ఈకన్యను మంత్రికుమారునకు ఇవ్వడానికి నేను స్వతంత్రుణ్ణి కాను. ఇతడు విర హమువల్ల మరణావస్థలో ఉన్నాడు. కుమారుడుచనిపోతేమంత్రి జీవించ లేడు. మంత్రిలేకపోతే ధర్మము ఎలానడుస్తుంది? కుమార సమేతంగా మంత్రిని చావనిస్తే బ్రాహ్మణహత్యాపాతకము నాకు సంక్రమిస్తుంది. ధర్మము స్థాపించవలె నంటే ఈకన్యను మంత్రిసుతునకు ఇచ్చి వివాహము చేయడం కర్తవ్యము."

వెంటనేపెద్దలు ముహూర్తము నిశ్చయించినారు. రాజప్రాసాదము నుంచి కన్యారూపములో ఉన్నమనస్వామిని మంత్రిగృహానికి రప్పించి నారు. మనస్వామి మహారాజుతో ఇలా పలికినాడు : "రాజన్! నన్ను వేరొకనికి ఇచ్చి పెళ్ళిచేయ వలె నని నాతండ్రి సంకల్పించినాడు. నన్ను మరొకరి కివ్వడం ధర్మ మవునో కాదో మీరే ఆలోచన చెయ్యండి. ధర్మాధర్మాలు ఎరిగినవారు. నేను ఒకషరతుమీద వివా హము అంగీకరిస్తాను. నాభర్త నాలుగుమాసాలదాకా గాని తీర్థ యాత్రలు చేసి తిరిగిరాడు. నాలుగు నెలలవరకూ నన్ను నూతన వరు నితో ఏకశయ్యలో పరుండ మని నిర్బంధము చేయవద్దు. అలా బాధి స్తే

నేనువెంటనే చనిపోతాను.'' రాజు ఆమాటలు విని అంగీకరించి వెంటనే మంత్రికుమారునికి మనస్స్వామి నిచ్చి వివాహము చేసినాడు. మంత్రి సుతుడు ఇద్దరుభార్యలనూ ఒకేఇంట్లో ఉంచినాడు. అతడు భార్యకోరిక తీర్చవలె నని తీర్థయాత్రలు చేసేనిమిత్తము ఇల్లు వదిలినాడు. మనస్వామి మృగాంకవతి అనే తోడుకోడలితోకూడా సమానశయన సౌఖ్యము అనుభవిస్తున్నాడు.

ఒకరాత్రి పరిజనము వసారాలో నిద్రలో ఉండగా శయ్యామందిరములో మృగాంకవతి వంటిమీద కునుకు రాలేదు. ఏకాంతములో ఆమె కన్యారూపములో ఉన్నమనస్స్వామితో "ప్రియసఖీ! కళ్ళుమూతపడవు కథ చెప్పమ్మా" అని అడిగింది.

మనస్స్వామి కథ ఆరంభించినాడు: "పూర్వము ఇలుడు అనే సూర్యవంశపురాజు పార్వతీశాపమువల్ల స్త్రీరూపాన్ని పొందినాడు. సఖీ! అలాగే దేవతాశక్తివల్ల పురుషుడు స్త్రీ కావడం, స్త్రీ పురుషుడు కావడం కద్దు. అలాంటిస్త్రీపురుషసంయోగము చిత్రంగానే ఉంటుంది, సుమా'' పెళ్ళిఅయినప్పటినుంచీ భర్తను ఎడబాసినమృగాంకవతి విరహాంవల్ల పులకరించిపోయి "సఖీ అలాగా! నాశరీరం కంపరమెత్తుతున్నది. గుండెలు జల్లుమంటున్నవి. నీవుప్రాణసమానవు. ఏఉపాయంవల్లనైనా ఇక్కడికి పురుషుడు వస్తే బాగుండును'' అని జాలిగా పలికింది. మనస్వామి ధూర్తుడై "సఖీ, విష్ణుదేవుని కృపాకటాక్షమువల్ల నేను పురుషుడనై పోగలను.'' అని నోట్లో ఉన్న యోగగుళికను తీసివేసినాడు. మనస్స్వామి పురుషుడుగా మారిపోగా ఇద్దరూ క్రీడాసుఖము అనుభవించినారు. మనస్స్వామి పగటివేళ స్త్రీరూపముతోను, రాత్రివేళ పురుషుడుగానూ మసలుతున్నాడు. మంత్రికుమారుడు యాత్రలు పూర్తి చేసుకొని వచ్చేలోగా మనస్స్వామి మృగాంకవతిని కూడాతీసుకొని పారిపోయినాడు.

ఈలోగా మనస్వామి గురు వైనమూలదేవుడు వృద్ధబ్రాహ్మణ వేషంతో యశఃకేతుమహారాజసన్నిధికి వెళ్ళి "రాజన్! నాకుమారుడు దేశాంతరమునుంచి తిరిగి వచ్చినాడు. మీదగ్గిర ఉంచిననాకోడలిని ఇప్పించండి." అని వినయముగా అడిగినాడు. మహారాజు మంత్రులతో కూడబలికి విప్రశాపభయంవల్ల "బ్రాహ్మణోత్తమా! నీకోడలు ఎక్కడికి వెళ్ళిందో మరి. ఆఅపరాధమునకు పరిహారంగా నాకుమార్తెను నీకుమారుని కిచ్చి వివాహము చేస్తాను." అని వేడుకొన్నాడు. మాయా బ్రాహ్మణవేషములో ఉన్నమూలదేవుడు కోపము అభినయించి తరువాత అంగీకరించినాడు. మహారాజు తనకుమారిని శశిప్రభను మూలదేవునిమిత్రునకు కట్టబెట్టినాడు. వివాహానంతరము వధూవరులు మనస్వామిని చూచినారు. మూలదేవునిసన్నిధిలో మనస్వామికీ శశిప్రభకూ వివాదము చెలరేగింది. శశి "నీ వెవరు? నాతండ్రి అగ్నిసాక్షిగా నాకు వివాహము చేసినాడు" అని పలికింది. "నేను గురుసన్నిధిలో నిన్ను అదివరకే పెళ్ళిచేసుకొన్నాను." అని మనస్వామి జగడమాడినాడు. నిర్ణయము కాలేదు.

కథ చెప్పడం పూర్తి అయింది. బేతాళుడు త్రివిక్రమసేనుని అడిగినాడు "రాజన్! ఇద్దరిలో శశిప్రభభర్త ఎవరు?" త్రివిక్రమసేనుడు "చౌర్యంగా మనస్వామి శశిప్రభను గాంధర్వవివాహము చేసుకొన్నాడు. ఆవివాహము చెల్లదు" అని సమాధానము చెప్పగా బేతాళుడు అంతర్ధానమైనాడు. అతన్ని తీసుకురావలెనని త్రివిక్రమసేనుడు శింశుపావృక్షముదగ్గిరికి వెళ్ళినాడు.

## తరంగము : ౯౦

## బేతాళకథ : ౧౬

త్రివిక్రమసేనుడు శింశుపావృక్షశాఖనుంచి బేతాళుని తనబుజాన ఎక్కించుకొని బయలుదేరినాడు. బేతాళుడు అతనిమార్గాయాసము పోగొట్ట దలచి కథ ఆరంభించినాడు.

హిమాలయ పర్వతసానువున కాంచనపురము ఉన్నది. జీమూతకేతువు అనేవిద్యాధరరాజేంద్రుడు పరిపాలన చేస్తున్నాడు. అతనిపెరటిలో తర తరాలనుంచీ కల్పవృక్షము ఉంటూ ఉన్నది. ఆరాజు కల్పతరువును ప్రార్థించి బోధిసత్త్వాంశసంభవు డైనజీమూతవాహనుడు అనే కుమారుని పొందినాడు. జీమూతవాహనుడు దానవీరుడు మహాసత్త్వుడు సర్వభూతహితుడు పితృశుశ్రూషాపరాయణుడు.

అతనికి వయసు రాగా తండ్రి పట్టము కట్టినాడు. జీమూతకేతువు అతనిమంత్రులూ యువరాజైన జీమూతవాహనునకు ఇలా హితము ఉపదేశించినారు : "మనపెరటిలో సకలార్థములను ప్రసాదించేకల్పతరువు ఉన్నది. నిత్యమూ దీనికి పూజాపునస్కారాలు చేయవలె. అలాచేస్తే దేవేంద్రుడు మనలను ఏమీచేయలేడు. అన్యులు మనజోలికే రాలేరు."

దయావీరు డైనజీమూతవాహనుడు ఇలాయోచనచేసినాడు : "ఈ కల్పతరువు పెరటిలో ఉన్నప్పటికీ నాతాతముత్తాతలు ఫలాన్ని పొందలేకపోయినారు. ఆసక్తితో ఆరాధనచేయడంవల్ల ఉత్కృష్టఫలమును మావారు పొందలేదు." అతడు తండ్రిదగ్గిరికి వెళ్ళి శుశ్రూషచేసి, ఆయనతో ఇలా మనవిచేసినాడు : " తండ్రీ! ఈదేహముస్థిరము కాదని నీకు తెలుసునుకదా. సంధ్యకాంతిసౌదామని. సంపదలు అస్థిరములు. భోగములు క్షణికములు. అటువంటిసందర్భంలో ఈకల్ప వృక్షము మనకెందుకు? అభిమానముతో ఈతరువును కాపాడుకొంటూ వచ్చారు మనపూర్వులు. నేను పరహితార్థము ఈకల్పవృక్షమును వినియోగించ దలచినాను." కుమారునివచనములు విని జీమూతకేతువు అంగీకారమిచ్చినాడు.

జీమూతవాహనుడు కల్పతరువును ఇలా వేడుకొన్నాడు : "సకలార్థదాయినీ! మాతాతముత్తాతలకోరికలు తీర్చినదానివి. నాకోరిక ఒక్కటే. ఈలోకంలోవారి దారిద్ర్యము లేకుండా చేయి; అర్థులకు నిన్ను అర్పి

స్తాను తల్లీ!" కల్పవృక్షము వెంటనే స్వర్గలోకానికి ఎగిరి, కనకవృష్టి కురిపించింది. అతనికీర్తిచంద్రికలు దశదిశలా వెలిగినవి. కల్పతరువు లేకపోవడంవల్ల జీమూతవాహనుడు అజేయుడు కాడని అతనిదాయాదులు తలచినారు. అతనిరాజ్యమును హరించవలెనని యుద్ధము ప్రకటించినారు. అప్పుడు కుమారుడు తండ్రితో "నాయనా! నీవు ఖడ్గము చేతబట్టి యుద్ధములో దిగినపక్షములో శత్రువులు ఎవరూ నిలవలేరు. బంధువులను చంపి, రక్తసిక్తము లైనరాజ్యభోగములను అనుభవించడం అనవసరము. క్షణభోగాయతనమైన ఈ శరీరముకోసము ఇందరిని చంపడం ధర్మము కాదు. రాజ్యలోభులకు మనరాజ్యమును వదలి ఇహపరసుఖములకు కావలసినధర్మము ఆచరించుదాము" అనిపలికినాడు.

తండ్రి "కుమారా, నీకోసమేగదా ఈ రాజ్యము? సర్వభూతహితుడవై రాజ్యమును త్యజిస్తున్నావు. నీఅభిమత ప్రకారమే కానీ" అని కుమారునికోరిక చెల్లించినాడు.

జీమూతవాహనుడు రాజ్యమును వదలి, తల్లినీ తండ్రినీ మలయాద్రి సానువుపైన ఏర్పాటుచేసిన ఆశ్రమములో ఉంచినాడు. నిత్యమూ అతడు జననీ జనకులకు శుశ్రూషచేస్తూ ఉన్నాడు. ఇలా ఉండగా మిత్రావసువు అనే అతనితో విశ్వావసువుఅనే రాజపుత్రునికి చెలిమికలిసింది. ఒకసారి జీమూతవాహనుడు ఉపవనములో ఉన్న గౌరిని దర్శించవలెనని వెళ్ళినాడు. అప్పుడు దివ్యకన్య పరివార సఖీజనముతో వచ్చి గౌరీపూజ ముగించి, వీణావాదనము చేస్తున్నది. ఆకన్య వల్లకీతంత్రులు మీటుతూ గీతము పాడుతున్నప్పుడు సారంగములు కదలక మెదలక చెవులు దోరపెట్టుకొని విన్నవి. ఆమె లావణ్యమును జీమూతవాహనుడు కన్నులార కాంచినాడు. అతనిమనస్సు దివ్యకన్యామయమైపోయింది. ఆసుందరి వలపువిరాళికి సహించలేక విరహగీతములు పాడింది. వీణాతంత్రులు ఆకన్నె మనసును బైట పెట్టినవి. జీమూతవాహనుడు చెలికత్తెద్వారా

ఆమె పేరు మలయవతిఅనీ, సిద్ధరాజైన విశ్వావసుని కుమార్తె అనీ తెలుసుకొన్నాడు. ఒక మునికుమారునివల్ల చెలికత్తె జీమూతవాహనుని ఊరుపేరులు తెలుసుకొని మలయవతికి మనవిచేసింది. "సఖీ, మలయవతీ! జగత్పూజ్యుడయిన ఈ అతిథి లభించినాడు; సామాన్యుడుకాడు; విద్యాధరేంద్రుడు." ఆమాటలు విని మలయవతి రేకెత్తిన లజ్జతో మొగము వంచి ఊరకున్నది. అప్పుడు చెలి "ఈచెలువ లజ్జావతి. నావల్ల మీరు అర్చన స్వీకరించండి" అని జీమూత వాహనునకు అర్ఘ్య మిచ్చి పుష్పమాల అర్పించింది. అతడా సుమమాలను పుచ్చుకొని మలయవతి కంఠాన వేసినాడు. మలయవతి క్రీగంటి చూపు లనే నల్లకలువల దండను ప్రియుని కంఠానవేసింది. ఇలా ప్రేయసీప్రియులు మాటామంతీలేకుండా స్వయంవరము పూర్తిచేసు కోగా చీకటివచ్చి "అమ్మా, మలయవతీ! మీకోసం అమ్మగారు కనిపెట్టుకొన్నారు. చప్పున రావాలి" అన్నది.

మలయవతి ప్రియునిమీద సారించిన చూపును మరల్చుకోలేక ఎలాగో ప్రయత్నముమీద దృష్టి మరల్చుకొన్నది. ఆమె ఇంటికి వెళ్ళి తల్లినిచూచి ప్రాణేశునిమీది వలవంతవల్ల సిగ్గుపడ్డది. ఆమె కన్నీరు పొంగి కపోలాలను తడిపింది. మలయవతి విరహబాధతో తామరాకుల పాన్పుమీద పరుండలేక పోయింది. ఆమె దూతికను ప్రియుని దరికి పంపేనేర్పు తెలియక అటమటించిపోయింది. అలాగే జీమూతవాహనుడు విరాళికి సహించలేక సెజ్జపైన పరుండి, విరహంవల్ల పాలిపోయి, ముని అయినప్పటికీ సిగ్గుచేత కామార్తి చెప్పలేక చెపుతూ రాత్రి గడిపినాడు. అతడు మలయవతీ దర్శనార్థము గౌరీదేవాలయానికి తమకముతో వెళ్ళినాడు. అతనివెంట అదివరకు వచ్చిన మునికుమారుడుకూడా వచ్చినాడు. జీమూతవాహనుడు విరహమువల్ల నిట్టూర్పులు వదులుతూ ఉండగా మునికుమారుడు అతనిని ఊరడించినాడు. అదేసమయాన

మలయవతి విరహాతురయై ఏకాకినిగా వనములో ప్రవేశించి, తలిరాకు జొంపాలమాటున ప్రియుని చూడలేక కన్నీరుమున్నీరుగా విలపించింది. ఆమె దేవికి వందనము చేసి "జగజ్జననీ! నాకీ జన్మలో జీమూతవాహనుడు భర్తకాకపోయినా, వచ్చే జన్మలో అయినా అతడే నాథర్తగా అనుగ్రహించుతల్లీ! అలా వరాన్ని ప్రసాదించవా మాతా!" అని వేడింది.

వెంటనే మలయవతి గౌరీదేవిఎదుట అశోకతరుశాఖకు తన పైట చెంగును ఉరితాడుగా కట్టుకొని "ప్రాణేశ్వరా! జీవనవల్లభా! జీమూతవాహనా! కరుణాపారీణా! నన్ను రక్షించవా" అంటూ కంఠాన పాశము తగిలించుకోబోయింది. గగనవాణి "కుమారీ! సాహసము కూడదు. విద్యాధరేంద్రుడైన జీమూతవాహనుడే నీకుభర్తకాగలడు!" అన్నది. వెంటనే సంతోషముతో పొంగిపోయి జీమూతవాహనుడు వయస్యునితో ప్రియురాలిదరికి వచ్చినాడు. చెలికాడయిన మునికుమారుడు "ఓవరవర్ణినీ! మలయవతీ! అమ్మవారిచ్చిన వరదానము! ఇదిగో నీ ప్రియుడు" అని పలికినాడు. విద్యాధరేంద్రుడు దక్షిణహస్తముతో ఆమె కంఠపాశమును తొలగించినాడు. ఆమె కన్నులు లజ్జాభారమువల్ల వంచి నేల బొటనవేలితో రాస్తూఉండగా, చేటి ఆమెకై వెతుక్కుంటూవచ్చి "కల్యాణీ, నీకు శుభము! నీకోరిక నెరవేరింది. ఇప్పుడే మీతండ్రి మిత్రావసువుతో చెప్పినారు. జీమూతవాహనుడు వచ్చినాడనీ, అతన్ని మనము సత్కరించి, మలయవతినిచ్చి పూజించాలనీ అన్నారు. మీతండ్రికోరికమీద మిత్రావసువు జీమూతవాహనుని కోసము మలయగిరి దరిలో ఆశ్రమ పదమునకు వెళ్ళినాడు. త్వరలో మీ వివాహము సిద్ధిస్తుంది. మనము ఇంటికి వెడదాము. జీమూతవాహనుడు ఆశ్రమానికి వెడతారు." అన్నది. మలయవతి చేటితో ముసిముసినవ్వులు నవ్వుతూ ప్రియుణ్ణి పదేపదే వెనుతిరిగి చూస్తూ ఇంటికి వెళ్ళింది.

జీమూతవాహనుడు మలయసానువుపైన ఉన్న ఆశ్రమపదము చేరినాడు. మిత్రావసువు అతనిని చూచి తాను వచ్చిన కార్యము తెలియచేసినాడు. జీమూతవాహనుడు అంగీకారము తెలిపినాడు. అతడు పూర్వజన్మవృత్తాంతము ఎరిగినవాడు, కనుక మలయవతి పూర్వజన్మలో తనప్రియురా లని, మిత్రావసువు మిత్రు డనీ అక్కడివారికి తెలియ బరచినాడు. కుమారునికి వివాహము అవుతుం దని తల్లీ తండ్రీ సంతోషించినారు. మిత్రావసువు జీమూతవాహనుని సిద్ధరాజు సన్నిధికి తీసుకొని వెళ్ళినాడు. సిద్ధుల ఆచారప్రకారము శుభముహూర్తాన మలయవతీ జీమూతవాహనులకు వివాహము జరిగింది. కొన్నాళ్ళు అతడు అత్తవారింటనే ఉన్నాడు.

ఒకసారి జీమూతవాహనుడు మలయాచల సానువుమీదికి మిత్రావసువుతో విహారము సలుపుతూ ఉన్నాడు. సముద్రతీరాన అతడు ఎముకలపోగులుచూచి "మిత్రమా, ఈ అస్థిరాసులు ఏజంతువులవి?" అని అడిగినాడు. బావమరిది మిత్రావసువు ఇలా సమాధానము ఇచ్చినాడు. "పూర్వము నాగులతల్లి కద్రువ, గరుడమాత వినతను మోసగించి చేయించిన ఒడంబడికను గరుత్మంతుడు తోసివేసి, కసితీరా నాగులను తినివేయడం మొదలు పెట్టినాడు. నాగులందరూ నాశన మయ్యే పరిస్థితి రాగా నాగరాజు వాసుకి గరుత్మంతుని బతిమాలుకొని "గరుత్మన్! నీకు నిత్యమూ ఒక్కొక్క నాగుని ఈ దక్షిణసముద్రతీరాన ఉన్న ఇసుక తిన్నెలమీదికి పంపుతూ ఉంటాను. నీవుమాత్రము పాతాళము ప్రవేశించి పాములన్నింటినీ నాశనం చెయ్యకు." అంటే గరుత్మంతుడు అంగీకరించినాడు. నాడుమొదలు నేటివరకూ వాసుకి పంపేపాములను దినదినమూ భక్షిస్తున్నాడు. ఈ కనబడే అస్థికలన్నీ పాములవి! ఎన్నెన్నిదిబ్బ లయినవో చూడు!"

ఇలా అంటూ ఉండగా జీమూత వాహనుని గుండె కరిగిపోయింది.

"అయ్యో, వాసుకి ఎన్నెన్ని పాములను శత్రువుకు పంపిస్తున్నాడోగదా! రెండువేలనాలుకలున్న వాసుకి గరుత్మంతునికి ఆహుతి కాలేకపోయి నాడు. తనపాతాళలోక వాసులను ఇలా నాశనము చేస్తాడా? కశ్యప తనయుడై, విష్ణువాహనమైన గరుత్మంతుడు ఇంత దారుణముగా ప్రవర్తి స్తున్నాడే! నాగాంగనలరోదనము వినికూడా గరుత్మంతుడు ఎంతకఠినంగా ఉన్నాడో! ఇంతకు అజ్ఞానప్రభావము!" అని జీముతవాహనుడు తలచి నాడు. అతడు నాగులను రక్షించ దలచినాడు. గరుత్మంతునకు నిస్సార మైన నిజదేహమును అర్పించవలె నని జీమూతవాహనుడు నిర్ణయించు కొన్నాడు. సరిగా అప్పుడే విశ్వావసు మహారాజు రమ్మంటున్నా రని ప్రతీహారుడు వచ్చి మిత్రావసువును పిలిచినాడు.

జీమూతవాహనుడు సిద్ధరాజసన్నిధికి వెళ్ళదలుచుకోలేదు; 'నేను తరువాత వస్తాను' అని మిత్రావసువుతో చెప్పిపంపినాడు. అతడు తన కోరిక తీరేఉపాయము తోచక అటూఇటూ తిరుగుతూ ఉండగా ఆర్తనాదము వినవచ్చింది. జీమూతవాహనుడు వెళ్ళగా రాజభటుడు యువకుని పట్టితెచ్చి ఉంచడము గమనించినాడు. యువకుడు ఏడు స్తున్న వృద్ధమాతను ఓదార్చి పంపుతున్నాడు. ముసలిది పుత్రశో కము భరించలేక 'అయ్యో, కుమారా, శంఖచూడ కులానికి లేకలేక ఒక్కడివే నాకడుపున పుట్టినావు. నిన్నెలా గరుత్మంతునికి అర్పించ నురా? ఈశోకభారంతో నేనెలా జీవించను" అని విలపిస్తూ ఉండగా శంఖచూడుడు "తల్లీ ఇంటికివెళ్ళు. గరుత్మంతుడు వచ్చేవేళ అయింది. ఇదే నాకడపటినమస్కారము" అని పలికినాడు. ఆమాటలు విని తల్లికి కడుపు చెరువైపోయింది. బోధిసత్త్వాంశుడయిన జీమూత వాహ నుడు జాలితో 'అయ్యో, వీడు నాగుడు. వాసుకి ఇతనిని గరుత్మంతునికి ఆహారంగా పంపినాడు. పాపము, ఆతల్లికి వీడు ఏకపుత్రుడు. ఇతనిని రక్షించని నాతను వెందుకు?" అని ఆలోచించి వృద్ధురాలి వద్దకు వెళ్ళి

"అమ్మా నీకుమారుని నేను రక్షిస్తాను" అని హెచ్చరించినాడు. ఆమాటలు విని ఆవచ్చినది గరుత్మంతు డని భయపడి "గరుత్మంతా నన్ను తిను. నన్ను తిను." అనిఆమె విలపించింది. అప్పుడు శంఖ చూడుడు "అమ్మా, ఇతడు ఎవరోమహానుభావుడు, సౌమ్యుడు" అని పలికినాడు. జీమూతవాహనుడు వృద్ధురాలితో "అమ్మా, నేను విద్యా ధరుడను. నీకుమారుని రక్షించ వలెనని వచ్చినాను. నీకుమారుని రక్తవస్త్రమును నేను కప్పుకొని గరుత్మంతునకు ఆహార మవుతాను. కుమారుని తీసుకొని ఇంటికి వెళ్ళనమ్మా" అని ధీరముగా పలికినాడు.

వృద్ధురాలు జాలిగా "నాయనా, ఇంత దయాళువైన నీవు నా కుమారునికన్న ఎక్కువైన వాడివి" అన్నది. జీమూతవాహనుడు "నాకోరిక తీరక తప్పదు. మీరెవరూ అడ్డురావద్దు." అని నిశ్చిత వచనములు పలికినాడు. శంఖచూడుడు అతని మహోదారగుణమును గ్రహించి "మహాసత్త్వా! నీమహాకారుణ్యము స్పష్టముగా కనపడు తున్నది. నీశరీరత్యాగము వల్ల నాశరీరము కాపాడుకోను. రత్నాన్ని ఇచ్చి పాషాణమును ఎవడు కాపాడుకొంటాడు?" అని ధైర్యంగా పలికి, తల్లితో "అమ్మా తోవతిన్నగా లేదు. చప్పున ఇంటికివెళ్ళిపో. నేనిప్పుడే సముద్ర తీరాన ఉన్న గోకర్ణేశ్వరుని సేవించి వస్తాను. గరుత్మంతుని ఎదురుచూస్తాను" అంటూ ఏడుస్తున్న తల్లికి పాదాభివందనము చేసి సెలవుతీసికొని వెంటనే గోకర్ణ క్షేత్రానికి వెళ్ళినాడు.

త్వరగా గరుత్మంతుడు వస్తే శరీరాన్ని అర్పించ వచ్చునని జీమూత వాహనుడు త్వరపడుతున్నాడు. గరుత్మంతుని రెక్కలగాలి రివ్వురివ్వున సాగింది. అది కనిపెట్టి ఆమహాసత్త్వుడు వడివడిగా వచ్చి అతన్ని ముక్కున కరిచి శిరోరత్నమును పెరికి వేసినాడు. ఆపక్షీంద్రుడు జీమూతవాహనుని మలయాచల శృంగానికి తీసుకుపోతూఉంటే దారిలో రక్తము జాలుగాకురిసింది. గరుత్మంతుడు ముక్కుతో అతన్ని

రక్కుతూ మాంసము తింటున్నాడు. అప్పుడు జీమూత వాహనుడు "ఇలా నాశరీరము పరహితార్థము వినియోగపడాలి. నాకు స్వర్గము అవసరములేదు. జన్మ జన్మకి ఇదేవిధంగా నాశరీరము అన్యులకై అర్పించాలి." అని ధ్యానముచేయగా ఆకాశమునుంచి దేవతలు అతని శిరసుమీద పూలవాన కురిపించినారు.

జీమూతవాహనుని శిరోరత్నము రక్తసిక్తమై మలయవతికి కనపడింది. ఆమె నెత్తుట తడిసిన రత్నాన్ని అత్తమామలకు చూపింది. వారు తెల్లపోయినారు. కొంతసేపటికి యోగదృష్టివల్ల జీమూతకేతువు కుమారుని అవస్థకనిపెట్టి వెంటనే భార్యతోను కోడలు మలయవతితోను మలయాచల శిఖరము దరికి వెళ్ళినాడు. ఈలోగా శంఖచూడుడు రక్తసిక్తమైన వధ్యశిలను చూచి, విలపించి, నెత్తురుజాడనుబట్టి జీమూత వాహనుని వద్దకు వెళ్లినాడు.

గరుత్మంతుడు జీమూతవాహనుని సంతోషమును కనిపెట్టి ఆశ్చర్యపడి "ఇతడెవరో మహాసత్త్వుడు, నాగుడు కాడు. ఈసాధుమూర్తిని భక్షించను" అని అతన్ని వదిలిపెట్టినాడు. జీమూతవాహనుడు "గరుత్మన్! నా దేహములో ఇంకా రక్తమాంసాలు ఉన్నవి. నీఆకలి ఇంకా తీర లేదు. నన్ను భక్షించు" అని వేడినాడు. గరుత్మంతుడు సంభ్రమముతో మహానుభావా! నీవెవరో దయచేసి చెప్పవలె" అనికోరినాడు. అప్పుడు జీమూతవాహనుడు "పోనీ, నన్ను నాగుడనే అనుకొని భక్షించు" అన్నాడు. శంఖచూడుడు దూరమునుంచి ఎలుగెత్తి "వైనతేయా, ఆయన నాగుడు కాడు. సాహసము కూడదు. నేనే నీఆహారము" అని కేకలు వేయగా గరుత్మంతుడు ఆశ్చర్యపడినాడు. శంఖచూడుడు పక్షీంద్రునితో మాట్లాడుతూ ఉండగా జీమూతవాహనుని తల్లీ, తండ్రీ, భార్యా వచ్చినారు. అందరూ అతన్ని చూచి రోదించినారు. ఆపరిదేవనము విని గరుత్మంతుడు పశ్చాత్తాపము పొంది "అయ్యా, బోధిసత్త్వాంశ

సంభవు డయినజీమూతవాహనుని తెలియక భక్షిస్తున్నాను. ఇతడు చనిపోతే నాకు పాపము చుట్టుకొంటుంది" అని పలికినాడు. జీమూత వాహనుడు వెంటనే చనిపోయినాడు.

తల్లితండ్రులు గుండెలు పగిలేటట్టు విలపించినారు. శంఖచూడుడు తనను నిందించుకొన్నాడు. మలయవతి భర్తృశోకమువల్ల దీనాతి దీనమై గౌరినిధ్యానించింది. అప్పుడు గగనవాణి "భావివిద్యాధరచక్ర వర్తి నీకు వరు డవుతా డని వరము ఇచ్చినాను. నామాట జరిగితీరు తుంది" అన్నది. దేవి ప్రత్యక్షమై జీమూతవాహనుని దేహముమీద అమృతాన్ని చిలకరించింది. వెంటనే జీమూతవాహనుడు ప్రవృద్ధతేజ ముతో బతికి లేచి జగజ్జననికి నమస్కరించినాడు. అప్పుడా దేవి "కుమారా! త్వరలో నీవు విద్యాధరచక్రవర్తివి కాగలవు. అంటూ అతన్ని అభిషేకించి అంతర్ధానమైంది. గగనమునుంచి పూలవాన కురిసింది.

గరుత్మంతుడు సవినయముగా జీమూతవాహనునితో "చక్రవర్తీ! నీ మహాసత్త్వము, నీ ఔదార్యము చూచి ప్రీతి చెందినాను. నీ కే వరము కావాలి?" అని అడిగినాడు.

జీమూతవాహనుడు "నీ వింక పాములను తినవద్దు. నాగాస్థికల రాను లన్నీ అమృతముతో తడుపు. చనిపోయిన నాగజాతి తిరిగి జీవిం చాలి" అని కోరినాడు. సముద్రతీరానఉన్న నాగులు ఉజ్జీవితు లైనారు. జీమూతవాహనునివల్ల నాగానందము కలిగింది. వాసుకి అతనిని కొని యాడినాడు. పార్వతీపరమేశ్వరులు అతనికి విద్యాధరచక్రవర్తిత్వము ప్రసాదించినారు.

బేతాళుడు కథ చెప్పడము పూర్తి అయింది. అతడు త్రివిక్రమ సేనునితో "శంఖచూడుడు గొప్పవాడా? జీమూతవాహనుడు ఘనుడా?" అని ప్రశ్నించినాడు. త్రివిక్రముడు "బేతాళా! చావు తప్పిపోయినా శంఖచూడుడు తనను అర్పించుకోవలె నని గరుత్మంతునిదగ్గరికి వెళ్ళి

నాడు. కనుక అతడే సత్త్వాధికుడు అని సమాధాన మిచ్చినాడు. బేతాళుడు యథాప్రకారంగా అంతర్ధానమై శింశుపావృక్షాన వేలాడుతున్న శవదేహములో ప్రవేశించినాడు.

## తరంగము: ౯౧

## బేతాళకథ: ౧౭

త్రివిక్రమసేనుడు బేతాళుని బుజాన ఎక్కించుకొని బయలుదేరినాడు. బేతాళుడు త్రివిక్రముని మార్గాయాసము పోగొట్టవలె నని కథ ఆరంభించినాడు.

గంగాతీరాన కనకపురమును యశోధనమహారాజు పరిపాలిస్తూ ప్రజలమన్ననలు పొందినాడు. అతనిరాజధానిలో ఒకవర్తకునికుమార్తె పేరు ఉన్మాదిని. కన్నెత్తి చూచినవాడు ఉన్మత్తుడవుతాడు. కన్యకు వయసు రాగా తండ్రి యశోధనునిదగ్గిరికి వెళ్ళి "ప్రభూ, నాకుమారి త్రిలోకసుందరి. దీనికి పెళ్ళి ఈడువచ్చింది. తమకు చెప్పకుండా అన్యునకు ఇవ్వదలచలేదు. తమరే ఈకన్యను స్వీకరించాలి" అని కోరినాడు. యశోధనుడు ఉన్మాదినీ సౌందర్యమును చూచి రమ్మని విప్రులను పంపినాడు. విప్రులాకన్యను చూచి ఉన్మత్తులై కొంతసేపటికి స్తిమితపడి "ఈరమణీమోహపాశములో మనప్రభువు చిక్కి రాజ్యపాలన చెయ్యలేడు. రాజ్యము నాశనమై పోతుంది. ఈకన్య సులక్షణ అని మనము ప్రభువుకు చెప్పకూడదు." అని ఆలోచించుకొని రాజుదగ్గిర అబద్ధ మాడినారు. యశోధనుడు వైశ్యకుమారిని వివాహము చేసుకోలేదు. రాజాజ్ఞప్రకారము వర్తకుడు కుమార్తెను బలధరుడు అనే సేనానాయకునకు పెళ్ళి చేసినాడు. ఉన్మాదిని "నేను సులక్షణను కానని మహారాజు స్వీకరించలేదు" అని కించపడి భర్తతో కాపురము చేస్తున్నది.

యశోధనుడు వసంతోత్సవము చూడవలెనని గజారోహణము చేసి ఊరేగినాడు. వర్తకుని కుమారి, ఉన్మాదిని మేడమీదినుండి మహారాజును చూచింది. ఆమె కనపడిన మాత్రాన అతని హృదయము కల్లోలమైనది. ఆమె చూపులకు రాజు వివశుడై మూర్ఛపోయినాడు. పరివారజనులు అతనిని ఓదార్చినారు. ఉన్మాదిని కులక్షణ అని అబద్ధాలాడిన విప్రులను మహారాజు వెళ్ళగొట్టినాడు. ఆయన అహోరాత్రములు ఆసుందరినే ధ్యానిస్తూ కామాగ్ని పుటపాకములో కుములుతున్నాడు. అప్పులు చిక్కిపాలిపోతున్న యశోధనుని చూచి జాలిగా "రాజేంద్రా, ఎందుకు మీరిలా కృశిస్తున్నారు?" అని అడిగినారు. సేనాధిపతి బలధరుడు ప్రభువును "దేవా, నీదాసుని దార పరదార కాదు, నీచరణదాసి. నాభార్యను ఏలినవారు స్వీకరించాలి" అని వేడినాడు. కొంతసేపు ఊరుకొని "దేవా, అలా మీకు ఇష్టము కాకపోతే నాభార్యను దేవాలయములో ఉంచుతాను స్వామీ! దేవదాసిని మీరు స్వీకరించవచ్చును" అని బలధరుడు విన్నవించినాడు.

యశోధనుడు "నేనే నీతి తప్పితే లోకము చెడిపోక మానదు. నీవు భార్యను వదలవద్దు. అధర్మాచరణముకన్న మరణమే మేలు" అని పలికినాడు. మహాసత్త్వులు ప్రాణత్యాగమైనా చేస్తారు, సదాచారము వదలివెయ్యరు. కొన్నాళ్ళకు రాజచంద్రుడు క్షీణించి కీర్తిశేషుడైనాడు. ప్రభుభక్తి పరాయణుడైన బలధరుడు కన్నీరు కారుస్తూ చితాగ్నిలో దుమికినాడు.

బేతాళుడు కథ చెప్పి త్రివిక్రముని "రాజన్, రాజ సేనాపతులలో సత్త్వాధికుడు ఎవడు?" అని అడిగినాడు. "మహారాజు సత్త్వాధికుడు" అని త్రివిక్రమసేనుడు సమాధానమిచ్చినాడు. బేతాళుడు "సేనాధిపతి సత్త్వాధికుడు ఎందుకు కాడు?" అని తిరిగి ప్రశ్న వేసినాడు. రాజు ఇలా ప్రత్యుత్తరమిచ్చినాడు. "సేనాధిపతి ప్రభుభక్తివల్ల ప్రాణ

త్యాగము చేసినాడు. అందులో ఘనత ఏమున్నది? రాజు ఉద్రిక్త చిత్తుడై ఉన్నవాసికై ధర్మనాశనము చేయక తానే మరణించినాడు. ధర్మాత్ముడై ప్రాణాలు వదలినాడే కాని అధర్మము చేయలేదు. అందువల్ల రాజే సత్త్వాధికుడు." ఈ సమాధానము విని బేతాళుడు వెంటనే అంతర్ధానమైనాడు. అతన్ని వెతికి తీసుకు రావలె నని త్రివిక్రమసేనుడు శింశుపావృక్షముదగ్గిరికి వెళ్ళినాడు.

## తరంగము: ౯౩

## బేతాళకథ: ౧౮

శ్మశానములో శవములు తగులబడుతూ భయంకరముగా ఉన్నవి. త్రివిక్రమసేనుడు ఎదురు బెదురు లేకుండా రుద్రభూమిలో నడుస్తున్నాడు. శింశుపావృక్షసమీపాన అతనికి లెక్కలేనన్ని శవములు కొమ్మలలో వేలాడుతున్నవి. ప్రతిశవదేహములో మాయాబేతాళుడు అధిష్ఠితుడైనాడు. మహారాజు కొంతసేపు కర్తవ్యము తోచక ఇటూ అటూ తారట్లాడినాడు. నిజంగా బేతాళుడున్న శవము తెలుసుకోలేక త్రివిక్రముడు సాహసించి "బేతాళు డెవడో తెలియకపోతే ఈరాత్రి నేను ప్రాణత్యాగము చేస్తాను" అని నిశ్చయము చేసికొన్నాడు. అతనిసత్యము కనిపెట్టి బేతాళుడు తన మాయను పోవిడిచినాడు. త్రివిక్రముడు బేతాళాధిష్ఠిత మయిన శవము బుజాన వేసుకొని నడిచినాడు. అతని మార్గాయాసము పోగొట్టవలెనని బేతాళుడు కథ ఆరంభించినాడు:

ఉజ్జయినీనగరాన్ని చంద్రప్రభ మహారాజు పరిపాలిస్తున్నాడు. ఆయనమంత్రి దేవస్వామి క్రతువులు చేసినసోమయాజి, సోమయాజులు కుమారుడైన చంద్రస్వామి చదువుకున్నవాడయినా జూదమాడి సొమ్మంతా ఖర్చుపెడుతున్నాడు. అతడు అందరినీ జూదమాడుదామని

రండని పిలవడము సాగించినాడు. అలకాపతి కుబేరునికూడా ఓడించి వేస్తానని ప్రగల్భాలు పలుకుతున్నాడు. చంద్రస్వామి జూదగాళ్ళతో చేరి పాచికలాడి ఓడిపోయినాడు. ఇల్లుగుల్ల కాగా కట్టుబట్టలతో అతడు మిగిలి జూదగాళ్ళకు ధనము ఇచ్చుకోలేకపోయినాడు. అందుచేత వారు అతన్ని చితకకొట్టినారు. రెండుమూడురోజులు చంద్రస్వామి కదలక మెదలక పడి ఉన్నాడు. జూదగాళ్ళ సభాపతి స్నేహితు లందరితో "చంద్రస్వామిని చీకటినూతిలో పారవేయండి. వాడు ఇవ్వవలసిన సొమ్ము నేను ఇస్తాను" అని పలికినాడు జూదరులు చంద్రస్వామిని మోసుకొని అడివిలో చీకటినూతికోసము వెతక నారంభించినారు. వాళ్ళలో వృద్ధుడు "చంద్రస్వామి జీవిస్తాడని తోచదు. వీణ్ణి నూతిలో పారేస్తే వచ్చేలాభ మేమిటి? ఇక్కడే పారేసి నూతిలో పారేశా మని చెప్పివేదాము" అని పలికినాడు. అందరూ అందుకు అంగీకరించినారు.

వారు చంద్రస్వామిని విడిచి వెళ్ళినారు. అతడు శూన్యశివాలయములో ప్రవేశించి "అయ్యో, జూదగాళ్ళు నన్ను మోసము చేసినారు. శరీరాన బట్టలులేవు. దుమ్ముకొట్టుకు పోయినాను. ఈస్థితిలో బంధుమిత్రులు నన్ను చూచి ఏమంటారు? ఈరాత్రి ఎక్కడో తలదాచుకుని ఆకలి తీర్చుకోవలె" నని తలచినాడు. సూర్యాస్తమాన మైంది. ఆసమయంలో జటాశూలధారి అయిన సన్యాసి కేవలము శివునివలె వచ్చినాడు. అతడు చంద్రస్వామి సంగతి తెలుసుకొని "నాఆశ్రమానికి అతిథిగా వచ్చినావు. లేచి స్నానముచేసి నాభిక్షలో భాగము పుచ్చుకొందువుగాని" అని ఆర్ద్రహృదయుడు వెల్లడించినాడు. చంద్రస్వామి "స్వామీ, నేను బ్రాహ్మణుడను, మీభిక్షాభాగము ఎలా స్వీకరించను?" అని సందేహించినాడు. ఆసన్యాసి మఠములో ప్రవేశించి ఇష్టసంపాదన విద్యను స్మరించినాడు. వెంటనేవిద్య సాక్షాత్కరించి ఏమి చేయవలెను?" అని అడిగింది. తాపసుడు విద్యతో "ఈఅతిథికి ఆతిథ్యము

ఇవ్వవలె" అని ఆనతిచ్చినాడు. ఆమె సరేనని పలికింది. వెంటనే అక్కడ ఉపవనము ఉత్పన్నమైనది. అందులో అంగనలతో రంగారు బంగారు నగరము ఏర్పాటయింది. చంద్రస్వామి తెల్లపోయి చూస్తూఉండగా వార వనితలు వచ్చి అతన్ని 'స్నానానికి లేవండి. భోజనము సిద్ధంగా ఉంది' అంటూ లోపలికితీసుకొనివెళ్ళినారు. వారు అతనికి స్నానము చేయించి శరీరాన హరిచందన చర్చచేసి సన్నని వలువలు కట్టుకోమనిఇచ్చి మరొక మందిరములోకి తీసుకొనివెళ్ళినారు. అక్కడ సుందరాంగి ఉత్కంఠతో లేచి తన అర్ధాసనముమీద చంద్రస్వామిని కూర్చోపెట్టింది. అతడు ఆమెతో మద్రసోపేతంగా భోజనముచేసితీయునివళ్ళు ఆరగించినాడు. రాత్రి సుందరితో శయ్యాభోగము అనుభవించినాడు. ఉదయాన మేలుకొని చూచేసరికి దివ్యభవనము గాని ఉపవనముగాని అందగత్తెగాని కనపడ లేదు. చంద్రస్వామి బెంగతో మఠము విడిచిరాగా తాపసుడు "అయ్యా రాత్రి సుఖంగానిద్ర పట్టిందా?" అని ప్రశ్నించినాడు. చంద్ర స్వామి "స్వామీ. మీదయవల్ల సుఖము అనుభవించాను. ఆసుందరి నాకు తెల్లవారేసరికి కనపడడములేదు. ఏమి చెయ్యను. ప్రాణాలు పోతున్నవి" అని జాలిగా సమాధానము ఇచ్చినాడు. తాపసుడు నవ్వుతూ "అలాగే రాత్రి సుందరితో భోగము అనుభవించ వచ్చును. అందాకా మనసు చిక్కబట్టు" అని ఊరడించినాడు.

ప్రతి రాత్రీ చంద్రస్వామి సన్యాసి దయవల్ల సుందరితో శయ్యా భోగము అనుభవిస్తూ దివ్యాహారము తింటూ ఉన్నాడు. ఒకనాడు చంద్రస్వామి "స్వామీ, మీవిద్యనాకు ఉపదేశించండి" అని వేడు కొన్నాడు. ఇలా తాపసుడు పలికినాడు: "విద్య సాధించడము మాట లతో కాదు. నీటిలోమునిగి జపము చేయవలసి ఉన్నది. జపము చేస్తు న్నప్పుడు విద్య మాయాజాలము పన్ని సాధకునికి అడ్డువస్తుంది. విద్యా దేవత అతనిని సిద్ధి పొందనీయదు. సాధకుడు ఉపాసనా సమయాన

తాను బాలుడైనట్లు భావన చేస్తాడు. తరువాత వయసు వచ్చినవుడు వివాహము చేసుకొని బిడ్డలను కంటాడు. ఇతడు నా స్నేహితుడు ఇతడు నా బంధువు అని భ్రమలో తారుమారు అవుతూ ఉంటాడు. ఇహము మరిచిపోతాడు. విద్యాసాధనక్రియ విస్మరిస్తాడు. గురుకటాక్షమువల్ల, ఉపదేశమువల్ల మేలుకొన్నవాడు ఇహము స్మరించి, దృశ్యప్రపంచము మిథ్యగా తెలుసుకొంటాడు. అతడు వాస్తవమైన అగ్ని ప్రవేశము చేస్తే నీటిలోనుంచి కూడా వెలువడ గలడు. విద్య అప్పుడు సిద్ధిస్తుంది. ఇలాంటి శిష్యునికే తప్ప మరొకరికి ఈవిద్య సిద్ధించదు. తగని వానికి ఉపదేశము చేస్తే ప్రయోజనము ఉండదు. నేను సిద్ధిపొందిన వాడను నేనుండగా నీవు సాధనచేసి బాధలు పడవద్దు. నాసిద్ధివల్లనే నీకు ఫలప్రాప్తి అవుతున్నప్పుడు నీవు వేరే సాధన ఎందుకు చేయుడం?"

చంద్రస్వామి పట్టినపట్టు వదలలేదు. "నేను ఎలాగైనా విద్యను సాధించాలి. మీరు సందేహించక నాకు విద్యాదానము చేయండి" అని వేడుకొన్నాడు. తాపసికి దయ కలిగింది. ఆశ్రితవాత్సల్యమువల్ల ఆయన చంద్రస్వామికి విద్య అనుగ్రహించినాడు. అతడు శిష్యుని నదీ తీరానికి తీసుకొనివెళ్ళి "వత్సా, నీవు విద్యను జపిస్తూ ఎప్పుడు మాయా స్వరూపము చూస్తావో, అప్పుడు నీకు మంత్రసిద్ధి కలిగేటందుకు హెచ్చరిక చేస్తాను. వెంటనే నీవు మాయాగ్నిలో ప్రవేశించు. నీకోసము ఈగట్టున ఎదురు చూస్తూ ఉంటాను" అని చెప్పినాడు. చంద్రస్వామి నదిలో స్నానము చేసి శుచిగా మంత్రోపదేశము పొందినాడు. గురువు గట్టున కూర్చున్నాడు. చంద్రస్వామి నీటిలో మునిగి మంత్రజపము చేస్తున్నాడు. వెంటనే అతడు విప్రకుమారుడై జన్మించి క్రమేణా బాలుడై ఎదిగినాడు. జనకుడు అతనికి ఉపనయనము చేసి చదువు చెప్పించినాడు. అనంతరము అతడు చక్కనిచుక్కను పెళ్ళాడి నాడు. త్వరలో ఆదంపతులకు సంతానము కలిగింది. చంద్రస్వామికి

పుత్రవాత్సల్యము ఎక్కువగా ఉన్నది. ఇలా మాయజన్మ అనుభవిస్తూ అతడు ఉంటూ ఉండగా గురువు నదీతీరమునుంచి విద్యాప్రబోధము చేసినాడు. చంద్రస్వామి చక్షువులు ఉన్మీలితములైనవి. జనన మంతా మిథ్యగా ఇహ మంతా ఆభాసగా అతడు గ్రహించి మాయాగ్నిలో ప్రవేశించదలచినాడు. బంధువులు మిత్రులు దుఃఖించినారు. భార్యా పుత్రులు నదీతీరానికి వచ్చి కన్నీరు మున్నీరుగా రోదించినారు. చంద్ర స్వామి అజ్ఞానవశాన ఏడుస్తున్న పిల్లలను చూచి జాలిపడి "అయ్యో, నేను అగ్నిప్రవేశము చేస్తే నావారందరూ ప్రాణత్యాగము చేస్తారు. గురువు చెప్పినమాట యథార్థ మనిపిస్తున్నది. మాయ ఎంత బలీయము! అగ్నిప్రవేశము చేయనా మాననా? ఏమిటి కర్తవ్యము? అగ్ని ప్రవేశమే కర్తవ్యము" అని చంద్రస్వామి వెంటనే అగ్నిలో ప్రవేశించి నాడు. అగ్నిహోత్రము మంచువలె చల్లగా సోకింది. మాయాజాలము తొలగిపోయింది. చంద్రస్వామి తెల్లపోతూ గురువు దగ్గరికివచ్చి పాదాభి వందనము చేసినాడు. గురువు "వత్సా, ఏమి జరిగింది?" అని ప్రశ్నించి నాడు. చంద్రస్వామి జరిగినది యావత్తూ విశదముగా చెప్పినాడు.

గురువు "వత్సా, నీవు అపచారము చేసినావు. అగ్నిహోత్రము శీతలముగా ఎలా ఉంటుంది? నీఅనుభవము విద్యాసిద్ధికి దూరముగా ఉంది" అన్నాడు. "నేనేమీ దోషము చేయలేదు స్వామీ" అని చంద్ర స్వామి సమాధాన మిచ్చినాడు. అతడు గురువును స్మరించినాడే కాని విద్యాప్రాప్తి కాలేదు. గురువుకు కూడా విద్యాప్రాప్తి కాలేదు. గురు శిష్యులు రెండింటికీ చెడి విద్యపోగొట్టుకొని దుఃఖిస్తూ వెళ్ళిపోయినారు.

బేతాళుడు త్రివిక్రమా! నాకీ సందేహము తీర్చు. సాధన సరిగా చేసినా గురుశిష్యులకు విద్య లభించలేదేమి? అని ప్రశ్నించినాడు. త్రివి క్రమసేనుడు "నాకు తెలుసును. నీవు కాలయాపన చేస్తున్నావు. మనసు సాత్త్వికమై స్వచ్ఛమైతేగాని సాధన చేసినా సిద్ధి కలుగదు. ఆ విప్ర

కుమారుని మనసు సందేహమయమై మలినమై పోవడంవల్ల విద్యా ప్రాప్తి కాలేదు. అనర్హునికి విద్యోపదేశము చేయడంవల్ల గురువు విద్యకు దూరమైనాడు.'' అని ప్రత్యుత్తర మిచ్చినాడు.

బేతాళుడు "త్రివిక్రమసేనుని బుజము మీదనుంచి అంతర్ధానమై పోయి నాడు. బేతాళుని వెతికి తేవలెనని రాజు శింశుపా వృక్షము దగ్గరకు వెళ్ళినాడు.

## తరంగము : ౯౩

## బేతాళ కథ : ౧౯

త్రివిక్రమసేనుడు బేతాళుణ్ణి మళ్ళీ బుజాన పెట్టుకొని భిక్షుకునివద్దకు వెళుతూ ఉంటే 'నీకు మంచికథ చెపుతాను' అని బేతాళుడు ఇలా చెప్పినాడు :

వక్రోలక నగరాన్ని సూర్యప్రభుడు అనేరాజు పరిపాలిస్తున్నాడు. ఆయనకు సమస్త సంపదలూ ఉన్నప్పటికీ ఎంతమంది రాణులున్నటికీ సంతానలోపము మాత్రము తీరలేదు. ఇది ఇలా ఉండగా తామ్రలిప్తి అనే నగరములో ధనపాలుడనే గొప్పవర్తకునికి ధనవతి అనే కొమార్తె కలిగింది. సౌందర్యాన్నిబట్టి ఆపిల్ల శాపభ్రష్టురాలైన విద్యాధరి అనిపిస్తున్నది. పుత్రికకు వివాహవయస్సు వచ్చేటప్పటికి తండ్రి చనిపోయినాడు. రాజు తమ పక్షాన ఉండడముచేత దాయాదులు ఆమె తండ్రి సంపద అపహరించారు. తల్లి హిరణ్యవతి రహస్యముగా దాచి పెట్టుకొన్న రత్నాభరణాదులు తీసుకొని కొమార్తెను తీసుకొని రాత్రివేళ ఇల్లు విడిచిపెట్టి పలాయనము చేసింది.

కూతురిని చేతపట్టుకొని చీకట్లో ఎలాగో నడుస్తూ హిరణ్యవతి ఊరిబయటికి వెళ్ళింది. అలా ఆమె వెళుతూ ఉండగా త్రోవమీద

ఉన్న చోరుని శరీరానికి ఆమె బుజము గట్టిగా తగిలింది. వాడు అయ్యో అని కేక వేశాడు. ఆమె జాలిపడి అతని సంగతి అడిగింది. 'అమ్మా నేను చోరుడను. పాపాత్ముడను. నన్ను కొరత వేశారు. ప్రాణాలు ఇంకా పోలేదు' అని ఆమె వృత్తాంతము అడిగినాడు దొంగ వాడు. హిరణ్యవతి తన వృత్తాంతము చెప్పింది. ఇంతలోనే చంద్రోదయ మయినది. చోరుడు వారిద్దరినీ బాగా చూచి 'అమ్మా, నా ప్రార్థన ఒకటున్నది. నీకు వెయ్యివరహాలిస్తాను. ఈకన్యను నాకు ధారపోయ్యవలి' అని వేడినాడు. హిరణ్యవతి నవ్వి ఎందుకు నీకు అని అడిగితే వాడు "తల్లీ నాకు పుత్రుడు లేడు. పుత్రుడు లేని వారికి ఊర్ధ్వలోకాలు లభించవు. ఈమె నాకు భార్య అని నిర్ధారణ చేస్తే తర్వాత ఈమెకు కలిగే కుమారుడు నాకు క్షేత్రజ కుమారుడు అవుతాడు. వాడు చేసేకర్మల వల్ల నాకు సుగతి కలుగుతుంది. అందుకని ఈమెను నాకు దానము చెయ్యమన్నాను." అని వివరించి చెప్పినాడు. ధనాశచేత హిరణ్యవతి అంగీకరించి సమీపములో ఉన్ననీరు తెచ్చి చోరుని చేతిలో పోసి "నా కొమార్తెను నీకు ధారపోస్తున్నాను." అని పలికింది. చోరుడామెతో 'అమ్మా, ఆ మర్రిచెట్టుక్రింద తవ్వితే బంగారము దొరుకుతుంది. అది తీసుకో. నాప్రాణాలు పోయిన తర్వాత నాశరీరము ఉపాయంగా దహనము చేయించి అస్థికలు నదిలో కలిపి వక్రోలక నగరానికి వెళ్ళండి. అక్కడిరాజు సూర్యప్రభుడు చాలామంచివాడు. ఏ ఉపద్రవమూ లేకుండా మీరు అక్కడ సుఖంగా ఉండవచ్చు' అని చెప్పి, ఆమెచేత మళ్ళీ నీరు తెప్పించి త్రాగి ప్రాణములు విడిచినాడు. హిరణ్యవతి చెట్టు కింద తవ్వి ధనము తీసుకొని రహస్యముగా తన కుమార్తెతో కూడా భర్త స్నేహితుని యింటికి వెళ్ళిపోయి ఉపాయంగా చోరునికి దహన సంస్కారము చేయించి అస్థికలు నదిలో కలిపించింది.

మర్నాడు హిరణ్యవతి ధనముతో పుత్రికతో బయలుదేరి క్రమేణ

వక్రోలకనగరము చేరి వసుదత్తుడనే వర్తకునివద్ద ఇల్లు కొని అందులో నివాసము ప్రారంభించింది. వక్రోలకములో విష్ణుస్వామి అనేగురువువద్ద మనఃస్వామి అనే బ్రాహ్మణశిష్యుడు చాలాఅందగాడు ఉన్నాడు. అతను కులగౌరవములు ఉన్నవా డయినప్పటికీ పడుచుదనమువల్ల హంసావళి అనేగణికను కామించినాడు. అది రాత్రికి అయిదునూర్ల బంగారు దీనారాలు పుచ్చుకొంటుంది. దానికి ఇవ్వడానికి డబ్బులేక బ్రాహ్మడు చాలా విచారపడుతున్నాడు. ఒకనాడు ధనవతి మేడమీదినుంచి ఆశువిక్షించిన అందగానిని చూచి మురిసింది. తనభర్త దొంగ ఇచ్చిన ఆజ్ఞను స్మరించి తల్లితో యుక్తిగా 'అమ్మా! ఈవిప్రునిఅందచందాలు కనిపెట్టు! ఇతని సౌందర్యము లోకలోచనామృతవర్షముగా ఉంది' అని హెచ్చరిక చేసింది. కూతురి మనసు విప్రునిమీదికి వెళ్ళిం దని తల్లి గ్రహించి "నాకుమార్తె మగనిఆజ్ఞప్రకారము ఎవరినో ఒకరిని వరించాలి కదా బిడ్డలకోసం! ఈవిప్రుణ్ణి నాకుమార్తె ఎందుకు చేపట్ట కూడదు?" అనుకొని తనకోరిక తెలిపి విప్రుణ్ణి తీసుకొని రమ్మని రహస్యధారిణి అయినచేటికను పంపింది. చేటిక ఏకాంతంలో మనః స్వామిని కలిసి సందేశము చెప్పింది. హంసావళితో ఒకరాత్రి గడప డానికి ఐదువందలదీనారాలు ఇస్తే వస్తా నని అతను చెప్పినాడు. చేటిక హిరణ్యావతికి కబురు తెచ్చింది. అతను కోరినప్రకారంగా ఆమె ధనము దానిచేత పంపింది. మనఃస్వామి ధనము పుచ్చుకొని ఆరాత్రి ధనవతితో గడిపి వేకువజామున రహస్యంగా వెళ్ళిపోయినాడు. ధనవతి క్రమేణా గర్భిణి అయింది. నవమాసాలు మోసి కుమారుని కన్నది. ధనవతికీ ఆమెజననికీ రాత్రికలలో ఈశ్వరుడు ప్రత్యక్షమై ఇలా చెప్పి నాడు: "కుర్రవాణ్ణి వేయివరహాలతో మంచముమీద పెట్టి, వేకువ జామున సూర్యప్రభరాజేంద్రుని సింహద్వారమున ఉంచితే శుభము కలుగుతుంది" తల్లీకూతుళ్ళు మేలుకొని స్వప్నవృత్తాంతాలు చెప్పు

కొన్నారు. కలలు నిజమవుక వని తలచి ఆకుర్రవానిని అలాగే మంచము మీాద పడుకోపెట్టి వరహాలు పోసి ఈశ్వరాజ్ఞప్రకారం రాజసింహ ద్వారముదగ్గిర వదలివేసినారు.

ఈశ్వరుడు పుత్రచింతతో ఉన్న రాజుకు కలలో కనపడి 'రాజన్, నీసింహద్వారముదగ్గిర ఎవరో వరహాలతో పాటు కుర్రవానిని మంచము మీాద వదిలిపెట్టినారు. ఆ శుభలక్షణుని వెంటనే తెచ్చుకో'. అని ఆజ్ఞచేసినాడు. రాజుకు మెళుకువ వచ్చింది. ద్వారపాలకులు శిశువును గురించి! చెప్పగా రాజు స్వయంగా సింహద్వారందగ్గిరికి వెళ్ళి శుభలక్షణ లక్షితు డైనకుర్రవానిని చూచి ఎత్తుకొని మురిసిపోతూ అంతఃపురంలో దేవేరిదగ్గిరికి వెళ్ళినాడు. సూర్యప్రభుడు సంతోషంతో ఉత్సవము చేసినాడు. కుర్రవాడు క్రమేణా పెరుగుతున్నాడు. అతను గుణవంతుడై యువకు డైనాడు. సూర్యప్రభుడు కుమారునికి రాజ్య మిచ్చి కాశికి వెళ్ళినాడు. కుమారుడు రాజ్యమేలుతూ ఉండగా వృద్ధప్రభువు తపస్సు చేస్తూ కాశిలో కాలధర్మము పొందినాడు.

తండ్రి మరణవార్తవిని చంద్రప్రభువు దుఃఖించి మంత్రులతో మంత్ నము చేసి తండ్రిఅస్థికలు గంగలో కలపవలెనని అనుకొన్నాడు. "మా నాయనగారి అస్థికలు తీసుకువెళ్ళి గంగలో కలుపుతాను. గయలో పితృ దేవతలకు పిండములు వేస్తాను. సందర్భానుసారంగా తూర్పుసము ద్రముదాకా తీర్థయాత్రలు చేసివస్తాను." అని అతడు మంత్రులతో అంటే వారు "మహారాజా, ప్రభువు రాజ్యము విడిచిపెట్టకూడదు. పితృకార్యము ఇతరులచేత చేయించండి. స్వయముగా చెయ్యనక్కరలేదు. రాజ్య పాలనకంటె తీర్థాటనము ఎక్కువా? ప్రయాణము ఆపదలకు ఆకరము. ప్రభువుకు ఎప్పుడూ అంగరక్షకు లుండాలి!'' అని వారించారు. వారితో రాజు మీారు అడ్డము చెప్పకండి. వెళ్ళక తప్పదు. శరీరము దృఢముగా ఉన్నప్పుడు కాకపోతే మరెప్పుడు తీర్థాటనము చెయ్యగలము? శరీరము

క్షణభంగురము కదా! నేను వచ్చేవరకూ మీరే రాజ్యభారము వహించండి' అని సామాధానము చెప్పినాడు. రాజు నిశ్చయాన్ని గ్రహించి మంత్రులు ఊరుకొన్నారు.

ప్రభువు ప్రయాణసన్నాహము చేయించి శుభవాసరమున స్నానాదులుచేసి బ్రాహ్మణపూజ అయిన తర్వాత రథమెక్కి శాంతవేషముతో బయలు దేరినాడు. రాజ్యము సరిహద్దుదాకా వచ్చి సామంతరాజులను ప్రధానపౌరులను ఎలాగో వెనుకకు పంపినాడు. బ్రాహ్మణులు వాహనాలతో వెంట వెళ్ళినారు. ప్రభువు రాజ్యము మంత్రుల వశము చేసినాడు. తర్వాత కొన్నాళ్ళకు గంగానదిని సమీపించి విధ్యుక్తప్రకారముగా నదీస్నానము చేసి రథమెక్కి క్రమేణా ప్రయాగ క్షేత్రము చేరినాడు. అక్కడ గంగాయమునా తీర్థోపవాసము చేసి స్నాన దాన శ్రాద్ధాదులు సక్రమంగా నిర్వర్తించి కాశీనగరము ప్రవేశించినాడు. మూడురోజులు ఉపవాసముచేసి విశ్వేశ్వరస్వామిని యథావిధిగా అర్చించి బయలుదేరి రమణీయప్రదేశాలు చూస్తూ గయాక్షేత్రము చేరుకొన్నాడు. విశేషదక్షిణలతో యథావిధిగా శ్రాద్ధము పెట్టి చంద్రప్రభుడు ధర్మారణ్యానికి వెళ్ళి అక్కడికూపములో పిండము వెయ్యబోతే మూడుచేతులు పైకి వచ్చినవి. రాజు ఆశ్చర్యపడి ఏమీ తోచక బ్రాహ్మణులను ఏచేతిలో పిండము వేయవలెనో చెప్ప మని అడిగినాడు. 'ఇనపమేకు దిగగొట్టినచెయ్యి చోరునిది. పవిత్రము (దర్భముడి) పెట్టుకొని ఉన్నహస్తము బ్రాహ్మణునిది. ఉంగరము ధరించి సులక్షణంగా ఉన్నచెయ్యి రాజుది. ఇంతవరకు మాకు తెలిసింది. పిండము ఏచేతిలో వెయ్యవలెనో మేము చెప్పలేము, అని వారు ప్రత్యుత్తర మిచ్చినారు. రాజు కేమీ తోచలేదు.

ఆపిండము ఏచేతిలో వెయ్యవలెనో నీవు చెప్పు త్రివిక్రమసేన మహారాజా, అన్నాడు బుజములమీద భేతాళుడు. "చోరునిచేతులో నే ఆ పిండ

మునువెయ్యవలె. చంద్రప్రభుడు అతనికిక్షేత్రజుడు. తనను కన్నబ్రాహ్మణునికీ కుమారుడు కాడు; ఒకరాత్రికి బ్రాహ్మణుడు అమ్ముడు పోవడము చేత. 'సూర్యప్రభువుకూ కుమారుడు కాడు; ఇతనిని పెంచి పెద్దవానిని చెయ్యడానికై ఇతనితలవద్ద ఉంచినధనమే ముఖ్యము కాబట్టి. ఇక, చోరుడే తండ్రి. అతడు ఇతనిజన్మకు అనుజ్ఞ ఇచ్చినాడు; ఇతనిపోషణకు చాలాధన మిచ్చినాడు. కాబట్టి చంద్రప్రభుడు చోరునిభార్యకు పుత్రుడు: అనగా అతనికి పుత్రుడు. పిండము చోరునిచేతులోనే వెయ్యడము ధర్మమని నాఅభిప్రాయము" అన్నాడు త్రివిక్రమసేనుడు. వెంటనే బేతాళుడు అదృశ్యు డయినాడు. రాజు అతనిని పట్టితేవడానికి మళ్ళీ బయలుదేరినాడు.

## తరంగము : ౯౫

## బేతాళకథ : ౧౦

శింశుపా వృక్షము మీదినుంచి బేతాళుణ్ణి రాజు బుజాన ఎక్కించుకొని నడుస్తున్నాడు. బేతాళుడు 'రాజా, నీకీపట్టుదల యెందుకు? ఆ కాపాలికాధముని వద్దకు నన్ను తీసుకు వెళ్ళడం న్యాయం కాదు. నీవు పట్టుదల విడవని పక్షాన ఇదిగో కథ' అని ఇలా చెప్పినాడు.

చిత్రకూట నగరానికి ప్రభువు చంద్రావలోకుడు. అతనికి అన్ని ఐశ్వర్యాలూ ఉన్నవి. కాని భార్య లేక పోవడమే పెద్దలోపము. ఆరాజు ఒకనాడు వేటకు వెళ్ళి కొంతసేపటికి గుర్రము వడిగా పోవడం చేత అరణ్య మధ్యంలో సరోవర సమీపము చేరినాడు. గుర్రము జీను మొదలైనవి తీసి అశ్వాన్ని నీటిలో కడిగి చెట్టునీడను కట్టివేసి దానికి పచ్చిక మేత వేసి తాను స్నానముచేసి విశ్రాంతి తీసుకున్నాడు. తర్వాత ఆప్రదేశాలు పరిశీలిస్తుంటే అతనికి అశోకవృక్షము మొదట

మునికన్య కనిపించింది. ఆమె నారచీర కట్టుకొన్నది. జడ ముడివేసుకొన్నది. ఆమె ప్రక్కన చెలికత్తె ఉన్నది.

చంద్రావలోకుడు తాపసకన్య దగ్గరికి వెళ్లినాడు. పూలదండ గుచ్చుతున్న మునికన్య చెయ్యి వణికి పువ్వుదామము కింద పడిపోయింది. ఆమె ఎల్లాగో లేచి అవతలికి వెళ్లబోయింది. రాజు "భద్రురాలా, దూరమునుంచి వచ్చిన అతిథిని కుశలప్రశ్న చెయ్యడము గాని అతిథి సత్కారం చెయ్యడంగాని లేకపోగా ఆశ్రమవాసులు పలాయనము చెయ్యడం భావ్యమా?" అని నాజూకుగా అన్నాడు. ఆమె చెలికత్తె రాజుకు అతిథి సత్కారం చేసింది. చంద్రావలోకుడు కోరికలు కొనలు మేస్తుండగా చనువు తీసుకొని "కల్యాణీ! నీసఖి ఏపవిత్ర వంశములోనిది. అమృత ప్రాయములైన నీ సఖినామాక్షరము లేవి? కుసుమ కుమారమయిన తన తనూలతను తాపసులకు తగిన కఠినవృత్తిలో ఎందుకు శ్రమ పెడుతోంది?" అన్నాడు. మహాశయా! ఈమె కణ్వమహాముని పెంపుడు బిడ్డ. మేనకాపుత్రిక. ఇందీవరప్రభ తండ్రిఆనతిచొప్పున ఈసరోవరంలో స్నానము చెయ్యడానికి వచ్చింది. కణ్వాశ్రమము సమీపములోనే ఉన్నది" అని సఖి ప్రత్యుత్తర మిచ్చింది.

రాజు ఆనందించి గుర్రమెక్కి ఆశ్రమము చేరి అశ్వమును అవతలనే కట్టివేసి ఋషులనడుమ కూర్చున్న కణ్వమహామునికి ప్రణామము చేసినాడు. ముని అతిథిసత్కారము చేసినతరువాత "నాయనా! నేను చెప్పే హితవాక్కులు విను, ప్రాణులకు మృత్యు వంటే భయముకదా? నిష్కారణముగా వేటలో జంతువులను ఎందుకు చంపుతావు? వేట వ్యసనాల్లోది కదా! ఆర్తులను రక్షించు, శత్రువులను సంహరించు, ధర్మమార్గమున ప్రవర్తించు" అని మృదుమధురముగా పలికినాడు.

చంద్రావలోకుడు మనసు కరిగి వేట మానుకొన్నా నని వాగ్దానము చేసినాడు. కణ్వుడు సంతోషించి, "నీవు కోరినవరం ఇస్తాను." అన్నాడు.

"మునీంద్రా! నాకు ఇందీవరప్రభను అనుగ్రహించు" అని రాజు విన్నవించినాడు. కణ్వుడు అంగీకరించి యథావిధిగా వారిద్దరికీ వివాహము చేసినాడు.

ఆశ్రమసీమాంతమువరకూ సాగనంపడానికి వచ్చినతాపసులవద్ద సెలవు తీసుకొని భార్యతోకూడా గుర్రమెక్కి చంద్రావలోకుడు ప్రయాణమైనాడు. చీకటి పడేవరకు ప్రయాణము చేసి వచ్చికమైదానముమీద పెద్దరావిచెట్టు కనిపిస్తే మకాము చేసి రాత్రి భార్యతోకూడా ఆవృక్షముకింద పూలపాన్పుమీద గడిపినాడు.

తెల్లవారినతరువాత జ్వాలాముఖుడనే బ్రహ్మరాక్షసుడు వచ్చి "ఓరీదుర్మార్గుడా! నానివాసస్థానమైనఈరావిచెట్టుమీదుగా ప్రయాణము చెయ్యడానికి దేవతలుకూడా భయపడతారు. నీవు మదాంధుడవై భార్యతో తెల్లవారేవరకూ ఇక్కడ కాలక్షేపము చేసినావు. కాబట్టి నీగుండె పెకలించి రక్తము తాగుతా" అని బెదిరించినాడు. ఇందీవరప్రభ గడగడలాడింది. బ్రహ్మరాక్షసుని చంపడానికి వీలులేదని గ్రహించి రాజు వినయముతో" స్వామీ! తెలియక చేసినతప్పు క్షమించు. నీ ఆశ్రమానికి వచ్చినాను. అతిథిని శరణాగతుడను కాబట్టి నన్ననుగ్రహించి విడిచిపెట్టు. నీవు ఎటువంటి మనిషిని కోరితే అటువంటివానిని తెచ్చి నీకు సమర్పిస్తాను" అని విన్నవించినాడు. బ్రహ్మరాక్షసుడు శాంతించి "సరే, ఏడేళ్ల బ్రాహ్మణకుమారుడు, వివేకము కలవాడు, నీకోసం అడ్డముచెప్పకుండా తనను అర్పించుకొనేవాడు కావాలి. వానిని చంపేటప్పుడు నేలమీద పడుకోబెట్టి చేతులు తల్లి, కాళ్లు తండ్రి గట్టిగా పట్టుకోవాలి. వానిని నీవు స్వయముగా ఖడ్గముతో నరికి నాకు అర్పించాలి. ఏడురోజులు గడు విచ్చాను. గడువు తప్పితే నిన్నూ నీపరివారాన్నీ నాశనం చేస్తాను" అన్నాడు. రాజు భయపడుతూనే "సరే" అన్నాడు. బ్రహ్మరాక్షసుడు ఎక్కడికో వెళ్లి

పోయాడు. రాజు భార్యతోకూడా ప్రయాణము చేసి తనకోసం ఎదురు వస్తున్న సేనతో సహా చిత్రకూటనగరము చేరినాడు. తమప్రభువుకు తగినభార్య లభించిం దని ప్రజలంతా పండగ చేసుకొన్నారు. రాజదంప తులకు మాత్రం మనశ్శాంతి లేదు.

మర్నాడు చంద్రావలోకుడు రాక్షసుని వృత్తాంతము అమాత్యులకు తెలియపరచినాడు. అందులో సుమతి అనేమంత్రి "దేవా, ఈ లోక ములో అనేక చిత్రాలు ఉన్నవి. మీరు కోరినబాలుడు దొరకకపోడు. నేను సాధించి తెస్తాను" అని ప్రభువును శాంతపరచి వెంటనే ఏడేళ్ల బాలునిబొమ్మ బంగారముతో చేయించి, రత్నాలతో అలంకరించి, పల్లకిలో పెట్టించి . ఈ విధముగా చాటించమని చెప్పినాడు. "ఏడేళ్ల బ్రాహ్మణకుమారుడు, బుద్ధిమంతుడు. ఎవడేనా బుద్ధిపూర్వకంగా తల్లిదండ్రుల అంగీకారము పొందవలె. సంహారసమయంలో తల్లిదండ్రులు అతనిచేతులూ కాళ్లూ పట్టుకోవాలి. అతని జననీజనకుల ఉపయో గార్థము ఈసువర్ణప్రతిమను నూరుగ్రామాలలో సహా ప్రభువు కానుకగా ఇస్తాడు."

బంగారుబొమ్మను ఈ చాటింపుతో తిప్పగా తిప్పగా ఒక అగ్రహా రములో ఈ లక్షణములకు సరిపోయిన బ్రాహ్మణబాలుడు ముందుకు వచ్చి రాజపురుషులతో "ప్రభువుకోసం నన్ను సంతోషపూర్వకముగా బ్రహ్మరాక్షసునికి బలిగా అర్పించుకుంటాను. ఇంటికివెళ్లి నాతల్లిదండ్రు లను ఒప్పించివస్తాను" అన్నాడు. రాజపురుషులుచాలా సంతోషించారు.

కుర్రవాడు ఇంటికివెళ్లి చేతులుజోడించి జననీజనకులతో బలినిగురించి చెప్పినాడు. కుమారునిమాట విని తల్లిదండ్రులు భయపడి "ఏమి నాయనా, నీకు మతిచెడిపోయిందా? పిశాచము పట్టిందా? ధనంకోసం కుర్రవాణ్ణి ఎవరుచంపుకుంటారు?" అన్నారు. ఆబాలుడు పట్టుపట్టి ఎన్నిచెప్పినా వినక శరీరము శాశ్వతము కాదనీ, మురికికూపమనీ,

నిస్సారమనీ, భూతహితముకోసం శరీరము విడవడం పుణ్యమనీ వాదించి అతికష్టముమీద తల్లిదండ్రులను ఒప్పించినాడు. ఇంకా కొంతమంది పుత్రులు ఉండడమువల్ల చిట్టచివరకు వా రంగీకరించారు. బాలుడు సువర్ణప్రతిమను నూరుగ్రామముల దానశాసనమునూ తల్లిదండ్రులకు అర్పించినాడు.

తరువాత బాలుడు తల్లిదండ్రులనుతీసుకొని ఆరాజపురుషులవెంట చిత్రకూటనగరము చేరి రాజసన్నిధికి వెళ్ళినాడు. ప్రభువు చాలాసంతోషించి కుర్రవానిమెడలో పూలహారము వేసి శరీరానికి అంగరాగము పూసి తల్లిదండ్రులతోకూడా వానిని ఏనుగు ఎక్కించి బ్రహ్మరాక్షసుని స్థానానికి ఏడోరోజు దాటకుండా తీసుకొని వెళ్ళాడు. రావిచెట్టుప్రక్కన పురోహితుడు మండలము నిర్మించి పూజాహోమము చేసినాడు. ఇంతలో జ్వాలాముఖుడు వచ్చినాడు. చంద్రావలోకుడు నమస్కరించి వినయముతో "స్వామీ! ఏడవరోజు దాటకుండా నీకు నరబలి తెచ్చి నాను. నన్ను అనుగ్రహించి యథావిధిగా ఈబలిని స్వీకరించు" అని విన్నవించినాడు. బ్రహ్మరాక్షసుడు నో రూరగా బ్రాహ్మణకుమారుని చూచినాడు. సత్వసంపన్నుడైన బ్రాహ్మణబాలుడు తనలో "ఈ దేహము అర్పించడమువల్ల వచ్చేపుణ్యముచేత లభించేస్వర్గమోక్షాలు నా కక్కర లేదు. జన్మజన్మలలో నాశరీరము ఇతరులమేలుకే వినియోగము కావడము నాఅభిలాష" అనుకొన్నాడు. ఇంతలో ఆకాశమున విమానాలు కనిపించాయి. దేవతలు పుష్పవర్షము కురిపించడానికి సిద్ధముగా ఉన్నారు. బ్రహ్మరాక్షసునిఎదట బాలుని పరుండబెట్టి తల్లిదండ్రులు కాళ్ళుచేతులు పట్టుకున్నారు. రాజు కత్తి దూసి ఖండించబోయేసమయంలో బాలుడు పకపకానవ్వినాడు. అక్కడివారందరూ బ్రహ్మరాక్షసుడూ ఆశ్చర్యపడి చేతులుజోడించి వానిముఖముకేసి తేరిపారచూచినారు.

ఈకథ చెప్పి బేతాళుడు త్రివిక్రమసేనునితో "రాజా! అటువంటి సమయంలో ఆబాలుడు ఎందుకు నవ్వినాడో చెప్పు. తెలిసి చెప్పక పోతే శాపమున్నదికదా!" అన్నాడు.

నాకు ఇలా తోస్తున్నది: "లోకములో బలహీనుడు ప్రాణరక్షణ కోసం జననీజనకులను కేకవేసి రోదనం చేస్తాడు. తల్లిదండ్రులులేనివాడు అందరినీ రక్షించేరాజునుగురించి ఆక్రోశిస్తాడు. రాజు సమీపములో లేకపోతే భగవంతుని ప్రార్థిస్తాడు. ఈబాలుడికి అంతా విపరీతముగా పరిణమించింది. తల్లిదండ్రులు చేతులు కాళ్ళు పట్టుకున్నారు. రాజు ఖడ్గము దూసినాడు. అక్కడ దైవతమైన బ్రహ్మరక్షస్సు వానిని భక్షించడానికి సిద్ధముగా ఉన్నాడు. ఈసంగతు లన్నీ చూచి శరీర స్వభావం గ్రహించి ఆబాలుడు ఆశ్చర్యముతోనూ ఆనందముతోనూ నవ్వినాడు" ఇలా త్రివిక్రమసేనుడు ప్రత్యుత్తరము ఇచ్చేసరికి భుజము మీాది బేతాళుడు అదృశ్యమై యథాస్థానానికి వెళ్ళినాడు. అతనిని పట్టి తీసుకుని రావడానికి రాజు మళ్లీ బయలుదేరినాడు.

తరంగము: ౯౭

బేతాళకథ: ౨౧

త్రివిక్రమసేనుడు బేతాళుని తనబుజముమీాద పెట్టుకొని స్మశానంలో నడిచి పోతున్నాడు. బేతాళుడు ఇలా కథచెప్పడం మొదలుపెట్టినాడు:

రాజా, ఈసారి మోహమును గురించినకథ చెపుతాను. ఉజ్జయినీ నగరమును పద్మనాభుడు పరిపాలించేకాలములో మహాధనవంతుడయిన వైశ్యుడు ఆనగరాన ఉంటుండేవాడు. తనకూతురు అనంగమంజరిని ఆవర్తకుడు తామ్రలిప్తి నివాసి అయిన మణివర్మ అనేవణిక్కుమారున కిచ్చి పెళ్ళిచేసినాడు. వేరే బిడ్డలు లేకపోవడంచేత అల్లుణ్ణి ఇంట్లోనే నిలుపుకొన్నాడు. అనంగమంజరికి భర్తమీాద అనురాగంలేదు. భర్తకుమాత్రం భార్యమీాద గాఢానురాగము.

ఒకసారి మణివర్మ తల్లిదండ్రులను చూడడానికి తామ్రలిప్తికి వెళ్ళినాడు. ఆరోజులలో ఒకనాడు అనంగమంజరి అంగరాగము పూసుకొని దుకూలము ధరించి తన చెలికత్తెతో మేడమీద నిలుచుని కిటికీలోనుంచి వీధికేసి చూస్తూఉన్నది. రాజపురోహితుని కుమారుడు కమలాకరుడు ఆమార్గాన వస్తున్నాడు. వారు పరస్పర ముఖవీక్షణములు చేసినారు. ఉభయులకూ అనురాగం అంకురించింది. కమలాకరుణ్ణి స్నేహితుడు ఇంటికి నడిపించుకొని పోయినాడు.

తర్వాత అనంగమంజరి చెలికత్తెనుపంపి కమలాకరుని పేరు గ్రహించింది. ఆమెకు విరహము క్రమంగా హెచ్చిపోయింది. మూడురోజులకు ఆమె విరహబాధ సహించలేక సాహసము చెయ్యలేక అర్ధరాత్రివేళ రహస్యముగా బయలుదేరి తమఆరామములో దిగుడుబావివద్దకు పోయి తన తండ్రి ప్రతిష్ఠించిన కులదేవత చండికాదేవికి ప్రణామముచేసి, 'తల్లీ, వచ్చేజన్మలోఐనా కమలాకరుడు నాకు భర్తఅయ్యేటట్టు అనుగ్రహించు' అని ప్రార్థించి అక్కడేఉన్న అశోకవృక్షానికి తనచీరెకొంగుతో ఉరి పోసుకుంటున్నది. ఇంతలోనే చెలికత్తెకు మెళుకువ వచ్చి వెతుక్కుంటూ అదృష్టవశాత్తూ ఆమె ఆతోటలోకే వచ్చింది. వచ్చి మెడకు ఉరితగిలించుకొంటున్న అనంగమంజరిని చూసి పరుగుపరుగునవెళ్ళి ఉరి తెంపివేసింది. అనంగమంజరి . కొంతవరకు స్వస్థచిత్త అయినతర్వాత ఈ సంఘటనకు కారణమేమని అడిగింది. 'మాలతికా, తల్లిదండ్రుల చాటుదానను, నాప్రియునితో సంయోగము కలగదు. నేను బతికి లాభమేమి!' అని అనంగమంజరి మూర్ఛపోయింది. శీతలోపచారములు చేసి అనంగమంజరికి చెలికత్తె కొంత చిత్తశాంతి కలిగించిన తర్వాత ఆమె 'మాలతికా, మాటలవల్ల లాభములేదు. నేనుబతికి ఉండవలెనంటే కమలాకరునికీ నాకూ సమాగమము సమకూర్చు' అన్నది. 'చెలీ, చాలపొద్దుపోయింది, లేవువెళ్ళి నీప్రియుని ఇక్కడికే తీసుకొని వస్తాను. అంతవరకూ ఎలాగో

ప్రాణాలు బిగబట్టుకొని ఉండు' అని చెలి చెప్పింది. అనంగమంజరి సంతోషించి తనకంఠహారము తీసి చెలికత్తె మెడలో వేసి మేడలోకి వెళ్ళి పండుకొన్నది.

మర్నాడు ఉదయమే మాలతిక రహస్యముగా కమలాకరుని ఇంటికి వెళ్ళి ఉద్యానవనము ప్రవేశించి అతనిని చూసింది. అతను విరహావస్థలో ఉన్నాడు. పక్కనే మిత్రుడు ఉపచారములు చేస్తున్నాడు 'మిత్రమా, ప్రయోజనము లేదు. వణిక్కన్య నామనస్సు హరించింది కదా. మాకు సమాగమము సమకూర్చు. ఇతరవిషయములవల్ల లాభము లేదు' అన్నాడు కమలాకరుడు. మాలతిక ఈమాటలకు సంతోషించి చెట్టుచాటునుంచి ఎదటికి వచ్చి 'అందగాడా, అనంగమంజరి నన్ను పంపించింది. సందేశము వినిపిస్తాను. నీవు బలవంతాన ముగ్ధహృదయంలో ప్రవేశించి అపహరించి కనపడకుండా ఉండడం ఏమిధర్మం! పైగా ఆశ్చర్యమేమంటే, ఆముద్దరాలు హృదయచోరునకే దేహమనఃప్రాణాలు అర్పించదలచి ఉన్నది. నీకోసం నిరంతరమూ బాష్పధారలు విడుస్తున్నది. నీకిష్టం అయితే మీరిద్దరూ కలిసే ఉపాయం చెవుతాను' అన్నది. కమలాకరుడు 'నీవే మా ఇద్దరికీ దిక్కు. నీఇష్టం వచ్చినట్టు చెయ్యవచ్చును' అన్నాడు.

'నేటిరాత్రి రహస్యంగా అనంగమంజరిని వాళ్ళ ఉద్యానవనంలోకి చేరుస్తాను. నీవు ఇవతల నిల్చొని ఉండు. ఉపాయంగా నిన్ను లోపలికి తీసుకొని వెడతాను' అని మాలతిక కమలాకరుని శాంతిపరచి వెళ్ళి అనంగమంజరితో ఈసంగతి చెప్పింది. అనంగమంజరి ఆపగ తెల్లాగో గడిపింది. రాత్రి అనుకున్నప్రకారంగా ఇద్దరికీ సమాగమం జరిగింది. అనంగమంజరి సిగ్గువిడిచి ఎదురుగా పరుగెత్తుకొని పోయి కమలాకరుని కంఠం కౌగలించుకొంది. ఆనందాతిశయములో ఊపిరాడక ఆమె ప్రాణములు పోయినవి! కమలాకరుడు పిడుగుపడినట్లయి, మూర్ఛపోయి

కొంతసేపటికి తెప్పిరిల్లి ప్రియురాలిని తన ఒడిలో పడుకోబెట్టుకొని మాటిమాటికీ కౌగలించుకొని ముద్దుపెట్టుకొని చివరకు దుఃఖాతిశయం వల్ల గుండె పగిలి చనిపోయినాడు. మాలతిక వచ్చి చూచి చాలా దుఃఖించింది.

ఉదయము తోటకాపరులవల్ల ఈవృత్తాంతము తెలుసుకొని ఉభయులబంధువులూ తోటలోనికి వచ్చి ఏమీ తోచక తలలు వంచుకొని నిలుచున్నారు.

మణివర్మ తాౖమలిప్తినుంచి భార్యకోసం తహతహలాడుతూ వచ్చినాడు; వచ్చి మామయింట్లోకి వెళ్ళి భార్యను చూచి నేలమీద వాలి ప్రాణములు విడిచినాడు.

ఈసంగతులు విని ఊరిలో చాలమంది అక్కడికి వచ్చినారు. తోటలో ఉన్న చండికాదేవిని ప్రమథులు 'తల్లీ, ఈ అర్థదత్తుడు నిన్ను ప్రతిష్ఠ చేసినాడు. ఇతడు నీకు భక్తుడు. అమ్మా అనుగ్రహించు' అని ప్రార్థించినారు. వెంటనే చండికాదేవిఅనుగ్రహామువల్ల ఆముగ్గురూ నిద్రపోయి లేచినట్లు శాంతముగా లేచినారు. ఆ ఆశ్చర్యసంఘటనకు జనులు ఆనందించారు. కమలాకరుడు సిగ్గుపడి తల వంచుకొని ఇంటికి వెళ్ళినాడు. లజ్జ పొందినతనపుత్రిక అనంగ మంజరినీ, ఆనందిస్తున్న అల్లుణ్ణీ అర్థదత్తుడు ఇంట్లోకి తీసుకువెళ్ళినాడు.

ఈకథ చెప్పి బేతాళుడు 'రాజా, అనురాగమూఢు లైన ఈ ముగ్గురిలో ఎవరికి ఎక్కువమోహాం'? అని అడిగినాడు.

'వీరిలో మరీ అనురాగమూఢుడు మణివర్మ. తక్కినఇద్దరికీ మదనావస్థ క్రమక్రమంగా కాని పరిపాకానికి రాలేదు. తనభార్యకు అన్యపురుషునిమీద ఆసక్తి ఉన్న దని స్పష్టముగా కనపడ్డప్పటికీ కోపం రాలేదు. మరి ఒకనికైతే ఒళ్ళు మండి పోయేది. కోపం రావలసిన

సమయంలో శోకంవల్ల ప్రాణములుకూడా విడిచినాడు. మణివర్మ మహా మూర్ఖుడు' అని త్రివిక్రమసేనుడు ప్రత్యుత్తర మిచ్చినాడు.

వెంటనే బుజముమీది బేతాళుడు అదృశ్యుడై శింశుపావృక్షము చేరినాడు. అతనిని తీసుకొని రావటానికి త్రివిక్రమసేనుడు తిరుగ బయలు దేరినాడు.

తరంగము: ౯౬

బేతాళకథ: ౨౨

త్రివిక్రమసేనుడు మళ్ళీ బేతాళుని శింశుపావృక్షమునుంచి తనబుజము మీది కెక్కించుకొని వస్తూ ఉంటే బేతాలుడు 'రాజా, నీవు సాధువువు, సత్యసంపన్నుడవు, కథ చెపుతానువిను' అని ఇలా ప్రారంభించినాడు:

పూర్వము కుసుమపురమును ధరణీవరాహుడనే ప్రభువు పాలిస్తూన్న రోజుల్లో ఆయనరాజ్యంలో విష్ణుస్వామి అనే బ్రాహ్మడు బ్రహ్మస్థల అగ్రహారములో ఉండేవాడు. ఆయనకు నలుగురు కొడుకులు. ఆకొడుకులు వేదాధ్యయనము పూర్తిచేసేసరికి తండ్రి చనిపోయినాడు. తల్లి సహగమనం చేసింది. దాయాదులు ఆస్తి అపహరించారు. నలుగురు అన్నదమ్ములూ ఆలోచించి మాతామహునియింటికి క్రమేణా చేరినారు. అక్కడ తాత చనిపోయినాడు. అందువల్ల ఈపిల్లవాళ్ళు మేనమామపోషణలో ఉండవలసి వచ్చింది. క్రమేణా వీళ్ళకు అవమానము జరగడం ప్రారంభించింది. ప్రాణము విసికి నలుగురూ ఏకాంతముగా కర్తవ్యము ఆలోచించారు. అందులో పెద్దవాడు ఇలా చెప్పినాడు: ఈమధ్య నేను స్మశానప్రాంతాల్లో తిరుగుతూంటే శవం కనిపించింది. అది చూచి చనిపోవడమే చాలా మంచి దని నేను నిశ్చయించుకొని తాడు తెచ్చి చెట్టుకు ఉరిపోసుకొన్నాను. తాడు తెగి కింద పడిపోయినాను. స్మృతి తప్పిపోయింది. కాని ప్రాణాలు పోలేదు. చనిపోదా

మంటేకూడా విధి అడ్డవడ్డది. శోవన పోతున్న సజ్జను దెవరో నాకు ఉపచారం చేసి తెలివి తెప్పించి 'చనువుకొన్నవాడిలా ఉన్నావు. ఆత్మ హత్యకు ఎందుకు ప్రయత్నిస్తావు? బతికి ఉంటే సత్కార్యాలు చెయ్య వచ్చును. ధైర్యం తెచ్చుకో' అని బోధించి వెళ్ళినాడు." ఆమాటలు విని తమ్ములు 'అన్నా, వివేకము ఉన్నవారికి ధనం లేకపోయినా అట్టే బాధ లేదు. ఎంత మనము రక్షించుకొన్నా సంపదలు శాశ్వతములు కావు. మనం ఏదో విశేషప్రజ్ఞ సంపాదిస్తే బాగుపడతాం. ఆప్రయత్నం చేయడం అవసరం" అని చెప్పేసరికి అన్నకు కొంతధైర్యము వచ్చింది. ఏమి చేతా మంటే ఏమి చేతా మని వారు ఆలోచించు కొని మేన మామఇల్లు వదిలి పెట్టిపోడానికి నిశ్చయించి, దేశాటనార్థం బయలు దేరి కొన్నాళ్ళకు ఏదో ఒకప్రదేశములో మళ్ళీ కలుసుకోడానికి నిర్ణయించారు.

అలాగే కొన్నాళ్ళకు నలుగురూ నిర్ణీతప్రదేశంలో కలిశారు. నీ వేంవిద్య నేర్చావని ఒకరి నొకరు ప్రశ్నించుకొన్నారు. ఒకడు "ఎముక ముక్క దొరికితే అది ఏప్రాణిదో ఆప్రాణికి తగినమాంసము నేను సృష్టి చేయగలను" అన్నాడు. "అలా మాంసము కల్పించినతర్వాత నావిద్యవల్ల ఆప్రాణికి ఉచితమైనచర్మమూ కేశములూ నేను సమకూర్చగలను" అన్నాడు రెండవవాడు. "చర్మము మాంసము, కేశములూ ఉన్న పిండానికి నావిద్యాప్రభావమువల్ల తక్కిన అవయవా లన్నీ సమకూరు స్తాను" అన్నాడు మూడవవాడు. "ఆకళేబరానికి ప్రాణం పోయగల" నన్నాడు నాలుగవవాడు. తమ విద్యాప్రభావాన్ని ప్రదర్శించడానికి నలుగురూ ఎముకకోసం అడవిలోకి వెళ్ళారు. ఒకచోట ఎముకముక్క దొరికింది. తమ శక్తివల్ల దానికి క్రమంగా కళేబరం ప్రాణంకూడా ఇచ్చారు. ప్రాణం పోసినవాడు నాలుగోవాడు. అది సింహం. ప్రాణము రాగానే సింహం చివాలున లేచి వాళ్ళమీద పడి నలుగురినీ చీల్చివే

సింది. దుష్టప్రాణివల్ల సుఖం ఎల్లా కలుగుతుంది! కష్టపడి అభ్యసించిన విద్యఅయినా దైవం ప్రతికూలంగా ఉన్నప్పుడు అపకారం చేస్తుంది.

ఈకథచెప్పి బేతాళుడు త్రివిక్రమునితో 'రాజా, ఆనలుగురిలో సింహనిర్మాణదోషం ఎవరిదో చెప్పు అన్నాడు.' 'ఈబేతాళుడు నాకు మానభంగము చేసి తప్పించుకొని వెళ్ళవలె నని ప్రశ్న వేస్తున్నాడు. తెలిసి చెప్పకపోతే శాపం తప్పదు. కాని మళ్ళీ వెళ్ళి తెస్తాను' అను కొని త్రివిక్రమసేనుడు ఇలా అన్నాడు: 'యోగీశ్వరా, ఆనలుగురు సోదరులలో జంతువుకు ప్రాణం పోసినవాడే సింహనిర్మాణపాపం చేసిన వాడు. తక్కిన ముగ్గురూ ఏజంతువు అస్థికో తెలియక కళేబరం నిర్మిం చారు. నాలుగోవాడు సింహాకారాన్ని చూచి సింహమని తెలిసి కూడా ప్రాణప్రతిష్ఠ చేశాడు. కాబట్టి ఆనాలుగుబ్రహ్మహత్యలపాత కమూ ఆమూర్ఖుడికే చుట్టుకొంటుంది'.

రాజు ఈమాటలు చెప్పగానే బేతాళుడు అంతర్ధానమైనాడు. అతనిని తీసుకొని రావడానికి త్రివిక్రముడు మళ్ళీ వెళ్ళినాడు.

## తరంగము : ౯౭

## బేతాళకథ : ౨౩

త్రివిక్రమసేనుడు శింశుపావృక్షందగ్గిరికి వెళ్ళినాడు. బేతాళుడు చాలా మాయలు చూపించాడు. కాని రాజు పట్టుదలతో అతనిని బుజాన్న ఎక్కించుకొని మౌనముతో నడుస్తున్నాడు. బేతాళుడు తోవలో అత నితో 'రాజా, ఈఅకార్యములో నీ కింత పట్టుదల ఉన్నదే! అయినా మార్గశ్రమ లేకుండా కథ చెపుతాను' అని ఇలా ప్రారంభించినాడు:

కళింగదేశములో శోభావతీనగరాన్ని ప్రద్యుమ్నుడనేరాజు పాలి స్తున్నాడు. ఆనగరములో ఒకభాగములో యజ్ఞస్థలము అనేఅగ్రహారము రాజు కట్టించి బ్రాహ్మణులకు నివాసయోగ్యం చేసినాడు. అందులో

సమస్తసద్గుణములుకల సోముడు అనే బ్రాహ్మడికి వార్ధకములో కొడుకు పుట్టినాడు. సోమదేవనాము డైన ఆ బాలుడు పెరిగి పెద్దవాడై విద్యావినయముల వల్ల అందరికీ ఇష్టు డైనాడు. అతను 'పదహారోసంవత్సరంలో జ్వరంవల్ల చనిపోయినాడు. తల్లిదండ్రులు చాలా దుఃఖించారు. తండ్రి కుమారునిశవాన్ని విడిచిపెట్టకుండా కూచున్నాడు. పెద్దలు వచ్చి ఆయనకు బహువిధాల బోధచేసి చివరకు పట్టు విడిపించారు. బంధువులు శవానికి అలంకారము చేసి రోదనం చేస్తూ స్మశానానికి తీసుకువెళ్ళారు.

స్మశానందగ్గిరిగా ముసలి పాశుపతయోగి చిన్నమఠం కట్టుకొని ఉంటున్నాడు. ఆ వామశివునితో శిష్యుడుకూడ మఠంలో ఉంటున్నాడు. వాడు మొండివాడు, విద్యాగర్వి, వామశివుడు శిష్యుణ్ణి ఎందుకో చివాట్లు పెడుతూ స్మశానంలో కోలాహలం విని వింతగా తోచి, అ దేమిటో కనుక్కు రమ్మని అన్నాడు. చివాట్లు తిన్నకోపంవల్ల శిష్యుడు, నేను వెళ్ళను నీవే వెళ్ళు. నాకు భిక్షవేళ దాటిపోతున్నదని నిర్లక్ష్యం చేశాడు. ఓరి, తిండిపోతా, తెల్లవారి అర్ధయామం కాలేదే. అప్పుడే నీకు భిక్షవేళ అయిందా? అని గురువు మందలించేసరికి శిష్యుడు ఒళ్ళు మండి 'ఓముసలీ, నేను నీకు శిష్యుణ్ణీ కాను, నీవు నాకు గురువువూ కావు. నీకమండలం నువ్వే మోసుకో. ఇక నీదగ్గర ఉండను' అని వెళ్ళిపోయినాడు.

అవృద్ధుడు నవ్వుతూ మఠంలోనుంచి ఇవతలకు వచ్చి శవమును సమీపించి చూచేసరికి నవయౌవనంలో ఉన్నకుర్రవాడు. అక్షణంలో పాశుపతయోగికి అకుమారుని శరీరంలో ప్రవేశించా లని బుద్ధి పుట్టింది. వెంటనే కొంతసమీపంలో ఉన్న చెట్టుచాటుకు వెళ్ళి ఒక్కసారి బిగ్గరగా ఏడ్చి వెంటనే నృత్యం చేసి యోగప్రభావమువల్ల అబ్రాహ్మణ కుమారుని కళేబరంలో ప్రవేశించినాడు. శవం కళ్ళు తెరిచి ఆవులించి లేచి కూచున్నది. బంధువులు చూచి కుర్రవాడు బతికే ఉన్నాడని

సంతోషంతో కేకలు వేశారు. బ్రాహ్మణకుమారుని శరీరంలో ఉన్న పాశుపతయోగి శరీరముతో వ్రతం సాగించదలచుకొని అక్కడ ఉన్న వారితో ఇలా అన్నాడు: నేను లోకాంతరానికి వెళ్ళినప్పుడు పరమ శివుడు నాకుప్రత్యక్షమై 'నీవు మహాపాశుపతవ్రతము ఆచరించవలసింది. అలా నియమప్రకారంగా నీవు ఆచరించేపక్షంలోనే నీకు ప్రాణాలు అనుగ్రహిస్తున్నాను' అని సెలవిచ్చినాడు. కాబట్టి నేను మీతో ఇంటికి రాను. ఏదో ఏకాంతప్రదేశాన పాశుపతవ్రతం అవలంబించాలి. మీరంతా ఇళ్ళకు పోండి. విచారం పెట్టుకోవద్దు." అని బోధించి వాళ్ళను పంపివేసినాడు. వాళ్లు వెళ్ళిపోయినతర్వాత ఆ ఏట్టుచాటుకు వెళ్ళి తన పూర్వశరీరము గోతిలో పూడ్చిపెట్టి తనకు సంక్రమించిన యౌవనానికి సంతోషిస్తూ ఎక్కడికో వెళ్ళి మహా పాశుపతవ్రతం అవలంబించినాడు.

ఈకథ చెప్పి బేతాళుడు 'రాజా, పరకాయప్రవేశం చేయబోయే టప్పుడు ఆ యోగీశ్వరుడు ఎందుకు ఏడ్చినాడు? తరువాత ఎందుకు నృత్యం చేసినాడు? తెలుసుకోవలె నని నాకు చాలా కుతూహలంగా ఉన్నది' అన్నాడు. రాజు శాపభయంవల్ల మౌనం విడిచి ఇలా చెప్పి నాడు: 'ఆపాశుపతయోగిఅభిప్రాయ మిది. ఈదేహము బహుకాలము నుంచీ నాతో పెరిగింది, సిద్ధికి సాధనభూతం అయింది. చిన్నప్పుడు తల్లిదండ్రులలాలన పొందింది. అటువంటిశరీరాన్ని ఇప్పుడు విడిచిపెట్ట వలసి వచ్చింది కదా అని దుఃఖము పొంగి ఒక్కసారి ఆవృద్ధుడు ఏడ్చినాడు. దేహాభిమానం వదలడం చాలా కష్టంకదా? ఇక నృత్యం చెయ్యడానికి కారణం: నూతనదేహంలో ప్రవేశిస్తున్నాను. ఇంతకన్న ఎక్కువగా సాధన చేయగలను అనే సంతోషంవల్ల నృత్యం చేసినాడు. యౌవనం ఎవరికైనా ఇష్టమేకదా?

త్రివిక్రమసేనుడు ఈమాటలు చెప్పేసరికి బేతాళుడు అతనిభుజం

మీద నుంచి అదృశ్యమైనాడు. రాజు అతనిని తేవడానికి మళ్ళీ బయలుదేరినాడు. ధీరులు పట్టుదల విడువరు కదా!

## తరంగము : ౯౮

## బేతాళకథ : ౨౪

త్రివిక్రమసేనుడు శింశపావృక్షముమీదనుంచి బేతాళుని బుజాన పెట్టుకొని తెచ్చేసమయములో బేతాళుడు ఇలా అన్నాడు: 'రాజా, ఈరాకపోకలవల్ల నేను చాలా అలిసి పోయినాను. నీకు శ్రమ కనపడదు. నాది పెద్దప్రశ్న ఉన్నది. విను: పూర్వకాలంలో దక్షిణాపథమున ధర్ముడనేమండలాధిపతి ఉండేవాడు. ఆయన పరమసాధువు. రాజుభార్య మాళవదేశములో ఉన్నతవంశమునకు చెందినది. పేరు చంద్రవతి. ఆభార్యాభర్తలకు లావణ్యవతి అనేపుత్రిక పుట్టింది. ఆమె పెరిగి పెద్దదై పెళ్ళియీడు వచ్చేనాటికి దాయాదులు రాజ్య మాక్రమించుకొన్నారు. ధర్ముడు కొన్నిరత్నములు ఆభరణములూ మూట కట్టుకొని భార్యను పుత్రికను వెంట పెట్టుకొని రాత్రి రహస్యముగా మాళవదేశానికి బయలుదేరినాడు. తోవలో వింధ్యారణ్యము ఉన్నది. తెల్లవారేనరికి కాలినడకను ఆముగ్గురూ శబరపల్లె చేరినారు. దూరమునుంచే రాజును చూచి శబరులు ఆభరణాలు హరించాలని మీదికి వచ్చారు. వరుగుపరుగున ఆశబరులు వచ్చేలోపున రాజు భార్యాపుత్రికలతో 'మ్లేచ్ఛులు వచ్చి మీద పడతారు, చప్పున ఈఅరణ్యములో దాక్కోండి' అని హెచ్చరించి వారిని పంపివేసినాడు.

శబరులు బాణములు విడిచినారు. రాజు డాలు అడ్డము పెట్టుకొని ఖడ్గముతో చాలమందిని సంహరించినాడు. శబరనాయకుడు అనేకులను గుంపులుగా ధర్ముడిమీదికి పంపినాడు. వాళ్ళు రాజుమీద వడి డాలు

ముక్కలు ముక్కలు చేసి అతనిని చంపి ఆభరణాలు తీసుకొని వెళ్ళి పోయినారు. కొంతదూరములో పొదరింటిలో దాక్కొని ఉన్న తల్లీ, కూతురూ అ దంతా చూచినారు. కబరులు అందరూ వెళ్ళిపోయిన తరవాత వా రిద్దరూ భయముతో వెనక్కు తిరిగి చూస్తూ పోయిపోయి మరోఅడివిలో ప్రవేశించారు. రెండుఝాము లయింది. ఒకచోట సరోవరతీరాన అశోకవృక్షచ్ఛాయలో ఉభయులూ చతికిల పడినారు.

చండసింహు డనేపెద్దమనిషి తనకుమారుడు సింహపరాక్రమునితో కూడా ఆఅడివికి వేటకు వచ్చినాడు. వారినివాసప్రదేశము అక్కడికి కొంతదగ్గరలోనే ఉన్నది. చండసింహునకు మార్గములో ధూళిలో స్త్రీల అడుగులజాడచూచి కుమారునితో 'నాయనా, ఈపాదముద్రలు సుందర స్త్రీలవి. ఈజాడ వెంట వెళ్ళి వారిని చూతాము. ఇద్దరిలో నీ కిష్ట మైనదానిని నీవు తీసుకో' అన్నాడు. 'నాయనా, చిన్నఅడుగులజంట ఒకటి, పెద్దఅడుగులజంట ఒకటి కనపడుతున్నది. చిన్నఅడుగులది నాభార్య. పెద్దఅడుగులది నీకు తగినది' అన్నాడు కుమారుడు.

'అబ్బాయీ, ఇలా అనవచ్చునా? నీతల్లి మొన్న మొన్న నే కదా చనిపోయింది! అట్టియోగ్యురాలు పోయినతరవాత ఇంకొక స్త్రీమీద అపేక్ష పెట్టుకోవచ్చునా?' అన్నాడు తండ్రి.

'కాదు నాయనా, భార్య లేనివానిఇల్లు పాడుకొంపకదా! నేను స్వీకరించేదాన్ని కాక నీవు రెండోదాన్ని స్వీకరించకతప్పదు' అని కుమారుడు బహువిధాల బలవంతపెట్టేసరికి తండ్రి చివరకు అంగీకరించినాడు.

ఉభయులూ గుర్రాలమీద ఆ అడుగుల జాడవెంట సరోవరతీరాన అశోకవృక్షముకింద ఉన్న చంద్రవతినీ లావణ్యవతినీ చూచినారు. చంద్రవతి వారిని చూచి చోరులనుకొని భయపడి లేచింది. లావణ్యవతి తల్లితో 'అమ్మా, భయములేదు. వీరు చోరులుకారు. పెద్దమనుష్యుల వలె ఉన్నారు. బహుశా వేటాడుతూ ఈవైపువచ్చినారు' అన్నది.

చంద్రవతి సందేహిస్తున్నది. ఇంతలో చండసింహుడు గుర్రము మీాద నుంచి దిగి 'సుందరీమణులారా, భయపడవద్దు. అనురాగమువల్లనే మిమ్మల్ని చూడవచ్చినాము. భయమువిడిచి మీావృత్తాంతము చెప్పండి. రత్నాలమేడలలో ఉండవలసిన మీారు ఈఅడివిలోకి ఎందుకువచ్చినారు? మిమ్మల్నిచూస్తే నాకు చాలావిచారము కలుగుతున్నది. క్రూర మృగములు సంచారముచేసే ఈ అరణ్యములో మీారు ఉండడం మేము ఒప్పుకోము' అన్నాడు.

చంద్రవతి నిట్టూర్పులు విడిచి కొంతసిగ్గుతో కొంతదుఃఖముతో తమకథ అంతా చెప్పింది. చండసింహుడు మంచిమాటలు చెప్పి చివరకు తల్లినీ కూతురినీ గుర్రముమీాద ఎక్కించి తమనివాసానికి తీసుకుని వెళ్ళినాడు. కుబేరవైభవములో ఉన్న తనసౌధములో వారిని దింపి కొద్ది రోజులలో వాళ్ళమనస్సులు రంజింప చేసినాడు చండసింహుడు. చంద్రవతి అనాథ ఐపోయింది. దిక్కులేదు. పరదేశములో వచ్చిపడ్డది. ఏమి చేస్తుంది! చండసింహుని మాటలకు అంగీకరించింది.

అడివిలో తండ్రీ కొడుకూ చేసుకున్న నియమప్రకారము చిన్న అడుగుల దానిని కుమారుడు, పెద్దపాదాల దానిని తండ్రి వివాహ మాడినారు. మొదట చేసుకొన్న నియమము పెద్దమనుష్యులు తప్పరుకదా! చిన్నపాదాలది తల్లి, పెద్దపాదాలది కూతురు. కాలక్రమేణా వారిద్దరికీ చాలామంది కొడుకులూ కుమార్తెలూ పుట్టినారు.

ఈ ప్రకారముగా కథచెప్పి బేతాళుడు త్రివిక్రమునితో 'రాజా, ఆ తల్లీకూతుళ్ళకు ఆ కుమారునివల్ల తండ్రివల్ల కలిగిన సంతానం ఉభయ పక్షాలవారూ ఒకరికొకరు ఏమాతారు? బాగాఆలోచించి చెప్పు. తెలిసికూడా చెప్పకపోతే శాపముమాట ఉండనే ఉన్నది' అన్నాడు. త్రివిక్రమసేనుడు ఏమీా తోచక బదులుచెప్పలేక త్వరత్వరగా నడుస్తున్నాడు. అతని బుజముమీాద ఉన్నశవంలో బేతాళుడు తనలో

'ఆహా! ఇతనికి సమాధానము తెలియలేదు. అందుచేతనే సంతోషముతో గబగబా నడుస్తున్నాడు. ఇతడు మహాసత్త్వుడు. ఇతనిని మోసగించేందుకు వీలులేదు. ఆభిక్షువు మాతో క్రీడిస్తూ ఇంతమాత్రానికి ఊరుకోడు. కాబట్టి ఉపాయముచేసి ఆదురాత్ముని వంచించి వానికి కలగవలసిన సిద్ధిని ఈరాజుకు సమకూర్చుతాను. ఇతడు భవిష్యత్తులో కల్యాణపరంపర పొందగలిగినవాడు' అనుకొని త్రివిక్రమసేనునితో ఇలా పలికినాడు. 'రాజా, నీవు సుఖపడవలసినవాడవు. ఈ కృష్ణచతుర్దశి రాత్రివేళ చీకటిలో ఈవల్లకాటిలో రాకపోకలవల్ల చాలా శ్రమపడ్డావు. నీమనస్సులో మార్పన్నమాట లేదు. నీఅద్భుతధైర్యానికి మెచ్చుకొన్నాను. ఈ శవాన్ని తీసుకొనివెళ్ళు. దీనిలోనుంచి నేను బయటికి వెళ్ళిపోతాను. నీమేలుకోరి నేనుచెప్పినప్రకారం చెయ్యి. ఈ నరశవాన్ని నీవు ఒకానొక నీచ భిక్షువుకోసం తీసుకొని పోతున్నావు. వాడు దీనిమీదికి నన్ను ఆవాహనచేసి అర్చన చేస్తాడు. ఆదుర్మార్గుడు నిన్ను బలి ఇవ్వడానికి నేలమీద సాష్టాంగప్రణామము చెయ్యమంటాడు. అప్పుడు నీవువానితో నాకు తెలియదు. ముందు నీవు ప్రణామము చెయ్యి. అది చూసి నేను చేస్తాను అని చెప్పు. నీకు పద్ధతి చూపడానికి ఆ అధముడు నేలమీద సాష్టాంగప్రణామము చేస్తుండగనే ఖడ్గముతో వానిశిరస్సు ఖండించు. వాడు అభిలషిస్తున్న విద్యాధర సంపద నీకు లభిస్తుంది. నీవు వానిని బలి ఇచ్చినట్లయితే నీకు ఈభూమండలం ప్రాప్తిస్తుంది. ఆదురాత్ముని "నీవు సంహరించడానికి సంశయించినట్లయితే వాడే నిన్ను బలి ఇస్తాడు. ఈ అమంగళము జరగకుండా ఇంతసేపూ విఘ్నాలు కల్పించాను. ఇక నీకు సిద్ధి కలుగుతుంది!

బేతాళుడు ఈ విధముగా బోధించి శవములోనుంచి వెడలిపోయినాడు. బేతాళునివాక్యాలవల్ల క్షాంతిశీలశ్రమణుడు తనకు శత్రువని గ్రహించి వటవృక్షముకింద ఉన్నభిక్షువుదగ్గరకు శవమును తీసుకు వెళ్ళినాడు త్రివిక్రమసేనుడు.

తరంగము: ౯౯

బేతాళకథ: ౨౫

శ్రమణుడు చెట్టుక్రింద కూచుని రాజుకోసం ఎదురు చూస్తున్నాడు. పక్కనే నేల రక్తముతో అలికి తెల్లటి ఎముకపొడితో మండలము చేసి దానికి నాలుగుపక్కలా రక్తకుంభాలు పెట్టి మనుష్యుని క్రొవ్వు నూనెతో దీపాలు పెట్టి పక్కన అగ్నిలో హోమము చేసి కావలసిన సంభారాలన్నీ సమకూర్చుకుని తన ఇష్టదేవతకు పూజచేసి కూర్చున్నాడు. రాజు శవమును తీసుకొని రాగానే వాడు చూచి సంతోషముతో లేచి “మహారాజా! అసాధ్యమైనపని సాధించావు! నీవంటివాడెక్కడ, ఈకాల మెక్కడ, ప్రాణానికి తెగించి అన్యులకార్యము సాధించిననీవు లోకులు చెప్పుకునేటట్టు ధీరుడవు అని స్తోత్రము చేసి తన పని నెరవేరిం దని లోలోపల ఆనందించి రాజు బుజముమీది శవాన్ని క్రిందికి దింపాడు. అనంతరం దానికి స్నానము చేయించి, అంగరాగము పూసి మెడలో పూలహారము వేసి మండలముమధ్య దాన్ని ప్రతిష్ఠ చేసినాడు. ఆపిమ్మట శ్రమణుడు ఒంటినిండా విభూతి పూసుకుని తల వెంట్రుకల యజ్ఞోపవీతం వేసుకుని శవచర్మం కప్పుకుని కొంచెంసేపు ధ్యానం చేసి మంత్రప్రభావముచేత బేతాళున్ని నరకళేబరముమీదికి ఆవాహనచేసి, అర్చనచేసినాడు. తర్వాత కపాలములో మనుష్యరక్తము బేతాళునికి అర్ఘ్య మిచ్చి పుష్పములర్పించి మనిషికళ్ళు ధూపమువేసి నరమాంసం నైవేద్యము పెట్టి అర్చన ముగించినాడు. అనంతరం శ్రమణుడు త్రివిక్రమసేనుని ఆహ్వానించి “మహారాజా! ఈమంత్రాధిరాజు సన్నిధానములో నీవు నేలమీద సాగిలపడి సాష్టాంగనమస్కారం చెయ్యి. అలా చేస్తే నీమనోరథాలు నెరవేరేటట్టు ఈమంత్రాధిరాజు వరమిస్తాడు” అని ప్రోత్సాహం చేసినాడు. రాజుకు బేతాళుని హితోప

దేశం జ్ఞాపకం వచ్చింది. "స్వామీ! సాష్టాంగనమస్కారం ఎలా చెయ్యాలో తెలియదు. ముందు నీవు చేస్తే చూచి తర్వాత నేను చేస్తాను" అన్నాడురాజు.

శ్రమణుడు సాష్టాంగదండప్రణామముచేయగానే త్రివిక్రమసేనుడు వాని శిరస్సు ఖండించి, రొమ్ము చీల్చి హృదయకమలము పైకి తీసి శిరస్సుతో సహా దానిని బేతాళునికి బలి ఇచ్చాడు. ఆకుశలకార్యానికి భూతగణం రాజును మెచ్చుకొన్నది. బేతాళుడు సంతుష్టుడై మానవ కళేబరములోనుంచి స్ఫుటవాక్కులతో "రాజా! నీవు భూమండల సామ్రాజ్యం అనుభవించినతరువాత విద్యాధరాధిపత్యము నీకు సంప్రాప్త మవుతుంది. ఈదుర్మార్గశ్రమణుడు వాంఛించింది ఆవిద్యాధరాధిపత్యమే! నిన్ను చాలా శ్రమ పెట్టినాను. నీవు కోరినవర మిస్తాను. అడుగు" అన్నాడు.

"యోగీశ్వరా! నీకు నామీద అనుగ్రహ ముండగా ఏకోరిక సిద్ధించదు? నీప్రశ్నలకథలు ఇరవై నాలుగున్నూ చివరదీ కలిసి మొత్తం ఇరవై ఐదు కథలూ లోకంలో పూజార్హములు అయ్యేలాగున వరం అనుగ్రహించు" అని రాజు ప్రార్థించిన మీదట బేతాళుడు "సరే! విశేషము చెప్పుతాను. ఈఇరవై అయిదుకథలు బేతాళపంచ వింశతి అనే పేరుతో లోకములో ప్రసిద్ధి చెంది పూజ్యతగణించి మంగళప్రద మవుతవి. ఇందులో ఒక వాక్యమైనా ఆదరముతో పఠించిన వాడు, విన్నవాడు వెంటనే పాపవిముక్తులౌతారు. ఇవి చెప్పేచోట యక్ష బేతాళ కూష్మాండ డాకినీ, రాక్షసాదులు చేరవు" అని ఆనర కళేబరం విడిచి యోగమాయవల్ల అంతర్ధానమైనాడు.

అప్పుడు మహేశ్వరుడు సంతుష్టుడై దేవగణసమేతముగా రాజుకు ప్రత్యక్షమై "వత్సా! నీవు చేసినపని యుక్తమే. ఈకపటశ్రమణుడు విద్యాధర మహాచక్రవర్తిత్వము కోసము మొండిపట్టు పట్టినాడు.

వీనిని సంహరించడము సముచితము. భూమిమీద మ్లేచ్ఛరూపాన అవతరించిన అసురులను నాశము చెయ్యడానికే నాఅంశాన ప్రభవించిన విక్రమాదిత్యుడవు. మళ్లీ ఇప్పుడు పుట్టిన దుర్మార్గులను శిక్షించడానికి త్రివిక్రమసేననామంతో నిన్ను నేనే సృష్టించాను. నీవు ద్వీపములతో పాతాళముతో కూడా ఈభూలోకాన్ని స్వాధీనం చేసుకొని తర్వాత మహా విద్యాధర చక్రవర్తివి అవుతావు. బహుకాలము దివ్యభోగాలు అనుభవించిన మీదట వైరాగ్యము పొంది అన్నిభోగాలు బుద్ధిపూర్వకంగా విడిచిపెట్టి నాసాయుజ్యం పొందుతావు. ఇదిగో, అపరాజితమనే ఈఖడ్గం తీసుకో. దీని ప్రభావంవల్ల సమస్త సౌభాగ్యములు నీకు సంక్రమిస్తవి. అని అనుగ్రహించి ఖడ్గము ప్రసాదించి అంతర్ధానమైనాడు.

తెల్లవారింది త్రివిక్రమసేనుడు తన ప్రతిష్ఠానసగరానికి వెళ్లినాడు. రాత్రి జరిగిన చర్యలన్నీ విని అక్కడివారు సంతోషించి ఉత్సవముచేసి రాజును పూజించినారు. త్రివిక్రమసేనుడు ఆనాడు స్నానాదులు అయిన తరువాత శివారాధన చేసి నృత్యగీత వాద్యాదికాలతో కాలంగడిపినాడు. శివుడు అనుగ్రహించిన ఖడ్గప్రభావం వల్ల త్వరలోనే ద్వీపపాతాళ సహితముగా భూచక్రమంతా జయించి పరిపాలించి చివరకు శివాజ్ఞవల్ల విద్యాధరచక్రవర్తి అయి చిరకాలము భోగము లనుభవించి శివసాయుజ్యము పొందినాడు.

బేతాళ పంచవింశతిక
సమాప్త మయినది.

మంత్రి విక్రమకేసరి నాగశాపమువల్ల బహుకాలము మృగాంకదత్తునికి దూరమయిపోయి శాపము తీరినతరువాత ఆయనను కలుసుకొని 'దేవా, ఆగ్రామములో వృద్ధబ్రాహ్మణుడు బేతాళకథలు చెప్పి "నాయనా, ఈప్రకారముగా సత్వసంపన్నుడైన త్రివిక్రమసేనుడికి బేతాళుని అనుగ్రహము వల్ల అన్నికోరికలు నెరవేరినవి. నీవుకూడా ఈ

మంత్రము ఉపదేశము పొంది విచారము విడిచి బేతాళుని ఉపాసించు. అతని అనుగ్రహామువల్ల నీప్రభువు మృగాంకదత్తుని, మళ్ళీ కలుసుకుంటాడు. ఉత్సాహము ఉంటే అన్నిపనులూ నెరవేరుతవి. నన్ను పాముకాటువేస్తే బతికించిన మిత్రుడవు. నేను చెప్పినప్రకారం చెయ్యి" అన్నాడు.

ఆబ్రాహ్మడివల్ల మంత్రం ఉపదేశముపొంది తంతుకూడా గ్రహించి ఆయనదగ్గర సెలవు తీసుకొని ఉజ్జయిని వెళ్ళినాను. అక్కడి మహాస్మశానంలో బేతాళపూజచేసి మహామాంసము నైవేద్యము పెట్టినాను: "నరమాంసము రుచిగా ఉన్నదనీ, "అదే ఇంకా తెమ్మనీ" బేతాళుడు తొందరపెట్టినాడు. అప్పుడు నేను నాశరీరాన కండలు కోసి పెట్టినాను. బేతాళుడు సంప్రీతుడై మిత్రమా, నీసత్వానికి మెచ్చుకొన్నాను. నీ శరీరం యధాప్రకారం అవుతుంది. నీ ఇష్టము వచ్చిన వరం కోరుకో' అని అనుగ్రహముతో పలికినాడు. "యోగీశ్వరా, నన్ను మృగాంకదత్త ప్రభువుసన్నిధికి చేర్చు. ఇంతకంటె వేరే కోరిక లేదు" అని విన్నవించాను.

అప్పుడు బేతాళుడు శవములో ప్రవేశించి నన్ను బుజాన ఎక్కించుకొని ఆకాశమార్గాన వచ్చి నీపాదసన్నిధానంలో దింపి వెళ్ళిపోయినాడు. దేవా, నాగశాపమువల్ల మీతో ఎడబాటు కలిగినమీదట జరిగిన సంగతులు మీకు విన్నవించాను.

మృగాంకదత్తుడు ఈసందర్భమంతా విని సంతోషించి శశాంకవతి కోసం ఉజ్జయినికి బయలుదేరి పారావతశాపము తీరడంవల్ల కొందరు అమాత్యులను కలుసుకొని తక్కినవారికోసం ఎదురు చూస్తున్నాడు.

## తరంగము: ౧౦౦

నమో విఘ్నజితే యస్య
జానుదేశే వివర్తతే

కుంభప్రస్తైవ నక్షత్ర
మాలా రాత్రిషు నృత్యతః!
కుంభవిప్రస్త విభ్రాంతి కొలువుచుండి.
నిశల నక్షత్రమాలిక నృత్యవేళ
తిరుగు నెవ్వని జాను ప్రదేశమందు,
అంజలి ఘటింతు అట్టి విఘ్నాధిపునకు!

విక్రమ కేసరి, గుణాకర విమలబుద్ధి, విచిత్రకథక, భీమపరాక్రమ ప్రచండశక్తి, శ్రుతధి - వీరితో బయలుదేరి మృగాంకదత్తుడు మరుభూమి ప్రవేశించినాడు. ఆకలిదప్పికలవల్ల బాధపడుతున్న మంత్రులతో ఎలాగో ఆప్రదేశం దాటిపోయి గొప్ప సరోవరం సమీపించినాడు. దాని పశ్చిమ తీరాన దివ్యఫలవృక్షం కనిపించింది. వారిలో ఆరుగురు త్వరగా వెళ్ళి చెట్టెక్కి పళ్ళు తిన్నారు. మృగాంకదత్తుడు వారికేసి చూస్తూ ఉండ గనే ఆరుగురూ ఫలములుగా మారినారు. రాజపుత్రుడు పేరు పేరుగా వారిని పిలిచినప్పటికీ ప్రత్యుత్తరము రాలేదు. మృగాంకుడు మూర్ఛ పోయినాడు. నేలమీదనే నిలుచునిఉన్న శ్రుతధి అతనికి తెలివి తెప్పించి విచారపడవద్దని బహువిధాల ఊరడించినాడు. కాని మృగాంకుడు ఏమీ శాంతి పొందక తటాకములో దూకి దేహము చాలించడానికి లేచినాడు. అప్పుడు అశరీరవాణి ఇలా పలికింది. 'వత్సా, ఎందుకు సాహసం? నీకు శుభం కలుగుతుంది. ఈదివ్యవృక్షాన గణేశ్వరుడు నివాసం చేస్తున్నాడు. నీమంత్రులు తెలివితక్కువవల్ల అపచారం చేశారు. కాళ్ళూ చేతులూ కడుక్కోలేదు. ఆచమనం చెయ్యలేదు. మైలబట్టలతో ఫలాలకోసం దివ్యవృక్ష మెక్కినారు. విఘ్నేశ్వరుని శాపంవల్ల పళ్ళు తాకగానే వారుకూడా ఫలాలైనారు. నీమంత్రులు నరుగురూ ఈదారినేవచ్చి ఇలాగే చెట్టెక్కి ఫలములై వేళ్ళాడుతున్నారు. కాబట్టి నీవు గణ నాయకుని గురించి తపస్సుచెయ్యి. స్వామి అనుగ్రహంవల్ల నీకు అభీష్ట సిద్ధి అవుతుంది.'

మృగాంకదత్తుడు ఆత్మహత్యా ప్రయత్నం మాని సరస్సులో స్నానంచేసి నిరాహారవ్రతం అవలంబించి గణనాయకుని అర్చించి అంజలి ఘటించి స్తోత్రముచేసినాడు. ఆరాత్రి మృగాంకుడు దర్భశయ్య మీద పడుకున్నాడు. శ్రుతధి అతనికి పరిచర్యలు చేస్తున్నాడు. ఇలా పదకొండు రోజులు గణేశపూజలో గడిచిపోయినవి. పన్నెండవనాడు వేకువజామున గణేశుడు అతనికి స్వప్నములో సాక్షాత్కరించి "వత్సా నీభక్తికి మెచ్చాను. నీ మంత్రుల శాపం తీర్చాను. మీరంతా కలిసి వెళ్ళండి. క్రమేణా శశాంకవతి నీకు లాభిస్తుంది" అని అనుగ్రహించినాడు. మృగాంకుడు మెలుకవ వచ్చిన తరవాత శ్రుతధికి స్వప్నవృత్తాంతము చెప్పి తెల్లవారగానే స్నానంచేసి వినాయకుని అర్చించి ఆయన నివాస వృక్షానికి ప్రదక్షిణము చేసినాడు. వ్యాఘ్రసేనుడు, స్థూలబాహుడు, మేఘబలుడు, దృఢముష్టి, మిగిలిన ఆరుగురూ — వెరసి పదిమంది మంత్రులూ చెట్టుదిగి వచ్చి అతనిపాదసన్నిధానములో వాలినారు. మృగాంకదత్తుడు ఆనందముతో అందరినీ ఆలింగనము చేసుకొన్నాడు. తరవాత వారంతా తటాకములో స్నానము చేసి భోజనాలు చేసినారు.

## తరంగము : ౧౦౧

## వ్యాఘ్రసేనుని కథ.

తరువాత సరోవర తీరాన అందరూ కూచున్నారు. మృగాంకదత్తుడు అడిగినమీదట వ్యాఘ్రసేనుడు తనకథ ఇలా చెప్పినాడు:

"దేవా, ఆ నాగశాపంవల్ల అందరినీ ఎడబాసి సొమ్మసిల్లి పడిఉండి రాత్రి తెలివి వచ్చినతరువాత అడవిలో తిరిగాను. చివరకు ఎలాగో తెల్లవారింది. మా ప్రభువు శశాంకవతీదేవి కోసం ఉజ్జయినే కదా వెళ్ళవలసినది అని మెల్లిగా నేను ఉజ్జయినికి బయలుదేరి వెళ్ళుతున్నాను.

మార్గములో అరణ్యము దాటి వెళ్ళినతరువాత సరోవరము కనుపించింది. అందులో నేను స్నానముచేసి తామరతూడులు తిని నీరు తాగి విశ్రాంతి తీసుకొంటూండగా దృఢముష్టి, స్థూలబాహు, మేహబలుడు అక్కడికి వచ్చినారు. మేమందరమూ నీసంగతి చర్చించి ఏదో కీడు మూడిందని భయపడి ప్రాణత్యాగం చేదామని సిద్ధపడ్డాము. సరిగ్గా ఆసమయానికే దీర్ఘతపసుడనే మునికుమారుడు స్నానార్థమక్కడికి వచ్చి మాసంగతి అడిగి తెలుసుకుని చివాట్లుపెట్టి త్వరలోనే మేలు కలుగుతుందని ధైర్యముచెప్పి స్నానము అయినతరువాత మమ్మల్ని తన ఆశ్రమానికి తీసుకొనివెళ్లినాడు.

దీర్ఘతపసుడు మమ్మల్ని ఒకచోట కూర్చోపెట్టి అర్ఘ్యపాద్యాదులిచ్చి ఆశ్రమవృక్షము ఒకొక్కదాని దగ్గర భిక్షాపాత్రము పట్టుతూంటే చెట్టుమీద నుంచి పండ్లురాలినవి. మునికుమారుడు మాకు ఆఫలములు పెట్టినాడు. రాత్రి చంద్రోదయమయిన తరువాత తపోవనములో మునులందరూ ఒకచోట సమావేశమైనారు. మేము నలుగురము వెళ్ళి వారికి నమస్కారాలు చేసి కూర్చున్నాము. మునులు మాకు అతిధి సత్కారం చేసి మావృత్తాంత మడిగినారు. మునికుమారుడు మాసంగతి అంతా చెప్పినాడు.

వారిలో కణ్వుడనే ముని మాతో "విచారపడవద్దు. ధైర్యము విడవకుండా ఉండడం ధీరులలక్షణం కదా! గొప్పవారు గొప్పకష్టములు ధైర్యముతో దాటి గొప్పఫలము పొంది గొప్పకీర్తి సంపాదిస్తారు. ఇందుకు నిదర్శనముగా మందారవతికోసం సుందరసేనుడు ఎటువంటి అవస్థపడ్డాడో చెవుతాను అని ఆకథ ఇలా ప్రారంభించినాడు:

### సుందరసేనుని కథ:

పూర్వము నిషధ అనేదేశంలో అలక అనే పట్టణమును మహాసేనుడనే రాజు పరిపాలిస్తున్నాడు. ఆరాజు శత్రువులందరినీ జయించి రాజ్యము

గుణపాలితుడనే తనమంత్రి పరము చేసి భార్య శశిప్రభాదేవితో సుఖముతో ఓలలాడుతున్నాడు. ఆరాజదంపతులకు సుందరసేను డనే కుమారుడు కలిగినాడు. అతడు పెరిగి పెద్దవాడై సమస్తసద్గుణములకు ఆట పట్టైనాడు. చిన్నతనమునుంచీ అతనితో కూడా సమానముగా పెరిగి పెద్దవారైన ఐదుగురు మంత్రికుమారులు మిత్రులు చంద్రప్రభువు, భీమభటుడు, వ్యాఘ్రపరాక్రముడు, విక్రమశక్తి, దృఢబుద్ధి అనే ఈఐదుగురు బుద్ధిమంతులు, సత్కుల సంజాతులు, స్వామిభక్తులు, సత్వసంపన్నులు. అందరికీ పక్షి భాషలు తెలుసును సుందరసేనునికి వయస్సు వచ్చినా తగినకన్య దొరకనందువల్ల వివాహము కాలేదు.

సుందరసేనుడు ఒకనాడు ఐదుగురుమంత్రులతో కలిసి వేటకు వెళుతున్నాడు. దూరదేశమునుంచి వచ్చిన కాత్యాయిని అనేవృద్ధపరివ్రాజిక అతనిని చూచి పరివారాన్ని అడిగి రాజపుత్రు డని తెలుసుకొని అతని సౌందర్యాన్ని మెచ్చుకొని "కుమారా, విజయము" అని బిగ్గరగా ఆశీర్వదించింది. తనమిత్రులు చెపుతున్నకబుర్లు వింటూ ఆమె మాటలు సుందరసేనుడు ఆలకించలేదు. కోపం వచ్చి పరివ్రాజిక బిగ్గరగా 'రాజకుమారా, నాఆశీర్వచనం నీ కక్కర లేదా? నన్ను ఆదరించని రాజు గాని రాజకుమారుడు గాని లేడు. రూపయౌవనములవల్ల నీ కింత గర్వమే! హంసద్వీప ప్రభువుకుమార్తె మందారవతిని నీవు పెళ్ళిచేసుకొంటే మనుష్యులమాట అటుంచి, మహేంద్రాదులమాటైనా చెవిని పెట్టవు అనుకుంటాను' అన్నది. రాజకుమారుడు తనను క్షమించమని వేడుకొని మందారవతివృత్తాంతమంతము సవిస్తరముగా వినదలచుకొని కాత్యాయనిని విక్రమశక్తిఇంటికి పరివారముతో పంపినాడు. వేటాడి వచ్చి ఆహ్నికకృత్యము ముగించుకొని భోజనానంతరం పరివ్రాజికను పిలిపించి సుందరసేనుడు 'భగవతీ, నీవు ఇందాక మందారవతి అన్నావే, ఎవ రామె? తెలుసుకోవలెనని కుతూహలముగా ఉన్నది. చెపుతావా?' అని అడిగినాడు.

ఆమె ఈవిధముగా చెప్పింది: "తీర్థాటనము చేస్తూ ఒకసారి నేను హంసద్వీపానికి వెళ్ళినాను. అక్కడ మందారదేవుడు ప్రభువు. ఆయన పుత్రిక మందారవతి మహాసౌందర్యవతి. ఆమెను చూడనివారినేత్రములు నిష్ఫలములు! నీవొక్కడవే ఆమెకు భర్త కాదగిన వాడవు."

"భగవతీ, అటువంటి మనోహారిణిరూపము మాకు ఎలా కనబడుతుంది?" అన్నాడు రాజకుమారుడు.

'నేను ఆమెరూపము పటముమీద చిత్రించి బరిణలో పెట్టి తెచ్చినాను. కుతూహల ముంటే చూడవచ్చును' అన్నది పరివ్రాజిక. సుందరసేనుడు ఆచిత్రరువు చూచి ముగ్ధుడై పోయి రెప్ప వాల్చక చూస్తూ ఉన్నాడు.

మంత్రికుమారులు 'భగవతీ, నీకు చిత్రలేఖనములో చాలా నేర్పు ఉన్నట్టు కనబడుతున్నది. మారాజకుమారుని రూపము పటముమీద చిత్రిస్తే సంతోషిస్తాం' అన్నారు. ఆమె భరిణలోనుంచి చిత్రలేఖన సామగ్రులు బైటికి తీసి త్వరలోనే సుందరసేనుని రూపము చిత్రించింది. మంత్రికుమారులు చూచి మెచ్చుకొని, మందారవతిరూపము ఈమె వాస్తవంగా చిత్రించి ఉంటుంది అనుకొని రెండు పటములూ తీసుకొని పరివ్రాజికకు ఉచిత సత్కారములు చేసి, ఆమె ఒకచోటే ఉండదు కాబట్టి వీడ్కొల్పినారు. సుందరసేనుడు ఆపటములు తీసుకొని మందారవతికేసి తదేకధ్యానముతో చూస్తూ మదనావస్థలో పడ్డాడు.

రాజదంపతులు అతనిమిత్రులవల్ల వృత్తాంత మంతా తెలుసుకున్నారు. తండ్రి మహాసేనమహారాజు కుమారునితో 'నాయనా, ఈ విషయము దాచిపెట్టడ మెందుకు? నీఅనురాగము యుక్తమైనదే. మందారవతి నీకు తగినదే. ఆమె తండ్రి మందారదేవుడు నాకు గొప్ప మిత్రుడు. దూతనుపంపితే పని నెరవేరుతుందే! వృథాగా ఎందుకు శ్రమపడతావు' అని అతనిని ఓదార్చి హంసద్వీప ప్రభువువద్దకు సురతదేవుడు

అనేదూతను పంపినాడు. కాత్యాయిని లిఖించిన సుందరసేనుని పటము దూతకు ఇచ్చినాడు.

రాయబారి త్వరగా ప్రయాణం చేసి మహేంద్రాదిత్య ప్రభువు పరిపాలిస్తున్న శశాంకపురము చేరినాడు. అది రేవుపట్టణము. అక్కడ సముద్రములో ఓడ ఎక్కి శీఘ్రకాలములోనే హంసద్వీపము చేరి రాజదర్శనము చేసి మందారదేవునికి ఈవిధముగా రాయబారము తెలిపినాడు : 'మహారాజా, మారాజకుమారుడు సుందరసేనునికి మీపుత్రిక మందారవతిని ఈయవలెను. కాత్యాయిని అనేపరివ్రాజిక మీకన్యామణి చిత్తరువు లిఖించి మాకిచ్చినది. మాసుందరసేనుని చిత్రపటము మీకు పంపినాము. మీకుమార్తె ఏప్రకారముగా సౌందర్యానికి పేరుపడ్డదో మారాజకుమారుడు అలాగే రూపానికి ప్రసిద్ధి చెందినవాడు. వీరి దాంపత్యము తగిన దని మా అభిప్రాయము.'

ఈప్రకారంగా రాయబారి వాచికము చెప్పి సుందరసేనుని చిత్రపటమును మందారదేవునికి సమర్పించినాడు. రాజు చూచి సంతోషించి రాణిని, కుమారిని పిలిపించి వారికి చిత్రపటము చూపి వృత్తాంతము తెలిపినాడు. రాణి అంగీకరించింది. మందారవతి చిత్తరువు చూస్తూ తక్కిన ప్రపంచం మరిచిపోయింది. తండ్రి కుమార్తెస్థితి కనిపెట్టి కన్యను ఇవ్వడానికి అంగీకారము సూచించి రాయబారిని సత్కరించినాడు.

మరునాడు కుమారదత్తుడు అనేదూతను మహాసేనప్రభువు దగ్గిరికి తిరుగు రాయబారముతో పంపుతూ 'మహారాజా, మేము మైత్రివల్ల కన్యను ఇచ్చినాము. వివాహానికి మీకుమారుడు ఇక్కడికి వస్తాడా, మాకన్యను అక్కడికి పంపమంటారా?' అనేవాచికము చెప్పినాడు.

దూత లిద్దరూ సముద్రమార్గాన. శశాంకపురము చేరి అక్కడినుంచి నాటుదారి ప్రయాణము చేసి క్రమేణా అలకానగరము ప్రవేశించి మహాసేనప్రభువు దర్శనముచేసి మందారదేవుని సందేశము అందించినారు.

మహాసేనుడు హంసద్వీపదూతను అడిగి మందారవతి జన్మనక్షత్రము తెలుసుకొని కార్తాంతికులను రప్పించి వివాహముహూర్తము నిశ్చయము చెయ్యవలసింది అన్నాడు. వారు గుణించి మాసుమాసముల తరవాత కార్తికశుద్ధ పంచమినాడు వధూవరులకు శుభలగ్నము అని నిర్ణయించారు. అంతట రాజు శుభలేఖ వ్రాయించి ముహూర్తము నాటికి సుందరసేనుడే హంసద్వీపానికి వస్తాడని తెలియజేస్తూ కుమారదత్తునివెంట తనదూత చంద్రస్వామిని పంపినాడు. ఉభయపక్షముల వారు శుభముహూర్తముకోసం ఎదురు చూస్తున్నారు.

హంసద్వీపములో మందారవతి సుందరసేనుని చిత్రపటము చూచి నప్పటినుంచీ చెప్ప శక్యముకాని విరహావస్థలో పడ్డది. ఆరోజు కారోజు ఆమెబాధ మితిమీరి పోతున్నది. పరివారజనమువల్ల కుమార్తెస్థితి తండ్రి తెలుసుకొని భార్యతోనూ మంత్రులతోనూ సంప్రతించి మందారవతి కాల విలంబము సహించలేకుండా ఉన్నది. మహాసేనుడు మాకు మిత్రుడు. అమ్మాయి నక్కడకు పంపితే మన కేమీ గౌరవహాని లేదు. సుందరసేనుని సమక్షములో ఉంటే అమ్మాయికి కొంత ధైర్యంగా ఉంటుంది' అని మంచిరోజు చూచి మందారవతిని పెళ్ళికూతురును చేయించి ధన వస్తు పరివార సమేతముగా తన మహామంత్రి వినీతమతిని సాయ మిచ్చి కుమార్తెను ఓడ ఎక్కించినాడు.

ప్రయాణము కొద్దిరోజులు సుఖంగానే సాగింది. ఒకనాడు గొప్ప తుపాను వచ్చింది. వినీతమతీ, పరివారమూ, ధనవస్తు సమూహముతో పడవ మునిగిపోయింది. మందారవతి మాత్రము ఎలాగో సముద్రపు ఒడ్డుచేరి బిగ్గరగా రోదనం చేస్తున్నది.

సమీపంలో మతంగమహాముని ఆశ్రమమున్నది. తనకుమార్తె యమున అనే బాలబ్రహ్మచారిణితో సహా సరిగా ఆవేళకే మతంగుడు సముద్రస్నానానికి వచ్చి స్త్రీరోదనము విని మందారవతిని సమీపించి

చల్లనిమాటలతో ఆమె వృత్తాంతము అడిగినాడు. ఆమె కొంత శాంతి పొంది సిగ్గుపడుతూ తన సంగతి అంతా విన్నవించింది. మతంగముని కొంచెము సేపు ధ్యానము చేసి "రాజకుమారీ, భయపడకు. విచారము విడిచిపెట్టు. ధైర్యము వహించు. త్వరలోనే నీభర్తను కలుసుకొంటావు. సమీపంలోనే నా ఆశ్రమ మున్నది. నా కుమార్తెతోకూడా మా ఆశ్రమంలో ఉండు. నీకేమీ శ్రమ ఉండదు" అని ఓదార్చి స్నానానంతరం ఆమెతోసహా ఆశ్రమము చేరినాడు. అక్కడ మందారవతి పతిప్రాప్తి కోసం దీక్షవూని యమునతోకలిసి మునికి పరిచర్యలు చేస్తూ దుఃఖము మరిచిపోయింది.

ఇక్కడ అలకానగరములో సుందరసేనుడు అను గడుగుకూ మందారవతిని స్మరిస్తూ వివాహానికి రోజులు లెక్కపెట్టుకొంటూ, మంత్రి కుమారుల మాటలవల్ల మధ్యమధ్య ఊరడిల్లుతూ, కాలం గడుపుతున్నాడు. మంచిరోజుచూచి మహాసేనుడు కుమారునికి ప్రయాణ మంగళము చేయించి హంసద్వీపానికి పరిణయంకోసం పంపినాడు. సుందరసేనుడు పరివారముతోను, మంత్రులతోను శశాంకపురము చేరినాడు. ఇతని ఆగమనము తెలుసుకొని మహేంద్రాదిత్య మహారాజు ఎదురువెళ్ళి ప్రార్థించి పరివార సమేతముగా ఇతనిని తన నగరిలోకి తీసుకొని వెళ్ళినాడు. మర్నాడు మహేంద్రాదిత్యుడు తనతోకూడా హంసద్వీపం వస్తానంటే సరేనని సుందరసేనుడు ఆరోజు అక్కడే గడిపి మందారవతిని తలుచుకుంటూ రాత్రి వెళ్ళబుచ్చి ప్రాతఃకాలము తన సేనను అక్కడేవిడిచి మహేంద్రాదిత్యునితో సహా సముద్రపు రేవుకు చేరినాడు. అక్కడ ఒక ఓడలో తన పరివారజనాన్ని ఎక్కించి సుందరసేనుడు తన మంత్రికుమారులతో మహేంద్రాదిత్యునితో మరోవడవలో ఎక్కినాడు. రెండుఓడలూ లంగరు ఎత్తినమీదట నైరృతి దిక్కుగా రెండురోజులు ప్రయాణము చేసినవి. మూడవనాడు

బ్రహ్మాండమైన తుపాను బయలుదేరింది. సముద్రానికి రత్నములు అర్ఘ్యమిచ్చి తెరచాపలు దించి గొలుసులకు పెద్దరాళ్లు కట్టి పడవలకు అన్నిపక్కలా వేలాడదీసినారు. అయినప్పటికీ రెండుఓడలనూ గాలి మహావేగముతో నెట్టివేస్తున్నది. లాభం లేదని సుందరసేనుడుగ్రహించి మహేంద్రాదిత్యునితో "మహారాజా, నాపాపమువల్ల ఈప్రళయము అనుకోకుండా మీకూ సంభవించింది. నేను కళ్ళారాచూడ దలుచుకోలేదు." అని ఉత్తరీయము నడుముకు కట్టుకొని గుభాలున సముద్రములోకి దూకినాడు. అదిచూచి మహేంద్రాదిత్యుడు, చంద్ర ప్రభాదులు నీటిలోకిఉరికినారు. వారంతా ఈదుతూ సముద్రతరంగాల వేగం వల్ల ఎక్కడెక్కడికో కొట్టుకుపోయినారు. సుంద సేనుడు, దృఢబుద్ధిమాత్రము దగ్గిర దగ్గిరగా ఈదుతూఉన్నారు. పెద్దఓడలు రెండూ మునిగిపోయినవి. ఇంతలో సముద్రము శాంతించింది. దైవానుగ్రహంవల్ల ఎక్కడినుంచో ఒక పడవ అటువైపు వచ్చింది. వారిద్దరూ అందులోకి ఎక్కినారు. మూడురోజులలో ఆపడవ గట్టుచేరింది. కొంచెం విశ్రాంతి తీసుకొన్నారు ఉభయులూ.

ఇంతలో స్నానార్థము ఇద్దరు తాపసు లక్కడికి వచ్చి వారిసంగతి తెలుసుకొని తమ ఆశ్రమానికి తీసుకొని పోయినారు. సుందరసేనుడు దృఢబుద్ధితోకూడా అక్కడ కొన్నాళ్లు ఉన్నాడు.

ఈలోగా భీమభుజుడూ విక్రమశక్తి విడివిడిగా ఈదుతూ ఎలాగో ఆతీరమే చేరి సుందరసేనుడుకూడా ఆప్రాంతాలకే వచ్చి ఉండువచ్చునని వెతుకుతూ మహారణ్యములో ప్రవేశించారు. తక్కిన చండప్రభ-వ్యాఘ్రపరాక్రములూ, మహేంద్రాదిత్యుడూ ఆతీరమేచేరి శశాంకపురానికి వెళ్ళినారు. వారు అక్కడ నిలిపిన సేనతో కలిసి అలకాపురము వెళ్ళి సుందరసేనుని వార్త తండ్రికి చెప్పినారు. కుమారుడు గతించినాడనే దుఃఖముతో రాజదంపతులు ప్రాణత్యాగము చేయ

డానికి సిద్ధపడితే మంత్రులు బహువిధాల ఓదార్చి ఆశలు కల్పించి ఆ ప్రయత్నము మాన్పించినారు. మహాసేనుడు పరివారసమేతముగా పట్టణము విడిచి నగరము వెలుపలి శివాలయములో తపస్సుచేస్తూ పుత్రుని సంగతి ఏమైనా తెలుస్తుందేమో నని ఆశ పెట్టుకొని ఉన్నాడు.

హంసద్వీపములో మందారదేవునికి అల్లుడిసంగతీ కూతురుసంగతీ తెలిసింది. మహాసేనుడు తపస్సు చేస్తున్నట్లు విని ఆయన మంత్రుల మీద రాజ్యభారం విడిచి కందర్పసేన అనే తన రాణితోకూడా బయలుదేరి అలకానగరముచేరి మహాసేనుని వలెనే మితాహారము పుచ్చుకుంటూ, దర్భశయ్యమీద పండుకుంటూ తపస్సు చెయ్యడం మొదలుపెట్టినాడు.

గాలికి ఆకులు కొట్టుకుపోయినట్టు ఎక్కడివా ళ్ళక్కడ చెల్లాచెదరై పోయినారు. అయితే అదృష్టవశాత్తు సుందరసేనుడు మందారవతి ఉన్న మతంగాశ్రమానికే కొన్నాళ్ళకు చేరుకొన్నాడు. దానిసమీపంలో ఉన్న సరస్సులో స్నానం చేసి మధురఫలాలు భక్షించి ఒకగట్టున నడుస్తూ శివాలయంపక్క కొందరు మునికన్యలు పుష్పాలు కోస్తూ ఉండడం చూచినాడు. వారిమధ్య మహాసౌందర్యవతి గోచరించింది. సుందరసేనుడు ఆమెను తేరిపార చూచి చిత్తరువులో ఉన్నమందారవతిలా ఉన్నది అనుకొన్నాడు. అతనివెంటనే ఉన్నదృఢబుద్ధి ఆమె మునికన్యకా దనీ, రాజకన్య అయిఉండా లనీ ఆకారాన్ని బట్టి అన్నాడు. ఉభయులూ చెట్లచాటున నిలుచుని వారిని కనిపెట్టి చూస్తూ ఉన్నారు. ఇంతలో వారంతా నదిలో దిగినారు. మొసలి ఆసుందరిని పట్టుకొన్నది. మునికన్యలు కేకలు వేసినారు. సుందరసేనుడు పరుగున పోయి మొసలిని సంహరించి ఆమెను రక్షించినాడు. ఆమె ఇతనిని తేరిపార చూచి ఈయన చిత్రపటములో ఉన్న నాప్రాణనాయకునివలె ఉన్నాడు అనుకొని ప్రాణరక్షణము చేసిన ఈమహానుభావునికి మొక్కులర్పించి పోదాము

అన్నది. మునికన్యలు మందారవతి పేరు ఉచ్చరించడము విని సుందర సేనుడు మునికన్యలలో ఒక తెను పిలిచి 'కల్యాణీ, మీసఖితల్లిదండ్రు లెవరు. ఈమెవృత్తాంతము వినవలె నని కుతూహలముగా ఉన్నది' అని అడిగినాడు.

'ఈమె హంసద్వీపాధిపతి మందారదేవునికూతురు, మందారవతి. అలకానగర ప్రభుకుమారుడు సుందరసేనునికి ఈమె నిచ్చి వివాహము చేయించడానికి ఓడ ఎక్కించి పంపినారు. మార్గములో తుపానువల్ల ఓడ మునిగిపోయింది. ఈమె ఎలాగో ఒడ్డున పడి ఈ మతంగాశ్రమం చేరింది' అని మునికన్య చెప్పింది. దృఢబుద్ధి సంతోషం పట్టలేక సుందర సేనునితో 'దేవా, మంచిరోజులు వచ్చినవి. మందారవతి లభించింది. అదృష్టం.' అన్నాడు. మునికన్యలు వీరివృత్తాంత మడిగి తెలుసుకొని మందారవతిని అభినందించారు. మందారవతి సుందరసేనునిపాదాలమీద వాలింది. మునికన్యలు వెళ్ళి ఈసంగతి మతంగమునికి తెలిపినారు. యమునతోకూడా ఆయన అక్కడకు వచ్చి ఆయనను తనఆశ్రమానికి తీసుకొని వెళ్ళి ఆతిథ్య మిచ్చినాడు. వారు ఆరోజు అక్కడే గడిపినారు. మరునాడు మతంగముని అతనితో 'వత్సా, పనిమీద నేను శ్వేత ద్వీపము వెళ్ళవలసిఉన్నది. మందారవతిని నాబిడ్డగానే భావించుకొన్నాను, నీకు సమర్పించాను. అలకాపురం వెళ్ళి యథావిధిగా వివాహం చేసుకో. ఈమెతో నీవు బహుకాలం సుఖము అనుభవిస్తూ భూమండలం ఏలు తావు. త్వరలోనే నీమంత్రు లంతా కలుస్తారు' అని కూతురు యము నతో కూడా ఆకాశమార్గమున శ్వేతద్వీపానికి వెళ్ళినాడు.

సుందరసేనుడు మందారవతి, దృఢబుద్ధులతో వెంటనే బయలుదేరి సముద్రతీరం చేరుకొన్నాడు. అక్కడ ఓడ కనిపిస్తే దృఢబుద్ధిద్వారా ఆఓడ యజమానిని ఓడలో చోటు ఇమ్మని కోరినాడు. ఆవణిక్కుమా రుడు మందారవతిని చూచి మోహించి ఓడను ఒడ్డుకు పట్టించినాడు.

సుందరసేనుడు ముందు మందారవతిని ఓడలో ఎక్కించి తాను ఎక్క బోయేలోగా వణిక్కుమారుడు సరంగుకు సంజ్ఞచేసినాడు. క్షణములో ఓడ గట్టుకు దూరముగా వెళ్లిపోయింది. మందారవతి బావురుమని ఏడ్చింది. పడవయజమాని వేగముగా ఓడను నడిపించుకు పోయినాడు.

సుందరసేనుడు నేలమీద పడి బహువిధాల విలాపము చేసినాడు. దృఢబుద్ధి ధైర్యము చెప్పి ఆదుర్మార్గుణ్ణి పట్టుకొందామని బయలుదేర దీసినాడు. ఉభయులూ అరణ్యములో ప్రవేశించి ప్రయాణం చేసి మరో అడవి చేరి దారి తప్పిపోయినారు.

వింధ్యకేతు వనే పుళిందనాయకుడు ఆప్రాంతాలకు ప్రభువు. అతని ఆజ్ఞానుసారముగా కొంతమంది పుళిందులు బయలుదేరి చండికాదేవికి నరబలి ఇవ్వడానికి మనుష్యులను వెతుకుతూ వీరినిచూసి పట్టుకో బోయినారు. సుందరసేనుడు చాలామందిని పొడిచి చంపినాడు. కాని అతనికీ దృఢబుద్ధికీ గాయాలు తగిలినవి. ఇద్దరు సొమ్మసిల్లి పడిపోయి నారు. ఉభయులనూ బంధించి పుళిందులు చెరసాలలో పడవేసినారు.

అందులో భీమభుజ - విక్రమశక్తులు సుందరసేనుని గుర్తుపట్టి అతని పాదాలమీద వాలినారు. ఆనలుగురూ ఒకరిసంగతులు ఒకరికి చెప్పు కొని దుఃఖభారములో మునిగినారు. చెరసాలలో ఉన్న ఇతర బందీలు వీరిని ఓదార్చి వచ్చే చతుర్దశినాడు అమ్మవారికి మనల నందరినీ పుళింద నాయకుడు బలి ఇస్తాడట. విచారపడి ఏమి ప్రయోజనము? ఒకవేళ అదృష్టవశాత్తు అనుకోకుండా మనకు మేలు కలుగుతుందేమో అని శాంతపరిచినారు.

కృష్ణచతుర్దశినాడు పుళిందుడు వచ్చి అందరినీ చండికాలయానికి తీసుకొని వెళ్ళినాడు. సుందరసేనుడు చండీదేవిని మనస్సులో స్తుతి చేసి నాడు. ఇంతలో పుళిందరాజు వింధ్యకేతుడు అమ్మవారి పూజ చేయ టానికి అక్కడికే వచ్చినాడు. సుందరసేనుడు వానిని దూరమునుంచే

ఆనవాలుపట్టి మిత్రులతో నెమ్మదిగా ఏను వింధ్యకేతువు మాకొలువులో ఉన్నవాడు. జీతానికి బదులు నాయనగారు ఈఅడవి అనుభవించమని వీడికిచ్చినారు. వీడితో మనసంగతి చెప్పవద్దు. మనంతట మనం ఎరుక పరుచుకోడం చాలా అవమానకరం అన్నాడు.

వింధ్యకేతువు తన సేవకులతో 'ఎవడురా ఒకపట్టున దొరకక మన వాళ్ళను చాలామందిని చంపిన ఆపెద్దవేటపోతు' అని కేకవేసినాడు. ఒంటిమీద నెత్తురుచారలూ, దుమ్మూ, గాయాలూ ఉన్నసుందర సేనుణ్ణి చూపించినారు. వింధ్యకేతువు కొద్దిగా ఆనవాలుపట్టి సందేహము పుట్టి 'ఎవరునీవు, ఎక్కడివాడివి' అన్నాడు. 'నేనెవరైతే నీకేమి' అన్నాడు సుందరసేనుడు. కంఠస్వరాన్ని బట్టి వింధ్యకేతువు కంగారు పడి పెద్దకేకవేసి అతని పాదాలమీద వాలి 'అయ్యో, ఎంత దురాత్ముణ్ణి మహాసేనమహారాజా! నీవు నాకు చూపిన అనుగ్రహానికి ఎటువంటి కృతజ్ఞత చూపించాను! సుందరసేన యువరాజును తెలియక కష్టాలపాలు చేశాను' అని అతన్ని కౌగలించుకొని ఏడవడం మొదలుపెట్టాడు. మంత్రికుమారులు 'పుళింద రాజా, ఇప్పుడు మరేమీ నష్టము లేదు. ముందుగానే కనుక్కొన్నావు. మించిపోయినతరువాత నీవు చేసేదేముంది? ఇప్పుడు సంతోషించవలసిన సమయం' అని వానిని ఓదార్చినారు. పుళిందనాయకుడు తెప్పరిల్లి బందీ లందరినీ విడిపించి మిత్రులతోసహా సుందరసేనుని తనపల్లెకు తీసుకొనిపోయి గాయాలకు కట్లు కట్టి మందుమాకు లిచ్చి ఉపచారాలు చేయించినాడు. తరవాత వారి వృత్తాంతమంతా విని ఆశ్చర్యపడ్డాడు.

ఇంతలో వింధ్యకేతువు సేనాపతి గబగబావచ్చి సంతోషముతో 'స్వామీ, ఎవరో గొప్పవర్తకుడు చాలాధనముతో స్త్రీ రత్నముతో ఈ అరణ్యమార్గాన వెడుతుంటే పరివారసమేతంగా వాణ్ణి పట్టుకొని ఇక్కడకు తీసుకు వచ్చాము. అదుగో అక్కడఉన్నారు. ఏమిసెలవు?'

అని అడిగినాడు. వారిని తనసన్నిధానానికి తీసుకు రమ్మని పుళిందరాజు ఆజ్ఞ ఇచ్చాడు. వాళ్ళు రాగానే దృఢబుద్ధి చూసి 'ఈమె మందారవతీ దేవి! వీడు ఆదుష్టవణిక్కుమారుడు' అన్నాడు. సుందరసేనుడు వెంటనే పోయి ఆమెను చేతులలోకి తీసుకొన్నాడు. పుళిందనాయకుడు వర్తకుని చూసి 'ఏమిరా, నమ్మినవాని భార్యను అపహరించావే!' అన్నాడు. వాడు గడగడ వణుకుతూ 'నాకు వినాశకాలం వచ్చి ఈపని చేశాను. ఈమెను అవమానించలేదు. నెమ్మదిమీద ఈమెను వివాహము చేసుకో వలెనని నాసంకల్పం. అయినప్పటికీ మహాపాపిని!' అని వినయముతో పలికినాడు. వానిశిరస్సు ఖండించవలసిందని పుళిందనాయకుడు ఆజ్ఞ ఇచ్చినాడు. వాణ్ణి కనికరించి విడిచిపెట్ట వలసిందని సుందరసేనుడు వాదించినాడు. వర్తకునికి ప్రాణముకన్న ధనమే ముఖ్యం. కాబట్టి ధనముమాత్రము తీసుకొని వింధ్యకేతువు వానిని విడిచిపెట్టినాడు.

మందారవతీ సుందరసేనులను తనమందిరములోకి తీసుకుపోయి, వింధ్యకేతువు సమస్త ఉపచారాలు చేయించి పీఠములమీద కూర్చుండ బెట్టి ముత్యాలు కస్తూరి మొదలైన పదార్థాలు కానుకయిచ్చి గౌరవించి నాడు. మరునాడు పెద్దఉత్సవము జరిగింది. శబర స్త్రీలంతా నృత్యాలు చేసినారు. సుందరసేనుడు పుళిందరాజుతో 'నాయకా! నా గాయములు మానిపోయినవి. నాఅభీష్టము నెరవేరినది. ఇక నేను బయలుదేరి మా అలకానగరానికి వెళ్లిపోతాను. ఉత్తరము రాసిఇస్తాను. లేఖాహారుణ్ణి ముందు మా నాయనగారి సన్నిధికి పంపించు' అన్నాడు. వాడు అలాగే చేసినాడు.

అలకానగరము వార్తాహారుడు చేరేసరికి మహాసేన మహారాజు శివాలయముఎదుట అగ్నిప్రవేశము చెయ్యడానికి సిద్ధముగా ఉన్నాడు. పౌరులు విచారముతో చుట్టూ నిలుచుని ఉన్నారు. వార్తాహారుడు గబగబా మహారాజు సన్నిధానానికి పరుగెత్తుకుపోయి తనను ఎరుక

పరచుకొని "దేవా! మీకుమారుడు, మందారవతీదేవి, మాదొర వింధ్యకేతువు కలిసి ఇక్కడికి వస్తున్నారు. ఈసంగతి తమకు విన్నవించ డానికి ముందు నన్ను పంపించారు' అని లేఖ ఆయనపాదాలవద్ద ఉంచి నాడు. జనం సంతోషంతో కోలాహలం చేశారు. రాజు ఉత్తరము బిగ్గరగా చదివి వార్తావహునికి బహుమానమిచ్చి ఊళ్లో ఉత్సవము చెయ్యడానికి అనుజ్ఞ ఇచ్చాడు. తరువాత కుమారునికి ఎదురు వెళ్ళ డానికి హంసద్వీపాధిపతిని కూడా తీసుకుని చతురంగసహితముగా బయలుదేరినాడు.

సుందరసేనుడు మందారవతితోను భీమభుజ, విక్రమశక్తి, దృఢ బుద్ధులతోను, వింధ్యకేతువుతోను బయలుదేరి మార్గమధ్యములో తండ్రి ఎదురు పడడమువల్ల గుర్రము దిగి పాదప్రణామము చేసినాడు. తండ్రివల్ల, మందారదేవునిసంగతి తెలుసుకుని ఆయనకు నమస్కరించి నాడు. శశాంకపురమునుంచి మహేంద్రాదిత్య ప్రభువు సంగతు లన్నీ తెలుసుకుని అక్కడికి వచ్చినాడు. అందరూ మహావైభవముతో అలకానగరము చేరినారు.

జ్యోతిష్కుడు పెట్టినముహూర్తము మర్నాడే కావడముచేత మందారదేవుడు మందారవతిని స్వయముగా కన్యాదానము చేసినాడు. వివాహము మహావైభవముతో జరిగింది. తనకు పుత్రులు లేకపోవడము చేత మందారదేవుడు అల్లునికి తన అనంతరము హంసద్వీపరాజ్యము అరణముగా ఇచ్చినాడు. వివాహమహోత్సవమునాడు దేశమంతటా ఆవులపాలు పితకకుండా దూడలకు వదిలిపెట్టినారు. చెరసాలలో ఉన్న వారి నంతా వదలిపెట్టారు. అర్థిజనులకు సువర్ణము, వస్త్రములు వర్షము కురిపించారు. అనంతరము భార్యతో సహా మందారదేవుడు హంస ద్వీపానికీ, మహేంద్రాదిత్యుడు శశాంకపురానికీ, వింధ్యకేతువు మహా రణ్యానికీ ఆనందముతో బయలుదేరి వెళ్ళినారు.

కొన్నాళ్ళకు మహారాజు తనకుమారునికి రాజ్యభారము అప్పగించి తపోవనానికి వెళ్ళినాడు. సుందరసేనుడు, మందారవతితో సమస్త సుఖములు అనుభవిస్తూ బహుకాలము రాజ్యము చేసినాడు.

వ్యాఘ్రసేనుడు ఈప్రకారముగా సరోవరతీరాన మృగాంకదత్తునికి కథ చెప్పి, దేవా! ఆశ్రమములో కణ్వమహాముని ఈకథ మాకు వివరించి, వత్సలారా! ధైర్యము లేనివారు ఎందుకూకాకుండాపోతారు. ఎటువంటి కష్టాలనైనా ఎదుర్కొనేవారు కొన్నాళ్ళకు మేలు పొందుతారు. కాబట్టి మీరు దైన్యము విడిచిపెట్టి వెళ్ళండి. మంత్రులంతా మళ్ళీ సమకూడుతారు. మీప్రభువు మృగాంకదత్తునికి శశాంకవతి లభిస్తుంది. బహుకాల మాయన రాజ్యపాలన చేస్తాడు'' అని మాకు బోధ చేసినాడు. మేము ధైర్యము తెచ్చుకొని ఆరాత్రి ఆశ్రమంలోనే గడిపి, మర్నాడు బయలుదేరి క్రమేణా ఇక్కడకు వచ్చాము. ఆకలికి తట్టుకో లేక ఈ చెట్టెక్కి మేముకూడా ఫలములుగా మారిపోయినాము. నీతపస్సువల్ల ఇప్పుడు విముక్తి పొందినాము. నాగశాపమువల్ల మాకు సంభవించిన దంతా నీకు విన్నవించాము. ఆశాపము తీరిపోయింది. మాతోకూడా వెంటనే బయలుదేరు'' అన్నారు.

మృగాంకదత్తుడు వారిమాటలు విని కొంత ఉత్సాహముతో ఆ రాత్రి గడిపినాడు.

## తరంగము : ౧౦౨

ప్రాతఃకాలము మృగాంకదత్తుడు సరోవరతీరమునుంచి లేచి, వినాయక వృక్షానికి ప్రదక్షిణము చేసి, మంత్రులతోనూ శ్రుతధితోనూ ఉజ్జయినికి ప్రయాణ మయినాడు. క్రమేణా గంధవతీనదిలో స్నానము చేసి ఉజ్జయినివెలుపల ఉన్నమహాకాళశ్మశానము దాటి నగరము చేరినాడు. ఉజ్జయినికి నాలుగుపక్కలా బ్రహ్మాండ మైనప్రాకారమూ,

అన్ని వైపులా సైనికులూ కనిపించారు. మృగాంకదత్తునికి గుండెదడ పుట్టింది. ఇంతిదుర్భేద్య మైనపట్టణంలో అడుగు పెట్టలేమే, ఇక శశాంకవతిమాట వట్టిదే అన్నాడు. 'మనము పదిపన్నెండు మందిమి ఈనగరం పట్టుకుంటా మనేనా మీా రనుకొన్నది; ఇం కేదైనా ఉపాయ మాలోచింతాము' అన్నారు మంత్రులు. ఏమీా తోచక అందరూ నగరంవెలపలనే మకాం చేసినారు.

విక్రమకేసరి బేతాళుని ద్వారా శశాంకవతిని తెప్పించా లని సంక ల్పించి బేతాళుణ్ణి స్మరించినాడు. తాడిచెట్టుపొడుగు శరీరము, ఒంటె మెడ, ఏనుగుముఖము, గుడ్లగూబకళ్ళు, గాడిదచెవులు, దున్నపోతు పాదాలతో బేతాళుడు ప్రత్యక్షమై సంగతి తెలుసుకొని నగరములోనికి వెళ్ళడానికి ప్రయత్నించి ప్రవేశించలేక వెనకకు తిరిగి వెళ్ళిపోయినాడు. ఎ ప్రభావంవల్ల ఉజ్జయినిలో బేతాళాదులు కూడా ప్రవే శించ లేరు. మృగాంకదత్తుడు విచారములో ఉంటే శ్రుతధి ఇలా చెప్పి నాడు. 'దేవా, రాజనీతి తెలిసికూడా విచార మెందుకు? శత్రువుశక్తి తెలిసికూడా ఏపనీ చేయకూడదు కదా! ఈనగరద్వారాలు నాలుగింటిలో రెండువేలఏనుగులు, ఇరవై ఐదు వేలగుర్రాలు, పదివేలరథాలు, లక్ష మంది కాల్బలము – రాత్రింబగళ్ళు కావలి ఉంటారు. సామాన్యసైన్యం తీసుకు వెళ్ళినా ఏమీా ప్రయోజనం లేదు. గొప్పసైన్యం సమకూర్చు కోవాలి. ఆనాడు నీవు నర్మదానదిలో శబరనాయకుడు మాయావటు వును మొసలినోటినుంచి తప్పించినావు. జ్ఞాపక మున్నదా? అతనూ, అతనిస్నేహితుడు మాతంగరాజు దుర్గపిశాచుడూ, నీబాల్యసహాధ్యాయి కిరాతరాజు శక్తిరక్షితుడూ సేనలతో వచ్చి సహాయం చేస్తే నీకోరిక నెరవేరుతుంది. నీవు పంపేమాటకోసం కిరాతరాజు ఎదురుచూస్తూ ఉంటారు. మాయావటువు మాతంగరాజు దేశములో కనిపెట్టుకొని ఉంటాడు; అందరికీ ఆప్రకారముగా హెచ్చరిక చేసి వచ్చినావు కదా! ఇక

మనము వింధ్యపర్వతానికి దక్షిణాన ఉన్న మాతంగరాజుదుర్గానికి వెళ్ళుదాము. ఆకరభగ్రీవపురానికే శక్తిరక్షితుణ్ణి పిలిపించవచ్చు. అందరమూ కలిసి ప్రయత్నము చేతాము.

శ్రుతధి ఇలా చెప్పినమీదట అందరూ సంతోషించారు. మరునాడు మృగాంకదత్తుడు సూర్యోపాసన చేసి మిత్రులతో కరభగ్రీవానికి కదలినాడు. మార్గములో మహారణ్యములు దాటి వింధ్యపర్వతము ఎక్కి దక్షిణదిక్కుకు దిగి శబరపల్లెలు చూస్తూ ఆ మాతంగరాజు దుర్గమెక్కడో ఎలా తెలుస్తుంది అన్నాడు. అక్కడ మునికుమారుడు ఎదురు పడ్డాడు. మృగాంకదత్తుడు అతనికి నమస్కారము చేసి 'స్వామీ, మాతంగరాజు అయినదుర్గపిశాచుని చూడబోతున్నాము. ఆయిన నివాసము మీకు తెలునునా?' అన్నాడు.

'ఇక్కడికి ఒకకోసుదూరములో పంచవటిఉన్నది. దానికి కొంచెము అవతల అగస్త్యాశ్రమం. దానికి కొంతసమీపంలో వింధ్యపర్వతము నెత్తముమీద మలకలమార్గంలో కరభగ్రీవం అనేదుర్గము ఉన్నది. మహాబలవంతుడు దుర్గపిశాచుడు అందులో ఉన్నాడు. అతనికొలువులో లక్షలకొద్దీ విలుకాండ్రూ, బంటులూఉన్నారు. వాడు బిడారాలు కొల్లగొట్టుతూ ఎదురు తిరిగినవారిని సంహరిస్తూ తక్కినరాజులను ధిక్కరించి మహారణ్యము ఏలుతున్నాడు' అని మునికుమారుడు చెప్పినాడు.

అతడు చెప్పినమార్గాన వెళ్ళి వారంతా కరభగ్రీవ కోటమార్గము చేరినారు. అక్కడ మాయావటుని వేగులవాండ్రు మృగాంకదత్తుని ఆనవాలు పట్టి ప్రభువుకు తెలిపినారు. మాయావటుడు సైన్యముతో ఎదురు వచ్చి గుర్రము దిగి మృగాంకదత్తుని పాదములకు ప్రణామము చేసినాడు. మృగాంకుడు అతనిని లేవనెత్తి కౌగలించుకొన్నాడు. ఇద్దరూ గుర్రాలమీద వెళ్ళి దుర్గపిశాచునిదగ్గిరికి ప్రతీహారుణ్ణి పంపినారు. వాడు బయలుదేరి వచ్చి మృగాంకదత్తుని చూచి కొంతదూరాన నిలిచి జుట్టు

నేలకు అంటేటట్టు మొక్కి 'దేవా, నీవు ఈనాడు మాప్రదేశానికి రావడం చేత ధన్యుణ్ణి అయ్యాను. వింధ్యవాసినీదేవి ప్రసన్నురాలు అయింది' అని మంచిముత్యములు, కస్తూరి మొదలైనవస్తువులు కానుక పెట్టినాడు. మృగాంకుడు అతనిని ఉచితరీతిని అభినందించినాడు.

మృగాంకదత్తుడు మర్నాడు మంగళస్నాన భోజనాదు లైనతరవాత ముఖ్యు లందరినీ సమావేశ పరచినాడు. దుర్గపిశాచుడు, మాయా వటువు అదివరలో జరిగినసంగతు లన్నీ విని 'దేవా, మీరు ధైర్యంతో ఉండండి. మీకోసం మాప్రాణాలు ఒడ్డుతాము. ఉజ్జయినీప్రభువు కర్మ సేనమహారాజును బంధించి ఇక్కడికి తెమ్మన్నారా ? ఆయనకూతురు శశాంకవతీదేవిని ఇక్కడికి తీసుకొని రమ్మన్నారా!'' అన్నాడు. మృగాంకుడు వారి నభినందించి 'మిత్రులారా, మీకు సాధ్యం కాని దే మున్నది? మిత్రకార్యము మీరు తప్పకుండా నెరవేరుస్తా రని నా విశ్వాసము బాగా ఆలోచించి యుక్త మైనపని చెయ్యండి' అన్నాడు.

ఆరాత్రి గడిచింది. తెల్లవారగానే మృగాంకుడు గుణాకరమంత్రిని పిలిచి, కిరాతరాజు శక్తిరక్షితుణ్ణి తీసుకొని రమ్మని చెప్పినాడు.

కొద్దిరోజులలోనే కిరాతరాజు మహాసైన్యముతో అక్కడకు వచ్చి నాడు. పదిలక్షలమంది భటులు, రెండులక్షల గుర్రాలు, ఎనభైఎనిమిది వేల రథాలు, పదివేల ఏనుగులు, ఆసైన్యములో ఉన్నవి. మృగాంక దత్తుడు మిత్రులతో సహా ఎదురు వెళ్ళి అతనిని గౌరవించి తనశి బిరానికి తీసుకొని వచ్చినాడు. మాతంగపతి మాయావటువు. దూత లను పంపితే వారిమిత్రులు బంధువులు అందరూ వచ్చారు. దుర్గ పిశాచుడు, మాయావటువు అందరికీ ఉచితరీతిని అన్నిసదుపాయాలూ చేసినారు. ఆ నాయకు లందరితో సహా మృగాంకదత్తుడు భోజనానికి కూచున్నాడు. మాతంగపతిని తనకు ఎదురుగా కొద్దిదూరములో కూచుండబెట్టినాడు.

కొత్తగా వచ్చిన సేనలు అన్నీ విశ్రాంతి తీసుకొన్న తరవాత మర్నాడు మృగాంకదత్తుడు ఏనుగదంతపుపీఠముమీద కూర్చుని కొలువుతీర్చి నాయకుల నందరినీ చక్కగా సన్మానించి 'మిత్రులారా, కాలయాపన ఎందుకు! ఈ సేనలతో వెంటనే ఉజ్జయినిమీదికి దండయాత్ర చేతామా' అన్నాడు.

శ్రుతధి 'రాజకుమారా! ఉపాయములలో సామోపాయము మంచిది. కర్మసేనుడు మహాబలవంతుడు. జయించడం కొంత కష్టం. అదీ గాక కన్యను కోరినవాడు కన్యాబంధువులను సంహరించడం సముచితము కాదు. అందుచేత ముందు రాయబారము పంపుదాము. రాయబారము విఫల మాతుందా, యుద్ధం ఉండనే ఉన్నది'అని చెప్పినమీదట అందరూ ఈపద్ధతే మంచి దన్నారు.

సువిగ్రహు డనే బ్రాహ్మణుడు కిరాతరాజుకు బాగా పరిచితుడు. రాయబారం నడపడంలో చాలా నేర్పరి. అతని చేతికి లేఖ ఇచ్చి కర్మసేనమహారాజుకు చెప్పవలసిం దని కొన్నిమాటలు కూడా చెప్పినాడు. సువిగ్రహుడు బయలుదేరి ఉజ్జయిని చేరి ప్రతీహారుని పంపి అంగీకారము వచ్చినమీదట నిండుకొలువులో రాజదర్శనము చేసినాడు. కర్మసేనుడు అతనిని ఆదరించి పీఠమిచ్చి కుశలప్రశ్న లడిగిన మీదట ఉత్తరము రాయబారి ప్రభువుకు సమర్పించినాడు. ప్రజ్ఞాకోశు డనే మంత్రి లేఖ తీసుకొని ముద్ర విప్పి స్ఫుటముగా చదివినాడు: 'స్వస్తిశ్రీ కరభగ్రీవ కోట్టమూలారణ్యమునుంచి అయోధ్యాపురీనాథుడు శ్రీమదమరదత్త మహీమండల మండన మహారాజాధిరాజపుత్రుడు శ్రీమాన్ మృగాంకదత్తుడు ఉజ్జయినీ ప్రభువు కర్మసేన మహారాజుకు సాదరముగా పంపిన సందేశము. మీకు కన్యారత్నమున్నది. కన్యను ఎవరికో ఒకరికి ఈయవలసినదే గదా! కాబట్టి మీశశాంకవతీదేవిని నాకివ్వండి. ఆమె నాకు తగినది. ఆదేవి నాకు భార్య అవుతుందని దేవతలు ఇదివరలోనే అనుగ్రహించినారు. ఇప్పుడు మనకు బాంధవ్యము కలుస్తుంది.

వెనకటి వైరం తొలిగిపోతుంది. మీరు అంగీకరించని పక్షములో నాబాహువులనే వేడుకొంటాను.

ఈవిధముగా ప్రజ్ఞాకోశుడు లేఖ వినిపించేసరికి కోపము వచ్చి కర్మసేనుడు మంత్రులను చూచి 'వీరు మనకు శత్రువులే. ఈసందేశము తిరస్కార సూచకముగా ఉన్నది. మొదట తనపేరు వ్రాసుకొని తరవాత మాపేరు వ్రాసినాడు. గర్వివలె ఉన్నాడు. ఇతడు తన బాహుబలమును ప్రస్తావించుకొంటున్నాడు. ఇటువంటివానికి ప్రత్యుత్తరము పంపకూడదు. కన్యను అసలే ఈయకూడదు' అని దూతను చూచి 'రాయబారీ, వెళ్ళు. నీప్రభువు తన ఇష్టప్రకారము చెయ్యవచ్చును' అన్నాడు.

సువిగ్రహుడు చురుకైనవాడు. 'రాజా, మృగాంకదత్తునిసంగతి తెలియక ఇలా మాటాడినావు. ఆయన ఇక్కడికి వచ్చినప్పుడు తారతమ్యం నీకే తెలుస్తుంది. సిద్ధముగా ఉండు' అనేసరికి రాజసభలో కల్లోలము బయలుదేరింది. 'రాయబారి అవధ్యుడు, వెళ్లు' అని కోపముతో రాజుపలికినాడు. 'కొందరు ఇప్పుడేవెళ్ళి అతనిపని పట్టుదామా!' అన్నారు. 'ఈ క్షుద్రరాయబారి వదరుబోతు. ఇతని మాటలకు కోపమెందులకు? మృగాంకదత్తుడు ఏమిచేస్తాడో చూతాము' అని కొందరన్నారు. కొందరి ముఖాలు ఎర్రబడ్డవి. సువిగ్రహుడు లేచి మృగాంకదత్తుని సన్నిధికి వెళ్లి జరిగిన వృత్తాంతము విన్నవించినాడు. మృగాంకుడు దండయాత్రకు అనతియిచ్చినాడు.

## త ర ం గ ము : ౧౦౩

## శ శాం క వ తీ హ ర ణ ము

మృగాంకదత్తుడు సేనాసమూహంతో వింధ్యపర్వతము దాటి, ఉజ్జయినీ రాష్ట్రము సరిహద్దు చేరినాడు. ఈవార్త తెలిసి కర్మసేనుడు నిజసైన్య

ముతో ఉజ్జయినివిడిచి మృగాంకునిసేనతో తలపడినాడు. నాలుగుదినములు భీకరయుద్ధము జరిగింది.

ఐదో రోజు సాయంకాలం మృగాంకుడు ఏకాంతంలో మంత్రులతో ఆలోచిస్తూన్న సమయాన శ్రుతధి వచ్చి ఇలా తెలిపినాడు: "మీరంతా యుద్ధముసందడిలో ఉన్నారు. నేను సన్యాసి వేషంతో భద్రంగా వెళ్ళి కొంత అజాగ్రత్తగా ఉన్న ద్వారమార్గాన ఉజ్జయినీ నగరములో ప్రవేశించి కనిపెట్టి వచ్చిన విశేషాలు మనవి చేస్తాను. కర్మసేన మహారాజు యుద్ధానికి బయలుదేరి రాగానే శశాంకవతీదేవి తల్లిదగ్గర సెలవు తీసుకుని అంతఃపురము విడిచి నగరములో ఉన్న గౌరీ దేవాలయానికి వెళ్లి తండ్రికి జయము కలగవలెనని అమ్మవారిని ఆరాధిస్తూ ఉన్నది. ఆమె చెలికత్తె చతురిక చాలా తెలివి కలది. నీవు యుద్ధములో గెలిస్తే తనను తండ్రి తప్పకుండా నీకిచ్చి పెళ్ళి చేస్తాడని శశాంకవతికి భయం. జయించినవాడు సుందరుడా కాడా అని ఓడిన రాజు చూడక కూతురు నిచ్చివేస్తాడు. అందుచేత నీవు సుందరాకారుడవో కావో ఉపాయముగా చూచి రమ్మని శశాంకవతి చతురికను పంపించింది. ఆ చెలికత్తె నీకు తెలియకుండా నిన్ను చూచి వెళ్ళి రాజకుమారితో రకరకాలుగా వర్ణించింది. ఆమీద శశాంకవతి అనురాగము తలకెక్కడముచేత తనతండ్రికీ నీకూ శుభము కలగవలెనని అమ్మవారిని ప్రార్థిస్తున్నది. ఆవిడ విరహబాధ చెప్ప తరముకాదు. మనము ఉపాయంగా అక్కడికి వెళ్ళగలిగితే ఆమె వెంటనే నీవెంట వస్తుంది. ఆ దేవాలయంలో కావలివారెవరూ లేరు. ఆమెను అపహరించి నీవు మాయావటుని నివాసానికి వెళ్లు. నేను ఈరాజు లందరికోపము తీర్చి యుద్ధము ఆపి అక్కడికి వస్తాను. నీ మామగారికీ నీకూ అపాయము ఉండదు. ప్రాణాలకు తెగించి యుద్ధం చెయ్యడం గతి లేనప్పుడు కదా ఇప్పుడు మనం చతురోపాయం ఉపయోగింతాం."

అందరూ అంగీకరించారు. మృగాంకదత్తుడు కొంతమంది మిత్రులతో రహస్యముగా రాత్రివేళ బయలుదేరి నిద్రమత్తులో ఉన్న కావలివారిని తప్పించుకొని శ్రుతధి చెప్పిన గుర్తులను బట్టి పుష్పకరండోద్యానములో ప్రవేశించి గౌరీదేవాలయము కనిపెట్టి అప్పుడే చంద్రోదయం కావడం చేత వెన్నెలలో కనపడుతున్న గౌరీఆశ్రమంలోకి వెళ్ళినాడు. శశాంక వతి చెలికత్తెలు నిద్రపోతున్నారు. ఆమెమాత్రం మేలుకొని మృగాంక దత్తుని గురించి మనస్సులో బహువిధాల భావనచేస్తూ లేచింది. నిరాశ కలిగింది కాబోలు – ఆత్మహత్యకు ప్రయత్నం చేసింది. మంత్రి విమల బుద్ధి ముందు నడవడంచేత ఆసంగతి కనిపెట్టి మృగాంకునితో "దేవా! ఎవరో కన్య ఉరిపోసుకోబోతున్నది' అన్నాడు. రాజకుమారుడు ఆమెను నివారించబోయేలోగా శశాంకవతి గౌరీదేవికి నమస్కరించి "భగవతీ, ఈజన్మలో మృగాంకదత్తదేవుడు భర్త కాకపోతే పైజన్మలో నైనా నాకు పతి అయ్యేటట్టు అనుగ్రహించు" అని కంఠానికి ఉరి తగిలించుకున్నది. ఇంతలో చెలికత్తెలు అదృష్టవశాత్తు అక్కడికి వచ్చి ఉరి తొలగించారు.

మృగాంకుడు ఒక్కడుగులో ఆమెను సమీపించి "భద్రురాలా! రాజకుమారీ! నీకు నామీద అనురాగమూ విశ్వాసమూ ఉంటే నా వెంట రమ్మని ప్రార్థన. ఉభయరాజవంశములకూ వైరముపోయి బాంధవ్యము ఏర్పడుతుంది. పెద్దల ఆశీర్వచనంతో మనజన్మ కృతార్థమవుతుంది" అని చల్లనిమాటలు చెప్పాడు.

శశాంకవతి అంగీకరించినవెంటనే ఆమెను చెలికత్తెలతో మృగాంకుడు బయలుదేర దీసినాడు. నగరరక్షకులు రాజకుమారిని చూచి ఆటంక పరచడానికి జంకినారు. వా రందరూ గుర్రా లెక్కి మాయావటుని నివాసము చేరినారు.

రాజకుమారిని ఎవరో అపహరించుకొని పోయినా రనే వార్త పట్టపు

దేవికి తెలిసింది. ఆమె యుద్ధభూమిలో ఉన్న మహారాజుకు విన్నవించమని నగరాధ్యక్షుని పంపింది. ఈలోగా గూఢచారులనాయకుడు మహారాజు దర్శనము చేసి "దేవా! చీకటి పడగానే మృగాంకదత్తుడు అనుచరులతో ఉజ్జయినిలో ప్రవేశించినాడట. గౌరీమందిరములో ఉన్న రాజకుమారిని అపహరించటమే ఆయన ఉద్దేశమట. ఈసంగతి తెలియగా తమకు విన్నవించడానికి వచ్చాను." అని పలికినాడు.

కర్మసేనమహారాజు సేనానాయకుని పిలిపించి "నీవు అయిదువందల మంది అశ్వికులతో రహస్యముగా తక్షణమే ఉజ్జయినికి వెళ్ళి, ఆ దుర్మార్గుని బంధించు, వీలు తప్పితే ఖండించు. నేనుకూడా సైన్యముతో త్వరలోనే వస్తాను." అన్నాడు.

సేనానాయకుడు ఆప్రకారముగానే బయలుదేరి కొంతదూరము వెళ్ళేసరికి మార్గమధ్యములో నగరాధ్యక్షు డెదురుపడి ఎవరో సాహసికులు రాజకుమారిని అపహరించి ఏమార్గాన వెళ్ళినారో తెలియదు" అని చెప్పినాడు. సేనానాయకుడు ప్రభువువద్దకు తిరిగివచ్చి ఈసంగతి నివేదించినాడు. కర్మసేనమహారాజు ఆలోచించి మృగాంకదత్తుని పట్టుకోవడం వట్టిదని భావించి అంతటితో విరమించినాడు.

మృగాంకదత్తుని శిబిరములో మాయావటువు మొదలైన ప్రభువులు రాత్రి జాగ్రత్తమీదనే ఉన్నారు. ప్రాతఃకాలము కర్మసేనుడు మృగాంకదత్తుని మిత్రులవద్దకు రాయబారిని పంపినాడు. "మృగాంకదత్తుడు చాతుర్యముతో మా శశాంకవతిని అపహరించుకొని పోయినాడు. ఐనదేమో అయినది. అతడు నాకు అల్లుడు కాతగ్గవాడు. ఇక అతడు మీఅందరితో సహా మామందిరానికి రావలెను. నాకుమార్తెనతని కిచ్చి యథావిధిగా వివాహము చేస్తాను." అని దూత చెప్పినాడు. రాజు లందరూ శ్రుతధితో సంప్రతించి రాయబారము విశ్వసించి దూతతో "ఆర్యా, ఆపక్షములో మీమహారాజు నిజనివాసానికి వెళ్ళ

వలెను. మేము వెళ్ళి మృగాంకదత్త ప్రభువును తీసుకుని వస్తాము" అని దూతకు ప్రత్యుత్తర మిచ్చినారు. కర్మసేనుడు ఉజ్జయినీ నగరములోకి వెళ్ళినాడు. మాయావటువు మొదలైనవారు మృగాంకదత్తుని పిలుచుకొని రావడానికి వెళ్ళినారు.

ఈలోపుగా మృగాంకుడు శశాంకవతితో మాయావటుని కాంచనపురము చేరినాడు. అక్కడ వారికి సమస్త ఉపచారములు జరిగినవి. మర్నాడు కర్మసేనుని సందేశం అతనికి చేరింది. అప్పుడు అందరూ సమావేశమై వివాహార్థము ఉజ్జయినికి వెళ్ళడము ఉచితమా, గాదా, అని ఆలోచించినారు. మంచివాడు కాదు. విశ్వసించడానికి వీలులేదు. అక్కడికి వెళ్ళడం ఎందుకు? శశాంకవతి ఇక్కడే ఉన్నది కదా – అన్నారు అందరూ – ఒక్క శ్రుతధి తప్ప. 'బ్రాహ్మణోత్తమా, నీవేమీ మాటాడవు. ఈపద్ధతి ఇష్టం లేదా నీకు?" అని అడిగినాడు మృగాంకుడు. 'కర్మసేనుడు కపటముతో సందేశము పంపినట్లు కనపడదు. నిజముగా అతనిమనస్సులో కపటమే ఉంటే తన పుత్రికను అపహరించినవానితో యుద్ధము మానుకొని ఎందుకు ఇంటికి వెళ్ళిపోతాడు? నీవు బలసమేతముగా అక్కడికి వెడితే ఆయన నీకు ఏమి అపకారము చేయగలడు? నీవు ఉజ్జయిని వెడితే నీమీద ఆయనకు ప్రీతి కలుగుతుంది. పుత్రికమీద వుండే ప్రీతివల్ల ఆయన నీకు ముందు ముందు సహాయంకూడా చేస్తాడు, వెళ్ళడమే ఉచితము' అన్నాడు శ్రుతధి. అందరూ బాగున్న దన్నారు.

'సరే, కాని మానాయనగారూ అమ్మగారూ లేకుండా నేను వివాహము ఎలా చేసుకుంటాను? వారి అభిప్రాయము తెలుసుకున్నతరువాత తగినట్లు ప్రవర్తిస్తాను. వారిని తీసుకురావడానికి ఎవరేనా అయోధ్యకు వెళ్ళాలి' అని మృగాంకుడు మిత్రులతో ఆలోచించి భీమపరాక్రముని అయోధ్యకు పంపినాడు.

అయోధ్యలో అమరదత్తమహారాజుకు లోకులవల్ల కుమారుని నిజవిషయం తెలిసింది. మంత్రి వినీతమతి వంచనచేసినట్టు రాజు గ్రహించి అతనిని సకుటుంబముగా దేశములోనుంచి వెళ్ళగొట్టి రాజనగరు విచారమువల్ల విడిచిపెట్టి నందిగ్రామ మనే ప్రదేశములో భార్యతోకూడా తపస్సు చెయ్యడం ప్రారంభించాడు. భీమపరాక్రముని రాక చారులు రాజుకు తెలిపినారు. అనంతరం అతడు రాజదర్శనము చేసి 'దేవా, మృగాంకదత్తకుమారుడు బాహుబలంవల్ల కర్మసేనప్రభువు కుమార్తె శశాంకవతీదేవిని సాధించినాడు. తమరూ, అమ్మగారూ సమక్షములో లేనిది, యువరాజుగారు పెళ్ళి ఆడనంటున్నారు. ఈవిషయం తమకు విన్నవించవలసిందని చెప్పినారు. ప్రస్తుతం ఆయన మాయావటు డనే శబరనాయకుని కాంచనపురములో విడిది చేసి ఉన్నారు. తమకోసం ఎదురుచూస్తున్నారు. అని విన్నవించి, మృగాంకదత్తుడు అయోధ్యలో బయలుదేరింది మొదలు నాటివరకూ జరిగిన సంఘటన లన్నీ వివరించినాడు. అమరదత్తమహారాజు సంతోషించినాడు.

ఆయన రాణితోకూడా ఏనుగెక్కి పరివారసమేతముగా బయలుదేరి కాంచనపురం సమీపించేటప్పటికి మృగాంకదత్తుడు మిత్రులతో ఎదురువచ్చి తండ్రికి ప్రణామము చేసినాడు. చిరకాలానికి కుమారుని చూచి తల్లిదండ్రులు చాలా ఆనందించినారు.

అమరదత్తుడు ఆతరవాత తనరాణితో సహా మాయావటుని నగరు ప్రవేశించి శశాంకవతిని చూచి కానుక లందుకొని శిబిరానికి వచ్చి కుమారునితోను మిగిలిన రాజులతోను కలిసి విందారగించి గీత వాద్య నృత్యాది వినోదాలతో ఆరోజు గడిపినాడు. కర్మసేనమహారాజు బాగా ఆలోచించి మళ్ళీ ఇంకో రాయబారిని పంపించి 'మృగాంకదత్తా, నీవు ఉజ్జయినికి రాలేవు. నాకుమారుడు సుషేణుని నీవద్దకు పంపుతాను, చెల్లెలు శశాంకవతిని నీకు సక్రమంగా కన్యాదానం చేస్తాడు. మా విష

యంలో నీకు ప్రీతి ఉన్నట్లైతే తొందరపడి విధి విహీనముగా వివాహ మాడవద్దు' అని సందేశము పంపినాడు. దానికి బదులుగా అమర దత్తుడు 'రాయబారీ, కర్మసేనుడు కాక మరి ఎవరు ఇంత మంచి సందేశము పంపించగలరు? ఆయనకు మామీద చాలాప్రీతి. మంచిది. సుషేణకుమారుని ఇక్కడికి పంపవచ్చును. ఆయన కోరిక ప్రకారము యథావిధిగా వివాహము జరుగుతుంది' అని దూతను సత్కరించి పంపి కొడుకును, శ్రుతధిని చూచి 'మన మిప్పుడే అయోధ్యకు వెడదాము. అక్కడ వివాహమహోత్సవము బాగా జరపవచ్చును. మాయావటు మహీపతి ఇక్కడే ఉండి సుషేణుని ఎదుర్కొని అయోధ్యకు తీసుకొని రావచ్చును. మనము ముందుగా వెళ్ళి వివాహసన్నాహము చేతాము' అన్నాడు. అందరూ అంగీకరించినారు.

మాయావటువును అక్కడ నిలిపి మరునాడు తండ్రీకొడుకులు, శశాంకవతి ప్రభృతులతో, తక్కిన రాజులతో బయలుదేరి శక్తిరక్షితుని ఇంట్లో సపర్యలు గ్రహించి, కానుకలు స్వీకరించి, ఒకరోజు అక్కడ విశ్రమించి మరునాడు బయలుదేరి క్రమేణా అయోధ్యానగరముచేరినారు.

కార్తాంతికులను పిలిపించి లగ్నము పెట్టించి మహారాజు అన్నిసంభారాలూ సమకూర్చవలసిందని ఆజ్ఞ ఇచ్చినాడు. అనంతరము మాయావటుని వద్దనుంచి దూతవచ్చి రాజదర్శనము చేసి 'దేవా, సుషేణ కుమారుడు వచ్చినాడు. ఆయనా, మాయావటువూ అయోధ్య సరిహద్దులో ఆగినారు' అని విన్నపము చేసినాడు. అమరదత్తుడు సేనానాయకుని ఎదురు పంపినాడు. మృగాంకదత్తుడు మిత్రప్రీతివల్ల స్వయముగానే ఎదురు వెళ్ళినాడు. కొంతసేపటికి అందరూ కలిసి అమరదత్తుని సన్నిధికి వచ్చినారు. సుషేణుడు తల్లెలిని చూచి అభినందించినాడు.

రెండు వేల బారువుల బంగారము, రత్నాభరణములు ఒక బారువ, ముత్యాలూట్టిపిట్టలమోత. ధనము, కొంతసువర్ణము రాజసన్నిధానానికి

తెప్పించి సుషేణుడు 'ప్రభూ, ఇది అంతా నా చెల్లెలి సొంతధనము. వివాహవేదికమీద కట్నము చదివించడానికి మా నాయనగారు పంపిన ధనము వేరే ఉన్నది' అని వివరించినాడు. ఆరోజు విందుతో పానగోష్ఠితో సుఖముగా గడిచింది.

మర్నాడు వివాహలగ్నము. మృగాంకుడు మంగళస్నానాదులు చేసినాడు. శశాంకవతిని ముత్తైదువులు అలంకరించినారు. అలంకార గృహములోనుంచి వచ్చి వధూవరులు వివాహవేదికమీద కూర్చున్నారు. యథావిధిగా పరిణయం జరిగింది. ఐదువేల గుర్రాలు, నూరు ఏనుగులు, రెండువందల బారువుల బంగారము, తొంభై ఏనుగులమీద ముత్యాల రత్నాల ఆభరణాలు, మేలివస్త్రాలు, తెప్పించి సుషేణుడు వివాహ సమయములో ఇచ్చినాడు.

ఆరోజు విందులతో, పానగోష్ఠులతో వినోదాలతో గడిచిపోయింది. వచ్చినవారికి అందరకీ ఉచితరీతిని సత్కారాలు జరిగినవి.

అమరదత్తమహారాజు మృగాంకదత్తుని బావమరది సుషేణునికి పట్టము కట్టి ఉచితమైనరాష్ట్ర మిచ్చినాడు. శబర కిరాత రాజులకు, మాతంగమహీపతికి, మృగాంకదత్తునిమంత్రులకు, శ్రుతధికి సముచిత సత్కారములు జరిగినవి. అందరూ తమతమనివాసాలకు వెడలిపోయినారు.

కొన్నాళ్ళకు అమరదత్తమహారాజు మంచిరోజున కుమారునకు పట్టము కట్టి భార్యతోసహా కాశికి వెళ్ళినాడు. అక్కడ త్రిసంధ్యలలో గంగాస్నానము చేస్తూ శివార్చన చేస్తూ కందమూలఫలాలు తింటూ మునివృత్తిలో ఉన్నాడు.

మృగాంకదత్తుడు బహుకాలము జనరంజకంగా రాజ్యముచేస్తూ సమస్తభోగము లు అనుభవించినాడు.

ఈవిధముగా పిశంగటమహాముని నరవాహనదత్తునికి కథ చెప్పి

'వత్సా, మృగాంకదత్తుడు కష్టాలకు ఓర్చి చివరకు శశాంకవతిని పొంది నట్టు నీవుకూడా మదనమంచుకను పొందగలవు' అని చల్లనిమాటలు చెప్పినాడు. నరవాహనదత్తుకు ధైర్యము తెచ్చుకొని మహామునివద్ద సెలవు తీసుకొని లలితలోచనను మలయసానువులమీద వెతకడానికి బయలుదేరినాడు.

## మ ది రా వ తీ లం బ క ము

### త రం గ ము : ౧౦౪

స వో విఘ్నేశ్వరః పాయా
న్నమితోన్నమితేవ యమ్
అనునృత్యతి నృత్యాన్తం
సంధ్యాను భువనావలీ!

గౌరీప్రసాధనాలగ్న
చరణాలక్తక శ్రియః
సఖీ సుఖాయ భూయాద్వః
శమ్భోర్భాలేక్షణప్రభా.

కవీన్ద్రమానసామ్భోజ
నివాసభ్రమరీం నుమః
దేవీం సహృదయానన్ద
శబ్దమూర్తిం సరస్వతీమ్.

సందెవేళల నృత్యంబు సలుపు నెవడు
నమిత మున్నమితమ్మునై నర్తనమ్ము
తోడుగా జేయుచున్నట్లు తోచు భువన
పాళి, యావిఘ్నరాజు మి మ్మేలు గాక!

గౌరీప్రసాధన కాలమ్మునందు
లగ్న మౌ పాదాల లత్తుక సిరికి
నచ్చెలి యౌ శంభు నిటలేక్షణంపు —
ప్రభ యొసంగును గాక శుభములు మీకు!
కవిరాజ మానసకమల నివాస
చంచరీకమునకు, సహృదయానంద
శబ్దమూర్తికి, సరస్వతికి వందనము!

నరవాహనదత్తుడు మదనమంచుకా విరహమువల్ల విచారగ్రస్తుడై మలయాచల ప్రాంతములో గుట్టలలోనూ, అరణ్యాలలోనూ తిరుగుతూ దేవతల సౌమనస్యమువల్ల గంగానదీమార్గాన కొలనుదగ్గిరికి చేరినాడు. అక్కడ వృక్షముకింద ఇద్దరు విప్రకుమారులు ఏకాంతముగా కూర్చుండి కథ చెప్పుకొంటున్నారు. వాళ్లు అతన్ని చూచి మన్మథు డని భ్రమ పడి 'భగవన్' కుసుమాయుధా, నమస్కారము! పుష్పధనుస్సు విడిచి సహచరి రతీదేవిలేకుండా ఒంటరిగా సంచరిస్తున్నావేమి? అన్నారు. 'నేను మన్మథుడను కాను, మానవుడను. నారతీదేవిమాత్రము పోయింది' అన్నాడు నరవాహనుడు.- అని తనసంగతి చెప్పి వారికథ ఏమిటి అని అడిగినాడు.

అందులో ఒకడు వినయముతో 'ప్రభూ, మీవంటి రాజుల సమక్షములో రహస్యము చెప్పడం ఎలాగు? అయినా ఆజ్ఞ అయింది కాబట్టి మనవి చేస్తాను :

## మ ది రా వ తి క థ

కళింగదేశములో శోభావతీనగరములో యశస్కరుడు మానాయన. ఆయన విద్వాంసుడు, చాలా యజ్ఞములు చేసినవాడు. నాజనని మేఖల మహాసాధ్వి — వారి మధ్యవయస్సులో నేను జన్మించాను. ఉపనయన

మయినతర్వాత నేను వేదాధ్యయనము ప్రారంభించాను. ఇంతలో చాలా గొప్పకరువు వచ్చింది. అమ్మ, నాయన, నేనూ వస్తువాహనాలతో ఉజ్జయినికి వెళ్ళినాము. మానాయన స్నేహితుడు ఒకానొకవర్తకుడు మాకు నివాసము చూపినాడు.

నేను ఒకానొక గురువువద్ద విద్యాభ్యాసము ప్రారంభించాను. కొంత మంది సహాధ్యాయులు ఉన్నారు. వారిలో విజయసేనుడు క్షత్రియ పుత్రుడు. చాలాధనవంతుడు, యోగ్యుడూ. ఒకనాడు అతనితో కూడా అతనిచెల్లెలు మదిరావతి గురువుగారి యింటికి వచ్చింది. ఆమె నామ ధేయాదులు మిత్రునివల్ల తెలుసుకొని ఆమెను వలచినాను. మదిరావతి కూడా నామీద అనురాగము కలిగినట్లు గ్రహించాను. ఆమె వెళ్ళుతూ నామీద అనురాగ వీక్షణము విసిరి ఇంటికి వెళ్ళింది. నేను ఇంటికి వెళ్ళిపోయి నేలమీద దొర్లుతూ ఏమీ తోచక అవస్థపడుతూ ఆమెను ధ్యానిస్తూ ఆపగలూ రాత్రిగడిపి, మర్నాడు గురువుగారి యింటికి వెళ్ళినాను.

విజయసేనుడు ఉత్సాహముతో నన్ను చూచి 'మిత్రమా, మామది రావతివల్ల నీసంగతి విని మాఅమ్మగారు నిన్ను చూడాలని అన్నది. నామీద నీకు అనురాగము ఉంటే మాయింటికిరా. నీపాదపద్మాల స్పర్శ వల్ల మాగృహము పవిత్రము చెయ్యి' అని వేడినాడు. చాలాఆనందించి నేను అతనియింటికి వెళ్ళినాను. అతనితల్లి నన్ను ఆదరించింది. నాప్రియు రాలి దర్శనముకూడా అయింది. ఇంతలో తండ్రివద్దనుంచి వార్త వచ్చే సరికి విజయసేనుడు వెళ్ళిపోయినాడు. అప్పుడు మదిరావతిదాది నావద్దకు వచ్చి నమస్కారము చేసి 'ఆర్యా, మాఅమ్మాయిగారు ఉద్యానములో మాలతిలతను పెంచింది. దానిమొగ్గలు ఈ ఒంటిపేట మాలికగా గుచ్చి మీకు బహుమానముగా పంపింది. నూతనవస్తువును మొదట ప్రియకా మునికి గదా ఇవ్వవలసింది!' అన్నది; అని పంచఫలకద్వారములతో తాంబూలములో పెట్టి ఇచ్చింది. నాప్రియురాలి చేతులతో సిద్ధమైనపువ్వు మాలిక మెడలో వేసుకొని ఆమెను ఆలింగనము చేసినట్టే ఆనందించాను. తాంబూలము వేసుకొని దాదితో 'కల్యాణీ, ఏమిచెప్పను! నీసఖికోసము

నేను ప్రాణాలు వదలగలిగితే నాజన్మ సార్థకము!' అని దానిని పంపివేసి అప్పుడే మరలివచ్చిన విజయసేనునితో గురువుగారి యింటికి వెళ్ళినాను.

విజయసేనుడు మర్నాడు మదిరావతిని మాయింటికి తీసుకు వచ్చినాడు. నాతల్లిదండ్రులు వారు వచ్చినందుకు ఎంతో సంతోషించారు. ఇలా తరుచుగా మేము కలుస్తూ ఉండడముచేత మా అనురాగము వృద్ధి పొందింది. ఒకనాడు మదిరావతి దాసి నాదగ్గిరికి వచ్చి రహస్యంగా 'మహాశయా, గురువుగారియింట్లో మిమ్మల్ని చూడగానే మా మదిరావతికి మీామీాద అనురాగము కలిగింది. ఇప్పుడామె విరహావస్థలో ఉన్నది. భోజనము సరిగా చెయ్యదు. అలంకారము చేసుకోదు. సంగీతము పాడదు. లీలాశుకముతోనైనా క్రీడించదు. ఆరోజుకు ఆరోజు క్షీణిస్తుంది. మీాప్రస్తావన చేస్తుంటే కాస్త తేటగా ఉంటుంది. నేను ఆమెను స్వయంగా అడిగాను. మీామీాద ప్రేమ అని ఆమె స్పష్టంగా చెప్పింది. కాబట్టి మీారు ఆమెకోరిక నెరవేరేమార్గము చూడాలి' అని బోధ చేసింది. నేను సంతోషించి "ఈపని నీచేతులో ఉన్నది. నేను మీాకు స్వాధీనుణ్ణి' అని ఆ సందర్భమువల్ల ఆశపొంది ఇంటికి వెళ్ళినాను.

ఆమర్నాడు ఉజ్జయినినుంచి వచ్చిన గొప్ప క్షత్రియకుమారుడు మదిరావతిని తన కిచ్చి వివాహము చెయ్యమని కోరితే ఆమెతండ్రి అంగీకరించినట్లు నాప్రియురాలి చెలికత్తెవల్ల తెలిసింది. నేను మూర్ఛపోయి క్రమేణ తెప్పిరిల్లి విచారపడి లాభము లేదనీ, చివరకు ఏమవుతుందో చూతా మనీ ధైర్యము తెచ్చుకొన్నాను. ఆమె చెలికత్తెలు తరచుగా వచ్చి చెప్పే మాటలవల్ల ప్రాణాలు నిలుపుకొంటున్నాను. ఇంతలోకే వివాహలగ్నము నిశ్చయ మయింది. ముహూర్తసమయము కూడా సమీాపించింది. మదిరావతికి మంగళస్నానము చేయించారు, మేళాలు వినిపించినవి. ఆమె పూర్వమువలె ఇవతలకు వచ్చేందుకు వీలు లేదు. ఆశ విడిచి నేను ఆత్మహత్యాప్రయత్నముమీాద బయలుదేరి నగరమువెలుపలి ఆలయమువద్ద మర్రిచెట్టుకు ఉరిపోసి గొంతుకు తగిలించుకొని కిందికి దూకాను. తెలివి వచ్చి చూచేసరికి ఆతాడు తెగి

పోయింది. నేను ఒకానొకయువకునిఒడిలో ఉన్నాను. అతడే నన్ను రక్షించినాడని భావించి 'మహానుభావా, నీవు నన్ను రక్షించినావు. కాని ప్రియావియోగబాధలో ఉన్న నాకు మరణమే ఇష్టము' అని నేను పలికేసరికి అతడు నాసంగతి అడిగినాడు. మదిరావతికథ చెప్పినాను. అతడు నాతో 'మహాశయా, ప్రాజ్ఞుడవు. ఎందుకు అజ్ఞానములో పడిపోతావు? సమస్తమూ ఆత్మకోసమేకదా! అటువంటిఆత్మను త్యజించడానికి యత్నించావే, ఏమిలాభము? నాసంగతి విను' అని ఇలా చెప్పినాడు:

## విప్రకుమారుని వృత్తాంతము

హిమవంతమువద్ద నిషధప్రదేశము నానివాసము. మానాయన శ్రుతశీలసంపన్నుడయినవిప్రుడు. నేను ఇంటివద్ద బయలుదేరి దేశాటనము చేస్తూ గురువులను దర్శిస్తూ ఇక్కడికి సమీపములో ఉన్న శంఖపురము వెళ్ళినాను. నగరసమీపములో శంఖహ్రదమనే నాగరాజసరోవరము ఉన్నది. నగరములో నేను గురుకులవాసము చేస్తూ ఒకనాడు యాత్రోత్సవముజరుగుతుంటే శంఖహ్రదము చూడబోయినాను. ఆసరస్సుకు దక్షిణదిక్కు ఉద్యానములో మాధవీలతా మంటపములో ఎవరో కన్యకామణి పూలు కోస్తున్నది. ఒకరి నొకరము చూచుకొన్నాము. నాకు వెంటనే వలపు కలిగింది. ఆమెకూడా మధ్యమధ్య నన్నుచూస్తూ పువ్వులు కొయ్యడము మానింది. నామీద ఆమె ప్రయోగించిన కటాక్షవీక్షణాలనుబట్టి ఆమెకుకూడా వలపు కలిగిందని తెలిసింది. ఇంతలో హాహాకారాలు చేస్తూ జనము తోసుకుంటూ వచ్చారు. అడవియేనుగు వాసన తగలడముచేత మదపుటేనుగు చెలరేగి గొలుసు తెంపుకొని మావటివానిని పడదోసి చెవికి తగిలించి ఉన్న అంకుశము కిందికి వాల్చి పరుగెత్తుకు వస్తున్నది. భయపడిన నాప్రియురాలిని ఎత్తుకొని జనసమూహములోకి తీసుకు వెళ్ళాను. ఇంతలోకే ఆమె పరివారజనము అక్కడికి వచ్చారు. ఏనుగు నూవైపే వస్తూ ఉంటే ఆమెను పరివారము ఒక ఎక్కకు త్వరత్వరగా తీసుకువెళ్ళిపోయినారు. నేను మరోవైపు వెళ్ళినాను.

ఏనుగుసందడి తగ్గిపోయిన తర్వాత ఆమెకోసము అన్నివక్కలా చూచాను. ఆమె కనబడలేదు. శూన్యహృదయముతో గురువుగారి యింటికివెళ్ళాను. ఆరోజునేనుపడిన బాధ వర్ణనాతీతము. రాత్రివేళ చాలా అవస్థపడుతున్న నన్నుచూచి మిత్రుడు 'ఏమి సఖా, ఇలాఉన్నావు! చూస్తే నీకు ఒంట్లో జబ్బులేదు. అర్థకామాలకోసముకలిగిన మనోవ్యథ అయితే ఇలావిను. లోభముచేత అన్యవంచనచేసి అపహరించిన ధనము నిలవదు. ఇక వ్యర్థమైన కామము ప్రాణాలనుతీస్తుంది. దానికి అధర్మము తోడయితే నరకానికి దోవ తీస్తుంది. మిత్రమా, నీవు పెదగుండెవాడవు. వృథా ఆలోచనలు చెయ్యక ధైర్యము వహించి ఇష్టసాధన కోసము మాత్రము ప్రయత్నించు'' అని హితబోధ చేసినాడు.

నే నీతని కేమీ బదులుచెప్పక రహస్యము బయట పెట్టక ధైర్యము వహించి ఆశ కలగడముచేత ఆమె ఇక్కడ ఉంటుందేమో అని ఇటు వచ్చాను. ఉరి పోసుకొన్న నిన్ను తప్పించాను. నీసంగతి చెప్పావు నాసంగతి చెప్పాను. మిత్రమా ఉభయులమూ అవస్థ పడు తున్నాము. ఊరూ పేరూ తెలియని యువతికోసము నేను ప్రయత్నము చేస్తున్నాను. మదిరావతి నీకు కనిపిస్తూ ఉన్నా ఆమె లభించే ప్రయ త్నము చెయ్యవే! పైగా దిగులు పడతావు. రుక్మిణీదేవిని గురించిన పురాణకథ వినలేదా! చేదిరాజుకు ఆమెను తండ్రి ఇచ్చినప్పటికీ కృష్ణుడు ఆమెను దక్కించుకోలేదా!

అతడు ఇలా చెవుతూఉండగా మంగళవాద్యములతో పరిజనముతో మదిరావతి అక్కడికే వచ్చింది. అప్పుడు నేను ఆమిత్రునితో వివా హానికి ముందు కులకన్యలు ఈఅమ్మవారి గుడికివచ్చి కామదేవపూజ చేస్తారు. తనకోసము ప్రాణాలు విడిచిన నన్ను మదిరావతి వచ్చి నప్పుడు చూడనైనా చూస్తుంది అనేభావముతో ఈగుడిఎదటి మర్రికి ఉరిపోసుకున్నాను'' అన్నాను. ఆధీరుడు క్షణమాలోచించి "అయితే మిత్రమా, వెంటనే ఈఆలయములోకి వెళ్ళి గర్భగుడిలో ప్రవేశించి

మాతృదేవతల వెనకాల దాగి ఉండు. తర్వాత ఏమవుతుందో చూచి కర్తవ్యము నిర్ణయించుకోవచ్చు" అని ప్రబోధించినాడు. ఇద్దరమూ లేచి ఆప్రకారమే చేసినాము. మంగళగీతాలతో మదిరావతి లోపలికి వచ్చింది. చెలికత్తెలను అవతలికి పంపివేసి ఒంటరిగా గర్భగుడిలోకి వచ్చి 'కామదేవా, నీవు మనస్సులో పుట్టినవాడ వయినప్పటికీ నామనస్సులో ఉన్నప్రియుని సంగతి గ్రహించావు కావు. ఈజన్మలో నీవు నాకు వరము అనుగ్రహించకపోతే జన్మాంతరములోనైనా ఆ విప్రకుమారుడు భర్త అయ్యేలాగున అనుగ్రహించు దేవా! అని తన ఉత్తరీయము తీసి అక్కడి చిలకకొయ్యకు కట్టి మెడకు ఉరి వేసుకోబోతుంటే మిత్రునిప్రబోధమువల్ల నేను లేచివెళ్ళి 'ప్రాణేశ్వరీ! ఏమి టీ సాహసము? ఇదిగో నేను వచ్చినాను' అని పాశము తొలగించినాను. మదిరావతి నన్నుగుర్తించి భయము ఆశ్చర్యము ఆనందమూ పొందింది. నామిత్రుడు దగ్గిరికివచ్చి 'సఖా, ఈసందెచీకటిలో నేను మదిరావతి వేషము ధరించి పరిజనముతో కలిసి వెళ్ళుతాను. మనఉభయుల ఉత్తరీయాలు ఈమెకు కట్టు, తర్వాత మీరు రెండోద్వారాన వెంటనే దేశాంతరము వెళ్ళి పెళ్ళిచేసుకోండి' అని బోధించినాడు. ఆప్రకారమే జరిగింది. ఆరాత్రివేళ నేనూ మదిరావతీ ఒక యామముదూరము వెళ్లినాము. క్రమేణ అచలపురము వెళ్లి ఒక బ్రాహ్మణుడియింట్లో దిగి వివాహము చేసుకొన్నాము.

నన్ను సర్వవిధాలా రక్షించిన మిత్రుడిసంగతి ఏమయిందో అని తరుచుగా అనుకొనేవాణ్ణి. ఉత్తరాయణకాలములో గంగాస్నానము చేతామని ఇక్కడికి వచ్చాను. ఈఅకారణబంధువు ఇక్కడ మళ్ళీ లభించినాడు. మేమిద్దరమూ సంభాషిస్తూ ఉండగా ఏలినవారు ఇక్కడికి దయచేశారు. ఈయనే నా ప్రాణదాత, భార్యాప్రదాతమిత్ర, రత్నము.

ఈవృత్తాంతము విని నరవాహనదత్తుడు రెండవ వానితో 'విప్రకుమారా, మిత్రుని కోసము ప్రాణాలు కూడా లెక్కచెయ్యని మీవంటి వాళ్ళు లోకములో చాలా అరుదు. నీవు పడిన విషమస్థితిలో నుంచి ఎలా తప్పించుకొన్నావో చెపితే సంతోషిస్తాను' అన్నాడు.

## విప్రకుమారుని కథ

అతడు తన కథ ఇలా చెప్పినాడు. మదిరావతి వేషములో ఉన్న నన్ను పరిజనులు తీసుకుపోయి పల్లకిలో కూర్చోబెట్టినారు. ఎవ్వరూ మోసము గుర్తించలేదు. మేళతాళములతో నన్ను సోమదత్తుని యింటికి తీసుకు వెళ్ళినారు. మంగళప్రయత్నాలతో పెళ్ళియిల్లు కోలాహలంగా ఉన్నది. ఆసవము తాగిన పరిచారికలు మేలిముసుగు వేసి నన్ను చిన్న యింట్లో కూర్చోబెట్టినారు. నాచుట్టూ ఆడవాళ్ళు చేరినారు.

ఇంతలో వాకిట్లో నూపురధ్వని కాంచీనినాదమూ వినిపించినవి. చెలికత్తెలతో ఒకకన్యామణి నాగదిలో ప్రవేశించి నాదగ్గిరికి వచ్చి కూర్చున్నది. ఏమి ఆశ్చర్యము! ఆనాడు శంఖహ్రదములో స్నానము చేయడానికి నేను వెళ్ళినప్పుడు తోటలో కనిపించిన నాప్రియురాలే ఆమె. ఇది స్వప్నమా, సత్యమా, కాకతాళీయమా అని నేను ఆశ్చర్యపడ్డాను. ఆమె దిగులుగా ఉండడము చూచి 'ఏమి ఇలా ఉన్నావు. రాజపుత్రీ!' అని మదిరావతి చెలికత్తెలు అడిగినారు. ఆమె రహస్యము బయట పెట్టక 'మదిరావతి నేను ఎటువంటి నేస్తాలమో మీకు తెలిసిన విషయమే ఇప్పుడీమెకు పెళ్ళికాబోతున్నది. ఈవిడ భర్తయింటికి వెళ్ళిన తర్వాత ఎడబాటు ఎలాసహిస్తానా! అని దిగులుగా ఉంది. మీరంతా బయటికి వెళ్ళండి. మే మిద్దరమూ కాస్త సేపు రహస్యముగా మాటాడుకోవాలి, అని వాళ్ళను పంపివేసి తలుపు గడియవేసి వచ్చి నాదగ్గిరిగా కూచుని ఇలా చెప్పింది.

'మదిరావతీ, నీది గొప్పమనోవ్యథ. నీవు వరించినవాడు కాదు, తండ్రి నిన్ను ఇస్తున్నది ఇంకొకనికి. అయినప్పటికీ నీ ప్రథమప్రియుణ్ణి అప్పుడప్పుడు చూడడానికి అవకాశ మున్నది. నాసంగతి ఎటువంటిదో తెలుసునా? ప్రత్యాశ లేనిదుఃఖము నాది. ఇదివరలో నీకు చెప్పలేదు. నీ యెడబాటువల్ల కలిగేదుఃఖాన్ని భావించి శంఖహ్రదములో స్నానము చెయ్యడానికి వెళ్ళాను. అక్కడి ఉద్యానవనములో సుందరవిక్రమ కుమారుడు కనిపించినాడు. పరస్పర విలోకనము అయినతర్వాత అక్క-

డికి మదపుటేనుగు పరుగెత్తుకు రావడం చూచి నా పరిజనులు పరుగెత్తి పోయినారు. నేను భయభ్రాంతురాలి నయినాను. ఆవిప్రకుమారుడు నన్ను ఎత్తుకుని జనులమధ్యకు తీసుకుపోయినాడు. ఆయన నన్ను ఎత్తుకొన్నప్పుడు ఆనందపారవశ్యములో నాకు ఏమీ తెలియలేదు. తర్వాత నా పరిజనులు నన్ను బసకు త్వరగా తీసుకు వెళ్ళారు. ఆ విప్ర కుమారుడు ఎటు వెళ్లినాడో ఏ మయినాడో ఆయన నామధేయ మేమిటో ఎక్కడివాడో ఏమీ తెలియదు. నేనుఅప్పటినుంచీ విరహాము పాలై చాలా బాధపడుతున్నాను. ఆయన నాకు లభిస్తాడనే ఆశ కూడా లేదు. నిన్ను చూస్తూ మనశ్శాంతి పొందుదా మనుకొంటే నీవు భర్తయింటికి వెళ్లిపోతున్నావు. ఇక నాకు మరణమే శరణము! ఉన్నంతసేపూ నిన్ను చూతా మని వచ్చాను.

ఆమె ఈ ప్రకారముగా చెప్పి మేలిముసుగు తొలిగించి నన్నుచూచి ఉలికిపడి తెప్పరిల్లి గుర్తించి ఆశ్చర్యపడ్డది అంతట నేను 'ప్రియా, అదృష్టవశాన అనుకోనివికూడా సంభవిస్తవి. నీకోసము నేను ఎంతఅవస్థ పడ్డానో తర్వాత సవిస్తరంగా చెపుతాను. మనము వెంటనేఅవతల పడే ఉపాయము చూడు!' అన్నాను. 'వెనుకదారి ఉన్నది. ఎవరికీ తెలియ కుండా మనము బయలుదేరుదాము. దీనికి అవతల మానాయనగారి ఉద్యాన మున్నది. అందులోకి వెళ్ళేమార్గాన నడిచి తర్వాత మన యిష్టము వచ్చినచోటికి పోదాము' అని ఆమె తక్షణమేపలికింది.

ఆవిడ ఆభరణాలన్నీ మూట కట్టి, ఆమె చూపినమార్గాన బయలు దేరి ఆరాత్రి చాలాదూరము ప్రయాణము చేశాము. తెల్లవారేసరికి మహారణ్యము వచ్చింది. అన్యోన్య వృత్తాంతాలు చెప్పుకుంటూ వెళుతూ ఉంటే మధ్యాహ్న మయింది. ఆమె దాహముకావలె నంటే చెట్టునీడకు చేర్చి, ఉత్తరీయముతో విసురుతున్నాను. హఠాత్తుగా అడవిదున్న గాయముతో అక్కడికి పరుగెత్తుకువచ్చింది. వెంటనే బలిష్ఠుడు అశ్వముమీద వచ్చి బల్లెముతో అడవిదున్నను పొడిచి చంపి, మావద్దకు వచ్చినాడు. నన్ను చూచి అతడు 'ఏమీ సాధూ!

ఎవరు మీరు? ఈమె యెవరు? ఈమార్గాన ఎక్కడికి వెళ్ళుతున్నారు?' అని అడిగినాడు. నా యజ్ఞోపవీతము చూపి, 'బాబూ, నేను బ్రాహ్మణుడను. ఈమె నాభార్య. ఒక బిడారుతో కలిసి వెళ్ళుతూ ఉన్నాము. దొంగలు వచ్చిపడ్డారు. ఎవరిదోవ వారి దయింది. మేము ఇటు వచ్చాము. నిన్ను అదృష్టవశాన చూచాము. మాకష్టాలు గట్టెక్కినవి' అని సత్యాసత్యములు కలిపి చెప్పినాను.

'నేను అడివిదొరను. వేటకోసము ఇటు వచ్చాను. బ్రాహ్మణోత్తములు నాకు అతిథులుగా లభించారు. సమీపంలోనే నా ఉనికిపట్టు. అక్కడికి వచ్చి విశ్రాంతి తీసుకోండి' అని ఆటవిక నాయకుడు సాదరముగా ఆహ్వానించి అలిసిపోయిన నా ప్రియురాలిని తన గుర్రము మీద ఎక్కించి తాను నాతోబాటు నడిచినాడు. అతని యింటికి వెళ్ళిన తర్వాత మాకు సమస్త సదుపాయాలూ సమకూర్చినాడు. దౌర్భాగ్య ప్రదేశాలలో కూడా అక్కడక్కడ యోగ్యులుంటారు.

నాయకుడు మాకు తోడిచ్చి పంపినాడు ఒక అగ్రహారము చేరాము. అక్కడ మంచిరోజున మాకు వివాహము జరిగింది. నా భార్యతో కూడా దేశాలు తిరుగుతూ గంగాస్నానము చేసే కుతూహలముతో ఒక బిడారుతోపాటు బయలుదేరి ఇక్కడకు చేరాను. ఇక్కడనే నా మిత్రుడు లభించినాడు. దేవరవారి దర్శనము అదృష్టవశాన సమకూడింది. ఇది నా వృత్తాంతము.

ఈవిధముగా విప్రకుమారుడు చెప్పగా నరవాహనదత్తుడు అతనిని అభినందించినాడు. సత్య సంపన్నుడైన బ్రాహ్మణుడు కావడముచేత అతనికి తగినఫలితము లభించిం దని పొగడినాడు.

ఇంతలో వెతుకుకొంటూ గోముఖాదులు అక్కడికి వచ్చినారు. నరవాహన దత్తుడు ఆవిప్రకుమారులను ఉభయులనూ వెంటబెట్టుకొని లలిత లోచనునితో తన నగరిలోనికి వెళ్ళినాడు.

అయిదవ సంపుటము సమాప్తము